తా. వంకాయయొక్క యాకారముగల రెండుమూసలజేయించి వాని నోటి యందు బెత్తెడు ప్రమాణముగలగొట్టమును దగిలించి వాని సందులకు చీలమన్ను లేపనముజేసి అందొకమూసలో పాదరసమును, మఱియొకమూసలో గంధకచూర్ణమును వైచి వాని ముఖముల మూసి వాలుకాయంత్రమునం దుంచవలయును గంధకముండు మూసక్రింద నగ్నిని జ్వలింపం జేయవలయును. ఇదియ తులాయంత్ర మనంబడును. ఈతులాయంత్రము తాళకము, గంధకము, లోహము వీని జారణార్థముపయోగించును.



## గర్భయంత్రము

స్థూలభాండస్యగర్భేతు ఇష్టకాం స్థాపయేత్తతః,
పాత్రం స్థాప్యం చేష్టికోర్ధ్వం ద్రవ్యం స్థూలేచ భాండకే.
పశ్చాన్ముఖేచాస్యభాండం ఘటికా సదృశం దదేత్,
సంధిలేపనతః కృత్వా జలందత్వోర్ధ్వపాత్రకే.
అగ్నిం ప్రజ్వాలయేన్మందం తప్తం నీరం పునస్త్యజేత్,
పునశ్శీతం జలం దత్వా తప్తం చైతత్త్యజేత్పునః.
ఏవం కృతేచోర్ధ్వభాండ లగ్నం తైలాదికం స్రవేత్,
అంతస్థేన సూక్ష్మపాత్రేచ తచ్చ గ్రాహ్యం ప్రయత్నతః,
గర్భయంత్రమిదం ఖ్యాతం సుగంధ్యర్కాదిసాధనే.

తా. ఒకగొప్పభాండమునుపొయిమీఁదనునిచి దానిలో నిటికెలాయి నిడి యాయిటికెలాపైని గాజు మొదలగువానిచే జేయఁబడిన గిన్నె నునిచి యాగిన్నె కంఠమువఱకు నౌషధద్రవ్యముల నునిచి యాభాండపుమూతిని మరియొకకుండయొక్క అడుగుభాగముచే మూసి సందులకు చీలమన్ను లేపనముజేసి భాండముపై మూసి యుండు కుండలో నుదకముపోసి మందముగ నగ్నిని జ్వలింపంజేయవలయును. కుండలోని యుదకముకాగిన దానిం దీసివేసి మరల శీతోదకమును పోయవలయును. ఇత్తెఱంగున జేయుచుండిన పైనమూసియుండు భాండముయొక్క అడుగున నావిరిజేరి గిన్నెలో తైలాదులు స్రవించును. వానిని యుక్తిచే గ్రహింపవలయును. ఇదియ గర్భయంత్ర మనంబడును.



## కచ్ఛపయంత్రము

ఖర్పరం పృథులం సమ్యగ్విస్తారం తస్యమధ్యతః,

ఆలవాలం పుటే కృత్వా తన్మధ్యే పారదం క్షిపేత్.
ఊర్ధ్వాధస్తు బిడం దత్వా మల్లేనారుద్ధ్య యత్నతః,
ఊర్ధ్వం దేయం పుటం తస్య యంత్రం కచ్ఛపసంజ్ఞికం,
జారణార్థం రసస్యోక్తం గంధాదీనాం విశేషతః.

తా. పెద్దవెడల్పునోరుగలబానను జేకొని దానిమధ్యమున సుమారు మూఁడువేళ్ల



పొడవుగల పాదినిజేసి దానియందు బిడాలవణమునువేసి దాని పై పాదరసము నునిచి దానిపై మరల బిడాలవణమునువేసి యాపాదికి తగినటుల యొకింత పల్లముగనుండుమూఁకుడుతో దానినిమూసి చీలమన్ను లేపనముజేసి యాబానను పిడకలచే నిండించి పుటంబిడిన రసగంధములుజారణంబులగును. ఇదియ కచ్ఛపయంత్ర మనంబడును.

## జలయంత్రము

ఉపర్యాపస్తలే తాపో మధ్యేచ రసగంధకౌ,
జలయంత్రమిదం గోప్యం యంత్రం శ్రేష్ఠం సమీరితమ్.
అస్మిన్ స్వర్ణాదిభూసత్వ గంధకాదిచ జారయేత్,
కృత్వా లోహమయీం పాత్రీ మధోముఖసమన్వితామ్.
ముఖమధ్యే క్షిపే ద్ద్రవ్యం పాత్రవక్త్రం నిరోధయేత్,
లోహచక్రికయారుద్ధ్వా తత్సంధిం సాధు లేపయేత్.
తస్మిన్నోష్ఠే క్షిపేదస్త్రం భాగం లోహరజోఽన్వితం,
పునఃపునశ్చ సంశుష్కే పునరేభిశ్చ లేపయేత్.
లోహవర్తచ్చ బబ్బూలక్వాథేన పరిమర్దితం,
జీర్ణేష్టకా రజస్సూక్ష్మ గుడచూర్ణసమన్వితమ్.
లేపయేత్ఖలు తత్ప్రోక్తం దుర్భేద్యం సలిలైః ఖలు,
ఖటికాపటుకిట్టైశ్చ మహిషీదుగ్ధమర్దితైః.
యత్తయా మృత్స్నయా రుద్ధో నగంతుం క్షమతే రసః,
విదగ్ధవనితాప్రౌఢప్రేమ్ణాబద్ధః పుమానివ.
తతో జలం వినిక్షిప్య వహ్నిం ప్రజ్వాలయేదధః,
అథవా కారయేన్మూషాం పాత్రలగ్నా మధోముఖీమ్.
లోహేనా మనురూపాశ్చ తన్మూషా ముఖరోధినీం,
దత్వాచాన్యాం తయోస్సంధిం విలేప్యాజాసృగాదిభిః.

జలమూర్ధ్వం వినిక్షిప్య నిస్సందేహం విపాచయేత్,
జలయంత్రంతు బహుభి ర్దినై రేవహి జాయతే.

తా. ఊర్ధ్వమున జలము, క్రింద నగ్నిజ్వాల, మధ్యమున రసగంధకాదుల నునిచి పాకముజేయుంటయ జలయంత్ర మనంబడును ఇది శ్రేష్ఠంబగుటచే రహస్యముగ నునిచికొనవలయును. ఇది స్వర్ణాదిఘాసత్వగంధకాదిజారణముల కుపయోగించును. ఎట్లనిన—లోహముతో నొకపెద్దబానను దానిలోపల లోహముతో నొకమూసను జేయించి దానియందు స్వర్ణరసగంధకాదుల నునిచి యామూసమూతికి దగినటుల లోహముతో నొకమూఁకుడును జేయించి దానిచే నా మూసమూతిని మూసి భాండములో నునిచి మేకనెత్తురుతో లోహకిట్టమును బాగుగ నూరి ఆమూసముఖమున, దానికడుగున పలుమారు బాగుగ లేపనముజేసి పలుమారు లెండించవలయును. ఇత్తెఱంగున నే యామూసకు క్రిందిభాగమున, పైభాగమున, తుమ్మచెక్కకషాయములో ప్రాతయిటికెతాయిచూర్ణమును, బెల్లమునునూరి పలుమారు లేపనముజేసి యెండింపవలయును. ఇటులంజేసిన ఉదకము దానిని భేదింపకుండును. మఱియు తెల్లమన్ను, ఉప్పు, లోహకిట్టము - వీని నెనుపపాలతో నూరి లేపనముజేసిన "ప్రియురాలగు స్త్రీయొక్క ప్రేమచే నాయకుఁడు బంధింపఁబడుభంగి" పాదరసము బంధింపఁబడును. పిదప నా పాత్రయం దుదకముపోసి క్రింద మంటవేయవలయును. లేక పెద్దభాండమును జేయించునపుడే దానిని మూసతోడ చేయించి పైప్రాకారము మూతమూసి లేపనాదుల జేయవలయును. ఇదియ జలయంత్రమనంబడును. ఇది గీర్ఘకాలముమీఁద సిద్ధించును.



## గౌరీయంత్రము

గౌరీయంత్రం ప్రవక్ష్యామి సుఖదం జారణావిధౌ,
అష్టాంగులోచ్ఛ్రియాం కృత్వా చతురస్రాం సమేష్టకామ్.
సూతనామా త్సముత్కృత్య మధ్యే చూర్ణేన లేపయేత్,
శ్లక్ష్ణాం వస్త్రకృతాం పిష్టిం కృత్వా ప్రాగ్బద్ధతాభ్రజామ్.
రూప్యజాం హేమజాం వాపి సత్వేనాపి వినిర్మితాం,
నివేశ్య తత్ర చోర్ధ్వాధో బలేశ్చూర్ణం విధాయచ.
తస్యాః పిష్ట్యా శ్చతుర్థాంశం వారంవారం విశోషయేత్,
వక్త్రే ఖర్పరచక్రంతు దత్వా లేప్య విశోష్యచ,
ఊర్ధ్వం హయఖురాకారం పుటం దద్యా ల్లఘూత్పలైః.

తా. జారణవిషయమున సుఖకారియగు గౌరీయంత్రమును వచించెదను:—ఎని
ిదంగుళములపొడవు వెడల్పుగల యొక యిటికరాతిని జేయించి దాని మధ్యమున



మూషాకారముగ పల్లము జేసి దానికి సున్నముపూసినున్న
గ జేసి యెండించి పిదప వెండి, బంగారు, అభ్రికము అను
వానిసత్వముల నూరి యిటికెరాతిమూసలో బోసి ఆస
త్వమునకు నాలవభాగము గంధకమును యిటికెరాతి
మూసకు క్రింద పైననునిచి మధ్యమున పైంజెప్పంబడిన రసాదిద్రవ్యముల నునిచి మూస
గోటిపై ప్రమిదెనుమూసి చీలమన్ను లేపనముజేసి యెండించి గుఱ్ఱపుగిట్టల ప్రమాణ
ముగల చిన్నచిన్న పిడకల పేర్చి పుటంబిడవలయును. ఇదియె గౌరీయంత్ర మనం
బడును.

## వజ్రమూష

వర్తులా గోస్తనాకారా వజ్రమూషా ప్రకీర్తితా,
ద్వౌ భాగౌ తుషదగ్ధస్య ఏకో వల్మీకమృత్తికా.
లోహకిట్టస్య భాగైకం శ్వేతపాషాణభాగకం,
నరకేశసమం కించిచ్ఛాగిక్షీరేణ పాచయేత్.
యామద్వయం దృఢం మర్ద్య తేన మూషాంచ సంపుటం,
శోషయిత్వా రసం క్షిప్త్వా తత్కాలై స్సంధిరుచ్యతే,
వజ్రమూషా ఇయం ఖ్యాతా సమ్యక్సూతస్య మారణే.

తా. ఉముక రెండుభాగములు, బూడిద, పుట్టమన్ను ౧ భాగము, లోహ



కిట్టము ౧భాగము, తెల్లరాతిచూర్ణము ౧ భాగము, ఒకింతమనుజుని వెండ్రు
కలు-వీనినేకముచేసి మేకపాలుబోసి యుడికించి రెండుఝాములునూరి గుండ్ర
ముగ, గోస్తనాకారముగ, పొడవుగ, నొకమూసను పైమూంకుడును జేసి
యెండించి మూసలో రసముబోసి పైన మూంకుడును మూసి చీలమన్ను లేప
నముచేయవలయును. ఇదియె వజ్రమూషయనంబడును. ఇది రసమారణమునం
దుపయోగించును.

## పాతాళయంత్రము

హస్తప్రమాణం నిమ్నంచ గర్తం కృత్వా ప్రయత్నతః,
తస్మిన్ భాండంచ సంస్థాప్య తథాన్యం పాత్రమాహరేత్.
తస్మిన్నౌషధవర్గంచ దత్వాన్యంచ శరావకం,
ముఖే సంస్థాప్య ఛిద్రాణి కృత్వాచైవ శరావకే.
శరావసహితం పాత్రం గర్తస్థే భాజనే న్యసేత్,

సంధిలేపం తతః కృత్వా గర్తమాపూర్య మృత్స్నయా
పశ్చాదగ్నించ ప్రజ్వాల్య స్వాంగశీతం సముద్ధరేత్,
పశ్చాత్తత్పాత్రమధ్యస్థం పాత్రం యుక్త్యా సమాహరేత్.
తదంతస్థంచ తత్తైలం గృహ్ణీయాద్విధిపూర్వకం,
పాతాళాఖ్యమిదం యంత్రం భాషితం శంభునా స్వయమ్.



తా. ఒకమూర లోతుగల పల్లమును త్రవ్వి అందు వెడల్పునోరుగల భాండము నునిచి మఱియొకకుండలో నౌషధమునునిచి యౌషధముండు కుండ నోటియందు రంధ్రములుగల మూకుడునునిచి ఆమూకుడుతోడనే యాకుండను పల్లములోని పాత్రపైనునిచి సంధిలేపనముజేసి యాపల్లమును మట్టితోమూసి దానిపై నగ్ని నునిచిన మూకుడుయొక్క రంధ్రమువలన క్రిందిభాండములో తైలముగాని, ద్రావకముగాని స్రవించును. దానిని స్వాంగశీతలమున యుక్తిచే గ్రహింపవలయును. ఇదియు పాతాళయంత్ర మనంబడును. ఇది ఈశ్వరునిచే జెప్పంబడియెను.

## తేజోయంత్రము

భాండేచార్ధప్రమాణేన ద్రవ్యం స్థాప్యం ప్రయత్నతః,
తన్ముఖే ద్వినళీయంత్రం సంస్థాప్యచ నిరోధయేత్.
పశ్చాత్ప్రజ్వాల్య మందాగ్నిం జలం దత్వోర్ధ్వపాత్రకే,
తత్తప్తం నళికాద్వారా నిస్సార్యంచ పునఃపునః.
నీచస్థనళికావక్త్రే భాండం స్థాప్యం ద్వితీయకం,
తస్మిన్నర్కాశ్చ సంధార్యో గృహ్ణీయాత్తు విశేషతః,
తేజోయంత్రమిదం ఖ్యాతం తథాన్యైర్లంబికం మతమ్.



తా. పెద్దభాండమును చేకొని దాని కర్ధభాగమువఱకు ఔషధద్రవ్యముల నునిచి దానినోటియందు రెండుగొట్టములుగలయంత్రమును దగిలించి సంధిలేపనముచేసి పైభాండములో నుదకముపోసి క్రింద మందాగ్నితో పాకముచేయవలయును. ఆయుదకముకాగి యుష్ణంబైన నళికామూలముగ దానిం దీసివేసి మరల శీతోదకమును బోయుచుండవలయును. క్రిందనుండు నళికాముఖమున గాజుమొదలగు పాత్రల నునిచి ద్రావకమును దీసికొనవలయును. ఇదియు తేజోయంత్రమనంబడును. దీనినే మఱికొందఱు లంబికాయంత్రమనియు వచించెదరు.

# పుటాధ్యాయము



## మహాపుటము

ఘనచౌరసకే గర్తే హస్తద్వితయమాత్రకే,
కరీషైరర్ధపూర్ణేచ ముద్రితంచ శరావకమ్.
సంస్థాప్యచాన్యకారీషైః పూరితే శుభగర్తకే,
అగ్నిం ప్రజ్వాల్య శీతేచ గృహ్ణీయాత్తు సరావకం,
ఏతన్మహాపుటంచోక్తం కృతిభిః పూర్వసూరిభిః.

తా. రెండుమూరలు చదరముగ, రెండుమూరలు లోతుగనుండు పల్లమును త్రవ్వి యందు సగమువఱకు ఏరుపిడకలఁబఱచి దానిమధ్యమున యౌషధశరావమును గాని, మూసనుగాని ఉనిచి దానిపై ఏరుపిడకలబఱచుటచే నాపల్లమును నిండించి యగ్ని పనిచి పుటంబిడి సాంగశీతలమున నౌషధమును గ్రహింపవలయును. ఇది మహాపుటమని పూర్వీకులచే జెప్పంబడియె.

## గజపుటము

ఘనచౌరసకే సార్ధ హస్తేచైవ తు గర్తకే,
పూర్వవద్ధ్వితయేచాగ్ని స్తత్పుటం గజసంజ్ఞితం,
మాహిషంవేతి సంజ్ఞేయం సూరిభి స్సముదాహృతమ్.

తా. ఒకటిన్నరమూర చదరము ఒకటిన్నరమూర లోతుగల పల్లమును త్రవ్వి దానిలో పైక్రమప్రకారము పుటంబిడుటయే గజపుట మనంబడును. దీనినే మాహిషపుట మనియు పెద్దలు వచించెదరు.

## వరాహపుటము

అరత్నిమాత్రే గర్తేయ ద్దీయతే పూర్వవత్పుటం,
కరీషాగ్నౌతు తత్ప్రోక్తం పుటం వారాహసంజ్ఞితమ్.

తా. మూరప్రమాణముగల పల్లమును త్రవ్వి దానియందు మునుపటివలెనే పుటంబిడుటయ వరాహపుట మనంబడును. దీనియందు దేరుపిడకల నుపయోగింపఁబడును.

## కుక్కుటపుటము

విత స్తిమాత్రగర్తే యత్పుట్యతే తత్తు కౌక్కుటమ్.

తా. జానెడుచదరము, జానెడులోతుగల పల్లమును త్రవ్వి దానిలో పైప్రకారము పుటంబిడుటయ కుక్కుటపుట మనంబడును.

## కపోతపుటము

విత స్తిమాత్రకే గర్తే సప్తభిర్వాథ చాష్టభిః,
వనోత్పలైః పుటం దత్తం తత్తు కాపోతసంజ్ఞితమ్.

తా. జానెడుచదరమును, జానెడులోతుగల పల్లమును త్రవ్వి అందు ఏడు, లేక ఎనిమిది పిడకలతో పుటంబిడుటయ కపోతపుట మనంబడును.

## గోవరపుటము

చూర్ణీకృతకరీషాగ్నౌ భూమావేవతు యత్పుటం,
దీయతే తత్తు కృతిభి ర్గోవరం సముదాహృతమ్.

తా. ఏరుపిడకలచూర్ణమును భూమిపైబోసి దానిమధ్యమునం దౌషధము నునిచి చేతితో బాగుగ నదిమి యగ్ని నునుచుటయ గోవరపుట మనంబడును.

## కుంభపుటము

మృద్ఘటస్యతు ఛిద్రాణి కృత్వాంగుళసమానివై,
చత్వారింశ త్తత స్తస్మిన్ శీత ముల్ముకచూర్ణకమ్.
అర్ధ మాపూరయిత్వాచ ముఖే దద్యా చ్ఛరావకం,
కర్పటేన మృదా లిప్త్వా ఛాయాశుష్కంచ కారయేత్.
తస్మిన్నంగారకాన్ క్షిప్య చుల్ల్యాంవాథేష్టకాసుచ,
నిధాయ త్రిదినాచ్ఛీతం గృహీత్వౌషధమాహరేత్,
ఏతత్కుంభపుటం జ్ఞేయం కథితం శాస్త్రదర్శిభిః.

తా. మంటికుండ కధోభాగమున నొక అంగుళప్రమాణముగల నలువది ఛిద్రముల జేసి యాకుండ కర్ధభాగమువఱకు బొగ్గులబోసి దానిపై నౌషధము నునిచి యాకుండ మూతిని ప్రమిదెతో మూసి చీలమన్ను లేపనము జేసి నీడనెండించి పొయిమీఁద నునిచి యాకుండప్రమిదెపై నగ్ని నిడి మూడుదినములు పొయిక్రింద మంటవేయవలయును. మంటచల్లారిన పిదప సాంగశీతలమున నౌషధమును గ్రహించవలయును. ఇది కుంభపుట మనంబడును.

---

## తాళపత్ర లిఖిత బసవరాజీయముయొక్క తెనుఁగుతాత్పర్యములో నుదహరింపఁబడిన మాత్రాప్రమాణవివరణము.

చతుర్వల్లం=౪ గురిగింజలయెత్తు
లేక 3 చిన్నములయెత్తు
నిష్కైకం=మాడయెత్తు
వల్లద్వయం=౪ గురిగింజలయెత్తు
మాషం=మినుపగింజయెత్తు
రెండుపలములు=౨మాడలయెత్తు
ఐదుపలములు=౫ మాడలయెత్తు
వల్లయుగ్మం=౪ గురిగింజలయెత్తు
పలం=పావు సేరు
పలాష్టకం= రెండు సేర్లు
షోడశపలం=౪ సేర్లు
శాణం=౧౦ చిన్నములు
నిష్కార్ధం=౫ చిన్నములు
కర్షం=౪ మాడలయెత్తు
కుడవం=౪ పలములు
నిష్కం=మాడయెత్తు
ప్రస్థం=౪ సేర్లు లేక ౧౬పలములు

అక్షం=తానిగింజప్రమాణము
మాషద్వయం=౫ చిన్నములు
కర్షం=ముప్పాతికయెత్తు
ఆఢకం=3౨ పలములు
కుంభం=తూము
అర్ధకలశం=ఇద్దుము
షోడశపలం=౬పావు సేర్లు
నిష్కద్వయం=౨ మాడలు
అక్షం=౪ మాడలు
ద్రోణము=౪ తూములు
ప్రస్థం=తూము
కర్షం=౪ మాడలు
బిడాలపతకం=పిల్లియడుగంత
సేరు=౪ పలములు
తులమన=౧౦౦ పలములు
ద్విపలం=చారెడు

# గ్రంథాంతర ప్రమాణ మాత్రావివరణము.



## పరమాణువు మొదలగువాని వివరణము

జాలాంతరగతే భానౌ యత్సూక్ష్మం దృశ్యతే రజః,
తస్య త్రింశత్తమో భాగః పరమాణు స్సఉచ్యతే.

తా. సూర్యకిరణములు కిటికీ మొదలగువానిలో ప్రసరించునప్పుడు అందు గానఁబడెడి అణువులో ౩౦-వ భాగము పరమాణు వనంబడును.

త్రసరేణు ర్బుధైః ప్రోక్త స్త్రింశద్భిః పరమాణుభిః,
త్రసరేణు స్తు పర్యాయనామ్నా వంశీ నిగద్యతే.

తా. ౩౦ పరమాణువు లొకత్రసరేణు వనంబడును. మఱియు నీత్రసరేణువుకు వంశియను నామాంతరముకూడ గలిగియుండును.

జాలాంతరగతై స్సూర్యకరై ర్వంశీ విలోక్యతే,
షడ్వంశీభి ర్మరీచిస్స్యా త్తాభి ష్షడ్భిస్తు రాజికా,
తిసృభీ రాజికాభిశ్చ సర్షపః ప్రోచ్యతే బుధైః.

తా. కిటికీ మొదలగువాటియందు ప్రసరించెడి సూర్యకిరణములచే గానంబడెడి నలుసువ వంశి యనంబడును. అట్టి ౬ వంశీ లొకమరీచి యనియు, ౬ మరీచి లొక రాజిక యనియు, ౩ రాజిక లొకసన్నయావగింజ యెత్తనియు బరంగును.

యవో ష్టసర్షపైః ప్రోక్తో గుంజాస్యా త్తచ్చతుష్టయం,
షడ్భిస్తురత్తికాభిస్స్యా న్మాషకో హేమధాన్యకౌ.

తా. మఱియు ౮ ఆవగింజ లొకయవగింజ యనియు, ౪ యవగింజ లొక గురిగింజయెత్తనియు, ౬ గురిగింజ లొకమాషమనియు జెప్పంబడును: మఱియు నీమాషమునకు హేమమనియు, ధాన్యకమనియు నామాంతరంబులు గలవు.

మాషై శ్చతుర్భి శ్శాణస్స్యా ద్ధరణ స్సనిగద్యతే,
టంకస్సఏవ కథిత స్తద్ద్వయం కోలఉచ్యతే,
క్షుద్రభో వటకశ్చైవ వంక్షణ స్సనిగద్యతే.

తా. మఱియు ౪ మాషము లొకశాణమనియు, ధరణమనియు, టంకమనియు, జెప్పంబడును. ౨ శాణము లొకకోలమనియు, క్షుద్రభమనియు, వటకమనియు, వంక్షణ మనియు బరంగును.

కోలద్వయంచ కర్షస్స్యాత్సప్రోక్తః పాణిమానికా,
అక్షం పిచుః పాణితలం కించిత్పాణిశ్చ తిందుకమ్.
బిడాలపదకంచైవ తథాషోడశికామతా,
కరమధ్యో హంసపదం సువర్ణం కబలగ్రహం,
ఉదుంబరంచ పర్యాయైః కర్షఏవ నిగద్యతే.

తా. మఱియు ౨ కోలము లొకకర్షమనియు, పాణిమానికయనియు, అక్ష మనియు, పిచువనియు, పాణితలమనియు, కించిత్పాణియనియు, తిందుకమనియు, బిడాల పదకమనియు, షోడశికయనియు, కరమధ్యమనియు, హంసపదమనియు, సువర్ణమనియు, కబళగ్రహమనియు, ఉదుంబరమనియు జెప్పంబడును.

స్యాత్కర్షాభ్యా మర్ధపలం శుక్తిరష్టమికా తథా,
శుక్తిభ్యాంచ పలం జ్ఞేయం ముష్టిరామ్రం చతుర్థికా,
ప్రకుంచ షోడశీబిల్వం పల్వమేవాత్ర కీర్త్యతే.

తా. మఱియు ౨ కర్షము లొ॥ అర్ధపలమనియు, శుక్తియనియు, అష్టమిక యనియు, ౨ శుక్తులొకపలమనియు, ముష్టియనియు, ఆమ్రమనియు, చతుర్థికయనియు ప్రకుంచమనియు, షోడశీబిల్వమనియు జెప్పంబడును.

పలాభ్యాం ప్రసృతిర్జ్ఞేయా ప్రసృతశ్చ నిగద్యతే,
ప్రసృతిభ్యా మంజలిస్స్యాత్కుడవోర్ధశరావకః.
అష్టమానంచ సజ్ఞేయం కుడవాభ్యాంచ మానికా,
శరావోష్టపలం తద్వాత్ జ్ఞేయ మత్ర విచక్షణైః.

తా. మఱియు, ౨ పలము లొకప్రసృతయనియు, ప్రసృతియనియు, ౨ ప్రసృతు లొకయంజలియనియు, కుడవమనియు, అర్ధశరావకమనియు, అష్టమాన మనియు, ౨ కుడవము లొకమానికయనియు, శరావమనియు, అష్టపలమనియు బరంగును.

శరావాభ్యాం భవేత్ప్రస్థ శ్చతుః ప్రస్థై స్తథాఢకం,
భాజనం కాంసపాత్రంచ చతుష్షష్టిపలంచ తత్.

తా. మఱియు, ౨ శరావకము లొక ప్రస్థమనియు, ౪ ప్రస్థము లొక ఆఢకమనియు, భాజనమనియు, కాంసపాత్రమనియు జెప్పంబడును. ఆఢకమన ౬౪ పలములు

చతుర్భి రాఢకై ర్ద్రోణః కలశో నల్వణోన్మనౌ,
ఉన్మానశ్చ ఘటో రాశి ర్ద్రోణపర్యాయసంజ్ఞకాః.

తా. మఱియు ౪ ఆఢకము లొకద్రోణమనియు, కలశమనియు, నల్వణమనియు ఉన్మనమనియు, ఉన్మానమనియు, ఘటమనియు, రాశియనియు పరంగును.

ద్రోణాభ్యాం శూర్పకుంభౌచ చతుష్షష్టిశరావకః,
శూర్పాభ్యాంచ భవే ద్ద్రోణీ వాహో గోణీచ సాస్మృతా,

తా. మఱియు ౨ ద్రోణము లొకశూర్పమనియు, కుంభమనియు, ౨ శూర్పవ లొక ద్రోణియనియు, వాహమనియు, గోణియనియు జెప్పంబడును. ద్రోణియన ౬ శరావములు.

ద్రోణీ చతుష్టయం ఖారీ కథితా సూక్ష్మబుద్ధిభిః.
చతుస్సహస్రపలికా షణ్ణవత్యధికాచ సా.

తా. మఱియు ౪ ద్రోణు లొకఖారి యనిజెప్పంబడును. ఖారియన ౪౦౯ పలములు.

పలానాం ద్విసహస్రంచ భారఏకః ప్రకీర్తితః,
తులా పలశతం జ్ఞేయం సర్వత్రైవైషనిశ్చయః.

తా. ౨౦౦ పలము లొక భారమనియు, ౧౦౦ పలము లొక తులమనియు జెప్పంబడును. కావున ముందు జెప్పంబోయెడి ప్రమాణంబులనన్నిటిని ఇదే ప్రకారముగా నెఱుంగందగును.

మాషటంకాక్షబిల్వాని కుడవః ప్రస్థమాఢకం,
రాశి గోణీ ఖారికేతి యథోత్తరచతుర్గుణాః,

తా. ౪ మాషము లొకటంకమనియు, ౪ టంకము లొక అక్షమనియు, ౪ అక్షము లొకబిల్వమనియు, ౪ బిల్వము లొకకుడవమనియు, ౪ కుడవము లొక ప్ర

మనియు ౪ ప్రస్థము లొక ఆఢకమనియు, ౪ ఆఢకము లొక రాశియనియు, ౪ రాసు లొకగోణియనియు, ౪ గోణు లొకఖారియనియు నెఱుంగవలయును. ఇఁక పచ్చవిగ నుండు ద్రవ్యపరిమాణంబుల వచించెదను.

గుంజాదిమాన మారభ్య యావత్స్యా త్కుడవస్థితిః,
ద్రవార్ద్రశుష్కద్రవ్యాణాం తావన్మానం సమంమతమ్.
ప్రస్థాదిమాన మారభ్య ద్విగుణంతు ద్రవార్ద్రయోః,
మానం తథా తులాయాస్తు ద్విగుణం న క్వచిత్ స్మృతమ్.

తా. పైఁజెప్పిన పరిమాణంబులలో గుంజాప్రమాణము మొదలుకొని కుడవప్రమాణమువఱకు రసార్ద్రశుష్కద్రవ్యంబులను సమాంశంబులుగను, ప్రస్థాదిపరిమాణంబులకు రసార్ద్రద్రవ్యంబులను శుష్కద్రవ్యంబులకన్న ద్విగుణంబుగను స్వీకరింపవలయును. ఐనను తులమనుప్రమాణము ద్విగుణంబుగ జెప్పంబడదయ్యెను.



శ్రీ ర స్తు.

# బ స వ రా జీ య ము

## ప్ర థ మ ప్ర క ర ణ ము

---

అవతరణిక. వైద్యశాస్త్రపారీణుం డగు బసవరాజు అను విద్వాంసుఁడు లోక హితార్థంబై బసవరాజీయ మని పేర్కొనంబడిన యీవైద్యశాస్త్రమును చేయంబూని తనచేఁ జేయంబడు నీగ్రంథము నిర్విఘ్నముగా పరిసమాప్తి యగుటకై నమస్కారాత్మకమంగళమును "శ్రీనాథం పార్వతీనాథం" అనుశ్లోకముచేఁ జేయుచున్నాఁడు.—

శ్లో. శ్రీనాథం పార్వతీనాథం వాణీనాథం సరస్వతీం,
హేరంబం వటుకం విద్యాం సతతం తం నమామ్యహమ్. 1

తాత్పర్యము. లక్ష్మీపతి యగువిష్ణువు గౌరీపతి యగునీశుఁడు వాణీపతి యగుబ్రహ్మ విద్యాధిష్ఠానదేవత యగు సరస్వతి విఘ్నేశ్వరుఁడు వటుకభైరవుఁడు వీరిని నేను ఎల్లపుడు నమస్కరించెద.

శ్రీనీలకంఠం భుజగేంద్రభూషం నాగాజినం రాజకళాకలాపం,
గౌరీశ్వరం దేవమునీంద్ర సేవ్యం దేవం భజే శ్రీగిరిరాజనాథమ్. 2

తా. శోభాకరనీలకంఠయుక్తుఁడును శ్రేష్ఠసర్పాభరణాలంకృతుఁడును గజచర్మధరుఁడును చంద్రకళాభూషణుఁడును పార్వతీపతియును ఇంద్రాదిదేవ నారదాదిముని సేవ్యుఁడును కైలాసపతియు నగు పరమేశ్వరుని బసవరాజు అను నేను భజియించెద.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమాబసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 3

తా. నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజు అని పేర్కొనఁబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠం బగు బసవరాజీయ మను నీ గ్రంథమును వచింపుచున్నాఁడను.

వృషరాజీయనామాయం గ్రంథః పరమదుర్లభః,
శ్రీమద్బసవరాజేన ధియా గురుసమేనచ. 4
పరోపకారపుణ్యాయ ప్రయాసేనచ నిర్మితః,

తా. బుద్ధియందు బృహస్పతితో సమానుఁడైన బసవరాజు అని పేరొందఁబడిన నేను పరోపకారపుణ్యమునకై బసవరాజీయ మని పేరొందఁబడి కడుదుర్లభముగ నుండు నీగ్రంథము నతిప్రయాసచే నిర్మించినాఁడను.

చరకం మాధవం కల్పం భైరవం కల్పమేవచ. 5
వాగ్భటం సిద్ధవిద్యాభూం తథాసిద్ధరసార్ణవం,
తథా భేషజకల్పంచ తద్వజ్జాతుకకర్ణకమ్. 6
మాధవీయం చాశ్వినీయ మాయుర్వేదం తథైవచ,
సిందూరదర్పణం తద్వత్పూజ్యపాదీయమేవచ. 7
దేవీశాస్త్రం చంద్రకల్పం బ్రహ్మగారుడమేవచ,
చింతామణిం జ్యోతిషం చ కాశీఖండం తథైవచ. 8
శారీరసూత్రం తద్వచ్చ నిత్యనాథీయమేవచ,
తద్వచ్చ నందినాథీయం తథా చాగ్నిమతాంతరమ్. 9
మతాంతరం చాన్యశాస్త్రం చికిత్సాసారసంగ్రహం,
తథాకర్మవిపాకంచ తద్వద్రేవణకల్పకమ్. 10
ఇత్యాదిగ్రంథరత్నాని సమాలోచ్య యథామతి,
లోకోపకారార్థమిమం జగద్వైద్యనుతం తథా. 11
ఆంధ్రభాషాయుతం తద్వత్కరామలకవత్స్ఫుటం,
సర్వరోగనిదానైశ్చ సాధ్యాసాధ్యై స్తథైవచ. 12
సర్వైశ్చికిత్సితైర్యుక్తం వక్ష్యే సంతోష్య యత్నతః.

తా. ఇపుడు బసవరాజు అను నేను చరకము మాధవకల్పము భైరవకల్పము బాహటము సిద్ధవిద్యాభు సిద్ధరసార్ణవము భేషజకల్పము జాతుకకర్ణకము మాధవీయము అశ్వినీయము ఆయుర్వేదము సిందూరమణిదర్పణము పూజ్యపాదీయము దేవీశాస్త్రము చంద్రకల్పము బ్రహ్మగారుడము చింతామణి జ్యోతిషము కాశీఖండము శారీరసూత్రము నిత్యనాథీయము నందినాథీయము అగ్నిమతాంతరము మతాంతరము అన్యశాస్త్రము చికిత్సాసారసిద్ధసంగ్రహము కర్మవిపాకము రేవణసిద్ధకల్పము ఇవి మొదలగు సమస్త వైద్యశాస్త్రరత్నంబుల నాబుద్ధ్యనుసారంబుగా బాగుగా పరిశీలించి లోకోపకారార్థము

జగద్వైద్యనుతంబుగా ఆంధ్రభాషాయుక్తంబుగ కరతలామలకమువలె స్ఫుటంబుగా సర్వరోగనిదానంబులు సాధ్యాసాధ్యంబులు సర్వరోగచికిత్సలు కలిగియుండునటుల బసవరాజీయం బను దుర్లభం బగు నీవైద్యశాస్త్రమును సంగ్రహముగా రచియింపుచున్నాఁడను.

ప్రోవాచ రోగనికరస్య వినాశనాయ
భైషజ్యతంత్రమమలంహి మహాంశ్చ దేవః,
బ్రహ్మాదివిష్ణుసురసిద్ధవిలోలచిత్తో
భక్త్యా విజృంభితమహం వృషభం స్మరామి. 13

తా. బ్రహ్మ విష్ణువు సురలు వీరలయందు దాసక్తచిత్తముగల నేను దేవతలలో పెద్ద యగు ఏవృషభుఁడు సకలరోగనివారణార్థంబై బైషజ్యతంత్రమును వచించెనో అట్టి మహామహిమగల వృషభుని మిగుల భక్తిచే భజింపుచున్నాఁడను.

యుగోపయుక్తగ్రంథములు

కృతేతు చరకః ప్రోక్తస్త్రేతాయాంతు రసార్ణవః,
ద్వాపరే సిద్ధవిద్యాభూః కలౌ బసవకః స్మృతః. 14

తా. కృతయుగమునకు చరకగ్రంథమును, త్రేతాయుగమునకు రసరత్నాకరమును, ద్వాపరయుగమునకు సిద్ధవిద్యాభు అను గ్రంథమును, కలియుగమునకు బసవరాజీయమును శ్రేష్ఠంబు లని చెప్పంబడియె.

ఆయుర్వేదప్రశంస

ఆయుష్యరక్షణార్థత్వా దాయుర్వేదస్తథోచ్యతే,
ధర్మార్థకామమోక్షాణాం వర్గాణాం ఫలదాయకః. 15

తా. ఆయుర్వేదము ఆయుర్వృద్ధికారణం బగుటం జేసి ఆయుర్వేద మనంబడు. మఱియు నది ధర్మార్థకామమోక్షరూపపురుషార్థచతుష్టయములకుకూడ కారణంబుగ నుండు.

గ్రంథాధ్యయనఫలము

ఉక్తంచ బసవాఖ్యేన నిదానం వృషరాజకం,
యోఽధీతే జానతస్తస్య సిద్ధ్యంత్యర్థా నసంశయః 16

తా. బసవరాజుచేఁ జెప్పఁబడిన బసవరాజీయనిదానము నెవ్వ రభ్యసించి దానియందలి యర్థము నెఱిఁగెదరో వారలకు రోగనిదానాది సకలసిద్ధులు నిశ్చయముగ కలుగును.

నిదానం సంప్రవక్ష్యామి బసవాఖ్యం కలౌయుగే,
యస్యజ్ఞానాచ్చ రోగాణాం ప్రయోగం కర్తు మర్హతి. 17

తా. కలియుగోపయుక్తం బగునటుల బసవరాజీయనిదానము చెప్పఁబడియె. కావున దానియందలి యర్థజ్ఞానము నెఱిఁగెడివారు చికిత్సలయందు సమర్థు లయ్యెదరు.

—ః గ్రంథస్థవిషయములు ః—

శ్రుత్వా సమస్తం క్రియతేచసారం ధన్వంతరోక్తం బహుజాలయుక్తం,
కాయాదిబాలగ్రహరోగసంఘాన్ చికిత్సితాద్యాన్ రసధాతుశోధనమ్.
కషాయచూర్ణాన్ఘుటికానుపానే తైలాదిలేహ్యాన్ఘృతయంత్రమంత్రాన్,
రత్నాదిశుద్ధించ విషక్రియాస్తథా పాషాణకాదే స్సకలాంచ శుద్ధిమ్.
అన్యత్పవిత్రేష్వథ దేశకాలాన్ లింగాఖ్యదేహం ప్రకృతిం మలాదీన్,
జ్వరాదికాన్వై సకలాంశ్చరోగాన్ జ్ఞాత్వా భిషక్కర్మ సమారభేద్వై.

తా. ధన్వంతరిప్రణీతంబై అనేకార్థజాలములుగల వైద్యశాస్త్రమును నేను బాగుగ నెఱిఁగి యీగ్రంథమును రచియించినాఁడను. ఇందు శరీరాది బాలగ్రహరోగ సమూహములు, తచ్చికిత్సలు, రసధాతుశుద్ధులు, కషాయములు, చూర్ణములు, ఘుటికలు, అనుపానములు, తైలములు, లేహ్యములు, ఘృతములు, యంత్రములు, మంత్రములు, రత్నాదిశుద్ధులు, విషచికిత్సలు, పాషాణాదిశుద్ధులు, దేశకాలములు, లింగదేహము, ప్రకృతి, మలములు, నాడీనిదానము, దూతలక్షణము, పథ్యములు, అపథ్యములు, ఇతర రోగములు, జ్వరము మొదలగు సర్వరోగములు చెప్పఁబడియున్నయవి. కావున వాని నెల్ల వైద్యుఁడు బాగుగా నెఱిఁగి చికిత్స జేయవలయు.

—ః జ్వరోత్పత్తి. ః—

యుగక్రమా ద్ధర్మబలస్య నాశ స్తథాక్రమా జ్జీవగతిశ్శరీరే,
కృతేయుగేప్యస్థిగతశ్చ జీవ స్త్రేతాయుగే మజ్జగతోవిధేయః. 21
ద్వాపారకే మాంసగతశ్చ జీవః కలౌయుగే తిష్ఠతి చాన్నపానే,
జ్ఞాత్వా ప్రయోగః క్రియతే బుధైఃకలౌప్రయోగమిచ్ఛన్ సుతరాం
[సువైద్యః.22

తా. ధర్మము, కృత త్రేతా ద్వాపర కలియుగములయందు క్రమముగా క్షయించును. అటులనే యుగక్రమముగా శరీరమునందలి జీవుఁడును (ప్రాణవాయువును) క్షయించు. ప్రాణవాయువు కృతయుగమున అస్థిగతముగా, త్రేతాయుగమున మజ్జా

ముగా, ద్వాపరయుగమున మాంసగతముగా, కలియుగమున అన్నపానాశ్రితముగా
డు. (దానంజేసి మానవులకు కృతయుగమున అస్థిగతజ్వరము, త్రేతాయుగమున
జ్జాగతజ్వరము, ద్వాపరయుగమున మాంసగతజ్వరము, కలియుగమున అన్నపానాశ్రిత
రము తరుచుగా జనించు.) కావున బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు చికిత్సఁజేయబూనిన
ఁడై పైక్రమంబుల నెఱిఁగి కలియుగానుగుణచికిత్సలం జేయవలయు. అటుల చేయు
ఁడే సువైద్యుఁడు.

న్నాచ్చ పానాచ్చ పురీషమూత్రం పురీషమూత్రాత్ప్రభవంతిరోగాః,
లస్య రోధో జ్వరమూలమాహుః పిత్తాధికం స్యా జ్జలపానదోషాత్.
లేచరంత స్సకలాశ్చ జీవాః ప్రసూతిభావోమలముద్గిరంతి,
త్పానసేవా స్త్వతిపిత్తవృద్ధి స్తస్మాచ్చ పిత్తం విషమగ్నిరూపమ్. 24
త్తంచనాభే శ్శ్రితవామభాగం తత్పాచకాఖ్యం జ్వరమూలకం స్యాత్,
వాతాదిదోషానలనాశకంస్యా దంతర్గతోసౌబహిరేవ గమ్యతే. 25

తతస్సవాయు ర్జఠరే ప్రవిష్ట స్స్రోతాంసి రుద్ధ్వా జ్వరతీవ్రకారః,
దోషత్రయం ద్వంద్వజసన్నిపాతా నామాతిసారం విషమం విదాహమ్.
ఇత్యాదిరోగాంస్తుబహూంశ్చకుర్యా ద్దృష్ట్వాప్రయత్నంకురుతేచికిత్సకః.
బహిర్గతోగ్నిః పునరంతరం యథా ప్రవేక్ష్యతే యేన కృతేన తత్క్షణాత్,
విధిప్రయుక్త్యా క్రియతేచ లంఘనం పాకక్రియాకర్తుమిహోచ్యతేపునః.

తా. అన్నపానాదులవలన మలమూత్రంబులును వానివలన రోగంబులును జనించు. మఱియు మలనిరోధమువలన జ్వరములును మిక్కుటముగా నీరుద్రాగుటవలన పైత్యరోగములును ఉదకములయందలి జీవరాసులు ప్రసవకాలమున వెళ్ళగ్రక్కెడి మలమిశ్రిత జలపానమువలన కడుపిత్తరోగమును జనించు. అందులంజేసి ఆ పిత్తము విషాగ్ని స్వరూపంబై నాభికి వామపార్శ్వంబున నుండినదై పాచక మనుపేరం బరగుచు సర్వజ్వరములకు మూలకారణంబై వాతాది దోషములను అగ్నిని నశింపఁజేయు. మఱియు నాపిత్తము అంతర్గతంబైయుండినను నాడీచలనమువలన వెలపట దృశ్యం బగుచుండు. పిదప వాతము జ్వరమున ప్రవేశించి నాడుల నడ్డగించి తీవ్రజ్వరములను కలుగంజేయు. మఱియు నాపిత్తమే వాతపిత్తశ్లేష్మ ద్వంద్వజ సన్నిపాతజ్వరములను ఆమాతిసారము విషమరోగము విదాహాము మొదలగు అనేకరోగములను కలుగఁజేయు. కావున వైద్యుఁడు తత్తత్కారణంబుల నెఱిఁగి చికిత్సింపవలయు. మఱియు వైద్యుఁడు

బహిర్గతజ్వరాగ్ని యెవ్విధ చికిత్సలచే తత్క్షణము లోపలఁ బ్రవేశించునో అవ్విధ చికిత్సలు జేయుటయేగాక శాస్త్రోక్తప్రకారము లంఘనమును చేయించవలయు. మఱియు పూర్వోక్త జ్వరము ఏ క్రియచే పాకమును జెందునో అట్టిదానిని వచించెద.

లంఘనానంతరం జ్ఞాత్వా రోగముక్తం చికిత్సకః,
బహిరగ్నిర్యథాపూర్వం గచ్ఛేత్కుర్యాత్తథా క్రియామ్. 28
ఔషధానాం ప్రభావంచ జ్ఞాత్వా దద్యాచ్చికిత్సకః,
ధాతూత్పన్నాశ్చ యేదోషా అన్యాన్వక్ష్యే యథాక్రమమ్. 29
అంతర్గతాశ్చ యేదోషాజ్వరరూపా బహిర్గతాః,
పునరామాశయగతా జ్వరపాకమవాప్నుతే. 30
తన్మధ్యేచాప్యపథ్యాని కురుతేఽజీర్ణముచ్యతే,

తా. లంఘనానంతరము జ్వరవిమోచనము నెఱిఁగి యెవ్విధ చికిత్సలచే బహిర్గత జ్వరము లోపలఁ బ్రవేశించునో అవ్విధచికిత్సలను వైద్యుఁడు చేయవలయును. అట్టి చికిత్సలం జేయుకాలమున ఔషధముల ప్రభావము నెఱిఁగి వానిని ప్రయోగించవలయు. ధాతుజనితదోషములను యితరదోషములను యథాక్రమంబుగా వచించెద. అంతర్గత దోషములు బహిర్గతంబులైన జ్వరరూపం బగు. బహిర్గతదోషములు మరల ఆమాశయగ తంబులైన జ్వరము పాకమును జెందు. జ్వరపాకమధ్యమున అపథ్యంబులుసేసిన అజీర్ణ రోగము జనించు.

రసరక్తగతం మాంసమజ్జాస్థిగత మేవచ. 31
ఏతన్మధ్యేత్వపథ్యాని ధాతుగస్తు తథోచ్యతే,
ధాతుగశ్చేత్త్వపథ్యాని కురుతే తత్క్షయో భవేత్. 32

తా. అజీర్ణదోషముచే రసగత రక్తగత మాంసగత మజ్జాగత అస్థిగతజ్వరములు జనించు. అపుడు అపథ్యంబులుసేసిన యవి ధాతుగతంబులగు. ధాతుగతంబున అపథ్యం బులుచేసిన ధాతుక్షయము కలుగు.

## అష్టధాతుస్థానములు

అథాన్యత్సంప్రవక్ష్యామి సంక్షిప్తంసూక్తముత్తమం,
ఆయుర్వేదోపదేశేస్మిన్ అష్టధాతునిగద్యతే. 33
నాడ్యోష్టౌ పాణిపాత్కంఠ నాసోపాంతసమాశ్రితాః,
పాదయోర్హస్తయోర్ఘ్రాణ మూలయోః కంఠమూలయోః 34
(ఆయుర్వేదే)

తా. ఇఁక ఆయుర్వేదములోఁ జెప్పఁబడిన ప్రకారము సంక్షిప్తముగా విశదముగా ...లకు అష్టస్థానములను వచించెద. ఎట్లన్న.—హస్తద్వయగతనాడులు రెండు, ...ద్వయగతనాడులురెండు, కంఠమున నిరుపార్శ్వములయందుండునాడులు రెండు, ...కమున నిరుపార్శ్వములయందుండునాడులు రెండు - అని నాడులు ఎనిమిది ...ములు.

పాదయోర్నాడికాస్థానం గుల్ఫస్యాంగులికాత్రయం,
హస్తయోస్తు ప్రకోష్ఠాంతే మణిబంధేఽంగులిత్రయమ్. 35

కంఠమూలేఽంగులిద్వంద్వం నాసామూలేఽంగులాధికం,
స్థానాన్యేతాని నాడీనాం తేషు ప్రాణో వ్యవస్థితః 36

తా. పాదాశ్రితనాడులు గుల్ఫప్రదేశమున (చీలమండల)కు క్రిందుగా మూడం...ములస్థానములోను, హస్తాశ్రితనాడులు ప్రకోష్ఠాంతమునందు మణికట్టుకు క్రిందుగా ...డంగుళములస్థానములోను, కంఠమూలాశ్రితనాడులు యిరుపార్శ్వములయందు ...డంగుళములస్థానములోను, నాసామూలాశ్రితనాడులు ఏకాంగుళస్థానములోను ...డును ఈయెనిమిదిస్థానములను ప్రాణవాయువు లాశ్రయించియుండును.

## సిరాదిస్వరూపము

పత్రరేఖానిభాభిన్నాస్సూక్ష్మావపుస్సిరాశ్శ్రితాః,
మృణాలనాడికారూపాస్స్రోతాంసి సర్వదేహగాః. 37

తా. సన్ననరములు ఆకుల రేఖలంబోలి యతిసూక్ష్మంబులై శరీరమంతట వ్యాపించియుండు. పెద్దనరములు తామరనాళములంబోలి శరీరమంతట వ్యాపించియుండు.

## నాడీపరీక్ష

జీవితం లాఘవం స్వాస్థ్యం జ్వరస్యచ విమోచనం,
యత్తుస్థానం సముచ్యేత పాదనాడీం నిదర్శయేత్. 38

తా. ఆయుువు, శరీరలఘుత్వము శరీరస్వాస్థత జ్వరవిమోచనము వీని నెఱుఁగుటకై పాదగతనాడీస్థానమును తప్పక పరీక్షింపవలయు.

## నాడీస్పర్శనవిధి

సవ్యేన రోగధృతికూర్పరభాగమధ్యం
పీడ్యాథ దక్షిణకరాంగులికాత్రయేణ,

అంగుష్ఠమూలమధిపశ్చిమభాగమధ్యే
నాడీప్రభంజనగతిం సతతం పరీక్షేత్. 39

తా. వైద్యుఁడు రోగియొక్క దక్షిణహస్తమును మోచెయ్యిమొదలు తన వామహస్తముచే చక్కగా పిసికి ఆహస్తముయొక్క అంగుష్ఠమూలములో లోభాగమధ్యమునందు తన దక్షిణకరాంగుళిత్రయములచే యెల్లపుడు వాతగతిని పరీక్షించి రోగనిదానము నెఱుఁగవలయు.

## స్త్రీపురుషనాడీభేదము

స్త్రీణామూర్ధ్వముఖఃకూర్మః పుంసాం పునరధోముఖః,
అతఃకూర్మవ్యతిక్రాంతాత్సర్వత్రైషవ్యతిక్రమః. 40
లక్ష్యతే దక్షిణే పుంసాం యాచ నాడీవిచక్షణైః,
కూర్మభేదేన వామానాం వామేచైవావలోక్యతే. 41

తా. నాభికూర్మము స్త్రీలకు ఊర్ధ్వముఖముగను, పురుషులకు అధోముఖముగనుండుటవలన స్త్రీపురుషులకు నాడులుకూడా వ్యత్యస్తముగ నుండును. కాఁబట్టి స్త్రీలకు వామహస్తమునందును, పురుషులకు దక్షిణహస్తమునందును నాడిని పరీక్షింపవలయు. నపుంసకుఁడైనయెడల వాని స్త్రీపురుషభేదముల నెఱిఁగి వామ దక్షిణ క్రమముగా నాడిని పరీక్షింపవలయు.

## హస్తగళనాడీపరీక్ష

తిర్యగ్యవప్రమాణేన జహాతిచ నిజంపదం,
సూచితం జీవనిర్యాణం హస్తనాడీగళేచయా. 42

తా. నాడి తిర్యగ్యవప్రమాణము హస్తమందేకాని గళమందేకాని స్వస్థానమును విడిచియుండిన జీవుఁడు శరీరమును విడనాడు నని తెలియవలయు.

## హస్తనాడీపరీక్ష

అజీర్ణమామదోషంచ జ్వరస్యాగమనం క్షుధాం,
వాతపిత్తకఫాన్దుష్టాన్ హస్తనాడీ నిదర్శయేత్. 43

తా. అజీర్ణము ఆమదోషము జ్వరాగమనము ఆఁకలి దుష్టమైన వాతపిత్తశ్లేష్మములు వీనిని హస్తనాడివలన తెలియవలయును.

## కంఠనాడీపరీక్ష

ఆగంతుకజ్వరం తృష్ణా మాయాసం మైథునం క్లమం,
భయం శోకంచ కోపంచ కంఠనాడీ నిదర్శయేత్. 44

తా. ఆగంతుకజ్వరము దప్పి ఆయాసము మైథునము బడలిక భయము శోకము కోపము వీనిని కంఠనాడివలన తెలియవలయు.

నాసానాడీపరీక్ష

మరణం జీవితం కామం నేత్రరోగం శిరోవ్యథాం,
శ్రావణాన్ముఖజాన్రోగాన్ నాసానాడీ నిదర్శయేత్. 45

తా. మరణము జీవితము కామము నేత్రరోగము తలనొప్పి చెవినొప్పి ముఖరోగము వీనిని నాసానాడివలన తెలియవలయు.

శుభనాడీపరీక్ష

సువ్యక్తతా నిర్మలత్వం స్వస్థానస్థితిరేవచ,
అచంచలమమందత్వం సర్వాసాం లక్షణం శుభమ్. 46

తా. సర్వనాడులు విశదముగ నిర్మలముగ (అనఁగా జాడ్యరహితముగ) స్వస్థానమునందు స్థిరముగ చంచలరహితముగ మంధవవిహీనముగ నుండిన శుభలక్షణము లని తెలియవలయు.

వాతాదినాడీపరీక్ష

వాతపిత్తకఫంచైవ ద్వంద్వజం సాన్నిపాతకం,
సాధ్యాసాధ్యవివేకంచ సర్వం నాడీనిదర్శయేత్. 47

తా. వాత పిత్త శ్లేష్మ ద్వంద్వజ సన్నిపాతరోగసాధ్యాసాధ్యంబుల నన్నిటిని నాడీగతివలన నెఱుఁగవలయు.

వాతాదినాడీలక్షణము

వాతాద్వక్రగతిర్నాడీ చపలా పిత్తవాహినీ,
స్థిరా శ్లేష్మవతీజ్ఞేయా సంసర్గాన్మిశ్రలక్షణమ్. 48

తా. వాతనాడి వక్రముగ పిత్తనాడి చంచలముగ శ్లేష్మనాడి స్థిరముగ నడుచు. నాడి సంకరమున మిశ్రమముగ నడుచు.

వాతాధిక్యనాడీలక్షణము

*వాతాధికే వహేచ్చాగ్రేప్యంతే శ్లేష్మాధికా వహేత్,
మధ్యేపిత్తాధికానాడీ సన్నిపాతే విలక్షణమ్. 49

తా. నాడి వాతాధిక్యమున మొదటి వ్రేలియొక్క అగ్రమునందు తీవ్రముగ,

* పాఠాంతరము.—వాతాధికావహేదంతే న్యగ్రే శ్లేష్మాధికావహేత్, మధ్యే పిత్తాధికానాడీ సన్నిపాతే త్రిలక్షణమ్.

శ్లేష్మాధిక్యమున మూడవవ్రేలియొక్క అగ్రమునందు తీవ్రముగ, పిత్తాధిక్యమున మధ్యమ వ్రేలియొక్క అగ్రమునందు తీవ్రముగ నడుచు. సన్నిపాతమునందు విలక్షణముగ నడుచు.

వాతే వాతాధికానాడీ వ్యాళీవ కుటిలా సదా,
అత్యంతదుష్టావహతి స్తబ్ధా తంత్రీసమాకృతిః 50

తా. వాతనాడి వాతాధిక్యమునందు సర్పమువలె వక్రముగను కడుదుష్టంబున బిగించఁబడిన తంత్రిచందంబునను నడుచు.

## పిత్తాధిక్యనాడీలక్షణము

పిత్తాధికేతు చపలా నాడీ వహతి కాకవత్,

తా. పిత్తనాడి పిత్తాధిక్యమునందు చంచలముగను కాకివలె నడుచు.

## శ్లేష్మాధిక్యనాడీలక్షణము

బకదర్దురసంచారా చటకావర్తికాగతిః. 51
కఫేన దుష్టనాడీతు హంస కుక్కుటగామినీ,
కపోతమందసంచారా వహతీతి వినిశ్చయః. 52

తా. శ్లేష్మనాడి శ్లేష్మాధిక్యమునందు కొంగవలె కప్పవలె ఊరపిచ్చుకవలె *పిరికిపిట్టవలె నడుచు. మఱియు కడుదుష్టంబున హంసవలె కోడివలె పావురపిట్టవలె మందముగ నడుచు.

## ప్రకారాంతరనాడీలక్షణము

అగ్రే వాతవహానాడీ మధ్యే వహతి పిత్తలా,
అంతే శ్లేష్మవికారేణ నాడీ జ్ఞేయా బుధైస్సదా. 53
వాతాద్వక్రగతిర్నాడీ పిత్తాదుత్ప్లుత్యగామినీ,
కఫాన్మందగతిర్జ్ఞేయా సన్నిపాతాదతిద్రుతా. 54

తా. వాతనాడి వాతప్రకోపమున అగ్రమునందు వక్రముగ, పిత్తనాడి మధ్యమందుండినదై పిత్తప్రకోపమున కప్పవలె ఎగిరెగిరియు, శ్లేష్మనాడి కడపట నుండినదై కఫప్రకోపమున మందముగ నడుచు. సన్నిపాతమునందు పైఁజెప్పఁబడిన మూఁడు నాడులు కడుతీవ్రముగ నడుచు.

## వాతపిత్తనాడీలక్షణము

ముహుస్సర్పగతిం నాడీం ముహుర్భేకగతిం తథా,

* ఇదే మీనవల్లంకిపిట్ట.

వాతపిత్తద్వయోద్భూతాం ప్రవదంతి విచక్షణాః. 55

తా. వాతపిత్తసంసర్గమునందు నాడి పలుమారు సర్పమువలె కప్పవలె నడుచు నని వైద్యవేత్తలు వచించెదరు.

### వాతశ్లేష్మనాడీలక్షణము

భుజగాదిగతిం నాడీం రాజహంసగతిం తథా,
వాతశ్లేష్మసముద్భూతాం ప్రవదంతి వినిశ్చయమ్. 56

తా. వాతశ్లేష్మసంసర్గమునందు నాడి సర్పము రాజహంస వీనివలె నడుచు నని వైద్యవేత్తలు వచించెదరు.

### పిత్తశ్లేష్మనాడీలక్షణము

మండూకాదిగతిం నాడీం మయూరాదిగతిం తథా,
పిత్తశ్లేష్మసముద్భూతాం ప్రాహు ర్వైద్యవిశారదాః. 57

తా. పిత్తశ్లేష్మ సంసర్గమునందు నాడి కప్ప నెమలి మొదలగువాని గమనము గలదిగ నుండు నని వైద్యవేత్తలు వచించెదరు.

### సన్నిపాతనాడీలక్షణము

మందంమందం శిథిలశిథిలం వ్యాకులం వ్యాకులం వా
స్థిత్వాస్థిత్వా వహతి ధమనీయాతినాశంచ సూక్ష్మా,
నిత్యంస్కంధే స్ఫురతి పునరప్యంగుళిస్సంస్పృశేద్వా
భావై రేవం బహువిధతరై స్సన్నిపాతేత్వసాధ్యా. 58

తా. సన్నిపాతమునందు నాడి కడుమందముగ కడుశిథిలముగ కడువ్యాకులముగ నిలిచి నిలిచియు కడుసూక్ష్మముగ పలుమాఱు భుజములపై స్థిరముగ నడుచుచు నంతలోనే అంగుళిస్థానము చేరి యనేకరీతులుగ నడుచుటయేగాక నాశనమును చెంది నటులకూడ దృశ్యం బగు. కావున నీసన్నిపాతం బసాధ్యంబు.

### అసాధ్యనాడీలక్షణము

యాత్యుత్కటాస్థిరాత్యంతం యాత్యేవం మందగామినీ,
యాచసూక్ష్మాచ వక్రాచ తామసాధ్యాంచ నిర్దిశేత్. 59

తా. ఏనాడి దోషముమీఁద హెచ్చుగా కడుస్థిరముగా కడుమందముగా సూక్ష్మముగా వక్రముగా నడుచుచుండునో, అట్టినాడి అసాధ్యం బని తెలియవలయు.

### మృత్యునాడీలక్షణము

వ్యాకులా శిథిలా మందా స్థిత్వాస్థిత్వా ప్రయాతి యా,
స్థానం క్రమేణ ముంచంతీ నాడీ మరణశంసినీ. 60

తా. ఏనాడి వ్యాకులముగా శిథిలముగా మందముగా నిలిచి నిలిచియు, క్రమముగా స్థానమును విడనాడి నడుచుచుండునో ఆనాడి మరణసూచకనాడి యని తెలియవలయు.

అత్యంతశీతలా నాసా స్తైమిత్యం నేత్రయోరపి,
స్థానచ్యుతిశ్చ నాడీనాం సద్యోమరణహేతవః. 61

తా. ఎవనినాసిక కడుశీతలముగా నేత్రములు నిశ్చలముగా (అనఁగా రెప్పపాటు వేయకుండా) నుండి నాడికి స్వస్థానచలనము కలిగియుండునో వాఁడు తత్క్షణమున మృత్యువును గాంచు.

జహాతి యస్య స్వస్థానం యవార్ధమపి నాడికా,
న స జీవితమాప్నోతి త్రిదినేనైవ పంచతామ్. 62

తా. ఎవనినాడి స్వస్థానమును విడనాడి యవార్ధప్రమాణమైనను చలించియుండునో వాఁడు మూఁడుదినములలో మరణమును జెందు.

### అజీర్ణనాడీలక్షణము

అజీర్ణాదుద్భవానాడీ కఠినా పూరితా జడా,
ప్రసన్నాస్ఫుటితాశుద్ధా క్షుధానాడీ ప్రశస్యతే. 63

తా. అజీర్ణనాడి కఠినముగా పూరితముగా జడముగా నడుచు. ఆఁకలిగొనినవానినాడి నిర్మలముగా స్పష్టముగా సాంకర్యరహితముగా నడుచు.

### బాలవృద్ధాదులనాడీలక్షణము

బాలానామపి వృద్ధానాం మూకానామపి దేహినాం,
ఉన్మత్తానామభిన్యాస విమూఢమనసామపి. 64
వ్యస్తం సమస్తం ద్వంద్వంచ దోషరూపమశేషతః,
దర్శయత్యచిరాదేవ నాడీ ద్రవ్యాణి దీపవత్. 65

తా. దీపము సర్వవస్తువులను ప్రకాశింపఁజేయునటుల, బాలురు వృద్ధులు మూకులు ఉన్మత్తులు అభిన్యాసరోగపీడితులు యోగపురుషులు వీరలనాడి తనయొక్క ప్రత్యేకగతిని సంకరగతిని ద్వంద్వగతిని దోషగతిని కడుశీఘ్రముగా ప్రకాశింపఁజేయు.

### త్రికాలనాడీలక్షణము

ప్రాతః శ్లేష్మగతిర్నాడీ మధ్యాహ్నే చాతిపిత్తళా,
అపరాహ్నే వాతికా జ్ఞేయా పునఃపిత్తా [1] నిశార్ధకే 66

నాడి [2] ప్రాతఃకాలమునందు శ్లేష్మగతి గలదిగ [3] మధ్యాహ్నమునందు పిత్తగతి గలదిగ [4] అపరాహ్ణమునందు వాతగతి గలదిగ అర్ధరాత్రియందు మరల పిత్తగతి గలదిగ నడుచు.

### నాడీగతవాతసంచారకృత్యము

స్పర్శనాత్పీడనోద్ఘాతాద్భేదనాన్మర్దనాదపి,
తాసు ప్రాణస్యసంచారం ప్రయత్నేన విశోధయేత్. 67

తా. స్పర్శించుట (తాఁకిచూచుట) పిసుకుట మెటికలు విఱుచుట మర్దించుట వీనిచే నాడులయందలి ప్రాణవాయువును బాగుగా సంచరించునటులఁ జేయవలయు.

### నాడీపరీక్షానిషేధకాలము

వ్యాయామతృష్ణాతపపీడితస్య బుభుక్షితో భుక్తవతోఽపిజంతోః,
అభ్యంజనస్నానవధూపభోగక్రియాసు నాడీ న విబోధనీయా. 68

తా. వ్యాయామము దప్పి ఎండ వీనిచే పీడింపఁబడినవానికి ఆఁకలిగొనినవానికి భుజించినవానికి అభ్యంజనము చేసికొనినవానికి స్నానము చేసినవానికి స్త్రీసంభోగము చేసినవానికి నాడి బాగుగా కనుపించదు. కావున నట్టిసమయములయందు నాడి పరీక్ష చేయంజనదు.

సద్యస్స్నాతస్య భుక్తస్య క్షుత్తృష్ణాతపసేవినః,
వ్యవాయశ్రాంతదేహస్య సమర్థోఽపి నబుధ్యతి. 69

తా. అపుడు స్నానముచేసినవాఁడు భుజించినవాఁడు ఆఁకలిగొనినవాఁడు దప్పి గలవాఁడు ఎండతాఁకినవాఁడు స్త్రీసంభోగము చేసినవాఁడు సంచారముచే బడలిన వాఁడు ఇట్టివారలనాడిని యెట్టి సమర్థుఁడైనను కనుఁగొనఁజాలఁడు.

భుక్తస్య సద్యః స్నాతస్య నిద్రితస్యోపవాసినః,
వ్యాయామశ్రాంతదేహస్య భూతావేసిని రోదనే. 70
సుందరీణాంచ సంయోగే మద్యపానే మతిభ్రమే,

---

1 దినార్ధకే. 2 ప్రాతఃకాలమనఁగా ఉదయాది పదిఘడియలు. 3 మధ్యాహ్న మనఁగా పదిఘడియలు మొదలు ఇరువదిఘడియలవఱకు. 4 అపరాహ్ణ మనఁగా ఇరువది ఘడియలు మొదలు సూర్యాస్తమయమువఱకు.

గంధారీ భక్షణేచైవ పవనాభ్యాససాధకే. 71
కుక్కుటీ శశ మండూక సర్పమాంసాదిభక్షకే,
అపస్మారే శ్రాంతదేహే నాడీసమ్యఙ్న బుధ్యతే. 72

తా. భుజించినవానికి అపుడు స్నానముచేసినవానికి నిదురగాంచినవానికి ఉపవాసముచేసినవానికి వ్యాయామముచే బడలినవానికి భూతము సోకినవానికి రోదనము స్త్రీసంభోగము మద్యపానము చేసినవానికి మతిభ్రమగలవానికి గంజాయి సేవించినవానికి యోగాభ్యాసము సేయువానికి కోడి కుందేలు కప్ప సర్పము వీని మాంసములను భుజించినవానికి అపస్మారరోగముకలవానికి బడలినవానికి నాడి బాగుగా కనుపించదు.

## నాడీజ్ఞానహీనవైద్యదోషము

నాడీగతిమవిజ్ఞాయ *యఃకరోతి చికిత్సితం,
ఆరోహతి గిరింసోంధస్తస్యయానసమంవిదుః.

తా. ఎవఁడు నాడీగతి విశేషంబుల నెఱుఁగక చికిత్స చేయంబూనునో, వాఁడు "పర్వతము నెక్కుటకు నడుచుటకు యత్నించు అంధునివలె" భంగపడు.

## స్పర్శలక్షణము

అథ స్పర్శమిమం వక్ష్యే కించిదుష్ణం ప్రభంజనే,
అత్యుష్ణం పిత్తరోగేతు హ్యథవాచాతిశీతలమ్. 74
కించిచ్ఛీతం శ్లేష్మరోగే ద్వంద్వజేచ పృథక్పృథక్,

తా: ఇఁక స్పర్శలక్షణమును వచించెద. శరీరము వాతరోగికి కించిదుష్ణముగ నుండు; పైత్యరోగికి కడు ఉష్ణముగగాని కడుశీతలముగగాని ఉండు, శ్లేష్మరోగికి ఒకింత శీతలముగా ద్వంద్వరోగికి పలురీతులుగా నుండు.

## రూపలక్షణము

తతస్స్వరూపం పశ్యేచ్చ శ్యామంభాతి ప్రభంజనే. 75
హరిద్రారక్తవర్ణాభం గాత్రం పైత్యే విభాతిచ,
పాండురస్యచ వర్ణాభం స్వరూపం కఫరోగతః. 76
మిశ్రజం ద్వంద్వరోగేతు వివర్ణం సాన్నిపాతికే,

తా. ఇఁక రూపలక్షణమును వచించెద. శరీరము వాతరోగమునందు నల్లగ నుండు,

* చికిత్సాం యః కరోతిచ.

పైత్యరోగమునందు పచ్చగగాని ఎఱ్ఱగగాని ఉండు. శ్లేష్మరోగమునందు *పాండురవర్ణముగా ద్వంద్వరోగమునందు మిశ్రముగా సన్నిపాతమునందు వివర్ణముగా నుండు.

### శబ్దలక్షణము

తతశ్శబ్దగుణం వక్ష్యే సమశబ్ద స్సమీరణే. 77
సహర్షోల్బణవాక్పిత్తే శ్లేష్మరోగేచ హీనతా,
ద్వంద్వజే మిశ్రితా జ్ఞేయా భిషక్శాస్త్రవిశారదైః 78

తా. ఇక శబ్దలక్షణమును వచించెద. వాతరోగి సమమైన మాటలుకలవాఁడుగ నుండు. పైత్యరోగి నవ్వుచు వదరుచు నుండు. శ్లేష్మరోగి హీనస్వరము కలవాఁడుగ నుండు. ద్వంద్వరోగి మిశ్రభాషలాడుచుండు. ఇటుల వైద్యశాస్త్రజ్ఞులు తెలిసికొనవలయు.

### జ్వరస్వరూపము

రుద్రకోపాగ్నిసంభూత స్సర్వభూతప్రతాపనః,
త్రిపాద్భస్మప్రహరణ స్త్రిశిరా స్సుమహోదరః. 79
వైయాఘ్రచర్మవసనః కపిలో: మాల్యవిగ్రహః,
పింగేక్షణో హ్రస్వజంఘో భీభత్సో బలవాన్మహాన్. 80
పురుషో లోకనాశార్థ మసౌ జ్వరఇతి స్థితః,
తైస్తైర్నామభిరన్యేషాం సత్వానాం పరికీర్త్యతే. 81
జన్మాదౌ నిధనేచైవ ప్రాయో విశతి దేహినాం,
ఋతే దేవమనుష్యాభ్యాం నాన్యో విషహతే హితమ్. 82

తా. రుద్రకోపాగ్నిలోనుండి జనించినవాఁడుగా, సర్వభూతములను తపింపఁజేయువాఁడుగా, మూఁడుకాళ్లు మూఁడుశిరములు పెద్దకడుపు ఇవిగలవాఁడుగా, పులితోలును కప్పుకొనియుండువాఁడుగా, కపిలవర్ణము పసుపువర్ణముగల నేత్రములు, పొట్టిగానుండుపిక్కలు, భయంకరమైన ఆకారము ఇవి గలవాఁడుగా, బలిష్ఠుఁడుగా, లోకనాశముకొఱకు జనించినవాఁడుగా నుండు పురుషుఁడు జ్వర మనఁబడును. ఈ జ్వరపురుషుఁడు స్థావరజంగమములైన సమస్తవస్తువులయందును వెవ్వేరునామములచే వెలయుచుండును. ఇది ప్రాణులకు ఉత్పత్తికాలమునందును అంత్యకాలమునందును కలుగును. దీనిని దేవతలు మనుజులు తప్ప ఇతరులు సహింపఁజాలరు.

---

* అధికముగా తెలుపుగలసిన పచ్చరంగు.

జ్వరో రోగపతిః పాప్మా మృత్యురోజోశనోంతకః,
క్రోధో దక్షాధ్వరధ్వంసి రుద్రోర్ధ్వనయనోద్భవః. 83
జన్మాంతయోర్మోహమయస్సంతాపాత్మాపచారజః,
వివిధైర్నామభిః క్రూరో నానాజాతిషు వర్తతే. 84

తా. జ్వరము సర్వరోగములలో ప్రధానంబై పాపమువలన జనించిన దగుటవలన పాపస్వరూపముగలదై మరణమును గలుగఁజేయునదియై శరీరపుష్టిని గలుగఁజేయునట్టి ఓజస్సును నశింపఁజేయుచు అంతకస్వరూపము గలదిగా నుండును. ఇది దక్షప్రజాపతి యాగమును నాశముచేసిన పరమేశ్వరునియొక్క ఊర్ధ్వనేత్రములోనుండి జనించిన కోప స్వరూపము గలది. ఉత్పత్తినాశము వీనియందు మోహమును కలుగఁజేయును. మిగుల సంతాపస్వరూపము గలదిగ నుండును. విషమాశనాద్యహితాహారములు, స్త్రీసంభోగము, వాతమలమూత్రాది వేగనిరోధము ఇంద్రియములకు అతిసంతోషము అతిపీడనము ఈ మొదలగు అహితాచారములవలన జనించును. ఇది నానావిధనామములచేత పశు పక్ష్యాది సమస్తజాతులయందును వర్తించును. రోగపతి, పాప్మా, మృత్యుః, ఓజోశనః, అంతకః అను నామములచే వ్యవహరింపఁబడుచుండును.

## జ్వరజాతిభేదములు

పాకలశ్చైవ నాగానాం పర్వతానాం శిలాజతు,
భుజంగానాంతు నిర్మోకః జలానాం నీలికాస్మృతా. 85
గవాంచ శీతికారోగః ఊషరం పృథివీతలే,
శునస్తు ళరోక్వ్యాఘ్రాదా దృష్టిప్రత్యవరోధనమ్. 86
అపస్మృతిః స్మృతాశ్వానాం శిఖోద్భేదశ్శిఖండినాం,
నేత్రరోగప్రవహితో వాయసే జ్వర ఉచ్యతే. 87
పృష్ఠభేదో బిడాలానా మాఖూనాం దర్దురుచ్యతే,
శుకానా మథ సర్వేషాం భిత్తికాజ్వర ఉచ్యతే. 88
శార్దూలానాంచ సర్వేషాం శ్రమోజ్వరఇహేరితః,
మానుషేషుచ ధర్మజ్ఞ మిథ్యాహారాదిసేవనమ్. 89
జన్మన్యంతేచ వన్యానాం స్వభావాజ్జాయతే జ్వరః,
ఏషమాహేశ్వరం తేజో జ్వరనామానుదారుణః. 90

తా. ఏనుఁగులకు కలిగెడిజ్వరము పాకలమనియు, పర్వతములకు కలిగెడి జ్వరము శిలాజిత్తనియు, పాములకు కలిగెడిజ్వరము నిర్మోకమనియు, ఉదకమునకు కలిగెడి

ర్వరమునీలికా యనియు, ఆవులకు కలిగెడిజ్వరము శీతికా యనియు, భూమికి కలిగెడిజ్వర
ఘు ఊషర మనియు, కుక్కలకు కలిగెడిజ్వరము అళర్క మనియు, పులులకు కలిగెడి జ్వర
ఘు దృష్టిప్రత్యవరోధ మనియు, గుఱ్ఱములకు కలిగెడి జ్వరము అపస్మృతి యనియు, నెమ
ళ్లకు కలిగెడిజ్వరము శిఖోద్భేదమనియు, కాకులకు కలిగెడిజ్వరము ప్రవాహతమనియు,
ల్లులకు కలిగెడిజ్వరము పృష్ఠభేదమనియు, రోమనాశమనియు, పందికొక్కులకు కలిగెడి
జ్వరము దర్దురమనియు, చిలుకలకు కలిగెడిజ్వరము భిత్తికాయనియు, శివంగి మొదలగు
జంతువులకు కలిగెడిజ్వరము శ్రమమనియు చెప్పఁబడును. మనుజులకు మిథ్యాహారాదుల
లన జ్వరము కలుగును. ఏనుఁగు మొదలగు అడవిజంతువులకు అంత్యకాలమునందు
స్వభావముగానే జ్వరము కలుగును. ఇటుల అనేకవిధములగు దారుణమైన జ్వరములు
మహేశ్వరునియొక్క కోపస్వరూపము కలవై యుండును.

## ఆహికజ్వరలక్షణము

అథోత్తరం ప్రవక్ష్యామి చాహికజ్వరలక్షణమ్,
శీతం సపులకం గాత్రం దాహసంతాపహృద్గదమ్. 91
శిరోరుజాంగవైకల్యం కుక్షిపార్శ్వేచ శూలకృత్,
అపథ్యవాంఛా తంద్రాచ పాదహృన్ముఖశోఫతా. 92
గాత్రం పాండురవర్ణంచ పీతవర్ణంచ లోచనమ్,
అక్షిరక్తవిహీనంచాప్యతిసారశ్చ జాడ్యతా. 93
కరపాదవిదాహశ్చాప్యాహికజ్వరలక్షణమ్. (మాధవనిదానే)

తా. ఇఁక ఆహికజ్వరలక్షణముల వచించెద. శరీరమున చలిపుట్టుట, శరీరము
పులకరించుట, విదాహము, సంతాపముకలుగుట, ఱొమ్ము నొచ్చుట, తల నొచ్చుట,
అంగములు శైథిల్యమును జెందుట, కడుపుపార్శ్వములు శూలించుట, అపథ్యముల
యం దిచ్ఛ కలుగుట, *తంద్రముకలుగుట, పాదములు ఱొమ్ము ముఖము వాచుట, శరీరము
పాండురవర్ణముగ నుండుట, నేత్రములు పసుపుబారియుండుట, నేత్రములు రక్తహీన
ములై తెలుపుబారియుండుట, అతిసారము శరీరజాడ్యము కలుగుట, చేతులు కాళ్లు
మండుట ఈలక్షణములు గలది ఆహికజ్వర మని తెలియవలయు.

## శీతలజ్వరలక్షణము

దేహస్య శీతతా కంపో రోమహర్షశ్చ గాయితా,

* తంద్ర యన సోమరితనము, లేక కునికిపాటు.

తంద్రామూర్ఛభ్రమశ్చైవ శీతజ్వరస్యలక్షణమ్. (సిద్ధరసార్ణవే)

తా. శరీరము చల్లగ నుండుట, వణుకుట, గగుర్పొడుచుట, పాడుట, తంద్ర, మూర్ఛ, భ్రమ యీలక్షణముగలది శీతలజ్వర మని తెలియవలయు.

త్వక్స్థౌ శ్లేష్మానిలౌ శీత మాదౌ జనయతో జ్వరమ్.
తయోః ప్రశాంతయోః పిత్తమంతే దాహంకరోతిచ. (మతాంతరే)

తా. శ్లేష్మవాతములు రెండును తొలుత రసధాతువు నాశ్రయించి వణుకును.చలిని గలుగఁజేసి పిదప జ్వరమును కలుగఁజేయును. ఆశ్లేష్మవాతములు శాంతిచెందిన పిదప పిత్తము ప్రకోపించి విదాహమును గలుగఁజేయును. ఈలక్షణములు సామాన్యముగా శీతపూర్వజ్వరంబులకెల్ల కల వని యెఱుంగవలయు.

శీతజ్వరములకు పాశుపతాస్త్రరసము

రసభస్మ తామ్రభస్మ గంధకంచ మనశ్శిలా,
పాషాణద్వితయంచాథ భృంగీ నీరేణ మర్దయేత్. 96
ద్వదినం వాలుకాయంత్రే చండాగ్నౌచ ద్వియామకమ్,
ద్విగుంజం భక్షయే న్నిత్యమార్ద్రికంచానుపానకమ్. 97
పాశుపతాస్త్రనామాయంసర్వాహికజ్వరంహరేత్. (ఆయుర్వేదే)

తా. రసభస్మము, తామ్రభస్మము, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసిన మణిశిల, శుద్ధిచేసిన ఉల్లిపాషాణము, శుద్ధిచేసిన గౌరిపాషాణము-వీనిని సమభాగములుగా గ్రహించి ఖల్వములో నునిచి గుంటగలగరాకు రసముచే రెండుదినములు యెడతెగక మర్దించి మాత్రలుజేసి గాజుకుప్పెలో బోసి వాలుకాయంత్రములో నునిచి రెండుఝాములు (గంధకము జీర్ణంబగువఱకు) తీక్ష్ణాగ్నిచే వండి సాంగశీతలమున దీసి ప్రతిదినము రెండు గురిగింజలయెత్తు ఔషధమును అల్లపురసానుపానముతో సేవింపుచుండిన సకల ఆహిక జ్వరములు నశించు. (ఇదియ పాశుపతాస్త్రరసము.)

శీతజ్వరములకు మహాపాశుపతాస్త్రరసము

ద్విభాగం శ్వేతపాషాణం రసం నేపాళమ్లేచ్ఛకమ్. 98
ప్రత్యేకమేకభాగంతు ఖల్వమధ్యే వినిక్షిపేత్,
కృష్ణదుత్తూరతోయేన మర్దితం యామమాత్రకమ్. 99
ముద్గప్రమాణమాత్రేణ త్వార్ద్రికం చానుపానకమ్,
ఐకాహికం ద్వ్యాహికంచ త్ర్యాహికం నాశయేజ్జ్వరమ్. 100
(సిద్ధవిద్యాభూః)

తా. శుద్ధిచేసిన ఉల్లిపాషాణము ౨ భాగములు, శుద్ధిచేసిన కపురి, శుద్ధిచేసిన ళములు, శుద్ధిచేసిన ఇంగిలీకము-ఇవి దినుసు ఒకటింటికి ఒక్కొక భాగము. ఇత్తే పన వీనినెల్ల గ్రహించి ఖల్వములోవైచి ఒకఝాము నల్ల ఉమ్మెత్తాకురసముతో గా మర్దించి పెసరగింజలంతేసి మాత్రలుచేసి యందొకదానిని చలివచ్చినతోడనే పురసముతో సేవింపవలయు. ఇటుల మూఁడుపూటలు సేవించిన ఏకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక శీతలజ్వరములు హరించును. (దీనియందు చప్పిడిగంజిని త్రాగవలయు. యు నీయౌషధమును వరుస త్రిరాత్రజ్వరములయందును సేవింపవలయు. ఈపాశు స్త్రరసములు శీతజ్వరములను హరింపఁజేయుటయందు కడుప్రసిద్ధిజెందినవి.)

### ద్వ్యాహికజ్వరలక్షణము

కరపాదవిదాహశ్చ ముఖే పాండురశోఫతా,
అంతర్దాహో బహిశ్శీతం ద్వ్యాహికజ్వరలక్షణమ్. (బాహటే)

తా. చేతులు కాళ్లు మండుట, ముఖము పాండురవర్ణమై శోఫయుక్తముగ సుట, కడుపులో మంట కలుగుట, వెలపట శీతలముగ నుండుట - ఈలక్షణములుంగలది వ్యాహికజ్వర మని తెలియవలయు. (ఈద్వ్యాహికజ్వరమునందు పైఁజెప్పిన పాశుప స్త్రరసమును సేవింపవలయు.)

### త్రిరాత్రజ్వరలక్షణము

దేహినాం శ్యామలంవర్ణం కంఠశోషశ్చ దాహకృత్,
గాత్రంతు శీతలం గ్రాహ్యం త్రిరాత్రజ్వరలక్షణమ్. 102
(పూజ్యపాదీయే)

తా. శరీరమునకు నల్లవర్ణము, కంఠము శోషించుట, శరీరము చల్లనై యుండుట-క్షణములు గలది త్రిరాత్రజ్వర మని తెలియవలయు. (ఈత్రిరాత్రజ్వరవరుసలో ము వచ్చుటకు ముందుదినము కడుపు కలుసుటకై యిఁకఁ జెప్పఁబడు రసప్రతాప ర్తాండరసమును గుడపానకయుక్తముగా సేవింపవలయు.)

### రసప్రతాప మార్తాండరసము

రసహింగుళనేపాళం పృథ్వీదంత్యంబుమర్దితం,
దినార్ధేన జ్వరం హన్యాద్గుడేన సితయాసహ. 103
చతుర్వల్లమిదంఖాదే త్సర్వజ్వర ప్రశాంతయే,

తా. శుద్ధిచేసినరసము ౧ భాగము, శుద్ధిచేసిన ఇంగిలీకము ౨ భాగములు, శుద్ధి నేపాళములు ౪ భాగములు - ఇటుల వీనిని ఖల్వములో వైచి నేలదంతిచెక్క

రసముచే రెండుఝాములు బాగుగా మర్దించి నాలుగువల్లములు (అనఁగా ఎనిమిది గురుగింజలయెత్తు) మాత్రలుచేసి యందొకదానిని బెల్లపురసముచేగాని పంచదార పానకముచేగాని సేవించిన కడుపుకలిసి సర్వజ్వరములు హరించు. (ఈ రసప్రతాపమార్తాండరసమును సేవించిన మరుదినంబున త్రిరాత్రజ్వరమునకు ఇఁకఁ జెప్పఁబడు జ్వరాంకుశమును ఒకమండలము సేవింపవలయు.)

## త్రిరాత్రజ్వరమునకు జ్వరాంకుశము

సూతంగంధంవిషంతుల్యం ధూర్తబీజం త్రిభిస్సమమ్. 104
చతుర్ణాం ద్విగుణం వ్యోషం చూర్ణయే ద్దినమాత్రకమ్,
జంబీరస్యరసైర్మర్ద్య మార్ద్రికస్య ద్రవేనచ. 105
గుంజాద్వయం ప్రదాతవ్యం వాతజ్వరహరం పరం,
ఇదం జ్వరాంకుశం నామ్నా సర్వజ్వరవినాశనమ్. 106
ఐకాహికం ద్వ్యాహికంచ త్ర్యాహికంవా చతుర్థకమ్,
విషమంవా త్రిదోషంవా హంతి సత్యం నసంశయః. 107

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన నాభి - ఇవి సమభాగములు, ఈమూటికి సమము శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు, ఈనాలుగింటికి ఇమ్మడి సొంటి, పిప్పలి, మిరియాలు-ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముచే ఒకదినము బాగుగా మర్దించి రెండుగురిగింజలంతేసి మాత్రలుచేసి యం దొకదానిని అల్లపురసముతో సేవించిన వాతజ్వరము హరించు. ఇది వాతజ్వరమును హరింపఁ జేయుట యందు కడుశ్రేష్ఠంబైనది. మఱియు దీనిని అల్లపురసముతో నలుబదిదినములు సేవించిన ఐకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థికజ్వరములు విషమజ్వరములు త్రిదోష జ్వరము మొదలగు సర్వజ్వరములు నిస్సంశయముగ హరించు. ఇదియ జ్వరాంకుశ మనఁబడు. (ఈజ్వరాంకుశమును పావుశేరు ఖర్జూరపండ్ల అనుపానముతోనేని, లేక పావుశేరు నేలతాటిగడ్డలచూర్ణానుపానముతోనేని, లేక పావుశేరు గుడానుపానముతోనేని ఒకమండలము ప్రత్యహము సేవింపుచుండిన త్రిరాత్రజ్వరము నశించు.)

తామ్రతోద్విగుణం తాళం మర్దయేత్స్నుహీద్రవైః,
ప్రపుటేద్భూధరేశీతే వజ్రీక్షీరేణ మర్దయేత్. 108
ప్రపుటేద్భూధరే పశ్చాత్పంచగుంజామితం భజేత్,
ఆర్ద్రికస్య రసేనైవ సర్వజ్వరనికృంతనః. 109
ఐకాహికం ద్వ్యాహికంచ త్ర్యాహికం చతురాహికం,

విషమంచాపి శీతాఢ్యం జ్వరం హంతి జ్వరాంకుశః. (అన్యశాస్త్రే)

తా. తామ్రభస్మము ౧ భాగము, శుద్ధిచేసిన తాళకము ౨ భాగములు-ఇటుల ని ఖల్వములో నునిచి కాకరాకు రసముచే ఒకరుఘాము మర్దించి బిళ్లచేసి యెండ డించి భూధరయంత్రములో పుటంబిడి సాంగశీతలమున దీసి బొంతజెముడు పాలచే రల మర్దించి మరల భూధరయంత్రములో పుటంబిడి అయిదు గురిగింజలప్రమాణమును ల్లపురసముతో సేవించిన ఐకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థిక జ్వరములు విషమ రములు శీతజ్వరము మొదలగు సర్వజ్వరములు హరించు. (ఇదియును జ్వరాంకుశ నఁబడు.)

### సర్వజ్వరములకు మహాజ్వరాంకుశరసము

పారదం గంధకం తామ్రం హింగుళం తాళమేవచ,
లోహం వంగం మాక్షికంచ ఖర్పరంచ మనశ్శిలా. 111
మృతాభ్రకం గైరికంచ టంకణం దంతిబీజకం,
సర్వాణ్యేతాని తుల్యాని చూర్ణయిత్వా విభావయేత్. 112
జంబీరతులసీచిత్ర విజయా తింతిడీరసైః,
ఏభి ర్దినత్రయంరౌద్రే నిర్జలే ఖల్వగహ్వరే. 113
చణమాత్రాం వటీం కృత్వా ఛాయాశుష్కాంచ కారయేత్,
మహాగ్ని జననీచైషా సర్వజ్వరవినాశినీ. 114
ఏకజం ద్వంద్వజంచైవచిరకాలసముద్భవం,
ఐకాహికం ద్వ్యాహికం చ తథా త్రిదివసజ్వరమ్, 115
చాతుర్థికం తథాత్యుగ్రం జలదోషసముద్భవం,
సర్వాన్ జ్వరాన్ నిహంత్యాశు భాస్కర స్తిమిరం యథా. 116
నాతఃపరంకించిద స్తి జ్వరనాశనభేషజం.
మహాజ్వరాంకుశోనామ రసోయం మునిభాషితః. (గ్రంథాంతరే)

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, తామ్రభస్మము, శుద్ధిజేసిన ఇంగి కము, శుద్ధిచేసిన తాళకము, లోహభస్మము, వంగభస్మము, శుద్ధిచేసిన హేమమాక్షి కము, శుద్ధిచేసిన కపరి, శుద్ధిచేసిన మణిశిల, అభ్రకభస్మము, కావిరాయి, వెలిగారము, నేలదంతివిత్తులు-వీనిని సమభాగములుగా చూర్ణముచేసి ఖల్వములో వేసి నిమ్మపండ్లరసము తులసిరసము చిత్రమూలరసము తక్కెడరసము చింతాకురసము వీనిలో ప్రతిదానిచే మూడేసిదినములచొప్పున భావనచేసి పిదప పైరసముల నన్నిటిచే ఖల్వమును నిండించి



మూడుదినములు నిర్జలప్రదేశములో ఖల్వముతోడ నెండ నెండించి శనగగింజలం
మాత్రలుచేసి నీడనెండించి యందొకమాత్రను అల్లపురసముతో సేవించిన అగ్నిదీపన
గలుగుటయేగాక వాతపిత్తశ్లేష్మజ్వరములు ద్వంద్వజ్వరములు పురాణజ్వరములు ఐ
హిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థికజ్వరములు అత్యుగ్రజ్వరము జలదోషమువ
జనించిన జ్వరము ఈమొదలగు సర్వజ్వరములను "సూర్యుఁడు చీకటిని బోకడు
చందంబున" బోకడుచు. జ్వరముల బోకడుచుటయందు దీనికంటె శ్రేష్ఠంబైనయౌష
ధియు లేదు. ఇది మహాజ్వరాంకుశరస మని మునీశ్వరులు వచించిరి.

## త్రిరాత్రజ్వరమునకు త్ర్యాహికారిరసము

రసకేసనమం శుద్ధం శిఖిగ్రీవంచ పాదికం,
గోజిహ్వాయా జయంత్యాచ తండులీయైశ్చ భావయేత్. 1
ప్రత్యేకం సప్తసప్తాథ శుష్కం గుంజాచతుష్టయం,
జరణేన ఘృతేనాద్యాత్త్ర్యాహికజ్వరశాంతయే. (మాధవనిదా

తా. కఫరి, శంఖము-ఇవి సమభాగములు. మైలుతుత్తము కాలుభాగము, వీటి
ఎద్దునాలుక, తక్కెడు, చిఱ్ఱికూర వీనిరసములలో ప్రతిదానిచే ఏడుపర్యాయము
భావనచేసి మర్దించి మాత్రలుచేసి నీడ నెండించి నాలుగు గురిగింజలయెత్తును ప్ర
నేతితో నిప్పించిన త్ర్యాహికజ్వరము నివర్తించును.

## త్రిరాత్రజ్వరచికిత్స

క. ఇలఁ దమ్ములమున నల్లుల
విలసితముగ వరుసతోడ విడియము సేయఁ
జలిబెట్టు త్రిరాత్రజ్వర
కులమెల్లను ద్రుంచుటరుదె గోపతిగమనా.

తా. త్రిరాత్ర వరుసదినమున నైదునల్లులను, రెండవ వరుసదినమున నేడునల్
లను, మూడవవరుసదినమున దొమ్మిదినల్లులను, తమలపాకులలో బొదిగి విడెముసేయ
వలయు. ఇటులజేసిన త్రిరాత్రజ్వరము హరించు. (త్రిరాత్రజ్వరములో పైఁజెప్పి
పాశుపతాస్త్రమునుకూడ బ్రయోగింపవలయు.)

## చాతుర్థికజ్వరలక్షణము

శీతం సపులకం గాత్రం శిరోభ్రమణకంపనే,
హరిద్రా నేత్రకాంతిశ్చ చాతుర్థజ్వరలక్షణమ్. (మాధవనిదానే

తా. చలిపెట్టుట, శరీరము పులకరించుట, తలదిరుగుట, వణుకుట, నేత్రములు చ్ఛనై యుండుట- ఈలక్షణములుగలది చాతుర్థికజ్వర మని తెలియవలయును.

చతుర్థకోమలే మేదో మజ్జాస్థ్న్యన్యతమే స్థితే,
మజ్జన్యేవ స్వపరే ప్రభావం సతు దర్శయేత్. 121
ద్విధాకఫేన జంఘాభ్యాం సపూర్వ శ్శిరసోనిలాత్,
చతుర్థకస్యాధుకార్య స్స త్ర్యహాంతరసంభవః. (బాహటే) 122

తా. మేదస్సు, మజ్జ వీనిలో దేనినేని దోషము ఆశ్రయించియుండునపుడు చాతుర్థికజ్వరము కలుగును. మజ్జధాతువు నాశ్రయించియుండునపుడు చాతుర్థికజ్వరము కలుగు నని కొందరాచార్యులమతము.

చాతుర్థికాదిసర్వజ్వరములకు మహదగ్నికుమారము

రసంవిషంచాభ్రగంధం తాళకం హింగుళం విషం,
శుల్బభస్మసమంతుల్యాం మర్దికం భృంగవారిణా, 123
కాచకుప్యాం వినిక్షిప్య మృత్తికాం లేపయేద్బహిః,
వాలుకాయంత్రకేపాచ్యం దినైకం మందవహ్నినా. 124
సాంగశీతలముద్ధృత్య దాతవ్యం చణమాత్రకం,
అనుపానవిశేషేణ చాతుర్థికజ్వరం హరేత్. 125
సన్నిపాతం నిహంత్యాశు సర్వజ్వరహరం పరం,
మహదగ్నికుమారోయం సర్వవ్యాధివిదారణమ్. (చింతామణౌ)

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన వసనాభి, అభ్రకభస్మము, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన తాళకము, శుద్ధిచేసిన ఇంగిలీకము, శుద్ధిచేసిన ఉల్లిపాషాణము, తామ్రభస్మము - వీనిని సమభాగములుగా ఖల్వములో నునిచి గుంటగలగరాకురసముచే ఒకదినము బాగుగా మర్దించి గాజుకుప్పెలో బోసి దానిపై చీలమన్ను లేపనముచేసి ఒక దినము వాలుకాయంత్రములో మందాగ్నిచే పాకముచేసి సాంగశీతలమున దీసి గుంట గలగరాకురసముచే మరల మర్దించి శనగగింజలంతమాత్రలు చేసి నలువదిదినములు అల్లపు రసానుపానముతో సేవింపుచుండిన చాతుర్థికజ్వరము సన్నిపాతజ్వరము త్రిరాత్రవరుస జ్వరము ఆహ్నికజ్వరము పురాణజ్వరములు ఇవి మొదలగు సర్వజ్వరములు హరించు. (దీనిని చాతుర్థికజ్వరమున పంచమూల కషాయానుపానముతో సేవింపవలయును.) ఇదియ మహదగ్నికుమార మనఁబడు.

## శీతజ్వరానుపానములు

కణాభయంవా కణజీరకంవా సశర్కరం కేవలజీరకంవా,
ఉష్ణాంబుపీత్వా సహసానిహన్యాచ్ఛీతస్యకంపంపరితాపముగ్రమ్.
(మాధవనిదానే)

తా. ఆహికజ్వరములయందు పిప్పలి కరకకాయనుగాని, లేక పిప్పలి జీలకఱ్ఱను గాని, లేక పంచదార జీలకఱ్ఱనుగాని, అనుపానముగా గ్రహించి ఉష్ణోదకముతో పాకము చేయించవలయు. మఱియు నౌషధమును అల్లపురసయుక్తముగా నొసంగవలయు. ఇటులజేసిన చలి వణఁకు ఉగ్రతాపము వీనితోఁగూడియుండు ఆహికజ్వరములు శీఘ్రముగా నశించు.

## ఆహికజ్వరనస్యములు

గిరికర్ణికయోర్మూలం మరీచం లశునంయుతమ్,
నస్యం శీతజ్వరం హంతి ఏకద్విత్రిచతుర్థకమ్. (మాధవనిదానే)

తా. *తెల్లగంటెనవేరు, నల్లగంటెనవేరు, మిరియాలు, వెల్లుల్లిపాయలు-వీనిని సమభాగములుగా నూరి నస్యముచేయించిన ఏకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థిక శీతజ్వరములు నశించు.

నరకేశాభ్యంగతైలే కాకచూర్ణం సపిప్పలం,
నస్యం శీతజ్వరం హంతి చాహికం హరతి క్షణాత్. (ఆయుర్వేదే)

తా. మనుజుఁడు అభ్యంజనము చేసికొనినపిదప అంటకలికాసరవేళ్ళు పిప్పళ్ళు నూరి నస్యముచేయించిన శీతజ్వరములు, ఆహికజ్వరములు తత్‌క్షణమున నశించు.

అజామోదం సైంధవంచ మరీచం లశునం సమం,
అర్కపత్రరసే నస్య మాహికజ్వరనాశనమ్. 130

తా. ఖురాసాని ఓమము, సైంధవలవణము, మిరియాలు, వెల్లుల్లిపాయలు - వీనిని సమభాగములుగా గ్రహించి జిల్లేడుకొనలరసముచే నస్యముచేయించిన ఆహిక జ్వరములు కూతవేసిపడే మూర్ఛరోగములు నశించు.

## మసూచికాజ్వరలక్షణము

వాతపిత్తకఫజామసూరికా శైలికాభిషగమంతుమానుషాః,
గంభీరాత్రిదినముత్థితాతథా సన్నిమోహన చతుర్థనాడికా. 131
ఈశ్వరప్రళయ ఉగ్రరూపిణీ చాష్టకేనవద శేషు శోషణం,

* ఇదే ఉంటెనవే రనియుఁ జెప్పఁబడు.

శక్తిరూపమథవాష్టమే జ్వరం దోషధాతునవమే ప్రలుప్యతే. 132
ఈశ్వరప్రళయముగ్రముద్భవం వైద్యనాథమితి కథ్యతే శృణు,
మధుమసూరికాపిత్తజాతిః, కృష్ణమర్కటదద్రువిషమాకఫజాతిః,
దోషజిహ్వాకమనిలగ్రహదోషజాతిః, హారనయనసముద్భవాగ్నినత్రి
ధాతువేష్టితముగ్రమారణమ్. (మాధవనిదానే) 134

తా. మసూరికాజ్వరము వాతపిత్తశ్లేష్మములవలన మనుజులకు శిలలకు జనించు నియు వానికి చికిత్సచేయుట కడు నసాధ్యం బనియు మనుజులు దెలిసికొనవలయు. మఱియు దానియందు మూడుదినములు గంభీరజ్వరము గలిగియుండుటయే గాక సన్ని పాతచాతుర్థికజ్వరములవలెనే నాడియు నాడును. మఱియు నది ఈశ్వరప్రళయమువలెనే గ్రరూపముగలదై ఎనిమిది, లేక తొమ్మిది, లేక పదిదినములకు శరీరమునుండి జారి పొక్కులు కట్టును. ఇది శక్తిస్వరూపము కలది. మఱియు నిది వాతపిత్తశ్లేష్మములను సాదిసప్తధాతువుల నాశ్రయించుటచే ఎనిమిది, లేక తొమ్మిదవదినమున జ్వరము మించు. మఱియు నిది ప్రళయమువలెనే ఉగ్రమైన యుత్పత్తిగలదిగ నుండు. దానం జేసి దానిస్థితి నెఱుంగుటకు వైద్యులకశక్యంబు. స్ఫోటకములు వట్రువలై నేత్రముల ంపుగ నుండిన పిత్తధాతుజనిత మనియు, నల్లకోతివెంట్రుకలవలె దద్దులు గలవై విషమ ముగ నుండిన శ్లేష్మధాతుజనిత మనియు, దోషగ్రస్తమైన నాలుకవలె నుండిన వాతధాతు జనిత మనియు, ఈమూడుధాతువులు నేకమై యుండిన వాఁడు చచ్చు ననియు తెలియ వలయు.

ఉగ్రరూపం మహాతేజ స్త్రిశూలం డమరుకం తథా,
క్రోధాగ్నిదంష్ట్రాసహితం శక్తిజ్వరస్య సంభవమ్. (ఆయుర్వేదే)

తా. ఉగ్రరూపము మహాతేజస్సు త్రిశూలము డమరుకము క్రోధము నేత్రముల యందు నిప్పులురాలుట పెద్దకోరలు ఇవిగలది మహాశక్తి జ్వరస్వరూపమని తెలియవలయు.

దాహజ్వరం సంతతదాహతృష్ణా,
మూర్ఛా స్యదోషం వమనంచ తంద్రా,
స్ఫోటజ్వరం *జంతువికారకారి
మసూరికాచ జ్వరమష్టసంభవమ్. (గ్రంథాంతరే) 136

* వ్యాధివికారకారి.

తా. దాహయుక్తజ్వరము ఎల్లప్పుడు ఆఁకలి దప్పి మూర్ఛ ముఖదౌర్గంధ్యము వాంతులు తంద్ర కడుపులో శూల ఈలక్షణములు గలది మసూరికాజ్వర మని తెలియవలయు. ఈమసూరికాజ్వరము ఎనిమిదివిధంబులుగ జనించు.

## అసాధ్యమసూరికాజ్వరలక్షణము

దద్రుంచ కుండలం దీర్ఘ మంతర్వేగం చతుర్విధం,
కృష్ణంచ రక్తకం శ్వేత మతివృద్ధిశ్చ నాశనమ్. 13
తృష్ణాతిసారః కంపశ్చ శ్వాసకాసాదివిభ్రమః,
హిక్కా మూర్ఛా జ్వరం దాహ మసాధ్యంచ వివర్జయేత్. 13
(అశ్వినీప్రోక్తే

తా. స్ఫోటకములు పద్దులయొక్క ఆకారము, వర్తులాకారము, దీర్ఘాకారము అంతర్వేగముగలవి యని నాలుగువిధంబులు. అవి కృష్ణవర్ణంబులుగనేని రక్తవర్ణంబలుగనేని శ్వేతవర్ణంబులుగనేని తలుచుగనేని నుండినను తలుచుగా దప్పి అతిసారము శరీ కంపము శ్వాసకాసలు డగ్గుత్తిక తబ్బిబ్బుమాటలు ఎక్కిళ్ళు మూర్ఛ జ్వరము దాహమ అనువానిలో దేనితోనైనను గూడియుండినను మరణము కలుగు నని తెలియవలయు.

## స్ఫోటకజ్వరచికిత్స

మహామయం సర్వమనేకరూపం
మూర్ఛాత్రిదోషజ్వరసన్నిపాతైః,
ఇదంపరాశక్తిరుజామనుష్యే
ష్వనేకరూపం బహుళం చికిత్సితమ్. 139
ధూమంచ యంత్రం తిలకం మనుష్యో
వక్ష్యేచ తాని స్ఫుటమేవ సంగ్రహాత్. (సిద్ధరసార్ణవే)

తా. సమస్తస్ఫోటకజ్వరములు కడుపరాక్రమముగలవిగ మూర్ఛ త్రిదోషసన్నిపాతములచే పలురూపంబులుగలవిగ నున్నయవి. మనుజులకు జనించెడి ఇవ్విధశక్తిరూపము గల స్ఫోటకజ్వరములకు ధూపములు యంత్రములు తిలకములు మొదలగు ననేక చికిత్సలు గలవు. వానిని సంగ్రహముగా వచించెద. వానిని మనుజు లాచరించవలయు.

దృష్టంహారీతాత్రేయకసంహితాయాంహారిద్రవిశ్వౌషధవాసకేషికా
గుడూచి నింబా తులసీదళంచ సజీరకం ధాన్యకపర్పటీచ. 140
విళంగతక్కోలత్రిజాతకంచ పాఠాదురాలాభువినింబపత్రమ్,

)లై వ్యశ్చపుంఖిపశుగంధదారుణంపతత్సమాంశంహరతే మసూరికామ్.
(సిద్ధరసార్ణవే)

తా. వాతపైత్యశ్లేష్మజనిత మసూరికాజ్వరములకు పసుపు, సొంటి, అడ్డసరపు ఆకులు, తిప్పతీగె, వేపాకు, తులసియాకు, జీలకఱ్ఱ, కొతిమెర్లు, పర్పాటకము, వాయువిడంగములు, తక్కోలపుట్టు, [1]లవంగపుచెక్క, ఏలకులు, ఆకుపత్రికె, చిరుబొద్ది, రేగటిదూల, నేలవేపాకు, మారేడు, ములువెంపలి, వావిలి, వీనినిసమభాగములుగా గ్రహించి ఉదకముతో మర్దించి దానిరసమును సేవించిన మసూరికాజ్వరములు హరించు. వీనిని హారీతాత్రేయాదిసంహితలం జూచి వచించినాఁడ.

ఉశీరం నింబపత్రంచ ధాత్రీమధుకధాన్యకమ్,
ముస్తా సౌవీరకం ఛిన్నం మంజిష్ఠాతివిషా తథా. 142
ఏతాని సమభాగాని తుల్యం చూర్ణంతు కారయేత్,
క్వాథమష్టావశేషంచ మసూరీజ్వరనాశనమ్. (మాధవనిదానే) 143

తా. వట్టివేళ్ళు, వేపాకు, ఉసిరికెపప్పు, ఇప్పపువ్వు, కొతిమెర్లు, తుంగముస్తెలు, రేగుపలుకులు, తిప్పతీగె, మంజిష్ఠ, అతివస-వీనిని సమభాగములుగా దంచి చూర్ణము చేసి దీని కెనిమిదింతలు నీళ్ళుపోసి అష్టావశేషముగా కషాయము కాచి సేవించిన మసూరికాజ్వరములు హరించు.

మధుకంచ సమం జాజి దేవదారుచిరాయుతం,
గుళూచీ బిల్వమూలంచ వాలుకం ముస్తకం తథా. 144
క్వాథ మష్టావశేషంతు మసూరీజ్వరనాశనం,

తా. ఇప్పపువ్వు, జాజికాయ, దేవదారు, ఊరకాకర, తిప్పతీగె, మారేడువేరు, కురువేరు, కూతురుబుడమ, తుంగముస్తెలు వీనిని సమభాగములుగా దంచి యందుదకముబోసి అష్టావశేషముగా కషాయము కాచి సేవించిన మసూచికాజ్వరములు హరించు. (మఱియు మాహేశ్వరధూపములు వేయవలయు. చండభానుతిలకము పెట్టవలయు. ఇటులజేసిన మసూచికాజ్వరములు అంటకుండు.)

## క్రిమిరోగలక్షణము

జ్వరోవివర్ణతా శూలం హృద్రోగస్సతతంభ్రమః. 145
భక్తద్వేషోతిసారశ్చసంవిద్యాత్క్రిమిలక్షణం, (సిద్ధవిద్యాభూః)

---

1 ఇదే దాచినిచెక్క. 2 ఇదే పిన్నరేగటిదూలగొండి.

తా. జ్వరము కలుగుట, శరీరము వివర్ణమైయుండుట, కడుపులో శూలించుట, హృదయములో మండుట, ఎల్లప్పుడు తబ్బిబ్బులాడుట, అన్నద్వేషము, అతిసారము ఈలక్షణములు గలది క్రిమిరోగ మని తెలియవలయు.

క్రిమిరోగచికిత్స

ఆరనాళేన పాతవ్యః క్రిమిఘ్నః క్రిమిశత్రుపః. 146
ప్రాతస్తత్సమోనాస్తి క్రిమిఘ్నో భువనత్రయే, (మాధవనిదానే)

తా. వాయువిడంగములను కలితో నూరి ప్రాతఃకాలమునందు సేవించిన క్రిమి రోగములు హరించు. క్రిముల నశింపజేయుటకు దీనికి సమానమైన యౌషధము ముల్లోకములయందు లేదు.

ఖదిరః కుటజః పిచుమందవచా త్రికటు త్రిఫలం త్రివృతాచ సమమ్,
పశుమూత్రయుతంపిబ సప్తదినం క్రిమికోటిశతాన్యపిహంత్యచిరాత్.
(గ్రంథాంతరే)

తా. చంద్రచెక్క, *కోలముక్కిచెక్క, మంచివేపచెక్క, వస, సొంటి, పిప్పలి, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, ఉసిరికెపప్పు-వీనిని సమభాగము లుగా చూర్ణముచేసి దీనికిసమముగా శుద్ధిచేసిన తెల్లతెగడ చూర్ణమును కలిపి ప్రతిదినము నాలుగుమాడలయెత్తు చూర్ణమును ఆవుపంచితముతో ఏడుదినములు సేవించిన సంఖ్యాతీత క్రిము లుండినను శీఘ్రముగ నశించును.

పాలాశబీజం సగుడం తిలజంతుఘ్నసంయుతమ్,
జలేన నారికేళస్య పిబేత్క్రిమివినాశనమ్. (మాధవనిదానే) 148

తా. మోదుగవిత్తులు, బెల్లము, నువ్వులు, వాయువిడంగములు-వీనిని సమభాగ ములుగా గ్రహించి టెంకాయనీళ్లతో నూరి సేవించిన క్రిమిరోగములు నశించును.

విళంగనిర్గుండ్యభయాఖుకర్ణీ రసోనశోభాంజనచిత్రకాణామ్,
క్వాథానిషేవ్యః క్రిమిదుష్టరోగే యథామృతంస్వర్గిభిరాదరేణ. 149
(అన్యశాస్త్రే)

తా. వాయువిడంగములు, వావిలి, కరక్కాయలు, ఎలుకచెవివిత్తులు, వెల్లుల్లి పాయలు, మునగవిత్తులు, చిత్రమూలము-వీనిని సమభాగములుగ దంచి కషాయము కాచి "స్వర్గవాసులగు దేవతలు అమృతమును ఆదరణతో సేవించినమాడ్కి" క్రిమిదుష్టరోగము గలవారు సేవించిన క్రిములు నశించుటయే గాక దివ్యశరీరముకూడా గలుగు.

---

* కొడిసెచెక్క.

ముస్తాఖుకర్ణీ సురదారుశిగ్రు వరాకషాయః క్రిమిజిత్కణాఢ్యః,
జలేనవాహింగువిళంగబీజం ప్రపీతమాశుక్రిమిజిత్కణాఢ్యమ్. 150
(మాధవనిదానే)

తా. తుంగముస్తెలు, ఎలుకచెవివిత్తులు, దేవదారు, మునగ, పిల్లిపీచర, వాయువిడంగములు, పిప్పళ్లు - వీనిని సమభాగములుగా దంచి కషాయము గాచి సేవించినను, లేక ఇంగువ, వాయువిడంగములు, పిప్పళ్ళు - వీనిని ఉదకముతో నూరి సేవించినను క్రిమిరోగములు హరించు.

యఃపిబేచ్ఛ్రద్ధయా నామ్నా కీటమర్దనకం రసం,
త్రిమాసం క్రిమిరోగేషు దివ్యదేహీభవే న్నరః. 151

తా. క్రిమిరోగముగలవారు కీటమర్దనరసమును మూడుమాసములు సేవించిన దివ్యదేహముగలవారుగ నయ్యెదరు.

## క్రిమిరోగములయందు పథ్యము

పటోలారిష్టవేత్రాగ్ర వాస్తుకం మూలకానిచ,
ఉపశ్రితో ముద్గయూషా పురాణశ్శాలిషష్టికః. 152
విళంగస్సర్వభోజ్యేషు క్రిమిరోగి ప్రయోజయేత్.

తా. పొట్లకాయ, వేము, వెదురుగొమ్ము, చక్రవర్తికూర, ముల్లంగిగడ్డలు, పెసరకట్టు, అరువదిదినములకు పండినప్రాతవడ్లు, వాయువిడంగములు - వీనిని సర్వభోజ్యవస్తువులయందు క్రిమిరోగపీడితులు జేర్చుకొనవలయు.

## క్రిమిరోగములయందు అపథ్యము

క్షీరాణి మాంసాని గుడం ఘృతాని దధీని శాకానిచ పర్ణవంతి,
సమాషతోమ్లాన్మధురాన్రసాంశ్చక్రిమీ౯జిఘాంసుః పరివర్జయేత్తా౯.

తా. పాలు, మాంసములు, బెల్లము, నెయ్యి, పెరుగు, ఆకుకూరలు, మినుములు, పులుసు, తేనె మొదలగు మధురద్రవ్యములు-వీనిని క్రిమిరోగులు వర్జింపవలయు.

## జంతుజ్వరలక్షణము

అరుచి శ్శ్యామనేత్రత్వం పాండుత్వం ఛర్దనం భ్రమః,
జ్వరాతిసారహృచ్ఛూలం క్రిమిణాథ ప్రజాయతే. (ఆయుర్వేదే)

తా. అరుచి నేత్రములకు నలుపువర్ణము శరీరమునకు పాండురవర్ణము వాంతులు తబ్బిబ్బుమాటలు జ్వరము అతిసారము ఱొమ్మునొప్పి ఇవి కలిగిన జంతుజ్వరమని తెలియవలయు.

### జంతుజ్వరములకు కీటమర్దనరసము

శుద్ధసూతం శుద్ధగంధ మజామోదం విళంగకం,
విషముష్టి ర్బ్రహ్మబీజం క్రమాదూర్ధ్వగుణం భవేత్. 155
చూర్ణయేన్మధునా లేహ్యం నిష్కైకం జన్తుజిద్భవేత్
కీటమర్దరసోనామ ముస్తాతోయం పిబేదను. (భేషజకల్పే) 156

తా. శుద్ధిచేసిన రసము ౧ భాగము, శుద్ధిచేసిన గంధకము ౨ భాగములు, ఓమము 3 భాగములు, వాయువిడంగములు ౪ భాగములు, *పెనుముష్టిచెక్క ౫ భాగములు, మోదుగవిత్తులు ౬ భాగములు - ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి అందులో తేనె బోసి వండి మాడయెత్తుమాత్రలు చేసి యందొకదానిని తుంగముస్తెల కషాయముతో సేవించిన జంతురోగము నశించు. ఇది కీటమర్దనరస మనఁబడు.

### జ్వరాతిసారలక్షణము

జ్వరసంతాపహృచ్ఛూల మరోచకవిరేచనమ్.
ఆమంవా శోణితంవాపి జ్వరాతీసారముచ్యతే. (మాధవనిదానే)

తా. జ్వరము సంతాపము రొమ్మునొప్పి అరుచి విరేచనములుగలుగుట ఆమము గాని రక్తముగాని పడుట ఈలక్షణములు గలది జ్వరాతిసార మని తెలియవలయు. (జ్వరాతిసారమునకు అతిసారప్రకరణములో నుదహరింపఁబడు కనకసుందరరసము నుపయోగింపవలయును.)

### జ్వరాతిసారచికిత్స

ధన్యానాగరముస్తాభి ర్బిల్వకైః క్వథితం జలమ్,
జ్వరాతిసారం విషమం మూర్ఛాం తృష్ణాం వమిం జయేత్.
(గ్రంథాంతరే)

తా. కొతిమెర్లు, శొంఠి, తుంగముస్తెలు, మారేడుపిందెలు-వీనిని సమభాగములుగా దంచి కషాయముకాచి సేవించిన విషమజ్వరాతిసారములు మూర్ఛ దప్పి వాంతులు హరించు.

### రక్తాతిసారజ్వరలక్షణము

రక్తాతిసారస్త్వథవా ప్రవాహః పిపాసనంచైవ మహాజ్వరస్స్యాత్,
విలోమవాంత స్సకలే నిరోధో జ్వరాతిసారస్యచ లక్షణంస్యాత్. 159
(పూజ్యపాదీయే)

* ఇదే విషముష్టి యనియు, ముసిణి యనియుఁ జెప్పఁబడు.

గర్భమైనట్టిమృతవంధ్యకాంతలెల్ల
కలితదీర్ఘాయుపుత్రులఁ గాంతు రపుడు.

(పైఁజెప్పఁబడిన రెండుపద్యములలోని యౌషధముల గర్భము నిలిచిన నాలవ మాసము మొద లొకమండలముగాని లేక రెండుమండలములుగాని సేవించుటయేగాక చప్పిడిపథ్యము నాచరింపవలయును. చప్పిడి యన — ఆవుపాలు, ఆవునెయ్యి, చింతలాకు, కూర, సహదేవికూర, అనువానితోడ నన్నము భుజించుటయనునది.)

సీ. శనివారముపవాసముచునుండి భానువారమునాడుగలగరసమునూనె
సరికూర్చి గంధకం బరతులంబును గల్పి భక్షించిశయ్యపైఁబవ్వళించి
పూని కుంపటిఁ గాచి మూఁడవజామున నీళ్ళాడి పథ్యంబునెఱినొనర్చి
పొసఁగ భానుత్రయంబును నాచరించియు మాన్యమా నేడవమాస [మందు
గీ. ననుభవించినకాంతల కవనిఁ బుత్ర
వర్గ ముదయించు మఱి శతవత్సరంబు
లాయువును గల్గినట్టి యత్యధికబలుల
సంశయంబేల నిందుకు సాటి లేదు.

ఏకవింశ ప్రకరణమ్.



# ద్వావింశప్రకరణము.



## క్షుద్రరోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లోకః. జగత్కారణ మీశానాం జటామండలమండితం,
వ్యాఘ్రచర్మాంబరధరం లింగమూర్తి మహం భజే.

తా. జగత్కారణభూతుఁడు, జగత్పరిపాలకుఁడు, జటామండలాలంకృతు: వ్యాఘ్రచర్మమును ధరించినవాఁడు, లింగస్వరూపుఁడు నగు పరమేశ్వరుని నేను ఖుంచెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్.

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేరొం ఁడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ గ్రంథముయొక ద్వావింశప్రకరణమును వచింపుచున్నాఁడను.

### అజగల్లికాలక్షణము

స్నిగ్ధా స్సవర్ణా గ్రథితా నీరుజా ముద్గసన్నిభాః,
కఫవాతోత్థితా జ్ఞేయా బాలానా మజగల్లికా. (ఆయుర్వే

తా. శిశువులకు కఫవాతమువలన పెసలంత కురుపులు జనించి మినప ాడుచు చర్మముతో సమానవర్ణముగ, గుండ్రముగ, వేదనారహితముగ నుండిన అజగ ునంబడును.

### అజగల్లికాచికిత్స

తత్రాజగల్లికామామాం జలౌకాభి రుపాచరేత్,
శుక్తి సౌరాష్ట్రికాక్షార కల్కైశ్చ లేపయే న్ముహుః.

తా. అజగల్లిక పండుటకుముందు జలగల నంటించి రక్తముదీసి దానియందు క ప్పుసున్నము, పటికారము అనువాని కల్కమును పలుమారు లేపనము జేయవలయును

కఠినాం క్షారయోగైశ్చ ద్రావయే దజగల్లికాం,
శ్యామా లాంగలికా మూర్వా కల్కైరపి విలేపయేత్.

తా. అజగల్లిక కఠినంబైయుండిన దానిపై క్షారమును బూసి స్రావము జేయుః ల్లసుగంధిపాల, చెన్నచర్లగడ్డ, చాగ అనువానికల్కమును లేపనము జేయవలయును.

పక్వాం వ్రణవిధానేన యథోక్తేన ప్రసాధయేత్,

తా. అజగల్లిక పండిన దానియందు యథోక్తముగ వ్రణచికిత్సం జేయవలయును.

### యవప్రఖ్యాలక్షణము

యవాకారాసు కఠినా గ్రథితా మాంససంశ్రితా. 6
పిటికా శ్లేష్మవాతాభ్యాం యవప్రఖ్యేతిచోచ్యతే,

తా. కఫవాతమువలన కురుపు జనించి యవవలె కఠినముగ, గుండ్రముగ, మాంసాశ్రితముగ నుండిన యవప్రఖ్య యనంబడును.

### అంధాలజీలక్షణము

ఘనామవక్త్రాం పిటికా మున్నతాం పరిమండలామ్. 7
అంధాలజీ మల్పపూయాం తాం విద్యా త్కఫవాతజామ్,

తా. కఫవాతమువలన కఠినముగ, ముఖవిహీనముగ, ఉబ్బుగ నుండుకురుపులు జనించి వానిచుట్టు చిన్నగుల్లలు వ్యాపించి యొకింతచీముతో గూడియుండిన అంధాలజి యనంబడును.

### యవప్రఖ్యాంధాలజీచికిత్స

అంధాలజీం యవప్రఖ్యాం పూర్వం స్వేదై రుపాచరేత్. 8
మనశ్శిలా దేవదారు కుష్ఠై రేనాం ప్రలేపయేత్,

పక్వాం వ్రణవిధానేన యథోక్తేన ప్రసాధయేత్. 9

తా. అంధాలజి, యవప్రఖ్య అనువానియందు దొలుత స్వేదనకర్మంజేసి పిదప మణిశిల, దేవదారు, చెంగల్వకోష్టు అనువానినినూరి లేపనము జేయవలయును. అవి పండియుండిన యథోక్తముగ వ్రణచికిత్సం జేయవలయును.

### వివృతాపిటికలక్షణము

వివృతాస్యాం మహాదాహాం పక్వోదుంబరసన్నిభామ్,
పరిమండలాం పిత్తకృతాం వివృతాంనామ తాం విదుః. 10

తా. పిత్తసంబంధమువలన నోరుదెరచికొని కడుదాహయుక్తంబై పండిన యత్తిపండుతోసమానంబై చుట్టు సన్నని గుల్లలవలన వ్యాప్తంబైయుండిన వివృతపిటిక యనంబడును.

### వివృత, ఇంద్రవృద్ధ, గర్దభ, జాలగర్దభచికిత్స

వివృతా మింద్రవృద్ధాం చ గర్దభే జాలగర్దభే,
పైత్తికస్య విసర్పస్య క్రియయా సాధయే ద్భిషక్. 11

తా. వివృత, ఇంద్రవృద్ధ, గర్దభ, జాలగర్దభ మనురోగములయందు పిత్తవిసర్పమునకై జెప్పంబడిన చికిత్సం జేయవలయును.

పాకే తు రోపయే దాజ్యైః పక్వైర్మధుర భేషజైః,
నీలీ పటోలమూలాభ్యాం సాజ్యాభ్యాం లేపనం హితమ్. 12
జాలగర్దభరూపం తు సద్యో హంతి సవేదనం,

తా. పైఁజెప్పబడిన వివృతాదులు పండియుండిన దానియందు మధురౌషధములతో సిద్ధముజేయఁబడిన ఘృతలేపనమును జేయవలయును. మఱియును జాలగర్దభమునందు నీలి, చేతిపొట్లవేరు - వీనిని నేతితో నూరి లేపనముజేసిన పోట్లు తత్క్షణమున హరించును.

కచ్ఛపికాలక్షణము

గ్రథితాః పంచవా షడ్వా దారుణాః కచ్ఛపోన్నతాః. 13
కఫానిలాభ్యాం పిటికా జ్ఞేయా కచ్ఛపికా బుధైః,

తా. కఫవాతమువలన ఐదు, లేక ఆరు కురుపులవలన వ్యాప్తంబై తాఁబేటి వీఁపువలె నున్నతమై భయంకరముగ నుండిన కచ్ఛపికమనంబడును.

చికిత్స

కచ్ఛపీం స్వేదయేత్పూర్వం తతఏభిః ప్రలేపయేత్. 14
కల్కీకృతై ర్నిశా కుష్ఠ శిలా తాళక దారుభిః,
తాం పక్వాం సాధయే చ్ఛీఘ్రం భిషగ్వ్రణచికిత్సయా. 15

తా. కచ్ఛపికయందు దొలుత స్వేదమును దీసి పసపు, చెంగల్వకోష్టు, మణిశిల, తాళకము, దేవదారు అనువానికల్కమును లేపనము సేయవలయును. మఱియు నదిపండిన శీఘ్రముగ వ్రణచికిత్సం జేయవలయును.

వల్మీకలక్షణము

గ్రీవాంసకక్షాకరపాదదేశే సంధౌగళే వా త్రిభిరేవదోషైః,
గ్రంథిస్సవల్మీకవదక్రియాణాం జాతః క్రమేణైవగతః ప్రవృద్ధిమ్.
ముఖైరనేకైస్స్రుతితోదవద్భి ర్విసర్పవత్సర్పతిచోన్నతాగ్రైః,
వల్మీకమాహు ర్భిషజోవికారం నిష్ప్రత్యనీకంచిరజంవిశేషాత్.

తా. మెడ, భుజశిరములు, చంకలు, హస్తములు, పాదములు, సంధులు, కంఠము అనునీస్థలముల త్రిదోషమువలన పాముపుట్టవలె గ్రంథి జనించి చికిత్సింపఁబడకుండుటవలన నది మెల్లమెల్లగ వృద్ధిం జెంది పెక్కుముఖములు, స్రావము, సూదులతో బొడుచుటల వేదన, ఉన్నతమైన ముఖము గలదై విసర్పరోగమువలె ప్రసరించిన వల్మీక

మనంబడును. దీనియం దౌషధోపచారము సేయుట కశక్యంబు. మఱియు జనించి చిర కాలంబైన నొకింత యుపచారంబయినను జేయుట కశక్యంబు.

మనశ్శిలాదితైలము

మనశ్శిలా సభల్లాత సూక్ష్మైలాగరు చందనైః,
జాతీపల్లవ కల్కైశ్చ నింబతైలం విపాచయేత్. 18
వల్మీకం నాశయే త్తద్ధి బహుచ్ఛిద్రం బహువ్రణం,

తా. మణిశిల, జీడి, సన్నయేలకులు, అగరు, చందనము, జాజియాకులు అను వాని కల్కముతో వేపనూనె గలిపి కాచి లేపనముజేసిన అనేకఛిద్రములతో గూడి బహువ్రణములుగల వల్మీకము హరించును.

పనసికలక్షణము

కర్ణస్యాభ్యంతరే జాతాం పిటికా ముగ్రవేదనామ్. 19
స్థిరాం పనసి కాంతాం తు విద్యాద్వాతకఫోత్థితాం,

తా. చెవిలోపల వాతకఫముచే పనసకాయవలె కఠినముగనుండు కురుపు జనించి మిక్కుటముగ బోట్లతో గూడియుండిన పనసిక మనంబడును. (మఱియు నిది చెవిపైటి భాగమునకు చుట్టు గలుగుచున్నదని భోజునిమతము.)

చికిత్స

భిషక్పనసికా పూర్వం స్వేదనై రపతర్పణైః. 20
జయేద్విదారిపన్లేపై శ్శిగ్రుదేవద్రుమోద్భవైః,

తా. పనసికయందు దొలుత స్వేదకర్మను, అపతర్పణక్రియను జేసి పిదప విదారిక యందు జెప్పంబడు మునగ, దేవదారు అనువానిపట్టల నుదకముతో నూరి లేపనము జేయ వలయును.

జాలగర్ధభలక్షణము

విసర్పవ త్సర్పతియ శ్శోథ స్తనురపాకవాన్. 21
దాహ జ్వరకరః పిత్తా త్సజ్ఞేయో జాలగర్ధభః,

తా. పిత్తముచే విసర్పమువలె నంతట వ్యాపించునదిగాని, లేక యొకింత పండు నదిగాని నుండు వాపు జనించి దాహము, జ్వరము అనువానితో గూడియుండిన జాల గర్ధభ మనంబడును.

ఇంద్రవృద్ధలక్షణము

పద్మకర్ణికవన్మధ్యే పిటికాభి స్సమాచితామ్. 22
ఇంద్రవృద్ధాం తు తాం విద్యాద్వాతపిత్తోత్థితాం భిషక్,

తా. కమలముయొక్క మిద్దెవలె మధ్యను నొకకురుపు జనించి దానిచుట్టు సన్నని కురుపులు వ్యాపించియుండిన ఇంద్రవృద్ధ మనఁబడును. ఇది వాతపిత్తములవలన గలుగును.

గర్దభికలక్షణము

మండలం వృత్తముత్సన్నం సరక్తం పిటికాచితమ్. 23
రుజాకరీం గర్ధభికాం తాం విద్యా ద్వాతపిత్తజాం,

తా. గుండ్రముగ, ఉబ్బుగ, ఎఱ్ఱగనుండు కురుపులవలన వ్యాప్తంబై మండలములు గలిగి మిక్కుటముగ నొచ్చుచుండిన గర్దభిక మనంబడును. ఇది వాతపిత్తములచే జనించును.

పాషాణగర్దభలక్షణము

వాతశ్లేష్మసముద్భూత శ్శ్వయథుర్హానుసంధిజః. 24
స్థిరో మంద రుజ స్స్నిగ్ధో జ్ఞేయః పాషాణగర్దభః,

తా. వాతకఫములచే కటుమర్లసంధియందు కఠినముగ, మందమైన పీడగలదిగ నుండు వాపు జనించి మినమినలాడుచుండిన పాషాణగర్దభ మనంబడును.

పాషాణగర్దభచికిత్స

సురదారు శిలా కుష్ఠై స్స్వేదయిత్వా ప్రలేపయేత్. 25
కఫ మారుత శోఫఘ్నో లేపః పాషాణగర్దభే,

తా. తొలుత స్వేదకర్మంజేసి దేవదారు, మణిశిల, చెంగల్వకోష్టు అనువానిని నూరి లేపనముజేసినను, లేక కఫ, వాత, శోఫ హరలేపనము జేసినను పాషాణగర్దభను హరించును.

ఇరివేల్లికలక్షణము

పిటికా ముత్తమాంగస్థాం వృత్తా ముగ్రజ్వరాన్వితామ్. 26
సర్వాత్మికాం సర్వలింగాం జానీయా దిరివెల్లికాం,

తా. త్రిదోషములవలన శిరముపై గుండ్రముగ, కడుపీడాయుక్తముగ, జ్వరయుక్తముగ, త్రిదోషలక్షణయుక్తముగ నుండు కురుపుజనించిన ఇరివేల్లిక మనంబడును.

చికిత్స

పైత్తికస్య విసర్పస్య యాచికిత్సా ప్రకీర్తితా. 27
తామేవ భిషగేతాం చ చికిత్సే దిరివేల్లికామ్,

తా. ఇరివేల్లికమునందు పూర్వోక్తపిత్తవిసర్పచికిత్సలం జేయవలయును.

కక్షపిటికాలక్షణము

బాహుకక్షాం సపార్శ్వేషు కృష్ణస్ఫోటాం సవేదనామ్. 28

పిత్తకోపసముద్భూతాం కక్షా మిత్యభినిర్దిశేత్,

తా. భుజము, చంకలు, భుజశిరస్సులు, పార్శ్వములు అనువానియందు పిత్తప్రకోపమువలన నల్లనికురుపు జనించి వేదనాయుక్తంబై యుండిన కక్షపిటిక యనంబడును.

## గంధనామ్నిలక్షణము

ఏకామేతాదృశీం దృష్ట్వా పిటికాం స్ఫోటసన్నిభామ్. 29
త్వగ్గతాం పిత్తకోపేన గంధనామ్నీం ప్రచక్షతే,

తా. పిత్తప్రకోపమువలన చర్మముపై ఒక పెద్దబొబ్బతో సమానమైన పిటిక జనించిన గంధనామ్ని యనంబడును.

## కక్ష, గంధపిటికాచికిత్స

గక్షాం చ గంధనామ్నీం చ చికిత్సేచ్చ చికిత్సకః. 30
పైత్తికస్య విసర్పస్య క్రియయా పూర్వముక్తయా,

తా. కక్షపిటిక, గంధనామ్ని అను రోగములయందు పూర్వోక్తపిత్తవిసర్ప చికిత్సం జేయవలయును.

## అగ్నిరోహిణీలక్షణము

కక్షభాగేషు యేస్ఫోటా జాయంతే మాంసదారణాః. 31
అంతర్దాహా జ్వరకరా దీప్తపావకసన్నిభాః,
సప్తాహా ద్ద్వాదశాహాద్వా పక్షాద్వా హంతి మానవమ్. 32
తా మగ్నిరోహిణీం విద్యా దసాధ్యాం సాన్నిపాతికం,

తా. చంకయందు మాంసమును పీడునటులంజేసెడి కురుపులు జనించి అంతర్దాహతాపములుగలవై జ్వలింపుచుండునగ్నివలె నెఱ్ఱనివియై యుండిన అగ్నిరోహిణి యనంబడును. ఇది వాతాధిక్యంబై యుండిన నేడుదినములకును, పిత్తాధిక్యంబై యుండిన ౧౨ దినములకును, కఫాధిక్యంబై యుండిన ౧౫ దినములకును రోగిని యమమందిరనివాసినిగ జేయును. ఇది త్రిదోషజనితంబగుటచే నసాధ్యంబు.

## చికిత్స

పిత్తవిసర్పవిధినా సాధయే దగ్నిరోహిణీమ్. 33
రోహిణ్యాం లంఘనం కుర్యా ద్రక్తమోక్షణరూక్షణం,
శరీరస్య చ సంశుద్ధిం తాంతు వృద్ధాం పరిత్యజేత్. 34

తా. అగ్నిరోహిణియందు పూర్వోక్తపిత్తవిసర్పచికిత్సను, తొలుత లంఘనరక్తమోక్షణములను, రూక్షకరవిధిని జేయుటచే అగ్నిరోహిణిని హరింపంజేయుటయేగాక విరేచనాదిక్రియలను జేయవలయును. అది వృద్ధింజెందిన వర్జింపవలయును.

### చిప్యలక్షణము

నఖ మాంస మధిష్ఠాయ వాతపిత్తే చ దేహినాం,
కుర్వాతే దాహపాకౌ చ తం వ్యాధిం చిప్య మాదిశేత్. 35

తా. వాతపిత్తములు నఖమాంసముల నాశ్రయించి దాహపాకములను గలుగం జేసిన చిప్య మనంబడును.

### కునఖలక్షణము

తదేవాల్పతరై ర్దోషైః కునఖం పురుషం వదేత్,
అభిఘాతాత్ప్రదుష్టో యో నఖో రూక్షోఽసితః ఖరః. 36
భవే త్తం కునఖం విద్యా త్కులీరమితి సంజ్ఞితం,

తా. చిప్యమే యల్పదోషమువలన జనించిన కునఖ మనంబడును. మఱియు నఖము అభిఘాతమువలన దుష్టంబై రూక్షము, నలుపువర్ణము, కాఠిన్యము కలదై యుండిన కునఖ మనియు, కులీర మనియు జెప్పంబడును.

### చిప్య, కునఖచికిత్స

చిప్యం రుధిరమోక్షేణ శోధనే నాప్యుపాచరేత్. 37
గతోష్మాణ మథైనం తు సేచయే దుష్ణవారిణా,
శస్త్రేణాపి యథాయోగ్య ముచ్ఛిద్య స్రావయే త్తతః. 38
వ్రణోక్తేన విధానేన రోపయేత్తు విచక్షణః,

తా. చిప్యమునందు రక్తమును దీసి శోధనక్రియను జేయవలయును. రక్తమోక్షణానంతరమందలి యుష్ణత్వము వెడలినపిదప నుష్ణోదకముతో సేకము సేయవలయును. మఱియు యథాయోగ్యముగ దానిని శస్త్రముతో ఛేదించి రక్తమును స్రవింపంజేసి వ్రణచికిత్సంజేసి మాంసపూరితం బగునటులం జేయవలయును.

### హారిద్రాదికల్కము

స్వరసేన హరిద్రాయాః పాత్రే కృత్వాయసేభయామ్. 39
ఘృష్ట్వా తజ్జేన కల్కేన లింపే చ్చిప్యం పునఃపునః,

తా. పసపుస్వరసములో కరకచూర్ణమును గలిపి దానిని నినుపపాత్రలో నునిచి మర్దించి చిప్యముపై పలుమారు లేపనము సేయవలయును.

### కునఖచికిత్స

శ్లేష్మవిద్రధివచ్చైవ కునఖం సముపాచరేత్. 40
నఖకోటిప్రవిష్టేన టంకణేన చ శామ్యతి,

తా. కునఖమునందు శ్లేష్మవిద్రధిచికిత్సం జేయుటయేగాక గోళ్ళప్రక్కన వెలిగారచూర్ణము నునిచిన కునఖము నశించును.

అనుశయీలక్షణము

గంభీరా మల్పసంరంభాం సవర్ణా ముపరిస్థితాత్. 41
పాదస్యానుశయీం తాంతు విద్యాదంతఃప్రపాకినీం,

తా. పాదముపై చర్మసమానవర్ణముగ, గంభీరముగ, ఒకింతయుబ్బుగ నుండు కురుపు జనించి లోనపండిన అనుశయీ యనంబడును.

చికిత్స

హరే దనుశయీం వైద్యః క్రియయా శ్లేష్మవిద్రధే. 42

తా. అనుశయీ యనురోగమున కఫవిద్రధికై జెప్పఁబడియుండు చికిత్సం జేయవలయును. దానిచే నది హరించును.

విదారికలక్షణము

విదారీ కందవద్వృత్తాం కక్షవంక్షణసంధిషు,
విదారికామితి వదే త్సరుజాం సర్వవేదనామ్. 43

తా. నేలగుమ్ముడుగడ్డవలె గుండ్రముగ చంకలయందుగాని, లేక గజ్జసంధుల యందుగాని గ్రంథిజనించి పీడతోఁగూడి సర్వదోషలక్షణయుక్తంబైయుండిన విదారిక మనంబడును. (ఇది సన్నిపాతమువలన జనించును.)

చికిత్స

విదారికాయాం ప్రథమం జలౌకాయోజనం హితం,
పాటనం చ విపక్వాయాం తతో వ్రణవిధిః స్మృతః. 44

తా. విదారికయందు దొలుత జలగల నంటించి రక్తము స్రవింపంజేయుట హితకరంబులు. మఱియు నదిపండిన ఛేదించి వ్రణచికిత్సం జేయవలయును.

సామాన్యోపచారము

జయే ద్విదారికాంలేపై శ్శిగ్రుదేవద్రుమోద్భవైః,

తా. మునగ, దేవదారు అనువానిలేపనమువలన విదారిక హరించును.

శర్కరాలక్షణము

ప్రాప్య మాంస సిరా స్నాయు శ్లేష్మ మేద స్తథానిలః. 45
గ్రంథిం కరోత్యసౌ భిన్నో మధుసర్పి ర్వసా నిభం,
స్రవత్యా స్రావ మనిల స్తత్ర వృద్ధిం గతఃపునః. 46
మాంసం విశోష్య గ్రథితాం శర్కరాంజనయే త్తతః,

తా. కఫమేదోవాతములు మాంససిరాస్నాయువులయందు జేరి గ్రంథిరూపంబై పగిలి తేనె, నెయ్యి, క్రొవ్వు అనువానితుల్యముగ నుండు స్రావమును గలుగంజేయుట వలన వాతము పలుమారు వృద్ధిం జెందిన మాంసమును శుష్కింపంజేసి సన్నసన్న గ్రంథుల గలుగంజేసిన శర్కర యనంబడును.

## శర్కరార్బుదలక్షణము

దుర్గంధిక్లిన్నమత్యర్థం నానావర్ణం తతస్సిరాః. 47
సృజంతి రక్తం సహసా తద్విద్యా చ్ఛర్కరార్బుదం,

తా. శర్కర జనించినపిదప నచ్చట సిరలవలన గడుదుర్గంధక్లేదయుక్తముగ, పలువిధవర్ణములుగ (అనఁగా ఘృతము, మేదస్సు, వసవలె) రక్తస్రావం బకస్మాత్తుగ గలిగిన శర్కరార్బుద మనంబడును.

## చికిత్స

మేదార్బుదవిధానేన నాశయే చ్ఛర్కరార్బుదమ్. 48

తా. శర్కరార్బుదమును మేదార్బుదచికిత్సలచే హరింపంజేయవలయును.

## పాదదారిలక్షణము

పరిక్రమణశీలస్య వాయురత్యర్థరూక్షయోః,
పాదయోః కురుతే దారీం సరుజాంతలసంశ్రితామ్. 49

తా. మిక్కుటముగ నడుచుటవలన, వాతసంబంధమువలన నరకాలు కడురూక్షంబై పగిలి నొచ్చుచుండిన పాదదారిక మనంబడును.

## మధూచ్ఛిష్టాదిలేపము

మధూచ్ఛిష్ట వసా మజ్జా ఘృతక్షార విమిశ్రితైః,
సర్జాహ్వాసింధూద్భవయో శ్చూర్ణం మాక్షికసంయుతమ్. 50
నిర్మథ్య కటుతైలాక్తం హితం పాదప్రమార్జనే,

తా. మైనము, క్రొవ్వు, మజ్జ, నెయ్యి, క్షారము అనువానిలో గుగ్గిలము, సైంధవలవణము, తేనె, తెల్లావనూనె గలిపి మర్దించి పాదములయందు రుద్దిన పాదదారిక హరించును.

## మదనాదిలేపము

మదన సైంధవ గుగ్గులు గైరికాజ్య మధువాలక పంకవిలేపనాత్,
ప్రపుటితం త్వఖిలంచరణద్వయం వికచతామవసప్రతిమంభవేత్. 51

తా. మ్రంగకాయ, సైంధవలవణము, గుగ్గిలము, కావిరాయి, వట్టివేరు - వీని చూర్ణములో నెయ్యి, తేనె గలిపి లేపనము జేసిన కాలిపగుళ్లు మాని తామరరేకులవలె మృదువుగ నుండును.

తా. రక్తవిరేచనంబు లగుట, లేక మలము పలచగ వెడలుట, దప్పి ప్రబలజ్వరము విలోమవాతము శరీరమంతటనొప్పి ఈలక్షణములు గలది రక్తాతిసారజ్వర మని తెలియవలయు. (ఈరక్తాతిసారజ్వరమునకు. అతిసారరోగ ప్రకరణమునం దుదహరింపఁబడు ప్రాణదగజకేసరి నేని కనకసుందరరసము నేని ప్రయోగింపవలయు.)

రక్తాతిసారజ్వరచికిత్స

శుంఠీసమంగాతివిషాచ బిల్వపాఠాకణావత్సకదీపనీయాః,
క్వాథోనిహన్యాదతిసారమాశు సామం సశూలంసకఫంసరక్తమ్. 160
(మాధవనిదానే)

తా. సొంటి, ముణుగుదామర, అతివస, మారేడు, *పాఠవేళ్లు, పిప్పళ్ళు, కొడిసెపాల, ఓమము - వీనిని సమభాగములుగా దంచి కషాయము పెట్టి సేవించిన ఆమము శూల కఫము రక్తము వీనితో గూడియుండు జ్వరాతిసారము హరించు.

దోషాతిసారలక్షణము

అంతర్దాహో బహిశ్శీతం కరపాదంచ శీతలం,
ప్రలాపశ్ఛర్దిహిక్కాచ కాసశ్వాసమరోచకమ్.
కంపోవిభ్రమహృల్లాసో బృంహణం జాగరోమదః,
ఆమం సరక్తం హృచ్ఛూలం దోషాతీసారలక్షణమ్. 162

తా. లోన విదాహము, వెలపట శీతలము, కాళ్ళు చేతులు చల్లగ నుండుట, కల్లలాడుట, వాంతి, ఎక్కిళ్ళు, కాసశ్వాసలు, అరుచి, శరీరమువణఁకుట, భ్రమ, అలసట, శరీరభారము, నిదుర రాకుండుట, మదము, ఆమము రక్తయుక్తమై వెడలుట, ఱొమ్ము నొచ్చుట-ఈలక్షణములు గలది దోషాతిసార మని తెలియవలయు. (ఇది యసాధ్యము.)

జ్వరితునియొక్క నియమములు

గుర్వన్నం శీతలం వారి దివాస్వాపం క్లమం త్యజేత్,
జ్వరితోజ్వరముక్తశ్చ యత్నాదాబలలాభతః. 163
(చికిత్సాసారసిద్ధసంగ్రహే)

తా. జ్వరితుఁడును జ్వరవిముక్తుఁడును శరీరమునకు బలముకలుగువఱకు బలకరయాహారసేవ శీతోదకపానము పగటినిద్ర శ్రమ వీనిని వర్జింపవలయు.

పునరావృత్తి జ్వరకారణము

అసక్తాహారచేష్టాభిః పునరావర్తతే జ్వరః,

---

* ఇదే చిరుబొద్దియనియు, విషబొద్దియనియుఁ జెప్పఁబడు.

## మధ్వాదిలేపము

మధు సిక్థక సైంధవ ఘృత గుడ మహిషాఖ్య సాల నిర్యాసైః,
గైరికసహితై ర్లేపః పాదస్ఫుటనాపహస్సిద్ధః. 52

తా. తేనె, మైనము, సైంధవలవణము, నెయ్యి, బెల్లము, మహిసాక్షిగుగ్గిలము, తెల్లధూపము కావిరాయి - వీని నేకముజేసి మర్దించి లేపనముజేసిన కాళ్ళ పగుళ్ళు మానును.

## మదనాదిలేపము

మదనం చ తథాసిక్థం సాముద్రలవణం తథా,
మహిషీనవనీతేన సంతప్తం లేపనే హితమ్. 53
సప్తాహా త్స్ఫుటితౌ పాదౌ జాయేతే కమలోపమౌ,

తా. మ్రంగకాయ, మైనము, సముద్రలవణము - వీనిని బఱ్ఱెవెన్నలో గలిపి యుడికించి ఏడుదినములు పూసిన కాళ్ళపగుళ్ళు మాని తామరరేకులవలె నగును.

## కందరలక్షణము

శర్కరోన్మథితే పాదే క్షతే వా కంటజాదిభిః. 54
గ్రంథిః కోలవదుత్పన్నో జాయతే కందరం తు తత్,

తా. ఱాయిని ద్రొక్కుటచేనేని, లేక కాలియందు గ్రుచ్చికొనిన ముల్లును దీయు నపుడు లోన ముల్లువిరుగుటచేనేని, గాయంబై రేగుబండంతయుబ్బుగల గ్రంథి జనించిన కందర బనంబడును.

## చికిత్స

దహే త్కందర ముద్ధృత్య తైలేన దహనేన వా. 55

తా. కందరమును ఛేదించి తీసి నూనెతో గాని అగ్నితో గాని కాల్చవలయును.

## అలసలక్షణము

క్లిన్నాంగుళ్యంతరౌ పాదౌ కండూ దాహ రుజాన్వితౌ,
దుష్టకర్దమసంస్పర్శా దలసంతం వినిర్దిశేత్. 56

తా. దుర్వాసనగల బురదగలుగుటచే కాలియొక్క వ్రేళ్ళసంధులయందలి మాంసము కుళ్ళి నీరునుగార్చుచు దురద, మంట, పోట్లు అనువానితో గూడియుండిన అలస మనంబడును.

## చికిత్స

పాదౌ సిక్తారనాళేన లేపనం త్వలసే హితం,
పటోల కునటీ నింబ రోచనా మరిచై స్తిలైః. 57

క్షుద్రా స్వరససిద్ధేన కటుతైలేన లేపయేత్,
తతః కాసీస కునటీ తిలచూర్ణై ర్విచూర్ణయేత్. 58

తా. అలసరోగమునందు దోలుత కలిని పాదములయందు బూసి పిదప చేతి పొట్ల, మణిశిల, వేప, గోరోచనము, మిరియాలు, నువ్వులు అనువానిచూర్ణములో ములక స్వరసమును, తెల్లావనూనెను గలిపి తైలపక్వముగ గాచి పాదముల లేపనముజేసి అన్నభేది, మణిశిల, నువ్వులు అనువానిచూర్ణమును దానిపై నద్దవలయును.

కరంజాదిలేపము

కరంజబీజం రజనీ కాసీసం పద్మకం మధు,
రోచనా హరితాళం చ లేపోఽయ మలసే హితమ్. 59

తా. క్రానుగవిత్తులు, పసపు, అన్నభేది, పద్మకాష్ఠము, తేనె, గోరోచనము, హరిదళము - వీనిని నూరి లేపనముజేసిన అలసకము హరించును.

దారుణలక్షణము

దారుణా కండురా రూక్షా కేశభూమిః ప్రపచ్యతే,
కఫమారుతకోపేన విద్యా ద్దారుణకం తు తత్. 60

తా. కఫవాతప్రకోపమువలన వెంట్రుకలుండు ప్రదేశము భయంకరమైన దురదతో గూడి సన్నని కురుపులవలన వ్యాప్తంబై పండిన దారుణ మనంబడును. (ఇది కఫవాత ప్రకోపజనితంబైనను రక్తపిత్తసంబంధములేకయే పాకము జెందకుండుటంజేసి రక్తపిత్తసంబంధమును గలదై యుండును.)

చికిత్స

దుగ్ధేన ఖాఖసంబీజం ప్రలేపా ద్దారుణం హరేత్. 61

తా. పాలతో గసగసాలను నూరి లేపనముజేసిన దారుణము హరించును.

కంటకార్యాదిలేపము

కంటకారీఫలరసై స్తుల్యం తైలం విపాచయేత్,
జపాపుష్పద్రవైర్వాథ తల్లేపో దారుణప్రణుత్. 62

తా. నేలములకపండ్ల రసమునకుగాని, దాసానిపువ్వుల రసమునకుగాని సమముగ నూనెగలిపి కాచి లేపనముజేసిన దారుణము హరించును.

భృంగరాజతైలము

భృంగరాజరసేనైవ లోహకిట్టం ఫలత్రికం,
శారిబాం చ పచే త్కల్కై తైలం దారుణనాశనమ్. 63
అకాలపలితం కండూ మింద్రలుప్తం చ నాశయేత్,

తా. గుంటగలగరాకురసములో లోహకిట్టము, త్రిఫలములు, సుగంధిపాలవేరు అనువానికల్కమును, తైలమును గలిపి కాచి లేపనము జేసిన దారుణము, అకాలమున వెంట్రుకలు నెరయుట, దురద, ఇంద్రలుప్తము హరించును.

అరూంషికలక్షణము

అరూంషి బహువక్త్రాణి బహుక్లేదాని మూర్ధని. 64
కఫాసృక్కృమికోపేన నృణాం విద్యా దరూంషికాం,

తా. కఫ, రక్త, క్రిమి, ప్రకోపమువలన శిరమున ననేకముఖములుగల కురుపులు జనించి బంకగ స్రావము వెడలిన అరూంషిక మనంబడును.

నీలోత్పలాదిలేపము

నీలోత్పలస్య కింజల్కో ధాత్రీఫలసమన్వితః. 65
యష్టీమధుకయుక్తశ్చ లేపాదస్యా ద్దరూంషికాం,

తా. నల్లకలువయగరులు, ఉసిరికకాయ, అతిమధురము-వీనిని నూరి లేపనము జేసిన అరూంషిక హరించును.

త్రిఫలాదితైలము

త్రిఫలాయా రజోయష్టి మార్కవోత్పల శారిబాః 66
సైంధవం పక్వమేతైస్తు లేపా ద్ధన్యా దరూంషికాం,

తా. త్రిఫలములు, అతిమధురము, గుంటగలగర, నల్లకలువ, సుగంధిపాల, సైంధవ లవణము అనువానికల్కములో నూనె గలిపి కాచి లేపనము జేసిన అరూంషిక హరించును.

పిణ్యాకాదిలేపము

పురాణమపి పిణ్యాకం పురీషం కుక్కుటస్య చ. 67
మూత్రపిష్టం ప్రలేపోయం శీఘ్రం హన్యా దరూంషికాం,

తా. ప్రాతగానుగపిండి, కోడిపిష్ఠము-వీటిని గోమూత్రముతో నూరి లేపనము జేసిన అరూంషిక శీఘ్రముగ హరించును.

తారుణ్యపిటికలక్షణము

శాల్మలీ కంటకప్రఖ్యాః కఫమారుతకోపజాః. 68
జాయంతే పిటికాయూనాం జ్ఞేయాస్తా ముఖదూషికాః,

తా. కఫవాతప్రకోపమువలన యౌవనపురుషునియొక్క ముఖమున బూరగముండ్లవంటికురుపులు జనించి ముఖము వికారముగనుండిన ముఖదూషిక యనంబడును. (ముఖదూషిక యన—మొటిమలు.)

మంజిష్ఠాదితైలము

న్యగ్రోధోదుంబరాశ్వత్థ ప్లక్షాః కపిత్థన స్తథా. 69

త్వచాన్తాం షోడశపలం మూలచూర్ణం ప్రకల్పయేత్,
ద్విరష్టగుణితైస్తోయైః పాచయే త్పాదశేషకమ్. 70
కషాయాంశం గవాంక్షీరం క్షీరార్ధతిలతైలకం,
మంజిష్ఠా ద్విసితా లోధ్ర తువరీ తాలకం శిలా. 71
లాక్షా గోరోచనా కుష్ఠం *కుంకుమం రజనీద్వయం,
గైరికం సిక్థకం తుత్థం వట మజ్జునవృక్షకమ్. 72
నాగకేసర కాలీయ పద్మబీజం చ కేసరం,
పారదం గంధకం పత్రం త్వచం చ ప్రతికార్షికమ్. 73
సర్వంపాచ్యం తైలశేషం లేపనా ద్వ్యంగ కాపహం,
వదనం చంద్రతుల్యంస్యా త్సప్తరాత్రాన్నసంశయః. (సిద్ధరసార్ణవే)

తా. మఱ్ఱి, మేడి, రావి, జువ్వి, అంబాళము అనువానివేరు పట్టల దినుసుకు ౧౬ పలములచొప్పున దంచి ౧౨౮ పలములు నీళ్ళుపోసి చతుర్థాంశముగ కషాయము గాచి దానికి సమముగ నావుపాలు, ఆవుపాలకు సమముగ నూనె గలిపి అందు మంజిష్ఠ, పసపు, మ్రానిపసపు, లొద్దుగచెక్క, తోపరిమన్ను, అరిదళము, మణిశిల, లక్క, గోరోచనము, చెంగల్వకోష్టు, కుంకుమపువ్వు, పసపు, మ్రానిపసపు, కావిరాయి, మైనము, మైలుతుత్థము, మఱ్ఱిచిగుళ్లు, ఏరుమద్దిచెక్క, నాగకేసరములు, కృష్ణచందనము, తామరవిత్తులు, తామరయగరులు, పాదరసము, గంధకము, ఆకుపత్రిక, లవంగపుచెక్క అనువానిచూర్ణమును దినుసుకు కర్షప్రమాణముచొప్పున గలిపి చిక్కగ వండి ముఖమునందు లేపనము జేసిన నేడుదినములలో వ్యంగము హరించి ముఖము చంద్రునితో సమానముగ నుండును.

### ముఖమంగులకు చికిత్స

ముఖచ్ఛాయాంతరం వంగభస్మస్యా న్మాహిషం పయః,
మాక్షికం తాళకం తుత్థం రాజావర్తం శిలాజతు. 75
మహిషాక్షం శిలా సూతం తుల్యం క్షీరైస్తు మాహిషైః,
సప్తాహం మర్దయే ద్గాఢం వ్యంగఘ్నం కాంతివర్ధనమ్. 76
మహిషీక్షీరమథిత మేతదుర్వర్తనం హితం,
ముఖవర్ణకరం స్త్రీణాం తిలకాలం చ నాశయేత్. (మాధవనిదానే)

తా. వంగభస్మమును బఱ్ఱెపాలతో నూరి లేపనముజేసిన ముఖమంగు, ముఖముయొక్క నలుపు మాని కాంతి గలుగును. మఱియు స్వర్ణమాక్షికము, తాళకము, మైలుతుత్థము, రాజావర్తము, శిలాజిత్తు, మహిసాక్షిగుగ్గిలము, మణిశిల, పాదరసము-వీనిని సమ

* తథాచ కుంకుమద్వయమ్.

భాగములుగ బఱ్ఱెపాలతో నేడుదినములు దృఢముగ నూరి లేపనముజేసిన ముఖమంగులు హరించి కాంతి గలుగును. మఱియు బఱ్ఱెపాలను జిలికి వెన్నదీసి ముఖమున మర్దనము జేసిన స్త్రీలకు ముఖమంగులు హరించి ముఖకాంతి గలుగును.

గౌరీ హరిద్రా మంజిష్ఠా ఘృతం గౌరాశ్చ సర్షపాః,
పేష్యం గైరికసంయుక్త మజాక్షీరేణ సంయుతమ్. 78
ఏతేనైవ భవేద్వక్త్ర ముదయాదిత్యసన్నిభం. (ఆయుర్వేదే)

తా. పచ్చిపసపు, మ్రానిపసపు, మంజిష్ఠ, నెయ్యి, తెల్లావాలు, కావిరాయి-వీనిని మేకపాలతో నూరి ముఖమునందు లేపనముజేసిన బాలసూర్యునివంటి కాంతి గలుగును.

శోకక్రోధాదికుపితా ద్వాతపిత్తాన్ముఖే తనుమ్.
శ్యామలం మండలం వ్యంగం ముఖాదన్యత్రనీలకా,
వ్యంగనీలద్వయోః కుర్యా ద్వ్యథాస్విన్నం సిరావ్యథామ్. 80
లేప్యం క్షౌద్రేణ మంజిష్ఠా ముసలీ మూలమేవవా,
ప్రసుప్తకుష్ఠరోగోక్తం కుర్యాద్ధూమం చ వహ్నినా. 81

తా. శోకము, కోపము మొదలగువానివలన వాతపిత్తములు ప్రకోపించి ముఖమునందు సూక్ష్మమైన నల్లనిమండలములను, మంగులను గలుగంజేసిన ముఖమంగనియు, ఇతరస్థలముల గలుగంజేసిన నీలియనియు జెప్పంబడును. వీని నివారణార్థంబై స్వేదమును సిరావ్యధను జేయుటయేగాక మంజిష్ఠనుగాని, లేక నేలతాటిగడ్డనుగాని తేనెతోనూరి ముఖమునందు లేపనముజేసిన మంగులు నల్లనిమండలములు హరించును. ఆ ముఖదూషికలయందు తిమిరిగలిగియుండిన కుష్ఠరోగచికిత్సలను ధూమపానమును జేయవలయును.

మహిషీక్షీరసంఘృష్టం రజనీ రక్తచందనం,
కృతోలేపో నిహంత్యాశు [1]శ్యామికాం గండయో స్థితామ్. 82
(మాధవనిదానే)

తా. పచ్చిపసపు, రక్తచందనము-వీనిని బఱ్ఱెపాలతోనూరి లేపనముజేసిన ముఖమునందును, చెక్కిళ్ళయందునుండు నల్లనిమండలములు శీఘ్రముగ హరించును.

సోమవల్లీ రజన్యాథ హ్యాశ్వక్షీరస్య లేపనాత్,
మనశ్శిలా తథాలోధ్రం ద్వినిశం సర్షపా స్సమమ్. 83
వారిపిష్టా హితో లేపో వదనే [2]శ్యామికాం హరేత్,
(సిద్ధవిద్యాభూః)

---

1 మాక్షికాం. 2. మాక్షికాం.

తా. భావంచివిత్తులు, పచ్చిపసపు వీనిని గుఱ్ఱపుపాలతో నూరి లేపనముజేసిన ముఖమునందలి నల్లనిమచ్చలు (మొటిమలు) హరించును. మఱియు మణిశిల, లొద్దుగ చెక్క, పచ్చిపసపు, మ్రానిపసపు, తెల్లావాలు-వీనిని సమభాగములుగ నుదకముతో నూరి లేపనముజేసిన ముఖమునందలి నల్లనిమచ్చలు హరించును.

విశాలోగ్ర ముశీరంచ సర్పి స్సర్జరసం పయః. 84
ఏతాని వటపత్రాణి రజన్యా సహ పేషయేత్,
లేపోఽయం ముఖపాదేచ పద్మవత్కురుతే భృశమ్. 85

తా. పాపర, నల్లయతివస, వట్టివేరు, నెయ్యి, సర్జరసము, మఱ్ఱిచిగుళ్ళు, పసపు, మ్రానిపసపు-వీనిని మేకపాలతో నూరి లేపనముజేసిన ముఖము, పాదములు పద్మమువలె నుండును. (లోనికి గంధకకల్పమును సేవింపవలయును.)

త్రిమాసే క్షుద్రరోగేషు నాశయే న్నాత్ర సంశయః,

తా. గంధకకల్పమును 3 మాసములు సేవించిన క్షుద్రరోగములన్నియు నిస్సంశయముగ హరించును.

## పలితలక్షణము

క్రోధ శోక శ్రమ కృత శ్శరీరోష్మా శిరోగతః. 86
పిత్తంచ కేశా న్పచతి పలితం తేన జాయతే,
వాతికం విషమం రూక్షం పీతం పిత్తా త్సితం కఫాత్. 87
సర్వరూపాన్వితంవిద్యా త్సన్నిపాతసమన్వితం,
రూక్షంశ్లక్ష్ణం చ సూక్ష్మంచ జరాపలితముచ్యతే. 88

తా. క్రోధము, శోకము, శ్రమ అనువానివలన శరీరోష్ణపిత్తములు శిరమునందు ప్రవేశించి వెంట్రుకల పండునటులంజేసిన పలిత మనంబడును. అట్లేరంగున నే వాత పిత్త కఫములు శిరమునందుజేరి పలితమును గలుగంజేయును. అందు వాతప్రాబల్యమున వెంట్రుకలు అర్థభాగము నల్లగ, అర్థభాగము తెల్లగ, రూక్షముగ నగును. పిత్తప్రాబల్యమువలన పీతవర్ణము నగును. కఫప్రాబల్యమువలన శ్వేతవర్ణముగ నగును. సన్నిపాతమువలన పూర్వోక్తసర్వలక్షణయుక్తంబై యుండును. మఱియు వెంట్రుకలు రూక్షముగ, నున్నగ, సూక్ష్మముగ నుండిన జరాపలిత మనియెదరు.

## వలీపలితరోగనిదానములు

వలీపలితరోగాశ్చ వాతదోషాదిసంచయాత్,
భైషజ్యం మునిభిశ్చాత్ర చంద్రోదయ ముదీరితమ్. 89

తా. వాతాదిదోషములు ప్రకోపించి [1]వలీ [2]పలితము లను రెండురోగముల గలుగంజేయును. వీనియందు చంద్రోదయము శ్రేష్ఠం బని మునులు వచించిరి.

హేమాద్రిరసము

రసనిష్కం కాంతనిష్కం గంధకంచ ద్వినిష్కకం,
త్రిఫలాచ త్రినిష్కాస్యా న్మర్దితం కజ్జలీకృతమ్. 90
చూర్ణితం శాణమాత్రంతు సితాయుక్తంతు సేవితం,
సర్వరోగవినాశాయ వలీపలితనాశనమ్. 91

తా. శుద్ధిజేసినరసము ౧ నిష్కము, కాంతభస్మము ౧ నిష్కము, శుద్ధిజేసిన గంధకము ౨ నిష్కములు, త్రిఫలములు 3 నిష్కములు-ఇటుల వీనినెల్ల నేకముజేసి ఖల్వములో నునిచి కాటుకవలె మర్దించి ౫ చిన్నముల యెత్తును పంచదారయనుపానముతోడ సేవించిన సర్వరోగములు, వలీపలితములు హరించును.

(అయస్కాంతమును నేరేడుచెక్కరసముతో మర్దించి పుటంబులిడి పిదప గుంటగలగరాకురసముతోను, త్రిఫలరసముతోను మర్దించి పుటంబులిడి వెలిగారముతో మరల మర్దించి పుటంబిడి సేవించిన వలీపలితములు హరించును.)

ముండీతైలము

ముంటీచూర్ణం దశపలం పచే త్తోయే చతుర్గుణే,
అర్ధశేషం హరేత్క్వాథం క్వాథార్థం తిలతైలకమ్. 92
తైలశేషం పచేత్తేన నస్యం పానం చ కారయేత్,
పలితం యౌవనస్త్రీణాం మాసార్ధంచ న తిష్ఠతి. (ఆయుర్వేదే) 93

తా. పదిపలములు బోడతరపుచూర్ణములో ౪౦ పలములనీళ్లు గలిపి యర్ధభాగము శేషించునటుల కషాయముగాచి దానికర్ధభాగము నూనె గలిపి చిక్కగ గాచి వడియగట్టి కొని నస్యపానములు జేయించిన యౌవనస్త్రీలవలీపలితములు ౧౫ దినములలోహరించును.

శ్యామా నింబ బలా లాజా లవణం క్వాథయేత్సమం,
తోయై రష్టగుణై రేవ పాదశేషం సమాహరేత్. 94
తిలతైలం క్వాథపాదం తైలార్ధం మాహిషంఘృతం,
స్నేహశేషం పచేత్తేన నస్యే మాసంప్రయోజయేత్. 95
బాలానాంవృద్ధనారీణాం యౌవనంకురుతేధ్రువం, (సిద్ధరసార్ణవే)

తా. ప్రేంకణము, వేము, ముత్తవపులగము, పేలాలు, ఉప్పు-వీనిని సమభాగములుగ గ్రహించి యెనిమిదింత లుదకముబోసి నాలవభాగముగ కషాయముగాచి వడియ

1 వలీ యన శరీరము ముడతలుపడుట. 2 పలిత మన వెంట్రుకలు నెరయుట,

గట్టి దానికి నాలవభాగము నూనె, నూనె కర్థభాగము బఱ్ఱెనెయ్యి గలిపి చిక్కగ తైలముగాచి వడియగట్టి మాషప్రమాణమును నస్యముజేయించిన యౌవనస్త్రీలు, వృద్ధులు వీరి వలీపలితములు శీఘ్రముగ హరించును.

నింబాదిచూర్ణము

కృష్ణనింబస్యపంచాంగం త్రిఫలాచ కటుత్రయమ్. 96
కాలా తిలా తథాక్రాంత వాకుచీకృష్ణజీరకం,
నింబేన సమభాగంస్యా దౌషధం దశకం తథా. 97
బిడాలపదమాత్రంతు భక్షయే త్ప్రాతరుత్థితః,
రసాయనమిదం శ్రేష్ఠం మేహావింశతినాశనమ్. 98
అష్టాదశచ కుష్ఠాని కాసశ్వాస క్షయానిచ,
కాయాగ్నేర్వర్ధనంచైవ వలీపలితనాశనమ్. 99

తా. త్రిఫలములు, త్రికటుకములు, నల్లతెగడ, నువ్వులు, విష్ణుక్రాంతము, భావంచివిత్తులు, నల్లజీలకఱ్ఱ, దశమూలములు-వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముజేసి దానికి సమముగ పెద్దవేముపంచాంగముల చూర్ణమును గలిపి బిడాలపదకప్రమాణమును ప్రాతఃకాలమున సేవించిన ౨౦ మేహములు, ౧౮ కుష్ఠువులు, కాశశ్వాసములు క్షయములు, వలీపలితములు హరించి శరీరవృద్ధి, అగ్నిదీపనము గలుగును.

వలీపలితచికిత్స

కంటకారీఫలరసై స్తుల్యం తైలం విపాచయేత్,
జపాపుష్పద్రవైఃక్వాథం తల్లేపః పలితంహరేత్. (సిద్ధవిద్యాభూః)

తా. నేలములకపండ్లరసమునకు సమముగ నూనె గలిపి కాచి లేపనముజేసినను, లేక దాసానిపువ్వులరసము నుడికించి లేపనముజేసినను పలితములు హరించును.

ద్విని శే నవనీతేన లేపా త్పలితకండునుత్,
నీలోత్పలం తిలా యష్టీ సర్షపా నాగకేసరమ్. 101
ధాత్రీ ఫలం సమం పిష్ట్వాలేపా త్పలితనాశనం, (మాధవనిదానే)

తా. పసపు, మ్రానిపసపు- వీనిని వెన్నతో నూరి లేపనముజేసిన పలితము, దురద హరించును. మఱియు నల్లకలువదుంపలు, నువ్వులు, యష్టిమధుకము, తెల్లావాలు, నాగకేసరములు వీనిని సమభాగములుగ గ్రహించి ఉసిరికపండ్లరసముతో నూరి లేపనముజేసిన పలితము హరించును.

కార్పాస బీజ మజ్జాంతు రవిక్షీరేణ పేషయేత్. 102
తస్యలేపో నిహంత్యాశు పలితంతు న సంశయః, (మాధవనిదానే)

తా. ప్రత్తివిత్తులలోని పలుకులను జిల్లేడుపాలతో నూరి లేపనముజేసిన పలితములు శీఘ్రముగ హరించును.

## ఇంద్రలుప్తరోగనిదానము

క్రిమిభ్యః కేశనాశశ్చ తస్యసా మేంద్రలుప్తకమ్. 103
తద్భావశ్చ సువిజ్ఞేయో భైషజ్యేతు జయంతికా,

తా. క్రిములవలన వెంట్రుక లూడిన ఇంద్రలుప్త మనంబడును. దీనియందు తక్కాలి యాకురసమును త్రాగుటయేగాక వెంట్రుకలూడిన స్థలమున యారసమును బూసిన వెంట్రుకలు వృద్ధియగును.

## ఇంద్రలుప్తలక్షణము

రోమకూపానుగం పిత్తం వాతేన సహమూర్ఛితమ్. 104
ప్రచ్యావయతి రోమాణి తతశ్శ్లేష్మా సశోణితః,
రుణద్ధి రోమకూపాంస్తు తతోఽన్యేషా మసంభవః. 105
తదింద్రలుప్తం విజ్ఞేయం ఖాలిత్యమితిచాపరే,

తా. పిత్తము వాతముతో గలిసి కుపితమై రోమకూపములయందు జేరుటవలన వెంట్రుకలూడి కఫరక్తములు రోమకూపముల బంధించుటవలన మరల వెంట్రుకలు జనింపకుండును. ఇది ఇంద్రలుప్తము ఖాలిత్యము అనంబడును.

## చికిత్సలు

త్రిఫలాం చోత్పలం కందం యష్టికాం భృంగజం రసమ్. 106
రసార్థం తిలతైలంస్యా త్పక్త్వా తైలావశేషకం,
తల్లేపా త్కేశవృద్ధిస్స్యా త్పునః పంచవిశేషతః. 107
ఆమలక్యామూలచూర్ణం పిష్ట్వా వట జటాంతువా,
మర్దయిత్వా రసైర్లేప స్తూర్ణం కేశవివర్ధనమ్. 108

తా. త్రిఫలములు, నల్లకలువగడ్డలు, యష్టిమధుకము-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి గుంటగలగరాకురసముతో నూరి కల్కముజేసి అందు గుంటగలగరాకురసము, దానికర్థభాగము నువ్వులనూనె గలిపి చిక్కగ తైలముగాచి ౫ మార్లు తలయంటికొనిన వెంట్రుకలు వృద్ధియగును. మఱియు ఉసిరికవేరు, మఱ్ఱియూడలు, జటామాంసి-వీనిని నూరి రసముపిండికొని తలయంటికొనిన కేశములు వృద్ధిజెందును.

మహిషీనవనీతేన ప్రత్యేకంచ ప్రలేపయేత్,
భృంగరాజరసం తుల్యం పాచ్యం తైలావశేషకమ్. 109

తా. బఱ్ఱెవెన్నను తలయంటికొనిన కేశములు వృద్ధిచెందును. లేక గుంటగలగరాకురసములో నూనె గలిపి చిక్కగగాచి తలయంటికొనిన వెంట్రుకలు బాగుగ పెరుగును.

హ_స్తీ దంతీపలం ధాత్ర్యా తిలత్తై లేన పాచయేత్,
తేన భృంగీసమాః కేశా స్థిరాశ్చాపి భవంతి చ. 110

తా. బలురక్కసిగడ్డ, నేలదంతివిత్తులు, ఉసిరికపప్పు-వీనిని నూరి కల్కముజేసి అందు నువ్వులనూనెకలిపి చిక్కగగాచి తలయంటికొనిన వెంట్రుకలు తుమ్మెదలవలె నల్లనై మృదువుగ స్థిరముగనుండును.

కృష్ణగోమూత్రసంపిష్ట జపాపుష్పప్రలేపనం,
బహుకేశాన్వితం సాంద్ర మింద్రలుప్తం ప్రజాయతే. 111

తా. కర్రియావుమూత్రముతో దాసానిపువ్వులనూరి వెంట్రుకలూడిన స్థలమున లేపనముజేసిన ఇంద్రలుప్తమునందుకూడ దట్టముగ వెంట్రుకలు మొలుచును.

ఇంద్రలుప్తేచేంద్రయవై శ్శిరసశ్చ విలేపనాత్,
ఘృష్ట్వాద్రి యవ కాసీసం మనోహ్వా తుత్థ కోషణైః. 112
హన్యా ద్దారురసై ర్వాపి గుంజామూలఫలై స్తతః,
తథా లాంగలికామూలైః కరవీరరసేనవా. 113
సక్షౌద్ర క్షుద్ర వార్తాక స్వరసేన విచక్షణః,
దుత్తూరకస్యపత్రాణి భల్లాతకరసేనవా. 114
అథవా మాక్షికం హంతి తిలపుష్పార్ద్రికర్ణికైః,
తైలకో హ_స్తిదంతస్య మషికాచౌషధం పరమ్. 115
కృష్ణగోమూత్రసంపిష్ట్య జపాపుష్పప్రలేపనం,
బహుకేశాన్వితం చిత్ర మిద్రలుప్తం ప్రజాయతే. 116

తా. కొడిసెపాల, సుష్ణోదకముతో నూరి శిరమున లేపనముజేసినను, లేక కొడిసెపాల, అన్నభేది, మణిశిల, మైలుతుత్థము, పిప్పలి-వీనిని దేవదారురసముతో నూరిగాని లేక పెద్దగురిజవేరు, దాసివిత్తులు, చెన్నచర్లగడ్డ-వీనిని గన్నేరువేరురసముతో నూరిగాని, నేలములకరసములో తేనెను గలిపిగాని, లేక ఉమ్మెత్తాకును జీడివిత్తులరసముతో నూరిగాని, లేక నువ్వులపువ్వు, అల్లము, గంటెన-వీనిని తేనెతో నూరిగాని, ఏనుగుదంతపు మసిని నూనెలోగలిపిగాని, లేక (ఏనుగుకొమ్ము, సదాప, పిప్పలి, కర్రియావుపంచితము, ఏరుజాజిపువ్వు వీనిని నూరిగాని) లేక దాసాని పువ్వులను కర్రియావుపంచితముతో నూరిగాని లేపనముజేసిన ఇంద్రలుప్తమునందుసగా మిక్కుటముగ వెంట్రుకలు మొలుచును.

### భృంగరాజతైలము

నీలీమూలకషాయేతు బీజం ఖదిరసారజం,
నీలిమూలాంజనం కల్కం యష్టీమధుక మేవచ. 117

తత్రార్థం లంఘనం కార్యం శేషం పూర్వవదాచరేత్. 1

తా. విరుద్ధాహారచేష్టలచే నివృత్తించినజ్వరము తిరిగివచ్చును. దానియం పూర్వోక్తలంఘనములో సగము లంఘనము వేయించి పిదప పూర్వోక్తజ్వరచికిత్స జేయవలయు.

## జ్వరముక్తలక్షణము

అన్నకాంక్షా శిరఃకండూః క్షువథుర్గాత్రలాఘవం,
ప్రస్వేదో ముఖపాకశ్చ జ్వరముక్తస్య లక్షణమ్. 1(

తా. అన్నమునందిచ్ఛ, తలదురద, తుమ్ములు, శరీరమునకు చులకదనము, చెమ ముఖపాకము-ఈలక్షణములుకలవాఁడు జ్వరవిముక్తుఁ డని తెలియవలయు.

దేహోలఘుర్వ్యపగతక్లమమోహతాపాః
పాకోముఖే కరణసౌష్ఠవమవ్యథత్వం,
స్వేదః క్షుతం ప్రకృతియోగమనోన్నలిప్సా
కండూశ్చ మూర్ధ్ని విగతజ్వరలక్షణాని. (గ్రంథాంతరే) 16

తా. శరీరలఘుత్వము కలిగియుండుట, బడలిక, అజ్ఞానము, తాపము లేకుండుట ముఖపాకము, ఇంద్రియములు తెలివిగ నుండుట, శరీరమున వేదన లేకుండుట, చెమట తుమ్ములు, మనస్సు తెలివిగ నుండుట, అన్నమునం దిచ్ఛ, తలదురద-ఈలక్షణములు గ వాఁడు జ్వరవిముక్తుఁ డని తెలియవలయు.

## జ్వరమంత్రము

ఓం నమో భగవతే పరమార్థిని సర్వజ్వరరక్షస్వాహా
హారిణా సారంగ సారంగ స్వామినిప్రసాదమ్. 16?

తా. ఈమంత్రముచే పదిమార్లు యభిమంత్రింపఁబడినజలమును పానముజేసిన సర్వజ్వరములు హరించు.

## జ్వరసంప్రాప్తికారణము

మిథ్యాహారవిహారాభ్యాం దోషాహ్యామాశయాశ్రయాః,
బహిర్నిరస్యకోష్ఠాగ్నిం జ్వరదాస్స్యూరసానుగాః. 168

తా. *మిథ్యాహారవిహారములచే వాతపిత్తశ్లేష్మములు దుష్టంబులై ఆమాశయము

* మిథ్యాహారమనఁగా—ప్రకృత్యాదివిరుద్ధఆహారసేవనయు,భుజించినయన్నము జీర్ణమగుటకుముందుగా భుజించుటయు, మిథ్యావిహార మనఁగా తనబలిమి కతిక్రమించిన కార్యమును చేయంబూనుట.

మార్కవస్వరసప్రస్థం తైలప్రస్థం విపాచయేత్,
అనేనలిప్తాః కేశాస్స్యుః మృదవః షట్పదై స్సమాః, 1:
ఇంద్రలుప్తహరం చైవ పాలిత్యంచైవ నాశయేత్,
తైలం రహస్యం పరమం వలీపలితనాశనమ్. (మాధవనిదానే) 1:

తా. నీలివేళ్ళను దంచి కషాయముగాచి యందు చంద్రవిత్తులచూర్ణము, నీలివేళ నల్లతుమికి, యష్టిమధుకము అనువానికల్కమును, ౧ ప్రస్థము గుంటగలగరాకు రసము ౧ ప్రస్థము నూనెనుగలిపి తైలపక్వముగగాచి వెంట్రుకలకు లేపనముజేసిన ఇంద్రలుప్తవ వలీపలితములు హరించి వెంట్రుకలు తుమ్మెదలవలె నల్లనై మృదువుగనుండును.

బృహతీఫలసంయుక్తం గుంజామూలఫలం తథా,
తల్లేపే నశ్యతి క్షిప్ర మింద్రలుప్త మనేకధా. (పూజ్యపాదీయే

తా. ములకపండ్లు, గురిగింజ వేరు, గురిగింజలు-వీనిని నూరి లేపనముజేసిన ప విధములైన ఇంద్రలుప్తములు శీఘ్రముగ హరించును.

## పద్మినీకంటకలక్షణము

కంటకైరాచితం వృత్తం మండలం పాండు కండురం,
పద్మినీకంటకప్రఖ్యై స్తదాఖ్యం కఫ వాతజమ్. 1:

తా. తామరముండ్లవలె గుండ్రముగ, పాండువర్ణముగ, దురదతోగూడినది నుండు మండలములు జనించిన పద్మినీకంటక మనంబడును. ఇది కఫవాతమువల జనించును.

## చికిత్స

పద్మినీకంటకే రోగే ఛర్దయే న్నింబవారిణా,
తేనైవ సిద్ధం సక్షౌద్రం సర్పిః పాతుం ప్రదాపయేత్. 12
నింబారగ్వధకల్కైర్వా ముహురుద్వర్తనం హితం,

తా. పద్మినీకంటకమున వేపకషాయముతో వమనముజేయింపవలయును. మఱియ వేపకషాయములో నెయ్యిగలిపి కాచి తేనె వేసి సేవింపవలయును. మఱియు వేప, రే గుజ్జు అనువానికల్కమును పలుమారు లేపనము జేయవలయును.

## నింబాదిఘృతము

చతుర్గుణేన నింబోత్థ పత్రక్వాథేన గోఘృతమ్, 12
పచే త్తతస్తు నింబస్య కృతమూలస్య పత్రజైః,
కల్కై ర్ధ్యాయః పచే త్సిద్ధం తత్పిబే త్పలసమ్మితమ్. 12
పద్మినీకంటకాద్రోగా న్ముక్తో భవతి నాన్యథా,

తా. వేపాకు కషాయములో నాలవభాగ మావునెయ్యి గలిపి అందు వేప, రే

అనువానియూకుల కల్కమును గలిపి ఘృతపక్వముగ గాచి అందొకపలమును త్రాగిన పద్మినీ కంటకము హరించును.

జంతుమణిలక్షణము

సమ ముత్పన్న మరుజం మండలం కఫరక్తజమ్. 125
సహజం లక్ష్మచైకేషాం లక్ష్యో జంతుమణిః స్మృతః,

తా. కఫరక్తమువలన జనించినది మొదలు సమముగ, ఉబ్బుగ, వేదనారహితముగ నుండు మండలము శరీరమున జనించిన కొందఱు లక్ష్మ యనియు, మఱికొందఱు లక్ష్య మనియు, వేఱుకొందఱు జంతుమణి యనియు వచించెదరు. (ఇది స్త్రీపురుషులకు జనించునట్టి స్థానవిశేషమువలన శుభాశుభఫలముల గలుగంజేయును.)

మాషలక్షణము

అవేదనం స్థిరంచైవ యస్మిన్గాత్రే ప్రదృశ్యతే. 126
మాషవత్కృష్ణముత్పన్న మనిలా న్మాషమాదిశేత్,

తా. వాతమువలన శరీరముపై వేదనారహితముగ, కఠినముగ, నల్లగ, ఒకింత నుబ్బుగ నుండు గంటుజనించి మినపగింజలవలెనుండిన మాషమనంబడును. (మాషమన—పులిపిరికాయ.)

తిలకాలకలక్షణము

కృష్ణాని తిలమాత్రాణి నీరుజాని సమానిచ. 127
వాతపిత్తకఫోద్రేకా త్తాన్విద్యా త్తిలకాలకాన్,

తా. వాత, పిత్త, కఫ, ప్రకోపమువలన మచ్చజనించి నల్లగ, నువ్వుగింజంత ప్రమాణముగలదై నొప్పిలేనిదిగ, చర్మమునకు సమానముగనుండిన తిలకాలక మనంబడును.

జంతుమణి, మాష, తిలకాలక చికిత్స

చర్మకీలం జంతుమణిం మాషకా న్తిలకాలకాన్. 128
ఉత్కృత్య శస్త్రేణ దహే త్క్షారాగ్నిభ్యా మశేషతః,

తా. చర్మకీలకము, జంతుమణి, మాషము, తిలకాలకము-వీనిని శస్త్రముతో ఛేదించి క్షారాగ్నికర్మల జేయవలయును.

న్యచ్ఛలక్షణము

మహద్వా యదివాత్యల్పం శ్యావంవా యదివా సితమ్. 129
నీరుజం మండలం గాత్రే న్యచ్ఛ మిత్యభిధీయతే,

తా. శరీరముపై పెద్దదిగగాని, లేక చిన్నదిగగాని, లేక నల్లదిగగాని, లేక తెల్లదిగగాని, వేదనారహితముగ గాని యుండు మచ్చజనించి ముఖవిహీనంబై యుండిన న్యచ్ఛ మనంబడును.

### మంజిష్ఠాదితైలము

మంజిష్ఠా మధుకం లాక్షా మాతులుంగశ్చ యష్టికా. 130
కర్షప్రమాణై రేతైస్తు తైలస్య కుడవం తథా,
అజం పయస్తు ద్విగుణం శనై ర్మృద్వగ్నినా పచేత్. 131
నీలికా పిటికా వ్యంగా నభ్యంగాదేవ నాశయేత్,
ముఖం ప్రసాదోపచితం వలీపలితవర్జితమ్. 132
సప్తరాత్రప్రయోగేణ భవేత్కనకసన్నిభం,

తా. మంజిష్ఠ, ఇప్ప, లక్క, మాదీఫలము, అతిమధురము-ఇవి దినుసుకు కర్షప్రమాణము, నూనె ౧ కుడవము, మేకపాలు ౨ కుడవములు-ఇటుల వీనినెల్ల నేకముజేసి మందాగ్నితో పాకముజేసి ౭ దినములు అభ్యంజనముజేసిన నీలిక, మొటిమలు, మంగు, వలీపలితములు-వీనిని హరింపజేయుటయేగాక ముఖము స్వచ్ఛముగ వెంట్రుకలు నల్లగ, ముఖము స్వర్ణకాంతిగలదిగ నగును.

### వ్యంగలక్షణము

క్రోధాయాస ప్రకుపితో వాయుః పిత్తేన సంయుతః. 133
ముఖమాగమ్య సహసా మండలం విసృజత్యతః,
నీరుజం తనుకం శ్యావం ముఖే వ్యంగం తమాదిశేత్. 134

తా. కోపము, శ్రమ అనువానివలన ప్రకోపించిన వాతపిత్తముతో గలసి ముఖముపై వేదనారహితముగ, పలచగ, శ్యామలవర్ణముగనుండు మండలముల గలుగంజేసిన వ్యంగము (మంగు) అనంబడును.

### చికిత్స

త్రిభువనవిజయాపత్రం మూలం స్థవిరస్య శింశుపాద్యైభిః,
ఉద్వర్తనం విరచితం న్యచ్ఛవ్యంగాపహం సిద్ధమ్. 135

తా. గంజాయియాకు, దేవదారు, ఇరుగుడువేరు—వీనిని నూరి ముఖమునందు లేపనము జేసిన మచ్చలు, వ్యంగము హరించును.

### వటాంకురాదిలేపము

వటాంకురా మసూరాశ్చ ప్రలేపా ద్వ్యంగనాశనం,
వ్యంగే మంజిష్ఠయా లేపః ప్రశస్తోమధుయుక్తయా. 136

తా. మఱ్ఱిచిగుళ్ళు, చిరుసెనగలు అనువానినిగాని, మంజిష్ఠిని తేనెతోగాని నూరి లేపనముజేసిన వ్యంగము హరించును.

### పటపత్రాదిలేపము

వటస్య పాండుపత్రాణి మాలతీ రక్తచందనం,
కుష్ఠం కాలీయకం లోధ్ర మేభిర్లేపం ప్రయోజయేత్. 137
యువానపిటికానాంతు వ్యంగానాంచ వినాశనః,

తా. పండి తెలుపుబారిన మఱ్ఱియాకు, జాజిచిగుళ్ళు, రక్తచందనము, చెంగల్వకోష్టు, మ్రానిపసపు, లొద్దుగచెక్క అనువానికల్కమును లేపనముజేసిన మొటిమలు మంగు హరించును.

### నీలికలక్షణము

కృష్ణమేవంగుణం గాత్రే ముఖేవా నీలికాం విదుః. 138

తా. పైఁజెప్పఁబడినప్రకారము నల్లనిమండలములు శరీరముపైగాని, ముఖముపైగాని గలిగిన నీలిక మనంబడును.

### కుంకుమాదితైలము

కుంకుమం చందనం లోధ్రం పతంగం రక్తచందనం,
కాలీయక ముశీరంచ మంజిష్ఠా మధుయష్టికా. 139
పత్రకం పద్మకం పద్మ కుష్ఠం గోరోచనం నిశా,
లాక్షా దారు హరిద్రాచ గైరికం నాగకేసరమ్. 140
పాలాశకుసుమంచాపి ప్రియంగుశ్చ వటాంకురాః,
మాలతీచ మధూచ్ఛిష్టం సర్షపా స్సురభి ర్వచా. 141
చతుర్గుణపయః పిష్టై రేతై రక్షమితైః పృథక్,
పచే న్మందాగ్నినా వైద్య స్తైలప్రస్థద్వయోన్మితమ్. 142
ప్రదనాభ్యంజనా దేతద్వ్యంగం నీలికయా సహ,
తిలకం మాషకం న్యచ్ఛం నాశయే న్ముఖదూషికామ్. 143
పద్మినీకంటకంవాపి హరే జ్జంతుమణిం తథా,
విదధ్యా ద్వదనం పూర్ణచంద్రమండలసుందరమ్. 144

తా. కుంకుమ, కేసరములు, చందనము, లొద్దుగచెక్క, రసకర్పూరము, రక్తచందనము, మ్రానిపసపు, వట్టివేరు, మంజిష్ఠ, అతిమధురము, లవంగపత్రి, పద్మకాష్ఠము, తామర, చెంగల్వకోష్టు, గోరోచనము, పసపు, లక్క, మ్రానిపసపు, కావిఱాయి, నాగకేసరములు, మోదుగపువ్వులు, ప్రేంకణము మఱ్ఱిచిగుళ్లు, జాజి, మైనము, తెల్లావాలు, తులసి, వస-వీనిని దినుసుకొక్కొక్క అక్ష ప్రమాణముగ గ్రహించి నూరి నాలు

గింతలు పాలుపోసి కషాయముగాచి అందు రెండుప్రస్థములు నూనె గలిపి మందాగ్ని తోపక్వముజేసి ముఖమునందు లేపనము జేయుచుండిన వ్యంగము, నీలిక, తిలకాలము, మాషము, న్యచ్ఛము, మొటిమలు, పద్మినీకంటకము, జంతుమణి-వీనిని హరింపంజేసి ముఖమునందు చంద్రునివంటికాంతిని గలుగంజేయును.

పరివర్తకలక్షణము

మర్దనా త్పీడనాద్వాపి తథై వా ప్యభిఘాతతః,
మేఢ్రచర్మ యదావాయు ర్భజతే సర్వతశ్చరః. 145
తదా వాతోపసృష్టత్వా త్తచ్చర్మ పరివర్తతే,
మణేరధస్తా త్కోశస్తు గ్రంథిరూపేణ లంబతే. 146
సవేదనం సదాహంచ పాకంచ వ్రజతి క్వచిత్,
పరివర్తికేతి తాం విద్యా త్సరుజాం వాతసంభవామ్. 147
సకండూః కఠినావాపి సైవ శ్లేష్మసముత్థితా,

తా. మేఢ్రమును రుద్దుటచేగాని, లేక పిసుకుటచేగాని, అభిఘాతమువలనగాని వ్యానవాయువు ప్రకోపించి చర్మమునందు చేరి చర్మమును వెనుకకు నీడ్చుటచే మేఢ్రకోశము వాచి మణిక్రింద గంటువలెనై వ్రేలాడుచు పోట్లు, మంటలతోగూడి యొకానొకప్పుడు పండిన పరివర్తక మనంబడును. ఇది వాతమువలన జనించిన పోట్లు గలుగును. కఫమువలన జనించియుండిన దురద, కాఠిన్యము గలుగును.

సామాన్యోపచారము

పరివర్తే ఘృతాభ్యక్తాం సుస్విన్నా ముపనాహయేత్. 148
త్రిరాత్రం పంచరాత్రంవా వాతఘ్నై శ్శాల్మలాదిభిః,
తతోఽభ్యజ్య శనైశ్చర్మ వేశయే త్పీడయే న్మణిమ్ 149
ప్రవిష్టే చర్మణిమణౌ క్లేదయే దుపనాహయేత్,
దద్యా ద్వాతహరాం వస్తిం స్నిగ్ధాన్యన్నాని భోజయేత్. 150

తా. పరివర్తకమునందు మేఢ్రమునకు ఘృతమును బూసి చెమటందీసి వాతహరమైన శాల్మలాదులచే మూడుదినములుగాని, లేక ఐదుదినములుగాని కట్టుగట్టి పిదపఘృతమును బూసి మేఢ్రమణిని చర్మములో మెల్లమెల్లగ ప్రవేశింపంజేసి పిదప వాతహరములగు ద్రవ్యములచే కట్టుగట్టి వాతహరములగుద్రవ్యములచే సిద్ధముచేయఁబడిన ఘృతాదులచే వస్తికర్మంజేసి స్నిగ్ధకరమైన యన్నమును భుజింపంజేయవలయును.

అవపాటికలక్షణము

అల్పీయసీం యదా హర్షా ద్బలా ద్గచ్ఛేత్స్త్రియం నరః,

హస్తాభిఘాతా దథవా చర్మణ్యుద్వర్తితే బలాత్, 151
మర్దనా త్పీడనాద్వాపి శుక్రవేగవిఘాతతః,
యస్యావపాట్యతే చర్మ తాం విద్యా దవపాటికామ్. 152

తా. సూక్ష్మమైన యోనిఛిద్రముల స్త్రీతో బలాత్కారముగ రతికేళిఁ దేలుటచేనేని, లేక చేతిదెబ్బచేనేని, బలాత్కారమువలన మేఢ్రచర్మము వ్యత్యస్తంబగుటచేనేని, పిసుకుటచేనేని, అదురుటచేనేని, శుక్రవేగము నడ్డగించుటచేనేని మేఢ్రచర్మను భిన్నంబై పీడను గలుగంజేసిన అవపాటిక మనంబడును.

చికిత్స

స్నేహస్వేదై రిమాం వైద్య శ్చికిత్సే దవపాటికాం,

తా. అవపాటికయందు స్నేహస్వేదోపచారములు సేయవలయును.

నిరుద్ధప్రకసలక్షణము

వాతోపసృష్టే మేఢ్రేతు చర్మసంశ్రయతే మణిమ్. 153
మణిశ్చర్మోతనద్ధస్తు మూత్రస్రోతో రుణద్ధిచ,
నిరుద్ధప్రకసే తస్మి న్మందధార మవేదనమ్. 154
మూత్రం ప్రవర్తతే జంతో ర్మణిర్విప్రియతేనచ,
నిరుద్ధప్రకసం విద్యా త్సరుజం వాతసంభవమ్. 155

తా. వాతసంబంధమువలన మేఢ్రపీడగలవాఁడై యుండ చర్మము వానిమేఢ్రమణిని మూసికొనుటవలన మూత్రమార్గము అడ్డగింపంబడి పోట్లు, మంటలు లేకనే బిందుబిందువులుగ మూత్రము వెడలిన నిరుద్ధప్రకసమనంబడును. ఇది వాతమువలన జనించును.

చికిత్స

నిరుద్ధప్రకసే నాడీం లౌహీ ముభయతోముఖీం,
దార్వీంచ వాజతుకృతాం ఘృతాక్తాంసం ప్రవేశయేత్. 156
పరిషించే ద్వసాం మజ్జాం శింశుమారవరాహయోః,
చక్రతైలం తథాయోజ్యం వాతఘ్నద్రవ్యసంయుతమ్. 157
అహోత్థూలతరాం సమ్య జ్నాడీం గర్భే ప్రవేశయేత్,
భిత్వావా సేవనీం ముక్త్వా సద్యఃక్షతవదాచరేత్. 158

తా. నిరుద్ధప్రకసమునందు, ఇనుము, వెదురు, లక్క అనువానితో దేనిచేనేని నొకశలాకను రెండుముఖములుగలదిగ జేయించి నెయ్యిపూసి లోన బ్రవేశింపంజేయుటజే దానినోరును దెరచి మొసలి, పంది అనువానియొక్క క్రొవ్వును, మజ్జను, వాతహరద్రవ్యయుక్తముగ జేయఁబడిన చక్రతైలమును బోసి తదనంతరము సేవని యను

నాడినివదలి, మిక్కుటముగ స్థూలించియుండునాడిని ఛేదించి గర్భములో బాగుగ ప్రవేశింపంజేసి సద్యఃక్షతోపచారములం జేయవలయును.

## సన్నిరుద్ధగుదలక్షణము

వేగసంధారణా ద్వాయు ర్విహతో గుదసంశ్రితః,
నిరుణద్ధి మహాస్రోత స్సూక్ష్మద్వారం కరోతిచ, 159
మార్గస్య సౌక్ష్మ్యాత్కృచ్ఛ్రేణ పురీషం తస్య గచ్ఛతి,
సన్నిరుద్ధగుదం వ్యాధి మేనం విద్యా త్సుదారుణమ్. 160

తా. మలమూత్రాదివేగము. నడ్డగించుటచే గుదాశ్రితవాతము ప్రకోపించి గుదము నడ్డగించి గుదద్వారమును సన్నముగ జేయును. దానివలన మలము కడుకష్టముమీఁద వెడలును. ఇదియ సన్నిరుద్ధగుద మనంబడును. ఇది కడుభయంకరమైనది.

## చికిత్స

సన్నిరుద్ధగుదే తైలై స్సేకో వాతహరై ర్హితః,
తథానిరుద్ధప్రకసే క్రియాపి కథితాహితా. 161

తా. సన్నిరుద్ధగుదమునందు వాతనాశకరతైలసేచనమును, నిరుద్ధప్రకసనమునందు జెప్పంబడిన సర్వక్రియలను జేయవలయును.

## అహిపూతనలక్షణము

శకృన్మూత్రసమాయుక్తే ధౌతే పానే శిశోర్భవేత్,
స్విన్నే వాస్నాప్యమానేవా కండూరక్త కఫోద్భవా. 162
తతఃకండూయనాత్క్షిప్రం స్ఫోటాస్స్రావశ్చ జాయతే,
ఏకీభూతం వ్రణం ఘోరం తం విద్యా దహిపూతనమ్. 163

తా. శిశువు మలమూత్రోత్సర్జనమును జేసిన పిదప గుదమును కడుగకుండుటచేనేని, చెమటను తుడువకుండుటచేనేని, స్నానము జేయించిన పిదప తుడువకుండుటచేనేని, రక్తకఫములు ప్రకోపించి దురదను కలుగంజేయును. పిదప గోకుటచే శీఘ్రముగ కురుపులు జనించి స్రావమును జేయించుటచే ఒకటితో నొకటిచేరి విస్తరించును. ఇదియ అహిపూతన మనంబడును. (ఈభయంకరమైన రోగము తరుచుగ శిశువులకే జనించును.)

## శంఖాదిలేపము

శంఖ సౌవీర యష్ట్యాహ్వై ర్లేపః కార్యోఽహిపూతనే,

తా. శంఖము, సురమరాయి, అతిమధురము-వీనిని నూరి లేపనముజేసిన అహిపూతనము హరించును.

### పటోలాదిఘృతము

పటోలపత్ర త్రిఫలా రసాంజన విపాచితమ్. 164
పీతం ఘృతం నాశయతి కృచ్ఛ్రమ ప్యహిపూతనం,

తా. చేతిపొట్లాకు, త్రిఫలములు, రసాంజనము అనువానికల్కములో ఘృతము గలిపి కాచి పానముజేసిన కష్టసాధ్యమైన అహిపూతనము హరించును.

### వృషణకచ్ఛలక్షణము

స్నానోత్సాదనహీనస్య మలోవృషణసంస్థితః. 165
యదా ప్రక్లిద్యతే స్వేదా త్కండూ స్సంజాయతే తదా,
కండూయనా త్తతఃక్షిప్రం స్ఫోటా స్స్రావశ్చ జాయతే. 166
ప్రాహుర్వృషణకచ్ఛూం తాం శ్లేష్మరక్తప్రకోపజాం,

తా. స్నానము జేయునపుడు వృషణమలమును బాగుగ కడిగికొనకుండుటవలన వృషణములయందు మలముజేరి చెమటవలన తేమగలదై మిక్కుటముగ దురదను గలుగంజేయును. దానిని గోకిన క్షణముననే కురుపులు జనించి స్రావము గలుగును. ఇదియె వృషణకచ్ఛ మనంబడును. ఇది కఫరక్తములవలన జనించును.

### సర్జాదిలేపనము

సర్జాంబు కుష్ఠ సైంధవ సితసిద్ధార్థైః ప్రకల్పితోయోగః,
ఉద్వర్తనేన నియతం శమయతి వృషణకండూతిమ్. 167

తా. సర్జరసము, వట్టివేరు, చెంగల్వకోష్టు, సైంధవలవణము, తెల్లావాలు-వీనిని నూరి యెల్లపుడు పూయుచుండిన వృషణములయందలిదురద హరించును.

### కాసీసాదిలేపము

కాసీస రోచనా తుత్థ హరితాళ రసాంజనైః,
అమ్లపిష్టైః ప్రలేపోఽయం ముష్కకం డ్వహిపూతనే. 168

తా. అన్నభేది, గోరోచనము, మైలుతుత్థము, హరిదళము, రసాంజనము - వీనిని నిమ్మపండ్లరసముతోనూరి లేపనముజేసిన అండవృద్ధి, దురద, అహిపూతనము హరించును.

### సూకరదంష్ట్రలక్షణము

సదాహో రక్తపర్యంత స్త్వక్పాకీ తీవ్రవేదనః,
కండూమా జ్జ్వరకారీచ సస్స్యా త్సూకరదంష్ట్రకః. 169

తా. చర్మము దాహయుక్తంబై యెఱ్ఱనై పండి తీవ్రవేదన, దురద, వాపు, లేక వ్రణముగలదై జ్వరయుక్తంబుగ నుండిన సూకరదంష్ట్ర మనంబడును,

రాజీవాదికల్కము

రాజీవమూలకల్కః పీతోగవ్యేవ సర్పిషా ప్రాతః,
శమయతి సూకరదంష్ట్రోద్భూతం జ్వరం ఘోరమ్. 170

తా. ఎఱ్ఱదామరగడ్డల కల్కములో ఆవునెయ్యిగలిపి ప్రాతఃకాలమున సెల్లపుడు సేవింపుచుండిన సూకరదంష్ట్రమువలన గలిగిన భయంకరమైన జ్వరము హరించును.

రజన్యాదిలేపము

రజనీం మార్కవమూలం పిష్టం శీతేనవారిణా,
తల్లేపాద్ధంతి వీసర్పం వారాహదశనాహ్వాయమ్. 171

తా. పసపు, గుంటగలగరవేరు-వీనిని శీతోదకముతో నూరి లేపనముజేసిన విసర్పము, వరాహదంష్ట్రము హరించును.

స్వరభంగనిదానము

వాతపిత్తే గళే జాతే స్వరభంగః ప్రజాయతే,
ఏతదుక్తంతు పూర్వేణ వామదేవేన మానినా. 172

తా. వాతపిత్తములు ప్రకోపించి కంఠమునుజెందిన స్వరభంగము గలుగునని పూర్వమందు వామదేవుఁడను మునీశ్వరుఁడు వచించెను.

విభీతకాదిచూర్ణము

విభీతక కణా ముండి సైంధవం తత్సమంసమం,
గోమూత్రేణ పిబే న్నిష్కం స్వరభంగప్రశాంతయే. 173
(మాధవనిదానే)

తా. తానికాయ, పిప్పలి, బోడతరము, సైంధవలవణము - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి నిష్కమెత్తును గోమూత్రములో గలిపి త్రాగిన స్వరభంగము హరించును.

ఆర్ద్రికాదిచూర్ణము

ఆర్ద్రికం భృంగ గోరంట వచా బ్రాహ్మీచ వాకుచీ,
ఏలాచూర్ణం సమాంశేన పలైకం వారిణా పిబేత్. 174
మాఘమాసే చతుర్దశ్యాం కృష్ణపక్షే ద్విసప్తకే,
గాంధర్వో జాయతే సమ్యక్ కోకిలానాం స్వరో యథా. 175
(ఆయుర్వేదే)

తా. అల్లము, గుంటగలగర, గోరింట, వస, మండూకబ్రహ్మి, భావంచివిత్తులు, ఏలకులు-వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ఒకపలము నుష్ణోదకములో గలిపి

మాఘబహుళచతుర్దశి దినము మొదలు ౧౮ దినములు త్రాగిన కంఠస్వరము గాంధర్వ కోకిలస్వరములతో సమానంబగును.

### సైంధవాదిచూర్ణము

సైంధవేంద్రయవం రాత్రౌ మరిచం చోష్ణవారిణా,
పాయయే త్కర్షమాత్రంతు గళదోషప్రశాంతయే. 176

తా. సైంధవలవణము, కొడిసెపాల, మిరియాలు - వీనిచూర్ణములో కర్షప్రమాణమును ఉష్ణోదకములో గలిపి రాత్రులయందు త్రాగిన స్వరభంగము హరించును.

కరంజబీజ మజ్జా చ ద్వినిష్కం చోష్ణవారిణా,
గళదోషహరం పానే పథ్యాం క్షౌద్రకసంయుతామ్. 177

తా. కానుగవిత్తులలోని పప్పును రెండునిష్కములయెత్తు ఉష్ణోదకములో గలిపి త్రాగినను, లేక కరక్కాయచూర్ణమును తేనెలో గలిపి సేవించినను స్వరభంగము హరించును.

అభయా గంధకం క్షౌద్రం నింబబీజం సమాంశకం,
గళదోషహరం లేహ్యం సక్షౌద్రం పర్పటీరసమ్. (సిద్ధరసార్ణవే) 178

తా. కరక్కాయ, గంధకము, వేపవిత్తులు-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి తేనెలో గలిపి సేవించినను, పూర్వోక్తపర్పటీరసమును తేనెతో సేవించినను స్వరభంగము హరించును.

ధాత్రీఫలరసైః క్షీరైః పానంస్యా త్స్వరభంగనుత్,
త్రిమాసేసేవయేన్నిత్యం స్వరభంగప్రశాంతయే. (నిత్యనాథీయే)179

తా. ఉసిరికపండ్లరసమును పాలలో గలిపి త్రాగిన స్వరభంగము హరించును. స్వరభంగరోగనివారణార్థంబై చెప్పంబడిన యౌషధమును మూడుమాసములు సేవింప వలయును.

### వదనదుర్గంధనిదానము

కఫపిత్తే గళే జాతే వక్త్రే దుర్గంధసంభవః,
తచ్ఛాంత్యర్థం వక్ష్యామి భైషజ్యం లోకమోహనమ్. 180

తా. కఫపిత్తములు ప్రకోపించి కంఠమును జెందిన నోట దుర్గంధము గలుగును. అది శమించుటకై ప్రశస్తమైన చికిత్సల వచించెదను.

### చికిత్స

సర్వసోమాతులుంగస్య సంయుతో మధుసర్పిషా,
తాలుదేశే ప్రదేయశ్చ చూర్ణితం సైంధవం తథా. 181

నాశ్రయించి కోష్ఠాగ్నిని బైలుపఱచి రసధాతువుతోగలసి జ్వరమునుగలుగజేయును. ఇదియె శారీరజ్వరలక్షణము.

తేమలా స్తత్ర దోషైశ్చ సైర్వసైర్వర్ధుష్టాః ప్రదూషణైః,
ఆమాశయం ప్రవిశ్యామ మనుగమ్య పిథాయచ. 169
స్రోతాంసి పంక్తిస్థానాచ్చ నీరస్య జ్వలనం బహిః,
సహ తేనాభిసర్పంత స్తపంత స్సకలం వపుః. 170
కుర్వంతో గాత్ర మత్యుష్ణం జ్వరం నిర్వర్తయంతి తే,
స్రోతోవిబంధాత్ప్రాయేణ తతః స్వేదో నజాయ తే.(బాహటే)171

తా. వాతాదిదోషములు తమతమ ప్రకోపకారణములచేత బ్రకోపించి ఆమాశయమును జెంది అజీర్ణముగనుండు ఆహారరసముతోచేరి రోమకూపము మొదలగు స్రోతోమార్గముల నడ్డగించి పక్వాశయమునందుండి జాఠరాగ్నిని బైలుపఱచి దానితోకూడ శరీరమంతట వ్యాపించి అత్యుష్ణముగనుండు జ్వరమును కలుగచేయును. జ్వరమునందు రోమకూపాదిస్రోతోమార్గములు అడ్డగింపఁబడియుండుటవలన తరుచుగా చెమట కలుగదు.

## జ్వరలక్షణము

స్వేదావరోధ స్సంతాప స్సర్వాంగగ్రహణం తథా,
యుగపద్యత్ర యోగేచ సజ్వరో వ్యపదిశ్యతే. 172

తా. చెమట బైలువెడలకుండుట, దేహము ఇంద్రియములు మనస్సు వీనియందు సంతాపము సర్వాంగములయందు వేదన ఈలక్షణములు ఏకకాలమునందు యేరోగములో కలుగునో నదియె జ్వర మనఁబడు.

## జ్వరపూర్వరూపము

శ్రమోరతిర్వివర్ణత్వం వైరస్యం నయనప్లవః,
ఇచ్ఛాద్వేషౌ ముహుశ్చాపి శీతవాతాతపాదిషు. 173
జృంభాంగమర్దో గురుతా రోమహర్షో రుచి స్తనుః,
అప్రహర్షశ్చ శీతంచ భవంత్యుత్పత్స్యతి జ్వరే, 174
సామాన్యతో విశేషస్తు జృంభోత్యర్థం సమీరణాత్,
పిత్తాన్నయనయోర్దాహః కఫాన్నాన్నాభినందనమ్. (గ్రంథాంతరే)

తా. బడలియుండుట, దేనియందును ఇష్టములేకుండుట, శరీము వివర్ణముగనుండుట, నోరువిరసముగనుండుట, నేత్రములయందు నీరుపూరించియుండుట, శీతము ఎండ

గోజలైః క్వథితం పథ్యా మిసి కుష్ఠ కణాన్వితం,
వదనస్య దురామోదం నిహంతి పరిశీలితమ్. 18
ధృతంచ కాంజికం దోషే పరితో భక్షయేత్సితాం,
తథాకృతే భవేదాస్యే దురామోదానుమర్దనమ్. 18

తా. మాదీఫలరసములో తేనెగాని, నెయ్యిగాని, గలిపి త్రాగినను, సైంధవలవ చూర్ణమును తాలుప్రదేశమునం దునిచినను, కరక్కాయలు, సదాప, చెంగల్వకోష్ఠ పిప్పలి-వీనిని చూర్ణముజేసి గోమూత్రములో కలిపి కాచి త్రాగినను, నోటిదుర్గంధవ హరించును. లేక కలిలో పంచదారగలిపి గండూషముజేసిన నోటిదుర్గంధము హరించున

## కుష్ఠాదివటికములు

గోమూత్రే క్వాథయే త్కుష్ఠం వాలుకం సహరీతకీ,
పిష్ట్వా ధార్యావటీఃకృత్వా ముఖదుర్గంధనాశనీః. 18

తా. చెంగల్వకోష్ఠు, కూతురుబుడమ, కరక్కాయలు - వీనిని చూర్ణముచే గోమూత్రములో గలిపి వండి నూరి మాత్రలుజేసి నోట నునిచికొనిన నోటిదుర్గంధవ హరించును.

## లాజాదికషాయములు

లాజా జాతీఫలం పూగో మాత్రికంచ పిబేదను,
శీతతోయం పలార్ధంచా ప్యాస్యదుర్గంధశాంతయే. 18

తా. పేలాలు, జాజికాయ, పోకలు-వీనిని సమభాగములుగ ఖల్వములో నుని తేనెతో మర్దించి మాత్రలుజేసి భక్షించి వెంబడిగ అరపలము శీతోదకమును త్రాగి నోటిదుర్గంధము హరించును.

## పులిపిర్లనిదానము

వాతేన కఠినం పీతం జాయతే కందుభేదనమ్. 18

తా. వాతమువలన కఠినమై పచ్చగ నుండు పులిపిర్లు జనించును.

## చికిత్స

అశ్వత్థస్యత్వచోభస్మ చూర్ణేన సమమిశ్రితం,
నవనీతం ద్వయోస్తుల్యం మర్ద్యంతేన విలేపయేత్. 187
ఆననే గుదపార్శ్వేచ కటిస్థాః పిటికా జయేత్,

తా. రావిచెక్కలబూడిదె, కొత్తసున్నము-వీనిని సమభాగములుగ గ్రహించి

వానికి సమముగ వెన్నగలిపి లేపనముజేసిన ముఖము, గుదపార్శ్వము, నడుము-వీనియందుండెడి పులిపిర్లు నశించును. (మఱియు నక్కపీటాకురసమును బూసిన పులిపిర్లు నశించును.)

## ఛాయారోగనిదానము

ఛాయారోగం ప్రవక్ష్యామి వాతదోషాదిసంభవమ్. 188
ఉత్తమాంగస్య కేశేషు రక్తరూపం ప్రజాయతే,

తా. వాతాదిదోషమువలన శిరమునందలి వెంట్రుకలు రక్తవర్ణంబులైన ఛాయారోగ మనంబడును.

## ఛాయారోగచికిత్స

జపాపుష్పశతం హంతి కృష్ణగోమూత్ర లేపనాత్. 189
గుంజామూలఫలం చూర్ణం కంటకారిఫలద్రవైః,
తేనలేపోనిహంత్యాశుఛాయారోగంసుదుస్సహమ్. (సిద్ధరసార్ణవే)

తా. నూఱు దాసానిపువ్వులను కరియావుమూత్రముతో నూరి లేపనముజేసిన ఛాయారోగము హరించును. మఱియు గురిజవేరు, గురిజవిత్తులు-వీనిచూర్ణమును నేలములకపండ్లరసముతో నూరి లేపనముజేసిన అసాధ్యమైన ఛాయారోగము శీఘ్రముగ హరించును.

భల్లాతకఫలద్రావై స్స్నుహీ క్షీరయుతై ర్జయేత్,
కుంకుమం మరిచం చార్ధం పిష్ట్వా తైలేన లేపనాత్. 191
పక్త్వా తైలం నిహంత్యాశు లేపో జంబీరజద్రవైః,
లాక్షా భల్లాతకం ముస్తా కుష్ఠ గుగ్గులుసర్పిషా. 192
విడంగేన సమం చూర్ణం పిబే చ్ఛాయాహరంపరం, (శారీరే)

తా. జీడిపండ్లరసమును జెముడుక్షీరములో గలిపిగాని, లేక కుంకుమపువ్వు ౧ భాగము, మిరియాలు ౪ భాగము-ఈరెంటిని నూరి నూనెలో గలిపిగాని, నిమ్మపండ్లరసములో నూనెను గలిపి కాచిగాని, లేపనముజేసిన ఛాయారోగము హరించును. లక్కబియ్యము, జీడిగింజలు, తుంగముస్తెలు, చెంగల్వకోష్టు, గుగ్గిలము, వాయువిడంగములు-వీనిని సమభాగములుగ చూర్ణముచేసి నేతిలో గలిపి త్రాగిన ఛాయారోగము హరించును.

## భల్లాతకాదిలేపము

భల్లాతకం కృష్ణతిలాః కంటకారిఫలం సమమ్. 193
పిష్ట్వాతండులతోయేన లేపశ్ఛాయాం వినాశయేత్, (నిత్యనాథీయే)

తా. జీడివిత్తులు, నల్లనువ్వులు, నేలములకపండ్లు-వీనిని సమభాగములుగ చూర్ణము జేసి బియ్యపుకడుగుతో నూరి లేపనము జేసిన ఛాయారోగము హరించును.

భల్లాతకం చ బృహతీ గుంజామూలం కటిల్లకమ్. 194
మధునాసహ లేపేన ఛాయారోగం వినశ్యతి,

తా. జీడివిత్తులు, ములకవిత్తులు, గురిజవేరు, కాకరవేరు - వీనిని సమభాగములుగ తేనెతో నూరి లేపనము జేసిన ఛాయారోగము హరించును.

## అరోచకలక్షణము

వాతాదిభిశ్శోకభయాతిలోభ క్రోధైర్మనోఘ్నాశనరూపగంధైః,
అరోచకాస్యుఃపరిహృష్టదంత కషాయవక్త్రస్యసతోఽనిలేన. 195
(మాధవనిదానే)

తా. వాత, పిత్త, కఫ, సన్నిపాత, శోక, భయ, అతిక్రోధ, లోభములవలన అరోచకము జనించును. ఇది జనించినపిదప మనోవేదన, అన్నాదిరూపకరమైన దౌర్గంధ్యము గలుగును. మఱియు అరుచి వాతజనితంబై యుండిన దంతములు పులిసినట్టుగ, నోరువగరుగ నుండును.

## చికిత్సలు

కుష్ఠ సౌవర్చలా జీర శర్కరా మరిచం బిడం,
ధాన్యైలా పద్మకోశీర పిప్పల్య శ్చందనోత్పలమ్. 196
లోధ్ర తేజోవతీ పథ్యా త్ర్యూషణం నమునాగ్రజం,
ఆర్ద్రిదాడిమ నిర్యాస స్సా జాజీ శర్కరాయుతః. 197
సతైలమాక్షికాహ్యేతే చత్వారః కబళగ్రహాః,
చతురో రోచకాన్ ఘ్నంతి వాతాద్యేకజసర్వజాన్. 198

తా. చెంగల్వకోష్టు, సౌవర్చలవణము, జీలకఱ్ఱ, మిరియాలు, బిడాలవణము - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అందు పంచదార, ఆవనూనె, తేనె అనువానిని సమముగ గలిపి లేహ్యపక్వముగవండి ప్రాతఃసాయంకాలములయందు రేగుపండంత *కబళముజేసిన వాతారోచకమును, ధనియాలు, ఏలకులు, తామరదుంపలు, వట్టివేరు, పిప్పళ్ళు, శ్రీగంధము, నల్లకలువగడ్డలు - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అందు పంచదార, ఆవనూనె, తేనె అనువానిని సమముగ గలిపి లేహ్యపక్వముగ వండి రేగుబండంతకబళముజేసిన పిత్తారోచకమును, లొద్దుగపట్ట, వెఱ్ఱుడుతీఁగె, కరక్కాయ, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, యవక్షారము - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అందు పంచదార, ఆవనూనె, తేనె అనువానిని సమముగ గలిపి లేహ్యపక్వముగ

* కబళ మన—నోటియందు దునిచికొని నములుట యనుట.

వండి రేగుబండంత ప్రాతస్సాయంకాలముల కబళముజేసిన కఫారోచకమును, జీలకఱ్ఱను చూర్ణముజేసి యందు దల్లపురసము, దాడిమపడ్లరసము, శుద్ధిజేసిన శిలాజిత్తు, పంచదార, ఆవనూనె, తేనె - అనువానిని సమముగ గలిపి లేహ్యపక్వముగ వండి రేగుబండంత కబళముజేసిన సన్నిపాతారోచకమును హరించును.

శమయతి కేసర మరుచిం సలవణఘృతమాశు మాతులుంగస్య,
దాడిమచర్వణ మథవా చరకోరుచికౌరిషూచయమాస. 199

తా. మాదీఫలకేసరములు, సైంధవలవణము - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అందు తగుమాత్రము నెయ్యిగలిపి ప్రాతస్సాయంకాలములయందు భక్షించినను, లేక పుల్లదాడిమగింజల బాగుగనమిలి భక్షించినను అరుచి శీఘ్రముగ నశించు నని చరకసంహితయం దుదహరింపఁబడియున్నయది.

శర్కరా దాడిమం చాథ ద్రాక్షా ఖర్జూర మేవ చ,
కేసరం మాతులుంగస్య సింధునా మధునాపి వా. 200
ఆస్యవైరస్య శమనం భక్షయే త్కర్ష సమ్మితమ్,

తా. దీపద్రాక్ష, ఖర్జూరము, మాదీఫలకేసరములు - వీనిని సమభాగములుగ దంచి అందు శర్కర, దాడిమపండురసము పైచి సైంధవలవణము నైనను, తేనెనైనను గలిపి లేహ్యపక్వముగ వండి అందొకకర్షమును సేవించిన అరుచి హరించి జిహ్వకు రుచి గలుగును.

విడంగచూర్ణం కర్షైకం క్షౌద్రై శ్చతుర్గుణైర్యుతమ్. 201
అసాధ్యమపి సంహన్యా దరుచిం వక్త్రధారణాత్,

తా. ఒకకర్షము వాయువిడంగములచూర్ణమునందు ౪ కర్షముల తేనె గలిపి కొంచెము వెచ్చజేసి గట్టియైనపిదప రేగుబండంతమాత్రలుజేసి యందొకమాత్రను పుక్కిట నునిచికొని దానిరసమును మ్రింగుచుండిన అసాధ్యమైన అరుచి హరించును.

సితా వ్యోష కపిత్థానాం చూర్ణం క్షౌద్రేణ తద్వటీమ్. 202
సర్వారోచకశాంత్యర్థం ధారయే ద్వదనాంబుజే.

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు-వీనిని సమభాగములుగ చూర్ణముచేసి అందు శర్కర, వెలగపండుగుజ్జు, తేనె గలిపి పక్వముగ వండి మాత్రలుజేసి పుక్కిట నునిచికొని దానిరసమును మ్రింగుచుండిన సమస్తమైన అరుచులు నశించును.

ద్వావింశ ప్రకరణమ్.

# త్రయోవింశప్రకరణము



## విషరోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లో. బాలచంద్రకళామౌళిం భుజగేంద్రవిభూషణం,
తారకం సచ్చిదానందం లింగమూర్తి మహం భజే. 1

తాత్పర్యము. బాలచంద్రుని శిరమున ధరించిన వాఁడును, సర్పములే యాభరణములుగ గలవాఁడును, జగత్తును దరింపఁజేయువాఁడును, సచ్చిదానందరూపుఁడును, లింగస్వరూపుఁడు నగు పరమేశ్వరుని నేను భజియించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరా జని పేరొక్కనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథము యొక్క త్రయోవింశప్రకరణమును వచియింపుచున్నాఁడను.

### విషనిదానము

అనేకవిషజీవానాం చూర్ణం ముఖవిషైర్యుతం,
మిశ్రితం నఖదంతైశ్చ లోహాద్యం చూర్ణసంచయమ్. 3
కృత్రిమం తు విషం ఖ్యాతం పక్షమాసా ద్విబాధతే,
ఆలస్యం కురుతే జాడ్యం కాసశ్వాసబలక్షయమ్. 4
రక్తస్రావో జ్వర శ్శోభా పీతచక్షుశ్చ లక్షణం, (బ్రహ్మగారుడే)

తా. అనేకవిషజంతువులు, ముఖమునందు విషముగల సర్పాదిజంతువిషములు, గోళ్ళు, దంతములు, లోహాదులు మొదలగువాని చూర్ణాదు లన్నాదులతోడ గలిపియొసంగుటయ కృత్రిమవిష మనంబడును.ఇది ౧౫ దినములకుగాని,ఒకమాసమునకుగాని విషమెక్కి బాధించును. దానిలక్షణము లెవ్వి యనిన—ఆలస్యము, జాడ్యము, దగ్గు, ఉబ్బసము, బలక్షయము, రక్తస్రావము, జ్వరము, శరీరమునందు వాపు, నేత్రములయందు పసపు వర్ణము అనునవి యనుట.

### భీమరుద్రరసము

మృతంస్వర్ణం శుద్ధసూతం శుద్ధం వై హేమమాక్షికమ్. 5
త్రయాణాం గంధకం తుల్యం మర్ద్యం కన్యాద్రవైర్దినం,
తచ్ఛుష్కం ససితక్షౌద్రం మాషైకం లేహయేత్సదా. 6

వహ్నిమూలం శృతం క్షీరై రనుస్యా ద్గరనాశనం,

తా. స్వర్ణభస్మము, శుద్ధిజేసిన రసము, శుద్ధిచేసిన హేమమాక్షికము-ఈమూటికి సమముగ శుద్ధిజేసిన గంధకము గలిపి కలబందరసముతో నొకదినము మర్దించి నీడ నెండించి మాషప్రమాణము మాత్రలుజేసి యందొకదానిని పంచదార, తేనె అనువాని యనుపానముతోడ సేవించి వెంబడిగ పాలలో చిత్రమూలమును వైచి కాచి త్రాగిన కృత్రిమవిషము నివర్తించును.

## శట్యాదియోగము

శటీ పుష్కరమూలం చ పాచ్యం పారావపిత్తకమ్. 7
మత్పిబే చ్ఛీతలం పానే గరతృష్ణాజ్వరాపహం, (మాధవనిదానే)

తా. కచోరములు, పుష్కరమూలము, పావురపుపిట్టచేదు-వీనిని సమభాగములుగ వండి శీతోదకముతో త్రాగిన కృత్రిమవిషములు, దప్పి, జ్వరము నివర్తించును.

## అభయాదిపటికములు

వృష భూనింబ పత్రాణి పటోలం చ పలంపలమ్. 8
తోయేచాష్టగుణేక్వాథం పాదశేషం సమాహరేత్,
క్వాథ తుల్యం ఘృతం గవ్యం ఘృతార్ధ మభయారసమ్. 9
ఘృతశేషం పచేత్సర్వం పానాద్విషహరం ఘృతం, (మాధవకల్పే)

తా. అడ్డసరము, నేలవేము, చేదుపొట్లాకు-వీనిని దినుసుకు పలిమెడుచొప్పున దంచి ౨౪ పలము లుదకముపోసి నాలవభాగముగ కషాయము గాచి దానికి సమముగ ఆవునెయ్యి, ఆవునేతికి సమముగ కరక్కాయలరసము గలిపి చిక్కగ వండి సేవించిన విషదోషము నివర్తించును.

## సర్పాక్షియోగము

సమూలపత్రాం సర్పాక్షీం జలేన క్వథితాం పిబేత్. 10
నరమూత్రైశ్చ వా పిష్టాం పిబే త్సర్వగదాపహం, (ఆయుర్వేదే)

తా. సర్పాక్షిసమూలమును దంచి యుదకములో వైచి కషాయముగాచి త్రాగినను, లేక సర్పాక్షిని నరమూత్రముతో నూరి త్రాగినను సర్వవిషములు నివర్తించును.

## విషచికిత్స

న్యగ్రోధో రజనీ కుష్ఠం పిష్ట్వాజ్యం గృహధూమకమ్. 11
తండులీయకమూలేన కర్షం గరహారం పిబేత్, (అశ్వినికల్పే)

తా. మఱ్ఱి, పసపు, చెంగల్వకోష్టు, కరుధూపము, చిఱ్ఱివేరు - వీనిని సమభాగములుగ నూరి కర్షప్రమాణమును నేతితో గలిపి సేవించిన విషదోషము నివర్తించును.

శిరీషం మేఘనాదం చ నవనీతసమన్వితమ్.
భల్లాతకం విషం హంతి లేపనేన క్షణా ద్ధ్రువం, (అన్యశాస్త్రే

తా. దిరిసెనము, చిర్రి, జీడి-వీనిని సమభాగములుగ నూరి వెన్నలో గలిపి లేపనము జేసిన విషము నిశ్చయముగ క్షణకాలములో నివర్తించును.

కుక్కకాటునకు చికిత్సలు

గుడ తైలార్కదుగ్ధస్య లేప శ్శ్వానవిషం హరేత్.
పిష్ట్వాపామార్గమూలం తు కర్షైకం మధునా లిహేత్,
శ్వానదష్టవిషం హంతి లేపా త్కుక్కుటవిష్ఠయా.
(భేషజకల్పే

తా. బెల్లము, నూనె, జిల్లేడుపాలు వీని నేకముజేసి లేపనము జేసినను, కర్ష ప్రమాణము ఉత్తరేణువేళ్ళను నూరి తేనెలో గలిపి భక్షించినను, లేక కఱచినస్థలమున కోడివిష్ఠను లేపనము జేసినను, పెట్టికుక్క (నక్క) విషము నివర్తించును. (గో కాకరగడ్డను ౪౦ దినములు సేవించినను, లేక మంగ, బోడతరము-వీనిరసములో మూ నూనెబొట్లు గలిపి ౪౦ దినములు త్రాగినను పెట్టికుక్క, నక్క విషములు నివర్తించున

నింబ కుటజబీజాని చందనాంబుజకేసరం,
క్షీరైః పిష్టం నిహంత్యాశు శ్వాన మారాలజం విషమ్.
(మాధవనిదా

తా. వేపవిత్తులు, కొడిసెవిత్తులు, చందనము, తామరగరులు-వీనిని పాల నూరి త్రాగిన కుక్కకాటు (నక్కకాటు) పిల్లికాటు శీఘ్రముగ నివర్తించును. ( తులము వెంట్రుకలను మంగలములో వైచి మసిజేసి దానిలో నూనెగలిపి త్రాగిన లేక శరీరమునకు కాకరాకురసము పూసికొని స్నానముజేసినను పెట్టికుక్క, నక విషము నివర్తించును. కుక్క, నక్క విషములయం దొకవత్సరమువఱకు చప్పిడి వ కమును భుజించుటయేగాక స్త్రీసంగమము, అవాలు, మామిడికాయ అనుపా వర్జింపవలయును.

మూషకవిషచికిత్స

శిలా తాళక కుష్ఠం చ భావ్యం నిర్గుండిజద్రవైః,
పానంమూషకదష్టానాం దంతతీవ్రవిషం హరేత్. (ఆయుర్వే

తా. శుద్ధిజేసిన శిలాజిత్తు, శుద్ధిజేసిన తాళకము, చెంగల్వకోష్టు-వీనిని వావిలా రసముతో నూరి భావనజేసి త్రాగిన ఎలుకకాటు శీఘ్రముగ నివర్తించును.

చించాఫలసమాయుక్తం గృహధూమం పలార్ధకం,
పురాణాజ్యేన సప్తాహం లిహే దాఖువిషం హరేత్.

తా. చింతగింజలు, కరుధూపము - ఈరెండిని నూరి అరపలమును ప్రాతనేతితో గలిపి భక్షించిన ఎలుకకాటు హరించును.

శిరీషకుసుమం తక్రైర్వత్సనాభయుతం పిబేత్,
విషం మూషకదష్టానాం శమమాప్నోతి తత్క్షణాత్. 18

తా. దిరిసెనపువ్వు, శుద్ధిజేసిన నాభి - వీనిని చల్లతో నూరి త్రాగిన ఎలుక కాటు తత్క్షణమున నివర్తించును. (మఱియు వెంట్రుకలను త్రాడుగాపేని ముడివేసి జిల్లేడు పాలలో నేడుమార్లు పడిపి చుంచెలుక కఱచినస్థలమున గాల్చి దానిపై జిల్లేడుచెక్క పొడి నద్దిన చుంచెలుకకాటు నివర్తించును.

తోయైర్వాత్వా నాగరం నస్యం పిబేద్వా ఘృతసైంధవం,
అర్కదత్తూరమూలంవా జలపానే విషాపహమ్. 19

తా. శొంఠి నుదకముతో నూరి నస్యము జేయించినను, లేక శుద్ధిజేసిన నాభిని సైంధవలవణముతో నూరి త్రాగించినను, లేక జిల్లేడు, ఉమ్మెత్త వీనివేరు నుదకముతో నూరి త్రాగించినను విషము నివర్తించును.

## వృశ్చికవిషచికిత్స

కాకజంఘీయమూలం చాప్యారనాళేన పేషయేత్,
పానాద్వా లేపనాద్వాపి విషం వృశ్చికజం హరేత్. 20

తా. నలుమసంధిపేరును కలితో నూరి త్రాగినను, లేక దానిని గంధము దీసి కఱచినస్థలమున లేపనము జేసినను, తేలువిషము నివర్తించును. (మఱియు తంగేడుకొనల రసమును త్రాగిన తేలుగఱచుటచేగలిగిన రక్తవమనము నివర్తించును.)

## ప్రభావతీవటికములు

హరిద్రా నింబపత్రాణి పిప్పలీ మరిచాని చ,
విళంగం భద్రముస్తా చ జీరకం విశ్వభేషజమ్. 21
చిత్రకం సైంధవం కుష్ఠం విషం పాఠా హరీతకీ,
ఏతాని సమభాగాని హ్యజామూత్రేణ పేషయేత్. 22
చణప్రమాణవటికా శ్ఛాయాశుష్కాశ్చ కారయేత్,
ఏకాముష్ణోదకైః పీత్వా విషూచీం చ వ్యపోహతి. 23
లూతవిస్ఫోటభేదం చ గోమూత్రేణ విలేపయేత్,
అష్టౌ తక్రేణ సేవేత సర్పదష్టవిషం హరేత్. 24
మహారక్తప్రవాహే తు శ్రీగంధేన సమం పిబేత్,
అర్కక్షీరయుతం లేప్యం వృశ్చికాదివిషం హరేత్. 25

హంతి పుష్పం చ పటలం రంభా కందరసాన్వితం,
కాకమాచీరసైః పీత్వా తిమిరాణి వినాశయేత్.
నీలికాయారసైర్యుక్తా రక్తాంగత్వం వినాశయేత్,
గుడేన మిశ్రితం భుక్త్వా వాతరోగం వినాశయేత్.
భృంగరాజరసైః పీత్వా శిరసో దాహనుద్భ్రశం,
తండులోదకసంమిశ్రం కాసకృచ్ఛ్రం వినాశయేత్.
గోమూత్రేణయుతం పీత్వా ప్లీహరోగం వినాశయేత్,
ఛాగక్షీరసమాయుక్తం వటికాం చాశ్వగంధికామ్.
పీత్వా మండలపర్యంతం రాజయక్ష్మ వినాశనం,

తా. మ్రానిపసపు, వేపాకు, పిప్పలి, మిరియాలు, వాయువిడంగములు, భ ముస్తెలు, జీలకఱ్ఱ, శొంఠి, చిత్రమూలము, సైంధవలవణము, చెంగల్వకోష్టు, అతిః చిరుబొద్ది, కరక్కాయ వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి మేకపంచితముః నూరి సెనగగింజలంత మాత్రలుజేసి నీడనెండించి యందొకదాని నుష్ణోదకముతో సే చిన విషూచియు, ఆవుపంచితముతో జాది లేపనము జేసిన లూత, విస్ఫోటకవ్రణ లును, ఎనిమిదిమాత్రల చల్లతో సేవించిన పాముకాటును, చందనానుపానముతో ద్రాగిన మిక్కుటముగ రక్తముగారుటయు, జిల్లేడుపాలతో జాది లేపనముజేసిన తే మొదలగువాని విషంబులును, అరటిగడ్డరసముతో జాది నేత్రముల కంజనమువేః కంటిపువ్వులును. పొరలును, కాచియాకురసానుపానముతోడ సేవించిన తిమిరరో బులును, నీలియాకురసముతోడ సేవించిన సర్వాంగముల రక్తముస్రవించుటయు, బెల్లః తోడ సేవించిన వాతరోగంబులును, గుంటగలగరాకురసానుపానముతోడ సేవింః శిరము మండుట (తలనొచ్చుట)యు, బియ్యపునీళ్ళతోడ సేవించిన క సాధ్యంబులగు దగ్గులును, ఆవుపంచితముతోడ సేవించిన ప్లీహరోగంబును, మేకపాలల పెన్నేరుగడ్డచూర్ణమును, ఈయౌషధమును గలిపి ఒకమండలముపఱకు సేవించిన రా యక్ష్మయుః నివర్తించును. (మఱియు నీప్రభావతివటికములు తేలు, పాము విషము హరింపంజేయుటయందు ప్రశస్తంబులు.)

### పులికోనుచికిత్స

క. వెలగయు నావయు ముద్దగఁ, గలయఁగ మర్దించియదియుఖాదము నేసి
న్నిలలో మనుజులఁగఱచిన, పులికోనులవిషము విఱిగిపోవు మహాత్మా

### తాటిజెఱ్ఱికి చికిత్స

గీ. ధారుణీచక్రమందునఁ దాటిజెఱ్ఱి, గొట్టెపామును మనుజులఁ గుట్టెనేః
తెల్లచౌటినుడక పెట్టి తేటనీరు, ద్రాగియదిగొట్టవలయునుదత్ స్థలమున

## విషప్రతివిషములు

సీసమాలిక:—

ఊడుగ గన్నేర్లకొగిఁ గరక్కాయలు పొత్తిగడ్డయు సొంటి పొందుమీఱు
జీడిగింజ దలంపఁ జెలఁగి మోదుగుపువ్వు ధర జెడ్డుపాలకుఁ దంగెడాకు
ముసిడికి నేరేడు మొగిలిచెక్కయు బొందుఁ గర్పూరమునకును గలగరాకు
నేరేడుపండ్లకు నెఱిదుగ్ధ మావకు నుసిరికపప్పు దా నుచితమగును
దేనె కాజ్యమునకు ధీరత నుదకంబుఁ జిక్కుఁ దమ్ములమునఁ జింతపండు
తాఁకిన జీడికిఁ దగ దూలకోవిల యుమ్మెత్తవెఱ్ఱి దా నుడుగువిధము
తామరచూర్ణము తగఁ బుల్లపావిలి పరఁగ నాక్షణమునఁ బచ్చికడుగు
తింత్రిణీఫలమునఁ దిలకింపఁ బసపును బెరుగుకు వేన్నీళ్ళు పెట్ట మేలు
మామిడిజీడికి మహినారికడపాకు స్థిరము సున్నమునకుఁ దిప్పతీఁగె
తెలికపిండికి నూనె తేటయటుకులగు సైంధవలవణంబు సరసమగును
సొంటి పిప్పళ్ళకు సొరిది మిర్యాలకు గ్రూలాటికడుగును గ్రోలగుణము
కడఁగి యనుములకెల్లగంధంబుసిద్ధంబు దూలింప దెగడకుఁ దుమ్మచెక్క
పెసలు బెల్లమునకుఁ బసచల్లగుమ్మడి యఱుఁగ నికరూటికి నావయంద్రు
నూనెయింగువకొప్పు గానఁ గేతకిరసంబడవిబీరకుముస్తల మఱియుండు
వత్సనాభులకెల్ల వరుసతో నాచిఱ్ఱి వెసఁ జేతరాసికి విరిగినార
కందకు దమలపా కందమై విలసిల్లుఁ బనసపంటికి సొంటి బాగునౌను
గనకబీజములకుఁ గడునిమ్మరసమును జీలకఱ్ఱ నిడుండు చెన్నుమీఱుఁ
గడునిమ్మపండ్లకు ఖర్జూరఫలమును పొసఁగ సున్నమునకుఁ బసపుశుద్ధి
నారికేళమునకు నలపరిబియ్యంబు మొనసి సువ్వాలకెల్ల మొగలిరసము
జిల్లేడుపాలకుఁ జెంచలినీలాకు పాషాణములకెల్లఁ బ్రత్తిగింజ
నల్లమందుకు సొంటి యల్లంబు సిద్ధంబు బలురక్కసికినెల్ల నులిమిడాకు
నేతికిఁ బులిచల్ల నేర్పుతో సంధిల్లు జిల్లకు ద్రాగుడు జిల్లగింజ

గీ. లనుచు నుగ్రవిషంబుల నవనినడఁచుఁ, జెలఁగుచును నిర్విషంబులఁ జెప్పి
రిట్లు, సిద్ధసారంబులందు దాఁ జెలువమైన, వైద్యశాస్త్రంబులందుల
వరుసఁ దెలిసి.

## సర్పదష్టలక్షణము

భ్రాంతిర్మూర్ఛాతిసారశ్చ శూలం వాంతిశ్చ కంపనమ్. 30

వాయువు శయనము వీనియందు పలుమారు ఇచ్ఛ, ద్వేషము, ఆవలింతలు కలుగుట, లేక శరీరము విరుచుట, శరీరమునొచ్చుట, శరీరము బరువుగనుండుట, గగుర్పొడుచుట, అన్నమునందు ఇష్టములేకుండుట, తమోగుణముకలుగుట, సంతోషములేకుండుట, చలి పెట్టుట-ఈలక్షణములు జ్వరము జనించుటకు ముందుగలుగు. ఇవి రాబోయ్యెడి వాత పిత్తశ్లేష్మజ్వరములకు సామాన్యలక్షణంబులు. వాతజ్వరములో తఱుచుగా ఆవలింతలు, పిత్తజ్వరములో నేత్రములయందుమంట, శ్లేష్మజ్వరములో అన్నద్వేషము కలుగు. ఇవి రాబోయ్యెడి జ్వరములకు విశేషలక్షణంబులు.

తస్యప్రాగ్రూపమాలస్య మరతిర్గాత్ర గౌరవం,
అస్యవైరస్యమరుచిర్జృంభాసాస్రాకులాక్షతా. 176
అంగమర్దో విపాకోల్పప్రాణతా బహునిద్రతా,
రోమహర్షోవీనమనం పిండికోద్వేష్టనంక్లమః. 177
హితోపదేశేష్వక్షాంతిః ప్రీతిరామ్లపటూషణే,
ద్వేషోనిస్వాదుభక్ష్యేషు తథా బాలేషు తృట్ భృశమ్. 178
శబ్దాగ్ని శీతవాతాంబు ఛాయోష్ణేష్వనిమిత్తతః,
ఇచ్ఛాద్వేషశ్చ తదపి జ్వరస్యావ్యక్తతా భవేత్. 179
(మాధవనిదానే

తా. ఆలస్యము, వస్తువులయందు ప్రీతిలేకుండుట, శరీరము బరువుగ నుండుట, నోటియందు నీరసత్వము, అరుచి, ఆవలింత, నేత్రములయందు నీరుకమ్ముట, శరీరమునందు పోట్లు, అజీర్ణము, శరీరదౌర్బల్యము, అధికనిద్ర, గగుర్పాటు, శరీరము విరుచుట, పిక్కలయందు నొప్పి, బడలిక, హితోపదేశములయం దసూయ, పులుసు ఉప్పు కారము వీనియందు ప్రీతి, మధురపదార్థములయందును బాలురయందును ద్వేషము, మిగుల దప్పి, శబ్దము, అగ్ని, శీతవాతము, శీతోదకము, నీడ, ఎండ వీనియందు కారణము లేకనే ఒకానొకపుడు ఇచ్ఛ ఒకానొకప్పుడు ద్వేషము ఇవి జ్వరమునకు పూర్వరూపం బులు. (అనఁగా జ్వరముకలుగుటకు ముందు పైలక్షణములు కలుగును.) పిదప జ్వరము ప్రకాశముగా కనుపించును.

వాతజ్వరలక్షణము

సర్వాంగదుఃఖం శిరసోఽతిఘాతో మందోష్ణమత్యుష్ణమితిప్రభావం,
కంపోవిబంధోమలమూత్రశుష్కం దంతోష్ఠభాగేత్వచికృష్ణవర్ణమ్.
విజృంభణం శీతమరోచకంస్యాద్విష్టంభనంబంధరుజాచ పార్శ్వే,

కాసశ్వాసౌ తీవ్రదాహో లక్షణం గద్గదస్వరః, (బ్రహ్మగారుడే)

తా. భ్రాంతి, మూర్ఛ, అతిసారము, శూల, వాంతి, వణుకు, కాసశ్వాసములు, తీవ్రమైనదాహము, హీనస్వరము-ఈలక్షణములవలన పాము గఱచిన దని తెలియ వలయును.

పుత్రజీవియోగము

పుత్రజీవీఫలే మజ్జా శీతతోయేన పేషయేత్. 31
లేపనే చాంజనే పానే నస్యే సర్వవిషాపహం,

తా. పుత్రజీవికాయలలోనిగుజ్జును శీతోదకముతో నూరి లేపనము జేసినను, నేత్రముల కంజనము వేసినను, లేక త్రాగినను, లేక నస్యము చేయించినను సర్వసర్పదష్టవిషములు హరించును.

విషహరచికిత్సలు

స్థావరం జంగమం చైవ కృత్రిమం యోగజం తథా. 32
నిష్కమాత్రం నసందేహో కాలదష్టోఽపి జీవతి,

తా. స్థావర, జంగమ, కృత్రిమవిషయములయం దొకనిష్కము పుత్రజీవి వేసమును ప్రతిదినమును సేవింపుచుండిన సర్వమైన పాములకాటు నివర్తించుటయేగాక కృష్ణసర్పాదులకాటును నిస్సంశయముగ నివర్తించును.

ముసలీ టంకణం పానే కాలదష్టోఽపి జీవతి. 33
కటుకా ముసలీమూలం పిబే త్తోయం విషాపహం,

తా. నేలతాటిగడ్డరసములో వెలిగారముగలిపి త్రాగిన కృష్ణసర్పదష్టుండైనను జీవించును. లేక చేతిబీరవేళ్ళు, నేలతాటిగడ్డలు-వీనిని నూరి రసముదీసి త్రాగిన సర్వవిషములు హరించును.

జలేన లాంగలీకంద నస్యే సర్వవిషాపహమ్. 34
వారిణా టంకణం పీత మథవార్కస్య మూలకం,

తా. చెన్నచర్లగడ్డ నుదకముతో నూరి నశ్యము జేయించినను, లేక తుంగగడ్డలు, వెలిగారము-వీనిని నూరి త్రాగినను, లేక జిల్లేడువేరును నూరి త్రాగినను సర్వవిషములు హరించును. (లేక నేలగుమ్ముడువేరు గంధమును భక్షించిన పేరులేని పాములవిషము హరించును. లేక పాపరవేళ్ళరసమునుగాని, ఈశ్వరచెట్టు సమూలరసమునుగాని, లేక చిట్టివేళ్ళరసమునుగాని త్రాగిన విషములు నివర్తించును. కాసరగడ్డను బిళ్ళలుగ దరిగి జిల్లేడుపాలతో నేడుమార్లుభావనచేసి నీడ నెండించి చింతగింజంత భక్షించిన సర్వవిషములు హరించును.

ఇతి సర్వవిషాదీనాం సర్వస్థానగతే తథా. 35

గోక్షీరై రజనీక్వాథం పిబే త్సర్వవిషాపహం,

తా. ఆవుపాలలో పచ్చిపసపు గలిపి కషాయముగాచి త్రాగిన సర్వస్థానముల జెందియుండు పాము మొదలగువానివిషము హరించును.

గోమూత్రై ర్నరమూత్రైర్వా పురాణేన ఘృతేన వా. 36
హారిద్రా పానమాత్రేణ విషం హంతి చరాచరం,

తా. పచ్చిపసపుపొడిని గోమూత్రముతోగాని, నరమూత్రముతోగాని, ప్రాత నేతితోగాని సేవించిన స్థావర జంగమాది సర్వవిషములు హరించును.

అశ్వగంధా మేఘనాదో గోమూత్రే మహిషాక్షికమ్. 37
గృహధూమయుతం లేపో శివకంఠవిషాపహం,

తా. పెన్నేరుగడ్డ, చిట్టివేరు, మహిసాక్షిగుగ్గిలము, కరుధూపము-వీని నావుపంచితముతో నూరి లేపనముచేసిన కాలకూటవిషముగూడా హరించును.

పంచాంగ మశ్వగంధాయాః ఛాగమూత్రేణ పేషయేత్. 38
లేపనా న్నేహసందేహో గోనసావిషనాశనం,

తా. పెన్నేరుసమూలమును మేకపంచితముతో నూరి లేపనముచేసిన దాసరి పాముగఱచిన విషము నిశ్చయముగ హరించును. (మఱియు అమావాస్య ఆదివారము నాఁడు భూతాంకుశపువేరును దెచ్చి దానిని పాముగఱచినచో గంధముదీసి అందు మూడు నూనెబొట్లు గలిపి త్రాగిన సర్పవిషములు హరించును.)

కర్కటీమూలలేపేన సర్పదష్ట స్సుఖీభవేత్. 39

తా. ఆగాకరవేరును నూరి లేపనముచేసిన సర్పవిషము హరించును.

అలాబుబీజంచ కరంజబీజం కోశాతకీబీజ శిరీషబీజం,
గోమూత్రపిష్టం పరమేతదిష్టం పానాదినా సర్పవిషాపహారమ్. 40

తా. చేదానుగపువిత్తులు, క్రానుగవిత్తులు, చేతిబీరవిత్తులు, దిరిసెనపువిత్తులు-వీనిని సమభాగములుగ నావుపంచితముతో నూరి ఆవుపంచితములోనే గలిపి త్రాగిన సర్వమైన పాములవిషము నివర్తించును.

శ్వేతార్కమూలం కుటజస్యమూలం కోశాతకీహింగు వచాసమేతం,
అజేనమూత్రేణకటుత్రయం చ పిష్టం విషంహంత్యపికాలకూటమ్. 41

తా. తెల్లజిల్లేడువేరు, కొడిసెపాల, చేతిబీరవిత్తులు, ఇంగువ, వస, త్రికటుకములు-వీనిని సమభాగములుగ మేకపంచితముతో నూరి మేకపంచితములోనే గలిపి త్రాగిన కాలకూటాది సర్వవిషములు హరించును. (మున్నూరు కరకాయల భక్షించిన సమస్తమైన పాములవిషము హరించును.)

## నేత్రాంజనము

తా. కుంకుడుపం డొకభాగము, మ్రుంగవిత్తులు ౨ భాగములు, మిరియాలు ౧౪ భాగము-వీనిని నిమ్మపండ్లరసముతో మర్దించి కణికలుచేసి కలితోగాని, నిమ్మపండ్లరసముతో గాని చాది కన్నులబెట్టిన సర్వమైన పాములవిషము, సుఖజన్నుల నిశ్చయముగ హరించును.

. సకలునకుఁ బక్షకునకును, బ్రకటముగ ననంతునకును బద్మకునకు వాసుకి శంఖపాల కర్కోటక ఘనపద్మకుల నాదటను వివరింతున్.

## అష్టఫణినిదాన, తద్బీజాక్షరౌషధంబులు

(ఆదివారమునాఁడు గఱచినపాము అనంతుఁ డనంబడును. అది గఱచినచోట పల విష ముండును. కావున మోగాలుమీఁద ఆ ఆ ఆ అనునక్షరముల వ్రాసి "అనంత గాలి హేలి విజయావిజయాయస్వాహా" అను మంత్రముతో నభిమంత్రించిన విషము నను. మఱియు నీమంత్రముతో డనే ఉప్పును, నూనెను మంత్రించి త్రాగించిన నాదివారమునాఁడు గఱచిన అనంతుఁ డనెడి పామువిషము దిగును. సోమవారమునాఁడు గఱచిన పాము వాసుకి యనంబడును, అది గఱచినచోట దాపల విషముండును. కావున మోకాటికీలుమీఁద ఆ ఆ ఆ అను నక్షరముల వ్రాసి "వాసుకి వాసుకి వాసుకి హేలి హేలి విజయాయస్వాహా" అనుమంత్రముతో మోకాలుమీఁద దిగమంత్రించి ౨౧ కరక్కాయలచూర్ణములో నెయ్యిగలిపి మంత్రించి త్రాగించిన సోమవారమునాఁడు గఱచిన వాసుకి యనుపామువిషము దిగును. మంగళవారమునాఁడు గఱచిన పాము పేరు తక్షకుఁ డనంబడును. అదిగఱచినచోట వెలపట విషముండును. కావున కంఠస్థానమునందు లి లి లి అనునక్షరముల వ్రాసి "తక్షక తక్షక తక్షక హేలి హేలి హేలి విజయాయ స్వాహా స్వాహా దిగు దిగు ఓం గురుప్రసాదం" అనుమంత్రముతో మంత్రించి వేపాకును, చెక్కనునూరి రసముదీసి పైమంత్రముతో నభిమంత్రించి త్రాగించిన మంగళవారమునాఁడు గఱచిన తక్షకుఁడనే పామువిషము దిగును. బుధవారమునాఁడు గఱచిన పాము కర్కోటకుఁడనంబడును. అదిగఱచినచోట దాపల విషముండును. కావున నాభిస్థానమున హా హా అనునక్షరమును వ్రాసి "కర్కోటకా హిలి హిలి విజయా విజయాయస్వాహా గురు ప్రసాదం" అని నాభియందు దిగమంత్రించి ఉప్పు, మిరియాలు, అనునవి నూరి నీళ్లలో గలిపి యభిమంత్రించి త్రాగించిన బుధవారమునాఁడు గఱచిన కర్కోటకు డను పామువిషము దిగును. గురువారమునాఁడు గఱచినపాము పద్మకుఁ డనంబడును అది గఱచినచోట వెలపట విష ముండును. కావున ఆ అనుబీజాక్ష

రము ను బొమ్మునవ్రాసి "పద్మాఖ్యా హిలిహిలి విజయాయస్వాహాదిగు దిగు ఓం గుసు ప్రసాదం" అని బొమ్మున దిగమంత్రించి పెన్నేరుగడ్డరసము నభిమంత్రించి త్రాగించిన గురువార మునాఁడు గఱచిన పద్మకుఁ డను పాముविషము దిగును. శుక్రవారమునాఁడు గఱచిన పాము మహాపద్మకుఁడనంబడును. అది గఱచినచోట దాపల విషముండును. కావున కంఠ మున ఆ అనే బీజాక్షరమునువ్రాసి "మహాపద్మకా హిలి హిలి విజయాయ స్వాహా" అనుమంత్రముతో కంఠమున దిగమంత్రించి ప్రాతచింతపండును నీళ్ళతో గలిపి యభి మంత్రించి త్రాగించిన శుక్రవారమునాఁడు గఱచిన మహాపద్మకుఁ డనే పామువిషము దిగును. శనివారమునాఁడు గఱచినపాము శంఖపాలకుఁ డనంబడును. అదిగఱచినచోట దాపల విష ముండును. కావున నేత్రములమీఁద ఓం అనే బీజాక్షరమును వ్రాసి "శంఖ పాల శంఖపాల హిలి హిలి విజయా విజయాయ స్వాహా" అనుమంత్రముతో నేత్ర ములపై నభిమంత్రించి బెల్లమును నీళ్ళలో గలిపి యభిమంత్రించి త్రాగించిన శనివారము నాఁడు గఱచిన శంఖపాలకుఁ డను పాముविषము దిగును. శనివారము ప్రొద్దుగూకగా గఱచినపాము సకలుఁ డనంబడును. అదిగఱచినచోట దాపల విష ముండును. కావున నడితలమీఁద ఓం అనుబీజాక్షరమును వ్రాసి "హరిహరి హిరిహిరి విజయావిజయా యస్వాహా" అనుమంత్రముతో నడితలమీఁద మంత్రించి నెయ్యి, అనుపకట్టు, బెల్లము అను వాని నేకముజేసి యభిమంత్రించి త్రాగించిన శనివారమునాఁడు ప్రొద్దుగూకి గఱచిన సకలుఁ డను పాముविषము దిగును. ఇటుల బ్రహ్మగారుడ మనే శాస్త్రమునందు అష్టఫణినిదానంబులు, తద్బీజాక్షరౌషధంబులు చెప్పంబడియెను. బీజాక్షరము వ్రాసిన చోటనే మంత్రించవలయును.)

### సర్వపాముల కాటుకు మంత్రము

అఘోనాగోనేళ్లో చిత్తబారోబోడా తేరో జాతిజింటిపిరి కావాసర్పోవికా టూలూరేనో జ్యాణేతో జాతిఈశ్వరపార్వతింకరో కోటికోటిఆజ్ఞ.

### తేలుమంత్రము

ఊరికి ఉత్తరాన ఉమ్మగిరిపర్వతం పర్వతంమీద చెట్టుక్రిందపుట్ట పుట్టలో మున్నూరుముచ్చు తేళ్లు, నన్నూరు నల్ల తేళ్లు, ఏనూరు ఎఱ్ఱ తేళ్లు, ఆర్నూరు అకు తేళ్లు, అందులో ఒక తేలు నిప్పైకుట్టు నీరై దిగు మీగురువున్లేరు నాగేంద్రుడాన చల్లగదిగు.

యఃకృత్తికాపూలమఖావిశాఖా సార్పాంతకార్ద్రాగ్రిసుభుజంగదష్టః,
సవైన తే యేనసురక్షితో౽పి ప్రాప్నోతిమృత్యుం భయదం మనుష్యః.

తా. కృత్తిక, మూల, మఖ, విశాఖ, ఆశ్లేష, భరణి, ఆర్ద్ర నక్షత్రములయందు పాముచే గఱవబడినవాఁడు గరుత్మంతునిచే రక్షింపంబడినను మృతిజెందును.

(సర్వసర్పవిషమునకు నాగముసిడిని నూరి త్రాగింపవలయును.)

పొడపాములవిషమునకు చికిత్స:—తిప్పతీఁగెవేరు, నాగమల్లెవేరు, ఊడుగవేరు, పుట్టపొదరువేరు, వస్త్రఘాలితపువేరు, నీలివేరు, తీఁగెముషిణివేరు, మిరియాలు - వీనిని సమభాగములుగ నుదకముతో నూరి కుంకుడుగింజలంత మాత్రలుజేసి రేపుమాపుఒక్కొక మాత్ర నుష్ణోదకముతో సేవించిన పొడపాములవిషము హరించును. పథ్యము - వేనీళ్లన్నము భుజింపవలయును.

వాపునకు:—జిల్లేడాకునుగాని, మారేడాకునుగాని నూరి కలితో నుడికించి ముద్దజేసి కట్టుగట్టి పిదప దిరిసెనపాకు, పుట్టపొదరాకు, జిల్లేడాకు అను వానిరసములలో మిరియపు చూర్ణము గలిపి వాపుపై లేపనముజేసిన పాముకాటువలన గలిగినవాపు నివర్తించును.

గాయమునకు చికిత్స:—జెముడువేరు, పుట్టపొదవేరు, జిల్లేడువేరు, నాగమల్లె వేరు, తీఁగెముషిణివేరు, పగిమవేరు, ముషిణిచిగుళ్ళు-వీనిని సమభాగములుగ గ్రహించి మెత్తగనూరి ముద్దజేసి చిట్టాముదములోగలిపి లేహ్యపక్వముగనుడికించిఅందుమిరియాలు, చెంగల్వకోష్టు, కాచు అనువానిచూర్ణమును మూడుభాగములు గుగ్గిలచూర్ణమును మూడు భాగములు గలిపి మర్దించి గాయముపై నునిచి కట్టుగట్టిన పాముకాటువలన గలిగిన గాయము మానును. కల్మషం బుండిన క్షోతమందు వేయవలయును.

ఉల్లిపాము కాటునకు చికిత్స:—తిప్పతీఁగె, నాగముషిణివేరు, మారేడువేరు, ఇందుపువేరు,సెరిజవేరు, నీలివేరు, దిరిసెనపువేరు, తెల్లజిల్లేడువేరు, మిరియాలు-వీనిని సమభాగములుగనుదకముతో నూరి ఇందుపుకాయగింజలంతమాత్రలుజేసి యందొకదానిని సేవించిన ఉల్లిపాముపిషము నివర్తించును. పథ్యము—చప్పిడి.

విషము కక్కుటకు చికిత్స:—కుంకుడువేరును నూరి కుంకుడుగింజంత సేవించిన విషము కక్కును.

## త్రయోవింశప్రకరణమ్.



# చతుర్వింశప్రకరణము

## ఉన్మాదరోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లో. అంబికాపతి మీశానం చంద్రశేఖర మచ్యుతం,
భస్మోద్ధూళితసర్వాంగం నీలకంఠ మహం భజే. 1

తా. పార్వతీవల్లభుఁడు, జగన్నియామకుఁడు, చంద్రునిశిరమున ధరించినవాఁడు, నాశరహితుఁడు, సర్వాంగమున భస్మము నలదికొనినవాఁడు నగు నీలకంఠుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేరొ్కనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథము యొక్క చతుర్వింశప్రకరణమును వచియింపుచున్నాఁడను.

### జ్వరకర్మవిపాకము

నీచస్థితస్య భానోర్దశాక్షీ నాశోజ్వరశ్శిరోరోగః,
బంధనమహోగ్రపీడా కుష్ఠస్య చ దర్శనం చిహ్నమ్. 3
క్షీణేందుదశాయామప్యేవమ్. (జ్యోతిశ్శాస్త్రే)

తా. నీచుఁడుగనుండు సూర్యదశయందును, క్షీణచంద్రదశయందును, నేత్రనాశనము, జ్వరము, శిరోరోగము, బంధనము, భయంకరమైనపీడ, కుష్ఠురోగము మొదలగునవి గలుగును.

సుహృద్బంధుసమాయోగో భూనిమిత్తం కలిర్భవేత్,
దేహపీడా జ్వరో వ్యాధి శ్శిఖిమధ్యగతే బుధే. 4
శనేరంతర్గతేప్యేవమ్, తద్దోషకృతనిరాకృతయేజపహోమాదికంకుర్యాత్.

తా. కేతుదశయందు బుధాంతర్దశ వచ్చియుండునపుడు స్నేహితులు, బంధువులు అనువారిసంబంధము, భూవిషయమునందు కలహము, శరీరపీడ, జ్వరము, వ్యాధి గలుగును. మఱియు శనిదశయందు బుధాంతర్దశ వచ్చియుండఁగా పైఫలములే గలుగును. ఈయుపద్రవములు నివర్తించుటకై జపహోమాదులను జేయవలయును.

వాక్యమ్. యేపునః పూర్వజన్మని క్రూరాః పిశునా స్తత స్తేఽన్యజన్మని
సతతం జ్వరిణస్స్యుః. (కర్మవిపాకే)

తా. పూర్వజన్మమునందు క్రూరుఁడై దుష్టుఁడైయుండువానికి తత్సంబంధపాతకమువలన రెండవజన్మమునందు సంతతజ్వరము గలుగును.

శీతజ్వరకర్మవిపాకము

యేపునః క్రూరకర్మాణః పాపాః పిశునచేతసః,
తే భవేయు స్సదా శీతజ్వరవంత స్తదేనసా. 7

తా. క్రూరకర్మలసేయువాఁడు, పాపాత్ముఁడు, కొండెకాఁడు-ఇట్టివారికెల్లపుడు, శీతజ్వరము గలుగును.

శీతజ్వరశమనోపచారము

శాంతయేఽయుతసంఖ్యాకం ప్రకుర్యా త్ప్రియతో జపం,
జాతవేదసమంత్రేణ బ్రాహ్మణాన్ భోజయే త్తతః. 8
సురామాంసోపహారై ర్వా బలిస్సర్వత్ర శస్యతే,
సహస్రకలశస్నానం శతభోజనమేవ చ. 9
శీతజ్వరే పునః కుర్యా దభిషేకం హరేర్బుధః,

తా. పైఁజెప్పఁబడిన శీతజ్వరశమనార్థంబై "జాతవేదసే" అనుమంత్రమును పదివేలమార్లు జపించి బ్రాహ్మణభోజనమునుగాని, లేక మద్యము, మాంసము అనువానివలన బలిదానముగాని జేయించవలయును. లేక వేయి కలశముల యుదకముతో దేవునికి నభిషేకమును సేయవలయును. లేక నూరుబ్రాహ్మణులకు భోజనంబైన నిడవలయును. లేక విష్ణువు నభిషేకమునైనను జేయించవలయును.

సహస్రకలశస్నానం రుద్రే ణేశస్య కారయేత్. 10
బ్రాహ్మణా న్భోజయే చ్ఛక్త్యా జపేద్వా జాతవేదసం,

తా. శివునికి వేయి కలశములచే రుద్రాభిషేకము జేయించి శక్త్యనుగుణ్యముగ బ్రాహ్మణులకు భోజనం బిడవలయును లేక "జాతవేదసే" అనుమంత్రజపమునేని జేయింపవలయును.

జ్వరవైదికోపచారము

వేదానాం శ్రవణం హితస్యచరణం విప్రస్యసంతర్పణం
కృష్ణస్యస్మరణం శుభస్యకరణం ద్రవ్యస్యసంతర్పణం,
అశ్వత్థభ్రమణం సురత్నధరణం దీనస్యసంరక్షణం
హన్యాదష్టవిధం జ్వరం కుముదినీనాథోయథోగ్రం తమః. 11

తా. వేదశ్రవణము, హితకరకార్యము, బ్రాహ్మణభోజనము, శ్రీకృష్ణస్మరణ, శుభకార్యము, ద్రవ్యదానము, అశ్వత్థప్రదక్షిణము, ఉత్తమరత్నధారణము, దీనుల పోషిం

చుట అనునుపచారములు "చంద్రుఁ డంధకారమును నశింపం జేయుం మాడ్కి" అష్టవిధ జ్వరముల నశింపఁజేయును.

సహస్రనేత్రస్యసహస్రబాహో స్సహస్రవక్త్రస్యసహస్రమూర్ధ్నః,
సహస్రపాదస్యసహస్రనామ్న స్సహస్రనామ్నాంపఠనం జ్వరఘ్నమ్

తా. వేయినేత్రములు, బాహువులు, ముఖములు, శిరములు, పాదములు, నామములుగల విష్ణుసహస్రనామపఠనము జేసిన జ్వరము నశించును.

గణేశ్వరోవా గరుడేశ్వరోవా గౌరీశ్వరోవా దివసేశ్వరోవా,
మహేశ్వరీవా కులదైవతంవా తత్పూజనం తజ్జ్వరిణాం ప్రశస్తమ్.

తా. గణేశుఁడు, విష్ణువు, శివుఁడు, సూర్యుఁడు, గౌరి, లేక కులదేవత అనువారిలో నెవరి నేని బూజించుటవలన జ్వరము నశించును.

## అతిసారకర్మవిపాకము

స్మార్తాగ్నిం శమయేద్యస్తు సోఽతిసారయుతో భవేత్,
అగ్నిరక్షేత్సృచం జప్త్వా దశాంశం జుహుయాత్తిలాన్. 14
సర్పిషాచాప్లుతా న్దద్యా ద్ధిరణ్యం బ్రాహ్మణాయ వై,
అగ్నిరక్షేతి యాఋుక్చ తారతమ్యేన తాం జపేత్. 15

తా. బ్రాహ్మణులుమొదలగువారి స్మార్తాగ్ని నార్చినవానికి అతిసారరోగము జనించును. దానిశమనార్థంబై "అగ్నిరక్ష" అనురుచమును రోగతారతమ్యము నెఱింగి జపించి ఘృతయుక్తముగ తిలలతో దశాంశహోమమును, బ్రాహ్మణునకు సువర్ణదానము జేయవలయును.

అతిసారీ సభవతి యస్త్రేతాగ్నివినాశకః,
సువర్ణేనాథ తామ్రేన కుర్యా త్ప్రతికృతిం బుధః. 16
వహ్నే శ్శక్త్యనుసారేణ పలేనార్ధేనవా పునః,
తథా జ్వాలాకులాం రక్తచందనేన విలేపితామ్. 17
రక్తవస్త్రేణ సంవీతాం మేషస్యోపరిసంస్థితాం,
రక్తమాల్యైశ్చ సంఛన్నాం ముక్తాదామపరిష్కృతామ్ 18
కనకాచలవర్ణాభాం ద్వాదశార్కనిభాం శుభాం,
బ్రహ్మచర్యాన్వితే విప్రే కర్మనిష్ఠేఽగ్నిహోత్రిణి. 19
అంగులీయకవస్త్రాద్యై ర్భూషితే తాం నివేదయేత్,
మంత్రేణానేన విధివ దగ్నిప్రీత్యర్థమాదృతః. (మతాంతరే) 20

తా. అగ్నిత్రయమును నశింపంజేయువానికి అతిసారము జనించును. దాని నివా ణార్థంబై సువర్ణపర్వతముతో సమానమైన కాంతి, ద్వాదశసూర్యులవంటికాంతిగ అగ్నిప్రతిమను శక్త్యనుగుణ్యముగ నరపలమెత్తుబంగారుతో గాని, తామ్రముతో గా మేషవాహానయుక్తముగ జేయించి రక్తచందనము, ఎఱ్ఱవస్త్రము, ఎఱ్ఱని పుష్పమా కలు, ముత్తియములహారము అనువానితో నలంకరించి పిదప బ్రహ్మచారినిగాని, శ కర్మనిష్ఠుఁడగు ఆహితాగ్ని విప్రునిగాని, ఉంగరములు, వస్త్రములు మొదలగువానిచే నల కరించి పూజించి "శ్లో. త్రేతారూపోఽగ్నిరీడ్య స్త్వమంతతశ్చాసివైనృణామ్, త్వ వేదప్రాక్తనం పాత మతిసారం వినాశయ, ఏవంకృత్వా నరస్సమ్య గతిసారం వ్యప హాతి, నీరుజస్సుఖీనిత్యం దీర్ఘమాయుశ్చ విందతి" అను మంత్రముతో దానము జేం వలయును.

స్త్రీహంతా వాతిసారీస్యా దశ్వత్థాన్ రోపయేద్దశ,
దద్యాచ్ఛ శర్కరాధేనుం భోజయేచ్చ శతంద్విజాన్. 2

(గ్రంథాంతరే

తా. స్త్రీహత్యజేసినవానికి అతిసారరోగము జనించును. తన్నివారణార్థంబై ప యశ్వత్థవృక్షముల స్థాపనముజేసి శర్కరాధేనుదానమును, నూరుబ్రాహ్మణులకు సంతర ణముజేయవలయును. (శర్కరాధేనుదానవిధానము రాజయక్ష్మప్రకరణమున జెప్ప బడియున్నయది.

## సంగ్రహణీకర్మవిపాకము

అనన్యగతికాం భార్యా మదుష్టాం కారణం వినా,
పరిత్యజతి యస్సోఽపి గ్రహణీరోగవా న్భవేత్. 2

తా. *అనన్యగతిగలదై పవిత్రముగనుండుభార్యను కారణములేకనే వర్జించెడ దుష్టమనుజునకు సంగ్రహణిరోగము జనించును.

## సంగ్రహణీరోగశాంతి

శివసంకల్పసూక్తస్య జపస్యాత్తత్ర శాంతయే,
అష్టోత్తరసహస్రం హి హిరణ్యంచ తథా మధు. 2
దద్యా ద్విత్తానుసారేణ సౌరమంత్రజప స్తథా,
ధేనుం సలక్షణాం దద్యా ద్వస్త్రాభరణసంయుతామ్. 2
పయస్వినీం గుణోపేతాం బ్రాహ్మణాయ కుటుంబినే,
వత్సాభరణసంయుక్తాం వస్త్రేణాభరణేనచ, 2

---

* గత్యంతరములేక.

తా. సంగ్రహణీరోగశమనార్థంబై శివసంకల్పసూక్తమును ౧౦౦౮ మార్లు జపించి బ్రాహ్మణులకు సువర్ణమును, తేనెను శక్త్యనుసారముగ నొసంగవలయును. అటులనే సౌరమంత్రమునుకూడ జపింపవలయును. మఱియు సలక్షణ వస్త్రాభరణయుక్తంబై గుణసంపత్తి, పాలుగలగోవును, వస్త్రాభరణములచే నలంకరింపఁబడిన నాయావు దూడను, కుటుంబియగు బ్రాహ్మణునకు దానం బియ్యవలయును.

### గుదరోగకర్మవిపాకము

సురాలయే జలేవాపి సకృద్ద్వేషం కరోతి యః,
గుదరోగో భవేత్తస్య పాపరూప స్సుదారుణః. 26
మాసం సురార్చనేనైవ గోదానద్వితయేనచ,
ప్రాజాపత్యేనచైకేన శామ్యంతి గుదజారుజః. 27

తా. దేవాలయమునుగాని, లేక ఉదకమునుగాని నశింపఁజేసినవానికి భయంకరమైన గుదరోగము జనించును. తన్నివారణార్థంబై ఒక మాసము దేవపూజనుజేసి రెండు గోదానములను, ప్రాయశ్చిత్తార్థముగ నొకప్రాజాపత్యకృచ్ఛ్రము నియ్యవలయును.

### అర్శోరోగకర్మవిపాకము

దత్వాథ వేతనం యోఽధ్యేత్యాద్దాయాపిచ వేతనం,
అధ్యాపయేచ్చ జుహుయా జ్జపేద్వార్శోయుతో భవేత్. 28

తా. వేతనమునిచ్చి యధ్యయనము జేసినవానికిగాని, లేక వేతనముతీసికొని యధ్యయనము జెప్పినవానికిగాని, లేక ద్రవ్యమునుదీసికొని హోమముజేసినవానికిగాని అర్శోరోగము జనించును.

### స్వర్ణధేనుదానము

బోధాయనోక్త మథవా స్వర్ణధేనుం ప్రకల్పయేత్,
సౌవర్ణీం గాం ప్రకుర్వీత పలేనార్ధపలేనవా. 29
విత్తశాఠ్యం నకుర్వీత కుర్వన్నైవఫలం లభేత్,
స్వర్ణశృంగీ రౌప్యఖురాం నానావస్త్రైరలంకృతామ్. 30
గ్రహాణాం ప్రీణనార్థాయ నవధాన్యాని నిక్షిపేత్,
హోమస్తు పూర్వవత్కార్యో గోవిందః ప్రియతామితి. 31
ఇదం విష్ణుః ప్రతద్విష్ణుః విష్ణోర్నుక మతిబ్రువన్,
సమిధాజ్యచరూ న్హుత్వా పూర్ణాహుత్యంతమాచరేత్. 32
తతస్స్నాత శ్శుచీరోగీ బ్రహ్మణం వేదపారగం,

రోమాంచకంవాంతి రుజావనాహం ప్రలాపనంమూర్ఛనకం విదాహః,
అత్యంతశైత్యం హ్యతిమూత్రఘాతః పదాతిశూలం నఖశోషణంచ.
(మాధవనిదానే)

తా. అవయవములయందు పోట్లు, అధికముగా తలనొచ్చుట, శరీరము ఒకింత ష్ణముగనేని, లేక కడునుష్ణముగనేవి ఉండుట, శరీరమువణుకుట, మలమూత్రములు లకుండుట, మలమూత్రములు శుష్కించి యొకింత వెడలుట, దంతములు పెదవులు ము నలుపుబారియుండుట, ఆవలింతలు, లేక ఒడలువిరుచుట, చలిబెట్టుట, అరుచి, ము బద్ధకించుట, ఒక పార్శ్వము కట్టివేసినట్టుండుట, గగుర్పొడుచుట, వాంతి, పుబ్బుట, ప్రలాపము, మూర్ఛ, విదాహము, కడుశైత్యము, అధికముగా *మూత్రా తము, పాదములు నఖములు వీనియందుపోట్లు, శూల-ఈలక్షణములు గలది వాతజ్వర తెలియవలయు.

వేపథుర్విషమో వేగః కంఠోష్ఠముఖశోషణం,
నిద్రానాశః క్షవః స్తంభో గాత్రాణాం రౌక్ష్యమేవచ. 182
శిరోహృద్గాత్రరుగ్వక్త్ర వైరస్యం గాఢవిట్కతా,
శూలాధ్మానే జృంభణంచ భవంత్యనిలజే జ్వరే. 183
(గ్రంథాంతరే)

తా. శరీరకంపము అనియతకాలమున జ్వరాధిక్యము కలిగి అవయవములు ఒకింత ఉష్ణముగ, శీతలముగ నుండుట, కంఠము పెదవులు ముఖము వీనియందు శోష, నాశము, తుమ్ములు, స్తబ్ధత్వము, అవయవములయందు చురుకు, శిరము హృదయము ము వీనియందు వేదన, నోరు వగరుగ నుండుట, మలము పెంటికలుకట్టుట, శూల పుబ్బరము ఆవలింతలు-ఈలక్షణములుగలది వాతజ్వర మని తెలియవలయు.

ఆగమాపగమక్షోభ మృదుతావేదనోష్మణాం,
వైషమ్యం తత్రతత్రాంగే తాస్తాస్యు ర్వేదనాశ్చలాః 184
పాదయోస్సుప్తతా స్తంభః పిండికోద్వేష్టనం క్లమః,
విశ్లేషఇవసంధీనాం సాదఊర్వోః కటిగ్రహః. 185
పృష్ఠం క్షోభమివాప్నోతి నిష్పీడ్యత ఇవోదరం,
భిద్యంత ఇవ చాస్థీని పార్శ్వాంగాని విశేషతః. 186
హృదయస్య గ్రహస్తోదో గ్రాజనేవైవ వక్షసః,

* మూత్రాఘాత మనఁగా-మూత్రము మిగుల బద్ధకించి కడుస్వల్పమయి వెడలుట.

శ్రుతవృత్తోపసంపన్న మనుద్వేగకరం నృణామ్. 33
భక్త్యాయుక్త స్సమానీయ పూజయేత్ప్రీతిపూర్వకం,
అంగుళీయకవస్త్రాద్యై రుపానచ్ఛత్రకై రపి. 34
మంత్రేణానేన పాత్రేఽస్మిన్ దద్యాద్రోగీజితాత్మవాన్,
గోవిందం మనసా ధ్యాయ న్గవాం మధ్యే స్థితం విభుమ్. 35
బర్హాపీడేనసంయుక్తం వేణువాదనతత్పరం,
గోపీజనైః పరివృతం వన్యపుష్పావతంసకమ్. 36
గోవింద గోపీజనవల్లభేశ కంసాసురఘ్న త్రిదశేంద్రవంద్య,
గోదానతృప్తఃకురుమేదయాళో వ్యర్శస్యనాశంక్షుపితారివర్గ. 37
దానేనానేన విధివ దర్శసో జాయతే క్షయః,

తా. ఒక పలము బంగారుతోగాని, లేక అర్ధపలము బంగారుతోగాని నొక గోవును జేయించి దానికి బంగారుకొమ్ములు, వెండిగిట్టలు కల్పించి వస్త్రపుష్పాదులతో నలంకరించి షోడశోపచారములచే బూజించి నవగ్రహప్రీత్యర్థముగ నవధాన్యములనునిచి నవగ్రహముల బూజించి "ఇదంవిష్ణుః ప్రతద్విష్ణుః విష్ణోర్నుకం" అనుమంత్రత్రయముచే సమిధాజ్యచరువుల ౧౦౦౦ల మార్లుగాని లేక ౧౦౮ మార్లుగాని రోగతారతమ్యాను గుణముగ విష్ణుప్రీత్యర్థమై హోమముజేసి పూర్ణాహుతి నొసంగి హోమమును పరిపూర్తి జేసి తదనంతరము రోగి స్నానముజేసి పరిశుద్ధుఁడై వేదపారగుఁడు, శాస్త్రజ్ఞానాచారసంపన్నుఁడు, శాంతుఁడునగు బ్రాహ్మణునికి అంగుళ్యాభరణ వస్త్రఛత్రోపానహాదుల నొసంగి గంధపుష్పాదులచే బూజించి విష్ణుభక్తిగలవాఁడై "గోవిందం మనసా ధ్యాయన్" అను మంత్రముచే స్వర్ణధేనువును, నవగ్రహధాన్యములను దానముజేసిన అర్శోరోగము నివర్తించును.

## మందాగ్నిహరవిధి

మందోదరాగ్నిర్భవతి సతిద్రవ్యేనవై యజేత్. 38
ప్రాజాపత్యత్రయం కృత్వా భోజయేత్సశతం ద్విజాన్,

తా. ద్రవ్యముండునపుడు వైశ్వదేవాదినిత్యయజ్ఞముల జేయకుండినవానికి అగ్నిమాంద్యరోగము గలుగును. తన్నివారణార్థంబై మూడుప్రాజాపత్యకృచ్ఛ్రప్రాయశ్చిత్తముల జేసికొని నూరు బ్రాహ్మణులకు భోజనం బిడవలయును.

గోమాంసభక్షణో మంద జఠరాగ్నిర్భవేన్నరః. 39
ప్రాజాపత్యం చరేత్కృచ్ఛ్ర మతికృచ్ఛ్రం తథైవచ,
అగ్నిమంత్రం జపేన్నిత్యం శ్రీసూక్తంచ విచక్షణః. (పారాశరే)40

తా. గోమాంసమును భక్షించినవానికి అగ్నిమాంద్యరోగము గలుగును. తన్నివారణార్థంబై ప్రాజాపత్యకృచ్ఛ్ర, అతికృచ్ఛ్రప్రాయశ్చిత్తములం జేసికొని "అగ్నిరక్షీతి" అనుమంత్రమును, శ్రీసూక్తమును జపింపవలయును.

అకారణం గరం దత్వా ప్రమారయతి యఃపునః,
సమందాగ్నిర్భవేదేవ మృతకల్పశ్చ జాయతే. 41
యాతేరుద్రేతిసూక్తేన చరుంచ జుహుయాద్ఘృతం,
అష్టోత్తరశతం సమ్యక్తత్పాపస్యాపనుత్తయే. 42
తామగ్నివర్ణామితిచ జపేత్సూక్తం సహస్రకం,
భోజయేద్బ్రాహ్మణా న్సమ్యక్చత్వారింశత్సుఖీభవేత్. 43
(కర్మవిపాకసంగ్రహే)

తా. నిష్కారణముగ నొకనికి విషంబిడి జంపినవాఁడు అగ్నిమాంద్యరోగపీడితుఁడై మృతతుల్యుఁడై జనించును. తద్దోషనివారణార్థంబై "యాతేరుద్ర" అనుసూక్తముచే అన్నాజ్యములతో అష్టోత్తరశతహోమమును జేయవలయును. మఱియు "తామగ్నివర్ణాం" అనుసూక్తమును సహస్రసంఖ్యజపము జేసి నలువదిబ్రాహ్మణులకు సంతర్పణము జేసిన సుఖము గలుగును.

## పాండురోగకర్మవిపాకము

దేవద్విజద్రవ్యహారీ పాండురోగీభవేన్నరః,
కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌకుర్యాచ్చ చాంద్రాయణ మతంద్రితః. 44
కుర్యాత్కూష్మాండహోమంచ స్వర్ణచంద్రేణవాససీ.
బ్రాహ్మణేభ్యో యథాశక్తి పాండురోగస్య శాంతయే. 45

తా. దేవబ్రాహ్మణుల ద్రవ్యము నపహరించినవానికి పాండు రోగము జనించును. తన్నివారణార్థంబై కృచ్ఛ్రాతికృచ్ఛ్రచాంద్రాయణకృచ్ఛ్రప్రాయశ్చిత్తములగాని, కూష్మాండహోమముగాని జేయవలయును. లేక చంద్రప్రతిమను స్వర్ణముతో జేయించి దానితోడ వస్త్రద్రవ్యముల శక్త్యనుగుణముగ బ్రాహ్మణున కియ్యవలయును.

## శిరోవేదనాసహితపాండురోగహరవిధి

అగ్నిష్టోమాదికర్మాణి ప్రక్రమ్య నసమాపయేత్,
సపాండురోగీ భవతి శిరోవేదనవాంస్తథా. 46
కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌకుర్యాచ్చ చాంద్రాయణ మతంద్రితః,
శతంచ భోజయేద్విప్రా న్మృష్టాన్నేన యథేప్సితమ్. 47

తా. అగ్నిష్టోమాదికర్మల నారంభించి పరిసమాప్తి జేయకుండినవానికి కపాల శూలయుక్తముగ పాండురోగము జనించును. తన్నివారణార్థంబై కృచ్ఛ్రాతికృచ్ఛ్రచాంద్రాయణ ప్రాయశ్చిత్తములగాని, నూరుబ్రాహ్మణులకు మృష్టాన్నయుక్తముగ సంతర్పణముగాని జేయింపవలయును.

కామలారోగకర్మవిపాకము

కామలీ భక్తచోరస్స్యా త్తస్య వక్ష్యామి నిష్కృతిం,
కుర్యాచ్చ పక్షిరాజానం విష్ణోర్వాహనముత్తమమ్. 48
సువర్ణేన యథాశక్త్యా పక్షయో ర్మౌక్తికద్వయం.
నాసికాయాం తథా వజ్ర ముత్తరీయంచ రాజతమ్. 49
ఏవంకృత్వా గరుత్మంతం ఘృతద్రోణో పరిన్యసేత్.
శ్వేతవస్త్రేణ సంవేష్ట్య శ్వేతమాల్యై స్సమర్చయేత్. 50
సర్వశాస్త్రార్థతత్వజ్ఞో వైష్ణవో ధర్మపాఠకః,
బ్రాహ్మణ స్త్వర్చితో భక్త్యా యజమానేన శక్తితః. 51
ఉపచారై ష్షోడశభి ర్ద్విజమభ్యర్చయేత్తథా,

తా. అన్నమును దొంగిలించినవానికి కామలారోగము జనించును. తన్నివారణార్థంబై యజమానుఁడు తనశక్త్యనుగుణముగ బంగారులో విష్ణువాహనమైన గరుడపక్షిని జేయించి దాని రెండుఱెక్కలపై రెండుముత్తియములగట్టించి నాసికమున నొక వజ్రమును జెక్కించి రజతవస్త్రముతో నలంకరించి ద్రోణప్రమాణ ఘృతముపై నునిచి తెల్లనివస్త్రమును ధరింపంజేసి తెల్లనిపువ్వులచేతను, షోడశోపచారములచేతను గరుత్మంతుని బూజించి సర్వశాస్త్రతత్వజ్ఞానముగలిగి ధర్మపఠనము సేయునట్టి విష్ణుభక్తుని శక్త్యనుగుణముగ వస్త్రాభరణాదులచే నలంకరించి దానము సేయవలయును.

ప్రతిమాదానము

పీతాంగః కామలారోగః కపాలముసలాన్వితః. 52
పూజావిధానం త్వాతంక దేవదాతేత్యుదాహృతః,

తా. కామలారోగపీడితుఁడు కాంతియందు పసపుఛాయగలదిగ, హస్తములో కపాలముసలములు ధరించునట్టిదిగనుండు ఆతంకదేవీప్రతిమను జేయించి దానిం బూజించి బ్రాహ్మణునకు దాన మొసంగవలయును.

రక్తపిత్తకర్మవిపాకము

మద్యపోరక్తపిత్తీస్స్యా త్సదద్యా త్సర్పిషాఘటమ్. 53
మధునోఽర్ధఘటంచైవ సహిరణ్యం విశుద్ధయే,

తా. మద్యపానము సేయువానికి రక్తపిత్తరోగము జనించును. తన్నివారణార్థంబై ఒకకుండనిండ ఘృతమును, దానితో నర్ధకుండతేనెను సువర్ణయుక్తముగ దానము జేయ వలయును.

చంద్రక్షేత్రే యథా భౌమో జాయతే మనుజస్తథా. 54
రక్తపిత్తేన దుర్నామ్నా నానావ్యాధిసమాకులః. (జ్యోతిశ్శాస్త్రే)

తా. జననకాలమున చంద్రక్షేత్రమున అంగారకుఁడుండిన రక్తపిత్తము, అర్శస్సు మొదలగు పలువిధరోగములు జనించును.

రక్తపిత్తం జ్వరం దాహ మగ్నివాయ్వోరుపద్రవమ్. 55
లభతే నాత్ర సందేహ శ్చంద్రమధ్యే యథా కుజః,
భౌమమంత్రజపఃకార్యో హోమఃఖాదిరజైస్తిలైః. 56
ఘృతేనచ సమాయుక్తైః దానం రక్తవృషస్యచ,
(మతాంతరే)

తా. చంద్రమధ్యమున కుజుఁడు వచ్చియుండ రక్తపిత్తము, జ్వరము, దాహము, అగ్నివాతము అనువానియొక్క యుపద్రవంబులు గలుగును. తన్నివారణార్థంబై అంగారకమంత్రజపమును, చండ్రసమిధలు, నువ్వులు, నెయ్యి అనువానితో హోమమును ఎఱ్ఱని యెద్దుదానమును జేయవలయును.

## జ్యోతిశ్శాస్త్రోక్తచికిత్స

బిల్వచందనబలాశణపుష్పై ర్హింగులూకఫలినీవకులైశ్చ,
స్నానమద్భిరిదమగ్నియుతాభి ర్భౌమదూషణనివారణమాశు.

తా. బిల్వము, చందనము, ముత్తవపులగము, శణపుష్పము. హింగుళము నల్లఅత్తి, పొగడకాయలు అనువానియుక్తముగ నుదకమునుగాచిస్నానముజేయించిన చంద్రస్థానగత అంగారకదోషము శమించును.

## క్షయరోగకర్మవిపాకము

బ్రహ్మహాక్షయరోగీస్యాత్ స్త్రీయాస్యా త్క్షేత్రమారణే. 58

తా. బ్రహ్మహత్యవలనగాని, క్షేత్రము, తోట, స్త్రీలు మొదలగువానిని నశింపంజేయుటవలనగాని క్షయరోగము జనించును.

## కదలీదానము

కారయేత్కదళీం దివ్యాం పత్రైస్సర్వత్ర సంయుతాం,
ఫలపూగేన సంయుక్తాం సువర్ణస్య పలేనతు. 59

బ్రాహ్మణా న్భోజయేచ్చాపి భక్ష్యై ర్నానావిధై శ్శుభైః. 60
హోమంచ కారయే త్తత్ర పూర్వవద్బ్రాహ్మణేనచ,
తస్మై తాం కదళీం దద్యా ద్వస్త్రాలంకారపూర్వికామ్.
పూజితాయ దరిద్రాయ ప్రశస్తాయా త్తవేదినే,
ధర్మజ్ఞాయాతిదాంతాయ మంత్రేణా నేన తాం క్షయీ. 62
హిరణ్యగర్భపురుష పరాత్పరజగన్మయ,
రంభాదానేన దేవేశ క్షయం క్షపయ మే ప్రభో. 63
పుణ్యాహవాచనం కార్యం బ్రాహ్మణై ర్వేదపారగైః,
శిష్టైరిష్టైర్బంధుభిశ్చ సహభోజనమాచరేత్. 64

తా. క్షయరోగి శక్త్యనుగుణముగ పలిమెడుబంగారుతో చుట్టుఆకులు, కాయలు, పువ్వులుగలిగియుండునటుల సుందరమైన యరటిచెట్టును జేయించి దాని చుట్టు వస్త్రమునుజుట్టి దారముతోబంధించి పలువిధపక్వాన్నములతోడ బ్రాహ్మణులకు భోజనంబిడి హోమముజేసి అలంకారపూర్వకముగ పూర్వోక్తమైన యరటిచెట్టును దరిద్రుఁడు, ప్రశస్తుఁడు, ఆత్మజ్ఞుఁడు, శాంతుఁడునైన బ్రాహ్మణుని పూర్వోక్త హిరణ్యగర్భాదిమంత్రములతో బూజించి దాన మొసంగి పిదప వేదపారగులగు బ్రాహ్మణులతోడ పుణ్యాహవాచనమును, ఉత్తమబ్రాహ్మణయిష్టబంధుపంక్తిభోజనమును జేయవలయును.

### బ్రహ్మచర్యాదియోగము

ధర్మశాస్త్రాణ్యవిజ్ఞాయ ప్రాయశ్చిత్తం దదాతి యః,
రాజయక్ష్మా భవేత్తస్య రోగః పీడాతిదారుణః. 65
పూర్వోక్తేన విధానేన ప్రదద్యా త్ప్రతిరూపకం,
రాజయక్ష్మాకృశతను శ్శంఖోపాసితతర్జనిః. 66
తథా త్రినేత్రో దంష్ట్రాభ్యాం తరుణో హేతిభిర్యుతః,

తా. ధర్మశాస్త్రము తెలియక ప్రాయశ్చిత్తమును విధించెడివానికి కడుభయంకరమైన పీడగల రాజయక్ష్మ జనించును. తన్నివారణార్థంబై పూర్వోక్తవిధానముతో కృశమైన శరీరముగలదై తర్జనితో శంఖమును బట్టికొనినట్టుగ, మూడునేత్రములుగలదిగ, కోరపండ్లతో నమలునదిగ, తరుణావస్థగలదిగ, ఆయుధముల ధరించినదిగనుండు క్షయరోగప్రతిమను జేయించి దానము చేయవలయును.

బ్రహ్మచర్యేణ దానేన తపసా దేవతార్చనైః. 67
సత్యేనాచారయోగేన రవిమండలసేవయా,

వైద్యవిప్రార్చనాచ్చైవరోగరాజోనివర్తతే. (జ్యోతిశ్శాస్త్రే) 68

తా. బ్రహ్మచర్యము, దానము, తపము, దేవపూజ, సత్యము, ఆచారము, సూర్య
జ, వైద్యబ్రాహ్మణపూజ అనువానివలన క్షయరోగము నివర్తించును.

కుష్ఠ కండూ వికారైశ్చ క్షయరోగ భగందరైః,
గజాదివాహనభయం భవేద్యస్యేనగే బుధే. (గ్రంథాంతరే) 69

తా. జననకాలమున సూర్యక్షేత్రమునందుగాని, లేక సూర్యునితోడగాని బుధుఁడు
ంధించియుండిన కుష్ఠువు, దురద, క్షయము, భగందరము, లేక ఏనుగుమొదలగు
ానములవలన భయము గలుగును.

## దేవపూజాదియోగము

చంద్రక్షేత్రే యదాచాంద్రిర్జాయతే యస్య జన్మని,
సజాతః క్షయరోగీస్యాత్కుష్ఠాదీసిచి పాండుతా. 70

తా. చంద్రక్షేత్రమునందు బుధయోగంబుండు లగ్నంబున జనించినవానికి క్షయ
ంబేని, కుష్ఠువు, పాండు మొదలగు రోగంబులేని జనించును.

## శాస్త్రార్థము

నిత్యం స్వదేవపూజా భక్తిర్భైషజ దేవతాగురుషు,
ఛాగలమాంసపయోశ్నన్ జీవతి యక్ష్మీ చిరం ధృతిమాన్. 71

తా. ప్రత్యహము ఇష్టదేవతాపూజ, ఔషధను, దేవగురుభక్తి, మేకపోతు
ంసభక్షణము, క్షీరపానము అనువానివలన క్షయరోగి చిరకాలము జీవించును.

## గీతాద్యుపాయము

గీతవాదిత్రకైస్త్విష్టైః ప్రియస్తుతిభిరేవచ,
హర్షణాశ్వాసనైర్నిత్యైర్గురూణాం సముపాసనైః. 72

తా. గీతవాద్యములు, ఇష్టకరపదార్థము, ప్రియకరమైనస్తుతి, ఆనందకరపదార్థ
ు, ఊరడింపుమాటలు, ప్రత్యహము గురూపాసన అను నుపాయంబులవలన క్షయ
ముును శమింపజేయవలయును.

## కాసకర్మవిపాకము

ద్రవ్యాణిచాల్పసారాణాం స్తేయం కృత్వాన్యవేషతః,
చరేత్సాంతపనం కృచ్ఛ్రమిత్యేవం మనురబ్రవీత్. 73

తా. దుర్బలునియొక్క ద్రవ్యమును దొంగలించువానికి కఫరోగము జనించును.
వారణార్థంబై సాంతపన, కృచ్ఛ్ర ప్రాయశ్చిత్తముల జేసికొనవలయునని మనువు
ంచెను.

త్రపుహారీచ పురుషో జాయతే శ్లేష్మలస్సదా,
ఉపోష్య దివసం సోఽపి దద్యాత్పలశతం త్రపు. (అన్యశాస్త్రే) 74

తా. తగరమును దొంగిలించినవానికి కఫరోగము జనించును. తన్నివారణార్థంబై ఒకదిన ముపవాసముజేసి నూరుపలములయెత్తు తగరమును దానము జేయవలయును.

నిత్యానుష్ఠానవిముఖః కఫరోగీ భవేన్నరః,
పరాభవం శుచాప్నోతీత్యాహ వై భగవాన్ యమః. 75
తచ్ఛాంతయే మాసమేకం యావకం భక్షయేన్నరః,
సహస్రనామపాఠశ్చ హోమశ్చాష్టోత్తరాయుతమ్. 76
సామమంత్రేణ కుర్వీత చర్వాజ్యంచ హవిర్భవేత్, (మతాంతరే)

తా. సంధ్యావందనాది నిత్యకర్మల జేయకుండినవానికి కఫరోగము జనించును. మఱియు కఫమువలనగాని, లేక శత్రువులవలనగాని పీడగలుగునని యముఁడు వచించెను. తన్నివారణార్థంబై, ఒకమాసమువఱకుయావకాన్నభోజనమును, విష్ణుసహస్రనామపఠనమును, సామమంత్రములతో నన్నాజ్యయుక్తముగ *అష్టోత్తరాయుతహోమమును జేయవలయును.

సూర్యేకుళీరజాతే బుధేనదృష్టివిగతనేత్రః,
కఫమారుతరోగార్తః పరస్వహారీవిలోలమతిచేష్టః. 77
(జ్యోతిశ్శాస్త్రే)

తా. జననకాలమున కర్కాటకరాశియందు సూర్యుఁడుండి బుధదృష్టియును కలిగియుండిన నష్టదృష్టిగలవాఁడుగనేని, కఫవాతరోగయుక్తుఁడుగనేని, లేక దొంగతనము, చంచలబుద్ధిగలవాఁడుగనేని, చంచలకర్మల జేయువాఁడుగనేని నగును.

## హిక్కాకర్మవిపాకము

యోకృత్వా బ్రాహ్మణో భుంక్తే స్నానహోమజపాదికం,
సహిక్కారోగసంయుక్త స్తత్పాపస్యాపనుత్తయే.
చాంద్రాయణత్రయం కుర్యాత్త్రీన్కృచ్ఛ్రాంశ్చ సమాచరేత్,

తా. స్నానము, హోమము, జపాదికర్మలనేయక భోజనము జేసినబ్రాహ్మణునకు హిక్కారోగము గలుగును. తద్దోషనివారణార్థంబై మూడుచాంద్రాయణములను, మూడు ప్రాజాపత్య కృచ్ఛ్రప్రాయశ్చిత్తములను జేయవలయును.

## శ్వాసకర్మవిపాకము

కృతఘ్నో జాయతే మర్త్యః కఫవాన్ శ్వాసకాసవాన్. 79

* పదివేల యెనిమిది.

ఉష్ణజ్వరీచ నిత్యంహి పిత్తరోగసమన్వితః,
చాంద్రాయణత్రయం కుర్యాత్పంచాశ ద్విప్రభోజనమ్. 80
విష్ణోర్నామజపం కుర్యాత్పంచాశ ద్విప్రభోజనం,
విష్ణోర్నామజపం కుర్యాత్తథాచైవద్విజోత్తమాన్. 81
పూజయేద్భోజయేద్దద్యాత్తస్మైనానాన్యమానసః,

తా. కృతఘ్నుఁడుగ నుండువానికి కఫము, శ్వాసము, దగ్గు, ఉష్ణజ్వరము, పిత్తరోగము గలుగును. తన్నివారణార్థంబై మూడుచాంద్రాయణ ప్రాయశ్చిత్తముల జేసి ఏబదిబ్రాహ్మణులకు భోజనంబిడి విష్ణునామములను జపించి బ్రాహ్మణుని పూజించి వానికి యథాశక్తిగ దక్షిణను దానముసేయవలయును.

కురుక్షేత్రాదిదేశేషు కాలేషు గ్రహణాదిషు.
మహాదానాని గృహ్ణీయాన్నిషిద్ధాన్యథవా స్వయం,
అపాత్రభూతో దాతృభ్యో నిషిద్ధేభ్యశ్చ మానవః. 83
సపామా శ్వాసకాసైశ్చ కుక్షిస్థకృమిభిస్తథా,
కండూత్యాచైవ పీడ్యేత తద్రోగస్య ప్రశాంతయే. 84
మహిషీం యమదైవత్యాం దద్యాద్విత్తానుసారతః,
కామ్యం యద్దీయతే దానం తత్సమగ్రం సుఖావహమ్. 85
అసమగ్రంతు దోషాయ భవతీహ పరత్రచ,
జపేన్నారాయణస్యాథ నామ్నాంచైవ సహస్రకమ్. 86
హిరణ్యం రక్తవాసాంసి పంచాశ ద్విప్రభోజనం,
సహస్రకలశస్నానం ప్రకుర్యాద్రోగశాంతయే. (హేమాద్రౌ)

తా. కురుక్షేత్రాదిపుణ్యదేశములో గ్రహణాదిపుణ్యకాలములయందు షోడశ మహాదానములనుగాని, నిషిద్ధవైతరణీగోదానాదులగాని జెందినను, అనర్హుఁడై దానమును జెందినను, నిషిద్ధులగువారలవలన దానమును జెందినను అట్టివారలకుగజ్జి, శ్వాసము, కాసము, కుక్షిరోగము, కృమిరోగము, దురద గలుగును. తన్నివారణార్థంబై యమదేవతాక. మహిషీదానమును తనవిభవానుసారముగజేయవలయును. కామ్యకర్మనుసంపూర్ణముగ జేసినసుఖముగలుగును. సంపూర్ణము గాకుండినదుఃఖకరంబగుటయేగాక నిహపరములయందును దోషహేతువగును. మఱియు విష్ణుసహస్రనామజపమును, సువర్ణరక్తవస్త్రదానమును, ఏబది బ్రాహ్మణులకు సంతర్పణమును, సహస్రకలశస్నానమును జేయించవలయును. దానివలన రోగము శమించును.

పిశునో నరకస్యాంత్యే జాయతే శ్వాసకాసవాన్,
ఘృతం తేన ప్రదాతవ్యం సహస్రపలసంఖ్యయా. (కర్మకాండే)

తా. కొండెకాఁడు నరకాంతమునందు శ్వాసకాసరోగియై జనించును. తన్నివారణార్థంబై వెయ్యిపలముల నెయ్యిని దానముచేయవలయును.

అరుచికర్మవిపాకము

వా. శ్రద్ధాహీనోధనీస్యదాతా దానరతిర్వా తామసగుణాన్వితోయః, సోఽరుచిమాన్ శూలీవా జాయతేతస్యప్రాయశ్చిత్తంకృఛ్రమతి కృఛ్రం, చాంద్రాయణం వ్యస్తంసమస్తంవా వ్యాధితారతమ్యేన కుర్యాత్, అత్రాశక్తౌధనీచనిత్యంపంచాశద్బ్రాహ్మణభోజనం ప్రతిదినం మృష్టాన్నేన కారయేత్ అత్రాప్యశక్తౌ. 89

జపం హోమం తథాతీర్థం స్నానంవాపి సమాచరేత్,
తీవ్రవైరాగ్యసంయుక్తః కుర్యాద్బ్రాహ్మణభోజనమ్. 90

తా. ధనవంతుఁడైయుండి శ్రద్ధాహీనముగ, అదాతగ, లేక దానముజేసినను తామసదానపరుఁడుగ నుండువానికి అరుచియేని శూలయేని గలుగును. తన్నివారణార్థంబై కృచ్ఛ్ర, అతికృచ్ఛ్ర, చాంద్రాయణముల సంపూర్ణముగగాని, లేక ఆయారోగ తారతమ్యమునకు దగినటుల ప్రాయశ్చిత్తమునుగాని జేయవలయును. మఱియు నీప్రాయశ్చిత్తముజేయుట కశక్తుఁడై ధనికుఁడుగ నుండువాఁడు ప్రతిదినము ఏబది బ్రాహ్మణులకు పిండివంటకములతోడ భోజనం బిడవలయును. ధనవిహీనుఁడుగ నుండువాఁడు జప, హోమ, తీర్థస్నానముల జేయవలయును. తీవ్రవైరాగ్యమును ధరించి బ్రాహ్మణులకు భోజనం బిడిన రోగవిముక్తుం డగును.

అతిపరిభూతకృపణ స్సహజయుతో మానవో భవతి,
జీవేమందాగ్నివిజితో దుశ్చిత్తకః పాపకర్మాచ. 91

వా. దుశ్చికిత్స్యస్థానస్థితగురోః ప్రాగుక్తజపహోమస్నానాదికం విదధ్యాత్. (జ్యోతిశ్శాస్త్రే)

తా. జన్మకాలమున సహజస్థానమునందు క్రూరగ్రహములుండినను, లేక గురుహజస్థానమునందు క్రూరగ్రహములుండినను, మందాగ్ని, పాపకర్మ, శత్రువుచే జయింపఁడుట, దుశ్చిత్తత గలవాఁడుగ జనించును. దుశ్చికిత్స్యస్థానస్థితగురుదోషనివారణార్థంబై గార్వోక్తజపహోమాదిక్రియలం జేయవలయును.

ఛర్దిరోగకర్మవిపాకము

గా. యోబ్రాహ్మణాయ కేశకీటకాకసారమేయాంద్యుపహతమన్నం జానన్నేవ ప్రమాదాత్ప్రయచ్ఛతి సచ్ఛర్దిమానస్యజన్మని. 93

తా. బ్రాహ్మణులకు వెంట్రుకలు, పురుగులు, కాకులు, కుక్కలు అనువానివలన

దుష్టంబైన యన్నమును ఉన్మత్తుఁడై బుద్ధిపూర్వకముగ నొసంగెడివానికి మఱియొక జన్మమున ఛర్దిరోగము జనించును.

వా. విశ్వాసఘాతకీ ఛర్ద్దియుక్తో భవతి. తదుపశాంతయే పంచాశద్బ్రాహ్మణభోజనం కారయేత్. అన్నదానంచయథాశక్త్యాజ్యయుక్తంచ కుర్యాత్. తతోపశాంతిర్భవతి. 94

తా. విశ్వాసఘాతుకము జేయువానికి ఛర్ద్దిరోగము జనించును. తన్నివారణార్థంబై ఏబది బ్రాహ్మణులకు భోజనం బిడవలయును. మఱియు శక్త్యనుగుణముగ ఘృతయుక్తముగ అన్నదానమును జేయవలయును.

రిపుస్థానే యదా స్యాతాం చంద్రశుక్రౌ తతో భవేత్,
ఛర్దిమార్గ మనుజస్తృష్ణాయుక్తోవా ప్యవలోకితే. 95
క్షీణచంద్రావలోకీతు షష్ఠస్థానస్థితో బుధః,
శుక్రబాధోపశాంతయేబుధస్యపూర్వోక్తమేనసకలం జపాది విదధ్యాత్. (జ్యోతిశ్శాస్త్రే)

తా. జననకాలమున నారవయింటిలో చంద్రశుక్రు లుండినను, లేక వారల దృష్టి గలిగియుండినను, ఛర్ద్దిరోగంబేని తృష్ణారోగంబేని జనించును. లేక బుధుఁడు ఆరవస్థానమునందుండి వానికి క్షీణచంద్రునిపై దృష్టిగలిగియుండిన ఛర్ద్దిరోగంబేని లేక తృష్ణారోగంబేని కలుగును. శుక్రబుధదోషనివారణార్థంబై పూర్వోక్తజపాదుల నన్నిటిని జేయవలయును.

## తృష్ణాకర్మవిపాకము

పథిచాధ్వపరిశ్రాంతం బ్రాహ్మణం గా మథాపివా,
నపాయయేత్ జలం యస్తు సతృష్ణామూర్ఛితో భవేత్. 97

తా. బ్రాహ్మణుఁడుగాని, ఆవుగాని, మార్గమునందు బడలికచే దప్పివలన బీడింపంబడియుండ ఉదకము నొసంగకుండువానికి తృష్ణ, మూర్ఛ జనించును.

పానీయం పాయసం భక్త్యా శర్కరాఘృతసంయుతం,
ఇదమాపశ్యతో దేయం మూర్ఛాతృష్ణోపశాంతయే. 98

తా. ఉదకము, పాలు, పంచదార, లేక ఘృతము అనువానిని బ్రాహ్మణులకు ముఖ్యముగ నొసంగి (తానును భుజించిన) మూర్ఛ, తృష్ణ హరించును.

## దాహరోగకర్మవిపాకము

వా. యఃపునరగ్నౌ క్షీవతి తం కపిలా నామ గ్రహో గృహ్ణాతి. తత్క్షణా

వర్ణము, చెమట, శ్వాసము దుర్గంధముగా వెడలుట, అధికదప్పి-ఈలక్షణములు పిత్తజ్వర
నందు కలిగియుండును.

## శ్లేష్మ జ్వరలక్షణము

కాసశ్వాసౌ పీనసః కంఠశోషా దాహోభ్రాంతిశ్శ్వేతవర్ణంబలాసం,
తంద్రాకారో గౌరవర్ణంచగాత్రం వాఙ్మాధుర్యం వారిపూరం సలాలమ్.
చింతాభీతిర్విద్ధితం మందవహ్నిం తాపస్స్వేదశ్శోఫమూత్రం శిరో ర్తిః
స్నిగ్ధంగాత్రంఘుర్ఘురంసారణంస్యాద్దేతుశ్లేష్మదోషతితోయంజ్వరస్స్యా
(సిద్ధవిద్యాభూ

తా. దగ్గు, ఎగరోజు, పీనస, కంఠశోష, దాహము, భ్రమ, కఫము తెల్లగ
డుట, తంద్ర, శరీరము పసుపువర్ణమై యుండుట, నోరు తియ్యగ నుండుట, అధికము
జొల్లుకారుట, చింత, భయము, అగ్నిమాంద్యము, తాపము, చెమట, శోభ, అధికము
మూత్రము వెడలుట, శిరస్సు నొచ్చుట, శరీరము నిగనిగలాడుచుండుట, కంఠములో గు
గుఱ్ఱు మనుశబ్దము, అతిసారము-ఈలక్షణములుగలది శ్లేష్మజ్వర మని తెలియవలయు.

స్తైమిత్యం స్తిమితోవేగ ఆలస్యం మధురాస్యతా,
శుక్లమూత్రపురీషత్వక్ స్తంభేస్తృప్తిరథాపిచ. 2
గౌరవం శీతముత్క్లేదో రోమహర్షోఽతినిద్రతా,
ప్రతిశ్యాయో రుచిః కాసః కఫజేఽక్ష్ణోశ్చశుక్లతా. (మతాంత

తా. శరీరము తడిగుడ్డచే గప్పఁబడినటుల నిశ్చలముగనుండుట, జ్వరమునకు మం
వేగము, కార్యములయందాలస్యము, నోరుతియ్యగనుండుట, మూత్రపురీషములు చర్మ
తెల్లగ నుండుట, శరీరము స్తంభించుట, తృప్తిజెందినవానివలె అన్నమునం దభిలా
లేకుండుట, శరీరము బరువుగనుండుట, శరీరము శీతలముగనుండుట, ఓకర, గగుర్పొ
చుట, కడునిద్ర, పీనస, అరుచి, కాస, నేత్రములు తెలుపుబారియుండుట, ఈలక్ష
ములుగలది శ్లేష్మజ్వర మని తెలియవలయు.

విశేషాదరుచిర్జాడ్యం స్రోతోరోధోఽల్పవేగతా,
ప్రసేకో ముఖమాధుర్యం హృల్లేపశ్వాసపీనసః. 20
హృల్లాసశ్ఛర్దనంకాస స్తంభ శైత్యంతగాదిషు,
అంగేషు శీతపిటకా స్తంద్రోదరకఫోద్భవే. (బాహటే) 20

తా. మిగుల అరుచి, జాడ్యము, స్రోతఃప్రతిబంధము, మలమూత్రాదులు కొం
ముగ వెడలుట, నోటియందు నీరుకారుట, నోరుతియ్యగనుండుట, హృల్లేపము, శ్వాసమ

జ్వరశూలసర్వాంగదాహాపీతనయనశ్చ భవతి. బలించ నిశిచతుష్పథే
పిష్టలాజాపిణ్యాకరుధిరతిలాశ్వగంధపుష్పైర్మిశ్రేణ దద్యాత్. 99
గృహ్ణీష్వచ బలించేమం కపిలాఖ్యమహాగ్రహా,
ఆతురస్య సుఖం సిద్ధిం ప్రయచ్ఛ త్వం మహాబల. 100

తా. అగ్నియందు నుమ్మివేయువానికి కపిలనామకమను గ్రహముసోఁకి పీడించుటచే తత్క్షణమున జ్వరము, శూల, సర్వాంగదాహము, నేత్రములయందు పసపు వర్ణము అనునుపద్రవంబులుగ లుగును. తన్నివారణార్థంబై నాలుగుత్రోవలమధ్య పిండి, పేలాలు, గానుగపిండి, రక్తము, నువ్వులు, పెన్నేరుగడ్డ, పువ్వులు అనువాని యుక్తముగ "గృహ్ణీష్వచ బలించేమం" అనుమంత్రముతో బలి నివ్వవలయును.

తనౌ భవతి భూపుత్రో రంధ్రే భవతి భాస్కరః,
జన్మకాలే యదా యస్య సదాహజ్వరవాన్భవేత్. 101
(జ్యోతిశ్శాస్త్రే)

తా. జన్మలగ్నమున అంగారకుఁడు, అష్టమస్థానమున సూర్యుఁడుండిన దాహము, జ్వరము గలుగును.

ఉన్మాదరోగకర్మవిపాకము

మోహయిత్వా పరాన్యస్తు భుఙ్క్తే వస్తువిగర్హితం,
సోన్మాదవాతయుక్తస్స్యా త్కృచ్ఛ్రం చాంద్రాయణం తథా.
కుర్యా త్సారస్వతంనామ జపే ద్బ్రాహ్మణతర్పణం,

తా. రెండవమనుజునికి మోహమును గలుగంజేసి నింద్యమైన వస్తువును భక్షణ జేయించినవానికి ఉన్మాదము, వాతపీడగలుగును. తన్నివారణార్థంబై చాంద్రాయణకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమునుగాని, సరస్వతీ నామజపమునుగాని జేయుటయేగాక బ్రాహ్మణసంతర్పణమును జేయవలయును.

అపస్మారకర్మవిపాకము

గురౌ స్వామినివ స్తేయః ప్రతికూలం సమాచరేత్. 103
సోఽపస్మారీ భవేత్తత్ర కుర్యా చ్చాంద్రాయణం నరః,

తా. గురువు, లేక స్వామి వీరలవద్దయుండి ప్రతికూలముగ నడుచువానికి అపస్మార రోగము గలుగును. తన్నివారణార్థంబై చాంద్రాయణ ప్రాయశ్చిత్తముల జేయవలయును.

బ్రాహ్మణశ్వాసరోధేన హ్యపస్మారీ భవేన్నరః. 104

వక్ష్యే తస్య ప్రతీకారం దానహోమక్రియావిధిం,

తా. బ్రాహ్మణునియొక్క శ్వాసమును బంధించినవానికి అపస్మారము గలుగును. దాని నివారణార్థంబై దానహోమక్రియాదుల జేయవలయును.

శనిభూసుతదిననాథనిధనస్థా యస్యజన్మకాలే స్యుః,
నానావ్యాధివధాద్యైః పీడాంచాపస్మారసంభవాం తస్య. 105

(జ్యోతిశ్శాస్త్రే)

హా అష్టమస్థానస్థశనిమంగళసూర్యజనితాపస్మారశాంతయే గ్రహప్రీత
యే పూర్వోక్తమేవ సకలం జపాది కుర్యాత్. 106

తా. జన్మకాలమున శని, అంగారకుఁడు, సూర్యుఁడు అష్టమస్థానమందుండిన పలువిధములైన రోగములుగాని, అపస్మారముగాని గలుగును. తన్నివారణార్థంబై గ్రహ ప్రీత్యర్థముగ పూర్వోక్తజపాది సర్వోపచారములం జేయవలయును.

వాతవ్యాధికర్మవిపాకము

దేవానాం బ్రాహ్మణానాంవా ధనాపహరణాత్తథా,
స్వామిద్రోహా ద్వాతరోగీ భవేత్తస్యాపి నిష్కృతిః. 107

తా. దేవ బ్రాహ్మణులయొక్క ధనము నపహరించుటవలనగాని, స్వామిద్రోహము వలనగాని, వాతరోగము జనించును. కావున దానికి పరిహారము జేయవలయును.

వాతరోగహరవిధి

గురుప్రత్యర్థితాం యాతో వాతరోగీ భవేన్నరః,
నామమంత్రేణ కుర్వీత జపం హోమం చ శాంతయే. 108

తా. గురువును ద్వేషించువానికి వాతరోగము గలుగును. తన్నివారణార్థంబై ఉత్త రోత్తర జెప్పంబడు అచ్యుత, అనంత, గోవిందాదినామమంత్రములతో జపహోమ ములు జేయవలయును.

ధనుర్వాతహరవిధి

అనిచ్ఛంతీం త్యక్షతాం యస్తు హ్యుపభుంక్తే పరస్త్రియం,
బలాదాక్రమ్య సనర స్సర్వసంధిషు వేదనామ్. 109
తీవ్రా మాప్నోత్యరుచిమార్తో ధనుర్వాతయుతో భవేత్,
జ్వరీ తదుపశాంత్యర్థం మహిషీదాన మాచరేత్. 110
కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌ కుర్వీత చాంద్రాయణ మథాపరం,
సూర్యనామజపం చైవ శక్త్యా బ్రాహ్మణతర్పణమ్. 111

నామత్రయం జపేన్మర్త్యో రోగశాంత్యర్థమాత్మనః,
సహస్రనామకంచాపి స్తోత్రం సమ్యగ్విధానతః. 112
అచ్యుతానంత గోవిందేత్యేతన్నామత్రయం ద్విజః,
అయుతత్రితయావృత్త్యా జపేద్రోగస్య శాంతయే. 113

తా. ఇచ్ఛయించని అక్షతయోనిగల పరస్త్రీతో బలాత్కారముగ సంగమము జేయువానికి సర్వసంధులయందు తీవ్రవేదన, అరుచి, ధనుర్వాతము, జ్వరము మొదలగు రోగములు గలుగును. తన్నివారణార్థంబై మహిషీదాన, కృచ్ఛ్ర, అతికృచ్ఛ్ర, చాంద్రాయణ ప్రాయశ్చిత్తములను, సూర్యనామజపమును, శక్త్యనుగుణ్యముగ బ్రాహ్మణ సంతర్పణమును, నామమంత్రజపమును, సహస్రనామ జపమును, విధాన పూర్వకముగ జేయుటయే గాక అచ్యుత, అనంత, గోవింద అనుమూడు నామమంత్రముల ముప్పది వేలమార్లు జపముజేయవలయును.

## పక్షవాతహరవిధి

సభాయాం పక్షపాతీచ జాయతే పక్షఘాతవాన్,
నిష్కత్రయమితం హేమ సదద్యాచ్చ ద్విజాతయే. 114
శ్రాద్ధం చ వైష్ణవం కుర్యాదాత్మనో హితమిచ్ఛయా,
సప్తధాన్యాని దద్యాచ్చ గోదానం తత్ర కారయేత్. 115

తా. సభయందు పక్షపాతము జేయువానికి పక్షఘాతవాతము గలుగును. తన్నివారణార్థంబు మూడునిష్కములయెత్తు బంగారును బ్రాహ్మణునికి దానముజేసి వైష్ణవ శ్రాద్ధమును, సప్తధాన్యదానమును, గోదానమును జేయవలయును.

రక్తవస్త్రప్రవాళానాం హారీస్యాద్రక్తవాతవాన్,
సవస్త్రాం మహిషీం దద్యాత్పద్మరాగసమన్వితామ్. 116

తా. ఎఱ్ఱనివస్త్రములను, పగడములను దొంగలించువానికి రక్తవాతముగలుగును, తన్నివారణార్థంబై పద్మరాగములతోడ వస్త్రయుక్తముగ మహిషీదానమును జేయవలయును.

## రక్తవాత రక్తపిత్తహరవిధి

సవర్ణాగమనే వాతరక్తవాన్ జాయతే నరః,
సవర్ణాగమనే వాతపిత్తవానపి జాయతే. 117
లక్ష్మీనారాయణం రూపం సువర్ణేన ప్రకల్పయేత్,
పలేనవా తదర్థేన తదర్థేనాథవా పునః. 118
లక్ష్మీనారాయణం రూపం సర్వదా సర్వకామికం,

తా. సవర్ణస్త్రీతో సంగమముజేయువానికి వాతరక్తరోగంబేని, లేక వాత పిత్తరోగంబేని గలుగును. తన్నివారణార్థంబై నాలుగు, లేక రెండు, లేక ఒకరూపాయి యెత్తుబంగారుతో లక్ష్మీనారాయణ ప్రతిమను జేసి దానము జేయవలయును. మఱియు ఈలక్ష్మీనారాయణప్రతిమను సర్వకాలములయందును సర్వకామనావిషయములయందును దానము జేయందగును.

వాతపిత్తహరవిధి

లశునం గృంజనం తాలఫలం వాశ్నాతి యో ద్విజః. 119
సవాతపిత్తరోగీచ భవే చ్చాంద్రాయణం చరేత్,

తా. వెల్లుల్లి, గంజావి, లేక తాటిఫలము - వీనిని భక్షణముసేయు బ్రాహ్మణునికి వాతపిత్తరోగములు గలుగును. తన్నివారణార్థంబై చాంద్రాయణప్రాయశ్చిత్తముల జేయవలయును.

అతిమారుతరోగార్తోపరస్వ హారీవిలోల మతిచేష్టః,
కర్కటసంస్థభానౌ స్వపుత్రదృష్టే పుమాన్ పిశునః. 120
(జ్యోతిశ్శాస్త్రే)

తా. జననకాలమున కర్కాటకరాశియందు సూర్యుఁడుండి శనివీక్షణమును గలిగియుండిన కొంటరితనము, వాతరోగము, చోరవృత్తి, చంచలచిత్తము గలుగును.

వాతపిత్తోద్భవాపీడా హీనజై రుగ్రవిగ్రహః,
విదేశగమనంచాపి సౌరిమధ్యే యదాశిఖీ. 121

తా. జననకాలమున శనిమధ్యమునందు కేతుసంబంధము గలిగియుండిన వాతపిత్తరోగము గలుగును. మఱియు హీనజాతివలన భయంకరమైన కలహంబేని, పరదేశగమనంబేని గలుగును.

ఆమవాతకర్మవిపాకము

వా. హుతాగ్నినిర్వాపకో హ్యామవాతవానితి వచనాత్, తదుక్తదోష శాంతయే అయుతసంఖ్యాకో గాయత్రీజపః. 122

తా. హోమాగ్ని నార్పినవానికి ఆమవాతము జనించును. తన్నివారణార్థంబై పది వేలమార్లు గాయత్రీజపమును జేయవలయును.

వా. అష్టమోగురురామస్యకర్తాచేతి వచనాత్, అష్టమస్థానస్థితగురు జనితామవాతరోగోపశాంతయే తత్ప్రీతయే పూర్వోక్తమేవ జపహోమపూజాదానాదికం కుర్యాత్, తేనోపశామ్యతి. 123
(జ్యోతిశ్శాస్త్రే)

తా. జననకాలమున అష్టమస్థానమునందు బృహస్పతియుండువానికి ఆమవాతము గలుగును. తన్నివారణార్థంబై పూర్వోక్తజపహోమ పూజాదానాదుల జేయవలయును.

అజీర్ణశూలకర్మవిపాకము

శూద్రస్యైవతు భుక్తాన్న మవ్రతస్య ద్విజస్యచ,
శూలవ్యాధి ర్భవే న్నిత్య మజీర్ణాచ్చాతిపీడితః.

తా. బ్రాహ్మణుడు శూద్రాన్నమునుగాని, లేక దుర్వృత్తిగల బ్రాహ్మణాన్నమును గాని భుజించిన నెల్లపుడు శూల, అజీర్ణము గలుగును.

ప్లీహశూల

విశ్వాస్తవిషదాతాచ ప్లీహవా& జాయతే నరః. 125

తా. తనయందు విశ్వాసముగ నుండువానికి విషంబిడుటవలన ప్లీహశూల గలుగును.

జఠరశూల

శ్రుతాధ్యయనసంపన్నం యాచితార మకించనం,
బ్రాహ్మణం దాంత మాహూయ దానార్థం న దదాతి యః. 126
సభవే జ్జఠరీశూలీ తథాధ్మానీచ కర్హిచిత్,

తా. వేదాధ్యయనము సేయువాడు, శ్రోత్రియుడు, యాచకుడు, దరిద్రుడు, శమదమాదిసాధనయుక్తుడు నగు బ్రాహ్మణుని బిలిపించి దానము జేయకుండిన వానికి ఉదరశూల, కడుపుబ్బరము గలుగును.

శమనము

కృచ్ఛ్రాతికృచ్ఛ్రచాంద్రాణి సకుర్యా ద్రోగయుక్తయే. 127

తా. జఠరశూలగలవాడు కృచ్ఛ్ర, అతికృచ్ఛ్ర, చాంద్రాయణ ప్రాయశ్చిత్తముల జేసిన నది నివర్తించును.

అరుచిశూల

వా. శ్రద్ధాహీనో ధనవా& దానే ష్వరతి స్తామవదానీ వాయస్సో రుచిమా& శూలీజాయేతాత్రైషనిస్తారః. 128

తా. ధనవంతుడుగ నుండువాడు శ్రద్ధాహీనముగగాని, లేక తామసముగగాని దానము జేసిన అరుచి, శూల గలుగును.

శమనము

చాంద్రాయణం చాతికృచ్ఛ్రం ప్రాజాపత్య మథాపరం,
హోమాద్యపిచ కుర్వీత వ్యాధ్యాదే రనురూపతః. 129

తా. అరుచి, శూల గలవాఁడు చాంద్రాయణ, అతికృచ్ఛ్ర, ప్రాజాపత్య ప్రాయశ్చిత్తములగాని, రోగతారతమ్యానుగుణ్యముగ హోమాదులగాని జేయవలయును.

సాధూద్ధంతి గవాదీని యః పునర్జననాంతరే,
శిరోరోగీ శ్రోత్రరోగీ శూలీచారుచిమాన్భవేత్. 130

తా. ఆవునుగాని లేక బ్రాహ్మణులు మొదలగువారినిగాని జన్మాంతరమున స్వయముగ జంపినవారికి మస్తకశూల, కర్ణశూల, ఉదరశూల, లేక అరుచి గలుగును.

శమనము

ఏతన్నివృత్తయే వర్షం ద్వివర్షంవా త్రివర్షకం,
చరేద్ఘృతవ్రతంచాంతే గోహిరణ్యాదికం దిశేత్. 131

తా. పూర్వోక్తమైన గోహత్యాదిదోషములు నివర్తించుటకై ఒక సంవత్సరం బేని, లేక రెండు సంవత్సరంబులేని, లేక మూడుసంవత్సరంబులేని ఘృతవ్రతమును జేసి అంత్యమున, బ్రాహ్మణునికి ఆవును, సువర్ణమును దానము చేయవలయును.

కటిశూలకర్మవిపాకము

గోగామీ కటిశూలీస్యాత్తస్య చాంద్రాయణం తథా,
కృచ్ఛ్రంచైవాతికృచ్ఛ్రంచ జపం సౌరంచ నిర్దిశేత్. 132

తా. గోగమనము జేయువానికి కటిశూల గలుగును. తన్నివారణార్థంబై చాంద్రాయణ, కృచ్ఛ్రాతికృచ్ఛ్రమునుగాని, సౌరజపమునుగాని చేయవలయును.

మైథునం శృణుయాత్పిత్రోః కర్ణశూలీ భవేత్తు సః,
స్యాచ్చైవ బధిరః కించిత్కపాలేఽసహ్యశబ్దవాన్. 133

తా. మాతాపితృమైథునము నాకర్ణించువానికి కర్ణశూలగాని, చెవిటితనముగాని, లేక కపాలమున అసహ్యమైన శబ్దముగాని గలుగును.

శమనము

నిష్కవింశతికం దద్యాద్బ్రాహ్మణాయ కుటుంబినే,
విష్ణుప్రకాశకాన్ మన్త్రాన్ జపేద్రోగోపశాంతయే. 134

తా. కర్ణశూల శమించుటకై కుటుంబియగు బ్రాహ్మణునికి ఇరువది నిష్కముల యెత్తు సువర్ణదానమునుగాని, లేక విష్ణుదేవతాకమంత్రజపములుగాని జేయవలయును.

హస్తశూల

పూర్వజన్మని నాస్తిక్యాత్సంధ్యాదిరహితో ద్విజః,
హస్తశూలీ సంభవతి నిష్కద్వాదశకం దిశేత్. 135

తా. జన్మాంతరమున నాస్తికుఁడై సంధ్యాదికర్మల జేయకుఁడిన బ్రాహ్మణునికి హస్తశూల గలుగును. తన్నివారణార్థంబై ౧-౨ నిష్కములయెత్తు బంగారమును దానము చేయవలయును.

శమనము

భోజయేద్బ్రాహ్మణాఞ్ఛక్త్యా జపేత్సౌరం హిరణ్యదః. 136

తా. హస్తశూలగలవాఁడు శక్త్యనుగుణముగ బ్రాహ్మణులకు భోజనంబిడి సువర్ణమును దానముజేసి సౌరజపమును చేయవలయును.

నయనశూల

నగ్నాం పరస్త్రియం దృష్ట్వా సూర్యంవాస్తమయోదయే,
నేత్రశూలీ భవేత్సోఽపి నేక్షితుం క్షమతే దిశః. 137

తా. నిర్వాణముగ నుండునపుడు పరస్త్రీని జూచెడువానికిగాని, లేక ఉదయాస్తమయకాలముల సూర్యావలోకము జేసెడివానికిగాని నేత్రమునందు శూలరోగము గలుగును. దానివలన దిక్కుల జూచుట కశక్యం బగును.

శమనము

వర్చో మే దేహి మంత్రేణ జపస్స్యా దష్టచాయుతం,
వయస్సుపర్ణా ఇతిచ మంత్రైస్సించేచ్చ వారిణా. 138

తా. నేత్రశూలరోగి, "వర్చో మే దేహి" అను మంత్రమును ౧౦౦౦౦ మార్లు జపించుటయేగాక "వయస్సుపర్ణా" అను మంత్రముతో అభిషేకముసగా చేయవలయును.

శూలకర్మవిపాకము

శూలీ పరోపతాపేన జాయతే వపుషా తనుః,
సోఽన్నదానం ప్రకుర్వీత తథా రుద్రం జపేద్బుధః. 139

తా. పరునికి దుఃఖము గలుగజేసెడువానికి శూలరోగము జనించి శరీరము కృశించును. తన్నివారణార్థంబై అన్నదానమునుగాని, లేక రుద్రజపమునుగాని, చేయవలయును.

ఆనాహ, ఉదావర్తకర్మవిపాకము

వా. దేవద్విజక్షేత్రతటాకవల్మీకకూపాదీనాం యో భేదనం కరోతి తం వాయసోనామగ్రహో గృహ్ణాతి. తల్లక్షణ మాధ్మానోదావర్తిజ్వరారుచిమార్గపాదదాహీచ జాయతే. 140

తా. దేవబ్రాహ్మణుల భూమినపహరించినవానికిని, చెఱువులు, పుట్టలు, బావులు మొదలగువాని నశింపజేసినవానికిని, వాయసమను గ్రహము సోఁకును. దానివలన కడుపుబ్బరము, ఉదావర్తము, జ్వరము, అరుచి, అరకాలియందు మంట అనునవి గలుగును.

మధ్యేపాపగ్రహయో శ్చంద్రే మదనే స్థితేఽర్కజే జంతోః,
శ్వాసక్షయవిద్రధిగుల్మప్లీహాదిపీడిత స్సనరః. (జ్యోతిశ్శాస్త్రే.) 141

తా. జననకాలమునందు పాపగ్రహమధ్యమున చంద్రుఁడుండి సప్తమస్థానమున శనియుండిన శ్వాసము, క్షయము, విద్రధి, గుల్మము, ప్లీహము మొదలగురోగములు గలుగును.

## గుల్మరోగకర్మవిపాకము

గురుప్రత్యర్థితాం యాతో గుల్మవాన్ జాయతే నరః,
ఆచరే త్తన్నివృత్త్యర్థం మాసమేకం పయోవ్రతమ్. 142

తా. గురుతిరస్కారకార్యము జేయువానికి గుల్మరోగము జనించును. అది నివారించుటకై ఒకమాసము పయోవ్రతమును జేయవలయును.

## హృద్రోగకర్మవిపాకము

ఉదక్యావీక్షితం భుక్త్వా జాయతే కృమిలోదరః,
గోమూత్రయావకాహార స్సప్తరాత్రేణ శుద్ధ్యతి. 143

తా. రజస్వలగా నుండు స్త్రీ యవలోకనముజేసిన యన్నమును భుజించుటవలన ఉదరమున క్రిములు జనించును. అది నివర్తించుటకై ఏడుదినములు గోమూత్రమును యవధాన్యమును భుజింపవలయును.

అభక్ష్య భక్షణేచైవ జాయంతే కృమయో హృది,
అథవా తద్విశుద్ధ్యర్థ ముపోష్యం భీష్మపంచకమ్. 144

తా. అభక్ష్యపదార్థములను భుజించుటవలన ఉదరమున క్రిములు జనించును. తన్నివారణార్థంబై భీష్మపంచక ముపవాసమును జేయవలయును.

గజేచ నిహతేవాశ్వే కృమి కుక్షిస్తు జాయతే.

తా. ఏనుగును, లేక గుఱ్ఱమును జంపినవానికి ఉదరమున క్రిములు జనించును.

మృతే భర్తరి యానారీ నీలీవస్త్రం ప్రధారయేత్,
సామృతా నరకం యాతి కృమికుక్షి స్తతఃపరమ్. 146

తా. పెనిమిటిమరణానంతరమున నీలివస్త్రమును ధరించినస్త్రీ మరణానంతరము నరకము ననుభవించి రెండవజన్మమున కడుపులో క్రిమిపీడగలదై జనించును.

పాటితహృదయో హిబుకే నిర్వాహనబాంధవార్తిసతిసౌఖ్యం,
బాల్యే వ్యాధితదేహో నఖరోమధరో భవే త్స్వగః. 147
(జ్యోతిశ్శాస్త్రే)

తా. జననకాలమునందు నాలవయింటిలో శనిగ్రహంబుండిన బొమ్మనొప్పి బంధుపీడ, భార్యాసౌఖ్యము, బాల్యమునందు వ్యాధి, నఖకేశధారణముగలవాఁడై యుండును.

మూత్రకృచ్ఛ్రకర్మవిపాకము

గురుజాయాగభిమనా న్మూత్రకృచ్ఛ్రం ప్రజాయతే,
తేనాపి నిష్కృతిః కార్యా శాస్త్రదృష్టేన వర్త్మనా. 14
పశుయోనౌచ గమనా న్మూత్రకృచ్ఛ్రం ప్రజాయతే,
తిలపాత్రత్రయంచైవ సజద్యా దాత్మశుద్ధయే.

తా. గురుభార్యాసంగమము జేసినవానికి మూత్రకృచ్ఛ్రము జనించును. తన్ని వారణార్థంబై శాస్త్రమున జెప్పఁబడియుండు ప్రకారము శాంతిచేయవలయును. పశు మైథునము జేయువానికి మూత్రకృచ్ఛ్రము జనించును. కావున నాత్మశుద్ధ్యర్థవ మూఁడుతిలపాత్రల దానము జేయవలయును.

జన్మకాలే యదాయస్య స్మరే భవతి భాస్కరః,
రాహుయుక్తః ప్రకురుతే మూత్రకృచ్ఛ్రాదికాం రుజమ్. 15
(జ్యోతిశ్శాస్త్రే

తా. జన్మకాలమున సప్తమస్థానమునందు శనిరాహువులు గలవానికి మూత్రక చ్ఛ్రాదిరోగములు జనించును.

అశ్మరీకర్మవిపాకము

వా. పరస్త్రీగామీ హ్యపస్మారీ భవ త్యశ్మరీవా. 15

తా. పరస్త్రీగమనము సేయువానికి అపస్మారముగాని, అశ్మరీమూత్రకృచ్ఛ్ర ముగాని జనించును.

శమనము

వా. స్వర్ణదానం కార్యం తస్య సర్వరోగే దానస్యోక్తత్వాత్. 15

తా. కావున వాని నివారణార్థమై స్వర్ణదానమును జేయవలయును.

వా. శూలప్రమేహపీడిత మశ్మర్యోపహతమాననంచాపి జనయ
రవిణాదృష్టో జీవగ్రహే చంద్రజపురుషం, గురుగ్రహావర్తమా
రవిదృష్టబుధజనితాశ్మరీరోగ ప్రతీకారపూర్వకం బుధప్రీతరె
పూర్వోక్తమేవ జపాదికం కుర్యాత్ (జ్యోతిశ్శాస్త్రే.) 15

తా. జననకాలమునందు గురువుతోడ బుధుఁ డుండి సూర్యునిచే జూడంబ

మండిన శూల, ప్రమేహము, అశ్మరీరోగము గలుగును. కావున వానిశమనార్థంబై
ుధగ్రహప్రీత్యర్థము పూర్వోక్తజపాదులు చేయవలయును.

## ప్రమేహకర్మవిపాకము

చాండాలీగమనా త్సర్వప్రమేహవ్యాధిమా న్భవేత్,
క్షుత్పిపాసాతురశ్చైవ జాయతే తస్యనిష్కృతిః. 154
చాంద్రాయణత్రయం కుర్యా ద్యవమధ్యం తథాపరే,
జుహుయా త్సర్పిషాచైతా జపేన్మంత్రా న్సమాహితః. 155
మం. ఇదమాపః ప్రవహ తేతి. 156

తా. చండాలస్త్రీగమనము జేయువానికి సర్వమేహరోగములుగాని, ఆకలి,
ప్పి అనురోగములుగాని జనించును. కావున వానిశమనార్థంబై మూడుయవమధ్యచాం
ద్రాయణప్రాయశ్చిత్తములచేసి రెండవనియమున "ఇదమాపః ప్రవహతి" అనుమంత్రజప
ుంను, మఱియు నీమంత్రముతోడనే సహస్రాజ్యహోమముల జేయవలయును.

## శూలమేహకర్మవిపాకము

తిర్యగ్గామీ సశూలేన ప్రమేహేనయుతో భవేత్,
కుర్యా త్సాంతపనాదీని ప్రాయశ్చిత్తం యథావిధి. 157

తా. ఆవు, ఎనుము మొదలగుజంతువుల మైథునముజేసినవానికి శూలమేహము
నించును. తన్నివారణార్థంబై యథావిధిగ సాంతపనాదిప్రాయశ్చిత్తముల జేయవలయును.

## వాతమేహకర్మవిపాకము

పర్వవ్యవాయీ మనుజః కన్యాగామీ తథైవచ,
వాతప్రమేహయుక్తస్స్యాత్కుర్యా చ్చాంద్రాయణత్రయమ్.

తా. అమావాస్య, పూర్ణిమ మొదలగు పర్వతిథులయందు స్త్రీసంగమముగాని,
ేక కన్యాసంగమముగాని జేయువానికి వాతమేహము జనించును. తన్నివారణార్థంమై
ూడుచాంద్రాయణప్రాయశ్చిత్తములు చేయవలయును.

## మధుమేహకర్మవిపాకము

మధుమేహీ మాతృగామీ సతతం జాయతే నరః,
పితృభార్యాభిగామీచ జలమేహీ నరాధమః. 159
యోగచ్ఛే ద్భగినీం నిత్య మిక్షుమేహీ భవేన్నరః,
ప్రాయశ్చిత్తం క్రమాదత్ర షడ్వర్షాణ్యథ పంచచ. 160
త్ర్యబ్దమిత్యాచరే త్సమ్యక్తతోరోగా త్ప్రముచ్యతే,

పీనస, హృల్లాసము, వాంతి, దగ్గు, స్తబ్ధత్వము, చర్మము నఖము యీ మొదలగువాని యందు తెలుపువర్ణము, అవయవములయందు శీతపిటికలు, తంద్ర - ఈ లక్షణములు శ్లేష్మజ్వరమునందు కలిగియుండును.

## వాతపిత్తజ్వరలక్షణము

తృష్ణామూర్ఛాభ్రమోదాహ స్స్వప్ననాశ శ్శిరోరుజా,
కంఠాస్యశోషోవమథూ రోమహర్షోఽరుచి స్తమః. 204
పర్వభేదశ్చ జృంభాచ వాతపిత్తజ్వరాకృతిః. (మాధవనిదానే)

తా. దప్పి, మూర్ఛ, భ్రమ, సర్వాంగతాపము, నిద్రానాశము, తలనొప్పి, కంఠము ముఖము ఎండియుండుట, వాంతి, గగుర్పొడుచుట, అరుచి, అకస్మాత్తుగా చీకట్లు కమ్ముకొనినట్లుండుట, కీళ్ళునొచ్చుట, ఆవలింతలు-ఈలక్షణములుగలది వాతపిత్తజ్వరమని తెలియవలయు.

శిరో ర్తిమూర్ఛావమిదాహమోహాః
కంఠాస్యశోషారతిపర్వభేదః,
ఉన్నిద్రితాతృట్ భ్రమరోమహర్షాః
జృంభాతివాక్త్వంచచలాత్సపిత్తాత్. (బాహటే) 205

తా. తలనొప్పి, మూర్ఛ, వాంతి, సర్వాంగతాపము, మోహము, గొంతు నోరు ఎండుట, పదార్థములయం దిచ్ఛలేకుండుట, కీళ్ళయందు నొప్పి, మిక్కుటముగా దప్పి, తాపము, భ్రమము, గగుర్పాటు, ఆవలింత, అధికముగా మాటలాడుట-ఈలక్షణములు వాత పిత్త జ్వరమునందు కలిగియుండును.

## శ్లేష్మవాతజ్వరలక్షణము

స్తైమిత్యం పర్వణాం భేదో నిద్రాగౌరవమేవచ,
శిరోగ్రహః ప్రతిశ్యాయః కాసస్స్వేదాప్రవర్తనమ్. 206
సంతాపో మధ్యవేగశ్చ వాతశ్లేష్మజ్వరాకృతిః. (మతాంతరే)

తా. శరీరము తడిగుడ్డచే గప్పబడినటుల నిశ్చలముగ నుండుట, కీళ్లనొచ్చుట, నిద్ర, అంగములు జడముగ నుండుట, తలబరువుగ నుండుట, పీనసము, కాసము, స్వల్పముగా చెమటపట్టుట, శరీరములో సంతాపము, జ్వరమునకు మధ్యవేగము - ఈలక్షణములుగలది వాతశ్లేష్మజ్వర మని తెలియవలయు.

తాపహానిర్యరుచిపర్వశిరోరుక్పీనసశ్వసనకాసవిబంధాః,

తా. మాతృగమనము చేసినవానికి మధుమేహమును, చవతితల్లిగమనము జేసిన వానికి జలమేహమును, సహోదరీగమనము జేసినవానికి ఇక్షుమేహమును జనించును. వానినివారణార్థంబై జెప్పఁబడిన ప్రాయశ్చిత్తములను క్రమముగ ఆరు, ఐదు, మూడు సంవత్సరములు జేయవలయును.

ఉదరకర్మవిపాకము

యో బ్రహ్మావిష్ణురుద్రాణాం మధ్యేచైకం విభావయేత్. 161
సాధయే దురదవ్యాధియుక్తో భవతి మానవః,

తా. ఎవఁడు బ్రహ్మ, విష్ణు, రుద్రులలో నొకని నేయధికముగ భావించి సాధించెడినో అట్టివానికి ఉదరరోగము గలుగును.

శమనము

కుర్యా త్కృచ్ఛ్రం చాతికృచ్ఛ్రం చాంద్రాయణ మథాపరమ్. 162
సహస్రకలశస్నాన మీశ్వరస్యతు కారయేత్,

తా. ఉదరరోగనివారణార్థంబై కృచ్ఛ్ర, అతికృచ్ఛ్ర, చాంద్రాయణాదిప్రాయశ్చిత్తములను, రుద్రునికి వెయ్యికలశములతో నభిషేకమును చేయవలయును.

జలోదరకర్మవిపాకము

రాజ్ఞావాతు నియుక్తేన నియుక్తో ధర్మనిశ్చయే,
పురోహితః ప్రాడ్వివాక స్సచివో వాన్యథా చరేత్. 163
జలోదరత్వం ప్రాప్నోతి తస్య వక్ష్యామి నిష్కృతిం,

తా. ధర్మనిర్ణయమునకై నియమింపఁబడిన రాజుగాని, లేక రాజుచే నియమింపఁబడిన పురోహితుఁడుగాని, న్యాయాధిపతిగాని, మంత్రిగాని - న్యాయవిరుద్ధముగ జరిగించిన జలోదరము గలుగును. దానికి శాంతిని వచించెదను.

శమనము

పయసా వర్తయే న్మాసత్రితయం వ్రతముత్తమమ్. 164
సహస్రకలశస్నానం మహాదేవస్యచైవహి,
భోజయేచ్చ శతంవిప్రా న్ముచ్యతే కిల్బిషాత్తతః. 165

తా. జలోదరశమనార్థంబై మూడుమాసములు పయోవ్రతమును, మహాదేవునకు సహస్రకలశస్నానమును చేయించి నూరుబ్రాహ్మణులకు భోజనం బిడవలయును.

ఉదరకర్మవిపాకము

గర్భపాతనజారోగా యకృత్ప్లీహజలోదరాః,
తేషాం ప్రశమనార్థాయ ప్రాయశ్చిత్తమిదం స్మృతమ్. 166

తా. గర్భపాతము గలుగ జేయుటచే యకృత్ప్లీహా, జలోదరము జనించును. వాని శమనార్థమై ప్రాయశ్చిత్తమును వచించెదను.

శమనము

ఏతేషు దద్యాద్విప్రాయ జలధేనుం విధానతః,
సువర్ణరౌప్యతామ్రాణాం పలత్రయసమన్వితామ్. 167

తా. పైఁజెప్పఁబడిన రోగశమనార్థంబై బ్రాహ్మణులకు విధ్యుక్తముగ మూడు పలములయెత్తు బంగారునేని, వెండినేని, తామ్రమునేని జలధేనువుతోడ దానముసేయ వలయును.

ప్లీహోదరకర్మవిపాకము

భృతకాధ్యాపకోయస్తు కన్యాదూషణతత్పరః,
ప్లీహావాన్ సంభవే ద్విప్రో జపే చ్ఛ్రీసూక్తమేవహి. 168

తా. వేతనముదీసికొని నధ్యయనము జెప్పెడువాఁడును, కన్యాదూషణము జేసెడి వాఁడును ప్లీహరోగపీడితుండగును. తచ్ఛమనార్థంబై శ్రీసూక్తజపమును జేయవలయును.

శమనము

అయుతత్రయసంఖ్యాకం ప్లీహోదరవిముక్తయే,
ప్రత్యృచంచ భవే ద్ధోమ శ్చరుణా సర్పిషా పృథక్. 169

తా. ప్లీహోదరముగలవాఁడు ముప్పదివేలమార్లు శ్రీసూక్తమును జపింపవలయును. మఱియు ప్రతిబుక్కు చేతఅన్నాజ్యముల ప్రత్యేకప్రత్యేకముగ హోమము జేయవలయు.

శోఫకర్మవిపాకము

అద్రౌమార్గే నదీతీరే ఛాయాయాం పులినే నరః,
మూత్రం పురీషం వల్మీకే యత్ప్రిముంచే జ్జలేపివా. 170
శ్వయథువ్యాధిమాప్నోతీత్యేవమాహ సదాశివః,
ఇంద్రంవఇతిమంత్రంహి జపేదష్టోత్తరాయుతమ్. 171
ఆపోహిష్ఠేతి హోమస్స్యా చ్చరుణా సర్పిషాయుతం,

తా. పర్వతము, మార్గము, నదీతీరము, నీడ, ఇసుకదిన్నె, పుట్ట, జలము అను వానియందు మూత్రమునుగాని, మలమునుగాని విసర్జనము సేయువానికి శోఫరోగము గలుగునని మహాదేవుఁడు వచించెను. తద్దోషశమనార్థంబై "ఇంద్రంవఇతి" అనుమంత్ర ముతో ౧౦౦౦౮ అష్టోత్తరజపమును "ఆపోహిష్ఠేతి" అనుమంత్రముతో అన్నాజ్య హోమములను జేయవలయును.

శోఫహరప్రతిమాదానము

శోఫః పంచకరస్త్రీక్ష్ణో దశాస్య శ్శరచాపధృక్. 172

దధానం ఛురికా ఘంటాం కులిశంచ కృశ స్తథా,

తా. శోఫరోగమున ఐదుచేతులు, పదిముఖములు, క్రూరత్వము, బాణము ధనుస్సు, కత్తి, గంట, వజ్రము అనువానిని ధరించుకొని శరీరము కృశించియుండునటుల రోగప్రతిమం జేసి దానముజేయవలయును.

## గళగండకర్మవిపాకము

గళగండీ గణద్రవ్యహర్తా భవతి మానవః. 173
దానేన తత్ప్రతీకారం వక్ష్యామి శృణు భాస్కర,
మాణిక్యం పద్మరాగంచ వజ్రమౌక్తికమేవచ. 174
వైడూర్యం పుష్యరాగంచ నీలం మరకతం తథా,
ఏభిర్మాలాం ప్రకుర్వీత సూత్రమన్యత్ర రాజతమ్. 175
అలాభే మౌక్తికాద్యన్యతమైర్మాలాం ప్రకల్పయేత్,
సర్వత్ర రాజతం సూత్రమితి వేదే ప్రకల్పితమ్. 176
తామ్రపాత్రే వినిక్షిప్య తిలానా ముపరిన్యసేత్,
తిలానాంచ పరీమాణం ద్రోణపంచకమిష్యతే. 177

వా. తతఊర్ధ్వం నవగ్రహాదిమహాశాంతిం కుర్యాత్. రత్నమాలాం పూజయిత్వా వేదశాస్త్రవిదే బ్రాహ్మణాయ దద్యాత్.

తా. సముదాయద్రవ్యము నపహరించువానికి గళగండరోగము గలుగును. తన్నివారణార్థంబై మాణిక్యము, పద్మరాగము, వజ్రము, ముత్తియములు, వైడూర్యము, పుష్యరాగము, ఇంద్రనీలమణి, పచ్చలు అనువానినిగాని, వానిలో దొరికెడివానినిగాని వెండితీఁగెలో జేర్చి మాలికజేసి తామ్రపాత్రయం దైదుద్రోణములయెత్తు నువ్వులు పోసి దానిపై నామాలిక నునిచి నవగ్రహాది మహాశాంతింజేసి పూజించి వేదశాస్త్ర సంపన్నుం డగు బ్రాహ్మణునికి దానము జేయవలయును.

## గండమాలకర్మవిపాకము

అధ్యాపయతి శిష్యాంస్తు యః ప్రతార్యగురు స్తథా,
శిష్యో గురుం వంచయిత్వా యోధితే శృణుతస్యచ. 179
జాయతే గండమాలాఖ్యో రోగ స్తదుపశాంతయే,
అభక్ష్యపానపాయీవా గండమాలి భవేన్నరః. 180
కృచ్ఛ్రత్రయం ప్రకుర్వీత చాంద్రాయణ మథాపరం,
అష్టోత్తరసహస్రంతు జపేత్పురుషసూక్తకమ్. 181
సౌరమంత్రజప స్తద్వచ్ఛక్త్యా బ్రాహ్మణభోజనం,

ఇతి కృత్వా నరస్సమ్యగ్గళగండా ద్విముచ్యతే. 182

తా. గురువు శిష్యుని వంచించి యధ్యయనము చెప్పుటవలనగాని, లేక శిష్యుడు గురువును వంచించి యధ్యయనము సేయుటవలనగాని, లేక అభక్ష్యభక్షణములవలన గాని, మద్యాదిపానములవలనగాని గండమాల జనించును. తన్నివారణార్థంబై మూడు కృచ్ఛ్రములు, లేక చాంద్రాయణము, అష్టోత్తరసహస్ర పురుషసూక్తజపము, లేక అష్టోత్తరసహస్ర సౌరమంత్రజపము, బ్రాహ్మణసంతర్పణ మొదలగు నుపచారముల శక్త్యనుగుణ్యముగ జేయవలయును.

## శ్లీపదకర్మవిపాకము

స్వగోత్రాయాభిగమనా చ్ఛ్లీపదీ జాయతే నరః,
యోన్యామసృక్చ స్రవతి తత్ర చాంద్రాయణం చరేత్. 183
మాంసం పయోవ్రతంచైవ తస్మాద్రోగాత్ప్రముచ్యతే,

తా. స్వగోత్రస్త్రీతో సంగమముజేయువానికి శ్లీపదరోగము జనించును. మఱియు, స్త్రీ స్వగోత్రపురుషునితో సంగమముజేసిన యోనివలన రక్తస్రావము గలుగును. వానిశమనార్థంబై చాంద్రాయణప్రాయశ్చిత్తమును, ఒకమాసమువఱకు పయోవ్రతమును జేయవలయును.

## శ్లీపదరోగప్రతిమాదానము

శ్లీపదస్త్రీపదః కుంతః పతఙ్క్షురధనుర్ధరః. 184

తా. మూడుపాదములు, కుంతత్వము, వినుగకాలుంగలదై దిగువబడునటులనుండు నట్టి శ్లీపదరూపప్రతిమను జేయించి దానముజేయవలయును.

## మస్తకవ్రణకర్మవిపాకము

జాత్యుత్తమస్త్రీగమనా జ్జాయతే మస్తకవ్రణీ,
తత్పాతకవిశుద్ధ్యర్థం ప్రాజాపత్యవ్రతం చరేత్. 185

తా. ఉత్తమజాతిగలస్త్రీతో సంగమముజేయువానికి శిరమున వ్రణము గలుగును. తద్దోషనివారణార్థంబై ప్రాజాపత్యవ్రతమును జేయవలయును.

## భగందరకర్మవిపాకము

స్వగోత్రస్త్రీప్రసంగేన జాయతేచ భగందరీ,
తేనాపి నిష్కృతిః కార్యా మేషీదానేన యత్నతః. 186
దేవానాంచ ముఖం హవ్యవాహనస్సర్వపూజితః,
తస్మాత్వం వాహనం పూజ్యం దేవైస్సేంద్రైర్మహర్షిభిః. 187
భగందరః పూర్వకర్మవిపాకోత్థంతు యన్మమ,

తత్సర్వం నాశయ శీఘ్రం సౌఖ్యంచాపి ప్రవర్ధయ. 188

తా. స్వగోత్రస్త్రీతో సంగమము సేయువానికి భగందరము గలుగును. తన్నివారణార్థంబై (బంగారుగిట్టలు, వెండికొమ్ములు మొదలగువానితో నలంకరింపఁబడిన) మేకను "దేవానాం యోముఖం హవ్య" మనుమంత్రముతో స్తుతించి దానము చేయవలయును.

## ఉపదంశకర్మవిపాకము

మాతృగామీ భవేద్యస్తు తస్య లింగం వినశ్యతి,
చాండాలీగమనేచైవ హీనకుష్ఠః ప్రజాయతే. 189
తస్య ప్రతిక్రియాం కర్తుం కుంభ ముత్తరతో న్యసేత్,

వా. తత్రోపరి కుబేరప్రతిమాం సౌవర్ణీం కృష్ణవస్త్రావృతాం మాల్యభూషితా మావాహనాది షోడశోపచారైః ప్రత్యహం పూజయేత్. అధర్వణవేదపారాయణం కుర్యాత్. సమాప్తే పారాయణే ప్రతిమా బ్రాహ్మణాయ దద్యాత్. దానమంత్రః. 190

నిధీనా మధిపో దేవ శ్శంకరస్య ప్రియస్సఖా,
సౌమ్యాశాధిపతి శ్శ్రీమా న్మమపాపం వ్యపోహతు. 191
ఇమంమంత్రం సముచ్చార్య హ్యాచార్యా య యథావిధి,
దద్యాదేవం హీనకుష్ఠీ లింగనాశీచ శుద్ధ్యతి. 192

తా. మాతృగమనము సేయువానికి లింగనాశనము గలుగును. మఱియు చండాలస్త్రీగమనము సేయువానికి శ్వేతకుష్ఠువు గలుగును. తద్దోషనివారణార్థంబై అగ్నికి నుత్తరదిశయందు కలశమును స్థాపించి దానిపై బంగారుతో కుబేరప్రతిమం జేసి యునిచి నల్లనివస్త్రముగట్టి పుష్పమాలికలచే నలంకరించి ప్రతిదిన మావాహనాది షోడశోపచారములచే బూజించి దాని కెదురుగ అథర్వణవేదపారాయణమును జేసి సమాప్తియైన పిదప నాప్రతిమను "నిధీనా మధిపో దేవేత్యాది" మంత్రముతో యథావిధిగ నాచార్యునికి దానము జేసిన హీనకుష్ఠము, లింగనాశనరోగము నివర్తించును.

## కుష్ఠరోగకర్మవిపాకము

పరుషం భాషతే వర్థ్యం సత్వగ్దోషయుతో భవేత్,
చాంద్రాయణత్రయం కుర్యా త్పశ్చిద్దద్యా దౌషధానిచ. 193
వైద్యశోక్తాని విప్రాయ శక్త్యా బ్రాహ్మణభోజనం,

తా. మఱియొకనితో కఠోరముగ, వ్యర్థముగ మాటలాడువానికి కుష్ఠురోగము గలుగును. తన్నివారణార్థంబై మూడుచాంద్రాయణ కృచ్ఛ్రముల జేసి వైద్యశాస్త్రము

నందు జెప్పంబడియుండునౌషధములను శక్త్యనుగుణముగ బ్రాహ్మణుని కియ్యవలయును. మఱియు శక్త్యనుగుణ్యముగ బ్రాహ్మణసంతర్పణమును జేయవలయును.

దుశ్చర్మత్వహారము

గురుతల్పగదోషాచ్చ గవి మైథునదోషతః. 194
దుశ్చర్మాస్యాదసౌ కుర్యా ద్గురుతల్పాతిదేశతః,
చాంద్రాయణత్రయం కుర్యా త్తతోదోషా త్ప్రముచ్యతే. 195

తా. గురుభార్యతోగాని, లేక గోవుతోగాని సంగమముసేయువానికి కుష్ఠువు గలుగును. తన్నివారణార్థంబై మూఁడు చాంద్రాయణముల జేయవలయును.

ముఖరోగ కర్మవిపాకము

కూటసాక్షీ భవే ద్వక్త్రరోగీ శోణితపిత్తవాన్,
కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌ కుర్వీత చాంద్రాయణ మథాపరమ్. 196
కుర్యా త్కూష్మాండహోమంచ గాయత్రీ మయుతం జపేత్,
దద్యా ద్ధిరణ్యం వ్రీహీంశ్చ ముఖరోగస్య శాంతయే. 197

తా. తప్పుసాక్ష్యము సెప్పెడువానికి ముఖరోగము, రక్తపిత్తరోగము గలుగును. తన్నివారణార్థంబై కృచ్ఛ్ర, అతికృచ్ఛ్ర, చాంద్రాయణప్రాయశ్చిత్తముల జేసికొని కూశ్మాండహోమమును, పదివేలమారులు గాయత్రీజపమును జేసి సువర్ణమును, ధాన్యమును దానము జేయవలయును.

కర్ణరోగకర్మవిపాకము

మాతాపితృగురూణాంచ దేవబ్రాహ్మణయో స్తథా,
శృణోతి నిందాం బుద్ధ్యా యః కర్ణాభ్యాం తస్యశోణితమ్. 198
పూయంచైవ ప్రవత్యస్య శాంతిః కృచ్ఛ్రచతుష్టయాత్,
హిరణ్యరక్తవస్త్రాణాం దానా ద్బ్రాహ్మణభోజనాత్. 199
జపాద్ధోమాచ్చ భవతి సౌరమంత్రేణ శక్తితః.

తా. తల్లి, తండ్రి, గురువు, దేవతలు, బ్రాహ్మణులు మొదలగువారినిందను బుద్ధిపూర్వకముగ వినుచుండినవానికి చెవియందు రక్తము, చీము, స్రవించును. తన్నివారణార్థంబై నాలుగుప్రాజాపత్యకృచ్ఛ్రప్రాయశ్చిత్తములంజేసి బంగారును ఎఱ్ఱనివస్త్రమును దానముసేయుటయేగాక బ్రాహ్మణసంతర్పణను, శక్త్యనుగుణముగ సౌరమంత్రజపహోమములను జేయవలయును.

చతుర్వింశ ప్రకరణమ్.

# పంచవింశప్రకరణము



## రసగంధకాది ద్రవ్యశుద్ధినిరూపణః

శ్లో. విశ్వనాథం జగన్నాథం లోకనాథం జగద్గురుం,
సర్వజ్ఞం పార్వతీనాథం లింగమూర్తి మహం భజే. 1

తా. సకలప్రపంచమునకు ప్రభువు, జంగమప్రపంచమునకు ప్రభువు, స్థావర ప్రపంచమునకు ప్రభువు, జగద్గురువు, సర్వజ్ఞుఁడు, లింగమూర్తిస్వరూపుఁడు నగు పార్వతీపతిని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేర్కొనంబడిననేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథము యొక్క పంచవింశప్రకరణమును వచియింపుచున్నాఁడను.

### పారదోత్పత్తి

స్కందా త్తారకహింసార్థం కైలాసే ప్రార్థితస్సురైః,
కరుణాత్మా మహాదేవః పార్వతీవల్లభ శ్శివః. 3
రతౌ శంభోః చ్యుతం రేతో గృహీతం వహ్నినా ముఖే,
క్షిప్తం తేన చతుర్దిక్షు క్షమాయాం తత్పృథక్పృథక్. 4
సౌమ్యాది దిక్త్రయస్యాంత ర్గౌరీశాపా న్నకార్యకృత్,
పశ్చిమాయాంతు యత్క్షిప్తం దిశి తత్సర్వకార్యకృత్. 5
ఏతోత్పత్తి స్సమాఖ్యాతా పారదస్య మనీషిభిః, (ఆయుర్వేదే)

తా. తారకాసురవధార్థమై కుమారస్వామిని జనింపఁజేయవలయునని కరుణాత్ముండును, మహాదేవుండును, పార్వతీవల్లభుఁడును నగునీశ్వరుని దేవేంద్రుఁడు మొదలగు సమస్తదేవతలు ప్రార్థింప నతండు కుమారస్వామి జననిమిత్తార్థమై పార్వతితో సంభోగముజేయ వీర్యము పతనంబయ్యెను. దాని నగ్ని గ్రహించి భరింపనేరక భూమి యందు విడిచిన నది నలుదిక్కులయందు వెవ్వేరుగ వ్యాపించెను. అందుత్తర ప్రాగ్దక్షిణ దిశలయందు పడినరసము గౌరీశాపముచే నిష్ఫలం బగుటంజేసి అది యేకార్యమునందు నుపయోగింపకుండును. పశ్చిమదిశయందు పడినరసము సమస్తకార్యములయం దుపయోగించును. ఇత్తెఱంగున రసోత్పత్తిక్రమము నాయుర్వేదవేత్తలచే జెప్పంబడియెను.

### రసభేదతల్లక్షణములు

రసో విప్ర స్సితో రక్తః క్షత్రియః పీతరుగ్విశః. 6
శూద్రః కృష్ణ ఇతిప్రోక్తో వర్ణభేదా చ్చతుర్విధః,
బ్రాహ్మణః కల్ప్యతే కల్పే గుటికాయంచ బాహుకః. 7
ధాతువాదే తథావైశ్య శూద్ర శ్చేతరకర్మణి,
అంతస్సునీలోజహిరుజ్జ్వలాంగోమధ్యాహ్నసూర్యప్రతిమప్రకాశః,
శస్తోథధూమ్రః పరిపాండురశ్చ చిత్రస్తుయోజ్యోరసకర్మసిద్ధ్యై 8

తా. పాదరసము వర్ణభేదములచే నాలుగువిధంబులు. అందు తెల్లగ నుండునది బ్రాహ్మణజాతి యనియు, ఎఱ్ఱగ నుండునది క్షత్రియజాతి యనియు, పచ్చగ నుండునది వైశ్యజాతి యనియు, నల్లగ నుండునది శూద్రజాతి యనియు జెప్పంబడును. వానిలో బ్రాహ్మణజాతి కల్పవిషయమునందును, క్షత్రియజాతి గుటికలయందును, వైశ్యజాతి ధాతువాదమునందును, శూద్రజాతి యితరకర్మలయందు నుపయోగించును. మఱియులోన నీలవర్ణము, వెలపట చాకచక్యముగలదై మధ్యాహ్నసూర్యునితో సమానమైన కాంతి గలదై ధూమ్రవర్ణము, తెలుపువర్ణము, చిత్రవర్ణము గలదై ప్రశస్తముగనుండు రసమును సర్వౌషధములయందు నుపయోగింపందగును.

### రసమాహాత్మ్యము

అథాన్యత్సంప్రవక్ష్యామి సంక్షిప్తం సూక్తముత్తమం,
ఆయుర్వేదోపదేశేఽస్మిన్ రసశుద్ధి ర్నిగద్యతే. 9
శుష్కేంధనమహారాజిం యద్వద్దహతి పావకః,
తద్వద్ధాతుగతా న్సూత స్సూతదోషా స్త్రయోదశ. 10
దర్శనా ద్రసరాజస్య బ్రహ్మహత్యా వ్యపోహతి,
స్పర్శనా న్నాశయే ద్దేవి గోహత్యాం నాత్ర సంశయః. 11
కింపునర్భక్షణా ద్దేవి ప్రాప్యతే పరమంపదం,
దోషహీనో రసో బ్రహ్మా మూర్ఛితస్తు జనార్దనః. 12
మారితో రుద్రరూపస్స్యా ద్బద్ధస్సాక్షాన్మహేశ్వరః,
వేధకో దేహలోహాభ్యాం సూత స్సాక్షాత్సదాశివః. 13

తా. ఇక నాయుర్వేదమున జెప్పంబడిన ప్రకారము రసశుద్ధిని వచించెదను. "ఎండినకట్టెల సమూహము నగ్నిహోత్రుడు దహింపంజేయుభంగి" ధాతుగతదోషములను పాదరసము దహింపంజేయును. ఐనను రసమునందు ౧౩ దోషంబులు గలవు. మఱియు రసమును దర్శించుటవలన బ్రహ్మహత్యాజనితదోషము నివర్తించును. దానిస్పర్శ

సమువలన గోహత్యజనితదోషము నిస్సంశయముగ నివర్తించి దానిసేవనవలన స్వర్గాది పరమపదములు గలుగును. దోషరహితమైనరసము బ్రహ్మస్వరూపము. మూర్ఛ జెందింపఁబడినరసము విష్ణుస్వరూపము. భస్మముజేయఁబడినరసము రుద్రస్వరూపము. బంధింపఁబడిన రసముమహేశ్వరస్వరూపము దేహలోహములచే వేధింపఁబడినరసము సదాశివస్వరూపము.

## (రసనామభేదలక్షణతత్ప్రయోజనము)

పారదో రసధాతుశ్చ రసలోహో మహారసః,
చతుర్విధో రసో జ్ఞేయో రసేంద్ర ఇతి భేదతః. 14
ఆకృష్ణ శ్చపలో రూక్షో రసేంద్రః పరికీర్తితః,
పారద శ్శుకవర్ణస్స్యా త్కించిత్కాల ఇవాదృతః. 15
ఆపీతకాంతి రూక్షశ్చ సూతకః పరికీర్తితః,
మయూరపింఛికాకారో రసకశ్చ విదుర్బుధాః. 16
రసేంద్రో రసకర్మార్థః పారదో రోగనాశనః,
సూతక స్సర్వకార్యార్థో రసో యోజ్యో రసాయనే. 17

తా. పారదము, రసధాతువు, రసలోహము, మహారసము అనునవి పాదరస నామంబులు. ఆరసము రసేంద్రము, పారదము, సూతకము, రసకము అన నాలుగు విధంబులు. అందొకింత నల్లగ, చంచలముగ, రూక్షముగ నుండునది రసేంద్రమనియుఁ, చిలుకవన్నెగలదై యొకింత నలుపువర్ణముగ నుండునది పారద మనియు, ఒకింత పచ్చనై రూక్షముగ నుండునది సూతక మనియు, నెమలిపించపుఛాయగలదిగ నుండునది రసక మనియు జెప్పంబడును. రసేంద్ర మనుదానిని రసకర్మలయందును, పారద మనుదానిని రోగ హరక్రియలయందును, సూతకమనుదానిని సర్వక్రియలయందును, రసకమను దానిని రసాయనమునందును గ్రహింపందగును.

## రసదోషాష్టకము

ఉండినంచాపి కౌటిల్య మనవర్తంచ సంకరం,
షండత్వ పంగుకారిత్వ సమలత్వగురుత్వతః. 18
సవిషత్వంచసూతస్య చాష్టదోషాః ప్రకీర్తితాః, (మాధవనిదానే)

తా. ఉండినదోషము, కౌటిల్యదోషము, అనవర్తదోషము, సంకరదోషము, షండత్వదోషము, పంగుదోషము, బరువుగనుండుటవలన మలదోషము, సవిషత్వదోషము అను నెనిమిది దోషములు రసమునందుండును (ఈదోషములు గలరసమును శుద్ధిజేయక ఔషధములలో బ్రయోగించినను, లేక సేవించినను రోగములు జనించును. అవెవ్వియనిన)

### దోషాష్టకయుక్తపారదసేవజనితరోగములు

ఉండినే శూలదోషస్స్యాత్ కౌటిల్యేస్యాత్ కపాలరుక్. 19
అనవర్తే భ్రమశ్చైవ సంకరే ధాతుసంకరః,
షండత్వే స్యాదసంతానో పంగుత్వే దాహకుష్ఠకృత్. 20
మలే జ్వరశ్చ మూర్ఛా చ విషత్వే చ క్షయో భవేత్.

తా. ఉండినదోషమువలన శూలయు, కౌటిల్యదోషమువలన కపాలరోగంబును, నవర్తదోషమువలన భ్రమయు, సంకరదోషమువలన ధాతుసాంకర్యంబును గలుగును. షండత్వదోషమువలన సంతానము గలుగకుండును. పంగుత్వదోషమువలన దాహంబేని, కుష్ఠరోగంబేని గలుగును. మలదోషమువలన జ్వరము, మూర్ఛ గలుగును. విషదోషమువలన శరీరము క్షయించును.

### రసదోషాష్టకము

నాగో వంగో మలో వహ్నిశ్చాంచల్యం చ విషం గిరిః. 21
అసహ్యాగ్నిర్మహాదోషా నిసర్గాః పారదే స్థితాః, (ఆయుర్వేదే)

తా. రసమునందు నాగ, వంగ, మల, వహ్ని, చాంచల్య, విష, గిరి, అసహ్యాగ్నులనెనిమిదివిధములైన దోషంబు లుండును.

### రసదోషాష్టకజనితరోగములు

జాడ్యం గండస్తమో నాగాత్కుష్ఠం వంగాద్రజో మలాత్.
దాహో వహ్నేర్బీజనాశశ్చాంచల్యాన్మరణం విషాత్,
గిరేస్స్ఫోటాగ్న్యసహాత్తా దోషాన్మోహోఽభిజాయతే, 23
విషం వహ్నిర్మలశ్చేతి దోషా ముఖ్యతమాస్త్రయః,
ఇమే మరణసంతాపమూర్ఛానాం హేతవః క్రమాత్. 24
యౌగికౌ నాగవంగౌ ద్వౌ తౌ జాడ్యాధ్మానకుష్ఠదౌ,

తా. రసమునందలి నాగదోషమువలన జాడ్యము, గండమాల, తామసము గలుగును. వంగదోషమువలన కుష్ఠువును, మలదోషమువలన రజస్సును, అగ్నిదోషమువలన దాహమును, చాంచల్యదోషమువలన శుక్రనాశనమును, విషదోషమువలన మరణంబును, గిరిదోషమువలన శరీరమున పొక్కులును, అసహ్యాగ్నిదోషమువలన మోహమును గలుగును. ఈయెనిమిదివిధములైన దోషములలో విష, వహ్ని, మలములను మూడుదోషములు ముఖ్యంబులు. అట్లగుటచే నవి మరణము, సంతాపము, మూర్ఛ అనువానిని క్రమముగా గలుగంజేయును. మఱియు నాగ, వంగ దోషములు యోగార్థముగలవి యగుటం జాడ్యాధ్మానకుష్ఠువుల గలుగంజేయును.

శీతజాడ్యతిమిరభ్రమతంద్రాశ్లేష్మవాతజనితజ్వరలింగమ్. 208

తా. తాపములేకుండుట, అరుచి, కీళ్ళయందునొప్పి, తలనొప్పి,పీనసము, శ్వాసము, కాసము, మలబంధము, శైత్యము, జాడ్యము, తిమిరరోగము, భ్రమ, తంద్ర-ఈలక్షణములు శ్లేష్మవాతజ్వరమునందు కలిగియుండును.

## శ్లేష్మపిత్తజ్వరలక్షణము

లిప్తతిక్తాస్యతాతంద్రామోహాః కాసోఽరుచిస్తృషా,
ముహుర్దాహోముహుశ్శీతంశ్లేష్మపిత్తజ్వరాకృతిః. (మతాంతరే)

తా. నోరుఅంటుకొని చేదుగనుండుట, తంద్ర, మోహము, కాస, అరుచి, దప్పి, ప్రతిక్షణమునందు దాహము, ప్రతిక్షణమునందు శీతలము-ఈలక్షణములుగలది శ్లేష్మపిత్తజ్వర మని తెలియవలయు.

## ద్వంద్వజ్వరలక్షణము

తృట్చమోహభ్రమదాహపీడతా స్వప్నహానిరతిశీర్షవేదనా,
రోమహర్ష మరుచిర్జ్వరంతథా శ్వాసకాసమితి కథ్యతేబుధైః. 210
స్వేదహానిభ్రమకంపశోషణం ద్వంద్వజన్యమితి కథ్యతే శృణు.
(మాధవనిదానే)

తా. దప్పి, మూర్ఛ, భ్రమ, దాహము, నిదురరాకుండుట, అధికముగా తలనొచ్చుట గగుర్పాటుచుట, అరుచి, కడుజ్వరము, శ్వాసకాసలు, చెమటపట్టకుండుట, తబ్బిబ్బులాడుట, వణుకుట, శోష - ఈలక్షణములు గలది ద్వంద్వజ్వర మని విద్వాంసులచేఁ జెప్పఁబడినది.

## సన్నిపాతజ్వరలక్షణము

రాత్రౌ జాగరణం దివాచ కృశతా మూర్ఛాతిదాహో మరు
చ్ఛీతం స్వేదప్రలాపసం మదతృషాహాస్యంచ హృత్పీడనం,
కాసశ్వాసవిదాహశైత్యజ్వరితాతృష్ణా [1]శిరోరోధనం
జిహ్వాదగ్ధకృశత్వ [2]మంగపులకం స్యాత్సన్నిపాతజ్వరే. 211
(మాధవనిదానే)

తా. రాత్రి మేల్కొనియుండుట, పగలు కృశించియుండుట, మూర్ఛ, శరీరమునందు దాహము, వాతము ప్రకోపించియుండుట, చలిబెట్టుట, చెమటపట్టుట, అసంగతముగ మాటలాడుట, మదము, నవ్వుట, ఱొమ్మునొచ్చుట, లేక ఱొమ్ములో మండుట,

1 శిరస్తోదనమ్. 2 కాయపులకమ్.

## రసస_ప్తకంచుకదోషములు

నాగో వంగో మలాగ్ని ర్విష గిరి చపలా స్స_ప్తసూతస్యదోషాః
నాగా ద్గండాలిరోగం జనయతి బహుశః కుష్ఠ వంగే చ వంగాత్,
జ్ఞాత్వాజ్ఞానంమలాస్యాన్మరణమపివిషాద్దాహమోహౌచవహ్నేః
జాడ్యం శైలాచ్చ వీర్యచ్యుతిరపి చపలా త్పారదశ్శోధ్యతే న. 25

తా. రసమునందు నాగ, వంగ, మల, అగ్ని, విష, గిరి, చాపలము లన స_ప్తకంచుకదోషములు గలవు. అందు నాగదోషమువలన గండమాలయు, వంగదోషమువలన కుష్ఠువును, మలదోషమువలన అజ్ఞానమును, విషదోషమువలన మరణంబును, అగ్నిదోషమువలన దాహమోహములును, గిరిదోషమువలన జాడ్యమును, చపలదోషమువలన వీర్యనాశనమును గలుగును. కావున రసమునందలి స_ప్తకంచుకదోషములు నివ_ర్తించుటకై దానిని శుద్ధిచేయవలయును.

## రసస_ప్తకంచుకదోషతజ్జనితరోగములు

నాగం వంగం మలం వహ్ని శ్చాంచల్యం చ గిరి ర్విషం,
పారదే కంచుకాస్స_ప్త సంతి నైసర్గికాయతః. 26
ఏతేతు స_ప్తదోషాశ్చ కుర్వంతి ప్రాణసంకటం,
నాగేన జాయతే గండం కుష్ఠం వంగేన జాయతే. 27
విషదోషా ద్భవే న్మృత్యు ర్గిరికే జాడ్యతామపి,
కంచుకే హన్యతే వీర్యం తస్మా ద్దోషవివర్జితః. 28

తా. పాదరసమున నాగ, వంగ, మల, అగ్ని, చాంచల్య, గిరి, విషజము లనునేడు స_ప్తకంచుకదోషంబులు స్వాభావికముగ గలిగియుండును. కావున నట్టిస_ప్తవిధదోషంబులుగల రసమువలన ప్రాణసంకటము గలుగును. మఱియు నాగదోషమువలన గండమాలయు, వంగదోషమువలన కుష్ఠువును, విషదోషమువలన మరణంబును, గిరిదోషమువలన జాడ్యంబును, కంచుకదోషమువలన వీర్యనష్టంబును గలుగును. కావున నట్టిదోషములుగల యశుద్ధమైన రసమును వర్జింపవలయును.

## రసశుద్ధాశుద్ధగుణములు

దోషహీనో యదాసూత స్తదా మృత్యు జరాపహః,
సాక్షా దమృతమప్యేష దోషయుక్తో రసో విషమ్. 29

తా. శుద్ధిచే దోషరహితంబైనరసము మృత్యువును, ముదిమిని హరింపంజేయుటయేగాక ప్రత్యక్షముగ నమృతతుల్యంబై యుండును. దోషయు_క్తరసము విషముతో సమానంబై యుండును.

తస్మా ద్దోషనివృత్త్యర్థం రసశుద్ధి ర్విధీయతే. 30

తా. కావున దోషము నివర్తించుటకై రసమునకు శుద్ధి విధింపఁబడుచున్నయది.

రసశుద్ధిక్రమము

రసో గ్రాహ్య స్స్వకక్షేత్రే పలానాం శతసమ్మితం,
పంచాశ త్పంచవింశ ద్ద్వాదశ పంచైక మేవ వా. 31
పలా దూనో న కర్తవ్యో రససంస్కార ఉత్తమైః,

తా. రసమును మంచినక్షత్రమున నూఱుపలములుగాని, ఏఁబదిపలములుగాని, నిరువదియైదుపలములుగాని, పన్నెండుపలములుగాని, ఐదుపలములుగాని, ఒకపలముగాని గ్రహించి సంస్కారము జేయవలయును. ఐన నొకపలమునకు తక్కువగ జేయం జనదు.

రససంస్కారమంత్రము

అఘోరఇతి మంత్రేణ రససంస్కారపూజనమ్. 32

తా. అఘోరమంత్రముచే రసమును బూజించి సంస్కారము జేయవలయును.

అమంత్రితపదార్థానాం తేజో నిఘ్నంతి భైరవాః. 33

తా. అమంత్రితపదార్థములయందలి తేజస్సును భైరవు లపహరింతురు.

రసదోషాష్టకనివర్తకోపాయము

అథాత స్సంప్రవక్ష్యామి దోషాష్టకనివారకం,
ఇష్టకా రజనీచూర్ణై ష్షోడశాంశై రసస్యచ. 34
మర్దయే త్తప్తఖల్వే తజ్జంబీరోత్థై ర్ద్రవై ర్దినం,
కాండికే క్షాలయే త్స్నాతం నాగదోషం విముంచతి. 35
విశాలాం కోలచూర్ణేన వంగదోషో వినశ్యతి,
రాజవృక్షో మలం హంతి చిత్రకో వహ్నిదూషణమ్. 36
చాంచల్యం కృష్ణధత్తూర స్త్రిఫలా విషనాశనం,
కటుత్రయం గిరిం హంతి హ్యసహ్యాగ్నిం త్రికంటకః. 37

తా. ఇఁక రసమునందలి అష్టదోషనివర్తకోపాయమును వచించెదను:—రసమునకు పదియాఱవభాగము ఇటికెపొడిని, పసుపుపొడిని జేర్చి నిమ్మపండ్లరసముతో నొకదినము తప్తఖల్వమున మర్దించి కలితో గడిగిన రసమునందలి నాగదోషము నివర్తించును. రసమునకు పదియాఱవభాగము పాపరవేరు, ఊడుగవేరు అనువాని చెక్కచూర్ణమును జేర్చి నిమ్మపండ్లరసము బోసి యిగిరి పోడియగువఱకు మర్దించి కలితోగడిగిన రసము

నందలి వంగదోషము నివర్తించును. శేల వేరుచెక్క, నిమ్మపండ్లరసము వీనితో రసము: మర్దించి కలితో గడిగిన రసమునందలి మలదోషము నివర్తించును. చిత్రమూలపుచెక్క చూర్ణము, నిమ్మపండ్లరసము వీనితో రసమును మర్దించి కలితో గడిగిన అగ్నిదోషవ నివర్తించును. నల్లయుమ్మెత్తవేరుచెక్క, నిమ్మపండ్లరసము వీనితో రసమును మర్దించి కలితో గడిగిన చాంచల్యదోషము నివర్తించును. త్రిఫలచూర్ణము, నిమ్మపండ్లరసము వీనితో రసమును మర్దించి కలితో కడిగిన విషదోషము నివర్తించును. త్రికటుకచూర్ణము, నిమ్మపండ్లరసము వీనితో రసమును మర్దించి కలితో గడిగిన గిరిదోషము నివర్తించును. చిత్రమూల వేళ్ళచూర్ణము, నిమ్మపండ్లరసము వీనితో రసమును మర్దించి కలితో గడగిన అసహ్యాగ్నిదోషము నివర్తించును.

## తప్తఖల్వలక్షణము

ఖల్వే లోహమయేవాథ పాషాణోత్థేప్యథాపి వా,
అజాశకృత్తుషాగ్నిశ్చ భూగర్భే త్రితయం క్షిపేత్. 38
తస్యోపరిస్థితం ఖల్వం తప్తఖల్వమితి స్మృతం,

తా. ఇనుముతోగాని, నల్లజనపరాతితోగాని ఖల్వమును జేయించి యేకాంత గృహమున గుంటత్రవ్వి యందు మేకపెంటికలు, ఊముక, అగ్నివైచి సెగతగులునటుల దానిపై ఖల్వము నునుచుటయె తప్తఖల్వ మనంబడును.

## రసగతసర్వదోషనివర్తకోపాయము

ప్రతిదోషం కలాంశేన తత్రచూర్ణం సకన్యకమ్. 39
సువస్త్రగలితం ఖల్వే సూతే క్షిప్త్వా యథాక్రమం,
ప్రత్యేకం ప్రత్యహం యత్నాత్సప్తరాత్రిం విమర్దయేత్. 40
ఉద్ధృత్య చారనాళేన మృద్భాండే క్షాళయేత్సుధీః,
సర్వదోషవినిర్ముక్తస్సప్తకంచుకవర్జితః. 41
జాయతే శుద్ధసూతోయం యోజయేద్వైద్యకర్మణి,

తా. రససప్తకంచుకదోషనివారణార్థంబై పైజెప్పంబడిన ద్రవ్యములలో ప్రతిదానియొక్క పదియారవపాలుచూర్ణమును, కలబందను గలిపి యొక్కొకదినము చొప్పున నేడుదినములు నిమ్మపండ్లరసముతో రసమును మర్దించి మంటిపాత్రలో నునిచి కలితో గడిగి ఆరనిచ్చి మంచివస్త్రములలో బోసి ఖల్వములో ప్రత్యేక ప్రత్యేకముగ నేడుమార్లు బిడచవలయును. కలితో గడుగునపుడు రసము నురుగువలె తేలును. (కావున నది క్రిందపోకుండా పదిలముగ గడుగవలయును.) ఇటులంజేసిన రసమునందలి సర్వదోషములు, సప్తకంచుకదోషములు నివర్తించి రసము శుద్ధంబగును. అట్టిదాని నౌషధములలో ప్రయోగింపవలయును.

## రసగతదోషతదుపద్రవములు

మల శిఖి విషనామానో రసస్యనైసర్గికాస్త్రయో దోషాః,
మూర్ఛాం మలేన కురుతే శిఖినా దాహం విషేణ మృత్యుంచ.
(గ్రంథాంతరే)

తా. రసమునందు మల, శిఖి, విషములవలన మూడుదోషంబులు స్వాభావికముగ గియుండును. అందు మలదోషమువలన మూర్ఛ, శిఖిదోషమువలన దాహము, విషదో ువలన మృత్యువు గలుగును.

## రసశుద్ధి

గృహకన్యా హంతి మలం త్రిఫలా శిఖి చిత్రకం,
విషం హన్యా త్త్రాళనేన మర్దయే త్సప్తవారకమ్. 43

తా. కలబందపలుకు లిగురుపఅకు నేడుమార్లు రసమును మర్దించి నీళ్ళగడిగిన దోషంబును, త్రిఫలచూర్ణముతో నేడుమార్లు మర్దించి నీళ్ళగడిగిన శిఖిదోషంబును, ్రమూలపు చెక్కచూర్ణముతో నేడుమార్లు మర్దించి నీళ్ళగడిగిప విషదోషంబును ంచును.

ఇష్టకాచూర్ణమాదాయ ఖల్వే మర్ద్యం రసం ద్రవైః,
విషాగ్నిరాజవృక్షస్య కృష్ణాచూర్ణై రసం ద్రవైః. 44

కుమార్యా స్త్రిఫలానాం చ కతకస్యచ గోక్షురైః,
యది సంశోధితం సూతం సర్వకర్మసు యోజయేత్. 45

తా. తొలుత రసమును ఖల్వములో నునిచి యిటికపొడితో మర్దించి గడుగ ును. ఇటులనే అతివస, చిత్రమూలము, రేల, పిప్పలి అనువానిచూర్ణములలో గల రసము గలిపి మర్దించి నీళ్ళ గడుగవలయును. మఱియు త్రిఫలములు, ఇండుపుగింజలు, ుపేళ్లు అనువానిని ప్రత్యేకప్రత్యేకముగ చూర్ణముచేసి ప్రత్యేకప్రత్యేక నిమ్మపండ్లరసము, కలబందరసము గలిపి మర్దించి నీళ్ళగడిగిన రసము శుద్ధియగును. దానిని సర్వయోగములయందు బ్రయోగింపం జనును.

రాజీరసోన మూషాయాం రసం క్షిప్త్వా విబంధయేత్,
వస్త్రేణ డోలికాయంత్రే స్వేదయే త్కాంజికై స్త్ర్యహమ్. 46
దినైకం మర్దయే త్సూతం కుమారీసంభవై ర్ద్రవైః,
తథా చిత్రకజైః క్వాథై ర్మర్దయే దేకవాసరమ్. 47
కాకమాచీరసై స్తద్వ ద్దినమేకం చ మర్దయేత్,
త్రిఫలాయా స్తతః క్వాథైః రసో మర్ద్యః ప్రయత్నతః. 48

తత స్తేభ్యః పృథ క్కుర్యా త్సూతం ప్రక్షాళ్య కాంజికైః,
తతః క్షిప్త్వా రసం ఖల్వే రసాదర్ధం చ సైంధవమ్.
మర్దయే న్నింబుకరసై ర్దినమేక మనారతం,
తతో రాజిరసోనశ్చ ముఖ్యశ్చ నవసాగరః.
ఏతై రససమై స్తద్వత్సూతో మర్ద్య స్తుషాంబునా,
తత స్సంశోష్య చక్రాభం కృత్వా క్షిప్త్వా చ హింగునా.
ద్విస్థాలీ సంపుటే భూత్వా పూరయే ల్లవణేన చ,
అథస్థాలీం తతో ముద్రాం దద్యా ద్దృఢతరాం బుధః. 5
విశోష్యాగ్నిం విధాయాథో నిషించే దంబునోపరి,
తతస్తు కుర్యా త్తీవ్రాగ్నిం తదధః ప్రహరత్రయమ్. 5
ఏవం నిపాతయే దూర్ధ్వం రసో దోషవివర్జితః,
అథోర్ధ్వం పిటరీమధ్యే లగ్నో గ్రాహ్యో రసోత్తమః. 5

తా. ఆవాలు, వెల్లుల్లి, యీరెంటిని నూరి మూసచేసి, అందు పాదరసము బోసి దానిపై వస్త్రముగట్టి డోలాయంత్రములో కలితోడ మూడుదినములు పాకముచే పిదప నాపాదరసమును దీసి ఖల్వములో బోసి కలబందరసము, చిత్రమూలకషాయము కాచియాకు అనువానిరసములలో ప్రతిదానిచే నొక్కొకదినమును, త్రిఫలకషాయము నొకదినమును మర్దించి కలితో గడిగి ఖల్వముగా బోసి దానికర్ధభాగము సైంధవలవణముగలిపి నిమ్మపండ్లరసముతో నొకదినము మర్దించి పిదప ఆవాలు, వెల్లుల్లి, నవాసారము అను నీమూడుద్రవ్యములను పాదరసమునకు సమముగజేర్చి ఉముకనీటితో ముద్దయగువఱకు మర్దించి బిళ్ళజేసి ఎండించి దానిపై ఇంగువను నూరి లేపనముజేసి కుండలో నునిచి దానిపై నుప్పుపోసి మఱియొకకుండను బోర్లగిలమూసి దళముగ చీలమన్ను లేపనముచేసి యెండనెండించి పొయిమీద నునిచి పాకముజేయవలయును. పైకుండకు వేడిమి తగిలిన నాపాదరసము కరిగి క్రిందపడును. కావున పైకుండపై నుదకమున బోయుచు గాఢాగ్నితో మూడుఝాములు వండవలయును. అది చల్లారిన చీలమన్ను నుపాయముచే దీసి పైకుండయం దంటుకొని యుండురసమును దీసికొనవలయును. ఈ రసము దోషరహితంబై శుద్ధంబుగ నుండును.

కుమార్యాశ్చ నిశాచూర్ణై ర్దినం సూతం విమర్దయేత్,
పాచయే త్పాతనాయంత్రే *శుద్ధో భవతి పారదః. 55

తా. పాదరసములో కలబందపలుకులు, పసపుపొడి గలిపి యొకదినము మర్దించి బిళ్ళచేసి దాని నటిక సంపుటములో నునిచి సందు లేకుండునటుల దానిమూతిని

* శుద్ధంచ వినియోజయేత్,

మూసి వస్త్రమృత్తికల లేపనముజేసి యెండనెండించుటచే పాతనాయంత్రమని పరంగె దానిని పొయిమీఁద నునిచి దానిపై మఱియొక యటికను బోర్లగిలమూసి దానిపై గుమాత్రముగ కుదురుగట్టి శీతోదకమును బోయుచుండవలయును. అది యుష్ణమైన నిందీసి పారబోసి మరల శీతోదకమును బోయవలయును. ఇటులంజేయుచుండిన సము పైకుండయందు మంచువలె వ్యాపించును. పిదప నాపాతనాయంత్రమునకు గాయంబడియుండు చీలమన్ను నుదకముతో దడిపి దీసి పైకుండ నంటియుండురసము రెండించి గీచి తీసికొని బట్టను బిడచవలయును. ఇత్తెఱంగుననే రెండు, లేక మూడుమారులు పాతనాయంత్రమునం దిడి పక్వముచేసి దీసికొనిన రసము శుద్ధంబగును. అట్టిదానిని సర్వౌ ధముల ప్రయోగింపం జనును.

ఇంగిలీకములో రసముదీయువిధము

* పారిభద్రరసైః పేష్యం హింగుళం యామమాత్రకం,
జంబీరాణాం ద్రవైర్వాథ పాచం పాతనయంత్రకే.
తంసూతం యోజయేద్యోగే సప్తకంచుకవర్జితం, (గ్రంథాంతరే)

తా. నాలుగు పలముల ఇంగిలీకము నొకఝాము వేపపేరు చెక్కరసముతో గాని, లేక నిమ్మపండ్లరసముతోగాని మర్దించి పాతనాయంత్రమునం దిడి పాకముచేసిన సప్తకంచుకదోషరహితమైన రసము జనించును. అట్టిరసము నౌషధములలో ప్రయోగింపంజనును.

రసాజీర్ణమూలకోపద్రవములు

క్షారంతీక్ష్ణంభూరిచామ్లంచవర్జ్యంసూతో జీర్ణోజాయతే యేనయస్మాత్,
సూతేజీర్ణేనాభిదేశేషుశూలందాహోమాంద్యంజాడ్యమాలస్యనిద్రా.
సత్వత్యాగోజాయతేబుద్ధినాశ స్తస్మాజ్జీర్ణేకన్యకాంగవ్యమాజ్యం,
కందంచామ్లంమృద్వికాం సేవయేద్వాసూతోజీర్ణస్సర్వదోషోపశాంతిః.

తా. ఉప్పు, తీక్ష్ణకరపదార్థములు, పులుసు-వీని నధికముగ సేవింపంజనదు.— అధికముగ సేవించిన రసము జీర్ణముగాక బొడ్డుక్రింద శూలించుట, ఒడలు మండుట, అగ్నిమాంద్యము, జాడ్యము, ఆలస్యము, నిదుర, సత్వక్షయము, బుద్ధినాశనము మొదలగు పద్రవంబులు గలుగును. కావున రసము జీర్ణించువఱకు కలబందరసములో నావునెయ్యిని లిపిగాని, లేక పుల్లనికందములగాని, లేక దీపద్రాక్షపండునుగాని సేవింపుచుండిన సాజీర్ణమువలనగలిగిన సర్వదోషములు నివర్తించును.

శిరోగతరసదోషనివర్తకోపాయము

కార్పాసదళనిర్యాసై స్తండులీయరసేన వా.



* నింబపత్ర.

అభ్రకం జీరకైర్యుక్తం లోహచూర్ణం సశర్కరం,
రసవేధవినాశార్థం కుర్యాద్భైషజ్య ముత్తమమ్. 60

తా. పైడిప్రత్తాకు రసములోగాని, చిట్టిపెళ్ళ రసములోగాని, అభ్రకసిందూరము, జీలకఱ్ఱ, పంచదార గలిపి సేవించిన రసవేధలు నివర్తించును. మఱియు పైడిప్రత్తాకు రసములోగాని, చిట్టిపెళ్ళ రసములోగాని లోహభస్మము, జీలకఱ్ఱ, పంచదార గలిపి రెండుమండలములు సేవించిన రసవేధలు నివర్తించును. ఇది యుత్తమమైనది.

## రసమెక్కినందుకు చికిత్స

ఉ. ఆరయ దూడియాకురసమందున నేయియుఁ బంచదారయు
న్గూరిచియు న్మరీచమును గూరిచి గ్రోలినమీఁద శైత్యపు
న్నీరును వేడినీళ్ళు తగ నిత్యమును న్జలమాడి పథ్యము
న్వారక నెయ్యి జావయు నవశ్యముసేయ యొనర్ప నెక్కిన
న్పారదరోగగర్వములు భంగముసై చను ధారుణీస్థలిన్.

(ఈపద్యములోని యౌషధమును రెండుమండలములు సేవింపవలయును.)

చ. నృపతరుపల్లవంబులును నిర్మలమైనను రూబతైలము
న్నవచన మొప్పఁజేసియును వేమును రెండుతులాలయెత్తున
త్యపటుగతి న్శరీరమున నద్దియు నెండనునుండి స్నానము
న్విపులముగా నొనర్చియును వేడియుఁ బథ్యము గొట్టిగింజిచేఁ
గపటపుసూతరోగముల గర్వములన్నియు మాను నిర్ధరన్.

(ఈపద్యములోని యౌషధమును రెండుమండలములు సేవించినను, లేక గంధకతైలమును సేవించినను రసవేధలు మానును.)

## రసతాపహరలేపనములు

ధాత్రీ కుమారీ సర్పాక్షీ కూశ్మాండం భృంగరాజకం,
కాకమాచీ మేఘనాదో రంభాకందం సజీరకమ్. 61
కార్పాసం చామృతాచైవ జంబుకా బింబ తండులం,
నవనీతే సమం లేప్యం చందనే రసతాపనుత్. (ఆయుర్వేదే) 62

తా. ఉసిరికపప్పు, కలబంద, సర్పాక్షి, బూడిదెగుమ్ముడుకాయ, గుంటగలగర, నల్లకాచి, చిట్టిపేరు, అరటిగడ్డ, జీలకఱ్ఱ, పైడిప్రత్తాకు, తిప్పతీఁగె, నేరేడుచెక్క, దొండాకు, పసిగడుగు - వీనిలో సమభాగములుగ రసముదీసి వెన్న, మంచిగంధము గలిపి శరీరమున లేపనముచేసిన రసతాపము నివర్తించును.

### రసతాపనివర్తకోపాయము

జమ్బ్వాత్వక్త్రిఫలాం బింబ కుమారీచ సమం పిబేత్,
రసతాపంమహాఘోరంనాశయేచ్చ సుఖీభవేత్. (మాధవనిదానే)

తా. నేరేడుచెక్క, త్రిఫలములు, దొండాకు, కలబంద-వీనిలో సమభాగము
గ రసముదీసి త్రాగిన కడుభయంకరమైన రసజనితశరీరతాపము నివర్తించును.

కుమారీరససంయుక్తం జీరకం తండులీయకం,
కార్పాసబీజకంచైవ నవనీతేన పేషయేత్. 64
చందనేన సమం కృత్వా స్యాల్లేపో రసతాపనుత్, (సిద్ధరసార్ణవే)

తా. జీలకఱ్ఱ, చిఱ్ఱి, ప్రత్తిగింజలు, వెన్న, మంచిగంధము-వీనిని సమభాగము
గ్రహించి కలబందరసముతో నూరి శరీరమున లేపనముజేసిన తల కెక్కిన రస
పములు నివర్తించును.

### రసమంత్రము

"ఓం గోరుకుగోరుకునాథం । అటుగట్టు నౌనాశిచోళుస్వాఃసుచా
కోటికిర్కిణి దేవిఆకుకోటురం । రాం । ధరణి । హరణి । ఘృటకాభ
ి । సకలదేవి । సకలపూజాపాదం । పాదరసం । కీర్తాయం । గూర్తాం ।
ండాతాం । నారాయణతాం । అల్లాతాం । తర్తిణితాం । తిర్తాతాం ।
హతిర్తాం । గోరుగోరుకునాథం" ॥ అనునీమంత్రముచే నభిమంత్రించి
ఔషధసేవనను, లేపనౌషధముల నభిమంత్రించి లేపనములను జేయిం
గలయును. (నిత్యనాథీయే)

### రసతాపములయందు పథ్యము

రసజనితవిదాహ శ్శీతతోయావగాహో
మలయజఘనసారై ర్లేపనం మన్దవాతాః,
తరుణదధిచ తక్రం నారికేళీఫలాంబు
శిశిరమధురసాన్నై శ్శీతమన్నం ప్రశస్తమ్. (సిద్ధవిద్యాభూః) 65

తా. పాదరసమువలన తాపముగలిగిన శీతోదకములో స్నానముజేయుట, శ్రీ
, కర్పూరముల లేపనముజేసికొనుట, చల్లనిగాడ్పులు, తీయనిపెరుగు, చల్ల, నారి
ంకాయనీరు, శీతకరరసములు, మధుకరరసములు, చల్లనివంటకను అనుపానిని సేవిం
ప్రశస్తంబు.

### రసౌషధసేవనయందు పథ్యము

గోధూమ జీర్ణశాల్యన్నం గవ్యంక్షీరం ఘృతం దధి,

తండులీయక ధాన్యాకం పటోలాలాబు సైంధవమ్. 66
అభోదకం ముద్గరసం మాంసం జాంగలజం హితం,
ఉద్గారే సతిచాత్యర్థం కృష్ణా మీనాక్షీ జీరకమ్. 67
అభ్యంగ మనిలఘ్నైస్తైలై ర్నారాయణాదిభిః,
ఆర్తిత శ్శీతతోయేన మస్తకే పరిషేచనమ్. 68
తృష్ణాయాం నారికేళాంబు ముద్గ యూషం సశర్కరం,
ద్రాక్షా దాడిమ కర్పూర కదలీనాం ఫలం హితమ్ 69
రసవేధా నివృత్యర్థం దధి క్షీరేక్షు శర్కరాః,
శైత్యోపచారై రన్యైశ్చ కర్తవ్యం స్యా ద్యథోచితమ్. 70
(మాధవనిదానే)

తా. గోధుమలు, ప్రాతబియ్యాపువంటకము, ఆవునెయ్యి, ఆవుపాలు, ఆవు పెరుగు, చిర్రికూర, ధనియాలు, పొట్లకాయ, ఆనుగపుకాయ, సైంధవలవణము, మేఘోదకము, పెసలకట్టు, జాంగలమాంసము అనువానిని సేవించుట, మిక్కుటముగ వమనంబులైన పిప్పులి, పొన్నగంటికూర, జీలకఱ్ఱ అనువానిని సేవించుట, వాతవికారము గలిగిన నారాయణతైలము మొదలగువానిచే నభ్యంజనముజేయుట, పీడగలిగిన శీతోదకములో శిరస్నానముజేయుట, దప్పిగలిగిన నారికేళోదకము, పంచదారతోకూడియుండు పెసరకట్టు, ద్రాక్షపండ్లు, దాడిమపండ్లు, పచ్చకర్పూరము, అరటిపండ్లు, పెరుగు, పాలు, చెఱకు, పంచదార, ఇతరములైన శైత్యోపచారములు మొదలగువానిని యథోచితముగ జేయుట-ఇట్టి యుపచారములచే రసతాపము నివర్తించును.

రసౌషధసేవనయం దపథ్యము

త్యజేత్కూష్మాండ వార్తాకం వేత్రాగ్రం కారవేల్లకం,
మాషా న్మసూరనిష్పావం *కుళుత్థా న్సర్షపా స్తిలాన్. 71
బృహతీ రాజికా బిల్వం దివానిద్రాంచ మైథునం,
లంఘనోద్వర్తనస్నానం తామ్రచూడం సురాసవమ్. 72
జలమాంసారనాళంచ భోజనం కదళీదళే,
కాంస్యకం గురువిష్టంభి తీక్ష్ణోష్ణంచ భృశం త్యజేత్. 73
అపథ్యం సూతరాజస్య పురా ప్రోక్తం మహర్షిభిః,

తా. గుమ్ముడుకాయ, వంకాయ, పేదురుగొమ్ము, కాకరకాయ, మినుములు, శనగలు, అనుములు, ఉలవలు, ఆవాలు, నువ్వులు, ములకకాయ, నల్లావాలు,

---

* కుళుత్థాన్ లవణం తిలాన్-అనగా ఉలవలు, ఉప్పు, నువ్వులు,

హారేడుకాయ, పగటినిద్ర, స్త్రీసంగమము, లంఘనము, శరీరమర్దనము, స్నానము, గోడిమాంసము, కల్లు, ఆసవము, జలమాంసము, కలి, అరటియాకులలో భుజించుట, కంచు పాత్రములలో భుజించుట, గురుకరపదార్థములు, మలబంధకరపదార్థములు, తీక్ష్ణకర ద్రవ్యములు, ఉష్ణకరద్రవ్యములు-ఇవి రససేవనజేయువారల కపథ్యకరంబులు.

## గంధకోత్పత్తి

శ్వేతద్వీపే పురా దేవ్యాః స్తీరే క్షీరపయోనిధేః. 74
క్రీడంత్యా స్సఖిభి స్సార్థ మభవ త్ప్రస్రుతం రజః,
బహుళం తద్రజోతీవ సుగంధి సుమనోహరమ్. 75
క్షీరార్ణవేతు సాథ్యా యద్దుకూలం రజసాన్వితం,
ధౌతంచ సఖిభి స్తత్ర తజ్జాతం గంధకం రజః. 76
క్షీరాబ్ధిమథనే చాథాప్యమృతేన సహోత్థితం,
నిజగంధేన తాన్ సర్వాన్ హర్షయామాస దానవాన్. 77
తతో దేవగణైరుక్తం గంధకాఖ్యో భవత్వయం,
రసస్య బంధనార్థాయ జారణాయ భవత్వయమ్. 78
యేగుణాః పారదే ప్రోక్తా స్తేచైవాత్ర భవంత్వితి,
ఇత్యేవం గంధకోనామ విఖ్యాతః క్షితిమండలే. 79
బలినా సేవితః పూర్వం ప్రభూతబలహేతవే.
వాసుకేః కర్షక స్తస్య తన్ముఖజ్వాలనాద్ద్రుతమ్. 80
వాసో గంధక గంధాఢ్యా సర్వతో మిశ్రితం తతః,

తా. తొల్లి క్షీరసముద్రతీరమునందలి శ్వేతద్వీపమునందు చెలికత్తెలతోడ పార్వతీదేవి క్రీడించుచుండ రజస్వలైనందున కడుసుగంధముగ, మనోహరముగనుండునట్టి జోయుక్తవస్త్రమును చెలికత్తెలు క్షీరసముద్రమునందుదికినందున రజస్సుగంధకముగ య్యెను. అది క్షీరాబ్ధిమథన కాలంబున నమృతముతోడ నుత్పన్నంబయ్యెను. మఱియు ది తనవాసనవలన సకలదైత్యులకు సంతోషము గలుగంజేసెను. దేవతలు దీనికి గంధక ను పేరుపెట్టి రసబంధనార్థంబును, జారణార్థంబు నుపయోగించునటుల రసమునకుగల ణంబులన్నియు దీనియందును గలిగియుండునటుల నాశీర్వాదముజేసిరి. అదిమొదలు నికి భూమండలమున గంధకమని ప్రఖ్యాతిగలిగెను. దీనిని పూర్వకాలంబున బలిచక్రవర్తి లకరార్థము భక్షణముజేసెను. పిదప మథనకాలమునందు వాసుకి నీడ్చునపుడు దాని ుఖజ్వాలలవలన గంధకముగరిగి భూమియందంతట చెదరెను. అదిమొదలు గంధకము ూమండలంబున లభించుచున్నయది.

శ్వాసకాసలు, విదాహించుట, శరీరము చల్లనైయుండుట, జ్వరము, దప్పి, తలనొచ్చుట, నాలుక పిడకవలెయెండి కృశించియుండుట, శరీరము గగుర్పొడుచుట-ఈలక్షణములు గలది సన్నిపాతజ్వర మని తెలియవలయు.

సర్వజోలక్షణైస్సర్వైః దాహోత్ర చ ముహుర్ముహుః,
తద్వచ్ఛీతం మహానిద్రా దివా జాగరణం నిశి. 212
సదావా నైవవా నిద్రా ముహుస్స్వేదోఽతినైవవా,
గీతనర్తనహాస్యాదివికృతేహా ప్రవర్తనమ్. 213
సస్రుతే కలుషే రక్తే భుగ్నే లులితపక్ష్మణీ,
అక్షిణీ పిండికాపార్శ్వమూర్ధపర్వాస్థిరుక్ భ్రమః, 214
స్వస్వనౌసరుజౌకర్ణౌ కంఠశ్శూకైరివావృతః,
పరిదగ్ధఖరాజిహ్వా గురుస్రస్తాంగసంధితా. 215
రక్తపిత్తకఫష్ఠీవో లోలనం శిరసోఽతిరుక్,
కోఠానాం శ్యావరక్తానాం మండలానాంచ దర్శనమ్, 216
హృద్వ్యథామలసంసర్గః ప్రవృత్తిర్వాల్పశోపివా,
స్నిగ్ధాస్యతా బలభ్రంశః స్వరసాదః ప్రలాపితా. 217
దోషపాకశ్చిరాత్తంద్రా సతతం కంఠకూజనం,
సన్నిపాతమభిన్యాసం తంబ్రూయాచ్చ హృతౌజనమ్. (బాహటే)

తా. సన్నిపాతజ్వరమునందు వాతాదిజ్వరములకు చెప్పియుండు లక్షణము లన్నియు కలిగియుండును. దీనియందు పలుమారు ఉష్ణము, పలుమారు శీతము, పగటియందు విశేషనిద్ర, రాత్రులయందు నిద్రలేకుండుట, లేక యెల్లపుడు నిద్రించుట, నిద్రలేకపోవుట, పలుమారు చెమటపట్టుట, అధికముగా చెమట, చెమటయే లేకుండుట, సంగీతము, నర్తనము, హాస్యము మొదలగు వికారచేష్టలుచేయుట, నేత్రములు కలకబారి నీళ్లతోగూడి యెఱ్ఱగా నుండుట, కంటిఱెప్పలు వంకరగా పోవుట, పిక్కలు పార్శ్వములు శిరము కీళ్ళు అస్థులు వీనియందునొప్పి, భ్రమము, చెవులయందు ధ్వని, శూల, గొంతులో ముండ్లుగ్రుచ్చుకొనినటు లుండుట, నాలుక కాల్పబడినటుల రూక్షగ నుండుట, శరీరబంధులు జారుట, కారియుమియునపుడు రక్తకఫములు వెడలుట, శిరమునందు వణుకు అధికనొప్పి, నల్లగ యెఱ్ఱగనుండు కోఠములు, మండలములు కనుపించుట, ఱొమ్మునొప్పి, మలబంధము లేక కొంచె కొంచెముగా మలము వెడలుచుండుట, ముఖము మినమినలాడుట, బలహాని, స్వరభంగము, వదరుట, బహుకాలముమీఁద దోషము

### గంధకలక్షణము

గంధ శ్చతుర్విధః ప్రోక్తో రక్తపీత స్సితోఽసితః. 81
రక్తో హేమక్రియా సూక్త శ్శుకతుండనిభోపరః,
పీతశ్చ మలసారాఖ్యో శ్రేష్ఠో రసరసాయనే. 82
శ్వేతోఽత్ర ఘుటికా ప్రోక్తో లేపనే లోహమారణే,
సుదుర్లభస్తు కృష్ణశ్చ స జరామృత్యునాశనః. 83

తా. గంధకము ఎఱుపువర్ణము, పసపువర్ణము, శ్వేతవర్ణము, కృష్ణవర్ణము గలది యని నాలుగు విధంబులు. అందు రక్తవర్ణముగలదై చిలుకముక్కువంటి కాంతిగలదై యుండునది స్వర్ణక్రియయం దుపయోగించును. అది కడు ప్రశస్తంబు. పసపువర్ణముగలది రసాయనోపయుక్తంబు. శ్వేతవర్ణముగలది ఘుటిక, లేప, లోహమారణములయం దుపయోగించును. కృష్ణవర్ణము గలది జరామృత్యువుల బోకడచును. అది దొరకుట దుర్లభము.

### గంధకనామములు

వైగంధక స్సుగంధశ్చ గంభీరో గంధకో బలీ. (గ్రంథాంతరే) 84

తా. వైగంధకము, సుగంధకము, గంభీరము, గంధకము, బలి అనునవి గంధక నామంబులు.

### శోధనయోగ్యగంధకలక్షణము

కపికచ్ఛునిభచ్ఛాయో నవనీతసమప్రభః,
సమృదుః కఠిన స్స్నిగ్ధ శ్శ్రేష్ఠో గంధకఉచ్యతే. 85

తా. దురదగొండివిత్తుతో సమానముగ, వెన్నతో సమానమైన కాంతిగలదిగ, మృదు కఠిన స్నిగ్ధములుగనుండు గంధకము శ్రేష్ఠంబు.

### గంధకశుద్ధి

సాజ్యభాండే పయఃక్షిప్త్వా ముఖం వస్త్రేణ బంధయేత్,
తత్పృష్ఠే చూర్ణితం గంధం క్షిప్త్వా స్రావేణ శోధయేత్.
భాండం నిక్షిప్య భూమ్యంతరూర్ధ్వే దేయం పుటం లఘు,
తతః క్షీరే ద్రుతం గంధం శుద్ధం యోగేషు యోజయేత్. 87

తా. నేతికుండలో పాలుపోసి దానిమూతికి వస్త్రమునుగట్టి దానిపై గంధక చూర్ణము బఱచి యాకుండమూతిని మూకుడుచేమూసి చీలమన్ను లేపనము చేసి యెండించి ఒకమూరెడులోతు గుంటలో పాతి దానిపై ఏరుపిడకలతో లఘుపుటంబిడిన నందలి

కము కరిగి పాలలో స్రవించును. పిదప దానిని సాంగశీతలమున దీసి యౌషధము ప్రయోగించికొనవలయును.

దత్తూర కేతకీ లింగైః కుమార్యాథ పునర్నవైః,
మేఘనాదైశ్చ గోక్షీరై ర్ఘృతేన మధు గంధకమ్. 88
శోధనై ర్నిర్మలం సర్వయోగేషు పరివర్తయేత్,

తా. గంధకమును ఉమ్మెత్తాకు, మొగలిచన్ను, లింగపొట్ల, కలబంద, గలిజేరు, అనువానిరసములోను, ఆవుపాలు, నెయ్యి, తేనె అనువానితోను, భూయంత్రమునను జేసిన శుద్ధియగును. దానిని సర్వయోగములయందు నుపయోగింపందగును.

### గంధకతైలము

అర్కక్షీరై స్స్నుహిక్షీరై ర్వస్త్రం లేప్యంతు సప్తధా. 89
గంధకం నవనీతేన పిష్ట్వా వస్త్రం ప్రలేపయేత్,
తద్వర్తిర్జ్వలితా దండే దృఢం ధార్యాప్యధోముఖమ్. 90
తైలం పతే దధోభాండే గ్రాహ్యం యోగేషు యోజయేత్,

తా. జిల్లేడుపాలు, బొంతజెముడుపాలు అనువానిలో వస్త్రము నేడేసిమార్లు యెండించి-గంధకమును వెన్నతో నూరి దానిపై లేపనముజేసి లావుగ వత్తిజుట్టి ంలో వెలిగించి దృఢముగ తలక్రిందుగ బట్టికొని దాని కడుగున నొకపిడత నునిచిన గంధకతైలము స్రవించును. దానిని సర్వౌషధములయందు గ్రహింపందగును.

### గంధకకల్కము

నాతారి తైలసంయుక్తం గుగ్గులు త్రిఫలాన్వితమ్. 91
గంధకం రససంయుక్తం జరావ్యాధి వినాశనమ్.
మాసమాత్రప్రయోగేణ శృణు వక్ష్యామి తద్గుణాన్. 92
అర్శో భగందరశ్చైవ తథా శ్లేష్మసముద్భవః,
అష్టాదశచ కుష్ఠాని రాజయక్ష్మా తథైవచ. 93
ఆమవాతశ్చ గుల్మంచ తథా సర్వవ్రణానిచ,
నశ్యంతి వ్యాధయస్సర్వే గంధకస్య ప్రభావతః. 94
ణ్మాసస్య ప్రయోగేణ శృణు వక్ష్యామి తత్ఫలం,
ంసవర్ణాశ్చ యేకేశావలీచైవావలంబినీ. 95
త్క్షణా ద్దేవతుల్యశ్చ వృద్ధోఽపి తరుణాయతే,
వ్యదృష్టి సమాయుక్తో జీవే దాచంద్రతారకమ్. 96
కుంచితఘనం కేశా దీర్ఘదృష్టిశ్చ జాయతే,

చలాదంతా మందదృష్టి ర్బల శుక్రాది సంక్షయః. 97
నిర్జిత్య యౌవనం యాతి భ్రమరాఇవ మూర్ధజాః,
దివ్యదృష్టి ర్మహాతేజా వరాహాఇవ కర్ణయోః. 98
చక్షుషా తార్క్ష్య తుల్యోఽసౌ బలేన బలివిక్రమః,
దృఢదంతో వజ్రకాయో ద్వితీయఇవ శంకరః 99
తస్య మూత్రపురీషేణ శుల్బం భవతి కాంచనం, (దేవీశాస్త్రే)

తా. ఆముదమున గుగ్గిలము, త్రిఫలములు, గంధకము, పాదరసము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి మర్దించి యొకమాసమువఱకు శరీరబలానుగుణముగ సేవించుచుండిన ముదిమి, అర్శస్సు, భంగదరము, శ్లేష్మరోగములు, పదునెనిమిది కుష్ఠవులు, రాజయక్ష్మ, ఆమవాతము, గుల్మము, సర్వవ్రణములు మొదలగు రోగముల నన్నిటిని గంధకము తనప్రభావమువలన నశింపజేయును. మఱియు దీని నాఱుమాసములు సేవించిన నరుఁడు దేవతలతో సమానుండై చంద్రనక్షత్రంబు లుండువఱకు జీవించును. అంతేగాక యిది నెరసిన వెంట్రుకలు, వ్రేలాడుచుండుచర్మము, కదలుచుండుదంతములు, దృష్టిమాంద్యము, బలక్షీణము, శుక్రక్షయము అనువానినన్నిటిని బోకడచి యౌవనమును గలుగంజేయును. ముడిచికొనియుండు వెంట్రుకలు దట్టముగ, వెంట్రుకలు తుమ్మెదలవలె నల్లగ, దృష్టికి దివ్యముగ నుండుటయేగాక మహాతేజస్సుగలవాఁడై పందివలెనే సూక్ష్మమైన వినికిడిగలవాఁడుగ, గరుత్మంతునితో సమానమైన దృష్టిగలవాఁడుగ, బలములో బలిచక్రవర్తితో సమానుఁడుగ, దృఢదంతములు, వజ్రదేహము గలవాఁడుగ, రెండవశంకరునితో తుల్యుఁడుగ నుండును. మఱియు వానిమలమూత్రములవలన నిశ్చయముగ తామ్రబంగారంబు లుత్పన్నంబులగును.

## శుద్ధగంధకగుణము

శుద్ధోగంధో హరే ద్రోగాన్ కుష్ఠ మృత్యు జరాదికాన్. 100
అగ్నికారీ మహానుష్ణో వీర్యవృద్ధిం కరోతిచ,

తా. శుద్ధిజేయఁబడిన గంధకము కుష్ఠువు, మృత్యువు, ముదిమి మొదలగువానిని నశింపజేయుటయేగాక అగ్నిదీపమును, మిక్కుటముగ నుష్ణమును, వీర్యవృద్ధిని గలుగంజేయును.

## అశుద్ధగంధకదోషము

అశుద్ధగంధం కురుతేచ కుష్ఠం తాపం భ్రమం పిత్తరుజం తథైవ,
రూపం సుఖం వీర్యబలం నిహంతి తస్మాద్విశుద్ధోవినియోజనీయః.

తా. అశుద్ధగంధకము కుష్ఠువు, తాపము, భ్రమ, పిత్తరోగము వీనిని గలుగం

జేయుటయేగాక రూప, సుఖ, వీర్య బలముల నశింపంజేయును. కావున నౌషధముల యందు శుద్ధిజేయఁబడిన గంధకమునే జేర్చవలయును.

### ఇంగిలీకశుద్ధి

హింగుళం స్తన్యపయసా మర్దితం శుద్ధిమాప్నుయాత్,
జంబీరఫలజద్రావై ర్మర్ద్యం శుద్ధి ర్భవిష్యతి. (గ్రంథాంతరే)

తా. ఇంగిలీకమును చనుపాలతోను, నిమ్మపండ్లరసముతోను మర్దించిన శుద్ధియగును. పిదప దానినౌషధములలో నుపయోగింపంజనును.

### ఇంగిలీకగుణము

హింగుళ స్సర్వదోషఘ్నో దీపనోఽతిరసాయనః,
సర్వరోగహరో వృష్యో జారణే లోహమారణే. 1( 3
హింగుళం మధురం తిక్త ముష్ణవాతకఫాపహం,

తా. ఇంగిలీకము సర్వదోషముల బోకడచి అగ్నిదీపనమును గలుగంజేయుటయే గాక సర్వరోగహరరసాయనోపయుక్తముగ, వీర్యవృద్ధికారిగ, జారణలోహమారణోపయుక్తముగ, మధురముగ, వగరుగ, ఉష్ణవాతమును బోకడచునదిగ నుండును.

### అశుద్ధఇంగిలీకదోషము

అశుద్ధో దరదః కుర్యా త్కుష్ఠం క్లైబ్యం క్లమం భ్రమమ్. 104
మోహాంచ శోధయే త్తస్మా చ్ఛుద్ధం వైద్య స్తు హింగుళం,

తా. అశుద్ధమైన ఇంగిలీకము కుష్ఠువు, పుంస్త్వహాని, శ్రమ, భ్రమ, మోహము వీనిని గలుగంజేయును. కావున దానిని శుద్ధిజేయవలయును.

### తాళకోత్పత్తి

సంధ్యాయాం నరసింహేన హిరణ్యకశిపు ర్హతః. 105
తచ్ఛవిసమోభూ త్తాల స్తత్కుషా లేఖనాశ్రితః,

తా. తొల్లినరసింహమూర్తిసాయంకాలమున హిరణ్యకశిపుఁడను పేరుగలదైత్యుని వధించి వానిచుంకల గీచినందున వానితో సమానకాంతిగల తాళకముత్పన్నంబయ్యెను.

### తాళకభేదములు

హరితాళం ద్విధా ప్రోక్తం పత్రాఖ్యం పిండసంజ్ఞితమ్. 106
*తత్పత్ర హీనం పిండాఖ్యం తయోః పూర్వం గుణాధికం,

తా. తాళకము పత్రాఖ్యము, పిండికము అన రెండువిధంబులు. వానిలో పత్రాఖ్యమనునది గుణాధిక్యముగలదిగ, పిండాఖ్యమనునది హీనగుణముగలదిగ నుండును.

---

* తయోరాద్యం గుణై శ్శ్రేష్ఠం తతో హీనగుణం పరమ్.

### తాళకనామములు

హరితాళమలం తాళం గోదంత నటభూషణమ్. 1
పిండాలకం విస్రగంధం పిజరం కనకప్రభం,

తా. హరితాళమలము, తాళము, గోదంతము, నటభూషణము, పిండాలకము విస్రగంధము, పింజరము, కనకప్రభము అనునవి హరిదళనామంబులు.

### తాళకశుద్ధి

తాళకం కణశః కృత్వా దశాంశేనచ టంకణమ్. 10
జంబీరాణాం ద్రవైః క్షాళ్యం కాంజికైః క్షాళయేత్పునః,
వస్త్రే చతుర్గుణే బధ్వా డోలాయంత్రే దినం పచేత్. 10
సంచూర్ణేనారనాళేన దినం కూశ్మాండజై రసైః,
తిలతైలైః పచేద్యామం యామంచ త్రిఫలాజలైః. 11
త్రివారం తాళకం భావ్యం పిష్ట్వా మూత్రైశ్చ కాంజికైః,
ఏవంద్వాదశధాపాచ్యం శుద్ధం యోగేషు యోజయేత్. 111

తా. తాళకమును రేకులుగ నొలిచి దానికి పదియవభాగము వెలిగారము గలిపి నిమ్మపండ్లరసముతోను, కలితోను గడిగి నాలుగుమడతలుగల బట్టలో మూటగట్టి డోలాయంత్రమున కలి, సున్నపునీళ్ళు పోసి దానిచే నొకదినము, గుమ్మడుకాయరసముతో నొకదినము, నువ్వులనూనెతో నొకఝాము వండి పిదప త్రిఫలరసముతో నొక్కొకఝాముచొప్పున మూడుమార్లును, గోమూత్రముతో నొక్కొకఝాముచొప్పున మూడుమార్లును, కలితో నొక్కొకఝాముచొప్పున మూడుమార్లును నూరి భావనజేసి డోలాయంత్రమున వండవలయును. ఇత్తెఱంగున పన్నెండుమార్లుజేసిన తాళకము శుద్ధియగును. అట్టిదాని నౌషధములలో బ్రయోగింపంజనును.

### తాళకభస్మము

సదళం తాళకం శుద్ధం పునర్నవారసేనతు,
ఖల్వే విమర్దయే దేకం దినం పశ్చా ద్విశోషయేత్. 112
సంశోష్య గోళకం తస్య కుర్యా త్తంచ విశోషయేత్,
తతః పునర్నవాక్షారై స్థాల్యర్ధంతు ప్రపూరయేత్. 113
తత్ర తం గోళకం ధృత్వా పున స్తేనైవ పూరయేత్,
ఆకంఠం పిఠరం తస్య పిధానం ధారయే న్ముఖే. 114
దినాన్యంతరహీనాని పంచవహ్నిం ప్రదీపయేత్.
స్థాలీం చుల్ల్యాం సమారోప్య క్రమాద్వహ్నిం వివర్ధయేత్. 115

ఏవం తు మ్రియతే తాళం మాత్రాతస్యైవ రక్తికా,
అనుపానాన్యనేకాని యథాయోగ్యం ప్రయోజయేత్. 116

తా. శుద్ధిజేసిన తాళకమును శేనలుగ నూరిచి గలిజేరురసముతో నొకదినము ంచి యుంటచేసి యెండించి దానిని బిందెవలె చిన్నని నోరుగలమంటిపాత్రలో నునిచి కంఠమువఱకు గలిజేరురసమును బోసి దానిపై మూసి ఐదుదినము లహోరాత్రములు యిమీఁద నునిచి క్రమాగ్నులతో సెడతెగక వండిన తాళకము భస్మంబగును. అందొక ంజయెత్తు ననుపానవిశేషములతో సేవించిన సర్వరోగములను హరింపఁజేయును.

## * తాళకగుణము

శ్లేష్మవాతవిషరక్తభూతహృద్దీపనంచ శీతలరుజాపహం,
స్నిగ్ధముష్ణజటుకంచ లేఖనం కుష్ఠవారి హరితాళముచ్యతే. 117

తా. తాళకము శ్లేష్మము, వాతము, విషము, రక్తదోషము, భూతదోషము - హరింపఁజేయుటయే గాక అగ్నిదీపనము గలుగఁజేసి శీతసింపు బోకపు ముగాను, ముగ, ఉష్ణముగ, కారముగ, లేఖనకారిగ, కుష్ఠువ్యాధిహరింపఁజేయునదిగ నుండును.

## అశుద్ధతాళకదోషము

అశుద్ధంతాళ మాయుష్నం కఫ మారుత మేహకృత్,
తాత స్ఫోటాంగసంకోచం కురుతే తేన శోధయేత్. 118

తా. అశుద్ధతాళకము ఆయువును క్షీణింపఁజేయుటయేగాక కఫము, వాతము, ము, శరీరతాపము, స్ఫోటకములు, అంగసంకోచము-సీనిని గలుగఁజేయును. కావున ం శుద్ధిజేయవలయును.

## మణిశిలభేదము

మనశ్శిలా త్రిధా ప్రోక్తా శ్యామాంగీ కరవీరకా,
ద్విఖండాఖ్యాచ తాసాంతు లక్షణాని నిబోధయ. 119
శ్యామా హింగుళవద్రక్తా కించిత్పీతా విదీప్తికా,
రవీరా రక్తవర్ణా చూర్ణరూపాతిభారయుక్. 120
ంచిద్రక్తాచ గౌరాచ ద్విఖండా భారవత్తరా,
త్రివిధాసుచ శ్రేష్ఠాస్యా త్కరవీరా మనశ్శిలా. 121

తా. మణిశిల శ్యామాంగి, కరవీర, ద్విఖండము లని మూఁడువిధంబులు. అందు కమువలె నెఱ్ఱగ, ఒకింతపచ్చగ, కాంతిహీనముగ నుండునది శ్యామాంగి యనియు, చూర్ణముతో సమానముగ, కడుబరువుగ నుండునది కరవీర మనియు, ఒకింత

* తాళక మన - హరిదళము.

గొట్టుగ, పచ్చగ, కడుబరువుగ నుండునది ద్విఖండమనియు జెప్పంబడును. వానిలో కర వీరమనునది శ్రేష్ఠంబు.

మణిశిలశుద్ధి

సూక్ష్మవస్త్రద్వయోపేతం మనోగుప్తానుబంధనం,
పాచయే చ్ఛాగమూత్రేణ డోలాయంత్రే దినత్రయమ్. 122
పచనం కురుతే హ్యత్ర శుద్ధిర్భవతి నిశ్చయం, (గ్రంథాంతరే)

తా. మణిశిలను సన్నమైన జమిలిబట్టలో మూటగట్టి మేకపంచితముతో మూడు దినములు డోలాయంత్రమున వండిన నిశ్చయముగ శుద్ధియగును.

అగస్త్యపత్రతోయేన శృంగిబేరరసేనచ. 123
భృంగితోయేన పచ్యేత భావితం సప్తధా శిలా,

తా. మణిశిలను అగసియాకు, అల్లము, గుంటగలగర అనువానిరసముతో నేడేసి మార్లు వండి ఏడేసిమార్లు భావనజేసిన శుద్ధియగును.

గౌరీపాషాణశుద్ధి

ద్విపలం గౌరిపాషాణం మర్ద్యం జంబీరవారిణా. 124
పిష్టం కృత్వా పటే బధ్వా డోలాయంత్రేణ బుద్ధిమాన్,
శిలాక్షారోదకే పాచ్యం భవే చ్ఛుద్ధి ర్వినిశ్చయః. 125

తా. రెండుపలములు గౌరీపాషాణమును నిమ్మపండ్లరసముతో మర్దించి ముద్దజేసి జమిలిబట్టలో మూటగట్టి సున్నపునీళ్ళతో డోలాయంత్రమున రెండుఝాములు వండిన శుద్ధియగును.

ఉల్లిపాషాణశుద్ధి

ఉల్లిపాషాణ సంశుద్ధిం వక్ష్యతే శాస్త్రనిశ్చితం,
చూర్ణీకృతం పటే బధ్వా శిలాక్షారోదకేనచ. 126
డోలాయంత్రే దినైకంతు పాచితంచ విశుద్ధ్యతి,

తా. ఉల్లిపాషాణమును చూర్ణముజేసి జమిలిబట్టలో మూటగట్టి డోలాయంత్రమున సున్నపునీళ్ళతో నొకదినమువండిన శుద్ధియగును.

మధునా పాచయే ద్యామం శనైర్మృద్వగ్నినా తతః. 127
ఉల్లిపాషాణశుద్ధిశ్చ భవేదేవం విశారదః, (అగ్నిమతే)

తా. ఉల్లిపాషాణమును తేనెలో వేసి యొకఝాము మందాగ్నితో మెల్లమెల్లగ వండిన శుద్ధియగును.

### దొడ్డిపాషాణశుద్ధి

గోమూత్రే దొడ్డిపాషాణం డోలాయంత్రే దినత్రయమ్. 128
పటే బధ్వా తతోపాచ్యం సమ్యక్ఛుద్ధి ర్భవిష్యతి,

తా. దొడ్డిపాషాణమును చూర్ణముజేసి జమిలిబట్టలో మూటగట్టి ఆవుపంచితముతో డోలాయంత్రమున మూడుదినములు వండిన శుద్ధియగును.

### విమలభేదము*

విమలం త్రివిధం ప్రోక్తం హేమాఖ్యం తారపూర్వకమ్. 129
కాంస్యపూర్వం తథాచాల్యల్లక్ష్యతే సర్వకామదం,

తా. స్వర్ణమాక్షికము, రౌప్యమాక్షికము, కాంస్యమాక్షికము అని విమలము మూడువిధంబులు. ఇది సర్వకామ్యముల నిచ్చును.

### విమలలక్షణము

వర్తులః కోణసంయుక్తః స్నిగ్ధశ్చ ఫలకాన్వితః. 130
మరుత్పిత్తహరో వృష్యో విమలశ్చ రసాయనః,

తా. రౌప్యమాక్షికము గుండ్రముగ, కోణయుక్తముగ, దట్టముగ, పలకలుగ, వాతపిత్తముల హరింపజేయునదిగ, వీర్యవృద్ధికారిగ రసాయనోపయుక్తముగ నుండును.

### విమలశుద్ధి

వాసా పునర్నవా సిందూవారకం యస్యకస్యచిత్. 131
రసేన స్వేదితం యామం విమలం నిర్మలం భవేత్,

తా. విమలమును అడ్డసరము, గలిజేరు, వావిలి అనువానిరసములలో దేనితోనేని డోలాయంత్రమున నొకదినమువండిన శుద్ధియగును.

పాటనా ద్విమలం భిన్నం సూక్ష్మవస్త్రేణ బంధయేత్. 132
అవిమూత్రే కాంజికేచ పృథక్క్వాథితవారిణి,
డోలాయంత్రే చతుర్యామం పాచయే చ్ఛుద్ధిమాప్నుయాత్.
(గ్రంథాంతరే)

తా. విమలమును పగులఁగొట్టి సన్నపుబట్టలో మూటగట్టి గొఱ్ఱెపంచితముతోను, కలితోను ప్రత్యేకప్రత్యేకముగ నాలుగుఝాములు డోలాయంత్రమున వండిన శుద్ధియగును.

### మాక్షికోత్పత్తి, తద్భేదాదులు

మాక్షికో ద్వివిధశ్చైవ మాక్షికస్తారమాక్షికః,

* విమల యనగ మాక్షికభేదము

తత్రాద్యః కన్యకుబ్జోత్థో దశవర్ణసువర్ణకః. 13
భిన్నదేశోపి తారోఽన్యః పంచవర్ణసువర్ణకః,
పాషాణబహుళశ్చానోన్యోగుణై రల్పతరోపిసః. (ఆయుర్వేదే

తా. స్వర్ణమాక్షికము, తారమాక్షికము అని మాక్షికము రెండువిధంబుల అందు మొదటిది కన్యాకుబ్జమున జనించును. అది పదియవవన్నెబంగారుతో సమానంబై (శోణరహితంబై)యుండును. తారమాక్షికము భిన్నదేశమున జనించును. ఇది ఐదవవన్నె బంగారముతో సమానముగ, బహుళమైన పాషాణముగలదిగ, అల్పగుణకారిగ నుండున

మాక్షికనామములు

ఆవర్తం మధు తుత్థం చ తాపిజం ధాతుమాక్షికం,
రౌప్యమాక్షికధాతుశ్చమాక్షికం హేమమాక్షికమ్. (నిఘంటౌ

తా. ఆవర్తము, మధు, తుత్థము, తాపిజము, ధాతుమాక్షికము, రౌప్యమాక్షికమ మాక్షికము, హేమమాక్షికము అనునవి మాక్షికనామంబులు.

[1]మాక్షికశుద్ధి

ఏరండతైల లుంగాంబు సిద్ధం శుధ్యతి మాక్షికం,
పక్వం వా కదలీకంద తోయేన ఘటికాద్వయమ్. 13
తప్తం క్షిప్తం వరాక్వాథే శుద్ధి మాయాతి మాక్షికం,

తా. మాక్షికమును చూర్ణముచేసి బట్టలో మూటగట్టి ఆముదము, మాదీఫలరసమ అరటిగడ్డరసము అనువానిలో ప్రతిదానిచే రెండుగడియలు డోలాయంత్రమున వండి మాక్షికము శుద్ధియగును. లేక మాక్షికమును నిప్పులో కాచి త్రిఫలకషాయములో వే నను శుద్ధియగును.

(ఒకపలము మాక్షికమును తేనెతో మర్దించి ముద్దజేసి జమిలి బట్టలో మూటగ ఉలవకట్టు, గోమూత్రము, కలి-వీనితో నొకర్షూము ప్రత్యేకముగ డోలాయంత్రమ వండిన శుద్ధియగును)

(మాక్షికమును కలితో నొకదినము డోలాయంత్రమున నుడికించి చూర్ణముశే దాని నినుపపాత్రమునవేసి తేనె, నెయ్యిపోసి నొకదినంబునిచి నున్నగచూర్ణముజేసి ఇ పపాత్రలోవైచి తేనె, నెయ్యిపోసి యొకదినము వండి జెముడుపాలతో నొకదిన భావనచేసి యెండించి నెయ్యి, తేనెతో నొకదినము మర్దించి అంధమూషలో నుని వండిన నందు గురివిందచాయవలె సత్వము దిగును.)

మాక్షికసత్వపాతనము

ఏరండోత్థేన తైలేన గుంజా క్షౌద్రంచ [2]టంకణమ్. 13

1 మాక్షిక మన నిమ్ము. 2 వర్జయేత్.

మర్దితం తస్యవాపేన సత్వం మాక్షికజం భవేత్,

తా. ఆముదము, గురివిందపలుకులు, లేసె, వెలిగారము - వీనినిజేర్చి నూరి మాక్షి
కముపై వైచి అగ్నిలో నునిచి యూదిన నందు సత్వము దిగును.

మాక్షికగుణము

శుద్ధంహితాప్యంసకలామయఘ్నంరసాదిధాతూంశ్చవరంప్రపుష్యేత్
దుర్మేహదేహక్షయమారకంచ గుణోత్తరంవృష్యరసాయనాగ్ర్యమ్,

తా. శుద్ధమైన మాక్షికము సర్వరోగముల హరింపంజేసి రసాదిధాతువృద్ధిని గలు
గంజేయునదిగ, దుష్టమేహమును, శరీరక్షయమును హరింపంజేయునదిగ, గుణకారిగ,
వీర్యవృద్ధికారిగ, రసాయనోపయుక్తముగ నుండును.

సువర్ణమాక్షికం స్వాదు తిక్తం వృష్యం రసాయనమ్. 140
చక్షుష్యం వార్తిహృత్కంఠ పాండు మేహ విషోదరం,
అర్శ శ్శోభవిషం కండూ త్రిదోషానపి నాశయేత్. 141

తా. సువర్ణమాక్షికము రుచికరముగ, వగరుగ,వీర్యవృద్ధికారిగ, నేత్రహితకారిగ,
అంగావర్తి, కంఠరోగము, పాండువు, ప్రమేహము, విషదోషము, ఉదరము, మూల
వ్యాధి, వాపు, విషరోగము, దురద, త్రిదోషము - వీనిని హరింపంజేయునదిగ నుండును.

అపక్వమాక్షికదోషము

మందానలత్వంబలహానిముగ్రాం విష్టంభితానేత్రగదాన్ సకుష్ఠాన్
ఘాలస్యభేదవ్రణపూర్వకంచ శుధ్యాదిహీనంఖలుమాక్షికంతు

తా: అశుద్ధమాక్షికము అగ్నిమాంద్యము, బలహాని, మలబద్ధము, నేత్రరోగము,
కుష్టువు, శిరోవ్రణము - వీనిని గలుగంజేయును.

* కాసీసభేదములు

వాలుకాఖ్యం పుష్పపూర్వం కాసీసం ద్వివిధం స్మృతం,
శ్యామ పాండురవర్ణంచ ద్వయోః పూర్వం గుణాధికమ్. 143

తా. వాలుకాసీసము, పుష్పకాసీసము లన కాసీసము రెండువిధంబులు. అందు
మొదటిది నలుపువర్ణము, రెండవది పాండువర్ణము గలవిగనుండును. వానిలో మొదటిది
గుణాధిక్యతం జెందియుండును.

కాసీసనామములు

కాసీసం ధాతుకాసీసం పాంసుకాసీస కేసరం,

---

*కాసీస మన్న అన్నభేది.

జీర్ణంబగుట, తంద్ర, యెల్లపుడు కంఠమునందు గుర్గురుశబ్దము-ఈలక్షణములు కలి యుండును. తేజస్సును నశింపఁజేయునట్టి యీసన్నిపాతము అభిన్యాస మనఁబడును.

## దాహజ్వరలక్షణము

దాహః పిపాసా ముఖశోషణంచ ప్రలాపసంతాపమతీవ దుఃఖం,
మూర్ఛాపరిభ్రాంతిర్మందరాగ్నిరోధ ఏతాని దాహజ్వరలక్షణాని.
(సిద్ధరసార్ణవే

తా. సర్వాంగతాపము, దప్పి, నోరెండుట, అసంగతముగా మాటలాడుట తాపము, కడుదుఃఖము, మూర్ఛ, తబ్బిబ్బులాడుట, అగ్నిమాంద్యము-ఈలక్షణములు గల దాహజ్వర మని తెలియవలయు.

## అజీర్ణజ్వరలక్షణము

జ్వరజృంభణహిక్కాశ్చ మందాగ్నిర్జ్ఞానునివ్యథా,
అమ్లస్వభావగంధశ్చాప్యజీర్ణజ్వరలక్షణమ్. (చరకే) 2

తా. జ్వరము, ఆవలింతలు, ఎక్కిళ్ళు, అగ్నిమాంద్యము, మోకాళ్ళ నొచ్చుట పులితేనుపులు-ఈలక్షణములుగలది అజీర్ణజ్వర మని తెలియవలయు.

## భూతజ్వరలక్షణము

అపస్మారో విరూపాక్షో జ్వరోత్యంతప్రలాపనం,
అతీవ భోజనే వాంఛా రోమహర్షశ్చ గాయితా,
హాస్యంచ నర్తనం తంద్రా స్యాద్భూతజ్వరలక్షణమ్. 22
(మాధవనిదానే

తా. అపస్మారము, వెఱ్ఱిచూపులు చూచుట, జ్వరము, మిక్కుటముగా వదురుట మిక్కుటముగా భుజించుటయందిచ్ఛగలుగుట, శరీరము గగుర్పొడుచుట, పాడుట నవ్వుట, ఆడుట, తంద్ర-ఈలక్షణములుగలది భూతజ్వర మని తెలియవలయు.

## అభిఘాతజ్వరలక్షణము

దూరవ్యాయామతోతీవ జాయతే జ్వరముత్కటం,
దాహస్సర్వాంగవైకల్యం స్వేదస్తంద్రా మతిభ్రమః. 22
శీతం తృష్ణాతిమోహాశ్చ ప్రలాపో హృది వేదనా,
శ్రమస్సంధిరుజాకాస శ్చాభిఘాతజ్వరాకృతిః. 22
(మాధవనిదానే

అన్యం మాల్యరసం పుష్పకాసీసం నేత్రభూషణమ్. 144

తా. కాసీసము, ధాతుకాసీసము, పాంసుకాసీసము, కేసరము, అన్యము, మాల్యరసము, పుష్పకాసీసము, నేత్రభూషణము అనునవి కాసీసనామంబులు.

కాసీసశుద్ధి

సకృద్భృంగాంబునా స్విన్నం కాసీసం నిర్మలం భవేత్. 145

తా. కాసీసమును గుంటగలగరాకురసముతో వండిన శుద్ధియగును.

కాసీససత్వపాతనము

చతుర్విధంతు కాసీసం రక్తపీతసితాసితం,
మర్దయే త్పిత్తవర్ణేన తిక్తకోశాతకీద్రవైః. 146
కాసమర్దద్రవైశ్చాపి మిత్రపంచకసంయుతం,
సత్వంచ యష్టికాయంత్రే ధ్మాతే సత్వం వినిశ్చితమ్. 147

తా. ఎఱుపు, పసపు, తెలుపు, నలుపు వర్ణభేదములవలన కాసీసము నాలుగువిధంబులు. వానిని మసిషి, గుఱ్ఱము, నెమలి, ఆవు, మత్స్యము-అనువాని చేదులతో ప్రత్యేక ప్రత్యేకముగ మర్దించి పిదప చేతిబీరాకురసము, కసివెందాకురసము, తేనె, నెయ్యి, వెలిగారము, గురివిందపలుకులు, బెల్లము అనువానితోడను మర్దించి బిళ్ళచేసి యష్టికాయంత్రమునం దునిచి యూదిన నందు సత్వము వెడలును. (దానిని చూర్ణముచేసి పుటంబులిడిన సిందూరించును.)

కాసీసగుణము

కాసీస మమ్లం చక్షుష్యం కేశఘ్నం కుచరంజనం,
గర శ్లేష్మ హారం వాత వ్రణదోషవినాశనమ్. 148

తా. కాసీసము పుల్లగ, నేత్రహితకారిగ, వెంట్రుకల నశింపఁజేయునదిగ, స్తనరంజనకారిగ, విష, శ్లేష్మ, వాత, వ్రణదోషముల హరింపఁజేయునదిగ నుండును.

గైరికభేదములు

గైరికం త్రివిధం తత్ర రక్తంస్యా త్పూర్ణగైరికం,
పాషాణగైరికం చైకం తేషాం పూర్వం గుణాధికమ్. 149

తా. రక్తగైరికము, పూర్ణగైరికము, పాషాణగైరికము అన *గైరికము మూడు విధంబులు. అందు మొదటిది గుణాధిక్యంబు గలదిగనుండును.

గైరికశుద్ధి

గైరికంతు గవాందుగ్ధై ర్భావితం శుద్ధిమాప్నుయాత్,

---

* గైరిక మన కావిఱాయి.

తా. గైరికము నావుపాలతో భావనజేసిన శుద్ధియగును.

**గైరికసత్వపాతనము**

గైరికం రక్తవర్గేణ పీతవర్గేణ భావితమ్. 150
సప్తాహం మర్దయే ద్యామం మిత్రపంచకసంయుతం,
ఆధ్మాతం యష్టికాయంత్రే సత్వం ముంచతి నిర్మలమ్. 151

తా. కావిరాయిని మంజిష్ఠ, కుంకుమపువ్వు, లక్క, దాడింబకాయ, రక్తచందనము, దాసనము, ఎఱ్ఱగన్నేరు అనురక్తవర్గములతోడను, కుసుంబ, మోదుగ, పసపు, మంజిష్ఠ, మ్రానిగోరింట అనుపీతవర్గములతోడను నేడేసిదినములు భావనజేసి తేనె, నెయ్యి, వెలిగారము, గురువిందపలుకులు, బెల్లము అనుమిత్రపంచకముతోడ నొకరుఝాము మర్దించి బిళ్ళజేసి యష్టికాయంత్రమునం దునిచి యూదిన నందు నిర్మలముగ సత్వము వెడలును.

**గైరికగుణము**

గైరికం మధురం నేత్రం దీపనం రక్తపిత్తజిత్;
వాంతి తాప విషఘ్నంచ రజస్తంభ బలప్రదమ్. 152

తా. కావిఱాయి మధురముగ, నేత్రహితకారిగ, అగ్నిదీపనకారిగ, రక్త పిత్తముల హరింపంజేయునదిగ, వాంతి, జ్వర, విషదోషముల బోకడచునదిగ, రజస్తంభనకారిగ, బలకారిగ నుండును.

**అంజనభేదములు**

పుష్ప నీల రస స్రోత సౌవీరపదపూర్వకం,
అంజనం పంచధా ప్రోక్తం లక్షణాదిక్రమేణచ. (చరకే) 153

తా. పుష్పాంజనము, నీలాంజనము, రసాంజనము,స్రోతోంజనము, సౌవీరాంజనము అని అంజనములు లక్షణాదిక్రమమువలన నైదువిధంబులు.

**టంకణ, శంఖ, వరాటాంజన, గైరిక, కాసీస, భుజగశుద్ధి**

జంబీరాణాంధ్ర వేచైవ మాతపే ధారయే ద్దినం,
శుధ్యంతి టంకణం శంఖం వరాటాంజన గైరికమ్. 154
కాసీసం భుజగంచైవ శుద్ధం యోగేషు యోజయేత్,

తా. వెలిగారము, శంఖము, గవ్వలు, సౌవీరాంజనము, పుష్పాంజనము, నీలాంజనము, స్రోతోంజనము, రసాంజనము, కావిఱాయి, అన్నభేది, భూనాగము అనువానిని నిమ్మపండ్లరసములో వైచి యొకదినము సూర్యపుటంబిడిన శుద్ధియగును. అట్టివాని నౌషధములతో బ్రయోగింపంజనును.

## అంజనపంచకశుద్ధి

అంజనాని విశుద్ధ్యంతి భృంగజస్వరసేన చ. 155

తా. పూర్వోక్త అంజనపంచకమును గుంటగలగరాకురసముతో భావనజేసిన శుద్ధియగును.

## అంజనపంచకగుణము

పుష్పాంజనం సితం శుద్ధం హిమం సర్వాక్షిరోగజిత్,
నీలాంజనం కృష్ణవర్ణం నేత్రదోషక్షయాపహమ్. 156
*రసాంజనంతు పీతాభం విష నేత్ర వికారనుత్,
స్రోతోఽంజనం పాండువర్ణం చక్షుష్యం సర్వరోగజిత్. 157
సౌవీరం రక్తవర్ణంచ నేత్రకండూ విషాపహం,

తా. పుష్పాంజనము తెల్లగ, శుద్ధముగ, శీతలముగ, సర్వ నేత్రరోగముల హరింపజేయునదిగనుండును. నీలాంజనము నల్లగ, నేత్రదోషము, క్షయము-వీనిని బోకడచునదిగ నుండును. రసాంజనము పచ్చగ, విషదోషమును, నేత్రరోగమును బోకడచునదిగనుండును. స్రోతోంజనము పాండువర్ణముగ, నేత్రహితకారిగ, సర్వరోగముల బోకడచునదిగ నుండును. సౌవీరాంజనము ఎఱ్ఱగ, కంటిదురదను, విషదోషమును హరింపజేయునదిగ నుండును.

## శిలాజతూత్పత్తి

నిదాఘే ఘర్మసంతప్తా ధాతుసారం ధరాధరాః.
158
నిర్యాసవత్ప్రముంచంతి శిలాజతు ప్రకీర్తితం, (గ్రంథాంతరే)

తా. పర్వతము యెండచే తపింపబడుటవలన నందలిధాతుసారము బంకవలె స్రవించిన శిలాజిత్తు అనంబడును.

## శిలాజత్తుభేదము

శిలాజతు ద్విధా ప్రోక్తం గోమూత్రం గోరసాయనమ్. 159
కర్పూరపూర్వకంచాన్యద్రక్తంచ పాండురం పరం,

తా. గోమూత్రసిలాజిత్తు, కర్పూరసిలాజిత్తు అని సిలాజిత్తు రెండువిధములు, అందు మొదటిది గోమూత్రవర్ణతుల్యముగ నుండును. కర్పూరసిలాజిత్తు యెఱుపుగగాని, తెల్లగగాని యుండును. అందు తెల్లనిది శ్రేష్ఠంబు.

క్షారామ్ల గుగ్గులోపేత మాతపే స్థాపయే ద్దినమ్. 160

---

* రసాంజనోత్పత్తి యెట్లనిన.—దార్వీక్వాథ మజాక్షీరే పాదపక్వం యథా ఘనమ్, తదా రసాంజనం ఖ్యాతం నేత్రయోః పరమంహితమ్.

స్వేదయే ద్ఘటికామాత్రం శిలాజతు విశుద్ధ్యతి,

తా. సిలాజిత్తు, సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము, నిమ్మపండ్లరసము, గ్గిలచూర్ణము - వీనితో నొకదినము యెండలో భావనజేసి యొకగడియ వండిన ద్ధియగును.

కర్పూరసిలాజిత్తుశుద్ధి

కర్పూరశిలధాతుశ్చ మృణాళరసమర్దితః. 161
అథవోత్పలజైర్యామం సమ్యక్ఛుద్ధి ర్భవిష్యతి,

తా. కర్పూరసిలాజిత్తును తామరతూండ్ల రసముతోగాని, కలువగడ్డరసముతో గాని యొకఝామము మర్దించిన శుద్ధియగును.

గోదుగ్ధై స్త్రిఫలాక్వాథై ర్భృంగద్రావైశ్చ మర్దయేత్. 162
ఆతపే దినమేకైకం తచ్ఛుష్కం శుద్ధతాం వ్రజేత్,

తా. కర్పూరసిలాజిత్తు నావుపాలు, త్రిఫలకషాయము, గుంటగలగరాకురసము- నితో నొకదినము యినుపఖల్వములో మర్దించి యెండనెండించిన శుద్ధియగును.

శిలాజతు పలమాత్రంచ మర్ద్యంచోత్పలజైరసైః. 163
ఆతపే ఘటికా స్సప్త శుద్ధిర్భవతి నిశ్చయం,

తా. ఒక పలము సిలాజిత్తును కలువగడ్డరసముతో నేడుగడియలు భావనజేసి యెండనెండించిన శుద్ధియగును.

శిలాజతో షోడశాంశం మృద్వీకా యష్టిచందనమ్. 164
నారికేళోదకం క్షిప్త్వా డోలాయంత్రేణ పాచయేత్,
తదుద్ధృత్యాతపే శోష్యం తత్తద్రోగానుపానతః. 165
సేవనా త్సర్వరోగఘ్నం కాంతి పుష్టి బలప్రదం,

తా. సిలాజిత్తునకు పదియాఱవభాగము దీపద్రాక్షను, యష్టిమధుకమును, శ్రీగంధమును గలిపి నారికెడపుకాయనీళ్ళతో డోలాయంత్రమున నుడికించి దానిం దీసి యెండనెండించి యనుపానవిశేషములతో సేవించిన సర్వరోగముల హరింపంజేయు టయేగాక శరీరకాంతిని, పుష్టిని, బలమును గలుగంజేయును.

శిలాజిత్తుగుణము

శుద్ధోఽయం గిరితప్తకందరభవః పాండు ప్రమేహ జ్వర
ప్లీహ శ్లేష్మ మరుద్భవాగ్ని సదన త్వగ్దోష శోషాపహః,
యక్ష్మోన్మాదక శోఫ శర్కర కృమి హృన్మూలామ్లపిత్తాపహో
నశ్యే చ్చోదర కామిలాశ్మరి జరాకృచ్ఛ్రాంచ పామాపహః. 166

తా. శుద్ధిజేయఁబడిన సిలాజిత్తు పాండువు, ప్రమేహము, జ్వరము, ప్లీహము, శ్లేష్మరోగము, వాతరోగము, అగ్నిమాంద్యము, కుష్ఠువు, శోష, రాజయక్ష్మ, ఉన్మాదము, శోఫ, శర్కర, కృమిరోగము, ఱొమ్మునొప్పి, మూలము, అమ్లపిత్తము, ఉదరము, కామిల, అశ్మరి, ముదిమి, మూత్రకృచ్ఛ్రము, గజ్జి వీనిని హరింపంజేయును.

అశుద్ధసిలాజతుదోషము

అశుద్ధం దాహమూర్ఛాంచ భ్రమపిత్తాస్రశోణితం,
శిలాజతు ప్రకురుతే మాంద్యమగ్నేశ్చ విడ్గ్రహమ్. 167

తా. అశుద్ధసిలాజిత్తు దాహము, మూర్ఛ, భ్రమ, పిత్తరక్తము, రక్తవికారము అగ్నిమాంద్యము, మలబద్ధకము మొదలగువానిని గలుగంజేయును.

శుద్ధశిలాజతుపరీక్ష

వహ్నౌ క్షిప్త్వా భవేద్యస్తు లింగాకారో హ్యధూమకః,
తృణాగ్రేణాంభసి క్షిప్తే హ్యధో గలతి తంతువత్. 168
గోమూత్రగంధం మలినం శుద్ధం జ్ఞేయం శిలాజతు,
సాధారణరసం కేచి ద్రసకర్మోపయోగిచ 169
పూర్వశాస్త్రానుసారేణ వక్ష్యతే లక్షణాదికం,

తా. అగ్నిపై వేసినపొగ వెడలకుండుట, పాకకాలమునందు లింగాకారమును జెందుట, తృణాగ్రముతో నెత్తి యుదకములో వేసిన తంతువలె క్రిందికి వ్యాపించుట, గోమూత్రమువంటివాసన వెడలుట-ఇట్టి లక్షణములవలన శుద్ధశిలాజతని తెలియవలయును. ఈసిలాజిత్తును సాధారణరసమని కొందఱువైద్యశాస్త్రజ్ఞులు వచించెదరు. కావున దీనిని రసస్థానమున నుపయోగింపంజనును.

సాధారణరసములు

కంపిల్లో లవణం గౌరీపాషాణో నవసాగరమ్. 170
దరదో వహ్నిజారశ్చ గిరిసిందూరమేవచ,
కేదారిశృంగి చేత్యష్టౌ సాధారణరసాస్స్మృతాః 171

తా. కంపిల్లము, సముద్రలవణము, గౌరీపాషాణము, నవాసాగరము, ఇంగిలీకము, వహ్నిజారము, గిరిసింధూరము, * కేదారశృంగి అను నీ యెనిమిదియు సాధారణ రసంబులు.

కంపిల్లనామములు

గిరిమృ ద్గైరికం ధాతూ రక్తాశ్మా రక్తశాంతికృత్. (నిఘంటౌ) 172

* ముదారసింగు.

తా. గిరిమృల్, గైరికధాతు, రక్తాశ్మ, రక్తశాంతి అనునవి కంపిల్లనామములు.

కంపిల్లభేదము

ఇష్టకాచూర్ణసంకాశం సవిరేకోపి హి కథ్యతే,
సౌరాష్ట్రదేశఖనిజం కంపిల్లమితి కీర్తితమ్. (గ్రంథాంతరే)

తా. సౌరాష్ట్రదేశముయొక్క గనియందు జనించినది కంపిల్ల మనంబడును: అది ఇటికపొడివలె నుండును. మఱియు నిదే విరేచనోపయుక్తంబుగ నుండును.

కంపిల్లశుద్ధి

స్వేద్యం హరీతకీసారే కంపిల్లం శుద్ధతాం వ్రజేత్,

తా. కంపిల్లమును చూర్ణముజేసి బట్టలో మూటగట్టి డోలాయంత్రమున కరక్కాయల రసముతోగాని, లేక కలితోగాని నుడికించిన శుద్ధియగును.

కంపిల్లగుణము

కంపిల్లకో విరేకీస్యాత్కటూష్ణో వ్రణనాశనః. 174
కఫ కాసార్తి హారీచ కంతు కృమి హరో లఘు,

తా. కంపిల్లము విరేచనకారిగ, ఒకింత, కటూష్ణముగలదిగ, వ్రణము, దగ్గు, ఉబ్బసము, జంతువులు, కృములు-వీనిని హరింపంజేయునదిగ, లఘుకారిగ నుండును.

బోళశుద్ధి

పలమాత్రం కృష్ణబోళం రక్తంవా మర్దితం తతః. 175
ఆతపే కాంజకే యామం భావ్యం శుద్ధిర్భవిష్యతి,

తా. ఒకపలము నల్లబోళమునుగాని, లేక ఎఱ్ఱబోళమునుగాని కలితో మర్దించి యొకఝాము యెండనెండించిన శుద్ధియగును.

మస్తకిశుద్ధి

జంబీరనీరకై ర్యామం భావయే దాతపే తథా. 176
అథవా నరమూత్రేణ శుద్ధిర్భవతి మస్తకి,

తా. మస్తకిని నిమ్మపండ్లరసముతోగాని, లేక నరమూత్రముతోగాని యొకఝాము భావనజేసి యెండనెండించిన శుద్ధియగును.

కఫరిశుద్ధి

కఫరీం పలమాత్రంచ చూర్ణం కృత్వా విమర్దయేత్. 177
నరమూత్రే సప్తయామం డోలాయంత్రే పచేత్తథా,
గోమూత్రేణ ద్వియామంచ పాచయే చ్ఛుద్ధిమాప్నుయాత్. 178

అథవా ఘృతసంమిశ్రం పాచయేత్కఫరీశుచిః,

తా. పలప్రమాణము కఫరిని నూరి చూర్ణముజేసి జమిలిబట్టన మూటగట్టి నరమూత్రముతో నేడుఝాములును, గోమూత్రముతో రెండుఝాములును, డోలాయంత్రమున వండిన శుద్ధియగును. లేక దాని నావునేతిలోగలిపి వండినను శుద్ధియగును.

## మైలుతుత్థశుద్ధి

మయూరతుత్థం సంమర్ద్యం దధ్నాచ సహయోజయేత్. 179
లోహైస్తప్తం కృతంచాథ శుద్ధిర్భవతి నిశ్చయం,

తా. మైలుతుత్థమును పెరుగుతో మర్దించి బిళ్ళజేసి పెంకులో నునిచి వెచ్చజేసిన శుద్ధియగును.

తుత్థస్య టంకణం పాదం చూర్ణయేన్మధుసర్పిషా. 180
తుత్థేన మిశ్రితం ధ్మాతం కోష్ఠయంత్రే దృఢాగ్నినా,
ద్రావితం ముంచతీ సత్వం శుకతుండసమప్రభమ్. 181

తా. మైలుతుత్థమునకు నాలవభాగము వెలిగారము గలిపి చూర్ణముజేసి దానితో తేనె నెయ్యితో జేర్చి కోష్ఠయంత్రమునందిడి దృఢాగ్నిలో నునిచి యూదిన ద్రవించి యందు ఆసత్వము వెడలును. ఆసత్వము చిలుకముక్కు వన్నెతో సమానముగ నుండును.

## పాలతుత్థశుద్ధి

పలమాత్రం క్షీరతుత్థం చూర్ణం కృత్వా వినుర్దితం,
పటే బధ్వా శిలాచూర్ణతోయే పాట్యం విశుధ్యతి. 182

తా. ఒకపలము పాలతుత్థమును నూరి చూర్ణముజేసి జమిలిబట్టలో మూటగట్టి సున్నపునీళ్ళతో వండిన శుద్ధియగును.

## గవ్వలు, శంఖములు వీనిశుద్ధి

వరాట శంఖం గోమూత్ర కూశ్మాండకరసద్రవైః,
ఆమ్లే స్సకాంజికాభిశ్చ డోలాస్విన్నం చ శుధ్యతి. (ఆయుర్వేదే)

తా. గవ్వలు, శంఖములు వీనిని గోమూత్రము, గుమ్మడుకాయరసము, నిమ్మపండ్ల రసము, కలి అనువానితో డోలాయంత్రమున వండిన శుద్ధియగును.

## సర్జక్షారశుద్ధి

సర్జక్షారం కాంజికేన మర్దయేద్ఘటికాద్వయం,
అథవా చ గవాం మూత్రే శుద్ధిర్భవతి నిశ్చయమ్. 184

తా. సర్జక్షారమును రెండుగడియలు కలితోగాని, లేక గోమూత్రముతోగాని మర్దించిన శుద్ధియగును.

### సర్జక్షారగుణము

సర్జక్షారోఽగ్నిజననం గుల్మశూలనివారణమ్. 185

తా. సర్జక్షారము, అగ్నిమాంద్యము, గుల్మము, శూల-వీనిని హరింపంజేయును.

### యవక్షారశుద్ధి

యవక్షారం విమర్ద్యాథ తండులోదకమిశ్రితం,
ఆతపే ఘటికామాత్రం క్షిపే చ్ఛుద్ధిర్భవిష్యతి. 186

తా. యవక్షారమును పసిగడుగుతో నొకగడియ మర్దించి యెండ నెండించిన శుద్ధియగును.

### యవక్షారగుణము

దీపనం కఫవాతఘ్నం యవక్షారం వ్రణాపహం,

తా. యవక్షారము అగ్నిదీపనమును గలుగంజేయుటయేగాక కఫ, వాత, వ్రణముల హరింపంజేయును.

### పంచలవణశుద్ధి

సైంధవం కాంజికే భావ్యం భవే చ్ఛుద్ధిర్ఘటీద్వయే. 187
అథవా ఛాగమూత్రేణ పాచితం శుద్ధిమాప్నుయాత్,
నింబనీరేణ సౌవర్చం భావయే చ్ఛుద్ధిమాప్నుయాత్. 188
బిడాలవణకం తక్రే భావయే చ్ఛుద్ధిమాప్నుయాత్,
లవణం కాచకం జ్ఞేయం తింత్రిణీజల ఆతపే. 189
సముద్రలవణం లోష్ఠే తప్తం కుర్యా త్త్రియామకం,
సమ్యక్ఛుద్ధంభవేద్వైద్యస్త్వౌషధేషుప్రయోజయేత్. (ఆయుర్వేదే)

తా. సైంధవలవణమును రెండుగడియలు కలితో భావనజేసి యెండనెండించినను, లేక గొఱ్ఱెపంచితముతో వండినను శుద్ధియగును. సౌవర్చలవణమును నిమ్మపండ్లరసముతో భావనజేసి యెండ నెండించిన శుద్ధియగును. బిడాలవణమును పులిచల్లతో భావనజేసి యెండ నెండించిన శుద్ధియగును. కాచలవణమును చింతాకురసముతో భావనజేసి యెండ నెండించిన శుద్ధియగును. సముద్రలవణమును పెంకులో బోసి మూడుయామములు వేయించిన శుద్ధియగును. ఇటుల శుద్ధి జేయఁబడినవాని నౌషధములలో బ్రయోగింపందగును.

లవణాని క్షాళితాని సక్షారేణాంభసాతపే,
శోషితాని విశుధ్యంతి విజ్ఞేయం వైద్యపారగైః. (మతాంతరే)191

తా. పంచలవణములక్షారోదకముతో గడిగి యెండ నెండించిన శుద్ధియగును.

### పంచలవణగుణములు

లవణం పంచధా భిన్నం సైంధవాదివిభేదతః,

సైంధవం చక్కణం స్నిగ్ధం ఘనకం శ్రేష్ఠముచ్యతే. 192
విశీర్యమాణఫలకం పాటలో నచ శస్యతే,
సైంధవం కఫవాతఘ్నం నిద్రాకుక్షీరుజాపహమ్. 193
సౌవర్చలం కృష్ణరక్తం గుల్మ శూల రుజాపహం,
కించిత్పిత్తం బిడా పాండు కుక్షీరోగ రుజాపహమ్. 194
కాచోత్థం కాచవర్ణం చ కుక్షీరోగ వినాశనం,
సాముద్రం కుక్షీరోగఘ్నం సర్వవాత వినాశనమ్. 195

తా. లవణములు సైంధవాది భేదములవలన ౫ విధంబులు. సైంధవలవణము నున్నగ, ఘనముగ, పలుకులుగ నుండును. ఇది ప్రశస్తమైనది. తనంతట తానే పలుకులై [1]పాటలవర్ణము గలదైయుండు సైంధవలవణ మప్రశస్తంబు. ఇది కఫ, వాత, నిద్ర, కుక్షిరోగముల బోకడచును. సౌవర్చలవణము కృష్ణరక్తవర్ణముగలదిగ నుండుటయేగాక గుల్మ, శూలరోగముల హరింపజేయును. బిడాలవణము పాండురవర్ణముగ నుండుటయేగాక యొకింత పిత్తకారిగ నుండును. ఇది కుక్షిరోగము, శరీరపీడను బోకడచును. కాచలవణము కాచవర్ణముగలదిగ నుండుటయేగాక కుక్షిరోగమును బోకడచును. సముద్రలవణము కుక్షిరోగమును, సమస్తవాతరోగములను బోకడచును.

### త్రికటుకశుద్ధి

శుంఠీం నిస్త్వక్కృతాంచాథ శిలాచూరం విలేపయేత్,
నిక్షిపే దాతపే యామం సమ్యక్ఛుద్ధిర్భవే ద్ధ్రువమ్. 196
వైదేహీం చిత్రకరసే [2]హ్యాతపే భావయే త్తథా,
సమ్యక్ఛుద్ధిర్భవే దేతాం రసయోగేషు యోజయేత్. 197
మరీచ మమ్ల తక్రేణ భావితం ఘటికాత్రయం,
లోపేతత స్తప్తకృతం శుద్ధిర్భవతి మారిచమ్. (చింతామణౌ) 198

తా. శొంఠిపై బెరడునుదీసి కొత్తసున్నము బట్టించి ఝాము యెండనెండించిన శుద్ధియగును. పిప్పలిని చిత్రమూలరసముతో రెండుగడియలు భావనజేసి యెండనెండించిన శుద్ధియగును. మిరియముల పులిచల్లతో మూడుగడియలు భావనజేసి పెంకులోబోసి వేయించిన శుద్ధియగును. ఇటుల శుద్ధిచేయఁబడినవానిని రసౌషధములయందు చేర్చికొనవలయును.

### గజపిప్పలిశుద్ధి

కాంజికే భావితా యామం శుద్ధావారణ పిప్పలీ,

1 ఎక్కుడు తెలుపుకలిసిన ఎఱుపువర్ణము. 2 నిక్షిపే ద్ఘటికాద్వయమ్.

అజామూత్రేణ భావ్యేత శుద్ధిర్భవతి నిశ్చయమ్.

తా. గజపిప్పళ్ళను కలితోగాని, లేక మేకపంచితముతోగాని, నొకఝాము భావనచేసి యెండ నెండించిన శుద్ధియగును.

### నల్లమందు శుద్ధిః

గజకర్ణదలే బధ్వా వ్యఫేనం శోధయేద్భిషక్,
డోలాయంత్రే పయఃపూర్ణే పాచితం యామమాత్రకమ్. 200

(సిద్ధసంగ్రహే)

తా. నల్లమందును బలురక్కసిపాకులో నునిచి మూటగట్టి యావుపాలతో డోలాయంత్రమున నొకఝాముపండిన శుద్ధియగును.

### ఇంగువశుద్ధి

పద్మపత్రరసే యామ మాతపే భావితంవిదుః,
రామఠం శుద్ధిమాప్నోతి రసయోగేషు యోజయేత్. 201

(చింతామణౌ)

తా. ఇంగువను తామరపాకురసముతో నొకఝాము యెండలో భావనచేసిన శుద్ధియగును. అట్టిదానిని రసయోగములలో నునిచికొనందగును.

### జీలకఱ్ఱశుద్ధి

ద్విజీరం కాంజికే తాపే క్షిపే ద్యామద్వయం పునః,
తతోఽగ్నినా క్వచి త్తప్తం కృత్వా శుద్ధిర్భవిష్యతి. 202

తా. జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ అను నీరెంటిని కలితో దడిపి రెండుఝాములు ఎండ నెండించి యొకింత వేయించిన శుద్ధియగును.

### ఆముదపువిత్తులు, నేలదంతివిత్తులు వీనిశుద్ధి

గంధర్వహ స్తబీజాని నారికేళోదకాంతరే,
యామమత్వక్ప చేచ్ఛుద్ధి ర్దంతిబీజం పచే త్తథా. 203

తా. ఆముదపువిత్తులు, నేలదంతివిత్తులు-వీనిపైపొట్టు దీసి టెంకాయ నీటిలో నొకఝాముపండిన శుద్ధియగును.

### ముష్టివిత్తులశుద్ధి

బీజాని విషముష్టేశ్చ ఛిల్లికామూలజే రసే,
పాచితం త్రిఘటీమాత్రం శుద్ధిర్భవతి నిశ్చయమ్. 204

తా. ముష్టివిత్తుల నడ్డకత్తితో తునకలుగచేసి చిల్లివేళ్ళరసముతో మూడు గడియలు పండిన శుద్ధియగును.

తా. తనబలిమి నతిక్రమించి కడుదూరము నడుచుటచే నతిశయముగా జ్వరము జనించుట. ఇది అభిఘాతజ్వర మనఁబడు. దానియందు దాహము, సర్వాంగములయందు బలక్షయము, చెమట, తంద్ర, తబ్బిబ్బుమాటలు, శరీరశైత్యము, దప్పి, కడు మోహము, ప్రలాపము, హృదయమునందు వేదన, శ్రమ, కీళ్లయందు నొప్పి, దగ్గు ఇవి గలుగును.

తస్మిన్ జ్వరేతు పవనః ప్రాయో రక్తం ప్రదూషయన్,
సవ్యథా శోషవైవర్ణ్యం సరుజం కురుతే జ్వరమ్. 224

తా. అభిఘాతజ్వరమునందు వాతము తరుచుగా రక్తమును చెరిచి నొప్పి, శోష, వివర్ణత్వము, ఉపద్రవము వీనిని గలుగజేసి పిదప జ్వరమును కలుగఁజేయును.

## విషమజ్వరలక్షణము

క్షుధామహాదాహభ్రమాజ్వరశ్చ క్షణంక్షణం శీతరుజామలాది,
ఊష్మాతిమూర్ఛావిషమప్రలాపశ్ఛర్దిశ్చహృద్రుక్క్లమశూలమోహాః.
క్వచిద్దినేచ త్రిదినే చతుర్థే విషోవిదాహో వివిధజ్వరంస్యాత్,
ఏతచ్చ రూపం విషమజ్వరాణాం క్వచిద్దినే ద్విత్రిహిమంజ్వరశ్చ.226
(బాహటే)

తా. ఆఁకలి, కడుదాహము, భ్రమ, ప్రతిక్షణమునందు జ్వరమువచ్చుట, చలి బట్టుట, మలమూత్రములు వెడలుట, శరీరము ఉష్ణముగనుండుట, కడుమూర్ఛ, తబ్బిబ్బు లాడుట, వాంతి, రొమ్మునొచ్చుట, బడలిక, శూల, మోహము, ఒకటవదినమునగాని మూడవదినమునగాని నాలుగవదినమునగాని విషమించి విదాహయుక్తమై పలువిధములుగ జ్వరమువచ్చుట, ఒకదినములో రెండు లేక మూడుమార్లు చలిబట్టి జ్వరము వచ్చుట - ఈలక్షణములుగలది విషమజ్వర మని తెలియవలయు. (మఱియు దీనియందు అసాధ్య నాడులు కలిగియుండిన అసాధ్యంబనియు సాధ్యనాడులు కలిగియుండిన సాధ్యంబనియు తెలియవలయు.)

క్షణేచోష్ణం క్షణేశీతం క్షణే జ్వరగతి స్తథా,
క్వచిద్దోఽగహిమంవాపి ద్వితీయంచ తృతీయకమ్. 227
చలం చాతుర్థికంవాపి విషమజ్వరలక్షణం, (నిత్యనాథీయే)

తా. క్షణములో ఉష్ణముగలుగుట, క్షణములో చలువపుట్టుట, క్షణములో జ్వరమువచ్చుట, ఒకదినములో రెండుమార్లేని మూడుమార్లేని నాలుగుమార్లేని విడిచి విడిచి చలివచ్చుట-ఈలక్షణములుగలది విషమజ్వర మని తెలియవలయు.

నేపాళశుద్ధి

నిస్త్వచంచైవ నేపాళం కుమారీరసజేనచ,
గుడోదకేన గోక్షీరైర్గోఘృతేన పృథక్పృథక్. 205
పాచితం శుద్ధిమాప్నోతి వైద్యశాస్త్రవినిశ్చితం,

తా. నేపాళముల పై పొట్టు నొలిచి యందలి యగరులం దీసి కలబందరసము, పానకము, ఆవుపాలు, ఆవునెయ్యి అనువానితో ప్రత్యేక ప్రత్యేకముగ నుడికించిన శుద్ధియగును.

వసనాభిశుద్ధి

విషంతు ఖండశః కృత్వా వస్త్రఖండేన బంధయేత్. 206
గోమూత్రమధ్యే నిక్షిప్య స్థాపయేదాతపే త్ర్యహం,
గోమూత్రంతు ప్రదాతవ్యం నూతనం ప్రత్యహం బుధైః.
త్ర్యహేతీతే తముద్ధృత్య శోషయేన్మృదువేషయేత్,
శుధ్యత్యేవం విషంచైవ యోగ్యం భవతి చార్తిజిత్. 208

తా. వసనాభిని తునకలుగ కత్తరించి బట్టలో మూటగట్టి యొకకుండలో వైచి అందు వసనాభి మునుఁగునటుల గోమూత్రము పోసి మూడుదినములు ఎండలో నుంచవలయును. మఱియు కుండయందలి గోమూత్రమును ప్రతిదినము దీసివేసి క్రొత్తగ గోమూత్రమును బోయుచుండవలయును. ఇటుల మూడుదినములుచేసి నాలవదినంబున వసనాభిని బైటికి దీసి జక్కఁగ నెండించిన శుద్ధియగును. దీని నౌషధములయందు చేర్చునెడ జక్కఁగ చూర్ణముచేసి చేర్చవలయును. ఇది సర్పపీడల బోకడచును.

సర్వద్రవ్యశుద్ధులు

క్షీరాజ్యే గంధకం శుద్ధ్యే త్తాళం కూశ్మాండజైర్ద్రవైః,
ఆరనాళేన తుత్థంతు జంబీరామ్లే మనశ్శిలా. 209
మయూరతుత్థం లుంగామ్లే గోమూత్రేణ విషం హరేత్,
దంతిబీజాని పయసా కుళుత్థేనతు మాక్షికమ్. 210
అజామూత్రేణ వైక్రాంతం టంకణం కాంజికేనతు,
జంబీరామ్లేణ దుత్తూరం దరదం తేన శుధ్యతి.
తీక్ష్ణం గోమూత్రకైశ్శుధ్యే న్మండకం త్రిఫలారసైః,
కృష్ణేరిమేదో జంబూత్వ గ్రసై ధాత్రీఫలస్యచ. 212
ఆతపే శోషయిత్వాచాప్యయోవారితరం భవేత్,
గైరికం తు గవాందుగ్ధే భావితం శుద్ధముచ్యతే. 213

అంజనాని విశుధ్యంతి భృంగస్వరససేచనాత్,
నరమూత్రే చాఖువిషం పచేద్దోలాఖ్యయంత్రకే 214
యామమాత్రం విశోష్యాథ గోక్షీరే భావితం శుచిః,
గౌరీపాషాణకం పీతం రసబంధపురస్సరః. 215
హరిద్రాస్వరసే స్విన్నో యామేన పరిశుధ్యతి,

తా. గంధకము, ఆవుపాలు, ఆవునెయ్యి-వీనిలో నుడికించిన శుద్ధియగును. తాళకమును రేకులుగవాలిచి గుమ్ముడుకాయనీరులో నుడికించిన శుద్ధియగును. మైలుతుత్థమును కలితో నూరి ఎఱ్ఱనగువఱకు కాల్చిన శుద్ధియగును. మణిశిలను నిమ్మపండ్లరసముతో నుడికించిన శుద్ధియగును. పాలతుత్థమును మాదీఫలరసముతో నూరి ఎఱ్ఱనగువఱకు గాల్చిన శుద్ధియగును. వసనాభిని గోమూత్రముతో మూడుదినములు నానబెట్టిన శుద్ధియగును. (నేపాళములు) నేలదంతివిత్తులు వీనిని పైపొట్టుదీసి పాలతో నుడికించిన శుద్ధియగును. మాక్షికమును ఉలవకట్టుతో నుడికించిన శుద్ధియగును. వైక్రాంతమును మేకమూత్రముతో వండిన శుద్ధియగును. వెల్లిగారమును కలితో నూరి కాల్చిన శుద్ధియగును. ఉమ్మెతవిత్తుల నిమ్మపండ్ల రసములో నానబెట్టిన శుద్ధియగును. ఇంగిలీకమును నిమ్మపండ్లరసముతో నూరి యెండించిన శుద్ధియగును. ఇనుము గాని, లేక చిట్టెమునుగాని గోమూత్రముతో కాచిన శుద్ధియగును. ఉక్కును త్రిఫలకషాయముతో కాచిన శుద్ధియగును. ఇనుము ఉక్కు-వీనిని నల్లతుమ్మ చెక్కరసము, నేరేడుచెక్కరసమును, ఉసిరికపండ్లరసము అనువానితో నూరి యెండనెండించిన శుద్ధియగును. పిదప దానిని చూర్ణముజేసి నీళ్ళపైపైచిన తేలును, కావిఱాయి నావుపాలతో భావనజేసిన శుద్ధియగును. అంజనపంచకముల గుంటగలగరాకురసముతో భావనజేసిన శుద్ధియగును. ఉల్లిపాషాణమును నరమూత్రముతో నొకఝాము డోలాయంత్రమున వండి యావుపాలలో భావనజేసి యెండించిన శుద్ధియగును. గౌరీపాషాణమును రసబంధపురసములతో నొకఝామువండి పసపునీరును చల్లి యావిరికొల్పిన శుద్ధియగును.

## ద్రవ్యశుద్ధ, ఉపరసమాలిక

శాలిధాన్యామ్లసంఘృష్ట మభ్రకం శుద్ధమిష్యతే. 216
విషం త్రిరాత్రముషితం గోమూత్రే శుద్ధమీరితం,
అఙ్గారైశ్చ గోమూత్రే క్షిపే త్తప్తాయసం మలమ్. 217
పురాతనం భూమికందం సప్తవారం విశుధ్యతి,
పలాశద్రవ తాళాభ్యాం వంగం భస్మీ భవేత్క్షణాత్. 218
శిలార్కదుగ్ధతో నాగం తామ్రమాజ్యేన గంధకాత్,
స్త్రీస్తన్యే హింగుళం తీక్ష్ణం తారం స్నుక్షీరతాపనాత్. 219
నాగభస్మశిలాభ్యాం తు హేమధాత్వాదయస్తథా,

అజామూత్రేణ లోహం తు శిలాగోమూత్ర భావితా. 220
కఫరీ నరమూత్రేణ భావితా శుద్ధముచ్యతే,
మాక్షికం కదళీతోయైః పాచయేత్తు భిషగ్వరైః. 221
క్షీరేణ టంకణం చాథ గంధకం తు విపాచయేత్,
కూశ్మాండనీరే తాళం చ తుత్థం జంబీరజైర్ద్రవైః. 222
దీప్యకంచూర్ణతోయేన గౌరిం జంబీరవారిణా,
సప్తాహం గవ్యతక్రస్థా విశుద్ధాస్స్యాదరాటికా. 223
గోక్షీరమాషయూషాభ్యాం భావ్యే హింగుళ టంకణే,
నిదిగ్ధికామృతా ముస్తా వాసారిష్టకమూలకైః 224
త్రిఫలా క్వాథతోయేన గుగ్గులుం శోధయే ద్భిషక్,
అనుక్తానిచ సర్వాణి గోమూత్రేణ విభావయేత్. 225
జంబీరనీరై స్సప్తాహం భావయిత్వా విశుధ్యతి, (ఆయుర్వేదే)

తా. అభ్రకమును వడ్లు, పులికడుగు - వీనితో రుద్దిన శుద్ధియగును. వసనాభిని గోమూత్రములో మూడుదినములు నానబెట్టిన శుద్ధియగును. ఇనుమును భూమిలోని ప్రాతచిట్టెమును, తానికట్టె నిప్పులో యేడుమార్లు కాచి యేడుమార్లు గోమూత్రముతో చల్లార్చిన శుద్ధియగును. వంగమును మోదుగరసము, తాళకము-వీనితో నూరి పుటంబులిడిన భస్మంబగును. నాగమును మణిశిల, జిల్లేడుపాలు-వీనితో నూరి పుటంబులిడిన భస్మంబగును. గంధకమును నేతితో నూరి తామ్రముపై లేపనముజేసి పుటంబులిడిన తామ్రము భస్మంబగును. ఇంగిలీకము చనుబాలతో నూరి పుటంబిడిన భస్మంబగును. వెండి సెజ్జగకాల్చి బొంతజెముడుపాలలో నద్దిన శుద్ధియగును. నాగభస్మము, మణిశిల-వీనితో స్వర్ణాదిధాతువులు భస్మంబులగును. లోహమును గోజ్జిపంచితముతో పుటంబులిడిన భస్మంబగును. సిలాజిత్తు గోమూత్రముతో శుద్ధంబగును. కఫరిని నరమూత్రముతో భావనజేసిన శుద్ధియగును. మాక్షికమును అరటిరసముతో వండిన శుద్ధియగును. వెలిగారము పాలతో వండిన శుద్ధియగును. గంధకమును పాలతో వండిన శుద్ధియగును. తాళకమును గుమ్మడుకాయనీటితో వండిన శుద్ధియగును. మైలుతుత్థమును నిమ్మపండ్లరసముతో వండిన శుద్ధియగును. ఓమమును సున్నపునీళ్ళతో వండిన శుద్ధియగును. గౌరీపాషాణమును నిమ్మపండ్లరసముతో వండిన శుద్ధియగును. గవ్వల నావుచల్లతో నేడుదినములు వండిన శుద్ధియగును. ఇంగిలీకము, వెలిగారము-వీని నావుపాలతోను, మినుపకట్టుతోను భావనజేసిన శుద్ధియగును. గుగ్గిలమును ములక, తిప్పతీగె, తుంగముస్తెలు, అడ్డసరము, వేప అనువాని వేళ్ళరసముతోను, త్రిఫలకషాయముతోను వండిన శుద్ధియగును. మఱియు జెప్పంబడని సర్వద్రవ్యముల గోమూత్రము, నిమ్మపండ్లరసము - వీనిలో ప్రతిదానిచే నేడేసి దినములు భావనజేసిన శుద్ధియగును.

[1]కంకుష్ఠభేదము

నాళీకం రేణుకంచేతి కంకుష్ఠం ద్వివిధం మతమ్. 226
నాళీకం పీతవర్ణం చా ప్యన్యం నీలం ప్రభం భవేత్,

తా. నాళీకము, రేణుకము అని కంకుష్ఠము రెండువిధంబులు. అందు పచ్చగ నుండునది నాళీకమనియు, నీలముగనుండునది రేణుకమనియు జెప్పంబడును.

కంకుష్ఠశుద్ధి

కంకుష్ఠం శుద్ధిమాయాతి త్రిధా విశ్వాంబుభావితమ్. 227

తా. కంకుష్ఠమును శొంఠిరసముతో మూడుమార్లు భావనజేసిన శుద్ధియగును.

కంకుష్ఠగుణము

కంకుష్ఠం తిక్తకటుకం [2]వీర్యేచోష్ణం ప్రకీర్తితం,
[3]వ్రణోదావర్తశూలఘ్నం గుల్మప్లీహగదాపహమ్. 228

తా. కంకుష్ఠము వగరు, కారము, ఉష్ణవీర్యముగలదిగ (కడు లేఖనకారిగ), వ్రణము, ఉదావర్తము, శూల, గుల్మము, ప్లీహము (రసదోషము, జంతువులు) వీనిని పోకడచునదిగా నుండును.

స్వర్ణాదిసర్వలోహనామములు

శుద్ధం లోహం కనకరజతం భానులోహాశ్మసారం,
పూతిర్లోహద్వితయముదితం నాగవంగాభిధానమ్. 229
మిశ్రం లోహం పిత్తలం కాంస్యవర్తం
ధాతుర్లోహోఽస్మాద్వికారాస్స్మృతా స్తే. 230

తా. బంగారు, వెండి, తామ్రము, ఇనుము, రెండువిధములైన పూతిలోహములు, నాగము, వంగము అను నీయెనిమిది శుద్ధలోహంబులును, ఇత్తడి, కంచు, వార్తలోహము, ధాతులోహము అను నాలుగు మిశ్రలోహంబులును భూవికారంబులు.

స్వర్ణం తారం తామ్ర నాగం వంగం కాంతం చ తీక్ష్ణకం,
ముండాంత మష్టధాలోహం కాంస్యారం ఘోషకం త్రిధా. 231
ఉపలోహః స్మృతాఖ్యాతా మండూరో ముండకిట్టకం,
ఏతద్ద్వాదశధాశోధ్యా మార్యాస్తాప్యాః పుటాదిషు. (మతాంతరే)

తా. బంగారు, వెండి, తామ్రము, నాగము, తగరము, కాంతము, ఉక్కు, ఇనుము అను నీయెనిమిది అష్టలోహంబులనియు, కంచు, ఇత్తడి, ఘోషకము అను నీమూ

1 కంకుష్ఠ మన ముదారుసింగు. 2 తీక్ష్ణోష్ణంచాతిలేఖనమ్. 3 గుల్మోదావర్త శూలఘ్నం రసజంతువ్రణాపహమ్.

డు లోహముతోడ నామద్వయముచే వెలయును. చుండూరము, ముండకిట్టనుచిట్టెమును చేర్చుటచే నాలుగుగ నయ్యెడిలోహములు కృత్రిమలోహములనియు, ఉపలోహములని యు జెప్పంబడును. ఈపన్నెండువిధములైన లోహముల శుద్ధిజేసి పుటంబులిడుటచే భస్మము జేయందగును.

### సర్వలోహశుద్ధి

త్రిక్షారం పంచలవణం తప్త్వాచామ్లేన భావయేత్,
కాంస్యారఘోషపత్రాణి తేనపత్రాణి లేపయేత్. 233

తా. సర్జక్షారము, యవక్షారము, వెలిగారము, పంచలవణములు-వీనిని నిమ్మపండ్ల రసముతో నూరి కంచు, ఇత్తడి, ఘోషము అనువాని రేకులపై లేపనముజేసి నిప్పులో గాచి నిమ్మపండ్లరసములో నద్దిన నవి శుద్ధియగును.

తైలే తక్రే గోమూత్రే హ్యారనాళామ్ల తక్రకే,
స్వర్ణాదిసర్వలోహానాం శుద్ధిర్భవతి నిశ్చయమ్. 234

తా. బంగారుమొదలగు సర్వలోహరేకులకాచి నువ్వులనూనె, ఉలవకట్టు, గోమూత్రము, పుల్లనికలి, పులిచల్ల అనువానిలో ప్రతిదానియందు నేడేడుమార్లు నద్దిన నవి శుద్ధియగును. మఱియు సీసము, తగరము అను నీరెంటిని నేడేడుమార్లు కరిగించి నువ్వుల నూనె మొదలగువానిలో నేడేడుమార్లు పోసిన శుద్ధియగును.

### సర్వలోహభస్మక్రమము

రుద్ధ్వా గజపుటే పక్త్వా శుద్ధమాయాతి నాన్యథా,
తామ్రపర్ణవదేతేషాం కృత్వా సర్వత్ర యోజయేత్. 235

తా. శుద్ధిజేయఁబడిన సర్వమైన లోహరేకులకు సమభాగముగ శుద్ధిజేసినగంధకమును గ్రహించి జిల్లేడుపాలతోనూరి వానిపై లేపనముజేసి మూషలోనునిచి తామ్రము వలెనే గజపుటంబులిడిన సర్వలోహములు భస్మంబులగును. అట్టిభస్మముల సర్వప్రయోగములయం దుని చికొనందగును.

### నవలోహవివరము

సువర్ణం రజతం తామ్ర మయో నాగం చ వంగకం,
రీతికా కాంస్య వర్తాని లోహా నవ తథా విదుః. 236

తా. సువర్ణము, రజతము, తామ్రము, ఇనుము, సీసము, తగరము, ఇత్తడి, కంచు, వర్తలోహము అనునవి నవలోహంబులు.

### సువర్ణనామములు

స్వర్ణం సువర్ణ కనకోజ్జ్వలకాంచనాని
కల్యాణహాటకహిరణ్యమనోహరాణి,

గాంగేయగైరికమహారజతాగ్నివీర్య
రత్నాంగహేతుతపనీయకభాస్కరాణి. (నిఘంటౌ) 237

తా. స్వర్ణము, సువర్ణము, కనకము, ఉజ్జ్వలము, కాంచనము, కల్యాణము, హాటకము, హిరణ్యము, మనోహరము, గాంగేయము, గైరికము, మహారజతము, అగ్నివీర్యము, రత్నాంగహేతు, తపనీయకము, భాస్కరము అనునవి సువర్ణ నామంబులు.

జాంబూనదం జాతరూపం హిరణ్యం హేమ హాటకం,
చామీకరం చారుపుష్పం సువర్ణ స్వర్ణ కాంచనమ్. 238
తపనీయం శాతకుంభం రుక్మం కనక మేవచ,
మహారజత మాగ్నేయం గాంగేయంభర్మకర్బురమ్.(మతాంతరే)239

తా. జాంబూనదము, జాతరూపము, హిరణ్యము, హేమము, హాటకము, చామీకరము, చారుపుష్పము, సువర్ణము, స్వర్ణము, కాంచనము, తపనీయము, శాతకుంభము, రుక్మము, కనకము, మహారజతము, ఆగ్నేయము, గాంగేయము, భర్మము, కర్బురము అనునవి సువర్ణనామంబులు.

## సువర్ణశుద్ధి

సువర్ణం రక్తమృత్స్నాచ లేపితం తాప్యశుధ్యతి,
తత్సువర్ణం దళం కృత్వా సూక్ష్మం కుర్యా ద్విచక్షణః. 240
జంబీరనీరేణ హేమమాక్షికం మర్దితం భిషక్,
తద్దళే లేపితం దంతిపుటం దేయం శరావకే. 241
భస్మీభవతి శీఘ్రేణ నాత్ర కార్యా విచారణా,

తా. బంగారు నెఱ్ఱమన్నులో పొదిగి కొలిమిలో నూదిన శుద్ధియగును. పిదప దానిని సన్నపురేకులుగ జేయించి దానిపై హేమమాక్షికమును నిమ్మపండ్లరసముతో నూరి లేపనముజేసి యెండించి మూకుడులోనునిచి దానిపై మఱియొకమూకుడునుమూసి మూడు చీలమన్నులిచ్చి మూడుగజపుటంబులిడిన బంగారము భస్మంబగును.

## సువర్ణసిందూరవిధి

తద్భస్మ రవిదుగ్ధేన చాశ్వత్థత్వగ్ద్రవేణచ. 242
హింగుళం భస్మతుల్యంచ దత్వా తుల్యం విమర్దయేత్,
మర్కటీమూరజబ్రాహ్మై ర్మాంసపాదిరసేనచ. 243
మర్దయే చ్చతుశో యామాన్ పుటమారణ్యకోత్పలైః,
కరిసంజ్ఞం పంచదేయం సిందూరం భవతి ధ్రువమ్. 244

తా. ఆబంగారు భస్మమును జిల్లేడుపాలతోను, రావిచెక్కల రసముతోను

మర్దించి యాబంగారుభస్మమునకు సమముగ శుద్ధిజేసిన ఇంగిలీకమునుజేర్చి ఖల్వములో నునిచి తీటకోవెల వేళ్ళరసము, హంసపాదియాకురసము అనువానితో నాలుగురుఝాములు మర్దించి పిడకలతో నైదుగజపుటంబులిడిన సువర్ణము శీఘ్రముగ సిందూరించును.

ప్రకారాంతరసువర్ణభస్మము

శుద్ధం స్వర్ణదళం కృత్వా చేక్షుకస్వరసేనచ,
గంధకం మర్దితం చాత్ర దళేకుర్యా ద్విలేపనమ్. 245
ఆతపే తాపయే త్తీవ్రే తద్విలేప్య ముహుర్ముహుః,
అరణ్యోత్పలకే దత్వా పుటమేకం శరావకే.
గంధం తత్సర్వపాదాంశం పునర్దత్వేక్షుకేరసే,
పునఃపుటత్రయేపాచ్యం భస్మీభవతి హాటకమ్. 247

తా. శుద్ధిజేసినబంగారును రేకులుగ జేయించి వానిపై శుద్ధిజేసిన గంధకమును చెఱుకు రసముతోనూరి లేపనముజేసి యెండ నెండించవలయును. ఇటుల నేడుమార్లు లేపనముజేసి యెండించి మూకుడులోనునిచి చీలమన్నులిచ్చి పిడకలతో నొకగజపుటంబిడి సాంగశీతలమునదీసి యారేకులకు నాలవభాగము శుద్ధిజేసినగంధకమును గ్రహించి చెఱుకు రసముతోనూరి యేడుమార్లు పట్టించి యెండించి పిడకలతో మూడుగజ పుటంబులిడిన బంగారు భస్మంబగును. (ఇట్టిభస్మమును క్షయరోగములయం దుపయోగింపదగును.)

స్వర్ణభస్మము

హేమ్నః పాదం మృతం సూతం పిష్ట మమ్లేన కేనచిత్,
పత్రే లిప్త్వా పుటేతచ్చా దష్టభి ర్మ్రియతే ధ్రువమ్. (సిద్ధరసార్ణవే)

తా. శుద్ధిచేసిన బంగారును రేకులుజేయించి సన్నముగ, టంకణపురేకులవలె సూక్ష్మముగ కత్తిరించి దానికి నాలవభాగము రసభస్మమునుజేర్చి నిమ్మపండ్లరసముతో మర్దించి రేకులపై లేపనముజేసి యెండించి ప్రమిదెలసంపుటములో నునిచి చీలమన్నులిచ్చి పుటంబిడి సాంగశీతలమునదీసి యాసువర్ణపురేకులకు నాలవభాగము రసభస్మముగలిపి నిమ్మపండ్లరసముతో మరల మర్దించి ఎనిమిదిపుటంబులిడిన సువర్ణము శుద్ధభస్మంబగును.

(శుద్ధిజేసిన బంగారు ఒకభాగము, శుద్ధిజేసిన రసభస్మము రెండుభాగములు - ఇటుల వీని నేకముజేసి యుదకముతో మర్దించి యందలి నీటెని వడిపి ముద్దచేసి దాని కర్థభాగము శుద్ధిజేసిన గంధకమును, ఇంగిలీకమునుజేర్చి ప్రమిదలో నునిచి చీలమన్ను లేపనముజేసి పుటంబిడిన భస్మంబగును. పిదప దానికి నాలుభాగము శుద్ధిజేసిన గంధకమును, ఇంగిలీకమునుజేర్చి రెండుపుటంబులిడిన బంగారము శుద్ధముగ భస్మంబగును.)

## స్వర్ణద్రుతి

ఇంద్రగోపకసూతంతు దేవదాలీఫలద్రవైః,
భావితంచైకవింశాహం ద్రుతే హేమ్ని ప్రదాపయేత్. 249
కించిత్కించి త్సమాయాతి యావ త్తిష్ఠతి సూతవత్,

తా. ఇంద్రగోపపురుగులు, పాదరసము-వీనిచూర్ణమును దేవదాలీఫలరసముతో ౨౧ మార్లు భావనజేసి పిదప సువర్ణభస్మమును కరిగించి రసమువలె ద్రుతియగువఱకు నా చూర్ణమును కొంచెకొంచెముగ వేయుచుండవలయును.

## సువర్ణభస్మగుణము

మూర్ఛోన్మాదౌచ యక్ష్మాణం గ్రహణీంచ విశేషతః. 250
నాశయే త్సర్వరోగాంశ్చ సాధ్యాసాధ్యాంశ్చ దుస్తరాన్,
తత్తద్రోగానుపానేన ప్రయుంజీత భిషగ్వరః. (ఆయుర్వేదే) 251

తా. సువర్ణభస్మము నాయారోగానుపానములతోడ నొసంగిన అసాధ్యంబులై సాధ్యాసాధ్యంబులుగ నుండు సర్వరోగముల హరింపజేయుటయేగాక మూర్ఛ, ఉన్మాదము, రాజయక్ష్మ, గ్రహణి అనువానిని విశేషముగ హరింపజేయును.

సువర్ణంతు భవే త్స్వాదు తిక్తం స్నిగ్ధం హిమం గురు,
బుద్ధివిద్యా స్మృతికరం విషహారిరసాయనమ్. (గ్రంథాంతరే) 252

తా. శుద్ధసువర్ణభస్మము వగరుగ, శీతకారిగ, జడముగ, బుద్ధి, విద్యాస్మృతుల గలుగంజేయునదిగ, రసాయనముచలన విషమును బోకడచునదిగ నుండును.

## స్వర్ణభస్మహరరోగములు

ఏతద్భస్మసువర్ణజం కటు ఘృతోపేతం ద్విగుంజోన్మితం
లీఢం హంతి నృణాం క్షయాగ్నిసదనం శ్వాసంచ కాసారుచిం,
ఓజోధాతువివర్ధనం బలకరం పాండ్వామయధ్వంసనం
పథ్యం సర్వవిషాపహం గరహరం దుష్టగ్రహణ్యార్తిజిత్. 253

తా. సువర్ణభస్మములో రెండుగురిగింజలయెత్తును కటుకరోహిణి ఘృతము అనువానితోడ సేవించిన క్షయాగ్నిమాంద్య, శ్వాస, కాసారుచుల హరింపంజేయుటయేగాక ఓజోవృద్ధిని, ధాతువృద్ధిని, బలమును, శరీరారోగ్యమును గలుగంజేసి పాండువు, సర్వవిషదోషము, కృత్రిమవిషదోషము, దుష్టగ్రహణి అనువానిని హరింపజేయును.

## సువర్ణభస్మగుణము

స్నిగ్ధం మేధ్యం విష గరహరం బృంహణం వృష్యమగ్ర్యం
యక్ష్మోన్మాదప్రశమనపరం రోగజాలప్రమాథి,

మేధా బుద్ధి స్మృతి సుఖకరం సర్వనేత్రామయఘ్నం
రుచ్యందీప్తప్రశమనపరం స్వాదుపాకం సువర్ణమ్. (నిత్యనాథీయే)

తా. సువర్ణభస్మము స్నిగ్ధముగ, పరిశుద్ధముగ, విష కృత్రిమవిషముల బోకడచునదిగ, శరీరపుష్టికారిగ, కడువీర్యవృద్ధికారిగ, రాజయక్ష్మోన్మాదముల హరింపంజేయునదిగ, రోగసమూహమును బోకడచునదిగ, మేధ బుద్ధి స్మృతి సుఖముల గలుగంజేయునదిగ, సర్వనేత్రరోగముల బోకడచునదిగ, రుచికారిగ, అగ్నిమాంద్యమును బోకడచునదిగ, పాకమువలన రుచికరముగ నుండును.

### అశుద్ధసువర్ణభస్మగుణము

సౌఖ్యం వీర్యం బలం హంతి రోగం వర్ణం కరోతి చ,
అశుద్ధ మమృతం స్వర్ణం తస్మాచ్ఛుద్ధం చ మారయేత్. 255

తా. అశుద్ధమైన సువర్ణభస్మము సౌఖ్య వీర్య బలముల బోకడచుటయేగాక రోగమును, దుష్టమైన వర్ణమును గలుగంజేయును. కావున బాగుగ శుద్ధిజేయఁబడిన సువర్ణము నే భస్మము చేయవలయును.

### హేమపరీక్ష

ఘర్షే కుంకుమసంకాశం ఛేదే సిందూరసన్నిభం,
శిరీషపాక కందాహే మార్దవే సికతోపమమ్. 256
స్వాదు స్నేహ నిభం స్నిగ్ధం పారదేన సమం గురు,
బహుమూలమితి ఖ్యాతం స్వర్ణం షడ్విధలక్షణమ్. 257

తా. ఒరసినకుంకుమవలె నెఱ్ఱగనుండుట, ఛేదించిన సిందూరమువలె నుండుట, కాచిన దిరసెన పుష్పమువంటి పాకముగలదై యిసుకవలె మృదువుగనుండుట, రుచి మెఱపు స్నిగ్ధముగలదిగ నుండుట, పాదరసమువలె బరువుగ నుండుట, వెల యధికముగ నుండుట-ఈయారులక్షణములు స్వర్ణమునం దుండును.

### రజతనామములు

రూప్యకం రజతం తారం త్రపుభీ రుధిరాహ్వయం,
కలధౌతం తప్తరూపం రుధిరం చంద్రహాసకమ్. (నిఘంటౌ) 258

తా. రూప్యకము, రజతము, తారము, త్రపుభి, రుధిరాహ్వయము, కలధౌతము, తప్తరూపము, రుధిరము, చంద్రహాసకము అనునవి రజతనామంబులు.

### రజతశుద్ధి

అథ రౌప్యదళం పంథ్యా కర్కోటీ కందకద్రవైః,
భావితం సప్తవారంచ శుద్ధిర్భవతి నిశ్చయమ్. (చింతామణౌ) 259

తా. వెండిరేకుల కొలిమిలో కాచి గోధ్దుకాకరగడ్డరసముతో నేడుమార్లు అద్దిన శుద్ధియగును.

### రజతభస్మము

తచ్ఛుద్ధం రజతం కృత్వా దళం సూక్ష్మం భిషగ్వరైః,
సీమంతినీ స్తన్యదుగ్ధే మర్దితం కాకమాక్షికమ్. 260
విలేపితం తథాశోష్యం పుటమేకంచ మూషయా,
పాచ్యం వారణసంజ్ఞేన భస్మీభవతి నిశ్చయమ్. 261
అథవా స్వర్ణవత్కుర్యా ద్రౌప్యం భస్మీ భవే ద్ధ్రువం,

తా. శుద్ధిజేసిన సన్నని వెండిరేకులపై కాకమాక్షికమును చనుబాలతో మెత్తగ నూరి పలుమారు పూసి యెండించి వజ్రమూషములో నునిచి ఏరుపిడకలతో గజపుటం బిడిన వెండి భస్మంబగును. లేక బంగారువలెనే పుటంబులిడినను వెండి భస్మంబగును.

### * రజతసిందూరము

సమం తద్భస్మదరదం బర్బరాణాం శృతంజలమ్. 262
అర్కక్షీర వటక్షీరై ర్హంసపాది దురాలభాః,
గుడోదకైః పృథఙ్మర్ద్యం పృథక్సప్తపుటంగజే, 263
సిందూరం భవతి జ్ఞేయం సర్వకర్మసు యోజయేత్,

తా. రజతభస్మమునకు సమముగ శుద్ధిజేసిన ఇంగిలీకమును జేర్చి తుమ్మచెక్క కషాయము, జిల్లేడుపాలు, మఱ్ఱిపాలు, హంసపాదియాకురసము, దూలగొండివేళ్ళ రసము, బెల్లపురసము అనువానిలో ప్రతిదానిచే నొక్కొకదినముచొప్పున మర్దించి ఏడు గజపుటంబులిడిన రజతభస్మము సిందూరించును.

### రజతద్రుతి

శతధా నరమూత్రేణ భావయే ద్దేవదాళికామ్. 264
తచ్చూర్ణవాపమాత్రేణ ద్రుతిస్స్యా త్స్వర్ణతారయోః,

తా. దేవతాడిని నరమూత్రముతో నూరుమార్లు భావనజేసి దానిచూర్ణమును రజతభస్మములో పలుమారు వేయుచు నూదుచుండిన బంగారు, వెండి-వీనియందు ద్రుతి వెడలును.

### రౌప్యభస్మానుపానములు

భస్మీభూతం రజతమమలం తత్సమం వ్యోషభాను
స్సరై ర్వేస్తుల్యం త్రికటుకవరం సార మాజ్యేన యుక్తం,

1 రజత మన వెండి.

## విషజ్వరోత్పత్తి కారణము

దోషోల్పోపహితసంభూతో జ్వరోత్సృష్టస్యవా పునః. 228
ధాతు మన్యతమం ప్రాప్య కరోతి విషమజ్వరం, (మతాంతరే)

తా. జ్వరవిముక్తునికి అహితాహారాచారాద్యపథ్యసేవనలచే దోషము జనించు. దోషము మరల కొంచెము వృద్ధిచెంది రసాదిసప్తధాతువులలో నేదైనా నొకదానిని నాశ్రయించి ఉత్పత్తిలోనే తృతీయాది విషమజ్వరములను గలుగజేయు. దోషము ఉత్పత్తికాలములో అల్పముగ నుండి కాలవిశేషమువలన బలవత్తరమై జ్వరము గలుగజేయు. బలవత్తరముగనుండిన నిత్యజ్వరమును గలుగజేయు.

ధాతుస్థానగతైర్దోషై ర్జాయంతే విషమజ్వరాః (ఆయుర్వేదే)
తా. దోషములు రసాదిసప్తధాతుగతంబులైన విషమజ్వరములు జనించు.

## విషమజ్వరభేదము

సంతతస్సతతోఽన్యేద్యు స్తృతీయక చతుర్థకౌ, (ఆయుర్వేదే)

తా. సంతతము, సతతము, అన్యేద్యు (అనఁగా ద్వ్యాహికము), తృతీయకము (అనఁగా త్ర్యాహికము), చతుర్థకము (అనఁగా చాతుర్థికము) అని విషమజ్వరములు ఐదు విధంబులు. (దోషము రసగతంబైన సంతతజ్వరమును గలుగజేయు. రక్తగతంబయిన సతత జ్వరమును గలుగఁజేయు. మాంసగతంబైన ద్వ్యాహికజ్వరమును గలుగజేయు. మేదోగతంబైన త్ర్యాహికజ్వరమును గలుగజేయు. అస్థిమజ్జాగతంబైన అనేకరోగములతో గలసి మృత్యుతుల్యముగనుండు చాతుర్థికజ్వరమును గలుగజేయు.)

రసాశ్రితస్సంతతకో దివారాత్రం నముంచతి. 230
అహోరాత్రే సతతకో ద్వౌకాలా వనువర్తతే,
అన్యేద్యుష్క స్త్వహోరాత్ర ఏకవారం ప్రవర్తతే. 331
తృతీయక స్తృతీయేహ్ని చతుర్థేహ్ని చతుర్థకః,
ముక్తేన్యేహ్ని చతుర్థోసౌ చాతుర్థిక విపర్యయః. 232

తా. రసధాతువు నాశ్రయించి ౭, ౧౦ లేక ౧౨ దినములవఱకు ఏయుంబగలు విడువకుండుజ్వరము సంతత మనఁబడును. అహోరాత్రమధ్యములో రెండుమార్లు(అనఁగా పగలు రెండుమారులుగాని, రాత్రి రెండుమార్లుగాని, లేక పగలు ఒకమారుగాని రాత్రి ఒకమారుగాని, ఒకపూటలో రెండుమార్లు గాని) వచ్చుజ్వరము సతత మనఁబడు అహోరాత్రమధ్యములో ఒకమారువచ్చుజ్వరము అన్యేద్యుష్క మనఁబడు. మూఁడవ దినముల కొకమారువచ్చు జ్వరము తృతీయక మనఁబడు. నాల్గుదినముల కొకమారు వచ్చు

లీఢం ప్రాతః క్షపయతి నృణాం యక్ష్మ పాండూదరార్శ
శ్శ్వాసా న్కాసా న్తిమిరజ హరం పిత్తరోగా నశేషాన్.

తా. నిర్మలమైన రజతభస్మమునకు సమముగ అభ్రకమును, తామ్రమును వానికన్నిటికి సమముగ త్రికటుకచూర్ణమును, నెయ్యిగలిపి ప్రాతఃకాలమున సేవిం క్షయము, పాండువు, ఉదరము, అర్శస్సు, శ్వాసము, కాసము, తిమిరరోగము, రోగము-వీనిని హరింపంజేయును.

### రౌప్యభస్మగుణము

రౌప్యం శీతం కషాయం చ స్నిగ్ధం వాతహరం గురు,
రసాయనవిధానేన సర్వరోగాపహారకమ్. 2

తా. రజతభస్మము శీతకారిగ, కషాయముగ, స్నిగ్ధముగ, వాతమును హరిం జేయునదిగ, బరువుగ, రసాయనమువలన సర్వరోగముల హరింపంజేయునదిగ నుండు

రౌప్యం స్నిగ్ధం కషాయామ్లం విపాకే మధురం పరం,
వయస స్థాపనం వృష్యం లేఖనం వాతపిత్తజిత్. (రసరత్నాక

తా. రజతము స్నిగ్ధముగ, కషాయముగ, పుల్లగ, విపాకమువలన మధురరస గలదిగ, విరేచనకారిగ, వయస్థాపనకారిగ, వీర్యవృద్ధికారిగ, లేఖనక్రియం జే నదిగ, వాతపిత్తముల బోకడచునదిగ నుండును.

రౌప్యం విపాకమధురం తువరామయఘ్నం
శీతం సరం పరమలేఖనకంచ వృష్యం,
స్నిగ్ధంచ వాత కఫజి జ్జఠ రాగ్నిదీప్తే
ర్బల్యప్రదం స్థిరవయస్కరణంచ హృష్యమ్. (ఆయుర్వేదే) 2

తా. రజతము విపాకమువలన మధురముగ, ఒగరుగ, రోగమును బోకడ నదిగ, శీతలముగ, విరేచనకారిగ, ఉత్తమమైన లేఖనక్రియాకారిగ, వీర్యవృద్ధికారి స్నిగ్ధముగ, వాతకఫముల హరింపంజేయునదిగ, జాఠరాగ్నికి దీపనమును గలుగంజే నదిగ, బలకారిగ, వయస్థాపనకారిగ, సుఖకారిగ నుండును.

### అశుద్ధరౌప్యభస్మగుణము

ఆయు స్సుఖం బలం హంతి తారం వీర్యంచ శుక్రజిత్,
అశుద్ధ మమృతం తారం శుద్ధం కార్యమతో బుధైః. 2

తా. అశుద్ధరజతభస్మము ఆయువు, సుఖము, బలము, వీర్యము, శుక్రము వీనిని బోకడచును. కావున దానిని శుద్ధముగనే జేయవలయును.

### * తామ్రనామములు

తామ్ర మౌదుంబరం శుల్బం పవిత్రం బ్రహ్మవర్ధనం,
రక్తలోహం మ్లేచ్ఛముఖం త్ర్యంబకం మిహిరాహ్వయమ్. 270
(నిఘంటౌ)

తా. తామ్రము, ఔదుంబరము, శుల్బము, పవిత్రము, బ్రహ్మవర్ధనము, రక్తలోహము, మ్లేచ్ఛముఖము, త్ర్యంబకము, మిహిరాహ్వయము అనునవి తామ్ర నామంబులు.

తామ్ర మౌదుంబరం శుల్బం తపనేష్ట ముదుంబరం,
త్ర్యంబకం చానువిందం చ రవిలోహం రవిప్రియమ్.(గ్రంథాంతరే)

తా. తామ్రము, ఔదుంబరము, శుల్బము, తపనేష్టము, ఉదుంబరము, త్ర్యంబకము, అనువిందము, రవిలోహము, రవిప్రియయు అనునవి తామ్రనామంబులు.

### తామ్రదోషము

అశుద్ధతామ్రం వక్ష్యామి తామ్రం నైవ మహావిషం,
విషస్యైకదోషస్స్యా దష్టౌ దోషాశ్చ శుల్బకే. 272
భ్రమో మూర్ఛా విదాహశ్చ ఛర్ది క్లేదన స్వేదనే,
సంతాపశ్చారుచిశ్చాష్టౌ శుల్బేదోషాభవంతి తే. (సిద్ధవిద్యాభూః)273

తా. అశుద్ధతామ్రమున భ్రమ, మూర్ఛ, విదాహము, ఛర్ది, క్లేదము, స్వేదము, సంతాపము, అరుచి అను యెనిమిదిదోషంబులుండును. అట్లగుటచే నొకేదోషముగలవిషము నకన్న తామ్రమే విషంబు.

### అశుద్ధతామ్రదోషము

అశుద్ధతామ్ర మాయుఘ్నం కాంతిఘ్నం సప్తధాతుహా,
వాంతి మూర్ఛా భ్రమోద్రేక నానారుక్కుష్ఠ శూలకృత్. 274

తా. అశుద్ధతామ్రమువలన ఆయుఃక్షయము, కాంతి నశించుట, రసరక్తమాంస త్వక్శుక్లమేదోమజ్జలను సప్తధాతునాశనము, వాంతి, మూర్ఛ, భ్రమ, నానావిధ రోగములు, కుష్ఠువు, శూల గలుగును. అట్లగుటచే దానిని శుద్ధిజేయవలయును.

### తామ్రశుద్ధి

తైల తక్రాదిశుద్ధస్య తద్దోషవినివృత్తయే,
శుల్బస్య శోధనం ప్రాజ్ఞైర్విశేషా త్సముదాహృతమ్. 275

---

* తామ్ర మన రాగి.

స్నుహ్యర్క క్షీర లవణ కాంజికై స్తామ్రపత్రకం,
లిప్త్వా ప్రతాప్య నిర్గుండీరసై స్సించే త్పునఃపునః. 2
వారాద్వాదశ దాహత్వం లేపనా త్తామ్రసించనాత్,
(చికిత్సాసారసిద్ధసంగ్రహే

తా. ఖరీదుదుడ్లనుగాని, వారాణసిచెంబులనుగాని రేకులుగజేయించి కో
కాచి నువ్వులనూనె, పులిచల్ల మొదలగువానిలో నద్దుటచే తామ్రదోషమును
కడచి పిదప బొంతజెముడుపాలు, జిల్లేడుపాలు, పంచలవణములు, కలి - వీనిని
కులపై ప్రత్యేకప్రత్యేకముగబూసి యెండించి కోమిలో కాచి వావిలియాకురసము
నద్దవలయును. ఇటుల ప్రతిదానిని బూసి కాచి ౧౨ మార్లు అద్దిన తామ్రము శు
బగును. (మఱియు తామ్రమును ౧౨ మార్లు కాచి చింతాకురసములోను, తామ్రము
హేమాక్షికమును నూరి పట్టించి వావిలాకురసములోను నద్దవలయును.)

## తామ్రశుద్ధి

గోమూత్రేణ పచేద్యామం తామ్రపత్రం దృఢాగ్నినా. 2
శుధ్యతే నాత్ర. సందేహో మారణం కథ్యతేఽధునా,

తా. తామ్రపురేకుల గోమూత్రములోవైచి దృఢాగ్నితో నొకఝాము కా
శుద్ధియగును. ఇక దానిమారణమును వచియించెదను.

## తామ్రభస్మము

సూక్ష్మాణి తామ్రపత్రాణి కృత్వా సంస్వేదయేద్బుధః. 2
వాసరత్రయ మమ్లేన తతఃఖల్వే వినిక్షిపేత్,
పాదాంశం గంధకం దత్వా యామ మమ్లేన మర్దయేత్. 2
తత ఉద్ధృత్య పత్రాణి లేపయే ద్ద్విగుణేనచ,
గంధకే నామ్లపిష్టేన తస్యకుర్యాచ్చ గోళకమ్. 2
తతఃపిష్ట్వాచ మీనాక్షీం చాంగేరీం వా పునర్నవాం,
తత్కల్కేన బహిర్గోళం లేపయే ద్వ్యంగుళోన్మితమ్. 2
ధృత్వా తద్గోళకం భాండే శరావేణచ రోధయేత్,
వాలుకాభిః ప్రపూర్యాథ విభూతిలవణాంబుభిః. 2
ధృత్వా భాండే ముఖే ముద్రా తతశ్చుల్యాం విపాచయేత్,
క్రమవృద్ధ్యాగ్నినా సమ్య గ్యావద్యామ చతుష్టయమ్. 2
స్వాంగశీతం సముద్ధృత్య మర్దయే త్సూరణద్రవైః,
యామైకం గోళకం తచ్చ నిక్షిపే త్సూరణోదరే. 2

మృదోపలేపః కర్తవ్యో సర్వతోఽంగుళమాత్రకః,
పాచ్యం గజపుటే క్షిప్తం మృతం భవతి నిశ్చితమ్. 285
వమనంచ విరేకంచ భ్రమం క్లేద మథారుచిం,
విదాహ స్వేద ముత్క్లేదం న కరోతి కదాచన. 286

తా. తామ్రమును పలచగ రేకులజేయించి మూడుదినములు నిమ్మపండ్లరసములో నుడికించి యందుండి దీసి ఖల్వములో నునిచి దానికి నాలవభాగము గంధకమును గలిపి నిమ్మపండ్లరసముతో నొకఝూము మర్దించి యాతామ్రరేకుల ఖల్వములోనుండి తీసి పిదప దానికి రెండింతలగంధకమును నిమ్మపండ్లరసముతో నూరి యారేకులపై బూసి యెండించి యారేకుల మడిచి యుంటగజేసి దానిపై పొన్నగంటి, పులిచింత, తెల్ల గలిజేరు అనువానికల్కములను రెండంగుళముల ప్రమాణము దళముగ ముద్దపై లేపనము జేసి యెండించి మూకుళ్ళలో నునిచి చీలమన్ను లేపనముజేసి వాలుకాయంత్రమునం దిడి దానికంఠమువఱకు నిసుకపోసి దానిపై బూడిదె, ఉప్పునీళ్లు చల్లి కుండమూతిని మూసి చీలమన్ను పూసి పొయిమీఁద నునిచి నాలుగుఝాములు క్రమముగ నగ్నిని వృద్ధి జేయుచు పాకముజేసి స్వాంగశీతలమున దీసి కందగడ్డరసముతో నొకఝాము మర్దించి యుంటజేసి కందగడ్డలో నునిచి యాకందగడ్డపై నొకయంగుళప్రమాణము చీలమన్ను పూసి గజపుటంబిడిన తామ్రము బాగుగ భస్మంబగును. దీనివలన వాంతి, భ్రాంతి, భ్రమ, క్లేద, అరుచి, విదాహ, స్వేద, ఉత్క్లేదములు గలుగకుండును.

## తామ్రభస్మము

సూక్ష్మం తామ్రదళం విమర్ద్య పటునా క్షారేణ జంబీరజై
స్తస్త్వామర్ద్య మథో తదర్కపయసా లిప్త్వా దళే సప్తధా,
నిర్గుండ్యంబు హిమం రసేంద్రగలితం గంధేన దుగ్ధేన త
త్త్రైల్యేనాథ మృతం భవేత్సుపుటితం పంచామృతేన త్రిధా.

తా. తామ్రమును పలచగ రేకులుజేయించి వానిపై పంచలవణములను, త్రిక్షారములను, నిమ్మపండ్లరసముతో నూరి లేపనముజేసి యెండించి ఏడుమార్లు కాచి వావిలియాకురసములో నద్దవలయును. పిదప వానిపై జిల్లేడుపాలు పట్టించి ఏడుమార్లు కాచి వావిలియాకురసములో నద్దవలయును. (పిదప హేమమాక్షికమును నూరి పట్టించి నిప్పులో కాచి వావిలియాకురసములో నద్దవలయును) ఇటులజేసిన తామ్రము శుద్ధియగును. పిదప యాతామ్రమునకు సమముగ రసమును, గంధకమును గ్రహించి జిల్లేడుపాల తోనూరి యారేకులపై బట్టించి పుటంబిడిన తామ్రము భస్మంబగును. ఆతామ్రభస్మమును పంచామృతములతో మర్దించి మూడుపుటంబులిడిన నందలి అష్టవిధదోషంబులు హరించును.

### తామ్రభస్మగుణము

తామ్రం తిక్తంచ మధురం కషాయం లేఖనం లఘు,
విషపాకం సరం శీతం మారణం కఫ పిత్తజిత్. 238

తా. తామ్రభస్మము వగరుగ, మధురముగ, కషాయముగ, లేఖనకారిగ, లఘువుగ, విషపాకముగలదిగ, విరేచనకారిగ, శీతకారిగ, కఫ, పిత్తరోగముల హరింపం జేయునదిగ నుండును.

వాంతి భ్రాంతి వివర్జితం జ్వర రుజా కుష్ఠాని పాండ్వామయం,
శూలం మేహ గుదాంకురానిలగదాన్ యుక్తానుపానై ర్జయేత్
భుక్తం స్థౌల్యజరాగ్నిమాంద్యశమనో వంధ్యాశమో వత్సరాత్.
(మతాంతరే)

తా. వాంతి భ్రాంతివివర్జితంబగుటచే శుద్ధమైన తామ్రభస్మమును యుక్తానుపానములతోడ సేవించిన జ్వరము, పీడ, కుష్ఠువు, పాండువు, శూల, మేహము, గుదరోగము, వాతము, స్థౌల్యరోగము, ముదిమి, అగ్నిమాంద్యము అనువానిని హరింపం జేయుటయేగాక ఒకసంవత్సరము సేవించిన వంధ్యాత్వమునుకూడ బోకడచును.

### అశుద్ధతామ్రభస్మదోషము

శుల్బం తనో నయతి దోష మశేషధాతూన్
రోగాన్ కరోతి వివిధాంశ్చ నిహంతి కాంతిం,
కుష్ఠం రుజంచ విషమాన్ కురుతే విశేషాన్
పాకేన హీన మిహ వాంతి విరేచనంచ. 290

హంత్యాయురుచ్చైః కురుతేవితాపం మూర్ఛాంవిధత్తేహరతేచశుక్రం,
నానాగదానాంచ సహాయకారీ హ్యశుద్ధశుల్బస్సుచజీవహర్తా. 291

తా. అశుద్ధతామ్రము సర్వధాతుదోషము, పలువిధములైన రోగములు, కాంతినాశనము, కుష్ఠువు, విషమజ్వరము, వాంతి, విరేచనము, ఆయుఃక్షయము, సంతాపము, మూర్ఛ, శుక్రనాశనము అనువానిని గలుగంజేయుటయేగాక యనేకరోగములకు సహాయకారియై తుదకు ప్రాణముల హరింపంజేయును.

అథాన్యత్సంప్రవక్ష్యామి సంక్షిప్తం సూక్ష్మముత్తమం,
ఆయుర్వేదోపదేశేఽస్మిన్ తామ్రశుద్ధి ర్నిగద్యతే. 292

తా. ఆయుర్వేదమున జెప్పంబడిన ప్రకారము తామ్రశుద్ధిని వచించెదను.

### తామ్రశుద్ధి

గృహకన్యారసేనైవ భావయిత్వా పునఃపునః,

తత స్తత్తం మేఘనాదే భావయిత్వా పునఃపునః. 293
గంధకార్కక్షీరలేపం కృత్వా కృత్వా పుటత్రయం,
చూర్ణీభవతి తత్తామ్రం పునః ఖల్వే విమర్దయేత్. 294
ఫలత్రయకషాయేణ తతో నిక్షిప్య మూషయోః,
పునర్మర్ద్యం క్రమేణైవ దత్వా షోడశధా పుటమ్. 295
అనంతరం క్షీరసర్పి ర్మధుమూత్రై ర్ముహుర్ముహుః,
భావయిత్వా పుటం దేయం ప్రత్యేకం సప్తసప్తచ. 296
గృహకన్యారసేనైవ భావయిత్వా పునః పుటం,
దత్వా విచక్షణ శ్చూర్ణం తద్భవే న్నాత్ర సంశయః. 297
ఏతై ర్ద్వివిధసంస్కారై శ్ఛర్దిదాహభ్రమం హరేత్,
వ్యోషై రేరండతైలేన కాంజికేనాథవా పునః. 298
నిష్కేణ సమ్మితే చూర్ణం గుల్మశూల ప్రశాంతయే,
ప్రయోగ స్సర్వరోగాణాం క్రమపథ్యేనచేదను. 299

తా. రాగిరేకుల నేడుమార్లు కాచి కలుబందరసములో నేడుమార్లును, పొన్నగంటిరసములో నేడుమార్లును నద్దిన శుద్ధియగును. పిదప నారేకులపై శుద్ధగంధకమును జిల్లేడుపాలతో నూరి బట్టించి మూడుపుటంబులిడిన భస్మంబగును. పిదప నాభస్మమును ఖల్వములో బోసి త్రిఫలకషాయముతో మర్దించి ముద్దజేసి యెండించి మూసలో నునిచి పుటంబిడవలయును. ఇత్తెఱంగుగ క్రమముగ ౧౬ మార్లు మర్దించి ౧౬ పుటంబులిడి ఆవుపాలు, ఆవునెయ్యి, తేనె, గోమూత్రము అనువానిలో ప్రతిదానిచే నేడేసిమార్లు మర్దించి మూసలో నునిచి నేడేసిపుటంబులిడి పిదప కలుబందరసముతో మర్దించి పుటంబిడవలయును. ఇట్టి సంస్కారములు జేయఁబడిన తామ్రభస్మమువలన ఛర్దిదాహభ్రమలు గలుగకుండును. మఱియు రూకయెత్తు తామ్రభస్మమును మృదువుగ మర్దించి నిష్కప్రమాణము త్రికటుకచూర్ణానుపానముతోగాని, ఆముదముతోగాని, గంజితోగాని క్రమపథ్యముగనుండి సేవించిన గుల్మశూలలు, సర్వరోగములు హరించును.

## తామ్రసిందూరము

తతో భస్మ రవిక్షీరై ర్హంసపాదిరసేనచ,
న్యగ్రోధదుగ్ధేఽజాక్షీరే కపికచ్ఛూద్రవేణచ. 300
అశ్వత్థవల్కలక్వాథే ప్లక్షక్వాథేనమర్దయేత్,
ముహుర్ముహు స్సప్తపుటాన్ కుర్యాద్వారణసంజ్ఞయా. 301
సూర్యోదయసమం వర్ణం సిందూరం భవతి ధ్రువం,

వాంతి భ్రాంతి విరేకంచ న కరోతి కదాచన.

తా. తామ్రభస్మమును ఖల్వములో బోసి జిల్లేడుపాలు, హంసపాదిర రసము, మఱ్ఱిపాలు, మేకపాలు, దూలగొండివేళ్ళరసము, రావిచెక్కకషాయము, పట్టికషాయము అనువానిలో ప్రతిదానిచే మర్దించి యెండేసి గజపుటంబులిడిన సూర్యునివలె సిందూరించును. దీనివలన వాంతి, విరేచనములు గలుగకుండును.

## తామ్రభస్మగుణము

తామ్రం తీక్ష్ణోష్ణ మధురం కషాయం శీతలం సరం,
కఫ పిత్త క్షయం పాండు కుష్ఠఘ్నం చ రసాయనమ్.
శ్లేష్మ పిత్తహరంచైవ సర్వరోగనివారణం,
వ్రణాని శూల మర్శాంసి మందాగ్నించ వినాశయేత్.

తా. తామ్రభస్మము తీక్ష్ణము, ఉష్ణము, మధురము, కషాయము, శీత సరముగలదిగ, కఫ, పిత్త, క్షయ, పాండు, కుష్ఠువుల హరింపంజేయునదిగ, రస నోపయుక్తముగ, శ్లేష్మపిత్తముల, సర్వరోగముల హరింపంజేయునదిగ, వ్రణము, శ అర్శస్సు, అగ్నిమాంద్యము-వీనిని నశింపంజేయునదిగ నుండును.

## కాంస్యనామములు

కాంస్య ఘోష ప్రకాశంచ కాంస్యఘోషశ్చ సంస్మృతమ్.

తా. కాంస్యము, ఘోషము, ప్రకాశము, కాంస్యఘోషము అనునవి కా నామంబులు.

## కాంస్యగుణము

కాంస్యం కషాయానురసం విశదం లేఖనం సరం,
దృష్టిప్రసాదనం రూక్షం తిక్తం పిత్తకఫాపహమ్.

తా. కాంస్యభస్మము కషాయముగ, పరిశుద్ధముగ, లేఖనకారిగ, సరమ నేత్రహితకారిగ నుండుటయేగాక రూక్షముగ, వగరుగ, పిత్తకఫముల బోక నదిగ నుండును.

## కాంస్యశుద్ధి

తింత్రిణీపత్రజద్రావైః కాంస్యం భావ్యం త్రివారకం,
తతః కుళుత్థయూషేణ కాంస్యం శుద్ధం భవిష్యతి.

తా. కంచును కాచి చింతాకురసములో మూడుమార్లు, ఉలవకట్టులో మూ మార్లు నద్దిన శుద్ధియగును.

## కాంస్యభస్మము

శుద్ధం కాంస్యం దళం కృత్వా సమభాగం బలిం దదేత్,

మర్దితం చార్కదుగ్ధేన చాతపే తాపయేత్పునః. 308
మర్దితం సప్తవారేణ రవిదుగ్ధే పునఃపునః,
వజ్రమూషగతం పాచ్యం కానవోత్పలభూపుటే. 309
ఏవం సప్తపుటం దత్వా కాంస్యం భస్మ భవేద్ధ్రువం,

తా. శుద్ధిజేసినకంచును సన్నముగ తునకలుజేసి దానికి సమముగ గంధకమును గ్రహించి జిల్లేడుపాలతో నూరి లేపనముజేసి యెండనెండించి వజ్రమూషలో నునిచి పిడకలతో భూపుటం బిడవలయును. ఇటుల నేడుమార్లు కంచుకుసమముగ గంధకమును గ్రహించి జిల్లేడుపాలతో నూరి లేపనముజేసి వజ్రమూషలో నునిచి యెండించి పిడకలతో నేడుపుటంబులిడిన కాంస్యము భస్మంబగును.

కాంస్యసిందూరము

తద్భస్మార్ధం చ దరదం తదర్ధం శుద్ధగంధకమ్. 310
తదర్ధం పారదం దత్వా వటక్షీరేణ మర్దయేత్,
హంసపాదిరసాశ్వత్థ వల్కల క్వథితైరపి. 311
బర్బరత్వక్కషాయేణ పాలాశత్వగ్రసేనచ,
మర్కటీమూలజరసైర్మర్దితం చ ముహుర్ముహుః. 312
పునర్జంబీరనీరేణ మర్ద్యం సప్తపుటే పచేత్,
పుటే వారణసంజ్ఞే చ విశ్వకర్మపుటేపి వా. 313
బాలసూర్యోదయసమం సిందూరం భవతి ధ్రువం,

తా. కాంస్యభస్మమున కర్ధభాగము ఇంగిలీకమును, దానికర్ధభాగము శుద్ధగంధకమును, దానికర్ధభాగము శుద్ధరసమును జేర్చి మఱ్ఱిపాలు, హంసపాదిమూకురసము, రావిచెక్కకషాయము, తుమ్మచెక్కకషాయము, మోదుగచెక్కరసము, దూలగొండివేళ్ళరసము, నిమ్మపండ్లరసము అనువానిలో ప్రతిదానిచే నొక్కొకమారు మర్దించి ఒక్కొక గజపుటము చొప్పున నేడుమార్లు గజపుటంబులిడినను, లేక కొలిమిలో నునిచి యూదినను కంచుభస్మము బాలసూర్యునివలె సిందూరించును.

కాంస్యభస్మగుణము

కాంస్యం కషాయ ముష్ణం చ లఘు రూక్షం చ తిక్తకమ్. 314
కఫ పిత్తరుజాం హంతి చాయుర్దేహబలాపహం,

తా. కాంస్యభస్మము కషాయముగ, ఉష్ణముగ, లఘువుగ, రూక్షముగ, వగరుగ నుండుటయేగాక కఫపిత్తరోగముల హరింపంజేయునదిగ ఆయుర్దేహబలకారిగ నుండును.

67

రీతి కా యుగళం రూక్షం తిక్తం చ లవణం పరమ్. 315
శోఫఘ్నం పాండు వాతఘ్నం బలవీర్యవివర్ధనం,

తా. రాజరీతి, కాకతుండి అను రెండువిధములైన ఇత్తడిభస్మము రూక్షముగ, వగరుగ, ఉప్పగ నుండుటయేగాక శోఫ, పాండు, వాతముల హరింపంజేయునదిగ, బలవీర్యకారిగ నుండును.

అశుద్ధకాంస్యదోషము

అశుద్ధ మమృతం లోహ మాయుర్హారి రుజాకరమ్. 316
హృత్పీడాం దేహతాపం చ తస్మాచ్ఛుద్ధం చ మారయేత్,

తా. అశుద్ధమైన కాంస్యభస్మము ఆయుఃక్షయము, పీడ, అొమ్మునొప్పి, శరీరతాపము అనువానిని గలుగంజేయును. కావున బాగుగా శుద్ధిజేయఁబడిన కంచునేభస్మము సేయవలయును.

రీతికా కటు తీక్ష్ణం చ గుల్మ మేహ కఫాస్రజిత్. 317
సతిక్త లవణం భేది పాండు త్వ క్క్రిమి వాతజిత్, (నిఘంటౌ)

తా. ఇత్తడిభస్మము కారముగ, తీక్ష్ణముగ, గుల్మ, మేహ, కఫరక్తదోషముల హరింపంజేయునదిగ, వగరుగ, ఉప్పగ, విరేచనకారిగ, పాండు, చర్మదోషము, క్రిమి, వాతముల బోకడచునదిగ నుండును.

ఇత్తడినామములు

పీతలోహం సింహలకం కపిలం సౌఖ్య మారకమ్. 318
వర్తలోహం త్రిలోహం చ రాజరీతి ర్మహేశ్వరీ,

తా. పీతలోహము, సింహలకము, కపిలము, సౌఖ్యము, ఆరకము, వర్తలోహము, త్రిలోహము, రాజరీతి, మహేశ్వరి అనునవి ఇత్తడినామములు.

రీతికా పిత్తళా పీతలోహ శ్శైవలకంచ తత్. (మతాంతరే)

తా. రీతిక, పిత్తళ, పీతలోహము; శైవలకము అనునవి ఇత్తడినామములు.

ఇత్తడిభస్మగుణము

రీతికా యుగళం రూక్షం తిక్తం చ లవణం రసే,
శోధనం పాండురోగఘ్నం కృమిఘ్నం వీర్యవర్ధనమ్. 320

తా. రాజరీతి, కాకతుండి అను ద్వివిధమైన ఇత్తడిభస్మము రూక్షముగ, వగరుగ, ఉప్పగ, శోధనకారిగ నుండుటయేగాక పాండు, క్రిముల హరింపంజేసి వీర్యవృద్ధిని గలుగంజేయును.

కాంతలక్షణము

యత్పాత్రస్థే ప్రవిశతి జలే తైలబిందు ర్నదత్తో

హింగోర్గంధం విసృజతి జలం తిక్తతాం నింబుకల్కః,
పాచ్యం దుగ్ధం భవతి శిఖరాకారకం నైతిభూమిం
దగ్ధాంగాస్స్యుస్సజలచణకాః కాంతలోహం తదుక్తమ్, 321

తా. కాంతపాత్రయందుదకముపోసి తైలబిందువును వైచిన వ్యాపించకుండుట, ఉదకము ఇంగువయొక్క వాసన వేయుట, నిమ్మపండ్లరసములో కాంతపాత్ర నునిచిన వగరుగ నగుట, మఱియు నాకాంతపాత్రలో పాలుకాచిన పొంగి బైలంపడక దానిలోనే పడుట, కాంతపాత్రనుకాచి సెనగలతడిపి దానిలోవేసిన సెనగలపై పొట్టు కాలిపోవుట-ఇట్టిలక్షణములుగలవి కాంతలోహ మనంబడును.

కాంతశుద్ధి

జంబీర జారనాళేచా ప్యామ్లతక్రే చ కాంతకం,
క్షిప్త్వా సప్తాతపే దేయం కాంతశుద్ధి ర్భవే త్సుధీః. 322

తా. సూదంటురాయిని నిమ్మపండ్లరసము, కలి, పులిచల్ల అనువానిలో ప్రతిదానియందు నేడేసిమార్లు వేసి నేడేసిగడియలు యెండ నెండించిన శుద్ధియగును.

కాంతభస్మము

తచ్ఛుద్ధం కాంతపాదాంశం గంధకం చ దదే ద్భిషక్,
అర్కక్షీరే విమర్ద్యాథ శిరాభేవిరసేన చ. 323
పలాశత్వగ్రసేనైవ మర్ద్యం గజపుటే పచేత్,
ఏవం పుటత్రయే పాచ్యం కాంతం భస్మ భవే ద్ధ్రువమ్. 324

తా. శుద్ధిజేసిన కాంతమునకు నాలవభాగము గంధకమును గ్రహించి జిల్లేడుపాలు, కొండపిండివేళ్ళరసము, మోదుగచెక్కరసము అను నీమూటిచే పేర్వేఱుగ మర్దించి మూడుగజపుటంబులిడిన కాంతము భస్మంబగును.

కాంతసిందూరము

తద్భస్మార్ధం చ దరదం దత్వా ఖల్వే విమర్దయేత్,
కపికచ్ఛూమూలరసే మర్దితం దివసత్రయమ్ 325
రక్తమృత్స్నావజ్రమూషాం కృత్వా తస్యాంతరా క్షిపేత్,
వస్త్రమృత్తికయా లేప్యం పాచ్యం గజపుటత్రయమ్ 326
కాంతం బాలోదయసమం సిందూరం భవతి ధ్రువం,

తా. కాంతభస్మమున కర్ధభాగము, ఇంగిలీకమునుజేర్చి దూలగొండివేళ్ళరసముతో మూడుదినములు మర్దించి యెఱ్ఱగ మంటితో జేయఁబడిన వజ్రమూషలో నునిచి మూడుచీలమన్నులిచ్చి మూడుగజపుటంబులిడిన బాలసూర్యునివలె కాంతము పండుం డించును.

జ్వరము చాతుర్థిక మనఁబడు. ఈచాతుర్థికజ్వరము నాలుగవదినంబున వచ్చి విడిచి ఐదవ దివసంబునవచ్చిన చాతుర్థికవిపర్యయము (అనఁగా పంచాహికము) అనఁబడు. (ఈవిషమ జ్వర సాధ్యాసాధ్యంబుల నెఱింగి చికిత్సింపవలయు. చికిత్సించునెడల స్వచ్ఛందభైరవమ్ము నొసంగవలయు.)

జ్వరః పంచవిధః ప్రోక్తః మలకాలబలాబలాత్,
ప్రాయశ్చ సన్నిపాతేన భూయసా త్వపదిశ్యతే,
సంతత స్సతతోఽన్యేద్యుః తృతీయక చతుర్థకౌ. (బాహటే)233

తా. వాతాదిదోషములు, ఆదానవిసర్గరూపమైన కాలము, వీని బలాబలముల వలన జనించుజ్వరము అయిదువిధములుగ నుండును. మఱియును సన్నిపాతముచే సంతతము, సతతము, అన్యేద్యుః, తృతీయకము, చతుర్థకము అని జ్వరములు నానావిధములుగ నుండును.

సంతతజ్వరోత్పత్తిక్రమము

ధాతుమూత్రశకృద్వాహి స్రోతసా వ్యాపినోమలాః,
తాపయంత స్తమం సర్వాం తుల్యదూష్యాదివర్ధితాః. 234
బలినో గురవ స్తబ్ధా విశేషేణరసాశ్రితాః,
సంతతం నిష్ప్రతిద్వంద్వం జ్వరం కుర్యు స్సుదుస్సహమ్. 235

తా. తుల్యమగుదూష్యాదులు, ప్రకోపకరవస్తువులు వీనిచే వృద్ధిచెంది బలిష్ఠముగనుండు వాతాదిదోషములు రసాదిసప్తధాతువులను మలమూత్రములను వహించునట్టి స్రోతస్సులయందు వ్యాపించి సమస్తశరీరమును తపింపఁజేసి పిదప అజీర్ణరసము నాశ్రయించి బలమును గురుత్వమును జెంది స్తబ్ధముగనై దుస్సహమైన సంతతజ్వరమును కలుగజేయును.

సంతతజ్వరక్రమము

మలాః జ్వరోష్మధాతూన్వా సశీఘ్రం క్షపయే త్తతః,
సర్వాకారం రసాదీనాం శుద్ధ్యశుద్ధ్యాపివా క్రమాత్. 236
వాతపిత్తకఫై స్సప్తదశద్వాదశవాసరాః,
ప్రాయోనుయాతి మర్యాదాం మోక్షాయచ వధాయచ. 237

తా. సంతతజ్వరము సర్వాంగములయందు వ్యాపించి మలమును రసాదిసప్త ధాతువులను శీఘ్రములో నిశ్శేషముగా నశింపఁజేయును. మఱియు నిది రసాదులయొక్క జీర్ణాజీర్ణభేదములవలన యథాక్రమముగా వాత పిత్త కఫదోషములచే ఏడు, పది,

కాంతద్రుతి

సృగాల మేష కూర్మాది శల్యాని చ శిలాజతు. 327
ఏతత్సర్వం చూర్ణయిత్వా సుతప్తే కాంతచూర్ణకే,
భావయేద్ద్రవతాం యాతి యథాసూతం సునిర్మలమ్. 328

తా. నక్క, గొఱ్ఱె, తాఁబేలు మొదలగువానియెముకలను, సిలాజిత్తును చూర్ణము జేసి కాంతచూర్ణము బాగుగాఁ గాచి నీరగువఱకు నా చూర్ణమును కొంచెకొంచెముగ వేయుచుండిన రసమువలె నిర్మలముగ ద్రుతి దిగును.

కాంతభస్మగుణము

కాంతాయఃకమనీయకాంతి జననం వాతామయారోచకం
యక్ష్మఘ్నం కఫనాశనం గరహరం దోషత్రయం నాశయేత్,
నానాకుష్ఠనిబర్హణం బలకరం వృష్యం వయస్స్తంభనం
సర్వవ్యాధిహరం రసాయనవరం భూమామృతం నాపరమ్. 329

తా. అయస్కాంతభస్మము శరీరకాంతిని గలుగఁజేయుటయేగాక వాతరోగము, అరుచి, రాజయక్ష్మ, కఫరోగము, కృత్రిమవిషము, త్రిదోషము, పలువిధములైన కుష్ఠరోగములు-వీనిని హరింపఁజేసి బల, వీర్యవృద్ధి, వయఃస్తంభనముల గలుగఁజేయును. మఱియు నది సర్వవ్యాధులఁ బోఁగొట్టునట్టి రసాయనంబును, భూమియందమృతంబునై యుండును.

కాంతాయఃకమనీయ ముత్తమతరం శ్రేష్ఠం చిరాయుష్యదం
స్నిగ్ధం మేహహరం త్రిదోషశమనం శూలాదిమూలాపహం,
గుల్మ ప్లీహ మసృగ్ధర క్షయహరం పాండూదర వ్యాధిను
త్తిక్తాఢ్యంహిమవీర్యకాంతిజననం కుష్ఠప్రమేహాన్ జయేత్. 330
(మతాంతరే)

తా. కాంతభస్మము మనోహరముగ, కడుశ్రేష్ఠంబైనదిగ, ప్రశస్తమైనదిగ, దీర్ఘాయువును గలుగఁజేయునదిగ, మేహపిటికా త్రిదోష, శూల, మూల, గుల్మ, ప్లీహ, అసృగ్ధర, క్షయ, పాండు, ఉదరముల హరింపఁజేయునదిగ నుండుటయేగాక, స్నిగ్ధముగ, వగరుగ, శీతవీర్యముగలదిగ, శరీరకాంతి కారిగ, కుష్ఠప్రమేహముల హరింపఁజేయునదిగ నుండును.

కాంతాభ్రసిందూరగుణము

కాంతాభ్రం కఫవాతపిత్తజనితం క్షీణం చ ప్లీహాపహం
శుక్లాస్థి ప్రవరక్తపిత్తవికృతా న్నానావిధానామయాం,

ఛర్దిం హృద్రుజ మామవాత మరుచిం మూర్ఛాం శిరోవిభ్రమం
పాండుంవింశతిమేహజాంచవికృతిం యోన్యామయంగుల్మజమ్. 331
కాస శ్వాస హలీమకాగ్నిశమనం శూలాతిసారం గరం
నానాక్షి ప్రభవాంగదాహహరణం కంఠప్రరోగాన్ జయేత్,
కుష్ఠోన్మాద మపస్మృతి వ్రణహరం క్షుద్రామయం విద్రధిం
వృద్ధిం సప్తవిధం హలీమకగదం హన్యాత్తథానాహకమ్. 332
వాతం పిత్త కఫ జ్వరం గుదగదం శోషం గ్రహణ్యామయం
వైసర్పిం వినిహంతి వాతరుధిరం స్థౌల్యామయం కామిలాం,
నానారోగహరానుపానసహితం యద్వా జరా న్నాశయేత్
ద్వృష్యం పుష్టికరం రసాయనవరం జత్రూర్ధ్వరోగాన్ జయేత్.
దంతానాం దృఢతాంకరోతిచికురాన్ భృంగైస్సమాన్ కుర్వతే
యే దేవా హ్యమృతం యథాచమనుజారక్షేచ్ఛతంచాయుషం,
మేధా బుద్ధి వివర్ధనం శుభకరం వర్ణప్రదం శ్రీకరం
పార్వత్యా వృషభధ్వజేన కథితం కాంతాభ్రసిందూరకమ్. 334

తా. కాంతాభ్రకములు, కఫ, వాత, పిత్తజనితకృశత్వ, ప్లీహరోగముల హరింపంజేయునవిగ, శుక్లదోషము, అస్థిస్రావము, రక్తపిత్తవికారము మొదలగు నానావిధ రోగములను, వాంతి, ఱొమ్మునొప్పి, ఆమవాతము, అరుచి, మూర్ఛ, తల దిరుగుట, పాండువు, ఇరువదిమేహములవలన గలిగినవికారము, యోనిరోగము, గుల్మము, కాస శ్వాసము, హలీమకము, అగ్నిమాంద్యము, శూల, అతిసారము, కృత్రిమవిషదోషము, పలువిధములైన నేత్రరోగములు, శరీరతాపము, కంఠరోగము, కుష్ఠువు, ఉన్మాదము, అపస్మారము, వ్రణము, క్షుద్రరోగములు, విద్రధి, సప్తవృద్ధులు, హలీమకము, అనాహము, వాత పిత్త కఫ జ్వరములు, మూలరోగము, శోష, గ్రహణి, విసర్పి, వాతరక్తము, స్థౌల్యము, కామిల అనువానిని హరింపంజేయునదిగ నుండుటయేగాక వానిని యుక్తానుపానములతోడ సేవించిన సర్వరోగములను, ముదిమిని హరింపంజేసి వీర్యవృద్ధిని, శరీరపుష్టిని గలుగంజేసి జత్రూర్ధ్వగతరోగముల బోకడచును. కాంతాభ్రకములు శ్రేష్ఠమైన రసాయనంబులు. కాంతాభ్రకసిందూరము దంతములకు దృఢత్వమును, వెంట్రులకు తుమ్మెదలవంటివర్ణమును గలుగంజేయును. మఱియు "అమృతము దేవతల రక్షింపుచుండంబున" మనుజుల నూఱుసంవత్సరములపఱకు కాంతము రక్షింపుచుండును. మఱియు దీనివలన మేధా, బుద్ధి, శుభము, వర్ణము, సంపత్తు గలుగును. ఈకాంతాభ్రకసిందూరములను శివుఁడు పార్వతికి నుపదేశించెను.

### లోహశుద్ధి

లోహసిందూర శుద్ధ్యాది వక్ష్యతే శాస్త్రసమ్మతం,
సూక్ష్మం చూర్ణీకృతం లోహం తిలతైలేన పాచయేత్. 335
తథోకజమూళయుతం బర్బురత్వగ్గ్రసే పునః,
పాచ్యం తీవ్రాతపే క్షిప్తం లోహశుద్ధిర్భవిష్యతి. (చింతామణౌ)

తా. లోహరాపొడిని నూనెలోవైచి యుడికించి నూనెపోవునటుల గడిగి తుమ్మ చెక్కరసముతో నుడికించి యొకర్షూము యెండనెండించిన శుద్ధియగును.

### లోహభస్మవిధి

తతో భస్మవిధిం వక్ష్యే తల్లోహం మర్దయేత్పునః,
జంబూత్వచోద్రవైర్మర్ద్యం పాచితం త్ద్రసేన చ. 337
తతశ్చామలకద్రావై స్త్రింత్రిణీదళజైరపి,
శిగ్రూత్వచరసైర్వాపి గవాంమూత్రే ముహుర్ముహుః 338
పాచితం మర్దితం లోహం రుధ్వా గజపుటేన చ,
భస్మీభవతి తల్లోహం రసయోగేషు యోజయేత్. 339

తా. శుద్ధిజేసిన లోహపొడిని మెత్తగనూరి నేరేడు చెక్కరసముతో రెండు ఝూము లుడికించి మఱల మర్దించవలయును. ఇత్తెఱంగుననే దాని నుసిరికరసము చింతాకురసము, మునగచెట్టరసము, ఆవుపంచితము అనువానితో ప్రతిదానిచే నుడికించి మర్దించి మూషలో నునిచి చీలమన్ను లేపనముజేసి గజపుటంబిడిన భస్మంబగును. ఇట్టిలోహభస్మం బును రసయోగములలో నుపయోగింపంజనును.

### లోహసిందూరము

తద్భస్మ త్రిఫలాద్రావైర్మర్ద్యం మర్ద్యం పునఃపునః,
న్యగ్రోధదుగ్ధార్కదుగ్ధైర్మర్దితం సప్తవాసరమ్. 340
పాచ్యం గజపుటేవాపి విశ్వకర్మపుటేపి వా,
త్రిచత్వారిపుటందద్యాత్సిందూరంభవతిధ్రువమ్. (చింతామణౌ)

తా. లోహభస్మము త్రిఫలరసము, మఱ్ఱిపాలు, జిల్లేడుపాలు అనువానిచే నేడు దినములు మర్దించి గజపుటంబిడవలయును. ఇత్తెఱంగున మర్దించి ఏడుగజపుటంబులిడినను, లేక కొలిమిలో నునిచి యూదినను లోహము సిందూరించును.

### లోహశుద్ధి

తాపయిత్వా తథాంగారే లోహపత్రం పునఃపునః,
నిర్వాపయేద్గవాంమూత్రే తతశ్చూర్ణం సముద్ధరేత్. 342

గోమూత్రే త్రిఫలాక్వాథే లోహచూర్ణం తతఃపచేత్,
పంచాశచ్ఛ పుటే తాభ్యాం సుశుద్ధం జాయతే యథా. 343
మత్స్యాక్షీ చేంద్రవారుణి హంసపాదికషాయకం,
దత్తూరచ్ఛదపత్రాణాం ద్రవేణ దరణేన చ. (ఆయుర్వేదే)

తా. తాటితొట్టిలో గోమూత్రము బోసి యందు ఉక్కురేకుల నెఱ్ఱగ కాల్చి యద్దుచుండిన యారేకులు తునకలుగ తునిగి యాతొట్టిలో బడును. పిదప గోమూత్రమును వడిపి యందలి ఉక్కుపొడిని దీసికొని పెంకులో బోసి గోమూత్రముతో నెఱ్ఱగ వేయించవలయును. ఇటుల గోమూత్రముతో నేడుమార్లును, త్రిఫలకషాయముతో నేడు మార్లును వేయించి ఖల్వములో బోసి గోమూత్రము, త్రిఫలకషాయము అనువానితో ముద్దగనూరి పదిగజపుటంబులును, పొన్నగంటి, పాపర అనువానిరసముతో నూరి పదిగజపుటంబులును వేయవలయును. పిదప దానికి పదియవభాగము ఇంగిలీకమును జేర్చి హంసపాదియాకు కషాయముతో మర్దించి పదిపుటంబులును, ఉమ్మెత్తాకురసము, అవిసెమట్ట రసము అనువానితో మర్దించి పదేసి పుటంబులను వేయవలయును. (ఇటుల నేబదిపుటంబులిడి లోహమునకు పదియవభాగము ఇంగిలీకముజేర్చి పంచదారపానకముతో మర్దించి బుద్ధ్యనుసారముగ పుటంబులిడిన లోహము శుద్ధముగ భస్మంబగును.)

### లోహద్రుతి

గంధకం రక్తలవణం తుల్యం దేయం పునఃపునః,
ధ్మాతానాం లోహచూర్ణానాం సర్వేషాం ద్రావణం పరమ్. 345

తా. గంధకము, ఎఱ్ఱఉప్పు-వీనిని సమభాగములుగ చూర్ణముచేసి దానిని లోహభస్మములో పలుమారు వేయుచు నగ్నిలో నుసిచి యూదుచుండిన లోహము ద్రవించును. మఱియు గంధకము, ఎఱ్ఱఉప్పు అనువానిచేత నే సర్వలోహములును ద్రవించును.

### లోహభస్మగుణము

మృతాని లోహాని చ సేవితాని నిఘ్నంతి యుక్తాని మహామయాని,
అభ్యాసయోగాద్దృఢదేహసిద్ధిం కుర్వంతి రుగ్జన్మజరావినాశమ్. 346
(రసరత్నాకరే)

తా. లోహభస్మసేవనవలన బలిష్ఠమైన రోగమును హరించును. మఱియు లోహభస్మము నెల్లప్పుడు సేవింపుచుండుటవలన శరీరదార్ఢ్యము గలుగుటయేగాక సకల రోగోత్పత్తిని, ముదిమిని బోకడచును.

ఆయుర్వీర్యం బలం దత్తే పాండుమేహం చ కుష్ఠజిత్,
ఆమవాతహరం లోహం వలీపలితనాశనమ్. 347
ఆయసం పాండురోగఘ్నం తీక్ష్ణముష్ణంచదీపనం, (నిత్యనాథీయే)

తా. లోహభస్మము ఆయుర్వీర్యబలముల గలుగంజేయునదిగ, శరీరపాండువు, మేహము, కుష్ఠువు, ఆమవాతము, ముదిమి, పాండురోగము అనువానిని హరింపంజేయునదిగ తీక్ష్ణముగ, ఉష్ణముగ, దీపనకారిగ నుండును.

లోహం జంతువికార పాండు పవన క్షీణత్వ పిత్తామయ
స్థౌల్యార్శో గ్రహణీ వికారకఫజి చ్ఛోఫ ప్రమేహ ప్రణుత్,
గుల్మ ప్లీహ విషాపహం బలకరం *కుష్ఠాగ్నిమాంద్యాపహం
సౌఖ్యాలంబి రసాయనం మృతిహరం దృష్టేశ్చ కాంతిప్రదమ్.
(ఆయుర్వేదే)

తా. లోహభస్మము, జంతువికారము, పాండువు, వాతము, క్షీణత్వము, పిత్తరోగము, స్థౌల్యము, మూలరోగము, సంగ్రహణి, కఫము, వాపు, ప్రమేహము, గుల్మము, ప్లీహము, విషదోషము, కుష్ఠువు, అగ్నిమాంద్యము అనువానిని హరింపంజేయునదిగ, సౌఖ్యకారిగ, శ్రేష్ఠమైన రసాయనముగ, మృత్యువును బోకడచునదిగ, దృష్టిప్రదముగ నుండును.

ఆమవాతహరణేషు శోభనం పాండుమేహగదనాశనేగజః,
దుష్టకుష్ఠపలితాస్రవాతజిత్స్వజ్జరామృతివలీవినాశనమ్. 349
కామలాకబలితక్షతక్షయం పాండుపాండురసుదేహమేహహా,
రూపసంపదముపైతి మానవో లోహమన్వహమహో లిహన్భిషక్.
(సిద్ధరసార్ణవే)

తా. లోహభస్మము ఆమవాతము, పాండువు, మేహము, కుష్ఠువు, వలీపలితములు, రక్తవాతము, ముదిమి, మరణము, వళులు, కామిల, క్షతక్షయము, పాండురోగము, శరీరపాండువర్ణము, మేహము-వీనిని నశింపంజేయుటయేగాక ప్రతిదినము దానిసేవంజేయువానికి రూపాతిశయమును గలుగంజేయును.

### అశుద్ధలోహదోషము

షండత్వకుష్ఠామయమృత్యుదంభవేద్ధృద్రోగశూలాశ్మరుతేశ్మరీంచ,
నానారుజానాంచతథాప్రకోపం కరోతిహృల్లాసమశుద్ధలోహమ్.
జీవహారిమదకారిచాయసం దేహహానిమథతాపకృద్ధ్రువం,
పాటవంతననుతేశరీరకే దారుణాంహృదిరుజాంచయచ్ఛతి. 352

తా. అశుద్ధలోహము నపుంసకత్వము, కుష్ఠువు, మృత్యువు, హృద్రోగము, శూల, అశ్మరి, పలువిధములైన రోగములు, తత్ప్రకోపము, హృల్లాసము (ఓకరింతలు),

* కాంతాజనానందకమ్—స్త్రీలకానందకారిగ.

ఆయుఃక్షయము, మదము, దేహహాని, తాపము, అశక్తత, హృదయమున దారుణమైన పీడ-వీనిని గలుగంజేయును.

### కిట్టనామములు

తీక్ష్ణం శస్త్రాయసం శస్త్రం పిండిం పిండాయసం శివం,
లోహకిట్టం తు కిట్టం స్యాల్లోహచూర్ణ మయోమలమ్. 353
(నిఘంటౌ)

తా. తీక్ష్ణము, శస్త్రాయసము, శస్త్రము, పిండము, పిండాయసము, శివము, లోహకిట్టము, కిట్టము, లోహచూర్ణము, అయోమలము అనునవి చిట్టెమునామములు.

### కిట్టశుద్ధి

అక్షాంగారైర్ధమేత్కిట్టం లోహజం తద్గవాంజలైః,
సేచయే త్తప్తతప్తం తత్సప్తవారం పునఃపునః. 354
మండూరోఽయం సమాఖ్యాత శ్శుద్ధం తీక్ష్ణం నియోజయేత్,

తా. చిట్టెమును కొలిమిలో నునిచి దానిబొగ్గుల నిప్పుతో నూది యెఱ్ఱగ కాల్చి తాటితొట్టిలో గోమూత్రముబోసి యందు నేడుమార్లు చల్లార్చిన చిట్టి శుద్ధి యగును. చిట్టకుండుదానిని మఱల కొలిమిలో నూది గోమూత్రములో నద్దిన చిట్టి శుద్ధం బగును. దీనినే మండూర మనియెదరు. ఈమండూరము నౌషధములయం దుపయోగింపఁ బడును.

### కిట్టమండూరము

గోమూత్రై స్త్రిఫలాక్వాథై స్తచోష్ఛధ్యం పాచయే చ్ఛనైః 355
లోహకిట్టే సుతప్తేతు యావత్తజ్జీర్యతి స్వయం,
తజ్జీర్ణం గ్రావభిః పేష్యం మండూరం తం ప్రయోజయేత్. 356

తా. పైప్రకారము శుద్ధిజేయఁబడిన చిట్టెమును గోమూత్రములోను, త్రిఫల కషాయములోను వైచి యాకషాయము శోషించువఱకు మెల్లమెల్లగ వండి దానిం దీసి కొని రోటిలోపోసి గోమూత్రముతో నేబదిమార్లు రుబ్బి ఏబదిపుటంబులును, త్రిఫల కషాయముతో నేబదిమార్లు రుబ్బి యేబదిపుటంబులును వేసిన మండూరము సిద్ధంబగును.

### మండూరగుణము

కిట్టం కటూష్ణం క్రిమినుత్పురాణాం పాండుశోభజిత్,
క్షయాదిసర్వరోగఘ్నం సంస్కారా త్సర్వరోగజిత్. 357

తా. బాగుగ శుద్ధిజేయఁబడిన చిట్టెము కారముగ, ఉష్ణముగ నుండుటయే గాక క్రిములు, పురాణజ్వరములు, పాండుశోఫలు, క్షయము, మొదలగు సర్వరోగ ముల హరింపంజేయును.

మండూరగుణము

యేగుణా మారితే ముండే తేగుణా ముండకిట్టకే,
తస్మాత్సర్వత్ర మండూరం రోగశాంతౌ నియోజయేత్. 358

తా. మండూరము లోహభస్మ సమానగుణము గలదియగుటంజేసి సర్వరోగముల యందు దానినే ప్రయోగింపంజనును.

లోహవిశేషగుణము

కిట్టా ద్దశగుణం ముండం ముండా త్తీక్ష్ణం శతోన్మితం,
తీక్ష్ణా ల్లక్షగుణం కాంతం భక్షణా త్కురుతే బలమ్. 359
తస్మాత్కాంతంసదాసేవ్యం జరామృత్యుహరంపరం, (ఆయుర్వేదే)

తా. మండూరముకంటె ముండలోహము పదింతలు గుణాధిక్యంబుగ, ముండ లోహమునకన్న ఉక్కు నూరింతలు గుణాధిక్యంబుగ, ఉక్కుకన్న కాంతము లక్షగు ణాధిక్యంబుగ, బలాధిక్యమును గలుగంజేయునదిగ నుండును. కావున కాంతము నెల్లపుడు సేవింపుచుండిన ముదిమి, మృత్యువు హరించును. (ఉక్కువలెనే ఇనుపశుద్ధిని, తద్భస్మాదు లను జేయందగును.)

ఇనుముపేళ్లు

ముండం ముండాయసం లోహ మయస్సారం శిలోద్భవత్. 360
ఆయసం కృష్ణలోహం చ హాయం కృష్ణాయసం తథా, (నిఘంటౌ)

తా. ముండము, ముండాయసము, లోహము, అయస్సారము, శిలోద్భవము, ఆయసము, కృష్ణలోహము, హాయము, కృష్ణాయసము అనునవి ఇనుముపేళ్లు.

ఇనుపభస్మగుణము

చక్షుష్యం కృష్ణలోహం తు కషాయం లేఖనం లఘు. 361
తీక్ష్ణోష్ణతి క్తకటుకం కుష్ఠరోగనివారణం,

తా. కృష్ణలోహము నేత్రహితకారిగ, కషాయముగ, లేఖనకారిగ, లఘువుగ తీక్ష్ణముగ, ఉష్ణముగ, వగరుగ, కారముగ, కుష్ఠురోగమును బోకడచునదిగ నుండును.

ముడీరకం హితకరం కఫవాత శూల
మూల ప్రమేహగద కామల పాండుహారీ,
గుల్మామ వాత జఠరా ర్తిహరం ప్రదీప్తం
శోథావహం హృదిగదం ఖలు కోష్ఠశుద్ధిమ్. (సిత్యనాథీయే) 362

తా. ఇనుపభస్మము హితకరముగ, కఫవాత, శూల, మూల, ప్రమేహ, కామిల, పాండు, గుల్మ, ఆమవాతముల హరింపంజేయునదిగ, జఠరపీడలు బోకడచునదిగ, దీపన కారిగ, శోఫ, ఆొమ్మునొప్పి-వీనిని నశింపంజేయునదిగ, కోష్ఠశుద్ధికారిగ నుండును.

## భస్మసిందూరపరీక్ష

న ధూమో నాపి వైవర్ణ్యం గంధం చాప్యగ్నిసంయుతం,
గురుర్లఘుతరం తోయే సిందూరభస్మలక్షణమ్. 363

తా. నిప్పుపైవేసిన పొగ వెడలకుండుట, వేఱువర్ణమును జెందకుండుట, వాసన లేకుండుట, శబ్దము జేయకుండుట, జడముగనుండుట, ఉదకముపైవైచిన చులకనగ తేలుట-ఇట్టిలక్షణములుగల సిందూరభస్మమును పరిశుద్ధం బని తెలియవలయును.

## తీక్ష్ణద్రుతి

సురదాలిభవం భస్మ నరమూత్రేణ గాలితం,
త్రిస్సప్తవారం తత్క్షార వాపాత్తీక్ష్ణద్రుతిర్భవేత్. 364

తా. దేవదాళిబూడిదె నిరువది యొకమారు నరమూత్రమున వడియగట్టి క్షార ముగవండి తీక్ష్ణలోహమును కాచి దానిపై నాక్షారమును వేయుచుండిన తీక్ష్ణము ద్రవించి ద్రుతివలె నగును.

## లోహాష్టకద్రుతి

గంధకం కాంత పాషాణం చూర్ణయిత్వా సమం సమం,
ద్రుతేచైవ ప్రతీవాపో దేయో లోహాష్టకం ద్రవేత్. 365

తా. గంధకము, కాంతము, పాషాణము-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అష్టలోహభస్మముల కొలిమిలో నూది యాచూర్ణమును కొంచె కొంచెముగ వేయుచుం డిన అష్టలోహములయందు ద్రుతి జనించును.

## లోహద్రుతి

దేవదాల్యారసైర్భావ్యం గంధకం దినసప్తకం,
తేన ప్రవాపమాత్రేణ లోహా స్తిష్ఠంతి సూతవత్. 366

తా. దేవదాళిరసముతో గంధకము నేడుదినములు భావనజేసి లోహభస్మమును కొలిమిలో నూది దానిపై నాగంధకమును కొంచెకొంచెముగ వేయుచుండిన లోహము పాదరసమువలె ద్రవించును.

## మృతలోహామృతీకరణము

తోయై రష్టగుణైః క్వాథ్యం త్రిఫలా పలపంచకం,
ఘృతం క్వాథస్య తుల్యంస్యా ద్ఘృతతుల్యం మృతాయసమ్.
పాచయే త్తామ్రపాత్రే తు లోహదర్వ్యా విచాలయన్,
మృద్వగ్నినా పచే త్తావ ద్యావదాజ్యం జీర్యతి తద్ద్రవః. 368
లోహతుల్యా శిలా యోజ్యా సుపక్వ మవతారయేత్,

యోగవాహ మిదంఖ్యాతం మృతలోహం మహామృతమ్. 369
ఏవంకాంతస్య తీక్ష్ణస్య ముండస్యాపి విధిక్రమః,

తా. ఐదుపలముల త్రిఫలములు దంచి యం దెనిమిదింతలు నీళ్లుపోసి యెనిమిదవ భాగముగ కషాయము గాచి దానికి సమముగ ఘృతము, ఘృతమునకు సమముగ ఇనుప భస్మము గలిపి తామ్రపాత్రలోబోసి ద్రవము శోషించువఱకు ఇనుపగరిటెతో కలియ బెట్టుచు మృద్వగ్నిలో పాకముజేసి లోహమునకు సమముగ మణిశిలచూర్ణమును గలిపి పక్వముజేసి దించికొనవలయును. ఇది యోగవాహ మనంబడును. ఇటుల నమృతీకరణము చేయఁబడిన లోహభస్మము మహామృతతుల్యంబును. ఇత్తెఱంగుననే కాంతభస్మము, తీక్ష్ణ భస్మము, ఇనుపభస్మము మొదలగు సర్వభస్మములకు నమృతీకరణము జేయందగును.

## సర్వలోహగుణములు

హైమం వ్యోషయుతం త్రిదోషశమనం రౌప్యేన పిత్తామయం
తామ్రేణాపి కఫామయాంశ్చ వివిధాన్ శూలాన్ జయేల్లోహతః,
నాగేనాపి జయేచ్చ వంగసహితం మేహాంశ్చ వజ్రామృతం
హేమగ్రాస నివృత్తచంచలగుణ శ్శుద్ధో నివృత్తో రసః. (ఆయుర్వేదే)

తా. సువర్ణభస్మమును త్రికటుకములతోడజేర్చి సేవించిన త్రిదోషమును, రజత భస్మముతోజేర్చి సేవించిన పిత్తరోగములును, తామ్రభస్మములో జేర్చి సేవించిన శ్లేష్మరోగములును, లోహనాగభస్మములతో జేర్చి సేవించిన పలువిధములైన శూలలును, వంగభస్మము, వజ్రభస్మము వీనితోడజేర్చి సేవించిన మేహరోగములును హరించును. శుద్ధిచేయఁబడిన రసము బంగారునుగ్రహించిన నందలిచాంచల్యగుణము నివర్తించిన దని తెలియవలయును.

## సీసముపేళ్ళు

సీసం కంతుజడం రంగం సీసకం నాగసంజ్ఞకం,
యోగేష్టం నాగ మురగ స్తీరకం పరిపిష్టకమ్. (నిఘంటౌ) 371

తా. సీసము, కంతుజడము, రంగము, సీసకము, నాగసంజ్ఞ, యోగేష్టము, నాగము, ఉరగము, తీరకము, పరిపిష్టకము-ఇవి సీసముపేళ్లు.

## అశుద్ధనాగవంగదోషము

పాకహీనౌ నాగవంగౌ కుష్ఠ గుల్మ రుజాకరౌ,
మేహ పాండూదరం *వాత కఫ మృత్యుకరౌ కిల. (నిత్యనాథీయే)

తా. అశుద్ధనాగవంగములవలన కుష్ఠువు, గుల్మము, పీడ, మేహము, పాండువు ఉదరము, వాతరోగము, శ్లేష్మరోగము, మరణము గలుగును. కావున నాగవంగములు శుద్ధముగ జేయవలయును.

---

* వాతకఫపిత్తకరౌకిల.

### నాగశుద్ధి

నిర్గుండీ మూలచూర్ణేన సార్కదుగ్ధేన లేపయేత్,
నాగపత్రంతు తచ్ఛుష్కం ద్రావయిత్వా నిషేచయేత్, 373
నిర్గుండీద్రవమధ్యే తు తతః పత్రం తు కారయేత్,
లిప్త్వా ద్రావ్యం పునస్సేచ్యం సప్తవారం విశుధ్యతి. 374

తా. సీసపురేకులపై వావిలిచూర్ణమును జిల్లేడుపాలతో భాగుగనూరిలేపనముజేసి యెండించి పిదప దానిని కరిగించి వావిలియాకురసములో బోయవలయును. ఇటుల నేడుమార్లు సీసపు రేకులకు లేపనము మొదలగు వానినిచేసిన సీసను శుద్ధియగును.

### నాగవంగశుద్ధి

తిలతైలే చ గోమూత్రే హ్యారనాళామ్లతక్రకే,
కులుత్థకే రవిక్షీరే ఛాగక్షీరే ముహుర్ముహుః. 375
దాలితౌ నాగవంగౌ ద్వౌ తేనద్వాలేన శుధ్యతి, (చింతామణౌ)

తా. నాగవంగముల కరిగించి నూనె, ఆవుపంచితము, కలి, చల్ల, ఉలవకట్టు, జిల్లేడుపాలు, మేకపాలు అనువానిలో ప్రతిదానియందు నేడేసిమార్లు పోసిన నాగవంగములు శుద్ధియగును.

### నాగభస్మవిధి

తతో నాగం లోష్టమధ్యే వాసాద్రావాజమోదకే. 376
తాపయే ద్వాసకాకాష్ఠై ర్భస్మీభవతి తత్క్షణాత్,

తా. శుద్ధిచేయఁబడినసీసమును పెంకులో పోసి అడ్డసరపాకురసమును, అజామోదరసమును పోయుచు అడ్డసరపుకట్టెతో వేయింపుచుండిన సీసము భస్మంబగును. (లేక శుద్ధిచేయఁబడిన సీసపురేకులకు కలుఁబందరసము నేడుమార్లు పూసి యెండించి మూకుటిలో నునిచి కలుఁబందపలుకులు వేయును నడ్డసరపుకట్టెతో వేయింపుచుండిన సీసము భస్మంబగును.)

### నాగసిందూరము

తద్భస్మవాసకరసే హ్యజామోదాద్రవేణ చ. 377
ముండీరసే తథా మర్ద్యం పచేద్దశపుటే తథా,
ఫణివల్లిరసైర్మర్ద్యం పునర్దశపుటే పచేత్. 378
రుద్ధ్వా గజపుటే పాచ్యం సింధూరం భవతి ధ్రువం,

తా. నాగభస్మమును అడ్డసరము, ఓమము, బోడతరపాకు అనువానిరసముతో

పన్నెండు దినములవఱకు అనుసరింపుచుండి పిదప జ్వరనివృత్తినైనను, లేక మరణము నైనను గలుగజేయును.

ద్విగుణా సప్తమీయాంతు నవమ్యేకాదశీ తథా,
ఏషా త్రిదోషమర్యాదా మోక్షాయచ వధాయచ. 238

## సంతతజ్వరకాలప్రమాణము

తా. వాతపిత్తశ్లేష్మములచే జనించినసంతతజ్వరములకు యథాక్రమముగా ౭, ౧౪, ౨౧, ౨౨, దినములు కాలప్రమాణ మనియు, దానికి పిదప జ్వరనివృత్తిగాని లేక మరణముగాని కలుగు ననియు హారీతునిమతము.

## దోషక్షయవృద్ధులచే విషమజ్వరోత్పత్తికారణము

కృశానాం వ్యాధిముక్తానాం మిథ్యాహారాదిసేవినాం,
అల్పోపిదోషో దూష్యాదీన్ లబ్ధ్వాన్యతమతోఫలమ్. 239
సవిపక్షో జ్వరం కుర్యా ద్విషమం క్షయవృద్ధిభాక్.

తా. జ్వరాదివ్యాధులు నివర్తించి కృశించియుండువారలకు మిథ్యాహారాదిసేవనముచలన దోషము స్వల్పమై యుండినను, దూష్యములను జెంది వానినుండి విశేషబలమును పొంది క్షయవృద్ధులనుజెందుచు విషమజ్వరమును గలుగజేయును. దీనియందు సన్నిపాతజ్వరములకు జెప్పియుండు దుర్గుణములు కలిగియుండును.

దోషఃప్రవర్తతే తేషాం స్వేకాలే జ్వరయన్ బలీ. 240
నివర్తతే పునశ్చైషః ప్రత్యనీకబలాబలః,
క్షీణేదోషే జ్వరస్సూక్ష్మః రసాదిష్వే బలీయతే. 241
లీనత్వా త్కార్శ్యవైవర్ణ్యజాడ్యాదీన్ విదధాతి సః,

తా. పైఁజెప్పినవారికి దోషములు తమతమ కాలములయందు బలమును జెంది విశేషముగా జ్వరమును గలుగజేయును. మరల నాదోషము విరుద్ధమైన యాహారాదులచే దుర్బలమై నివర్తించును. దోషము క్షయించుచుండగా జ్వరము సూక్ష్మరూపముగా రసాదిధాతువులయందు లయమును జెందుచుండును. మఱియు నాజ్వరము రసశేషమునందు లయించియుండుటవలన శరీరకృశత్వము, వైవర్ణ్యము, జాడ్యము యీ మొదలగువానిని కలుగజేయును.

## సంతతాదిజ్వరనిదానము

ఆపన్నవివృతాస్యత్వా త్స్రోతసాం రసవాహినామ్. 242
ఆశు సర్వస్య వపుషో వ్యాప్తిర్దోషేణ జాయతే,

పదిమార్లు మర్దించి ప్రమిదెలలో నునిచి చీలమన్ను లేపనము జేసి పదిగజపుటంబులును తమలపాకురసముతో పదిమార్లు మర్దించి పదిగజపుటంబులును వేసిన నాగభస్మము సిందూరించును.

నాగసిందూరవిధి

చించాత్వగ్భస్మపాదాంశం ద్రుతేనాగే వినిక్షిపేత్. 379
పాదయే ల్లోహపాత్రేణ సిందూరం జాయతే శుభం,
భస్మనా పూర్వవన్నాగం శాకస్య వారిజస్య చ. 380
సిందూరం జాయతే దివ్యం యథేష్టం నాత్రసంశయః,
రక్తశాకిన్యపామార్గ కుటజస్య తు భస్మకం, 381
చతుర్థాంశం ద్రుతేనాగే లోహదర్వ్యా నిఘర్షయేత్,
చండాగ్నినా దినైకం తు దత్వా మర్ద్యం దినత్రయమ్. 382
పూర్వవల్లోహపాత్రే తు సిందూరం జాయతే శుభం,
(ఆయుర్వేదే)

తా. నాగమును కరిగించి దానికి నాలవభాగము చింతబెరడు చూర్ణమును గలిపి లోహపాత్రలో వేయించిన సిందూరించును. మఱియు పూర్వమువలెనే నాగభస్మమును బాడిదెపాకు క్షారములో వేయించిన నిస్సంశయముగ సిందూరించును. నాగమును కరిగించి దానికి నాలవభాగము * రక్తశాకి, ఉత్తరేణు, కొడిసె అనువానిబూడిదెలను గలిపి యినుపపాత్రలోబోసి యొకదినము గాఢాగ్నియందునిచి ఇనుపగరిటెతో రుద్దుచుండిన భస్మంబగును. దానిని పైబూడిదెలతోడనే మూడుదినములు రుద్దుచుండిన సిందూరించును.

సీసభస్మగుణము

శతనాగబలం ధత్తే మృతనాగో రుజాపహః. 383
ఆయుఃకాంతిం వీర్యవృద్ధిం కురుతే సేవయేత్సదా,

తా. నాగభస్మము నూరుయేనుగుల బలమును గలుగంజేసి సర్వరోగముల హరింపంజేయుటయే గాక ఆయుర్వృద్ధిని, కాంతిని, వీర్యవృద్ధిని గలుగంజేయును. కావున దానినెల్లపుడు సేవింపుచుండవలయును.

సీసం పుష్టికరం వాతపిత్తశ్లేష్మరుజాపనుత్. 384

తా. సీసము పుష్టిని గలుగంజేయునదిగ, వాత, పిత్త, శ్లేష్మరోగముల హరింపంజేయునదిగ నుండును.

---

* ఎఱ్ఱనిటేకు.

## వంగశుద్ధి

కార్పాసార్కకరంజధూర్తమునిజై ర్భల్లాతగుంజాగ్నికై
స్స్నుగ్వ్యాఘ్రీహయగంధసూరణఫలై ర్మూలైశ్చ పత్రైః ఫలైః,
తక్రాక్తం బహుశస్తు ఖర్పరగతం వంగం నిషించేన్మహుః
యావత్పంచదినం చ శుద్ధ్యతి భిషగ్యోగే సదా యోజయేత్.

(సిద్ధవిద్యాభూః)

తా. ప్రత్తియాకు, జిల్లేడు, క్రానుగ, ఉమ్మెత్త, అగిసె, జీడి, గురిజ, చిత్రమూలము, బొంతజెముడు, నల్లేరు, పెన్నేరు, కంద అనువానివేళ్ళను, ఆకులను, కాయలను, మజ్జిగతో ద్రొక్కి రసముదీసి చల్లగలిపి, వడియగట్టి తగరమును కరిగించి దానిలో పలుమారు బోయుచుండవలయును. ఇటుల నైదుదినములు చేసిన తగరము శుద్ధియగును. ఈప్రకారము శుద్ధిచేయఁబడిన తగరము నౌషధములయందు గ్రహింపంజనును.

(పైప్రకారము శుద్ధిచేయఁబడిన తగరపురేకులపై కఫరిని నూరి లేపనము జేసి యెండించి అగ్నిలో కాచిన తగరము భస్మంబగును. లేక తగరమును పెంకులో పోసి కరిగించి అందామ్లశిల గంధకమును, తాళకమును, సురాకారమును, సమభాగములుగ చూర్ణము చేసి కొంచెకొంచెముగ వేయుచు వేపకట్టెతో వేయింపుచుండిన తగరము భస్మంబగును.

అపామార్గస్య చ క్షారై ర్లోష్టే వంగం ప్రదాపయేత్,
భస్మీభవతి తద్భస్మ జంబుసీరేణ మర్దయేత్. 386
పుటత్రయం చ దాతవ్యం సిందూరం భవతి ధ్రువం,

(చింతామణౌ)

తా. శుద్ధిచేయఁబడిన తగరమును పెంకులో బోసి కరిగించి యందుత్తరేణు చూర్ణమునువైచి వేయింపుచుండిన తగరము భస్మంబగును. దానిని నిమ్మపండ్లరసముతో నూరి మూడుగజపుటంబు లిడిన సిందూరించును.

(శుద్ధతగరపురేకులపై కఫరిని నూరి లేపనముచేసి అగ్నిలో కాచిన తగరము భస్మంబగును.)

## వంగభస్మగుణము

సతిక్తలవణం వంగం పాండుఘ్నం క్రిమి * వాతనుత్. 387
లేఖనం పిత్తలం కించి త్సర్వమేహవ్రణాపహం,

తా. వంగభస్మము చేదుగ, ఉప్పుగ నుండుటయేగాక పాండు, క్రిమి, వాత, ముల హరింపంజేయునదిగ, లేఖనకారిగ, ఒకింతపిత్తకారిగ, సర్వమేహవ్రణముల బోకడచునదిగ నుండును.

---

* మేహజిత్,

వంగం తిక్తోష్ణ రూక్షంచాప్యేతద్వాతప్రకోపనమ్. 388
మేహశ్లేష్మ క్షయఘ్నం చ మేహక్రిమికులాంతకం, (మతాంతరే)

తా. వంగభస్మము తీక్ష్ణముగ, ఉష్ణముగ, రూక్షముగ, వాతప్రకోపకారిగ, మేహ, శ్లేష్మ, క్షయ, మేహక్రిముల బోకడచునదిగ నుండును.

లోహాష్టకభస్మవిధి

వంగం పలాశద్రవ తాళకేన నాగం పయస్యార్కమనశ్శిలేన. 389
శుల్బంహ్యజాక్షీరకగంధకేన తీక్ష్ణంచ నాగం పయహింగుళేన,
తారంచవజ్రీపయమాక్షికేణ హేమం శిలావర్తక నాగభస్మనా. 390

తా. వంగము మోదుగరసము, తాళకము అనువానివలనను, నాగము జిల్లేడు పాలు, మణిశిల అనువానివలనను, తామ్రము మేకపాలు, గంధకము అనువానివలనను, ఉక్కు, నాగము అను నీరెండును జిల్లేడుపాలు, ఇంగిలీకము అనువానివలనను, రజతము బొంతజెముడుపాలు, మాక్షికము అనువానివలనను, సువర్ణము, మణిశిల, నాగభస్మము అనువానివలనను భస్మంబగును.

తాళేనవంగం దరదేనతీక్ష్ణం నాగేనహేమం శిలయాచనాగం,
శుల్బంతథాగంధవరేణనిత్యంతారంచమాక్షీకవరేణహన్యాత్.

తా. తాళకముచే వంగంబును, ఇంగిలీకముచే లోహంబును, సీసముచే సువర్ణంబును, మణిశిలచే సీసంబును, గంధకముచే తామ్రంబును, మాక్షికముచే రౌప్యంబును మృతిచెందును.

హేమాదిభస్మపరీక్షగుణము

హైమం కపోతకంఠాభ మభ్రకం గతచంద్రకం,
వాంతిభ్రాంతిహరం తామ్రం లోహం వారితరం శుభమ్. 392

తా. సువర్ణభస్మమును పావురపిట్టకంఠవర్ణముతో సమానముగ, అభ్రకభస్మము తళుకులులేనిదిగ, తామ్రభస్మము వాంతి, భ్రాంతి వర్జితముగ, లోహభస్మము నీళ్ళపై తేలునదిగనుండిన పరిశుద్ధంబులని తెలియవలయును.

హేమభస్మాదిశేషాణి ఉత్థానరహితాని చ,
నాన్యఽతోఽసౌ గుణం కుర్యాద్భవేయుర్వ్యాధిహేతవః. 393

తా. హేమాదిభస్మములు, ఇతరమైనభస్మములు మరల జనింపకుండిన సుగుణమును, ఆయుర్వృద్ధిని గలుగంజేయును. జనించిన రోగహేతువగును.

సప్తధాతుభస్మపరీక్ష

సర్వమేవం మృతం లోహం ధ్మాతవ్యం మిత్రపంచకైః,

ఇత్యేవం స్యా న్నిరుత్థానం సేవ్యవారితరం భవేత్. 394

తా. సర్వలోహభస్మములలో మిత్రపంచకము వేచ్చి యూఁపెన మరల జనింపక నుదకముపై వైచిన తేలుచునుండిన పరిశుద్ధంబులని యెఱింగి వానిని సేవింపవలయును.

మిత్రపంచకము

గుడ గుగ్గులు గుంజాజ్య సారమై ష్టంకణం సమం,
జీవనం మృతధాతూనాం వైద్యశాస్త్రే ప్రకీర్తితమ్. 395

తా. బెల్లము, గుగ్గిలము, గురిగింజ, నెయ్యి, తేనె, మఱియు వెలిగారము-వీని తోడి మృతలోహములచేర్చి కొలిమిలో నూదిన నవి మరల జనించునని వైద్యశాస్త్రమునందు జెప్పంబడియున్నయది.

మధు గుడ ఘృత గుంజా టంకణం పంచమిత్రకం, (మతాంతరే)

తా. తేనె, బెల్లము, నేయి, గురిగింజ, వెలిగారము అనునవి మిత్రపంచకములు.

నిరుత్థాపనము

గంధకంచోత్థితం భస్మ తుల్యం ఖల్వే విమర్దయేత్. 396
దినైకం కన్యకాద్రావై రుధ్వా గజపుటే పచేత్,
ఇత్యేవం సర్వలోహానాం కర్తవ్యం తు నిరుత్థితమ్. 397

తా. జనించినభస్మమును, గంధకమును, సగభాగములుగ గ్రహించి కలబంద రసముతో నొకదినము మర్దించి మూకుళ్ళలో నునిచి చీలమన్ను లేపనము చేసి గజపుటం బిడుటచే సర్వలోహములను మరల జనింపకుండునటులం జేయవలయును.

సూతాదిభస్మగుణము

సూతాద్గుణానంతకకోటివజ్రే హ్యాభ్రే సహస్రం కనకేశతైకం,
కాలేగుణాశీతితదర్ధకాంతే రౌప్యేచతుష్షష్టిజదేతదర్ధమ్. 398

తా. రసమునకన్న వజ్రమునందు అనంతకోటి గుణములును, అభ్రకమునందు వెయ్యిగుణంబులును, సువర్ణమునందు నూఱుగుణంబులును, లోహమునం దెనుబదిగుణం బులును, కాంతమునందు నలుపదిగుణంబులును, రజతమునం దరువదినాలుగు గుణంబులును, సీసమునందు ముప్పదిరెండుగుణంబులును గలిగియుండును.

అభ్రకభేదములు

పినాకం దర్దురం నాగం వజ్రంచేతి చతుర్విధం,
పినాకాద్యాస్త్రయో వర్జ్యా వజ్రం యత్నా త్సమాహరేత్. 399

తా. పినాకము, దర్దురము, నాగము, వజ్రము అని అభ్రకము నాలుగు విధంబులు. అందు పినాకము మొదలు మూడు అభ్రకంబులు వర్జ్యంబులు. వజ్రాభ్రకము శ్రేష్ఠంబగుటచే దానిని గ్రహింపవలయును.

వజ్రాభ్రకపరీక్ష

వజ్రాభ్రకం తు వహ్నిస్థం నకించి ద్వికృతిం వ్రజేత్,
తస్మాద్వజ్రాభ్రకం యోజ్యం వ్యాధి వృద్ధత్వ మృత్యుజిత్. 400

తా. అభ్రకమును నిప్పులోనునిచి యూదిన కొంచెమైనను వికారము జెందకుండిన దానిని వజ్రాభ్రకమని తెలియవలయును. ఇది రోగము, ముదిమి, మృత్యువు వీనిని హరింపంజేయును కావున దానినే గ్రహింపవలయును.

అభ్రకశుద్ధి

ధమేద్వజ్రాభ్రకం వహ్నౌ తతః క్షీరే నిషేచయేత్,
భిన్నపత్రం తు తత్కృత్వా మేఘనాదామ్లజద్రవైః. 401
భావయే దష్టయామం తదేవం శుధ్యతి చాభ్రకం,

తా. వజ్రాభ్రకమును మూకుటిలో బోసి కొలిమిలో నెట్టిగ నగువఱకు నూది పాలతో జల్లార్చి రేకులుగ నొలిచి చిఱ్ఱియాకు, తిప్పాకు, చింతాకు అనువానిరసములలో నెనిమిదిఝాములు భావనచేసిన వజ్రాభ్రకము శుద్ధియగును.

ధాన్యాభ్రకవిధి

అథవాభ్రస్య భాగౌ ద్వౌ ముస్తాశ్చైకం జలైస్సహ. 402
త్రిదినం స్థాపయేత్పాత్రే సూక్ష్మం కృత్వా ప్రవేశయేత్,
బధ్వా ధాన్యయుతం వస్త్రే మర్దయేత్కాంజికైస్సహ. 403
అధో యద్గలితం సూక్ష్మం శుద్ధం ధాన్యాభ్రకం భవేత్,

తా. అభ్రకము రెండుభాగములు, తుంగముస్తె లొకభాగము-ఇటుల వీనినేకముజేసి యొకభాండములో వైచి యందుదకముపోసి మూడుదినములు నానబెట్టి మెత్తగరుబ్బి క్రొత్తబట్టలో కొంచెకొంచెముగ నునిచి చారెడేసివడ్లు వేయుచు కలిసిబోయుచు దానికి క్రింద నొకకుండ నునిచి గంజియన్నమును రుద్దునటుల రుద్దిన అభ్రకము కరిగి మురికివలె క్రిందికుండలో దిగును. బట్టలో వడ్లుమాత్రము నిలుచును. బానలో దిగిన దానిని తేరనిచ్చిన పైన నల్లగ తేలును. ఆనల్లనీళ్ళను వడిపి కుండలోనుండు శుద్ధమైన ధాన్యాభ్రకమును విభూతివలె వడియగట్టిగాని, కలి యిగురునటుల కాచిగాని గ్రహించవలయును.

అథాన్యత్సంప్రవక్ష్యామి సంక్షిప్తం సూక్తముత్తమమ్. 404
ఆయుర్వేదోపదేశేఽస్మిన్ వ్యోమభస్మ నిగద్యతే,

తా. ఇక నాయుర్వేదమున జెప్పంబడిన ప్రకారము అభ్రకభస్మమును వచించెదను.

అభ్రకభస్మము

కృత్వా ధాన్యాభ్రకం తత్తు శోషయిత్వా విమర్దయేత్. 405
అర్కక్షీరై ర్దినం ఖల్వే చక్రాకారం తు కారయేత్,
వేష్టయే దర్కపత్రైశ్చ సమ్య గ్గజపుటే పచేత్. 406
పునర్మర్ద్యం పునఃపాచ్యం సప్తవారం ప్రయత్నతః,
తతో వటజటాక్వాథై స్తద్వ ద్దేయం పుటత్రయమ్. 407
మ్రియతే నాత్ర సందేహ స్సర్వయోగేషు యోజయేత్,
మృతం త్వభ్రం హరే న్మృత్యుం జరాపలితనాశనమ్. 408
అనుపానైశ్చ సంయుక్తం తత్తద్రోగహరంపరం, (ఆయుర్వేదే)

తా. ఇటుల ధాన్యాభ్రకమును జేసినపిదప దానిందీసి యెండించి ఖల్వములో బోసి జిల్లేడుపాలతో నొకదినము మర్దించి సన్నపువడియములు చేసి యెండించి మూకుటి కడుగున జిల్లేడాకులపఱచి యం దభ్రకవడియముల నునిచి దానిపై జిల్లేడాకులను వరుసగపఱచి దానిపై మఱియొక మూకుడునుమూసి చీలమన్ను లేపనముచేసి గజపుటంబిడి సాంగశీతలమునదీసి మరల పైరసములచేతనే రుబ్బి వడియములుచేసి యెండించి మునుపటివలెనే యాకులబఱచి పైప్రకారమే ఏడుగజపుటంబులిడి సాంగశీతలమున దీసి మఱ్ఱియూడలకషాయముతో మరల మర్దించి వడియమునుజేసి మునుపటివలెనే యాకులబఱచి దానిపై మూకుడునుమూసి ఏడుగజపుటంబులిడిన ధాన్యాభ్రకము భస్మంబగును. దీనిని సర్వయోగములయం దునిచికొనందగును. మఱియు నభ్రకభస్మము నాయారోగానుపాన విశేషములతో సేవించిన మృత్యువు, ముదిమి-వీనిని హరింపంజేయును.

అభ్రకసిందూరము

ఇత్థం కేచిన్మతం ప్రాహు ర్గగనస్య చ మారణమ్. 409
భేకరాజరసైశ్చైవాప్యహి శాకరస స్తథా,
అశ్వగంధా సనిర్గుండీ రుదంతి విజయాద్రవైః. 410
శతావర్యా రసైశ్చైవాప్యాటరూషర స స్తథా,
బలాచాతిబలాచైవ శాల్మలీ సత్వమేవ చ. 411
కూశ్మాండకరసైశ్చైవ ముస్తాయాసపఏవ చ,
విదారి వరకందం చ తులసీ మదనం తథా. 412
భల్లాతకరసైశ్చైవ ద్రాక్షాఫలరస స్తథా,
కటుంబరారసైశ్చైవా ప్యర్కక్షీరం తథైవ చ. 413
ఉశీరం వాలుకం కుష్ఠం తథాలోహితపుష్పకం,

చంపకః కాకమాచీ చ గోక్షురం శతపత్రికా. 414
దాడిమీ కపికచ్ఛూక ధాత్రీఫలరసస్తథా,
పునర్నవా తథా బ్రాహ్మీ చిత్రకస్య రసస్తథా. 415
ముండీరస శ్శిరీషస్య గుడూచ్యా స్స్వరసస్తథా,
అభ్రకస్య పుటే దేయం ప్రత్యేకైకరసేన చ. 416
హన్యాత్తే సర్వరోగాణి తమసం భాస్కరో యథా,

తా. అభ్రకమారణవిధిని మఱికొందఱు వచించుతెఱంగెట్లనిన—గుంటగలగర, బ్రహ్మదండివేరు, పెన్నేరుగడ్డ, వావిలాకు, దూలగొండి, గంజాయియాకు, పిల్లిపీచరవేళ్లు, అడ్డసరపాకు, చుత్తవపులగపువేళ్లు, పెద్దముత్తవపులగపువేళ్లు అనువానిరసములతోడను, బూరుగబంగకల్కముతోడను, గుమ్ముడుకాయనీళ్ళతోడను, తుంగముస్తెలు, నేలగుమ్ముడుగడ్డ, తులసియాకు, మ్రంగవేళ్ళు, జీడివేరు, ద్రాక్షపండు, కటుకరోహిణి (రుద్రజడ) అనువానిరసములతోడను, జిల్లేడుపాలు, వట్టివేరు, కురువేరు, చంగల్వకోష్టు' వసపువ్వు, సంపంగివేరు అనువానికషాయములతోడను, కామంచి, పల్లేరువేరు, తామరగడ్డ, దాడిమాకు, దూలగోవెలవేరు, ఉసిరికపండు, గలిజేరువేరు, మండూకబ్రహ్మి, చిత్రమూలము, బోడతరము, దిరిసెనపువేరు, తిప్పతీఁగ అనువానిరసములతోడను, ప్రత్యేక ప్రత్యేకముగ అభ్రకమును మర్దించి బిళ్ళజేసి యెండించి ప్రతిదానిచే నొక్కొక గజపుటముచొప్పున పుటంబులిడిన అభ్రకము సిందూరించును. అది "సూర్యుం డంధకారమును బోకడచుభంగి" సర్వరోగముల బోకడచును.

**శతపుటాభ్రకసిందూరము**

పునర్నవా మేఘనాదద్రవై ర్ధాన్యాభ్రకం దినమ్. 417
మర్ద్యం గజపుటే పాచ్యం చించాసూరణజైః పునః,
ద్రవైర్ముస్తా భవై ర్మర్ద్యం పృథగ్దేయం పుటత్రయమ్. 418
కాసమర్దరసైః పంచగోమూత్రై స్త్రిఫలైరపి,
న్యగ్రోధక్వాథకై ర్మర్ద్యం కుర్యా ద్దశపుటం పునః. 419
షట్చ జంబీరనీరేణ గోక్షీరేణ పుటత్రయం,
ఏవ మర్కదళై ర్వేష్ట్య దేయం రుద్ధ్వాచ సంపుటేత్. 420
శతధా పుటితం భస్మ జాయతే పద్మరాగవత్,
నిశ్చంద్రం జాయతే హ్యభ్రం యథాయోగేషు యోజయేత్. 421
(గ్రంథాంతరే)

తా. ధాన్యాభ్రకమును గలిజేరు, చిట్టి అనువానిరసములచే ప్రత్యేకముగ నొక్కొకదినము మర్దించి రెండుగజపుటంబు లిడవలయును. పిదప దానిని చింతాకు,

కందగడ్డ, తుంగముస్తెలు అనువానిరసములతో వెవ్వేఱుగ మర్దించి మూడుగజపుటంబులును, కసివెందాకురసముతో మర్దించి ఐదుగజపుటంబులును, గోమూత్రము, త్రిఫల కషాయము-వీనితో ప్రత్యేకప్రత్యేకముగ మర్దించి ఐదుపుటంబులును, మఱ్ఱియూడల కషాయముతో మర్దించి పదిపుటంబులును, నిమ్మపండ్లరసముతో మర్దించి ఆరుపుటంబులును, ఆవుపాలతో మర్దించి మూడుపుటంబులును వేయవలయును. ఇటుల పుటంబులిడిన పిదప అభ్రకమును బాగుగ మర్దించి వడియములుచేసి యెండించి జిల్లేడాకులలో నునిచి మూడుకులలోబెట్టి పైన మూకుడుమూసి చీలమన్ను లేపనము జేసి కెంపువలె నెఱ్ఱగనగువఱకు ౧౦౦ గజపుటంబు లిడవలయును. ఇటులంజేసిన అభ్రకము నిశ్చంద్రకముగ సిందూరించును. దానిని సర్వయోగములయందు బ్రయోగింపఁజనును.

ముస్తా క్వాథేన ధాన్యాభ్రం పంచవింశత్పుటే పచేత్.
గోమూత్రై స్త్రిఫలాక్వాథైః పక్త్వాచ పూర్వవత్పచేత్. 422
పంచవింశత్పుటైరేవం కాసమర్దద్రవైః పచేత్,
దేయం పుటత్రయం క్షీరై ర్మర్దయేచ్చ పుటేపుటే. 423
నిశ్చంద్రం జాయతే హ్యభ్రం జరా మృత్యు రుజాపహం,
(సిద్ధరసార్ణవే)

తా. ధాన్యాభ్రకమును తుంగముస్తెల కషాయముతో మర్దించి ఇరువదిరైదు పుటంబులును, గోమూత్రము, త్రిఫలకషాయము-వీనితో మర్దించి ప్రత్యేకముగ ఇరువదియైదుపుటంబులును, కసివెందాకురసముతో మర్దించి ఇరువదియైదుపుటంబులును, పాలతోమర్దించి పదిపుటంబులును వేసి పిదప లెస్సగ మర్దించి వడియములుజేసి యెండించి దానిని జిల్లేడాకులలోగట్టి మూకుళ్ళలో నునిచి గజపుటంబులిడిన నిశ్చంద్రకముగ అభ్రకము సిందూరించును. దానిని సేవించిన ముదిమి, మృత్యువు, సర్వరోగములు హరించును.

ధాన్యాభ్రకం ద్రవైర్మర్ద్యం మత్స్యాక్షీ తులసీద్రవైః.
మూలజైః కోకిలాక్షస్య కుమారీ శ్వేతమూర్వయోః, 424
వ్యాఘ్రీభిః పునర్నవాయాశ్చ దినమేతద్విమర్దయేత్. 425
కుంజరాఖ్యైః పుటైస్సప్త పిష్ట్వా పిష్ట్వా పచేత్పునః,
తద్వత్పంచామృతైః పాచ్యం పిష్ట్వా పిష్ట్వా తు సప్తధా. 426
ఏవం నిశ్చంద్రితాంయాతి సర్వరోగేషు యోజయేత్, (మతాంతరే)

తా. ధాన్యాభ్రకమును పొన్నగంటి, తులసి, గొలిమిడివేళ్ళు, కలబంద, తెల్లచాగ, ప్రాకుడు, గలిజేరు, అనువానిరసములచే ప్రత్యేకముగ నొక్కొకదినము మర్దించి వడియములుజేసి యెండించి మూకుళ్లలో నునిచి చీలమన్ను లేపనముజేసి యేడేసి గజపుటంబు లిడవలయును. పిదప దానిని పంచామృతములలో మర్దించి ఏడేసిపుటంబు లిడవల్ల

యును. ఇటులజేసిన నిశ్చంద్రకమువలె అభ్రకము భస్మంబగును. దానిని సర్వరోగముల యందు ప్రయోగించవలయును. (అభ్రకభస్మము సిందూరించినపిదప దాని నమృతీకరణము జేయవలయును. ఎట్లనిన.)

అభ్రామృతీకరణము

సర్వేషాం ఘాతితాభ్రాణా మమృతీకరణం శృణు. 427
త్రిఫలోత్థకషాయస్య పలాన్యాదాయ షోడశ,
గోఘృతస్య పలాన్యష్టౌ మృతాభ్రస్య తథాదశ. 428
ఏకీకృత్య లోహపాత్రే పాచయే న్మృదువహ్నినా,
ద్రవేజీర్ణే సమాదాయ సర్వయోగేషు యోజయేత్. 429

తా. అభ్రకభస్మమునకు అమృతీకరణము వచించెదను. పదియారుపలముల త్రిఫలకషాయమును, ఎనిమిదిపలముల ఆవునెయ్యిని, పదిపలముల అభ్రకభస్మము లోహపాత్రలోవైచి యేకముచేసి మృద్వగ్నియందు ద్రవమిగురువఱకు కాచి గ్రహింపవలయును. అట్టిదానిని సర్వరోగములయం దుపయోగింపందగును.

అమృతీకృతాభ్రకగుణము

అనుపానం వినాహ్యభ్రం జరా మృత్యు రుజాపహం,
యోజయే దనుపానైర్వా తత్తద్రోగహరం పరమ్. 430

తా. పైప్రకార నమృతీకరణము చేయఁబడిన అభ్రకమును అనుపానరహితముగ సేవించిన ముదిమి, మృత్యువు, సర్వరోగములు వీనిని హరింపజేయును. మఱియు అభ్రకసిందూరమును అనుపానవిశేషములతో సేవించిన సర్వరోగముల హరింపజేయును.

అభ్రకభస్మగుణము

మృతంచాభ్రం హరేద్రోగా న్జరా మృత్యు మనేకధా,
సేవితం దేహదార్ఢ్యం చ రూపం వీర్యం వివర్ధయేత్. 431

తా. శుద్ధమైన అభ్రకభస్మము మృత్యువు, ముదిమి మొదలగు సర్వరోగముల హరింపజేయుటయేగాక శరీరదార్ఢ్యమును, రూపమును, వీర్యమును గలుగంజేయును.

అభ్రపత్రం తు రోగఘ్నం ఖరత్వం జరనాశనం,
మృదుసత్వం మృత్యునాశం ద్రుతిసత్వ మతంద్రతామ్. 432

తా. అభ్రకపుపత్రములు రోగముల హరింపజేయును. ఖరత్వము ముదిమిని బోకడచును. మృదుసత్వము మృత్యువును బోకడచును. ద్రుతిసత్వము ఆలస్యమును బోకడచును.

## అభ్రకగుణము

గౌరీతేజః పరమమమృతం వాత పిత్త క్షయఘ్నం
ప్రజ్ఞాబోధి ప్రశమితజరం వృష్య మాయుష్య మగ్ర్యం,
బల్యం స్నిగ్ధం రుచిదమకఫం దీపనం శీతవీర్యం
తత్తద్యోగై స్సకలగదహృద్వ్యోమసూతేంద్రబంధి. 433

తా. అభ్రకభస్మము కడు అమృతతుల్యంబుగ, వాత, పిత్త, క్షయములను, ముదిమిని హరింపంజేయునదిగ, బుద్ధిప్రదముగ, వీర్యవృద్ధికారిగ, ఆయుర్వృద్ధి, బల ము-ల గలుగంజేయునదిగ, స్నిగ్ధముగ, రుచికారిగ, ఇంద్రియనిగ్రహమును బోకడ చునదిగ, కఫమును హరింపంజేయునదిగ, దీపనకారిగ, శీతవీర్యముగలదిగ, రసబంధన కారిగ నుండును.

## అశుద్ధాభ్రకదోషము

పీడాం విధత్తే వివిధాం నరాణాం
కుష్ఠం క్షయం పాండుగదం చ శోఫం,
హృత్పార్శ్వపీడాశ్చ కరోత్యశుద్ధం
భ్రమ్యాహితం జాఠరవహ్నిహృత్స్యాత్. 434

తా. అశుద్ధాభ్రకసేవనవలన పలువిధములైన పీడ, కుష్ఠువు, క్షయము, పాండువు, శోఫ, హృదయ, పార్శ్వములయందు పీడ, భ్రమ, అగ్నిమాంద్యము గలుగును.

## అభ్రకభస్మానుపానములు

అభ్రకం తు నిశాచూర్ణం మధునా సహమిశ్రితం,
శతావరీచూర్ణయుక్తం సర్వమేహేషు యోజయేత్. 435
అభ్రకం కాంతసంయుక్తం నవనీతవిమిశ్రితం,
సర్వవ్యాధిహరం పుంసాం కాంతివీర్యబలప్రదమ్. 436
అభ్రకం సైంధవం ద్రాక్షా మరీచేన విమిశ్రితం,
ఉష్ణోదకేన తత్పీత్వా సర్వాజీర్ణనిబర్హణమ్. 437
అభ్రకం రసభస్మస్యా న్మిశ్రితం మధునా విహేత్,
అత్యుగ్రసన్నిపాతఘ్నం మూర్ఛితం స్యా త్సముద్ధరేత్. 438
అభ్రకం మాగధీచూర్ణం కలిద్రుమఫలాని చ,
చూర్ణమేతత్సమోపేతం శ్లేష్మరోగనిబర్హణమ్. 439
అభ్రకం తామ్రభస్మస్యా న్మిశ్రితం విజయాసహ,
యోజితం మాతులుంగస్య ఫలేన స్వరసేన చ. 440

సంతత స్సంతత స్తేన విపరీతో విపర్యయాత్. 243
విషమో విషమారంభాః క్రియాః కాలోనుషంగవాన్,
దోషో రక్తాశ్రయః ప్రాయః కరోతి సతతజ్వరమ్. 244

తా. అన్నరసాదులను వహించెడి స్రోతోద్వారములు తెరవబడియుండుటవలన ాయన్నరసాదులు సమస్తశరీరమునందు వ్యాపించి స్వల్పముగ క్షీణముగనుండు దోషము ంతతజ్వరమును గలుగజేయును. ఇదియ సంతతజ్వరనిదానము. దీనియందు విరుద్ధాహారా లవలన విషమజ్వరము కలుగును. రక్తము నాశ్రయించియుండుదోషము తరుచుగా తతజ్వరమును గలుగజేయును. ఇది ఒకయహోరాత్రము విడువకుండును. ఇదియ ఏకా ాకజ్వర మనఁబడును.

## ద్వ్యహిక త్ర్యాహిక జ్వరనిదానము

అహోరాత్రస్య సద్విస్స్యా త్సకృదన్యేద్యురాశ్రితః,
తస్మిన్ మాంసవహానాడీ మేదోనాడీ తృతీయకే. 245
గ్రాహిపిత్తాన్నలాన్మూర్ధా త్రికస్య కఫపిత్తతః,
సపృష్ఠస్యానిలకఫౌ త్సచైకాహాంతరస్మృతః. 246

తా. జ్వరము మాంసవహనాడినాశ్రయించియుండిన మరుదినము జ్వరము కలు ను. ఇదియ ద్వ్యహికజ్వర మనఁబడును. జ్వరములో నాడి న్నాశ్రయించియుండిన ్ర్యాహికజ్వరము కలుగును. దీనియందు పిత్తవాత సంసర్గమువలన తలనొప్పి, కఫపిత్త ంసర్గమువలన ముడ్డిపూసయందుపట్లు, కఫవాతసంసర్గమువలన వీపునందుపట్లు ఇవి లుగును. ఇది ఒకదినము విడిచి మరుదినమునందు కలుగును. దీనిని త్ర్యాహికజ్వర నియెదరు.

## శుక్లగతజ్వరలక్షణము

తిమిరకఠినవాక్యం స్వేదమూర్ఛాప్రలాపం
నయనజలదదృష్టిర్వాంతి లాలాస్యదేశే,
వికృతవిదహాదేహే నష్టకాంతిః ప్రకుర్యా
ద్వివిధవిషవికారాన్ శుక్లయుక్తం జ్వరంచ. 247

తా. కండ్లు చీకట్లుకమ్ముట, కఠినముగ మాటలాడుట, చెమట, మూర్ఛ, ప్రలా ంచుట, కండ్లయందు నీరుకారుట, వాంతులగుట, నోటజొల్లుకారుట, శరీరము వికృ మైయుండుట, తాపయుక్తముగనుండుట, కాంతిహీనముగనుండుట—ఇట్టి విషవికార ులు, శుక్లస్ఖలనము-ఈలక్షణములుగలది శుక్లగతజ్వర మని తెలియవలయు. (దీనియం

సర్వశూలం నిహంత్యాశు కథితం శూలపాణినా,
అభ్రికం రససిందూర మిశ్రితం హేమభస్మనా. 441
సమభాగం ప్రకల్ప్యైత రసేనార్ద్రేణ యోజయేత్,
క్షయం చ క్షయ పాండుం చ క్షయం నాశం చ కుంభకమ్. 442
జయే న్మండలపర్యంతం పూర్వకర్మవిపాకతః,
అభ్రకం చ హరీతక్యా శ్చూర్ణం గోమూత్ర వేషితమ్. 443
గోమూత్రేణ పిబే న్నిత్యం మండలా త్పాండురోగజిత్,
ద్విగుణం సేవితం శోఫా కుంభ కామిలయా సహ. 444
నశ్యంతి త్రిగుణం సేవ్యం వాదిశే త్పథ్యభోజనం,
అభ్రికం లోహభస్మస్యా చ్ఛివా ॰సవిమర్దితమ్. 445
త్రింశత్పుటం పునర్దేయం తద్ర సేన పునః పునః,
లవంగ మధుసంయుక్తం ధాతువృద్ధికరం పరమ్. 446
సహస్రనారీ రమతే పురుషో వీర్యవా న్భవేత్,
అభ్రకం చ జపాపుష్పరసేన సహ భావయేత్. 447
శతధా చ తథా జాజీ కుసుంబస్వరసేన చ,
శతధా మల్లికాపుష్పస్వరసే భావయే ద్దృఢమ్. 448
శతధా శరపుష్పస్య భావయే త్స్వరసేన చ,
శతధా పంచకైః పుష్పై స్స్వరసే భావయే ద్భిషక్. 449
తదభ్రకం భాగమేకం కుంకుమం తు ద్విభాగకం,
సురాకారం త్రిభాగంస్యా చ్చతుర్భాగం చ చందనమ్. 450
ఏతత్సర్వం సమం కృత్వా మృగనాభి ర్విశేషతః,
హిమాంబునా మర్దితం స్యా చ్చతుర్వల్లమితం భవేత్. 451
మధునా సేవితం నిత్యం యథేష్టాహారభోజనైః,
క్షీరాన్నం దాపయే త్పథ్యం ద్రాక్షా ఖర్జూరజం ఫలమ్. 452
భక్షయే చ్ఛర్కరాదీ న్స్వ్య త్పిబే న్నిత్య మతంద్రితః,
ఆపాదమస్తకాంగాని లేపయే ద్వరచందనమ్. 453
ఏవం సేవిత మానందం సర్వపిత్తం విశోధయేత్,
అభ్రకం వజ్రభస్మస్యా త్సంయోగం కురుతే భిషక్. 454
మృగనాభిరసై ర్మర్ద్యం సేవితం మాషమాత్రకం,

మాషమాత్రం జయేన్మృత్యుం వలీపలితనాశనమ్. 455
సర్వరోగా న్జయే త్ప్రాజ్ఞో బలవా న్వీర్యవా న్భవేత్,
అభ్రకం కలధౌతస్య భస్మ ముక్తాఫలస్య చ. 456
తస్మి న్ప్రవాళభస్మాపి భస్మమాక్షీకమేవ చ,
తారతామ్రకభస్మం చ భస్మవైక్రాంతమేవ చ. 457
ఏతైర్భస్మసమంచైవ వ్యోమభస్మవిమిశ్రితం,
సర్వపుష్పరసై ర్భావ్యం మాషమాత్రం సహార్ద్రకైః. 458
సర్వరోగనివృత్త్యర్థం దాపయే త్కరుణాకరమ్,
మధునా శ్లేష్మరోగస్య వాతస్యైరండతైలకైః. 459
పిత్తస్య సితసంయుక్తం పాండుశోభస్య మూత్రకే,
ఘృతేన శ్వాసకాసేచ శ్లేష్మరోగస్య మాగధీ. 460
ముస్తా నాగరయుక్తం చా ప్యతిసారం వినాశయేత్,

తా. అభ్రకభస్మమును పసపుచూర్ణము, తేనె, చల్లపిల్లిగడ్డలచూర్ణము అనువానితోడ సేవించిన సర్వమేహములు హరించును. అభ్రకభస్మము కాంతభస్మమును, వెన్న అనువానితోడ సేవించిన సర్వరోగముల హరింపంజేసి శరీరకాంతిని, వీర్యమును, బలమును గలుగంజేయును. అభ్రకభస్మమును సైంధవలవణము, ద్రాక్షపండు, మిరియములు, ఉష్ణోదకము అనువానితోడ గలిపి సేవించిన సర్వాజీర్ణములు హరించును. అభ్రకభస్మమును రసభస్మము, తేనె అనువానిలో గలిపి సేవించిన అత్యుగ్రసన్నిపాతములు మూర్ఛ హరించును. అభ్రకభస్మమునకు సమముగ పిప్పలిచూర్ణమును, తాడికాయల చూర్ణమును గలిపి సేవించిన శ్లేష్మరోగములు హరించును. అభ్రకభస్మమును తామ్రభస్మము, కరక్కాయ, మాదీఫలరసము అనువానితో జేర్చి సేవించిన సర్వశూలలు నివర్తించునని శివుఁడు వచించెను. అభ్రకభస్మమునకు సమముగ రససిందూరమును, సువర్ణభస్మమును గలిపి అల్లపురసముతో నొకమండలము సేవించిన పూర్వజన్మకర్మపరిపాకమువలన క్షయము, క్షయపాండువు, శరీరక్షయము, కుంభకామిల హరించును. అభ్రకభస్మము, కరకచూర్ణము - వీనిని గోమూత్రముతో నూరి గోమూత్రముతోడ నొకమండలమువఱకు సేవింపుచుండిన పాండురోగము హరించును. రెండింతల అభ్రకభస్మములో ఒకభాగము కరకచూర్ణమును గలిపి గోమూత్రముతో నూరి గోమూత్రముతోడనే సేవించిన పాండు, శోఫలును, మూడింతల అభ్రకభస్మములో ఒకభాగము కరకచూర్ణము గలిపి గోమూత్రముతో నూరి గోమూత్రముతోడనే సేవించిన పాండు, శోఫ, కుంభకామిలలును హరించును. దీనియందు పథ్యభోజనముల వైద్యుఁడు విధింప

వలయును. అభ్రకభస్మములో లోహభస్మమును గలిపి కరక్కాయరసముతో మర్దించి ముప్పదిపుటంబులిడి లవంగములు, తేనె అనువానియనుపానముతోడ సేవించిన పురుషుడు వీర్యవృద్ధిగలవాడై వెయ్యిస్త్రీలతో రమించును. అభ్రకమును దాసనపువ్వు జాజిపువ్వు, కుసుంబాపువ్వు, మల్లెపువ్వు, కుక్కవాయింటపువ్వు అనువానిరసములలో ప్రతిదానిచే నూరేసిభావనలచొప్పున నేనూరు భావనలుజేసి యందొకభాగమును గ్రహించి అందు రెండుభాగములు కుంకుమపువ్వును, మూడుభాగములు సురాకారమును, నాలుగుభాగములు చందనమును, పదిభాగములు కస్తూరిని కలిపి శీతోదకముతో మర్దించి నాలుగువల్లములంత మాత్రలంజేసి తేనెతో ప్రతిదినము సేవింపుచు యథేష్టాహారభోజనములను, పాలన్నమును, ద్రాక్షపండు, ఖర్జూరపండు, పంచదార మొదలగువానిని ప్రతిదిన మాలస్యముజేయక సేవింపుచుండుటయేగాక పాదము మొదలు శిరమువఱకు చందనమును బూసికొనిన సంతోషమును గలుగంజేసి సర్వపిత్తరోగములు హరింపంజేయును. అభ్రకభస్మమును, వజ్రభస్మమును చేర్చి కస్తూరినీళ్లతో మర్దించి మాషప్రమాణమును సేవించిన మృత్యువు, ముదిమి, సర్వరోగములు - వీనిని హరింపంజేయుటయేగాక బల, వీర్యముల గలుగంజేయును. సువర్ణభస్మము, ముత్తియముల భస్మము, పగడభస్మము, స్వర్ణమాక్షికభస్మము, రజతభస్మము, తామ్రభస్మము, వైక్రాంతభస్మము - వీనికన్నిటికి సమముగ అభ్రకభస్మమును గలిపి దాసనపువ్వు, జాజిపువ్వు కుసుంబాపువ్వు, మల్లెపువ్వు, కుక్కవాయింటపువ్వు మొదలగు సర్వపుష్పరసములతో భావనలుచేసి మాషప్రమాణమును అల్లపురసానుపానముతోడ సేవించిన సర్వరోగముల నివర్తించును. ఈయోగము కరుణాకరమని చెప్పంబడును. దీనిని తేనెతో సేవించిన శ్లేష్మరోగములును, ఆముదముతో సేవించిన వాతరోగములును, పంచదారతో సేవించిన పిత్తరోగ, పాండు, శోఫ, బహుమూత్రములును, ఘృతముతో సేవించిన శ్వాసకాసములును, పిప్పలితో సేవించిన శ్లేష్మరోగములును, తుంగముస్తెలు, శొంఠి అనువానితో సేవించిన అతిసారములును హరించును.

### అభ్రకానుపానములు

నిశ్చంద్రికమృతం యోగ్యం సేవ్యం సర్వగదేషు చ. 46
పిప్పలీ శర్కరాయుక్తం వాత పిత్త జ్వరాపహం,
ఘృతేన గృహధూమేన గగనం చిప్పికాసహమ్. 46
పంచసారేణ గగనం విషమజ్వరజిద్వరం,
చాతుర్జాతం త్రిరాత్రం తు సన్నిపాతహరం పరమ్. 46
తథాష్టై సన్నిపాతఘ్నం వాతఘ్నం రక్తపిత్తజిత్,

వాసారసేనగగనం * కాసశ్వాసం దురావహమ్. 464
క్షయరోగహరం శీఘ్రం మశ్వగంధి విసర్పిషు,
మయూరపింఛక్షారేణ మధునా ఛర్దిలుంఠనమ్. 465
కపిత్థఫలసారేణ హిక్కారుచిహరం పరం,
భల్లాతకేన గగన మర్శోరోగహరం పరమ్ 466
ముస్తా నాగరక్వాథేన సర్వాతీసారనాశనం,
ఇతి సాంగానుపానాభ్రం సర్వరోగహరం పరమ్. 467

తా. తళుకులులేకుండు అభ్రకభస్మమును సేవించిన సర్వరోగములు హరించును. మఱియు అభ్రకభస్మమును పిప్పలి, పంచదార అనువానితోఁడ సేవించిన వాతపిత్తజ్వరములును, నెయ్యి, కరుధూమము అనువానితోఁడ సేవించిన చిప్పికాకాసమును, పంచసారములతోఁడ సేవించిన విషమజ్వరములును, చాతుర్జాతక చూర్ణానుపానముతోఁడ మూఁడు దినములు సేవించిన సన్నిపాత, వాత, రక్తపిత్తములును, అడ్డసరపాకురసముతో సేవించిన అసాధ్యమైన కాసశ్వాసములును, పెన్నేరుగడ్డచూర్ణముతో సేవించిన క్షయ, విసర్పిరోగములును, నెమలియీకెభస్మము, తేనె అనువానియనుపానముతోఁడ సేవించిన ఛర్దియు, వెలగగుజ్జుతో సేవించిన హిక్కారుచులును, జీడిగింజలకషాయముతో సేవించిన అర్శోరోగంబును, తుంగముస్తెలు శొంఠి అనువానికషాయముతో సేవించిన సర్వాతిసారములును హరించును. ఈయనుపానవిశేషములతోఁడ అభ్రకభస్మమును సేవించిన సర్వరోగములు నివర్తించును.

## రసాష్టాదశసంస్కారవివరణను

స్వేదనం మర్దనం మూర్ఛోత్థాపనం పాతనం త్రిధా,
బోధనం నియమంచైవ దీపనం చానువాసనమ్. 468
మారణం జారణంచైవ సారణం ప్రతిసారణం,
క్రామణం వేదనంచైవ దేహే యోగే చ శస్యతే. 469

తా. స్వేదనము, మర్దనము, మూర్ఛనము, ఉత్థాపనము, అధఃపాతనము, తిర్యక్పాతనము, ఊర్ధ్వపాతనము, బోధనము, నియమము, దీపనము, అనువాసనము, మారణము, జారణము, సారణము, ప్రతిసారణము, క్రామణము, వేదనము, శరీరయోగము అనునవి రసాష్టాదశసంస్కారంబులు.

## స్వేదనవిధి

త్ర్యూషణం లవణం రాజీ రజనీ త్రిఫలార్ద్రకం,
మహాబలా నాగబలా మేఘనాదః పునర్నవా. 704

* అర్శోరోగహరం పరమ్.

మేషశృంగి చిత్రకం చ నవసారం సమంసమం,
రసస్య షోడశాంశేన సర్వాం యుంజ్యాత్పృథక్పృథక్. 471
ఏతత్సమస్తం వ్యస్తం వా పూర్వోక్తైశ్చైవ వేషయేత్,
లింపేదనేన కల్కేన వస్త్రేనాంగుళిమాత్రకమ్. 472
తన్మధ్యే నిక్షిపే త్సూతం బధ్వా తత్ర దినం పచేత్,
డోలాయంత్రేఽమ్లసంయుక్తే జాయతే స్వేదితో రసః. 473

తా. త్రికటుకములు, ఉప్పు, ఆవాలు, పసపు, త్రిఫలములు, అల్లము, పెద్ద ముత్తపపులగము, నాగముత్తపపులగము, చిట్టీకూర, తెల్లగలిజేరు, వద్ది, చిత్రమూలము, నవాసారము అనువానిలో ప్రతిద్రవ్యమునుగాని, అందు దొరకినవానినిగాని రసము నకు పదియారవభాగము గ్రహించి ప్రత్యేకముగగాని, సముదాయముగగాని కలితో నూరి వస్త్రముపై అంగుళప్రమాణము లేపనముచేసి దాని మధ్యమున పాదరసమును బోసి వస్త్రములో మూటగట్టి దానిని డోలాయంత్రమున దగిలించి కలితో నొకదినము వండు టయుం స్వేదన మనంబడును.

## మర్దనవిధి

భిషగ్భి ర్మర్దయే చ్చూర్ణై ర్మిళిత్వా షోడశాంశతః,
సూతస్య గాలితే వస్త్రే వక్ష్యమాణద్రవాదిభిః. 474
గృహధూమేష్టికాచూర్ణం తథా దధి గుడాన్వితం,
లవణాసురిసంయుక్తం క్షిప్త్వా సూతం విమర్దయేత్. 475
జీర్ణాభ్రకం తథాజీర్ణ బీజసూతం తథైవ చ,
గృహ్ణాతి నిర్మలో రోగాన్ గ్రాసేగ్రాసే విమర్దితః. 476

తా. కరుధూపము, ఇటికెరాయిపొడి, పెరుగు, బెల్లము, ఉప్పు, ఆవాలు జీర్ణాభ్రకము - వీనిలో ప్రతిదానిచూర్ణమును రసమునకు పదియారవభాగముచేర్చి మర్దించి రసమును వస్త్రములోబోసి పిడిచిన నిర్మలమై శీఘ్రముగ రోగముల హరింప జేయును.

## మూర్ఛనవిధి

సహా కన్యామలం హంతి త్రిఫలా వహ్నినాశినీ,
చిత్రమూలం విషం హంతి తస్మాత్తంచ ప్రయత్నతః. 47
మిశ్రితం మర్దయే త్సూతం సప్తవారేణ మూర్ఛయేత్,
ఇత్థం సమ్మూర్ఛిత స్సూతో దోషశూన్యః ప్రజాయతే 47

తా. కలుబంద పాదరసమునందలి మలదోషమును, త్రిఫలములు వహ్నిదోష
ను, చిత్రమూలము విషదోషమును హరింపఁజేయును. కావున మిశ్రిత పాదరసమును
ంబంద, త్రిఫలములు, చిత్రమూలము అను నానిరసములతో ప్రతిదానిచే ఏడేసిమార్లు
ర్దించిన రసము మూర్ఛం జెందును. ఇటుల మూర్ఛంజెందినరసము దోషరహితంబు.

### ఉత్థాపనవిధి

జలై స్స్వేష్ణారనాళైర్వా క్షాళనా దుత్థితో భవేత్,
అథవా పాతనాయంత్రే పాతనా దుత్థితో భవేత్. 479
ఉత్థితః కాంజికక్వాథైః క్షాళనీయ మతఃపరం,

తా. పాదరసమును ఉష్ణోదకముతోగాని, ఉష్ణముగనుండు కలితోగాని, కడిగి
కొనిన ఉత్థితంబగును. లేక ఊర్ధ్వపాతనాయంత్రమునందును ఉత్థితంబగును. ఉత్థా
నానంతరము రసమును ఉష్ణముగ నుండుకలితో గడుగవలయును.

### ఊర్ధ్వపాతనవిధి

భాగాస్త్రయో రసస్యార్కచూర్ణ మంశాంశనింబుకమ్ 480
తతస్సంమర్దయే ద్యావ త్తావ దాయాతి పిండతాం,
తత్పిండం తలభాండస్థ మూర్ధ్వభాండే జలం క్షిపేత్. 481
కృత్వా లంబాలకే యంత్రే దత్వావార్ద్రిం హి మోదకం,
సంరోప్య చాగ్నిం మధ్యస్థం చతుర్యామం హి బోధయేత్. 482
యుక్త్యోర్ధ్వభాండసంలగ్నం గృహ్ణీయా త్పారదం తతః,
ఊర్ధ్వపాతన మిత్యుక్తం భిషగ్భి స్సూతశోధనే. 483
ససూతభాండవివర మన్యద్గలతి భాండకే,
తథా సంధిర్ద్వయోః కార్యా పాతనాయంత్రయంత్రకే. 484
యంత్రప్రమాణం వదనా ద్గురోర్జ్ఞేయం విచక్షణః,

తా. పాదరసము మూడుభాగములు, జిల్లేడుపట్టచూర్ణము ఒకభాగము - ఇటుల
వీనిని గ్రహించి అందొకింత నిమ్మపండ్లరసము పోసి యుంటగ నగువఱకు మర్దించి దాని
నధస్స్థితభాండమునం దునిచి పైభాండమునం దుదకముబోయుటచే డమరుకాయంత్ర
మన పరఁగెడుదానిని పొయ్యిమీఁద నునిచి పైభాండమునందు శీతోదకముపోయుచు
నాలుగురఝాములు మధ్యమాగ్నితో వండి పైకుండ నంటియుండురసమును యుక్తితో
గ్రహింపవలయును. రసశోధనవిషయమున చేయంబడు నీక్రియనే ఊర్ధ్వపాతన మనియె
దరు. ఊర్ధ్వపాతనాధస్స్థితభాండముఖములో పైభాండముయొక్క ముఖమును చేర్చి

బాగుగ సంధిలేపనము చేయవలయును. యంత్రప్రమాణమును గురుముఖమువలన దెలి
కొనవలయును.

### అధఃపాతనవిధి

త్రిఫలా శిగ్రు శిఖిభి ర్లవణాసురిసంయుతైః. 48
నష్టపిష్టరసం కృత్వా లేపయే దూర్ధ్వభాండకే,
ఊర్ధ్వభాండోదరం లిప్త్వా చాధోభాండే జలం క్షిపేత్. 48
సంధిలేపం ద్వయోః కృత్వా తద్యంత్ర భువిపూరయేత్,
ఉపరిష్టాత్పుటే దత్తే జలే పతతి పారదః. 4
అధఃపాతన మిత్యుక్తం సిద్ధాద్యైస్సూతకర్మణి,

తా. త్రిఫలములు, మునగ, చిత్రమూలము, ఉప్పు, ఆవాలు-వీనితోడ రసము చేర్చి రసము గలియునటుకు ఖల్వమున మర్దించి డమరుకయంత్రముయొక్క పైపా లోభాగమున దానినిబూసి క్రిందిపాత్రయం దుదకముపోసి ఆరెండుపాత్రలచేర్చి సం లకు బాగుగ చీలమన్ను లేపనముచేసి యెండించి యాపాత్రను భూమిలోపూడ్చి దాని పుటంబిడవలయును. ఇటులచేసిన రసము జలముండు క్రిందిపాత్రయందు పడును. దీ సిద్ధాదులు రసకర్మయందు అధఃపాతనమని వచించెదరు.

### తిర్యక్పాతనము

ఘటేరసో వినిక్షిప్య సజలం ఘటమన్యకమ్. 4
తిర్యఙ్ముఖం ద్వయోఃకృత్వా సమ్ముఖం రోధయేత్సుధీః,
తత్రైవ చుల్ల్యాం సంస్థాప్య యత్నతస్తంతతో భిషక్. 4
రసస్యోజ్జ్వాలయేద్వహ్నిం యావత్సూతో జలం విశేత్,
తిర్యక్పాతనమిత్యుక్తం సిద్ధైశ్చైవార్జునాదిభిః. 4
మిశ్రితౌ నాగవంగౌ చ రసే విక్రయహేతుతః,
తాభ్యాం స్యాత్కృమిదోషస్తు తన్ముక్తిః పాతనత్రయాత్.
ఏవం సుసంస్కృతస్సూతః పాతనావిధియత్నతః,
సర్వదోషవినిర్ముక్తో జాయతే నాత్ర సంశయః. 4

తా. యంత్రమునకు తగినటుల ఒకింత నిడుపుగనుండు కుండల గ్రహించి దొకదానిలో పాదరసమును, మఱియొకదానిలో నుదకమునుబోసి అడ్డముగ ను వానిని చేర్చి సంధులకు చీలమన్ను లేపనముచేసి రసముపోసినకుండను పొయిమీద ముగ యుక్తితో నునిచి పాకముజేసిన రసమునీళ్ళలో ప్రవేశించును. దీనినే నాగార్జును మొదలగుసిద్ధులు తిర్యక్పాతనమని వచించెదరు. ఇటుల యుక్తిచే మూడుమార్లుతిర్య

తనము చేయుటవలన రసమునందలి నాగ, వంగ, క్రిమిదోషములు నివర్తించును. ఈతిర్యక్పాతనవిధివలన రసమునందలి సర్వదోషములు నిస్సంశయముగ హరించును.

## బోధనము

ఏవం కదర్థిత స్సూతః షండత్వ మధిగచ్ఛతి,
తస్మ త్తద్దోష క్రియతే బోధనం కథ్యతే హి తత్. 493

తా. పైప్రకారము శోధింపఁబడిన పాదరసమునందు షండత్వదోషం బుండును. అది నివర్తించుటకై బోధనక్రియను వచించెదను.

కదర్థనేనైవ నపుంసకత్వ మేవంభవే దస్యరసస్యపశ్చాత్,
వీర్యప్రకర్షాయ చ భూర్జపత్రే స్వేద్యోజలే సైంధవచూర్ణగర్భే.

తా. రసమునకు పైఁజెప్పంబడిన సంస్కారమువలన షండత్వదోషము గలుగును. తన్నివారణార్థంబును, రససామర్థ్యము వృద్ధిఁజెందుటకును, రసమును భూర్జపత్రము, ఉదకము, సైంధవలవణము అనువానితో పాకము జేయవలయును.

## నియమనము

సర్పాక్షీ చించకా వంధ్యా భృంగాబ్ద కనకాంబుభిః,
దినం సంస్వేదజ స్సూతో నియమార్థిన్సరతాం వ్రజేత్. 495

తా. పాదరసమును సర్పాక్షి, చింత, గొడ్డుకాకర, గుంటగలగర, తుంగముస్తెలు, ఉమ్మెత్త అనువానిరసముతోగాని, లేక కషాయములతోగాని, ఒకదినము వండిన నియమన మనంబడును.

## సందీపనము

కాసీసం పంచలవణం తదూర్ధ్వం నింబుకం రసం,
క్షిప్త్వా క్షిప్త్వాథ దాతవ్యం తాదృక్సైంధవఖేటకమ్. 496
గర్తే కృత్వా ధరాగర్భే దత్వా సైంధవసంయుతం,
ధూలి మష్టాంగుళీం దత్వా రాజికా మరిచాని చ. 497
ద్విశిగ్రుబీజ మేకత్ర టంకణేన సమన్వితం,
ఆలోడ్య కాంజికే డోలాయంత్రే పాచ్యం దినైస్త్రిభిః 498
దీపనం జాయతే సమ్యక్సూతరాజస్య జారణే,

తా. అన్నభేది, పంచలవణము-వీనిని గ్రహించి దానిపై పలుమారు నిమ్మపండ్ల రసమునుబోసి సైంధవలవణగడ్డను పగులగొట్టి అందు సైంధవలవణముతోడ పాదరసమును జేర్చి దానిపై పూర్వోక్త సైంధవలవణమును, నిమ్మపండ్లనంటించి దానిపై నెనిమిదంగుళముల ధూళినంటించి మునగవిత్తులు, చేదుమునగవిత్తులు, వెలిగారము అన

నీమూటచెని నూరి కుండకు లేపనముజేసి అందు కలిసిబోసి దానిమధ్యమున డోలాయం
ముతో మూడుదినములు వండిన రసము జారణసంస్కారణమునందు దీపనమగును.

(రసమున కష్టాదశసంస్కారములు జెప్పంబడియుండినను "స్వేదో మర్దితమూ
ర్ఛా స్థితిరతః పాతోఽపి భేదాన్వితో, బోధ స్సంయమనం ప్రదీపనమితి స్పష్టాష్ట
సంస్కృతిః, అస్యాస్సర్వరసోపయోగికతయా త్వస్యానవిన్యస్య తే, గ్రంథేఽస్మి
త్రకృతోపయోగవిరహా ద్విస్తారభీత్యాథవా." అను గ్రంథాంతరవచన ప్రకార
స్వేదన, మర్దన, మూర్ఛన, ఉత్పాతన, పాతన, బోధన, సంయమన, ప్రదీపనము
లనెనిమిది సంస్కారములు సర్వోపయోగంబులగుటచే చెప్పంబడియెను. తక్కినపదిసంస్కా
రములు ఔషధోపయోగంబులు గాకుండుటంజేసియు, గ్రంథవిస్తరభీతింజేసియు
జెప్పంబడవయ్యెను.)

## రసభస్మము

దత్వా వింశతిభాగకే జలధిజే సూతస్యభాగం దృఢం
ఖల్వే మర్ద్య చ కాంజికేన సతతం యద్వా తతశ్చాంబునా,
ఉద్ధృత్యాపి చ నిక్షిపేచ్చ పుటయే దేవం యథేష్టోరస
స్సాముద్రైశ్చ సుమార్యతే చ లవణై రేవం ప్రకారేణ చ. 49

తా. ఒకపలము శుద్ధిచేసిన రసములో ఒకపలము సముద్రలవణమును గలి
యవి యిగురువఱకు మర్దింపవలయును. ఇత్తెఱంగున ౨౦ పలములసముద్రలవణ మిగు
వఱకు పాదరసమును కలితో మర్దించి హండికాయంత్రమునందునిచి పాకముజేసినరస
భస్మంబగును. ఆరసభస్మమును దీసికొని భస్మముగాకుండురసమును మరల లవణము,
అనువానితో మర్దించి హండికాయంత్రమునం దునిచి పాకముజేసిన యారసము భస్మం
బగును. రసము భస్మంబగువఱకు పైప్రకారమే మర్దనపాకముల జేయవలయును. (భ
మైనరసమును గ్రహించుతెఱం గెట్లనిన—రసభస్మమును, తీయనిసీళ్ళను ఖల్వము
బోసి మర్దించి యొకకుండలోబోసి దానినిండా యుదకముపోసి ౮ ఝాములు పేరని
యందలియుదకమును వడిపిన క్రింద తెల్లగ రసభస్మము నిలిచియుండును. అందు మ
నుదకముపోసి బాగుగగలిపి నీళ్ళు తీయగనగువఱకు వడిపి క్రిందనుండు రసభస్మమును
కొనిఖల్వమున నెండించి దంతపుకరాటములో నునిచికొనవలయును. అట్టి రసభస్మమ
౪ తులము, జాజికాయ ౧ తులము, జాపత్రి ౧ తులము, లవంగములు ౧ తుల
పిప్పలి ౧ తులము, వాయువిడంగములు ౧ తులము, ఓమము ౧ తుల
బెల్లము ౮ తులములు-ఇటుల వీనినెల్ల నేకముజేసి మర్దించి మాత్రలుచేసి యందొక
దానిని సాయంప్రాతఃకాలములయం దావునేతిలో సేవించి చప్పిడిపథ్యము నాచరింప
అవుచల్లనుద్రాగుచు నుండవలయును. దానివలన సర్వరోగములు హరించును.)

శుద్ధసూత స్తదర్ధంతు శుద్ధగంధకమేవచ,
తయోః కజ్జలికాం కుర్యా ద్దినమేకం విమర్దయేత్, 500
మృత్కర్పటవిలిప్తాయాం కుప్యాం కజ్జలికాం క్షిపేత్,
వాలుకాయంత్రకే పాచ్యా యావద్దినచతుష్టయమ్.
గృహ్ణీయా దూర్ధ్వసంలగ్నం సిందూరం రససన్నిభం,

తా. శుద్ధిచేసినరసము ఒకభాగము, శుద్ధిచేసినగంధకము అరభాగము - ఇటుల వీనినేకముజేసి కజ్జలిగ నొకదినము మర్దించి గాజుకుప్పెలో నునిచి చీలమన్ను లేపనము జేసి యెండించి వాలుకాయంత్రమునందిడి, నాలుగుదినములు పాకముచేసి సాంగశీతల మునదీసి గాజుకుప్పెగొంతు నంటి యుండు రససిందూరమును గ్రహింపవలయును.

ధూమసారం రసం తోరీ గంధకం నవసాగరమ్. 502
యామైకం మర్దయే దమ్లై ర్భాగం కృత్వా సమంసమం,
కాచకుప్యాం వినిక్షిప్య తాంచ మృద్వస్త్రముద్రయా. 503
విలిప్య పరితోవస్త్రే ముద్రాం దత్వాచ శోషయేత్,
అథ సచ్ఛిద్రపిఠరీ మధ్యే కుప్యాం నివేశయేత్. 504
పిఠరీం వాలుకాపూరై ర్భృత్వా చాకూపికాగళం,
నివేశ్య చుల్ల్యాంతదధః కుర్యా ద్వహ్నిం శనైశ్శనైః. 505
తస్మా దప్యధికం కించిత్పావకం జ్వాలయే త్క్రమాత్,
ఏవం ద్వాదశభిర్యామై ర్మ్రియతే సూతకోత్తమః. 506
స్ఫోటయే త్స్వాంగశీతం చాపూర్యోర్ధ్వకం గంధకం జహేత్,
అధస్థ్సం మృతసూతంచ సర్వకర్మసు యోజయేత్. 507

తా. కరుధూపము, శుద్ధిచేసినరసము, పటికారము, శుద్ధిజేసినగంధకము, నవాసాగరము-వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో నొకఝాము మర్దించి గాజుకుప్పెలో నునిచి దానినోటికి బిరడవేసి చీలమన్ను లేపనముచేసి యెండించి చట్టికి క్రిందిభాగమున దబ్బనముతో రంధ్రముచేసి యాచట్టిమధ్యమున గాజుకుప్పె నునిచి కుప్పెగొంతువఱకు నిసుకబోసి యాచట్టిని పొయిమీఁదనునిచి లఘ్వగ్నితో పాకముచేయుటయేగాక క్రమముగ నగ్నిని హెచ్చించుచుండవలయును. ఇత్తెఱంగున పన్నెండుఝాములు పాకముచేసి సాంగశీతలమున కుప్పెనుదీసికొని యుక్తితో పగుల గొట్టి దానినోటియందంటియుండు గంధకమును పరిగ్రహించి క్రిందయుండురసభస్మమును దీసికొని సర్వకార్యములయం దుపయోగించుకొనవలయును.

దశనికి దోషధాతువులు కలిగెడినో వాఁడు మృత్యువుపాలగు. అటుగాక ధాతువు స్వస్థగతిగా నడుచుచుండిన సాధ్య మని యెఱింగి చికిత్సింపవలయు.

మరణం ప్రాప్నుయాత్తత్ర శుక్రస్థానగతే జ్వరే,
శేఫసః స్తబ్ధతా మోక్షః శుక్రస్యచ విశేషతః. (మతాంతరే)248

తా. రసాదిసప్తధాతుగతజ్వరములలో శుక్రస్థానమును జ్వరము నాశ్రయింపుచుండగా మరణము కలుగు. ఆజ్వరమధ్యములో మేఢ్రము స్తబ్ధత్వమును బొందుటయేగాక విశేషముగా శుక్రస్రావమును, ఒకానొకపుడు కొంచెకొంచెముగా రక్తస్రావమును కలుగును.

### శుక్రగతజ్వరచికిత్స

పునర్నవార్కమూలంచ బాలావార్తాకమూలకం,
కుళుత్థమూలం బృహతీ బర్బరం గ్రంథినాగరమ్. 249
కణచూర్ణమిదం ఖాదేచ్ఛుక్లజ్వరనికృంతనం,

తా. గలిజేరువేరు, జిల్లేడువేరు, నూనెముంతవేరు లేక ముత్తవపులగపువేరు, వంగవేరు, ఉలవవేరు, నేలములకవేరు, వాయింటవేళ్లు, మోడి, సొంటి-వీనిని సమభాగములుగా దంచి కషాయము కాచి పిప్పలిచూర్ణముకలిపి సేవించిన శుక్లగతజ్వరము హరించు.

### ఆమజ్వరలక్షణము

లాలాప్రసేకహృల్లాస హృదయాశుద్ధ్యరోచకా. 250
*తంద్రాలస్యవిపాకంచ గురుగాత్రాతిమూత్రకం,
ఆమజ్వరసలింగంస్యా న్నదద్యాత్తత్ర భేషజమ్. (భేషజకల్పే)

తా. తంద్ర, ఆలస్యము, అన్నము అరగకుండుట, నోరు విరసముగనుండుట, అంగములు బరువుగ నుండుట, ఆఁకలి లేకుండుట, పలుమారు మూత్రము వెడలుట, అంగములు స్తంభించియుండుట, అధికజ్వరము – ఈలక్షణములుగలది అపక్వజ్వర మని తెలియవలయు. దీనియందు ఔషధము నివ్వంజనదు. ఔషధము నిచ్చిన అధికముగా జ్వరముగలుగు. మఱియు శోధనీయ ఔషధములనుగాని లేక శమనీయ ఔషధములనుగాని ప్రయోగించిన విషమజ్వరము కలుగును. అని పాఠాంతరముగలదు.

---

* తంద్రాలస్య విపాకాస్య వైరస్యం గురుగాత్రతా, క్షున్నాశో బహుమూత్రత్వం స్తబ్ధతా బలవాన్ జ్వరః, ఆమజ్వరస్య లింగాని నదద్యాత్తత్ర భేషజమ్, భేషజం హ్యామదోషస్య భూయో జనయతి జ్వరం, శోధనం శమనీయంచ కరోతి విషమజ్వరమ్,

కాకోదుంబరికాదుగ్ధైః రసం కించి ద్విమర్దయేత్,
తద్దుగ్ధఘృష్టిహింగోశ్చ మూషాయుగ్మం ప్రకల్పయేత్. 50
క్షిప్త్వా తత్సంపుటే సూతం తత్ర ముద్రాం ప్రదాపయేత్,
ధృత్వా తం గోళకం ప్రాజ్ఞో మృన్మూషా సంపుటేభికే. 50
పచేన్మృదుపుటేనైవ సూతకోయాతి భస్మతాం, (మతాంత

తా. శుద్ధిచేసిన రసమును ఖల్వములోబోసి బ్రహ్మమేడిపాలతో యొకింత మర్దిం పిదప ఇంగువను బ్రహ్మమేడిపాలతోనూరి రెండుమూసలుజేసి యందొకదానిం నొకింత మర్దించిన పైపాదరసమునునిచి దానిపై రెండవమూసను మూసి బాగుగచే యుంటజేసి మూకుళ్ళలో నునిచి చీలమన్ను లేపనముజేసి ఏరుపిడకలతో లఘుపు బిడిన రసము భస్మంబగును.

అపామార్గస్య బీజానాం మూషాయుగ్మం ప్రకల్పయేత్. 5
తత్సంపుటే న్యసే త్సూత మర్కదుగ్ధ విమిశ్రితం,
ద్రోణపుష్పీ ప్రసూనాని విడంగ మిరిమేదకమ్. 5
ఏతమ్చూర్ణ మధశ్చోర్ధ్వం దత్వా ముద్రాం ప్రదాపయేత్,
తంగోళం ముద్రయే త్సమ్యఙ్మృన్మూషా సంపుటే సుధీః. 5
ముద్రాం దత్వా శోషయిత్వా తతో గజపుటే పచేత్,
ఏవ మేకపుటేనైవ జాయతే సూతభస్మకమ్. 5

తా. ఉత్తరేణువిత్తులనూరి రెండుమూసలుచేసి అందొకదానిలో తుమ్మిపూ వాయువిడంగములు, నల్లతుమ్మపట్ట అనువాని చూర్ణమునువైచి శుద్ధిచేసినరసవ జిల్లేడుపాలతో మర్దించి యాచూర్ణముపై బోసి దానిపై తుమ్మిపూలు మొదలగు చూర్ణమును వైచి మఱియొకమూతను మూసి సందులకు చీలమన్ను లేపనముజేసి వ మూసలోనునిచి దానిపై మఱియొక మంటిమూతనుమూసి సందులకు చీలమన్ను లేప జేసి యెండించి గజపుటంబిడిన రసము భస్మంబగును.

### రససిందూరము

పలద్వయం శుద్ధరసం పలార్ధం శుద్ధగంధకం,
కర్షార్ధం నవసారంచ జంబీరేణ విమర్దయేత్.
కాచకుప్యాం క్షిపేచ్చైవ మృత్కర్పట్యాచ సప్తధా,
విలిప్య కాచకుప్పీంతా మాతపే శోషయే ద్దృఢమ్.
ఛిద్రభాండే తతో కుప్పీం న్యసే త్సికతయంత్రకే,

కుప్పికాకంఠ మాసేన పూజయే ద్దిష్టదేవతాః. 516
పంచభోజ్యా కుమార్యశ్చ తతశ్చుల్యాం వినిక్షిపేత్,
పచే ద్యామాష్టకంచైవ కుప్పికాంచ క్షణేక్షణే. 517
సంశోధ్య పాచయేద్యంతే స్వాంగశీతం సముద్ధరేత్,
గ్రాహ్యంచ దరదాకారం దేవదానవదుర్లభమ్. 518
సేవయే ద్రోగనాశాయ తతో రోగానుపానతః,
వల్లంవా వల్లయుగ్మంవా మధునా కణయాసహ. 519
సేవితం కామినీకామం దర్పయే ద్రతికౌతుకం,
వీర్యబంధకర శ్శీఘ్రం యోషామదవినాశనమ్. 520
సిందూరం హరవీర్యసంభవమిదం రూక్షాగ్నిమాంద్యాపహం
యక్ష్మాది క్షయ పాండు శోఫ ముదరం గుల్మ ప్రమేహాపహం,
శూల ప్లీహ వినాశనం జ్వరహరం దుష్టవ్రణా న్నాశయే
దర్శాంసి గ్రహణీభగందరగ్రహం ఛర్ది త్రిదోషాపహమ్.

తా. శుద్ధిచేసినరసము రెండుపలములు, శుద్ధిజేసినగంధకము అరపలము, నవా గరము అరకర్షము-ఇటుల వీని నేకముచేసి కజ్జలిగ మర్దించి నిమ్మపండ్లరసముతో నూరి జుకుప్పెలో నునిచి దానిపై నేడుమార్లు చీలమన్ను లేపనముచేసి బాగుగ నెండ నెం చి ఛిద్రముగల వాలుకాయంత్రమునం దునిచి యాగాజుకుప్పెకంఠమువఱకు నిసుక సి ఇష్టదేవతాపూజచేసి ఐదుకుమారికల కన్నంబిడి పొయిమీఁద నునిచి పలుమారు ప్పెను బరీక్షించుచు నెనిమిదియామములు పాకముచేసి సాంగశీతలమున దేవదైత్యులకు ర్లభంబై ఇంగిలీకమువలె నెఱ్ఱగనుండు రససిందూరమును గ్రహింపవలయును. ఇట్టి సిందూరములో ఒకటి, లేక రెండువల్లముల ప్రమాణము నాయారోగోక్తానుపానము ఁడనేని, తేనె, పిప్పలి అనువానితోఁడనేని సేవించిన సర్వరోగముల హరింపంజేయు మేగాక స్త్రీలకు శీఘ్రముగ సంతోషమును జూపించునట్టి వీర్యబంధనకారిగ, స్త్రీ దమును హరింపంజేయునదిగ నుండును. మఱియు పాదరసమువలన జనించిన నీసిందూ ము రూక్ష, అగ్నిమాంద్యము, రాజయక్ష్మ, క్షయము, పాండువు, శోఫ, ఉదరము, ల్మము, ప్రమేహము, శూల, ప్లీహము, జ్వరము, దుష్టవ్రణము, అర్శస్సు, గ్రహణి, ందరము, గ్రహదోషము, వాంతి, త్రిదోషము అనువానిని హరింపంజేయును.

పలమాత్రం రసంశుద్ధం తావన్మాత్రంతు గంధకం,
విధివ త్కజ్జలీం కృత్వా న్యగ్రోధాంకురవారిణా. 522
భావనా త్రితయం దత్వా స్థాలీమధ్యే నిధాపయేత్,
విధాయ కచ్ఛపీయంత్రే వాలుకాభిః ప్రపూరయేత్, 523

మౌక్తికనామములు

ముక్తాఫలం మౌక్తికం శుక్తిజంస్యాత్తారాకారా తౌతిలాముక్తికాచ.
అంభస్సారం శీతలం నీరజంచ నక్షత్రం స్యాద్బిందురత్నంచ రత్నమ్.
(నిఘంటౌ)

తా. ముక్తాఫలము, మౌక్తికము, శుక్తిజము, తారాకారము, తౌతిలము, ముక్తికము, అంభస్సారము, శీతలము, నీరజము, నక్షత్రము, బిందురత్నము, రత్నము అనునవి ముత్తియముల పేళ్లు.

మౌక్తికశుద్ధి

కుండలీఫలజద్రావై ర్భావితం దివసత్రయం,
అథవా తింత్రిణీద్రావై శుద్ధిర్భవతి మౌక్తికమ్. 537

తా. ముత్తియముల తెల్లఉప్పిపండ్లరసముతోఁగాని, చింతపండుపులుసుతోఁగాని (కుంకుడుపండ్లరసముతోఁగాని) మూఁడుభావనలుజేసిన శుద్ధియగును.

మౌక్తికభస్మము

శుద్ధముక్తా ఫలశ్వేతబృహతీఫలజద్రవైః,
భావితం భూపుటే పాచ్యం భస్మశుద్ధం భవిష్యతి. 538

తా. శుద్ధిజేసినముత్తియముల తెల్లములకపండ్లరసముతో భావనజేసి మూఁకుళ్ళలోనునిచి చీలమన్ను లిచ్చి భూపుటంబిడిన శుద్ధభస్మంబగును.

మౌక్తికగుణము

ముక్తాఫలం హిమం సర్వం తీక్ష్ణం చోష్ణం గదాపహం,
దీపనం వస్తి శూలఘ్నం మనోజ్ఞం గ్రహదోషనుత్. 539

తా. ముత్తియములు శీతలముగ, స్వరభంగమును బోకడచునదిగ, తీక్ష్ణముగ, ఉష్ణరోగములం బోకడచునదిగ, అగ్నిదీపనకారిగ, వస్తిశూలను బోకడచునదిగ, మనోజ్ఞముగ, గ్రహదోషమును బోకడచునదిగ నుండును.

అశుద్ధవజ్రగుణము

హృత్పార్శ్వపీడా శ్వయథు కుష్ఠ గుల్మ రుజాకరం
పాండుతాప గురుత్వంచ తస్మాచ్ఛుద్ధంచ మారయేత్. 540

తా. అశుద్ధవజ్రగుణములు హృత్పార్శ్వములయందు నొప్పి, వాపు, కుష్ఠువు, గుల్మము, పాండువు, తాపము, జడత్వము అనువానిని గలుగంజేయును. కావున శుద్ధిజేయఁబడిన వజ్రములనే భస్మము జేయవలయును.

వజ్రభేదములు

శ్వేత రక్తం పీత కృష్ణం ద్విజాద్యా వజ్రజాతయః. 541

తా. తెల్లనివర్ణముగల వజ్రము బ్రాహ్మణజాతియనియు, ఎఱ్ఱనివర్ణముగలవజ్రము క్షత్రియజాతియనియు, పీతవర్ణముగలవజ్రము వైశ్యజాతియనియు, కృష్ణవర్ణముగల వజ్రము శూద్రజాతియనియు జెప్పంబడును.

వజ్రగుణము

రసాయనం భవే ద్విప్ర శ్శుభ్రం సిధ్యష్టదాయకం,
క్షత్రియో మృత్యుజి ద్రక్తం వలీపలితరోగహా, 542
ద్రవ్యకారీ భవే ద్వైశ్యః పీతం దేహస్య జాడ్యకృత్,
కృష్ణ శ్శూద్రో రుజాం హంతి వయస్తంభం కరోతిచ. 543

తా. తెల్లనివర్ణముచే బ్రాహ్మణజాతియని పరంగెడువజ్రము రసాయనములయం దుపయోగించిన అష్టసిద్ధులు గలుగును. రక్తవర్ణముచే క్షత్రియజాతియని పరంగెడు వజ్రము మృత్యువును ముదిమిని, రోగములను హరింపంజేయును. పచ్చనివర్ణముచే వైశ్య జాతియని పరంగెడువజ్రము ద్రవ్యకారిగ నుండుటయేగాక శరీరజాడ్యమును గలుగం జేయును. నల్లనివర్ణముచే శూద్రజాతియని పరంగెడువజ్రము రోగముల బోకడచి వయ స్తంభనమును గలుగంజేయును.

వజ్రజాతినిర్ణయము

పుం స్త్రీ నపుంసకంచేతి లక్షణేనతు లక్షయేత్. 544

తా. వజ్రములయొక్క పురుష, స్త్రీ, నపుంసకభేదముల వానిలక్షణములవలన తెలియవలయును.

వజ్రలక్షణ, తద్గుణముచు

సువృత్తాః ఫలసంపూర్ణా స్తేజోయుక్తా బృహత్తరాః,
పురుషాహీరకా స్తేచ రేఖాబిందువివర్జితాః 545
రేఖాబిందుసమాయుక్తా షడస్రా స్తే స్త్రియస్స్మృతా,
త్రికోణాశ్చ సుదీర్ఘాశ్చ విజ్ఞేయా స్తే నపుంసకాః. 546
*పూర్వపూర్వమిమేశ్రేష్ఠాః పురుషాః రసబంధకాః,
శరీరకాంతిజనకాః భోగదా వజ్రయోషితః. 547
నపుంసకా హ్యల్పవీర్యాః కాముకా స్సత్వవర్జితాః,

తా. గుండ్రముగ, సంపూర్ణమైన పలకలుగలదిగ, తేజోవంతముగ, పెద్దదిగ, రేఖలు, బిందువులులేనిదిగ నుండువజ్రము పురుషజాతియనియు, రేఖలు బిందువులు నితోగూడి ఆరుకోణములుగలదై యుండువజ్రము స్త్రీజాతియనియు, మూడుకోణ

* సర్వేషు పురుషాశ్శ్రేష్ఠా వేధకా రసబంధకాః.

ములుగలదై నిడుపుగనుండువజ్రము నపుంసకజాతియనియు తెలియవలయును. వానిలో ముందుముందుదిశ్రేష్ఠంబు. అందు పురుషవజ్రము రసబంధనకారిగ నుండును. స్త్రీవజ్రము శరీరకాంతికారిగ, భోగకారిగ నుండును. నపుంసకవజ్రము అల్పవీర్యముగలదిగ, కాముకులకు సత్వమును బోకడచునదిగ నుండును.

స్త్రీత్వాదిజాతిభేదమువలన వజ్రోపయోగము

స్త్రీతు స్త్రీణాం ప్రదాతవ్యం క్లీబేక్లీబం తథైవచ. 548
సర్వేషాం సర్వదా యోజ్యః పురుషో బలవత్తరః.

తా. స్త్రీలకు స్త్రీవజ్రమును, నపుంసకులకు నపుంసకవజ్రమును, సమస్తమైన వారికి పురుషవజ్రమును బ్రయోగించిన బలవత్తరంబుగ నుండును.

వజ్రశుద్ధి

గృహీత్వాహ్ని శుభే వజ్రం వ్యాఘ్రీకందే వినిక్షిపేత్. 549
మహిషీవిష్ఠయా లిప్త్వా కరీషాగ్నౌ విపాచయేత్,
నిశాయాంతు చతుర్యామం *నిశాంతే చాశ్వమూత్రకైః. 550
సేవయేత్వాచమేదేవం సప్తరాత్రేణ శుధ్యతి,

తా. వజ్రములను శుభకరమైనదినమున గ్రహించి నేలములకవేరులో నునిచి బఱ్ఱెపేడలో పొదిగి ప్రాతయెరువు, ఉముక అనువానితో రాత్రికాలంబున నాలుగుఝాములు పుటంబిడి ప్రాతఃకాలమున గుఱ్ఱపుమూత్రములో వేసి వానిం దీసికొని మునుపటివలెనే నేలములకవేరులో నునిచి నాలుగుఝాములు రాత్రియందు పుటంబిడి వానిం దీసి గుఱ్ఱపుమూత్రములో వేయవలయును. ఇటుల నేడుదినములు జేసిన వజ్రములు శుద్ధియగును.

కుళుత్థకోద్రవక్వాథై ర్దోలాయంత్రే విపాచయేత్. 551
వ్యాఘ్రీకందగతం వజ్రం సప్తాహాద్విమలం భవేత్,

తా. వజ్రముల నేలములకవేరులోనునిచి ఉలవలు, ఆళ్లు అనువానికషాయములతో డోలాయంత్రమున నేడుదినములువండిన వజ్రములు శుద్ధియగును.

మేఘనాద శమీ శ్యామా శృంగీ మదనకోద్రవమ్. 552
కుళుత్థ వేతసం చాఖుకర్ణీవై సిందువారకం,
ఏతేషాంచ జలక్వాథై ర్వజ్రం జంబీరమధ్యగమ్. 553
డోలాయంత్రే త్ర్యహం పాచ్య మేవం వజ్రం విశుధ్యతి,

తా. వజ్రముల నిమ్మపండులో నునిచి చిట్టి, జమ్మి, తెగడ, కర్కాటకశృంగి,

* యామిన్యంతే.

మ్రంగ, ఆల్లు, ఉలవలు, ప్రబ్బలి, ఎలుకచెవియాకు (అవిసె), వావిలి (ఈశ్వరివేరు) అనువానికషాయములతో డోలాయంత్రమున మూడుదినములు వండిన వజ్రములు శుద్ధియగును.

## వజ్రభస్మము

త్రివర్గనాగవల్ల్యస్తు కార్పాసారూఢమూలికాః. 554
పిష్ట్వా తన్మధ్యగం వజ్రం కృత్వా మూషాం నిరోధయేత్,
పచేద్గజపుటే తచ్చ మ్రియతే సప్తధాపుటైః. 555

తా. మూడేండ్లతమలపాకులు, ప్రత్తివేళ్ళు-వీనిని నూరి ముద్దచేసి దానిలో శుద్ధిచేసిన వజ్రముల నునిచి యాముద్దను *అంధమూషలో బెట్టి ఏడుగజపుటంబు లిడిన వజ్రములు భస్మంబగును.

వజ్రం మత్కుణరక్తేన సప్తధా పరిభావితం,
వేష్టయే ద్బదరీపత్రై రుధ్వా గజపుటే పచేత్. 556
పునర్లేప్యం పునస్తాప్యం సప్తధా మ్రియతేచ తత్,

తా. వజ్రముల నల్లినెత్తురుతో నేడుమార్లు భావనజేసి రేగాకులతో పొదిగి పైన చీలమన్ను లేపనముచేసి మూసలో నునిచి దానిపై చీలమన్నుపూసి ఏడుగజపుటంబు లిడిన వజ్రములు భస్మంబగును.

శుద్ధవజ్రం వజ్రవల్లీరసేన పరిభావితమ్. 557
వజ్రమూషాంతరే క్షిప్త్వా భస్మీభవతి తత్క్షణాత్,

తా. శుద్ధిచేసినవజ్రముల నల్లేరురసములో నొకదినము నానబెట్టి వజ్రమూషలో నునిచి చీలమన్ను లేపనముచేసి ఏరుపిడకలతో గజపుటం బిడిన వజ్రములు భస్మంబగును.

## వజ్రభస్మగుణము

వజ్ర మాయు ర్బలం రూపం దేహసౌఖ్యం కరోతిచ. 558
సేవితం హంతి రోగాంశ్చ మృతవజ్రం న సంశయః,

తా. వజ్రభస్మము ఆయువు, బలము, రూపము, శరీరసౌఖ్యము-వీనిని గలుగంజేయుటయేగాక దానిసేవనవలన సర్వరోగములను నిస్సంశయముగ హరింపంజేయును.

---

* అంధమూషాతుకర్తవ్యా గోస్తనాకారసన్నిభా, సైవఛిద్రాన్వితా మధ్యే గంభీరాసారణోచితా.

వైక్రాంతోత్పత్తి

దేవ్యాహతే మహాదైత్యే మహిషాసురసంజ్ఞికే. 559
అస్యరక్తంతు పతితం యత్రయత్ర స్థితం భువి,
తత్రతత్ర తు వైక్రాంతం వజ్రాకారం మహారసః. 560
వింధ్యస్య దక్షిణావాసే ఉత్తరే వాస్తి పర్వతః,
నికృంతయతి లోహాని తేన వైక్రాంత మిష్యతే. (సిద్ధవిద్యాభూః)

తా. మహిషాసురుఁడను నామముగల మహాదైత్యుని దేవి సంహరించినపుడు వాని రక్తముపడిన స్థలమునందంతట వజ్రాకారమైన వైక్రాంతము జనించెను. ఆవైక్రాంతపర్వతములు వింధ్యపర్వతమునకు దక్షిణభాగమునందు ఉత్తరభాగమునందు నున్నయవి. ఇది లోహముల భేదించునట్టి శక్తిగలవి యగుటంజేసి వైక్రాంత మనంబడును.

వైక్రాంతలక్షణము

అష్టకం చాష్టఫలక షట్కోణ మమృతో గురుః,
శుద్ధ మిశ్రితవర్ణశ్చ యుక్తో వైక్రాంత ఉచ్యతే. 562

తా. ఎనిమిదిభేదములు, ఎనిమిదిపలకలు, ఆరుకోణములు, అమృతగుణము, శుద్ధవర్ణము, బరువు, మిశ్రితవర్ణముగలది వైక్రాంత మనంబడును.

వైక్రాంతభేదములు

శ్వేతో రక్తశ్చ పీతశ్చ నీలః పారావతప్రభః,
శ్యామలః కృష్ణవర్ణశ్చ కర్బూరశ్చాష్టమో మతః. 563

తా. వైక్రాంతము తెలుపు, ఎఱుపు, పసపు, నీలము, పావురపిట్టవర్ణము, శ్యామలవర్ణము, కృష్ణవర్ణము, కర్బూరవర్ణము అనువర్ణభేదములచే ఎనిమిదివిధంబులు.

వైక్రాంతశుద్ధి

త్రిక్షారైః పంచలవణై ర్వసామూత్రామ్లకద్రవైః,
మత్స్యతైలే ఘృతే తైలే ప్యేరండే కాంజికాన్వితే. 564
సప్తాహం డోలికాయంత్రే వ్యాఘ్రీకందగతం పచేత్,
సర్వవర్ణంతు వైక్రాంతం శుద్ధి మాయాతి నిశ్చయమ్. 565

తా. త్రిక్షారములు, పంచలవణములు, వస, సప్తవిధమూత్రములు, అమ్లపంచకము, మత్స్యతైలము, నెయ్యి, నూనె, ఆముదము, కలిపినని డోలాయంత్రమున

చేర్చి నేలములక వేరు తొలచి యందు వైక్రాంతముల నునిచి పండిన సర్వవర్ణములుగల వైక్రాంతములు శుద్ధియగును.

## వైక్రాంతశుద్ధి, తద్భస్మవిధి

వైక్రాంతం వజ్రవచ్ఛోధ్యం నీలం శ్వేతంచ లోహితం,
హయమూత్రేణ తత్సించే త్తప్తం తప్తం త్రిసప్తధా. 566
తత శ్చోత్తరవారుణ్యాః పంచాంగే గోళకే క్షిపేత్,
రుధ్వా మూషాం పుటే పాచ్య ముద్ధృత్య గోళకే పునః. 567
క్షిప్త్వా రుధ్వా పుటే దేవం సప్తధా భస్మతాం వ్రజేత్,

తా. నల్లగగాని, తెల్లగగాని, ఎఱ్ఱగగాని నుండు వైక్రాంతముల వజ్రములవలెనే శుద్ధిజేయవలయును. మఱియు వైక్రాంతము నెఱ్ఱగ నిరువదియొకమారు కాచి గుఱ్ఱపుమూత్రములో నిరువదియొకమారు వేసి చల్లార్చిన శుద్ధియగును. పిదప దుష్టపుసమూలమును ముద్దనూరి దానిలో శుద్ధిచేసిన వైక్రాంతముల నునిచి యాముద్దను మూసలో నునిచి దానిపై మఱియొకమూసను మూసి చీలమన్ను లేపనముచేసి గజపుటంబిడి సాంగశీతలమున దీసి మరల వైక్రాంతముల పైప్రకారమే దుష్టపుముద్దలోనునిచి యాముద్దను మూసలోబెట్టి దానిపై మఱియొకమూసను మూసి చీలమన్ను లేపనముచేసి యేడుగజపుటంబు లిడిన వైక్రాంతము భస్మంబగును.

## వైక్రాంతభస్మము

వైక్రాంతం వజ్రవచ్ఛోధ్యం ధ్మాతం సిక్తంచ మూత్రకే. 568
వజ్రవ న్మృతి మాయాతి వజ్రస్థానే నియోజయేత్,

(సిద్ధవిద్యాభూః)

తా. వైక్రాంతమును వజ్రమువలెనే కొలిమిలో నూది గుఱ్ఱపుమూత్రములో నద్దుటచే శుద్ధిచేసి వజ్రమువలెనే భస్మముచేసి వజ్రస్థానమున నుపయోగింపందగును.

## వైక్రాంతద్రుతి

కేతకీస్వరసం గ్రాహ్యం సైంధవం స్వర్ణపుష్పికా.
ఇంద్రగోపకసంయుక్తం స్వర్ణభాండే వినిక్షిపేత్, 569
సప్తాహం స్వేదయే త్తస్మి న్వైక్రాంతం ద్రవతాం వ్రజేత్. 570

తా. మొగలిచన్నులరసము, సైంధవలవణము, రేలపువ్వు, * ఇంద్రగోపపురుగులు - వీనితోడ వైక్రాంతమునుచేర్చి బంగారుపాత్రలో నునిచి ఏడుదినములు పాకము చేసిన వైక్రాంతము ద్రవించి ద్రుతివలె నగును.

## వైక్రాంతసత్వము

వైక్రాంతం వజ్రకందంచ స్నుహ్యాశ్చ పయసాసహ,
మహిషీనవనీతేన సక్షౌద్రం మర్దయే ద్దినమ్. 571
పూర్వవద్ధమనాత్సత్వ మింద్రగోపనిభం భవేత్,

తా. శుద్ధిచేసినవైక్రాంతము ౧ భాగము, బొంతజెముడుగడ్డచూర్ణము ౧భాగము ఇటుల వీని నేకముచేసి బొంతజెముడుపాలతో నొకదినము, బఱ్ఱెవెన్నతో నొకదినము, తేనెతో నొకదినము మర్దించి బిళ్ళజేసి కోష్టయంత్రమునం దునిచి యూదిన ఇంద్రగోపపురుగులఛాయవలె సత్వము దిగును. (లేక వైక్రాంతము రెండుభాగములు, అభ్రకద్రావక మొకభాగము-ఇటుల వీని నేకముజేసి మర్దించి బిళ్ళజేసి కోష్టయంత్రమునందునిచి యూదిన సత్వము దిగును.)

## వైక్రాంతగుణము

ఆయుఃప్రదంచ రసబంధకరంచ వృష్యం
వహ్నిప్రదం నిఖిలరోగమదాపహారీ,
దోషత్రయాపనయనం విషదోషహారి
వైక్రాంతకం ఖలు వపుర్బలలోహకారీ. 572

తా. వైక్రాంతము ఆయుర్వృద్ధిని, రసబంధనమును, వీర్యవృద్ధిని, అగ్నిదీపనమును గలుగంజేసి సర్వరోగ త్రిదోష విషదోషముల హరింపజేయునదిగ, శరీరబలకారిగ, లోహవేధనకారిగ నుండును.

## వైడూర్యనామములు

వైడూర్యం కేతురక్తంచ కైతవం వాలవాయజం,
ప్రావృష్యం భద్రలోహంచ భద్రశబ్దాంకుర స్తథా. 573

తా. వైడూర్యము, కేతురక్తము, కైతవము, వాలవాయజము, ప్రావృష్యము, భద్రలోహము, భద్రశబ్దాంకురము - ఇవి వైడూర్యనామములు.

---

* ఇంద్రగోపపురుగులు అనఁగా ఆరుద్రపురుగులు.

### వైడూర్యశుద్ధి

వైడూర్యం వాజిమూత్రేణ కూశ్మాండస్వరసేనచ,
భావితం ద్విదినంచాథ శుద్ధిర్భవతి నిశ్చయమ్. 574

తా. వైడూర్యము, గుఱ్ఱపుమూత్రములో నొకదినము, గుమ్మడుపండురసములో నొకదినము నానబెట్టిన శుద్ధియగును.

### వైడూర్యభస్మము

తద్వైడూర్యం శిలాభేసిరసేన పరిభావితం,
విశ్వకర్మపుటే దగ్ధ్వా తీవ్రాగ్నౌ వజ్రమూషయా. 575
తతో గజపుటే పాచ్యం భస్మీభవతి నిశ్చయం,

తా. శుద్ధిచేసిన వైడూర్యములను *పిండికొండవేళ్ళరసముతో భావనజేసి కొలిమిలో నూది వజ్రమూషలో నునిచి దానిపై మఱియొకమూసను మూసి చీలమన్ను లేపనముజేసి గజపుటం బిడిన వైడూర్యము భస్మంబగును.

### వైడూర్యభస్మగుణము

వైడూర్యం వజ్రతుల్యంతు సర్వారోగాన్వ్యపోహతి. 576

తా. వైడూర్యము వజ్రతుల్యముగ, సర్వరోగములహరింపజేయునదిగనుండును.

### నీలశుద్ధి

ఖరమూత్రాంతరో క్షిప్త్వా నీలం తీవ్రాతపే క్షిపేత్,
భావితం దినమేకంచ నీలం శుద్ధం భవిష్యతి. 577

తా. నీలముల గాడిదెమూత్రములోవైచి యొకదినము తీక్ష్ణమైనయెండను భావనజేసిన శుద్ధియగును

### నీలభస్మము

తన్నీలం లక్షితం జీవాద్రవే భావ్యం త్రియామకం,
విశ్వకర్మపుటే దగ్ధ్వా భస్మీభవతి తత్క్షణాత్. 578

తా. శుద్ధిచేసిన నీలముల అక్షీపంజాకురసములో మూడుఝాములు నానబెట్టి వజ్రమూషలోపోసి కొలిమిలోనునిచి యూదిన తత్క్షణమున నీలములు భస్మంబగును.

### నీలగుణము

నీలం శీతం గురు స్నిగ్ధం మధురం పిత్తనాశనమ్. 579

---

* ఇదే పిండిబండ యనియు చెప్పంబడును.

తా. జొల్లుకారుట, ఓకరవచ్చునట్లుండుట, ఒళ్ళు జడముగ నుండుట, అరుచి, తంద్ర, ఆలస్యము, అన్నము అరగకుండుట, శరీరము బరువుగా నుండుట, అధికముగా మూత్రోత్సర్జనంబగుట - ఈలక్షణములుగలది ఆమజ్వరమని (అనఁగా అపక్వజ్వరమని) తెలియవలయు. దీనియందు ఔషధము నివ్వఁజనదు.

జ్వరోపద్రవతీక్ష్ణత్వ మగ్లానిర్బహుమూత్రతా,
సప్రవృత్తిర్నవిడ్జీర్ణం నక్షుత్సామజ్వరాకృతిః. (బాహటే) 252

తా. జ్వరమునకు చెప్పియుండు శ్వాస కాస మొదలగు పదియుపద్రవములు తీక్ష్ణముగా నుండుట, బడలిక లేకుండుట, మూత్రము అధికముగా బైలువెడలుట, ప్రవృత్తి లేకపోవుట, మలము జీర్ణము కాకుండుట, ఆఁకలి లేకుండుట-ఈలక్షణములు ఆమజ్వరమునకు కలిగియుండును.

### పచ్యమాన జ్వరలక్షణము

జ్వరవేగోధికాత్తృష్ణా ప్రలాపశ్శ్వసనం భ్రమః,
*మలప్రవృత్తిరిత్ క్లేశః పచ్యమానస్యలక్షణమ్. (పూజ్యపాదీయే)

తా. జ్వరవేగము, కడుదప్పి, ప్రలాపము, శ్వాస, భ్రమ, మలోత్సర్జనము, ఓకరవచ్చునట్లుండుట - ఈలక్షణములు గలది పచ్యమానజ్వరమని (అనఁగా పాకోన్ముఖమైన జ్వరమని) తెలియవలయు.

### నిరామజ్వరలక్షణము

క్షుత్క్షామతా లఘుత్వంచ గాత్రాణాం జ్వరమార్దవమ్,
దోషప్రవృత్తిరుత్సాహో నిరామజ్వరలక్షణమ్.(మాధవనిదానే)

తా. ఆఁకలి, శరీరము కృశించుట, అంగములు లఘువుగ నుండుట, మందజ్వరము, వాతము అధోముఖం బగుట, మనస్సంతోషము - ఈలక్షణములు గలది నిరామజ్వరమని (అనఁగా పక్వమైనజ్వర మని) తెలియవలయు.

### ఆమాదిజ్వరకాలప్రమాణము

ఆమజ్వరస్త్రిరాత్రంస్యా త్సప్తాహం పచ్యమానతా,
దోషహీనో దశాహోర్ధ్వం నిరామమితికథ్యతే. 255

తా. జ్వరమునకు మూఁడుదినములు ఆమావస్థ యనియు, నాలుగవదినము మొదలు ఏడవదినమువఱకు పచ్యమానావస్థ యనియు, ఏడవదినము మొదలు పదిదినములవఱకు దోషనశ్యమానావస్థ యనియు, దానికి పిదప నిరామావస్థ యనియు తెలియవలయు.

---

* మలప్రవృత్తేరుత్ క్లేశః—,మలము కడుకష్టముమీఁద వెడలుట,

తా. నీలము శీతలముగ, జడముగ, స్నిగ్ధముగ, మధురముగ, పిత్తనాశనకారిగ నుండును.

### పుష్పరాగశుద్ధి

పుష్పరాగం ఛాగమూత్రై ర్భావ్యం శుద్ధం భవిష్యతి,
తత్పుష్పరాగం పాషాణభేదిద్రావేణ భావితమ్. 580
విశ్వాకర్మపుటే దగ్ధ్వా భస్మీభవతి తత్క్షణాత్,

తా. పుష్పరాగముల మేకపంచితములో నొకరుఝాము నానబెట్టిన శుద్ధియగును. శుద్ధిజేయఁబడిన పుష్పరాగముల కొమ్మనబిండియూకురసముతో భావనజేసి మూకుళ్ళలో నునిచి చీలమన్నులిచ్చి కొలిమిలో నూదిన తత్క్షణమున భస్మంబగును.

### పుష్పరాగగుణము

పుష్పరాగం పుష్టికరం శ్లేష్మలం గురు శీతలమ్. 581

తా. పుష్పరాగము పుష్టికారిగ, శ్లేష్మకారిగ, జడముగ, శీతలకారిగ నుండును.

### మరకతనామములు

స్మృతో జాత్యా మరకతో రౌహిణేయోఽనురక్తకం,
హరిన్మణిశ్చ సౌవర్ణం బుధరత్నాంశుకధ్వజమ్. 582
గరళాయుర్వాయువశం గురుదం రుద్రసమ్మతం, (నిఘంటౌ)

తా. మరకతము, రౌహిణేయము, అనురక్తము, హరిన్మణి, సౌవర్ణము, బుధరత్నము, అంశుకధ్వజము, గరళాయువు, వాయువశము, గురుదము, రుద్రసమ్మతము అనునవి మరకతనామంబులు.

### మరకతశుద్ధి

క్షిప్త్వా విదారికం దాంతఃపుటే కౌక్కుటసంజ్ఞికే. 583
పాచితంచాథ తం నీత్వా భవే న్మరకతం శుచిః,

తా. పచ్చలను తొలిచిన నేలగుమ్ముడుగడ్డలో నునిచి దానిపై చీలమన్ను వేసి కుక్కుటపుటంబిడి స్వాంగశీతలమునదీసిన శుద్ధియగును.

### మరకతభస్మము

తతో మరకతం క్షుద్రారసేన పరికల్పయేత్. 584
పాషాణభేదిద్రావేణ మర్దితంచ శరావకే,
పుటమేకం తతః పాచ్యం భస్మీభవతి తద్ధ్రువమ్. 585

తా. శుద్ధిచేసినపచ్చల ప్రాకుడురసములో భావనజేసి కొండపిండివేళ్ళరసముతో మర్దించి బిళ్ళజేసి యెండించి మూకుళ్ళతో నునిచి చీలమన్నుపూసి గజపుటంబిడిన భస్మంబగును.

మరకతగుణము

హారితం విశదం కాంతం లఘు గ్రాహి త్రిదోషజిత్. 586

తా. పచ్చలు పరిశుద్ధముగ, మనోహరముగ, లఘువుగ, మలబద్ధకారిగ, త్రిదోషములను బోకడచునదిగ నుండును.

గోమేధికశుద్ధి

తతో గోమేధికం వాజిమూత్రే భావ్యం దినత్రయం,
తతో విదారిస్వరసే భావ్యం శుద్ధిర్భవిష్యతి. 587

తా. గోమేధికమును గుఱ్ఱపుమూత్రములో మూడుదినములు నానబెట్టి పిదప నేలగుమ్ముడుగడ్డరసములో నానబెట్టిన శుద్ధియగును.

గోమేధికభస్మము

శుద్ధగోమేధికం కృష్ణధుత్తూరద్రావ భావితం,
విశ్వకర్మపుటే దగ్ధ్వా త్రివారం భస్మచాప్నుయాత్. 588

తా. శుద్ధిజేసిన గోమేధికముల నల్లయుమ్మెత్తాకురసములో మూడుమార్లు* భావనజేసి కొలిమిలో నునిచి యూదిన భస్మంబగును.

గోమేధికభస్మగుణము

గోమేధికం కఫహరం దీపనం బలవర్ధనం,

తా. గోమేధికము కఫమును హరింపజేయుటయేగాక అగ్నిదీపనమును బలమును గలుగజేయును.

ప్రవాళనామములు

ప్రవాళోఽంగారకమణి ర్విద్రుమో బోధిపల్లవః (నిఘంటౌ) 589

తా. ప్రవాళము, అంగారకమణి, విద్రుమము, బోధిపల్లవము అనునవి ప్రవాళనామంబులు.

ప్రవాళశుద్ధి

జంబీరనీరాంతరేణభావితం యామమాత్రకం,
ఉష్ణోదకే క్షాళయిత్వా శుద్ధం భవతి విద్రుమమ్. 590

---

* భావన యన నానబెట్టుట.

తా. పగడముల నిమ్మపండ్లరసములో నొకదినము నానబెట్టి యుష్ణోదకముతో గడిగిన శుద్ధియగును.

ప్రవాళభస్మము

తద్విద్రుమం రవిక్షీరై ర్భావితం దివసత్రయం,
ఏవం గజపుటే పాచ్యం భస్మీభవతి తత్క్షణాత్. 59

తా. శుద్ధిచేసినపగడములను జిల్లేడుపాలతో మూడుదినములు నానబెట్టి మూళ్ళలోబోసి చీలమన్నులిచ్చి గజపుటంబిడిన తత్ క్షణమున భస్మంబగును.

ప్రవాళగుణము

ప్రవాళంరక్తపిత్తఘ్నం రక్తాతీసారనాశనం,
ప్రదరం రక్తశూలఘ్నం గ్రాహి పైత్తవినాశనమ్. 59

తా. పగడము రక్తపిత్త, రక్తాతిసార, ప్రదర, రక్తశూల పైత్యరోగముల హరింప జేయుటయేగాక మలబద్ధకారిగనుండును. (పగడభస్మములో మామిడిచెక్కరసము, మూ నూనెబొట్లు గలిపి సేవించిన రక్తకుసుమములును, ఆరెచెక్కరసము, పంచదార, జీలక గలిపి సేవించిన రక్తకుసుమములును, చింతచిగురురసము, ఏకుమిరియములచూర్ణము గ సేవించిన తెల్లచీరెలును, ఆరెచెక్కరసముగలిపిసేవించిన తెల్లచీరెలును హరించును. పథ్యా చప్పిడి.)

రోగానుక్రమణిక

ఆమదోష జ్వరే చాతిసారేచ గ్రహణీకృశే,
క్రిమిదోషే రక్తపిత్తేఽసృగ్దరే కామిలా హలీ. 59
పాండురోగే క్షయే గుల్మే జఠరార్శాంసి విద్రధిః,
మూత్రకృఛ్రాశ్మరీ మేహే వృద్ధ్యామపృష్ఠపదంశకే. 59
శ్వాసకాసేచ హిక్కాయాం ఛర్దౌ తృష్ణా హృదామయే,
శూలోదావర్త ఆనాహే మారుతే వాతశోణితమ్. 59
కుష్ఠే విసర్పి శోభేచ శ్లీపదేచ మదాత్యయే,
తునశ్చిలక సోమేచ కర్ణనాసా గళస్థుశే. 59
ముఖరోగే శిరోరోగే నయనామయకే వ్రణే,
వ్రణేచ వివిధేచైవ భగంధరగదే తథా. 59

గ్రంథ్యర్బుదగదే క్షుద్రే స్ఫోటకే గుహ్యకే గదే,
వంధ్యాదోషే గర్భదోషే గర్భిణీ సకలామయే. 598
ఆమోదరే ప్లీహరోగే స్థౌల్యరోగేచ మర్కటీ,
విషూచ్యాం వహ్నిమాంద్యే చాజీర్ణే వై కాయదోషజే. 599
జ్వరాశ్చ సప్తదోషాశ్చ సన్నిపాతా స్త్రయోదశ,
సూతికా బాలరోగాణా మున్మాదాపస్మృతా వపి. 600
మద మూర్ఛా గ్రహాగదే సన్న్యాసకగదేపిచ,
ఇంద్రలుప్తే వలీరోగే ఛాయారోగే ఫిరంగికే 601
స్వరభంగామయే లూతే చామ్లపిత్తగదేపిచ,
తథావరణపైత్తేచ విశ్వే భుజగదంశనే. 602
మూషకాది విషాద్రోగే కృత్రిమాకృత్రిమే విషే,
చికిత్సాశ్చాపి పథ్యాని బీజపాషాణహేతుకే. 603
పరిపాక స్సర్వరోగే పథ్యాపథ్యం చికిత్సితం,
రసలోహవిధిర్యత్ర రోగవర్గో యథాక్రమమ్. 604
అసాధ్యసాధ్యరోగాశ్చ ప్రోక్తా స్సత్యం న సంశయః,
శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః 605
అవోచం నృపరాజీయ మహం వైద్యశిఖామణిః,
పంచవింశ త్ప్రకరణై ర్యుక్తం విద్వన్మనోహరమ్. 606
కలౌ హితకరం నృణాం సర్వరోగనివారకమ్.

తా. ఆమాతిసారము, జ్వరాతిసారము, అతిసారము, గ్రహణి, కార్శ్యరోగము, కృమిరోగము, రక్తపిత్తము, అసృగ్దరము, కామిల, హలీమకము, పాండువు, క్షయము, గుల్మము, జఠరరోగము, అర్శస్సు, విద్రధి, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి ప్రమేహము, వృద్ధి రోగము, ఉపదంశము, శ్వాసము, కాసము, మొదలగుశ్లేష్మరోగములు, ఎక్కిళ్ళు, ఛర్ది, తృష్ణ, హృద్రోగము, శూల, ఉదావర్తము, ఆనాహము, వాతరోగము, రక్తవాతము, కుష్ఠువు, విసర్పి, శోఫ, శ్లీపదము, మదాత్యయము, తుని, ప్రతితుని, అష్ఠీలా, ప్రత్యష్ఠీలా, సోమరోగము, కర్ణరోగము, నాసారోగము, గండమాల (గళరోగము), ముఖరోగము, శిరోరోగము, నేత్రరోగము, మండి, డొక్కమండి, వదనదౌర్గంధ్యము, దంతరోగము, చనుమాదలు, జంతుకవ్రణము, మురికినొన్నారి, నూతిపుండు, కరపాదరోగము, అస్థిస్రావము, మొదలగు నానావ్రణములు, భగందరము, గ్రంథి, అర్బుదము, క్షుద్ర రోగము, కాలస్ఫోట, విషస్ఫోటకములు, ఆస్యస్ఫోటకము, గుహ్యరోగము, వంధ్యాదోషము, గర్భదోషము, గర్భిణీరోగములు, ఆమరోగము, ఉదరము, ప్లీహము (జలకూ

ర్శ్మము), స్థౌల్యరోగము, మర్కటీరోగములు, విషూచి, అగ్నిమాంద్యము, అజీర్ణము, కాయదోషము, జ్వరములు, సప్తవిధదోషములు (అష్టధాతునిదానము, మూత్రపరీక్ష), త్రయోదశసన్నిలు, ప్రసూతిరోగము, బాలరోగము, ఉన్మాదము, అపస్మారము, మదము, మూర్ఛ, గ్రహదోషము, సన్యాసకము, ఇంద్రలుప్తము, వలీరోగము, ఛాయారోగము, ఫిరంగిరోగము, స్వరభంగము, లూతవ్రణము, ఆమ్లపిత్తము, ఆవరణపిత్తము, సర్పవిషములు, ఎలుకవిషము, స్థావరజంగమవిషములు, అశుద్ధపారద, పాషాణదోషములు, రసలోహ శుధ్యాదులు, నవలోహభస్మతద్గుణంబులు, సర్వరోగపరిపాకంబులు, రోగసాధ్యాసాధ్యంబులు, చికిత్సానుపాన పథ్యాపథ్యంబులు మొదలగువానినన్నిటిని గలిగియుండునటుల క్షీరసముద్రమునకు చంద్రుఁడై వైద్యశిఖామణియను బిరుదుచే వాసికెక్కిన బసవరాజను నేను కలియుగమున నరులకు జనించు సర్వరోగనివారణార్థంబై యిరువదియైదు ప్రకరణంబులుగల వృషరాజీయ మనునీగ్రంథమును సత్యముగ, నిస్సంశయముగ, పండిత మనోహ్లాదకరముగ రచియించినాఁడను.

ఇతి శ్రీనీలకంఠచరణారవిందతీర్థప్రసాద పారావారభోగవిహారపారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయశారాధ్య రామదేశికశిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్రపవిత్ర
కవితాచాతురీధురీణ వైద్యజనశిరోభూషణ
శ్రీబసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే రసగంధకాది ద్రవ్యశుద్ధి,
ద్వాదశలోహశుద్ధి, తద్భస్మసిందూర
ద్రుతిక్రమ తత్సేవనానుపానమృతలోహామృతీకరణ
హేమాదిపరీక్షా క్రమాభ్రకశుద్ధి
తద్భస్మనిశ్చంద్రితామృతీకరణ నవరత్నశుద్ధి
తద్భస్మక్రమ తత్సేవనాగుణాదియుక్తం
పంచవింశప్రకరణమ్.

బసవరాజీయనామకవైద్యశాస్త్రం సంపూర్ణమ్.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.
P. I. Card Q. H. No. Ms. 22. 25-3-19..

## త్వగ్గతాది జ్వరలక్షణము

త్వగంతర్గతరక్తాస్థిమాంసధాతుగతజ్వరమ్,
ప్రవక్ష్యతే తన్నిదానం సువిజ్ఞేయమిదం బుధైః. 25(
కించిన్మూత్రం జ్వరోదాహో నాడీ మందగతి ర్భవేత్,
కించిచ్ఛిరోవ్యథా జ్ఞేయం త్వగ్గతజ్వరలక్షణమ్.(మాధవనిదానే) 25'

తా. చర్మగత అంతర్గత రక్తగత అస్థిగత మాంసధాతుగత జ్వరనిజదానంబు వచించెద.—స్వల్పముగా మూత్రము వెడలుట, జ్వరము, దాహము, నాడి మందము నడచుట, ఒకింత తలనొచ్చుట-ఈలక్షణములు గలది త్వగ్గతజ్వర మని తెలియవలయు.

## అంతర్గతజ్వరలక్షణము

అంతర్దాహో బహిశ్శీతం కౌటిల్యం సంతతజ్వరమ్,
క్షయః పాండుశ్చ బధిర మంతర్గతస్యలక్షణమ్.(ఆయుర్వేదే) 25(

తా. కడుపులో మండుట, వెలపట శీతలముగ నుండుట, కుటిలముగ నుండుట, ఎ[ల్ల]పుడు జ్వరము, శరీరము క్షయించి పాండురవర్ణముగ నుండుట, చెవుడు-ఈలక్షణముల గలది అంతర్గతజ్వర మని తెలియవలయు.

## రక్తగతజ్వరలక్షణము

జ్వరోష్ణతా విదాహశ్చ మదాలస్య మతిభ్రమాః,
అంగవైకల్యమూర్ఛాచజ్వరోరక్తగతః స్మృతః. (మాధవనిదానే) 25(

తా. జ్వరోష్ణము, విదాహము, మదించినవానివలె నుండుట, ఆలస్యము, చి[త్త]భ్రమ, అంగములు నొచ్చుట, మూర్ఛ-ఈలక్షణములు గలది రక్తగతజ్వర మని తెలియవలయు.

రక్తనిష్ఠీవనం దాహో మోహశ్ఛర్దనవిభ్రమా,
ప్రలాపః పిటకా తృష్ణా రక్తప్రాప్తే జ్వరే నృణామ్. 26(

తా. ఉమియునపుడు రక్తముపడుట, దాహము, మోహము, వమనము, భ్రాంతి వదరుట, పిటికలు, దప్పి-ఈలక్షణములు గలది రక్తగతజ్వర మని తెలియవలయు.

## మాంసగతజ్వరలక్షణము

అతితీవ్రజ్వరశ్శ్వాస స్స్వేదస్తృష్ణాంగకవ్యథా,
తంద్రావిదాహపులకమూర్ఛామాంసగతజ్వరే.(సిద్ధవిద్యాభూః) 261

తా. కడుతీవ్రజ్వరము, శ్వాస, చెమట, దప్పి, అంగములయందునొప్పి, తంద్ర, హము, శరీరము పులకరించుట, మూర్ఛ — ఈలక్షణములు గలది మాంసగతజ్వర మని యవలయు.

పిండికోద్వేష్టనం తృష్ణా సృష్టమూత్రపురీషతా,
ఊష్మాంతర్దాహవిక్షేపౌ గ్లానిస్స్యాన్మాంసగేజ్వరే. (మతాంతరే)262

తా. పిక్కలయందు దండముచేఁ గొట్టఁబడినటుల వేదన, దప్పి, అధికముగా త్రపురీషములు వెడలుట, వెలుపట నూష్మము, కడుపులో మంట, హస్తపాదములు ంచుట, గ్లాని - ఈలక్షణములు గలది మాంసగతజ్వర మని తెలియవలయు.

## అస్థిగతజ్వరలక్షణము

పరిభ్రమశ్శోకవిదాహపూర్వం క్రోధోద్భవో గాత్రసకంపతృష్ణా
విషార్తిమజ్జారసరక్తమాంసజ్వరం కృశార్తిశ్చ శిరోర్తిశోషౌ. 263
రాత్రౌ క్వచిత్స్వేదరుజాజ్వరం స్యాదజీర్ణమందోష్ణపురీషబంధమ్,
బలక్షయోదోషమహాగదశ్చ ప్రారబ్ధజం హ్యస్థిగతజ్వరంస్యాత్.264
(ఆయుర్వేదే)

తా. శరీరము పరిభ్రమించుట, దుఃఖము, శరీరము విదాహించుట, కోపము, శరీ వణకుట, దప్పి, నోరు ఎండుట, మజ్జా రస మాంస రక్తగత జ్వరములయందలి లు, శరీరము కృశించుట, తల నొచ్చుట, శరీరము శోషించుట, ఒకదినమురాత్రి టజ్వరము, అజీర్ణము, సన్నపుజ్వరము, మలము వెడలకుండుట, బలము క్షయించుట, జ్వరము- ఈలక్షణములు గలది అస్థిగతజ్వర మని తెలియవలయు. ఇది. ప్రారబ్ధము జనించు.

భేదోస్థ్నాంకుంచనంశ్వాసో విరేకశ్ఛర్దిరేవచ,
విక్షేపణం చ గాత్రాణామేతదస్థిగతే జ్వరే. (మతాంతరే) 265

తా. ఎముకలు విరిగినటుల నొచ్చుట, ఎముకలు సంకోచమును జెందుట, శ్వాసము, సనము, ఓకర, అవయవములు పీడిన ట్టుండుట - ఈలక్షణములు గలది అస్థిగత జ్వర తెలియవలయు.

## కాలజ్వరలక్షణము

దాహస్వేదహిమోద్భవం స్వరమితం హ్యాచూచ్ఛలమానా...
మూర్ఛాశోషశిరోవ్యథాచ జఠరే హంత్యాశుకాలజ... 266
(వ...నిదానే)

తా. దాహము, చెమట, చలిపెట్టుట, స్వరము హీన మగుట, హృదయము శూలిం చుట, కడుపుబ్బరము, మూర్ఛ, శోష, తల కడుపు నొచ్చుట - ఈలక్షణములు గలది కాలజ్వర మని తెలియవలయు. ఇది మనుజుని కడుశీఘ్రముగా జంపును.

చర్మగతజ్వరకాలప్రమాణము

జ్వరం చర్మగతం యస్య సర్వాంగం శీతమాశ్రయేత్,
దశరాత్రవినిర్ముక్తో నరో జీవే న్ననిశ్చితమ్. (అశ్వినీనిఘంటౌ) 267

తా. చర్మగతజ్వరమునందు సర్వాంగములు శీతలముగా నుండును. అది పదిదినములలో నివర్తించినను నివర్తించును, లేక చంపినను చంపును. (పదిదినములకు పిదప జీవించియుండిన చికిత్స చేయవలయు.)

రక్తగతజ్వరకాలప్రమాణము

దేహం పాండురవర్ణంచ రక్తశ్లేష్మవిజృంభణమ్,
నవజ్వరేచ సంతాపః కాలజ్ఞానేన భాషితమ్. (బాహటే) 268

తా. రక్తగతజ్వరమునందు శరీరమునకు పాండురవర్ణము రక్తయుక్త *శ్లేష్మస్రావము తొమ్మిదిదినములలో శరీరతాపము కలుగునని కాలజ్ఞానుఁడు వచించె. (ఈజ్వర రోగి తొమ్మిదిదినములకు వైవస్వతనిలయంబునకేగును. అటుగాక దైవికమువలన జీవించియుండిన చికిత్స చేయవలయు.)

మాంసగతజ్వరకాలప్రమాణము

జ్వరం మాంసగతం యస్య సర్వాంగే కృశతా భవేత్,
ద్వాదశే జాయతే మృత్యుః కాలజ్ఞానేన భాషితమ్. 269
(మాధవనిదానే)

తా. మాంసగతజ్వరమునందు సర్వాంగములు కృశించి దిగబారినట్టుండిన రోగి పన్నెండుదినములలో యమాలయంబున కేగు నని కాలజ్ఞానుఁడు వచించె. (అటుగాక దైవికమువలన జీవించియుండిన చికిత్స చేయవలయు.)

రసగతజ్వరలక్షణము

గురుతా హృదయోత్క్లేశ స్సదనం ఛర్ద్యరోచకౌ,
రసస్థే తు జ్వరే లింగం దైన్యంచాస్యోపజాయతే.(మాధవనిదానే)

తా. శరీరము జడముగ నుండుట, వాంతివచ్చునటు లుండుట, గ్లాని, ఓకర, అన్న ద్వేషము, మనోవ్యథ-ఈలక్షణములు గలది రసగతజ్వర మని తెలియవలయు.

---

* శ్లేష్మస్రావ మనఁగా - తెమడ వెడలుట.

రసగతజ్వరకాలప్రమాణము

జ్వరం రసగతం యస్య సర్వాంగే జ్వరశైత్యతః,
చతుర్థే జాయతే మృత్యుః కాలజ్ఞానేన భాషితమ్. (చరకే) 271

తా. రసగతజ్వరమునందు సర్వాంగములయందు జ్వరము చలువబుట్టినయెడల నాలుగుదినములలో యమమందిరమున కేగు నని కాలజ్ఞానుఁడు వచించె. (అటుగాక దైవికమువలన జీవించియుండిన చికిత్స చేయవలయు.)

ఆగంతుకజ్వరనిదానము

ఆగంతురభిఘాతాభిషంగశాపాభిచారతః,
చతుర్ధాత్రక్షతచ్ఛేదదాహాద్యైరభిఘాతజః. 272

తా. అభిఘాతము, తిరస్కారము, శాపము, అభిచారము-వీనివలన నాలుగువిధము లగు ఆగంతుకజ్వరము జనించు. అం దభిఘాతజ్వరము - గాయము నరుకుదెబ్బ దాహ క్రియలు మొదలగువానివలన జనించును.

అభిన్యాసజ్వరలక్షణము

ప్రహాసో నర్తనం గానం ఘుర్ఘజృంభాశిరోరుజాః,
భైషజ్యేప్యతివృద్ధిస్స్యాద్రక్తాక్షం రోమహర్షణమ్,
ఏభిస్తు లక్షణైర్జ్ఞేయా హ్యభిన్యాసజ్వరాకృతిః. 273

తా. నగుట, ఆడుట, పాడుట, బొబ్బరించుట, ఆవలించుట, తలనొచ్చుట, ఔషధసేవనచే జ్వరము హెచ్చుట, కన్నులు ఎఱ్ఱనై యుండుట, గగుర్పొడుచుట- ఈలక్షణములుగలది అభిన్యాసజ్వర మని తెలియవలయు.

కామజ్వరలక్షణము

అవస్తుకాలేపి విమూఢబుద్ధి స్తేజోవిహీనత్వ మనంగతాపః,
నిరన్నకాంక్షాపి వివర్ణతాచ భవంతి కామజ్వరతాపితస్య. 274

తా. స్త్రీపురుషుల కన్యోన్యవిరహమువలన మూఢబుద్ధి, తేజోవిహీనము, మన్మథ తాపము, అన్నమునం దిష్టములేకుండుట, శరీరము వివర్ణముగనుండుట - ఈలక్షణములు గలది కామజ్వర మని తెలియవలయు.

కామజే చిత్తవిభ్రంశ స్తంద్రాలస్య మభోజనం,
హృదయే వేదనాచాస్య గాత్రంచ పరిశుష్యతి.(మాధవనిదానే)

తా. చిత్తభ్రమ, తంద్ర, ఆలస్యము, అన్నమునం దిచ్ఛ లేకుండుట, హృదయమున వేదన, శరీరము శుష్కించుట - ఈలక్షణములు గలది కామజ్వర మని తెలియవలయు.

కామాన్మోహారుచిర్దాహో హ్రీనిద్రాధీధృతిక్షయః. (బాహటే)

తా. కామజ్వరమునందు అరుచి మోహము సర్వాంగతాపము ఇవి కలుగుట, లజ్జ నిద్ర బుద్ధి ధైర్యము ఇవి లేకుండుట-ఈలక్షణములు కలుగును.

అసాధ్యజ్వరలక్షణము

జ్వరో నిహంతి రక్తాక్షం క్షీణాంగం హృది శూలినమ్,
సదా శ్వాసశ్చ స్వేదశ్చ శక్తిహీనం హతానలమ్. 277

తా. నేత్రము లెఱ్ఱనై యుండుట, శరీరము కృశించుట, ఱొమ్మునందు శూల, ఎల్లపుడు శ్వాసము, ఎల్లపుడు చెమట, సత్వము అగ్నిదీపనము లేకుండుట - ఈలక్షణము గల జ్వరరోగి యమాలయంబున కేగు.

హేతుభి ర్బహుభి ర్జాతో బలవద్భి ర్బహులక్షణః,
జ్వరః ప్రాణాంతకృద్యశ్చ శీఘ్రమింద్రియనాశనః. 278

తా. అనేక కారణములతో జనించి బలక్షయమును గలుగఁ జేసి స్వేదాద్యనేక దుర్లక్షణములతోఁగూడి శీఘ్రముగా ఇంద్రియశక్తిని నశింపఁజేయుచుండు జ్వరము ప్రాణాంతక మగు.

జ్వరః క్షీణస్య శూన్యస్య గంభీరో దైర్ఘ్యరాత్రికః,
అసాధ్యో బలవాన్ యశ్చ కేశసీమంతకృజ్జ్వరః. (మాధవనిదానే)

తా. శరీరము కృశించినవానికిఁగాని లేక శరీరము ఉబ్బియుండువానికిఁగాని గలిగినజ్వరము, వాతాదినాడీగమనము తెలియఁగుట కశక్యముగ నేని, అంతర్వేగముగలదిగ నేని నుండుజ్వరము, దీర్ఘకాలమువఱకు విడువక వేధింపుచుండుజ్వరము, బలవత్తరముగా నుండుజ్వరము, అకస్మాత్తుగా తలవెంట్రుకలను పాపటగా దీసికొనువానియొక్క జ్వరము ఇవి అసాధ్యంబులు.

ఆరంభాద్విషమో యస్య యస్య వా దైర్ఘ్యరాత్రికః,
క్షీణస్యానిమిషాక్షస్య గంభీరో హంతి మానవమ్. 280
విసంజ్ఞస్తామ్యతే యస్తు శేతే నిపతితోపివా,
శీతార్దితోంతరుష్ణశ్చ జ్వరేణ మ్రియతే నరః. (అన్యశాస్త్రే) 281

తా. ఆరంభము మొదలు విషమముగా జనించినజ్వరము, అనేకదినములు విడువక వేధింపుచుండుజ్వరము, కృశించినవానికి జనించినజ్వరము, నిక్కబొడిచికొనియుండు నేత్రములుగలవానికి అనువర్తించియుండు గంభీరజ్వరము - ఇవి మనుజునిఁ జంపును. మఱియు దిగ్భ్రమచెంది బడలియుండుజ్వరితుఁడు, శయనించి మరల లేచుటకశక్తుఁడుగనుండు జ్వరితుఁడు, వెలుపట శీతబాధ లోనజ్వరవేగము గల జ్వరితుఁడు-వీరు మరణమును జెందెదరు.

యో హృష్టరోమారక్తాక్షో హృదిసంఘాతశూలవాన్,
వక్త్రేణ చైవోచ్ఛ్వసితి తం జ్వరో హంతి మానవమ్. 282
హిక్కాశ్వాసతృషాయుక్తం మూఢం విభ్రాంతలోచనమ్,
సంతతోచ్ఛ్వాసనం క్షీణం నరం క్షపయతి జ్వరః. 283
హతప్రభేంద్రియం క్షామ మరోచకనిపీడితమ్,
గంభీరతీక్ష్ణవేగార్త జ్వరితం పరివర్జయేత్. (నిత్యనాథీయే) 284

తా. రోమాంచము ఎఱ్ఱనేత్రములు హృదయమునందు అష్ఠీలికాది వాతసమూహతుల్యమైన శూలగలవాఁడై ముఖమువలన శ్వాసము విడుచుచుండెడిజ్వరరోగి మరణముఁ జెందును. ఎక్కిళ్ళు, శ్వాస, దప్పి, మోహము, వెఱ్ఱిచూపులు, లేక నేత్రములు చక్రాకారములుగ దిరుగుట, ఎల్లపుడు ముఖమువలన శ్వాసము వెడలుట, శరీరము క్షయించియుండుట - ఈలక్షణములు గలజ్వరరోగి యమాలయమున కేగును. తేజోవిహీనత, ఇంద్రియములకు శక్తిహీనత, కృశత్వము, అధికముగా అన్నద్వేషము, గంభీరజ్వరము లేక తీక్ష్ణమైనజ్వరపీడ - ఇవి గలజ్వరరోగి మరణముఁ జెందును.

ప్రేతైస్సహ పిబేన్మద్యం స్వప్నే యః కృష్యతే శునా,
సఘోరం జ్వరమాసాద్య నజీవే న్నచ ముచ్యతే. 285
జ్వరః పూర్వాహ్ణికో యస్య శుష్కకాసశ్చ దారుణః,
బలమాంసవిహీనశ్చ యథాప్రేతస్తథైవ సః. 286
జ్వరోయస్యాపరాహ్ణేతు శ్లేష్మాకాసశ్చ దారుణః,
బలమాంసవిహీనశ్చ యథాప్రేత స్తథైవ సః. 287
సహసా జ్వరసంతాప స్తృష్ణామూర్ఛా బలక్షయః,
విశ్లేషణంచ సంధీనాం ముమూర్షోరుపజాయతే. 288
గోసరే వదనాద్యస్య స్వేదః ప్రచ్యవతే ధ్రువమ్,
లేపజ్వరోపసృష్టస్య దుర్లభం తస్యజీవితమ్. 289

స్వేదోలలాటే హిమవాన్నరస్య శీతార్దితస్యాతిసుపిచ్ఛిలస్య,
కంఠస్థితోయస్య సయాతి వహ్నోనూనంయమస్యైతిగృహం సమర్త్యః.
యస్య స్వేదోతి బహుళః పిచ్ఛిలోయాతి సర్వతః,
రోగిణశ్శీతగాత్రస్య తదా మరణమాదిశేత్. (మతాంతరే) 291

తా. జ్వరమధ్యమునందు ప్రేతలతోడ మద్యపానముచేసినటులేని, కుక్కలచే నీడువఁబడినటులేని స్వప్నముగాంచెడివాఁడు భయంకరమైన జ్వరరోగముగలవాఁడై మరణముచెందును. పూర్వాహ్ణమునందు దారుణమైనజ్వరము, కఫవిహీనమైనదగ్గు, బలహాని, మాంసక్షయముగల జ్వరితుఁడు యమాలయంబునకేగు. అపరాహ్ణమునందు దారుణమైన జ్వరము, శ్లేష్మముతోఁగూడినదగ్గు, బలహాని, మాంసక్షయము - ఇవిగలజ్వరితుఁడు యమునింగాంచు. అకస్మాత్తుగా జ్వరసంతాపము; దప్పి, మూర్ఛ, బలక్షయము, సంధిశైథిల్యము - ఇవిగల జ్వరితునికి మరణము ఆసన్నమైనదని తెలియవలయు. ఉదయకాలములో ముఖమునందు స్వేదస్రావము, లేపజ్వరవ్యాప్తి ఇవిగలజ్వరితుఁడు జీవించుట దుర్లభము. నుదుట చల్లని చెమటబట్టుట, అంగములు శీతలముగ శరీరము జిగటగ నుండుట, నోటిలో నుంచుకొనిన కబళము బ్రొమ్ములోనికి దిగకుండుట - ఈలక్షణములు గల జ్వరితుఁడు యమాలయంబున కేగు. జిగటగ నుండుచెమట అధికముగా జనించి శరీరమంతట వ్యాపించుట, అంగములయందు చలుపపుట్టుట - ఈలక్షణములుగల జ్వరితుఁడు కృతాంతునికడ కేగు.

## సంగమదోషజ్వరలక్షణము

సంగదోషస్య చిహ్నాని నేత్రరోగశ్శిరోవ్యథా,
ఊరుపీడోదరేదాహ స్సంధిబంధ స్తృషాజ్వరః. (గ్రంథాంతరే) 292

తా. నేత్రము లెఱ్ఱనై నీరు గారుచుండుట, తల తోడలు నొచ్చుట, కడుపులో మండుట, సంధులు బంధించినట్లుండుట, దప్పి (ఆరాటము), జ్వరము - ఈలక్షణములు గలది సంగమజ్వర మని తెలియవలయు. (దీనియందు శుక్లగతజ్వరచికిత్సచేయవలయు.)

## విషూచిజ్వరలక్షణము

విషూచికాజ్వరే చ్ఛర్ది ర్నాడీ మందగతి ర్భవేత్,
అంతర్దాహో బహిశ్శీత మతిసారో జ్వర స్తథా. 293
తృష్ణా ప్రలాపో భ్రాంతిశ్చ విజ్ఞేయా వైద్యపారగైః,
చతుర్థే జాయతే మృత్యుః కాలజ్ఞానేన భాషితమ్. 294

తా. వమనం బగుట, నాడులు మందగించుట, లోపల విదాహము, వెలుపట శీతలము, అతిసారము, జ్వరము, దప్పి, వదరుట, భ్రాంతి - ఈలక్షణములు గలది విషూచి జ్వర మని ఆయుర్వేదవేత్తలు తెలిసికొనవలయు. ఇవి గలవాఁడు నాలుగుదినములలో యమాలయంబున కేగు నని కాలజ్ఞానుఁడు వచించె.

విషూచిజ్వరచికిత్స

అరలుర్మథితనిపీతం చించాతరుమూలఖాదిరరసం వా,
వినిహంత్యాశు విషూచిం సవిదాహం చూతవల్కలరసశ్చ. 295

తా. పెద్దమ్రానుచెక్కరసము, పెరుగు, కాచు - వీనినేని, లేక చింతవేరుచెక్కరసము, పెరుగు, కాచు - వీనినేని, మామిడివేరుచెక్కరసము, పెరుగు, కాచు - వీనినేని నేకముచేసి త్రాగిన విషూచిజ్వరములు హరించు.

సహాతైలోప్యతైలోవా చించాపత్రభవో రసః,
మస్తకే నాభిదేశేచ తథా పాదద్వయేపిచ. 296
లేపిత స్తత్క్షణాద్ధంతి సవిదాహం విషూచికామ్. (ఆయుర్వేదే)

తా. చింతాకురసములో నూనెను కలిపిగాని కలపకగాని యారసమును శిరము అరికాళ్ళు నాభి వీనియందు లేపనము పానము చేయించిన విషూచిజ్వరములు తత్క్షణమున హరించు.

విషూచిజ్వరములకు అగ్నికుమారము

రసేంద్రగంధం సహటంకణేన సమంవిషం యోజ్యమిదం త్రిభాగమ్,
కపర్ది శంఖావపిచ త్రిభాగౌ మరీచచూర్ణాష్టగుణం విదధ్యాత్. 297
సుపక్వజంబీరరసేనఘృష్టశ్శుద్ధో భవే దగ్నికుమార ఏషః,
విషూచికారోచకసన్నిపాతే దేయంద్విగుంజం యదివాప్యజీర్ణే.
శ్రీపర్ణఖండేన యథాబలం చ శీతంజలంచానుపిబేత్పరంతు. 299
(ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసినవెలిగారము - ఇవి సమభాగములు, శుద్ధిచేసిన నాభి 3 భాగములు, గవ్వలభస్మము, శంఖభస్మము, - ఇవి 3 భాగములు, మిరియములచూర్ణము ౮ భాగములు-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముచే బాగుగా మర్దించి రెండుగురిగింజలంతేసి మాత్రలు చేసి నీడ నెండించి యం దొకదానిని శరీరబలము నెఱిఁగి ప్రాతస్సాయంకాలములయందు తమలపాకురసాను

పానముతో సేవించి పిదప శీతోదకమును త్రాగిన విషూచిజ్వరము అరుచి సన్నిపాతము అజీర్ణము ఇవి నశించును.

కామిలాజ్వరలక్షణము

కృష్ణంపీతం శకృన్మూత్రం తంద్రామోహశ్చ ఛర్దనమ్,
దాహోరుచి స్తథానాహో జ్వరస్స్యా ద్రక్తనేత్రతా. 300
అసాధ్యశ్శ్వాసకాసాత్తు కామలాజ్వరలక్షణమ్, (గ్రంథాంతరే)

తా. మలము నల్లగ మూత్రము పసుపువర్ణముగ వెడలుట, తంద్ర, మోహము, వాంతి, దాహము, అరుచి, కడుపుబ్బరము, నేత్రము లెఱ్ఱనైయుండుట, జ్వరము - ఈ లక్షణములు గలది కామిలాజ్వర మని తెలియవలయు. దీనియందు శ్వాసకాసలు కలిగి యుండిన యసాధ్యము.

మేదోగతజ్వరలక్షణము

భృశంస్వేద స్తృషామూర్ఛా ప్రలాపశ్ఛర్దిరేవచ. 301
దౌర్గంధ్యారోచకం గ్లాని శ్చేదస్థేచాసహిష్ణుతా, (గ్రంథాంతరే)

తా. కడుచెమట దప్పి మూర్ఛ ప్రలాపము వాంతి శరీరదౌర్గంధ్యము అన్నమునం దరుచి గ్లాని వేదన సహింపకుండుట - ఈలక్షణములు గలది మేదోగతజ్వర మని తెలియవలయు.

మజ్జాగతజ్వరలక్షణము

తమఃప్రవేశనం హిక్కా కాసః శైత్యం వమి స్తథా. 302
అంతర్దాహో మహాశ్వాసో మర్మభేదశ్చ మజ్జగే, (మాధవనిదానే)

తా. చీకటి కమ్ముకొనిన ట్లుండుట, ఎక్కిళ్ళు, కాస, శరీరశైత్యము, ఓకర, అంతర్దాహము, మహాశ్వాసము, హృదయము పగిలిన ట్లుండుట - ఈలక్షణములు గలది మజ్జాగతజ్వర మని తెలియవలయు.

జీర్ణజ్వరలక్షణము

త్రిసప్తాహే వ్యతీతేతు జ్వరో య స్తనుతాం గతః. 303
ప్లీహాగ్నిసాదం కురుతే సజీర్ణజ్వర ఉచ్యతే, (మతాంతరే)

తా. ఇరువదియొకదినములకు జ్వరము బలముగా నుండి పిదప సూక్ష్మంబై ప్లీహరోగమును అగ్నిమాంద్యమును గలుగజేయునది జీర్ణజ్వర మని తెలియవలయు.

గంభీరజ్వరలక్షణము

గంభీరస్తు జ్వరో జ్ఞేయో హ్యంతర్దాహేన తృష్ణయా. 304

ఆనద్ధత్వేన దోషాణాం శ్వాసకాసోద్గమేనచ, (మాధవనిదానే)

తా. అంతర్దాహము, దప్పి, కడుదోషవృద్ధి, లేక మలబద్ధము, శ్వాసము, కాసము-ఈలక్షణములు గలది గంభీరజ్వర మని తెలియవలయు.

### తరుణాదిజ్వరప్రమాణము

ఆసప్తరాత్రం తరుణం జ్వరమాహు శ్చికిత్సకాః. 305
మధ్యమం దశరాత్రంతు హ్యాతడూర్ధ్వం పురాణకమ్,
(గ్రంథాంతరే)

తా. జ్వరమునకు ఏడుదినములు తరుణవయస్సు, పదిదినములు మధ్యమవయస్సు, దానికిపైన వృద్ధాప్యము (అనఁగా పురాణము) అని తెలియవలయు.

సప్తాహాదౌషధం కేచి దాహురన్యే దశాహతః. 306
ప్రాగర్పయతి సప్తాహే ద్విషవద్ధంతి మానవమ్, (గ్రంథాంతరే)

తా. జ్వరమున కౌషధము కొందఱు ఏడుదినములకు పిదప మఱికొందఱు పది దినములకు పిదప నివ్వవలయు నని వచించెదరు. ఏడుదినములలోపల జ్వరమున కౌషధం బిచ్చిన నది విషతుల్యంబై రోగిని జంపును.

### బాలురకుజనించు నీరుచవ్వలలక్షణము తచ్చికిత్స

వచనము. బాలురకు శరీరము వాచి చర్మము పొట్టువలె నూడుచు పులినీరు గారుచు రోమము లెట్టనై యుండిన నీరుచవ్వ లని తెలియవలయు. దీనికి చికిత్స—బాలురతల్లి పావుశేరు కరివేపచెక్కరసములో మిరియముచూర్ణము నూనె ధీనినిగాని, లేక నల్లవరిబియ్యపువంటకములో నూనెనుగాని కలిపి పానముచేసి పిదప బాలురకు స్తన్యము నివ్వవలయు. స్తన్యము నిచ్చునపుడు బాలురకును తా త్రాగిన యౌషధమును బోయవలయు. ఇటుల జేయుటయేగాక బాలురతల్లి చప్పిడిపథ్యము నాచరింపుచుండిన బాలురయొక్క నీరుచవ్వలు హరించు.

### సూతికాజ్వరలక్షణము

అంగమర్దో జ్వరః కంపో పిపాసా గురుగాత్రతా. 307
శోథ శ్శోఫాతిశీతంచ సూతికాజ్వరలక్షణమ్, (మతాంతరే)

తా. శరీరమునందు నొప్పి, జ్వరము, కంపము, దప్పి, శరీరము బరువుగ నుండుట, దుఃఖము, శోథ, అతిచలువ- ఈలక్షణములు గలది సూతికాజ్వర మని తెలియవలయు. దీనినే కొందఱు సూతికావాత మని చెప్పెదరు. (దీనికి వాతరోగప్రకరణములోఁ జెప్పియుండు వాతవిధ్వంసినీరసమునేని సంజీవనీరసమునేని బడబానలరసమునేని ప్రయోగింపవలయు.)

## స్వేదభేదములు

జ్వరేముక్తే మలేముక్తే ప్రాణేముక్తే సమీరణే. 308
సన్నిపాతోద్భవశ్చైవ స్వేదోభవతి పంచమః,

తా. జ్వరమువిడుచుచెమట, మలమువిడుచుచెమట, ప్రాణమువిడుచుచెమట, వాతప్రకోపముమీఁదిచెమట, సన్నిపాతముమీఁదిచెమట - అనిస్వేదములు పంచవిధములు. ఇఁక వానిలక్షణంబుల వచించెద.

జ్వరముక్తేతు సర్వాంగే మలముక్తే లలాటకే. 309
ప్రాణముక్తేచ కంఠేచ సన్నిపాతే ముహుర్ముహుః,

తా. జ్వరము విడుచునపుడు సర్వాంగములయందు చెమట గలుగు. మలము విడుచునపుడు లలాటమునందు చెమట కలుగు. ప్రాణము విడుచునపుడు కంఠమునందు చెమట గలుగు. సన్నిపాతమునందు పలుమారు చెమట స్రవింపుచుండు.

## స్వేదచికిత్స

స్వేదోద్గమే కుళుత్థానాం భ్రష్టానాం చూర్ణకం తథా. 310
భూనింబక్షారక స్తిక్తా వచాపార్వ్షకంరజః,
ఉద్ధూళ౦ త్రిదోషోత్థే స్వేదే భిష్యందజజ్వరే. 311

తా. ఉలవలను వేయించి చూర్ణముచేసి అందు నేలవేము, క్షారము, కటుకరోహిణి, వస, ఆవాలు కలిపి శరీరమునకు లేపనముచు చేసిన త్రిదోషజనితస్వేదము, అభిష్యందజ్వరజనితస్వేదము హరించును.

హరీతకీంవా చణకం సంపిష్యోద్వర్తయే న్నరః,
పశ్చాదేవం ప్రకుర్వంతి దేహస్వేదప్రశాంతయే. 312

తా. కరక్కాయలచూర్ణమునేని, లేక సెనగపప్పుచూర్ణమునేని శరీరమునకు లేపనము చేయించి పిదప పొడపత్రకషాయమును పానముచేయించిన స్వేదదోషములు హరించు.

## జ్వరితునిమారకోపద్రవములు

రక్తపిత్తం తథాకాస హిక్కా హృచ్ఛూలశ్వాసకాః,
మలరోధో ఽతివిభ్రంశో జ్వరితానాముపద్రవాః. (నిత్యనాథీయే)

తా. పైఁజెప్పిన సర్వజ్వరములలో దేనియందేని రక్తముగ్రక్కుట, దగ్గి ఉమ్మి వేయునపుడు రక్తమువెంట తెమడ వెడలుట, ఎక్కిళ్ళు, రొమ్మునొప్పి, శ్వాస, మలమూత్రములు వెడలకుండుట, అధికముగా భ్రమమాటలాడుట - ఈదుర్గుణములు గలిగి జ్వరము విడువక వేధింపుచుండిన మనుజుని జంపును.

శ్వాసమూర్ఛారుచి చ్ఛర్దితృష్ణాతీసార[1]విభ్రమాః,
హిక్కాకాసోఽంగభేదశ్చ జ్వరేచోపద్రవాదశ. 314

తా. పైఁజెప్పిన సర్వజ్వరములలో దేనియందేని శ్వాస, మూర్ఛ, అరుచి, వాంతి, దప్పి, అతిసారము, చిత్తభ్రమము, ఎక్కిళ్ళు, కాస, ఒడలునొప్పి-అను నీపది యుపద్రవములు గలిగి జ్వరమువిడువక వేధింపుచుండిన మనుజుని జంపును.

కాసశ్శ్వాసశ్చ హిక్కాచ శిరోరోగగళగ్రహా,
ఛర్దిర్మూర్ఛాపస్మతీసారో జ్వరితానాముపద్రవా. (ఆయుర్వేదే)

తా. పైఁజెప్పిన సర్వజ్వరములలో దేనియందేని కాస, శ్వాస, ఎక్కిళ్లు, మహాశిరోరోగము, నాలుక లోనికీడ్చుకొనుట, వాంతులు, మూర్ఛ, అతిసారము-అను నీయుపద్రవములు గలిగి జ్వరము విడువక వేధింపుచుండిన మనుజుని జంపును.

## జ్వరదశావస్థలు

ప్రథమోఽపి హ్యపస్మారో ద్వితీయం ప్రేతభాషణం,
తృతీయ శ్చిత్తవిభ్రంశ శ్చతుర్థం శ్వాసమూర్ఛనమ్. 316
పంచమో చోర్ధ్వదృష్టిశ్చ [2]షష్ఠీచ రతికామనా,
సప్తమ స్త్వంగదాహశ్చ వక్త్రస్పర్శనమష్టమమ్. 317
నవమం స్విన్నగాత్రత్వం దశమం మరణం భవేత్, (సిద్ధరసార్ణవే)

తా. జ్వరమునకు పదియవస్థలు గలవు:—అం దపస్మారము మొదటియవస్థ, ప్రేతసంభాషణము రెండవయవస్థ, చిత్తభ్రమ మూడవయవస్థ, శ్వాసము మూర్ఛ నాలవయవస్థ, ఊర్ధ్వదృష్టి ఐదవయవస్థ, రతికోరికె ఆఱవయవస్థ, శరీరములో విదాహము ఏడవయవస్థ, నాలుక లోనికేగుట ఎనిమిదవయవస్థ, శరీరమునందు చెమట స్రవించుట తొమ్మిదవయవస్థ-ఇటుల తొమ్మిది యవస్థలు గడచినపిదప పదియవది మరణావస్థ.

---

1 విద్ర)హాః, 2 షష్ఠంస్వరవిభేదనమ్ - షష్ఠంత్వచలకాంగకమ్.

### జ్వరరోగసాధ్యాసాధ్యోపద్రవములు

బలవాన్ స్వల్పదోషశ్చ జ్వరస్సాధ్యోఽనుపద్రవః. 318
ఉపద్రవయుతో హంతి జ్వరోఽతీంద్రియనాశనః, (మాధవనిదానే)

తా. బలవంతుఁడుగా స్వల్పదోషయుక్తుఁడుగా శ్వాసాద్యుపద్రవరహితుఁడుగా నుండు జ్వరరోగి జీవించును. బలక్షయము ఉపద్రవముల కభివృద్ధి ఇంద్రియనాశము ఇవిగల జ్వరరోగి మృతిచెందును.

నిద్రాసౌఖ్యం భవేద్యస్య శరీరం సోద్యమం భవేత్. 319
ఇంద్రియాణి ప్రసన్నాని బుద్ధిః ప్రకృతిమాగతా,
శరీరే యస్య నైర్మల్యం సరోగీనైవనశ్యతి. (రసరత్నాకరే) 320

తా. నిద్రాసౌఖ్యము శరీరోల్లాసము పంచేంద్రియములు తెలివిగ బుద్ధి నిర్వికారముగ శరీరము నిర్మలముగ నుండుట-ఈలక్షణములు గల జ్వరరోగి జీవించును.

### జ్వరదినప్రమాణము

వాతపిత్తకఫే సప్త దశ ద్వాదశవాసరాః,
ప్రాయోనుయాంతి మర్యాదాం మోక్షాయచ వధాయచ. 321
(నిత్యనాథీయే)

తా. వాతజ్వరమునకు ౭ దినములు, పిత్తజ్వరమునకు ౧౦ దినములు, శ్లేష్మజ్వరమునకు ౧౨ దినములు కాలప్రమాణము. అట్లగుటచే యాజ్వరములు వానివాని కాలక్రమముగా విడిచినను విడుచును. లేక చంపినను చంపును.

ఇత్యగ్నివేశస్యమతం హారీతస్యాపిచ స్మృతం,
ద్విగుణా సప్తమీయాతు నవమ్యేకాదశీ తథా. 322
ఏషా త్రిదోషమర్యాదా మోక్షాయచ వధాయచ,
శుద్ధాశుద్ధజ్వరేకాలో దీర్ఘమప్యనువర్తతే. (అగ్నిమతే) 323

తా. వాతజ్వరమునకు ౧౪ దినములు, పిత్తజ్వరమునకు ౧౮ దినములు, శ్లేష్మజ్వరమునకు ౨౨ దినములు కాలప్రమాణము. అట్లగుటచే యాజ్వరములు వానివానికాలక్రమముగా విడిచినను విడుచును. లేక చంపినను చంపును. శుద్ధాశుద్ధజ్వరములకు నిదియ కాలప్రమాణము. దీనినతిక్రమించి అనువర్తించియుండిన పురాణజ్వరమగు. ఇటుల అగ్నివేశుఁడును హారీతుఁడును వచించిరి.

వచనము. వాతపిత్తశ్లేష్మజ్వరము లోకరఘూములో వెలపట వ్యాపించిన ఏడు, లేక తొమ్మిదిదినములకు విడుచును. రెండవరఘూమున వెలపట వ్యాపించిన పదకొండు, లేక పదమూడుదినములకు విడుచును. మూడవరఘూమునగాని నాలవరఘూమునగాని వెలపట వ్యాపించిన పదునేను, లేక ఇరువదియొకటవదినమున విడుచును.

సప్తరాత్రంవాతికేస్యాత్ షడ్రాత్రంచాపి పైత్తికే,
నవరాత్రం కఫేచైవ ద్వంద్వజే దశరాత్రకమ్. 324
జ్వరపాకో భవేదత్ర హ్యథయాప్యజ్వరంహరేత్, (చింతామణౌ)

తా. వాతజ్వరము ౭ దినములు, పిత్తజ్వరము ౬ దినములు, శ్లేష్మజ్వరము ౯ దినములు, ద్వంద్వజ్వరము ౧౧ దినములు వేధింపుచుండును. ఇవియ జ్వర... ప్రమాణములు. ఈదినప్రమాణములలో జ్వరములు పాకముచెందిన హరించు. చెందక... డిన యాప్యమగు. (అనఁగా విడువక దీర్ఘకాలమువఱకు అనువర్తించియుండును.)

## జ్వరపాకక్రమము

లంఘనానంతరం జ్ఞాత్వా రోగముక్తం చికిత్సకః. 325
బహిరగ్నిర్యథాపూర్వం గచ్ఛేత్కుర్యాత్తథాక్రియాం,
ఔషధానాం ప్రభావంచ జ్ఞాత్వా దద్యాచ్చికిత్సకః. 326
ధాతూత్పన్నాశ్చ యేదోషాః అన్యాశ్చోక్తాయథాక్రమం,
అంతర్గతాశ్చ యేదోషా జ్వరరూపా బహిర్గతాః. 327
పునరామాశయగతా జ్వరపాకమవాప్యతే,
తన్మధ్యే చాప్యపథ్యాని కురుతే జీర్ణముచ్యతే. 328

తా. లంఘనానంతరము జ్వరవిమోచనము నెఱిఁగి ఎవ్విధచికిత్సలచే బహిర్గత జ్వరము లోపల ప్రవేశించునో అవ్విధచికిత్సల వైద్యుఁడు చేయవలయును. అటుల చికిత్సించునెడ ఔషధములప్రభావము నెఱిఁగి ప్రయోగింపవలయును. ధాతుజనితదోషములను ఇతరదోషములను యథాక్రమంబుగా వచించినాఁడ. అంతర్గతదోషములు బహిర్గతంబులైనను జ్వరరూపంబులగు. బహిర్గతదోషములు మరల నామాశయగతంబులైన జ్వరము పాకమును జెందు. జ్వరపాకమధ్యమున యపథ్యంబులుసేసిన అజీర్ణరోగము జనించు.

## జ్వరితపథ్యలక్షణము

జ్వరితో జ్వరముక్తోవా సాయాహ్నే పథ్యమాచరేత్,

తత్తద్దోషక్షయంకుర్యా ద్దాదౌ దోషప్రవర్ధనమ్. 329
అన్నకాలేన భుంజానః క్షీయతే హన్యతేఽథవా, (నిత్యనాథీయే)

తా. జ్వరితుఁడేని లేక జ్వరవిముక్తుఁడేని సాయంకాలమునందు పథ్యము నాచరింపవలయు. దానిచే నానాదోషములు క్షయించు. పూర్వాహ్ణమున పథ్యము నాచరించినను, లేక గంజిత్రాగినను దోషములు వృద్ధిచెందు. పథ్యకాలమునందు పథ్యముసేయని వానికి శరీరకృశత్వంబేని, లేక మరణంబేని గలుగు.

లంఘనక్రమము

లంఘనం త్రివిధం ప్రోక్తం వాతపిత్తకఫే ష్వథ. 330
లంఘనం తూపవాసస్స్యా ల్లంఘనం భోజనం లఘు,
లంఘనం శుష్కపానీయం లంఘనం పరమౌషధమ్. 331
(చింతామణౌ)

తా. లంఘనము వాతపిత్తశ్లేష్మభేదంబులచే మూఁడువిధంబులు. అందు వాతజ్వరపీడితుఁడు ఉపవాసము సేయవలయు. పిత్తజ్వరపీడితుఁడు లఘువుగ భుజింపవలయు. శ్లేష్మజ్వరపీడతుఁడు పలచనిగంజిని త్రాగవలయు. అట్టిలంఘనమే పరమౌషధము.

పథ్యక్రమము

ఔషధేనవినా వ్యాధిః పథ్యాభ్యాసేన జీర్యతే,
నతు పథ్యవిహీనస్య త్వౌషధానాంశతైరపి. 332
పథ్యం దేయం యథాసాత్మ్యం తస్మాత్పథ్యం సమాచరేత్,
నతు పథ్యవిహీనస్య భేషజానాంశతైరపి. 333
శాకేషు తరుణం పథ్యం దధిపర్యుషితం హితం,
ధాన్యం వర్షాంతికం పథ్యం మాంసం సద్యోహితం నృణామ్. 334
అశీతేనాంభసాస్నానం పయఃపానం వయస్స్త్రియః,
ఏతద్ధి మానవం పథ్యం స్నిగ్ధముష్ణంచ భోజనమ్. 335
(గ్రంథాంతరే)

తా. ఔషధసేవ చేయకుండినను పథ్యము నాచరింపుచుండిన కడుశీఘ్రముగా రోగము నివర్తించును. పథ్యమును వర్జించి నూఱుఔషధంబులు సేవింపుచుండినను రోగము శమింపదు. కాఁబట్టి పథ్యములలో ప్రకృత్యనుగుణమైన పథ్యముల నాచరింపవలయు. నూఱు ఔషధంబులు సేవించినను అవి పథ్యముతో సమానంబులు గావు. లేక

ారలు, పులిసినపెరుగు, ఒకసంవత్సరము మాగిన ధాన్యములు తత్కాలమున జంపినజంతు
ాంసము, ఉష్ణోదకస్నానము, క్షీరపానము, వయస్త్రీసంభోగము, సుకుమారమై యొకింత
ిఁడిగ నుండు నన్నము - ఇవి మానవులకు పథ్యకరంబులు.

పథ్యోపయుక్తశాకములు

పటోలఫలవార్తాక కూశ్మాండం కారవేల్లకం,
తండులీయకశాకంచ కాకమాచీజ్వరే హితమ్. 336

తా. పొట్లకాయ, లేతవంకాయ, ముదురుగుమ్మడికాయ, కాకరకాయ, చిర్రి
ూర, కొయ్యతోటకూర, నల్లకాచికూర ఇవి జ్వరితులకు పథ్యకరంబులు.

శాలయష్షష్టికాశ్చైవ పటోలం జాంగలామిషం,
మత్స్యాక్షీముద్గయూషంచ తండులీయకవార్తికి. 337
పక్వకూశ్మాండకుటజ మపక్వం కదళీఫలం,
లఘునవ్యంచ యద్ద్రవ్యం పురాణంచ హితం సదా. (గ్రంథాంతరే)

తా. అఱువదిదినములకు ఫలించినవడ్లు, పొట్లకాయ, *జాంగలమాంసము,
ొన్నగంటికూర, పెసరకట్టు, చిర్రికూర, లేతవంకాయ, ముదురు గుమ్మడికాయ,
డిసెకాయ, లేత అరటికాయ, నవీనంబులై లఘువుగ నుండు ద్రవ్యములు, పురాణ
్రవ్యములు- ఇవి జ్వరితునికి ఎల్లపుడు హితకరంబులు.

అపథ్యద్రవ్యాదులు

షష్టికానిచ సర్వాణి శాకాని హరితానిచ.
విదాహీన్యుష్ణవీర్యాణి జ్వరితః పరివర్జయేత్. 339
దివాసుప్తంచ సతతంస్నాన మభ్యంగ సంగమం,
వ్యాయామం రోషతాపంచ క్రోధంచాపి వివర్జయేత్. 340

(సిద్ధరసార్ణవే)

తా. అఱువదిదినములలో ఫలించిన సర్వధాన్యములు, పచ్చిఆకుకూరలు, విదాహ
వస్తువులు, ఉష్ణవీర్యము గలవస్తువులు, పగటినిద్ర, స్నానము, అభ్యంజనము, స్త్రీ
భోగము, సంచారము, రోషము, ఎండ మొదలగువానియొక్క సేవ, కోపము-వీనిని
ిరితుఁడు ఎల్లపుడు వర్జింపవలయు.

* మేకమాంసము.

పురాణజ్వరములకు మాలినీవసంతరసము

రసకయుగళభాగం వేల్లజంచైకభాగం
ద్వితయమపిచ ఖల్వే మర్దయేచ్ఛ్లక్ష్ణకేన,
భవతి జ్వరవిముక్తో నింబనీరేణతావత్
జ్వరహర మథ కుర్యా న్మాలినీప్రాగ్వసంతమ్. 341
జీర్ణజ్వరే ధాతుగతేఽతిసారే రక్తాన్వితే రక్తగవిట్స్వరూపే,
జ్వరేఽస్థిగేమాంసగతే పురాణే వల్లద్వయం దుగ్ధమతీవ పథ్యమ్.
(సిద్ధరసార్ణవే)

తా. శుద్ధిజేసినకఫరి ౨ భాగములు, మిరియాలు ౧ భాగము - ఇటుల వీనిని ఖల్వములో వైచి వేపచెక్కరసముతో మూఁడుదినములు బాగుగా మర్దించి ఆఱు గురిగింజలయెత్తు మాత్రలుజేసి జీలకఱ్ఱ, పిప్పళ్లు-వీని అనుపానయుక్తముగా సేవించిన జీర్ణజ్వరము, ధాతుగతజ్వరము, జ్వరాతిసారము, రక్తయుక్తజ్వరాతిసారము, రక్తయుక్తమలాతిసారజ్వరములు, అస్థిగత మాంసగతజ్వరములు, పురాణజ్వరములు హరించు. ఇది మాలినీవసంతరస మనఁబడు.

పురాణజ్వరములకు రసకల్పములు

కఫరీం మర్దయేత్త్రిరైశ్చతురశీతియామకం,
అనంతరం దివారాత్రం మర్దనేనామృతం భవేత్. 343
మాషమాత్రం సానుపానం జ్వరం హంతి దినార్ధతః,
(గ్రంథాంతరే)

తా. శుద్ధిజేసినకఫరిని ఖల్వములో నునిచి ౮౪ ఝాములు ఆవుపాలతో రేయుంబగలు ఎడతెగక మర్దించిన అమృతతుల్యం బగు. పిదప దానిని ఏడుగురిగింజలంతేసి మాత్రలు జేసి తేనె, పిప్పలి- వీని అనుపానయుక్తముగా సేవించిన పురాణజ్వరములు అర్ధదినములో నశించు.

కఫరీం శోధితాం కృత్వా మర్దయేచ్చ రసామృతైః. 344
పంచాశదష్టౌ యామాన్వా ఏకమార్గంతు మర్దయేత్,
అనుపానవిశేషేణ యామేన జ్వరనాశనమ్.(మతాంతరే) 345

తా. శుద్ధిజేసినకఫరిని ఖల్వములో నునిచి ఆవునేతితో ౫౮ ఝాములు ఎడతెగక మర్దించి నాలుగుగురిగింజలంతేసి మాత్రలుజేసి పిప్పళ్ళు, లవంగములు వీని అనుపానముతో సేవించిన పురాణజ్వరములు ఒకఝాములో హరించు.

అర్క మూలరసేనైవ కఫరీం సమవేల్లజం,
మర్దయే దశీతియామం మాషమాత్రం వటీకృతమ్. 346
గోమూత్రేణ తథా దద్యాద్యథా రోగప్రశాంతయే,
(మతాంతరే)

తా. శుద్ధిజేసినకఫరి, మిరియాలు వీనిని సమభాగములుగా ఖల్వములో నునిచి జిల్లేడువేళ్ళరసము, గోమూత్రము వీనిచే ౮౦ ఝాములు బాగుగా మర్దించి ఏడుగురి ంజలంతేసి మాత్రలుజేసి లవంగములు పిప్పళ్ళు తేనె వీని అనుపానయుక్తముగా సేవిం న పురాణజ్వరములు హరించు.

కఫరీం శోధితాం కృత్వా సమగంధకమిశ్రితమ్. 347
అజాక్షీరేణ సంమర్ద్య హ్యష్టాశీతికయామకం,
గవాం క్షీరేణ దాతవ్యం జ్వరమాంద్యాదిరోగకమ్. 348
శమయే ద్ఘటికానర్ధే దేవానామమృతంయథా,

తా. శుద్ధిజేసినకఫరి, శుద్ధిజేసిన ఆమ్లసారగంధకము - వీనిని సమభాగములుగా ల్వములో నునిచి ౮౮ ఝాములు మేకపాలచేతను, ౮౮ ఝాములు ఆవుపాలచేతను గుగా మర్దించిన దేవతలయమృతముతో తుల్యం బగు. పిదప దానిని నాలుగు గురిగిం ఎత్తు మాత్రలుజేసి జీలకఱ్ఱ పిప్పళ్ళు తేనె వీనియనుపానముతో సేవించిన పురాణ రములు, అగ్నిమాంద్యము మొదలగునవి అరగడియలో హరించు.

కఫరీం ఘృతసంయుక్తాం నింబనీరేణ మర్దయేత్. 349
త్రింశత్త్రీణి దినాన్యస్య ప్రమాణమమృతోపమం,
గుంజామాత్రం ప్రదాతవ్యం శతాయుర్వజ్రదేహకృత్. 350

తా. శుద్ధిజేసినకఫరిని ఆవునేతిచేతను, వేపచెక్కరసముచేతను, ముప్పదిమూడు ములు బాగుగా మర్దించిన అమృతతుల్యం బగు. పిదప దానిని గురిగింజలంతేసి మాత్ర జేసి జీలకఱ్ఱ పిప్పళ్ళు పంచదార వీని యనుపానయుక్తముగా సేవించిన జ్వరము రించుటయేగాక నూరుసంవత్సరంబు లాయువు, వజ్రదేహము గలవాఁడై యుండును.

కఫరీం మధుసంయుక్తాం గోక్షీరేణచ మర్దయేత్.
అహోరాత్రం మండలంతు దినమేకంతు శోషయేత్. 351
మాషమాత్రం సానుపానం సోమరోగం హరేజ్జ్వరం,

తా. శుద్ధిజేసినకఫరి తేనె ఆవుపాలు పీశిచే నలువదిదినములు రేయుంబగలు ఎడ తెగక మర్దించి ఒకదినము యెండించి ఏడుగురిగింజలంతేసి మాత్రలుజేసి తేనె పిప్ప లితో సేవించిన సోమరోగము, జ్వరము ఇవి హరించును.

కఫరీం శిఖితోయేన చతురశీతియామకమ్. 35
అహోరాత్రంచ సంమర్ద్య భుంజీత మధుమిశ్రితం
రోగావసానకాలేతు మాషమాత్రం ప్రదాపయేత్. 35
యథోక్తం భోజనం కృత్వా దృఢకాయో భవష్యతి,

తా. శుద్ధిజేసినకఫరిని ఖల్వములో నునిచి మయూరశిఖికషాయముచే ర ఝాములు రేయుంబగలు ఎడతెగక మర్దించి ఏడుగురిగింజలంతేసి మాత్రలుజేసి య దొకదానిని తేనెతో నొసంగి జ్వరము విడుచునపుడు యథోక్తముగా భుజింపఁజేసి జ్వరములు హరించుటయేగాక శరీరదార్ఢ్యముకూడ గలుగును.

శతవత్సరపర్యంతం వజ్రదేహో భవిష్యతి. 35
రసం రక్తం త్వచం మాంసం మజ్జా మస్థిగతం హరేత్,
(సిద్ధరసార్ణ

తా. పైఁజెప్పిన కఫరియోగములను సేవించిన పురాణజ్వరములు, రసము, రక్త మాంసము, చర్మము, మజ్జ, అస్థి- వీని నాశ్రయించి యుండు జ్వరములు హరించుట గాక నూరుసంవత్సరములవఱకు వజ్రతుల్యదేహముగలవారై జీవించెదరని సిద్ధరసార్ణవ నందు శంకరుఁడు వచియించె. కావున పైచెప్పిన కఫరియోగములను నాలుగు మాసము సేవింపవలయు.

## కఫరిశుద్ధి

కఫరీ పలమాత్రంతు చూర్ణంకృత్వా విమర్దయేత్. 3
నరమూత్రే సప్తయామాం డోలాయంత్రే పచేత్తతః,
గోమూత్రేణ ద్వియామంచ పాచయేచ్ఛుద్ధిమాప్నుయాత్. 3
అథవా ఘృతసంమిశ్రం పాచయే త్కఫరీశుచిః,

తా. పలప్రమాణము కఫరిని చూర్ణముచేసి ప్రాతబట్టలో మూటగట్టి ౭ ఝాము నరమూత్రముచేత, ౨ ఝాములు గోమూత్రముచేత డోలాయంత్రములో వ నను, లేక ఆవునేతిలో వైచి ఏడుపొంగులు వచ్చువఱకు వండినను శుద్ధి యగు. ఇట శుద్ధిచేయఁబడినకఫరిని పైఁజెప్పిన యోగములయందును, సర్వౌషధములయందును న యోగింపం దగు.

—— జ్వరమురారి ——

త్రిస్సప్తజంబీరజభావితఖర్పరస్య
చూర్ణం విమర్ద్య నవనీతసమానచూర్ణమ్,
వల్లద్వయం హరతి శర్కరయానుపానం
సద్యోజ్వరం జ్వరమురారిసమాఖ్యమేతత్. (ఆయుర్వేదే) 357

తా. శుద్ధిజేసిన కఫరిని ఖల్వములో నునిచి ౨౧ పర్యాయము నిమ్మపండ్లరసముచే ౨నజేసి పిదప దానిని వెన్నతో సమానముగ నూరి చూర్ణముచేసి యం దొలు గుం ౨ల ప్రమాణమును శర్కరానుపానముచేగాని, తేనె పిప్పళ్లు వీనియనుపానముచేగాని ౦చిన జ్వరములు హరించు. ఇది జ్వరమురారి యనఁబడును.

హింగుళంచ విషం వ్యోషం టంకణం నాగరాభయా,
జయపాలసమాయుక్తం సద్యోజ్వరనివారణమ్. (బాహటే) 358

తా. శుద్ధిచేసిన ఇంగిలీకము, శుద్ధిజేసిననాభి, త్రికటుకములు, వెలిగారము, ౦తి, కరక్కాయ-వీనిని చూర్ణముచేసి దీనికి సమముగా శుద్ధిచేసిన నేపాళచూర్ణమును నూరి కలాయప్రమాణము మాత్రలుచేసి అల్లపుస్వరసముతో నిచ్చించిన [illegible] నే జ్వరము నివర్తించును. (ఇది మఱియొకవిషయమైన జ్వరమురారి.)

—— సర్వజ్వరాదిహరగుటికలు ——

జాతీఫలం త్రికటుకం త్రిఫలం త్రిజాతం
ఖర్జూరద్రాక్షాగరువాలుకచందనాని,
తక్కోలధాన్యమధుజీరకమశ్వగంధా
చూర్ణం సమం సమసితం గుళికాం ప్రకుర్యాత్. 359
భుక్తిః కరోతి సకలజ్వరపైత్యనాశం
శ్వాసం క్షయం హరతి పాండు ప్రమేహరోగాన్,
జీర్ణజ్వరం సతతసంతతకం ప్రణాశం
రోగాన్నిహంతి కథితం పరపూజ్యపాదైః. (నిత్యనాథీయే) 360

తా. జాజికాయ [1]త్రికటుకములు, [2]త్రిఫలములు, [3]త్రిజాతకము, ఖర్జూరపు ౦, ద్రాక్ష, అగరు, కూతురుబుడమ, చందనము, తక్కోలములు, ధనియాలు,

---

1 త్రికటుకమనఁగా శొంఠి, పిప్పలి, మిరియాలు. 2 త్రిఫలము లనఁగా కర ౦య, తానికాయ, ఉసిరికె వరుగు. 3 త్రిజాతకము లనఁగా ఏలకులు, ఆకుపత్రి, ౯పుచెక్క.

అతిమధురము, జీలకఱ్ఱ, పెన్నేరుగడ్డ - వీనిని సమభాగములుగా చూర్ణముజేసి దానికి సమముగా శర్కరను పాకుబట్టి యందాచూర్ణమును కలిపి ఘుటికలుజేసి యందొకదానిని భక్షించిన సర్వజ్వరములు, పైత్యరోగములు, శ్వాస, క్షయము, పాండువు, ప్రమేహము, జీర్ణజ్వరము, సతతజ్వరము, సంతతజ్వరము-ఈరోగములు హరించునని శ్రేష్ఠుఁడగు పూజ్యపాదమహర్షి వచించె.

జ్వరవైరివటుకములు

రసోగంధకనాభీచ బీజమున్మత్తసంభవం,
ద్వేద్వేపలానిచైతాని హ్యేకంశుంఠీచ పిప్పలీ. 361
ఏతాని పంచమరిచం మర్దయేద్గుడవారిణా,
గుంజామాత్రం ప్రకుర్వీత గుడేనైవ ప్రయుజ్యతే. 362
ఉష్ణోదకానుపానేన భేషజం జ్ఞానపారగైః,
జ్వరవైరీతివిఖ్యాతం సర్వజ్వరవినాశనమ్. (ఆయుర్వేదే) 363

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, శుద్ధిజేసినవసనాభి, శుద్ధిజేసిన ఉమ్మెత్త విత్తులు - ఇవి దినుసు ఒకటింటికి రెండేసిపలములు, సొంటి, పిప్పళ్ళు-ఇవి దినుసు ఒకటింటికి ఒక్కొకపలము, మిరియాలు ఐదుపలములు-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి బెల్లపురసముచే బాగుగా మర్దించి గురిగింజలంతేసి మాత్రలుచేసి యందొకదానిని బెల్లముతో నొసంగి పిదప బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు ఉష్ణోదకమును పానముచేయించిన విడువక వేధింపుచుండు నెట్టిజ్వరములైనను నలుపదిదినములలో హరించు. ఇవి జ్వరవైరివటుకము లనఁబడు. ఇవి సర్వజ్వరములను హరింపఁజేయుటయందు కడుప్రసిద్ధిఁజెందినవి.

జ్వరగజకేసరి

జలదదరదయుక్తం శుద్ధసూతం సుగంధం
ప్రహరమధుసుపిష్టం వల్లయుగ్మంచ దద్యాత్,
జ్వరగజహరిసంజ్ఞం శృంగిబేరోదకేన
ప్రథమజ్వరితదాహే క్షీరభక్తంచ భోజ్యమ్. (చరకే) 364

తా. తుంగముస్తెలు, శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసినరసము, శుద్ధిజేసిన గంధకము వీటిని సమభాగములుగా ఖల్వములో నునిచి తేనెతో నొకఝాము బాగుగా మర్దించి ఆఱుగురిగింజలంతేసి మాత్రలుచేసి యందొకదానిని తొలుత జ్వరమువచ్చి నపుడు, అల్లపురసానుపానముతో సేవించి, అన్నమును క్షీరమిశ్రముగా భుజించిన సమస్త జ్వరములు హరించును.

### జ్వరములకు పంచాననరసము

రసం గంధం వత్సనాభం టంకణం మాగధీసమం,
దుత్తూరమూలజద్రావై ర్మర్దితం యామయుగ్మకమ్. 365
గుంజాప్రమాణవటుకా న్యనుపానవిశేషతః,
ఖాదేత్సర్వజ్వరం హంతి సన్నిపాతాం స్త్రయోదశ. 366
తత్క్షణేన వినశ్యంతి విషమం దోషనాశనం
పంచాననరసోనామ శంభునా పరికల్పితః. 367

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసిననాభి, వెలిగారము, పిప్పళ్లు-నిని సమభాగములుగా గ్రహించి ఉమ్మెత్తవేళ్ళరసముచే రెండుఝాములు మర్దించి ంజాప్రమాణము మాత్రలుచేసి అనుపానవిశేషములతో నిప్పించిన సర్వజ్వరములు. 3 సన్నిపాతములు తత్క్షణము నశించుటయేగాక విషమదోషములుకూడా మానును. ది శివునిచే నిర్మింపఁబడిన పంచాననరసము.

### జ్వరగజాంకుశము

రసామ్లసారగంధంచ నేపాళం బీజటంకణం.
ఖజ్జలీనాంచ సంమర్ద్యం ముద్గమాత్రప్రమాణకమ్. 368
చణమాత్రంచ వానీతం నాగవల్లీదళాన్వితం,
దేయం సర్వజ్వరం హంతి సంతతం తరుణజ్వరమ్. 369
పథ్యంచైవ ప్రదాతవ్యం దధిక్షీరేణ శర్కరా,
పూజ్యపాదమిదంప్రోక్తం సర్వజ్వరగజాంకుశమ్. (మాధవనిదానే)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసిన ఆమ్లసారగంధకము, శుద్ధిచేసిన నేపాళములు, లిగారము-వీనిని ఖల్వములో నునిచి కజ్జలివలె మర్దించి పెసరగింజలంత లేక సెనగగింజ ంత మాత్రలుచేసి తమలపాకులో నునిచి యిప్పించిన సర్వజ్వరములు, సంతతజ్వరములు, ఱణజ్వరములు ఇవి నశించును. పెరుగు, పాలు, శర్కర వీనిని పథ్యమునం దుపయో చవలెను. ఇది పూజ్యపాదునిచేఁ జెప్పఁబడిన సర్వజ్వరగజాంకుశము.

### సర్వజ్వరములకు నారసింహరసము

నేపాళగంధామృతపారదానాం సచూర్ణకానాం సమభాగయుక్తం,
జ్వరాంతకశ్శర్కరయాసమేతః రసోనృసింహోత్యమృతప్రసిద్ధః. 371
(ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసిన నేపాళములు, శుద్ధిచేసినగంధకము, శుద్ధనాభి, శుద్ధిచేసినపాద రసము-వీనిని సమభాగములుగా చూర్ణముచేసి పంచదారతోడ నిప్పించిన సర్వజ్వరములు నశించును. ఇది నారసింహరసము. అమృతమువలె ప్రసిద్ధమైనది.

### జ్వరములకు చండభానురసము

సూతం త్రైగుణ్యగంధం పరిమితమమృతం తీక్ష్ణకం భానునేత్రం
హరితాళం తచ్చతుష్కం గగనమథయుగం మారిచం సర్వతుల్యమ్,
ఏతందద్యాన్నిహంతి జ్వరవనదహన స్తాముసాహేః ఖగేంద్రః
కాసశ్వాసాపహంతా క్షయతరుదహనః పాండురోగాపహంతా. 372
వాతవ్యాధీభసింహో హ్యుదర జలనిధే శ్శోషకో బాడబాగ్నిః
నష్టాగ్నేర్దీపకస్స్యా జ్జఠర మలమహాక్లేశహృద్రోగహారీ,
మూలవ్యాధ్యంధకారప్రశమనతపనః కుష్ఠరోగాపహంతా
నామ్నాయం చండభాను స్సకలగదహరో భాషితం పూజ్యపాదైః.
(నిత్యనాథీయే)

తా. శుద్ధిజేసినరసము ౧ భాగము, శుద్ధిజేసినగంధకము, శుద్ధిజేసినవసనాభి, లోహ భస్మము, తామ్రభస్మము-ఇవి దినుసు ఒకటింటికి మూడుభాగములు, శుద్ధిజేసిన తాళకము ౪ భాగములు, అభ్రకభస్మము ౨ భాగములు, మిరియాలు ౧౫ భాగములు - ఇటుల వీనినెల్ల గ్రహించి చిత్రమూలరసముచే నొకదినము బాగుగా మర్దించి గురిగింజలంతేసిమాత్రలుజేసి నీడ నెండింపవలయు. జ్వర మనువనమునకు కార్చిచ్చై, సన్నిపాతము లనుసర్పములకు గరుత్మంతుఁడై, కాసశ్వాసలఁ బోకడచునదియై, క్షయమనువృక్షమునకు అగ్నియై, పాండురోగములఁజంపునదియై, వాతవ్యాధులను ఏనుఁగులకు సింహంబై, ఉదరరోగమనుసముద్రమును శోషింపఁజేసెడిబడబాగ్నియై, నష్టమైనజాఠరాగ్నిని జ్వలింపఁజేయునదియై, జఠరాశ్రితమలమువలన జనించినకడుక్లేశమును బొమ్మునొప్పిని అపహరించునదియై, మూలవ్యాధి యనుయంధకారమును బోకడచుటయందు సూర్యునితో సమానంబై, కుష్ఠరోగమును జంపునదియై, చండభాను అనుపేరం బరగు సీరసము సకల రోగముల హరింపఁజేయునని పూజ్యపాదమహర్షి వచించె. (దీనిని అల్లపురసముతో నొసంగిన జ్వరములు సన్నిపాతములు, త్రికటుకములతో నొసంగిన కాసశ్వాసములు, తేనె పిప్పలి వీనితో నొసంగిన క్షయరోగములు, జీలకఱ్ఱతో నొసంగిన పాండురోగములు, వెల్లుల్లిరసముతో నొసంగిన వాతవ్యాధులు, బెల్లము కరక్కాయ వీనితోనొసంగిన ఉదరరోగములు, పిప్పళ్లు ఉష్ణోదకము వీనితో నొసంగిన అగ్నిమాంద్యము, నేలదంతిరసముతో

నొసంగిన మలబద్ధకము, తేనెతో నొసంగిన ఒళ్ళునొప్పి, త్రిఫలకషాయముతో నొసంగిన మూలావ్యాధులు, తేనె పంచదార వీనితో నొసంగిన కుష్ఠరోగములు హరింపజేయును.

### జ్వరనాశనరసము

పారదం నిష్కమాత్రంస్యా ద్గంధకంచ ద్వినిష్కకం,
నిష్కంచ టంకణక్షారం నిష్కంవై తాళకం తథా. 374
ఏతేషాం సమభాగాని దంతిబీజాని మర్దయేత్,
నాగవల్లీదళేనైతద్గుంజామాత్రం ప్రదాపయేత్. 375
పథ్యం క్షీరోదనం దద్యా ద్రసోయం జ్వరనాశనః. 376

(మాధవనిదానే)

తా. శుద్ధిజేసినపాదరసము ౧ *నిష్కప్రమాణము, శుద్ధిజేసినగంధకము ౨ నిష్కములు, శుద్ధిజేసిన వెలిగారము ౧ నిష్కప్రమాణము, శుద్ధిజేసిన తాళకము ౧ నిష్కప్రమాణము, శుద్ధిజేసిన నేపాళచూర్ణము ౪ నిష్కములప్రమాణము - ఇటుల వీనినెల్ల ఖల్వములో వైచి అల్లపురసముచే మర్దించి గురిగింజలంతేసి మాత్రలుచేసి యందొకదానిని తమలపాకులో నునిచి సేవించిన సర్వజ్వరములు హరించు. దీనియందు పాలతో అన్నమును భుజించుట పథ్యము-ఇది జ్వరనాశనరస మనఁబడు.

### తరుణజ్వరాదిరసము

నైపాలగంధం విషపారదంతు తుల్యం కుమారీస్వరసేనమర్ద్యమ్,
అస్యద్విగుంజాహి సితోదకేన ఖ్యాతోరసోయం తరుణజ్వరారిః. 377
దాతవ్యఏషోహని పంచమేవా షష్ఠేథవాసప్తమ ఏవవాపి,
జాతేవిరేకే విగతజ్వరః స్యాత్పటోలముద్గాన్ననిషేవణేన. 378

(సిద్ధరసార్ణవే)

తా. శుద్ధిజేసిన నేపాళము, శుద్ధిజేసినగంధకము, శుద్ధనాభి, శుద్ధపాదరసము-వీనిని సమభాగములుగా గ్రహించి కలబందరసముచే మర్దించి రెండు గురిగింజలప్రమాణమును శర్కరోదకముతో నిప్పింపవలయును. ఇది తరుణజ్వరారిరస మనఁబడును. దీనిని జ్వరము కనుపించిన ౫, లేక ౬, లేక ౭ యీదినములయందు నిప్పించవలయును. ఒకసారి విరేచనమైనపిదప పొట్లకాయ, పెసరయన్నము వీనిని పథ్య మిప్పించిన జ్వరము నివర్తించును.

---

* నిష్క మన ౨ లేక ౩౨ గురిగింజలయెత్తు.

నవజ్వరేభసింహరసము

శుద్ధసూతం తథా గంధ లోహం తామ్రంచ సీసకం,
మరిచం పిప్పలీ విశ్వం సమభాగాని కారయేత్. 3
అర్ధభాగం విషం దత్వా మర్దయే ద్వాసరద్వయం,
శృంగిబేరాంబుపానేన దద్యాద్గుంజాద్వయం భిషక్. 3
నవజ్వరే మహాఘోరే ధాతుస్థే గ్రహణీగదే,
నవజ్వరేభసింహోయం సర్వజ్వరకులాంతకృత్. (మాధవనిదా

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిగంధకము, లోహభస్మము, తామ్రభస్మము, భస్మము, మిరియాలు, పిప్పళ్ళు, శొంఠి-వీటిని సమభాగములుగా గ్రహించి వీనికి భాగము శుద్ధనాభిని చేర్చి రెండుదినములు మర్దించి దారుణమైన నవజ్వరములు, ధ గతజ్వరము, గ్రహణీరోగము-వీనియందు రెండుగురిగింజలప్రమాణము అల్లపురస పానముతో నిప్పించిన సమస్తజ్వరములను నశింపఁజేయును. ఇది నవజ్వరేభసింహరస

నవజ్వరములకు త్రిపురభైరవరసము

విషటంకబలిమ్లేచ్ఛదంతీబీజంక్రమాద్బహు,
దంత్యంబుమర్దితంయామం రసస్త్రిపురభైరవః.
వల్లం వ్యోషేణ చార్ద్రస్య రసేన సితయాథవా,
దత్తోనవజ్వరం హంతి మాంద్యామానిలశోఫహః.
హంతి శూలం సవిష్టంభ మర్శాంసి క్రిమిజాన్ గదాన్,
పథ్యం తక్రేణ భోక్తవ్యం రసేస్మిన్ రోగహారిణి. (ఆయుర్వే

తా. శుద్ధిచేసిననాభి, వెలిగారము, శుద్ధగంధకము, తామ్రభస్మము, నే ములు - వీటిని క్రమముగా గ్రహించి దంతివేళ్ళరసముతో ఒకఝాము మర్దిం యును. ఇది త్రిపురభైరవరస మనఁబడును. దీనిని వల్లప్రమాణము త్రికటుకము గాని లేక అల్లపురసముతోగాని లేక పంచదారతోగాని నిప్పించిన నవజ్వరమ అగ్నిమాంద్యము, ఆమము, వాతము, శోఫ, శూల, మలబంధము, అర్శస్సు, రోగము వీటిని హరింపఁజేయును. రోగహరమైన యీరసమునందు మజ్జిగయన్న భుజింపవలయు.

జ్వరములకు వైష్ణవీరసము

హింగుళం వత్సనాభంచ చక్రాంగీ కటుకత్రయం,
చిత్రమూలకషాయేణ సమభాగం విమర్దయేత్.

డోలాయంత్రే యామమాత్రం పచేన్నిష్పాదితో భవేత్,
ఆర్ద్రకస్యానుపానేన మాషమాత్రం జ్వరాపహః. 386
ద్వంద్వజ్వరం సన్నిపాతం పురాణం విషమజ్వరం,
నాశయేదఖిలాన్ ఘోరాన్నామ్నాయం వైష్ణవీరసః. 387
(గ్రంథాంతరే)

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిచేసిన వసనాభి, కటుకరోహిణి, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు - వీనిని సమభాగములుగా గ్రహించి ఖల్వములో నునిచి చిత్రమూల కషాయముచే మర్దించి పిదప డోలాయంత్రమున నునిచి ఒకఝాము వండి ఏడు గురిగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని అల్లపురసానుపానముతో సేవించిన జ్వరములు, ద్వంద్వజ్వరములు, సన్నిపాతములు, పురాణజ్వరములు, విషజ్వరములు హరించుటయేగాక భయంకరములుగనుండు సమస్తరోగములుకూడా నివర్తించును. ఇదియ వైష్ణవీరస మనఁబడు.

సర్వజ్వరములకు శీతభంజీరసము

రసహింగుళగంధంచ నేపాళం మర్దితం త్రిభిః,
దంతీక్వాథేన సంమర్ద్య రసోజ్వరహరః పరః. 388
ఆర్ద్రకస్వరసేనాథ దాపయే ద్రక్తికాద్వయం,
నవజ్వరం మహాఘోరం నాశయేద్యామమాత్రతః. 389
శీతతోయం పిబేచ్చాను ఇక్షుముద్గరసో హితః,
శీతభంజీరసోనామ్నా సర్వజ్వరకులాంతకృత్. 390
(సిందూరమణిదర్పణే)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధఇంగిలీకము, గంధకము, నేపాళము వీటిని దంతివేళ్ళకషాయముచే మూడుదినములు మర్దించి అల్లపుస్వరసములో రెండుగురిగింజలప్రమాణమును కలిపి యిప్పించి శీతోదకము, చెఱకురసము, పెసరకట్టు వీటిని వెంబడిగా పానము చేయించిన ఒకఝాములోపల మిగుల దారుణమైన నవజ్వరములు నశించు. ఇది శీతభంజీరస మనఁబడు. సమస్తజ్వరములను నశింపఁజేయును.

ముహూర్తములో జ్వరమును హరించెడి శీతభంజీరసము

పారదం రసకం తాళం తుత్థం టంకణ గంధకం,
సర్వమేతత్సమం శుద్ధం కారవేల్లాద్రవైర్దినమ్. 391

మర్దయేత్తేన కల్కేన తామ్రపాత్రోదరం లిపేత్,
అంగుళ్యాద్యర్ధమానేన తంపచేత్సికతాహ్వయే. 392
యంత్రే యావత్స్ఫుటంత్యేవ వ్రీహయస్తస్య పృష్ఠతః,
తామ్రపాత్రం సముద్ధృత్య చూర్ణయేన్మరిచైస్సమమ్. 393
శీతభంజీరసోనామ ద్విగుంజం వాతికే జ్వరే,
దాతవ్యం పర్ణఖండేన ముహూర్తాన్నాశయేజ్జ్వరమ్. 394
(రసరత్నాకరే)

తా. శుద్ధిచేసినరసము, రసకము, తాళము, మైలుతుత్తము, వెలిగారము, గంధకము వీటిని సమభాగములుగా గ్రహించి కాకరరసముచే నొకదినము మర్దించి రాగిపాత్రలో అరయంగుళప్రమాణము దళముగా పూసి * సికతాయంత్రములో నునిచి ఆయంత్రముయొక్క వెనకప్రక్కయందు వడ్లనువేసి దఫముగా ప్రేలునంతవఱకు పాకము చేసి పిదప నాతామ్రపాత్రనుతీసి మిరియాలను సమముగా చేర్చి చూర్ణముచేయ వలయు. ఇది శీతభంజీరస మనఁబడును. దీనిలో రెండుగురిగింజల ప్రమాణమును వాత జ్వరమునందు తమలపాకులలో నిచ్చించిన ఒకముహూర్తములో జ్వరము నశించును. (అరు తులముల ప్రమాణముగల శుద్ధతామ్రముచే నొక తామ్రఖల్వమును చేయించి దానిలో రసాదిద్రవ్యకల్కమును ఒకతుల ప్రమాణము ప్రత్యేకముగా లేపనముచేసి మఱియొక తామ్రపాత్రచే మూసి ఇసుకపోసి పొయిమీఁదనునిచి అగ్నిని జ్వలింపఁజేసి ఆ యిసుకలో వడ్లను వేసి ప్రేలువఱకు పక్వముచేసిన నారసము సిద్ధమగును. పిదప దానిలో ౬ తుల ములు మిరియములను చేర్చి చూర్ణముచేసి ౨ గురిగింజలయెత్తును తమలపాకులలో నునిచి నిచ్చింపవలయునని ఉపదేశము చేయఁబడినది.

జ్వరమునకు స్వచ్ఛందభైరవము

సమభాగంచ సంగ్రాహ్యం పారదామృతగంధకం,
జాతీఫలంచ భాగార్ధం దత్వా కుర్యాచ్చ కజ్జలిమ్. 395
సర్వార్ధం మాగధీచూర్ణం ఖల్వయిత్వా నిధాపయేత్,
గుంజాద్వయం త్రయంవాపి నాగవల్లీరసేనచ. 396
ఆర్ద్రికస్వరసేనాపి ద్రోణపుష్పరసేనవా,
శీతజ్వరే సన్నిపాతే విషూచ్యాం విషమజ్వరే. 397
పీనసేచ ప్రతిశ్యాయే జ్వరే జీర్ణే తథైవచ,

* సికతాయంత్ర మనఁగా—వాలుకాయంత్రము.

మందాగ్నౌ వమనేచైవ శిరోరోగేచ దారుణే. 398
ప్రయోజ్యో భిషజా సమ్యగ్రస స్స్వచ్ఛందభైరవః,
పథ్యం దధ్యోదనం దద్యా ద్వీక్ష్య దోషబలాబలమ్. 399

(భేషజకల్పే)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినవసనాభి, శుద్ధిచేసినగంధకము ఇవి సమభాగములు, జాజికాయ పాదరసమున కర్ధభాగము-ఇటుల వీనిని ఖల్వమున కజ్జలిగా మర్దించి పిదప పైఁజెప్పిన ద్రవ్యముల కన్నిటి కర్ధభాగము పిప్పలిచూర్ణము కలిపి తమలపాకు రసముచే బాగుగా మర్దించి రెండు, లేక, మూడుగురిగింజలయెత్తు మాత్రలుజేసి యందొక దానిని తమలపాకుతోగాని అల్లపురసముతోగాని తుమ్మిపూలరసముతోగాని యొసంగిన శీతజ్వరములు, సన్నిపాతములు, విషూచులు, విషమజ్వరములు, పీనసము, పడిశము, జీర్ణజ్వరము, వమనము, శిరోరోగము, అగ్నిమాంద్యము, దారుణరోగము హరించు. ఇది స్వచ్ఛందభైరవ మనఁబడు. దీనిని వైద్యుఁడు బాగుగా నెఱిఁగి ప్రయోగింపవలయును. దీని యందు రోగబలాబలము నెఱింగి పెరుగన్నము నొసంగుట పథ్యము.

### త్రిదోషజ్వరములకు జ్వరాంకుశము

రసస్య ద్విగుణం గంధం గంధతుల్యం తు టంకణం,
రసతుల్యం విషం యోజ్యం మరిచం పంచధా విషాత్. 400
కట్ఫలం దంతిబీజంచ ప్రత్యేకం మరిచోన్మితం,
జ్వరాంకుశో రసోహ్యేష చూర్ణయేదతిచిక్కణమ్. 401
మాషైకేన నిహంత్యాశు జ్వరం జీర్ణం త్రిదోషజమ్,

(మాధవనిదానే)

తా. శుద్ధిచేసినరసము, దీనికి రెండింతలు గంధకము, దీనికి సమము వెలిగారము, రసమునకు సమము నాభి, రసమునకు ౫ భాగములు మిరియాలు, కాయఫలము నేపాళములు ఇవి మిరియాలకు సమభాగము-ఇటుల వీని నన్నిటిని చేర్చి చక్కగా చూర్ణముచేసిన నది జ్వరాంకుశరస మనఁబడు. దీని నొకమాషప్రమాణము నిప్పించిన జీర్ణజ్వరము త్రిదోషజ్వరము నివర్తించును.

### అష్టవిధజ్వరములకు జ్వరాంకుశము

మరిచం టంకణం శంఖచూర్ణం పారద గంధకమ్. 402
శోధితం బ్రహ్మపుత్రంచ భాగమేకం వినిక్షిపేత్,
గుంజామాత్రం ప్రదాతవ్యం నాగవల్లీదళైస్సహ. 403

జ్వరాంకుశోరసోహ్యేష జ్వరమష్టవిధం జయేత్, (సిద్ధరసార్ణవే)

తా. మిరియాలు, వెలిగారము, శంఖచూర్ణము, శుద్ధిచేసినరసము, గంధకము, శుద్ధిచేసిననాభి ౧ భాగము వీనినన్నిటినిచేర్చి మర్దించి గురిగింజయెత్తు తమలపాకులో నిచ్చించిన ఎనిమిదివిధములగుజ్వరములు నివర్తించును. ఇది జ్వరాంకుశ మనఁబడును.

విషమజ్వరములకు జ్వరాంకుశము

శుద్ధసూతం తథా గంధం కర్షమానం నయేద్బుధః. 404
మహౌషధం టంకణంచ హరితాళం తథా విషమ్,
రసార్ధం మర్దయే త్ఖల్వే భృంగరాజరసేనతు. 405
త్రిదినం భావనాం దత్వా చతుర్థే వటికాం తతః,
కుర్యాచ్చణకమాత్రంచ పిప్పలీ మధుసంయుతః. 406
ఏషజ్వరాంకుశోనామ విషమజ్వరనాశనః, (రసరత్నాకరే)

తా. శుద్ధిచేసినరసము, గంధకము ఇవి కర్షప్రమాణము, సొంటి, వెలిగారము, శుద్ధహరిదళము, శుద్ధనాభి ఇవి రసమునకు అర్ధభాగము, ఇటుల వీని నన్నిటినిచేర్చి ఖల్వములోవేసి మర్దించి గుంటగలగరాకురసముతో మూడుదినములు భావనచేసి నాలవదినమునందు సెనగలంతమాత్రలుచేసి పిప్పలి, తేనె వీని యనుపానముతో నిచ్చించిన విషమజ్వరములు హరించును ఇది జ్వరాంకుశ మనఁబడును.

భేదిజ్వరాంకుశము

పారదం వత్సనాభంచ ప్రత్యేకం నిష్కసమ్మితమ్. 407
ద్వినిష్కం గంధకంచైవ టంకణంచ ద్వినిష్కకం,
మరిచం పంచనిష్కంస్యా త్షణ్ణిష్కం దంతిబీజకమ్. 408
సింహీఫలరసైర్మర్ద్యం ద్వియామం శ్లక్ష్ణతాం నయేత్,
గుంజామాత్రం వటీంకృత్వా ఛాయాశుష్కంచ కారయేత్. 409
ఆర్ద్రికద్రవసంయుక్తం జ్వరేజీర్ణే ప్రయోజయేత్,
సర్వజ్వరహరం శీఘ్రంనామ్నా భేదిజ్వరాంకుశమ్. (గ్రంథాంతరే)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినవసనాభి ఇవి దినుసొకటింటికి నిష్కప్రమాణము, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసినవెలిగారము ఇవి దినుసొకటింటికి ౨ నిష్కములు, మిరియాలు ౫ నిష్కములు, శుద్ధిచేసిననేపాళములు ౬ నిష్కములు-ఇటుల వీనిని ఖల్వములో నునిచి ౨ ఝాములు ములకపండ్లరసముచే బాగుగా మర్దించి గురిగింజ అంతేసి మాత్రలుచేసి నీడ నెండించ్చి యం దొకదానిని అల్లపురసానుపానముతో జ్వర

క్వ కాలమునం దొసంగిన సర్వజ్వరములు కడుశీఘ్రముగ నశించు. ఇది భేదిజ్వరాంకుశ
మనఁబడు.

జ్వరములకు రాజచండీశ్వరరసము

రసంగంధంవిషంశుల్బం వహ్నినీరేణమర్దయేత్,
గుంజాప్రమాణకంచైవ దత్తం హంతి క్షణేజ్వరమ్. 411
తైలాభ్యంగం జలస్నానం తృష్ణార్తా తక్రసేవనం,
గాత్రే చందనలేపంతు సుఖం తాంబూలచర్వణమ్. 412
ఇక్షుపానంచ పానీయం దైహానివివిధానిచ.
రాజచండీశ్వరోనామ రసానాముత్తమోత్తమః. (సిద్ధవిద్యాభూః)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసినవసనాభి, తామ్రభస్మము నిని సమభాగములుగా గ్రహించి ఖల్వములో నునిచి చిత్రమూలరసముచే నొకదినము గుగా మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి అల్లపురసముతో నొసంగిన తత్క్షణమున జ్వరము హరించు. తేనె పిప్పళ్లతో నొసంగిన పురాణజ్వరములు నిశ్చయముగ హరించు. ంతేయు నీయౌషధసేవనకాలంబున తైలాభ్యంజనము, శీతోదకస్నానము, దప్పి గలిగిన జ్జిగను సేవించుట, శ్రీగంధలేపనము, తాంబూలసేవన, చెఱకురసమును పానము యుట, శీతోదకపానము, ఇతరదేహోపచారములు వీని నాచరింపవలయును. ఇది రాజ ండీశ్వరరస మనఁబడు. సర్వరసంబులలో కడుశ్రేష్ఠంబు.

జ్వరములకు సూతరాజీయము

సూతం షోడశతత్సమోదినకరస్తస్యార్ధభాగోబలిః
తద్వత్సింధుజసూక్ష్మచూర్ణమృదితం *షడ్భాగకం టంకణం,
జంబీరస్వరసేన తద్దినకరే తప్తం సుపక్వం భవేత్
కాసశ్వాసగుల్మశూలముదరం పాండుజ్వరం నాశయేత్. 414

(రసరత్నాకరే)

తా. శుద్ధిజేసినపాదరసము ౧౬ భాగములు, తామ్రభస్మము ౧౬ భాగములు ద్ధిజేసినగంధకము ౮ భాగములు, సైంధవలవణము ౮ భాగములు, శుద్ధిచేసినవెలిగా ము ౬ భాగములు-ఇటుల వీనినెల్ల గ్రహించి ఏకముజేసి ఖల్వములో నునిచి నిమ్మపండ్ల సముచే నొకదినము బాగుగా మర్దించి యెండ నెండించిన పక్వంబగును. పిదప దానిని డ్డకయెత్తుమాత్రలు జేసి తేనె పిప్పళ్ళ వీని యనుపానముతో సేవించినను, లేక అల్లపు

* తస్యాంశకం టంకణం అనియు పాఠాంతరము గలదు.

రసముతో సేవించినను, కాసశ్వాసములు, గుల్మము, శూలలు, ఉదరరోగములు, పాండువు, పురాణజ్వరములు హరించు.

## జ్వరములకు కాలాగ్నిరుద్రరసము

భస్మసూతస్య సంగ్రాహ్యం పలమేకం నియోజయేత్,
చతుష్పలం తామ్రభస్మగంధకంచ చతుష్పలమ్. 415
తాళకం పలమేకంతు పలమేకంతు టంకణం,
పలార్ధం వత్సనాభంతు జంబీరామ్లేన పేషయేత్. 416
చిత్రమూలరసేనాపి మర్దయిత్వా పృథక్పృథక్,
హంసపాదీరసేనాపి మర్దయేద్యామమాత్రకమ్. 417
అయంకాలాగ్నిరుద్రస్స్యాన్నామ్నా రోగార్తినాశనః,
వ్రీహిమాత్రప్రయోగేణ జ్వరాన్ ఘోరాన్నివర్తయేత్. 418
రసేంద్రో హంతి చ వ్యాధీన్ రసస్సర్వత్ర పూజితః,
(పూజ్యపాదీయే

తా. రసభస్మము ౧ పలము, తామ్రభస్మము ౧ పలము, శుద్ధిచేసినగంధకము ౪ పలములు, శుద్ధిచేసినతాళకము ౧ పలము, శుద్ధిచేసిన వెలిగారము ౧ పలము, శుద్ధిచేసినవసనాభి ౺ పలము ఇటుల వీనినెల్ల గ్రహించి ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసము చిత్రమూల *రసము, హంసపాదియాకురసము-వీనిలో ప్రతివానిచే నొక్కొకరుఘామ బాగుగా మర్దించి వరిగింజలంతేసి మాత్రలు జేసి యందొకదానిని అల్లపురసముతోగాని లేక పిప్పళ్లు, జీలకఱ్ఱ వీనియనుపానముతోగాని సేవించిన ఘోరజ్వరములు హరించు మఱియు నీరసము సర్వవ్యాధుల నశింపజేయుటచే సర్వత్ర పూజితంబుగ నున్నయది.

## జ్వరములకు నవరత్నాగ్నికుమారము

పారదం పంచలవణం నవరత్నసమం సమమ్. 419
మర్దితం తరుణద్రావైః ఖల్వమధ్యే దినద్వయమ్,
కాచకుప్యాంతరే క్షిప్త్వా వాలుకాయంత్రకే పచేత్. 420
షడ్యామాంతే సముద్ధృత్య సూక్ష్మచూర్ణంతు కారయేత్,
అనుపానవిశేషేణ సర్వరోగహరం పరమ్. 421
గుంజామాత్రం ప్రదాతవ్య మిచ్ఛాపథ్యం ప్రదాపయేత్,

* కషాయము.

రసోహ్యగ్నికుమారోయం రత్నాఖ్యేన భిషగ్వరైః. 422
(మాధవనిదానే)

తా. శుద్ధిచేసినరసము, పంచలవణములు, నవరత్నభస్మములు- వీనిని సమభాగ
ములుగా గ్రహించి ఉలిమిడివేళ్ళరసముచే రెండుదినములు మర్దించి గాజుకుప్పెలోనునిచి
వాలుకాయంత్రమునం దిడి ఆరుఝాములువండి సాంగశీతలమున దీసి చూర్ణముచేసి గురి
గింజప్రమాణమును అనుపానవిశేషములచే నిచ్చిన సర్వజ్వరములు హరించు. దీనియందు
పథ్యాపథ్యం బిడవలయు. ఇది నవరత్నాగ్నికుమారరస మనఁబడును.

## జ్వరములకు సిద్ధాగ్నికుమారము

సశుద్ధపారదం గంధం టంకణం వత్సనాభికం,
అర్కపత్రరసైర్మర్ద్యం వజ్రమూషాంతరే క్షిపేత్. 423
వాలుకాయంత్రకే పాచ్యం పుటమేకం తు భూధరే,
సాంగశీతలముద్ధృత్య గుంజామాత్రం ప్రదాపయేత్. 424
సిద్ధాఖ్యోయమితిఖ్యాతో రసోహ్యగ్నికుమారకః, (ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసినరసము, గంధకము, వెలిగారము, వసనాభి-వీనిని జిల్లేడాకురసముచే
బాగుగామర్దించి వజ్రమూషలో నునిచి చీలమన్నుఇచ్చి యామూషను వాలుకా యంత్ర
మునం దునిచి భూధరపుటం బిడి సాంగశీతలమున దీసి గుంజాప్రమాణమును అనుపాన
విశేషములచే నిచ్చిన సర్వజ్వరములు హరించు. ఇది సిద్ధాగ్నికుమారరస మనఁబడును.

## జ్వరములకు లఘ్వగ్నికుమారము

పారదం టంకణం గంధం తాళకంచ మనశ్శిలా. 425
సర్వం హంసపదిద్రావై ర్దినమేకంతు మర్దయేత్,
కాచకుప్యాం నివేశ్యాథ వాలుకాయంత్రకే పచేత్. 426
షడ్యామాంతే సముద్ధృత్య దేయం గుంజానుపానతః,
విఖ్యాతమితి లఘ్వగ్నికుమారోయం మహారసః. (రసరత్నాకరే)

తా. శుద్ధిచేసినరసము, వెలిగారము, ఆమ్లసారగంధకము, తాళకము, మణిశిల
వీని సమభాగములుగా జేర్చి హంసపాదియాకురసముచే నొకదినము మర్దించి గాజుకు
ప్పెలో నునిచి దానిపై చీలమన్ను పూసి వాలుకాయంత్రములో నునిచి ౬ ఝాములు
వండి సాంగశీతలమునదీసి గురిగింజప్రమాణమును అనుపానవిశేషములచే నిచ్చిన సర్వజ్వర
ములు హరించు. ఇది లఘ్వగ్నికుమారరస మనఁబడును.

## ౼ పురాణజ్వరములకు త్రిలోచనము ౼

శుద్ధసూతం సమంగంధం సూతాంశం మృతమభ్రకం,
త్రిభస్తుల్యైర్గవాంక్షీరై మర్దయేదాతపేఖరే. 428
నిర్గుండ్యాశ్చ ద్రవైర్మర్ద్యం దినైకం తచ్చ గోళకం,
త్రియామం వాలుకాయంత్రే స్యథ మూషాగతం పచేత్, 429
ఆదాయ చూర్ణయే త్తుల్యే హ్యష్టమాంశం విషం క్షిపేత్,
త్రిలోచనరసోనామ్నా చేయం గుంజాద్వయం ద్వయమ్. 430
పంచకోలం పిబేచ్చానుపథ్యం ఛాగపయ స్తథా,
సన్నిపాతం త్రిదోషోత్థం సాధ్యాసాధ్యం న సంశయః. 431
పశుగంధా పూతికర్ణి సిందువారకచిత్రకం,
మేషశృంగీహ్యపామార్గో గ్రంథికం త్ర్యూషణం వచా. 432
క్వాథ మష్టావశేషం తు సన్నిపాతా న్నిహంతి చ,
త్రయోదశవిధాంశ్చైవ పురాణజ్వరనాశనమ్. 433
మృత్యుంజయకషాయేణ సారకాసానిహంతిచ, (పూజ్యపాదీయే

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, అభ్రకభస్మము వీనిని సమభాగములుగా గ్రహించి ఖల్వములోనునిచి వానికిసమముగా ఆవుపాలుపోసి బాగుగా మర్దించి తీక్ష్ణమైనయెండ నెండించి పిదప వావిలాకురసముచే ౧ దినము మర్దించి ముద్దచేసి మూస లోనునిచి వాలుకాయంత్రమునందిడి మూడుఝాములువండి సాంగశీతలమున దీసి ఖల్వములో నునిచి దానికెనిమిదవభాగము శుద్ధిచేసిన నాభినికలిపి మర్దించి చూర్ణముచేసి కొండేసిగురిగింజలయెత్తు [1]పంచకోలకషాయానుపానముతో సేవించిన త్రిదోషమువలన జనించి సాధ్యాసాధ్యంబుగ నుండు సన్నిపాతములు నిస్సంశయముగా హరించు. ఇది త్రిలోచనరస మనఁబడు. మఱియు దీనిని నెమలిచెక్క, క్రానుగు, వావిలి, చిత్రమూలము, [2]మొక్కము, ఉత్తరేణి, మోడి, త్రికటుకములు, వస-వీనినివేసి అష్టావశేషముగా కాచఁబడిన కషాయానుపానముతో సేవించిన పదమూడు సన్నిపాతములు, పురాణజ్వరములు, అతిసారము, కాసము ఇవి హరించు. ఇది మృత్యుంజయకషాయ మనఁబడు. ఈ యౌషధసేవనకాలమునందు మేకపాలను పథ్యమునందు జేర్చికొనవలయును.

---

1 పంచకోలమనఁగా—పిప్పళ్లు, మోడి, చెవ్యము, చిత్రమూలము, సొంటి
2 ఇదే వద్ధిచెక్క.

### సర్వజ్వరములకు సింహప్రతీపాలనము

సూతం గంధక వత్సనాభ గరళం చైకైకభాగాన్వితం
సర్వం మర్దితహంసపాది స్వరసే గుంజేనమాత్రామితం,
తైలాభ్యంగజలోపచారకథితం పథ్యంచ దధ్యోదనం
సర్వంకాంతి మనేకదోషశమనం సింహప్రతీపాలనమ్. 434
(ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసినరసము, గంధకము, నాభి, గరళము.- వీనిని సమభాగములుగా గ్రహించి పెద్దహంసపాదియాకురసముచే మర్దించి గురిగింజలంత మాత్రలుచేసి అనుపాన విశేషములతో నిప్పించిన అనేకదోషములచే జనించిన జ్వరములు శమించు. దీనియందు తైలాభ్యంగము, శీతజలోపచారము, పెరుగన్నభోజనము వీనిని చేయించవలయు. ఇది సింహప్రతీపాలన మనఁబడును.

### సర్వజ్వరములకు ఆనందభైరవము

సౌభాగ్యహింగుళకణం గరళం మరీచం
సంమర్ద్య నిందకరసేన దినత్రయంచ,
ఆనందభైరవవటీ తువరీప్రమాణం
నానానుపానసహితం సకలామయఘ్నమ్. (నిత్యనాథీయే) 435

తా. శుద్ధిచేసిన వెలిగారము, శుద్ధిజేసిన ఇంగిలీకము, పిప్పళ్లు, శుద్ధిజేసిన వసనాభి, మిరియాలు వీనిని సమభాగములుగా ఖల్వములో నునిచి వేఁపచెక్కరసముచే మూడుదినములు మర్దించి కందిగింజలంతేసి మాత్రలుచేసి యందొకదానిని అనుపానవిశేషములతో నొసంగిన సర్వజ్వరములు హరించు. ఇది ఆనందభైరవ మనఁబడు. (దీనిని నేత్రముల కంజనమువేసిన సన్నిపాతములు హరించు.)

### ముహూర్తములో నవజ్వరములను హరించెడి రత్నగిరిరసము

శుద్ధసూతం సమంగంధం మృతతామ్రాభ్రహాటకం,
ప్రత్యేకం సూతతుల్యం స్యాత్సూతార్ధం మృతలోహకమ్. 436
లోహార్ధం మృతవైక్రాంతం మర్దయేద్భృంగజద్రవైః,
పర్పటీరసవత్పాచ్యం చూర్ణితం భావయేత్పృథక్. 437
శిగ్రువాసకనిర్గుండీ. వచాగ్నిభృంగముండికైః,
ద్రాక్షామృతాజయంతీభి ర్మునిబ్రహ్మీసుతిక్తకైః. 438
కన్యాయాశ్చ ద్రవైర్భావ్యం ప్రతివారై స్త్రిధాత్రిధా,

రుద్ధ్వాలఘుపుటేపాచ్యా వాలుకాయంత్రమధ్యగా. 43
యంత్రం నిరుధ్య యత్నేన స్వాంగశీతం సముద్ధరేత్,
చూర్ణం నవజ్వరే దేయం మాషమాత్రం లసస్యవై. 44
కృష్ణాధాన్యసమాయుక్తం ముహూర్తాన్నాశయేజ్జ్వరం,
అయం రత్నగిరిర్నామ రసోయోగస్య వాహకః. (నిత్యనాథీయే

తా. శుద్ధిచేసినరసము, గంధకము, తామ్రభస్మము, అభ్రకభస్మము, స్వ భస్మము - ఇవి ప్రత్యేకము సమభాగములు, లోహభస్మము రసములో 4 భాగవ వైక్రాంతభస్మము లోహభస్మములో 4 భాగము - ఇటులగ్రహించి గుంటగలగరాకు ముచే మర్దించి పర్పటీరసమును చేర్చి పాకమునుచేసి పిదప దానిని చక్కగా చూర్ణముచే మునగ, అడ్డసరము, వావిలి, వస, చిత్రమూలము, గుంటగలగర, బోదతరము, ద్రా లిప్పతీగె, తక్కోడు, మోదుగు, బ్రాహ్మి, చేదుపొట్ల, కలబాద - వీనిరసముల ప్రత్యేకముగా నొక్కొకదినము మూడుపర్యాయములుభావన చేసి మూతుళ్ళలో నుని చీల చేస్సిలఘుపుటంబిడి పిదప వాలుకాయంత్రమధ్యములో నునిచి పాకముచేసి స్వాం శీతలమున దించుకొని చూర్ణముచేసి మాషప్రమాణమును పిప్పళ్ళు, ధనియాలు వీనియ పానముతోడ నిప్పించిన ఒకముహూర్తములో నవజ్వరములు నివర్తించును. ఇది రత్న రస మనఁబడును. యోగవాహకమైనది.

## సర్వజ్వరములకు చండేశ్వరరసము

రసం గంధం విషం తామ్రం మర్దయేదేకయామకం,
ఆర్ద్రికస్య రసేనైవ మర్దయే త్సప్తవారకమ్. 44
నిర్గుండ్యా స్వరసే పశ్చా న్మర్దయే త్సప్తవారకం,
గుంజైకార్ద్రిరసేనైవా దత్వా హంతి జ్వరం క్షణాత్. 44
వాతజం పిత్తజం శ్లేష్మ ద్విదోషజమపి క్షణాత్,
సుశీతలజలే స్నానం తృష్ణార్తే క్షీరభోజనమ్. 44
ఆమ్రంచ పనసంచైవ చందనాగురు లేపనం,
ఏతత్సమో రసోనాస్తి వైద్యానాం హృదయంగమః 4
ఏషచండేశ్వరోనామ సర్వజ్వరకులాంతకృత్, (రసరత్నాక

తా. శుద్ధిచేసినరసము, గంధకము, నాభి, తామ్రభస్మము-వీటిని అల్లపురసము నొకఝాము మర్దించవలయు. ఇటుల నేడుపర్యాయములు మర్దించి పిదప వావిలియా స్వరసముచే నేడుపర్యాయములు మర్దించి గురిగింజప్రమాణమును అల్లపురసముతో నిప్పి

న వాతము, పిత్తము, శ్లేష్మము, ద్వంద్వదోషము, వీనివలన జనించిన జ్వరములు అతి
ప్రముగా నివర్తించును. మిగులశీతలముగ నుండు జలస్నానము, దప్పిగలిగిన క్షీర
పానము, మామిడిపండ్లను, పనసపండ్లను భుజించుట, చందనము, అగరు వీనిలేపనము
నా మొదలగువాటిని చేయించవలయు. దీనికి సమమైనరసము లేదు. ఇది వైద్యుల మన
ను మిగుల సంతోషపఱచును. దీనికి చండేశ్వరరస మని నామము గలదు. ఇది సమస్త
రకులమును హరింపఁజేయును.

సర్వజ్వరములకు శ్రీజయమంగళరసము

హింగూలసంభవం సూతం గంధకం టంకణం తథా. 446
తామ్రవంగం మాక్షీకంచ సైంధవం మరిచం తథా,
సమంసర్వం సమాహృత్యద్విగుణం స్వర్ణభస్మకమ్. 447
తదర్థం కాంతలోహంచ రూప్యభస్మాపి తత్సమం,
ఏతత్సర్వం విచూర్ణ్యాథ భావయేత్కనకద్రవైః. 448
శేఫాలీదళజైశ్చాపి దశమూలరసేనచ,
కిరాతతిక్తకక్వాథై స్త్రివారం భావయేత్సుధీః. 449
భావయిత్వా తతఃకుర్యా ద్గుంజాద్వయమితాంవటీం,
అనుపానం ప్రయోక్తవ్యం జీరకం మధుసంయుతమ్. 450
జీర్ణజ్వరం మహాఘోరం చిరకాలసముద్భవం,
జ్వరమష్టవిధం హంతి సాధ్యాసాధ్యమథాపివా. 451
పృథగ్దోషాంశ్చ వివిధాన్ సమస్తాన్ విషమజ్వరాన్,
మేదోగతం మాంసగత మస్థి మజ్జాగతం తథా. 452
అంతర్గతం మహాఘోరం బహిఃస్థంచ విశేషతః,
నానాదోషోద్భవం చైవ జ్వరం శుక్రగతం తథా. 453
నిఖిలం జ్వరనామానం హంతి శ్రీశివశాసనాత్,
జయమంగళనామాయం రసశ్శ్రీశివనిర్మితః. 454
బలపుష్టికరశ్చైవ సర్వరోగనిబర్హణః, (సిద్ధరసార్ణవే)

తా. ఇంగిలీకములో నెత్తబడి శుద్ధిజేయఁబడిన రసము, శుద్ధిజేసినగంధకము,
శుద్ధిజేసినవెలిగారము, తామ్రభస్మము, వంగభస్మము, హేమమాక్షికభస్మము, సైంధవ
లవణము, మిరియాలు-ఇవి దినుసుకొక్కొకభాగము, సువర్ణభస్మము ౨ భాగములు,
కాంతభస్మము, లోహభస్మము-ఇవి దినుసుకొక్కొకభాగము, రజతభస్మము ౨ భాగ

ములు-ఇటుల వీని నన్నిటిని ఖల్వములో నునిచి చూర్ణము జేసి ఉమ్మెత్తరసము, నల్లవావిలి యాకురసము, *దశమూలముల రసము, నేలవేముకషాయము-వీనిచే ప్రత్యేక ప్రత్యేకముగా మూడేసిమారులు భావనజేసి పిదప ౨ గురిగింజలం తేసి మాత్రలుజేసి యందొకదానిని జీలకఱ్ఱ తేనె వీనియనుపానముతోడ సేవించిన కడుభయంకరమై దీర్ఘకాలముగా వేధింపుచుండు జీర్ణజ్వరము, సాధ్యాసాధ్యముగనుండు ఎనిమిదివిధజ్వరములు, వాతాదులచే ప్రత్యేకముగా జనించినజ్వరములు, ద్వంద్వజ్వరములు, సన్నిపాతజ్వరములు, విషమజ్వరములు, మేదోగత మాంసగత అస్థిగత మజ్జాగతజ్వరములు, కడు భయంకరమైన అంతర్గతజ్వరములు, బహిర్గతజ్వరములు, నానాదోషములచే జనించిన జ్వరములు, శుక్రగతజ్వరము - ఈమొదలగు సర్వజ్వరములను ఈశ్వరునియాజ్ఞచే హరింపఁజేయును. ఇది ఈశ్వరనిర్మితంబయిన జయమంగళరసము. ఇది బలమును పుష్టిని గలుగఁజేయుటయే గాక సర్వరోగములనుకూడా హరింపఁజేయును.

### సర్వజ్వరములకు మృత్యుంజయరసము

విషస్యైకం తథాభాగం మరిచం పిప్పలీకణా. 455
గంధకస్యతథాభాగం భాగంస్యాట్టంకణస్యవై,
సర్వత్ర సమభాగం స్యా ద్ద్విభాగం హింగుళం భవేత్. 456
జంబీరస్య రసేనాత్ర భావ్యం హింగుళశోధితం,
రసశ్చే త్సమభాగంస్యా ద్ధింగుళం నేష్యతే తదా. 457
గోమూత్రశోధితం చాత్రం విషం సౌరవిశోధితం,
చూర్ణయేత్ఖల్వమధ్యేతు ముద్గమాత్రాం వటీంచరేత్. 458
మధునాలేహనం ప్రోక్తం సర్వజ్వరనివృత్తయే,
దధ్యుదకానుపానేన వాతజ్వరనిబర్హణః. 459
ఆర్ద్రికస్వరసే పానం దారుణే సాన్నిపాతికే,
జంబీరరసయోగేన అజీర్ణజ్వరనాశనః. 460
అజాజీగుడసంయుక్తో విషమజ్వరనాశనః,
జీర్ణజ్వరే మహాఘోరే పురుషే యౌవనాన్వితే. 461
పూర్ణమాత్రా ప్రదాతవ్యా పూర్ణం వటిచతుష్టయం,
అతిక్షీణేతివృద్ధేచ శిశౌచాల్పవయస్యపి. 462

---

* దశమూల మన—మారేడు, తక్కలి, దుందిలము, గుమ్ముడు, కలిగొట్టు, కోలపొన్న, నేలపొన్న, చిన్నములక, పెద్దములక, పల్లేరు.

తుర్యమాత్రా ప్రదాతవ్యా వ్యవస్థాసారనిశ్చితా,
నవజ్వరే ప్రదానేచ యామైకాన్నాశయేజ్జ్వరమ్. 463
అతిక్షీణేచ కఫాభావే దాహేవా వాతపైత్తికే,
సితాదద్యాత్ప్రియత్నేన నారికేళాంబునిర్భయమ్. 464
అయం మృత్యుంజయోనామ రసస్సర్వజ్వరాపహః,
అనుపానప్రభేదేన నిహంతి సకలాన్గదాన్. (నిత్యనాథీయే) 465

తా. గోమూత్రములో శుద్ధిచేసిననాభి ౧ భాగము, మిరియాలు, పిప్పళ్ళు, ాడి, శుద్ధగంధకము - ఇవి దినుసుకు ౧ భాగము, వెలిగారము ౧ భాగము, నిమ్మ డ్లరసముచే శుద్ధిచేయఁబడిన ఇంగిలీకము వానికన్నిటికి ౨ భాగములు ఇటుల వీని టిని ఖల్వమునం దునిచి చక్కఁగా చూర్ణముచేసి పెసరగింజంతమాత్రలు చేయ యును. దీనియందు నాభి మొదలైనవానికి సమభాగముగా రసమును చేర్చుపక్షములో గిలీకమును చేర్పంజనదు. ఈమృత్యుంజయరసమును సమస్తజ్వరములయందు తేనెలో ంది నాకించవలయును. పెరుగు, ఉదకము వీనియనుపానముతో నిప్పించిన వాత రము, అల్లపురసముతో నిప్పించిన దారుణమైన సన్నిపాతజ్వరములు, నిమ్మపండ్ల ముతోడ నిప్పించిన అజీర్ణజ్వరము, జీలకఱ్ఱ బెల్లము వీనియనుపానముతోడ నిప్పిం వ విషమజ్వరము ఇవి నివర్తించును. దారుణమైన జీర్ణజ్వరమునందు యౌవనవయస్సు ల పురుషునికి సంపూర్ణమాత్రగా (అనఁగా పెసరగింజంత) పరిమాణముగల నాలుగు ాత్రల నిప్పించవలయును. అతిక్షీణుఁడు, వృద్ధుఁడు, శిశువు, స్వల్పవయస్సుగలవారు ికి తుర్యమాత్రగా (అనఁగా పూర్ణమాత్రలో నాలవభాగము) నిప్పించవలయును. వజ్వరములయం దిప్పించిన ౧ ఝాములోపల జ్వరము నివర్తించును. వాతపిత్తమువలన ించిన తాపమునందు పంచదారతోను పైమాత్ర నిప్పించి నారికేళోదకమును భయము క ప్రయత్నముతో నిప్పించవలయును. ఇది మృత్యుంజయరస మనఁబడును. మస్తజ్వరములను పోఁగొట్టును. మఱియు నిది అనుపానభేదముచే సమస్తరోగములను ఁగొట్టును.

### తరుణాదిజ్వరములకు ప్రళయానలరుద్రరసము

హింగుళోత్థరసంభాగం ద్వౌభాగానిచ గంధకం,
బాణభాగాభ్రగోదంతం శాలభాగం మనశ్శిలా. 466
టంకణం నేత్రభాగంచ రసితం ఋతుభాగికం,
ఏకభాగంచ నేపాళం ద్విభాగంచ హాలాహలమ్. 467

దరదం చార్ధభాగంచ లోహం తామ్రంచ భాగికం,
సర్వంఖల్వోదరే స్థాప్యం క్షీరేణార్కస్యమర్దయేత్. 468
సింధువారాగ్నిదత్తూరజంబీరః కారవల్లికా,
గంధతాళవిషమ్లేచ్ఛ భాగాగ్రం నిక్షిపేద్బుధః. 469
దశమూలకషాయేణ మర్దయే ద్యామయుగ్మకం,
పంచకోలకషాయేణ మర్దయే ద్యామమాత్రకమ్. 470
నిక్షిప్య తామ్రపాత్రేణ ద్వియామా వాలుకాగ్నినా,
సాంగశీతలముద్ధృత్య వల్లమాత్రకమేవచ. 471
యోజయేత్తరుణోపేతే దోషవాతజ్వరేపి చ,
పిత్తవాతగతేచైవ ప్రత్యహం తరుణేపి వా. 472
చాతుర్థిక త్రిరాత్రేచ అన్యత్ర వివిధజ్వరః,
అమందాద్దీపనం జ్ఞేయో దాహస్వేదోల్బణం జయేత్. 473
పయశ్శాల్యోదనం పథ్యం దధితక్రసమన్వితం,
సితయామిశ్రతోయేన నారికేళాంబునా తథా. 474
కదళీఫలపక్వాని పునస్సర్వేషు నాళితః,
తాంబూలచందనోన్మిశ్రం దేయోదద్యా ద్భిషగ్వరైః. 475
వాపీకూపతటాకానాం స్నానంకుర్యాద్యథేచ్ఛయా,
ప్రళయానలరుద్రాఖ్యో రసఃకోలాగ్నిభైరవః. (ఆయుర్వేదే) 476

తా. ఇంగిలీకములోనుండి తీయఁబడినరసము (అనఁగా బాలరసము) ౧ భాగము, గంధకము ౨ భాగములు, తాళకము అభ్రకము ఇవి ౫ భాగములు, మణిశిల ౩ భాగములు, వెలిగారము ౨ భాగములు, ఉల్లిపాషాణము ౬ భాగములు, నేపాళము ౧ భాగము, హలాహల మను విషము ౨ భాగములు, ఇంగిలీకము ౮ భాగములు, లోహమండూరము ౧ భాగము, తామ్రభస్మము ౧ భాగము - వీనినన్నిటిని శుద్ధిచేసి ఖల్వమునం దునిచి జిల్లేడుపాలతో మర్దించి పిదప వావిలాకు, చిత్రమూలము, ఉమ్మెత్త, నిమ్మ, కాకర వీనిరసములతో మర్దించి అందులో గంధకము, తాళకము, నాభి, ఇంగిలీకము వీటిని మునుపుచెప్పిన భాగములచొప్పున చేర్చి దశమూలకషాయముచే ౨ ఝాములు, పంచకోలకషాయముచే ౧ ఝాము మర్దించి తామ్రపాత్రలో నునిచి రెండుఝాములు వాలుకాయంత్రములో పాకముచేసి సాంగశీతలమున దీని వల్లప్రమాణము సేవించిన తరుణజ్వరములు, దోషజ్వరములు, వాతజ్వరములు

పిత్తవాతజ్వరములు, ప్రత్యహామునుండు తరుణజ్వరములు, చాతుర్థికజ్వరములు, త్ర్యాహిక జ్వరములు, పలువిధములైన ఇతరజ్వరములు ఇవి యన్నియు హరించు. మఱియు అగ్ని మాంద్యము, దాహము, మిక్కుటముగా స్వేదము ఇవికూడా హరించును. శాల్యన్నమును పాలు పెరుగు మజ్జిగ వీనిసహితముగా భుజించవలయును. పంచదారపానకమునుగాని, నారికేళోదకమును గాని పానముచేయించవలయును. అరటిపండ్లు మొదలగువానినికూడా భుజింపవచ్చును. తాంబూలభక్షణము, చందనలేపనము వీనిని వైద్యుఁడు చేయించ వలయును. కోనేరు, నుయ్యి, తటాకము-వీనియందు యథేచ్ఛగా స్నానము చేయించ వలయును. ఇది ప్రళయానలరుద్రరస మనియు, కాలాగ్నిభైరవ రసమనియు చెప్పఁ బడును.

### సర్వజ్వరములకు తరుణార్కరసము

గంధకం టంకణం చాభ్రం నాభిదుత్తూరబీజకం,
కృష్ణసర్పస్య గరళం రక్తచందన వంగకమ్. 477
ఏతాని సమభాగాని సర్వత్ర సమహింగుళం,
మాతులుంగరసైర్మర్ద్యం త్రిదినంచ మహామృదు. 478
వటికా సర్షమాత్రేణ హ్యనుపానవిశేషతః,
తరుణార్కరసోఖ్యాత స్సర్వజ్వరనివారణః. (ఆయుర్వేదే) 479

తా. శుద్ధిచేసినగంధకము, వెలిగారము, అభ్రకభస్మము, శుద్ధిచేసిననాభి, ఉమ్మెత్త విత్తులు, నల్లత్రాఁచువిషము, రక్తచందనము, వంగభస్మము-ఇవి సమభాగములు, వీని యన్నిటికిని సమము శుద్ధిచేసిన ఇంగిలీకము - ఇటుల వీని నన్నిటిని చేర్చి మాదీఫలరసముచే మూఁడుదినములు మృదువుగా మర్దించి ఆవగింజలంతేసి మాత్రలుచేసి అనుపానవిశేషము చే నిచ్చిన సర్వజ్వరములు హరించు. ఇది తరుణార్కరస మనఁబడును.

### అసాధ్యజ్వరాదులయందు కల్పతరురసము

రసం గంధం విషం తామ్రం సమభాగం ప్రచూర్ణయేత్,
భావయే త్పంచభిః పిత్తైః క్రమశః పంచవాసరమ్. 480
నిర్గుండీ స్వరసేనైవ మర్దయే త్సప్తవాసరం,
ఆర్ద్రికస్య రసేనైవ భావయేచ్చ త్రిధాపునః. 481
సర్షపాభావటీకార్యా ఛాయయా పరిశోషితా,
తతస్సప్తవటీయోజ్యా యావన్న త్రిగుణాభవేత్. 482
వయోగ్నిదోషగం బుధ్వా ప్రయోజ్యాభిషజాంవరైః,

అనుపానంచోష్ణజలం కజ్జలీపిప్పలీయుతమ్. 483
పానావశేషే ప్రస్వాప్య వస్త్రైరాచ్ఛాదయేన్నరం,
ఘర్మాభ్యాగమనం యావత్తతోరోగాత్ప్రముచ్యతే. 484
రోగిణం స్వాపయిత్వాతు భోజయేత్ససితం దధి,
ఏషకల్పతరుర్నామ రసః పరమదుర్లభః. 485
అసాధ్యం చిరకాలోత్థం జీర్ణంచ విషమజ్వరం,
హంతి జ్వరాతిసారౌచ గ్రహణీం పాండు కామలామ్. 486
నదేయ శ్శ్వాసకాసేచ శూలయుక్తే నరేతథా,
గోపనీయః ప్రయత్నేన నదేయో యస్య కస్యచిత్. 487

తా. శుద్ధిచేసినరసము, గంధకము, విషము, తామ్రభస్మము-వీటిని సమభాగములుగా గ్రహించి చక్కఁగ చూర్ణముచేసి పంచపిత్తములచే (అనఁగా మత్స్యము, ఎనుబోతు, నెమలి, ఆడవిపంది, మేకపోతు వీనిపిత్తములచే) యథాక్రమముగా అయిదుదినములు భావనచేసి పిదప వావిలిస్వరసముచే ఏడుదినములు, అల్లపుస్వరసముచే మూఁడుదినములు భావనచేసి మర్దించి ఆవాలంతమాత్రలు చేసి నీడ నెండించి దోషము, వయస్సు, జఠరాగ్ని వీని బలము నెఱిఁగి సమర్థుఁ డగువైద్యుఁడు ఏడుమాత్రల నిప్పించి ఉష్ణోదకము, పిప్పలీస్వరసము-వీనిని అనుపానముచేయించి రోగిని పరుండబెట్టి చెమటకలుగు వఱకు వస్త్రమును కప్పి నిద్రించునటుల చేయవలయును. పిదప పంచదార, పెరుగు వీనితోడ పథ్యము నిప్పించవలయు. ఇది కల్పతరురస మనఁబడును. మిగుల దుర్లభమైనది. అసాధ్యజ్వరము, చిరకాలజ్వరము, జీర్ణజ్వరము, విషమజ్వరను, జ్వరాతిసారము, గ్రహణి, పాండువు, కామిల-వీనిని హరింపఁజేయును. శ్వాసకాసములు శూల వీనితోఁగూడియుండు జ్వరమునందు దీనిని నిప్పింపంజనదు. దీని నితరులకు ఇవ్వకుండా మిగుల ప్రయత్నముతో రహస్యముగా కాపాడవలయును.

## జ్వరములకు అర్ధనారీశ్వరరసము

గౌరీశిలా హింగుళ మభ్రకంచ తారంచ తామ్రంచ బలించసూతం,
విషంచ నేపాళ మదోత్కటంచ వల్లీఫలం కర్పరి మైలతుత్థమ్. 488
సర్వంచ చూర్ణం శిఖిమత్స్యపిత్తైసంభావయేత్వగ్నిభవేంద్రవారిణా,
హాలాహలాదంతిచ మజ్జతోయై దినేనమర్ద్యం పరిభావశోషయేత్.
అజోత్తరస్తస్యపయోమిళిత్వాయామార్ధవామాన్యజ్వరంనిహన్యాత్,

అర్ధంశరీరం వపుభవ్యమన్యే మహోద్భుతం వైద్యవివాదకాలే.
తథామజో దక్షిణదుగ్ధమిశ్రే ఉభేచ పక్షాగతయే జ్వరంహరేత్.
కథితా హ్యజనాథేన రహస్యం చిత్రకారిణా,
అర్ధనారీశ్వరోనామ రసస్సేవ్యో రసాయనః. (ఆయుర్వేదే) 491

తా. శుద్ధిజేసినగౌరీపాషాణము, ఇంగిలీకము, అభ్రకభస్మము, రజతభస్మము, తామ్రభస్మము, గంధకము, రసము, నాభి, నేపాళములు, కస్తూరి, మిరియాలు, పాలకుత్తము, మైలుతుత్తము-వీనిని సమభాగములుగా గ్రహించి చూర్ణముచేసి నెమలిచేదున, చేపచేదున మర్దించి చిత్రమూలరసము, నాభికషాయము, పెద్దపాపరరసము, దంతివేళ్ల రసము, జాజికాయలరసము వీనిచే నొక్కొకదినము మర్దించి, భావనచేసి యెండించి వైద్యవివాదకాలమునందు మేకఉత్తరపు చనుపాలతో నిప్పించిన నాలుగు ఘడియలకు వామభాగమునందుండు జ్వరములు మానును. పిదప మేకయొక్క దక్షిణవైపు చనుబాలలో కలిపి యిప్పించిన రెండుపార్శ్వములయందలిజ్వరము మానును. ఇది అజనాథునిచే చెప్పఁబడిన అర్ధనారీశ్వరరసము. ఇది మిగులశ్రేష్ఠమైనది. ఉత్తరస్తన్య మనఁగా ఎడమచన్ను, దక్షిణస్తన్యమనఁగా కుడిచన్ను.

రసగంధామృతంచైవ సమం శుద్ధం చ టంకణం,
మర్దయే త్ఖల్వమధ్యేతు యావత్స్యాత్కజ్జలప్రభమ్. 492
నకులారిముఖే క్షిప్త్వా మృదాసంవేష్టయేద్బహిః,
స్థాపయే న్మృణ్మయేపాత్రే ఊర్ధ్వాధో లవణం క్షిపేత్. 493
భాండవక్త్రం నిరుధ్యాథ చతుర్యామం దృఢాగ్నినా,
స్వాంగశైత్యం సముద్ధృత్య ఖల్వేకృత్వాతు కజ్జలీమ్. 494
గుంజామాత్రం ప్రదాతవ్యం నస్యం కర్ణేయో జయేత్,
వామభాగే జ్వరం హంతి తత్క్షణాల్లోకకౌతుకమ్. 495
కుర్యా ద్దక్షిణభాగేన చారోగ్యం నిశ్చితం భవేత్,
గోప్యాద్గోప్యతమం ప్రోక్తం గోపనీయం ప్రయత్నతః. 496
అర్ధనారీశ్వరోనామ రసోయం కథితో భువి, (మతాంతరే)

తా. శుద్ధిచేసిన రసము, గంధకము, నాభి, శుద్ధిచేసిన వెలిగారము-వీటిని సమభాగములుగా గ్రహించి ఖల్వములో వైచి యావత్తును కజ్జవలె మర్దించి నకులారిముఖములోనునిచి వెలపట చీలమన్నుచేసి మట్టికుండలో ఉప్పుపోసి అందులోనునిచి పైన ఉప్పుపోసి కుండనోరుమూసి నాలుగుఝాములు దృఢాగ్నిచే పక్వముచేసి సాంగశీతల

మున దీసి ఖల్వములో నునిచి చక్కగానూరి గురిగింజలంత మాత్రలుచేసి యెడమప్రక్క కొకమాత్రను నస్యముచేయించిన తత్క్షణమే వామభాగమునందుండుజ్వరము నివర్తించును. కుడిప్రక్క చేయించిన నిశ్చయముగా ఆరోగ్యము గలుగును. ఇది మిగుల రహస్యమైనది. దీనిని ప్రయత్నముచే రక్షించవలయు. ఇది అర్ధనారీశ్వరరస మనఁబడును.

## ఆమజ్వరాదులకు అగ్నికుమారరసము

మరిచోగ్రాకుష్ఠముస్తైః సర్వైరేవ సమం విషమ్. 497
పిష్ట్వాచార్ద్రిరసేనైవ వటికా రక్తికామితా,
ఆమజ్వరే ప్రథమతః శుంఠ్యాచ మధుపిష్టయా. 498
ఆర్ద్రికస్య రసేనాపి నిర్గుండ్యాశ్చ కఫజ్వరే,
పీనసేచ ప్రతిశ్యాయే ఆర్ద్రికస్యచ వారిణా. 499
అగ్నిమాంద్యే లవంగేన శోఫేన దశమూలకైః,
గ్రహణ్యాం సహ శుంఠ్యాచ దశమూలాతిసారకే. 500
సామేచ ధాన్యశుంఠీభ్యాం పక్వేచ కుటజం మధు,
సన్నిపాతజ్వరారంభే పిప్పల్యార్ద్రికవారిణా. 501
కంటకార్యా రసైఃకాసే శ్వాసే తైలం గుడాన్వితం,
పీత్వా వటీద్వయం రోగీ స్వాస్థ్యం సముపగచ్ఛతి. 502
సర్వేషామేవ రోగాణా మామదోషప్రశాంతయే,
అగ్నివృద్ధికరోనామ్నా విఖ్యాతోఽగ్నికుమారకః. (సిద్ధరసార్ణవే) 503

తా. మిరియాలు, వస, చెంగల్వకోష్టు, తుంగముస్తెలు-వీనికన్నిటికి సమము నాభి ఇటుల వీనినిగ్రహించి అల్లపురసముచే మర్దించి గురిగింజప్రమాణముమాత్రలు చేయవలయు. దీనిని ఆమజ్వరమునందు తొలుత శొంఠి, తేనె వీనియనుపానముతోడను, పిదప అల్లపురసముతోడను, కఫజ్వరమునందు వావిలిరసముతోడను, పీనసము ప్రతిశ్యాయము వీనియందు అల్లపురసముతోడను, అగ్నిమాంద్యమునందు లవంగములతోడను, శోఫరోగమునందు దశమూలములతోడను, గ్రహణీరోగమునందు శొంఠితోడను, అతిసారమునందు దశమూలములతోడను, అజీర్ణజ్వరమునందు ధనియాలు, శొంఠి వీనియను పానముతోడను, పక్వజ్వరమునందు కొడిసెవిత్తులు తేనె వీనియనుపానముతోడను, సన్నిపాతజ్వరారంభమునందు పిప్పళ్లు, అల్లపురసము వీనియనుపానముతోడను, కాసమునందు వ్రాకుడురసముతోడను, శ్వాసమునందు నూనె బెల్లము వీనియనుపానముతోడను 2 మాత్రల నిప్పించిన రోగికి సౌఖ్యము కలుగును. మఱియు సమస్తరోగములయందును

ఆమదోషము నివర్తించుటకై వీని నిప్పింపవలయును. ఇది అగ్నికుమారరస మనఁబడును. ఇది జాఠరాగ్నిని వృద్ధిజేయును.

## సర్వజ్వరాతిసారములకు మేఘనాదరసము

తారం కాంస్యం మృతం తామ్రం త్రిభిస్తుల్యంచ గంధకం,
క్వాథేన మేఘనాదస్య పిష్ట్వా మథ్వా పుటేపచేత్. 504
షడ్భిఃపుటైర్భవేత్సిద్ధో మేఘనాదో జ్వరాపహః,
భక్షయే త్పర్ణఖండేన విషమజ్వరనాశనః. 505
అస్యమాత్రాద్విగుంజాస్యా త్పథ్యం దుగ్ధౌదనం హితం,
నాగరాతి విషాముస్తా భూనింబామృత వత్సకైః. 506
సర్వజ్వరాతి సారఘ్నం క్వాథమస్యానుపాయయేత్,
తరుణం వా జ్వరం జీర్ణం తృష్ణాం దాహంచ నాశయేత్. 507

తా. రజతభస్మము, కంచుభస్మము, తామ్రభస్మము ఇవి సమభాగములు, ఈ మూటికి సమము శుద్ధిజేసినగంధకము-వీనిని చిట్టిమూరకషాయముచే బాగుగా మర్దించి బిళ్లలుచేసి యెండ నెండించి మూకుటిలోనునిచి చీలమన్ను ఇచ్చి పుటమువేయవలయు. ఇటులనే చిట్టియాముకషాయముచే మరల మర్దించి ఐదుపుటములువేసిన శుద్ధం బగు. పిదప వీనిని రెండు గురిగింజలయెత్తు తమలపాకులో నునిచి సేవించిన విషమజ్వరములు హరించు. వీనిని శొంఠి, అతివస, తుంగముస్తెలు, నేలవేము, తిప్పతీగె, కొడిసె - వీనికషాయానుపానముతో సేవించిన సమస్తజ్వరాతిసారములు, తరుణజ్వరము, జీర్ణజ్వరము, దప్పి, దాహము ఇవి హరించు. ఇది మేఘనాదరస మనఁబడు. దీనియందు పాలతోగూడిన యన్నమును భుజించుట పథ్యము.

## చాతుర్థికజ్వరములకు చాతుర్థికారిరసము

హరితాళం శిలాతుత్థం శంఖచూర్ణం చ గంధకం,
సమాంశం మర్దయేత్ఖల్వే కుమారీరససంయుతమ్. 508
శరావసంపుటే కృత్వా దత్వా గజపుటేపచేత్,
కుమారికారసేనైవ వల్లమాత్రా వటీకృతా. 509
దత్తా శీతజ్వరం హంతి చాతుర్థంతు విశేషతః,
మరీచఘృతయోగేన తక్రం పీత్వా చరేద్వటీమ్. 510
ఏతయా వమనంభూత్వా జ్వరస్తస్మాద్వినశ్యతి, (గ్రంథాంతరే)

తా. శుద్ధిజేసిన హరిదళము, శుద్ధిజేసిన మణిశిల, శుద్ధిజేసిన పాలతుత్తము, శంఖచూర్ణము, శుద్ధిజేసిన గంధకము-వీనిని సమభాగములుగా గ్రహించి ఖల్వములో నునిచి కలబందరసముచే మర్దించి యెండ నెండించి మూకుళ్లలో నునిచి చీలమన్ను ఇచ్చి గజపుటంబిడి సాంగశీతలమున గ్రహించి మరల కలబందరసముచే మర్దించి మూడుగురిగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని సేవించిన శీతజ్వరములు, విశేషముగా చాతుర్థికజ్వరములు హరించు. మిరియములచూర్ణమును ఘృతమును మజ్జిగలో కలిపి పానముజేసి పిదప ఒకమాత్రను సేవించిన వమనంబై జ్వరము హరించు.

## సర్వజ్వరములకు చింతామణిరసము

రసం గంధం మృతం తామ్రం మృతమభ్రం ఫలత్రికమ్. 511
త్ర్యూషణం దంతిబీజం చ సమంఖల్వే విమర్దయేత్,
ద్రోణపుష్పీ రసైర్భావ్యం శుష్కం తదుపపాలితమ్. 512
చింతామణిరసోహ్యేష త్వజీర్ణే శస్యతే సదా,
జ్వరమష్టవిధం హంతి సర్వశూలనిషూదనమ్. 513
గుంజైకంవా ద్విగుంజంవా దేయమార్ద్రికవారిణా, (గ్రంథాంతరే)

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, తామ్రభస్మము, కరక తాండ్రయుసిరికెలు, శొంఠి పిప్పలి మిరియాలు, శుద్ధిజేసిన నేపాళములు - వీనిని సమభాగములుగా ఖల్వములో నునిచి తుమ్మిపూలరసముచే మర్దించి దానిరసముచేతనే భావనజేసి యెండించి రోగబలాబలము నెఱిఁగి ఒకటి, లేక రెండుగురిగింజలప్రమాణమును అల్లపురసానుపానముతో సేవించిన అజీర్ణ జ్వరమును, అష్టవిధజ్వరములను, సమస్తశూలలను బోకడచును. ఇది చింతామణిరస మనఁబడును.

## సర్వజ్వరహరకషాయము

భార్గ్యబ్ద పర్పాటక ధన్వయాసవిశ్వ
భూనింబకుష్ఠకణసింహామృతవాసాకషాయః,
జీర్ణజ్వరం సతతసంతతకం నిహన్యా
దన్యేద్యుకం సహతృతీయచతుర్థకంచ. 515

తా. గంటుభారంగి, తుంగగడ్డలు, పర్పాటకము, * రేగటిదూల, సొంటి, నేలవేము, చెంగల్వకోష్టు, పిప్పళ్లు, నేలములక, తిప్పతీగె, అడ్డసరపుటీనెలు-వీనిని సమభాగములుగా దంచి కషాయముబెట్టి సేవించిన సర్వజ్వరములు హరించు.

* ఇదే దురదగొండి.

శీతజ్వరహారకషాయములు

రామలక్ష్మణసీతాశ్చ రావణేన విభీషణః,
కుంభకర్ణసమాయుక్తం కషాయం సముపాచరేత్. 516
జానకీచూర్ణసంయుక్తం శీతజ్వరవినాశనం, (మాధవనిదానే)

తా. నేలవేము, లక్ష్మణపంజి, పర్పాటకము, పెద్దమ్రాను, తానికాయ, బలురక్కసి - వీనిని కషాయముబెట్టి అందు పిప్పలిచూర్ణము కలిపి త్రాగిన శీతజ్వరము హరించును.

మత్స్య కూర్మ వరాహాశ్చ నారసింహాశ్చ వామనః. 517
రామో రామశ్చ రామశ్చ బుద్ధకః కల్కిమేవచ,
అవతారేణ సంయుక్తం శీతజ్వరవినాశనమ్. 518

తా. కటుకరోహిణి, నందివృక్షము, పెన్నేరుదుంపలు, అడ్డసరము, కొండగోగు, తెల్లగరికె, నేలవేము, చిట్టాముదపువేళ్లు (కలుక్రానుగు), రావిచిగుళ్లు, చిత్రమూలము- వీనిని కషాయముబెట్టి త్రాగిన శీతజ్వరము హరించును.

శీతజ్వరమునకు క్షుద్రాదికషాయము

క్షుద్రాధాన్యకశుంఠీభిః గుడూచీ ముస్తపద్మకైః,
రక్తచందన భూనింబ పటోల వృషపుష్కరైః. 519
కటుకేంద్రయవారిష్టభార్గీపర్పటకైస్సమైః,
క్వాథం ప్రతినిషేవేత సద్యశ్శీతజ్వరచ్ఛిదమ్. 520

తా. వాకుడు, ధనియాలు, సొంటి, తిప్పతీగె, తుంగముస్తెలు, పద్మకము, రక్తచందనము, నేలవేము, చేదుపొట్ల, అడ్డసరము, పుష్కరమూలము, కటుకరోహిణి, కొడిసె, వేప, గంటుభారంగి, పర్పాటకము-వీనిని సమభాగములుగా చేర్చి కషాయము కాచి పుచ్చుకొనిన శీతజ్వరము తత్క్షణమే నివర్తించు.

సర్వజ్వరములకు భూనింబాదికషాయము

భూనింబదారుదశమూలమహౌషధాబ్ది
తిక్తేంద్రబీజధనకేభకణాకషాయః,
తంద్రాప్రలాపకసనారుచిదాహమోహ
శ్వాసాదియుక్తమఖిలం జ్వరమాశు హంతి. 521

తా. నేలవేము, దేవదారు, దశమూలములు, సొంటి, తుంగముస్తెలు, చేదుపొట్ల, కొడిసెవిత్తులు, ధనియాలు, ఏనుగపిప్పళ్లు- వీని కషాయము, తంద్ర, పలవరింత, కాసము

అరుచి, సర్వాంగతాపము, మోహము, శ్వాసము - ఈ మొదలగువానితో గూడియుండు దారుణమయినజ్వరములనన్నిటిని అతిశీఘ్రముగా హరింపఁజేయును.

విషమజ్వరములకు దార్వ్యాదికషాయము

దార్వీదారుకళింగలోహితలతాశమ్యాకపాఠాసతీ
శౌండీవీరికిరాతకుంజరకణాత్రాయంతికాపద్మకైః,
చక్రాధాన్యకనాగరాక్షసరళాశీఘ్రాంబుసింహీశివా
వ్యాఘ్రీపర్పటదర్భమూలకటుకానంతామృతాపుష్కరైః. 522
ధాతూత్థం విషమం త్రిదోషజనితం ఏకాహికం ద్వ్యాహికం,
పీతో హంతి మహావ్యథం బహురుజం సద్యః ప్రలాపాన్వితమ్. 523

తా. మ్రానిపసపు, దేవదారు, కొడిసె, రక్తచందనము, కస్తూరి, రేల, విష బొద్ది, కచోరములు, పిప్పళ్లు, పిల్లిపీచర, నేలవేము, ఏనుగుపిప్పళ్లు, కలుక్రానుగు, పద్మకము, చక్రా, ధనియాలు, సొంటి, తానికాయ, సరళదేవదారు, శీఘ్రా, జలము, నేలములక, కరక్కాయ, వ్రాకుడు, పర్పాటకము, దర్భవేళ్లు, కటుకరోహిణి, సుగంధపాల, తిప్పతీగె, పుష్కరమూలము - వీనితో సిద్ధముచేయఁబడిన కషాయము నిప్పించిన ధాతుజనితము, విషమము, త్రిదోషజనితము, ఏకాహికము, ద్వ్యాహికము-యీ మొదలగుజ్వరములు, పలవరింత, అధికశూల, పీడ వీనితో గూడియుండు దారుణజ్వరములు - ఇవి అతిశీఘ్రముగా హరించును.

శ్లేష్మజ్వరాదులకు దశమూలకషాయము

శాలిపర్ణీ పృశ్నిపర్ణీ బృహతీద్వయగోక్షురైః,
బిల్వాగ్నిమంథశ్యోనాక కాశ్మరీ పాటలాయుతైః. 524
దశమూలమితిఖ్యాతం క్వథితం తజ్జలం పిబేత్,
పిప్పలీచూర్ణసంయుక్తం వాతశ్లేష్మహరం పరమ్. 525
సన్నిపాతజ్వరం హంతి సూతికాదోషనాశనమ్,
ఉత్కంఠగ్రహపార్శ్వార్తి తంద్రా మస్తకశూలహృత్. 526

తా. కోలపొన్న, నేలపొన్న, చిన్నములక, పెద్దములక, పల్లేరు, మారేడు, తక్కలి, దుందిలము, నేలగుమ్ముడు, కలిగొట్టు-వీనివేళ్లు దశమూలము లనఁబడును. వీని కషాయమును పిప్పలిచూర్ణసహితముగా నిప్పించిన వాతశ్లేష్మజ్వరము, సన్నిపాతజ్వరము, సూతికాదోషము, మెడపట్లు, పార్శ్వశూల, తంద్ర, తలనొప్పి వీటిని శీఘ్రముగా హరింపఁజేయును.

కఫరోగమునకు కట్ఫలాదికషాయము

కట్ఫలాంబుద భార్గీభి ర్ధాన్యరోహిష పర్పటైః,
వచా హారీతకీ శృంగీ దేవదారుమహౌషధైః. 527
క్వాథః కాసజ్వరం హంతి శ్వాసశ్లేష్మగళగ్రహాన్,

తా. కాయఫలము, తుంగముస్తెలు, గంటుభారంగి, ధనియాలు, కామంచిగడ్డి, పర్పాటకము, వస, కరక్కాయ, కర్కాటకశృంగి, దేవదారు, సొంటి-వీనికషాయము కాసయుక్తజ్వరము, శ్వాసము, శ్లేష్మము, మెడపట్లు వీటిని హరింపఁజేయును.

కఫాదిజ్వరములకు శృంగ్యాదికషాయము.

శృంగీ దారు నిశాసురాహ్వమభయా భార్గీచ విశ్వౌషధం
ముస్తా పర్పట కట్ఫలంచ సవచాకుస్తుంబరం కత్తృణం,
క్వాథం క్షౌద్రయుతం పిబేచ్ఛ కఫజే కాసే క్షయే పీనసే
శ్వాసే వాతయుతే జ్వరేచ వమనే హిక్కాసు పిత్తామయే. 528

తా. కర్కాటకశృంగి, మ్రానిపసపు, దేవదారుచెక్క, కరక్కాయ, గంటుభారంగి, సొంటి, తుంగముస్తెలు, పర్పాటకము, కాయఫలము, వస, ధనియాలు, కామంచిగడ్డి-వీనికషాయమును తేనెపరిశేషముగా పానముచేయుచ్చిన కఫమువలన జనించిన కాసము, క్షయము, పీనసము, శ్వాసము, వాతజ్వరము, వాంతి, ఎక్కిళ్ళు, పిత్తరోగము వీటిని శమింపఁజేయును.

త్రిదోషజజ్వరమునకు క్షుద్రాదికషాయము

క్షుద్రామృతానాగరపుష్కరాహ్వైః
కృతః కషాయః కఫమారుతోత్తరే,
సశ్వాసకాసారుచి పార్శ్వశూలే
జ్వరే త్రిదోషప్రభవే ప్రశస్యతే. 529

తా. వాకుడు, తిప్పతీఁగె, సొంటి, పుష్కరమూలము - వీటికషాయము శ్లేష్మవాతప్రకోపము, శ్వాసకాసములు, అరుచి, పార్శ్వశూల, వీనితోఁగూడియుండు త్రిదోషజ్వరమును నివర్తింపఁజేయును.

అష్టవిధజ్వరాదులకు వృద్ధక్షుద్రాదికషాయము

క్షుద్రానింబపటోలచందనఘనై స్తిక్తామృతాపద్మకైః
వాసావేసణశుంఠిపుష్కరజటాభూనింబభార్గ్యాసహ,

బీజంకుష్ఠధమాపకం కృమిరుజం కాసం వమిం కామలం
క్వాథం చాష్టవిధం జ్వరం కఫమరుత్పిత్తం సదాహం జయేత్. 530

తా. వ్రాకుడు, వేము, పొట్ల, చందనము, తుంగముస్తెలు, చేతిపొట్ల, తిప్పతీఁగె, పద్మకము, అడ్డసరము, వేసనము, సొంటి, పుష్కరమూలము, జటామాంసి, నేలవేము, గంటుభారంగి, వేగిస, చెంగల్వకోష్టు, దురదగొండి-వీనికషాయము కృమిరోగము, కాసము, వాంతి, కామిల, అష్టవిధజ్వరములు, సర్వాంగతాపముతో గూడియుండు కఫవాతపిత్తము వీనిని నశింపఁజేయును.

అజీర్ణాదిజ్వరములకు కిరమాలాపంచకకషాయము

ఆరగ్వధం గంధకతిక్తముస్తా హరీతకీభిః క్వథితః కషాయః,
సామే సశూలే కఫవాతయుక్తే జ్వరేహితో దీపనపాచనశ్చ. 531

తా. రేల, మునగ, నేలవేము, తుంగముస్తెలు, కరక్కాయ - వీనితో సిద్ధము చేయఁబడిన కషాయము అజీర్ణము, శూల, కఫవాతము వీనితోఁగూడియుండు జ్వరమును హరింపఁజేయుటయేగాక అగ్నిదీప్తిని ఆమపాకమును కలుగఁజేయును.

వాతపిత్తజ్వరములకు పరిచభద్రకషాయము

పర్పటాబ్దామృతావిశ్వా కైరాతం సాధితంజలం,
పంచభద్రమిదంజ్ఞేయం వాపిత్తజ్వరాపహమ్. 532

తా. పర్పాటకము, తుంగముస్తెలు, తిప్పతీఁగె, శొంఠి, నేలవేము-వీనితోసిద్ధము చేయఁబడిన కషాయమే పంచభద్ర మనఁబడును. ఇది వాతపిత్తజ్వరమును బోకడుచును.

వాతజ్వరమునకు శఠ్యాదికషాయము

శఠీ పుష్కరమూలం చ భార్ఙ్గి శృంగీ దురాలభా,
గుడూచీ నాగరంపాఠా కిరాతం కటురోహిణీ. 533
ఏష శఠ్యాదిజః క్వాథః సర్వవాతజ్వరాపహః,
కాసాదిశోఫయుక్తేషు దద్యాత్సోపద్రవేషు చ. 534

తా. కచోరములు, పుష్కరమూలము, గంటుభారంగి, కర్కాటకశృంగి, దురదగొండి, తిప్పతీఁగె, సొంటి, విషబొద్ది, నేలవేము, కటుకరోహిణి-వీనితో సిద్ధముచేయఁబడినకషాయము కఠ్యాదికషాయ మనఁబడును. ఇది సమస్తవాతజ్వరములను పోఁగొట్టును. కాసము, శోఫ, ఉపద్రవములు వీనితోఁ గూడియుండు జ్వరమునందు హితకరము,

## శ్లేష్మజ్వరాదులకు బృహచ్ఛట్యాదికషాయము

శఠీపటోలద్వినిశోగ్రగంధా వాసాకిరాతం దశమూలధారా,
సహాచరీ భార్గివరీ సశృంగీ రాస్నేంద్రబీజం సురదారుశిగ్రుః. ౫౫
దురాలభాధాన్యకశుంఠిపాఠా సురేంద్రకల్కం సహాటలకీభిః,
త్రాయంతికైంద్రీకటుకాగదంచ కషాయమేషాం విహితస్సహాయః.
శ్లేష్మజ్వరే కాసనశ్వాసశూలే వాతాధికే రోగిణి శీతకేచ,
చిరజ్వరే దుష్టమలగ్రహేపి నూనం హితోయం సతతం శ...

తా. కచోరములు, పొట్ల, పసుపు, మ్రానిపసుపు, పస, అడ్డసరము, ... దశమూలములు, ధారా, ...ములుగోరింట, గంటుభారంగి, ... కొడిసెపాల, ... రాస్నము, కొడిసెవిత్తులు, దేవదారు, మునగ, దురదగొండి, ... ... గొద్ది, సరళదేవదారుచెక్క, కరక్కాయ, కలుత్రాసుగు, పెద్దమాను, ... ... ల్యాకోష్టు-వీనితో సిద్ధము చేయఁబడిన కషాయము ... ... శ్లేష్మజ్వరము, శ్వాసకాసములు, శూల, వాతప్రధానజ్వరము, శీతజ్వరము, ... ము, దుష్టమలబంధము వీటిని హరింపఁజేయును.

## వాతజ్వరమునకు పటోలాదికషాయము

పటోలీచ గుడూచీచ ముస్తాచైవధమాసకం,
నింబత్వక్పర్పటం తిక్తా భూనింబ త్రిఫలావృషాః. ౕ౪౩
పటోలాదిరయం క్వాథో వాతజ్వరహరస్స్మృతః. ౫౪౪

తా. పొట్ల, తిప్పతీఁగె, తుంగముస్తెలు, దురదగొండి, వేపపట్ట, పర్పాటకము, ... గొట్ల, నేలవేము, త్రిఫలములు, అడ్డసరము-వీనితో సిద్ధము చేయఁబడిన కషాయము ... ... గాది యనఁబడును. ఇది వాతజ్వరమును పోఁగొట్టును.

## వాతకఫజ్వరమునకు వృద్ధముస్తాదికషాయము

ముస్తా గుడూచీ సహనాగరేణ వాసాజలం పర్పటకం చ పథ్యా,
ముద్రాచదుస్స్పర్శయుతః కషాయః పీతో హితో వాతకఫజ్వరే చ.

తా. తుంగముస్తెలు, తిప్పతీఁగె, శొంఠి, అడ్డసరము, వట్టివేరు, పర్పాటకము, ...కాయ, దురదగొండి, ద్రాక్షపండు-వీనితో సిద్ధముచేయఁబడినకషాయము ... ... కఫజ్వరము నివర్తించును.

## పిత్తజ్వరమునకు గుడూచ్యాదికషాయము

గుడూచీ నింబ ధాన్యాకం పద్మకం రక్తచందనం,

ఏష సర్వజ్వరం హంతి గుడూచ్యాదిస్తు దీపనః. 541

తా. తిప్పతీఁగె, వేము, ధనియాలు, పద్మకము, రక్తచందనము-వీనితో సిద్ధము చేయఁబడినకషాయము గుడూచ్యాది యనఁబడును. ఇది సమస్తజ్వరములను హరింపఁ జేయును. అగ్నిదీప్తిని కలుగఁజేయును.

పిత్తజ్వరమునకు త్రాయమాణాదికషాయము

త్రాయంతీ పర్పటోశీర తిక్తా భూనింబ దుస్స్పృశా,
కషాయో మధుసంయుక్తః పిత్తజ్వరవినాశనః. 542

తా. కలుత్రాసుగు, పర్పాటకము, వట్టివేరు, చేదుపొట్ల, నేలవేము, దురదగొండి-వీనితో సిద్ధముచేయఁబడిన కషాయమును తేనెసహితముగా నిప్పించిన పిత్తజ్వరము నివర్తించును.

పిత్తశ్లేష్మజ్వరమునకు-వృద్ధత్రాయమాణాదికషాయము

త్రాయంతీంద్రయవా వాసా ఛిన్నా తిక్తపటోలకైః,
నింబ దుస్పర్శభూనింబ సమ్యక్పద్మకపర్పటైః,
అష్టావశేషితః క్వాథ పిత్తశ్లేష్మజ్వరాపహః. 543

తా. కలుత్రాసుగు, కొడిసె, అడ్డసరము, తిప్పతీఁగె, చేదుపొట్ల, వేము, దురదగొండి, నేలవేము, పద్మకము, పర్పాటకము-వీటిని చేర్చి అష్టావశేషముగా క్వాచఁబడిన కషాయము పిత్తశ్లేష్మజ్వరమును నివర్తి జేయును.

విషమజ్వరమునకు వాసాదికషాయము

వాసాక్షుద్రామృతాముస్తా శుంఠీధాత్రీ సమాతృకః,
పిప్పలీ చూర్ణసంయుక్తో విషమజ్వరనాశనః. 544

తా. అడ్డసరము, వాకుడు, తిప్పతీఁగె, తుంగముస్తెలు, సొంటి, ఉసిరికెపప్పు, వీనికషాయమును తేనె పిప్పలిచూర్ణసహితముగా నిప్పించిన విషమజ్వరము నివర్తించును.

ఏకాహికజ్వరమునకు పటోలాదికషాయము

పటోలం త్రిఫలా నింబ ద్రాక్షా శమ్యాక వాసకైః,
క్వాథం సితామధుయుతం పిబేదేకాహికజ్వరే. 545

తా. పొట్ల, త్రిఫలములు, వేము, ద్రాక్ష, రేల, అడ్డసరము - వీనికషాయమును పంచదార తేనె వీనిసహితముగా పానముచేసిన ఏకాహికజ్వరము నివర్తించును.

## త్ర్యాహికజ్వరమునకు గుడూచ్యాదికషాయము

గుడూచీ ధాన్యముస్తాభి శ్చందనోశీరనాగరైః,
కృతం క్వాథం పిబేత్ క్షౌద్ర సితాయుక్తం జ్వరాతురః. 546
తృతీయజ్వరనాశాయ తృష్ణా దాహనివారణం,
పీతో మరిచచూర్ణేన తులసీపత్రగోరసః. 547
ద్రోణపుష్పీ రసోవాపి నిహంతి విషమజ్వరాన్. 548

తా. తిప్పతీగె, ధనియాలు, తుంగముస్తెలు, చందనము, వట్టివేరు, సొంటి - వీనితో సిద్ధముచేయఁబడిన కషాయమును తేనె పంచదార వీనిసహితముగా నిచ్చిన త్ర్యాహికజ్వరము, దప్పి, సర్వాంగ తాపము ఇవి నివర్తింపచును. మెంతియొక్క తులసియొక్కరసములోగాని లేక తుమ్మిపూలరసములోగాని మిరియాలచూర్ణమును కలిపి పానముచేయించిన విషమజ్వరము హరించును.

## పురాణజ్వరములకు మహాలవంగాదిచూర్ణము

భృంగం నాగాంగకైలా మరిచ మగధజా నాగరం వాజిగంధా
భృంగం స్యాదేకభాగం ద్వయహరికుసుమం ద్రావిళీ వేదభాగా,
మారీచం చాష్టభాగం తదపి మగధజా భాగశష్షోడశోక్తాః
ద్వాత్రింశచ్ఛృంగిబేరం చతురధికయుతా వాజిగంధాచ షష్టిః.
ఏతేషాం సూక్ష్మచూర్ణం సమసితసహితం సోష్ణధారం కఫఘ్నం
పిత్తఘ్నం పాండుగుల్మజ్వరగురుగుదజారోచకాజీర్ణనాశమ్,
భృంగశ్వాసాదిహిక్కా జ్వరజఠరమహాశ్వాసహృద్రోగనాశం
భృంగాఖ్యంచైకబాహుం సకలగదహారంభాషితం పూజ్యపాదైః.
(పూజ్యపాదీయే)

తా. లవంగపుచెక్క ౧ భాగము, నాగకేసరములు ౨ భాగములు, ఏలకులు ౪ భాగములు, మిరియాలు ౮ భాగములు, పిప్పళ్లు ౧౬ భాగములు, సొంటి ౩౨ భాగములు, * దొమ్మడోలుగడ్డ ౬౪ భాగములు-ఇటుల వీనినిచూర్ణముజేసి దానికిసమము పంచదార గలిపి ఉష్ణోదకముతోనేని ఉష్ణధారలతోనేని సేవించిన కఫము, పిత్తము, పాండువు, గుల్మము, పురాణజ్వరము, మూలవ్యాధి, అరుచి, అజీర్ణము, భృంగశ్వాసము, ఎక్కిళ్లు, జ్వరము, ఉదరరోగము, మహాశ్వాసము, హృద్రోగము, ఏకబాహుజనితవాత

* ఇదే పెన్నేరుగడ్డయనియుఁ జెప్పఁబడు.

రోగము - ఈ మొదలగు సర్వరోగములు హరించు నని పూజ్యపాదమహర్షి వచిం
ఇది లవంగాదిచూర్ణము.

పురాణజ్వరక్షయాదులకు ఏలాదిచూర్ణము

ఏలా త్వక్పత్ర నాగా మరిచ మగధజా నాగరం కుందురుష్కం
తక్కోలం కోష్ఠజాతీఫలమమృతలతాసార భూనింబవాసాః,
యష్టిద్రాక్షాకచోరం మలయజఖదిరం క్షీరవారం ప్రియంగుః
హ్రీబేరం ధాన్యజాజీ శతకుసుమవచాభార్గిముస్తాశ్చ తిక్తమ్.
సర్వాంసమ్యక్సుచూర్ణం సమసితసహితం శ్లేష్మపిత్తజ్వరఘ్నం
పిత్తం వై పాండురోగాన్ క్షయమదగుదజారోచకాగుల్మజీర్ణం,
హంతి శ్వాసాదిహిక్కాజ్వరజఠరమహాకాసహృద్రోగనాశం
ఏలాద్యం యోగరాజం సకలజనహితం భాషితం పూజ్యపాదైః.
(పూజ్యపాదీ

తా. ఏలకులు, * దాచినిచెక్క, ఆకుపత్రి, నాగకేసరములు, మిరియా
పిప్పళ్ళు, కుందురుష్కము, తక్కోలము, చంగల్వకోష్టు, జాజికాయ, తిప్పసత్తు,
వేము, అడ్డసరపుటీసెలు, యష్టిమధుకము, దీపద్రాక్ష, కచోరములు, శ్రీగంధ
చంద్రచెక్క, మనుబాలవేళ్లు, ప్రేంకణము, కురువేరు, కొతిమెర్లు, జాజిమొ
చామంతులు, వస, గంటుభారంగి, తుంగముస్తెలు, కటుకరోహిణి - వీనిని సమభా
లుగాగ్రహించి సూక్ష్మచూర్ణముచేసి దానికి సమము పంచదార గలిపి ఉష్ణోదకమ
సేవించిన శ్లేష్మపిత్తజ్వరములు, పిత్తము, పాండురోగము, క్షయరోగము, మద
మూలవ్యాధి, అరుచి, గుల్మము, పురాణజ్వరములు, శ్వాసకాసలు, ఎక్కిళ్లు, అం
జ్వరము, మహాశ్వాసము, ఱొమ్మునొప్పి ఇవి నశించును. ఇది ఏలాదిచూర్ణ మనఁబడు.
శ్రేష్ఠమైనయోగము సర్వజనులకు హితకర మని పూజ్యపాదమహర్షి వచించె.

ఏకాహికాదిజ్వరములకు నింబాదిచూర్ణము

నింబపత్రవచాహ్వోషయవానీ లవణత్రయం,
క్షారోదిగ్వహ్ని రామేషు త్రినేత్రక్రమశోంశకాః.
సర్వమేకం కృతం చూర్ణం ప్రత్యూషే భక్షయేన్నరః,
ఏకాహికం ద్వ్యాహికం చ తథా త్రిదివసజ్వరమ్.

---

* ఇదే లవంగపుచెక్క.

చాతుర్థకం మహాఘోరం సతతం సంతతం దివా,
ధాతుస్థం చ త్రిదోషోత్థం జ్వరం హంతి న సంశయః. 555

తా. వేపాకు ౪ భాగములు, త్రిఫలములు 3 భాగములు, త్రికటుకములు 3 భాగములు, ఓమము ౧౨ భాగములు, మూడువిధములయిన లవణములు 3 భాగములు, క్షారము 3 భాగములు-ఇటుల వీని నన్నిటి నొకటిగాజేర్చి చక్కగా చూర్ణముచేసి ప్రాతః కాలమునందు భక్షించిన ఏకాహిక, ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థికజ్వరములు, దారుణమైన సతత సంతతజ్వరములు, దివాజ్వరము, ధాతుగతజ్వరము, త్రిదోషజ్వరము-ఇవి యన్నియు నివర్తించును.

## జ్వరములకు సుదర్శనచూర్ణము

కాలీయకం తు రజనీ దేవదారు వచాఘనం,
అభయాధన్వయాసం చ శృంగీ క్షుద్రా మహౌషధమ్. 556
త్రాయంతీ పర్పటం నింబం గ్రంథికం బాలకం శఠీ,
పౌష్కరం మాగధీ మూర్వా కుటజ్ఞం మధుయష్టికా. 557
శిగ్రూద్భవం సేంద్రయవం వరీదార్వీ కుచందనం,
పద్మకం సరళోశీర త్వచం సౌరాష్ట్రికా స్థిరా. 558
యవాన్యతివిషాబిల్వం మరిచం గంధపత్రకం,
ధాత్రీగుడూచీ కటుకం సచిత్రకపటోలకమ్. 559
కలశీచైవ సర్వాణి సమభాగానికారయేత్,
సర్వద్రవ్యస్యచార్ధంతు కైరాతం సంప్రకల్పయేత్. 560
ఏతత్సుదర్శనం నామ జ్వరాన్హంతి న సంశయః,
పృథగ్దోషాంశ్చ వివిధాన్ సమస్తాన్ విషమజ్వరాన్. 561
ప్రాకృతం వైకృతం చాపి సౌమ్యం తీక్ష్ణమథాపి వా,
అంతర్గతం బహిస్థం చ నిరామం సామమేవ చ. 562
జ్వరమష్టవిధం హంతి సాధ్యాసాధ్యమథాపి వా,
నానాదోషోద్భవం చైవ వారిదోషభవం తథా. 563
విరుద్ధభేషజభవం జ్వరమాశు వ్యపోహతి,
ప్లీహానం యకృతం గుల్మం హంత్యవశ్యం నసంశయః. 564
యథా సుదర్శనం చక్రం దానవానాం నిషూదనం,
తథా జ్వరాణాం సర్వేషా మిదమేవ నిగద్యతే. 565

తా. మ్రానిపసుపు, పసుపు, దేవదారు, వస, తుంగముస్తెలు, కరక్కాయ దురదగొండి, కర్కాటకశృంగి, ప్రాసుడు, సొంటి, కలుక్రానుగు, పర్పాటకము, వేము, గ్రంథితగరము, వట్టివేరు, కచోరములు, పుష్కరమూలము, పిప్పళ్ళు, చాగ, కొడిసె, యష్టిమధుకము, మునగవిత్తులు, కొడిసెపాల, చల్లపిల్లిగడ్డలు, మ్రానిపసుపు, కుచందనము, పద్మకము, దేవదారు, వట్టివేరు, లవంగపట్ట, కావిరాయి, మయ్యాకుపొన్న, కురాసానిఓమము, అతివస, మారేడు, మిరియాలు, గంధపత్రి, ఉసిరికె, తిప్పతీగె, కటుకరోహిణి, చిత్రమూలము, పొట్ల, నక్కతోకపొన్న-వీని నన్నిటిని సమభాగములుగా చేర్చి దీనిలో సగము నేలవేమును చేర్చి చూర్ణము చేయవలయును. ఇది సుదర్శన చూర్ణ మనఁబడు. ఇది ప్రత్యేకదోషములచే జనించిన జ్వరములు, విషమజ్వరము, ప్రాకృతజ్వరము, నిరామజ్వరము, సామజ్వరము, సాధ్యాజ్వరము, అసాధ్యాజ్వరము, పలు దోషములచే జనించినజ్వరములు, జలదోషమువలన జనించినజ్వరము, విరుద్ధౌషధమువలన జనించినజ్వరము, ప్లీహము, యకృత్తు, గుల్మము-ఈ మొదలగు రోగములను సుదర్శన చక్రము అసురులను నశింపఁజేసినటువలెనే నశింపఁజేయును.

### సర్వజ్వరములకు జ్వరభైరవచూర్ణము

నాగరం త్రాయమాణా చ పిచుమందం దురాలభా,
పథ్యాముస్తాం వచాదారు వ్యాఘ్రీశృంగీ శతావరీ. 566
పర్పటం పిప్పలీమూలం విశాలాపుష్కరం శటీ,
మూర్వాకృష్ణా హరిద్రే ద్వే లోధ్రచందనముత్పలమ్. 567
కుటజన్యపరం వల్కం యష్టీమధుకచిత్రకం,
శోభాంజనం బలాచాతివిషాచ కటురోహిణీ. 568
ముసలీపద్మకాష్ఠం చ యవానీశాలపర్ణికా,
మరిచంచామృతాబిల్వం బాలంపంకస్యపర్పటీ. 569
తేజపత్రం త్వచం ధాత్రీ పృశ్నిపర్ణి పటోలకం,
గంధకం పారదం లోహ మభ్రకం చ మనశ్శిలా. 570
ఏతేషాం సమభాగేన చూర్ణమేవం వినిర్దిశేత్,
తదర్ధం ప్రక్షిపేత్తత్ర చూర్ణం భూనింభసంభవమ్. 571
మాత్రామస్య ప్రయుంజీత దృష్ట్వా దోషబలాబలమ్,
చూర్ణం భైరవసంజ్ఞంతు జ్వరాన్హంతి న సంశయః. 572
పృథగ్దోషాంశ్చ వివిధాన్ సమస్తాన్ విషమజ్వరాన్,

ద్వంద్వజాన్ సన్నిపాతోత్థాన్ మానసానపి నాశయేత్, 573
ప్రాకృతం వైకృతం చైవ సౌమ్యం తీక్ష్ణమథాపి వా,
అంతర్గతం బహిఃస్థం చ నిరామం సామమేవ చ. 574
జ్వరమష్టవిధం హంతి సాధ్యాసాధ్యం న సంశయః,
నానాదోషోద్భవం చైవ వారిదోషభవం తథా. 575
విరుద్ధభేషజభవం జ్వరమాశు వ్యపోహతి,
అగ్నిమాంద్య యకృత్ ప్లీహ పాండురోగ మరోచకమ్. 576
ఉదరాణ్యాంత్రవృద్ధిం చ రక్తపిత్తత్వగామయం,
శ్వయథుం చ శిరశ్శూలం వాతామయరుజాం హరేత్. 577
జ్వరభైరవసంజ్ఞం తు భైరవేణ కృతం శుభం,

తా. శొంఠి, కలుక్రానుగు, వేము, దురదగొండి, కరక్కాయ, తుంగముస్తెలు, వస, దేవదారు, ప్రాకుడు, కర్కాటకశృంగి, పిల్లిపీచర, పర్పాటకము, మోడి, పాపర, పుష్కరమూలము, కచోరములు, చాగ, పిప్పళ్లు, పసుపు, మ్రానిపసుపు, లొద్దుగు, చందనము, నల్లకలువ, కొడిసెవిత్తులు, లవంగపట్ట, యష్టిమధుకము, చిత్రమూలము, మునగ, ముత్తవపులగము, అతివస, కటుకరోహిణి, నేలతాటిగడ్డలు, పద్మకాష్ఠము, కురాసాని ఓమము, కోలపొన్న, మిరియాలు, తిప్పతీగె, లేతమారేడు, పద్మకము, పర్పాటకము, తేజపత్రము, లవంగపుచెక్క, ఉసిరికె, నేలపొన్న, పొట్ల, శుద్ధిచేసినగంధకము, రసము, లోహభస్మము, అభ్రకభస్మము, మణిశిల-వీని నన్నిటిని సమభాగములుగా చేర్చి చక్కగా చూర్ణముచేసి దీనికి అర్ధభాగము నేలవేముచూర్ణము కలిపి దోషబలానుసారముగా ప్రయోగించిన వాతపిత్తశ్లేష్మదోషములు, ద్వంద్వదోషములు, సన్నిపాతదోషము, విషమజ్వరము, ప్రాకృతము, వైకృతము, సౌమ్యము, తీక్ష్ణము, అంతర్గతము, బాహ్యము, నిరామము, సామము, సాధ్యాసాధ్యజ్వరములు, నానాదోషములవలన జన్మించిన జ్వరములు, జలదోషమువలన జనించిన జ్వరము, విరుద్ధౌషధమువలన జనించినరోగము, అగ్నిమాంద్యము, యకృత్తు, ప్లీహము, పాండువు, అరోచకము, ఉదరరోగములు, ఆంత్రవృద్ధి, రక్తపిత్తము, చర్మరోగము, వాపు, శిరశ్శూల, వాతరోగము వీని నన్నిటిని హరింపఁజేయును. ఇది భైరవచూర్ణ మనఁబడును. ఇది భైరవునిచేఁ జెప్పఁబడినది.

## సర్వజ్వరములకు ఆమలక్యాదిచూర్ణము

ఆమలం చిత్రకం పథ్యా పిప్పలీ సైంధవం తథా. 578

చూర్ణితోయం గణోజ్ఞేయః సర్వజ్వరహరః పరః,
భేదీరుచికరశ్లేష్మహంతా దీపనపాచనః. 579

తా. ఉసిరికె, చిత్రమూలము, కరక్కాయ, పిప్పళ్లు, సైంధవలవణము వీని నన్నిటి నొకటిగఁజేర్చి చేయఁబడిన చూర్ణము సర్వజ్వరములను పోఁగొట్టును. దోషములను భేదించును. రుచిని పుట్టించును. శ్లేష్మమును పోఁగొట్టును. అగ్నిదీపనము, జీర్ణము వీటిని కలుగఁజేయును.

దుష్టజ్వరములకు హరీతక్యాదిచూర్ణము

హరీతకీ నింబపత్రం నాగరం సైంధవానలః,
ఏషాం చూర్ణం సదా ఖాదేద్దుర్జలజ్వరశాంతయే. 580

తా. కరక్కాయ, వేపాకు, శొంఠి, సైంధవలవణము, చిత్రమూలము వీని చూర్ణమును సేవించిన జలదోషమువలన జనించిన దుష్టజ్వరములన్నియు శమించును.

దుష్టజలజనితజ్వరమునకు కిరాతాదిచూర్ణము

కిరాతతిక్తాత్రివృదంబుపిప్పలీ విడంగవిశ్వాకటురోహిణీరజః, .
నిహంతి లీఢం మధునాతిసత్వరం సుదుస్తరం దుర్జలదోషజం జ్వరమ్.

తా. నేలవేము, తెగడ, నీరుపిప్పళ్ళు, వాయువిడంగములు, శొంఠి, కటుకరోహిణి-వీని చూర్ణమును తేనెతో నాకించిన దుష్టజలదోషముచే జనించిన జ్వరము అతిశీఘ్రముగా నివర్తించును.

జ్వరములకు లాక్షాదితైలము

లాక్షారససమం తైలం తైలాన్మస్తు చతుర్గుణం,
అశ్వగంధనిశాదారు కౌంతికుష్ఠాబ్దచందనమ్. 582
సమూర్వారోహిణీ రాస్నా శత హ్వా మధుకైస్సమం,
సిద్ధం లాక్షాదికం నామ తైలమంగేన లేపితమ్. 583
సర్వజ్వరగ్రహోన్మాద మూర్ఛాపస్మారనాశనం,
యక్షరాక్షసభూతఘ్నం గర్భిణీనాం హితం విదుః 584

తా. లక్క వీసెడుతెచ్చి నాలుగువీసెల ఉదకముపోసి చతుర్భాగావశేషముగా కషాయము కాచి వడియగట్టి ఆకషాయమునకు సమము నూనె నాలుగింతలు ఆవుపెరుగు మీఁగినీళ్ళు నొకబానలోఁ బోసి పెన్నేరుగడ్డ, మ్రానిపసుపు, దేవదారుచెక్క, రేణుకలు, చెంగల్వకోష్టు, తుంగముస్తెలు, శ్రీగంధము, చాగగడ్డలు, కటుకరోహిణి, దుంప

రాస్నము, సదాపాకు, అతిమధురము ఇవి ప్రత్యేకము తులప్రమాణము చూర్ణించి వేసి తైలపక్వమున దించుకొనవలయును. ఇది లాక్షాదితైల మనఁబడును. ఇది అభ్యంజనాదులచే సమస్తజ్వరములు గ్రహపీడ ఉన్మాదము మూర్ఛ అపస్మారము యక్షరాక్షసభూతాది పీడ వీటిని హరింపఁజేయును. గర్భిణీస్త్రీలకు మిగుల హితకరమైనది.

## శీతజ్వరాదులకు హస్తికర్ణికతైలము

హస్తికర్ణీ బలాదుస్పృక్శ్లీరాస్నాసురద్రుమైః,
గాంధారీ సహదేవీ చ తులసీ సింధువారకః. 585
పృథగ్దశపలం క్షుణ్ణం జలద్రోణే విపాచయేత్,
చతుర్భాగావశేషేస్మిన్ తైలం ప్రస్థద్వయం క్షిపేత్. 586
గాంధారిస్వరసం తైలం తుల్యం తక్రాఢకద్వయం,
లాక్షాయాస్స్వరసం చైవ తైలం తుల్యం ప్రదాపయేత్. 587
వత్సకాతివిషా ముస్తా రాస్నా కాంతీపటోలికా,
కుష్ఠకైడర్యకృమిజిత్పాఠాదార్వీ కటుత్రయమ్. 588
పిప్పలీమూల చవికా లశునం గృహధూమకం,
పృథక్కర్షం విచూర్ణ్యాథ శనైర్మృద్వగ్నినా పచేత్. 589
యాంతేనరక్షశ్రోత్రాయ నవవస్త్రేణ వేష్టయేత్,
తత్తైలం శ్రేష్ఠమభ్యంగపానేన నవకర్మసు. 590
శీతజ్వరం నిహంత్యాశు పురాణజ్వరమేవ చ,
ఏకాహికం ద్వ్యాహికం చ త్ర్యాహికం చ చతుర్థకమ్. 591
విషమం చ త్రిదోషం చ హంతి సత్యం న సంశయః,

తా. బలురక్కసి ౧౦ పీసెలు, ముత్తవపులగము, తీటకసింద, సీలివేళ్ళు, దుంపరాస్నము, దేవదారు, తక్కెడ, సహదేవి, తులసి, వావిలి వీటిని ప్రత్యేకప్రత్యేకముగా ౧౦ పలములచొప్పున గ్రహించి తునకలుచేసి నాలుగుపళ్లనీళ్ళు పోసి చతుర్భాగావశేషముగా కషాయముకాచి దానిలో ౨ ప్రస్థములు నువ్వులనూనె, తక్కెడాకు స్వరసము ౨ ప్రస్థములు, తక్రము ౨ ఆఢకములు, లక్కస్వరసము ౨ ప్రస్థములు వీటిని చేర్చి కాచవలయును. కాగునపుడందు కొడిసెపాలవిత్తులు, అతివస, తుంగముస్తెలు, దుంపరాస్నము, రేణుకలు, వెఱ్ఱిపొట్ల, చెంగల్వకోష్టు, కరివేపాకు, వాయువిడంగములు, అగరుసొంటె, మ్రానిపసపు, త్రికటుకములు (శీమము, చిత్రమూలము, లవంగపుచెక్క, కటుకరోహిణి, కచోరములు, అగరుచెక్క, మంజిష్ఠి, సదాప, తక్కోలాలు, గంటు

భారంగి), మోడి, చవ్యము, వెల్లుల్లి, కరుధూపము వీటిని ప్రత్యేక ప్రత్యేకము కర్ష ప్రమాణము గ్రహించి చూర్ణముజేసి వైచి మృద్వగ్నిచే మెల్లగ పక్వముచేసి నూతన వస్త్రముచే వడియకట్టవలయును. ఈతైలము అభ్యంగము పానము మొదలగు కర్మల యందు మిగుల శ్రేష్ఠమైనది. ఇది శీతజ్వరము, పురాణజ్వరము, ఏకాహికము, ద్వ్యాహికము, త్ర్యాహికము, చతుర్థకము, విషమము, సన్నిపాతము వీటిని నిస్సంశయముగా హరింపఁజేయును.

## సర్వజ్వరములకు అంగారకతైలము

మూర్వా లాక్షా హరిద్రే ద్వేమంజిష్ఠా సేంద్రవారుణీ. 592
బృహతీ సైంధవం కుష్ఠం రాస్నా మాంసీ శతావరీ,
ఆరనాళాఢకే నైవ తైలప్రస్థం విపాచయేత్. 593
తైలమంగారకం నామ సర్వజ్వరవినాశనం,

తా. చాగ, లక్క, పసుపు, మ్రానిపసుపు, మంజిష్ఠి, పెద్దపాపర, నేలములక, సైంధవలవణము, చెంగల్వకోష్టు, దుంపరాష్ట్రము, జటామాంసి, పిల్లిపీచర వీటినిచేర్చి ఆఢక ప్రమాణము ఆరనాళముతోడ ఒక ప్రస్థమునూనెపోసి పక్వముచేయవలయును. ఇది అంగారకతైల మనఁబడును. ఇది సమస్తజ్వరములను పోఁగొట్టును.

## జ్వరములకు లాక్షాదితైలము

లాక్షా హరిద్రా మంజిష్ఠా కల్కైస్తైలం విపాచయేత్. 594
షడ్గుణేనారనాళేన దాహశీతజ్వరాపహం,

తా. లక్క, పసుపు, మంజిష్ఠ వీటికల్కమును చేర్చి ఆరుభాగములు ఆరనాళములో తైలమును పోసి పక్వముచేయవలయును. ఇది తాపజ్వరము శీతజ్వరము వీనిని బోఁగొట్టును.

## విషమజ్వరములకు మహాలాక్షాదితైలము

లాక్షారసాఢకే ప్రస్థం తైలస్య విపచేద్భిషక్. 595
మస్త్వాఢకసమాయుక్తం పిష్ట్వాచాత్ర సమార్పయేత్,
శతపుష్పాం హరిద్రాం చ మూర్వాం కుష్ఠం హరేణుకమ్. 596
కటుకాం మధుకం రాస్నామశ్వగంధాం చ దారు చ,
ముస్తకం నందనం చైవ పృథగక్షసమానకైః. 597
ద్రవ్యైరేతైస్తు తచ్ఛిద్ధమభ్యంగాన్మారుతాపహం,
విషమాఖ్యాన్ జ్వరాన్ సర్వాన్ ఆశ్వేవ ప్రశమం నయేత్. 598

కాసం శ్వాసం ప్రతిశ్యాయం కండూందౌర్గంధ్యగౌరవం,
త్రికపృష్ఠకటీశూలం గాత్రాణాం కుట్టణం తథా. 599
పాపాలక్ష్మీ ప్రశమనం సర్వగ్రహనివారణం,
అశ్విభ్యాం నిర్మితం శ్రేష్ఠం తైలం లాక్షాదికం మహత్. 600
లాక్షాయాః షడ్గుణం తోయం దత్వైకవింశతివారకం,
పరిస్రావ్య జలం గ్రాహ్యం కిం వా క్వాథ్యం యథోదితమ్. 601

తా. ఆఢక ప్రమాణము లక్కరసములో నువ్వులనూనె ౧ ప్రస్థము పోసి పెరుగు మీఁదినీళ్లు ఆఢక ప్రమాణము చేర్చి, సదాప, పసుపు, చాగ, చెంగల్వకోష్టు, రేణుకలు, కటు కరోహిణి, యష్టిమధుకము, దుంపరాష్ట్రము, పెన్నేరుగడ్డ, దేవదారు, తుంగముస్తెలు, చందనము వీనిని ప్రత్యేకము అక్ష ప్రమాణము గ్రహించి కల్కము చేసి దానిలో చేర్చి పక్వముచేయవలయును. దీనిని అభ్యంగముచేసికొనిన వాతము, సమస్తవిషమజ్వరములు ఇవి శీఘ్రముగా శమించును. మఱియు కాసము, శ్వాసము, పీనసము, దురద, దుర్గంధము, గురుత్వము, ముడ్డిపూస వీఁపు నడుము వీనియందలిశూల, అవయవములయందు పోట్లు ఇవియన్నియు నివర్తించును. పాపము, అలక్ష్మి, సమస్తగ్రహపీడ ఇవియును శమించును. ఇది మహాలాక్షాదితైల మనఁబడును. అశ్వినీదేవతలచే నిర్మింపఁబడినది. మిగులశ్రేష్ఠమైనది. లక్కను ఆరుభాగము లధికముగనుండు ఉదకములోవైచి మర్దించి ౨౧ పర్యాయము వడియకట్టిగాని లేక లక్కను నలియగొట్టి ఎనిమిదింతల ఉదకములో వైచి పాదావశేషముగా కషాయముకాచిగాని యెత్తుకొనవలయును. ఇది లక్కరస మనఁబడును.

## శీతజ్వరమునకు కట్టరతైలము

సువర్చికానాగరకుష్ఠమూర్వా లాక్షానిశాలోహితయష్టికాభిః,
తైలం జ్వరే షడ్గుణతక్రసిద్ధమభ్యంజనాచ్ఛీతవిదాహమత్స్యాత్.
దధ్నస్ససారకస్యాత్ర తక్రం కట్టరమిష్యతే. 603

తా. సువర్చికా, శొంఠి, చెంగల్వకోష్టు, చాగ, లక్క, పసుపు, రక్తచందనము, యష్టిమధుకము, తైలము-వీటిని ఆరుభాగము లధికముగ నుండు మజ్జిగలో పక్వముచేయవలయును. ఇది అభ్యంజనమువలన శీతజ్వరమును పోఁగొట్టును. మీగడతోఁ గూడిన పెరుగులో నుండి తీయఁబడినమజ్జిగ కట్టర మనఁబడును.

## ఏకాహికాదివిషమజ్వరములకు మహాకట్టరతైలము

శుక్తారనాలై దధిమస్తుతక్రైః ఫలాంబుభాగేన సమం హి తైలం,

కృష్ణాదికల్కైర్మృదువహ్నిసిద్ధ మభ్యంజనం వాతకఫజ్వరాణామ్.
ఏకాహికద్విత్రిచతుర్థకానాం మాసార్ధమాసద్వయమాసికానాం,
నివారణంతద్విషమజ్వరాణాంతైలంతుషట్కట్వరకం మహత్స్యాత్.

తా. శుక్తము, ఆరనాళము, పెరుగుమీఁదిమీగడ, మజ్జిగ, త్రిఫలోదకము వీటికి సమముగా తైలము-వీనినన్నిటిని జేర్చి దానిలో కృష్ణాదికల్కమును అనఁగా "కృష్ణా చిత్రకపద్గ్రంథా వాసకం వికషాఘనమ్, గ్రంథికైలేచాతివిషా రేణుకంచ కటుత్రయమ్, యవానీ గోస్తనీ వ్యాఘ్రీ భూనింబం బిల్వచందనమ్, భార్గీ శ్యామా శివాధాత్రీ స్థిరా మూర్వా స జీరకా, సర్షపం హింగుకటుకీం విడంగంచ సమాంశకమ్, ఏషకృష్ణాదికోనామ గణోజ్వరవినాశనః." అనెడివచనప్రకారము పిప్పళ్లు, చిత్రమూలము, వస, అడ్డసరము, మంజిష్ఠి, తుంగముస్తెలు, గ్రంథితగరము, ఏలకులు, అతివస, రేణుకలు, త్రికటుకములు, కురాసాని ఓమము, ద్రాక్ష, వాకుడు, నేలవేము, మారేడు, చందనము, గంటుభారంగి, కరక్కాయ, ఉసిరికె, ముయ్యాకుపొన్న, చాగ, జీలకఱ్ఱ, ఆవాలు, ఇంగువ, కటుకరోహిణి, వాయువిడంగములు వీటిని సమాంశములుగా చేర్చి నల్లసుగంధిపాలకల్కము పోసి మృద్వగ్నిచేసిద్ధముచేయవలయును. ఇది బృహత్కట్వరతైల మనఁబడును. దీనినభ్యంజనము చేసికొనిన వాతకఫజ్వరములు, ఏకాహికము, ద్వ్యాహికము, త్ర్యాహికము, చాతుర్థికము, మాసికము, అర్థమాసికము, మాసద్వయము యీమొదలగు జ్వరములన్నియు నివర్తించును. ఇది విషమజ్వరములను పోఁగొట్టును.

### విషమజ్వరములకు బృహత్పిప్పల్యాదితైలము

పిప్పలీ ముస్తకం ధాన్యం సైంధవం త్రిఫలా వచా,
యవానీ చాజమోదా చ చందనం పుష్కరాహ్వయమ్. 606
శఠీ ద్రాక్షా గవాక్షీ చ శాలిపర్ణీ త్రికంటకం,
భూనింబారిష్టపత్రాణి మహానింబం నిదిగ్ధికా. 607
గుడూచీపృశ్నిపర్ణీ చ బృహతీ దంతి చిత్రకా,
దార్వీ హరిద్రా వృక్షామ్లం పర్పటం. గజపిప్పలీ. 608
ఏతేషాం కార్షికైః కల్కైస్తైలప్రస్థం విపాచయేత్,
దధికాంజికతక్రైశ్చ మాతులుంగరసైస్తథా. 609
స్నేహమాత్రాసమైరేభిశ్శనైర్మృద్వగ్నినా పచేత్,
సిద్ధమేతత్ప్రయోక్తవ్యం జీర్ణజ్వరమపోహతి. 610

ఏకజం ద్వంద్వజం చైవ దోషత్రయసముద్భవం,
సంతతం సతతాన్యేద్యు స్తృతీయకచతుర్థకాః. 611
మాసజం పక్షజం చైవ చిరకాలానుబంధినం,
సర్వాంస్తా న్నాశయత్యాశు పిప్పల్యాద్యమిదం మహత్. 612

తా. పిప్పళ్లు, తుంగముస్తెలు, ధనియాలు, సైంధవలవణము, త్రిఫలములు, ...స, కురాసానిఓమము, అజామోదము, చందనము, పుష్కరమూలము, కచోరములు, ...ద్రాక్ష, పాపర, కోలపొన్న, పల్లేరు, నేలవేము, వేపాకు, పెనువేప, ప్రాకుడు, తిప్ప ...తిగె, నేలపొన్న, నేలములక, దంతి, చిత్రమూలము, ముల్లనిపసపు, వృక్షామ్లము, పర్పా ...టకము, ఏనుగుపిప్పళ్లు వీటిని ప్రత్యేకము కర్షప్రమాణముచొప్పున గ్రహించి కల్కము వేసి ౧ ప్రస్థము తైలములో కలిపి పెరుగు, కాంజికము, మజ్జిగ, మాతులుంగరసము ...వీటిని ప్రత్యేకము ఒక్కొక ప్రస్థముచొప్పునచేర్చి మెల్లగ మృద్వగ్నిచే పక్వముచేయ ...వలయును. ఇది మహాపిప్పల్యాదితైల మనఁబడును. దీనిని ప్రయోగించిన జీర్ణజ్వరము, ...ఏకజము, ద్వంద్వజము, త్రిదోషజము, సంతతము, అన్యేద్యుః, తృతీయకము, చతుర్థకము, మాసజము, పక్షజము, చిరకాలానువర్తి మొదలగు జ్వరము లన్నియు నివర్తించును.

### ఏకాహికాదిజ్వరములకు లాక్షాభూతాంకుశతైలము

భూతాక్షీన్న స్వరసం ప్రస్థమజాక్షీరం చ తత్సమం,
భృంగీ నిర్గుండికాచైవ తర్కారీ తులసీద్వయమ్. 613
అశ్వగంధీ కాకజంఘీ హస్తికర్ణీ శతావరీ,
లాక్షారసం ప్రయోజ్యం తు బలా తైలాఢకం తథా. 614
ఏతేషాం స్వరసం గ్రాహ్యం ప్రస్థ ప్రస్థం పృథక్పృథక్,
శనైర్మృద్వగ్నినా పక్త్వా కల్కద్రవ్యాణి దాపయేత్. 615
కటుకోశీరలశునం చందనం దేవదారు చ,
క్రిమిఘ్నమరిచం ముస్తా పంచకోలం త్రిజాతకమ్. 616
ఏతేషాం కర్షమాత్రాణి తైలయుక్తేన యోజయేత్,
ద్విదండాన్నవ్యవస్త్రేణ పిష్టస్యాద్భహుపీడయేత్. 617
పానలేపనసస్యేన పురాణజ్వరనాశనం,
ఏకాహికం ద్వ్యాహికం చ త్ర్యాహికం చ చతుర్థకమ్. 618
షణ్మాసాంతజ్వరమాసాంతం వర్షాంతేతిజ్వరం హరం,

సర్వంతే విషమం హంతి శిశూనాం పరమౌషధమ్. 619

తా. మహాబీరాకుస్వరసము ౧ ప్రస్థము, మేకపాలు ౧ ప్రస్థము, గుంటగలగరాకురసము ౧ ప్రస్థము, వావిలియాకురసము ౧ ప్రస్థము, తక్కెడాకురసము ౧ ప్రస్థము, భూతులసివేళ్లకషాయము ౧ ప్రస్థము, మంచి తులసివేళ్ళకషాయము ౧ ప్రస్థము, పెన్నేరుగడ్డలరసము ౧ ప్రస్థము, చీకివెలగాకురసము ౧ ప్రస్థము, బలురక్కసిగడ్డరసము ౧ ప్రస్థము, పిల్లిగడ్డలరసము ౧ ప్రస్థము, చతుర్థావశేషముగా కాచి వడియబోసికొనబడిన లక్కకషాయము ౧ ప్రస్థము, చిట్టాముదము ౪ ప్రస్థములు - ఇటుల వీనినన్నిటిని ఒకబానలో బోసి పక్వమగువఱకు కాచి అందులో కటుకరోహిణి, వట్టివేళ్ళు, తెల్లగడ్డలు, శ్రీగంధము, దేవదారుపట్ట, వాయువిడంగములు, మిరియాలు, తుంగముస్తెలు, పంచకోలములు, త్రిజాతకములు-ఇవి ప్రత్యేకము ఒక్కొకతులము చొప్పున కూర్చి తైలపాకముగావండి నూతనవస్త్రముచే వడియగట్టికొని పానము లేపనము నస్యము వీనియందు ధుపయోగించిన పురాణజ్వరములు ఏకాహికము, ద్వ్యాహికము, త్ర్యాహికము, చాతుర్థికము, పక్షాంతము, మాసాంతము, వర్షాంతము, విషమము-ఈమొదలగు జ్వరములన్నియు నివర్తించును. ఇది శిశువులకు మిగుల హితకరమైనది.

### జ్వరములకు హస్తికర్ణితైలము

హస్తకర్ణి సమూలేన తుణ్ణా ద్రోణాంభసీ పచేత్,
చతుర్భాగావశేషేఽస్మిన్ కల్కద్రవ్యాణి దాపయేత్. 620
భార్గీ ముస్తా పర్పటం చ దుస్పర్శా విశ్వభేషజం,
భూనింబకుష్ఠయష్ట్యాహ్వా గుడూచీ కంటకారికా. 621
శతావరీ హరిద్రా చ ప్రత్యేకం కర్షమాత్రకం,
తైలం ప్రస్థం పయస్తుల్యం ఘటమధ్యే వినిక్షిపేత్. 622
ఖరపాకయుతం తైలం సర్వజ్వరహరం పరం,
పురాణజ్వరమత్యుగ్రం సూతికాజ్వరనాశనమ్. 623

తా. బలురక్కసిగడ్డలు తెచ్చి తునకతునకలుగ తరిగి ఒకద్రోణప్రమాణము ఉదకముపోసి చతుర్థావశేషముగా కషాయముకాచి వడియబోసి, ౧ ప్రస్థము నూనె, ౧ ప్రస్థము ఆవుపాలు పోసి అందులో గంటుభారంగి, తుంగముస్తెలు, పర్పాటకము, దురదగొండి, శొంఠి, నేలవేము, కోష్ఠు, అతిమధురము, తిప్పతీగె, ములక, పిల్లిగడ్డలు, పసుపు-ఇవి ప్రత్యేకము తులప్రమాణము చూర్ణించి వేసి ఖరపాకముగా తైలముకాచి సేవించిన సమస్తజ్వరములు, దారుణమైన పురాణజ్వరములు, సూతికాజ్వరము ఇవి నివర్తించును.

## జ్వరాదులకు క్రముకాదిరసాయనము

హేమాంభోధరచందనం త్రికటుకం జాతీప్రియాళం కుహా
మజ్జాపత్రిసుగంధి జీరకయుగం శృంగాటకల వంశజమ్,
జాతీకోశలవంగధాన్యకయుతం ప్రత్యేకకర్షద్వయం
హవ్యం గోకుడుపం సితార్ధతులయా ధాత్రీవరీయంజలీ. 624
పూగస్యాష్టపలాన్యులూఖలవరే సంకుట్య చూర్ణీకృతం
క్షీరస్యాష్టకసంయుతం కృతమిదం మందాగ్నినా తప్తచేత్,
ఖాదేత్ ప్రాతరిదం జ్వరామయహరం దాహంచ పిత్తం జయేత్
నాసాస్యాక్షిగుదప్రవాహరుధిరం యద్రోమకూపచ్యుతమ్. 625
యక్ష్మాక్షీణబలక్షతాగ్నినిలయం ఛర్దిప్రమేహార్శసా
రేతోవృద్ధికరం రసాయనవరం గర్భప్రదం యోషితామ్,
మూత్రాఘాతవినాశనం బలకరం క్షీణాంగపుష్టిప్రదం
పూగీపాకమిమం ప్రశస్తదివసే కుర్యాత్తథా భక్షయేత్. 626

తా. నాగకేసరములు, తుంగముస్తెలు, శ్రీగంధము, త్రికటుకములు, జాజికాయలు, సారపప్పు, త్రిఫలములోనిపప్పు, లవంగపుచెక్క, ఏలకులు, ఆకుపత్రి, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, పరికెగడ్డలు, వెదురుప్పు, జాపత్రి, లవంగాలు, ధనియాలు ఇవి ప్రత్యేకము ౨ తులములచొప్పునచేర్చి చేసినచూర్ణము ౮ పలములు రోటిలోవేసిచక్కగా చూర్ణించిన చిగినపువక్కలచూర్ణము-ఈరెండుచూర్ణములకు ఎనిమిదింతలు ఆవుపాలు, ఉసిరికెపండ్లరసము, పిల్లిగడ్డలరసము-ఇవి ప్రత్యేకము అంజలిక ప్రమాణము, ఆవునెయ్యి కుడుపము, పంచదార ౫౦ పలములు- ఇటులు వీనినన్నిటిని చేర్చి మృద్వగ్నిచే రసాయన పాకముగా వండి ప్రాతఃకాలమునందు సేవించిన జ్వరము, సర్వాంగతాపము, ముక్కు నోరు కండ్లు గుదము వీనియందు రక్తము స్రవించుట, రోమకూపములనుండి రక్తము వెడలుట, క్షయరోగము, బలక్షయము, మందాగ్ని, ఛర్ది, ప్రమేహము, అర్శస్సు-ఈ మొదలగు రోగములను నివర్తింపఁజేయును. రేతస్సును వృద్ధిజేయును. స్త్రీలకు గర్భమును కలుగఁజేయును. మూత్రాఘాతమును పోఁగొట్టును. బలము, పుష్టి వీనిని కలుగఁజేయును. ఈరసాయనమును శుభదినమునందుచేసి పుచ్చుకొనవలెను.

## జ్వరములకు ఎఱ్ఱవాలుడులేహ్యము

రక్తవాతారిమూలత్వక్ సహస్రపలమానకం,
కుండలీదహనం వ్యోషాకరంజమరిమేదకమ్. 627

ఖట్వావృక్షకణామూలం వాయణం జలవృక్షకం,
తాపనం ధ్రువమూలంచ ద్రవ్యాణ్యేతాని నిక్షిపేత్. 628
ద్రోణే చతుష్టకే తోయే పాచయేద్గాఢవహ్నినా,
తస్మిన్ మధుగుడైస్తుల్యైః పచేత్సూక్ష్మాగ్నినా పునః. 629
కణమూల మజామోదం పిప్పలీ చవ్యనాగరం,
దీప్యచిత్రకకుష్టం చ నాగరం గజపిప్పలీ. 630
వ్రణదారువిళంగాని చూర్ణమేషా సమాంశకం,
దీపాగ్నినా పచేత్తస్మిన్ క్షిప్త్వా మధుసమన్వితమ్. 631
పూర్వవద్ధాన్యమధ్యేతు పుటం దద్యాథ భక్షయేత్,
కర్షమాత్రప్రమాణేన జ్వరం సర్వాణి దాహజిత్. 632
గార్గేయనిర్మితం వాలావడస్యాల్లేహ్యముత్తమం,

తా. ఎట్టివాలుడుచెక్క ౧౦౦ పలములు, నల్లఉప్పి ౧ వీసె, చిత్రమూలమ ౧ వీసె, త్రికటుకములు ౭ వీసెలు, కానుగచెక్క, తుమ్మచెక్క, ఖట్వమనుతీగె, మోడి మెుగలింగచెక్క, ఆరెదొండవేళ్ళు - ఇవి దినుసు ౧కొకటింటికి వీసె ౧-ఇటుల నీదిన సుల నన్నిటిని బానలో వేసి యెనమండుము ఉదకముపోసి గాఢాగ్నిచే అష్టావశేషముగ కషాయము కాచి వడియబోసి, అందు పాతబెల్లము ౧౦౦ పలములు కలిపి సూక్ష్మాగ్నిచే పాకము రానిచ్చి, మోడి, ఓమము, పిప్పళ్ళు, చవ్యము, శొంఠి, ఖురాసాని ఓమము చిత్రమూలము, కోష్టు, గజపిప్పళ్ళు, దేవదారుచెక్క, వాయువిడంగములు ఇవి దినుసు ఒకటింటికి ౨ పలములచొప్పున చూర్ణించివేసి, సూక్ష్మాగ్నిచే పక్వముచేసి పిదప ౧ వీసె తేనెబోసి ధాన్యమధ్యమునందు పుటంబిడి కర్షప్రమాణము సేవిం చిన సమస్తజ్వరములును తాపమును నివర్తించును. ఇది గార్గేయునిచే చెప్పఁబడిన ఎట్టి వాలుడులేహ్యము.

సహదేవిఘృతము

సహదేవీరసప్రస్థం ఘృతప్రస్థం నివేదితమ్. 633
రోహిణీ చ ప్రకుంచం చ క్షీరప్రస్థం విపాచయేత్,
సేవితం విషమం రూక్షం శీతజ్వరనివారణమ్. 634
సహదేవిఘృతం నామ శరీరబలవర్ధనం,

తా. సహదేవియాకురసము ౧ ప్రస్థము, నెయ్యి ౧ ప్రస్థము, కటుకరోహిణి ౧ కుంచము, పాలు ౧ ప్రస్థము-ఇటుల వీనినెల్ల కలిపి పాకముచేసి చిక్కనిపాకముగ

వడియకట్టుకొని సేవించిన విషమజ్వరములు, రూక్ష, శీతజ్వరములు హరించును. ఇది సహదేవిఘృత మనఁబడును. శరీరమునకు బలము నిచ్చును.

క్షీరషట్పలఘృతము

పంచకోలైః ససింధూత్థైః పలికైః పయసా సమమ్. 635
సర్పిః ప్రస్థం శృతం ప్లీహ విషమజ్వరగుల్మనుత్,

తా. పంచకోలములు, సైంధవలవణము, మిరియాలు వీటికి సమముగా ఆవుపాలు, ఘృతము ౧ ప్రస్థము-వీటినన్నిటిని చేర్చి కాచి సిద్ధముచేయవలయును. ఇది ప్లీహము, విషమజ్వరము, గుల్మము వీటిని బోఁగొట్టును.

దశమూలషట్పలఘృతము

అత్ర ద్రవాంతరానుక్తేః క్షీర మేవ చతుర్గుణమ్. 636
ద్రవాంతరేణ యోగేపి క్షీరం స్నేహసమం భవేత్.
దశమూలీరసే సర్పిః సక్షీరం పంచకోలకైః. 637
సక్షారైర్హంతి తత్సిద్ధం జ్వరకాసాగ్నిమాందతాః,
వాతపిత్తకఫవ్యాధీన్ ప్లీహానం చాపి పాండుతామ్. 638

తా. దశమూలరసము, ఘృతము, క్షీరము, పంచకోలములు, క్షారము-వీటిని చేర్చి సిద్ధముచేయవలయు. ఈఘృతము జ్వరము, కాసము, అగ్నిమాంద్యము, వాతపిత్తకఫ రోగములు, ప్లీహము, పాండువు వీటిని పోఁగొట్టును. ఘృతపాకమునందు వేరుద్రవ ద్రవ్యమును చేర్చునటుల చెప్పకుండినచో ఆవుపాలను నాలుఁగుభాగములు చేర్చుకొనవలయును. ద్రవద్రవ్యము చెప్పియుండినచో పాలను ఘృతమునకు సమముగాఁ జేర్చుకొనవలయును.

ప్రథమప్రకరణమ్.



# ద్వితీయ ప్రకరణము

## సన్నిపాతనిదానలక్షణచికిత్సాదయః

అవతరణిక. ఇపుడు గ్రంథకర్త "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే" అను భగవన్మహాభాష్యకారవచనప్రకారము గ్రంథమధ్యమునందు తన కిష్టదేవత యగు ఈశ్వరనమస్కారాత్మకమంగళమును "కృత్తివాసం పురారాతిం" అనుశ్లోకముచే జేయుచున్నాఁడు:—

కృత్తివాసం పురారాతి మంధకాసురభంజనం,
భర్గం శైలసుతాధీశం నీలకంఠమహం భజే. 1

తాత్పర్యము. గజచర్మాంబరధరుఁడు, త్రిపురాంతకుఁడు, అంధకాసురసంహారకుఁడు, సర్వలోకపూజితుఁడు, పార్వతీపతియు నగు నీలకంఠుని నేను భజింపుచున్నాఁడను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమాబసవాహ్వాయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజు అని పేర్కొనఁబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథమునందు రెండవప్రకరణమును వచింపుచున్నాఁడను.

### సన్నిపాతోత్పత్తికారణము

నిరూపణేన దోషస్య నిదానం కథ్యతే పురః,
పిత్తం తు కటుకాపాద్యం మధురామ్లాన్మరుత్కఫౌ. 3
సంకరాద్ద్వంద్వరూపం తు సర్వజం సన్నిపాతకం,
ఋతుదోషగ్రహావేశ విషదుర్గానకోపతః. 4
జన్మర్క్షగ్రహపీడాభి రతిపాపానుషంగతః,
గర్భస్రావాచ్చ నారీణాం సన్నిపాతసముద్భవః. 5

తా. తొలుత సన్నిపాతస్వరూపమును వానికారణమును వచించెద—మిక్కుటముగా కారమును సేవించుటవలన పిత్తమును, మధురమును సేవించుటవలన వాతమును, పులుసును సేవించుటవలన శ్లేష్మమును ప్రకోపించు. మఱియు దానిని సంకరముగా సేవించుటవలన ధాతువులకు ద్వంద్వరూపము గలుగు. సర్వరసములను మిక్కుటముగా

సేవించుటవలన సన్నిపాతములు జనించు. మఱియు ఋతుదోషము, గ్రహముసోఁకుట, విషసంబంధము, పాలదోషము, జన్మనక్షత్రపీడ, సూర్యాదిగ్రహపీడ, అతిపాపము, గర్భస్రావము-వీనివలనకూడా సన్నిపాతము జనించును.

## త్రయోదశసన్నిపాత సామాన్యనిదానము

ఆమ్లస్నిగ్ధోష్ణతీక్ష్ణైః కటుమధురసురాతాపసేవాకషాయైః
కామక్రోధాతిరూక్షైర్గురుతరపిశితాహారసౌహిత్యశీతైః,
శోకవ్యాయామచింతాగ్రహగణవనితాత్యంతసంగప్రసంగైః
ప్రాయఃకుప్యంతి పుంసాం మధుసమయశరద్వర్షణే సన్నిపాతాః. 6
(మతాంతరే)

తా. పులుసు, స్నిగ్ధోష్ణము, అత్యుష్ణకారముగల పదార్థసేవన, మద్యము, ఎండ, ఒగరు వీనిసేవనవలనను, కామక్రోధములవలనను, అతిరూక్ష, కడుజడత్వముగల పదార్థసేవనవలనను, ఆకంఠభోజనము, మాంసభక్షణము, శీతపదార్థసేవన, శోకము, శ్రమ, చింత, పిశాచబాధ, అత్యంత స్త్రీసంభోగము యీ మొదలగువానివలనను, చైత్రము, వైశాఖము, ఆశ్వీజము, కార్తికము, శ్రావణము, భాద్రపదము అను ఋతుదోషముల వలనను, మనుజులకు తఱుచుగా సన్నిపాతములు ప్రకోపించును.

గ్రహౌషధ విష క్రోధ చింత భీతి స్తిరస్కృతిః,
గ్రహాత స్సన్నిపాతస్స్యా ద్భయతో మరుదాశ్రయః. 7
(ఆయుర్వేదే)

తా. పిశాచపీడ ఔషధము విషము కోపము - చింత భీతి తిరస్కారము మొదలగువానివలనను సూర్యాదిగ్రహసంబంధమువలనను సన్నిపాతము జనించును. భయపడుట వలన వాతజ్వరము జనించును.

కోపక్రోధేన పిత్తస్స్యా ద్యౌతు శాపాభిచారజౌ,
సన్నిపాతజ్వరౌ ఘోరౌ తావసాధ్యతమౌ మతౌ. 8

తా. కోపక్రోధమువలన పైత్యము ప్రకోపించును. శాపము, అభిచారము వీని వలన భయంకరములైన సన్నిపాతము జ్వరము జనించును. ఈరెండును అసాధ్యములు.

## సన్నిపాతసామాన్యలక్షణము

రాత్రౌ జాగరణం దివాచ కృశతా మూర్ఛాతిదాహో మరుత్
శీతం స్వేదప్రలాపనం మదతృషా హాస్యం చ హృత్పీడనం,

కాసశ్వాస విదాహ శైత్య జ్వరితా తృష్ణా శిరోరోధనం
జిహ్వాదగ్ధకృశత్వ మంగపులకం స్యాత్సన్నిపాతజ్వరే.

(సిద్ధవిద్యాభూ

తా. రాత్రి మేల్కొనియుండుట, పగలు కృశించియుండుట, మూర్ఛ, శరీరమందు కడుదాహము, వాతము ప్రకోపించియుండుట, చలిబెట్టుట, చెమటపట్టుట, అసంగతముగ మాటలాడుట, మదము, నగుట, బొమ్మునొచ్చుట, లేక బొమ్ములమండుట, శ్వాసకాసలు, విదాహించుట, శరీరము చల్లనైయుండుట, జ్వరము, దప్పి, శిరస్సునొచ్చుట, నాలుక పిడకవలె యెండి కృశించియుండుట, శరీరము గగుర్పొడుచుట ఈలక్షణములుగలది సన్నిపాతజ్వరమని తెలియవలయు.

సంధ్యస్థిమూర్ధ్నిరుగ్దాహ శీతతంద్రా రుచిభ్రమాః,
కంఠకూజనకర్ణార్తిరక్తదృగ్భుగ్ననేత్రతా. 1
రక్తనిష్ఠీవనం మూర్ఛా తృష్ణా నిద్రాక్షయోనిశి,
జిహ్వాదగ్ధాఖరస్పర్శాశ్యామారక్తాంగరోధితా. 1
విపాకే మూఢతా చేతి సన్నిపాతజ్వరాకృతిః, (ఆయుర్వేదే

తా. కీళ్లు, ఎముకలు, తల నొచ్చుట, దాహము, శైత్యము, తంద్ర, అరుచి, దబ్బలాడుట, హీనస్వరము, చెవులు గడియలుపడుట, కన్నులకొనలు ఎఱ్ఱనైయుండుట, నేత్రములు క్రుంగియుండుట, నెత్తురు ఉమియుట, మూర్ఛ, దప్పి, రాత్రులయందు నిదురపట్టకుండుట, నాలుక కాలినట్టుగ బిరుసుగ నల్లగ ఎఱ్ఱగనుండుట, శరీరము బ్ర...గించియుండుట - ఈలక్షణములుగలది సన్నిపాతజ్వరమని తెలియవలయు. మఱియు నీసన్నిపాతజ్వరము ముదిరిన శరీరమునకు మరువుగలుగు.

మిశ్రితే లక్షణే జాతే జ్వరస్స్యాత్సాన్నిపాతికః. 12
క్షణే దాహః క్షణే శీత మస్థిసంధి శిరోరుజా,
సాస్రావే కలుషే రక్తే నిర్భుగ్నే చాపి లోచనే. 13
సస్వనౌ సరుజౌ కర్ణౌ కంఠశ్శూకైరివావృతః,
తంద్రా మోహః ప్రలాపశ్చ శ్వాసః కాసోఽరుచిర్భ్రమః. 14
పరిదగ్ధా ఖరస్పర్శా జిహ్వాప్రస్తాంగతాపరం,
ష్ఠీవనం రక్తపిత్తస్య కఫేనోన్మిశ్రితస్య చ. 15
శిరసోలోఠనం తృష్ణా నిద్రానాశో హృది వ్యథా,
స్వేదమూత్రపురీషాణాం చిరాద్దర్శనమల్పశః. 16

కృశత్వం నాతిగాత్రాణాం ప్రతతం కంఠకూజనం,
కోఠానాం శ్యావరక్తానాం మండలానాం చ దర్శనమ్. 17
మూకత్వం స్రోతసాంపాతో గురుత్వముదరస్య చ,
చిరాత్పాకశ్చదోషాణాం సన్నిపాతజ్వరాకృతిః. (మాధవనిదానే)

తా. జ్వరములలో వాతపిత్తశ్లేష్మసాంకర్యలక్షణములు గలిగియుండిన సన్నిపాత జ్వరమని తెలియవలయు. వానిలక్షణంబు లెవ్వియనిన— ప్రతిక్షణమున దాహము, ప్రతిక్షణమున శీతలము, ఎముకలు కీళ్లు శిరస్సు వీనియందు శూల, కండ్లయందు నీరు గారుట, నేత్రములు కలకబారియుండుట, నేత్రము లెఱ్ఱనైయుండుట, నేత్రములు క్రుంగియుండుట, లేక నిక్కబొడిచికొనియుండుట, చెవిలోశబ్దము, పోట్లు, కుతికెలో ముండ్లుపారినట్లుండుట, తంద్ర, మోహము, వదురుట, శ్వాసము, కాస, అరుచి, భ్రమ, నాలుక కాలినబొగ్గువలె నల్లనై బిరుసై ముండ్లుబారియుండుట, శరీరము మిక్కుటముగా వ్రేలుట, రక్తమిశ్రితములేక పిత్తమిశ్రితకఫమును స్వల్పముగా ఉమియుట, తలవిసురుట, దప్పి, నిదురపట్టకుండుట, ఱొమ్ములో వేదన, దీర్ఘకాలముమీఁద చెమట మూత్రము మలము కొంచెముగా వెడలుట, శరీర మధికముగా కృశింపకుండుట, కడుహీనస్వరము, మండలాకారంబై నలుపు ఎఱుపువర్ణములుగలదద్దులు శరీరమున నగుపడుట, మందముగ మాటలాడుట, లేక మాటలాడకనేయుండుట, చెవులు వినరాకుండుట, నేత్రములకు దృష్టిలేకుండుట, ఆఁకలి లేకుండుట, వాతపిత్తశ్లేష్మములు దీర్ఘకాలముమీఁద పక్వంబు లగుట - ఈలక్షణములు గలది సన్నిపాతజ్వరమని తెలియవలయు.

అంగవ్యథా శిరోరుక్స్యాద్దాహ స్సర్వాంగనేత్రయోః,
నేత్రే శోణితపీతాభే మూర్ఛాభ్రాంతిప్రలాపకమ్. 19
హృచ్ఛూలం గుంభనం హిక్కా కాసస్స్యాద్రోమహర్షణం,
సన్నిపాతజ్వరే ఘోరే వైద్యోజానాతి నిశ్చయత్. 20
(మతాంతరే)

తా. శరీరమునందు వేదన, శిరమునందు పోట్లు, సర్వాంగములు నేత్రములు మండుట, నేత్రము లెఱ్ఱగ లేక పచ్చగనుండుట, మూర్ఛ, భ్రాంతి, వదురుట, ఱొమ్ము నొచ్చుట *డగ్గుత్తికయుండుట, ఎక్కిళ్ళు, దగ్గు, గగుర్పొడుచుట-ఈలక్షణములుగలది భయంకరమైన సన్నిపాతజ్వరమని వైద్యుఁడు తెలిసికొనవలయు.

---

* డగ్గుత్తిక అనఁగా గద్గదస్వరముతో మాటలాడుట.

అసాధ్యసన్నిపాతసామాన్యనాడీలక్షణము

కాష్ఠభారస్య మధ్యేతు చుంచూగమనవద్భవేత్,
కుటిలం శిథిలం మందం సూక్ష్మం చ చపలం తథా. 21
సన్నిపాతోద్భవానాడీ విజ్ఞేయా సా తథాబుధైః, (చింతామణౌ)

తా. పదమూడుసన్నిపాతములలోను సప్తవిధదోషములలోను నాడి కట్టెల మోపునడుమ చుంచుపాఱినటులను, కుటిలముగను, తెగినటుల ఖండఖండములుగను, మందముగను, సూక్ష్మముగను, చపలముగను, నడచుచుండిన రోగి మృతిచెందు నని తెలియవలయును.

మృత్యుర్ధాతులక్షణము

నాడీ డమరుకాకారా దినే మృత్యుర్ద్దినత్రయే. (మతాంతరే) 22

తా. నడిమివ్రేలికింద కడపటివ్రేలిక్రింద నాడి డమరుకమువలె నడచుచుండిన రోగి ఒకదినములోగాని మూడుదినములలోగాని మృతిచెందును.

సన్నిపాతజ్వర సామాన్యప్రమాణము

దోషే విబద్ధే నష్టేగ్నౌ సర్వసంపూర్ణలక్షణః,
సన్నిపాతజ్వరోసాధ్యః కృచ్ఛ్రసాధ్యస్తతోఽన్యథా. 23
సప్తమే దివసే ప్రాప్తే దశమే ద్వాదశేపి వా,
పునర్ఘోరతరో భూత్వా శమనం యాతి హంతి వా. 24
ఏభిశ్చ ద్విగుణైర్వాపి మోక్షాయ చ వధాయ చ, (నిత్యనాథీయే)

తా. పిత్తాదిదోషములు మలాదిదోషములు బద్ధగించుట, జాఠరాగ్ని నశించుట, వాతాదులయొక్క సర్వదోషములు సంపూర్ణముగా నుండుట - ఈలక్షణములుంగల సన్నిపాతజ్వరము అసాధ్యం బనియు, దోషప్రవృత్తి ఒకింత అగ్నిదీపనము సర్వలక్షణములలో కొన్నిలక్షణములు ఇవి మాత్రము గలిగియుండిన కష్టసాధ్యం బనియు తెలియవలయు. సన్నిపాతము ౭ లేక ౧౧ లేక ౧౨ దినములకు కడు ఉగ్రంబై శాంతి చెందినను జెందును. లేక చంపినను చంపును. అటుకాదేని ౧౪-౨౦-౨౧ దినములకు శాంతి చెందినను జెందు, లేక చంపినను చంపు.

వాక్యము: మాధవనిదానము, ఆయుర్వేదము, నిత్యనాథీయము, వైద్యచింతామణి - వీనియందలి త్రయోదశ సన్నిపాత నిదానంబులను, వానిసాధ్యాసాధ్యంబులను, కాలప్రమాణంబును, ఉపద్రవములను, చికిత్సానుపానంబులను సంగ్రహించెద.

## సన్నిపాతనామతత్సాధ్యాసాధ్యములు

సంధిక స్తాంద్రికశ్చైవ దుస్సాధ శ్చిత్తవిభ్రమః. 25
కష్టసాధ్యః కంఠకుబ్జః కర్ణికో జిహ్వక స్తథా,
కష్టాత్కష్టతరో జ్ఞేయో రుగ్దాహో హంతి మానవమ్. 26
అంతకో భుగ్ననేత్రశ్చ రక్తష్ఠీవీ ప్రలాపకః,
శీతాంగశ్చాప్యభిన్యాస షట్సాధ్యా స్సప్తమారకాః. 27
(మాధవనిదానే)

తా. సంధికము, తాంద్రికము, చిత్తవిభ్రమము, కంఠకుబ్జము, కర్ణికము, జిహ్వ, రుగ్దాహము, అంతకము, భుగ్ననేత్రము, రక్తష్ఠీవి, ప్రలాపము, శీతాంగము, అభిన్యాసము అను నీపదమూడును సన్నిపాతనామంబులు. అందాఱు సాధ్యంబులు, తక్కిన యేడు మారకంబులు. అందు సంధికము, తాంద్రికము, చిత్తవిభ్రమము ఇవి కష్టసాధ్యంబులు. కంఠకుబ్జములు, కర్ణికము, జిహ్వకము ఇవి కడుకష్ట సాధ్యంబులు. రుగ్దాహము మారకంబు. తక్కినవి ఆఱును సాధ్యంబులు. (ఇంక వాని సాధ్యాసాధ్యంబుల నెఱుంగుటకు తగినలక్షణంబుల వచించెద.)

## సంధికసన్నిలక్షణము

అంగశోఫో వాయుకఫౌ తంద్రా శూల ప్రజాగరాః,
సంధికాఖ్యే సన్నిపాతే బలహానిశ్చ జాయతే. (మాధవనిదానే)

తా. అంగములు వాచుట, వాతోపద్రవములు కలిగియుండుట, కఫముపడుట, తంద్ర, శూల, నిదురపట్టకుండుట, సత్వము క్షయించుట- ఈలక్షణములు కలిగి అంగములు వాచియుండునది సంధికసన్ని యని తెలియవలయు.

పూర్వరూపకృతశూలసంభవం *శోఫవాతబహువేదనాన్వితం,
శ్లేష్మతాపబలహానిజాగరం సన్నిపాతమితి సంధికం వదేత్. 29
(ఆయుర్వేదే)

తా. వాపు, శరీరము వాతపూరితముగ నుండుట, తఱచుగ పొరలుట, శ్లేష్మకోపము, సంతాపము, సత్వము క్షయించుట, నిదురపట్టకుండుట - ఈలక్షణములు పూర్వరూపజనితశూలతోఁగూడి అంగములు శోభించియుండునది సంధికసన్నియని తెలియవలయు.

శరీరం పూర్వవచ్ఛూలం శోఫవాతం చ వేదనా,

* శోషవాత.

కఫస్తంద్రామతాపంచ సంధికే సాన్నిపాతికే. (నిత్యనాథీయే) 3

తా. శరీరము పూర్వమువలెనేయుండుట, శూల శోభ గలిగియుండుట, శరీరమునందు వాతోపద్రవములు వేదన కఫము తంద్ర తాపము ఈలక్షణములుగలది సంధిసన్నియని తెలియవలయును.

సదాస్యం శ్లేష్మణా పూర్ణం శూలం నాసాతివేదనా,
శోకస్స్యల్లక్షణం జ్ఞేయం సంధికే సాన్నిపాతికే. (చింతామణౌ

తా. ఎల్లపుడు నోరు శ్లేష్మపూరితముగ నుండుట, శూల, నాసికములో కడవేదన, కన్నులయందు నీరుగారుట ఈలక్షణములుగలది సంధికసన్నియని తెలియవలయు (ఇందు శుభకరనాడులు కలిగియుండిన సాధ్యము. అశుభకరనాడులు కలిగియుండి అసాధ్యము. ఆశుభాశుభనాడులను అష్టధాతువు నిదానమువలన తెలుచుగా నెఱుం వలయు.)

### తాంద్రికసన్నిలక్షణము

తంద్రా శూల జ్వర శ్లేష్మ తృష్ణాచ ఛర్ది కంఠరుక్,
ఉత్కణ్ఠాస్స్య దనశోనం తాంద్రికే శ్వాసకః కఫః. (మాధవనిదానే

తా. తంద్ర, శూల, జ్వరము, శ్లేష్మము, దప్పి, వాంతులు, మెడవాచియుండుట బొంగుపోయినటుల మాటలాడుట, అన్నమునం దిచ్ఛలేకుండుట, శ్వాసము, తెమట వెడలుట- ఈలక్షణములుగలిగి తంద్ర విడువకుండునది తాంద్రికసన్నియని తెలియవలయు.

ప్రభూతా తంద్రార్తి జ్వర కఫ పిపాసాకులతరో
భవేచ్ఛ్యామా జిహ్వా పృథులకఠినా కంటకవృతా,
అతీసార శ్శ్వాసః క్లమథ పరితాప శ్శ్రుతిరుజో
భృశం కంఠేజాడ్యం శయనమనిశం తాంద్రికగదే. (ఆయుర్వేదే)33

తా. అధికముగా తంద్ర, శూల, జ్వరము, తెమటవెడలుట, దప్పివలన రోగి కడుపీడితుండుగ నుండుట, నాలుక నల్లనై దళమై కఠినమై ముండ్లుబారియుండుట, అతిసారము, శ్వాస, బడలిక, శరీరముమండుట, చెవి వినరాకుండుట, మిక్కుటముగా కంఠమునందు జడత్వము, రేయుంబగలు పరుండియుండుట - ఈలక్షణములు గలిగి తంద్ర విడువకుండునది తాంద్రికసన్నియని తెలియవలయు. ఇది యసాధ్యము.

అతితంద్రా జ్వర శ్శ్వాస శ్శ్రవస్తాపోఽతిసారతృట్,
స్థూలకణ్ఠాయుతిశ్శ్యామా జిహ్వా కఠినకంటకా. 34

శ్రుతిస్వల్పాకఫశ్చేతి తాంద్రికేసాన్నిపాతికే, (నిత్యనాథీయే)

తా. విడువనితంద్ర జ్వరము శ్వాస శ్రమ చేతులు కాళ్ళు మండుట, అతిసారము దప్పి కుతికె బొంగురుపోవుట, నాలుక నలుపువర్ణముగలదై కఠినమై ముండ్లుబారియుండుట, చెవుడు, పొడిదగ్గు-ఈలక్షణములు గలిగి తంద్ర విడువకుండునది తాంద్రికసన్ని యని తెలియవలయు.

బద్ధప్రలాప స్తంద్రాచ జిహ్వాశ్యామా సకంటకా. 35
కఠినా నిర్ద్రవా శుష్కం సంతాప శ్చాతిసారకః,
శ్వాసః కండూ ర్వివర్ణశ్చ తోయం స్రవతి లోచనే. 36
జ్వరమత్యుత్కటం చైవ తాంద్రికేసాన్నిపాతికే, (చింతామణౌ)

తా. వదురుట, తంద్ర, నాలుక నల్లనై ముండ్లుబారి కఠినమై ద్రవము లేకుండుట, శరీరము శుష్కించుట, తాపము అతిసారము శ్వాస శరీరమునందు దురద, నేత్రములు విశాలమై పెద్దవిగనుండుట, కన్నులయందు నీరుగారుట, తీవ్రజ్వరము-ఈలక్షణములుగలిగి తంద్ర విడువకుండునది తాంద్రికసన్నియని తెలియవలయు.

## ప్రలాపసన్నిలక్షణము

ప్రలాపకంపరుక్ప్రజ్ఞా నాశవైకల్యవిభ్రమాః. 37
ప్రలాపః ప్రాణహంతాచవిలాపోగ్రజ్వరాదిభిః, (మాధవనిదానే)

తా. ప్రలాపము కంపము వేదన మతిమరుపు శరీరము వికలమైయుండుట, తబ్బిబ్బులాడుట, ఏడ్చుట, శరీరమునందు బొబ్బెలు, ఉగ్రజ్వరము-ఈలక్షణములు గలిగి ఏడ్చుచు వదురుచు నుండిన ప్రలాపసన్ని యని తెలియవలయు. ఇది ప్రాణములను హరించును.

కంపప్రలాప [1] పరితాపనకంఠపీడా
[2]శోషప్రవాతప్రతికః పవమానచింతా,
ప్రజ్ఞాప్రణాశవికలః ప్రచురప్రవాదః
శీఘ్రం ప్రయాతి పితృపాలపదం ప్రలాపీ. (ఆయుర్వేదే) 38

తా. శరీరము వణుకుట, ప్రలాపించుట, సంతాపము, కుతికనొచ్చుట, శోష, శరీరము వాతపూరితముగనుండుట, గాలినికోరుట, ప్రజ్ఞావిహీనతచే శరీరము గురు తెరుగ

---

1 పరితాపనశీర్షపీడా=కపాలమునందు పీడగలుగుట. 2 షాఢ్ధప్రభావపవమాన పరోన్యచింతా=గంభీరముగా మాటలాడుట, తనసుఖమునుగోరి పరులదుఃఖమునకు వ్యసనపడుట.

కుండుట, అధికముగ వదురుట-ఈలక్షణములు గలిగి ఏడ్చుచు వదురుచు నుండిన ప్ర
పసన్ని యని తెలియవలయు. ఇది గలవాఁడు కడుశీఘ్రముగా పితృలోకమున కేగును

ప్రలాపకంపౌ భ్రాంతిశ్చ ప్రజ్ఞానాశోఽతితాపవాన్,
పాదశోథాంగపీడా చ వికలః ప్రతివాదితా.
జ్ఞేయం ప్రలాపకేచిహ్నం సన్నిపాతో నికృంతకః, (నిత్యనాథీయే

తా. వదురుట, శరీరము వణకుట, భ్రమమాటలాడుట, అజ్ఞానము, అతితాపవ
పాదములు శోభించుట, శరీరము నొచ్చుట, శరీరము గురుతెరుగ కుండుట, ప్రతివా
చుట - ఈలక్షణములు గలది ప్రలాపసన్ని యని తెలియవలయు. ఇది రోగిని జంపు

కంపప్రలాపసంతాపా వాతశ్లేష్మప్రజాయతే.
హిక్కా తాపజ్వరశ్చైవ ప్రలాపే సాన్నిపాతికే, (చింతామణౌ

తా. శరీరము వణకుట, వదురుట, సంతాపము, శరీరము నొచ్చుట, దగ్గు
ఎక్కిళ్ళు, తాపజ్వరము-ఈలక్షణములు గలది ప్రలాపసన్ని యని తెలియవలయు.

చిత్తవిభ్రమసన్నిలక్షణము

ప్రలాపో నర్తనం హాస్యం నాసాపీడా మదభ్రమాః.
వైకల్యం కోపనం గానం దుస్సాధశ్చిత్తవిభ్రమః,
(మాధవనిదానే

తా. ప్రలాపించుట, నృత్యము సలుపుట, నగుట, ముక్కు కలుచుకొనుట, మ
మెక్కియుండుట, తబ్బిబ్బులాడుట, శరీరము గురుతెరుగకుండుట, కోపము, పాడు
ఈలక్షణములు గలిగి యెల్లపుడు చిత్తభ్రమ గలిగియుండునది చిత్తవిభ్రమసన్ని య
తెలియవలయు. ఇది అసాధ్యము.

మదో మోహో భ్రమ స్తాపో హాస్య గీత ప్రలాపనమ్.
నృత్యం వికలతా పీడా వికటాక్షో విచక్షణః,
లక్షణై స్సన్నిపాతోఽయం జ్ఞాతవ్య శ్చిత్తవిభ్రమః. (ఆయుర్వేదే

తా. శరీరము మదమెక్కుట, మోహము, భ్రమ, తాపము, నగుట, పాడుట
వదురుట, ఆడుట, శరీరము గురుతెరుగకుండుట, శరీరపీడ, వెఱ్ఱిచూపులు, తెలివిగల వా
వలె నుండుట - ఈలక్షణములుగలది చిత్తవిభ్రమసన్ని యని తెలియవలయును.

యది కథమపి పుంసాం జాయతే కాయపీడా
భ్రమ మద పరితాపా మోహ వైకల్యభావా,
వికటనయనహాసో నృత్తగీత ప్రలాపా

హ్యభిదశతి నసాధ్యం కేహి చిత్తభ్రమాఖ్యమ్. (నిత్యనాథీయే) 44

తా. ఉన్మత్తకాయదినినవానివలె పిచ్చిమాటలాడుట, భ్రమ, శరీరము మదమెక్కుట, సంతాపము, మోహము, శరీరము గురుతెరుగకుండుట, ఉఱిమిచూచుట, నగుట, ఆడుట, పాడుట, వదురుట-ఈలక్షణములు గలది చిత్తవిభ్రమసన్నియని తెలియవలయు. ఇది యసాధ్యము.

సర్వావయవవైకల్యం వాతపిత్తప్రకోపనం,
భ్రమమోహహా భ్రుకుటిలో గీతనృత్యప్రలాపనమ్. 45
మహాఘోరస్సన్నిపాతో జ్ఞాతవ్యశ్చిత్తవిభ్రమః. (చింతామణౌ)

తా. సర్వావయవములు వైకల్యమును జెందియుండుట, వాతపిత్తములు ప్రకోపించుట, భ్రమ, మోహము, కనుబొమలు ముడిపడుట, పాడుట, ఆడుట, వదురుట-ఈలక్షణములు గలది కడుభయంకరమైన చిత్తవిభ్రమసన్ని యని తెలియవలయు.

## జిహ్వకసన్నిలక్షణము

శ్వాసకాస పరితాప విహ్వాలో మీలితాక్షీచ కఫావృతం ముఖం,
నిశ్శ్వసఞ్ బధిరమూకలక్షణ శ్శాంతకృద్భవతి యస్సజిహ్వకః. 47
(మాధవనిదానే)

తా. శ్వాసకాసలు, సంతాపము, మతిచాంచల్యము, నేత్రములు మూతలుపడుట, నోట కఫము వెడలుట, నిట్టూర్పు, వాతము వెడలుట, చెవుడు, మూగతనము-ఈలక్షణములు గలిగి నాలుక కఠినమై ద్రవములేక ముండ్లుపారియుండునది జిహ్వకసన్ని యని తెలియవలయు. ఇది రోగిని జంపును.

శ్వసనకాసపరితాపవిహ్వలః కఠినకంటక వృతాచ జిహ్వికా,
బధిరమూకబలహానిలక్షణో భవతి కష్టతరసాధ్యజిహ్వకః. 48
(ఆయుర్వేదే)

తా. కాసశ్వాససంతాపములచే మతిచాంచల్యము, నాలుక కఠినమై ముండ్లుపారియుండుట, చెవుడు, మూకత్వము, సత్వము క్షయించుట-ఈలక్షణములుగలది జిహ్వకసన్ని యని తెలియవలయు. ఇది కష్టసాధ్యము.

కంటకాకఠినాజిహ్వా కాసశ్వాసాతివిహ్వలః,
మూకో బధిరతాతాపో బలహాని ర్విలక్షణైః. 49
జిహ్వకస్సన్నిపాతోఽయం కష్టసాధ్యం విదుర్బుధాః,
(నిత్యనాథీయే)

తా. నాలుక కఠినమై ముండ్లుపారియుండుట, కాసశ్వాసలు, మతిచాంచల్యము మూకత్వము, చెవుడు, తాపము, సత్వక్షయము, మరణచిహ్నములు - ఈలక్షణములు గలిగి నాలుక కఠినమై ముండ్లు పారియుండునది జిహ్వాకసన్నియని తెలియవలయు. ఇ కష్టసాధ్యము.

నిశ్శ్వాసో వేగసంతాపౌ కాసః కఠినజిహ్వికా. 5
కంటకాః శ్యామవర్ణా చ మూకత్వం బధిరో జడః,
జిహ్వాకస్సన్నిపాతోఽయ మసాధ్యం చ వినిర్దిశేత్. (చింతామణౌ

తా. ఊర్ధ్వశ్వాసము, తాపము, దగ్గు, నాలుక కఠినమై నల్లనై ముండ్లుపా ియుండుట, స్వల్పముగ మాటలాడుట, లేక మాటలాడకనేయుండుట, చెవుడు, జ త్వము-ఈలక్షణములుగలది జిహ్వాకసన్నియని తెలియవలయు. ఇది యసాధ్యము.

కర్ణికసన్నిలక్షణము

జ్వరోగ్రతాపకర్ణార్తి గ్రంథిః క్రోధః ప్రలాపనం,
శ్వాసకాసప్రసేకాస్స్యుః కర్ణికః కృచ్ఛ్రసాధ్యకః. ౬
(మాధవనిదానే

తా. ఉగ్రజ్వరము, తాపము, చెవికొనలు వాచుట, గ్రంథులుపుట్టుట, కోపమ వదురుట, శ్వాసకాసలు, నోటిలో నీరుగారుట - ఈలక్షణములుగలిగి కర్ణమూలము యందు వాపుకలిగియుండునది కర్ణికసన్నియని తెలియవలయు. ఇది కష్టసాధ్యము.

ప్రలాప శ్రుతి హ్రాసకంఠగ్రహాంగ
వ్యథా శ్వాసకాసప్రసేకప్రభావం,
జ్వరం తాపకర్ణాంతయోర్గల్లపీడా
బుధాః కర్ణికం కష్టసాధ్యం వదంతి. (ఆయుర్వేదే) 5

తా. వదురుట, చెవుడు, కుతికబట్టికొనినట్టుండుట, శరీరమునందు వ్యథ, శ్వా దగ్గు, జొల్లుకారుట, జ్వరము, సంతాపము, చెవి చెక్కిళ్లు వీనిమూలములయందు వాపు ఈలక్షణములుగలది కర్ణికసన్నియని తెలియవలయు. దీనిని పండితులు కష్టసాధ్య మ వచించెదరు.

జ్వరః కర్ణాంతశోథా చ శ్వాసకంపప్రలాపనం,
స్వేదఃకంఠగ్రహస్తాపో హృల్లాసోఽంగవ్యథాపి చ. 5
కర్ణికే సన్నిపాతే చ లక్షణాని చ పండితైః. (నిత్యనాథీయే

తా. జ్వరము, కర్ణమూలములయందు వాపు, ఉబ్బసము, శరీరకంపము, వదురుట, చెమట, కంఠముపట్టికొనినట్టుండుట, తాపము, ఓకరవచ్చునట్టుండుట, శరీరమునందు సూదులచే బొడుచునటుల వ్యథ-ఈలక్షణములుగలది కర్ణికసన్నియని పండితులు తెలిసికొనవలయు.

ప్రలాప జిహ్వాస్ఫుటన హిక్కా కాసాంగకంపనమ్. 55
కర్ణాంతశోఫస్తాపశ్చ కర్ణికేసాన్నిపాతికే, (చింతామణౌ)

తా. వదురుట, నాలుక పగిలియుండుట, ఎక్కిళ్ళు, దగ్గు, శరీరకంపము, చెవికొనలు వాచుట, తాపము, పలుమారులేచుట - ఈలక్షణములుగలది కర్ణికసన్నియని తెలియవలయు.

## పూర్వోక్తసన్నిపాతసాధ్యనాడీలక్షణము

సువ్యక్తతా నిర్మలత్వం స్వస్థానస్థితిరేవ చ. 56
అచంచల మమందత్వం సర్వం సల్లక్షణం శుభం, (ఆయుర్వేదే)

తా. పైఁజెప్పఁబడిన నాలుసన్నిపాతములలో నాడి స్వస్థానము విడనాడకను, నిర్మలముగను, కౌటిల్యరహితంబుగను, సూక్ష్మతావిహీనంబుగనుండిన యాసన్నిపాతములు సాధ్యములని తెలియవలయును.

## సాధ్యసన్నిపాతవివరణము

సంధిక స్తాంద్రికశ్చైవ ప్రలాప శ్చిత్తవిభ్రమః. 57
జిహ్వకః కర్ణికశ్చైవ షట్సాధ్యాశ్చ ప్రకీర్తితాః, (గ్రంథాంతరే)

తా. సంధికము, తాంద్రికము, ప్రలాపము, చిత్తవిభ్రమము, జిహ్వకము, కర్ణికము-అను నీయారుసన్నిపాతములు సాధ్యంబులు. (అట్లగుటచే వానికి చికిత్సజేయవలయు.)

## అసాధ్యసన్నిపాతవివరణము

రుగ్దాహ మంతకో భుగ్ననేత్రం స్యా త్కంఠకుబ్జకః. 58
రక్తష్ఠీవీ శీతగాత్ర మభిన్యాసశ్చ దారుణాః,
సన్నిపాతా ఇమే సప్త హ్యసాధ్యాః పరికీర్తితాః. (గ్రంథాంతరే)

తా. రుగ్దాహము, అంతకము, భుగ్ననేత్రము, కంఠకుబ్జము, రక్తష్ఠీవి, శీతాంగము, అభిన్యాసము-అను నీయేడుసన్నిపాతములు అసాధ్యంబులు. (అట్లగుటచే వానికి తటుచుగా చికిత్సజేయంజనదు.)

## రుద్ధాహసన్నిలక్షణము

శోఫ ప్రలాప మోహాగ్నిమాంద్యం శ్రాంతిస్తృషా భ్రమః,
రుద్ధాహే శ్వాసశూలౌచ కంఠమన్యారుజా తథా. 60

(మాధవనిదానే)

తా. శరీరమువాచుట, ప్రలాపము, మోహము, అగ్నిమాంద్యము, బడలిక, దప్పి తబ్బిబ్బులాడుట, ఉబ్బసము, శూల, మెడ పెడతలనరము వీనియందు వేదన-ఈలక్షణములు గలిగి కుతికపగిలి నొచ్చునది రుద్ధాహసన్ని యని తెలియవలయు.

మోహస్తాపః ప్రలాపశ్చ వ్యథాకంఠే భ్రమః క్లమః,
వేదనాతితృషా జాడ్యం శ్వాసస్త్వేతైశ్చ లక్షణైః. 61
కష్టాత్కష్టతరం జ్ఞేయం రుద్ధాహస్సాన్నిపాతికః, (ఆయుర్వేదే)

తా. మోహము, తాపము, పదురుట, కుతిక పగిలి నొచ్చుట, శరీరము చక్రాకారముగ దిరుగుట, బడలిక, పొరలుట, కడుదప్పి, శరీరజాడ్యము, శ్వాస - ఈలక్షణములు గలిగి కుతికపగిలి నొచ్చునది రుద్ధాహసన్ని యని తెలియవలయు. ఇది కడు అసాధ్యము.

ప్రలాప పరితాపన ప్రబలమోహ మాంద్యశ్రమాః
పరిభ్రమణ వేదనావ్యథితకంఠమన్యాహనుః,
నిరంతరతృషాకర శ్శ్వసన శూల హిక్కాకులః
సకష్టతరసాధనో భవతి హంతి రుద్ధాహకః. (నిత్యనాథీయే) 62

తా. పదురుట, సంతాపము, కడుమోహము, అగ్నిమాంద్యము లేక కడుపులో మంట, శ్రమ, శరీరము తిరుగుట, కంఠము పెడతలనరము చెక్కిళ్ళు వీనియందు వేదన, ఎల్లపుడు దప్పి నిట్టూర్పులు శూల ఎక్కిళ్ళు - ఈలక్షణములు గలిగి కుతికపగిలియుండు నది రుద్ధాహసన్ని యని తెలియవలయు. ఇది యసాధ్యంబగుటచే రోగిని జంపును.

ప్రలాపతాపౌ మోహశ్చ కంఠే వై వేదనాభ్రమః,
వేదనాతితృషాకాసో జాడ్యకంపప్రలాపనమ్. 63
స్వేదో లలాటకంఠే చ రుద్ధాహేసాన్నిపాతికే, (చింతామణౌ)

తా. పదురుట, తాపము, మోహము, కుతికపగిలి నొచ్చుట, శరీరము తిరుగుట, పొరలుట, కడుదప్పి, కాసము, శరీరజాడ్యము, శరీరకంపము, మొరబెట్టుట, లలాటము కుతిక వీనియందు చెమట-ఈలక్షణములు గలిగి కుతికపగిలి నొచ్చునది రుద్ధాహసన్నియని తెలియవలయును.

## అంతకసన్నిలక్షణము

అంతర్దాహా శిరఃకంప హిక్కా రోదనవిభ్రమాః. 64
తమంతకం విజానీయా దసాధ్యశ్చాప్రతిక్రియః, (మాధవనిదానే)

తా. కడుపులోదాహము, శిరఃకంపము, ఎక్కిళ్లు, ఏడ్చుట, తబ్బిబ్బులాడుట - ఈలక్షణములుగలిగి కడుపులో కడుమంటలు గలిగియుండునది-అంతకసన్నియని తెలియవలయు. ఇది యసాధ్యము. అట్లగుటచే దానికి చికిత్సయే లేదు.

దాహా మోహా శిరఃకంప హిక్కా కాసాంగ కంపనమ్. 65
సంతాపశ్చాత్మనోజ్ఞేయ శ్చాంతకే సన్నిపాతకే. (ఆయుర్వేదే)

తా. దాహము, మోహము, శిరఃకంపము, ఎక్కిళ్లు, దగ్గు, శరీరము వణకుట, ఆత్మకు సంతాపము-ఈలక్షణములుగలిగి కడుపులో కడుతాపము గలిగియుండునది అంతకసన్ని యని తెలియవలయు. ఇది యసాధ్యము.

దాహం కరోతి పరితాపనమాతనోతి
మోహం దదాతి విదధాతి శిరఃప్రకంపం,
హిక్కాం కరోతి కసనం చ సమాతనోతి
జానీహి తం విబుధవర్జితమంతకాఖ్యమ్. (నిత్యనాథీయే) 67

తా. దాహము, సంతాపము, మోహము, తలవణకుట, ఎక్కిళ్లు, వాంతి - ఈ లక్షణములుగలది అంతకసన్ని యని తెలియవలయు. ఇది యసాధ్యము.

సదాహా మోహా స్తాపశ్చ శిరఃకంపః ప్రలాపనం,
వాంతిర్హిక్కాజ్వరశ్చైవ హ్యంతకే సన్నిపాతకే. (చింతామణౌ)

తా. దాహము, మోహము, సంతాపము, తలవణకుట, వదరుట, వాంతి, ఎక్కిళ్ళు, జ్వరము - ఈలక్షణములుగలది అంతకసన్ని యని తెలియవలయు. ఇది యసాధ్యము.

## భుగ్ననేత్రసన్నిలక్షణము

అక్షిభంగ శ్శ్రుతేర్భంగః ప్రలాప శ్శ్వాసవిభ్రమాః,
భుగ్నదృష్టిం విజానీయా దసాధ్యం కంఠశోషవత్. 69

తా. నేత్రములయందు మిటిమిటిచూపు, చెవులు వినరాకుండుట, ప్రలాపము, శ్వాసము, తబ్బిబ్బులాడుట, కంఠశోష - ఈలక్షణములుగలిగి నేత్రములు భ్రంగియుండునది భుగ్ననేత్రసన్నియని తెలియవలయు. ఇది యసాధ్యము.

9

జ్వరబలాపచయ శ్రుతిశూన్యతా
శ్వసనభుగ్న విలోచన మోహితాః,
ప్రలపన భ్రమ కంపన శోకవాఞ్
త్యజతి జీవితమాశు సభుగ్నదృక్. (ఆయుర్వేదే)

తా. జ్వరమువలన బలక్షయము, చెవులు వినరాకుండుట, నిట్టూర్పు, వాతః విడుచుట, నేత్రములు క్రుంగియుండుట, మోహము, వదరుట, శరీరము దిరుగు శరీరకంపము, దుఃఖించుట-ఈలక్షణములుగలది భుగ్న నేత్రసన్నియని తెలియవలయు ఇది యసాధ్యం బగుటచే రోగి కడుశీఘ్రముగా ప్రాణంబులు విడుచును.

శ్వసనం లోచనే భుగ్నే శ్రుతిశూన్యం జ్వరాధికం,
మోహ ప్రలాపనః కంపో భ్రమో నిద్రాపి లక్షణైః. 7
జ్ఞాతవ్యో భుగ్న నేత్రోఽయం సన్నిపాత స్సుదారుణః,
(నిత్యనాథీయే

తా. శ్వాస, నేత్రములు క్రుంగియుండుట, చెవులు వినరాకుండుట, జ్వరా క్యము, మోహము, ప్రలాపము, శరీరకంపము, భ్రమ, మైకము - ఈలక్షణములుగల భుగ్న నేత్రసన్నియని తెలియవలయు. ఇది యసాధ్యము.

భుగ్నం విలోచనద్వంద్వం బాష్పంస్రవతి సంతతమ్. 7
నిరీషణేన రహితం ప్రలాపభ్రమకంపనం,
జ్ఞాతవ్యో భుగ్న నేత్రోఽయం సన్నిపాత స్సుదారుణః. 7
(చింతామణౌ)

తా. నేత్రములు క్రుంగియుండుట, నేత్రములయందు యెల్లపుడు నీరుగారుట, నేత్రములకు చూపులేకుండుట, వదరుట, భ్రమయుట, వణకుట-ఈలక్షణములు గలది భుగ్నసేత్రసన్నియని తెలియవలయు. ఇది యసాధ్యము.

కంఠకుబ్జసన్నిలక్షణము

హనుకంఠశిరశ్శూలో మోహ కంప జ్వరానిలాః,
మూర్ఛా దాహ ప్రలాపాస్స్యు రిత్యాద్యాః కణ్ఠకుబ్జకే. 74
(మాధవనిదానే)

తా. చెక్కిళ్ళను మెడయు శిరమును శూలించుట, మోహము వణకుట జ్వరము ఊర్ధ్వశ్వాసము మూర్ఛ దాహము ప్రలాపము- ఈలక్షణములుగలిగి మెడ కుదియఁబడి యుండునది కంఠకుబ్జసన్నియని తెలియవలయు. ఇది యసాధ్యము,

శిరో_ర్తికంఠగ్రహదాహమోహ కంపజ్వరార_క్తసమీరణా_ర్తిః,
హనుగ్రహస్తాపవిలాపమూర్ఛా స్యాత్కంఠకుబ్జః ఖలు కష్టసాధ్యః.
(ఆయుర్వేదే)

తా. తలనొచ్చుట, మెడకుదియఁబడుట, దాహము, మోహము, వణకు, జ్వరము, ర_క్తవాతసంబంధపీడ, చెక్కిళ్ళు కిట్టుకొనుట, సంతాపము, వదరుట, మూర్ఛ-ఈలక్షణములుగలది కంఠకుబ్జసన్నియని తెలియవలయు. ఇది కష్టసాధ్యము.

కంఠగ్రహా జ్వరో మూర్ఛా దాహః కంపో విలాపనం,
మోహస్తాపశ్శిరో_ర్తిశ్చ వాతా_ర్తః ప్రలపఞ్ శ్వసన్. 76
(నిత్యనాథీయే)

తా. కంఠము కుదియఁబడుట, జ్వరము మూర్ఛ దాహము వణకు ఏడ్చుట, మోహము తాపము శిరోవేదన వాతప్రకోపము, వదరుట, నిట్టూర్పులు విడుచుట - ఈలక్షణములుగలది కంఠకుబ్జసన్నియని తెలియవలయు. ఇది యసాధ్యము.

మోహ దాహౌ శిరఃకంపః కణ్ఠకుబ్జశ్చ మూకతా,
విలాప స్తాపనం మూర్ఛా త్వంగశైథిల్యకం కఫః. 77
ఛర్దిర్హిక్కా గుంభనంచ హ్యు_త్తమాంగవ్యథా తతః,
స ఏవ సన్నిపాతోఽయం జ్ఞాతవ్యః కణ్ఠకుబ్జకః. (చింతామణౌ) 78

తా. మోహము, దాహము, తలవణకుట, మెడకుదియఁబడుట, మూకత్వము, లపించుట, తాపము, మూర్ఛ, శరీరము శైథిల్యమునుజెందుట, దగ్గు, వాంతి, ఎక్కిళ్ళు, గ్గు_త్తికపడుట, తలనొచ్చుట-ఈలక్షణములుగలది కంఠకుబ్జసన్నియని తెలియవలయు.

## రక్తష్ఠీవసన్నిలక్షణము

ర_క్తఛర్ది భ్రమ శ్వాసా అజ్ఞానాధ్మాన హిక్కికా,
ఆర_క్తమండలం శ్యామం ర_క్తష్ఠీవీ యమాలయమ్. 79
(మాధవనిదానే)

తా. నెత్తురుగ్రక్కుట, తబ్బిబ్బులాడుట, ఉచ్ఛ్వాసము అజ్ఞానము కడుపుబ్బము ఎక్కిళ్ళు, శరీరము నల్లనై ర_క్తమండలములు గలిగియుండుట - ఈలక్షణములు లగి ర_క్తము గ్రక్కుచుండిన ర_క్తష్ఠీవిసన్నియని తెలియవలయు. ఇది గలవాఁడుయమాయంబున కేగు.

ర_క్తష్ఠీవీ జ్వర వమి తృషా మోహ శూలాతిసారా

హిక్కా ధ్మాన భ్రమణ దవథు శ్వాస సంజ్ఞా ప్రణాశాః,
శ్యామారక్తాధికతరరసనా మండలోత్థానరూపా
రక్తష్ఠీవీ నిగదిత ఇహ ప్రాణహంతా ప్రసిద్ధః. (ఆయుర్వేదే) 81

తా. రక్తముగ్రక్కుట, జ్వరము వాంతి దప్పి మూర్ఛ శూల అతిసారము ఎక్కిళ్లు కడుపుబ్బరము, శరీరము చక్రాకారముగ దిరుగుట, సంతాపము, శ్వాస, తెలివి లేకుండుట నాలుక నల్లగగాని ఎఱ్ఱగగాని లేక మండలములుగలదిగగాని యుండుట-ఈలక్షణముల గలది రక్తష్ఠీవిసన్నియని తెలియవలయు. ఇది ప్రాణహానిని చేయుటయందు ప్రసిద్ధి జెందినది.

రక్తష్ఠీవన సంమూర్ఛా జ్వర మోహ తృషా భ్రమాః,
వాంతిర్హిక్కాతిసారశ్చ సంజ్ఞానాశో వ్యథాశ్వసః. 82
మండలా శ్యామరక్తాశ్చ దాహస్స్యుల్లక్షణాని వై,
జ్ఞాతవ్య స్సన్నిపాతోఽయం రక్తష్ఠీవీతిఘాతుకః. (నిత్యనాథీయే)

తా. రక్తముగ్రక్కుట, మూర్ఛ జ్వరము మోహము దప్పి, శరీరము తిరుగుట వాంతి ఎక్కిళ్ళు అతిసారము, తెలివిలేకుండుట, *వ్యథ, శ్వాస, శరీరమునందు నల్లగగాని ఎఱ్ఱగగానియుండు మండలములు జనించుట, దాహము-ఈలక్షణములుగలది రక్తష్ఠీవి సన్నియని తెలియవలయు. ఇది రోగిని జంపును.

జిహ్వోష్ఠస్ఫోటనా చ్చైవ రక్తంస్రవతి వేగతః,
జ్వరతృష్ణా మోహమూర్ఛా హిక్కాతీసారవిభ్రమాః. 83
కాసశ్శిరోభ్రమః కంపో జిహ్వా శ్యామా సకంటకా,
రక్తష్ఠీవీ సన్నిపాతో విజ్ఞేయ శ్చాతిభీషణః. (చింతామణౌ) 84

తా. నాలుక పెదవులు పగిలి తీవ్రముగా రక్తముగారుట, జ్వరము దప్పి మోహము మూర్ఛ ఎక్కిళ్ళు అతిసారము దగ్గు, తబ్బిబ్బులాడుట, తలతిరుగుట, వణకుట, నాలుక నల్లనై ముండ్లుపారియుండుట-ఈలక్షణములుగలది రక్తష్ఠీవిసన్నియని తెలియవలయు. ఇది కడుభయంకరమైనది.

శీతాంగసన్నిలక్షణము

ఉగ్రతాపక్లమశ్శైత్యం ఛర్ద్యతీసారవేగవాన్,
శోకకంపభ్రమశ్వాస శీతగాత్రాద్యుపద్రవాః. (మాధవనిదానే)

---

* వ్యథ అనగా - సూదులచే బొడుచునటుల శరీరమునందు వేదన.

తా. లోన ఉగ్రమైనతాపము లేక కడుశైత్యము బడలిక వాంతి, అధికముగా విరేచనములగుట, శోకము వణకు భ్రమ ఎగయూపిరి - యీమొదలగులక్షణములు గలిగి శరీరమంతయు చల్లగనుండునది శీతాంగసన్నియని తెలియవలయు.

హిమసదృశశరీరో వేపథుశ్వాసహిక్కా
శ్శిథిలితసకలాంగః ఖిన్ననాదః ప్రలాపః,
క్లమథదవథుకాసచ్ఛర్ద్యతీసారశోకా
స్త్వరితమరణహేతు శ్శీతగాత్రప్రభావాత్. (ఆయుర్వేదే)

తా. శరీరము మంచువలె చల్లగనుండుట, శరీరము వణకుట, శ్వాస ఎక్కిళ్ళు, సర్వాంగములు శిథిలములై యుండుట, స్వరభంగము ప్రలాపము అనాయాసముగా శ్రమ లోన ఉగ్రసంతాపము దగ్గు వాంతి అతిసారము దుఃఖము - ఈలక్షణములుగలది శీతాంగసన్నియని తెలియవలయు. దీనియందు శరీరము శీతలముగానుండుటచే ఇది త్వరితమరణమునకు హేతుకరంబగును.

శరీరం హిమశీతం చ ఛర్ద్యతీసారకంపనం,
క్షీణనాడ్యంగతాపశ్చ హిక్కాశ్వాసక్లమశ్రమా. 87
సర్వాంగశిథిలో హంతి శీతాంగస్సన్నిపాతకః, (నిత్యనాథీయే)

తా. శరీరము మంచువలె చల్లగనుండుట, వాంతి అతిసారము వణకు నాడి క్షీణించియుండుట, శరీరతాపము ఎక్కిళ్ళు శ్వాస బడలిక శ్రమ, సర్వాంగములు శిథిలముచెందుట - ఈలక్షణములుగలది శీతాంగసన్నియని తెలియవలయు. ఇది రోగిని జంపును.

సర్వాంగం చంద్రవచ్ఛీతం కాసశ్శ్వాసశ్చ జాయతే. 88
హిక్కా సర్వాంగశైథిల్యం వాంతి సంతాపమూర్ఛనం,
అతిసారోంగకంపశ్చ శీతాంగే సన్నిపాతకే. (చింతామణౌ)

తా. సర్వాంగములు చంద్రునివలె చల్లగనుండుట, కాసశ్వాసలు ఎక్కిళ్ళు సర్వాంగములయందు శైథిల్యము వాంతి సంతాపము మూర్ఛ అతిసారము శరీరకంపము- ఈలక్షణములుగలది శీతాంగసన్నియని తెలియవలయు.

### అభిన్యాససన్నిలక్షణము

కరపాదతలే దాహః ప్రజ్ఞాహానిశ్చ జాయతే,
జానీయాత్తమభిన్యాసమాయుర్వేదవిశారదః. (మాధవనిదానే)

తా. అరికాళ్లు అరిచేతులు మంట, తెలివిలేకుండుట - ఈలక్షణములుగలది అభిన్యాససన్నియని ఆయుర్వేదవేత్తయగువాఁ డెఱుంగవలయు.

దోషత్రయస్నిగ్ధముఖత్వనిద్రా వైకల్యనిశ్చేష్టనకష్టవాచః,
బలప్రణాశ శ్శ్వసనాదినిగ్రహో౽భిన్యాసఉక్తో నను మృత్యుకల్పః.
(ఆయుర్వేదే)

తా. వాతపిత్తశ్లేష్మనాడులు ప్రకోపించి పలుమాఱు రెగిరెగిరినడుచుట, ముఖము నిగనిగలాడుట, నిదురపట్టకుండుట, చేష్ట లుడిగియుండుట, కడుకష్టముమీఁద మాటలాడుట, బలిమికోరవడుట, శ్వాసాదులు వెడలక బిగబట్టుట - ఈలక్షణములు గలది అభిన్యాససన్నియని తెలియవలయు. ఇది మృత్యుతుల్యముగ నుండు.

త్రిదోషం చ ముఖం స్నిగ్ధం నిద్రావైకల్యకంపనే,
నిశ్చేష్టనమతిశ్వాస మందాగ్నిబలహానయః. 92
మృత్యుతుల్యం హ్యభిన్యాసం సన్నిపాతం సులక్షయేత్,
(నిత్యనాథీయే)

తా. వాతపిత్తశ్లేష్మనాడులు సంకరముగ నడుచుట, ముఖము మెఱయుట, నిదురపట్టకుండుట, వణఁకుట, చేష్ట లుడిగియుండుట, అతిశ్వాస అగ్నిమాంద్యము బలము క్షయించుట-ఈలక్షణములుగలది అభిన్యాససన్నియని తెలియవలయు. ఇది మృత్యుతుల్యమని యూహింపవలయు.

దోషత్రయం జ్వరశ్శ్వాస స్నిగ్ధాస్యమతినిద్రతా. 93
అంగవైకల్యతాపశ్చ బలహాని స్తృషాజటః,
అత్యుత్కట స్సన్నిపాతో హ్యభిన్యాస స్సుదారుణః. 94
(చింతామణౌ)

తా. వాతపిత్తశ్లేష్మనాడులుగలసి ప్రకోపించుట, జ్వరము, శ్వాస, ముఖము మెఱయుట, అధికనిద్ర, అంగములయందునొప్పి, తాపము, బలముక్షయించుట, దప్పి, జాడ్యము - ఈలక్షణములుగలిగి భయంకరముగ నుండునది అభిన్యాససన్నియని తెలియవలయు. ఇది యసాధ్యము.

### సన్నిపాతభేదములు

తద్ద్విధా దాహశీతాది దాహోద్యాష్టధాపరే,
అభిన్యాసో భవేదేవ స్సన్నిపాతాస్త్రయోదశ. (శారీరే) 95

తా. సన్నిపాతములు దాహాదిశీతాదిభేదములచే ద్వివిధంబు. అందు దాహాదిలక్ష ణములతోఁగూడిన సన్నిపాతములు ఆఱు. శీతాదిలక్షణముతోఁగూడిన సన్నిపాతములు ఆఱు. అభిన్యాసం బొకటి. అని సన్నిపాతములు పదమూఁడు.

### శీతాదిసన్నిపాతవివరణము

సంధిక స్తాంద్రికో జిహ్వః కర్ణికశ్చ ప్రలాపకః,
చిత్తవిభ్రమక శ్శీతాః కఫవాతోత్తరాః స్మృతాః. 96

తా. సంధికము, తాంద్రికము జిహ్వకము, కర్ణికము, ప్రలాపము, చిత్తవిభ్ర మము-అను నాఱుసన్నిపాతములు శీతాదిలక్షణయుక్తంబులై శ్లేష్మవాతప్రకోపములు గలవిగనుండు. అట్లగుటచే నవి సాధ్యంబులు.

### దాహాద్యుగ్రసన్నిపాతవివరణము

భుగ్నాక్షో రక్తనిష్ఠీవీ శీతాంగోఽంతక ఏవ చ,
కణ్ఠకుబ్జశ్చ రుగ్దాహో దాహాద్యాభూతపిత్తకాః. 97

తా. భుగ్ననేత్రము, రక్తష్ఠీవి, శీతాంగము, అంతకము, కంఠకుబ్జము, రుగ్దా హము-అను నాఱుసన్నిపాతములు దాహాదిలక్షణములతోఁగూడి కేవల పిత్తాధిక్యము గలవై యుండు. ఈ ఆఱు నసాధ్యములు.

అంతర్దాహో బహిశ్శీతో నిహంత్యేష త్రయోదశ,

తా. అంతర్దాహ బహిశ్శీతంబులుగలది అభిన్యాససన్నిపాతము. ఇది పదమూఁడవ సంఖ్యగలదిగ నుండు. ఇది మనుజుని జంపును.

త్రయోదోషా స్సమాక్షిప్య చేష్టాభగ్నేనచేతసా. 98
అభిన్యాసే ప్రకుప్యంతి తేన జంతుర్మృతోపమః,

తా. వాతపిత్తశ్లేష్మములు మూఁడును బ్రకోపించి సమానంబులైన చేష్టావిహీనం బులై మనస్సుతోఁగలసి క్రమముదప్పియుండునది అభిన్యాససన్నియని తెలియవలయు. ఇది నిశ్చయముగా మనుజుని జంపును.

### సన్నిపాతదినప్రమాణము

సంధిక స్సప్తదివస మంతకో వాసరాన్ దశ. 99
రుగ్దాహో వింశతిం వారా న్విభ్రమ స్త్వేకవింశతిం,
పక్షమేకం శీతగాత్ర స్తాంద్రికః పంచవింశతిమ్. 100
అథవా వాసరాన్ సప్త కంఠకుబ్జస్త్రయోదశ,
త్రిమాసం కర్ణికశ్చైవ భుగ్ననేత్రో దినాష్టకమ్. 101

రక్తష్ఠీవీ దశదినం ప్రలాపస్స్యాచ్చతుర్దశ,
జిహ్వాకష్షోడశదిన మభిన్యాసోఽర్ధమాసకమ్. 102
ఇత్థంహి సన్నిపాతానాం ప్రమాణం పరికీర్తితం, (గ్రంథాంతరే)

తా. సంధికసన్నికి ౭ దినములు, అంతకసన్నికి ౧౦ దినములు, రుగ్దాహసన్నికి ౨౦ దినములు, చిత్తవిభ్రమసన్నికి ౨౧ దినము, శీతాంగసన్నికి ౧౫ దినములు తాంద్రికసన్నికి ౨౫ దినములు లేక ౭ దినములు, కంఠకుబ్జసన్నికి ౧౩ దినములు, కర్ణిక సన్నికి ౩ మాసములు, భుగ్ననేత్రసన్నికి ౮ దినములు, రక్తష్ఠీవిసన్నికి ౧౦ దినములు ప్రలాపసన్నికి ౧౪ దినములు, జిహ్వకసన్నికి ౧౬ దినములు, అభిన్యాససన్నికి ౧౬ దినములు కాలప్రమాణంబు. (అట్లగుటచే సంధికము, తాంద్రికము, ప్రలాపము, చిత్త విభ్రమము, జిహ్వకము, కర్ణికము అను నాఱుసాధ్యసన్నిపాతములు పైఁజెప్పఁబడిన కాలక్రమముగా నివర్తించినను నివర్తించు. లేక చంపినను చంపు. అంతకము, రుగ్దాహము, శీతాంగము, కంఠకుబ్జము, అభిన్యాసము, రక్తష్ఠీవి, భుగ్ననేత్రము అను నేడు అసాధ్యసన్నిపాతములు వానివాని కాలక్రమముగా తప్పక జంపును.)

### త్రయోదశసన్నిపాతనిశేషములు

ఏకోల్బణాస్త్రయస్తేషు ద్వ్యుల్బణాశ్చ తథేతి షట్. 10
త్ర్యుల్బణాశ్చ భవేదేకో విజ్ఞేయః సకుసప్తమః,
ప్రవృద్ధమధ్యహీనైస్తు వాతపిత్తకఫైశ్చషట్. 10
సన్నిపాతజ్వరస్యైవం స్యుర్విశేషాస్త్రయోదశ,
విస్ఫారకశ్చాశుకారీ కంపనో బభ్రుసంజ్ఞకః. 10
శీఘ్రకారీ తథాభల్లః సప్తమః ఫుటపాలకః,
సమ్మోహకః పాలకశ్చ యామ్యః క్రకచఇత్యపి. 10
తతః కర్కటకః ప్రోక్తస్తతో వైదారికాభిధః,

తా. వాతాధిక్యముగల సన్నిపాతము, పిత్తాధిక్యముగల సన్నిపాతము, శ్లేష్మాధిక్యముగల సన్నిపాతము, వాతపిత్తాధిక్యముగల సన్నిపాతము, వాతశ్లేష్మాధిక్యముగల సన్నిపాతము, పిత్తశ్లేష్మాధిక్యముగల సన్నిపాతము, వాతపిత్తశ్లేష్మాధిక్యముగల సన్నిపాతము, వాతము వృద్ధిచెంది పిత్తము సమముగ కఫము క్షీణముగనుండు సన్నిపాతము, వాతము సమముగ పిత్తమువృద్ధిచెంది కఫము క్షయించియుండు సన్నిపాతము, వాతము క్షయించి పిత్తము వృద్ధంబై కఫము సమముగానుండు సన్నిపాతము, వాతము వృద్ధిచెంది పిత్తముక్షయించి కఫము సమముగానుండు సన్నిపాతము, వాతము సమమ

పిత్తము క్షయించి కఫము వృద్ధిచెందియుండు సన్నిపాతము - ఇటుల సన్నిపాతములు ౧౩ విధంబులుగనుండును. వీనికి యథాక్రమముగా విస్ఫారకము ఆశుకారి కంపనము బభ్రు శీఘ్రకారి భల్లము పుటపాలకము సమ్మోహకము పాలకము యామ్యము క్రకచము కర్కటకము వైదారికము అని నామంబులు గలవు.

## విస్ఫారకసన్నిపాతలక్షణము

శ్వాసః కాసో భ్రమో మూర్ఛా ప్రలాపో మోహవేపథూ. 107
పార్శ్వస్య వేదనా జృంభా కషాయత్వం ముఖస్య చ,
వాతోల్బణస్య లింగాని సన్నిపాతస్యలక్షయేత్. 108
ఏషవిస్ఫారకోనామ్నా సన్నిపాత స్సుదారుణః,

తా. శ్వాసము, కాసము, భ్రమము, మూర్ఛ, పలవరింత, మోహము, వణకు, ప్రక్కశూల, ఆవులింత, నోరు వగరుగనుండుట-ఈలక్షణములు వాతాధిక్యముగల సన్నిపాతమునందు కలిగియుండును. ఇది విస్ఫారకసన్నిపాత మనఁబడును. మిగుల దారుణమయినది.

## ఆశుకారిసన్నిపాతలక్షణము

అతిసారో భ్రమో మూర్ఛా ముఖపాక స్తథైవ చ. 109
గాత్రే చ బిందవోరక్తా దాహోఽతీవ ప్రజాయతే,
పిత్తోల్బణస్యలింగాని సన్నిపాతస్యలక్షయేత్. 110
భిషగ్భి స్సన్నిపాతోఽయ మాశుకారీ ప్రకీర్తితః,

తా. అతిసారము, భ్రమ, మూర్ఛ, ముఖపాకము, శరీరమునందు రక్తబిందువులు, సర్వాంగములయందు అధికతాపము-ఇవి పిత్తాధిక్యముగల సన్నిపాతమునందు కలిగియుండును. ఇది ఆశుకారిసన్నిపాతమని వైద్యులచేఁ జెప్పఁబడును.

## కంపనసన్నిపాతలక్షణము

జడతా గద్గతా వాణీ రాత్రౌ నిద్రా భవత్యపి. 111
ప్రస్తబ్ధే నయనే చైవ ముఖమాధుర్యమేవ చ,
కఫోల్బణస్య లింగాని సన్నిపాతస్య లక్షయేత్. 112
మునిభి స్సన్నిపాతోఽయ ముక్తః కంపనసంజ్ఞకః,

తా. జాడ్యము, గద్గదభాషణము, రాత్రులయందు నిద్రించునపుడు నేత్రములు స్తబ్ధములుగ నుండుట, నోరు తియ్యగనుండుట-ఈలక్షణములు కఫాధిక్యముగల సన్నిపాతమునందు కలిగియుండును. ఇది కంపనసన్నిపాతమని ఋషులచేఁ జెప్పఁబడును.

బభ్రుసన్నిపాతలక్షణము

వాతపిత్తాధికో యస్తు సన్నిపాతః ప్రకుప్యతి. 113
తస్యజ్వరో మదస్తృష్ణా ముఖశోషః ప్రమీలకః,
ఆధ్మానారుచితంద్రాశ్చ కాసశ్వాస భ్రమశ్రమాః. 114
మునిభిర్బభ్రునామాయం సన్నిపాత ఉదాహృతః,

తా. వాతపిత్తాధిక్యముగల సన్నిపాతమునందు జ్వరము, మదము, దప్పి, నోరు ఎండుట, తంద్ర, కడుపుబ్బరము, అరుచి, కాసశ్వాసములు, భ్రమ, శ్రమము ఇవి కలుగును. ఇది బభ్రుసన్నిపాతమని ఋషులచేఁ జెప్పఁబడును.

శీఘ్రకారి సన్నిపాతలక్షణము

వాతశ్లేష్మాధికో యస్య సన్నిపాతః ప్రకుప్యతి. 115
తస్య శీతజ్వరో మూర్ఛా క్షుత్తృష్ణా పార్శ్వనిగ్రహః,
శూలమస్విద్యమానస్య తంద్రా శ్వాసశ్చ జాయతే. 116
అసాధ్య స్సన్నిపాతోఽయం శీఘ్రకారీతి కథ్యతే,
నహి జీవత్యహోరాత్ర మేతేనావిష్టవిగ్రహః. 117

తా. శీతజ్వరము, మూర్ఛ, ఆఁకలి, దప్పి, పార్శ్వములయందు పట్లు, శూల, చెమటలేకుండుట, తంద్ర, శ్వాసము-ఇవి వాతశ్లేష్మాధిక్యముగల సన్నిపాతమునందు కలిగియుండును. ఇది శీఘ్రకారిసన్నిపాత మనఁబడును. చికిత్సయం దసాధ్యము. ఒక అహోరాత్రములోపల మనుజుని జంపును.

భల్లసన్నిపాతలక్షణము

పిత్తశ్లేష్మాధికో యస్య సన్నిపాతః ప్రకుప్యతి,
అంతర్దాహో బహిశ్శీతం తస్యతృష్ణా ప్రవర్ధతే. 118
తుద్యతే దక్షిణేపార్శ్వే ఉరశ్శీర్షగళగ్రహః,
ష్ఠీవతిశ్లేష్మపిత్తం చ కృచ్ఛ్రాత్కోఠశ్చ జాయతే. 119
విడ్భేదశ్వాసహిక్కాశ్చ వర్ధంతే న ప్రమీలకాః,
ఋషిభిర్భల్లనామాయం సన్నిపాత ఉదాహృతః. 120

తా. శరీరముయొక్క లోభాగమునందు విశేషతాపము, పైభాగమునందు శీతము, విశేషదప్పి, కుడిపార్శ్వమునందు పోట్లు, ఱొమ్ము శిరము కంఠము వీనియందు పట్లు, శ్లేష్మపిత్తము, కారియుమియుట, కోఠమునందు నొప్పి, మలబంధము, శ్వాసము,

ఎక్కిళ్లు, తంద్ర-ఇవి పిత్తశ్లేష్మాధిక్యముగల సన్నిపాతమునందు కలిగియుండును. ఇది భల్లసన్నిపాతమని ఋషులచేఁ జెప్పఁబడును.

### కూటపాలకసన్నిపాతలక్షణము

సర్వదోషోల్బణో యస్య సన్నిపాతః ప్రకుప్యతి,
త్రయాణామపి దోషాణాం తస్యరూపాణి లక్షయేత్. 121
వ్యాధిభ్యో దారుణశ్చైవ వజ్రశస్త్రాగ్నిసన్నిభః,
కేవలోచ్ఛ్వాస పరమ స్తబ్ధాంగ స్తబ్ధలోచనః. 122
త్రిరాత్రాత్పరమేతస్య జంతోర్హరతి జీవితం,
తదవస్థం తు తం దృష్ట్వా మూఢో వ్యాహార తేజనః. 123
ధర్షితో రాక్షసై ర్ధ్యాన మవేళాయాం చరంతి యే,
అంబయా బ్రువతే కేచిత్ యక్షిణ్యా బ్రహ్మరాక్షసైః. 124
పిశాచై ర్గుహ్యకై శ్చైవ తథాన్యై ర్మస్తకే హతం,
కులదేవార్చనాహీనం ధర్షితం కులదైవతైః. 125
నక్షత్ర పీడామపరే గరకర్మేతిచాపరే,
సన్నిపాతమిమం ప్రాహు ర్భిషజః కూటపాలకమ్. 126

తా. వాతాదిత్రిదోషప్రకోపాధిక్యముగల సన్నిపాతమునందు ప్రకోపించియుండు వాతాదిత్రిదోషములలక్షణము లన్నియు కలిగియుండును. ఇది అన్నివ్యాధులకంటె మిగుల దారుణమయినది. దీనియందు పెద్దయూపిరి, విశేషమైనదప్పి, అవయవములును నేత్రములును స్తబ్ధములుగనుండుట-ఈలక్షణములు కలిగియుండు. ఇది మూడుదినములలోపల రోగియొక్క ప్రాణమును హరింపఁజేయును. ఈసన్నిపాతము కలిగియుండువానిని చూచి కొందఱు మూఢులు అకాలములో సంచరించునట్టి రాక్షసగ్రహములు సోఁకినవనియు, కొందఱు చాముండాదిగ్రహములు సోఁకినవనియు, కొందఱు బ్రహ్మరాక్షసగ్రహములు సోఁకినవనియు, కొందఱు పిశాచగ్రహము సోఁకినదనియు, కొందఱు యక్షగ్రహము సోఁకినదనియు, కొందఱు కులదేవతలను పూజింపకుండుటవలన జనించిన చేష్టయనియు, కొందఱు నక్షత్రపీడయనియు, కొందఱు విషప్రయోగమువలన జనించినదనియు, మఱికొందఱు మారణాదిప్రయోగమువలన జనించినదనియు వచించెదరు. ఇది కూటపాలకమను సన్నిపాతకమని వైద్యశాస్త్రవేత్తలు వచించెదరు.

### సంమోహసన్నిపాతలక్షణము

ప్రవృద్ధమధ్యహీనైస్తు వాతపిత్తకఫైశ్చ యః,

తేనరోగా స్త ఏవోక్తా యథాదోషబలాశ్రయాః. 1
ప్రలాపాయాస సంమోహా కంప మూర్ఛారతి భ్రమాః,
ఏకపక్షాభిఘాతశ్చ తత్రాప్యేతే విశేషతః. 1
ఏషసంమోహకోనామ్నా సన్నిపాత స్సుదారుణః,

తా. వాతము ప్రవృద్ధమై పిత్తము సమముగా కఫము క్షయించినదిగా నుం సన్నిపాతమునందు పలవరింత, ఆయాసము, మోహము, వణకు, మూర్ఛ, అ భ్రమము, ఒకపార్శ్వమునందు శూల-ఇవి జనించియుండును. ఇది సమ్మోహనసన్ని మనఁబడును. మిగుల దారుణమయినది.

పాలకసన్నిపాతలక్షణము

మధ్యప్రవృద్ధహీనై స్తు వాతపిత్తకఫైశ్చ యః. 1
తేనరోగా స్తఏవోక్తా యథా దోషబలాశ్రయాః,
మోహప్రలాపమూర్ఛాస్స్యు ర్మన్యాస్తంభః శిరోగ్రహః. 1
కాసః శ్వాసో భ్రమ స్తంద్రా సంజ్ఞానాశో హృదివ్యథా,
ఖేభ్యోర క్తంవిసరతి సంరక్త స్తబ్ధనేత్రతా.
తత్రాప్యేతేవిశేషాస్స్యుర్మృత్యుర్యర్వాక్ త్రివాసరాత్,
భిషగ్భి స్సన్నిపాతోఽయం కథితః పాలకాభిధః.

తా. వాతము సమముగానుండి పిత్తము వృద్ధిచెంది కఫము క్షయించియు సన్నిపాతమునందు మూర్ఛ, పలవరింత, మోహము, మన్యాస్తంభము, తలనొ కాసము, శ్వాసము, భ్రమము, తంద్ర, ప్రజ్ఞాహాని, ఱొమ్మునొప్పి, నేత్రాదింద్రి ద్వారములనుండి రక్తము వెడలుట, నేత్రము లెఱ్ఱగ స్తబ్ధముగనుండుట - ఈల ములు గలుగును. ఇది పాలకసన్నిపాతమని వైద్యులచే జెప్పఁబడును. ఇది మూ దినములలోపల మరణమును కలుగఁజేయును.

యామ్యసన్నిపాతలక్షణము

హీనప్రవృద్ధమధ్యైస్తు వాతపిత్తకఫైశ్చ యః,
తేనరోగా స్తఏవోక్తా యథా దోషబలాశ్రయాః.
హృదయం దహ్యతేచాస్య యకృత్ప్లీహాంత్రపుప్పుసాః,
పంచత్యత్యర్థమూర్ధ్వాధః పూయశోణితనిర్గమః.
శీర్ణాదంతాశ్చ మృత్యుశ్చ తత్రాప్యేతద్విశేషతః,
భిషగ్భి స్సన్నిపాతోయం యామ్యోనామ్నా ప్రకీర్తితః.

తా. వాతము హీనమై పిత్తము ప్రవృద్ధమై కఫము సమముగనుండు సన్నిపాతము నందు హృదయమునందు మంట, యకృత్తు, ప్లీహము, ఆంత్రము, పుప్పుసము-ఇవి పాకమును బొందుట, ఊర్ధ్వాధోమార్గముగా చీము రక్తము వెడలుట, దంతములు రాలి పడుట, శీఘ్రముగా మరణము కలుగుట-ఈలక్షణములు కలిగియుండును. ఇది యామ్య సన్నిపాతమని వైద్యులచేఁ జెప్పఁబడినది.

## క్రకచసన్నిపాతలక్షణము

ప్రవృద్ధహీనమధ్యైస్తు వాతపిత్తకఫైశ్చ యః,
తేనరోగా స్తవప్రోక్తా యథా దోషబలాశ్రయాః. 136
ప్రలాపాయాస సంమోహా కంప మూర్ఛారతి భ్రమాః,
మన్యాస్తంభేన మృత్యుస్స్యా త్తత్రా ప్యేతద్విశేషతః. 137
భిషగ్భి స్సన్నిపాతో௨యం క్రకచః సంప్రకీర్తితః,

తా. వాతము ప్రవృద్ధమై పిత్తము క్షయించి కఫము సమముగానుండు సన్నిపాతమునందు పలవరింత, ఆయాసము, మోహము, వణకు, మూర్ఛ, అరతి, భ్రమము-ఇవికలుగుటయేగాక మన్యాస్తంభముచే మరణము సంభవించును. ఈసన్నిపాతము క్రకచ మను పేరఁ బరఁగునని వైద్యశాస్త్రవేత్తలు వచింపుచున్నారు.

## కర్కటకసన్నిపాతలక్షణము

మధ్యహీనప్రవృద్ధైస్తు వాతపిత్తకఫైశ్చ యః. 138
తేనరోగా స్తవప్రోక్తా యథా దోషబలాశ్రయాః,
అంతర్దాహో విశేషో௨త్ర క్షచవక్తుం నశక్యతే. 139
రక్తమాల క్తకేనేవ లక్ష్యతే ముఖమండలం,
ఇత్యేనాకర్షితః శ్లేష్మా హృదయాన్న ప్రసిచ్యతే. 140
ఇషుణేవాహతం పార్శ్వం తుద్యతే ఖన్యతే హృది,
ప్రమీలక శ్వాసహిక్కా వర్ధంతేతు దినేదినే. 141
జిహ్వాదగ్ధా ఖరస్పర్శా గళః సూకైరివావృతః,
విసర్గం నాభిజానాతి కూజేచ్చాపి కపోతవత్. 142
అతీవ శ్లేష్మణాపూర్ణః శుష్కరక్తోష్ఠతాలుకః,
తంద్రా నిద్రాతియోగార్తో హతవాఙ్నిహతద్యుతిః. 143
న రతిం లభతే నిత్యం విపరీతానిచేచ్ఛతి,
ఆయమ్యతే చ బహుశో రక్తం ష్ఠీవతి చాల్పశః. 144

ఏషకర్కటకోనామ్నా సన్నిపాత స్సుదారుణః,

తా. వాతము సమముగా పిత్తము క్షయించినదిగా కఫము వృద్ధిజెందినది నుండు సన్నిపాతమునందు మిగుల దారుణమైన అంతస్తాపము, ముఖము విశేషము వెట్టగనుండుట, యెంతకారియుమిసినను కఫము వెడలకుండుట, హృదయము బాణము క్కొట్టఁబడినట్టు విశేషమునొప్పితో గూడియుండుట, కండ్లు చెక్కుకొనిపోవుట, ఎక్కిళ్ల అడుగడుగుకు వృద్ధిచెందుచుండుట, నాలుక నిప్పులోకాల్పఁబడినట్లును కఠినస్పర్శముగ దిగనుడుండుట, కంఠము ముండ్లచే కప్పఁబడినటులుండుట, శ్వాసము వెడలునపుడు పావు పిట్టశబ్దమువలె కంఠమునందు ధ్వనిగలుగుట, నోరు కఫముచే పూరింపఁబడి లోద్దాడ పెర యొండి రక్తవర్ణముగనుండుట, తంద్ర, అధికనిద్ర, మాటలు బయటికిరాకుండుట, శ రమునందు కాంతి తగ్గియుండుట, ఎల్లపుడు ఉత్సాహములేకుండుట, అపథ్యవస్తువ యందు విశేషముగా నిచ్ఛగలుగుట, కారియుమియునపుడు రక్తము స్వల్పస్వల్పమ పడుట - ఇట్టిలక్షణములు కలిగియుండును. ఇది కర్కటక మనఁబడును. మిగు దారుణమైనది.

## వైదారికసన్నిపాతలక్షణము

హీనమధ్యప్రవృద్ధైస్తు వాతపిత్తకఫైశ్చ యః. 14
తేనరోగా స్తఏవోక్తా యథా దోషబలాశ్రయాః,
అల్పశూలం కటీతోదో మధ్యేదాహో రుజాభ్రమః. 14
భృశంక్లమః శిరోవస్తి మన్యాహృదయవాగ్రుజః,
ప్రమీలక శ్వాసకాస హిక్కాజాడ్యవిసజ్ఞతాః. 14
ప్రథమోత్పన్నమేనం తు సాధయంతి కదాచన,
ఏతస్మిన్ సన్నివృత్తే తు కర్ణమూలే సుదారుణః. 14
పిటకో జాయతే జంతో ర్యథాకృచ్ఛ్రేణ జీవతి,
సవైదారికసంజ్ఞోఽయం సన్నిపాత స్సుదారుణః. 14
త్రిరాత్రాత్పరమేతస్య వ్యర్థమౌషధకల్పనం,

తా. వాతము క్షయించి పిత్తము సమమై కఫము వృద్ధిచెందియుండు సన్నిప తమునందు స్వల్పశూల, నడుమునొప్పి, బొడ్డునందు శూల, భ్రమ, విశేషముగా బ లిక, శిరము వస్తి వెడతల పెద్దనరము హృదయము నోరు వీనియందు శూల, తంద్ర శ్వాసకాసములు, ఎక్కిళ్ళు, జడత్వము, ప్రజ్ఞలేకుండుట-ఈలక్షణములు కలిగియుండును ఇది జనించినతోడనే చికిత్సించిన ఒకానొకపుడు శమించును. శమించినతోడనే కర్ణ మూలమునందు దారుణమయిన పిటకజనించును. దీనిచేత ప్రాణాంత్యమయినకష్టము కల

గును. ఇది వైదారికసన్నిపాత మనఁబడును. దీనియందు మూడుదినములకుపైన చికిత్స చేయుట నిష్ఫలము.

## సన్నిపాతసప్తవిధదోషమారకోపద్రవములు

జ్వరస్తీక్ష్ణో ఽథవా శీత మథవాల్పజ్వరోఽపి వా. 150
నేత్రాంతౌ రక్తరహితౌ పాణిపాదనఖా స్తథా,
నేత్రే కాంతివిహీనే చ నశ్రుతా సాగరధ్వనిః. 151
స్వేదహీనజ్వరశ్చైవ హ్యథవా స్వేద ఉత్కటః,
ముఖే కాంతి స్తతో హీనా నేత్రే భుగ్నే ఽథవా కృశే. 152
నాభి హృ న్నాసికా పాద పాణి శైత్యం శిరోవ్యథా,
ఊర్ధ్వశ్వాసో ధనుర్వాతో హిక్కా సర్వాంగకంపనమ్. 153
శిరఃకంపోఽప్యపస్మారః కఫః కంఠం సమాగతః,
గంధస్వాదుం నజానాతి మలం కపిలవర్ణకమ్. 154
శిథిలా చపలాచైవ నాడీ కుటిలసూత్రకా,
ఆదౌపిత్తగతిర్నాడీ తతో వాతగతిర్భవేత్. 155
తతశ్లేష్మగతిర్నాడీ చక్రవద్భ్రమతే ముహుః,
మందనాడీ భవేద్యస్య హ్యసాధ్యం భవతి ధ్రువమ్. 156
సరోగీ నిధనంయాతి విజ్ఞేయం వైద్యపారగైః,
సాధ్యాసాధ్యవిధిం జ్ఞాత్వా చికిత్సేత్పండితస్స్వయమ్. 157
(సిద్ధవిద్యాభూః)

తా. అతితీవ్రజ్వరము, లేక శరీరమునకు శీతలము, లేక స్వల్పజ్వరము, నేత్రాంతములు రెప్పలు పాదములు హస్తములు నఖములు వీనియందు రక్తములేకుండుట, నేత్రములు కాంతిహీనములైయుండుట, చెవులలో సముద్రపుధ్వని వినరాకుండుట, చెమట లేని జ్వరము, లేక ఆరనిచెమట, ముఖమున కాంతిలేకుండుట, నేత్రములు క్రుంగియుండుట, నేత్రములు కృశించి సూక్ష్మంబులైయుండుట, బొడ్డు హృదయము నాసిక కాళ్ళు చేతులు కడుచల్లనైయుండుట, కడుతీవ్రమైనశిరోరోగము, ఎగయూపిరి, ధనుర్వాతము, ఎక్కిళ్లు, శరీరమంతట వణకు, తలవణకు, అపస్మారము, కుతికలో శ్లేష్మము అడ్డపడుట, పరిమళద్రవ్యములవాసన నాసికకు తెలియకుండుట, మలము కపిలవర్ణముగ వెడలుట, నాడి మూడువ్రేళ్ళక్రింద ఖండఖండములుగనేని లేక చపలముగ (మెఱపువలె) నేని, లేక కుటిలమై వేగముగనేని నడుచుట, వాతపిత్తశ్లేష్మనాడులు మూఁడునుగలసి తంతివలె

శేకముగనడుచుట, నాడి ముందుగా పిత్తగతి వెనక వాతగతి దానికివెనక శ్లేష్మగతి గలదై నడుచుట, పలుమారు చక్రమువలె దిరుగుట, మందగతిగా నడుచుట, ఈదుర్గుణములలో ఒకటి రెండు మూడు సర్వసన్నిపాతములలోను సప్తవిధదోషములలోను జనిచిన వానితోడ పైఁజెప్పిన వికారములును గూడియుండిన అసాధ్యంబగుటచే ఆరోగి మరణముచెందును. అట్లగుటంజేసి సన్నిపాతసప్తవిధదోషసాధ్యాసాధ్యముల నెఱిఁగి వైద్యవేత్తయగుపండితుఁడు చికిత్సజేయవలయు.

జ్వరోనిహంతి రక్తాక్షు మక్షామం హృది శూలినం,
సదాశ్వసంతం స్విద్యంతం శక్తిహీనం హతానలమ్. (అశ్వినీకల్పే

తా. నేత్రములు రక్తోద్రిక్తములై యుండుట, శరీరము కృశింపకుండుట, అరొమ్ము నొచ్చుట, ఎల్లపుడు శ్వాసము వెడలుట, ఆరనిబంకచెమట, సత్వములేకుండుట, అగ్నిమాంద్యము - ఈలక్షణములు పదమూడు సన్నిపాతజ్వరములలోను సప్తవిధదోషములలోను గలిగియుండిన ఆరోగి మరణముచెందునని యెఱిఁగి చికిత్స జేయంజనదు.

జిహ్వాశ్యామా ముఖంపూతి క్షతమక్షినిమజ్జతి,
ఖగాశ్చ మూర్ధ్ని రిష్యంతి యస్య రోగాంశ్చవర్జయేత్.(ఆయుర్వేదే

తా. నాలుక నల్లగనుండుట, నోరు కంపువేయుట, నేత్రములు పగిలి క్షతయుండుట, తలమీఁద పక్షితన్నుట - ఈలక్షణములు పదమూడు సన్నిపాతములలో సప్తవిధదోషములలోను గలిగిన ఆరోగి బ్రతుకఁడని యెఱిఁగి చికిత్సజేయంజనదు.

సుశీతా హారితా యస్య రోమకూపాశ్చ సంవృతాః,
ఆమ్లాభిలాషస్సతతం మృత్యుమాప్నోతి తత్వతః. (నిత్యనాథీర

తా. శీతలద్రవ్యాహారములను గోరుట, రోమకూపములు మూసికొనుట, పులుసు మీఁద నభిలాషగలుగుట - ఈలక్షణములు వీరోగమందుగలిగినను రోగి బ్రతుకఁడని తెలియవలయు,

## రోగారిష్టతిథివారనక్షత్రములు

ఉరగశతభిషార్ద్రాస్వాతిమూలాత్రిపూర్వా
భరణిపితృవిశాఖాభానుభౌమార్కజానాం,
ప్రతిపనవచతుర్థీ ద్వాదశీచాపిషష్ఠీ
హరిహరవిధిరేకో రోగిణాం కాలమృత్యుః. (జ్యోతిషగ్రం

తా. ఆశ్లేష, శతభిష, ఆర్ద్ర, స్వాతి, మూల, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, మఖ, విశాఖ, ఆదిత్యవారము, మంగళవారము, శనివారము, పాడ

నవమి, చవితి, ద్వాదశి, షష్ఠి-ఈతిథివారనక్షత్రములు మూడును గూడినదినమునం దెవ నికి జ్వరమువచ్చెడినో వానికి కాలమృత్యువు ఆసన్నమైన దని తెలియవలయు.

రోగోత్పత్తిశుభాశుభనక్షత్రములు

కృత్తికాసు యదాకశ్చి జ్వరాది ప్రతిపద్యతే,
నవరాత్రం దదాపీడా త్రిరాత్రం రోహిణీషుచ. 162
మృగశీర్షే పంచరాత్ర మార్ద్రాయాం ప్రాణభయం తథా,
పునర్వసూ చ పుష్యశ్చ సప్తరాత్రం విధీయతే. 163
నవరాత్రం తథాశ్లేషాః శ్మశానాంత మఘాసుచ,
ద్వౌమాసౌ ఫల్గునీచైవ హ్యుత్తరాసు త్రిపంచకమ్. 164
హస్తేవ జాయతే పక్షం చిత్రాచైవార్ధమాసకం,
మాసద్వయం తథాస్వాతీ విశాఖే పంచవింశతిః. 165
అనూరాధా దశప్రోక్తా జ్యేష్ఠాచైవార్ధమాసకం,
మూలేన జాయతే మోక్షః పూర్వాషాఢాస్త్రిపంచకమ్. 166
ఉత్తరే దినవింశత్యా ద్వౌమాసౌ శ్రవణే తథా,
ధనిష్ఠాయా మర్ధమాసో వారుణేచ దశాహకమ్. 167
పూర్వాభాద్రపదే మోక్ష ఉత్తరాసు త్రిపంచకం,
రేవతీ సప్తరాత్రం చ హ్యహోరాత్రం తథాశ్వినీ. 168
భరణీ తత్క్షణే నైవ మరణం తు న సంశయః, (గ్రంథాంతరే.)

తా. కృత్తికానక్షత్రమున గలిగిన జ్వరాదులు తొమ్మిదిరాత్రులును, రోహిణియందు మూడురాత్రులును, మృగశీర్షయం దైదురాత్రులును పీడించును. ఆర్ద్రయందు ప్రాణ భయమును గలుగఁజేయు. పునర్వసు పుష్యమినక్షత్రములజనించిన జ్వరాదులుఏడురాత్రు లును, ఆశ్లేషానక్షత్రమున తొమ్మిదిరాత్రులును పీడించు. మఖానక్షత్రమున జనించిన జ్వరాదులు మరణమును గలుగఁజేయు. పుబ్బానక్షత్రమునజనించిన జ్వరాదులు రెండు మాసములును, ఉత్తరానక్షత్రమున పదిహేనుదినములు, హస్తానక్షత్రమున ఒకపక్షమును, చిత్తానక్షత్రమున అర్ధమాసమును, స్వాతీనక్షత్రమున రెండుమాసములును, విశాఖానక్ష త్రమున ఇరువదియైదుదినములును, అనూరాధానక్షత్రమున పదిదినములును, జ్యేష్ఠానక్ష త్రమున పదిహేనుదినములును పీడించు. మూలానక్షత్రమున జనించినరోగము పదిహేను దినములలోను, పూర్వాషాఢానక్షత్రమున పదిహేనుదినములలోను, ఉత్తరాషాఢా నక్షత్రమున ఇరువదిదినములలోను, శ్రవణనక్షత్రమున రెండుమాసములలోను, ధనిష్ఠా

నక్షత్రమున పదిహేనుదినములలోను, శతభిషానక్షత్రమున పదిదినములలోను నివర్తించును. పూర్వాభాద్ర ఉత్తరాభాద్రనక్షత్రముల జనించినరోగము పదిహేనుదినములును, రేవతీనక్షత్రమున ఏడుదినములును, అశ్వినీనక్షత్రమున ఒక యహోరాత్రమును పీడించి పిదప నివర్తించు. భరణీనక్షత్రమున నిస్సంశయముగా తత్క్షణమున మరణమును గలుగఁజేయు.

దూతలక్షణ, రోగసాధ్యాసాధ్యములు

పూర్వత్ర పశ్చా నైఋర్త్యా ముత్తరస్యాం తథాదిశీ. 169
భాషతే దూతకో యత్ర శుభం భవతి నిశ్చయం, (సిద్ధవిద్యాభూః)

తా. రోగివద్దనుండి వచ్చినదూత వైద్యునికి తూర్పుభాగమునందేని, పశ్చిమభాగమునందేని, నిరృతిభాగమునందేని, ఉత్తరభాగమునందేని నిలువఁబడి వైద్యుని బిలిచిన ఆరోగి జీవించునని తెలియవలయు.

యామ్యే చాగ్నేయ వాయవ్యేప్యైశాన్యే యది సంస్థితః. 170
దూతోపి భాషతే జ్ఞేయ మశుభం నిశ్చితం తథా,

తా. మఱియు రోగివద్ద నుండివచ్చినదూత వైద్యునికి దక్షిణభాగమునందేని, ఆగ్నేయభాగమునందేని, వాయువ్యభాగమునందేని, ఈశాన్యభాగమునందేని నిలువఁబడి వైద్యునితో సంభాషించిన రోగి మరణముచెందునని వైద్యుఁ డెఱుఁగవలయు.

సన్నిపాతసప్తవిధదోషసాధ్యలక్షణములు

అథ సాధ్యగుణాన్వక్ష్యే శ్రోతవ్యం భిషజోత్తమ. 171
ఇందీవరసమం నేత్రం ముఖం తామ్రేశసన్నిభం,
సమదాతుగతిర్నాడీ సర్వః కోకిలసన్నిభః. 172
క్షుతం క్షుధా మూర్ధ్ని కండూ రన్న వాంఛా తనుర్లఘుః,
దంతాః కుందనిభాభాసా జిహ్వాసద్రవమార్దవా. 173
యవాగూప్రాశనేస్వేదః కర్ణయో శ్రవణంసమం,
ఘ్రాణేగంధసమజ్ఞానే పాణిపాదతలోష్ణతా. 174
నఖపక్ష్మాక్షిరేఖాసు రక్తసంపూర్ణతా యదా,
జ్ఞాత్వా చైవం సుఖం సాధ్యం చికిత్సేత్పండితో భిషక్. 175
(సిద్ధవిద్యాభూః)

తా. ఇఁక త్రయోదశసన్నిపాత సప్తవిధదోషసాధ్యగుణంబుల వచించెద. ఓవైద్యోత్తముఁడా ! వినుము: నేత్రములయందు నల్ల కలువరేకులవంటి కాంతి,

ముఖము చంద్రునితో సమానముగనుండుట, నాడికి సమగమనము, స్వరము కోకిలస్వరముతో సమానముగనుండుట, తుమ్ములు, అన్నమునం దిచ్ఛ, శరీరము చులకనగనుండుట, దంతములయందు మొల్లలవంటి కాంతి, నాలుక ద్రవయుక్తమై మృదువుగనుండుట, నిద్రాగునపుడు చెమట, కర్ణములయందు ఘోషము సమముగ వినిపించుట, ఇరు నాసికలయందు పరిమళద్రవ్యములవాసన సమముగా నెఱుంగవచ్చుట, కాళ్లు చేతులు ఉష్ణముగనుండుట, నేత్రములు రెప్పలు గోళ్లు హస్తరేఖలు ఇవి రక్తపూరితముగ నుండుట-ఈలక్షణములు పదమూడు సన్నిపాతములలోను, సప్తవిధదోషములలోను జనించి నాడి స్వస్థగతిగా నడుచుచుండిన సాధ్యమని యెఱిఁగి పండితుఁడు చికిత్స జేయవలయు.

## అపథ్యజనితసప్తవిధదోషలక్షణము

తంద్రా మూర్ఛా భ్రమో మోహః ప్రలాపో హ్యాది వేపనం,
అపథ్యదోషావిజ్ఞేయా వైద్యవిద్యావిశారదైః. (మాధవకల్పే) 176

తా. తంద్ర మూర్ఛ భ్రమ మోహము ప్రలాపము ఒణఁకు అదురుట - ఈ లక్షణములు గలిగిన అపథ్యదోషమని వైద్యశాస్త్రవేత్తలు తెలిసికొనవలయు.

## స్త్రీసంగమదోషలక్షణము

తరుణజ్వరమధ్యే తు యువతీ సంగమే తథా,
జాయతే వారుణోదోషో హ్యంగవైకల్యకంపనమ్. 177
వక్షోంతరే చ సంతాపః ప్రలాప స్తాపవిభ్రమౌ,
పాణిపాదతలే శీతం దోషః స్త్రీసంగమే స్మృతః. (మాధవనిదానే)

తా. తరుణజ్వరమధ్యములో స్త్రీసంభోగము సేయుటచే దారుణమైనదోషము జనించు. దానియందు అంగవైకల్యము వణఁకు ఱొమ్ములోమంట ప్రలాపము తాపము బొబ్బుమాటలు హస్తపాదములయందు శైత్యము గలుగు-ఈలక్షణములుగలది స్త్రీసంగమదోషమని తెలియవలయు.

## విషమదోషలక్షణము

జ్వరసంతాపవేగశ్చ నాడీ కుటిలవేగతా,
అంతర్దాహో మదో మూర్ఛా విషమే దోషసంగతే. 179
(మాధవనిదానే)

తా. జ్వరము కడుసంతాపము అంతర్దాహము మదము మూర్ఛ గలిగి నాడి కుటిలమై వేగముగ నడుచుచుండిన విషమదోషమని తెలియవలయు.

### విషమశీతదోషలక్షణము

దినే ద్విత్రిచతుర్వారం ముహుశ్శీతం ముహుర్జ్వరః,
దాహో మోహ శ్శిరోరుక్చ జిహ్వా కఠినకంటకా. 180
దోషం విషమశీతం వై జానీయాద్వైద్యపారగః, (గ్రంథాంతరే

తా. ఒకదినములో రెండు మూడు నాలుగు పర్యాయములు చలి, జ్వరము వచ్చుట, దాహము మోహము తలనొప్పి గలుగుట, నాలుక కఠినమై ముండ్లుపారియుండుట-ఈలక్షణములుగలది విషమశీతదోషమని వైద్యవేత్తయగువాఁడెఱుఁగవలయు.

### పీతజిహ్వాకదోషలక్షణము

జిహ్వాపీతా స్ఫోటశుష్కా గ్రంథికా జ్వరవిభ్రమాః. 18
*మూర్ఛామూకత్వగుంభం చ పీతజిహ్వాకలక్షణం, (గ్రంథాంతరే

తా. నాలుక పచ్చగనుండుట, నాలుక ముండ్లుపారియుండుట, చెవులసంధులలో గడ్డలుకట్టుట, జ్వరము, తబ్బిబ్బులాడుట, మూర్ఛ, మూగతనము, దగ్గుత్తికపడుట ఈలక్షణములుగలది పీతజిహ్వాకదోషమని తెలియవలయు.

### రక్తజిహ్వాకదోషలక్షణము

జిహ్వాచ రక్తవర్ణాస్స్యాత్కంటకద్రవసంయుతా. 18
జ్వరతృష్ణా విదాహం చ రక్తజిహ్వాకలక్షణం, (మాధవనిదానే

తా. నాలుక ఎఱ్ఱగనుండుట, నాలుక ముండ్లుపారి ద్రవయుక్తముగనుండుట జ్వరము, దప్పి, శరీరతాపము-ఈలక్షణములుగలది రక్తజిహ్వాకదోషమని తెలియవలయు

### కృష్ణజిహ్వాకదోషలక్షణము

కృష్ణాజిహ్వా చ కఠినా కంటకా దాహవిభ్రమా. 18
శ్వాసఃకండూర్మదస్తృష్ణా స్యాద్దోషః కృష్ణజిహ్వాకః,
(మాధవనిదానే

తా. నాలుక నల్లనై కఠినమై ముండ్లుపారియుండుట, తాపము, తబ్బిబ్బులాడుట, శ్వాసము, శరీరమున దురద, శరీరము గురుతెరుగకుండుట, దప్పి-ఈలక్షణములు గలది కృష్ణజిహ్వాకదోషమని తెలియవలయు.

### శ్వేతజిహ్వాకదోషలక్షణము

జిహ్వా శ్వేతా స్ఫోటగళ శ్చాంగవైకల్యకంపితా. 18

---

* మూర్ఛగుంభనహిక్కాశ్చ పీతజిహ్వాకలక్షణమ్—మూర్ఛ, దగ్గుత్తిక, ఎక్కిళ్లు గలుగుట.

భ్రమస్వేదాతిసారాశ్చ హిక్కోద్గారశ్చిత్తవిభ్రమః,
క్షణేక్షణే మతిర్మూర్ఛా శ్వేతజిహ్వాకలక్షణమ్. (గ్రంథాంతరే)

తా. నాలుక తెల్లగనుండుట, గొంతులో ఉడికి పగిలినట్లుండుట, శరీరము నొచ్చుట, వణకుట, భ్రమ, చెమట, అతిసారము, ఓకర, చిత్తభ్రమ, ప్రతిక్షణమునందు మఱపు, మూర్ఛ-ఈలక్షణములుగలది శ్వేతజిహ్వాకదోషమని తెలియవలయు.

సప్తవిధదోషదినప్రమాణము

ఇతిసప్తవిధాదోషాః ప్రమాణం చార్ధమాసకం,
అథవా సప్తదివసం విజానీయాత్త్రిపగ్వరః. (మాధవనిదానే) 186

తా. పైఁజెప్పఁబడిన సప్తవిధదోషములకు పదిహైదుదినములుగాని ఏడుదినములుగాని కాలప్రమాణమని వైద్యుఁడు తెలిసికొనవలయు. (ఆకాలము గడచినపిదప రోగి జీవించియుండిన చికిత్సచేయవలయు. ఆసప్తవిధదోషములు తరుణమునందు జనించిన ఏడు దినములకు జంపును. తరుణము గతించినపిదప జనించిన పదిహైదుదినములకు జంపును. అట్లగుటంజేసి ఏడుదినములుగాని, పదిహైదుదినములుగాని గతించిన దైవబలము గలవారు జీవించినను జీవించెదరు.)

ఔషధప్రయోగకాలము

క్షణాద్దోషాద్యవస్థాయాం కుర్యాద్భేషజయోగకృత్,
తా. దోషించినపుడే యౌషధం బియ్యవలయును.

సప్తవిధదోషమారకోపద్రవములు

హీనస్వరో గుదభ్రంశః కాసశ్వాససమాకులః. 187
హృదిశోభో భవేత్తస్య కుక్షిశూలో న జీవతి, (గ్రంథాంతరే)

తా. హీనస్వరము * గుదభ్రంశము, కుతికలో శ్లేష్మము అడ్డపడుట, శ్వాస, శరీరము గురుతెరుగకుండుట, ఱొమ్మువాచుట, కడుపులో ప్రబలమైన శూల - ఈలక్షణములు సప్తవిధదోషములలోను సన్నిపాతములలోను కలిగియుండిన అట్టిరోగి యమాలయమున కేగు నని యెఱింగి చికిత్సజేయంజనదు.

యోహృష్టరోమా రక్తాక్షః స్పృహిక్కాశ్వాసశూలవాన్. 188
విభ్రాంతలోచనం మూఢం జ్వరితం పరివర్జయేత్, (సిద్ధరసార్ణవే)

తా. రోమములు గగుర్పొడుచుట, నేత్రములు రక్తోద్రిక్తములుగ నుండుట, ఎక్కిళ్ళు, ఎగయూపిరి, కడుపులో ప్రబలమైనశూల, నేత్రములు చక్రాకారముగ దిరు

* గుదభ్రంశ మనఁగా—ఆసనము బైటికి వెడలుట.

గుట, శరీరము గురు తెరుగకుండుట - ఈలక్షణములు పదమూడుసన్నిపాతములలోను సప్త విధదోషములలోను కలిగియుండిన రోగి యమమందిరమున కేగునని తెలియవలయు.

రాత్రౌతాపో దివాశీతం వాతా ర్తిర్హ్యల్పజల్పకః. 189
కృష్ణాజిహ్వాతిరక్తా వా శిరస్తోదో నశస్యతే, (పూజ్యపాదీయే)

తా. శరీరము రాత్రులయందు తాపయుక్తముగనుండుట, పగటియందు చల్లగ నుండుట, ధనుర్వాతము, స్వల్పముగా మాటలాడుట, నాలుక నల్లగగాని కడు ఎఱ్ఱగ గాని నుండుటయేగాక ముండ్లుపారి పిడకవలెనుండుట, శిరము నిలువకుండుట - ఈలక్షణములలో ఒకటిగాని కొన్నిగాని సప్తవిధదోషములలోను పదమూడు సన్నిపాతముల లోను కలిగియుండిన రోగి జీవించుట దుర్లభమని యెఱింగి చికిత్సచేయం జనదు.

భగ్నగ్రీవా తథాస్ఫోటో మూర్ఛా వాతః క్షణేక్షణే. 190
ఊర్ధ్వశ్వాసో భవేద్యస్య కఫః కణ్ఠే న జీవతి, (మాధవనిదానే)

తా. మెడ నిలువకుండుట, కుతికలో పగిలియుండుట, ప్రతిక్షణమునందు మూర్ఛ, ధనుర్వాతము, ఎగయూపిరి, కుతికలో శ్లేష్మము అడ్డపడుట-ఈలక్షణములు సప్త విధదోషములలోను పదమూడు సన్నిపాతములలోను కలిగియుండిన రోగి బ్రతుకఁడని తెలియవలయు.

అంగులీనాం నఖానాం చ దంతానాం పక్ష్మణాం తథా. 191
నాస్తిచేద్రక్తవర్ణత్వం తస్య మృత్యుర్నసంశయః,

తా. ఏరోగమునందు వ్రేళ్ళతుద, గోళ్ళు, పండ్లచిగుళ్లు, రెప్పలు నీనియందు రక్తములేకుండునో అట్టిరోగి నిశ్చయముగా మృతిచెందునని తెలియవలయు.

అంగకంపో గతేర్భంగో ముఖం కుంకుమసన్నిభమ్. 192
ముఖే నారిచ నిశ్వాస స్సచ యాతి యమాలయం,
చిరాత్ప్రవృద్ధరోగస్తు భోజనేష్వసమర్థకః. 193
భగ్నగాత్రో భవేద్యస్తు సద్యస్త్యాజ్యో భిషగ్వరైః,
ఇత్యేవం లక్షణం జ్ఞాత్వా చికిత్సాం కారయేద్బుధః. 194

తా. శరీరము వణకుట, నడుచుటకు శక్తిలేకుండుట, ముఖము ఎఱ్ఱగనుండుట, నోట నీరుగారుట, శ్వాస - ఈలక్షణములు గలరోగి యమాలయంబున కేగు. మఱియు రోగికి రోగములు క్రమముగా వృద్ధిచెందుచుండుట, అన్నము దిగకుండుట, శరీరము

శిథిలముచెందుట - ఈలక్షణములుగల రోగిని వైద్యుఁడు వర్జింపవలయును. ఇటుల రోగ సాధ్యాసాధ్యంబుల నెఱిఁగి బుద్ధిమంతుఁ డగువాఁడు చికిత్స జేయవలయును.

అనిలోయాతి పిత్తే చ పిత్తంయాతి కఫాలయే,
కఫశ్చ కంఠమాయాంతి దుర్లభం తస్యజీవితమ్. (నిత్యనాథీయే) 195

తా. నాభికి క్రిందిభాగముననుండు వాతము ప్రకోపించి నాభికి పైభాగమున నుండు పిత్తస్థానమునుచెందును. అందువలన పిత్తము ఉద్రిక్తమై ఆమ్మునందుండుశ్లేష్మ స్థానమును చెందు. అందువలన శ్లేష్మము ప్రకోపించి కుతిక నడ్డగించును, దానివలన రోగి మరణము చెందును.

క్షీణేంద్రియస్య చాసత్వ కాసశ్వాసోద్గమస్య చ,
జ్వరాదౌ విషమో యస్య యస్య దీర్ఘాశ్చ రాత్రయః. 196
తీక్ష్ణవేగార్తిరూక్షస్య తం ఘ్నంతిజ్వరితం ధ్రువమ్. (భైరవకల్పే)

తా. సప్తవిధదోషములలోను సన్నిపాతములలోను చక్షురాది పంచేంద్రియ క్షయము, బలహాని, ఎగయూపిరి, కుతికలో శ్లేష్మప్రతిబంధము, తొలుత విషమజ్వరము తీవ్రవేగము, రూక్షకలిగి దీర్ఘకాలమువఱ కనువర్తించియుండిన రోగి మరణము చెందు నని తెలియవలయును.

## సన్నిపాతసప్తవిధదోషమృత్యునాడీలక్షణము

చాంచల్యం దోషదుష్టత్వం కాఠిన్య మతిమందతా. 197
వక్రత్వ మతిసూక్ష్మత్వం స్వస్థానత్యాగ ఏవ చ,
యస్యైతాని చ దృశ్యంతే సయాతి యమమందిరమ్. (ఆయుర్వేదే)

తా. పదమూఁడుసన్నిపాతములలోను సప్తవిధదోషములలోను నాడి చంచలముగ త్రిదోషసంకరముగ కఠినముగ అతిమందముగ వక్రముగ, లేక అతి సూక్ష్మముగ నడుచుచు స్వస్థానమును విడనాడియుండిన రోగి యమాలయమున కేగునని తెలియవలయును.

## అసాధ్యరోగచికిత్సావశ్యకత్వము

యావత్కంఠగతాః ప్రాణాః యావన్నశ్యతిచేంద్రియం,
తావచ్చికిత్సా కర్తవ్యా కాలస్య కుటిలాగతిః. (నిత్యనాథీయే)

తా. ఈశ్వరేచ్ఛాకర్మగతుల నెఱుఁగుట కెవ్వారికి నశక్యముగానుండుటచే ప్రాణములు కంఠగతం బగువఱకును ఇంద్రియములు నశించువఱకును అసాధ్యరోగములయందు కూడా చికిత్స జేయవలయును.

## సద్వైద్యలక్షణము

వ్యాధేస్తత్వపరిజ్ఞానం వేదనాయాశ్చ నిగ్రహః,

ఏతద్వైద్యస్య వైద్యత్వం న వైద్యః ప్రభురాయుషః. 200

తా. వైద్యుఁడు రోగతత్వము నెఱిఁగి రోగమువలనజనించిన వేదనలను పోకడు చుటయందు సమర్థుఁ డగునేకాని ఆయువునొసంగుటకు సమర్థుఁడు కానేరఁడు.

సప్తవిధదోషసన్నిపాతసాధ్యలక్షణములు

భిషగ్భేషజయోస్సమ్యగ్విశ్వాసస్త్వంగ శేశుచిః,
నిద్రాసౌఖ్యం ప్రీతిహర్షౌ శరీరం సోద్యమం భవేత్. 201
ఇంద్రియాణి ప్రసన్నాని సరోగీ నైవ నశ్యతి,
సౌమ్యదృష్టిర్భవేద్యస్య శ్రోత్రే వక్త్రేచ స్వచ్ఛతా. 202
పాణిపాదం భవేదుష్ణం జిహ్వా యస్యచ కోమలా,
స్వేదహీనో జ్వరో యస్య *కాసశ్వాసో న వర్తతే. 203
కంఠోఽపి కఫహీనస్తు స రోగీనైవ నశ్యతి,
చైతన్యం సకలం యస్య గంధస్వాదస్ఫుటం భవేత్. 204
సర్వపూరితకంఠస్తు స జీవతి న సంశయః,
ఏతాని విపరీతాని యస్య స్యుర్న స జీవతి. 205

తా. వైద్యునియందు ఔషధమునందు శ్రద్ధ, శరీరశుచి, సుఖముగా నిద్ర బట్టుట, వస్తువులయం దాసక్తి సంతోషము, కార్యములయందు ప్రవృత్తి, పంచేంద్రియములకు పటుత్వము - ఈలక్షణములుగలరోగి జీవించునని తెలియవలయు. మఱియు సౌమ్యదృష్టి, చెవులు బాగుగా వినిపించుట, నోరు దోషరహితమై నిర్మలముగనుండుట, కాళ్లు చేతులు ఉష్ణముగనుండుట, నాలుక మృదువై ద్రవయుక్తముగనుండుట, బంక చెమట లేకుండెడిజ్వరము, కాసశ్వాసలు లేకుండుట, కుతికలో తెమడ లేకుండుట, సర్వాంగములయందు ఎఱుకగలిగియుండుట, ముక్కున పరిమళద్రవ్యములవాసన తెలియవచ్చుట, కంఠస్వరము చెడక బాగుగానుండుట - ఈలక్షణములుగలిగి నాడి స్వస్థగతిగా నడుచుచుండిన ఆరోగి నిశ్చయముగా జీవించునని ఎఱింగి చికిత్స జేయవలయు. మఱియు పైఁజెప్పిన లక్షణములకు విపరీతలక్షణంబులు కలిగియుండిన ఆరోగి వైవస్వతనిలయంబున కేగునని యెఱింగి చికిత్స జేయంజనదు.

సన్నిపాతసప్తవిధదోషములకు కాలకూటరసము

రుద్రసంఖ్యామృతంచైవ త్రిభాగం సూతమేవ చ,
గంధకం పంచభాగం చ శిలాయాంబుతుభాగకమ్. 206

---

* నాసాశ్వాసః ప్రవర్తతే.

తామ్రభస్మచతుర్భాగం ఋషిభాగం చ టంకణం,
తాళకం నవభాగం చ వహ్నిమూలం తథైవ చ. 207
త్రిఫలా చ త్రికటుకం దశద్వాదశకం తథా,
హింగుభాగైకసంఖ్యాన ముగ్రగంధా తథైవ చ. 208
ఏవం ఖల్వే చ సంస్థాప్య హ్యార్ద్రకం వహ్నిమూలకం,
జంబీరలశునం చైవ శార్ఙ్గిశిగ్ర్వర్కమూలకమ్. 209
లాంగలీ హంసపాదేన సింధుర్నాగదళేన చ,
అంకోలశిగ్రుమూలాని ప్రత్యేకం యామమాత్రకమ్. 210
పంచకోలకషాయేణ పంచమూలేన మర్దయేత్,
గుంజామాత్రం వటీం కృత్వా శృంగిబేరం పిబేదను. 211
అసాధ్యం సన్నిపాతం చ సర్వజ్వరహరం పరం,
సప్తదోషావినాశశ్చ సన్నిపాతకులం హరేత్. 212
స్నానం కుర్యాత్ప్రయత్నేన శ్రీగంధం లేపమాచరేత్,
పథ్యం దధ్యోదనం చైవ ఖర్జూరాదిఫలైరపి. 213
తాంబూలచర్వణం కుర్యాత్క్రమేణైవం సమాచరేత్,
కాలకూటరసో నామ్నా త్వీశ్వరేణైవ భాషితమ్. 214
భిషగ్వరాశ్చ కుర్వీరన్ రోగాణాం కులనాశకృత్, (నిత్యనాథీయే)

తా. శుద్ధిజేసిన నాభి ౧౧ భాగములు, శుద్ధిజేసిన పాదరసము ౩ భాగములు, శుద్ధిజేసిన గంధకము ౫ భాగములు, శుద్ధిచేసిన మణిశిల ౬ భాగములు, తామ్ర భస్మము ౪ భాగములు, శుద్ధిజేసిన వెలిగారము ౬ భాగములు, శుద్ధిచేసిన తాళకము ౯ భాగములు, చిత్రమూలము ౯ భాగములు, త్రిఫలములు ౧౦ భాగములు, త్రికటుకములు ౧౨ భాగములు, ఇంగువ ౧ భాగము, వస ౧ భాగము-ఇటుల వీనిని ఖల్వములో నునిచి అల్లము, చిత్రమూలను, నిమ్మపండ్లు, వెల్లుల్లి, బండిగురువెందచెక్క, కాఋమునగ, జిల్లేడువేళ్లు, చన్నచర్లగడ్డ, హంసపాదియాకు, వావిలాకు, తమలపాకులు, ఊడుగవేళ్లచెక్క, మునగవేళ్ళచెక్క-వీనిరసములచే ప్రత్యేకప్రత్యేకముగా నొక్కొక ఝామము బాగుగామర్దించి పిదప పంచకోలకషాయములో నొకదినము పంచమూలకషాయములో నొకదినము మర్దించి గురిగింజలంతేసిమాత్రలుజేసి యందొకదానిని అల్లపు రసానుపానముతో సేవించిన అసాధ్యసన్నిపాతములు, సప్తవిధదోషములు, సర్వజ్వరములు, సన్నిపాతసమూహము నశించు. మఱియు దీనియందు శీతోదకస్నానము, శ్రీగంధ

లేపనము, పెరుగన్నమును భుజించుట, ఖర్జూరాదిఫలభక్షణము, తాంబూలచర్వణము- వీనిని క్రమముగా నాచరింపవలయును. ఇది ఈశ్వరునిచే వచింపఁబడిన కాలకూటరసము. దీనిక్రమము నెఱిఁగి వైద్యోత్తములు ప్రయోగించిన సన్నిపాతాదిరోగసమూహమును నశింపఁజేయును.

### సన్నిపాతభైరవము

తాళకం గంధకం సూతం వత్సనాభం త్రిభిస్సమమ్. 215
శిలాచ టంకణం చైవ సర్వత్ర సమహింగుళం,
మర్దితం చిత్రజంబీరే ణార్ద్రకేన దినత్రయమ్. 216
అనుపానవిశేషేణ సన్నిపాతకభైరవం,
త్రిదోషంచాతిసారం చ కఫపాండుమరోచకమ్. 217
కుక్షిశూలముదావర్తసన్నిపాతనికృంతనం,

తా. శుద్ధిచేసిన తాళకము, గంధకము, రసము-ఇవి సమభాగములు, వీనికిసమము నాభి, మణిశిల, వెలిగారము - ఇవి తాళకముతో సమము, వీనికన్నిటికి సమము ఇంగిలీకము. వీటిని చిత్రమూలరసముతో నొకదినము నిమ్మపండ్లరసముతో నొకదినము అల్లపురసముతో నొకదినము మర్దించి మినపగింజలంత మాత్రలుచేసి అనుపానవిశేషములతో నిప్పించిన త్రిదోషాతిసారములు కఫపాండువు అరోచకము కుక్షిశూల ఉదావర్తము సన్నిపాతములు ఇవి హరించును. ఇదియ సన్నిపాతభైరవము.

### సన్నిపాతాదులకు అపుటాగ్నికుమారము

రసస్యభాగా శ్చత్వారో వంగంచాష్టప్రకల్పయేత్. 218
చత్వారో మరిచం గంధం విషకం చ త్రిభాగకం,
ద్వాదశస్ఫటికం గ్రాహ్యం సర్వంచూర్ణం ప్రకల్పయేత్. 219
అపుటాగ్నికుమారోఽయం దీయతే గుంజమాత్రకం,
ఆర్ద్రకస్వరసస్యాద్యం సన్నిపాతజ్వరాపహమ్. 220

తా. శుద్ధిజేసిన పాదరసము ౪ భాగములు, వంగభస్మము ౮ భాగములు, మిరియాలు ౪ భాగములు, శుద్ధిచేసిన గంధకము ౪ భాగములు, శుద్ధిజేసిన వసనాభి 3 భాగములు, పటిక ౧౨ భాగములు-ఇటుల వీనిని ఖల్వములోనునిచి అల్లపురసముతో మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి అల్లపురసానుపానముతో సేవించిన ౧3 సన్నిపాతములు సప్తవిధదోషములు నశించు, ఇది అపుటాగ్నికుమారమనఁబడు.

## సన్నిపాతములకు రాజాగ్నికుమారము

రసం గంధామృతం తుల్యం త్రిక్షారోదుంబరస్నుహా,
హంసపాదిద్రవే ఖల్వే మర్దితం దివసత్రయమ్. 221
కాచకుప్యాం నివేశ్యాథ విలేప్య వస్త్రమృత్తికాం,
వాలుకాయంత్రకే పాచ్యా రసైర్మృద్వగ్నినా తతః. 222
ద్విషడ్యామం సముద్ధృత్య చూర్ణయే న్మాషమాత్రకం,
ఆర్ద్రికస్యానుపానేన సర్వరోగా న్నిహంతి చ. 223
రసోహ్యగ్నికుమారాఖ్యో యోగోఽయం రసభూపతిః,

తా. శుద్ధిచేసిన రసము, గంధకము, వసనాభి-ఇవి సమభాగములు. త్రిక్షారములు, మేడి వీనిని పైఁజెప్పిన వస్తువులకు సమముగాగ్రహించి ఖల్వములోనునిచి వాలుకాయంత్రమున మృద్వగ్నిచే ౧౨ ఝాములువండి సాంగశీతలమునదీసి నూరి చూర్ణము చేసి మాషప్రమాణము అల్లపురసముతోనిచ్చిన సన్నిపాతజ్వరములు సమస్తరోగములు హరించును. ఇదియె రాజాగ్నికుమార మనఁబడును.

## సన్నిపాతములకు నవలోహాగ్నికుమారము

సంశుద్ధపారదం తుల్యం భస్మలోహాష్టకం సమమ్. 224
అర్కమూలకషాయేణ మర్దితం దినపంచకం,
కూపికాయాం నివేశ్యాథ విలేప్య వస్త్రమృత్తికామ్. 225
మృద్వగ్నినా వాలుకాభి ర్ద్వాదశప్రహరం పచేత్,
సాంగశీతలముద్ధృత్య మర్దితం చూర్ణయేత్తతః. 226
గుంజామాత్రం ప్రదాతవ్యం సర్వరోగో వినశ్యతి,
సన్నిపాతోఽతిశీఘ్రేణ సర్వజ్వరహరం పరమ్. 227
ప్రఖ్యాతం నవలోహాఖ్యం రసో హ్యగ్నికుమారకః,

తా. శుద్ధిచేసినరసము, సువర్ణభస్మము, రజితభస్మము, వంగభస్మము, లోహభస్మము, నాగభస్మము, తామ్రభస్మము, కంచుభస్మము, ఇత్తడిభస్మము-వీనిని సమభాగములుగా ఖల్వములో వేసి జిల్లేడువేళ్ళకషాయముచే అయిదుదినములు మర్దించి గాజుకుప్పెలోబెట్టి చీలమన్ను చేసి వాలుకాయంత్రమునం దునిచి మృద్వగ్నిచే ౧౨ ఝాములు వండి సాంగశీతలమునదీసి చూర్ణముచేసి గురిగింజయెత్తును అనుపానవిశేషముచే నిచ్చిన సమస్తరోగములు హరించును. సన్నిపాతములు సర్వజ్వరములు - ఇవి అతిశీఘ్రముగా నివర్తించును. ఇది నవలోహాగ్నికుమారరస మనఁబడును.

సన్నిపాతములకు ప్రతాపాగ్నికుమారము

పారదం శుల్బభస్మం చ విషం మరిచ నాగరమ్. 228
త్రిక్షారం పంచలవణాన్యేభిస్తుల్యైర్ద్రీకద్రవైః,
కాచకుప్యాంతరే క్షిప్త్వా మృదాచాలేపయేద్బహిః. 229
ఏష మృద్వగ్నినా పాచ్యః వాలుకాయంత్రకే దినే,
సాంగశీతలముద్ధృత్య దశమాంశం విషం క్షిపేత్. 230
సూక్ష్మచూర్ణీకృతం ఖల్వే గుంజామాత్రం ప్రదాపయేత్,
సన్నిపాతం నిహంత్యాశు ఆర్ద్రీకద్రవసంయుతమ్. 231
ప్రతాపాగ్నికుమారోఽయం సర్వరోగహరం పరం,

తా. శుద్ధిచేసినరసము, తామ్రభస్మము, నాభి, మిరియాలు, సొంటి, త్రిక్షారములు, పంచలవణము-వీనిని సమభాగములుగా గ్రహించి అల్లపురసముచే మర్దించి గాజుకుప్పెలోబెట్టి చీలమన్నుపూసి వాలుకాయంత్రమునం దిడి ఒకదినము మెల్లనిమంటను వండి సాంగశీతలమునదీసి దీనికి పదియవపాలు నాభిచేర్చి మెత్తగానూరి గురిగింజప్రమాణమును అల్లపురసముతో నిచ్చిన సన్నిపాతములు శీఘ్రములో నశించును. ఇది సర్వరోగములను హరింపఁజేసెడి ప్రతాపాగ్నికుమారము.

దివ్యాగ్నికుమారము

హారవీర్యం విషంతుల్యం మర్ద్యం వహ్నికషాయకే. 232
మూషాయాం భూధరేపాచ్యం వాలుకాయంత్రకే దినం,
సాంగశీతలముద్ధృత్య కటుత్రైలేన భావయేత్. 233
పాదాంశమమృతం క్షిప్త్వా మర్దితం నీలికాద్రవైః,
గుంజాద్వయం ప్రదాతవ్యం సర్వేషాం సన్నిపాతనుత్. 234
సుదివ్యాగ్నికుమారోఽయం ప్రాణినాం ప్రాణదాయకః,

తా. శుద్ధిచేసిన పాదరసము, వసనాభి - వీనిని సమభాగములుగా గ్రహించి చిత్రమూలవేళ్లకషాయముచే నూరి గుటికలుచేసి మూషలోబోసి వాలుకాయంత్రమునం దిడి ఒకదినము భూధరపుటమువేసి సాంగశీతలమున దీసి సొంటి పిప్పలి మిరియాలు వీనిలో తైలముతీసి దానిచేమర్దించి ఔషధమునకు నాలవపాలు నాభిచేర్చి నీలియాకురసముచే మర్దించి రెండుగురిగింజలప్రమాణమునిచ్చిన సమస్తసన్నిపాతములు హరించును. ఇది దివ్యాగ్నికుమారము. ఇది ప్రాణులకు ప్రాణము నిచ్చును.

### సన్నిపాతములకు మహాతరుణార్కము

అభ్రకం గంధకం తామ్రం టంకణం నాగ వంగకమ్. 235
మాక్షికం లోహభస్మం చ మౌక్తికం చ ఫణివిషం,
జాంబూనదోన్మత్తబీజం ప్రవాళం రక్తచందనమ్. 236
తవక్షీరీ చ కస్తూరీ సరోహితమనశ్శిలా,
ఏతత్సర్వం సమాంశాని సర్వతుల్యం తు నాభకమ్. 237
సర్వేతదర్ధమర్ధంస్యాత్తత్స్వరూపస్య హింగుళం,
సర్వం ఖల్వే వినిక్షిప్య మాతులుంగరసేన చ. 238
మర్దయే త్త్రిదినం ఖల్వే నవనీతసమం మృదు,
మూలకస్య చ బీజాని మాత్రాద్వంద్వం ప్రయోజయేత్. 239
ఉద్ధతాన్ వినిహంత్యాశు సన్నిపాతాన్ త్రయోదశ,
పుంసాంతు జనితాన్ దోషాన్ స్త్రీణాం దోషం చ నాశయేత్. 240
సర్వరోగా వినశ్యంతి హ్యనుపానవిశేషతః,
మహాతరుణార్కనామాయం బాలదోషప్రశాంతికృత్. 241

తా. అభ్రకభస్మము, శుద్ధిచేసిన గంధకము, తామ్రభస్మము, శుద్ధిచేసిన వెలిగారము, నాగభస్మము, వంగభస్మము, హేమమాక్షికము, లోహభస్మము, ముత్తెపు భస్మము, త్రాంచువిషము, సువర్ణభస్మము, శుద్ధిజేసిన ఉమ్మెత్తవిత్తులు, పగడభస్మము, రక్తచందనము, తవక్షీరి, కస్తూరి, శుద్ధిచేసిన రక్తమనోశిల - ఇవి సమభాగములు. వీనికి సమము శుద్ధిచేసిన నాభి, నాభికిసమము శుద్ధిచేసిన ఇంగిలీకము - ఇటుల వీనినన్నిటిని ఖల్వమునందునిచి మాదీఫలరసముచే మూడుదినములు వెన్నవలె మృదువుగా మర్దించి ముల్లంగి గింజలంతమాత్రలుచేసి ౨ మాత్రలను అనుపానవిశేషములతో నిచ్చిన ప్రకోపించియుండు ౧౩ సన్నిపాతములు మానును. మఱియు పురుషులకు జనించియుండు దోషములు స్త్రీలకు జనించియుండుదోషములు హరించును. ఇది మహాతరుణార్క మనఁబడును. ఇది బాలరోగములనుకూడా శమింపఁజేయును.

### సన్నిపాతములకు సమగరళతరుణార్కము

గోదంతం హింగుళం తుల్యం ద్వయోస్తుల్యం హాలాహలం,
త్రయాణాం గరళం తుల్యం గరళం కృష్ణసర్పజమ్. 242
మాతులుంగరసైర్మర్ద్యం దినమేకం తు కజ్జలీ,
ముద్గప్రమాణవటికాన్నారికేళోదకేన చ. 243

దాతవ్యం సన్నిపాతార్తే తతశ్శైత్యముపాచరేత్,
తరుణార్కరసో నామ మృత్యుం జయతి నిశ్చయః. 244
మృత్యువక్త్రగతంవాపి రోగిణం జీవయేద్ధ్రువం,

తా. తాళకము, శుద్ధిచేసిన ఇంగిలీకము-ఇవి సమభాగములు; ఈరెంటికిసమము హాలాహలమనువిషము. ఇది దొరకనియెడల నాభి; ఈమూటికి సమము గరళము, నల్లత్రాచువిషము. వీనిని మాదీఫలరసముచే నొకదినము మర్దించి కజ్జలిచేసి పెసరగింజ లంతమాత్రలుచేసి కొబ్బెరకాయనీరుతో నొసంగి శైత్యోపచారము చేయుచుండిన సకల మయిన సన్నిపాతములు హరించును. ఇది తరుణార్కరస మనఁబడును. ఇది మృత్యువును నిశ్చయముగా హరింపఁజేయును. మరణముచెందినవానినికూడా శీఘ్రముగా జీవింపఁ జేయును.

సన్నిపాతాదులకు అమృతసంజీవనీరసము

శుద్ధసూతం విషం గంధం హింగుళం కటురోహిణీ. 245
భృంగరాజస్య నీరేణ మర్దయే ద్దివసత్రయం,
మాషమాత్రాం వటీం కుర్యా దార్ద్రికస్యాను పానతః. 246
దేయంహ్యమృతసంజీవిరసోఽయం సన్నిపాతనుత్,
(మాధవనిదానే)

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిజేసిన వసనాభి, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన ఇంగిలీకము, కటుకరోహిణి - వీనిని సమభాగములుగా ఖల్వములో నునిచి గుంటగలిజేరాకురసముచే 3 దినములు బాగుగా మర్దించి [1]మాషప్రమాణము మాత్రలుజేసి యం దొకదానిని అల్లపురసముతో సేవించిన ౧౩ సన్నిపాతములు, సప్తవిధ దోషములునశించు.

సన్నిపాతాదులకు ఆనందభైరవము

హింగుళం చ విషం వ్యోషం మరీచం టంకణం కణాః, 247
మాతులుంగరసైర్మర్ద్యం రసమానందభైరవం,
కాసశ్వాస క్షయే గుల్మే ప్రమేహే విషమజ్వరే. 248
తృష్ణాయాం గ్రహణీరోగే హ్యజీర్ణే సన్నిపాతకే,
గుంజైకం తు ప్రదాతవ్యం రసమానందభైరవమ్. (మాధవకల్పే)

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసిననాభి, [2]త్రికటుకములు, మిరియాలు, శుద్ధిజేసిన వెలిగారము, పిప్పళ్ళు-వీనిని సమభాగములుగా ఖల్వములో నునిచి మాదీఫల

1 మాషమన—ఎనిమిది, లేక ఏడుగురిగింజలయెత్తు.
2 త్రికటుకములనఁగా—శొంఠి, పిప్పలి, మిరియాలు.

రసముచే నాలుగుఝాములు బాగుగా మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి యందొక దానిని అల్లపురసముతో సేవించిన కాసశ్వాసములు, క్షయములు, గుల్మములు, ప్రమేహములు, విషమజ్వరములు, దప్పి, గ్రహణిరోగము, అజీర్ణము, ౧౩ సన్నిపాతములు, సప్తవిధదోషములు నశించు.

హింగుళం చ చతుర్భాగం టంకణం వసుసమ్మితం,
కణాచ వత్సనాభం చ ప్రత్యేకమినసంఖ్యయా. 250
ఆర్ద్రికస్యరసేనైవ దినాని త్రీణి మర్దయేత్,
ఆర్ద్రికస్యరసేనైవ గుంజామాత్రం ప్రదాపయేత్. 251
సర్వేషు సన్నిపాతేషు రసమానందభైరవం, (నిత్యనాథీయే)

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము ౪ భాగములు, వెలిగారము ౮ భాగములు, పిప్పళ్లు ౧౨ భాగములు, నాభి ౧౨ భాగములు - ఇటుల వీనిని ఖల్వములోనునిచి అల్లపురసముచే మూడుదినములు మర్దించి గురిగింజంతమాత్రలుచేసి అల్లపురసముచే నిచ్చిన సమస్తసన్నిపాతములు హరించును. ఇది ఆనందభైరవరస మనఁబడును.

సన్నిపాతములకు బ్రహ్మాస్త్రరసము

ద్వితుత్థం చ త్రిపాషాణం గంధకం చ శిలావిషమ్. 252
నేపాళం దరదం చాభ్రం సైంధవం మరిచం బిడం,
త్రిక్షారం టంకణం హింగు సర్వతుల్యం తు పారదమ్. 253
జ్యోతిష్మత్యాస్తు తైలేన మర్దయే ద్దినపంచకం,
డోలాయంత్రే దినే పాచ్యా నీత్వా ఖల్వే విమర్దయేత్. 254
మయూర మహిషీ మత్స్య వారాహా చ్ఛాగ పన్నగాః,
శశకా జంబుకా శ్వాన ఏభిఃపిత్తైస్తు భావయేత్. 255
గుంజామాత్రం తు రేభిత్వా బ్రహ్మద్వారే వినిక్షిపేత్,
నశ్యంతి తత్క్షణేనైవ సన్నిపాతం సుదారుణమ్. 256
మూర్ఛాపస్మార బధిరా హిక్కా శ్వాస వినాశనం,
బ్రహ్మాస్త్రోఽయం రసో ఖ్యాత స్సన్నిపాతకులాంతకః. 257

తా. శుద్ధిజేసిన మైలుతుత్తము, పాలతుత్తము, ఉల్లిపాషాణము, గౌరీపాషాణము, దొడ్డిపాషాణము, గంధకము, మణిశిల, నాభి, నేపాళములు, ఇంగిలీకము, అభ్రకభస్మము, సైంధవలవణము, మిరియాలు, బిడాలవణము, సర్జక్షారము, యవక్షారము,

సజ్జీకారము, వెలిగారము, ఇంగువ - వీనికి సమము శుద్ధిచేసిన పాదరసము, వీనినన్ని టిని ఖల్వములో నునిచి వెక్కుడువిత్తులతైలముతో ౫ దినములు మర్దించి డోలాయంత్రమునవండి మరల ఖల్వములోనునిచి నెమలి, ఎనుబోతు, రోహితమను మత్స్యము, పంది, మేక, పాము, చెవులపిల్లి, నక్క, శునకము - వీని చేదులచే వెవ్వేరుగ మర్దించి కత్తితో బ్రహ్మరంధ్రమునుగీరి పైరసమును గుంజామాత్రమునునిచిన తత్క్షణమువనే దారుణమైన సన్నిపాతములు మానును. మఱియు మూగతనము, అపస్మారము, చెవుడు, ఎక్కిళ్ళు, శ్వాసము-వీనినికూడా హరింపఁజేయును. ఇది బ్రహ్మాస్త్రరస మనఁబడు. సన్నిపాతకులమును నశింపఁజేయును.

## సన్నిపాతాదిసర్వరోగములకు శీతాంశురసము

కునటీ శుద్ధతాళం చ తద్యుగ్మం వ్యోషకం భవేత్,
మర్దయే న్నింబనీరేణ గుంజాయుగ్మం తు సేవయేత్. 258
అనుపానం మధుపథ్యా వ్యుష్ణవారి తథార్ద్రికం,
శీతజ్వరం సన్నిపాతం కామిలా పంచగుల్మకే. 259
సర్వం శ్వాసం చ కాసం చ హృద్యుదరే పూర్వరోగజిత్,
సన్నిపాతం తథాఛర్ది మశీతేవాతపైత్తకే. 260
శూలం శూకా జీర్ణశూలం నాభౌ కుక్షౌచ విద్రధిం,
ఆధ్మానానాహ విష్టంభం తాపం సర్వాంగదాహకమ్. 261
జంగమస్థావరవిషం హిక్కాం దీప్తేశ్చ కారణం,
శోఫం చ భ్రమ మూర్ఛాంచ తిమిరం చానువిధ్యతి. 262
మర్దితం నింబతోయేన లేపితం గజచర్మకం,
విసర్పి మణ్డలేచైవ తుషాచర్మవ్యపోహతి. 263
సేవితం లేపితం కుర్యా ద్వేధితం గ్రంథి మర్బుదం,
లేపితం దంతరోగాంశ్చ జిహ్వా నేత్రరుజ స్తథా. 264
అర్కపత్రరసైః కర్ణే కర్ణరోగస్య నాశనం,
నిర్గుండీ మిశ్రితం నస్య మపస్మారం శిరోరుజామ్. 265
అంజనం సర్షమాత్రం చ నేత్రరోగవినాశనం,
మాషం చ సన్నిపాతానాం కామిలా జ్వరశీతకే. 266
ధనుర్వాతం తథాభూతం శేషరోగే చ కా కథా,

భాషితం రేవణేనైవ రసం శీతాంశునామకమ్. (రేవణసిద్ధభాష్యే)

తా. శుద్ధిజేసిన నేపాళమణిశిల, శుద్ధిజేసిన తాళకము ఇవి దినుసు కొక్కొక భాగము, త్రికటుకములు ౨ భాగములు - ఇటుల వీనిని ఖల్వములో నునిచి వేపచెక్క రసముతో బాగుగా మర్దించి ౨ గురిగింజలంతేసి మాత్రలుజేసి యం దొకదానిని తేనె, కరక్కాయచూర్ణము, ఉష్ణోదకము, అల్లపురసము వీని యనుపానముతోడ సేవించిన శీతజ్వరములు, సన్నిపాతపాండువు, కామిల, ఐదుగుల్మములు, సమస్తకాసశ్వాసలు, ఉదరరోగపూర్వరూపములు, సన్నిపాతములు, వాంతి, ఎనుబదివాతములు, నలువది పిత్తరోగములు, శూల, శూకరోగము, పరిణామశూల, నాభికుక్షులయందు జనించెడి బల్లలు, కడుపుబ్బరము, ఆనాహవాతము, విష్టంభము, తాపము, సర్వాంగముల దాహము [1]స్థావర [2]జంగమవిషములు, ఎక్కిళ్ళు, అగ్నిమాంద్యము, శోఫ, భ్రమ, మూర్ఛ, తిమిరరోగము హరించు. మఱియు దీనినే వేపాకురసముతో చాది లేపనము చేసిన గజచర్మము, విసర్పి, మండలకుష్ఠము, శరీరమున పొట్టువలె చర్మము ఊడెడి రోగము హరించు. మఱియు గ్రంథులు, అర్బుదము-వీనియందు కత్తివాట్లువేసి వేప రసముతో నూరి లేపనము జేయుటయేగాక దానిసేవనముకూడా జేయుచుండిన గ్రంథులు అర్బుదము హరించు. మఱియు వేపరసముతో నూరి దంతరోగములయందు లేపనము చేసిన దంతరోగములు, జిహ్వారోగములు, నేత్రరోగములు హరించును. జిల్లేడాకురస ముతో నూరి చెవిలోబోసిన కర్ణరోగములు, వావిలాకురసముతో నూరి నస్యముచేసిన అపస్మారము (కాకిసోమాలు), శిరోరోగములు-నిమ్మపండ్లరసముతో నూరి ఆవగింజంతే కన్నులయందు కలికమువేసిన నేత్రరోగములు, మాషప్రమాణము అల్లపురసముతో నొసంగిన ౧౩ సన్నిపాతములు, సప్తవిధదోషములు, కామిలలు, శీతజ్వరములు, ధనుర్వాతము, భూతచేష్టలు హరించు. ఇట్టి ప్రబలరోగములనే హరింపఁజేయుచుం డగా-తక్కినరోగములనుగుఱించి వచింపనేల ? ఇది రేవణసిద్ధునిచే చెప్పఁబడిన శీతాంశు రసము.

### సన్నిపాతములకు మృతోత్థాపనరసము

శుద్ధసూతం ద్విధాగంధం శిలా చ విష హింగుళం,
మృతకాంతాభ్ర తామ్రాయః తాళకం మాక్షికం సమమ్. 268
ఆమ్లవేతస జంబీర చాంగేరీణాం రసేన చ,

1 స్థావరవిష మనఁగా—వసనాభి మొదలగువానివిషము. 2 జంగమవిష మనఁగా - పాము, తేళ్ళు, ఎలుకలు, సాలెపురుగు మొదలగువానికాటుచే జనించువిషము.

నిర్గుండీ హస్తిశుండ్యోశ్చ ద్రవైర్మర్ద్యం దినత్రయమ్. 269
రుద్ధ్వాతు భూధరే పాచ్యో దినాంతే తం సముద్ధరేత్,
చిత్రకస్య కషాయేణ మర్దయే త్ప్రహరద్వయమ్. 270
మాషమాత్రం ప్రదాతవ్యం హింగుమోషార్ద్రకద్రవైః,
సకర్పూరానుపానంస్యా న్మృతసోత్థాపనేరసే. 271
పీడితం సన్నిపాతేన గతంవాపి యమాలయం,
తత్క్షణా జ్జీవయత్యేష పథ్యం క్షీరైః ప్రయోజయేత్. 272
(గ్రంథాంతరే)

తా. శుద్ధిచేసిన పాదరసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు, శుద్ధిచేసిన మణిశిల, శుద్ధిజేసిన వసనాభి, శుద్ధిజేసిన ఇంగిలీకము, కాంతభస్మము, అభ్రక భస్మము, తామ్రభస్మము, శుద్ధిజేసిన తాళకము *హేమమాక్షికభస్మము - ఇవి దినుస కొక్కొకభాగము. ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి పుల్లప్రబ్బలి, నిమ్మపండ్లు, పుల చింతాకు, వావిలి, హస్తిశుండి-వీనిరసములచే మూడుదినములు మర్దించి బిళ్ళచేసి ఎండించి మూకుళ్ళలో నునిచి చీలమన్ను లేపనము జేసి భూధరయంత్రమున ౧ దినము పాకము జేసి దినాంతమున స్వాంగశీతలమున దీసి చిత్రమూలకషాయముచే ౨ ఝాములు మర్దించి మాషప్రమాణము మాత్రలుజేసి యందొకదానిని సేవింపవలయు. సేవించునెడ హింగు పత్రి, త్రికటుకములు, అల్లము-వీనికల్కములో పచ్చకర్పూరము గలిపి సేవింపవలయు ఇది మృతోత్థాపనరస మనఁబడు. ఇది సన్నిపాతముచే పీడింపఁబడుచుండురోగిని, లేక మృతుఁడైనరోగిని క్షణమాత్రములో సజీవునిగ జేయును. దీనియందు పాలను పథ్యముగ గ్రహింపవలయును.

### సన్నిపాతములకు మృతసంజీవినీరసము

శుద్ధసూతం ద్విభాగంధం ఖల్వే తత్కజ్జలీకృతం,
అభ్రలోహకయోర్భస్మ తామ్రభస్మసమంసమమ్. 273
విషం తాళం వరాటీ చ శిలా హింగుల చిత్రకం,
హస్తిశుండీ చాతివిషా త్ర్యూషణం హేమమాక్షికమ్. 274
చూర్ణం విమర్దయేద్ద్రావై రార్ద్రకస్య దినత్రయం,
నిర్గుండీ విజయాద్రావై స్త్రిదినం మర్దయేత్పునః. 275

1 హేమమాక్షిక మనఁగా—వెండినిమ్మా.

కాచకుప్యాం నివేశ్యాథ వాలుకాయంత్రకే పచేత్,
ద్వియామాంతే సముద్ధృత్య మర్దయేదార్ద్రకద్రవైః. 276
మృతసంజీవినీనామ రసోఽయం శంకరోదితః,
మృతోఽపి సన్నిపాతార్తో జీవత్యేవ న సంశయః. 277
నాతఃపరతరం కించి త్సన్నిపాతహరో రసః, (అన్యశాస్త్రే)

తా. శుద్ధిజేసిన రసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు-ఇటుల వీనిని ఖర్వములో నునిచి కజ్జలివలె మర్దించి అభ్రకభస్మము, లోహభస్మము, తామ్రభస్మము, శుద్ధిజేసిన వసనాభి, శుద్ధిజేసిన తాళకము, గవ్వలభస్మము, శుద్ధిజేసిన మణిశిల, శుద్ధిజేసిన హేమమాక్షికభస్మము - వీనిని దినుసొకటింటికి కొక్కొకభాగము చొప్పున చూర్ణముజేసి కలిపి అల్లపురసముచే 3 దినములు, వావిలిగూకురసముచే 3 దినములు, తక్కోదరసముచే 3 దినములు మర్దించి కాచకుప్పెలోనునిచి వాలుకాయంత్రమున రెండుయామములు వండి సాంగశీతలమున దీసి మరల అల్లపురసముచే మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని అల్లపురసముతో సేవించిన సన్నిపాతముచే పీడితుఁడుగ నుండువాఁడును, మృతిజెందినవాఁడును, నిస్సంశయముగా జీవించును. ఇది శివునిచే వచింపఁబడిన మృతసంజీవినీరసము. సన్నిపాతములను హరింపఁజేయుటయందు దీనికంటె శ్రేష్ఠంబైనయౌషధం బెద్దియులేదు.

## సన్నిపాతాదులకు మృతసంజీవనరసము

హింగూలభాగా శ్చత్వారో జైపాలస్య త్రయోమతాః. 278
ద్వౌభాగౌ టంకణస్యాపి భాగైకమమృతస్య చ,
తత్సర్వం మర్దయేచ్ఛ్లక్ష్ణం శుష్కం యామం భిషగ్వరః. 279
శృంగిబేరాంబునా మర్ద్యం వ్యోషచిత్రకసైంధవైః,
యామద్వయమితస్తాపం హరత్యేష న సంశయః. 280
ఘనసారసారేణ చందనేన విలేపనం,
విదద్యాత్కాంస్యపాత్రేణ వీజయేద్రోగిణం భిషక్. 281
శాల్యన్నం తక్రసహితం భోజయే దిందుసంయుతం,
సన్నిపాతే మహాఘోరే త్రిదోషే విషమజ్వరే. 282
ఆమవాతే వాతగుల్మే శూలే ప్లీహ్ని జలోదరే,
శీతపూర్వే దాహపూర్వే విషమే సంతతజ్వరే. 283

అగ్నిమాంద్యే చ వాతే చ ప్రయోజ్యోఽయం రసోత్తమః,
మృతసంజీవనో నామ విఖ్యాతో రససాగరే. 28

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము ४ భాగములు, నేపాళములు 3 భాగములు, వె
గార్రము ౨ భాగములు, వసనాభి ౧ భాగము-వీనినన్నిటిని సన్నగనూరియెండించి అల్లక
రసముచే ౧ ఝాము మర్దించి త్రికటుకములు, చిత్రమూలను, సైంధవలవణము
వీనిచే ౨ ఝాములు మర్దించి యిప్పించిన తాపము నివర్తించును. పచ్చకర్పూరసహి
ముగా చందనలేపనము, కంచువిసనకఱ్ఱతో విసురుట, మజ్జిగ, సైంధవలవణము, వీ
తోడ శాల్యన్నభోజనము ఈ మొదలగువానిని చేయింపవలయు. దీనిని దారుణమైన
సన్నిపాతము, త్రిదోషజ్వరము, విషమజ్వరము, ఆటువాతము, వాతగుల్మము, శూల
ప్లీహము, జలోదరము, శీతపూర్వజ్వరము, దాహపూర్వజ్వరము, విషమసంతతజ్వరము
అగ్నిమాంద్యము, వాతము-వీనియందు ప్రయోగింపవలయును. ఇది మృతసంజీవన మ
రససాగరమునందు చెప్పఁబడినది.

### సన్నిపాతములకు మహాగంధసూర్యరసము

గంధే శైలశునాంభోభిః మర్దయేద్యామమాత్రకం,
తస్యోదకేన సంయుక్తం నస్యం తత్ప్రతిబోధయేత్. 28
మరిచేన సమాయుక్తం హంతి తంద్రా ప్రలాపకం,

తా. శుద్ధిచేసిన గంధకము, పాదరసము-వీటిని వెల్లుల్లిరసముచే నొకఝాము
మర్దించి వెల్లుల్లిరసముతో కలిపి నస్యముచేయించిన మూర్ఛ నివర్తించును. మిరియాలతో
నొసంగిన తంద్ర, పలవరింత ఇవి నివర్తించును.

### సన్నిపాతములకు సూచికాముఖరసము

రుచకం చాభ్రగంధం చ నేపాళం చ మనశ్శిలా. 286
కర్పరీ మైలతుత్థం చ తాళకం టంకణం తథా,
దరదం సైంధవం చైవ సర్వతుల్యం తు పారదమ్. 287
మధుబీజస్య తైలేన మర్దితం దివసత్రయం,
డోలాయంత్రే పచేద్యామం తన్నీత్వా ఖల్వమధ్యకే. 288
కృష్ణసర్పస్యపిత్తేన భావితం దివసద్వయం,
బ్రహ్మద్వారే తు రేఖైవ క్షతం గుంజా విమర్దితమ్. 289
జంబీరనీరే యుంజీత సన్నిపాతాన్నిహంతి చ,
హిక్కాం మూర్ఛాం చ కంపం చ మూకత్వం బధిరస్య చ. 290

కాసాఘ్నస్తథోర్ధ్వశ్వాసం చ మధువాతం నికృంతనం,
సూచికాముఖనామోఽయం రసః ప్రాణప్రదాయకః. 291

తా. సౌవర్చలవణము, అభ్రకభస్మము, శుద్ధిచేసిన గంధకము, నేపాళములు, మణిశిల, కర్పూరి, మైలుతుత్తము, పాలతుత్తము, తాళకము, వెలిగారము, ఇంగిలీకము, సైంధవలవణము ఇవి సమాంశములు. వీనికి సమము పాదరసము. ఇటుల వీనినన్నిటిని చేర్చి ఇప్పవిత్తులతైలముచే 3 దినములు మర్దించి డోలాయంత్రమున ఒకరుఝాము వండి ఖల్వములో నునిచి నల్లత్రాచుపిత్తాన రెండుదినములు భావనచేసి బ్రహ్మరంధ్రమును గీరి గురిగింజయెత్తును నిమ్మపండ్లరసములో కలిపి ఆగాయమునందు రాయుచుండిన సన్నిపాతములు హరించును. మఱియు ఎక్కిళ్ళు, మూర్ఛ, వణకు, మూగతనము, చెవుడు, కాసము, ఊర్ధ్వశ్వాసము, మధువాతము-వీనినికూడా హరింపఁజేయును. ఇది సూచికాముఖరస మనఁబడును. ఇది ప్రాణులకు ప్రాణమునిచ్చును.

## సన్నిపాతములకు బేతాళరసము

రసం గంధం విషంచైవ మరిచం చ సమాంశకం,
మర్దయేచ్ఛిలయా తావద్యావజ్జాయేత కజ్జలమ్. 292
గుంజాద్వయప్రమాణేన హరేద్ద్వాదశసజ్ఞకం.
సాధ్యాసాధ్యం నిహంత్యాశు సన్నిపాతం సుదారుణమ్. 293
గ్లానేషు లిప్తదేహేషు మోహగ్రస్తేషు దేహిషు,
దాతుమర్హతి బేతాళో యమదూతనివారకః. 294

తా. శుద్ధిచేసిన రసము, గంధకము, నాభి, మిరియాలు-వీటిని సమాంశములుగా గ్రహించి కాటుకవలెనగువఱకు చక్కగా రాతిచే మర్దించి ౨ గురిగింజలప్రమాణము నిప్పించిన సాధ్యాసాధ్యముగ మిగుల దారుణముగనుండు ౧౨ విధములైన సన్నిపాతములు నివర్తించును. బడలిక, శరీరము జారిపోవుట, మోహము కప్పుకొనుట - యీలక్షణములు కలిగియుండునపుడు దీనిని రోగికి ఇప్పింపవలయును. ఇది బేతాళరస మనఁబడును. ఇది యమదూతల నడ్డగించును.

## సన్నిపాతములయందు సూచికాభరణరసము

విషం పలమితం సూతః శాణకశ్చూర్ణయే ద్వయం,
తచ్చూర్ణం సంపుటే కృత్వా కాచలిప్తశరావయోః. 295
ముద్రాం కృత్వాథ సంశోష్య శతశ్చుల్యాం నివేశయేత్,
వహ్నిం శ్నైః శనైః కుర్యాత్ ప్రహరద్వయసంఖ్యయా. 296

తతఉద్ఘాట్య తన్ముద్రా ముపరిస్థశరావకాత్,
సంలగ్నో యోభవేద్ధూమః తం గృహ్ణీయాచ్ఛనైశ్శనైః. 297
వాయుస్పర్శో యథానస్యా తతఃకూప్యాం నివేశయేత్,
యావత్కూప్యాముఖే లగ్నం కూప్యానిర్యాతి భేషజమ్. 298
తావన్మాత్రో రసో దేయో మూర్ఛితే సన్నిపాతిని,
క్షురేణ ప్రచ్ఛితే మూర్ధ్ని తత్రాంగుళ్యా చ ఘర్షయేత్. 299
రక్తభేషజసంపర్కా న్మూర్ఛితోఽపి హి జీవతి,
తథైవ సర్పదష్టోఽపి మృతావస్థోఽపి జీవతి. 300
యదా తాపో భవేత్తస్య మధురం తత్రదీయతే,

తా. శుద్ధిచేసిన విషము ౧ పలము, రసము ౧ శాణము-ఇట్లు వీనిని చక్కగా చూర్ణముచేసి ప్రమిదెపైన ప్రమిద మూసి వానిపై కాచమృత్తికను పూసి యెండించి పొయిమీదనునిచి ౧ర్ఘామలపఱకు మెల్లమెల్లగా నిప్పును జ్వలింపఁజేసి పిదప దానిని గ్రహించి పైన పూసియుండుమట్టిని తీసివేసి పైప్రమిదెలో నంటియుండుపొగను గాలి సంబంధములేకుండా మెల్లగా నెత్తి ఉంచుకొని సూదికొనచే నెత్తిన యెంతవచ్చునో అంతప్రమాణముగల ఔషధమును మూర్ఛతోఁగూడియుండు సన్నిపాతరోగియొక్క శిరమునందు కత్తితోఁగీరి ఔషధము నునిచి వ్రేళ్ళచే రాచవలయును. ఔషధము రక్తముతో సంబంధించినతోడనే దారుణమయిన మూర్ఛను గలుగజేసియుండు సన్నిపాతరోగము తత్క్షణమే నివర్తించును. పాముకాటుచే మరణావస్థ జెందియుండువానికి ఔషధమును పూర్వోక్తప్రకారము ప్రయోగించినవాఁడు తత్క్షణమే జీవించును. శిరమునందు మంట గలిగినతోడనే మధురౌషధమును ప్రయోగింపవలయును.

### సన్నిపాతములకు రసరాజేంద్రరసము

సూతస్యశుద్ధస్యపలం పలంతామ్రమయో రజః. 301
అభ్రం నాగం పలం వంగం పలం గంధక తాళకం,
పలం శుద్ధవిషం చూర్ణం సర్వమేకత్ర కారయేత్. 302
మర్దయే త్కాకమాచ్యాశ్చ పత్రసార రసేన చ,
మత్స్య వారాహ మాయూర ఛాగ మాహిషపిత్తకైః. 303
మర్దయే ద్భిన్నభిన్నం చ త్రికటూరంబుభి స్తథా,
ఆర్ద్రికస్యరసైః పశ్చాత్ శతవారా న్మహుర్ముహుః. 304
సిద్ధోఽయం రసరాజేంద్రో ధన్వంతరి ప్రకాశితః,

గుంజామాత్రం రసం దద్యా త్సురసా రససంయుతమ్. 305
మేఘధారాప్రవాహేన ధారితం వారి మస్తకే,
అనివారో యదా దాహ స్తదా దేయా చ శర్కరా. 306
భోజనం దధిసంయుక్తం వారమేకం తు దాపయేత్,
ఈశ్వరేణ హతః కామః కేశవేన చ దానవః. 307
పావకేన హతం శీతం సన్నిపాతరస స్తథా.

తా. శుద్ధిజేసిన రసము, తామ్రభస్మము, లోహభస్మము, అభ్రకభస్మము, నాగభస్మము, వంగభస్మము, శుద్ధిచేసిన గంధకము, తాళకము, శుద్ధిచేసిన నాభి-ఇవి వినుసుకొక్కొక పలము. వీనినన్నిటిని చూర్ణముచేసి కాకమాచిరసము, మత్స్యములు, పంది, నెమలి, మేక, బట్టె-వీని పిత్తములచే ప్రత్యేకప్రత్యేకముగా నూరి పిదప త్రికటుకషాయముచేతను, అల్లపుస్వరసముచేతను పలుమారు భావనచేయవలయును. ఇది ధన్వంతరిచే జెప్పఁబడిన రసరాజేంద్ర మనఁబడును. దీనిని గురిగింజప్రమాణము తులసీరససహితముగా నిప్పింపవలయును. వానిని వర్షధారలయందు నిలిపియు తాపము శమించకుండిన శర్కరను ఇప్పించవలయును. ఒకపూట పెరుగన్నమును భుజింపఁ జేయవలయును. ఈశ్వరుఁడు మన్మథుని, విష్ణు వసురులను, అగ్ని శీతమును నాశముజేసినటుల నీరసము సన్నిపాతములను నాశముచేయును.

## ద్వితీయ ప్రకరణమ్.



# తృతీయ ప్రకరణము



## కాయదోషమనోదోషమూత్రపరీక్షాక్రమలక్షణాదయః

అవతరణిక. ఇపుడు గ్రంథకర్త గ్రంథమధ్యమమునందు తనకిష్టదేవత యగువీర భద్రునకు నమస్కారాత్మక మంగళమును "దక్షయజ్ఞాపహారం చ" అను శ్లోకముచే జేయుచున్నాఁడు.—

దక్షయజ్ఞాపహారం చ సర్వదేవమదాపహం,
వీరచూడామణిం వీరం వీరభద్రమహం భజే. 1

తాత్పర్యము. దక్షయజ్ఞసంహారకుఁడు, ఇంద్రాది సర్వదేవతలమదమును బోకడచినవాఁడు, శూరాగ్రగణ్యుఁడు, ప్రభాకలితుఁడు నగు వీరభద్రుని నేను భజింపుచున్నాఁడను.

శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజు అని పేరొకనఁబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథమునందు మూడవప్రకరణమును వచింపుచున్నాఁడను.


మనఃకాయదోషలక్షణము

కాయస్య దోషా వాతాద్యా మనసస్తు రజస్తమః,
దోషా ఏవహి సర్వేషాం రోగాణామేవ కారణమ్. 3
*రాగాదయో మనోరోగాః కాయరోగా జ్వరాదయః,
(మాధవనిదానే)

తా. వాతపిత్తశ్లేష్మదోషములు దేహజనితంబులు. రాజసతామసములు మనోజనితంబులు, దేహజనిత వాతపిత్తశ్లేష్మములు, మనోజనిత రజస్తమోగుణములు-ఇవి సర్వప్రాణులకు ద్వివిధరోగములకు కారణభూతంబులు. రాగాదులన మనోరోగంబులు, జ్వరాదులన దేహజరోగంబులు.

---

* దాహాదయో.

### వాతస్థానములు

పక్వాశయ కటి స్సక్థిశ్రోత్రాస్థి స్పర్శనేంద్రియమ్. 4
స్థానం వాతస్య తత్రాపి పక్వాధానం విశేషతః,

తా. పక్వాశయము, పిఱుఁదు, తొడలు, చెవులు, అస్థులు, త్వగింద్రియము - ఇవి వాతమునకు స్థానంబులు. అయినను వాతం బధికముగా పక్వాశయముననే సెలకొనియుండుటం జేసి పక్వాశయమే వాతమునకు ముఖ్యస్థానము.

### పిత్తస్థానములు

నాభి రామాశయ స్స్వేదో లసికా రుధిరం రసః. 5
దృక్స్పర్శనం చ పిత్తస్యం నాభిరత్ర విశేషతః,

తా. బొడ్డు, ఆమాశయము, చెమట, చొంగ, రక్తము, రసధాతువు, శీతోష్ణజ్ఞానసహితనేత్రములు - ఇవి పిత్తమునకు స్థానంబులు. అయినను పిత్తం బధికముగా నాభియందే సెలకొనియుండుటం జేసి నాభియే పిత్తమునకు ముఖ్యస్థానము.

### శ్లేష్మస్థానములు

ఉరః కంఠ శ్శిరః క్లోమాపర్వాణ్యా మాశయాద్రసః. 6
మేదోఘ్రాణం చ జిహ్వా చ కఫస్య సుతరాముర్కః,

తా. హృదయము, కంఠము, శిరము, మెదడు, కీళ్లు, బొడ్డునకుపైననుండు రసము, క్రొవ్వు, నాసికము, నాలుక - ఇవిశ్లేష్మమునకు స్థానంబులు. అయినను శ్లేష్మం బధికముగా హృదయముననే సెలకొనియుండుటం జేసి హృదయమే శ్లేష్మమునకు ముఖ్యస్థానంబు.

### వాతాదిధాతువుల అవస్థావిశేషము

చయోవృద్ధిస్స్వధామ్న్యేవ కోపస్తూన్మార్గ గామితా. 7
శమస్స్వస్థానసమతా తత్రైవాపచయః క్షయః,

తా. వాతపిత్తశ్లేష్మములు తమతమస్థానములయందు వృద్ధిజెందుట చయావస్థ యనియు, వృద్ధిజెందినస్థానము విడనాడి నాడులయందు ఊర్ధ్వముగా నడుచుచుండిన ప్రకోపావస్థ యనియు, తమతమస్థానములయందు సమముగనుండిన శమావస్థ యనియు, తమతమ స్థానములయందు హీనదశను జెందిన క్షయావస్థయనియు జెప్పఁబడును.

### వాతాదిదోషాద్యవస్థాలక్షణము

స్రోతోరోధో బలభ్రంశో గౌరవానిలమూఢతే. 8
ఆలస్యాపక్తి నిష్ఠీవ మలసంగారుచిక్లమాః,

లింగం మలానాం సామాన్యం నిరామాణాం విపర్యయః. 9

తా. నాడీద్వారములు బంధించుట, బలము క్షయించుట, శరీరము బరువుగ నుండుట, వాతము బాగుగా స్ఫురింపకుండుట, ఆలస్యము, అజీర్ణము, కారియుమియుట, మలబద్ధకము, అరుచి, బడలిక-ఇవి దుష్టమైన వాతాదులకు సామాన్యలక్షణములని తెలియవలయు. వాతాదులు నిర్దుష్టంబులుగనుండిన పైలక్షణములు లేకయుండును.

వాతవికారములు

స్రంసతాపవ్యథాస్వాపా స్సాదరుక్తోద భేదనం,
సంగేచ భంగస్సంకోచో వర్త్మాంత స్రావదర్శనమ్. 10
పారుష్యకంపౌ వాతస్య శోషస్పందన వేష్టనం,
స్తంభః కషాయరసతా వర్ణ శ్శ్యామోఽరుణోపి వా. 11

తా. శరీరము సోలుట, మండుట, సూదులచే బొడిచినటులుండుట, నిదుర, శరీర కృశత్వము, శోషాదిరోగములు, వేదన, శరీరము నలియగొట్టినటుల నొచ్చుట, సంభోగమున భంగపడుట, శరీరము సంకోచమును జెందుట, కనురెప్పకొనలు విడివిడియై నీరు గ్రమ్ముట, శరీరమునందు వణకు పరుసదనము, శరీరము ఎండుట, శరీరము కదలుట, శరీరము చుట్టికొనుట, శరీరము స్తంభించుట, నోరు ఒగరుగనుండుట, శరీరము నలుపువర్ణముగనేని ఎఱ్ఱగనేని యుండుట - ఈలక్షణములుగలిగిన వాతవికారములని తెలియవలయును.

పిత్తవికారములు

పిత్తస్య దాహరోగోష్మా భుక్తాశనవిపాకతా,
స్వేదః ఖేదః స్మృతిః క్రోధ శ్శమనం మూర్ఛనం మదః. 12
కటుకామరసో వక్త్రే పాండుర స్త్వచి వర్ణతః,

తా. దాహము, ఉష్ణాధిక్యరోగము, భుజించినయన్నము పక్వముగాకుండుట, చెమట, శరీరమునందు బడలిక, స్మృతి, కడుకోపము, శరీరశైత్యము, మూర్ఛ, మదము నోరు కారముగగాని పుల్లగగాని యుండుట, శరీరము *పాండురవర్ణముగనుండుట - ఈ లక్షణములుగలిగిన పిత్తవికారములని తెలియవలయును.

* తెలుపు పచ్చన గలరంగు.

### శ్లేష్మవికారములు

శ్లేష్మణ స్స్నేహ కాఠిన్య కండూ శీతత్వగౌరవమ్. 13
బంధోపలేప స్తైమిత్య శోఫా పర్షణి నిద్రితం,
వర్ణ శ్శ్వేతో రసస్స్వాదు ర్లవణం చిరకారితా. 14

తా. శరీరము మెఱయుట, కఠినమైయుండుట, దురదగొనుట, శరీరము చల్లగ బరువుగా నుండుట, శరీరము ధాతుసంధులు దృఢమై గట్టిగ నుండుట, శరీరము జిగటగ నిశ్చలముగనుండుట, శరీరము వాచుట, నిదుర, శరీరము తెల్లనైయుండుట, నోరు తీపిగ నేని ఉప్పగనేని యుండుట, మందముగ పనిసేయుట - ఈలక్షణములు గలిగిన శ్లేష్మ వికారములని తెలియవలయును.

### దోషలక్షణముల నెఱుంగునుపాయము

ఇత్యశేషామయవ్యాపి యదుక్తం దోషలక్షణమ్,
దర్శనస్పర్శనప్రశ్నై స్తత్సమ్యగుపలక్షయేత్, 15

తా. పైఁజెప్పఁబడిన క్రమప్రకారము సకలరోగవ్యాపక దోషలక్షణములను దర్శన స్పర్శన ప్రశ్నలచే నెఱుంగందగును.

### ఋతుభేదమువలన వాతాదులకు అవస్థావిశేషము

చయప్రకోపప్రశమా వాయోర్గ్రీష్మాదిషు త్రిషు,
వర్షాదిషు చ పిత్తస్య శ్లేష్మణ శ్శిశిరాదిషు. 16

తా. గ్రీష్మముమొదలు మూఁడుఋతువులయందు వాతమునకు క్రమముగా చయ ప్రకోప శమనావస్థలు గలుగు. వర్షఋతువుమొదలు మూఁడుఋతువులయందు పిత్తమునకు క్రమముగా చయ, ప్రకోప, శమనావస్థలు గలుగు. శిశిరఋతువుమొదలు మూఁడు ఋతువులయందు శ్లేష్మమునకు క్రమముగా చయ, ప్రకోప, శమనావస్థలు గలుగు.

### శరీరజరోగముల కౌషధభేదవివరణము

శోధనం శమనంచేతి సమాసాదౌషధం ద్విధా,
శశీరజానాం రోగాణాం క్రమేణ పరమౌషధమ్. 17

తా. సర్వరోగములకు ఔషధము, శోధనము, శమనము అని ద్వివిధంబులు. అందు శరీరజనితరోగములకు ఈరెండును క్రమముగా పరమౌషధంబులు.

వస్తి ర్విరేకో వమనం తథా తైలం ఘృతం మధు,

తా. [1]వస్తి, [2]విరేచనము, [3]వమనోపయుక్తఔషధములు, శోధనౌషధంబులు. నూనె, నెయ్యి, తేనె-ఇవి శమనౌషధంబులు. ఈరెంటిని శరీరజనిత రోగములయందు ఉపయోగింపవలయును. (మనోజనిత రోగములయందు బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు ధైర్యము నవలంబించి రోగియొక్క యభిప్రాయము నెఱిఁగి తదనుగుణముగా చికిత్స చేయవలయు.)

వాతాదిదోషచికిత్సాభేదవివరణము

ద్విధాచోపక్రమస్తేషాం తర్పణం చాపతర్పణమ్. 18
బృంహణం లంఘనంచేతి తత్పర్యాయముదాహృతం,

తా. వాతపిత్తశ్లేష్మరోగములయందు ద్వివిధచికిత్సలఁ జేయవలయును. ఎట్లన్న తర్పణము, అపతర్పణము అను రెండుక్రియలను, [4]బృంహణము, లంఘనము అను నీరెండు క్రియలను క్రమముగా జేయవలయును.

బృంహణం యద్బృహత్వాయ లంఘనం లాఘవాయ చ. 19
బృంహణం లంఘనం చైవ వాయోః పిత్త కఫస్య చ,

తా. పుష్టికొఱకు బృంహణక్రియను, లఘువుకొఱకు లంఘనక్రియ్యను జేయించవలయు. మఱియు వాతపిత్తశ్లేష్మములయందు బృంహణలంఘనముల జేయించవలయును.

---

1 వస్తి యనఁగా—చిమ్మనగొట్టములో తైలాదిరూపౌషధముల నాకర్షించుటకై దానిమధ్యమభాగమున బంధింపఁబడి అధోభాగమునందు కర్ణికాకారముగా, అందాకర్షింపఁబడిన తైలాదుల వెలిపఱచుటకై అగ్రభాగమునందు గుండ్రముగా నిర్మింపఁబడి చిమ్మనగ్రోవిలో బంధింపఁబడియుండుదండమే వస్తియనఁబడును. ఆవస్తికర్మ అనువాసనము, నిరూహము అని ద్వివిధంబులు. అందు ఘృతతైలాది స్నేహములను చిమ్మనగ్రోవితో గొట్టుట అనువాసనవస్తికర్మ యనియు, కషాయము పాలు తైలము వీనిని చిమ్మనగ్రోవితో కొట్టుట సిరూహవస్తి యనియు జెప్పఁబడును.

2 పక్వాపక్వంబులుగనుండు నన్నాదుల పచనముజేసి వెలిపఱచెడి తెల్లతెగడ మొదలగునవి విరేచనౌషధ మనఁబడును.

3 అపక్వరూపముగనుండు పిత్తశ్లేష్మముల హృదయమున నడ్డగించి వానియందలి దోషసంబంధమైన జలాదుల ఊర్ధ్వముఖముగా వెలిపఱచెడి మ్రంగకాయ మొదలగునవి వమనౌషధ మనఁబడును.

4 బృంహణమన—శరీరమునకు ఔషధాదులచే పుష్టిని గలుగజేయుట.

### లంఘనభేదము

శోధనం శమనంచేతి లంఘనం ద్వివిధం భవేత్. 20
ఔదరం యద్బహిర్దోష శ్శోధనం తచ్చ పంచధా,

తా. లంఘనము శోధనము, శమనము అని ద్వివిధంబులు. అందు అంతర్గతబాహ్యాగతదోషములకు శోధనము ఏదువిధంబులు.

### దోషభేదముచే రోగభేదములు

ఏకైకేనైవ చ దోషేణ త్రయో ద్వాభ్యామపి త్రయః. 21
త్రిదోషైరపి చైకస్స్యా దేవం సప్తవిధో గదః,

తా. సర్వరోగములు ఏకదోషజనితము, ద్విదోషజనితము, త్రిదోషజనితము అని ఏడువిధంబులు. అందు వాతము, పిత్తము, శ్లేష్మము-వీనివలన ప్రత్యేకముగా జనించినవి ఏకదోషజనితంబులు. వాతశ్లేష్మము, వాతపైత్యము, పిత్తశ్లేష్మము-వీనివలన జనించినవి ద్వంద్వదోషజనితంబులు. వాతపిత్తశ్లేష్మములవలన జనించినవి త్రిదోషజనితలంబులు.

### సర్వరోగసాధ్యాసాధ్యవివరణము

ప్రయోగశ్శమయేద్వ్యాధి మన్యామయముదీరయేత్. 22
నాసావశుద్ధశ్శుద్ధస్తు శమయేన్న సమీరయేత్, (నిత్యనాథీయే)

తా. ఔషధప్రయోగముచే శుద్ధరోగములు (అనఁగా ఏకదోషజనితరోగములు) హరించును. మఱియు అశుద్ధరోగములయందు (అనఁగా ద్వంద్వరోగములయందు త్రిదోషజనితరోగములయందు) ఔషధము బ్రయోగించిన నితరరోగములు జనించును. అట్లగుటంజేసి శుద్ధరోగములకే చికిత్స జేయవలయును. అశుద్ధరోగములు కుదురుట దుర్లభం బగుటచే చికిత్స జేయంజనదు.

### మూత్రపరీక్షాక్రమతత్సాధ్యలక్షణములు

గృహీత్వా రోగిణో మూత్రం సూర్యాతాపే నిధాపయేత్. 23
తస్య మధ్యే క్షిపే త్తైలం తన్మూత్రం చ పరీక్షయేత్,
యదా వికాస మాప్నోతి తదా సాధ్యం భవిష్యతి. 24
బిందురూపేణ మధ్యస్థ మసాధ్యం తైలమాదిశేత్,

(సిద్ధవిద్యాభూః.)

తా. రోగియొక్క మూత్రమును కుండపెంకులోబట్టి ఎండలోనునిచి దాని మధ్యమున నూనెబొట్టువైచి పరీక్షించిన వికసించెనేని రోగము సాధ్య మనియు, వికసించక బిందురూపముగనుండిన రోగం బసాధ్యంబనియు తెలియవలయును.

తైలబిందు ర్యదా మూత్రే వికాసం కురుతే స్వయమ్. 25
స్వరూపం తస్య వక్ష్యామి శుభాశుభవినిర్ణయం,
తైలబిందు ర్యదా మూత్రే మత్స్యాకారం భవే ద్ధ్రువమ్. 26
నిర్దోషం చ తదా నూనం మోక్షణం చైవ కారయేత్,

తా. పైఁజెప్పఁబడిన క్రమప్రకారము మూత్రమునందువైచిన తైలబిందువు వికసించుటచే జెందునట్టిభేదముల, వానిశుభాశుభముల వచించెద. ఆతైలబిందువు మత్స్యాకారమును జెందిన రోగము నిశ్చయముగ సాధ్య మని యెఱింగి చికిత్సింపవలయును.

సర్వదా సకలే పాత్రే ప్రాసాదం గజచామరమ్. 27
ఛత్రం చ తోరణాకారం తైలబిందుశుభప్రదం,
(మాధవనిదానే)

తా. పైప్రకారము రోగి మూత్రములోఁ వేయఁబడిన తైలబిందువు మూత్రమంతట వికసించినను, లేక మేడ, ఏనుగు, వింజామరము, గొడుగు, తోరణము - దేని యొక్క రూపము నేని జెందినను, రోగము నిశ్చయముగా సాధ్య మని తెలియవలయును.

ప్రాత రుత్థాయ మతిమాన్ మూత్రం పశ్యేన్నిరంతరమ్. 28
మృణ్మయే తైలజే స్వచ్ఛే పాత్రే దృష్ట్వా శుభాశుభం,
తన్మధ్యే నిక్షిపే త్తైలం యథాసాధ్యం విచారయేత్. 29
(మాధవకల్పే)

తా. బుద్ధిమంతుఁ డగువైద్యుఁడు రోగిమూత్రమును పరీక్షించవలయు నని నిశ్చయించునపుడెల్ల వానిని ప్రాతఃకాలమున మేలుకొలిపి స్వచ్ఛమై తైలసంబంధము లేకుండెడి మట్టిపాత్రయందు మూత్రమును విసర్జించునటులచేసి దానిమధ్యమున నొక తైలబిందువువైచి రోగసాధ్యాసాధ్యంబుల బరీక్షింపవలయును. ఎట్లన్న:—

బిందురూపేణ మధ్యస్థం తైలంచేత్కృచ్ఛ్రసాధ్యతాం,
వికాసతే యదా తైలం సుఖసాధ్యం సమాదిశేత్. 30
(గ్రంథాంతరే)

తా. పైక్రమప్రకారము మూత్రమునందు వేయఁబడినతైలము బిందురూపముగ నుండిన రోగము కష్టసాధ్య మనియు, వికసించిన సుఖసాధ్య మనియు తెలియవలయు.

ఛత్రపర్వతవృక్షాణాం ప్రాసాదోష్ట్ర గజస్య చ,
రూపైస్సమాని సాధ్యం స్యాత్తైలబిందుః ప్రకాశతే. 31
(గ్రంథాంతరే

తా. మూత్రమునందు వేయఁబడిన తైలము గొడుగు, పర్వతము, వృక్షము, మేడ, లొట్టిపిట, ఏనుగు-వీనిలో దేనియొక్క రూపము నేని జెందినరోగము సాధ్య మని తెలియ వలయును.

వల్లీ మృదంగ మనుజ భాండ చక్ర మృగాదిభిః,
సమో వికాసతే బిందుః కృచ్ఛ్రసాధ్యం సమాదిశేత్. 32
(ఆయుర్వేదే)

తా. మూత్రస్థతైలబిందువు తీఁగె, మద్దెల, నరాకారము, భాండాకారము, చక్రాకారము, సింహము మొదలగువానిలో దేనియాకారము గలదిగ నేని వికసించిన రోగము కష్టసాధ్య మని తెలియవలయును.

ప్రాతరగ్రభవాం ధారాం త్యక్త్వా మూత్రస్య రోగిణః,
తత్ర తైలలవం క్షిప్త్వా సాధ్యాసాధ్యం విచారయేత్. (శారీరే)

తా. ప్రాతఃకాలమునందు రోగియొక్క మూత్రప్రథమధారను వర్జించి మధ్య ధారను గ్రహించి ఎండలోనునిచి తైలబిందువునువైచి రోగసాధ్యాసాధ్యముల బరీక్షింప వలయును.

భద్రపీఠ పృథు దర్పణ ఛత్రం పద్మ శంఖసహ చామర వీణాః,
కుండలాకృతి భవేద్యది తైలం యస్యమూత్రపతితం సతుసాధ్యః.

తా. మూత్రమునందువేసిన తైలబిందువు భద్రపీఠము, అటుకులు, అద్దము, గొడుగు, పద్మము, శంఖము, చామరము, వీణ, కుండలము-వీనిలో దేనియొక్క రూపము గలదిగ నేని గనుపట్టిన రోగము సాధ్యమని తెలియవలయును.

## అసాధ్యమూత్రపరీక్ష

చతుష్పాదం త్రిపాదం చ ద్విపదం చైవ దృశ్యతే,
ఏకపాదం యదా బిందు ర్మృత్యుదః కథితో బుధైః. 35
నరశ్శిరో విహీనస్తు గాత్రం స్తంభసమాకృతిః,
ఏతద్రూపవిభేదాచ్చ ధ్రువం మృత్యుః ప్రజాయతే 36
(నిత్యనాథీయే)

తా. మూత్రమునందువేసిన తైలబిందువు నాలుగుఖండములుగ నేని, మూడు ఖండములుగ నేని, రెండుఖండిములుగ నేని, ఒకఖండముగ నేని గనుపించిన రోగి మృతి జెందునని బుధులు వచించెదరు. మఱియు నా తైలబిందువు శిరోవిహీననరాకారముగ నేని,

శరీరాకారముగనేని, స్తంభాకారముగనేని గన్పించిన రోగి మృతిజెందు నని తెలియ వలయును.

శస్త్ర ఖడ్గ ధనుశ్చైవ త్రిశూలం ముసలాయుధమ్,
లగుడాకృతికం తైలం తత్క్షణం వా గతాయుషమ్. 37
(మాధవనిదానే)

తా. మూత్రస్థతైలబిందువు శస్త్రము, ఖడ్గము, విల్లు, త్రిశూలము, రోఁకలి, *భిండివాలము-వీనిలో దేనియొక్క రూపము గలదిగనేని గన్పట్టిన రోగి తత్క్షణమున మృతిజెందు నని తెలియవలయును.

సృగాల సర్ప మార్జాల ఖడ్గ బాణ ల్లులాయవత్,
వ్యాఘ్రి మర్కట సింహానాం సాదృశ్యాన్మృత్యుమాప్నుయాత్ .38
(మాధవకల్పే)

తా. మూత్రస్థతైలబిందువు నక్క, పాము, పిల్లి, ఖడ్గము, బాణము, ఎనుబోతు, పులి, సింహము, వానరము-వీనిలో దేనియొక్క రూపము గలదిగనేని గన్పట్టిన రోగి కాలాంతకునికడ కేగు నని తెలియవలయును.

సర్ప వానర బిడాల మూషికా సూకరాకృతి భవేద్యది చిహ్నం,
వృశ్చికాకృతి భవేదథ స్తదా యస్య మూత్రపతితం స గతాయుః. 39
(మతాంతరే)

తా. మూత్రస్థతైలబిందువు సర్పము, వానరము, పిల్లి, ఎలుక, పంది, తేలు - వీనిలో దేనియొక్క రూపము గలదిగనేని గన్పట్టినను, లేక లోన మునిఁగినను, రోగి యొక్క ఆయువు క్షయించిన దని తెలియవలయును.

పక్షీ కూర్మో వృష స్సింహ స్సూకర స్సర్ప వానరా,
బిడాలో వృశ్చికశ్చైవ ఛిద్రత్వేపి తథైవ చ. 40
నిమజ్జనాత్తైలబిందో స్తదా మృత్యుర్ధ్రువం భవేత్,
(ఆయుర్వేదే)

తా. మూత్రస్థతైలబిందువు పక్షి, తాఁబేలు, ఆఁబోతు, సింహము, పంది, సర్పము, వానరము, మార్జాలము, తేలు-వీనిలో దేనియొక్క రూపము గలదిగనేని, ఛిద్రరూపములు గలదిగనేని గన్పట్టినను, లేక లోన మునింగినను రోగి నిశ్చయముగా మరణము జెందునని తెలియవలయును.

---

* భిండివాల మన—ఇనుప అలుగు కఱ్ఱసాగు.

నాగవల్లీదళం కుంభసన్నిభం హస్తి వాలకైః. 41
వృష వానర మండూకం మూత్రం పశ్యేన్న జీవతి,
(మాధవనిదానే)

తా. మూత్రస్థతైలబిందువు తమలపాకు, కుండ, ఏనుగు, తోఁక, ఆఁబోతు, వానరము, కప్ప-వీనిలో దేనియొక్క-రూపము గలదిగనేని గన్పట్టిన రోగి బ్రతుకఁడని తెలియవలయును.

తైలబిందుర్యదా మూత్రే చాల నీలేంద్రగోపకమ్. 42
ప్రేతలోకస్య గమనం ధ్రువం జ్ఞేయం చికిత్సకైః, (గ్రంథాంతరే)

తా. మూత్రస్థతైలబిందువు జల్లెడవలె, ఇంద్రగోపపురుగులవలె నుండిన రోగి ప్రేతలోకమున కేగునని వైద్యుఁ డెఱుంగవలయును.

### దీర్ఘరోగియొక్క- మూత్రపరీక్షాక్రమము

ప్రవృద్ధరోగిణాం వైద్యో మూత్రోత్సర్గం తు కారయేత్. 43
భాస్కరోదయవేళాయాం ప్రకాశే స్థాపయేద్ధ్రువం,
లోడయిత్వా చ తత్సమ్యక్తతోమూత్రం పరీక్షయేత్. 44
శ్వేతకాచమయే పాత్రే ధృత్వా మూత్రం పరీక్షయేత్,
తృణేన తిలతైలస్య బిందుమాత్రం క్షిపేత్తదా. 45
వాతేన మండలం యాతి పిత్తతో బుద్బుదాయతే,
కఫేన బిందుమాయాతి త్రిదోషే తు నిమజ్జతి. 46

తా. నిర్మలమై తెల్లగనుండు గాజుపాత్రయందు దీర్ఘరోగము గలవానిని వైద్యుఁడు మూత్రోత్సర్జనము జేయించి ఆమూత్రమును సూర్యోదయమున ఎండయందునిచి బాగుగా కలియఁబెట్టి అందొకతృణముచే నూనెబిందువునువేసి రోగమును పరీక్షించవలయును. పరీక్షించునపుడు మూత్రస్థబిందువు మండలాకారమును జెందిన వాతరోగమనియు, బుద్బుదాకారమును జెందిన పిత్తరోగమనియు, చిన్నచిన్నబిందువులయొక్క- యాకారమునుజెందిన కఫరోగమనియు, లోన మునిఁగిన త్రిదోషమనియు తెలియవలయును.

### రోగవిశేషముల మూత్రలక్షణము

అధోబహుళమారక్తం మూత్రమాలోక్యతే యదా,

వదంతి తదతీసారలింగం వై లింగవేదినః. 47
జలోదరసముద్భూతం మూత్రం ఘృతకణోపమం,
ఆమవాతే వసాతుల్యం తక్రతుల్యం తు జాయతే. 48
వాతజ్వర సముద్భూతం మూత్రం కుంకుమపింజరం,
మలేన పీతవర్ణం చ బహుళం చ ప్రజాయతే. (గ్రంథాంతరే) 49

తా. పాత్రయందలి మూత్రము అధోభాగమునందు మిగుల రక్తవర్ణముగల దిగ నుండిన అతిసారరోగమనియు, నేతికణములవలెనుండిన జలోదర మనియు, వసతో సమానంబుగ నేని, మజ్జిగతో సమానంబుగ నేని నుండిన ఆమవాతరోగమనియు, కుంకుమ వలె నెఱ్ఱగ నేని, ఎఱుపధికముగాఁగల పచ్చరంగు గలదిగ నేని, మలయుక్తమై పీతవర్ణము గలదిగ నేని యుండి అధికముగా వెడలుచుండిన వాతజ్వర మనియు తెలియవలయును.

పీత స్వచ్ఛం చ జాయేత మూత్రం పిత్తోదయే సతి,
సమధాతౌ పునః కూపజలతుల్యం ప్రజాయతే. 50
మూత్రం చ కృష్ణతాం యాతి క్షయరోగాకులస్య చ,
క్షయరోగో భవేద్యస్య త మసాధ్యం వినిర్దిశేత్. 51
ఊర్ధ్వం పీతమధోరక్తం మూత్రం వైద్యవరస్తదా,
పిత్తప్రకృతిసంభూత సన్నిపాతస్య లక్షయేత్. 52
యస్యేక్షురస సంకాశం మూత్రం నేత్రే చ పింజరే,
రసాధిక్యం విజానీయా న్నిర్దిశేత్తస్య లంఘనమ్. 53
పీతం చ బహుళం చైవ హ్యామవాతాత్ప్రజాయతే,
రక్తం స్వచ్ఛం చ యన్మూత్రం తజ్జ్వరాధిక్యలక్షణమ్. 54
ధూమ్రవర్ణం యదామూత్రం జ్వరాధిక్యం వదేత్తదా,
కృష్ణమచ్ఛం చ జానీయా త్సన్నిపాతజ్వరోద్భవమ్. 55
(గ్రంథాంతరే)

తా. మూత్రము పసుపువర్ణముగలదిగ, స్వచ్ఛముగ నుండిన పిత్తజ్వరమనియు, కూపజలతుల్యముగనుండిన సమధాతువనియు, కృష్ణవర్ణంబుగనుండిన క్షయరోగమనియు తెలియవలయును. అట్టిక్షయరోగము అసాధ్యము. మఱియు నాపాత్రలోనిమూత్రము పైభాగమునందు పీతవర్ణము గలదిగ, అధోభాగమునందు రక్తవర్ణము గలదిగ నుండిన పిత్తప్రకృతిసంభూతసన్నిపాతరోగ మనియు తెలియవలయును. మఱియు మూత్రము

చెఱకుగసతుల్యంబుగ, నేత్రములు ఎఱుపధికముగాగల పచ్చరంగుగలదిగ నుండిన రసాధిక్యరోగమని యెఱింగి లంఘనము వేయవలయును. మఱియు మూత్రము పచ్చవర్ణము గలదై అధికముగా వెడలుచుండిన ఆమవాతరోగమనియు, తేటకలదై రక్తవర్ణముగ నేని ధూమ్రవర్ణముగనేని యుండిన జ్వరాధిక్యమనియు, నిర్మలమై కృష్ణవర్ణముగ నుండిన సన్నిపాతజ్వర మనియు తెలియవలయును.

## వాతాదిరోగమూత్రలక్షణము

కఫే స్వచ్ఛతరం శీతం ఫేనబుద్బుదసంయుతం,
ఘృతోదకసమం వాతే మిశ్రైర్మిశ్రగుణం భవేత్. 56
(సిద్ధవిద్యాభూః)

తా. శ్లేష్మరోగియొక్క మూత్రము నిర్మలముగ శీతలముగ, పిత్తరోగియొక్క మూత్రము నురుగు బుగ్గలు వీనితో గూడినదిగ, వాతరోగియొక్కమూత్రము ఘృతము ఉదకము వీనితో తుల్యముగ, ద్వంద్వరోగియొక్కమూత్రము మిశ్రలక్షణములు గలదిగ నుండును.

వాయోశ్చ పాండురం మూత్రం రక్తవర్ణం చ పైత్తకే,
అథవా పీతవర్ణం చ కామిలాయాం తథైవ చ. 57
శ్వేతవర్ణం కఫానాం చ మిశ్రితం ద్వంద్వజం భవేత్,

తా. వాతరోగియొక్క మూత్రము పాండువర్ణముగ, పిత్తరోగియొక్క మూత్రము రక్తముగ, లేక పీతవర్ణముగ, కామిలారోగియొక్కమూత్రము పచ్చగ, శ్లేష్మరోగియొక్క మూత్రము తెల్లగ, ద్వంద్వరోగియొక్క మూత్రము మిశ్రవర్ణముగ నుండుసు.

## దీర్ఘరోగిమూత్రలక్షణము

రక్తధారా దీర్ఘరోగే కృష్ణా తు మరణాంతికే. 58
సౌవీరస్య సమం మూత్రం మాతులుంగ సమప్రభం,
తైలతుల్యం భవేన్మూత్రం నిత్యం సహజపిత్తజమ్. (సిద్ధరసార్ణవే)

తా. మూత్రము రక్తవర్ణముగనుండిన దీర్ఘరోగమనియు, నలుపువర్ణముగనుండిన మరణము జెందుననియు, సౌవీరతుల్యముగనేని మాతులుంగరసతుల్యముగనేని తైలతుల్యముగనేని యుండిన పైత్యరోగమనియు తెలియవలయును.

## ప్రకారాంతర అసాధ్యమూత్రలక్షణము

అతిరక్తం మేహరోగే జ్వరే హారిద్రవర్ణకం,

జ్వరే వా మేహరోగే వా హ్యసాధ్యం బహుమూత్రకమ్. 60

(నిత్యనాథీయే)

తా. మూత్రము కడురక్తవర్ణముగ వెడలిన మేహరోగం బనియు, పచ్చగవెడలిన జ్వరరోగం బనియు, జ్వరమునందేని మేహరోగమునందేని బహుమూత్రము గలిగిన రోగి మృతిజెందుననియు తెలియవలయును.

యస్య మూత్రం ప్రవేత్తైలం మధుమద్యం ప్రవేత్తదా,
యమేన క్రియతే శీఘ్రం పాలితః పశుపాలకః. 61

తా. ఏరోగియొక్క మూత్రము తైలము, తేనె, కల్లువలె వెడలెడినో అట్టిరోగి కడు శీఘ్రముగా మరణము జెందును.

తృతీయప్రకరణమ్.

# చతుర్థప్రకరణే

## క్షయరోగనిదానలక్షణచికిత్సాదయః

అవతరణిక. ఇపుడు గ్రంథకర్త విఘ్నబాహుళ్యశంక గలవాఁడై తనచే జేయంబడు నీగ్రంథము నిర్విఘ్నముగ పరిసమాప్తి జెందునిమిత్తము గ్రంథమధ్యమమున తన కిష్టదేవతయగు పరమేశ్వరనమస్కారాత్మక మంగళమును "బ్రహ్మావిష్ణుసురాధీశ" అను శ్లోకముచే జేయుచున్నాఁడు.—

బ్రహ్మావిష్ణుసురాధీశసేవ్యపాదసరోరుహం,
పరాత్పరతరం దేవం నీలకంఠమహం భజే. 1

తా॥ చతుర్ముఖుఁడు, విష్ణువు, దేవేంద్రుఁడు అనువారలచే సేవింపఁబడునట్టి పాదపద్మములుగలవాఁడును, హిరణ్యగర్భునకంటె పరుఁడును, స్వయంప్రకాశస్వరూపుఁడునగు పరమేశ్వరుని నేను భజింపుచున్నాఁడను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా॥ నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజు అని పేర్కొనఁబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీ గ్రంథమునందు నాలుగవప్రకరణమును వచింపుచున్నాఁడను.

### క్షయరోగోత్పత్తికారణము

రసరక్తగతం మాంస మజ్జాగోఽస్థిగతో జ్వరః,
ఏతన్మధ్యేత్వపథ్యాని ధాతుగస్తు తదోచ్యతే. 3
ధాతుగశ్చేత్వపథ్యాని కురుతే తత్క్షయో భవేత్,

(ఆయుర్వేదే)

తా॥ రసగత, రక్తగత, మాంసగత, మజ్జాగత, అస్థిగత జ్వరములు జనించిన నట్టితరి నపథ్యంబులుసేసిన నవి ధాతుగతంబు లగును. ధాతుగతంబున నపథ్యంబులు సేసిన క్షయరోగము జనించు. (ఆక్షయరోగము రసగత, రక్తగత, మాంసగత, మజ్జాగత, అస్థిగతములన నైదువిధంబులు. అందు శరీరాశ్రితరసము క్షయించుచుండిన రసగత

క్షయమనియు, రక్తము క్షయించుచుండిన రక్తగతక్షయమనియు, మాంసము క్షయించు చుండిన మాంసగతక్షయ మనియు, మజ్జ క్షయించుచుండిన మజ్జాగతక్షయమనియు, అస్థులు క్షయించుచుండిన అస్థిగతక్షయమనియు తెలియవలయును.)

క్షయరోగకారణీభూతపాపములు

స్త్రీహత్యా గురుహత్యాభ్యాం తథైవ బ్రహ్మహత్యయా. 4
సజ్జనానాం విరోధేన రాజయక్ష్మా ప్రజాయతే, (కర్మవిపాకే)

తా. స్త్రీహత్య, గురుహత్య, బ్రహ్మహత్య, సజ్జనవిరోధము అనువానివలన పదకొండుక్షయరోగములు జనించునని కర్మవిపాక మను గ్రంథమున జెప్పఁబడి యున్నయది.

క్షయరోగస్వరూపము

అనేకరోగానుగతో బహురోగపురోగమః. 5
రాజయక్ష్మా క్షయశ్శోషో రోగరాజ ఇతి స్మృతః,

తా. అనేకరోగంబులతోఁగూడి తనకు ముం దనేకరోగంబులు గలదై సకల రోగంబులకు ప్రభువై యుండునదియే 1 రాజయక్ష్మయని, 2 క్షయమని, 3 శోషయని చెప్పఁబడును.

క్షయరోగపరివారము

క్షయరోగే జ్వరో రాజా తస్య పత్నీ తు కామిలా. 9
చమూపతిః పాండురోగో రక్తపిత్తం తు పుత్రకః,
సఖ్యౌ శోఫాతిసారౌ చ మంత్రిణౌ శ్వాసకాసకౌ. 7
గూఢచారౌ వాతపిత్తే వాజినౌ వాంతికారుచి,
గ్రహణ్యర్శో గుల్మశూలా గాయకా స్తూర్యవాదకాః. 8
అనేకరోగానుగతో బహుర్రోగపురస్సరః,
ఏవంవిధప్రకారేణ క్షయో భవతి రోగరాట్. 9
అసాధ్యోఽయం మహారోగో సహస్రదివసావధి, (ఆయుర్వేదే)

తా. జ్వరము రాజుగ, ఆరాజుకు కామిలారోగము భార్యగ, పాండురోగము

1 సర్వరోగములకు రాజుగనుండుటవలన రాజయక్ష్మ యనంబడును. 2 శరీరము నందలి జాఠరాగ్నియొక్క సర్వక్రియల క్షయింపంజేయుటవలన క్షయ మనంబడును. 3 రసము, రక్తము, మాంసము, మేదస్సు, మజ్జ, అస్థి, శుక్రము అను సప్తధాతువుల శోషింపంజేయుటవలన శోష యనంబడును.

సేనాధిపతిగ, రక్తపిత్తము పుత్రుఁడుగ, శోఫాతిసారములు స్నేహితులుగ, శ్వాసకాసలు మంత్రులుగ, వాతపిత్తములు గూఢచారులుగ, వాంత్యరుచులు అశ్వములుగ, గ్రహణ్యర్శస్సులు గుల్మశూలలు గాయకులుగ, వాద్యములు వాయించువారుగ గలదై అనేకరోగములతోఁగూడి తనకు ముం దనేకరోగంబులు గలదై రోగాధిపతియై యుండునదియే క్షయరోగమని తెలియవలయును. ఇది అసాధ్యము. అట్లగుటం జేసి దీనికి వెయ్యి దినములు ప్రమాణము.

ప్రకారాంతరక్షయరోగోత్పత్తికారణము

వేగరోధాత్క్షయాచ్చైవ సాహసాద్విషమాశనాత్. 10
త్రిదోషో జాయతే యక్ష్మా గదో హేతు చతుష్టయాత్,
(సిద్ధవిద్యాభూః)

తా. వాతమూత్రపురీషాదివేగము నడ్డగించుట, అతిమైథునము, ఉపవాసము, అసూయ, దుఃఖము ఈమొదలగువానివలన ధాతువులు క్షయించుట, బలిష్ఠమై యుద్ధాదులచే క్షోభగలుగుట, నానావిధాన్నపానముల విషమముగ భుజించుట ఈనాలుగు కారణములవలన త్రిదోషములు ప్రకోపించి ఒక యక్ష్మరోగమును జనింపఁజేయును. (పైఁజెప్పిన వేగరోధాది నాలుగుకారణములవలన వాతము ప్రకోపించును. దానివలన అగ్నిదుష్టంబై పిత్తశ్లేష్మముల బ్రకోపింపఁజేయును. మఱియు పైఁజెప్పఁబడిన వేగరోధాది నాలుగుహేతువులమధ్యములో అసంఖ్యాతీతమైన హేతువులు అంతర్భావమును జెంది యుండును.

కఫప్రధానైర్దోషైస్తు రుద్ధేషు రసవర్త్మసు.
అతివ్యవాయినో వాపి క్షీణే రేతస్యనంతరాః 11
క్షీయంతే ధాతవస్సర్వే పతశ్శుష్యతి మానవః. 12

తా. కఫమే ముఖ్యముగగల వాతాదిదోషములు రసవాహినులగు ధమనుల నడ్డగించుటవలన రసము హృదయమునుజెంది యచ్చటనే దుష్టంబై నోటిమార్గముగ బైలు వెడలును. అందుచే రసధాతువు, రసధాతువువలన రక్తము, రక్తధాతువువలన మాంసము, మాంసధాతువువలన మేదస్సు, మేదోధాతువువలన మజ్జ, మజ్జాధాతువువలన అస్థులు, అస్థులవలన శుక్రము క్రమముగ క్షయించి అనులోమక్షయమును గలుగఁజేయును. మఱియు అతిమైథునమువలన పురుషునికి శుక్రము, శుక్రమువలన అస్థులు, అస్థులవలన మజ్జ, మజ్జవలన మేదస్సు, మేదస్సువలన మాంసము, మాంసమువలన రక్తము, రక్తమువలన రసము క్షయించి ప్రతిలోమక్షయమును గలుగఁజేయును. పిదప నరుఁడు శుష్కించును. కార్యభూతమగునశుక్రము క్షయించుటవలన కారణీభూతములైన మజ్జాదిధాతువులును

క్షయించును. ఎట్లనఁగా:—కాలిన ఇనుపగుండును తడిభూమియందునుచుటచే దానికి చుట్టునుండుతడిని యది శోషింపఁజేయుచందంబున శుక్రము క్షయించుటవలన వాతము ప్రకోపించి సమీపముననుండు మజ్జాదిధాతువుల శోషింపఁజేయును.

క్షయరోగ రూపములు

భక్తద్వేషో జ్వర శ్శ్వాసః కాస శ్శోణితదర్శనం,
స్వరభేదశ్చ జాయేత షడ్రూపం రాజయక్ష్మణి. 13

తా. అన్నద్వేషము, జ్వరము, దగ్గు, దిబ్బసము, నెత్తురుగ్రక్కుట, స్వరభేదము అన నీయాఱును రాజయక్ష్మరూపంబులు.

రాజయక్ష్మలక్షణము

అంసపార్శ్వాభితాపశ్చ సంతాపః కరపాదయోః,
*సత్త్వహానిశ్చ దౌర్బల్యం రాజయక్ష్మణి లక్షణమ్. 14
(సిద్ధవిద్యాభూః)

తా. భుజశిరఃపార్శ్వములు సంతాపముగలుగుట, చేతులు కాళ్ళు మండుట, సత్త్వము క్షయించుట, దౌర్బల్యము గలుగుట ఈలక్షణములు గలది రాజయక్ష్మయని తెలియవలయును.

అగ్నిమాంద్య బలహీనతా జ్వరా శ్శ్వాసకాస కృశదేహితాశ్వాసః,
పాకహాని గురు వాంతి రేచనం రోగరాజపరిపాకలక్షణమ్. 15
(మాధవనిదానే)

తా. అగ్నిమాంద్యము, బలహాని, జ్వరము, శ్వాసకాసలు, శరీరకృశత్వము గలుగుట, నిట్టూర్పు వాతము వెడలుట, భుజించినయన్నము జీర్ణముగాకుండుట, శరీరము బరువుగనుండుట, వమన విరేచనంబు లగుట-ఈలక్షణములచే క్షయరోగము ముదిరినదని తెలియవలయును.

వాతక్షయలక్షణము

సంకోచ స్స్కంధపార్శ్వానాం స్వరభేదజ్వరభ్రమాః,
వాతజే యక్ష్మణి జ్ఞేయం లక్షణం చాతిశీతతా, (చరకే) 16

తా. భుజపార్శ్వములు నొచ్చుట, స్వరము హీనమగుట, జ్వరము భ్రమగలుగుట, శరీరము కడుచల్లగనుండుట ఈలక్షణములుగలది వాతక్షయమని తెలియవలయును.

---

* జ్వరస్సర్వాంగగశ్చైవ లక్ష్మణాం రాజయక్ష్మణః = సర్వాంగములజ్వరముగలది రాజయక్ష్మయని తెలియవలయును.

### పిత్తక్షయలక్షణము

జ్వరదాహాతిసారాశ్చ రక్తవాంతిశ్శ్రమో మహాన్,
వీర్యస్తంభో రతిఃక్షీణా లక్షణం పిత్తజే క్షయే. (సిద్ధరసార్ణవే) 17

తా. జ్వరము దాహము అతిసారము గలుగుట, నెత్తురుగ్రక్కుట, మిక్కుట ముగ అలసటగలుగుట, వీర్యము స్తంభించుట, రతిక్రియలు క్షయించుట ఈలక్షణములు గలది పైత్యక్షయమని తెలియవలయును.

### శ్లేష్మక్షయలక్షణము

గురుత్వం శిరస శ్ఛర్ది కాసః కంఠే తథారుచిః,
ఊర్ధ్వశ్వాసశ్చ విజ్ఞేయం లక్షణం కఫజే క్షయే. (మాధవనిదానే)18

తా. తలనొచ్చుట, వమనంబగుట, కుతికలో శ్లేష్మము అడ్డపడుట, అరుచి, ఎగ ఊపిరిగలుగుట ఈలక్షణములుగలది శ్లేష్మక్షయమని తెలియవలయును.

### సన్నిపాతక్షయలక్షణము

వాత పిత్త కఫైర్యస్య లక్షణై స్సంయుతో యదా,
సన్నిపాతాన్నితో జ్ఞేయః కష్టసాధ్యః క్షయ స్తథా. 19
(ఆయుర్వేదే)

తా. వాత, పిత్త, శ్లేష్మ, క్షయలక్షణంబులు గలది సన్నిపాతక్షయమని తెలియవలయును. ఇది కష్టసాధ్యములు.

### వాతశ్లేష్మక్షయలక్షణము

స్వరభేదః కఫః కంఠే శూలం శ్వాసశ్చ ఛర్దనం,
వాతశ్లేష్మభవో యక్ష్మాజ్ఞాత్వైవం తు చికిత్సయేత్. 20
(మాధవనిదానే)

తా. స్వరభేదముగలుగుట, కంఠములో శ్లేష్మముకట్టుట, కడుపులో శూలగలుగుట, ఎగఊపిరిగలుగుట, వమనంబగుట ఈలక్షణములుగలది వాతశ్లేష్మక్షయమని తెలియవలయును.

### వాతపిత్తక్షయలక్షణము

స్వరభేదో జ్వరో దాహో శూలం ఛర్దిహ్యరోచకం,
వాతపిత్తాత్మకో యక్ష్మా రాజరోగో మహాబలః. (సిద్ధసంగ్రహే) 21

తా. స్వరభేదము జ్వరము దాహము కడుపులో శూల వమనము అరోచకము

కలుగుట ఈలక్షణములుగలది వాతపిత్తక్షయమనియు కడుబలిష్ఠమైన రాజయక్ష్మ యనియు తెలియవలయును.

### పిత్తశ్లేష్మక్షయలక్షణము

ఆలస్యం బహునిద్రా చ స్వల్పదాహో భ్రమో జ్వరః,
వాంతి శోణితపూరశ్చ పిత్తశ్లేష్మోద్భవే క్షయే. (భేషజకల్పే) 22

తా. ఆలస్యము కడునిద్ర యొకింతదాహము భ్రమ జ్వరముగలుగుట, నెత్తురు గ్రక్కుట ఈలక్షణములుగలది పిత్తశ్లేష్మక్షయమని తెలియవలయును.

### రక్తపిత్తక్షయలక్షణము

స్వరభేదోఽనిలశ్శూలం సంకోచశ్చోరపార్శ్వయోః,
జ్వరదాహాతిసారాశ్చ రక్తపిత్తస్య యక్ష్మణః. 23

తా. కంఠస్వరము చెడుట, శరీరము వాతపూరితముగ నుండుట, కడుపులో శూలగలుగుట, రొమ్ము ప్రక్కలు పార్శ్వములు నొచ్చుట, జ్వరము దాహము అతిసారము గలుగుట, నెత్తురుగ్రక్కుట ఈలక్షణములుగలది రక్తపిత్తక్షయమని తెలియవలయును, (ఇది అసాధ్యము.)

### క్షతక్షయలక్షణము

వక్త్రే విభంగ స్స్వరభంగయోగ స్స్వల్పజ్వరః పాణిపదేషు దాహః,
రక్తాన్వితచర్ద్యతిసారయుక్తః ప్రోక్తశ్చ యక్ష్మా క్షతలక్షణశ్చ. 24
(సిద్ధసంగ్రహే)

తా. నోరు పొక్కియుండుట, లేక మాటలాడుటకు శక్తిలేకుండుట, కంఠస్వరము చెడుట, స్వల్పజ్వరము గలుగుట, చేతులు కాళ్లు మండుట, రక్తయుక్తముగ గ్రక్కుట, పారుట - ఈలక్షణములుగలది క్షతక్షయమని తెలియవలయును. (ఇది అసాధ్యము.)

### రోగరాజక్షయలక్షణము

అగ్నిమాంద్యం జ్వరం శైత్యం ఛర్ది శ్శోణితపూయయోః,
సత్వహానిశ్చ దౌర్బల్యం రోగరాజస్య లక్షణమ్. (సిద్ధరసార్ణవే) 25

తా. అగ్నిమాంద్యము జ్వరము శైత్యము గలుగుట, రక్తమునేని చీమునేని గ్రక్కుట, సత్వము క్షయించుట, దౌర్బల్యము గలుగుట ఈలక్షణములుగలది రోగరాజక్షయమని తెలియవలయును. (ఇది అసాధ్యము.)

రక్తక్షయలక్షణము

మందాగ్ని శ్ఛర్దనం మోహా రక్తత్విణ్మూత్రనేత్రకః,
మాంసగ్రంథ్యర్బుదగ్రంధి ముఖదౌర్గంధ్యమేవచ. 26
కంఠశ్శుష్యతి మాంసం చ రక్తక్షయీ యమాలయమ్,

తా. మందాగ్నిగలుగుట, వమనంబగుట, మోహముగలుగుట, మూత్రము రక్తవర్ణముగనుండుట, నేత్రముల నెత్తురు ఉట్టిపడుట, మాంసగ్రంథులు జనించుట, నోరు దుర్గంధముగనుండుట, కంఠము శోషించుట, శరీరమాంసము కృశించుట ఈలక్షణములు గలది రక్తక్షయమని తెలియవలయును. ఇదిగలరోగి యమాలయంబున కేగును.

చతుర్విధక్షయలక్షణము

త్రివిధస్స్యాత్క్షయో దోషై ర్ధాతుచతుష్టయాత్. 27
ధాతుక్షయాద్వేగరోధా త్సాహసాద్విషమాశనాత్,
ఆగంతుకక్షయో జ్ఞేయ శ్చతుర్థో వైద్యపారగైః. 28
తస్య రూపాణి వైస్వర్యం కాసశ్శ్వాసోఽరుచిర్జ్వరః,
బల మాంస క్షయః పార్శ్వ శిరోరుగ్రేచనం వమిః. 29
కంఠపార్శ్వరుజానాహ రక్తశ్చ చ్ఛర్ది పీనసః,
నిహంతి పూయనిష్ఠీవో హ్యతిసారో హాతిస్వరః. (సిద్ధవిద్యాభూః)

తా. విరుద్ధాహారవిహారములవలన వాతపైత్యశ్లేష్మములు ప్రకోపించి వాతక్షయము, పిత్తక్షయము, శ్లేష్మక్షయము అని మూడువిధములైన క్షయరోగము గలుగంచేయును. ధాతుక్షయము, మలమూత్రప్రతిబంధము, సాహసము, *విషమాశనము అను నాలుగుకారణములవలన ఆగంతుకక్షయమును జనించు. ఈఆగంతుకముతోడ క్షయరోగములు నాలుగువిధంబులని సిద్ధవిద్యాభువనెడు గ్రంథమున జెప్పంబడియున్నయది. వానియందు స్వరహీనము, కాసశ్వాసములు, అరుచి, జ్వరము, బలక్షయము, మాంసక్షయము, పార్శ్వములయందు నొప్పి, మిక్కుటముగ శిరమునందు నొప్పి, వమనము, కుతికయొక్క పార్శ్వములయందు నొప్పి, కడుపుబ్బరము, రక్తమును గ్రక్కుట, పీనసము, దగ్గునపుడు చీముపడుట, అతిసారము, హీనస్వరముగలుగుట ఈలక్షణములతోంగూడియుండెడి నాలుగువిధములైన క్షయరోగములు రోగిని జంపును.

ఏకాదశక్షయలక్షణములు

సాహసో వేగ సంక్రోధ శ్శుక్లాభిస్నేహానం క్షయః,

* విషమాశనమన—నానావిధాన్నపానముల విషమముగ సేవించుట.

అన్నాహారవిధేస్త్యాగ శ్చత్వారో రాజయక్ష్మణః. 31
రూపం భవిష్యత స్తత్ర ప్రతిశ్యాయ స్తు సంక్షయః,
ప్రసావే ముఖమాధుర్యం తపనం వహ్నినాశనమ్. 32
స్థౌల్యరోగ స్తథా నాహ శోభావస్యశుభే క్షణం,
మక్షికాతృణకేశాది ప్రాణవాయు స్త్వపానగః. 33
హృల్లాసశ్ఛర్దిరరుచీ రసతోఽపి బలక్షయః,
పాణ్యోశ్చ శోఫఃపదయో శ్శోషశ్చ క్షీణశుక్లతా. 34
బాహ్యప్రమానభిజ్ఞానం కాయే భీభత్సదర్శనం,
పీనస శ్వాసకాసాది మూర్ధస్వర రుజారతిః 35
ఊర్ధ్వవిస్రంసనం శోఫో రక్తఛర్ది స్తు కోష్ఠగః,
యోనిపార్శ్వగుదే శూలం సంధికో భవతి జ్వరః 36
ఏకాదశసురూపాణి జాయంతే రాజయక్ష్మసు, (సిద్ధరసార్ణవే)

తా. సాహసము చేయబూనుట, కార్యములయందు కడు వేగముగలుగుట, శుక్లము క్షయించుట, లేక చమురువలెగారుట, అన్నమునం దిచ్ఛలేకుండుట - ఈనాలుగును ముందుగలుగబోయెడి పదకొండువిధములైన రాజయక్ష్మలకు పూర్వరూపంబులు. అవి జనించినపిదప పడిసెము, మూత్రకృఛ్రముగలుగుట, నోరు తీపిగనుండుట, శరీరము విదాహించుట, అగ్నినశించుట, స్థూలరోగము, కడుపుబ్బరముగలుగుట, ముఖము వాచుట, వికారముగజూచుట, వెంట్రుకలు మక్షికాతృణవర్ణసమానంబులుగ నుండుట, ప్రాణవాయువు అపానవాతముతోగలియుట, ఓకర, లేక ఎక్కిళ్లు వాంతి అరుచి గలుగుట, రసధాతుక్షయమువలన సత్వము క్షయించుట, కాళ్ళుచేతులు వాచుట, శరీరము శోషించుట, శుక్లము క్షయించుట, శరీరమున స్పర్శజ్ఞానములేకుండుట, శరీరము ఘోరముగ గనుపించుట, పీనసము, శ్వాసకాసాదులుగలుగుట, తలనొచ్చుట, కుతికలోనొచ్చుట, దేనియం దిష్టములేకుండుట, నోట మలము వెడలుట, శరీరము వాచుట, నెత్తురు గ్రక్కుట, కోష్ఠవాతముగలుగుట, యోనిపార్శ్వములు గుదస్థలము శూలించుట, సంధివాతము జ్వరము గలుగుట ఈలక్షణంబులన్నియు ఏకాదశక్షయలకు గలవని తెలియవలయును.

## క్షయరోగలక్షణము

మందాగ్నిర్బలహీనతా కృశతను శ్శ్వాసశ్చ కాసభ్రమా
హృచ్ఛూలం వమనం ప్రవాహస్వరరుక్కంప స్త్వజీర్ణం తృషా,

దాహో విష్టృతహస్తిమూత్ర గళరుక్ఛీతం శిరోర్తిర్జ్వరః
మూర్ఛార్తిస్తథపీనసం జడగతి ర్హ్యేతత్క్షయే లక్షణమ్. (చరకే)

తా. మందాగ్నిగలుగుట, సత్వములేకుండుట, శరీరము కృశించుట, కాసశ్వాసములు భ్రమ ఱొమ్మునొప్పి వాంతులు అతిసారము స్వరభేదము వణకు అజీర్ణము దప్పి దాహము గలుగుట, ఏనుగుమూత్రమువలెనే మూత్రం బధికముగ వెడలుట, కుతికలో నొచ్చుట, చలువగలుగుట, తలనొచ్చుట, జ్వరము మూర్ఛ పీనసము జడత్వము గలుగుట-ఇవియన్నియు క్షయరోగలక్షణంబులని తెలియవలయును.

## క్షయోపద్రవములు

సీ. క్షయకుపద్రవ మతిసారంబు గృశమైన
దేహంబు గన్నులు దెల్ల నగుట
కడుపెండి వెన్నునఁ గలయుట మోహంబు
నష్టేంద్రియంబు వ్రణాలు గలుగు
దగ్గును శూల యూర్ధ్వశ్వాసస్వరహీన
మై కాళ్ళువాచుట మఱియు దాన
నంగమెల్లను శుష్క మగుట ముక్కున నెత్తు
రొలుకుట ధాతుక్షయోర్మి యగుట

గీ. క్షయల కెల్లను నీరోగజాల మున్న
నది ప్రయాసంబు ధన్వంత్రికైనఁగాని
మాన్పరా దని చెప్పెఁ బల్మాఱు నీల
కంఠకొట్టూరు వైద్యసంఘుం బెఱుంగ.

అనేకోపద్రవయుతం పాదయోః ప్రసృతం నరం,
నారీం శోఫముఖీం హంతి కుక్షిగుహ్యావుభావపి. (నిత్యనాథీయే)

తా. ఏపురుషునికి క్షయరోగముతోడ అనేకోపద్రవములుగూడి కాళ్ళయందు వాపు, స్త్రీకి ముఖమునందు వాపు, స్త్రీపురుషులకు కడుపు, మర్మస్థలము అను వానియందు వాపుగలిగియుండెడినో, అట్టివారు మరణము జెందుదురని తెలియవలయును.

జ్వరాతిసారశోఫానాం శ్వయథౌ చ తథా క్షయే,
ఆననం హస్తపాదం చ విశేషాద్యస్య శుష్యతి.
స్వయోనావపి దేహే చ సామాన్యాద్యాతి పంచతాం,
(నిత్యనాథీయే)

తా. క్షయరోగములలో జ్వరాతిసారంబేని శోఫయేని ముదిరినను, లేక ముఖము కాళ్లు చేతులు శుష్కించి యోని శరీరము వాచియుండినను, అట్టిక్షయరోగి మరణము జెందునని తెలియవలయును.

నాసికాచ్యుతరక్తశ్చ మేహపాండ్వామయీ క్షయీ. 40
సద్యోఽపి ముంచతిప్రాణాన్ సత్యమేవ న సంశయః, (మతాంతరే)

తా. మేహ, పాండు, క్షయరోగముగలవారికి ముక్కుచెవిరి రక్తముగారు చుండిన వారు నిస్సంశయముగ తత్క్షణంబున ప్రాణంబుల విడిచెదరు.

శోఫోదరార్శో గ్రహణీ జ్వరగుల్మా హ్యుపద్రవాః. 41

తా. క్షయరోగంబులలో శోష, ఉదరము, మూలవ్యాధి, గ్రహణి, జ్వరము, గుల్మము అను నుపద్రవములు గలిగినరోగి మృతిజెందునని తెలియవలయును.

విషూచీ శ్లేష్మ హీనాంగ మతిసార ప్రపీడితం,
శూల శుష్కోదరం చైవ యక్ష్మాణం పరివర్జయేత్. 42
ఊర్ధ్వశ్వాసాతిశుక్లాక్షీ భిన్నకాంస్యహతస్వరః,
అతిమేహః కృశో మందో హీనబుద్ధిబలేంద్రియః. 43
వ్రణాంగశోషహిక్కావాన్ క్షయీ యాతి యమాలయం,
తథాప్యపి ప్రకర్తవ్యా చికిత్సా జీవితావధి. (మాధవనిదానే) 44

తా. విషూచి, కఫము, అంగహీనము, అతిసారము, శూల, శుష్కోదరము, ఎగయూపిరి, నేత్రములు తెల్లనై రక్తవిహీనములుగనుండుట, స్వరము పగిలినకంచుపాత్ర ధ్వనితో తుల్యముగనుండుట, కడుమేహము, శరీరకృశత్వము, శరీరమాంద్యము, బుద్ధిమాంద్యము, బలక్షయము, ఇంద్రియక్షయము, వ్రణములు, శరీరము ఎండుట, ఎక్కిళ్లు అను నుపద్రవములలో దేనితోనేని, లేక అనేకరోగంబులతోనేని గూడియుండెడిక్షయరోగి యమాలయంబున కేగును. ఐనను క్షయరోగి జీవించియుండువఱకు చికిత్సం జేయవలయును.

## క్షయఏకాదశరూప షడ్రూప, త్రిదోష, శోషవివరణము

స్వరభేదోఽనిలాచ్ఛూలం సంకోచశ్చాంసపార్శ్వయోః,
జ్వరో దాహోఽతిసారశ్చ పిత్తాద్రక్తస్య చాగమః. 45
శిరసోఽప్యతిపూరశ్చాప్యభక్తచ్ఛంద ఏవ చ,
కాసః కంఠస్య చోద్ధ్వంసో విజ్ఞేయః కఫకోపతః. 46
ఏకాదశభిరేతైర్వా షడ్భిర్వాపి సమన్వితం,

కాసాతిసారపార్శ్వార్తి స్వరభేదారుచిజ్వరైః. 47
త్రిభిర్వా పీడితం లింగైః జ్వరకాసాసృగామయైః,
జిహ్వాచ్ఛోషార్దితం జంతుమిచ్ఛం సువిపులం యశః. (ఆయుర్వేదే)

తా. వాతపిత్తశ్లేష్మసంకరమువలన జనించు సన్నిపాతము సర్వలక్షణసంపూర్ణముగ నుండుచందంబున, సన్నిపాతమువలన జనించిన క్షయరోగము సర్వలక్షణసంపూర్ణముగనుండును - అందు వాతప్రకోపమువలన స్వరభేదము, శూల, భుజపార్శ్వములు ఈడ్చికొనుట, పిత్తప్రకోపమువలన జ్వరము, దాహము, అతిసారము, రక్తము గ్రక్కుట, శ్లేష్మప్రకోపమువలన శిరోభారము, అన్నద్వేషము, దగ్గు, కంఠమున నొప్పి అను నీపదకొండులక్షణములుగలిగి మాంసక్షయముతోఁగూడియుండు క్షయరోగిని, లేక కాసము, అతిసారము, పార్శ్వములు ఈడ్చికొనుట, స్వరభేదము, అరుచి, జ్వరము అను నీఆఱులక్షణములు గలిగి మాంసక్షయముతోఁ గూడియుండు క్షయరోగిని, లేక జ్వరము, దగ్గు, రక్తముగ్రక్కుట - అను నీమూడులక్షణములుగలిగి మాంసక్షయముతోఁ గూడియుండు క్షయరోగిని మిక్కుటముగ యశమునుగోరెడి వైద్యుఁడు వర్జింపవలయును.

## సర్వరోగభేదవివరణము

ఏకేనైవ చ దోషేణ త్రయో ద్వాభ్యామపి త్రయః,
త్రిదోషైరపి చైకస్స్యా దేతైస్సప్తవిధో గదః. 49

తా. సర్వరోగములు ఏకదోష, ద్విదోష, త్రిదోషజనితము లన నేడువిధంబులు. అందు వాత, పిత్త, శ్లేష్మములవలన ప్రత్యేక ప్రత్యేకముగ జనించినవి ఏకదోషజనితంబులు. వాతశ్లేష్మ, వాతపైత్య, పిత్తశ్లేష్మములవలన జనించినవి ద్వంద్వదోషజనితంబులు. వాతపిత్తశ్లేష్మములవలన జనించినవి త్రిదోషజనితంబులు.

## రోగసాధ్యాసాధ్యములు

ప్రయోగశ్శమయేద్వ్యాధి మన్యామయముదీరయేత్,
నాసావశుద్ధశ్శుద్ధస్తు శమయేన్న సమీరయేత్. (నిత్యనాథీయే) 50

తా. ఔషధప్రయోగము శుద్ధభాగము (అనఁగా ఏకదోషజనితభాగము) లను హరింపఁజేయునేగాని యితరరోగముల గలుగఁజేయకుండును. మఱియు అశుద్ధరోగముల (అనఁగా ద్వంద్వరోగముల త్రిదోషజనితరోగముల) ఔషధము ప్రయోగించిన ఇతర రోగములు జనించును. అట్లగుటంజేసి శుద్ధరోగములకే చికిత్సం జేయవలయును. అశుద్ధరోగములు కుదురుట దుర్లభం బగుటచే వానికి చికిత్స జేయంజనదు.

## క్షయరోగములకు తాళకసిందూరము

శుద్ధతాళస్య భాగం చ సుధాచూర్ణం సమాంశకం,
రక్తకార్పాససారేణ మర్దయిత్వా దినత్రయమ్. 51
మూషాయాన్నిక్షిపేత్సర్వం సప్తవారం పుటం భవేత్,
సిందూరం హరితాళస్య చేంద్రగోపప్రభం భవేత్. 52
ఏతత్సర్వం సమాలోడ్య నానారోగేషు యోజయేత్,
పత్రవల్లీరసైర్యుక్తం శ్లేష్మక్షయవినాశనమ్. 53
గోక్షురస్వరసైర్యుక్తం రక్తక్షయవినాశనం,
నారికేళరసైర్యుక్తం వాతశ్లేష్మవినాశనమ్. 54
హరీతకీచూర్ణయుక్తం శ్వాసక్షయవినాశనం,
పిప్పలీచూర్ణయోగేన కాసక్షయవినాశనమ్. 55
సితయా మధునా యుక్తం పైత్తక్షయవినాశనం,
నిర్గుండీచూర్ణసంయుక్తం కఫజ్వరవినాశనమ్. 56
నవనీతేన సంయుక్తం హిక్కాఛర్దినివారణం,
మంజరీసారసంయుక్తం చాతుర్థికవినాశనమ్. 57
అర్జునత్వక్చూర్ణయుక్తం శుక్లమేహవినాశనం,
కార్పాసబీజచూర్ణేన బహుమూత్రం ప్రణశ్యతి. 58
శంఖచూర్ణేన సయుక్తం గ్రహణీసారనాశనం,
ఉన్మత్తసారసంయుక్తం క్రిమికుష్ఠం వినశ్యతి. 59
అపామార్గస్య సారేణ గుదరోగో వినశ్యతి,
వృశ్చికాళీరసైర్యుక్తం మేహం కృచ్ఛ్రం వినశ్యతి. 60
ధూపచూర్ణేన సంయుక్తం గ్రహణీదోషనాశనం,
శుక్లకందేన సంయుక్తం గ్రహణీ శూలనాశనమ్. 61
దాడిమీకుసుమసారేణ హిక్కా గ్రహణినాశనం,
ఏతత్సమాంశకం చూర్ణం మయోక్తం భాషితం తథా. 62
తాళసిందూరయోగేన నానారోగహరం పరం, (మాధవనిదానే)

తా. శుద్ధిజేసిన తాళకము, సున్నము వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమున నునిచి పైడిప్రత్తిపువ్వులరసాన మూడుదినములు మర్దించి వజ్రమూషలో నునిచి ౭ లఘుపుటములువేసిన తాళకము ఆరుద్రపురుగులవలె సెట్టిగ సిందూరించును. పిదప

నావజ్రమూషలోని సిందూరము గీచి యెత్తుకొని సర్వరోగములయం దుపయోగింప వలయును. మఱియు నాసిందూరములో రెండు *చిన్నములయెత్తును దుద్రజాకు రసముతో నొసంగిన శ్లేష్మక్షయమును, ఏనుగుపల్లేరురసముతో నొసంగిన రక్తక్షయమును, టెంకాయనీరుతో నొసంగిన వాతశ్లేష్మక్షయమును, కిరకాయచూర్ణముతో నొసంగిన శ్వాసక్షయమును, పిప్పలిచూర్ణముతో నొసంగిన కాసక్షయమును, చీనాపంచదారతోనేని తేనెతోనేని నొసంగిన పైత్యక్షయమును, నల్లవావిలియాకుచూర్ణముతో నొసంగిన శ్లేష్మజ్వరమును, వెన్నతో నొసంగిన ఎక్కిళ్ళను వాంతులును, తులసియాకు రసముతో నొసంగిన చాతుర్థికజ్వరమును, మద్దిచెక్కచూర్ణముతో నొసంగిన శుక్ల మేహమును, ప్రత్తివిత్తులచూర్ణముతో నొసంగిన బహుమూత్రమును, శంఖచూర్ణముతో నొసంగిన గ్రహణి అతిసారములును, ఉమ్మెత్తరసముతో నొసంగిన క్రిమి కుష్ఠరోగములును, ఉత్తరేణిరసముతో నొసంగిన గుదరోగమును, తేలుమణియాకు రసముతో నొసంగిన మేహరోగమును మూత్రకృచ్ఛ్రమును, అగరుగంధపుచెక్క చూర్ణముతో నొసంగిన గ్రహణీదోషమును, అతివసచూర్ణముతో నొసంగిన గ్రహణి శూలలును, దానిమ్మపువ్వులరసముతో నొసంగిన ఎక్కిళ్ళతోఁ గూడియుండు గ్రహణి రోగమును నశించును. పైయనుపానములను సిందూరమునకును సమముగ నుంచికొనవల యును. మఱియు నీతాళకసిందూరము నానారోగముల హరింపఁజేయుటయందు కడు శ్రేష్ఠంబైనదిగ నున్నయది.

◆ క్షయపాండుకామిలలకు శ్రీమదగ్నికుమారము ◆

తుల్యే గంధకపారదావమృతకం శుల్బం చ తుల్యాంశకం
ఖల్వే హంసపదీరసే దినయుగం సంమర్ద్య యత్నాత్తతః,
కృత్వా కాచమయే ఘటే చ వటికా స్సంతాప్య సూర్యాంశుభిః
తద్రుద్ధ్వానన మంగుళీపరిమితం చేలం మృదా వేష్టయేత్. 64
భాండే వాలుకయా త్రిభాగభరితే క్షిప్త్వా క్షిపేద్వాలుకాం
భాండాస్యం తు నిరుధ్య వాసరయుగం గాఢాగ్నిముద్దీపయేత్,
ఉత్తార్య స్వశరీరశీతల మతో వేదాంశతుల్యామృతం
తుల్యాంశైశ్చ మరీచచూర్ణనికరై స్సంయోజ్య గుంజామితమ్. 65
దేయం నాగలతాదళేన సహితం చూర్ణం తథా ఖాదయే
చ్ఛ్రీమానగ్నికుమారకో రసవరో నిశ్శేషరోగాపహః,

* చిన్నము నాలుగుగురివెందగింజలయెత్తు.

శ్వాసకాస క్షయ పాండు కామిలా శూల వాత వమిరోగభూపతిః,
సన్నిపాత మతిదారుణజ్వరాన్ హంతి హంత రసభూపతిః క్షణాత్.
(చింతామణౌ)

తా. శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన వసనాభి, తామ్రభస్మము - వీనిని సమభాగములుగ ఖల్వమున నునిచి రెండుదినములు హంసపాదియాకురసముచే బాగుగ మర్దించి మాత్రలు చేసి ఎండ నెండించి గాజుకుప్పెలో బోసి దానిమూతిని బలపు బిరడచే మూసి యేడుచీలమన్నులిచ్చి ఎండించి కుండకు మూడుభాగములు యిసుక పోసి అందాగాజుకుప్పె నునిచి దానిపై మరల నిసుకబోసి వాలుకాయంత్రమున రెండు దినములువండి స్వాంగశీతలమున దీసి దానికి నాలుగవపాలు శుద్ధిచేసినవసనాభి, వసనాభికి సమము మిరియపుచూర్ణము కలిపి యందొక గురిగింజప్రమాణమును తమలపాకులో నునిచి సేవించిన శ్వాసకాసలు, క్షయరోగములు, పాండువులు, కామిల, శూల, వాతములు, వాంతులు, సన్నిపాతములు, పురాణజ్వరములు (ఆమ్లపైత్యములు, శోఫలు) మొదలగు సర్వరోగముల నది తత్క్షణమున నిశ్శేషముగ బోకడుచును. ఇది శ్రీమదగ్నికుమార మనియు, రసభూపతియనియు జెప్పంబడును.

### క్షయాదిసర్వరోగములకు పూర్ణచంద్రోదయము

పలం మృదుస్వర్ణదళం రసేంద్ర పలాష్టకం షోడశగంధకస్య,
శోణైస్సుకార్పాసభవైః ప్రసూనైస్సర్వంవిమర్ద్యాథకుమారి కాద్భిః.
తత్కాచకుంభే నిహితం ప్రగాఢే *మృత్కర్పటీభి ర్దివసత్రయం చ,
పచేత్క్రమాగ్నౌ సికతాఖ్యయంత్రే తతోరజః పల్లవరాగరమ్యమ్.
నిగృహ్యచైతచ్చ పలం పలం చ చత్వారి కర్పూరరజస్తథైవ,
జాతీఫలం శోషణమింద్రపుష్పం కస్తూరికాయా ఇహ శాణమేకమ్.
చంద్రోదయోఽయం కథితోఽస్యమాషోభుక్తోహివల్లీదళమధ్యవర్తీ,
మదోత్కటానాం ప్రమదాశతానాం గర్వాధికత్వంశ్లథయత్యకాండే.
ఘృతం ఘనీభూతమతీవ దుగ్ధం †మృదూనిమాంసాని సమండకాని,
మాషాన్నపిష్టాని భవంతి పథ్యా న్యానందదాయీన్యపరాణిచాత్ర.
వలీ పలితనాశనస్తనుభృతాం వయస్తంభన
స్సమస్తగదఖండనః ప్రచురరోగపంచాననః,
గృహేపి గృహభూపతిర్భవతి యస్య చంద్రోదయ

---

* మత్కర్పటైస్తద్దివసత్రయంచ. † గురూణి మాంసాని సమస్తకాని.

స్స పంచశరదర్పితో మృగదృశాం భవేద్వల్లభః. 72
రతికాలే రతాంతేవా సేవితవ్యో రసోత్తమః,
మానహానిం కరోత్యేష ప్రమదానాం సునిశ్చితమ్. 73
కృత్రిమం స్థావరం చైవ జంగమంచాపి యద్విషం,
నవికారాయ భవతి సాధకేంద్రస్య వత్సరాత్. 74
యథామృత్యుంజయాఖ్యాసా న్మృత్యుంజయతి దేహినాం,
తథాయం సాధకేంద్రస్య జరామరణనాశనః. 75
ఇంద్రపుష్పం లవంగం స్యా త్కార్పాసకుసుమద్రవం,
తంత్రాంతరే ప్రసిద్ధోఽయం మకరధ్వజనామతః. (గ్రంథాంతరే) 76

తా. శుద్ధిచేయఁబడి సూక్ష్మముగ కత్తిరించఁబడిన కుందనపురేకులు ౧ పలము, శుద్ధిచేసిన పాదరసము ౮ పలములు, శుద్ధిచేసిన ఆమ్లసార శిలాగంధకము ౧౬ పలములు. ఇటుల వీనినెల్ల ఖల్వమున నునిచి ఎఱ్ఱప్రత్తిపువ్వులరసమున ఒకదినము బాగుగ మర్దించి పిదప మఱియొకదినము కలబందరసముచే మర్దించి సెనగగింజలంతేసి మాత్రలుచేసి ఎండించి గాజుకుప్పెలో బోసి చీలమన్ను లేపనముచేసి వాలుకాయంత్రమున నునిచి మృదు, తీక్ష్ణ, గాఢాగ్నులచే మూడుదినములువండి స్వాంగశీతలమునదించి యందలి యౌషధమును దీసి చూచిన యది చిగురుటాకువర్ణతుల్యముగ నుండవలయును. అటు లుండిన పక్వంబైన దని యెఱింగి యందు దినుసు కొక్కపలముచొప్పున పచ్చకప్పూరమును, జాజికాయలను, పిప్పళ్లను, లవంగములను *శాణప్రమాణము కస్తూరిని గలిపి మర్దించవలయును. ఇదియ పూర్ణచంద్రోదయ మనంబడును. దీనిని మాషప్రమాణము తమలపాకులో నునిచి సేవించిన మదించిన నూరుగురు స్త్రీలగర్వము నణచుటయందు శక్తిగలవాఁడుగ నగును; మఱియు నిది ముదిమిని సమస్తరోగములను బోకడచి వయస్తంభనమును గలుగంజేయుటయేగాక బలిష్ఠమైన క్షయాదిరోగములనే ఏనుగులకు సింహముగనుండును. ఈపూర్ణచంద్రోదయము గృహపతి గృహమును రక్షింపుచుండుచందంబున శరీరమును రక్షింపుచుండును. మఱియు దీనిని సేవించువాఁడు కామముచే గర్వితుఁడై స్త్రీలకు మిగుల సంతోషమును గలుగంజేయుచుండును. మఱియు దీనిని సురతకాలంబునగాని సురతాంతమునగాని సేవించెడువాఁడు మదించిన స్త్రీలయొక్కగర్వమును నిశ్చయముగ పోకడుచును. మఱియు దీనినొకసంవత్సరమువఱకు సేవించెడివానికి కృత్రిమస్థావరజంగమ విషములవలన యెవ్విధవికారంబును గలుగకుండును. మృత్యుంజయరససేవనవలన

* శాణ మన ౪ మాషములయెత్తు.

మృత్యువు గలుగకుండుచందంబున దీనిసేవనవలన జరామరణములు గలుగకుండును. దీని యందు పేరినెయ్యి, అధికముగ పాలు, మృదుకరమాంసములు, మీగడ, మాషాన్నము, పిండివంటలు మొదలగు తనకిష్టపదార్థముల సేవించుట పథ్యకరము.

## క్షయాదులకు మహాదగ్నికుమారము

గంధకేన ద్వికర్షేణ శుద్ధసూతేన తావతా,
విధాయ కజ్జలీం శ్లక్ష్ణా మేకవాసరమర్దనాత్. 77
కర్షమాత్రం విషం దత్వా మర్దయిత్వా దృఢం తథా,
హంసపాదిరసం దత్వా స్తోకం స్తోకం ముహుర్ముహుః. 78
కుడవార్ధమిదం పశ్చా ద్గోళీకృత్య విచక్షణః,
కాచకుప్యాం వినిక్షిప్య శుల్బంచాస్మి ప్రదాపయేత్. 79
దేవీశాస్త్రే పునః ప్రోక్తం చూర్ణితం కాంచనం విషం,
ఊర్ధ్వాధో గోళకానాం హి కాచకుప్యాం వినిక్షిపేత్. 80
నిక్షిపేత్కజ్జలీమధ్యే యథా శ్వాసో న జాయతే,
తతశ్చ ద్వ్యంగుళేనైవ మృదా కుప్యం విలిప్య చ. 81
విశోష్య వాలుకాయంత్రే సూత్రస్థానప్రకాశితే,
అధోముఖం ఘటీం క్షిప్త్వా క్షిపేదుపరి వాలుకామ్. 82
నిరుధ్య భాండవక్త్రం చ చుల్ల్యా మారోప్య యత్నతః,
వహ్నిం ప్రజ్వాలయేత్సార్ధదినం క్రమవివర్ధితమ్. 83
స్వాంగశీతం సమాకృష్య సహతామ్రేణ మర్దయేత్,
పలార్ధం మారిచం సూక్ష్మం కర్షార్ధం వత్సనాభకమ్. 84
వినిక్షిప్య విమర్ద్యాథ క్షిపేద్ద్రవ్యం కరండకే,
నందినాథ సమాదిష్టం రసతుల్యం మరీచకమ్. 85
వత్సనాభం చ కర్షార్ధం మిశ్రయే త్ప్రితిచూర్ణితమ్. 86
నిర్దిష్టోఽగ్నికుమారకో రసవరో దేయస్తథా నందినా
సద్యో వైద్యయశః ప్రభూతఫలదస్సర్వామయధ్వంసనః,
నిత్యం పాచనదీపనో రుచికర శ్శీఘ్రం గుణోత్కర్షకృ
చ్ఛాలీభోజన తోయభక్ష సుఖద శ్శ్రేష్ఠో రసానాం ప్రభుః. 87
మందాగ్నిం కఫవాతజ క్షయగదం నిశ్శేషశూలామయం
శ్వాసం కాస గదం తథా కఫ మరుజ్జార్తిం చ పాండుం తథా,

శోషం నాతగదాన్మహాకఫరుజః కంఠామయం సర్వశః
సామాం చ గ్రహణిం హరేత్షలు రతిం కుర్యాచ్చ పణ్డాన్వితః. 88
*కణయాసితయాజ్యేన దాతవ్యోఽయం మహారసః,
వాయుముఖ్యేషు రోగేషు వాయుసంసర్గకేష్వపి. 89
నందినాథే పునఃప్రోక్త స్తత్తద్రోగహారః పరః,
నిహంతి సకలాన్ రోగా ననుపానవిశేషతః. 90

రసజనితవిదాహే శీతతోయాభిషేకో
మలయజఘనసారై ర్లేపనం మందవాతః,
తరుణదధిచయుక్తం నారికేళస్య నీరం
మధురశిశిరవాతశ్శీతమన్యచ్చ శస్తమ్. (దేవీశాస్త్రే) 91

తా. శుద్ధిచేసిన గంధకము ౨ కర్షములు, శుద్ధిచేసినరసము ౨ కర్షములు-ఇటుల వీనిని గ్రహించి ఖల్వములో నునిచి ఒకదినము కజ్జలిగ మర్దించి అందు కర్షప్రమాణము శుద్ధిచేసిన వసనాభిని కలిపి మరల దృఢముగ మర్దించి హంసపాదియాకురసమును కుడవార్ధపరిమితముగ జేకొని కొంచెకొంచెముగ వేయుచు పలుమారు మర్దించి మాత్రలుచేసి యెండించి పిదప గాజుకుప్పెలోపల దేవకాంచనపు చూర్ణమును, శుద్ధిచేసిన వసనాభిచూర్ణమును వైచి, దానిపై నామాత్రల నునిచి ఆమాత్రలకు నడుమ తామ్రభస్మమును, మరల దానిపై దేవకాంచనపు చూర్ణమును, శుద్ధిచేసిన వసనాభిచూర్ణమును వైచి, సందులేకుండునటుల దానిమూతిని బలపపురాతిచే మూసి రెండంగుళముల దళప్రమాణము చీలమన్ను లేపనముచేసి ఎండించి దేవీశాస్త్రము యొక్క సూత్రస్థానమున జెప్పంబడిన వాలుకాయంత్రములో నునిచి దానిపై నిసుక బోసి ఒకకుండను దానిపై బోర్లించి ఆరెండుకుండలమూతులు బంధించి చీలమన్ను లేపనముచేసి యెండించి కడుజాగరూకతతో పొయిమీంద నునిచి మృదు తీక్ష్ణ గాఢాగ్నులచే క్రమముగ ౧౨ ఝాములు పాకముచేసి చల్లారినపిదప నందలిగాజుకుప్పెను దీసికొని తామ్రభస్మముతోడ ఖల్వమున మర్దించి అందు మిరియములచూర్ణము అర్ధపలము, శుద్ధిచేసిన వసనాభిచూర్ణము అర్ధకర్షప్రమాణము కలిపి ఒకభరణియం దునిచి కొనవలయును. ఇటుల రసమునకు సమముగ మిరియములచూర్ణమును, అర్ధకర్షము శుద్ధిచేసిన వసనాభిని కలుపుటచే నిర్దుష్టంబై శ్రేష్ఠంబుగ నుండు మహాదగ్నికుమార

* మధునా.

మను నీరసము తమలపాకుతోడ సేవింపఁబడిన పాచనము, అగ్నిదీపనము, రు
గుణాధిక్యము అనువానిని గలుగంజేయు ననియు, అగ్నిమాంద్యము, కఫవాతజనితక్ష
రోగములు, శూల, శ్వాసము, కాసము, కఫము, వాతరోగములు, పాండువు, శో
ఎనుబదివాతములు, శ్లేష్మరోగములు, కంఠరోగము, ఆమయుక్తగ్రహణి మొద
సర్వరోగముల హరింపంజేయుటవలన తత్కాలమునందే వైద్యులకు యశస్సు
గలుగంజేయు ననియు, పిప్పళ్ళచూర్ణము పంచదార, నెయ్యి, అనువానితో సేవిం
బడుటవలన వాతమే ముఖ్యముగ గలరోగముల వాతసంబంధమువలన జనించినరోగమ
హరింపంజేయు ననియు, మఱియు అనుపానవిశేషములవలన సకలరోగముల హరిం
జేయు ననియు, నందినాథీయ మను గ్రంథమున జెప్పంబడియున్నయది. ఈరససేవన
ముల సంతాపము జనించిన శీతోదకస్నానము, పచ్చకర్పూరముతోగూడి శీతకరవ
నుండు చందనలేపనము, ఒకింత వాతసేవన, నూతనమైన పెరుగు, టెంకాయస్
మధురద్రవ్యములు, శీతకరద్రవ్యములు, ఇతర శీతలద్రవ్యములు అనువానిని సే
చుట హితకరం బగును. ఇదియ మహదగ్నికుమార మనంబడును. ఇది సకల రసముల
కడు శ్రేష్ఠంబు. దీనియందు మంచిశాల్యన్నమును, మంచి ఉదకములను, మంచిభ
ములను, పథ్యముగ గ్రహింపవలయును.

### మండూరగుణము

మండూర కఫవాతఘ్నం శోఫ పాండు క్షయాపహమ్.
(మాధవనిదా

తా. మండూరమును తేనె, పిప్పలితో సేవించిన శ్లేష్మము, వాతము, శో
పాండువు, క్షయరోగము హరించును.

### క్షయాదులకు జీర్ణమండూరచూర్ణము

జీర్ణం మండూరచూర్ణం పశుసలిలయుతం భృంగరాజార్కవాసా
మత్స్యాక్షీ మేఘనాదేక్షురకులిశలతా బ్రహ్మమూర్వామృతానాం
వర్షాభూ శిగ్రు నీలీ హపుష బహుదళా శేఫకనార్ద్రికానాం
భృష్టం శ్రేష్ఠం రసేన త్రికటువరనిశా దారు దార్వ్యగ్నివేల్లైః.
ఏభిస్తుల్యం సమాంశం దధి మధు పయసా క్రోష్టు గోమార్ద్రిసీ
ప్రాతఃపీత్వానిహన్యాత్క్షయకసనశుభశ్వాసపాండ్వగ్నిమాంద్యా
(అశ్వినీక

తా. పాతచిట్టెము నెఱ్ఱగ కాల్చి గోమూత్రములో ఏడుమారులు చల్ల

ద్ధియగును. పిదప దానిని దంచి చూర్ణముచేసి గుంటగలగర, జిల్లేడాకులు, అడ్డసర, పొన్నగంటియాకు, చిత్రియాకు, నీరుగొలిమిడి, నల్లేరు, మండూకబ్రహ్మి, నుట్టలు, తిప్పతీగె, గలిజేరు, మునగచెక్క, నీలియాకు, బోడతరము, సంబ, హావిలి, కలబంద, అల్లము, దుష్టుపాకు, పసపు అను వానిరసముతో ప్రతిచే ప్రత్యేకప్రత్యేకముగ రుబ్బి ప్రతిదానిచే నైదేసిపుటంబులచొప్పున నూఱుబు లిడవలయును, ఇటుల నూఱుపుటంబులిడిన నది శుద్ధం బగును. పిదప సొంటి, ,మిరియాలు, కరక తాండ్ర యుసిరికెలు, పసపు, మ్రానిపసపు, దేవదారు, చిత్రము, వాయువిడంగములు అనువానిని సమభాగములుగ చూర్ణముచేసి దానికిసమముగ ండూరము గలిపి ప్రతిదినము పదిచిన్నములయెత్తును పెరుగు, పాలు, కోష్టుము, అల్లపురసము, అనువానిలో చేనితోనేని ప్రాతఃకాలమున సేవింపుచుండిన రోగములు, కాసము, శోఫ, శ్వాసము, పాండువు, అగ్నిమాంద్యము హరించును. సండూరము క్షయ, పాండు, శోఫల హరింపంజేయుటయందు కడుప్రసిద్ధిం నది.)

### సర్వక్షయములకు కాంతవల్లభరసము

కాంతం షోడశభాగం చ చతుర్దశమయోరజః,
కిట్టం చ ద్వాదశం చైవ దశభాగం తు టంకణమ్. 95
మనశ్శిలాష్టభాగం చ షడ్భాగం చ శిలాజతు,
సర్వేణ చ సమం సూతం గంధకంచాపి తత్సమమ్. 96
ఆర్ద్రిమూషోదరే న్యస్య వాలుకాయంత్రకే క్షిపేత్,
పాచయేత్సప్తరాత్రం తు సంగ్రాహ్యం సూక్ష్మచూర్ణితమ్. 97
సేవితం మధునాయుక్తం నిష్కార్ధేన సమన్వితం,
పాండురోగ క్షయం గుల్మ గ్రహణీరోగనాశనమ్. 98
కాసం శ్వాసం జ్వరం ఛర్ది ప్లీహోదర మరోచకం,
మందాగ్ని కుష్ఠరోగం చ మూలరోగం భగందరమ్. 99
వాతశూలహరం వృష్య మత్యంతమతిదీపనం,
తుష్టిపుష్టికరం కాంతివర్ధనం బలవర్ధనమ్. 100
కాంతవల్లభనామ్నాయం విష్ణునా నిర్మితం పురా,
సర్వపాండు క్షయంచైవ లోకస్యారోగ్యకారణమ్. 101
(నిత్యనాథీయే)

తా. కాంతభస్మము ౧౬ భాగములు, ఉక్కురాపొడి ౧౪ భాగములు, * మండూరము ౧౨ భాగములు, శుద్ధిచేసిన వెలిగారము ౧౦ భాగములు, శుద్ధిచేసిన మణిశిల ౮ భాగములు, శుద్ధిచేసిన కర్పూరశిలాజితు ౬ భాగములు, శుద్ధిచేసిన పాదరసము ౬౬ భాగములు, శుద్ధిచేసిన గంధకము ౬౬ భాగములు - ఇటుల వీనినెల్ల ఖల్వమున నునిచి నిమ్మపండ్లరసముతో బాగుగమర్దించి † ఆర్ద్రమూషలోగాని గాజు కుప్పెలోగాని ఉనిచి వాలుకాయంత్రమున ఏడుదినములు వండి సాంగశీతలమున ఖల్వమున నునిచి మర్దించి చూర్ణముచేసి యం దర్ధనిష్క ప్రమాణమును ప్రత్యహము ప్రాతస్సాయంకాలముల తేనెతో సేవింపుచుండిన పాండువు, క్షయరోగము, గుల్మము, గ్రహణీరోగము, కాసశ్వాసలు, జ్వరము, వాంతులు, ప్లీహోదరము, అరుచి, అగ్నిమాంద్యము, కుష్ఠువు, మూలవ్యాధి, భగందరము, వాతశూల హరించుటయేగాక కడు వీర్యవృద్ధి, అగ్నిదీపనము, మనస్సంతోషము, శరీరపుష్టి, కాంతి, బలము అనునవి సహా గలుగును. ఇది విష్ణువుచే నిర్మింపఁబడిన కాంతవల్లభరస మనంబడును. మఱియు నిది సర్వపాండువుల, క్షయముల హరింపంజేసి లోకమున కారోగ్యము గలుగంజేయుచుండును.

## క్షయరోగములకు లోకనాథరసము

వరాట తుల్యమండూరం తదర్థం తీక్ష్ణలోహకం,
తత్పాదాంశం మృతం సూతం సూతద్విగుణగంధకమ్. 102
ఖల్వోదరే వినిక్షిప్య మర్దయే ద్దివసత్రయం,
వర్షాభూ మూలసారేణ వజ్రవల్లీరసేన చ. 103
వాసాసాతలకేనాపి చిత్రమూలేన మర్దయేత్,
గోళకంచాతపే శోష్యం దినాంతం తు వినిక్షిపేత్. 104
శరావేణ చ మృద్వగ్నౌ కుక్కుటీపుటవద్భవేత్,
సూక్ష్మచూర్ణం తతః కృత్వా తత్సమం మారిచం రజః. 105
భావనానంతరం ద్రవ్యం నాగవల్లీరసార్ద్రికం,
భృంగరాజం చ నిర్గుండీ ముండీ శిగ్రురసస్తథా. 106
త్రిఫలారసభావేన ఛాయాశుష్కం తు కారయేత్,

* మండూర మన — ప్రాతచిట్టెము.

† ఆర్ద్రమూష యన — ఆవము (సూళె)లో నుంచని మూస.

నిష్కార్ధం మధునా లేహ్యం యామేయామే చ భక్షయేత్. 107
క్షయం క్షయకృశం వ్యాధీన్ వాతపిత్తకఫోద్భవాన్,
కాసశ్వాస ప్రతిశ్యాయ శోభ పాండు గదాదికాన్. 108
హలీమకంచాస్థిగతం వినిహంతి చ సత్వరం,
దీపనం వీర్యవృద్ధిం చ కారయేన్నాత్ర సంశయః. 109
లోకనాథరసో నామ శంభునా పరికీర్తితః, (పూజ్యపాదీయే)

తా. గవ్వభస్మము ౧ భాగము, మండూరము ౧ భాగము, లోహభస్మము ౪ భాగము, రసభస్మము, లేక శుద్ధిచేసిన రసము ౨ భాగము, శుద్ధిచేసిన గంధకము ౧ భాగము - ఇటుల వీనినెల్ల ఖల్వమున నునిచి గలిజేరువేళ్ళు, నల్లేరు, అడ్డసరము, సంబరేణు, చిత్రమూలము అనువానిరసములచే మూడుదినములు బాగుగ మర్దించి సెనగగింజలంతేసి మాత్రలుచేసి ఒకదినము ఎండించి మూకుడులో నునిచి దానిపై నొకమూకుడు మూసి బాగుగ చీలమన్ను లేపనముచేసి కుక్కుటపుటం బిడవలయును. లేక ఒకఝాము వఱకు పొయిమీఁదనైనావండవలయును. పిదప నామాత్రల సాంగశీతలమునదీసి చూర్ణము చేసి దానికి సమముగ మిరియములచూర్ణము కలిపి తమలపాకు, అల్లము, గుంటగలగరాకు, వావిలి, బోడతరము, మునగచెక్క, కరకతాండ్రయుసిరికెలు అనువాని రసములతో ప్రత్యేకప్రత్యేకముగ భావన చేసి అర్ధనిష్కప్రమాణము మాత్రలుచేసి నీడ నెండించి తేనెతో ప్రతిఝామున సేవింపుచుండిన క్షయరోగము, క్షయము వలన జనించిన శరీరకృశత్వము, వాతపిత్తశ్లేష్మమువలన జనించిన కాసశ్వాసలు, పీనసము, శోఫ, పాండువు మొదలగు రోగములు, హలీమక, అస్థిగతజ్వర, అగ్నిమాంద్య రోగముల నిస్సంశయముగ హరింపఁజేసి వీర్యవృద్ధిని సహా గలుగఁజేయును. ఇది శివునిచే జెప్పంబడిన లోకనాథరస మనంబడును. (పైఁజెప్పిన యౌషధముల నన్నింటిని సర్వక్షయ రోగములయం దుపయోగింపవలయును. తాళకసిందూరము నొసంగునెడ దానియనుపానముల నెఱింగి ప్రయోగింపవలయును.)

### క్షయరోగములయందు పథ్యము

పురాణశాల్యోదనముద్గయూషౌ ఘృతామృతే వాస్తుకమేఘనాదౌ,
కూశ్మాండశిగ్రూ లఘురుచ్యభోజ్య క్షయేషుపథ్యంసముదాహరంతి.

తా. ప్రాతరాజనపుబియ్యపువంటకము, పెసరకట్టు, మేకనెయ్యి, మేకపాలు, చక్రవర్తపుకూర, చిఱ్ఱికూర, ముదురుగుమ్మడికాయ, మునగకూర, లఘువై రుచికరముగ నుండు ద్రవ్యములు క్షయరోగులకు పథ్యకరంబులు.

కుళుత్థయూషోనిలహా శర్కరాశ్మరిభేదనః,
తూని ప్రతూని నిరసో గుల్మ మేహ క్షయాపహాః. 111

తా. ఉలవకట్టు వాతరోగము, శర్కరాశ్మరి, తూని, ప్రతూని గుల్మరోగము, మేహరోగము, క్షయరోగము గలవారలకు పథ్యకరంబులు.

క్షయరోగములయం దపథ్యములు

వర్జయేల్లవణం హింగు గవాంతక్రం సదాపయేత్,
క్షీరమాజ్యదధిక్వాథ పథ్యవర్గ క్షయేఽహితః. 112

తా. లవణము, ఇంగువ, ఆవుచల్ల (ఆవుమజ్జిగ), పాలు, నెయ్యి, పెరుగు, పగరుగలద్రవ్యములు, క్షయరోగుల కపథ్యములు.

చతుర్థ ప్రకరణమ్.



# పంచమప్రకరణే



## పాండురోగనిదానలక్షణచికిత్సాదయః

అవతరణిక. ఇపుడు గ్రంథకర్త విఘ్నబాహుళ్యశంకగలవాఁడై తనచే జేయంబడు నీగ్రంథము నిర్విఘ్నముగ పరిసమాప్తి జెందుటకై తనకిష్టదేవతయగు ఈశ్వర నమస్కారాత్మకమంగళమును "నందీశ శేషశీతాంశు" అను శ్లోకముచే జేయుచున్నాఁడు.—

నందీశ శేష శీతాంశు సింహ కర్పూర సారసైః,
చందనేన చ తుల్యాంగం నీలకంఠమహం భజే. 1

తా. నందీశ్వరుఁడు, ఆదిశేషుఁడు, చంద్రుఁడు, సింహము, కర్పూరము, సారస పక్షి, చందనము అనువానితో తుల్యశరీరముగల నీలకంఠుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజు అని పేరొకనఁబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథముయొక్క యైదవప్రకరణమును వచింపుచున్నాఁడను.



### పాండురోగనిదానాదులు

పాండురోగాః స్మృతాః పంచ వాతపిత్తకఫై స్త్రయః,
చతుర్థ స్సన్నిపాతేన పంచమో భక్షణాన్మృదః. 3
వ్యాయామో లవణం చామ్ల మతితీక్ష్ణం చ మృత్సుగా,
సేవనాచ్చ దివాస్వాపా జ్జాయతే పాండుర స్త్వచి. 4
అపక్వం మూత్రవిట్పీతం మృత్తికా భక్షణాధికం,
నిష్ఠీవనం త్వచి స్ఫోటో విజ్ఞేయం పూర్వలక్షణమ్. (ఆయుర్వేదే)

తా. పాండురోగములు వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, మృత్పాండువు లన నైదువిధంబులు. మిక్కుటముగ సంచారాదులు సేయుటవలన, ఉప్పు, పులుసు కడు తీక్ష్ణద్రవ్యములు, మృత్తిక, కల్లు అనువానిని మిక్కుటముగ సేవించుటవలన, పగటి నిద్రవలన, రక్తముదుష్టంబై చర్మము పాండురవర్ణముగ నగును. అందుభుజించినయన్నము

జీర్ణము గాక విరేచనంబు లగుట, మలమూత్రములు పచ్చగ వెడలుట, అధికముగ మన్ను దినుటయం దిచ్ఛ గలుగుట, కారి ఉమియుట, శరీరము ఎండి చర్మము ఊడుట, లే శరీరము గాచరై యుండుట ఈలక్షణములు ముందుగలుగబోయెడి పాండురోగమునకు పూర్వరూపంబులు.

వాతపాండురోగలక్షణము

త్వఙ్మూత్రనయనాదీనాం రౌక్ష్యం కృష్ణారుణాభతా,
వాతపాండ్వామయే కంపతోదానాహ భ్రమాదయః.
(మాధవనిదానే

తా. చర్మము మూత్రము నేత్రములు మొదలగునవి రూక్షగనేని, నల్లగనేని ఎఱ్ఱగనేని యుండుట, వణకు, సూదులచే బొడుచునటుల వేదన, కడుపుబ్బరము, భ్ర మొదలగునవి గలుగుట ఈలక్షణములు గలది వాతపాండు వని తెలియవలయును.

పిత్తపాండురోగలక్షణము

పీత మూత్ర శకృన్నేత్రో దాహ తృష్ణా జ్వరాన్వితః,
భిన్నవిట్కోఽతిపీతాభః పిత్తపాండ్వామయీ నరః.
(మాధవనిదా

తా. మూత్రము మలము నేత్రములు పచ్చగ నుండుట, దాహము దప్పి జ్వర గలుగుట, అధికముగ మలము వెడలుట, శరీరము కడుపచ్చగ నుండుట ఈలక్షణము గలది పిత్తపాండు వని తెలియవలయును.

శ్లేష్మపాండురోగలక్షణము

కఫ ప్రసేక శ్వయథు తంద్రాలస్యాతిగౌరవైః,
పాండురోగీ కఫాచ్ఛుక్లై స్త్వఙ్మూత్రనయనాననైః.
(మాధవనిదా

తా. తెమడ వెడలుట, వాపు తంద్ర ఆలస్యము గలుగుట, శరీరము కడుబరువ నుండుట, చర్మము మూత్రము నేత్రములు తెల్లగ నుండుట ఈ లక్షణములు గలది శ్లే పాండువని తెలియవలయును.

సన్నిపాతపాండురోగలక్షణము

జ్వరారోచక హృల్లాస తృష్ణా ఛర్ది క్లమాన్వితః,
పాండురోగీ త్రిభిర్దోషై స్త్యాజ్యః క్షీణో హతేంద్రియః.
(గ్రంథాంత

తా. జ్వరము అరుచి ఓకర దప్పి వాంతి బడలిక గలుగుట, పైఁజెప్పఁబడిన వాత, పిత్త, శ్లేష్మ పాండురోగలక్షణంబు లన్నియు గలిగియుండుట, శరీరము క్షయించుట, ఇంద్రియములు స్వస్వవిషయగ్రాహక శక్తివిహీనంబులుగ నుండుట ఈలక్షణములు గలది సన్నిపాతపాండు వని తెలియవలయును. ఇదిగలరోగికి చికిత్స చేయంజనదు. ఐనను చక్షురాదింద్రియములకు స్వస్వవిషయగ్రాహకశక్తి గలిగియుండిన చికిత్స చేయవలయును.

### మృత్పాండురోగలక్షణము

మృత్తికాదనశీలస్య పాండురోగస్సుదుస్సహః,
జాయతే క్రిమికుష్ఠం చ హ్యతిసారస్సకృత్కఫః. 10
శూనాక్షీ కూటగండభ్రూః శ్శూనహస్తాది మేహనః,
అతిశ్వేతోఽతిదగ్ధాంగ శ్ఛర్ది మూర్ఛా తృషాన్వితః. 11
(మాధవనిదానే)

తా. మిక్కుటముగ మన్ను భక్షించుటవలన పాండురోగము జనించును. అందు పురుగులు కుష్ఠువు అతిసారము గలుగుట, ఒకానొకపుడు తెమడ వెడలుట, కనురెప్పలు చెక్కిళ్ళు కనుబొమలు హస్తములు తొడలు పాదములు నాభి మేహనము ఉబ్బియుండుట, శరీరము తెలుపుబారియుండుట, శరీరము మండుట, వాంతులు మూర్ఛ దప్పి గలుగుట ఈలక్షణములు గలది మృత్పాండు వని తెలియవలయును. ఇది అసాధ్యము.

### ప్రకారాంతరపాండురోగలక్షణము

నయనధవళకాంతిస్స్వేదనం జాడ్యరూపం
శ్వయథు వమన మాంద్యం చాంగశోషాతిసారం,
అరుచి జఘనజాడ్యం శ్లేష్మ నిద్రాతిపిత్తం
శ్రమ భ్రమణ విదాహం షోడశైతాని పాండౌ. (నిత్యనాథీయే)

తా. నేత్రములు తెల్లగనుండుట, చెమట, శరీరజాడ్యము, వాపుగలుగుట, వమనంబగుట, శరీరము వాతపూరితముగ నుండుట, శరీరము శోషించుట, అతిసారము అరుచి గలుగుట, పిఱుదులయందు జాడ్యముగలుగుట, దగ్గు నిదుర కడుపైత్యము అలసట గలుగుట, శరీరము దిరుగుట, కడుదాహము గలుగుట ఈపదహారు లక్షణములు గలది పాండురోగ మని తెలియవలయును.

నయనధవళకాంతి స్స్వేదనం జాడ్యరూపం
పవనపదకరాగ్నిత్వంగశోఫ స్తథైవ,

అరుచిరనలమాంద్యం శ్లేష్మనిద్రా ప్రయుక్తిః
భ్రమణ మతివిదాహో ద్వాదశైతాని పాండౌ. (సిద్ధరసార్ణవే)

తా. నేత్రములు తెల్లగనుండుట, చెమట శరీరజాడ్యము గలుగుట, శరీరము వాతపూరితముగ నుండుట, కాళ్ళు చేతులు మండుట, శరీరము వాచుట, అరుచి అగ్నిమాంద్యము దగ్గు నిద్ర భ్రమ గలుగుట, శరీర మధికముగ మండుట ఈపన్నెండులక్షణములు గలది పాండురోగ మని తెలియవలయును.

వివర్ణతా శరీరస్య శ్వయథుః కార్శ్యమేవ చ,
సత్వహాని స్తథాలస్యం పాండురోగస్య లక్షణమ్. (గ్రంథాంతరే)

తా. శరీరము వివర్ణముగ నుండుట, శరీరము వాచుట, శరీరము కృశించుట, సత్వము లేకుండుట, ఆలస్యము గలుగుట ఈ లక్షణములు గలది పాండురోగ మని తెలియవలయును.

నిస్సార శ్శిథిలేంద్రియోఽల్పవచనం శూనాక్షికూట స్తథా
శ్వాసః కర్ణరవోఽగ్నిసాధనయుతో హ్యక్ష్ణప్రమేద స్రవః,
కాసో దృష్టి విహీనతా నిశి తనౌ కార్శ్యం చ నిష్ఠీవనం
ధాతూనాం శిథిలత్వ మంగగురుతా పీతాన్వితః పాండురః. 15
(ఆయుర్వేదే)

తా. శరీరము నిస్సత్తువగ నుండుట, ఇంద్రియములు క్షయించుట, మాటలాడుటకు శక్తి లేకుండుట, కనురెప్పలు ఉబ్బుట, శ్వాసము గలుగుట, చెవిలో గింగురింగు మనుట, అగ్నిమాంద్యముగలుగుట, నేత్రముల నీరు పుసి గారుట, దగ్గుగలుగుట, రాత్రుల నేత్రములకు దృష్టి లేకుండుట, శరీరము కృశించుట, తఱచుగ ఉమియుట, సప్తధాతువులు శిథిలంబు లగుట, శరీరము వాచుట, శరీరము పసపుపారియుండుట ఈలక్షణములు గలది పాండురోగ మని తెలియవలయును.

పూర్వోక్తపంచపాండురోగమారకోపద్రవములు

తంద్రా దాహా రుచి శ్ఛర్ది మూర్ఛాధ్మానాతిసారవాన్,
పాండుదంతేక్షణనఖః పాండుసంఘాతదర్శనః. 16
ఏభిశ్చలక్షణైర్యుక్తం వర్జయేత్పాండురోగిణం, (సిద్ధవిద్యాభూః)

తా. తంద్ర దాహము అరుచి వాంతులు మూర్ఛ కడుపుబ్బరము అతిసారము గలుగుట, దంతములచిగుళ్లు నేత్రములు గోళ్లు పాండురవర్ణముగ నుండుట, సర్వ

వస్తువులు పాండురవర్ణముగ నగుపడుట-ఈలక్షణములు పైఁజెప్పిన పంచవిధపాండు రోగములలో దేనియందు గలిగియుండినను ఆ పాండురోగిని వర్జింపవలయును.

పాండుదంతనఖోయస్తు పాండునేత్రశ్చ యో భవేత్. 17
పాండుసంఘాతదర్శీ చ పాండురోగీ వినశ్యతి, (చింతామణౌ)

తా. దంతములచిగుళ్ళు గోళ్ళు నేత్రములు అనునవి రక్తహీనంబులై పాండుర వర్ణముగనుండినను, లేక సర్వవస్తువులు పాండురవర్ణముగ గనుపించినను, ఆపాండు రోగి వైవస్వతనిలయంబున కేగు నని తెలియవలయును.

పాండురోగే శ్వయథుమాన్ పీతాక్షినఖవాం స్తథా. 18
తంద్రా దాహోఽరుచిశ్ఛర్దిః పాండురోగీ వినశ్యతి,
(పూజ్యపాదీయే)

తా. శరీరము వాచియుండుట, నేత్రములు గోళ్ళు పసపుపారియుండుట, తంద్ర తఱచుగ దాహము అరుచి గలుగుట, వమనంబగుట ఈ లక్షణములుగల పాండురోగి యమధర్మరాజును గాంచు నని తెలియవలయును.

నాసికాస్రుతరక్తశ్చ మేహపాండ్వామయీ క్షయీ 19
సద్యో విముంచతి ప్రాణాన్ సత్యమేవ న సంశయః,

తా. మేహ, పాండు, క్షయరోగములయందు ముక్కు బెదిరి రక్తము గారు చుండిన రోగి నిస్సంశయముగ తత్క్షణమున ప్రాణంబుల విడుచును.

నిస్సారతాతినిష్ఠీవ శ్రమశూనాక్షికూటతాః. 20
ధాతూనాం శిథిలత్వం స్యా దసాధ్యం పాండులక్షణం,
(రసరత్నాకరే)

తా. శరీరము సత్వవిహీనమై యుండుట, తఱచుగ నుమియుట, అలసట గలు గుట, కనురెప్ప లుబ్బియుండుట, సప్తధాతువులు శిథిలంబులై యుండుట ఇవి అసాధ్య పాండురోగలక్షణము లని తెలియవలయును.

ధాతుక్షయసమాయుక్త శ్ఛర్ది శోఫాద్యుపద్రవః. 21
పీతభాసా సమాలోకః పాండురోగీ త్యజేదసూన్, (ఆయుర్వేదే)

తా. సప్తధాతువులు క్షయించుట, వమనంబులగుట, శరీరము వాచుట, శరీ రము పసపుపారియుండుట, సర్వవస్తువుల పచ్చగ గాంచుట ఈ లక్షణములు గల పాండు రోగి ప్రాణముల విడనాడు నని తెలియవలయును.

ఉ. ఇంద్రియనష్టి ధాతువులు హీనతఁ బొందుట పాండురోగముల్
తంద్ర యరోచి ఛర్దియును దాహము మూర్ఛయుఁగండ్లుపండులుఁ
సాంద్రము తెల్పు పచ్చ యతిసారము ముక్కున నెత్తురొల్కుటల్
చంద్రునకైన మాన వివి సత్యము చెప్పెదఁ దాఁకెనేనియున్.

రోగసాధ్యాసాధ్యవివరణము

ప్రయోగశ్శమయేద్వ్యాధి మన్యామయముదీరయేత్. 22
నాసావశుద్ధశ్శుద్ధస్తు శమయేన్న సమీరయేత్, (నిత్యనాథీయే)

తా. ఔషధప్రయోగము శుద్ధరోగము (అనఁగా ఏకదోషజనితరోగము)లను హరింపఁజేయునేగాని ఇతరరోగముల గలుగఁజేయకుండును. మఱియు అశుద్ధరోగములను (అనఁగా ద్వంద్వరోగములను త్రిదోషజనితరోగములను) ఔషధముఁ బ్రయోగించిన ఇతర రోగములు జనించును. అట్లగుటంజేసి శుద్ధరోగములకే చికిత్సంజేయవలయును. అశుద్ధరోగములు కుదురుట దుర్లభంబగుటచే వానికి చికిత్స జేయంజనదు.

పాండురోగచికిత్సారంభక్రమము

పాండ్వామయే పిబేత్సర్పిరాదౌ కల్యాణకాహ్వయమ్. 23
ఊర్ధ్వశుద్ధిమధశ్శుద్ధింవిధ్యుక్తం త్వాచరేత్తతః, (శారీరనిఘంటౌ)

తా. పాండురోగికి తొలుత కల్యాణఘృతమును పానము చేయించి పిదప వమన విరేచనంబుల కొసంగి శాస్త్రోక్తముగ ఔషధసేవలను జేయింపవలయును.

వాతపాండువునకు రససిందూరభూషణము

శుద్ధసూతం స సిందూరం పలైకైకం విమర్దయేత్. 24
వాసారసేన యామైకం త లేకుర్యాచ్చ చక్రికాం,
అపక్వాం కారయేన్మూషా మున్నతాం ద్వాదశాంగుళామ్. 25
తన్మధ్యే గంధకం శుద్ధం క్షిపే త్పలచతుష్టయం,
పూర్వోక్తాం చక్రికాం వక్త్రే దత్వా రుద్ధ్వా పుటే లఘు. 26
జీర్ణే గంధే సముద్ధృత్య చక్రికాం తాం విచూర్ణయేత్,
చూర్ణాద్దశగుణం యోజ్యం మృతలోహం చ మర్దయేత్. 27
లశునస్య దశాంశేన చణమాత్రా వటీకృతా,
వాతపాండుహరస్సిద్ధో రసస్సిందూరభూషణః. (మాధవనిదానే)

తా. శుద్ధిచేసిన పాదరసము, సిందూరము - వీనిని దినుసు కొక్కొకపలము చొప్పున ఖల్వమున నునిచి అడ్డసరపురసముచే నొకఝామము మర్దించి అఱచేతిలో

బిళ్ళజేసి పన్నెండంగుళములపొడవుగల [1]అపక్వమూషను గ్రహించి దానిలోపల నాలుగు పలములు శుద్ధిచేసిన గంధకమును వైచి దానిపై ఈబిళ్ళ నునిచి మూషయొక్క మూతిని బలపపుబిళ్ళతో మూసి చీలమన్ను లేపనముచేసి మూసయందలి గంధకము జీర్ణం బగు వఱకు లఘుపుటంబిడి యాబిళ్ళను దీసి ఖల్వమున నునిచి చూర్ణముచేసి దానికి పదింతలు లోహభస్మము గలిపి ఈ యౌషధమునకు పదియవభాగము వెల్లుల్లిపాయల గలిపి మర్దించి సెనగగింజలంతేసి మాత్రలుచేసి అనుపానవిశేషములతో సేవించిన వాతపాండువు హరించును. ఇది రససిందూరభూషణ మనంబడును.

మండూరం చూర్ణితం శ్లక్ష్ణం గోమూత్రే ఒష్టగుణే పచేత్,
త్ర్యూషణం త్రిఫలా ముస్తం విళంగం చవ్య చిత్రకమ్. 29
దార్వీ గ్రంథీ ర్దేవదారు తుల్యం సర్వం విచూర్ణయేత్,
చూర్ణం మండూర తుల్యం చ పాకకాలే విమిశ్రయేత్. 30
భక్షయే త్కర్షమాత్రం చ జీర్ణాంతే తక్రభోజనం,
పాండు శోఫ హలీమం చ హ్యూరుస్తంభం చ కామిలామ్. 31
అర్శాంసి హంతి శీఘ్రం చ హంసమండూరకాహ్వయం,
(అన్యశాస్త్రే)

తా. [2]మండూరమును దంచి మృదువుగ చూర్ణముచేసి దాని కెనిమిదింతలు గోమూత్రము పోసి పాకము చేయవలయును. పాకకాలంబున త్రికటుకములు, త్రిఫలములు, తుంగముస్తెలు, వాయువిడంగములు, చవ్యము, చిత్రమూలము, మ్రానిపసపు, దేవదారు అను వానిని సమభాగములుగ దంచి చూర్ణముచేసి పై మండూరమునకు సమముగ వైచి బాగుగ కలియబెట్టి పాకముజేసి కర్షప్రమాణము మాత్రలుజేసి సేవింపవలయును. సేవించిన యౌషధము జీర్ణంబైనపిదప మజ్జిగ అన్నమును భుజింపవలయును. ఇట్లుల చేసిన పిత్తపాండువు, శోఫలు, హలీమకము, ఊరుస్తంభవాతము, కామిలారోగము, మూలవ్యాధి శీఘ్రముగ నశించును. ఇదియ హంసమండూర మనఁబడును.

### శ్లేష్మపాండువుకు మండూరవటుకములు

నిశాదార్వీత్వచం చవ్యం గ్రంథికం దేవదారు చ. 32
వ్యోమం చ నవకం చైతచ్చూర్ణయే ద్ద్విగుణం తతః,
మండూరం చాంజననిభం సర్వతో ఒష్టగుణే క్షిపేత్. 33
పృథఙ్మిపచ్య గోమూత్రే వటకీకరణక్షమే,

1 అపక్వమూషయన—అర్ద్రమూష. 2 మండూరమన—ప్రాత ఇనుపచిట్టెము.

ప్రక్షిప్య వటికాః కుర్యాత్ త్రాం ఖాదే త్తక్రభోజనమ్. 3
ఏతామండూరవటికా అగదాః పాండురోగినాం,
కుష్ఠాసృగ్రజకం శోఫా మూరుస్తంభ మరోచకమ్. 3
అర్శాంసి కామిలాం మేహం ప్లీహానం శమయంతి చ, (మతాంతరే

తా. మండూరమును కాటుకవలె చూర్ణముచేసి యామండూరమునకు ఈ క్రిందజెప్పంబడు ద్రవ్యములచూర్ణమునకును ఎనిమిదింతలు గోమూత్రముపోసి మాత్రల జేయుటకు పక్వంబగువఱకు పాకముజేసి అందు పసపు, మ్రానిపసపు, లవంగపుచెక్క, చవ్యము, కానుగచెక్క, దేవదారుచెక్క, త్రికటుకములు అనువానిని సః భాగములుగ దంచి చూర్ణముజేసి పై మండూరమున కర్ధభాగము కలిపి రేగుపండం మాత్రలుచేసి సేవింపుచుండిన పాండువులు, కుష్ఠువులు, శోఫలు, రజశ్శూలలు, ఊరు స్తంభవాతము, అరుచి, మూలరోగము, కామిల, మేహము, ప్లీహారోగము హరించును ఇవియు మండూరకవటకము లనంబడును. సేవించిన యౌషధము జీర్ణంబైనపిదప మజ్జి యన్నమును భుజింపవలయును.

## మృత్పాండువుకు స్వయమగ్నిముఖమండూరము

మండూరం ద్వాదశపలం గోమూత్రే ఉష్టగుణే పచేత్.
పంచకోలం దేవదారు ముస్తం వ్యోషం ఫలత్రయం,
విడంగం పలమాత్రం తు పాకాంతే చూర్ణితం క్షిపేత్.
పాయయే దక్షమాత్రం తు తక్రేణ సహబుద్ధిమాన్,
పాండు ఖుందాగ్ని గ్రహణీ శోఫా ర్శాంసి హలీమకమ్.
ఊరుస్తంభం క్రిమిప్లీహ గళరోగం చ నాశయేత్,
అసాధ్యం శ్వయథుం హంతి పాండురోగం చిరోద్భవమ్.
స్వయమగ్నిముఖం నామ మృత్పాండౌ చ ప్రశస్తకం,
(గ్రంథాంత

తా. ౧౨ పలముల గోమూత్రములో సూక్ష్మముగ చూర్ణముచేయఁబడిన ౧ పలముల మండూరమును వైచి పాకముచేసి అందు *పంచకోలములు, దేవదారు, తు ముస్తెలు, త్రికటుకములు, త్రిఫలములు, వాయువిడంగములు - అనువానియొక చూర్ణమును దినుసు కొక్కొక పలము చొప్పున పాకాంతమున వైచి కలియబెట్టి గ కాయలంతేసి మాత్రలుజేసి యం దొకదానిని మజ్జిగతో సేవింపుచుండిన మృతా

---

* పంచకోలమన—పిప్పళ్ళు, మోడి, చెవ్యము, చిత్రమూలము, శొంఠి.

డుపు, అగ్నిమాంద్యము, గ్రహణీరోగము, వాపు, మూలవ్యాధి, హలీమకము, ఊరుస్తంభవాతము, క్రిమిరోగము, ప్లీహరోగము, గళరోగము, అసాధ్యమైనవాపు, దీర్ఘకాలముగ జనించియుండు పాండురోగము నశించును. ఇదియ స్వయమగ్నిముఖమండూరమనంబడును. ఇది మృత్పాండువులకు కడుప్రశస్తము.

సన్నిపాతపాండువుకు సిద్ధమండూరము

మండూరస్య పలాన్యష్టౌ గోమూత్రే ఽష్టగుణే పచేత్. 40
పునర్నవా త్రివృద్వ్యోషం విడంగం దేవదారుకం,
ద్వివిశే పుష్కరం వహ్ని దంతీ చవ్యం ఫలత్రికమ్. 41
తుటజస్య ఫలం తిక్తా పిప్పలీ మూల ముస్తకం,
విషం చ ప్రతికర్షం తు చూర్ణయిత్వా వినిశ్రయేత్. 42
మండూరస్య చ పాకాంతే హ్యక్షమాత్రావటీ కృతా,
పాండు [1] శోఫోదరానాహ శూలార్శః క్రిమి గుల్మనుత్. 43
ఇత్యేవం సిద్ధమండూరం [2]సర్వపాండువినాశకృత్. (సూత్రస్థానే)

తా. ౬౪ పలముల గోమూత్రములో సూక్ష్మముగ చూర్ణముచేయఁబడిన ౮ పలముల మండూరమును వైచి పాకముజేసి అందు గలిజేరు, శుద్ధిచేసినతెగడ, త్రికటుకములు, వాయువిడంగములు, దేవదారు, పసపు, మ్రానిపసపు, పుష్కరమూలము, చిత్రమూలము, నేలదంతి, చవ్యములు, త్రిఫలములు, కొడిసెవిత్తులు, చేదుబీరవిత్తులు, మోడి, తుంగముస్తెలు, అతివస అనువానియొక్క చూర్ణమును దినుసుకు కర్షప్రమాణముచొప్పున మండూరపాకకాలమున కలిపి గచ్చకాయలంతేసి మాత్రలుజేసి యం దొకదానిని సేవించిన పాండువు, వాపులు, ఉదరరోగములు, కడుపుబ్బరము, శూలలు, మూలవ్యాధి, క్రిమిరోగము, గుల్మములు హరించును. ఇదియ సిద్ధమండూర మనంబడును. ఇది సర్వపాండువుల హరింపంజేయును. (పైఁజెప్పిన నైదువిధపాండురోగభేదముల శాస్త్రోక్తముగ నెఱింగితగిన యౌషధంబుల సేవించిన సర్వపాండువులు హరించును.)

సర్వపాండ్వాదులకు చించాదికషాయము

కాలలోహశకలేనవాథవా తన్మలేన సహ తింత్రిణీదళైః,
క్వాథితాంబు సకలావినాశనే ద్వంద్వపాండుగదశోఫకామిలాః.
(అశ్వినీకల్పే)

తా. చింతాకును దంచి అందు ఇనుపతునకలగాని, లేక చిట్టెచూర్ణమునుగాని

1 శోఫజ్వరానాహ. 2 సర్వరోగ.

వైచి కషాయము కాచి వడియగట్టి దానిలో పిప్పలిచూర్ణము కలిపి సేవించిన ముదిరిన పాండువులు, వాపులు, కామిలలు మొదలగునవి హరించును.

సర్వపాండువులకు లఘుచించాదిలేహ్యము

చించాపత్రతులా మర్ధతులాం కృష్ణలోహశకలానాం,
ద్విద్రోణేంబుని విపచే ద్వసుభాగశ్రితేచ గుడపలాన్యత్ర. 45
ప్రక్షిప్య పంచవింశతి మార్ద్రికశకలాని షోడశపలాని,
వృశ్చికవరదకరసం ప్రస్థం విపచ్యాం సాంద్రతరం తత్ర. 46
త్రికటుక జీరక చూర్ణం చతుష్పలం తత్సమం చ మండూరం,
దత్వావతార్యధాన్యే నిధాయ పక్షం యథానలం లీఢమ్. 47
వినిహంతి పాండు శోఫ గ్రహణీ మేహన ప్లీహానాహాన్,
అయమశ్విభ్యాం దిష్టో హ్రస్వశ్చించాదిలేహ్యకస్సమ్యక్. 48
(అశ్వినీకల్పే

తా. చింతాకు ౧౦౦ పలములు, ఇనుపతునకలు ౫౦ పలములు-ఇటుల వీనిని నొకభాండమున వైచి అందు ఎనమండుము ఉదకము బోసి ఒకతూము శేషించునటుల చిక్కగ కషాయము గాచి వడియగట్టి అందు బెల్లము ౨౫ పలములు, పైబొబ్బరతీసిన అల్లపుతునకలు ౧౬ పలములు, తేలుచుణియాకురసము ౧ కుంచెడు, త్రిఫల కషాయము ౧ కుంచెడు వైచి లేహపక్వముగ కాచి యందు సొంటి, పిప్పలి, మిరియాలు, జీలకఱ్ఱ అనువానిని దినుసు కొక్కొకపలముచొప్పున చూర్ణము జేసివైచి అందు ౪ పలములు సూక్ష్మముగ చూర్ణముచేయఁబడిన మండూరమును కలిపి పొయిమీఁదనుండి దించి చల్లార్చి ౧౫ దినములు ధాన్యరాశియం దునిచి యందుండి దీసి అగ్నిబలానుగుణ్యముగ సేవింపుచుండిన ముదిరినపాండువులు, వాపులు, గ్రహణీరోగములు, మేహములు, ప్లీహరోగము, కడుపుబ్బరము హరించును. ఇదియ అశ్వినీదేవతలచే జెప్పంబడిన లఘుచించాదిలేహ్యము. (ఇది పాండు, శోఫల హరింపంజేయుటయందు కడు ప్రసిద్ధిం జెందినది.)

పాండువులకు ప్రకారాంతరలఘుచించాదిలేహ్యము

పాదాంశై ర్లోహశకలై శ్చించాపత్రతులాంసహ,
పచేజ్జలేఽష్టగుణితే తస్మిన్ పాదావశేషితే. 49
పక్వే గుడతులాం సమ్యక్ సార్ధప్రస్థార్ద్రికాన్వితాం,
ఆతపే జీరకం వ్యోషం ప్రత్యేకం పలపంచకమ్, 50

తత్సమంచాపి మండూరం క్షౌద్రం ప్రస్థం చ నిక్షిపేత్,
లఘుచించాదిలేహోఽయం సర్వపాండు నిబర్హణః. 51
ఆనాహ మరుచిం శోఫ కాసశ్వాస మహోదరం,
హలీమకం కామిలాం చ సర్వంచైవ వ్యపోహతి. (అశ్వినీకల్పే)

తా. చింతాకు ౧౦౦ పలములు, ఇనుపతునకలు ౨౫ పలములు - ఇటుల వీనిని నొకభాండములో వైచి యందు దెసిమిదింతలు ఉదకముబోసి చతుర్థాంశముగ కషాయము గాచి వడియకట్టి అందు ౧౦౦ పలములు బెల్లము, పైపొట్టుతీసిన అల్లపుతునకలు ౨౮ పలములు వైచి లేహ్యపక్వముగా కాచి అందు జీలకఱ్ఱ, శొంఠి, పిప్పలి, మిరి యాలు అనువానిని దినుసు ఒకటింటికి ౫ పలములచొప్పున చూర్ణము జేసివైచి కలియఁ బెట్టి అందు ౨౦ పలములు శుద్ధమండూరమును కలిపి చల్లార్చి పిదప నందు కుంచెడు తేనె పోసి బాగుగ కలియఁబెట్టి ౧౫ దినములు ధాన్యరాశియందు దునిచి ప్రతి దినము నాలుగుమాడలయెత్తు లేహ్యమును సేవింపుచుండిన సమస్తపాండువులు, కడు పుబ్బరము, అరుచి, శోఫ, కాసశ్వాసములు, మహోదరము, హలీమకను, కామిలలు హరించును. ఇదియ లఘుచించాదిలేహ్య మనంబడును. మఱియు నిది పాండువు, వాపు, కామిల, హలీమకమ్ము అను నీరోగముల బోకడచును.

సర్వపాండువులకు మహాచించాదిలేహ్యము

చించాపత్రతులార్ధ మాయసరజో వహ్నిస్తథైవార్ద్రకం
తస్యార్ధం పృథగే తదర్ధముదితం దేవం చ పౌనర్నవం,
పాఠానాయకపుంఖ ధాన్యకుటజ ద్రాక్షాః పృథక్ ప్రస్థకాః
చవ్యగ్రంథి దశాంఘ్రియశ్చ కుడపః క్వాథేతురాస్మిన్గుడమ్. 53
చాఙ్గేరీదళ మాతులుంగ-రసయోః ప్రస్థం తథా పాచయేత్
వేల్లత్ర్యూషణ జీరకం త్రుటి శటీ త్వక్పత్రకం పాలికం,
మండూర ద్విపలాయస త్రిపలికే క్షౌద్రేణ యోజ్యం తథా
సేవ్యోఽయం చిరపాండు శోఫ శమన శ్చించాదిలేహ్యోమహాన్.
(గ్రంథాంతరే)

తా. చింతాకు ౧౦౦ పలములు, ఇనుపరాపొడి, చిత్రమూలము ఇవి దినుసుకు ౫౦ పలములు, అల్లము, దేవదారు, గలిజేరువేళ్ళు, చిరుబొద్దివేళ్ళు ఇవి దినుసుకు ౨౫ పలములు, ములువెంపలివేళ్ళు, కోతిమెర్లు, కొడిసెచెక్క, ద్రాక్షపండు ఇవి దినుసుకు ౧౬ పలములు, చవ్యము, పిప్పలీమూలము ఇవి దినుసుకు ౪ పలములు, దశమూలములు

దినుసుఒకటింటికి ౪ పలములు-ఇటుల వీనిని గ్రహించి వీనికన్నిటికి నాలుగింతలు (అనగా వైద్యసంప్రదాయప్రకారము ముప్పందుము) నీళ్ళుపోసి చతుర్థాంశముగ చిక్కగ కషాయము కాచి వడియగట్టి అందు ౧౦౦ పలములు బెల్లము కలిపి వడబోసి అందు పులిచింతాకురసము కుంచెడు, మాదీఫలరసము కుంచెడు పోసి బాగుగ కలిపి లేహ్యపాక ముగ వండి అందు వాయువిడంగములు, త్రికటుకములు, జీలకఱ్ఱ, ఏలకులు, కచోర ములు, దాల్చినిచెక్క, తాళిసపత్రి అను వానియొక్క చూర్ణము దినుసు కొక్కొక పలము, మండూరము ౨ పలములు, లోహభస్మము ౩ పలములు లేహ్యపాకమున వైచి సాంగశీతలమున తేనె కలిపి సేవించిన ముదిరిన పాండువు శోఫలు హరించును. ఇదియ మహాచించాదిలేహ్య మనంబడును.

పాండువులకు రక్షాకర్మాదులు

ద్వ్యఙ్గుళేఽధః కూర్పరతో దహే త్తామ్రశలాకయా,
చించాదిలేహ్యద్వితయం ప్రయోజ్యం పాండురోగిణామ్. 55
(గ్రంథాంతరే)

తా. పాండురోగముల మోచెయ్యికి రెండంగుళములకుదిగువ తామ్రశలాకుతో రక్షలు వేయుటయే గాక లోనికి చించాదిలేహ్యమునేని, మహాచించాదిలేహ్యమునేని నొసంగవలయును.

హలీమకవివరము

వాతపిత్త సముద్భూతః పాండురోగో హలీమకమ్. 56

తా. వాతపిత్తములచే జనించిన పాండువు, హలీమక మని చెప్పంబడును.

హలీమకలక్షణము

యదాతు పాండోర్వర్ణస్స్యా ద్ధరిత శ్శ్యావపీతకః,
బలోత్సాహక్షయ స్తంద్రా మందాగ్నిత్వం మృదుర్జ్వరః 57
స్త్రీష్వహర్షోఽంగమర్దశ్చ దాహ తృష్ణారుచిర్భ్రమాః,
హలీమకం తదా తస్య విద్యాదనిలపిత్తతః. (గ్రంథాంతరే)

తా. పాండురోగమధ్యమున శరీరము ఆకుపసపువర్ణము, కపిలవర్ణము, లేక పసపువర్ణముగలదై బలము, ఉత్సాహము అనునవి నశించి తంద్ర, అగ్నిమాంద్యము, స్వల్పజ్వరము, స్త్రీసంభోగమునం దిచ్ఛలేకుండుట, ఒడలునొప్పి, దాహము, దప్పి, అన్నద్వేషము, భ్రమ అనునవి గలిగియుండిన వాతపిత్తములచే జనించిన హలీమక మని తెలియవలయును.

### పాండువులకు త్రిఫలాయసచూర్ణము

త్రిఫలా ద్వికరంజాగ్ని కుండలీ చూర్ణసంయుతం,
పాండురోగీ పిబే ల్లోహ రజ స్తక్రేణ మండలమ్. (లోహతంత్రే)

తా. కరక తాండ్ర యుసిరికెలు, క్రానుగచెక్క, సెమలిచెక్క, చిత్రమూలము నల్లఉప్పిచెక్క వీనిని సమభాగములుగ చూర్ణము చేసి యందు తగుమాత్రము లోహ భస్మము కలిపి మజ్జిగతో ఒకమండలము సేవించిన పాండువు, శోఫలు హరించును.

### పాండువులకు సహాయసచూర్ణము

వ్యోషాగ్ని వేల్ల త్రిఫలా తుల్యం భసితమాయసం,
సహాయసమిదం చూర్ణం ప్రశస్తం పాండుశోభినామ్. 60
(చింతామణౌ)

తా. త్రికటుకములు, చిత్రమూలము, వాయువిడంగములు, త్రిఫలములు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దానికి సమముగ లోహభస్మము కలిపి, యందొక తులమును ప్రతిదినము మజ్జిగతో సేవింపుచుండిన పాండువు, శోఫలు హరించును. (క్షయరోగ ప్రకరణమున జెప్పంబడిన కాంతవల్లభరసము నేని, లోకనాథరసము నేని సర్వపాండువులయందు బ్రయోగింపం దగును.)

### సర్వపాండువులకు పూర్ణచంద్రరసము

ద్వికర్షం శుద్ధసూతం చ గంధకం చ ద్వికర్షకం,
లోహభస్మ పలంచాభ్రం జారితం చ పలాశకమ్. 61
ద్వితోలం రజతం చైవ వంగభస్మ ద్వికర్షకం,
సువర్ణం తోలకం చైవ తామ్రం కాంస్యం చ తత్సమమ్. 62
జాతీఫలం చేంద్రపుష్ప మేలాం భృంగం చ జీరకం,
కర్పూరం వనితా ముస్తం కర్షం కర్షం పృథక్పృథక్. 63
సర్వం ఖల్వతలే క్షిప్త్వా కన్యారసవిమర్దితం,
భావయిత్వా వరీతోయై రుబుకానాం రసైస్తథా. 64
ఏరండపత్రై స్సంవేష్ట్య ధాన్యే రాత్రిం దివోషితం,
ఉద్ధృత్య మర్దయిత్వా తు వటికాం వల్లసమ్మితామ్. 65
ఖాదేచ్ఛ వటికా మేకాం పర్ణఖండేన సంయుతాం,
సర్వవ్యాధివినాశాయ కాశీనాథేన నిర్మితః. 66
పూర్ణచంద్రరసో నామ్నా సర్వరోగేషు యోజయేత్,

బలో రసాయనో వృష్యో వాజీకరణ ఉత్తమః. 67
అయమష్ఠీలికాం హంతి కాసశ్వాస మరోచకం,
ఆమశూలం కటీశూలం హృచ్ఛూలం పంక్తిశూలకమ్. 68
అగ్నిమాంద్య మజీర్ణం చ గ్రహణీం చిరజాం పరాం,
ఆమవాతం చామ్లపిత్తం భగందరమపి ద్రుతమ్. 69
కామిలాం పాండురోగం చ ప్రమేహం వాతశోణితం,
వాతఃపరతరం శ్రేష్ఠో విద్యతే వాజికర్మణి. 70
రసస్యాస్య ప్రసాదేన నరో భవతి నిర్గదః,
మేధాం చ లభతే వాగ్మీ తుష్టిపుష్టిసమన్వితః. 71
మదనస్య సమాకాంతిర్మదనస్యసమం బలం,
గీయతే మదనే నైవ మదనస్యసమం వపుః. 72
ప్రియాం చైవ రతిప్రాయాం పశ్యేచ్ఛ మదనాకులం,
స్త్రీణామప్యనపత్యానాం దుర్బలానాం చ దేహినామ్. 73
క్షీణానా మల్పశుక్రాణాం వృద్ధానాం వాతరేతసాం,
ఓజస్తేజస్కరశ్చాయం స్త్రీషు కామవివర్ధనః. 74
అభ్యాసేన నిహంతి మృత్యుపలితం సర్వామయధ్వంసనః,
వృద్ధానాం మదనోదయోదయకరః ప్రౌఢాంగనాసంగమే,
నిత్యానందకరస్తథాతిసుఖదో భూపైః సదా సేవ్యతే
దృష్టస్సిద్ధఫలో రసాయనవరః శ్రీపూర్ణచంద్రో రసః. 75

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము ఇవి దినుసుకును రెండుకర్షములు, లోహభస్మము, జారణము చేయఁబడిన అభ్రకభస్మము, ఇవి దినుసు కొక్కొకపలము, రజతభస్మము ౨ తులములు, వంగభస్మము ౨ కర్షములు, సువర్ణభస్మము తామ్రభస్మము, కంచుభస్మము - ఇవి దినుసుకొక్కొకతులము, జాజికాయ, లవంగములు, ఏలకులు, లవంగపుచెక్క, జీలకఱ్ఱ, పచ్చకర్పూరము, వనితా, తుంగముస్తెలు - ఇవి దినుసు కొక్కొకపలము - ఇటుల వీనినెల్ల ఖల్వమున నునిచి కలబందరసముతో మర్దించి పిదప పిల్లిపీచరము, ఆముదపువేళ్లు అనువానిరసములలో ప్రత్యేక ప్రత్యేకముగ భావనచేసి ముద్దచేసి ఆముదపాకులలో చుట్టి ధాన్యరాశియం దొకఱేయుంబగ లునిచి పిదప దానిని యందుండి తీసి మరల మర్దించి వల్లప్రమాణము మాత్రలుజేసి యందొకదానిని తమలపాకులోనునిచి సేవించిన సర్వరోగములు హరించును.

ఇదియ దివోదాసునిచే నిర్మింపఁబడిన పూర్ణచంద్రరస మనంబడును. దీనిని సర్వరోగముల ప్రయోగింపం దగును. ఈ రసాయనము బలమును, వీర్యవృద్ధిని, మైథునశక్తిని గలుగం జేయుటయే గాక అష్ఠీలికావాతము, కాసశ్వాసలు, అరుచి, ఆమశూల, కటిశూల, ఱొమ్మునొప్పి, పంక్తిశూల, అగ్నిమాంద్యము, అజీర్ణము, చిరకాలముగ నుండు గ్రహణి రోగము, ఆమవాతము, అమ్లపిత్తము, భగందరము, కామిల, పాండువు, ప్రమేహము, వాతరక్తము అను వానిని సగా కడుశీఘ్రముగ పోకడుచును. *వాజీకరణమునకు దీనికన్న శ్రేష్ఠంబైన యౌషధం బెద్దియులేదు. ఈరస సేవనవలన నరుఁడు సర్వరోగవిముక్తుం డగుటయే గాక మేధ, వాక్పటుత్వము, సంతోషము, శరీరపుష్టి, మన్మథునితో సమాన మైన శరీరకాంతి, బలము గలవాఁడుగ సగా నగును. మఱియు వానికి స్త్రీలయం దత్యాసక్తియు, వానియందు స్త్రీలకు కడు ఆసక్తియు గలుగును. దీనిని గొడ్రాలుగ నుండు స్త్రీ సేవించిన సంతానంబును, దుర్బలులుగ నుండువారు సేవించిన బలంబును, శరీరకృశత్వము, అల్పశుక్రవృద్ధాప్యము, వాతదుష్టశుక్రము గలవారు సేవించిన ఓజస్సు, తేజస్సును గలుగును. దీనిని స్త్రీలు సేవించిన వారికి కామోద్రేకము గలుగును. మఱియు దీని సేవనవలన మరణము, ముదిమి, సర్వరోగములు హరించి వృద్ధులు కామోద్రేకము గలవారై మదించిన స్త్రీలను సురతమున తృప్తిపరచెదరు. మఱియు నీరసమును రాజులు ప్రత్యహము సేవింపుచుండిన వారికి కడుసౌఖ్యము వాటిల్లును. ఈరసము నిశ్చయముగ ఫలమును గలుగం జేయును.

### పాండుశోఫలకు శోఫాంకుశరసము

తామ్రపత్రం త్రిభాగేన రసగంధేన లేపయేత్,
నింబద్రవేణ సంయోజ్య సూర్యతాపే వినిక్షిపేత్. 76
ఊర్ధ్వాధో గంధకం దత్వా పాచయే దతియత్నతః,
మత్స్యాక్షీ మర్దితం కృత్వా మృద్భాండే వాలుకే క్షిపేత్. 77
యామమాత్రం చ పక్త్వైవం స్వాంగశీతలముద్ధరేత్,
గుంజామాత్రాం వటీం కృత్వా పథ్యయా గుడసంయుతామ్. 78
ఆర్ద్రకస్య రసేనాపి శోఫ పాండు విభేదనం,

* వాజః శుక్రం తదస్యాస్తీతివాజీ అవాజీవాజీ క్రియతే పురుషోఽనేనేతి వాజీకరణమ్. శ్లో. యేన నారీషు సామర్థ్యం వాజీవల్లభతే నరః, యేనవాభ్యధికం వీర్యం వాజీకరణమేవ తత్,

శోఫాంకుశరసో నామ్నా లోకానాం హితకారకః. 79
(జాతుకర్ణనిఘంటౌ)

తా. శుద్ధిజేసిన రాగిరేకులు 3 భాగములు, శుద్ధిజేసిన రసము 3 భాగములు, శుద్ధిజేసిన గంధకమును గ్రహించి వేపాకురసములో బాగుగ మర్దించి లేపనముజేసి ఎండనెండించి మూకుటిలో నునిచి వానికి ఊర్ధ్వాధోభాగముల గంధకము నునిచి చీల మన్ను పూసి పాకము జేసి మరల పొన్నగంటియాకురసములో మర్దించి మాత్రలు జేసి యందొకదానిని కరక్కాయచూర్ణము, బెల్లము అనువానితోగాని, అల్లపురసములోగాని సేవించిన శోఫ, పాండువులు హరించును. ఇదియ శోఫాంకుశరస మనఁబడును.

## శోఫముద్గరరసము

రసం గంధం మృతం తామ్రం పథ్యా వాలుకగుగ్గులు,
సమమాజ్యేన సంయుక్తం గుళికాః కారయేత్తతః. 80
ఏకైకాం సేవయేద్వైద్య శ్శోఫపాండ్వపనుత్తయే,
సీతలం చ బలం దేయం తక్రంచామ్లం వివర్జయేత్. 81
శోఫముద్గరనామ్నాయం పూజ్యపాదేన నిర్మితః, (గ్రంథాంతరే)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, తామ్రభస్మము, కరక్కాయలు, కూతురుబుడమ, శుద్ధిజేసిన గుగ్గిలము వీనిని సమభాగములుగ గ్రహించి నేతితో బాగుగ మర్దించి ఐదు చిన్నములయెత్తుమాత్రలు జేసి యందొకదానిని సేవించిన పిదప శీతోదకమును పానముజేసిన శోఫ, పాండువులు హరించును. ఇదియ పూజ్యపాదునిచే నిర్మింపఁబడిన శోఫముద్గరరస మనంబడును. దీనియందు మజ్జిగను, పులుసును వర్జింపవలయును.

## శుష్కపాండులక్షణము

పాండురోగే భవేత్కార్శ్యం శుష్కపాండుం వినిర్దిశేత్. 82
(మాధవనిదానే)

తా. పాండురోగములలో శరీరము ఎండియుండిన శుష్కపాండు వని తెలియవలయును.

## శుష్కపాండువులకు కాలవిధ్వంసనరసము

పారదం త్రిఫలం దత్వా గంధకే త్రిపలాత్మకే,
పచేద్యామం చ చుల్ల్యాం తు చూర్ణయిత్వా తతః పునః. 83
గుళూచీ సారమాధాయ శుష్కం సప్తపలాత్మకం,
మర్దయిత్వా తతస్సర్వం మధునా గుళికాకృతమ్. 84

వాసాపత్రైస్స్వమాబధ్య మధుభాండే వినిక్షిపేత్,
ఏకైకాం భక్షయేన్నిత్యం శుష్కపాండువినాశనః. 85
కాలవిధ్వంసనో నామప్యసాధ్యం శ్వయథుం జయేత్,

తా. శుద్ధిజేసిన రసము 3 భాగములు, శుద్ధిజేసిన గంధకము 3 భాగములు ఇటుల వీని నేకముజేసి మర్దించి మూసళ్ళలో నునిచి బాగుగ చీలమన్ను లేపనముజేసి ఒకరఘాము వండి సాంగశీతలమున చూర్ణముజేసి యందు తిప్పసత్తు 2 భాగములు కలిపి తేనెతో మర్దించి మాత్రలుజేసి అడ్డసరపాకులలో నునిచి బంధించి తేనెకుండయం దునిచి యం దొక్కొకమాత్రచొప్పున ప్రత్యహము ప్రాతస్సాయంకాలముల సేవింపుచుండిన శుష్కపాండువు, అసాధ్యశోఫలు హరించును. ఇదియె కాలవిధ్వంసనరస మనఁబడును.

## శుష్కపాండుక్షయలకు త్రైలోక్యసుందరరసము

భాగారసస్య చత్వారో గంధకస్య చ పంచ చ. 86
ముసలీ త్రిఫలాచైవ త్రికటుర్గోచ సంజ్ఞకః,
గుళూచి సత్వకంచైవ పంచ పంచ పృథక్పృథక్. 87
అభ్రకస్య షడష్టౌ చ లోహస్య పరికీర్తితాః,
చూర్ణయిత్వా చ తత్సర్వం భావయే దతియత్నతః. 88
చతుష్షష్టికవారం చ త్రిఫలాక్వాథత స్తథా,
తదర్ధం భృంగరాజస్య తదర్ధం శిగ్రుమూలతః. 89
ద్రవేణ చిత్రమూలస్య తదర్ధం గృహకన్యయా,
ఆర్ద్రికస్య ద్రవేణాపి భావనా పరికీర్తితా. 90
త్రైలోక్యసుందరోనామ్నా శుష్కపాండుక్షయాపహః,
అష్టవల్లం ప్రదద్యాశ్చ దశ ద్వాదశ రా భిషక్. 91
మధునాసితయావాపి ఘృతేన కణయాపివా,
ఏవంచించాసమాయుక్తం శోఫ పాండు వినాశనమ్. 92
పథ్యం మృగాంకవద్దద్యా ద్భక్ష్యం సర్వం వివర్జయేత్,
(ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసిన పాదరసము ౪ భాగములు, శుద్ధిచేసిన గంధకము ౫ భాగములు, నేలతాటిగడ్డలు, కరక తాండ్ర యుసిరికెలు, శొంఠి, పిప్పలి, మిరియాలు, బూరుగ, పిప్పసత్తు అనువానిచూర్ణము దినుసు కొకటింటికి ౫ భాగములు, అభ్రకసిందూరము ౬ భాగములు, లోహభస్మము ౮ భాగములు-ఇటుల వీనినెల్ల ఖల్వమున వైచి చూర్ణము

జేసి త్రిఫలాకషాయముచే ౨౮ భావనలు, గుంటగలగరాకుకషాయముచే ౩౨ భావనలు, మునగవేళ్ళరసముచే ౧౬ భావనలు, చిత్రమూలము, కలబంద, అల్లము అను వానిరసములచే ప్రత్యేక ప్రత్యేకముగ ఎనిమిదేసి భావనలుజేసి పిదప ఎనిమిది, లేక పది, లేక పన్నెండు వల్లముల ప్రమాణము మాత్రలుజేసి యందొకదానిని తేనె, పంచదార, ఘృతము అను వానితోనేని, చింతాకురసము పిప్పలితోనేని సేవింపుచుండిన శుష్కపాండువు, క్షయములు, వాపులు హరించును ఇదియ త్రైలోక్యసుందరరస మనంబడును. దీనియందు సర్వభక్ష్యముల వర్జించి మృగాంకరసములో జెప్పంబడిన పథ్యము నాచరింపవలయును.

గంధకం టంకణం సూతం త్రికటు త్రిఫలా సమమ్.  93
నవద్రవ్యాణి చైతాని లోహ కిట్టం సమాంశకం,
గోమూత్రే ద్విగుణే పక్త్వా తత్సమం మిశ్రితం గుడమ్.  94
భక్షయేత్కోలమాత్రం తు శాల్యన్నం తక్రభోజనం,
అనంతగుణమండూరం క్షయపాండువినాశనమ్: (అన్యశాస్త్రే) 95

తా. ౯ భాగముల చిట్టెపుచూర్ణములో ౩౬ భాగములు గోమూత్రము పోసి కాచి అందు శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిచేసిన వెలిగారము, త్రికటుకములు, త్రిఫలములు అనువానిచూర్ణము దినుసుకొక్కొకభాగముచొప్పున ౯ భాగములు, ప్రాతబెల్లము ౧౮ భాగములు వైచి పాకముజేసి రేగుపండంత మాత్రలుజేసి సేవింపుచుండిన క్షయము, పాండువు హరించును. ఇదియ అనంతగుణమండూరము. పథ్యము - దీనియందు మజ్జిగయన్నమును భుజింపవలయును.

పాండురోగములయందు పథ్యము

భోజనం సాత్మ్యకం శాలి యవ గోధూమ ముద్గకం,
జాంగలాని చ మాంసాని గోపయో మాహిషం ఘృతమ్.  96
వృష్టా పటోలం వేత్రం చ పర్పటం శాక ద్రాక్షకం,
దాడీమంచాపి ఖర్జూరం ఫలాన్యామలకాని చ.  97
పంచమూలం సింధువారి పిబేద్వాతాదికే తథా,
సర్వేషాం పాండురోగాణాం మాహిషం తు ఘృతం హితమ్.  98
(మాధవనిదానే)

తా. శరీరప్రకృతికనుగుణముగనుండు భోజనము, ప్రాతవడ్లు, యవలు, గోధుమలు, పెసలు, జాంగలమాంసము, ఆవుపాలు, బఱ్ఱెనెయ్యి, అడ్డసరము, పొట్లకాయ,

దురుగొమ్ము, పర్పాటకము, తోటకూర, ద్రాక్షపండు, దానిమ్మపండు, ఖర్జూరపండు, సిరికెపండు, మారేడు, నెల్లికూర, గుమ్మడుబద్ద, దుందిలము, కలిగొట్టు, నదీజలము - ఇవి వాతాది సర్వపాండురోగములయందు పథ్యకరంబులు.

పాండురోగముల పథ్యాపథ్యములు

గురుద్రవ్య విదాహీని తిలం ముద్గాన్నమేవ చ,
గ్రామ్యాన్యుపోతకీంచాపి మాంసాని పరివర్జయేత్. 99
సర్వేషాం పాండురోగాణాం మాహిషం తు ఘృతం హితం,
ఇతి సామాన్యతః ప్రోక్తం పాండురోగే చికిత్సకైః. 100

తా. గురుద్రవ్యములు, విదాహకరవస్తువులు, నువ్వులు, పులగము, ఊరబచ్చలికూర, మాంసములు ఇవి పాండురోగములయందు అపథ్యకరంబులు. సర్వపాండురోగములకు బఱ్ఱెనెయ్యి హితకరము. ఇటుల పాండురోగముల చికిత్సకులచే పథ్యాపథ్యంబులు సామాన్యంబుగ జెప్పంబడియె.

పాండురోగచికిత్సావిధానము

పాండురోగేషు కుశల శ్శోఫోక్తం చక్రియా క్రమమ్. 101

తా. బుద్ధిమంతుఁ డగువైద్యుఁడు పాండురోగములయందు సగా శోఫచికిత్సలనే జేయవలయును.

శోఫనిదానము

నీత్వానిలో రుధిరపిత్తకఫాన్ ప్రదుష్టో
బాహ్యస్సిరాః ప్రకుపితాన్ సచ తైర్నిరుద్ధః,
త్వఙ్మాంస సంశ్రయమలం వితనోతి శోఫం
సోత్సేధసంహతమథోకిల శోఫమాహుః. 102
కర్మవ్యాధికృశత్వతీక్ష్ణలవణక్షారోష్ణశీతాశనా
చ్ఛోకస్వప్నసురాతిమాంసరతితస్సంక్షోభణాద్వాహనాత్,
ఊర్ధ్వాధశ్చ సిరాసురోధకుపితః స్థిత్వానిలో మధ్యగః
సోత్సేధం పరిసర్పిణం వితనుతే శోఫం చ సర్వాంగగమ్ 103
శ్వయథుర్యస్య పాదస్థో ఘునఃపాదౌ నిపీడయేత్,
శోఫస్సంధిని వైషమ్యం తం భిషక్పరివర్జయేత్. (అశ్వినీకల్పే) 104

తా. సర్వకారణముచే దుష్టమైనవాతము రక్తపిత్తకఫముల దోషయుక్తంబులుగ జేసి బైటిసిరల జెందునటులం జేయును. పిదప వాతము పూర్వోక్తరక్తపిత్తకఫములచే నడ్డ

గింపఁబడినదై త్వఙ్మాంసములయం దున్నతముగ, కఠినముగ నుండువాపును గలుగంజేయు ను. ఇదియ శోఫరోగ మనంబడును. మఱియు ప్రారబ్ధకర్మమువలన వ్యాధిచే జనించెడి కృశత్వమువలన అత్యుష్ణము, లవణము, కారము, ఉష్ణము, శీతలముగల పదార్థసేవనవలన శోకము, నిద్ర, కడుమద్యపానము, కడుమాంసభక్షణము అనువానిసేవనవలన, కోరికల వలన, శరీరశ్రమవలన, అధికముగ భారమును మోయుటవలన వాతము సిరలయొక్క ఊర్ధ్వాధఃప్రదేశములయందు పూర్వోక్తరక్తపిత్తకఫములచే నడ్డగింపఁబడుటంజేసి ప్రకోపించినదై శరీరమంతట వ్యాపించి ఉన్నతమైనశోఫను గలుగంజేయును. మఱియు ఎవనికి పాదములయందు వాపు దిగి గట్టియై వేదనను గలుగంజేయుచు మరల తొడలయందు వ్యాపించుచు నుండెడినో, అట్టివానిని వైద్యుఁడు వర్జింపవలయును.

రక్తపిత్తకఫాన్వాయుర్దుష్టోదుష్టాన్ బహిస్సిరాః,
నీత్వా రుద్ధగతి స్తైర్హి కుర్యాత్త్వఙ్మాంససంశ్రయమ్. 105
సోత్సేధం సంహతం శోఫం తమాహుర్నిచయాదతః,
(గ్రంథాంతరే)

తా. వాతము దుష్టంబై స్వకారణముచే దుష్టంబులైన రక్తపిత్తకఫముల బాహ్యసిరల జెందునటులంజేసి వానిచే నడ్డగింపఁబడిన గతిగలదై త్వఙ్మాంసాశ్రితముగ నుండు వాపును గలుగంజేయును. ఆవాపు పొడవుగ, కఠినముగ నుండును. మఱియు నిది రక్తయుక్తత్రిదోషసంబంధముగలదిగ నుండుటంజేసి సన్నిపాతాత్మక మని చెప్పంబడును.

### శోఫవిభాగము

సర్వం హేతువిశేషైస్తు రూపభేదాన్నవాత్మకమ్. 106
దోషైః పృథగ్ద్వయైస్సర్వై రభిఘాతాద్విషాదపి,

తా. ఆవాపు కారణభేదజనిత కార్యభేదములవలన వాత, పిత్త, శ్లేష్మ, వాతపిత్త, పిత్తశ్లేష్మ, శ్లేష్మవాత, సన్నిపాత, అభిఘాత విషసంబంధమువలన తొమ్మిది విధంబులుగ నగును.

### శోఫపూర్వరూపము

తత్పూర్వరూపం దవథుస్సిరాయామోఽంగగౌరవమ్. 107

తా. సంతాపము గలుగుట, సిరలు ఈడ్చినటుల నొచ్చుట, శరీరజడత్వము గలుగుట ఈలక్షణములవలన వాపు జనించు నని తెలియవలయును.

### శోఫకారణము

శుద్ధ్యామయాభక్తకృశా బలానాం క్షారామ్లతీక్ష్ణోష్ణగురూపసేవా,

దధ్యామమృచ్ఛాకవిరోధి దుష్టగరోపసృష్టాన్ననిషేవనం చ. 108
ఆర్శాంస్యచేష్టా నచ దేహశుద్ధి ర్మర్మోపఘాతో విషమా ప్రసూతిః,
మిథ్యోపచారః ప్రతికర్మణాం చ నిజస్య హేతుశ్శ్వయథోః ప్రదిష్టః.

తా. వమనవిరేచకాది శోధనము, జ్వరాదిరోగములు, విరుద్ధభోజనము, ఉపవాసము ఈ మొదలగువానివలన కృశించినవారలు, మఱియు సత్వక్షయముగలవారలు, ఉప్పు, పులుసు, కారము, ఉష్ణము, జడముగల పదార్థముల సేవించుటవలనను, పెరుగు అపక్వద్రవ్యములు, మృత్తిక, ఆకుకూరలు, క్షీరమత్స్యాది విరుద్ధపదార్థములు, దుష్టాన్నము, విషసంబంధముగల అన్నము ఈ మొదలగువానిని సేవించుటవలనను, మూలవ్యాధి, సంచారాదులు సేయకుండుట, వమనవిరేచనములచే శోధనార్హం బగుదోషముల శోధింపకుండుట, హృదగుదాది మర్మస్థలముల దోషములు కుపితంబగుటచే ఉపఘాతము గలుగుట, ఆమగర్భప్రసవము, విరుద్ధప్రసవము, వమనాదికర్మలయందు విరుద్ధోపచారంబులు సేయుట ఈ మొదలగువానివలనను వాపు జనించును.

## శోఫసామాన్యలక్షణము

సగౌరవం స్యాదనవస్థితత్వం సోత్సేధమూష్మాథ సిరాతనుత్వం,
సలోమహర్షశ్చ వివర్ణతా చ సామాన్యలింగం శ్వయథోః ప్రదిష్టమ్.

తా. శరీరజడత్వము చంచలచిత్తము శరీరమున ఉబ్బు దాహము గలుగుట, నరములు ఉబ్బుట, గగుర్పొడుచుట, శరీరము వివర్ణముగ నుండుట ఈలక్షణములు శోఫలయందు సామాన్యముగ గలిగియుండునని తెలియవలయును.

## వాతజశోఫలక్షణము

చల స్తనుత్వక్పరుషోఽరుణోఽసిత
స్సుషుప్తిహర్షార్తియుతోఽనిమిత్తతః,
ప్రశామ్యతి ప్రోన్నమతి ప్రపీడితో
దివాబలీ స్యాచ్ఛ్వయథుస్సమీరణాత్. 111

తా. వాపు చంచలముగ చర్మము పలచగ కఠినముగ ఎఱ్ఱగ లేక నల్లగ నుండుట, స్పర్శజ్ఞానము లేకుండుట, జిలజిల యను వేదనగాని గగుర్పాటుగాని గలిగి కారణము లేకనే శమించుట, అణచిన తక్షణమున పైకిలేచుట, పగటియందు వాపు ప్రాబల్యముగ నుండుట ఈలక్షణములుగలది వాతజశోఫ యని తెలియవలయును.

## పిత్తజశోఫలక్షణము

మృదు స్సగంధోఽసిత పీత రాగవాౝ

భ్రమ జ్వర స్వేద తృషా మదాన్వితః,
యఉష్యతే స్పర్శరుగక్షిరాగకృ
త్సపిత్తశోఫో భృశదాహపాకవాన్. 112

తా. మృదువుగ, ఒకింత గంధయుక్తముగ, నల్లగ, పసపుగ, ఎఱ్ఱగ నుండుట, భ్రమ, జ్వరము, చెమట, దప్పి, ఉన్మాదము, తాపముగలుగుట, తాఁకిన నొచ్చుట, నేత్రము లెఱ్ఱగనుండుట, కడుమంటలు, పాకముగలుగుట ఈలక్షణములుగలది పిత్తజశోఫ యని తెలియవలయును.

### శ్లేష్మజశోఫలక్షణము

గురుః స్థిరః పాండుగరోచకాన్వితః
ప్రసేకనిద్రావమివహ్నిమాంద్యకృత్,
సకృచ్ఛ్రజన్మప్రశమో నిపీడితో
నచోన్నమేద్రాత్రిబలీ కఫాత్మకః. 113

తా. జడముగ, స్థిరముగ, పాండువర్ణముగ నుండుట, అన్నద్వేషము గలుగుట, జొల్లుకారుట, నిద్ర, ఓకర, అగ్నిమాంద్యము గలుగుట, చిరకాలముమీఁదట ఉత్పత్తినాశనముల జెందుట, అణచిన పైకిలేవకుండుట, కఫము రాత్రులయందు వృద్ధిని జెంది నాడుల నడ్డగించి రోగికి దేహక్లేదమును, చేష్టావిహీనతను గలుగంజేయుటవలని వాపు బలవత్తరముగ నుండుట, పగటియందు కఫమునకు బలము లేకుండుటంజేసి స్రోతస్సులకు ప్రతిబంధము, చేష్టావిహీనత లేకుండుట-ఈ లక్షణములుగలది శ్లేష్మజశోఫ యని తెలియవలయును.

### ద్వంద్వజ, సన్నిపాతజ శోఫలక్షణము

నిదానాకృతిసంసర్గా చ్ఛ్వయథుస్స్యాద్ద్విదోషజః,
సర్వాకృతిస్సన్నిపాతా చ్ఛోఫో వ్యామిశ్రలక్షణః. 114

తా. రెండురెండు దోషవికారములు, లక్షణములు గలిగియుండిన ద్వంద్వశోఫ యనియు, వాతాదిసర్వదోషలక్షణములు గలిగియుండిన సన్నిపాతశోఫ యనియు తెలియవలయును.

### అభిఘాతజశోఫలక్షణము

అభిఘాతేన శస్త్రాది ఛేదభేదక్షతాదిభిః,
హిమానిలోదధ్యనిలై ర్భల్లాతకపికచ్ఛుజైః. 115
రసైశ్శూకైశ్చ సంస్పర్శాచ్ఛ్వయథుస్స్యాద్విసర్పవాన్,

భృశోష్మాలోహితాభాసః ప్రాయశః పిత్తలక్షణః. 116

తా. కాష్ఠాదులచే ప్రహరించుట, శస్త్రాదులచే నరుకుట, బ్రద్దలుసేయుట, లేక గాయపఱుచుట, చలిగాలి, సముద్రపుగాలి, జీడిగింజరసము, దురదగొండిరసము, ముల్లు అను వాని సంబంధమువలన శరీరమున వాపు జనించి కడుదాహము, ఎఱుపువర్ణము, తఱుచుగ పిత్తశోఫలక్షణములు గలిగియుండుట ఈలక్షణములు గలది అభిఘాతశోఫ యని తెలియవలయును.

## విషజశోఫలక్షణము

విషజస్సవిషప్రాణి పరిసర్పణమూత్రణాత్,
దంష్ట్రాదంతనఖాఘాతా దవిషప్రాణినామపి. 117
విణ్మూత్రశుక్రోపహత మలవద్వస్త్రసంకరాత్,
విషవృక్షానిలస్పర్శా ద్గరయోగావచూర్ణనాత్. 118
మృదుశ్చలోవలంబీచ శీఘ్రోదాహరుజాకరః,

తా. విషజంతువులు శరీరముపైఁ బరుగిడుటచేనేని, లేక వానిమూత్రము శరీరముపైఁ బడుటచేనేని, లేక విషవిహీనజంతువులయొక్క కోరలు, లేక దంతములు, నఖములు అనువాని అభిఘాతముచేనేని, లేక విషప్రాణులయొక్క మల, మూత్ర, శుక్లములచే తడిసిన వస్త్రమును ధరించుటచేనేని, లేక విషవృక్ష విషవాత స్పర్శచేనేని, లేక విషసంబంధముగలవస్తువును శరీరముపై పూయుటచేనేని విషశోభ జనించును. ఆశోభ మృదువుగను, చంచలముగ, వ్రేలునదిగ, శీఘ్రోత్పత్తి, దాహము, పీడ గలదిగ నుండును.

## వాతాదిస్థానవిశేషమువలన శోఫోత్పత్తిక్రమము

దోషాశ్శ్వయథు మూర్ధ్వం హి కుర్వంత్యామాశయస్థితాః. 119
పక్వాశయస్థా మధ్యేతు వర్చస్థానగతా స్త్వధం,
కృత్స్నం దేహమనుప్రాప్తాః కుర్యుస్సర్వసరంతథా. 120

తా. వాతపిత్తశ్లేష్మములు ఆమాశయగతంబులైన ఱొమ్మునుపైభాగమున, పక్వాశయగతంబులైన ఱొమ్ము, పక్వాశయము అనువానికి మధ్యభాగమున వాపును గలుగఁజేయును. మఱియు మలాశయగతంబులైన పక్వాశయము మొదలు పాదపర్యంతము వాపును గలుగఁజేయును. మఱియు శరీరమంతట వ్యాపించిన సర్వాంగముల వాపును గలుగఁజేయును.

## అసాధ్యశోఫలక్షణము

శ్వాసః పిపాసా ఛర్దిశ్చ దౌర్బల్యం జ్వరయేవ చ,

యస్య చాన్నేరుచిర్నాస్తి శోఫినం పరివర్జయేత్. 121

తా. శ్వాసము, దప్పి, ఓకర, దౌర్బల్యము, జ్వరము, అన్నద్వేషముగల శోఫ రోగిని వర్జింపవలయును.

ఆననం హస్త పాదం చ పుంసి శోఫః ప్రవర్తతే,
పునఃపునః ప్రకారేణాప్యసాధ్యః పరికీర్తితః. (నిత్యనాథీయే) 122

తా. ఏపురుషునికి ముఖము, కాళ్లు, చేతులు అనువానియందు వాపు జనించి నివృత్తింపుచు మరల వాచుచునుండెడినో, అట్టిరోగియొక్క శోఫ యసాధ్యంబని తెలియవలయును.

ఆననం హస్త పాదం చ కుక్షీ గుహ్యౌ వుభావపి,
స్త్రీణాం శోఫః ప్రవర్తేత హ్యసాధ్యః పరికీర్తితః. (సిద్ధసంగ్రహే.

తా. స్త్రీకి ముఖము, చేతులు, కాళ్లు, కడుపు, మర్మస్థలము అనువానియందు వాపు జనించినను, లేక నివృత్తించి మరల వాచినను, ఆస్త్రీయొక్క శోఫ యసాధ్యం బని తెలియవలయును.

గౌరవం చ జ్వరం తృష్ణా మద స్వేదోఽగ్నిమందతా,
మూత్రకృచ్ఛ్రాతిసారం చ ఛర్దిశ్చ శ్వయథౌ భవేత్. 124
(అశ్వినీకల్పే

తా. శరీరము బరువుగ నుండుట, జ్వరము దప్పి గలుగుట, శరీరము గురుతెలియకుండుట, చెమటపట్టుట, అగ్నిమాంద్యము, మూత్రకృచ్ఛ్రము, అతిసారము, వాంతి గలుగుట ఈలక్షణములు గలవాపులు అసాధ్యములని తెలియవలయును.

శోఫమారకోపద్రవములు

అనేకోపద్రవయుతం పాదయోః ప్రసృతం నరం,
నారీం శోఫ ముఖీం హంతి కుక్షీ గుహ్యౌ వుభావపి. (మతాంతరే

తా. ఏపురుషునికి శోఫరోగముతోడ అనేకోపద్రవంబులు గూడి కాళ్లయందు వాపు, స్త్రీకి ముఖమునందు వాపు, స్త్రీపురుషులకు కడుపు, మర్మస్థలము అనువానియందు వాపు గలిగియుండెడినో, అట్టివారు మరణముజెందుదురని తెలియవలయును.

జ్వరాతిసార శోఫానాం శ్వయథౌ చ తథాక్షయే,
ఆననం హస్త పాదం చ విశేషాద్యస్య శుష్యతి. 126
స్వయోనావపి దేహే చ సామాన్యాద్వ్యాతిపంచతామ్,
(నిత్యనాథీయే

తా. పాండు, క్షయరోగములలో జ్వరాతిసారంబేని, శోఫయేని ముదిరినను, లేక ముఖము, కాళ్లు చేతులు శుష్కించి యోని శరీరము వాచియుండినను ఆపాండు క్షయ రోగులు మరణముజెందుదురని తెలియవలయును. (మఱియు అనేకోపద్రవములతో గూడి యుండు శోఫలు అసాధ్యంబు లనియు, తక్కినవి సాధ్యంబు లనియు తెలియవలయును)

క. చిరుచెమట దప్పి మూత్రము
నరికట్టుట పచ్చ నగుట యతిసారంబుక్
జ్వరమును వాంతియుఁ గలంగూ
గురుశోఫలు మానవనుచుఁ గొట్టురు చెప్పెన్.

శోఫారిరసము

స్వచ్ఛసూతేన గంధేన కృతా కజ్జలికా శుభా. 127
తతశ్శుల్బం సకాంతం చ రాజావర్తశ్చ రౌప్యకం,
[1]అభ్రకం చ శిలాతాళం విషం వ్యోష సరాజితాః. 128
విషతిందుక బీజాగ్ని ప్రత్యేకం రససమ్మితం,
సర్వమేకత్ర సంయోజ్య చూర్ణయిత్వా తతఃపరమ్. 129
భృంగరాజరసం దత్వా మర్దయే ద్దివసద్వయం,
శోషణం కారయే త్తేన దాతవ్యా చణకోపమా. 130
రసశ్శోఫారి నామాయం ప్రోక్తమందారభైరవే. 131
స్థౌల్యం రోగ మరోచకాగ్నిసదనం శోఫం చ పాండ్వామయం
ప్లీహం చ గ్రహణీం చ మూలక రుజాం వాతం తథావాహకం,
హిక్కా శ్వాస కఫానిలం క్రిమి యకృచ్ఛూలం చ జీర్ణజ్వరం
సర్వాన్వాతకఫామయాంశ్చ హరతి క్షిప్రం త్రిదోషామయాన్.
(భైరవకల్పే)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము వీనిని సమముగ ఖల్వమున నునిచి కజ్జలిగ మర్దించి యందు తామ్రభస్మము, కాంతభస్మము, [2]రాజావర్తపు రాయి భస్మము, రజితభస్మము, అభ్రకభస్మము, శుద్ధిజేసిన మణిశిల, శుద్ధిజేసిన తాళకము, శుద్ధిజేసిన వసనాభి, త్రికటుకములు, గంటెన, శుద్ధిజేసిన ముష్టిగింజలు, చిత్రమూలము అనువానిలో ప్రతిదానిచూర్ణమును పాదరసమునకు సమముగ వైచి గుంటగలగ రాకు రసముతో రెండుదినములు మర్దించి సెనగగింజలంతేసి మాత్రలు జేసి యెండించి

1 కాచజం చ—గాజుప్పు. 2 రాజావర్త మన—కలుపురాయి.

తేనెతో సేవించిన స్థూలరోగము, అరుచి, అగ్నిమాంద్యము, శోఫ, పాండువులు, ప్లీహ రోగము, గ్రహణిరోగము, మూలరోగము, కడుపుబ్బరము, ఎక్కిళ్లు, శ్వాస, కఫ రోగము, వాతరోగము, కృమిరోగము, యకృద్రోగము, శూల, జీర్ణజ్వరము, సమస్త వాతకఫములచే జనించినరోగములు, త్రిదోషజనితరోగములు కడుశీఘ్రముగ హరించును. ఇదియ మందారభైరవగ్రంథమున జెప్పంబడిన శోఫారిరస మనంబడును.

## శోఫలకు వజ్రమండూరము

సూక్ష్మచూర్ణం తు మండూరం గోమూత్రే పాచయే ద్దినం,
వజ్రవల్లీం సమాంశం చ చించా త్వక్క్షారసంయుతామ్. 133
భక్షితంచాక్షమాత్రం తు హ్యసాధ్య శ్వయథుం జయేత్,
(మాధవనిదానే)

తా. మండూరమును సూక్ష్మముగ చూర్ణముజేసి గోమూత్రములోవైచి ఒకదినము వండి పిదప నామండూరమును గ్రహించి దానికి సమముగ నల్లేరుబూడిదెను, చింత చెక్కలబూడిదెను కలిపి గచ్చకాయలంతేసి మాత్రలుజేసి సేవింపుచుండిన అసాధ్య శోఫలు హరించును. మఱియు పాండురోగమున జెప్పంబడిన బింబాదికషాయమును సహా శోఫరోగములో సేవింపం దగును.)

## శోఫలకు కిట్టాదికషాయము

కిట్టామలకషాయేణ పాండుం శోఫం చ కామిలామ్. 134
చించా కిట్ట కషాయేణ శోఫ పాండు గదం హరేత్,
(ఆయుర్వేదే)

తా. ప్రాతచిట్టెమును, ఉసిరికెపప్పును కషాయము గాచి అందు సిందూరము గలిపి సేవించిన పాండువు, శోఫ, కామిల హరించును. మఱియు చింతాకును, ప్రాతచిట్టెమును కషాయముగాచి యందు సిందూరముగలిపి సేవించిన పాండువు,శోఫ హరించును.(మఱియు పాండురోగములయందు జెప్పంబడిన కాంతవల్లభరసము, లోకనాథ రసము, మండూర కల్పములు, లోహభస్మము, చించాదిలేహ్యము అనువానిలో దేనినేని సేవించిన శోఫలు హరించును.)

## శోఫలకు తింత్రిణీమండూరము

తింత్రిణీ కణసంయుక్తం మండూరం యోజయే త్తతః. 135
పీత్వా చ హరతే శీఘ్రం శోఫ పాండు క్షయాదికం, (బాహటే)

తా. చింతాకు రసము పావుసేరు, పిప్పళ్లు ఒకవరహాయెత్తు, మండూరము ఒక

వరహాయెత్తు-ఇటుల వానినెల్ల నేకముజేసి నలువదిదినములు సేవింపుచుండిన శోఫ, పాండువు, క్షయములు, పురాణజ్వరములు హరించును. పథ్యము—వాయింటికూరను, శాల్యన్నమును భుజింపవలయును.

## శోఫలకు రసభూపతి

రసగంధామృతం తుల్యం తీక్ష్ణతాౘ్రం ఉదుంబరం సమమ్. 136
హంసపాదిద్రవైః ఖల్వే మర్దితం దివసత్రయం,
కాచకుప్యాం నివేశ్యాథ లేపయే ద్వస్త్రమృత్తికామ్. 137
వాలుకాయంత్రకే క్షిప్త్వా శనైర్మృద్వగ్నినా పచేత్,
ద్విషడ్యామం సముద్ధృత్య చూర్ణయే న్మాషమాత్రకమ్. 138
ఆర్ద్రికస్యానుపానేన సర్వశోఫం నిహంతి చ,
రసోహ్యగ్నికుమారాఖ్యో యోగోఽయం రసభూపతిః. 139

(చింతామణౌ)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసినవసనాభి, ఉక్కుభస్మము, తామ్రభస్మము వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమున వైచి హంసపాదియాకు రసముతో మూడుదినములు మర్దించి గాజుకుప్పెలో నునిచి చీలమన్ను లేపనముజేసి వాలుకాయంత్రమున పండ్రెండుఝాములు సూక్ష్మాగ్నిచే వండి సాంగశీతలమున దీసి చూర్ణముచేసి యందు మాషప్రమాణమును అల్లపురసానుపానముతో నొసంగిన సర్వ శోఫలు హరించును. (ఇదియ అగ్నికుమారమని రసభూపతి యని జెప్పంబడును.)

## శోఫలయందు పథ్యము

పురాణశాలి గోధూమ పటోలం తండులీయకం,
ధాత్రీపృథ్వీకఘురసి ద్రాక్షా దాడిమ చందనమ్. 140
తక్రం మధు మధూకే చ శోఫానాం హితమావిదుః,

(మాధవనిదానే)

తా. ప్రాతవడ్లు, గోధుమలు, పొట్లకాయ, చిర్రికూర, ఉసిరికె, గలిజేరుకూర, చేతరాసికూర, ద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లు, శ్రీగంధము, ఆవుచల్ల, ఇప్పపువ్వు, తేనె ఇవి శోఫరోగులకు పథ్యకరంబులు.

## శోఫలయం దపథ్యము

దధి నిష్పావ కట్వమ్ల మత్స్య మద్య విదాహినః. 141
తిలా స్స్నాపశ్చ మాషశ్చ శోఫానా మహితం విధుః,

తా. పెరుగు, చిక్కుడుకాయ, అనపకాయ, కారము, పులుసు, మత్స్యములు కల్లు, విదాహకరద్రవ్యములు, నువ్వులు, పప్పు, మినుములు ఇవి శోఫరోగుల కపథ్యంబులు

కామిలా నిదానము

పాండురోగేషు యే వాత పిత్త కాసాస్తతో భవేత్. 14
హరిద్రయా సమం చక్షు ర్ముఖవిణ్మూత్రమలం తథా,
దాహో విపాకో దౌర్బల్య మరుచిశ్చ ప్రజాయతే. 14
కామిలా సాతికాలేన జాయతే కుంభకామిలా, (మాధవనిదానే

తా. పాండురోగ వాతపిత్తశ్లేష్మలక్షణము లన్నియు గలిగియుండుట, ముఖమ నేత్రములు మూత్రము మలము పసపుపారియుండుట, దాహము గలుగుట, అన్నమ జీర్ణము గాకుండుట, దౌర్బల్యము అరుచిగలుగుట-ఈలక్షణముగలది కామిల యని తెలియ వలయును. ఇది దీర్ఘకాలం బుండుటచే * కుంభకామిలగ పరిణమిల్లును.

కుంభకామిలా లక్షణము

కృష్ణ పీత శకృ న్మూత్ర తంద్రా మోహాశ్చ ఛర్దనమ్. 14
దాహోఽరుచి స్తథానాహ జ్వరోవై రక్తనేత్రతా,
అసాధ్యా శ్వాసకాసశ్చ విజ్ఞేయా కుంభకామిలా. 14
(మాధవనిదానే

తా. మలము నల్లగ, మూత్రము పచ్చగ వెడలుట, తంద్ర మోహము వాం దాహము అరుచి కడుపుబ్బరము జ్వరము గలుగుట, నేత్రము లెఱ్ఱగ నుండుట, శ్వా కాసలు గలుగుట-ఈలక్షములుగలది కుంభకామిల యని తెలియవలయును.

కామిలా సాధ్యాసాధ్యోపద్రవములు

దగ్ధమాంస రుధిరాతిపిత్తతః కామిలా భ్రమ తృషా విదాహినీ,
పీతనేత్ర బలవత్యుపేక్షయా శోభవత్యపిత కుంభకామిలా. 1
కామిలా హంతి రక్తాక్షం రక్తమూత్రం హతానలం,
(అశ్వినీకలే

తా. పిత్తోద్రేకమువలన రక్తమాంసములు ఉడికి శరీరము దిరుగుచు దా తాపముగలిగిన కామిలారోగమని తెలియవలయును. ఇది ఉపేక్షవలన ప్రబలమై నే ముల పసపువర్ణమును శరీరమున శోభను గలుగంజేసి కుంభకామిల యని చెప్పంబడు

* కుంభకామిలయన కోష్ఠము నాశ్రయించియుండు కామిల.

అందు నేత్రములు, మూత్రము ఎఱ్ఱనై అగ్నిదీపనము లేకుండిన రోగి జీవింపఁడని యెఱింగి చికిత్స జేయంజనదు. మఱియు పైదుర్గుణంబులు లేకుండిన రోగము సాధ్యమని యెఱింగి చికిత్సంజేయవలయును.

కామిలకు పంచాస్యరసము

రసభస్మాభ్ర కాంతార్క తీక్ష్ణతాళక మాక్షికమ్. 147
దేవదారు ద్రవైః పిష్ట్వా దినైకం తత్సమం సమం,
పాచయే ద్వాలుకాయంత్రే త్రిదినాంతే సముద్ధరేత్. 148
[1]అమృతోత్పలకల్హార కందేన క్షీరసంయుతం,
పిష్టం యష్ట్యంభసాయామం మాషం క్షౌద్రసితాయుతమ్. 149
రసః పంచాస్యనామ్నాయం సేవయే త్కుంభకామలీ,
(చికిత్సాసారసంగ్రహే)

తా. రసభస్మము, అభ్రకభస్మము, కాంతభస్మము, తామ్రభస్మము, లోహభస్మము, శుద్ధిజేసిన తాళకము, [2]హేమమాక్షికభస్మము వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమున నునిచి ఒకదినము దేవదారుచెక్కరసముతో మర్దించి కుప్పెలో నునిచి వాలుకాయంత్రమున మూఁడుదినములు దీపాగ్నిచే వండి సాంగశీతలమున దీసి ఖల్వములో నునిచి అందు తిప్పతీఁగె, కలువగడ్డలు, తామరగడ్డలు అనువానిచూర్ణమును కలిపి పాలు, అతిమధురకషాయము వీనితో ఒకరుఝాము మర్దించి మాషప్రమాణముంతేసి మాత్రలుజేసి తేనె పంచదారలతోగాని (నల్లగంటెనవిత్తుల చూర్ణముతో గాని, గలిజేరువేళ్ల రసము మిరియములు పంచదార అనువానితోగాని, తెల్లదింటెన రసము, పాలు అనువానితో గాని, కుప్పెంటాకురసము, పెరుగు అనువానితోగాని) సేవించిన కుంభకామిల హరించును. ఇదియ పంచాస్యరస మనంబడును.

శిలాజిత్వాది వటికములు

శిలాజతుశ్చ గోమూత్రం మండూరంచాథ మాక్షికమ్. 150
లోహభస్మ చ నిష్కం వా సేవయే త్కుంభకామలీ, (సిద్ధరసార్ణవే)

తా. శుద్ధిజేసిన శిలాజత్తు, మండూరము, హేమమాక్షికభస్మము, లోహభస్మము వీనిని సమభాగములుగ గోమూత్రముతో మర్దించి నిష్కప్రమాణము మాత్రలుజేసి సేవించిన కుంభకామిల హరించును.

---

1 అమృతోత్పలకందాతిబలాక్షేత్రపలంయుతమ్. 2 హేమమాక్షిక మనఁ వెండినిమ్మ

కామిలకు మంత్రము

అగ్రతో నారసింహశ్చ పృష్ఠతో వాయునందనః. 151
ఉభయోర్బాహుధన్వంత్రౌ సహితౌ రామలక్ష్మణౌ,

తా. ఈమంత్రముచే కామిలారోగిని మంత్రించుచు క్రొత్తకంచుగిన్నెలో పుడిసెడు నీళ్లుబోసి దానియందు ఛాయను జూచునటులంజేసి అట్టితరి రెండుసూదుల దెచ్చి వానికొసలబట్టికొని పైకంచుగిన్నెలో ముంచుచు నీమంత్రమును ముమ్మారు జెప్పుచు వాని ముఖము మొదలుకొని పాదములపర్యంతము దిగదుడిచి యందలి నీరును పదిలము సేయవలయును. మఱియు కామిలారోగము హరించువఱకు దిగుప్రొద్దున మంత్రింపుచుండవలయును. ఆగిన్నెలోనినీరు విరుగకుండిన కామిల మానుననియు, విరిగిన మానదనియు తెలియవలయును.

కామిలకు రక్షకర్మ

ఘుటికా మణిబంధే చ దహే త్సూక్ష్మశలాకయా. 152
వలయం చ సువర్ణస్య తామ్రస్య రజతస్య వా, (అగ్నిమతే)

తా. ఇరుమణికట్లు తిరుగువారలయందు, రెండుచీలమండలయొక్క కీళ్లయందు బంగారుశలాకుతోనేని, రాగిశలాకుతోనేని, వెండిశలాకుతోనేని వలయాకారంబుగ రక్షలువేసిన కామిల మానును. మఱియు దీనియందు పాండురోగమున జెప్పంబడిన పథ్యములనే నాచరింపవలయును.

హలీమకకులాంతకరసము

శుద్ధసూతామృతం గంధం హరితాళం మనశ్శిలా. 153
ఏతాని సమభాగాని ఖల్వమధ్యే వినిక్షిపేత్,
వాసా ఖదిర దుత్తూర రసేన పరిభావయేత్. 154
ప్రత్యేకం చ దినం యామం వాలుకాయంత్రకే పచేత్,
స్వాంగశీతల ముద్ధృత్య పంచపిత్తేన భావయేత్. 155
గుంజామాత్రం ప్రదాతవ్య మనుపానం పిబేదను,
త్రికటు త్రిఫలాచైవ లజ్జాళు గిరికర్ణికా. 156
అపామార్గశ్చ సురసా నిర్గుండీ కర్షమాత్రతః,
క్వాథ మష్టావశేషం తు పీయమానం హలీమకమ్. 157
నాశయే త్సర్వరోగాంశ్చ కామిలా పాండు శోఫజిత్,
(గ్రంథాంతరే)

తా. శుద్ధిజేసినపాదరసము, శుద్ధిజేసిన వసనాభి, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన హరిదళము, శుద్ధిజేసిన మణిశిల - వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమున నునిచి అడ్డసరము, చంద్ర, ఉమ్మెత్త అనువాని రసములచే ప్రత్యేక ప్రత్యేకముగ ఒక్కొక దినము మర్దించి భావనజేసి కుప్పెలో నునిచి ఒకఝాము వాలుకాయంత్రమున వండి సాంగశీతలమున దీసి ఖల్వములో నునిచి చేప, కాకిబట్ట, నెమలి, అడవిపంది, మేక అనువానిచేదులచే భావనజేసి గురిగింజలంతేసి మాత్రలుజేసి శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక తాండ్రయుసిరకెలు, అంతరదామర, తెల్లగంటెన, ఉత్తరేణి, మంచితులసి, వావిలి అనువానిని దినుసు ఒకటింటికి కర్ష ప్రమాణముచొప్పున గ్రహించి ఉదకముపోసి అష్టావశేషముగ కషాయముకాచి దీనిచే నౌషధమును సేవించిన హలీమకము, కామిల, పాండువులు, శోఫ మొదలగు సర్వరోగములు హరించును.

హలీమకే పాండురోగ చికిత్సాకారయేద్భిషక్. (గ్రంథాంతరే)

తా. హలీమకమునకు పాండురోగ చికిత్సలే జేయవలయును.

## పఞ్చమ ప్రకరణమ్.



# షష్ఠప్రకరణే



## వాతరోగనిదానలక్షణచికిత్సాదయః

అవతరణిక. ఇపుడు గ్రంథకర్త తనచే జేయంబడు నీగ్రంథమునందు షష్ఠప్రకరణమును రచింపంబూని యది నిర్విఘ్నముగ పరిసమాప్తి జెందుటకై తన కిష్టదేవతయగు ఈశ్వరనమస్కారాత్మక మంగళమును "వృషేంద్రగామినం శంభుం" అనుశ్లోకముచే జేయుచున్నాఁడు:—

శ్లో. వృషేంద్రగామినం శంభుం సర్వేశం భక్తవత్సలం,
భూతేశం లోకకర్తారం నీలకంఠమహం భజే. 1

తాత్పర్యము. శ్రేష్ఠమైన వృషభమూనెక్కి సంచారము సేయువాఁడు, సుఖకరుఁడు, జగదీశ్వరుఁడు, భక్తులయందు వాత్సల్యము గలవాఁడు, భూతములకు ప్రభువు, జగత్సృష్టిస్థితిసంహారకుఁడు నగు నీలకంఠుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజు అని పేర్కొనఁబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథముయొక్క యాఱవప్రకరణమును వచింపుచున్నాఁడను.

 అశీతివాతవివరణము

ఊర్ధ్వవాతం శిరోవాతం పక్షఘాతం చ పార్శ్వకం,
అర్ధాంగ కంపవాతం చ హన్వూరుస్తంభం తథైవ చ. 3
కిక్కసం శోణితం వాతం హృచ్ఛూలం చ కఫవాతకం,
సాధ్యవాతం ధనుర్వాతం తిమిరం కంఠవాతకమ్. 4
కాకవాతం శీతవాతం నయనోదరవాతకం,
నాసావాతం ముఖావాతం వాతంచావయవాంగకమ్. 5
జిహ్వాంగం నరవాతం చ కర్ణవాతం నిరుధ్య చ,
అనువాతం చ త్వగ్వాత మణువాతం తథైవ చ, 6

అంగభ్రమణకం చైవ మలబద్ధం చ గుల్మకం,
మూత్రబద్ధం బాహుకంపం స్కంధవాతం తథైవ చ. 7
ఆఢ్యవాతం ధూమవాతం విధూమం భోగవాతకం,
కటివాతం తు తద్వచ్ఛ శుక్లవాతం చ పాంశుకమ్. 8
సంధివాతం గృధ్రవాతం గుల్ఫవాతం తథైవ చ,
మందవాతం జానువాతం జంఘావాతం చ పాదకం. 9
కంధరంచాంగుళీవాత మనులోమం విలోమకం,
సుప్తవాతం కోష్ఠవాతం వస్తివాతం చ శుష్కకమ్. 10
స్థానవాతం కుక్షివాత మస్థివాతం చ మజ్జకం,
ఏకాంగకం క్షీణవాత వసావాతకసంజ్ఞకమ్. 11
మధువాతం క్షుధావాతం శృంఖలం స్ఫోటవాతకం,
స్నాయు ప్రసూతివాతం చ హ్యజీర్ణాతపవాతకమ్. 12
అగ్నివాతం తథానామ్నా స్వరహీనం చ ఖంజకం,
కళావాతం దండవాతం క్షతవాతం చ పంగుకమ్. 13
దధివాతం తథోన్మాద మశీతిర్వాతసంజ్ఞికాః,

తా. ఊర్ధ్వవాతము, శిరోవాతము, పక్షఘాతవాతము, పార్శ్వవాతము, అర్ధాంగవాతము, కంపవాతము, ఊరుస్తంభవాతము, కిక్కసవాతము, రక్తవాతము, ఆప్లవాతము, కఫవాతము, సాధ్యవాతము, ధనుర్వాతము, తిమిరవాతము, కంఠవాతము, కాకవాతము, శీతవాతము, నయనవాతము, ఉదరవాతము, నానావాతము, ముఖవాతము, అవయవాంగవాతము, జిహ్వాంగవాతము, నరవాతము, కర్ణవాతము, ఆప్లువాతము, త్వగ్వాతము, అణువాతము, అంగభ్రమణవాతము, మలబద్ధవాతము, గుల్మవాతము, మూత్రబద్ధవాతము, బాహుకంపవాతము, స్కంధవాతము, ఆఢ్యవాతము, ధూమవాతము, విధూవాతము, భోగవాతము, కటివాతము, శుక్లవాతము, పాంశువాతము, సంధివాతము, గృధ్రవాతము, గుల్ఫవాతము, మందవాతము, జానువాతము, జంఘావాతము, పాదవాతము, కంధరవాతము, అంగుళీవాతము, అనులోమవాతము, విలోమవాతము, సుప్తవాతము, కోష్ఠవాతము, వస్తివాతము, శుష్కవాతము, స్థానవాతము, కుక్షివాతము, అస్థివాతము, మజ్జావాతము, ఏకాంగవాతము, క్షీణవాతము, వసావాతము, మధువాతము, క్షుతవాతము, శృంఖలవాతము, విస్ఫోటవాతము, స్నాయకవాతము, ప్రసూతివాతము, అజీర్ణవాతము, ఆతపవాతము, అగ్నివాతము, స్వరహీనవాతము, ఖంజావాతము, కళావాతము, దండ

వాతము, క్షతవాతము, పంగువాతము, దధివాతము, ఉన్మాదవాతము అని వాతరోగములు ఎనుబదివిధంబులు.

### వాతాదిప్రకోపజనితరోగభేదములు

న వాతేన వినా శూలం న కండూః శ్లేష్మణా వినా. 14
న పిత్తేన వినా ఛర్దిః నాజీర్ణేన వినా జ్వరః,

తా. వాతము ప్రకోపించకనే శూలయు, శ్లేష్మము ప్రకోపించకనే దురదయు, పైత్యము ప్రకోపించకనే వాంతియు, అజీర్ణము లేకనే జ్వరమును గలుగదని తెలియవలయును.

### వాతరోగనిదానము

రూక్షశీతాల్పలఘ్వన్న వ్యవాయాతి ప్రజాగరైః. 15
విషమాదుపచారాచ్చ దోషాసృక్స్రవణాదపి,
లంఘన [1]ప్లవనాత్యధ్వవ్యాయామాతివిచేష్టనైః. 16
ధాతూనాం సంక్షయాచ్చింతా శోకరోగాతికర్శనాత్,
వేగసంధారణాదామాదభిఘాతాదభోజనాత్. 17
మర్మబాధాద్గజోష్ట్రాశ్వ శీఘ్రయానాదిసేవనాత్,
దేహస్రోతాంసి రిక్తాని పూరయిత్వానిలో బలీ. 18
కరోతి వివిధాన్ వ్యాధీన్ సర్వాంగైకాంగసంశ్రయాన్,
సంకోచః పర్వణాం స్తంభో భంగోస్థ్నాం పర్వణామపి. 19
రోమహర్షః ప్రలాపశ్చ పాణిపృష్ఠశిరోగ్రహః,
ఖాంజ్యపాంగుల్యకుబ్జత్వం శోషోంగానా మనిద్రతా. 20
గర్భశుక్లరజోనాశ స్స్పందనం గాత్రసుప్తతా,
శిరోనాసాక్షి జత్రూణాం గ్రీవాయాశ్చాపి హుండనమ్. 21
భేదస్తోదార్తిచాక్షేపో [2]మోహశ్చాయాస ఏవ చ,
మోటనంచైవ గ్రీవాయా శ్శ్వాసస్సర్వాంగతోదనమ్. 22
[3]ఏవంవిధాని రూపాణి కరోతి కుపితోఽనిలః,
తత్ర కోష్ఠాశ్రితే దుష్టే నిగ్రహో మూత్రవర్చసోః. 23
హేతుస్థానవిశేషాచ్చ భవే ద్రోగవిశేషకృత్,

---

1 ప్లవనాత్యధ్వాయాసాదతివిచేష్టనైః. 2 ముహుశ్చాయాసఏవ చ.
3 పార్శ్వశూలం, భ్రమో మోహ; కరోతి కుపితో ఽనిలః.

సుస్నిగ్ధైస్సుఖయేద్దేహం సోష్ణస్నేహం చ పాయయేత్. 24
యూషై స్తైలైర్ఘృతై స్సాన్ద్రైః పయోభిస్స్వరసై రసైః,
భోజయేద్రేచయేత్స్విద్యే న్మృదుస్నేహోక్తభేషజైః. 25
క్షీరైర్వాతారితైలం వా పిబేచ్ఛుద్ధికరం భవేత్, (మాధవనిదానే)

తా. రూక్ష, శీతలము, అల్పప్రమాణము, లఘుత్వముగల యన్నమును భుజించుట, కడుమైథున, జాగరణ, విషమోపచారముల సేయుట, దోషము అనఁగా—కఫ పిత్త మలమూత్రాదులను, రక్తమును స్రవింపఁజేయుట, దాఁటుట, నదులయం దీఁదుట, మిక్కుటముగ మార్గము నడుచుట, (కడు ఆయాసముజెందుట), దుముకుట మొదలగు కడువిరుద్ధచేష్టలుసేయుట, రసరక్తాదిధాతువులు క్షయించుట, చింత, దుఃఖము, రోగము అనువానిని జెందుట, మిక్కుటముగ కృశించుట, మలమూత్రముల బంధించుట, ఆమమన—రసధాతువు దుష్టంబై వాతమార్గము నడ్డగించుట, కాష్ఠాద్యభిఘాతము నెందుట,. ఉపవాసము సేయుట, హృదయాదిమర్మములయం దభిఘాతము గలుగుట, ఏనుగు, ఒంటె, గుఱ్ఱము మొదలగువానిపైనుండి భూమిపైఁబడుట - ఈ మొదలగు కారణములవలన వాతము ప్రకోపించి బలిష్ఠమై శరీరమునందలి రిక్తములైననాడుల పూరింపం జేసి సర్వాంగమునేని, లేక ఏకాంగమునేని నాశ్రయించి నానావిధ వాతరోగముల జనింపంజేయును. మఱియు సంధులయందు సంకోచము, స్తంభనము, అస్థిసంధుల యందు భిన్నం బగునటుల పీడ, గగుర్పాటు, తబ్బిబ్బుమాటలు, చేతులు, వీఁపు, శిరము అనువానియందు పట్లు, కుంటితనము, పిచ్చుకుంటితనము, కుబ్జత్వము, అంగములయందు వాపు, నిద్రాభంగము, గర్భము ధరింపకుండుట, శుక్ర రజో రక్తములు నశించుట, శరీరము వణకుట, శరీరము మొద్దుపారియుండుట, కేశప్రదేశము, కణత, లలాటము అనువానియందు పగులుట, ఘ్రాణేంద్రియము నశించుట, నేత్రములదృష్టి లేకుండుట, ఱొమ్ము డుచుకొనుట, మెడ స్తంభించుట, పెదవులు, దంతములు, కంఠము మొదలగు వానియందు పగులుట, సూదులచే బొడుచునటుల పీడ, ఆక్షేపవాతము, మోహము, ఆయాసముగలుగుట, మెడ యీడ్చికొనుట, శ్వాసము, సర్వాంగము వేదన, (పార్శ్వములయందు శూల, మోహము) గలుగుట—ఈలక్షణములు వాత ప్రకోపము వలన గలుగును. కోష్ఠాశ్రితవాతము దుష్టంబైన మలమూత్రముల నడ్డగించును. మఱియు ప్రకోపించిన వాతము కారణస్థానభేదములవలన నానావిధ వాతరోగముల గలుగం జేయును. వాతరోగికి కోమలములగు ద్రవ్యములచే శరీరసౌఖ్యమును గలుగంజేయుటయేగాక - ఉష్ణములగు స్నేహద్రవ్యములపానమును, * యూషము, తైలము,

* యూష మన పెసలు, ఉలవలు మొదలగువానికట్టు.

ఘృతము, పుల్లనిద్రవ్యములు, పాలు, స్వరసములు, రసవిశేషద్రవ్యములు అనువాని భోజనమును, స్వేదనక్రియయును, మృదుకర ద్రవ్యములు, స్నేహము అనువాని లేపనమును, రేచనమును, క్షీరము, వాతారితైలము అనువానిసేవనము జేయింపవలయును. ఈ ఉపచారములచే వాతరోగము శమించును. ఇవియ వాతరోగమునకు సామాన్యోపచారంబులు.

## వాతసాధ్యాసాధ్యములు

పార్శ్వస్థానవిశేషాచ్చ భవేద్రోగవిశేషకృత్. 26
ధనురాదిరసాధ్యస్తు ద్వంద్వలక్షణక స్తథా,
స్థాననామానురూపేణ లింగభేదా ద్వినిర్దిశేత్. 27
శుద్ధవాతహతం పక్షం కృచ్ఛ్రసాధ్యతమం విదుః,
హను స్తంభార్దితాక్షేప పక్షఘాతాపతానకాః. 28
కాలేన మహతా సాధ్యా హ్యసాధ్యాశ్చ చిరంగతాః,
(ఆయుర్వేదే)

తా. ఒకపార్శ్వము నాశ్రయించియుండు వాతము, ధనురాదివాతములు, ద్వంద్వవాతములు, స్థాననామానుగుణమువలన లక్షణములవలన అసాధ్యము లనియు, శుద్ధవాతము (అనఁగా ఏకదోషజనిత వాతరోగము) వలన జనించిన పక్షవాతము కష్టసాధ్యమనియు, హనుస్తంభము, అర్దితము, ఆక్షేపము, పక్షఘాతము, అపతానకము అను వాతరోగములు కాలక్రమమునీఁదట సాధ్యంబు లనియు, కడుదీర్ఘకాలమునుండిన అసాధ్యము లనియు తెలియవలయును. (ఇఁక జ్వరముతోఁగూడిన ఏకాదశ వాతలక్షణములు వచించెదను.)

## ధూమవాతలక్షణము

విషూచికా వాంతి విదాహకాశ్చ జ్వరోఽతి తృష్ణాప్యతిసారకశ్చ,
పిత్తంచ మూర్ఛాభ్రమణంవికారో ధూమంచ వాతంతు వదంతితజ్జ్ఞాః.
(మాధవనిదానే)

తా. విషూచి, వాంతులు, శరీరమున విదాహము, కడుదప్పి, అతిసారము గలుగుట, పిత్తము ప్రకోపించుట, మూర్ఛ, భ్రమగలుగుట ఈలక్షణములతోడ జ్వరమును గూడి శరీరము తెలుపుపారియుండిన ధూమవాత మని ఆయుర్వేదవేత్తలు వచించెదరు. (దీనియందు పంచవక్త్రరసమును సేవింపవలయును.)

## ధూమవాతమునకు త్రిఫలాదిచూర్ణము

ఏరండతైలం త్రిఫలా గోమూత్రం చిత్రకం విషం,
ఏకమాసం ఘృతైః పానం ధూమవాతం వినాశయేత్. 30

తా. కరక్కాయ, తానికాయ, ఉసిరికెపప్పు, చిత్రమూలము, అతివస వీనిని సమభాగములుగ చూర్ణముజేసి ఆముదము, గోమూత్రము, నెయ్యి అనుపానిలోగలిపి ఒకమాసము సేవించిన ధూమవాతము హరించును.

## విధూమవాతలక్షణము

శరీరే తు విదాహశ్చ జ్వరస్యోత్కటసంభవః,
శిరశ్శూలం రక్తనేత్రం విధూమం వాతకం విదుః. 31

(మాధవనిదానే)

తా. శరీరము విదాహించుట, శిరము నొచ్చుట, నేత్రము లెఱ్ఱగ నుండుట, ఈలక్షణములతోడ ఉత్కృష్టమైన జ్వరము గలిగి శరీరమున తెల్లని పొట్టురాలుటయే విధూమవాతమని తెలియవలయును.

## విధూమవాతమునకు వాతాదిరసము

అష్టౌభాగా రసస్యాపి విషం తిందో స్తథైవ చ,
గంధకస్య తథై వాష్టౌ కటుత్రయ ఫలత్రయమ్. 32
వహ్ని పత్రక ముస్తానాం వచాశ్వగంధ యోరపి,
రేణుకా విష కుష్ఠానాం పిప్పలీమూలకస్య చ. 33
ఏకైకం తు భవేద్భాగ మింద్రదారో స్తథైవ చ,
చతుర్వింశద్గుడేచాత్ర వటకా చణకాకృతిః. 34
వాతారిరస నామాయం విధూమవాతనాశకమ్. 35

తా. శుద్ధిజేసిన పాదరసము ౮ భాగములు, కలిలో మూడుదినములు నానబెట్టి ఎండించి విషముష్టిగింజలు ౮ భాగములు, శుద్ధిజేసిన గంధకము ౮ భాగములు, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయలబెరడు, తానికాయలబెరడు, ఉసిరికెపప్పు, చిత్రమూలము, ఆకుపత్రికె, తుంగముస్తెలు, వస, * డొమ్మడోలుగడ్డ, రేణుకలు, శుద్ధిజేసిన వసనాభి, చెంగల్వకోష్ఠు, పిప్పలీ మూలము, పాపటవేరు, అనువానిచూర్ణము దినుసు ఒకటటింటికి ఒక్కొకభాగము-ఇటుల వానినెల్ల గ్రహించి యందు బెల్లము ౨౪ భాగములువైచి బాగుగ మర్దించి సెనగగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని ఆవు

* డొమ్మడోలుగడ్డ యన పెన్నేరుగడ్డ.

నెయ్యి, మిరియములచూర్ణము, అనువాని యనుపానముతో సేవించిన విధూమవాతము హరించును. ఇదియ వాతారిరస మనంబడును. (మఱియు నీరసమే ఎనుబదివాతముల హరింపం జేయునని గ్రంథములయందు జెప్పంబడియున్నయది.)

ఏకాంగవాతలక్షణము

వాతాధికం జ్వరవిదాహ వికార కంపం
దేహాతిదుఃఖ గతిపీడిత వాంతిదోషం,
శుష్కాంగకం చ శిరసో భ్రమణం క్షుతం చ
నిష్ఠీవనం మలనిరోధనకుక్షిదాహమ్. (మాధవనిదానే) 36

తా. వాతము ప్రకోపించుట, శరీరము మండుట, శరీరమున వికారము గలుగుట, శరీరము వణకుట నొచ్చుట, నడుచుటకు శక్తిలేకుండుట, వాంతిగలుగుట, అవయవములు ఎండుట, తల దిరుగుట, తుమ్ములు గలుగుట, కారి యుమినేయుట, మలము వెడల కుండుట, కడుపులో మండుట, ఈలక్షణములతోడ జ్వరమును గలిగి శరీరములో సగము వాతపూరితముగ నుండునదియే ఏకాంగవాతమని తెలియవలయును. (ఇది అసాధ్యము.)

ఏకాంగవాతమునకు స్వర్ణారిరసము

రసభాగో భవేదేకో గంధకో ద్విగుణో మతః,
ద్వాదశబ్రహ్మబీజానాం విషతిందో స్తథైవ చ. 37
త్రిదినం కాంజికే క్షిప్త్వా శోధయే ద్విషతిందుకాన్,
ఏకీకృత్య తతశ్చూర్ణం మధునా లోడయే త్తతః. 33
స్నిగ్ధభాండే నిధాయాథ ధాన్యరాశౌ వినిక్షిపేత్,
మాసాదూర్ధ్వం తత స్తస్య ఖాదయే ద్గుళికాద్వయమ్. 39
ఏకాంగవాతమత్యర్థం ఖంజకం చ వివర్జయేత్,
షణ్మాసేన తు సేవేత రసం స్వర్ణారికాహ్వయమ్. 40

తా. శుద్ధిజేసిన రసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు, మోదుగ విత్తులు ౧౨ భాగములు, కలిలో మూడుదినములు నానబెట్టబడిన ముష్టిగింజలు ౧౨ భాగములు-ఇటుల వీనినెల్ల ఖల్వమున నునిచి చూర్ణముజేసి తేనెలో కలిపి నున్నని క్రొత్త కుండలో నునిచి ధాన్యరాశిలో నొకమాసం బిడి పిదప నందు రెండుగుళికెలచొప్పున ఆరు మాసములు సేవించిన ఏకాంగవాతము, ఖంజకవాతము హరించును. ఇదియ స్వర్ణారిరస మనంబడును. (మఱియు దీనియందువాతారిరసము నైనను రసకర్పూరము నైనను సేవింపందగును.)

### కఫవాతలక్షణము

దేహశోషో జ్వరఃకార్శ్యం కాసశ్చ హ్యల్పభాషితా,
దేహస్థూలం చ వహతి కఫవాతస్య లక్షణమ్. (మాధవనిదానే)

తా. శరీరము వాచుట, శరీరము కృశించుట, హీనస్వరము గలుగుట, శరీరము స్థూలించుట ఈ లక్షణములతోడ జ్వరము దగ్గు గలుగుటయే కఫవాత మని తెలియ వలయును.

### కఫవాతారిరసము

మృతసూతం తీక్ష్ణకాంతం తాళం మాక్షీక గంధకం,
తుల్యాంశం మర్దయేత్ఖల్వే వాతారేరార్ద్రికోద్భవైః. 42
భృంగజైః కాకమాచ్యుత్థైః గరికర్ణ్యా ద్రవైర్దినం,
మర్దితం భాండగం రుద్ధ్వా పచేన్మందాగ్నినా దినమ్. 43
వ్యోషాగ్నిగంధకవిషం సూరాణాభయటంకణం,
సమాంశం చూర్ణితం మిశ్రం తుల్యాంశం పూర్వపాచితమ్. 44
త్రిదినం మర్దయేద్ద్రావై ర్ముండీ నిర్గుండి భృంగజైః,
అష్టగుంజామితం ఖాదే త్కఫవాత నికృంతనమ్. 45

తా. రసభస్మము, లోహభస్మము, కాంతభస్మము, శుద్ధిజేసిన తాళకము, హేమ మాక్షికభస్మము, శుద్ధిజేసినగంధకము-వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమున నునిచి ఆముదపుచెట్లు, అల్లము, గుంటగలగర, కాచాకు, తెల్లగంటెన అనువాని రసములతో ఒక్కొకదినము ప్రత్యేక ప్రత్యేకముగ మర్దించి ముద్దచేసి కుప్పెలో నునిచి చీలమన్ను లేపనముచేసి క్రమప్రకారము మందాగ్నిలో ఒకదినము వండి సాంగశీతలమున దీసి ఖల్వములో వైచి చూర్ణముజేసి దానికి సమముగ శొంఠి, పిప్పలి, మిరియాలు, చిత్ర మూలము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిననాభి, కందగడ్డ, కరక్కాయ, శుద్ధిజేసిన వెలి గారము అనువాని చూర్ణమునుకలిపి బోడతరము, వావిలి, గుంటగలగర అనువాని రసము లతో మూడుదినములు మర్దించి ఎనిమిదిగురిగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని అనుపానవిశేషములతో సేవించిన కఫవాతము హరించును.

### జిహ్వాంగవాతలక్షణము

జిహ్వాంగబంధనం దోషో జ్వర తృష్ణా పరిభ్రమం,
మూకబాధిర్యతాపం చ జిహ్వాంగవాతలక్షణమ్. (మాధవనిదానే)

తా. దప్పిగలుగుట, తబ్బిబ్బులాడుట, మూగతనముగలుగుట, చెవులు వినరాకుండుట, తాపము గలుగుట ఈలక్షణములతోడ జ్వరముగలిగి నాలుక లోనికీడ్చికొనుటయే జిహ్వాంగవాతమని తెలియవలయును.

జిహ్వాంగవాతాంకుశరసము

సూతం పంచపలం ప్రోక్తం పలంస్యాత్తామ్రభస్మకం,
జంబీరాణాం ద్రవైః పిష్టం సూతతుల్యం చ గంధకమ్. 47
నాగవల్లీరసైః పిష్టం కాచే పిష్టం ప్రకల్పయేత్,
రుధ్వా లఘుపుటే పాచ్యం త్ర్యూషణేన సు మిశ్రితమ్. 48
జిహ్వాంగకంపవాతార్తో భక్షయే త్తద్ద్విగుంజకం,

తా. శుద్ధిజేసిన రసము ౫ పలములు, తామ్రభస్మము ౧ పలము, శుద్ధిచేసిన గంధకము ౫ పలములు-ఇటుల వీనిని గ్రహించి నిమ్మపండ్లరసముతోను, తమలపాకుల రసముతోను మర్దించి గాజుకుప్పెలోనునిచి చీలమన్ను లేపనముజేసి లఘుపుటంబిడి సాంగశీతలమునదీసి ఖల్వమునసునిచి మరల మర్దించి దానికిసమముగ శొంఠి, పిప్పలి, మిరియాలు అనువానిచూర్ణమును కలిపి యందు రెండుగురిగింజలయెత్తును సేవించిన జిహ్వాంగవాతము, కంపవాతము నశించును.

స్కంధవాతలక్షణము

సతాపం దృష్టిహీనాంగం శిరోభ్రమణకంపనమ్. 49
సజ్వరం శూలికంఠశ్చ స్కంధవాతస్య లక్షణం, (మాధవనిదానే)

తా. శరీరము వెచ్చగనుండుట, నేత్రములు కనుపడకుండుట, అంగములు హీనములై యుండుట, తలతిరుగుట, శరీరము వణకుట-ఈ లక్షణంబులతోడ జ్వరమును గలిగి కంఠము శూలించుటయే స్కంధవాతమని తెలియవలయును.

కంధరవాతలక్షణము

దాహశుష్కాంగ సోషం చ తంద్రా నిద్రా మతిభ్రమః. 50
జ్వరతృష్ణా వికారోఽయం వాతకంధరలక్షణం, (మాధవనిదానే)

తా. తాపము గలుగుట, శరీరము కృశించుట, అవయవములు వాచుట, తంద్ర నిదురగలుగుట, తబ్బిబ్బులాడుట, దప్పిగలుగుట ఈలక్షణములతోడ జ్వరము గలిగి మెడ కొంకులు నొచ్చుటయె కంధరవాతమని తెలియవలయును.

స్కంధవాతమునకు వాతముద్గరరసము

శుద్ధసూతం విషం గంధం టంకణం చ మనశ్శిలా. 5

ధూర్తబీజం సమం ఖల్వే హంసపాదిరసేన చ,
మర్దితం కజ్జలీం కృత్వా శరావే సంపుటే పచేత్. 52
స్నుహీక్షీరేణ సంమర్ద్య మత్స్యపిత్తేన భావయేత్,
గుంజామాత్రం ప్రదాతవ్యం స్కంధవాతం వినశ్యతి. 53

తా. పాదరసము, వసనాభి, గంధకము, వెలిగారము, మణిశిల, ఉమ్మెత్తవిత్తులు వీనిసెల్ల శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వమునసునిచి హంసపాదియాకురసముతో మర్దించి ముద్దచేసి మూకుళ్లలో నునిచి చీలమన్ను లేపనముజేసి వాలుకాయంత్రమున నాలుగు ఝాములు వండి సాంగశీతలమున దీసి మరల ఖల్వమునవైచి జెముడుపాలతో మర్దించి పిదప చేపచేదుతో భావనజేసి గురిగింజలంతేసి మాత్రలుజేసి అనుపాన విశేషములతో సేవింపుచుండిన స్కంధవాతము (కంధరవాతము) హరించును.

## స్కంధవాతమునకు ఇంద్రవారుణికాదిఘుటికలు

ఇంద్రవారుణికామూలం మాగధీ గుడసంయుతం,
భక్షయే త్కర్షమాత్రం తు స్కంధవాతహరం భవేత్. 54

తా. పాపరవేరు, పిప్పళ్లు అనువానిచూర్ణములో బెల్లము కలిపి బాగుగ మర్దించి కర్షప్రమాణము సేవించిన స్కంధవాతము (కంధరవాతము) హరించును.

## పాదవాతలక్షణము

మోహానం ఘూత తంద్రం చ జ్వరశ్శూలం చ కంపనం,
అక్షిశూలం కర్ణశూలంశిరశ్శూలం చ గుహ్యకమ్. 55
కటిశూలం పాదశూలం పాదవాతస్యలక్షణం, (మాధవనిదానే)

తా. మోహము, శరీరమున పోట్లు, తంద్ర, కడుపులో శూల, వణకుగలుగుట, నేత్రములు, చెవులు, శిరము, మర్మస్థలము, మొల అనువానియందు శూలగలుగుట ఈలక్షణములతోడ జ్వరమును గలిగి పాదములు శూలించుటయే పాదవాతమని తెలియవలయును.

## పాదవాతమునకు స్వచ్ఛందనాయకరసము

మృతసూతం మృతం లోహం గంధకం తాళ మాక్షికమ్. 56
పథ్యా శృంగీ విషం త్ర్యూష మగ్నిమంథం చ టంకణం,
తుల్యం ఖల్వే దినం మర్ద్యం ముండీ నిర్గుండిజద్రవైః. 57
ద్విగుంజవటికాం ఖాదే త్పాదవాతం వినశ్యతి,

తా. రసభస్మము, లోహభస్మము, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన తాళకము, హేమమాక్షికభస్మము, కరక్కాయలు, కర్కాటకశృంగి, శుద్ధిచేసిన వసనాభి, శొంఠి, పిప్పలి, మిరియాలు, నెల్లి, శుద్ధిజేసిన వెలిగారము వీనిని సమభాగములుగ ఖల్వమున నునిచి బోడతరము, వావిలి అనుపానిరసములతో ఒకదినము బాగుగ మర్దించి రెండు గురిగింజలంతేసి మాత్రలుజేసి అనుపానవిశేషముతో సేవింపుచుండిన పాదవాతము హరించును. (మఱియు నీవాతమున రసకర్పూరము, ఉప్పి, పరంగిచెక్క అనువానియోగ మునుకూడ సేవింపందగును.)

## మధువాతలక్షణము

జ్వరః పాండుశ్చ హిక్కా చ నాసికాకుసుమం తథా. 58
దేహ కండూ శ్శిరః కండూః కఫస్యాన్మధువాతకే,
(మాధవనిదానే)

తా. శరీరము పాండురవర్ణముగనుండుట, యెక్కిళ్లు గలుగుట, ముక్కునసెత్తురు గారుట, శరీరమున శిరమున దురదగలుగుట, దగ్గుగలుగుట ఈలక్షణములతోడ జ్వరము గలిగి నోరు తీపిగనుండుటయే మధువాతమని తెలియవలయును.

## మధువాతహరఘుటికలు

పిప్పలీ పిప్పలీమూలం హింగుళం చ శిలాజతు. 5
గుగ్గులుం వర్ధమానం వా మాక్షీకేన గుడేన వా,
పథ్యా శుంఠ్యమృతా క్వాథ పిప్పలీచూర్ణమిశ్రితమ్. 6
భక్షయే న్నిష్కమాత్రం తు మధువాతం వినాశయేత్,

తా. పిప్పలి, మోడి, శుద్ధిజేసిన యింగిలీకము, కర్పూరశిలాజిత్తు, శుద్ధిచేసి గుగ్గిలము, ఆముదము-వీనిని సమభాగములుగ ఖల్వమున వైచి అందు తేనెగాని బెల్లవ గాని కలిపి మర్దించి నిష్కప్రమాణమంతేసి మాత్రలుజేసి యందొకదానిని కరక్కాయ శొంఠి, తిప్పతీఁగె అనువాని కషాయానుపానములో పిప్పలిచూర్ణముకలిపి సేవించిన మధు వాతము హరించును.

## వస్తివాతలక్షణము

సజ్వరంచాగ్నిమాంద్యం చ నిద్రాభంగవిదాహకృత్. 6
మహావరోధనం దుఃఖం శిరోభంగః పరిభ్రమః,
అతిమూర్ఛాతిశీతం చ వస్తివాతస్య లక్షణమ్. (మాధవనిదానే) 6

తా. అగ్నిమాంద్యము గలుగుట, లేక కడుపులో మండుట, నిదుర రాకుండుట

విదాహము గలుగుట, శరీరము మిక్కుటముగ బద్ధకించుట, తలనొప్పి గలుగుట, తల దిరుగుట, కడుమూర్ఛ గలుగుట, శరీరము కడుచల్లగనుండుట, ఈలక్షణములతోడ తీవ్ర జ్వరముగలిగి పొత్తికడుపు నొచ్చుటయే వస్తివాతమని తెలియవలయును.

వస్తివాతమునకు స్వచ్ఛందభైరవరసము

శుద్ధసూతం విషంచాభ్రం హింగుళం బలితాళకం,
తుల్యం తుల్యం ఖల్వమధ్యే క్షిపేన్మర్ద్యం దినత్రయమ్. 63
హంసపాదికషాయేణ కుక్కుటీపుటపాచితం ,
చూర్ణం కృత్వా తతో దేయం మత్స్యకూర్మవరాహకే. 64
పిత్తే దినత్రయం భావ్యం మాషమార్ద్రానుపానతః,
వస్తివాతం నిహంత్యాశు చాత్యుగ్రం నాశయేద్ధ్రువమ్. 65

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన వసనాభి, అభ్రకభస్మము, శుద్ధిచేసిన ఇంగిలీకము, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన తాళకము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకు కషాయముతో మూడుదినములు బాగుగ మర్దించి కుక్కుటపుటంబిడి సాంగశీతలమునదీసి ఖల్వమునవైచి చూర్ణముచేసి చేఁప, తాఁబేలు, అడవిపంది అనువానిచేదులలో ప్రతిదానిచే ఒక్కొకదినముచొప్పున మూడుదినములు భావనచేసి మాషప్రమాణముంతేసి మాత్రలుజేసి అల్లపురసానుపానముతో సేవింపుచుండిన అత్యుగ్రమైన వస్తివాతము హరించును.

క్షుతవాతలక్షణము

క్షుతఘాతశ్చ దౌర్బల్య మన్నద్వేషో వికారితా,
అగ్నిమాంద్యం జ్వరం తృష్ణా క్షుతవాతస్య లక్షణమ్. 66

తా. సత్వము క్షయించుట, అన్నద్వేషము, శరీరమున వికారములు, అగ్నిమాంద్యము, లేక కడుపులో మంట, దప్పిగలుగుట, ఈలక్షణములతోడ జ్వరమును గలిగి తరుచుగ తుమ్ములుగలుగుటయే క్షుతవాతమని తెలియవలయును. (ఇది హరించుటకై రసకర్పూరమునేని, వాతారిరసమునేని సేవింపవలయును.) పైఁజెప్పఁబడిన పదకొండును జ్వరవాతములు. వానిలో శుభకరనాడులు గలిగియుండిన సాధ్యమని యెఱింగి చికిత్సింపవలయును.

శృంఖలవాతలక్షణము

దేహం చ పాండు శుష్కం చ నిద్రానాశ శ్శిరోవ్యథా,

వాంతి ర్హిక్కా చ విస్ఫోట శ్శృంఖలవాతలక్షణమ్. 67
(మాధవనిదానే)

తా. శరీరము పాండురివర్ణముగ నుండుట, శరీరము కృశించుట, నిదురపట్టకుండుట, తలనొచ్చుట, వాంతులు, ఎక్కిళ్ళు గలుగుట-ఈలక్షణములతోడ శరీరమున కంతులు కట్టుటయే శృంఖలవాతమని తెలియవలయును.

### శృంఖలవాతమునకు త్రిగుణాఖ్యరసము

శుద్ధసూతం విషం గంధం చాభ్రకం చామ్లవేతసం,
ద్విదినం భావయే త్ఖల్వే హంసపాదిరసై స్తథా. 68
కాచకుప్యా న్నివేశ్యాథ కుక్కుటీ పుటపాచితం,
భావితం మత్స్యపిత్తేన ద్విగుంజం భక్షయేత్సదా. 69
అనుపానవిశేషేణ శృంఖలవాతనాశనం,
పథ్యం క్షీరోదనం దేయం నారికేళజలప్లుతమ్. 70

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసిన వసనాభి, శుద్ధిజేసినగంధకము, అభ్రకభస్మము, ఆమ్లవేతసము-వీనినెల్ల సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకురసమున రెండుదినములు మర్దించి గాజుకుప్పెలో నునిచి కుక్కుటపుటంబిడి సాంగశీతలమున దీసి మరల ఖల్వములో నునిచి చేపచేదున భావనచేసి రెండుగురిగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని వసకషాయముతోనేని, ఒరగొమ్మచెక్కరసము, మిరియములు, అనువానితోనేని సేవించిన శృంఖలవాతము హరించును. దీనియందు పాలు అన్నమును, టెంకాయరసముతో తడుపఁబడినయన్నమును భుజించుట పథ్యకరంబును. (మఱియు నీశృంఖలవాతమున రసకర్పూరమును అనుపానముగ గ్రహింపవలయును.)

### విస్ఫోటవాతలక్షణము

దేహస్య భ్రమణం చైవ హిక్కాతీవ శిరోభ్రమః,
నేత్రశూలం మహారోగో విస్ఫోటవాతలక్షణమ్. 71
(మాధవనిదానే)

తా. శరీరము తిరుగుట, ఎక్కిళ్ళు గలుగుట, మిక్కుటముగ తలతిరుగుట, నేత్రములు శూలించుట, కడుపీడగలుగుట - ఈలక్షణములతోడ శరీరమున మంటలు, చెమటకాయలు గలుగుటయే విస్ఫోటవాతమని తెలియవలయును. (వాతము హరించుటకై శృంఖలవాతచికిత్సనే జేయవలయును. మఱియు రసఉబ్బవేయవలయును.)

### స్నాయుకవాతలక్షణము

దేహస్యస్ఫుటితం పుంసాం హ్యాంగవైకల్యపీడనం,
దేహశోషో నేత్రశూలం స్నాయువాతస్యలక్షణమ్. 72
(మాధవనిదానే)

తా. అంగములు నొచ్చుట, శరీరమున పీడగలుగుట, శరీరము వాచుట, నేత్రములు నొచ్చుట-ఈలక్షణములతోడ శరీరము పగులుటయే స్నాయుకవాతమని తెలియవలయును.

### స్నాయుకవాతమునకు పంచాననకల్పము

మృతంసూతం తథాగంధం కాంతం చాభ్రకమేవ చ,
తామ్రభస్మమృతం సమ్యక్ నిష్కార్థం శిఖితుత్థకమ్. 73
సింధువారస్య భృంగస్య పత్రచూర్ణం పలత్రయం,
ఖాదిరం ద్విపలం చైవ సర్వం సంచూర్ణ్య నిక్షిపేత్. 74
స్నిగ్ధభాండే వినిక్షిప్య ద్వికాలం భక్షయేత్సుధీః,
నిష్కార్థమాత్రం సేవేత పథ్యం తక్రౌదనం హితమ్. 75
లవణ క్షారకామ్లాని వర్జయిత్వా నిషేవయేత్,
చిరకాలసముద్భూతం వాతం స్నాయుకసంజ్ఞితమ్. 76
నాశయేన్నాత్ర సందేహో ముక్తకంచూరగా ఇవ,

తా. రసభస్మము, శుద్ధిజేసిన గంధకము, కాంతభస్మము, అభ్రకభస్మము, శుద్ధతామ్రభస్మము ఇవి దినుసొకటింటికి నాలుగేసితులములు, శుద్ధి జేసిన మైలుతుత్తము అర్ధనిష్కప్రమాణము, వావిలియాకుచూర్ణము, గుంటగలగరాకు చూర్ణము, చండ్రచెక్కచూర్ణము ఇవి దినుసొకటింటికి ౨ పలములు ఇటుల వానినెల్ల నేకముజేసి మర్దించి నున్ననికొత్తకుండలో నునిచి సాయంప్రాతఃకాలముల అర్ధనిష్కప్రమాణము చొప్పున ఉష్ణోదకముతో సేవింపుచుండిన చిరకాలముగ బాధింపుచుండు వాతకంతులు హరించి శరీరము కూసమువిడిచినపాముపలె నగును. దీనియందు ఉప్పు, క్షారము, పులుసు, మైథునము మొదలగు వానిని వర్జించి మజ్జిగయన్నమును భుజించుట పథ్యకరములు.

### స్నాయుకవాతమునకు భుజగరాజచూర్ణము

తాపసద్రుమమూలస్య త్వక్షోభిష్యా చూర్ణితా పునః. 77
క్రమాత్తదర్ధం మరిచం తదర్ధం చ లవంగకం,

సర్వం సమాంశకం చూర్ణం శర్కరాసహితం భజేత్. 78
ఉష్ణోదకేన సంమిశ్ర మథవా ఘృతసంయుతం,
నవాతపిటకాన్ హంతి వినిధాన్ వాతసంభవాన్. 79
నాశయేన్నాత్ర సందేహో ముక్తకంచూరగాఇవ,

తా. గారవేళ్లచూర్ణము ౧ శేరు, మిరియపుచూర్ణము ౪ శేరు, లవంగపుచూర్ణము పావుశేరు - ఇటుల వీనినెల్ల నేకము చేసి దానికి సమముగ పంచదారగలిపి సాయంప్రాతః కాలముల పూటకు ఒకటిన్నరతులముచొప్పున ఉష్ణోదకముతోనేని, లేక ఆవునేతితోనేని సేవింపుచుండిన వాతమువలనఁబుట్టిన నానావిధవాతపిటకలు హరించి శరీరము కూసము విడిచినపామువలె నగును. (మఱియు నీచూర్ణ సేవనకాలమున పూటకు రెండువీసములయెత్తు పచ్చకర్పూరమును గలిపి సేవింపవలయును.)

## గృధ్రవాతలక్షణము

స్ఖలనం వాత శోఫౌ చ కరపాద విదాహకృత్. 80
స్వేదో మూర్ఛా భ్రమస్తృష్ణా గృధ్రివాతస్యలక్షణం,
(గ్రంథాంతరే)

తా. శరీరము వాతపూరితముగ నుండుట, శరీరము వాచుట, చేతులు, కాళ్లు మండుట, చెమట, మూర్ఛ, తబ్బిబ్బుమాటలు, దప్పిగలుగుట - ఈలక్షణములతోడ ఇంద్రియము స్ఖలనంబగుటయే గృధ్రవాతమని తెలియవలయును. (దీనియందు పూర్ణ చంద్రోదయమునేని, చింతామణిరసమునేని సేవింపవలయును.)

## గృధ్రవాతమునకు ద్రాక్షాదిఘుటికలు

ద్రాక్షా యష్టీక ఖర్జూర మేలా త్వక్పత్ర కేసరమ్. 81
మధు కులీ చందనం చ ముసలీ కందమేవ చ,
ప్రియాళు మజ్జాసంతుల్యం సర్వాంశం జాతికాఫలమ్. 82
సిందూర మష్టభాగం చ నవనీతేన మిశ్రితం,
మహావీర్యకరో వృద్ధిం వనితాశతసంగమమ్. (సిందూరమణిదర్పణే)

తా. ద్రాక్షపండ్లు, అతిమధురము, ఖర్జూరపండ్లు, ఏలకులు, లవంగపుచెక్క, ఆకుపత్రికె, నాగకేసరములు, తేనె, తంగేడుపిత్తులు, శ్రీగంధము, నేలతాటిగడ్డలు, మొరలిబంక - వీనిని సమభాగములుగ గ్రహించి వానికి సమముగ జాజికాయలు, పైవానికన్నిటి కెనిమిదవభాగము సిందూరము గలిపి ఖల్వమున మర్దించి ఆసిందూర ములో ప్రాతఃకాలమున చిన్నప్రమాణము సాయంకాలమున చిన్నప్రమాణం బుండు

నటుల మాత్రలుజేసి వానిని ఆవువెన్నతో ఒకసంవత్సరము సేవింపుచుండిన నష్టవీర్య దోషము హరించి వీర్యవృద్ధిని, దండవృద్ధిని, నూఱుగురు స్త్రీలతో రమించుశక్తిని గలుగం జేయును. (మఱియు దీనిని సేవించునపుడు ఆవనూనె, పులుసు, స్త్రీసంగమము ఈ మొదలగు వానిని వర్జించి మధురాహారముల సేవింపవలయును.)

### పాంశువాతలక్షణము

స్ఖలనం పాయు మేఢ్రే చ కరపాద విదాహకృత్,
స్వేదో మూర్ఛాభ్రమస్తృష్ణా పాంశువాతస్య లక్షణమ్. 84

తా. చేతులు కాళ్ళు మండుట, చెమట, మూర్ఛ గలుగుట, తబ్బిబ్బులాడుట, దప్పిగలుగుట-ఈలక్షణములతోడ ఆసనమేఢ్రముల వీర్యము స్రవించుటయే పాంశువాతమని తెలియవలయును. (ఈవాతమునందు వాతగజాంకుశరసమునేని, వాతారిరసమునేని, సిందూరమును జిబిలికెవేళ్ళ రసముతోనేని సేవించిన నది హరించు నని నిత్యనాథీయమున జెప్పంబడియున్నయది. స్త్రీసంగమమున వీర్యము స్ఖలితమై శరీరము చలువగొనుట, చెమట, మూర్ఛ, బుగులుగలుగుట, శరీరము వణకుట, కాళ్ళుతీయుట - ఈలక్షణములుగలది స్ఖలనవాత మని తెలియవలయును. దీనియందు వాతగజాంకుశరసమునేని, వాతారి రసమునేని ప్రయోగింపవలయును.)

### శుక్లవాతలక్షణము

ఇంద్రియం పుంస్త్వవర్జ్యం చ విదాహం చ వికారితాం,
అంతర్వాయుః ప్రకుర్వీత శుక్లవాతస్య లక్షణమ్. (గ్రంథాంతరే)

తా. శరీరము మండుట, శరీరమున వికారము గలుగుట, అంతర్వాతము ప్రకోపించుట - ఈలక్షణములతోడ శుక్రము లోన నింకిపోవుటయే శుక్లవాత మని తెలియవలయును.

### శుక్లవాతమునకు ఫణిపతిరసము

శుద్ధసూతం సమంగంధం చాభ్రకం లోహభస్మకం,
తామ్రభస్మ సమం మర్ద్యం జంబనీరేణ సంయుతమ్. 86
ద్విదినం గుళికా కార్యా కాచకుప్యాం వినిక్షిపేత్,
విలేప్య మృత్తికావస్త్రం వాలుకాయంత్రకే పచేత్. 87
షడ్యామాంతే సముద్ధృత్య గుంజామాత్రం ప్రదాపయేత్,
అనుపానవిశేషేణ శుక్లవాతం నిహంతి చ. 88

తా. శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిజేసిన గంధకము, అభ్రకభస్మము, లోహ భస్మము, తామ్రభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వమున నునిచి నిమ్మపండ్లరసముతో రెండుదినములు మర్దించి ముద్దచేసి గాజుకుప్పెలో నునిచి చీలమన్ను లేపనము చే ఎండించి వాలుకాయంత్రమున నునిచి ఆఱుఝాములు వండి సాంగశీతలమున దీసి ౭ గురిగింజయెత్తు ఔషధమును తీటకోవిలవేళ్ళ చూర్ణముతోనేని, లేక నెయ్యి, మిరియ చూర్ణముతోనేని సేవించిన శుక్లవాతము హరించును.

## నష్టేంద్రియనిదానము

ఉష్ణద్రవ్యాణి పథ్యాని హ్యుష్ణవీర్యం చ జాయతే,
వీర్యేణ తేన మేహశ్చ మేహరోగ స్స ఉచ్యతే. ౬
మేహేఽపి వీర్యనాశశ్చ చికిత్సాం కురుతే భిషక్,
పూర్ణచంద్రోదయం పేయం క్షీణరేతోహరం పరమ్. ౯

తా. ఉష్ణద్రవ్యములు శరీరమున కపథ్యకరంబులు. వానివలన ఉష్ణవీర్యము ఉష్ణవీర్యమువలన మేహరోగంబును, మేహరోగమువలన వీర్యనష్టమును గలుగును. వీర్యనష్టమునకు పూర్ణచంద్రోదయమును ఒకసంవత్సరము సేవించిన నది హరించు (మఱియు ఇంద్రియస్ఖలనము గలిగెడి సర్వవాతములయందును పూర్ణచంద్రోదయము సేవింపవలయును.)

## నష్టేంద్రియమునకు వాతాంతకరసము

హేమార్క కాంత లోహాభ్రం సూతభస్మ చ గంధకం,
వైక్రాంతం విద్రుమం చైవ తారం తాళసమన్వితమ్. ౯
సుముహూర్తే ఖల్వమధ్యే చిత్రమూలస్య చ ద్రవైః,
చతుర్యామం చ సంమర్ద్యం ఛాయాశుష్కం చ కారయేత్. ౯
కుక్కుటీ పుటపాకేన సాంగశీతలముద్ధరేత్,
ఇదం చ చూర్ణితం శ్లక్ష్ణం తదర్ధం సూతభస్మకమ్. ౯
సూతతుల్యం మృతం తాళం సర్వం ఖల్వే విమర్దయేత్,
చిత్రకార్ద్రికనీరేణ నిర్గుండీ వారుణీ ద్రవైః. ౯
వాసాజంబకనీరేణ సప్తభావ్యం పృథక్పృథక్,
గుంజామాత్రప్రయోగేణ కణా మధ్వాజ్యసంయుతమ్. ౯
సుప్తవాతం వాతశూలం వేదనా వాతమేవ చ,
స్నాయు కంపం గాత్రభంగం పక్షఘాతం హనుగ్రహమ్.

వాయోర్మూర్ఛాం చ తిమిరం వాతాశీతం చ నాశయేత్,
వంధ్యా చ లభతే గర్భం నష్టం వీర్యం ప్రశస్యతే. 97
వాతాంతకరసో నామ్నా సర్వరోగనివారకః,
లోకోపకరణార్థాయ హ్యశ్వినీదేవనిర్మితః. (ఆయుర్వేదే) 98

తా. సువర్ణభస్మము, తామ్రభస్మము, కాంతభస్మము, లోహభస్మము, అభ్రకభస్మము, రసభస్మము, శుద్ధిజేసినగంధకము, వైక్రాంతభస్మము, పగడభస్మము, రజితభస్మము, తాళకభస్మము-వీనిని సమభాగములుగ మంచిముహూర్తమున ఖల్వమున నునిచి నాలుగు ఝాములు చిత్రమూలరసముతో మర్దించి బిళ్ళజేసి నీడనెండించి కుక్కుటపుటంబిడి సాంగశీతలమున దీసి సూక్ష్మముగ చూర్ణముచేసి దానికి అర్ధభాగము రసభస్మము, తాళకభస్మము కలిపి చిత్రమూలము, అల్లము, వావిలి, చాగ, అడ్డసరము, నిమ్మకాయ అనువాని రసములలో ప్రతిదానిచే ఏడేసిమార్లు మర్దించి ఏడేసిమార్లు భావనజేసి గురిగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని పిప్పలిచూర్ణముతోనేని, తేనెతోనేని, నేతితోనేని యొసంగిన సుప్తవాతము, వాతశూలము, వేదనావాతము, స్నాయుకవాతము, కంపవాతము, గాత్రభంగవాతము, పక్షఘాతవాతము, హనుగ్రహవాతము, మూర్ఛావాతము, తిమిరవాతము ఈ మొదలగు ఎనుబదివాతములు నశించుటయేగాక గొడ్రాలగు నుండుస్త్రీ గర్భమును ధరించును. మఱియు నష్టవీర్యము సగా శాంతిఁజెందును. ఇది లోకోపకారమునకై అశ్వినీదేవతలచే సర్వరోగనివారణార్థంబై నిర్మింపఁబడిన వాతాంతకరసము.

### సూతికావాతలక్షణము

అంగమర్దో జ్వరఃకంపో పిపాసా గురుగాత్రతా,
శోకశ్శోఫోఽతిశీతం చ సూతికావాతలక్షణమ్. (ఆయుర్వేదే) 99

తా. శరీరమంతయు నొచ్చుట, శరీరము నగుర్పొడుచుట, దప్పిగలుగుట, శరీరము బరువైయుండుట, కండ్లనీరుగారుట, శరీరమున శోఫగలుగుట, శరీరము కడుచల్లగనుండుట-ఈలక్షణములు గలిగి జ్వరమును, కంపమును గలిగియుండుటయే సూతికావాతమని తెలియవలయును.

### సూతికావాతమునకు బడబానలరసము

శుద్ధసూతం చైకభాగం తామ్రభస్మ చ తత్సమం,
ద్విభాగం గంధకం చైవ త్రిభాగం చ కటుత్రయమ్. 100
వహ్నినామాచైకభాగం కోష్ఠభాగం చ తత్సమం,

జ్వాలాముఖీరసైర్దద్యాం బదరాస్థిప్రమాణకమ్. 101
బడబానలనామాయం సూతికావాతనాశనః 102

తా. శుద్ధిజేసిన రసము ౧ భాగము, తామ్రభస్మము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు, త్రికటుకములు 3 భాగములు, చిత్రమూలము ౧ భాగము, చెంగల్వకోష్ఠు ౧ భాగము-ఇటుల వీసిసెల్ల ఖల్వమున నునిచి నెమలిచెక్కరసమున ఒక దినము మర్దించి రేగుగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని మినుపకట్టు, వెల్లుల్లి రసము, అనువాని యనుపానముతోనేని, లేక తీటకళింద వేళ్ళరసానుపానముతోనేని, లేక ములువెలగచెక్కరసము, మిరియపు చూర్ణముతోనేని సేవించిన ప్రసూతివాతము హరించును. (మఱియు ప్రాణేశ్వరరసమునుగాని, లేక సంజీవనీరసమునుగాని సేవించిన ప్రసూతి వాతము హరించును.)

సూతికావాతమునకు వాతవిధ్వంసకరసము

రసం గంధకం నాగ వంగం చ లోహం
తథా తామ్రజం వ్యోమనిశ్చంద్రకం చ,
కణా టంకణం చోషణం నాగరం వై
పృథగ్భాగమేకం క్షిపే త్ఖల్వమధ్యే. 103
తతో వత్సనాభం చతుష్కార్ధభాగం
దృఢం మర్దయే ద్వ్యోషజైశ్చ త్రివారం,
వరాచిత్రకైర్భార్కకుష్ఠైస్త్రివారం
పృథగ్భావయే *త్సింధువారార్ద్రవాసైః. 104
తథా మోహినీజంబనీరైః పృథగ్వై
మహాన్ వాతవిధ్వంసకోఽయం రసశ్చ,
సమీరేచ శూలే తథా శ్లేష్మరోగే
గ్రహణ్యాం తథా సన్నిపాతే చ మూకే. 105
అపస్మార మాంద్యే చ శీతే చ పిత్తే
ప్లీహోదరే కుష్ఠరోగే చ దద్యాత్,
స్త్రియస్సూతికా వాతరోగే తథైవ
ద్విగుంజం ప్రదద్యాదిమం సూతరాజమ్. (మాధవనిదానే) 106

* సింధువారార్కవాసైః.

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, సీసభస్మము, తగరభస్మము, లోహభస్మము, తామ్రభస్మము, తళుకులు లేని అభ్రకభస్మము, పిప్పళ్ళు, శుద్ధిజేసిన వెలిగారము, మిరియాలు, శొంఠి-ఇవి దినుసుకొక్కొకభాగము, శుద్ధిచేసిన వసనాభి 84 భాగము-ఇటుల వీనిని ఖల్వమున నునిచి శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు అనువాని కషాయములతో మూడుపర్యాయములును, నేలతాటిగడ్డలరసము, చిత్రమూలరసము, గుంటగలగరాకురసము, చెంగల్వకోష్టుకషాయము అనువానితో మూడుమార్లును, వావిలియాకు, అల్లము, అడ్డసరము, గంజాయాకు, నిమ్మపండ్లు అనువానిరసములతో ప్రత్యేకప్రత్యేకముగను మర్దించి భావనజేసి గురిగింజలంతేసి మాత్రలుజేసి యందు రెండుగురిగింజలయెత్తును అనుపానవిశేషములతో సేవింపుచుండిన వాతరోగము, శూల, శ్లేష్మరోగము, గ్రహణి, సన్నిపాతము, మూకవాతము, అపస్మారము, అగ్నిమాంద్యము, శీతపిత్తము, ప్లీహోదరము, కుష్ఠువు హరించును. (లేక నక్కపీటాకురసములో పిప్పలిగలిపి సేవింపుచుండిన ప్రసూతివాతము హరించును.) ఇదియ రసములలో శ్రేష్ఠమయిన వాతవిధ్వంసక రసము.

### త్వగ్వాతలక్షణము

దేహస్ఫోటనసర్వాంగ పాదమూల విదారణం,
కరపాద విదాహశ్చ త్వగ్వాతస్యచ లక్షణమ్. (ఆయుర్వేదే) 107

తా. సర్వాంగములు కాళ్ళు పగులుట, చేతులు కాళ్ళు మండుట- ఈలక్షణములతోడ శరీరముపగులుటయే త్వగ్వాతమని తెలియవలయును (దీనియందు రసకర్పూరమునేని, బోడతరపాకురసముతో వాతారిరసమునేని నలువది దినములు సేవింపవలయును.)

### భోగవాతలక్షణము

విఘూమం చ విదాహశ్చ హ్యామ్లకంపశ్చ దేహినాం,
విస్పష్టం వాయుకోపశ్చ హ్యంగవైకల్యకారితా. 108
నేత్రశూలం శిరశ్శూలం భోగవాతస్య లక్షణం, (ఆయుర్వేదే)

తా. పులితేనుపులువచ్చుట, శరీరము విదాహించుట, శరీరము పులుసుకంపువేసుట, శరీరము వణకుట, వాయువు ప్రకోపించుట, అంగములు నొచ్చుట, నేత్రములు శిరము శూలించుట-ఈలక్షణములుగలిగి శరీరము సర్పమువలె ముడుచుకొనుటయే భోగవాతమని తెలియవలయును.

### భోగవాతమునకు ఏరండమూలచూర్ణము

స్థూలైరండకమూలస్య కర్షం ఘృష్ట్వా జలైః పిబేత్. 109

భోగవాతవికారం చ సర్వవాతం చ నాశయేత్,

తా. పెద్దామదపువేళ్ళను దంచి చూర్ణముజేసి కర్షప్రమాణములు ప్రాచినీళ్ళలో కలిపి నలువదిదినములు సేవించిన భోగవాతము, సర్వవాతములు హరించును. (దీనియందు కాలాగ్నిరుద్రరసమును సగా సేవింపందగును.)

భోగవాతమునకు రసకర్పూరము

రసకర్పూరమమృతం వాతాశీతివినాశనమ్. 110

తా. రసకర్పూరము అమృతతుల్యంబగుటచే ఎనుబదివాతముల హరింపం జేయు నని సర్వశాస్త్రములు జెప్పుటంజేసి భోగవాతమున సేవింపవలయును.

కిక్కసవాతలక్షణము

కటిప్రదేశశూలం చ మహాశూలావరోధనం,
పాదే పీడా శిరో ఘూర్ణే కిక్కసవాతలక్షణమ్. (ఆయుర్వేదే) 111

తా. శరీరమంతట శూలించుట, లేక శరీరమంతట పట్టుకొనుట, పాదములు నొచ్చుట, తల శూలించుట, ముక్కునొచ్చుట-ఈలక్షణములుగలిగి మొలచుట్టు శూలించుటయే కిక్కసవాతమని తెలియవలయును.

కిక్కసవాతమునకు మహాకర్పూరము

రసకర్పూరమమృతం వాతాశీతివినాశనం,
మహాకర్పూరసేవేయం కిక్కసవాతనాశనీ. 112

తా. రసకర్పూరము అమృతసమానంబగుటచే ఎనుబదివాతముల హరింపంజేయును. అట్లగుటంజేసి కిక్కసవాతము హరించుటకై రసకర్పూరమును సేవింపవలయును. మఱియు రసఉబ్బను వేయవలయును.

కటివాతలక్షణము

కటిభంగో వికారశ్చ మహాశూలం చ క్రోధకృత్,
అపస్మారీ చ దుర్భాషీ కటివాతస్య లక్షణమ్. (ఆయుర్వేదే) 113

తా. మొలచుట్టు పగులగొట్టునటుల నొచ్చుట, శరీరవికారము, కడుకోపము, అపస్మారము గలుగుట, దుర్భాషలాడుట - ఈలక్షణములు గలిగి మిక్కుటముగ నడుము శూలించుటయే కటివాతమని తెలియవలయును.

కటివాతమునకు వాతకేసరీరసము

హింగుళం వత్సనాభం చ చక్రాంగీం త్రికటుం వచాం,

చిత్రమూలకషాయేణ సమభాగం విమర్దయేత్. 114
డోలాయంత్రే పచేద్యామం కటివాతం నిహంతి చ,

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసిన వసనాభి, కటుకరోహిణి, త్రికటుకములు, వస - వీనిని సమభాగములుగ ఖల్వమున నునిచి చిత్రమూలకషాయముతో మర్దించి ముద్దజేసి డోలాయంత్రమున ఒకఝాము వండి సేవన లేపనముల సేయుచుండిన కటివాతము హరించును. (ఈకటివాతము హరించుటకై కిక్కసవాత చికిత్సలను సగా చేయవలయును.)

మలబద్ధవాతలక్షణము

పక్షస్యారావగ్నితాపో మూత్రబంధ ఇతిస్మృతః. 115
అనాహశ్చ శిరఃకంపో మలబద్ధస్య లక్షణం, (మాధవనిదానే)

తా. బొమ్ము తొడలు మండుట, మూత్రము వెడలకుండుట, కడుపుబ్బుట, తల వణకుట ఈలక్షణములుగలిగి మలము బంధించుటయే మలబద్ధవాతమని తెలియవలయును. (ఇది [1]యాప్యము.)

మలబద్ధవాతమునకు వాకుచ్యాదిచూర్ణము

శతశోభావితం మూత్రం భావయేత్తేనవాకుచీమ్. 116
పలద్వయం శారిబా చ తథా కృష్ణతిలాన్వితం,
కైడర్యం శంఖపుష్పీ చ సమభాగం విచూర్ణయేత్. 117
ఉష్ణోదకే పిబేచ్చూర్ణం మలబద్ధం వినాశయేత్,

తా. భావంచివిత్తులు ౨ పలములు, గూడపాల, నల్లనువ్వులు, [2]పెద్దమ్రాను చెక్క, కట్లచెక్క వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి అనేకమారులు వడియ కట్టంబడిన మేకమూత్రముతో భావనజేసి ఉష్ణోదకముతో ప్రాతఃకాలమున సేవించిన మలబద్ధవాతము హరించును.

మూత్రబద్ధవాతలక్షణము

అనీహాతా మూత్రవిదాహికాచ కంఠావరోధో గుదకీలకం చ,
ఆధ్మానముక్తంహృదయాచరోధో మూత్రం విబద్ధంత్వితి వాతవిద్భిః.
(గ్రంథాంతరే)

తా. శరీరము వెలవెలబారుట, మూత్రద్వారము మండుట, మెడ పట్టుకొనుట,

1 యాప్యమన — శరీరముండువఱకు మానకుండురోగములు.

2 ఇదే గుమ్ముడు లేక అనియు జెప్పంబడును.

మూలవ్యాధి గలుగుట, ఉబ్బుపట్టుకొనుట - ఈలక్షణములతోడ కడుపుబ్బి మూత్రము వెడలకుండుటయే మూత్రబద్ధవాతమని తెలియవలయును. (ఇది యాప్యము.)

## మూత్రబద్ధవాతమునకు వాతవిద్రావణరసము

సూతాభ్ర తామ్ర తీక్ష్ణం చ మృతం తాళక గంధకం,
భార్గీ శుంఠీ వచా ధాన్యా కట్ఫలం చాభయావిషమ్. 119
మర్ద్యం పర్పటకద్రావై ర్నిష్కైకం భక్షయే ద్వటీం.
మూత్రబద్ధవినాశాయ సర్వవాతప్రశాంతయే. 120

తా. రసభస్మము, అభ్రకభస్మము, తామ్రభస్మము, లోహభస్మము, తాళక భస్మము, శుద్ధిజేసిన గంధకము, గంటుభారంగి, శొంఠి, వస, కొతిమిర్లు, *పెద్ద గుమ్ముడు, కరక్కాయలు, అతివస వీనిని సమభాగములుగ ఖల్వమున నునిచి పర్పాటక రసముతో ఒకదినము మర్దించి నిష్కప్రమాణమంత మాత్రలుచేసి సేవించిన మూత్రబద్ధవాతము, సర్వవాతములు హరించును.

## ఊరుస్తంభవాతలక్షణము

ఊరుస్తంభశ్చ మేఢ్రే చ గుదే పాదే చ శూలకం,
రక్తవాంతిర్నఖే శూల మూరువాతస్య లక్షణమ్. 121

తా. మేఢ్రము గుదము పాదములు శూలించుట, నెత్తురు గ్రక్కుట, గోళ్లు నొచ్చుట - ఈలక్షణములతోడ తొడలు స్తంభమువలె కదలక శూలించుటయే ఊరుస్తంభవాతమని తెలియవలయును. (ఇది అసాధ్యము.)

దేహం చ పాండురం మూత్రం దేహనేత్రే చ కంపనం,
శరీరే చ వికారోయ మూరువాతః ప్రకీర్త్యతే. (గ్రంథాంతరే) 122

తా. శరీరము పాండురవర్ణముగ నుండుట, మూత్రము పాండురవర్ణముగ వెడలుట, శరీరము వణకుట, నేత్రములు తిరుగుట, శరీరము వికారముగ నుండుట, ఈలక్షణములుగలిగి తొడలు కదలక శూలించుటయే ఊరువాతమని తెలియవలయును. (ఇది అసాధ్యము. ఈవాతము హరించుటకై రసకర్పూరమును సేవింపవలయును.)

## ఊరుస్తంభవాతమునకు వాతగజాంకుశరసము

అష్టభాగారసస్యాపి విషతిందో స్తథైవ చ,
గంధకస్య త్రిభాగం చ కటుత్రయపలత్రయమ్. 123

* ఇదే గుమ్ముడుతేకు అనియు జెప్పంబడును.

గుంజామాత్రం వటీం ఖాదే దశీతివాతనాశనం,
వాతగజాంకుశో నామ్నా హ్యూరుస్తంభం నిహంతి చ. 124

తా. శుద్ధిచేసిన పాదరసము ౧ భాగములు, మూడుదినములు కలిలో నానఁబెట్టిన విషముష్టిగింజలు ౧ భాగములు, శుద్ధిచేసిన గంధకము ౧ భాగములు, త్రికటుకములు 3 భాగములు, త్రిఫలములు 3 భాగములు - ఇటుల వీనిని ఖల్వమున నునిచి నిమ్మపండ్ల రసముతో బాగుగ మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి యందు మూడుమాత్రలను నెయ్యి, మిరియపుచూర్ణానుపానముతో నొసంగిన ఊరుస్తంభవాతము మొదలగు ఎనుబది వాతములు హరించును.

## తిమిరవాతలక్షణము

దేహం తిమిరయుక్తం చ గజదేహోపసంభవేత్,
దేహతాపశ్చాంగశోషో తిమిరవాతలక్షణమ్. (మాధవకల్పే) 125

తా. శరీరము ఏనుగుచర్మమువలె నుండుట, శరీరము మండుట, అంగములు శోషించుట - ఈలక్షణములు గలిగి శరీరమున చీమలు ప్రాఁకినటుల తిమిరి గలుగుటయే తిమిర వాతమని తెలియవలయును. (ఇది యాప్యము. మఱియు పంగువాతప్రకరణమున జెప్పంబడిన ప్రభావతివటికముల నల్లకాచాకు రసముతోనేని లేక ఉన్మాదప్రకరణమున జెప్పంబడు గంధకపిష్టమునేని ఆరుసెలలు సేవించిన తిమిరవాతము హరించును.)

## కంపవాతలక్షణము

కరపాదతలే కంపో దేహభ్రమణ దుఃఖితే,
నిద్రాభంగో మతిః క్షీణా కంపవాతస్య లక్షణమ్. 126

తా. చేతులు కాళ్లు వణకుట, శరీరము తిరుగుట, కడుదుఃఖము గలుగుట, నిదుర పట్టకుండుట, జ్ఞానము లేకుండుట - ఈలక్షణములు గలిగి శరీరము వణకుటయే కంపవాతమని తెలియవలయును. (ఇది యాప్యము.)

## కంపవాతమునకు విజయభైరవరసము

మృతసూతం మృతం తామ్రం మర్ద్యం గోకంటకద్రవైః,
ఏకవింశతివారం చ శోష్యం పేష్యం పునఃపునః. 127
చణమాత్రవటీం కుర్యా త్కంపవాతం వినాశయేత్,

తా. రసభస్మము, తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి పల్లేరువేళ్లరసముతో మర్దించి ఎండింపవలయును. ఇటుల ౨౧ దినము మర్దించి ఎండించి

శనగగింజలంతేసి మాత్రలుజేసి దుంపరాష్నముతోగాని, నెయ్యి, మిరియపుచూర్ణముతో గాని, ఆరునెలలు సేవించిన కంపవాతము హరించును. (దీనియందు చప్పిడిపథ్యము నాచరించవలయును.)

బాహుకంపవాతలక్షణము

ఏకబాహుప్రకంపశ్చ వికారశ్చాపి దేహినామ్. 128
మహాదుఃఖం దివారాత్రౌ బాహుకంపస్య లక్షణం,

తా. శరీరవికారముగలుగుట, జేయుంబగలు కడుదుఃఖము గలుగుట - ఈలక్షణములు గలిగి ఒకచెయ్యి వణకుటయే బాహుకంపవాతమని తెలియవలయును. (ఇది యసాధ్యము.)

బాహుకంపవాతమునకు మాషతైలము

మాషప్రస్థే హ్యపామష్టౌ పాకేస్మిన్ పాదశేషితే.
జీవనీయ మిసీవ్యోష రాస్నా యష్ట్యాహ్వసైంధవైః, 129
ఆత్మగుప్తాయుతం తైలం ప్రస్థం క్షీరం చతుర్గుణమ్. 130
వస్తికం చాపబాహుం చ బాహుకంపం వినాశయేత్,

తా. ౪ శేర్లు మినుముల నొకభాండములో వైచి దానికెనిమిదింతలు నీళ్ళుపోసి చతుర్థాంశముగ కాచి అందు పాలకూర, పిన్నసదాప, త్రికటుకములు, దుంపరాష్నము, యష్టిమధుకము, సైంధవలవణము, దూలగొండివిత్తులు అనువానిచూర్ణము దినుసుకు పావుశేరు, నూనె ౪ శేర్లు, పాలు ౧౬ శేర్లు కలిపి చిక్కగ కాచి శరీరమునకు మర్దనచేయుచుండిన వస్తివాతము, అపబాహువాతము, బాహుకంపవాతము హరించును.

బాహుకంపహాతమునకు కార్పాసతైలము

కార్పాసాసి కుళుత్థానాం క్వాథం తైలం పయోన్వితమ్. 131
సైంధవం చిత్రకాభ్యాం చ స్నిగ్ధం తదపబాహుకే,

(గ్రంథాంతరే)

తా. ప్రత్తివిత్తులు ౪ శేర్లు, ఉలవలు ౪ శేర్లు, వీనిలో 3౨ శేర్లు ఉదకము పోసి ౮ శేర్లు మిగులునటుల కషాయము కాచి అందు నూనె ౪ శేర్లు, పాలు ౧౬ శేర్లు కలిపి చిక్కగవండి దించునపుడు సైంధవలవణము, చిత్రమూలము అనువానిచూర్ణము దినుసుకు పావుశేరువంతున కలిపి శరీరమునకు లేపనము సేయుచుండినను, (లేక ఈతానును మేకపాలలో వైచి కాచి ఒకసంవత్సరముపఱకు సేవింపుచుండినను) అపబాహుకవాతము హరించును.

## శీతవాతలక్షణము

దేహేతిశీతలం మూర్ఛా నేత్రభ్రమణమేవ చ. 132
కంఠశూలం శిరశ్శూలం శీతవాతస్య లక్షణం, (ఆయుర్వేదే)

తా. మూర్ఛగలుగుట, నేత్రములు శరీరము తిరుగుట, మెడ శిరము శూలించుట-ఈలక్షణములుగలిగి శరీరము కడు శీతలముగనుండుటయే శీతవాతమని తెలియవలయును. (ఇది యాప్యము.)

## శీతవాతమునకు అగ్నికుమారరసము

సూతభస్మైకభాగం చ శుల్బభస్మ తథైవ చ. 133
విషం చ తత్సమం గ్రాహ్యం గంధకం ద్విగుణీకృతం,
త్రికటు త్రిఫలాచైవ సర్వమేకత్ర మర్దయేత్. 134
నిర్గుండీ భావనీ వహ్నీ వ్యాఘ్రీ పాతాళకం తథా,
కర్కోటీ కాకమాచీ చ ఇంద్రం వారుణికా తథా. 135
ఏతేషాం స్వరసం గ్రాహ్యం భావయే దేకవింశతి,
రసోహ్యగ్నికుమారాఖ్యః ప్రత్యక్షం పరమేశ్వరి. 136
సన్నిపాతే త్రిదోషే చ శీతాంగే వాతబంధనే,
యమాలయస్య కర్తవ్యం సూచికాగ్రప్రమాణకమ్. 137
సన్నిపాతహరం చైవ శీతజ్వరనివర్తకం,

తా. రసభస్మము, తామ్రభస్మము, శుద్ధిజేసిన వసనాభి ఇవి దినుసు కొక్కొక భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు, త్రికటుకములు ౧ భాగము, త్రిఫలములు ౧ భాగము-ఇటుల వీని ఖల్వమునం దునిచి వావిలాకు, నేలములకవేళ్ళు, చిత్రమూలము, ఎఱ్ఱ ఆముదపువేళ్ళు, దూసరితీఁగె, గొడ్డుకాకర, నల్లకాచాను, పాపటవేళ్ళు అనువానిరసములతో ఇరువదియొకమారు మర్దించి భావనజేసి మిరపగింజలంత మాత్రలుజేసి అల్లపురసముతో నొసంగిన సన్నిపాతము, త్రిదోషము, శీతాంగవాతము, వాతపట్లు హరించును. మఱియు సన్నిపాత శీతజ్వరములవలన యమాలయమున కేగుటకు ఉన్ముఖుండుగ నుండువానియొక్క నడినెత్తియందు వెంట్రుకలు తీసి ఈయగ్నికుమారమును సూచ్యగ్రప్రమాణంబునిచి నెత్తురుతో గలియునటులు వ్రేలితో బాగుగరుద్దిన వాఁడు జీవించును. ఈఅగ్నికుమారరసము పరమేశ్వరునిచే పార్వతికిఁ జెప్పంబడియెడిది. (మఱియు దీనిని నెయ్యి మిరియపు చూర్ణానుపానముతోనేని లేక శొంఠి గుడానుపానముతోనేని లేక కారుమునగగడ్డరసానుపానముతోనేని లేక సొంటి వెల్లుల్లిరసానుపానముతోనేని సేవించి

నను లేక పైత్యప్రకరణమున జెప్పంబడు బడబాగ్నిరసమును సేవించినను శీతవాతము హరించును.)

### సిరావాతలక్షణము

సార్వాంగం చ సిరాదుఃఖం శరీరంచ చరాచరమ్. 138
దేహః పాండుశ్చ పీతశ్చ సిరావాతస్య లక్షణం, (ఆయుర్వేదే)

తా. అవయవములు నొచ్చుట, శరీరము దౌర్బల్యముగనుండుట, శరీరము పాండురవర్ణముగగాని, పచ్చగగాని నుండుట-ఈలక్షణములు గలిగి నరములు నొచ్చుటయే సిరావాతమని తెలియవలయును. (దీనియందు వాతగజాంకుశరసమునేని, రసకర్పూరమునేని సేవింపవలయును.)

### సిరావాతమునకు ఏరండాదికషాయము

ఏరండమూలం లశునం శుంఠీ దార్వీ పునర్నవా. 139
సపిప్పలీ కృతక్వాథం సిరావాతహరం పరం,

తా. ఆముదపువేళ్లు, వెల్లుల్లిపాయలు, సొంటి, మ్రానిపసపు, గలిజేరువేళ్లు, పిప్పళ్లు వీనిని సమభాగములుగ దంచి కషాయము కాచి సేవించిన సిరావాతము హరించును.

### సిరావాతమునకు దేవదార్వాదికషాయము

దేవదారు బలావిశ్వ సైరేయై స్సాధితం జలమ్. 140
పాయయే త్తైలమిశ్రం తు సిరావాతవికారనుత్,

తా. దేవదారు, ముత్తవపులగము, సొంటి, ములుగోరింట వీనిని సమభాగములుగ కషాయము కాచి వడియకట్టి అందు నాలుగుబిందువులు ఆముదము కలిపి త్రాగిన సిరావాతము హరించును.

### నయనవాతలక్షణము

నయనే కంపరోగశ్చ శిరోభ్రమణమారుతమ్. 141
ఉష్ణాశ్రుసహితం నేత్రం నయనే వాతలక్షణం,

(ఆయుర్వేదే)

తా. నేత్రములు అదరుట, తల తిరుగుట, శరీరము వాతపూరితముగ నుండుట, నేత్రములు మండుట, నేత్రముల నీరుగారుట-ఈలక్షణములు గలిగి నేత్రములు నొచ్చుటయే నయనవాతమని తెలియవలయును. (మఱియు పరంగిచెక్కను, సాయంప్రాతఃకాలముల సేవింపుచు తియ్యనిపదార్థములు, అన్నము, కందిపప్పు వీనిని భక్షింపుచుండినను-లేక రసకర్పూరమును సేవింపుచుండినను నయనవాతము హరించును.)

### నాసావాతలక్షణము

పూరితం కుసుమం ఘ్రాణే నిర్వేదన మహాభయమ్. 142
శిరోభ్రమణ పిత్తం చ నాసావాయుః ప్రకీర్తితం,

తా. శరీరము దుర్బలముగ నుండుట, కడు భయముగలుగుట, తల వణకుట, శరీరము పిత్తాధిక్యముగనుండుట-ఈలక్షణములు గలిగి నాసికము పూరించి నెత్తురుగారుటయే నాసావాతమని తెలియవలయును (ఇది హరించుటకై మఱ్ఱియూడలచూర్ణమును నస్యము సేయవలయును).

### నాసావాతమునకు నస్యము

శర్కరా తిల కల్కాభ్యాం నాసాఘ్రాణం ప్రయోజయేత్. 143
గళూచ్యాః పుటపాకం తు నిష్పీడ్యానేననావయేత్,
నాసాయాం చ శిరోహృద్యం నాసావాయుర్వినశ్యతి. 144

తా. పంచదార, నువ్వులు వీనిని కల్కముగనూరి దానిని బట్టలో నునిచి నస్యము చేసినను లేక తిప్పతీగెను కుమ్ములోనుక్కి యందు రసముతీసి ముక్కులో పిండినను నాసావాతము, శిరోవేదన హరించును.

### నాసారక్తమునకు నస్యము

గుడ నాగరయోః కల్క కోష్ణతోయేననావనం,
స్వరసైర్భృంగరాజస్య త్ర్యూషణేనచనావనమ్. 145
నాసావాతే శిరోమధ్యే లేప్యం రక్తం వినశ్యతి,

తా. నాసావాతమున బెల్లము, సొంటి వీనిని ఉష్ణోదకముతోనూరి కల్కము చేసి నస్యముచేసినను, లేక సొంటి, పిప్పలి, మిరియాలు - వీనిని గుంటగలగరాకు రసముతో నూరి నస్యముచేసినను, లేక శిరోమధ్యమున లేపనముచేసినను నాసారక్తము హరించును.

### ముఖవాతలక్షణము

నిష్ఠీవనం కృశత్వం చ ముఖనాసాత్కఫస్య చ. 146
దేహకండూశ్చ శ్వాసశ్చముఖవాతః ప్రకీర్తితః, (మాధవనిదానే)

తా. శరీరము కృశించుట, శరీరమున దురద, ఉబ్బసము గలుగుట-ఈలక్షణములు గలిగి ముక్కున నోట తెమడగారుటయే ముఖవాతమని తెలియవలయును.

### ముఖవాతమునకు చతుర్ముఖరసము

మృతసూతాభ్రకం తుత్థం రాజావర్తం శిలాజతు. 147

గుగ్గులుశ్చ శిలాచైవం సమాంశం మధుమిశ్రితం
భక్షయే న్మాషమేకం తు ముఖవాతప్రశాంతయే. 148

తా. రసభస్మము, అభ్రకభస్మము, శుద్ధిజేసిన మైలుతుత్తము, కలుపురాయి, శుద్ధిజేసిన శిలాజిత్తు, శుద్ధిజేసిన గుగ్గిలము, శుద్ధిజేసిన మణిశిల వీనిని సమభాగములుగ తేనెలో మర్దించి మాషప్రమాణముం తేసి మాత్రలుజేసి భక్షించిన ముఖవాతము శమించును.

ముఖవాతమునకు విళంగాదిచూర్ణము

విళంగ హింగ్వపామార్గ బీజ నక్తాహ్వాసర్షపైః,
అగ్నింపురస్తా న్నిక్షిప్య ముఖవాతే చ ధూపయేత్. 149

తా. వాయువిళంగములు, ఇంగువ, ఉత్తరేణివిత్తులు, ఆవాలు-వీనిని చూర్ణముజేసి అగ్నిలో వేసి పొగబట్టిన ముఖవాతము హరించును.

ఉదరవాతలక్షణము

ఉదరం శూలబద్ధం చ బాహుకంప శ్శిరోవ్యథా,
నిద్రానాశో౽తిపీడా చ ఉదరవాతలక్షణమ్. (మాధవనిదానే)

తా. చేతులు వణకుట, తలనొచ్చుట, నిదురపట్టకుండుట, శరీరమున పీడగలుగుట-ఈలక్షణములు గలిగి కడుపు శూలించి బంధించుటే ఉదరవాత మని తెలియవలయును.

కుక్షివాతలక్షణము

కుక్షిశూలం శోఫ పాండు శిరోభ్రమణకం తథా,
నేత్రభ్రమో నాభిశూలం కుక్షివాతస్య లక్షణమ్. 151
(మాధవనిదానే)

తా. శరీరము వాచుట, శరీరము పాండురవర్ణముగ నుండుట, తల నేత్రములు తిరుగుట, బొడ్డుక్రింద శూలించుట - ఈలక్షణములు గలిగి కడుపు శూలించుటయే కుక్షివాతమని తెలియవలయును. (ఉదర, కుక్షివాతములకు ఏకచికిత్సం జేయవలయును.)

అశీతివాతములకు కాలాగ్నిరుద్రరసము

శుద్ధసూతం విషం గంధ మజామోదం ఫలత్రయం,
సర్జక్షారం యవక్షారం వహ్ని సైంధవజీరకమ్. 152
సౌవర్చలం విళంగాని టంకణం చ కటుత్రయం,
విషముష్టి స్సర్వసమో జంబీరై ర్మర్దయే ద్దినమ్. 153
మరీచమాత్రవటికా హ్యగ్నిమాంద్యం ప్రణాశయేత్,

అశీతివాతజాన్ రోగాన్ గుల్మంచ గ్రహణీ గదాన్. 154
రసః కాలాగ్నిరుద్రోఽయం పూజ్యపాదేన నిర్మితః,

తా. శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసిన వసనాభి, శుద్ధిచేసిన గంధకము, అజామోదము, త్రిఫలములు, సర్జక్షారము, యవక్షారము, చిత్రమూలము, సైంధవలవణము, జీలకఱ్ఱ, సౌవర్చలవణము, వాయువిడంగములు, శుద్ధిచేసిన వెలిగారము, త్రికటుకములు-వీని నెల్ల సమభాగములుగ దంచి చూర్ణముజేసి దీనికి సమముగ మూడుదినములు కలిలో నానబెట్టఁబడిన విషముష్టివిత్తుల చూర్ణముచు కలిపి ఖల్వమున నిమ్మపండ్లరసములో ఒక దినము మర్దించి మిరియపుగింజలంతేసి మాత్రలుజేసి నెయ్యి, మిరియపుచూర్ణము అనుపాని యనుపానముతో నొసంగిన అగ్నిమాంద్యము, కుక్షివాతము మొదలగు ఎనుబది వాతములు, గుల్మము, గ్రహణి హరించును. ఇదియ పూజ్యపాదునిచే వచింపఁబడిన కాలాగ్నిరుద్రరసము.

## అజీర్ణవాతలక్షణము

మలస్యబంధోఽవయవేచ దుఃఖం జంఘాదిపాదే శిరశూలశోషం,
మందాగ్నియోగో హ్యరుచి క్లమం చ హ్యజీర్తివాతం ప్రవదంతి తజ్జ్ఞాః. (మాధవనిదానే)

తా. మలము బద్ధకించుట, అవయవములు నొచ్చుట, పిక్కలుమొదలు పాదములవఱకు శూలించుట, తల నొచ్చుట, శరీరము ఎండుట, అగ్నిమాంద్యము, అరుచి, బడలిక గలుగుట-ఈలక్షణములుగలిగి భుజించినయన్నము అరిగి అరగకుండుటయే అజీర్ణవాతమని తెలియవలయును. (ఇది హరించుటకై వాతగజాంకుశరసమునేని, లేక రసభస్మమునేని సేవింపవలయును.)

## ఆమ్లవాతలక్షణము

అరుచిశ్చామ్లవాతశ్చ మందాగ్నిర్నాభిశూలనం,
గురూకరత్యపీడా చ హ్యామ్లవాతస్య లక్షణమ్. (మాధవనిదానే)

తా. అరుచిగలుగుట, అన్నము అరగకుండుట, బొడ్డులో శూలించుట, శరీరము బరువుగనుండుట, శరీరమునొచ్చుట - ఈలక్షణములుగలిగి పులితేనుపులు వచ్చుటయే అమ్లవాతమని తెలియవలయును. (ఇది హరించుటకై క్షయప్రకరణమున జెప్పంబడిన శ్రీమదగ్నికుమారమును సేవింపవలయును.)

## ఆమ్లవాతమునకు విషతిందుకతైలము

విషతిందుకవృక్షస్య ఫలసారస్య ప్రస్థకం,

ద్వావ్యథకే నారనాశేన సంమిశ్ర్యాలోడ్య యత్నతః. 157
జంబీరనీరం ద్విప్రస్థం ప్రస్థం తద్బీజచూర్ణకం,
ప్రస్థ మేరండతైలం చ ద్విప్రస్థం తిలతైలకమ్. 158
తావత్కషాయం తత్తైలం నవవస్త్రేన డోలితమ్. 159
సర్వాంగసంధ్యస్థిగతామ్లవాయు కఫామయేచానిలఘోరశూలే,
విలోమవాయావనులోమవాయౌ స్తంభే ధనుర్వాతఇతి ప్రశస్తమ్.

తా. నాలుగుసేర్ల విషముష్టివిత్తులలో ముప్పదిరెండు సేర్ల జొన్నలకలిపోసి ౧౨ సేర్లకషాయము కాచి క్రొత్తవస్త్రమున వడియగట్టి అందు నిమ్మపండ్లరసము ౨ సేర్లు, విషముష్టివిత్తుల చూర్ణము ౧ సేర్లు, ఆముదము ౧ సేర్లు, నువ్వులనూనె ౨ సేర్లు కలిపి తైలపక్వముగ కాచి, శరీరమున లేపనము జేయుచుండిన సర్వాంగవాతము, సంధివాతము, అస్థివాతము, ఆమ్లవాతము, కఫవాతము, ఘోరమైన వాతనొప్పులు, విలోమవాతము, అనులోమవాతము, ఊరుస్తంభవాతము, ధనుర్వాతము మొదలగునవి హరించును.

## అనులోమ వాతలక్షణము

శిరః కండూశ్చ దేహశ్చ పాండురశ్ఛర్దనం భ్రమః,
స్వేద మూర్ఛా భయం చైవ ధాతుశోషో వికారకృత్. 161
హాస్యం నిద్రాతిశ్వాసశ్చ హ్యనులోమస్య లక్షణం,
(ఆయుర్వేదే)

తా. శిరమున దురద గలుగుట, శరీరము * పాండురవర్ణముగ నుండుట, వాంతి, భ్రమ, చెమట, మూర్ఛ, భయము గలుగుట, ధాతువులు శోషించుట, శరీరవికారము, నగవు, కడునిద్ర, కడుశ్వాసము గలుగుట-ఈలక్షణములతోడ వెనుకకు వంగదీయుటయే అనులోమవాతమని తెలియవలయును. (దీనియందు తీవ్రమైనతీపులు గలిగిన రోగి మృతి జెందుననియు, మెల్లనితీపులు గలిగిన రోగి జీవించుననియు తెలియవలయును.)

## అనులోమవాతమునకు వాతసమ్మోహనరసము

శుద్ధసూతం విషం చాభ్రం వ్యోషం గంధక టంకణమ్. 162
సైంధవం ధూర్తబీజం చ తుల్యం తుల్యం విచూర్ణయేత్;
త్రిదినం మర్దయేత్ఖల్వే కారవల్లీరసేన చ. 163
వజ్రమూషాంతరే క్షిప్త్వా కాచకుప్యా మథాపి వా,
వాలుకాయంత్రకే పక్త్వా ద్వియామాంతే సముద్ధరేత్. 164

* పాండురవర్ణమున— తెలుపువన్నె, లేక తెలుపు పచ్చన గలరంగు.

ఏతత్సర్వం సమాదాయ మత్స్యపిత్తేన భావయేత్,
మాషమాత్రం నిషేవేత హ్యనులోమం నిహంతి చ. 165

తా. శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసినవసనాభి, అభ్రకభస్మము, త్రికటుకములు, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసిన వెలిగారము, సైంధవలవణము, శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు-వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ఖల్వములో నునిచి కాకరాకురసముతో మూడు దినములు మర్దించి వజ్రమూషలోగాని గాజుకుప్పెలోగాని నునిచి వాలుకాయంత్రమున రెండుఝాములు వండి సాంగశీతలమున దీసి ఖల్వములో నునిచి చేపచేదుతో భావనజేసి మాషప్రమాణముంతేసి మాత్రలుచేసి యందొకదానిని తీటకసిందవేళ్ళ రసముతోనేని, వావిలాకురసముతోనేని సేవించిన అనులోమవాతము హరించును.

### విలోమవాతలక్షణము

అతితంద్రాప్యతిశ్వాసః పాండుతా నేత్రశూలకృత్,
స్వేదో హిక్కాతివాంతిశ్చ విలోమవాతలక్షణమ్. 166

తా. కడుతంద్ర, కడుశ్వాసము గలుగుట, శరీరము పాండురవర్ణముగ నుండుట, నేత్రములు శూలించుట, చెమట, ఎక్కిళ్ళు, వాంతి గలుగుట - ఈలక్షణములు గలిగి ముందరికి వంగదీయుటయే విలోమవాత మని తెలియవలయును. (మఱియు దీనియందు తీపులు తీవ్రముగ నుండిన రోగి మృతిజెందు ననియు, మెల్లగ నుండిన జీవించు ననియు తెలియవలయును.)

### విలోమవాతమునకు సింహనాదరసము

శుద్ధసూతం విషం గంధం సమం మణిశిలారసం,
దంతిబీజం సమంఖల్వే మర్దయే ద్దివసద్వయమ్. 167
కారవల్లీరసై స్సమ్యక్పుటపాకే చ యోజయేత్,
ఉద్ధృత్య చూర్ణయే త్ఖల్వే ద్వియామంచానుపానతః. 168
గుంజామాత్రం ప్రదాతవ్యం విలోమవాతనాశనం,

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసినవసనాభి, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసినమణిశిల, శుద్ధిచేసిన కపరి ఇవి సమభాగములు-వీనికి సమముగ నేలదంతివిత్తులచూర్ణము కలిపి ఖల్వమున నునిచి కాకరాకురసముతో రెండుదినములు మర్దించి ౨ ఝాములు వాలుకాయంత్రమున పాకముచేసి సాంగశీతలమున దీసి ఖల్వములో చూర్ణముచేసి గురిగింజ

ప్రమాణమును వావిలాకురసముతోనేని, తీటకసిందరసముతోనేని సేవింపుచుండిన విలోమ వాతము హరించును.

### ధనుర్వాతలక్షణము

ధనుశ్చ కంపనం మూర్ఛా హ్యగ్నిమాంద్యం ప్రలాపకమ్. 169
మృత్యుతుల్యాని చిహ్నాని ధనుర్వాతస్య లక్షణం,
(మాధవనిదానే)

తా. వణకుట, మూర్ఛ, అగ్నిమాంద్యము లేక కడుపుబ్బు మంట, ప్రలాపము గలుగుట, మృతిజెందినటుల కనుపించుట-ఈలక్షణములు గలిగి శరీరము విల్లువలె వంగి యుండుటయే ధనుర్వాతమని తెలియవలయును. (ఇది అసాధ్యము.)

### ధనుర్వాతమునకు అగ్నికర్మాదిచికిత్స

శరీరం జాయతే ఘోర మగ్నివైద్యం చకారయేత్. 170
పాదాదికంఠపర్యంతం సంధిదేశే శలాకయా,
ఏరండతైలత్రిఫలా గోమూత్రం చిత్రకం విషమ్. 171
మాషకస్య ఘృతైః పానం ధనుర్వాతం వినాశయేత్,

తా. పైఁజెప్పఁబడిన ధనుర్వాతమున శరీరము మహాఘోరముగ నుండును. కావున పాదము మొదలు కంఠమువఱకు సంధిప్రదేశముల శలాకుతో అగ్నివైద్యమును సేయుటయేగాక త్రిఫలములు, చిత్రమూలము, అతివస అనువానిని సమభాగములుగ చూర్ణముచేసి అందు ఆముదము, గోమూత్రము కలిపి సేవించినను, లేక మినపకట్టులో నేతిని కలిపి సేవించినను ధనుర్వాతము హరించును.

### కంఠవాతలక్షణము

సద్యోమృత్యుః కంఠవాత శ్శిరోభంగః ప్రలాపనమ్. 172
వాంతీరక్తస్య కంపశ్చ కంఠవాతస్య లక్షణం,

తా. ప్రలాపించుట, నెత్తురుగ్రక్కుట, శరీరము వణకుట-ఈలక్షణములు గలిగి కంఠము, తల బ్రద్దలుచేసినటుల నొచ్చుటయే కంఠవాతమని తెలియవలయును. ఇది జనించునపుడే రోగిని చంపును. (దీనియందు వాతగజాంకుశరసమును సేవింపందగును.)

### పక్షఘాతవాతలక్షణము

శిరసః పాదపర్యంత మర్ధాంగే పార్శ్వశూలకృత్. 173
మహాశూలం దివారాత్రౌ పక్షఘాతస్య లక్షణం,

తా. శిరము మొదలు పాదపర్యంతమును, ఒకపార్శ్వమున శూలించుట, రేయింబగలు శరీరము మిక్కుటముగ నొచ్చుట-ఈలక్షణములు గలిగి శరీరముయొక్క అర్ధపార్శ్వము పగులగొట్టునటులనొచ్చుటయే పక్షఘాతవాతమని తెలియలయును .(ఇది సాధ్యము.)

పార్శ్వమర్థం శరీరస్య కంపస్స్యా త్కుక్షిశూలనమ్. 174
నేత్రామయవిరోధశ్చ భంగస్స్యా త్పక్షఘాతకః, (ఆయుర్వేదే)

తా. శరీరార్ధపార్శ్వము వణకుట, కడుపులో శూలించుట, నేత్రరోగము గలుగుట-ఈలక్షణములు గలిగి శరీరముయొక్క అర్ధపార్శ్వము పగులగొట్టునటుల నొచ్చుటయే పక్షఘాతవాతమని తెలియవలయును. (ఇది సాధ్యము. మఱియు వీనితోడ జ్వరమును సంబంధించియుండిన రోగి మృతిజెందును. జ్వరము సంబంధించకుండిన చికిత్సం జేయవలయును. చికిత్సించునెడ రసకర్పూరమును సేవింపజేయవలయును. రసఉబ్బను వేయవలయును)

పక్షఘాతవాతమునకు కాలకంఠరసము

శుద్ధసూతం విషం గంధం మరీచం టంకణం కణా. 175
ధూర్తబీజం చ త్రిఫలా సమభాగం చ ఖల్వకే,
తిందుకో బృహతీ ఫల్గు సోమవల్లీ కపిత్థకః. 176
ఆర్ద్రికం భృంగరాజం చ ద్రవైర్భావ్యం దినత్రయం,
కాచకుప్యాం విలేప్యాథ వాలుకాయంత్రకే పచేత్. 177
యామద్వయం చ మందాగ్నౌ సాంగశీతలముద్ధరేత్,
వారాహ ఛాగపిత్తే చ భావయేచ్చ దినద్వయమ్. 178
గుంజామాత్రం ప్రదాతవ్యం పక్షఘాతం వినాశయేత్,
త్రికటు త్రిఫలా క్వాథ మనుపానం పిబేత్సదా. 179

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిచేసిన వసనాభి, శుద్ధిచేసిన గంధకము, మిరియాలు శుద్ధిచేసిన వెలిగారము, పిప్పళ్ళు, ఉమ్మెత్తవిత్తులు, త్రిఫలములు - వీనిని సమభాగములుగ చూర్ణము చేసి ఖల్వములో నునిచి నల్లతుమికి, పెద్దములక, బ్రహ్మమేడి, భావంచి విత్తులు, వెలగ, అల్లము, గుంటగలగర అనువానిరసములతో మూడుదినములు మర్దించి భావనచేసి ముద్దజేసి గాజుకుప్పెలో నునిచి చీలమన్ను లేపనముజేసి ఎండించి వాలుకా యంత్రమున రెండుఝాములు మందాగ్నితో వండి సాంగశీతలమున దీసి ఖల్వమున నునిచి అడవిపంది, మేక అనువానిచేదులతో రెండుదినములు భావనచేసి గురిగింజలంతేసి

మాత్రలుజేసి యందొకదానిని త్రికటుకములు త్రిఫలములు, అనుపాని కషాయ పానముతో సేవించిన పక్షఘాతవాతము హరించును. (మఱియు ఔషధమును ఒకప రంజేని, ఆరుమాసములేని సేవింపక వాతరోగములు హరింప వని శాస్త్రములయం చెప్పఁబడియున్నయవి.)

### అర్ధాంగవాతలక్షణము

అర్ధాంగం బాహుకంపశ్చ నిద్రానాశనమేవ చ,
హృదయాగ్నిర్మలంబద్ధ మర్ధాంగవాతలక్షణమ్. 18

తా. బాహువులు వణకుట, నిదుర పట్టకుండుట, కడుపులో మంట, మల బంధించుట - ఈలక్షణములు గలిగి శరీరములో అర్ధభాగము ఈడ్చికొనియుండుట అర్ధాంగవాతమని తెలియవలయును.(ఇది యాప్యము. దీనియందు పక్షఘాతవాతచికి లం జేయవలయును.)

### పార్శ్వవాతలక్షణము

దేహస్య శీతలం పార్శ్వే ప్యున్మాదశ్చ శిరోభ్రమః,
కర్ణనేత్రే చ విస్ఫోటః పార్శ్వవాతస్య లక్షణమ్. (ఆయుర్వేదే) 18

తా. ఉన్మాదము గలుగుట, తల తిరుగుట, చెవులు, నేత్రములు నొచ్చుట - లక్షణములు గలిగి శరీరములో అర్ధపార్శ్వము చల్లగనుండుటయే పార్శ్వవాతమని తె యవలయును. (ఇది యాప్యము. దీనియందు వాతగజాంకుశరసమును సేవింపవలయును

శిరఃపార్శ్వే చ శూలం చ నేత్రకర్ణే తు మందతా,
కర్ణాంతరే మహాశూలం పార్శ్వశూలాదిదోషకృత్. 18

తా. శిరముయొక్క ఒకపార్శ్వము శూలించుట, నేత్రములకు చూపులేకుండు చెవులు వినరాకుండుట, చెవిలో మిక్కుటముగ పోట్లుపొడుచుట-ఈలక్షణములు గ శరీరముయొక్క ఒకపార్శ్వమున శూలాదిదోషములు కలుగుటయే పార్శ్వవాతమ తెలియవలయును. (ఇది హరించుటకై వాతగజాంకుశరసమును సేవింపవలయును.)

### ఆతపవాతలక్షణము

పాండుశ్చ దృష్టి ర్భ్రమణం వికారః
ప్రాణస్యహానిర్భయతాపసంభవః,
దుఃఖాతిపీడా కుటిలం వ్యథా చ
శరీరఇత్యాతపవాతలక్షణమ్. (మాధవకల్పే) 18

తా. నేత్రములు పాండురవర్ణముగ నుండుట, శరీరము తిరుగుట, శరీరము వికారముగ నుండుట, ప్రాణహాని, దుఃఖము, మహాసంకటము గలుగుట, పలువిధములైన యుపద్రవములు గలుగుట-ఈలక్షణములతోడ సహించుట కశక్యమైనతాపము గలుగుటయే ఆతపవాతమని తెలియవలయును. (ఇది యాప్యము.)

ఆతపవాతమునకు వాతశార్దూలరసము

విషం సూతాభ్రకం గంధ వచా హింగుళ సైంధవం,
లవంగం పిప్పలీమూలం తుల్యంతుల్యం విమర్దయేత్. 184
దినం హంసపదీద్రావైః కుక్కుటీపుటపాచితం,
చూర్ణీకృతం తతో దేయ మనుపానవిశేషతః. 185
ఆతపవాతనిర్ముక్తి స్తమసూర్యోదయే యథా,

తా. శుద్ధిచేసినవసనాభి, శుద్ధిచేసినరసము, అభ్రకభస్మము, శుద్ధిచేసిన గంధకము, అతివస, శుద్ధిచేసిన ఇంగిలీకము, సైంధవలవణము, లవంగములు, మోడి - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో ఒక దినము మర్దించి కుప్పెలో నునిచి మూడుయామములు కుక్కుటపుటంబిడి సాంగశీతలమున దీసి చూర్ణము జేసి గురిగింజంతయెత్తును నెయ్యి మిరియపుచూర్ణముతో నొసంగిన "సూర్యుం డుదయించుటచే నంధకారము నశించుభంగి" ఆతపవాతము నశించును.

అగ్నివాతలక్షణము

అగ్నౌ దేహవికారయంతి మనుజా మూర్ఛా విదాహ శ్శిరో
భంగస్స్యాచ్ఛ తథాశరీరమలినా శ్శుష్కాంగతా కోపితా,
ఆయుర్వర్ధనదో బలక్షయకరః కాంతిం వినా మానుషా
హ్యగ్నింవాతమిమం వదంతి మునయో ధాత్రీచరం మారుతమ్. 186
(గ్రంథాంతరే)

తా. శరీరవికారము, మూర్ఛ, విదాహము, తలనొప్పి, శరీరమాలిన్యము, శరీరకృశత్వము, కోపము, *ఆయుర్వృద్ధి, దౌర్బల్యము గలుగుట, శరీరము కాంతివిహీనముగ నుండుట-ఈలక్షణములు గలిగి శరీరము అగ్నివలె మండుచు మనుజుల పీడింపుచుండునది అగ్నివాతమని మునీశ్వరులచే జెప్పంబడియుడిది. (ఇది యాప్యము.)

అగ్నివాతమునకు వీరభద్రరసము

మృతంసూతం మృతంతామ్రం మర్దయే త్కంటకీద్రవైః,

* ఆయుర్వృద్ధియన—చంపక బాధించుట.

ఏకవింశతివారం వై శోష్యం పేష్యం పునఃపునః. 187
చణమాత్రాం వటీం ఖాదే త్సర్వాంగేచాగ్నివాతకే,
స్వర్ణక్షీరీ విషా వహ్నీన్ వారిణా పేషయేత్సమమ్. 188
ఈషన్మాత్రఘృతే పాచ్యం లేపాద్వాతో వినశ్యతి,

తా. రసభస్మము, తామ్రభస్మము - వీనిని ఖల్వములో నునిచి పల్లేరువేళ్ళరసముతో మర్దించి ఎండింపవలయును. ఇటుల ఇరువదియొకమారు మర్దించి ఎండించి శనగగింజలంతేసి మాత్రలుజేసి సేవించుటయేకాక రెడ్డినానబ్రాలు, అతివస, చిత్రమూలము అనువానిని సమభాగములుగ ఖల్వములో నునిచి ఉదకముతో నూరి అందు ఒకింత ఘృతము కలిపి పాకము చేసి శరీరమునకు లేపనముజేసిన అగ్నివాతము నశించును.

### ఆఢ్యవాతలక్షణము

వక్షాణి జఠరే దాహ శ్శిరో నేత్రే భ్రమ స్తథా. 189
పాదశూలం కర్ణశూల మాఢ్యవాతస్యలక్షణం,

(మాధవనిదానే)

తా. కడుపులో మండుట, తల వణకుట, కన్నులు తిరుగుట, కాళ్ళయందు శూల, చెవిలో పోట్లుగలుగుట-ఈలక్షణములు గలిగి శరీరమున గాదెలుకట్టుటయే ఆఢ్యవాతమని తెలియవలయును.

### ఆఢ్యవాతమునకు ప్రభావతీవటికములు.

భాగమేకం తు కర్పూరం తదర్ధం శుద్ధగంధకమ్. 190
తత్సమాని విడంగాని జాతీపత్ర లవంగకం,
జాజీఫలం తథాచైలా వ్యోషంచాపి సమంసమమ్. 191
శ్లక్ష్ణచూర్ణమిదం సర్వం మర్దయే ద్యామమాత్రకం,
గుడేన మాషమాత్రం తు వటికాం కారయేద్బుధః. 192
ఇయం ప్రభావతీ నామ్నా హ్యాఢ్యవాతవినాశకృత్. 193

తా. రసకర్పూరము ౧ భాగము, శుద్ధిచేసిన గంధకము ౪ భాగము, వాయువిడంగములు ౪ భాగములు, లవంగము, జాపత్రి, జాజికాయ, ఏలకులు - ఇవి దినుసు ఒకటింటికి ఒక్కొకభాగము, త్రికటుకములు ౧ భాగము-ఇటుల వానినెల్ల గ్రహించి చూర్ణముచేసి అందు బెల్లము కలిపి ఒకఝాము మర్దించి మాషప్రమాణమంతేసి మాత్రలుజేసి సాయంప్రాతఃకాలములయందు దొక్కొకమాత్రచొప్పున నాలుగుమాసములు నేతితో సేవింపుచుండిన ఆఢ్యవాతము హరించును.

## శుష్కవాతలక్షణము

దేహశ్చ పాండుః శ్రమమారుతౌ చ
మూర్ఛాతికంప భ్రమ తాపయుక్తః,
స్వేదశ్చ తృష్ణా బధిరత్వయోగః
శుష్కం చ వాతం ప్రవదంతి తజ్జ్ఞాః. (మాధవనిదానే) 194

తా. శరీరము పాండురవర్ణముగ నుండుట, బడలిక, శరీరమున వాతోపద్రవములు, మూర్ఛ, వణకు, భ్రమ, తాపము, చెమట, దప్పిగలుగుట, చెవులు వినరాకుండుట- ఈలక్షణములు గలిగి శరీరము ఎండియుండుటయే శుష్కవాతమని తెలియవలయును. (ఇది హరించుటకై ఆఢ్యవాతచికిత్సనేని వాతగజాంకుశరసము సేవననేని చేయవలయును.)

## సుప్తవాతలక్షణము

భయం బీభత్సతా రౌద్రం శోషః కర్ణాంతరుగ్భవేత్,
మూర్ఛా కంప భ్రమ స్వేదా స్సుప్తవాతం వినిర్దిశేత్. 195
(మాధవనిదానే)

తా. భయపడుట, చిత్తవికారము, కోపము గలుగుట, శరీరము ఎండుట, చెవికొనలయందు పీడ, మూర్ఛ, వణకు, భ్రమ, చెమట గలుగుట – ఈలక్షణములు గలిగి స్పర్శజ్ఞానము లేకుండుటయే సుప్తవాతమని తెలియవలయును.

## సుప్తవాతమునకు కనకసుందరరసము

శుద్ధం చ పారదం శుల్బం గంధకం టంకణం కణా,
కాకజంఘా కషాయేణ దినమేకం తు మర్దయేత్. 196
డోలాయంత్రే పచే ద్యామం సమ్యక్తీవ్రాగ్నినా తతః,
ఆర్ద్రికస్యానుపానేన మాషమాత్రం పిబేదను. 197
సుప్తవాతం నిహంత్యాశు సర్వవాతనికృంతనః,

తా. శుద్ధిచేసిన రసము, తామ్రభస్మము, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన వెలిగారము, పిప్పళ్లు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి వెలమసుందివేళ్ల కషాయముతో ఒకదినము మర్దించి ముద్దచేసి డోలాయంత్రమున ఒకఝాము గాఢాగ్నితో వండి మాషప్రమాణమును అల్లపురసముతో సేవించిన సుప్తవాతము హరించును. (మఱియు దీనినే శుష్కవాతము నందురు. ఎనుబదివాతములయందును సేవింపవలయును.)

సంధివాతలక్షణము

శరీరం గంధలిప్తం చ శూలం వాయుప్రకోపతః. 198
దేహే చ వికృతిశ్చైవ రోమహర్షో విలాసనం,
అంగసంధిషు పీడా చ సంధివాతస్య లక్షణమ్. 199

తా. శరీరము గంధముచే పూయబడినటు లుండుట, వాతప్రకోపమువలన శూల గలుగుట, శరీరమున గాదెలుకట్టుట, గగుర్పొడుచుట, ప్రలాపించుట - ఈలక్షణములు గలిగి అవయవసంధులు నొచ్చుటయే సంధివాతమని తెలియవలయును.

సంధివాతమునకు రత్నగర్భపోటలీరసము

శుద్ధసూతం విషం గంధం హింగుళం కటురోహిణీ,
లోహ తామ్ర మయోభస్మ తాళకం చ మనశ్శిలా. 200
అర్కమూలకషాయేణ మర్దితం వటకీకృతం,
కాచకుప్యాం నివేశ్యాథ లేపయేద్వస్త్రమృత్తికామ్. 201
త్రియామం వాలుకాయంత్రే పచేన్మృద్వగ్నినా తతః,
గుంజామాత్రం ప్రయుంజీత సంధివాతం నిహంత్యలమ్. 202

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినవసనాభి, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన ఇంగిలీకము, కటుకరోహిణి, లోహభస్మము, తామ్రభస్మము, మండూరము, శుద్ధిచేసిన తాళకము, శుద్ధిచేసినమణిశిల-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి జిల్లేడువేళ్ళ కషాయముతో ఒకదినముమర్దించి గాజుకుప్పెలో నునిచి చీలమన్ను లేపనముజేసి ఎండించి వాలుకాయంత్రమున మూడుయామములు మృద్వగ్నితో వండి యం దొక గురిగింజప్రమాణమును నెయ్యి, మిరియపు చూర్ణముతో నేని, లేక ఓషము వస అనువాని కషాయముతో నేని సేవించిన సంధివాతము హరించును.

సాధ్యవాతలక్షణము

రోమహర్షణకంచైవ శిరోభ్రమణ శూలకం,
కర్ణబాధిర్య మజ్ఞానం సాధ్యవాతం వినిర్దిశేత్. (ఆయుర్వేదే)

తా. గగుర్పొడుచుట, తలతిరుగుట, శరీరము శూలించుట, చెవులు వినరాకుండుట, అజ్ఞానము గలుగుట-ఈలక్షణములు గలది సాధ్యవాతమని తెలియవలయును. (ఇది యాప్యము. దీనియందు పూర్వోక్తసంధివాతచికిత్సనే చేయవలయును.)

శిరోవాతలక్షణము

శిరోవాతే చ హృచ్ఛూలం రోమహర్షో విశోషణం,

దాహః స్సర్వాంగనేత్రే చ శిరోవాతస్య లక్షణమ్. (ఆయుర్వేదే)

తా. బొమ్మనొచ్చుట, రోమములు గగుర్పొడుచుట, శరీరము ఎండుట, సర్వాంగములు నేత్రములు మండుట - ఈలక్షణములు గలిగి తలనొచ్చుటయే శిరోవాతమని తెలియవలయును. (ఇది హరించుటకై రసకర్పూరమునేని కాలాగ్నిరుద్రరసమునేని సేవింపవలయును.)

### స్వరహీనవాతలక్షణము

ఆతపో దేహశుష్కత్వం స్వరహానిశ్చ కంపనం,
పరిభ్రమః కర్ణశూలం స్వరహీననిరీక్షయేత్. (గ్రంథాంతరే)

తా. శరీరము ఉడుకుట, శరీరము శుష్కించుట, శరీరము వణకుట, తబ్బిబ్బులాడుట, చెవిలో శూలగలుగుట-ఈలక్షణములు గలిగి స్వరహీనమై పలుకుటయే స్వరహీనవాతమని తెలియవలయును.

### స్వరహీనవాతమునకు వాతకులాంతకతైలము

రసం గంధ శిలా తాళ చూర్ణం మర్ద్యం చ కాంజికైః,
లిప్త్వా వస్త్రే కృతాం వర్తిం తైలాక్తాం జ్వాలయేన్ముఖాత్. 206
స్రావయేద్గ్రాహయే త్తైల మధఃపాత్రే ఘృతైస్సహ,
తత్తైలం లేపయేత్పత్రే నాగవల్ల్యాస్తు భక్షయేత్. 207
స్వరహీనవికారఘ్నం సర్వవ్రణహరం పరం,

తా. రసము, గంధకము, శిలాజిత్తు, తాళకము-వీనిని శుద్ధిచేసి సమభాగములుగ చూర్ణముచేసి ఖల్వములో నునిచి కలితో మర్దించి వస్త్రమునకు లేపనము జేసి ఎండించి వర్తిగజుట్టి నూనెలోతడిపి దీపము ముట్టించి దానిక్రింద నొకపాత్ర నునిచిన అందు నూనె పడియును. పిదప దానిలో ఆవునెయ్యి కలిపి తమలపాకునకు లేపనముజేసి భక్షించిన స్వరహీనవాతమును, లేపనముజేసిన సర్వవ్రణములును హరించును.

### రక్తవాతలక్షణము

రక్తవాంతిశ్చ హిక్కా చ మూర్ఛా దాహశ్చ కంపనమ్. 208
దేహకాంతిహర స్స్వేదో రక్తవాతస్య లక్షణం,

తా. నెత్తురు గ్రక్కుట, ఎక్కిళ్లు, మూర్ఛ, దాహము గలుగుట, శరీరము వణకుట, శరీరకాంతి నశించుట, చెమటగలుగుట-ఈలక్షణములు గలిగి నెత్తురుగ్రక్కుటయే రక్తవాతమని తెలియవలయును.

## రక్తవాతమునకు వాతాంతకరసము

శుద్ధసూతం విషం చాభ్రం విషం త్రికటుకం సమమ్. 20
చిత్రమూలకషాయేణ దినం మర్ద్యం చ వాసయా,
అర్కమూలకషాయేణ దినం జంబీరనీరకైః. 21
డోలాయంత్రే యామమాత్రం మాషమాత్రం చ భక్షయేత్,
క్షీణవాతం విహంత్యాశు రక్తవాతం వినాశయేత్. 21

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసిన వసనాభి, అభ్రకభస్మము, అతివస, త్రికటుకములు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి చిత్రమూలకషాయము, అడ్డసరపాకురసము, జిల్లేడువేళ్లకషాయము అనువానిలో ప్రతిదానిచే ఒక్కొకదినంబును, నిమ్మపండ్లరసముతో ఒకదినంబును మర్దించి ముద్దచేసి డోలాయంత్రములో ఒకరుఘాము పాకముజేసి మాషప్రమాణముం లేసి మాత్రలు జేసి యందొకదానిని నీరుగొలిమిడి కషాయానుపానముతో నొసంగిన రక్తవాతమును, నెయ్యి, మిరియపుచూర్ణానుపానముతో నొసంగిన క్షీణవాతమును హరించును.

## క్షీణవాత లక్షణము

క్షీణే చ వాతే శిరసోవ్యథా చ నాసానఖే దుఃఖితమంగశూలం,
దివా చ రాత్రౌ చ వినష్టనిద్రః కపాలనేత్రే చ వివృద్ధశూలమ్.21

తా. తలనొచ్చుట, నాసికము గోళ్లు శూలించుట, అంగములునొచ్చుట, రేయుంబగలు నిదురపట్టకుండుట, కపాలము నేత్రములు మిక్కుటముగ నొచ్చుట - ఈలక్షణములు గలిగి శరీరము కృశించుటయే క్షీణవాత మని తెలియవలయును. (క్షీణ శిరోవాతములు హరించుటకై రక్తవాతచికిత్సనేని, లేక రసకర్పూరసేవననేని చేయవలయును.)

## ఖంజావాతలక్షణము

జాగరశ్చ దివా నిద్రా హ్యజీర్ణిశ్చాగ్నిమాంద్యకం,
అంగవైకల్యనిశ్చేష్టం ఖంజావాతస్య లక్షణమ్. 213
(ఆయుర్వేదే)

తా. రాత్రులు నిదురపట్టకుండుట, పగలు నిద్రించుట, అన్నము జీర్ణముగాకుండుట, అగ్నిమాంద్యము, లేక కడుపులో మంటగలుగుట, అంగములు నొచ్చుట, శరీరము గురుతెరుగకుండుట-ఈలక్షణములు గలిగి కుంటితనము గలుగుటయే ఖంజావాతమని తెలియవలయును,

### ఖంజావాతమునకు వాతవజ్రరసము

అభ్రకం గంధకం సూతం విష వ్యోషక సైంధవం,
హింగుళం చ విళంగం చ పిప్పలీమూల చిత్రకమ్. 214
దినం హంసపదీద్రావైః కుక్కుటీపుటపాచితం,
చూర్ణం కృత్వా తతో దేయం హ్యనుపానవిశేషతః. 215
మాషమాత్రం చ సేవేత ఖంజావాతం వినాశయేత్,

తా. అభ్రకభస్మము, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినవసనాభి, త్రికటుకములు, సైంధవలవణము, శుద్ధిచేసిన ఇంగిలీకము, వాయువిడంగములు, మోడి, చిత్రమూలము-వీనిసిసమభాగములుగ ఖల్వములోనునిచి హంసపాదియాకురసముతో ఒక దినము మర్దించి కుక్కుటపుటం బిడి సాంగశీతలమున దీసి చూర్ణముచేసి యందొకమాష ప్రమాణమును నెయ్యితోనేని, మిరియపుచూర్ణముతోనేని, దుంపరాష్ట్రపు చూర్ణముతో నేని సేవించిన ఖంజావాతము హరించును. (మఱియు దీనినే కళావాతమునందును సేవింపందగును.)

### కళావాతలక్షణము

శరీరం పాండురంచాస్యే వైవర్ణ్యం రక్తనేత్రతా. 216
కృష్ణజిహ్వా చ శూలం చ కళావాతస్య లక్షణం,

తా. శరీరము పాండురవర్ణముగనుండుట, ముఖము వివర్ణమైయుండుట, నేత్రము లెఱ్ఱగ, నాలుక నల్లగనుండుట, శరీరము శూలించుట - ఈలక్షణములుగలిగి స్త్రీరజస్సును, శుక్రమును జెరుపునదియే కళావాత మని తెలియవలయును.

### కళావాతమునకు వాసాదితైలము

వాసా గళూచీ చతురంగుళానా మేరండతైలేన పిబేత్క షాయం,
క్రమేణ సర్వాంగవిమర్దనం చ కళాఖ్యవాతస్యవినాశకంస్యాత్. 217

తా. అడ్డసరము, తిప్పతీఁగె, రేల-వీనిని కషాయముకాచి యందాముదము కలిపి సేవించుటయేగాక శరీరమునకు లేపనము సగా జేసిన కళావాతము హరించును. (మఱియు దీనియందు ఖంజావాతచికిత్సనుకూడ జేయందగును.)

### అవయవాంగవాతలక్షణము

అవయవాంగే వాతశూలం దేహేచాగ్నివిదాహకం,
మలమూత్రవినాశశ్చ నిద్రానాశ శ్శిరోవ్యథా. 218

తా. శరీరమంతట నొచ్చుట, శరీరమంతయు మండుట, మల మూత్రములు వెడల

కుండుట, నిదురపట్టకుండుట, తలనొచ్చుట-ఈలక్షణములు గలిగి సర్వాంగములు నొచ్చుటయే అవయవాంగవాతమని తెలియవలయును.

### అవయవాంగవాతమునకు వైరేచనకల్పము

పయసైరండజంతైలం పిబేద్దోషహరం పరం,
హారీతక్యాస్త్రయోభాగా భాగస్సైంధవకృష్ణయోః. 219
ఏతదుష్ణాంబునా పీతం చూర్ణమాశు విరేచయేత్,
అవయవాంగం సన్నిపాతం వాతశూలహరం పరమ్. 220

తా. ఆవుపాలు, ఆముదము వీని నేకముజేసి త్రాగినను, లేక కరక్కాయలు 3 భాగములు, సైంధవలవణము, పిప్పళ్లు ఇవి దినుసుకు ఒక్కొకభాగము - ఇటుల వాని నేకముజేసి ఉష్ణోదకముతో నూరి త్రాగినను, శీఘ్రముగ విరేచనంబులై అవయవాంగ వాతము, సన్నిపాతము, వాతశూల హరించును. (మఱియు ఈ అనుపానములతో ఆమ వాతమున జెప్పంబడిన పంచవక్త్రరసమును సేవించిన అవయవాంగవాతము హరించును.)

### స్త్యానవాతలక్షణము

మహావాతం భవేద్దేహే దివారాత్రౌ చ శూలనం,
సదా నిరశనం స్వేద స్త్యానవాతస్య లక్షణమ్. 221

తా. వాతము అధికముగ ప్రకోపించుట, రేయింబగలు మిక్కుటముగ అంగములు శూలించుట, ఎల్లపుడు ఆఁకలిలేకుండుట, చెమట గలుగుట - ఈలక్షణములు గలిగి శరీరసంధులు శూలించి ఆలస్యమును గలుగంజేయునదియే స్త్యానవాతమని తెలియవలయు.

### స్త్యానవాతమునకు వాతోన్మూలనరసము

శుద్ధసూతం విషం గంధం ధూర్తబీజం త్రిభిస్సమం,
పంచకోలకషాయేణ మర్దయేద్దివసద్వయమ్. 222
మాషయోర్భ్యాధరే పాచ్యం సాంగశీతం విచూర్ణయేత్,
మత్స్యపిత్తే భావయేచ్చ మర్దయేద్దివసద్వయమ్. 223
పంచకోలకషాయేణ గుంజామాత్రం ప్రదాపయేత్,
స్త్యానవాతం హరేచ్ఛీఘ్రం సర్వవాతవికారనుత్. 224

తా. రసము, వసనాభి, గంధకము - వీనిని శుద్ధిచేసి వానికి సమముగ శుద్ధిజేసిన ఉమ్మెత్తవిత్తుల చూర్ణమును కలిపి ఖల్వములో నునిచి పంచకోలకషాయముతో రెండు దిన

ములుమర్దించి మూసలోనునిచి దానిపై మరియొకమూసను మూసి చీలమన్ను లేపనము జేసి ఎండించి భూధరయంత్రముతో పుటంబిడి సాంగశీతలమున దీసి ఖల్వములో నునిచి చూర్ణముచేసి చేపచేదుతో రెండుదినములు భావనచేసి మర్దించి గురిగింజలంతేసి మాత్రలు జేసి పంచకోలకషాయానుపానముతో సేవింపుచుండిన స్త్యానవాతము, సర్వవాతములు కడుశీఘ్రముగ హరించును.

### గుల్ఫవాతలక్షణము

శరీరం పాండువర్ణం చ కటిదేశే చ తాపనం,
శిరశ్శూలం నేత్రశూలం గుల్ఫశూలం విదాహికా. 225
తన్నిద్రాం నాశయేద్రాత్రౌ గుల్ఫవాతస్య లక్షణమ్,
(గ్రంథాంతరే)

తా. శరీరము పాండువర్ణముగ నుండుట, మొలచుట్టు మండుట, శిరము నేత్రములు శూలించుట, శరీరము విదాహించుట, రాత్రులయందు నిదురపట్టకుండుట - ఈలక్షణములు గలిగి చీలమండలు వాచి కడుశూల గలుగుటయే గుల్ఫవాత మని తెలియవలయును. (ఇది హరించుటకై రసఉబ్బ వేయవలయును. మఱియు రసకర్పూరమును సేవింపవలయును.)

### గుల్ఫవాతమునకు ప్రాణవల్లభరసము

రసం విషం విషం చాభ్రం గంధకం చ మనశ్శిలా. 226
మర్దితం పర్పటద్రావై ర్వజ్రమూషాంతరే క్షిపేత్,
భూధరే పుటపాకం చ సాంగశీతలముద్ధరేత్. 227
ఖల్వమధ్యే వినిక్షిప్య మత్స్యాజశిఖిపిత్తకైః,
భావితం యామమాత్రం తు గుంజామాత్రం ప్రదాపయేత్. 228
గుల్ఫవాతం నిహంత్యాశు సర్వవాతవికారనుత్,

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినవసనాభి, అతివస, అభ్రకభస్మము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసినమణిశిల- వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి పర్పాటక రసముతో రెండుదినములు మర్దించి వజ్రమూషలో నునిచి భూధరపుటంబిడి సాంగశీతల మునదీసి ఖల్వములోనునిచి చేప, మేక, నెమలి, అనువాని చేదులతో ఒకఝాము భావన జేసి గురిగింజలంతేసి మాత్రలుజేసి అల్లపురసానుపానముతో సేవించిన గుల్ఫవాతము. సర్వవాతములు కడుశీఘ్రముగ హరించును.

అంగుళీవాతలక్షణము

దేహే తాప శ్చాంగుళీనాం దాహశ్చ కరపాదయోః. 229
అంగుళ్యః కుబ్జరూపేణ హ్యాంగుళీవాతలక్షణం,

తా. శరీరము మండుట, చేతులవ్రేళ్ళయందు కాళ్ళవ్రేళ్ళయందు మంటలు పోట్లు గలుగుట, ఈలక్షణములు గలిగి వ్రేళ్లు కుబ్జత్వమును జెందుటయే అంగుళీవాతమని తెలియవలయును. (ఇది హరించుటకై వాతగజాంకుశరసమును పిప్పళ్ళు, మోడి అనువానికషాయానుపానముతోగాని, లేక నీరుగొబ్బియాకురసము, జీలకఱ్ఱ అనువానితో గాని సేవింపవలయును. మఱియు రసకర్పూరమునుగాని, లేక మేహవ్రణప్రకరణమున జెప్పంబడు పరంగిచెక్క యోగములో శుద్ధిజేసిన ఇంగిలీకమును కలిపిగాని సేవింపవలయును. ఆపరంగిచెక్క యోగమును సేవించునపుడందు జెప్పంబడినపథ్యముల నాచరింపవలయును.)

జానువాతలక్షణము

జానుశుష్కత్వ కంపౌ చ వాంతి ర్మూర్ఛా పరిభ్రమః 230
హృద్దాహో జానుశూలం చ జానువాతం వినిర్దిశేత్,

తా. మోకాళ్ళు ఎండుట, శరీరము వణకుట, వాంతులు మూర్ఛ గలుగుట, తబ్బిబ్బులాడుట, ఱొమ్ములోమండుట-ఈలక్షణములు గలిగి మోకాళ్లనొచ్చుటయే జానువాతమని తెలియవలయును. (ఇది నివృత్తించుటకై వాతగజాంకుశరసమునేని, రసకర్పూరమునేని సేవింపవలయును.)

జంఘావాతలక్షణము

భీతభీతం చాతిశూలం రోమహర్షో నిరీక్షణమ్. 231
భ్రూమధ్యే శూలనం మూర్ఛా జంఘావాతస్య లక్షణం,

తా. కడుభీతిగలుగుట, శరీరమున పోట్లుపొడుచుట, శరీరము గగుర్పొడుచుట, రెప్పపాటువేయక చూచుట, కనుబొమలనడుమ శూలించుట, మూర్ఛిల్లుట-ఈలక్షణములు గలిగి పిక్కలు శూలించుటయే జంఘావాతమని తెలియవలయును.

జంఘావాతమునకు లక్ష్మీవిలాసరసము

శుద్ధసూతం విషం గంధం నేపాళం దరదం సమమ్. 232
చిత్రమూలకషాయేణ డోలాయంత్రే దినం పచేత్,
మత్స్యపిత్తేన సంశోధ్య ద్వియామం చ విమర్దయేత్. 233
స్నుహీ క్షీరే దినం మర్ద్యం ద్విగుంజం భక్షయేత్సదా,

జంఘావాతం నిహంత్యాశు హ్యనుపానవిశేషతః. 234

తా. రసము, వసనాభి, గంధకము, నేపాళములు, ఇంగిలీకము-వీనిని సమభాగము లుగ శుద్ధిజేసి ఖల్వములో నునిచి ఒకదినము చిత్రమూలకషాయముతో మర్దించి డోలా యంత్రమున ఒకదినము వండి సాంగశీతలమున దీసి మరల ఖల్వములో నునిచి చేప చేదుతో రెండుఝాములును, బ్రహ్మజెముడుపాలతో ఒక దినమును మర్దించి, రెండు గురిగింజలంతేసి మాత్రలుజేసి ఆరుమాసములు బోడతరపాకురసములో మిరియపుచూర్ణ మును గలిపి సేవింపుచుండిన జంఘావాతము హరించును.

## అస్థివాతలక్షణము

దేహస్యకంపనం మూర్ఛా స్వేద దాహాగ్నిమాంద్యకం,
శ్రోత్రేతిబధిరత్వంచ హ్యస్థివాతస్య లక్షణమ్. (గ్రంథాంతరే) 235

తా. శరీరము వణకుట, మూర్ఛిల్లుట, చెమట, తాపము, అగ్నిమాంద్యము, చెవుడుగలుగుట-ఈలక్షణములుగలది అస్థులు మిక్కుటముగ నొచ్చుటయే అస్థివాతమని తెలియవలయును. (ఇది హరించుటకై ఒకవత్సరమువఱకు పైజెప్పంబడు గంధకకల్పము నేని వాతగజాంకుశరసము నేని సేవింపవలయును.)

## కాకవాతలక్షణము.

హస్తేపాదే చ కంపశ్చ శిరోభ్రమణకం తథా,
నేత్రభ్రమణకంచైవ కాకవాతస్య లక్షణమ్. (పారిజాతే) 236

తా. చేతులు, కాళ్లు వణకుట, తల, నేత్రములు దిరుగుట-ఈలక్షణములు గలిగి తలదిరిగి భూమిపైబడుటయే కాకవాతమని (కాకిసోమాలని) తెలియవలయును. (ఇది హరించుటకై పైజెప్పంబడు గంధకకల్పము నేని, టెంకాయనీరులో సిందూరము కలిపి యేని, సిందూరము, కానుగవిత్తులు, పిప్పలి అనువాని చూర్ణము నేని, ఆరుమాసములు సేవింపవలయును.)

## భ్రమణవాతలక్షణము

భ్రమణే మారుతే శీఘ్రం మూర్ఛా తృష్ణా వికారకృత్,
అంగశోభోదరం గుల్మం దేహశోషశ్చ లక్షణమ్. (కౌముద్యామ్)

తా. దప్పిగలుగుట, శరీరము వికారముగనుండుట, అంగములు వాచుట, ఉదర గుల్మరోగములు గలుగుట, దేహము శుష్కించుట-ఈలక్షణములు గలిగి శరీరము తిరిగి మూర్ఛిల్లబడుటయే భ్రమణవాతమని తెలియవలయును. (ఇది హరించుటకై ఒకవత్సరము వఱకు గంధకకల్పమును సేవింపవలయును.)

### భ్రమణవాతమునకు విష్ణుపరాక్రమరసము

శుద్ధపారద గంధం చ టంకణం చ విషం సమం,
త్రిక్షారం సైంధవం తుల్యం సర్వం ధుత్తూరజైర్ద్రవైః. 238
మర్దితం గోళకీకృత్య కుక్కుటీపుటపాచితం,
ఖల్వమధ్యే వినిక్షిప్య మత్స్య వారాహ పిత్తకే. 239
భావితం మాషమాత్రం చ దేయం శీతోదకం త్వను,
సన్నిపాతే జ్వరే శ్వాసే దోషే విషమశీతకే. 240
అపస్మారే ధనుర్వాతే కంపవాతే చ మూర్ఛకే,
తత్క్షణేన నిహంత్యాశు ఇచ్ఛాపథ్యం ప్రదాపయేత్. 241
మనుష్యాణాం హితార్థాయ సర్వరోగభయాపహః,
విష్ణునా కథితః పూర్వం రసో విష్ణుపరాక్రమః. 242

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసిన వెలిగారము, శుద్ధిజేసిన వసనాభి, *త్రిక్షారములు, సైంధవలవణము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి ఉమ్మెత్తాకురసముతో మర్దించి ఘుటికలుచేసి కుక్కుటపుటంబిడి సాంగశీతలమున దీని మఱల ఖల్వములోనునిచి చేప, అడవిపంది అనువానిచేదులతో భావనజేసి మాషప్రమాణమంతేసి మాత్రలు జేసి యందొకదానిని శీతోదకము, లేక రేలవేరుగంధము, శ్రీగంధము అనువాని యనుపానములలో దేనితోనైని సేవింపుచుండిన సన్నిపాతము, జ్వరము శ్వాసము, విషమశీతదోషము, అపస్మారము, ధనుర్వాతము, కంపవాతము, భ్రమణవాతము మొదలగునవి తత్క్షణమున హరించును. దీనియం దిచ్ఛాపథ్యము నాచరింపవలయును. సర్వరోగములు హరించి మనుజులకు హితముకలుగుటకై విష్ణుపరాక్రమమను రసమును పూర్వకాలమున విష్ణువు వచించెను. (ఈ భ్రమణవాతము హరించుటకై వాతగజాంకుశ రసమును కూడా సేవింపందగును.)

### భ్రమణాదివాతములకు గంధకకల్పము

షట్పలం గంధచూర్ణం చ త్రిఫలా చిత్రతండులాః,
శుంఠీమరీ చ వైదేహీ షణ్ణిష్కం చ పృథక్పృథక్. 24
చిత్రకం చ పలైకం తు చూర్ణితం వస్త్రగాలితం,
ఏకనిష్కం ద్వినిష్కంవా పయసాజ్యసితైః పిబేత్. 24
సర్వరోగవినిర్ముక్తో మృగరాజపరాక్రమః,

* త్రిక్షారములు—సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము.

దీర్ఘాయుః కుంజరబలో దివా పశ్యతి తారకాః. 245
దివ్యదేహో బలీభూత్వా ఖేచరత్వం ప్రపద్యతే,
తస్య మూత్రపురీషాణి శుల్బం భవతి కాంచనమ్. 246
హంత్యష్టాదశకుష్ఠాని గ్రహణీశ్చ చతుర్విధాః,
మందాగ్ని మతిసారం చ గుల్మ మష్టవిధం తథా. 247
అశీతిం వాతరోగాంశ్చ హ్యర్శాంస్యష్టవిధాని చ,
మనుష్యాణాం హితార్థాయ పూజ్యపాదేన నిర్మితః. 248

తా. శుద్ధిజేసిన ఆమ్లసారశిలగంధకము ౬ పలములు, త్రిఫలములు, వాయువిడంగములు, శొంఠి, మిరియములు, పిప్పళ్లు అనువానిచూర్ణము దినుసుఒకటింటికి ౬ నిష్కములు, చిత్రమూలపుచూర్ణము ౧ పలము-ఇటుల వీనినెల్ల వస్త్రగాలితం బొనర్చి నేకము జేసి యందొక నిష్కప్రమాణంబునేని, రెండునిష్కముల ప్రమాణంబునేని, ఆవుపాలు, ఆవునెయ్యి, శర్కర అనువానిలో దేనితోనేని ఆరుమాసములవఱకు సాయంప్రాతః కాలముల సేవింపుచుండిన సర్వరోగవిముక్తుండై సింహముతో సమానమైన పరాక్రమము దీర్ఘాయువు, ఏనుగుతోసమానమైనబలము, పగటియందు నక్షత్రముల గాంచతగినదృష్టి, సుందరమైన దేహము, శరీరదార్ఢ్యముగలవాఁడై ఆకసమున సంచరించువాఁడుగ, రాగిని, బంగారును ఉత్పత్తిజేయఁదగిన మూత్రపురీషముల విసర్జించువాఁడుగ నగును. మఱియు నీగంధకకల్పసేవనవలన ౧౮ కుష్ఠువులు, ౪ విధగ్రహణులు, అగ్నిమాంద్యము, అతిసారము, ౮ విధగుల్మరోగములు, ౮౦ వాతరోగములు, ౮ విధమూలరోగములు హరించును. దీనిని మనుష్యులహితార్థంబై పూజ్యపాదుఁడు వచించెను. (దీనియందు చప్పిడి యన్నము, ఆవుపాలు, ఆవుచల్ల అనువానిని సేవించుట పథ్యకరములు.)

## పంగువాతలక్షణము

గృహీతోరుద్వయః పంగో గతిభంగశ్చ వాతకే. 249
(సిందూరమణిదర్పణే)

తా. రెండుతొడలు బంధింపఁబడి నడుచుటకు శక్తిలేకుండుటయే పంగువాతమని తెలియవలయును. దీనినే కొందఱు చచ్చువాత మనియు వచించెదరు. (ఇది నివర్తించుటకై గంధకకల్పమును ఆరునెలలు సేవింపవలయును )

## పంగువాతమునకు ప్రభావతీవటికలు

హరిద్రా నింబపత్రాణి పిప్పలీ మరిచాని చ,
విడంగం భద్ర ముస్తా చ జీరకం విశ్వభేషజమ్. 250

చిత్రకం సైంధవం కుష్ఠం విషం పాఠా హరీతకీ,
ఏతాని సమభాగాని హ్యజామూత్రేణ పేషయేత్. 251
చణప్రమాణవటికా శ్ఛాయాశుష్కాశ్చ కారయేత్,
ఏకాహ్యుష్ణోదకైః పీతా విషూచీం చ వ్యపోహతి. 252
లూతవిస్ఫోటభేదే చ గోమూత్రేణ విలేపయేత్,
ఉషామూలేన పీతాచే త్సర్పదష్టవిషం హరేత్. 253
మేహే రక్తప్రవాహే చ శ్రీగంధేన సమం పిబేత్,
అర్కక్షీరేణ సంలిప్తా వృశ్చికస్య విషం హరేత్. 254
హంతి పుష్పం చ పటలం *రంభాకందరసాన్వితా,
కాకమాచీరసైః పీతా తిమిరాణి వినాశయేత్. 255
నీలికాయా రసై రక్తా రక్తాక్షిత్వం వినాశయేత్,
గుడేన భక్షితాచైవ వాతరోగం వినాశయేత్. 256
భృంగరాజరసైః పీతా శిరోదాహం హరేద్భృశం,
తండులోదకసంయుక్తా కాసం కృచ్ఛ్రం వినాశయేత్. 257
గోమూత్రేణ యుతా పీతా ప్లీహరోగం వినాశయేత్,
ఛాగక్షీరసమాయుక్తా వటికా సాశ్వగంధికా. 258
పీతా మండలపర్యంతం రాజయక్ష్మవినాశిని,

తా. పసుపు, మంచివేపాకు, పిప్పళ్లు, మిరియాలు, వాయువిడంగములు, తుం
ముస్తెలు, జీలకఱ్ఱ, సొంటి, చిత్రమూలము, సైంధవలవణము, చెంగల్వకోష్టు, అతివస
శిరుబొద్ది, కరక్కాయలు-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి ఖల్వములో నునిచి మే
మూత్రముతో నాలుగుఝాములు మర్దించి, శనగగింజలంతేసి మాత్రలుజేసి నీడనెండించి
యందొకదానిని ఉష్ణోదకముతో సేవించిన విషూచియు, గోమూత్రముతో నూ
లేపనముచేసిన లూత, విస్ఫోటకవ్రణములును, నాగురువేరుగంధముతో సేవించి
సర్పవిషములును, శ్రీగంధముతో సేవించిన ప్రమేహములును, కుసుమరోగములున
జిల్లేడుపాలతో నూరి లేపనముజేసిన తేలుకఱచిన విషంబును, అరటిగడ్డరసముతో నూ
నేత్రముల కంజనముచేసిన కంటిపువ్వులును, పటలములును, నల్లకాచాకురసముతో
సేవించిన నేత్రములయందు జనించు తిమిరరోగంబును, నీలియాకురసముతో నూరి నేత్ర
ముల కంజనముచేసిన రక్తోద్రేకమును, నేత్రదోషంబును, బెల్లముయొక్క అనుపానముతో

* అజాక్షీరేణసంయుతా.

సేవించిన వాతరోగంబులును, గుంటగలగరాకురసముతో సేవించినశిరోవాతము, శిరోజనిత తాపమును, పశికడుగుతో సేవించిన కాసమును, మూత్రకృచ్ఛ్రములును, గోమూత్రముతో సేవించిన ప్లీహరోగంబును, మేకపాలు *డొమ్మడోలుగడ్డ చూర్ణము అనువానితో నలుబదిదినములు సేవించిన క్షయరోగంబును హరించును. (మఱియు దీనినే శిరుబొద్దివేళ్లకషాయములో సేవించిన జ్వరములును, ప్రసూతిరోగములును, బెల్లముతో ఆరుమాసములు సేవించిన పంగువాతమును, భ్రమణవాతమును, తిమిరవాతమును హరించును.)

పక్ష, అర్దితవాతములకు భృంగాదినస్యము

భృంగైరండక నిర్గుండ్యో మత్స్యాక్షీ చార్కపత్రకమ్. 259
సతైలమరిచం నస్యం పక్షఘాతార్దితేషు చ,

తా. గుంటగలగర, ఆముదపుకొనలు, వావిలికొనలు, పొన్నగంటియాకు, జిల్లేడుకొనలు-వీనిని సమభాగములుగ నూరి కల్కముచేసి అందు మిరియపుచూర్ణము, నూనె కలిపి నస్యముజేసిన పక్షఘాతవాతము, అర్దితవాతము హరించును.

మూర్ఛావాతమునకు మధూకాదినస్యములు

మధూకపిష్టం సితయా చ యుక్తం
స్తన్యేన నస్యం వినిహంతి మూర్ఛాం,
స్తన్యేన హింక్షు స్వరసేన నస్యం
సుచందనంచైవ నిహంతి మూర్ఛామ్. 260

తా. ఇప్పపిండి, పంచదార అనువానిని చనుబాలతోనూరి నస్యముచేసినను, లేక చనుబాలు, చెఱకురసము, శ్రీగంధము అనువాని నేకముజేసి నస్యముజేసినను మూర్ఛావాతము హరించును. (మఱియు జిల్లేడుకొనలనస్యముచేసిన కూఁతవేసి భూమిపైఁబడే మూర్ఛారోగములు హరించును.)

అర్దితాదివాతములకు కాశ్మర్యాదినస్యము

కాశ్మరీ చవ్యకుష్ఠం చ లవంగం దారు సైంధవం,
పిప్పలీనస్యకం హంతి హ్యర్దితం చ హనుగ్రహమ్, 261

తా. కవ్వపుగుమ్ముడుకొనలు, చవ్యము, చెంగల్వకోష్టు, లవంగములు, దేవదారు, సైంధవలవణము, పిప్పలి - వీనిని సమభాగములుగ నూరి నస్యముచేసిన అర్దితవాతము, హనుగ్రహవాతము హరించును.

---

* ఇదే పెన్నేరుగడ్డ యనియు జెప్పంబడును.

౼ మూర్ఛాదులకు కుంకుమాదినస్యము ౼

కుంకుమం ఘృతసంయుక్తం మూర్ఛా పిత్తవికారనుత్,
శిరోభ్రమహరం శ్రేష్ఠం నస్యం వై నాత్ర సంశయః, 262

తా. కుంకుమపువ్వును నేతిలోకలిపి నస్యముచేసిన మూర్ఛ, పైత్యవికారము, తల తిరుగుట నిస్సంశయముగ హరించును.

౼ వాతాదిరోగములకు త్రికటుకాదినస్యము ౼

త్ర్యూషణం చిత్రకం చైవ లాంగలీ చేంద్రవారుణీ,
వచా మధుకబీజాని తత్ర పాఠా నదీఫలమ్. 263
తాళకం వత్సనాభం చ అంకోల క్షారయుగ్మకం,
ఏవం పంచదశైతాని సమభాగాని కారయేత్. 264
సూక్ష్మచూర్ణీకృతంచైవ నిర్గుండీ తింత్రిణీరసైః,
ఆర్ద్రికస్వరసైర్మర్ద్యం త్రివిధైశ్చ విచక్షణః. 265
ఏవం నస్యం ప్రదాతవ్య మర్కమూలరసేన చ,
అపస్మారం చ హృద్రోగం వాతసంకులమేవ చ. 266
ధనుర్వాతం భ్రమం హంతి హ్యున్మాదం సన్నిపాతకం,
పూజ్యపాదకృతో యోగో నరాణాం హితకామ్యయా. 267

(పూజ్యపాదీయే)

తా. త్రికటుకములు, చిత్రమూలము, చెన్నచెర్లగడ్డ, పాపరవేళ్లు, వస, ఇప్పగింజలు, శిరుబొద్దివేళ్లు, సముద్రపాలవిత్తులు, శుద్ధిజేసినతాళకము, శుద్ధిచేసిన వసనాభి, ఊడుగకొనలు, సర్జక్షారము, యవక్షారము - ఈపదిహేనుదినుసులను సమభాగములుగ జేకొని సూక్ష్మముగ చూర్ణముచేసి వావిలి, చింతాకు, అల్లము అనువానిరసములతో ఒక దినము మర్దించి శనగగింజలంతేసి మాత్రలుచేసి ఎండనెండించి యందొకదానిని జిల్లేడు వేళ్లరసముతో నూరి నస్యముచేసిన అపస్మారము, హృద్రోగము, వాతరోగముచేత శరీరము గురుతెరుగక పడేరోగములు, ధనుర్వాతము, భ్రమణవాతము, ఉన్మాదము, సన్నిపాతము నశించును. ఇది లోకహితార్థమై పూజ్యపాదునిచే నిర్మింపఁబడియెను.

౼ దండవాతలక్షణము ౼

దండవత్ స్తంభతే యస్మిన్ మందాగ్నిశ్చాతిశీతతా,
అపస్మారశ్చ తంద్రా చ కఫః పాండుశ్చ స్వాపితా. 268
ఉదరం గంధలేపేన శూలం వాయుశ్చ దండకః,

తా. అగ్నిమాంద్యము, కడుశైత్యము, అపస్మారము, తంద్ర, దగ్గుగలుగుట, శరీరము పాండురవర్ణముగ నుండుట, నిదురగలుగుట, ఉదరమున శ్రీగంధము పూసికొనినటులనే వాసనవచ్చుట, శూల గలుగుట-ఈలక్షణములుగలిగి శరీరము దండమువలె స్తంభించియుండుటయే దండవాతమని తెలియవలయును.

దండవాతమునకు విజయభైరవరసము

శుద్ధసూతం విషం గంధం మరీచం నాగరం సమమ్. 269
త్రిక్షారం పంచలవణం పేషయే దార్ద్రికద్రవైః,
కాచకుప్యంతరే క్షిప్త్వా శనై ర్మృద్వగ్నినా పచేత్. 270
స్వాంగశీతం సముద్ధృత్య దశమాంశం విషం క్షిపేత్,
సూక్ష్మచూర్ణం కృతం ఖల్వే గుంజామాత్రం ప్రదాపయేత్. 271
ఆర్ద్రికద్రవసంయుక్తం దండవాతం వినాశయేత్,

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసిననాభి, శుద్ధిచేసినగంధకము, మిరియాలు, సొంటి, సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము, *పంచలవణములు - వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి ఖల్వములో నునిచి అల్లపురసముతో ఒకదినము మర్దించి గాజుకుప్పెలో నునిచి చీలమన్ను లేపనముజేసి ఎండించి మూడుజాములు మృద్వగ్నిలో వండి స్వాంగశీతలమున దీసి మరల ఖల్వములో నునిచి దానికి పదియవభాగము శుద్ధిజేసిననాభి కలిపి బాగుగ మర్దించి గురిగింజంత అల్లపురసానుపానముతో సేవించిన దండవాతము (ఆమవాతము, అజీర్ణవాతము) హరించును.

మందవాతలక్షణము

పాండురశ్చ భ్రమో మూర్ఛ స్వేదః కంఠే పరిభ్రమః. 272
వాంతిదోషో వికారశ్చ మందవాతస్య లక్షణం,

తా. శరీరము పాండురవర్ణముగ నుండుట, తబ్బిబ్బులాడుట, మూర్ఛ, కుతికెయందు చెమట గలుగుట, శరీరము తిరుగుట, వాంతి, వికారకలుగుట - ఈలక్షణములు గలది మందవాతమని తెలియవలయును.

మందవాతమునకు కాలకంటకరసము

శుద్ధసూతం మృతం గంధం చాభ్రకం తీక్ష్ణతామ్రకమ్. 273
హంసపాదిగసై ర్మర్ద్యం కాచకుప్యాం నివేశయేత్,

---

* పంచలవణములనగా—సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, కాచలవణము, సముద్రలవణము అనునవి.

వాలుకాయంత్రకే పాచ్యం షడ్యామాంతే సముద్ధరేత్. 27
మాషమాత్రప్రయోగేణ మందవాతో వినశ్యతి,

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, అభ్రకభస్మము, లోహభస్మము, తామ్రభస్మము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో ఒకదినము మర్దించి గాజుకుప్పెలో నునిచి చీలమన్ను లేపనముజేసి ఎండించి వాలుకాయంత్రమున ఆఱుఝాములు వండి స్వాంగశీతలమున దీసి మాషప్రమాణమును మినుముకట్టు, వెల్లుల్లిరసము అనువాని అనుపానముతో సేవించిన మందవాతము హరించును.

కోష్ఠవాతలక్షణము

దేహక్షయో హరిద్రాచ స్వేదో హీనమలస్తథా. 27
అగ్నిమాంద్యం వికారశ్చ కోష్ఠవాతస్య లక్షణం,

తా. శరీరము కృశించుట, శరీరము పసపువర్ణముగ నుండుట, చెమట, అగ్నిమాంద్యము, కడుపులో వికారముగలుగుట - ఈలక్షణములు గలిగి అల్పముగ మలము వెడలుటయే కోష్ఠవాతమని తెలియవలయును.

సతతం చాగ్నిమాంద్యం చ శోభాతీసారసంభవః. 27
దేహం చ పాండురం మూత్రం కోష్ఠవాతస్య లక్షణం,
(గ్రంథాంతరే.

తా. ఎల్లప్పుడు అగ్నిమాంద్యముగలుగుట, శరీరము వాచుట, అతిసారముగలుగుట శరీరము పాండురవర్ణముగ నుండుట, మూత్రము పాండురవర్ణముగ వెడలుట - ఈలక్షణములుగలది కోష్ఠవాత మని తెలియవలయును.

కోష్ఠవాతమునకు స్వచ్ఛందభైరవరసము

శుద్ధసూతం విషం గంధం నేపాళం విష చిత్రకమ్. 27
అర్కమూలకషాయేణ మర్దయే ద్యామమాత్రకం,
డోలాయంత్రే పచేద్యామం గుంజామాత్రం ప్రదాపయేత్. 278
కోష్ఠవాతవినాశస్స్యా త్సర్వవాతవికారనుత్,

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసిననాభి, శుద్ధిజేసినగంధకము, శుద్ధిజేసిన నేపాళములు, అతివస, చిత్రమూలము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి జిల్లేడువేళ్ళకషాయముతో ఒకఝాము మర్దించి డోలాయంత్రములో ౧ ఝాము వండి గురిగింజప్రమాణము సేవించిన కోష్ఠవాతము, సర్వవాతములు నశించును.

### గుల్మవాతలక్షణము

అజీర్తిర్భోజనే భంగో కుక్షిశూలం శిరోవ్యథా. 279
ధాతుశోషో వికారశ్చ గుల్మవాతస్య లక్షణం,

తా. అన్నము అరగకుండుట, భోజనమునం దిచ్ఛ లేకుండుట, తలనొచ్చుట, ధాతువులు శోషించుట, శరీరము వికారమును జెందుట - ఈలక్షణములు గలిగి కడుపులో శూలించుటయే గుల్మవాత మని తెలియవలయును.

### గుల్మవాతమునకు త్రివిక్రమరసము

శుద్ధసూతా మృతం తామ్రం శిలాతాళం చ గంధకమ్. 280
కుష్ఠం మహాబలాపథ్యా శిఖికంఠం విదారికా,
ఏరండతైలం సంయోజ్య దినమేకం తు మర్దయేత్. 281
పునర్నవాద్రవేణైన హ్యనుపానేన వై తథా,
గుంజామాత్రాం వటీం ఖాదే ద్గుల్మవాతం నిబర్హణమ్. 282

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిజేసినవసనాభి, తామ్రభస్మము, శుద్ధిజేసిన మణిశిల, శుద్ధిచేసిన తాళకము, శుద్ధిచేసినగంధకము, చెంగల్వకోష్టు, ముత్తవపులగపువేళ్లు, కరక్కాయలు, శుద్ధిచేసిన మయిలతుత్తము, నేలగుమ్ముడుగడ్డ - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి ఆముదముతో ౧ దినము మర్దించి గురిగింజంత మాత్రలుజేసి యందొకదానిని గలిజేరురసానుపానముతో సేవించిన గుల్మవాతము హరించును.

### మజ్జావాతలక్షణము

సర్వాంగశోభః కంపశ్చ హిక్కా వై ఛర్దనం తథా.
తీవ్రభ్రమణశూలం చ మజ్జావాతస్య లక్షణమ్. 283

తా. సర్వాంగములు వాచుట, శరీరము వణకుట, ఎక్కిళ్ళు, వాంతి గలుగుట, శరీరము తిరుగుట, శూలగలుగుట- ఈలక్షణములు గలిగి ఎముకలలోని క్రొవ్వు శోషించుటయే మజ్జావాత మని తెలియవలయును. (ఇది హరించుటకై వాతారిరసము నేని, వాతగజాంకుశరసము నేని సేవింపవలయును.)

### క్షతవాతలక్షణము

ఆనాహో మూత్రకృచ్ఛ్రం చ హ్యంగదాహశ్చ కంపనం,
నాభిశూలం కుక్షిశూలం క్షతవాతస్య లక్షణమ్. 284

తా. కడుపుబ్బుట, మూత్రము ఒక్కొకబొట్టుగ వెడలుట, అవయవములు మం

డుట, శరీరము వణకుట - ఈలక్షణములు గలిగి బొడ్డు, కడుపు శూలించుటయే క్షత వాతమని తెలియవలయును.

### పసావాతలక్షణము

గాత్రే శోఫశ్చ నేత్రే చ నిద్రాభంగశ్శిరోవ్యథా,
నాసాశూలం శిరశ్శూలం వసావాతస్య లక్షణమ్. 285

తా. శరీరము వాచుట, నేత్రములు ఉబ్బుట, నిదుర రాకుండుట, తలనొచ్చుట, ముక్కు, తల శూలించుట-ఈలక్షణములు గలిగి మాంసములోని క్రొవ్వు శోషించుటయే వసావాతమని తెలియవలయును. (ఇది హరించుటకై వాతారిరసము నేని, వాతగజాంకుశ రసము నేని సేవింపవలయును.)

### అణువాతలక్షణము

అణువాతే కుబ్జరూప మంగేషు పరిపీడనం,
గాత్రభేదో గతేర్భంగో హ్యణువాతస్య లక్షణమ్. 286

తా. శరీరము స్వల్పమగుట, కుఱుచతనము గలుగుట, అవయవములు నొచ్చుట, శరీరము విఱిచికొనుట, నడుచుటకు శక్తిలేకుండుట-ఈలక్షణములు గలిగి నడుమునులోప లికి వంగదీయుటయే అణువాతమని తెలియవలయును. (ఇది యాప్యము. ఇది హరించుట కై వాతగజాంకుశరససేవనను, విషతిందుకతైలలేపనమును చేయుచుండవలయును.)

### దధివాతలక్షణము

అక్షిశూలం కర్ణశూలం నాసాశూలం శిరోభ్రమః,
హిక్కాతిసారకంచైవ దధివాతస్య లక్షణమ్. 287

తా. నేత్రములు కర్ణములు ముక్కు, శూలించుట, తల తిరుగుట, ఎక్కిళ్ళు. అతిసారము గలుగుట-ఈలక్షణములు గలది దధివాత మని తెలియవలయును.

### దధివాతారిరసము

రస గంధక నేపాళం సమం ఖల్వే విమర్దయేత్,
చిత్రమూలకషాయేణ డోలాయంత్రేణ పాచయేత్. 288
గుంజామాత్రం పాయయేత్తు దధివాతం వినశ్యతి,

తా. రసము, గంధకము, నేపాళములు-వీనిని శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వము లో నునిచి చిత్రమూలకషాయముతో ఒకదినము మర్దించి డోలాయంత్రమున వండి ఒక గురిగింజయెత్తును సేవించిన దధివాతము హరించును.

### కర్ణవాతలక్షణము

కర్ణవాతే చ బాధిర్యం మహాశూలేన పీడనమ్. 289
అహోరాత్రం చ దుఃఖంస్యా ద్దేహశోషః ప్రకీర్తితః,

తా. చెవులునొచ్చుట, ఱేయింబగలు దుఃఖించుట, శరీరము కృశించుట-ఈలక్షణములు గలిగి చెవులు వినరాకుండుటయే కర్ణవాతమని తెలియవలయును.

### కర్ణవాతహరతైలము

శేఫాళ్లతిలకై రండ కుమారీ కులమిశ్రితైః. 290
తతో నిరూహో వాతఘ్నః కల్కస్నేహైర్నిరూహయేత్,
కర్ణవాతం నిహంత్యాశు బాధిర్యం చ వినాశయేత్. 291

తా. నల్లవావిలి, ఆమ్లవేతసము, నువ్వులనూనె, ఆముదము, కలబందగుజ్జు, చాకుడు-వీనిని కల్కముగ వండి చెవిలో * నిరూహవస్తిసంస్కారము చేసిన కర్ణవాతము, చెవుడు కడుశీఘ్రముగ హరించును.

### బధిరవాతలక్షణమః

వాతేన బధిరో జాతః తథా శ్రోత్రధ్వనిర్భవేత్,
కర్ణవాతహరం తైలం ప్రయోక్తవ్యం పలాయతే, 292

తా. వాతమువలన చెవుడు, చెవులయందు ధ్వని గలిగిన బధిరవాత మని తెలియవలయును. ఇది హరించుటకై పైఁజెప్పఁబడిన కర్ణవాతహరతైలమును ప్రయోగింపవలయును.

### కర్ణవాతమునకు దశమూలతైలము

క్వాథశ్చ దశమూలానాం ఛాగక్షీరం చ తత్సమం,
తిలతైలం ద్వయోస్తుల్యం పాచ్యం తైలావశేషితమ్. 293
తత్తైలం నిక్షిపేత్కర్ణే బాధిర్యం నాశయేద్ధ్రువం,

తా. దశమూలములు (అనఁగా మారేడు, గుమ్ముడు, తక్కాలి, కలిగొట్టు, దుంపిలము, కోలపొన్న, నేలపొన్న, నేలములక, పెద్దములక, పల్లేరు) అనువాని వేళ్ళను దంచి కషాయముకాచి వడియఁగట్టి దానికిసమముగ మేకపాలుగలిపి ఈరెంటికిసమముగ నువ్వులనూనె కలిపి తైలముపాకముగ (అనఁగా తైలము శేషించువఱకు) వండి దానిని చెవిలో బోసిన చెవుడు, ధ్వని కడుశీఘ్రముగ హరించును.

---

* నిరూహ మన-కషాయము, పాలు, తైలము అనువానిని చిమ్మనగొట్టములో చిమ్ముట.

## కర్ణశూలవాతలక్షణము, తచ్చికిత్స

కర్ణశూలం పవనజం క్షీ పేచ్ఛ్రోత్రే రసాశనమ్. 294
వాతఘ్నసాధితం సర్పిః కోష్ణం కర్ణం చ పూరయేత్,
మహతః పంచమూలస్య కాష్ఠాత్క్షౌమేన వేష్టితాత్. 295
తైలసిక్తాత్ప్రదీప్తాగ్నే స్స్నేహస్స్రద్యోకరుజాపహః,

తా. వాతమువలన చెవులయందు శూల గలుగును. దానియందు అన్నరసమును, ఆవునెయ్యిని విడిచి చెవిలోఁ బోసినను, లేక వాతహరద్రవ్యయుక్తముగ కాఁచఁబడిన ఘృతమును చెవిలోఁ బోసినను, లేక మారేడు, చిత్రమూలము, పెద్దమ్రాను, గుమ్ముడు, కలిగొట్టు అను మహాపంచమూలములయొక్క కాష్ఠములకు పట్టువస్త్రము చుట్టి నూనెతో తడిపి జ్వాలగ దీపము ముట్టించి యందు స్రవించెడితైలమును చెవిలోఁ బోసి నను చెవినొప్పి తత్క్షణమున హరించును.

## ఉన్మాదవాతలక్షణము

ప్రలాపకృత్తథాకోపీ భూతావేశవికారకృత్. 296
దిగంబరస్మృతిభ్రంశ ఉన్మాదస్స్యాచ్చ మారుతః,

తా. వదరుట, కోపగించుకొనుట, దయ్యముపట్టినట్టుగ దిగంబరుడుగ నుండుట స్మృతి లేకుండుట - ఈలక్షణములును, ఉన్మాదమును గలిగియుండుటయే ఉన్మాదవా మని తెలియవలయును. (ఇవి హరించుటకై ఉన్మాదప్రకరణమునఁ జెప్పంబడు విజయ గుళికలనేని, పర్పటీరసమునేని సేవింపవలయును.)

## ఊర్ధ్వవాతలక్షణము

ఉపరోధో మలం బద్ధ ముచ్ఛ్వాస శ్వాసకాసకౌ. 29
అన్నం క్షీణం చ మందాగ్ని రూర్ధ్వవాతస్య లక్షణం,

తా. శరీరము బద్ధకించుట, మలము బంధించుట, అన్నమునం దిచ్ఛ లేకుండుట అగ్నిమాంద్యము గలుగుట- ఈలక్షణములతోడ ఉచ్ఛ్వాసము, లేక శ్వాసకాసలు కలుగ టయే ఊర్ధ్వవాత మని తెలియవలయును. (ఇది అసాధ్యము.)

## ఊర్ధ్వవాతమునకు వాతారిరసము

క్రమోత్తరగుణం శుద్ధం రసం గంధ ఫలత్రయమ్. 29
చిత్రకం గుగ్గులుం మర్ద్యం పంచైరండకతైలజైః,
పున్నాగం బృహతీయుగ్మం దేవదారు సుచూర్ణకమ్. 29
ఏతత్పూర్వౌషధసమం మర్దయే ద్యామమాత్రకం,

కర్షం ఖాదే త్పిబే త్క్వాథం నాగరైరండమూలజమ్. 300
అభ్యంగై రండతైలేన పృష్ఠే స్వేదం చ కారయేత్,
విరేచనం భవే త్తేన స్నిగ్ధముష్ణం చ భోజయేత్. 301
రసోవాతారినామాయ మూర్ధ్వవాతం చ నాశయేత్,

తా. శుద్ధిచేసిన రసము ౧ మాడయెత్తు, శుద్ధిజేసిన గంధకము ౨ మాడలయెత్తు, కరక్కాయలు ౩ మాడలయెత్తు, తానికాయలు ౪ మాడలయెత్తు, ఉసిరికపప్పు ౫ మాడలయెత్తు, చిత్రమూలము ౬ మాడలయెత్తు, శుద్ధిజేసిన గుగ్గిలము ౭ మాడలయెత్తు-ఇట్టుల వీనినెల్ల ఖల్వములో నునిచి ఐదుమాడలయెత్తు ఆముదముపోసి మర్దించి పిదప దానికి సమముగ సురపొన్న, నేలములక, వాకుడు, దేవదారు అనువానిచూర్ణమును కలిపి మరల ఒకఝామువఱకు మర్దించి కర్షప్రమాణమంతేసి మాత్రలు చేసి యందొకదానిని శొంఠి, ఆముదపువేళ్లు అనువానికషాయానుపానముతో సేవనను, ఆముదముతో అభ్యంజనమును, స్వేదస్రావము గలుగునటుల వీపునందు మర్దనను చేయించిన ఊర్ధ్వవాతము హరించును. మఱియు నీయౌషధసేవనవలన ఒకమారు విరేచనమగును. పిదప స్నిగ్ధమై ఒకింత ఉష్ణముగనుండు భోజనమును భుజింపంజేయవలయును.

ఆమవాతలక్షణము

దేహం చ పాండురం మూత్రం తృష్ణా ఛర్దిశ్చ నేత్రకమ్. 302
పీతవర్ణం భవే దుష్ణ మామవాతస్య లక్షణం,

తా. శరీరము, మూత్రము పాండురవర్ణముగ నుండుట, దప్పి, వాంతి గలుగుట, నేత్రములు పచ్చగ, శరీరము ఉష్ణముగ నుండుట-ఈలక్షణములు గలది ఆమవాతమని తెలియవలయును.

జంఘోరుత్రికసంధీనాం వ్యథా హృన్నాభిపాదకే. 303
తృష్ణా శోషో విషూచిశ్చా ప్యామవాతస్య లక్షణం,
(గ్రంథాంతరే)

తా. పిక్కలు, తొడలు, ముడ్డిపూస, సంధులు, హృదయము, నాభి, పాదములు అనువానియందు వేదన గలుగుట, దప్పి గలుగుట, శరీరము ఎండుట, విషూచి గలుగుట - ఈలక్షణములు గలది ఆమవాత మని తెలియవలయును.

ఆమవాతనివర్తకోపాయము

పంచవక్త్రరసో దేయో ద్విగుంజం తత్ప్రశాంతయే. 304

దద్యాదేరండతైలేన రసంవాతారిమేవ చ,

తా. పైఁజెప్పఁబడు పంచవక్త్రరసములో రెండుగురిగింజల ప్రమాణమును సేవించినను, లేక ఆముదములో వాతారిరసమును గలిపి సేవించినను ఆమవాతము హరించును.

ఆమవాతమునకు పంచవక్త్రరసము

శుద్ధసూతం సమం గంధం మరీచం టంకణం కణా. 305
మర్దయే ద్ధూర్తజద్రావై ర్దినమేకం విశోషయేత్,
పంచవక్త్రరసో నామ్నా ద్విగుంజం సన్నిపాతజిత్. 306
అర్కమూలకషాయం చ సవ్యోషమనుపాయయేత్,

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, మిరియాలు, శుద్ధిచేసిన వెలిగారము, పిప్పళ్ళు వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి ఉమ్మెత్తరసముతో ఒకదినము మర్దించి ఎండించి రెండుగురిగింజల ప్రమాణమును జిల్లేడువేళ్లకషాయము, త్రికటుకచూర్ణము అను వాని యనుపానముతోడ సేవించిన ఆమవాతము, సన్నిపాతము హరించును.

ఆమవాతమునకు ఏరండతైలము

ఆమవాతగజేంద్రస్య శరీరవనచారిణః. 307
ఏకఏవాగ్రణీర్హంతా ఏరండస్నేహకేసరి,

తా. శరీరమను వనమున సంచరించునట్టి ఆమవాతమను నేనుఁగును ఆముదమను సింహము నశింపఁజేయుచున్నయది.

ఒరుగువాతమునకు చికిత్స

సీ. పెనువజ్రనీలియు బీరము గురిజాకు
రసము మిర్యము నూనె రవిదినమున
నొక్కటి రేగొట్టిచెక్క మిర్యము ద్రాగి
తెరలగా విడెము సంధిల్ల నొకటి
తగు గువ్వగుత్తాకుద్రవమును మిరియంబు
గోఘృతంబున సేవఁ గూడ నొకటి
మేదిని నీలాకు మేకపాలును గాచి
చెన్నుమీఱఁగ సేవఁ జేయ నొకటి

గీ. నమలి చెక్కయుఁ బిప్పలి నమరఁ ద్రాగి
యొరుగుదిక్కున గంధంబు నొరయ నొకటి
రమణతో బుడ్డకాచాకురసము నెయ్యి
మిరియముల మానుచుండుఁ దా నొరుగు వాయు.

## వాతప్రకోపలక్షణము

పార్శ్వసంకోచ శూలార్తి స్పంధిభంగో౽తిశీతతా. 308
అంగశోఫః ఖరశ్యామ స్స్వప్నో వాతాత్ప్రజాయతే,

తా. శరీరపార్శ్వము సంకోచమును బొందుట, శూల గలుగుట, కీళ్లు నొచ్చుట, శరీరము చల్లగనుండుట, అంగములు వాచుట, అంగములు బిరుసై నల్లగనుండుట, నిదుర గలుగుట-ఈలక్షణములవలన వాతము ప్రకోపించిన దని తెలియవలయును.

## వాతశమనోపచారములు

స్వేదాభ్యంగైః కటుక్షారైః స్నేహైర్వా భోజనైర్ఘృతైః. 309
తైలై రసౌషధై ర్వైద్య స్మారుతం నాశయేద్భిషక్,

తా. మఱియు వాతప్రకోపమును, స్వేదస్రావము, అభ్యంజనము, కారము, క్షారము, స్నేహము, ఉష్ణాన్నభోజనము, వాతోపయుక్తఘృతములు, తైలములు రసౌషధములు-ఈ మొదలగు వానివలన వైద్యుఁడు పోకడచవలయును.

## సర్వవాతములకు స్వచ్ఛందభైరవము

శుద్ధసూతం మృతం లోహం తాప్యం గంధక తాళకమ్. 310
పథ్యాగ్నిమంథనిర్గుండీ త్ర్యూషణం టంకణం విషం,
తుల్యాంశం మర్దయేత్ఖల్వే దినం నిర్గుండికాద్రవైః. 311
ముండీద్రావై రేకదినం ద్విగుంజం వటకీకృతం,
భక్షయేత్సర్వవాతార్తో నామ్నా స్వచ్ఛందభైరవః. 312
రాస్నా మృతా దేవదారు శుంఠీ వాతారితుల్యకం,
గుగ్గులుం సర్వతుల్యాంశం కుట్టయేద్ఘృతపాచితమ్. 313
కర్షం చ భక్షయేచ్చాను సర్వవాతహరం పరం,

తా. శుద్ధిజేసినరసము, లోహభస్మము, స్వర్ణమాక్షికభస్మము, శుద్ధిజేసినగంధకము, శుద్ధిచేసిన తాళకము, కరక్కాయ, నెల్లి, వావిలి, త్రికటుకములు, శుద్ధిజేసిన వెలిగారము, శుద్ధిజేసిన వసనాభి - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి వావిలాకురసముతో నొకదినము, బోడతరపాకురసముతో నొకదినము మర్దించి రెండు గురిగింజలంతేసి

మాత్రలుచేయవలయును. ఇదియ స్వచ్ఛందభైరవ మనంబడును. దుంపరాస్నచూర్ణము, తిప్పతీఁగెచూర్ణము, దేవదారుచూర్ణము, శొంఠిచూర్ణము, ఆముదము అనువానిని సమభాగములుగ గ్రహించి దానికి సమముగ శుద్ధిచేసిన గుగ్గిలపుచూర్ణమును వైచి అందు నెయ్యి గలిపి వండి కర్షప్రమాణమును జేకొని దానిలో పై స్వచ్ఛందభైరవమును గలిపి రెండు మండలములు సేవింపుచుండినను, లేక(రసఉప్పు వేసినను)సర్వవాతములు హరించును.

అశీతివాత సామాన్యలక్షణము

అశీతిర్వాతరోగాశ్చ జాయంతే వాతకోపతః. 314
రుక్తోదభేదసంకోచశోషవేష్టనలక్షణాః, (శారీరనిఘంటౌ)

తా. విరుద్ధాహారచేష్టలవలన వాతము ప్రకోపించి * ఎనుబదివాతముల గలుగంజేయును. అందు పీడ, పోట్లు, బద్దలు సేయునట్టుల వేదన, శరీరసంకోచము, శరీరకార్శ్యము, శరీరము మెలిపడుట ఈలక్షణములు గలుగును.

మతాంతరస్థాశీతివాతములలో బలవత్తరములైనవాతములు

ఆయామద్వయదండకార్దితహనుస్రంసప్రణాయామరు
జ్జిహ్వాస్తంభకళాయఖంజవికృతిస్సా గృధ్రసీ విశ్వచిః,
ఖల్లీస్యాదపతంత్రతానకగదౌ పంగుశ్చ ఖంజఃక్రమా
దూరుస్తంభశిరోగ్రహావపి తథాక్షేపాంఘ్రిదాహామయాః. 3 5
వాతకంటకగదోపబాహుకం క్రోష్టుశీర్షమథపాదహర్షరుక్,
పక్షఘాతమఖిలాంగవాతస ఙ్ఞారుతేషు బలవత్తరా ఇమే. 316

తా. అంతరాయామము, బహిరాయామము, దండకము, అర్దితము, హనుస్రంసము, ప్రణాయామము, జిహ్వాస్తంభము, కళాయఖంజము, గృధ్రసి, విశ్వాచి ఖల్లీ, అపతంత్రకము, అపతానకము, పంగువు, ఖంజము, ఊరుస్తంభము, శిరోగ్రహము, ఆక్షేపకము, పాదదాహము, వాతకంటకము, అపబాహుకము, క్రోష్టుశీర్షము, పాదహర్షకము, పక్షఘాతము, సర్వాంగవాతము అను నిరువదియైదును అశీతివాతములలో బలవత్తరములని తెలియవలయును.

* ఈవాతప్రకరణమునం దశీతివాతనామ లక్షణంబులు జెప్పంబడియెను. ఐనను వానికి మతాంతరమువలన నామ, లక్షణభేదములు గలిగియున్నయవి. వానిలో ఇందుఁ జెప్పంబడని యితర వాతలక్షణంబుల నిచట నుదహరించిన గ్రంథవిస్తరం బగునను భీతిచేఁ జెప్పంబడవయ్యెను. కావున వాని నామ, లక్షణముల శారీరనిఘంటుమొదలగు గ్రంథములవలన తెలిసికొనవలయును.

## బలవత్తరవాతలక్షణములు

సూత్రమ్. వేగైరంతరానమితాంగోఽంతరాయామః. వేగైర్బహిరానమితాంగో బహిరాయామః. తేన దశరాత్రం నజీవతి. మందవేగేన తు జీవేత్. దండవత్ స్తబ్ధసర్వాంగో దండకః, తం భిషగ్వర్జయేత్. వక్రితవక్త్రార్ధోఽర్దితః స్రస్తహనుర్హనుస్రంసః. వ్రణప్రకోపాదంతర్బహిశ్చ వేగై రానమితాంగో వ్రణాయామః, తం భిషక్పరివర్జయేత్. దండవత్ స్తబ్ధజిహ్వో జిహ్వాస్తంభః. ముక్తసంధిప్రబంధనః కలాయఖంజః, గృహీతైకచరణో గృధ్రసీ, సా బాహౌ చేద్విశ్వాచిః పాదే బాహౌచ ఖల్లీ, అంతర్బహిశ్చ వేగైర్నమితాంగోఽపతంత్రః, తేన దశరాత్రం నజీవతి, మందవేగేనతు జీవేత్. అపతంత్రకవదపతానకః, తంత్రాయం విశేషః, హృద్యనిలేవిముక్తే సుఖీభవేత్. సతుసాధ్యః; గృహీతసక్థిద్వయః పంగుః, గృహీతైకసక్థిః ఖంజః, దండవత్ స్తబ్ధోరుః ఊరుస్తంభః, గృహీతగ్రీవా శిరశ్శిరోగ్రహః. అనుక్రమం వేగైః పరితస్సమాక్షిప్తాం ఆక్షేపకః. పాదదాహకత్వాదంఘ్రిదాహః, సకంటకగమనో వాతకంటకః. అధోముఖ బాహ్వాఽపబాహుకః. జానుమధ్యాదికరుజాశోఫః క్రోష్టుశీర్షకః. సుప్త్యాహృష్టపాదః పాదహర్షః. హతైకపక్షః పక్షఘాతః. భగ్నసర్వాంగ స్సర్వాంగవాతః. (శారీరసూత్రస్థానే) 317

తా. వాతము బొమ్మునాశ్రయించి శరీరమును విల్లువలె వంగతీయునది అంతరాయామవాత మనియు, వీపు నాశ్రయించి శరీరమును విల్లువలె వంగతీయునది బహిరాయామవాతమనియుఁ జెప్పంబడును. ఇవి జనించిన పదిదినములకు రోగి మృతిజెందును. అయినను వానియందు తీపులు మందముగనుండిన రోగి జీవించును. శరీరమును కఱ్ఱవలె స్తంభింపంజేయునది దండకవాత మనంబడును. ఇది అసాధ్యమగుటంజేసి దానియందు వైద్యుండు చికిత్స జేయంజనదు. వాతము ముఖము నాశ్రయించి సగమునోరును వంకరగఁజేయునది అర్దితవాతమనియు, దవడలనాశ్రయించి వానిని జారునట్లులం జేయునది హనుస్రంసవాతమనియుఁ జెప్పంబడును. వ్రణప్రకోపమువలన శరీరమును లోనికిఁగాని, వెలుపలికిఁగాని, వంగతీయునది వ్రణాయామవాతమనంబడును. ఇది అసాధ్యమగుటంజేసి వైద్యుఁడు వర్జింపఁదగియుండును. వాతము వాగ్వాహినీసిరలయందుఁ బ్రవేశించి నాలుకను

దండమువలె స్తంభింపంజేయునది జిహ్వాస్తంభవాత మనియు, శరీరసంధుల వదలిం
శరీరమును, కాళ్ళను వణకింపుచు ఖంజరీపిట్టవలె వంకరగ నడుచునటులం జేయున
కళాయఖంజవాత మనియు, ఒకపాదముయొక్క సిరల నాశ్రయించి కదల
బంధింపంజేయునది గృధ్రసీవాతమనియు, ఒకహస్తముయొక్క స్థూలసిరలయం
ప్రవేశించి అందుండి భుజములయందు వ్యాపించి హస్తమును కదలక బంధిం
జేయునది విశ్వాచివాతమనియు, కాళ్ళచేతులయందు వ్యాపించి శూలను గలు
జేయునది ఖల్లీవాత మనియు జెప్పంబడును. వాతము ఊర్ధ్వముఖంబై లోపల వెలు
ష్టేపనను, తాపమును గలుగంజేయుచు శరీరమును వంగదీయునది అపతంత్రకవ
మనంబడును. ఇది గలవాఁడు పదిదినములకు మృతిచెందును. అయినను దానియందు మో
తీపులు గలిగియుండిన వాఁడు జీవించును. అపతంత్రకవాతలక్షణములు గలదే అపతా
వాత మనంబడును. అయినను దానియందు ఒళ్ళునొప్పి లేకుండిన రోగి జీవించును.
అసాధ్యము. వాతము రెండురొండ్ల ప్రవేశించి తొడలయందలి స్థూలనరంబుల
తొడల బంధింపంజేయునది పంగువాత మనియు, ఒకరొండియందు ప్రవేశించి ఒకతొ
యందు వ్యాపించి కుంటితనము గలుగంజేయునది ఖంజవాత మనియు, తొడలయం
ప్రవేశించి గుదియవలె స్తంభింపఁజేయునది ఊరుస్తంభవాత మనియు, మెడ, తల వీ
కదలక బంధింపఁజేయునది శిరోగ్రహవాతమనియు, సిరలఁజొచ్చి ఏనుఁగుమీఁదకూర్చుం
వాని శరీరము కదలుభంగి శరీరమును పలుమారు కదలునటులం జేయునది ఆక్షేపక
మనియు, నడిచిన అరకాళ్లు మండునటులం జేయునది పాదదాహవాత మనియు,
-చిన ముండ్లు నాటునటుల నొచ్చునటులం జేయునది కంటకవాత మనియు, చే
తల క్రిందుగఁ జేయునది అపబాహుకవాతమనియు, రక్తాశ్రితమై మోకాలినడుమ
నొప్పిని వాపును గలుగంజేయునది క్రోష్టుశీర్షవాతమనియు. కఫాశ్రితమై కాళ్ళయ
గిలిగింతలవలె తిమురును గలుగంజేయునది పాదహర్షవాతమనియు, అర్ధాంగమునఁ ప్ర
శించి సంధిబంధముల వదలించి శరీరముయొక్క ఒకపార్శ్వమును చేతనారహితమ
జేయునది పక్షఘాతవాతమనియు, విరఁగొట్టఁబడినటుల సర్వాంగములయందు నొ
గలుగంజేయునది సర్వాంగవాత మనియుఁ జెప్పంబడును.

## బలవత్తరవాతోపచారము

ఏతేదాహక్రియాసాధ్యా అగ్నివైద్యమతఃపరమ్.

తా. పైఁజెప్పఁబడిన వాతములు అగ్నికర్మవలన సాధ్యంబులు. అట్లగుట
అగ్నికర్మల వచించెదను.

## వాతములకు రక్షాదికర్మలు

సూత్రమ్. ఆయామద్వయాపతంత్రకాపతానకాక్షేపకేషు శిరో లలాట కర్ణమూల గ్రీవాగ్రపృష్ఠమధ్యత్రికవక్షోజంఘాప్రదేశేషు సందహేత్ అర్దితే గ్రీవాగ్రఏవ, హనుస్రంసే హనుమూలయోరేవ. జిహ్వాస్తంభే కర్ణమూలయోరేవ. కళాయఖంజే సంధిబంధనేషు. గృధ్రస్యాం జానోరూర్ధ్వం వా చతురంగుళే. విశ్వాచ్యాంహస్తే తద్వత్. ఖల్యాం తద్వత్పాదహస్తయోః. సక్థిమధ్యేపంగౌ. తద్వత్ఖంజే. వాతకంటకే గుల్ఫాదధోద్వ్యంగుళే అపబాహుకే భుజశిరసోర్ద్వ్యంగుళే. భుజానుకపాలస్య పరితః క్రోష్టుశీర్షకే, ఊరుస్తంభే తన్మధ్యఏవ. పాదదాహే న దాహః. శిరోగ్రహే గ్రీవాగ్రఏవ. పాదహర్షే న దాహః, పక్షఘాతేషు పక్షయోరేవ, సర్వాంగవాతే న దాహః. 319

తా. అంతరాయామము, బహిరాయామము, అపతంత్రకము, అపతానకము ఆక్షేపకము అను నీ ఐదువాతములందు శిరము, లలాటము, కర్ణమూలము, మెడ, నడివీపు, ముడ్డిపూస, ఱొమ్ము, పిక్కలు అనువానియందును, అర్దితవాతమున మెడకు పైభాగమునందును రక్ష వేయవలయును. హనుస్రంసవాతమునందు చెక్కిళ్ళమూలములయందుగాని, లేక పెద్దచెవిగూబ మొదటిగుంటలోగాని, లేక క్రిందిపెదవిగుంటలోగాని రక్ష వేయవలయును. జిహ్వాస్తంభవాతమునందు చెవికొలంకులయందును, కళాయఖంజవాతమున కీళ్ళయందును రక్షలు వేయవలయును. గృధ్రసివాతమున మోకాలియొక్క నాలుగు అంగుళములకుపైనగాని, లేక వెనుకనుగాని రక్షవేయవలయును. విశ్వాచివాతమున చేతి నడిమకీలుకు ముందరగాని, లేక వెనుకనుగాని రక్షలు వేయవలయును. ఖల్లీవాతమునందు మోకాళ్ళు, మోచేతులు అనువానిముందర, వెనుక రక్షలువేయవలయును పంగువాతము, ఖంజవాతముఅనువానియందు తొడలమధ్యమునందును, వాతకంటకవాతమున చీలమండలకు రెండువ్రేళ్ళక్రిందను, అపబాహుకవాతమున భుజశిరస్సులకు రెండువ్రేళ్ళక్రిందను, క్రోష్టుశీర్షవాతమున మోకాలిచిప్పతిరుగువాటియందును, ఊరుస్తంభవాతమున తొడల నడుమను రక్షలు వేయవలయును. పాదదాహవాతమున రక్షలు వేయంజనదు. శిరోగ్రహవాతమున మెడతుదను రక్షలు వేయవలయును. పాదహర్షవాతమున రక్షలు వేయంజనదు. పక్షఘాతవాతమున ఇరుప్రక్కల రక్షలు వేయవలయును. సర్వాంగవాతమున రక్షలు వేయంజనదు.

సూత్రమ్. ఆయామయోస్సిరావేధం వమనం చ కుర్యాత్. 320

తా. అంతరాయామ బహిరాయామవాతములయందు సిరావేధనను, వమనమును జేయించవలయును.

సూత్రమ్. త్వఙ్మాంసశోణితగతేష్వనిలేషు శృంగైరస్రం విస్రావయేత్. 321

తా. త్వగ్గత, మాంసగత, రక్తగత వాతములయందును ఆవుకొమ్ముల శృంగములతో రక్తమును స్రవింపజేయవలయును. (కంటియొక్క నల్లగుడ్డు మీఁదికెగదీయుచు కంటికి ముందర అదురుచుండువాతమున కంటియొక్క క్రింద యెముకమీఁద కదురుతో నడ్డముగ రఉ వేయవలయును. కాళ్ళయం దిద్దుపుగలిగిన చీలమండయొక్క కీలువెనుక చంద్రాకారముగ రఉ వేయవలయును. మోకాలు, మోచెయ్యి, ముంజెయ్యి అనువానిలో దేనియందేని వాపుగలిగియుండిన నూనె పట్టించి ఏడు తడిబట్టలుచుట్టి దానిపై అగ్నికర్మ సేయఁబడు వాఁడుపదిదినములు సాయంప్రాతఃకాలముల అగ్నికర్మ సేయవలయును. నొప్పిగల కంటియొక్క కనుబొమ్మమీఁద రెండువ్రేళ్ళకుపొడవున కదురుతో అడ్డముగ రఉ వేసిన నేత్రము లెఱ్ఱనైపోట్లు పొడుచుచు నీరుకారుచుండు నేత్రవాతము హరించును. కుడికన్ను తెల్లగ ఆవిరై నీళ్లు గారుచు నొప్పితో గూడి కప్పుకొనుచు వచ్చుచుండిన ఎడమకాలియొక్క ఐదువ్రేళ్ళనాశ్రయించి యుండుకీళ్ళయందును, ఎడమకన్ను అయినయెడల కుడికాలియొక్క ఐదువ్రేళ్ళయందుండు కీళ్ళయందును అడ్డముగ రఉ వేయవలయును. గుజ్జపు మోర్లకు జిట్టెడుకొలిచికదురుతో అడ్డముగ రఉ వేయవలయును. డబురుకవాతమున వెణుతురునారతో త్రాడుపేని దానిని కాఁగిననూనెలోముంచి మోకాలికి రెండంగుళముల ప్రదేశమున రఉ వేయవలయును. మఱియు డబురుకమైన మోకాలియొక్క వెలుపటికంటికి ఐదంగుళములకు దిగువరఉ చేయవలయును. మఱియు డబురుకమైన కాలియొక్క చీలమండసంధిలో అడ్డముగ కదురుతో చంద్రాకారముగ రఉ వేయవలయును.)

[శుద్ధిజేసిన నాభి, మేకవెంట్రుకలబూడిదె, మిరియాలు వీనిని దినుసు కొకటింటికి ఒకతులముచొప్పున ఖల్వములో నునిచి కరివేపాకురసముతో మర్దించి గురిగింజలంతేసి మాత్రలు జేసి యందొకదానిని ఐదుచిన్నములకరివేపాకురసముతో సేవించిన ఒరుగు వాతము, సర్వవాతములు, మూర్ఛ హరించును.]

ఉ. మేలుచికిత్సఁ గోరి విను మేదిని బ్రహ్మజెముడుఁబాలును
నాలుగుసేరు లాముదము నాలుగుసేరులుఁ గూర్చి యందులో
నేలపుదంగెడాకుపొడి నీరులిగడ్డల సర్ధసేరునుం

గ్రాలఁగఁ దైలపాకముగఁ గాఁచియు వాతశరీరనొప్పిపైఁ
దాలిమిఁ బూసి కాఁచినను దక్షణమాత్రన మాను నిమ్ముగన్.

సర్వవాతములకు అర్కాదితైలము

అర్కక్షీర మజాక్షీరం నిర్గుండీ తింత్రిణీరసః,
తిలతైలసమాయుక్తం వాతాశీతివినాశనమ్. 322

తా. జిల్లేడుపాలు, మేకపాలు, వావిలాకురసము, చింతాకురసము, నూనె వీనిని సమభాగములుగ కలిపి ఒకకుండలో బోసి తైలపక్వముగ కాచి శరీరమునకు లేపనముచేసి మర్దింపుచుండిన ఎనుబదివాతములు హరించును.

తైలపాకలక్షణము

నాంగుళి గ్రాహితా కల్కే నస్నేహే౽గ్నౌ చ శబ్దితా,
వర్ణాదికం పంచ యదా తదైతచ్ఛీఘ్రమాహరేత్. 323

తా. కల్కము వ్రేళ్లకు అంటుకొనకుండుట, అగ్నియందు వైచిన చటచటశబ్దము లేకుండుట, విజాతీయశబ్దస్పర్శవర్ణరసగంధములు గలుగుట-ఈలక్షణములవలన తైలము పక్వమైన దని యెఱింగి దానిని శీఘ్రముగ దించవలయును.

పాకస్తు త్రివిధో మందః చిక్కణః ఖరచిక్కణః,
మందః కల్కసమే కిట్టే చిక్కణో మదనోపమే. 324
కించిత్సీదతి కృష్ణే చ వర్తమానేతు పశ్చిమః,

తా. తైలపాకము మందము, చిక్కణము, ఖరచిక్కణము అన మూడు విధంబులు. అందుస్నేహకిట్టము కల్కముతో సమముగనుండిన మందపాకమనియు, మైనముతో సమముగనుండిన చిక్కణపాకమనియు, ఒకింత చెడినను లేక నలుపువర్ణమును జెందినను ఖరచిక్కణపాకమనియు తెలియవలయును.

ఖరోమణిరవః కాంస్యే మృదుః పిచునివర్తికా. 325
చిక్కణస్స్పర్శమాత్రేణ నిమ్నభావం ప్రపద్యతే,
మృదుర్నస్యే ఖరో౽భ్యంగే పానే వస్తౌ చ చిక్కణః. 326
(మతాంతరే)

తా. మఱియు స్నేహకిట్టమును ఉంటగజేసి కంచుపాత్రముపైవైచిన మణివలెనే ధ్వనికలిగిన ఖరపాకమనియు, వ్రేళ్లతోనలిపిన వత్తియొక్క ఆకారమును జెందిన మృదుపాక మనియు, ఉంటచేసి వ్రేళ్ళతోనదిమిన పల్లముపడిన చిక్కణపాక మనియు తెలియ

వలయును. తైలమును నస్యమునకు మృదువుగను, అభ్యంజనమునకు ఖరముగను, పానవస్తి కర్మలకు చిక్కణముగను పాకము సేయవలయును.

## వాతరోగములయందు పథ్యము

కూశ్మాండ మాష వార్తాక బృహతీ కారవేల్లకం,
వాస్తుకం కాస మర్దం చ పృశ్నికాళి పునర్నవమ్. 327
కృష్ణాః కుళుత్థా గోధూమా స్తైలం తిక్తపటోలకం,
మూలకం వత్సకం చైవ ఢుండుకం కతకం తథా. 328
తక్కారీ సూరణీ ముండీ మిసీ జీరకరామఠం,
పురాణధాన్యమభ్యంగం మిత్రవర్గోఽనిలామయే. 329

తా. బూడిదెగుమ్మడుకాయ, మినుములు, వంకాయ, ములకకాయ, కాకరకాయ, చక్రవర్తికూర, కసివెందకూర, తూటికూర, గలిజేరుకూర, నల్లఉలవలు, గోధుమలు, నూనె, చేదుపొట్ల, ముల్లంగి, కొడిసెకాయ, దుందిలపుకాయ, మొక్కపుకాయ, తక్కలి, కంద, బోడతరము, పెద్దసదాప, జీలకఱ్ఱ, ఇంగువ, ప్రాతబియ్యము, అభ్యంజనస్నానము ఇవి వాతరోగములయందు పథ్యకరంబులు.

## వాతరోగములయం దపథ్యములు

శీతాంబు శాకలః కంద త్రపు సాలాబు ముద్గకం,
గురూణి చాభిష్యందీని నిష్పావోర్వారుసర్షపమ్. 3.0
కరీరాణి తథా నింబో నవధాన్యం చ లంఘనం,
మృణాలీ ఝురసీ నింబ తిక్తబింబం హిమాలయః. 331
కోశాతకీద్వయంచైవ పవనాశీతిశత్రవః.

తా. శీతోదకము, మూడాకులగడ్డ, దోసకాయ, అనపకాయలు (అనగా సొరకాయ), పెసలు, గురుకరద్రవ్యములు, కఫకరపదార్థములు, అనుములు, నక్కదోసకాయ, ఆవాలు, వెదురుమొలకలు, వేపపండ్లు, క్రొత్తధాన్యము, ఉపవాసము, తామరతూండ్లు, చాతలాసికూర, కరివేము, చేదుదొండకాయ, శీతలప్రదేశము, బీరకాయ, నేతిబీరకాయ ఇవి ౮ం వాతరోగములయం దపథ్యంబులు.

## షష్ఠ ప్రకరణమ్.



# సప్తమప్రకరణే

## పిత్తరోగనిదానలక్షణచికిత్సాదయః

అవతరణిక. గ్రంథకర్త తనచే జేయంబడునీగ్రంథమునందు సప్తమప్రకరణమును వచింపం బూని నిర్విఘ్నముగ పరిసమాప్తిజెందుటకై తనకిష్టదేవతయగు ఈశ్వరనమస్కారాత్మకమంగళమును "శూలినం మేరు కోదండం" అనిశ్లోకముచే జేయుచు చున్నాఁడు:—

శ్లో. శూలినం మేరుకోదండం పద్మలోచనసాయకం,
త్రిపురాసురసంహారం నీలకంఠమహం భజే. 1

తాత్పర్యము. శూలహస్తుఁడై మేరుపర్వతమే ధనస్సుగ గలవాఁడై శ్రీమహావిష్ణువే బాణముగ గలవాఁడై త్రిపురముల జయించిన నీలకంఠుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వాయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజు అనిపేరొందనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథమునందు సప్తమప్రకరణమును వచింపుచున్నాఁడను.

### చతుర్వింశతి పైత్యవివరణము

ఆవర్ణం చ వివర్ణం చ సూర్యవర్ణం చ కామిలా,
ఆమ్లం రక్తం చ స్వేదశ్చ హ్యున్మత్తం పాండ్రసర్పికమ్. 3
కరపాదం చ శీతం చ మూర్ఛా మధుర కుసుమకం,
క్రోధభ్రంశశ్శిరః క్షుచ్చ తృష్ణా దుర్బాచచర్మణీ. 4
దుర్గంధం మదనం పిత్తం చతుర్వింశతిపైత్తకం,
పూర్వాచార్యైరిదం ప్రోక్తం శాస్త్రమార్గవిచారణాత్. 5

(మాధవనిదానే)

తా. ఆవర్ణపైత్యము, వివర్ణపైత్యము, సూర్యవర్ణపైత్యము, కామిలాపైత్యము, ఆమ్లపైత్యము, రక్తపైత్యము, స్వేదపైత్యము, ఉన్మాదపైత్యము, పాండ్రకపైత్యము, విసర్పిపైత్యము, కరపాదపైత్యము, శీతపైత్యము, మూర్ఛాపైత్యము, మధురపైత్యము, కుసుమ

పైత్యము, క్రోధపైత్యము, భ్రాంశపైత్యము, శిరఃపైత్యము, క్షుధాపైత్యము, తృష్ణాపైత్యము, దుర్భావపైత్యము, చర్మపైత్యము, దుర్గంధపైత్యము, మదనపైత్యము, అన పైత్యరోగములు ౨౮ విధంబు లని వైద్యశాస్త్రానుసారముగ పూర్వాచార్యులు వచించిరి.

స్వేదః కాంతిహారం తృష్ణా వ్యతిదుర్గంధదేహతా,
దేహస్తు పీతస్సర్వాంగ మావర్ణం పైత్తమాదిశేత్. 6

(మాధవనిదానే)

తా. చెమట, దప్పిగలుగుట, శరీరము పచ్చగ నుండుట, సర్వాంగముల కంతులు గట్టుట-ఈలక్షణములు గలిగి శరీరము కాంతివిహీనముగ నుండుటయే ఆవర్ణపైత్య మని తెలియవలయును.

అంగదాహ శిరో దాహః పాదదాహ శ్శిరోభ్రమః,
మూర్ఛా భ్రమో మనస్తాపో హృది సంతాపవేదనమ్. 7
కంఠ స్వేదశ్చ పాండుత్వం శోషః క్లేశో ముహుర్భయం,
సర్వేంద్రియేషు దౌర్బల్య మావర్ణపైత్యలక్షణమ్. (చరకే) 8

తా. శరీరము, శిరము, పాదములు మండుట, తల తిరుగుట, మూర్ఛ, భ్రమ, మనస్తాపముగలుగుట, ఱొమ్ములోమండుట, కడుపునొచ్చుట, కుతికెక్రింద చెమటపట్టుట, శరీరము పాండురవర్ణముగ నుండుట, శోష క్లేశము గలుగుట, పలుమారు భయపడుట, శ్రోత్రత్వఙ్నేత్రజిహ్వాఘ్రాణేంద్రియ వాక్పాదపాణిపాయుగుహ్యేంద్రియములను దశేంద్రియములు దౌర్బల్యమును జెందుట. (అనగా శ్రోత్రేంద్రియదౌర్బల్యమున చెవులలో ధ్వనులుగలుగుట, చెవులు గడియలుపడుట, చెవుడుగలుగుట, త్వగింద్రియ దౌర్బల్యమున చర్మముమండుట, శరీరము అదురుట, శరీరము ఉబ్బుట, శరీరమున పొట్టువలె రాలుట, శరీరము పగులుట, శరీరమున దురద గలుగుట, నేత్రేంద్రియదౌర్బల్యమున నేత్రములు మండుట, నిదుర పట్టకుండుట, దృష్టిమధ్యమగుట, జిహ్వేంద్రియదౌర్బల్యమున నాలుక పసనులేక బిరుసైయుండుట, వాంతి, అరుచి, ఊములుగలుగుట, ఘ్రాణేంద్రియదౌర్బల్యమున ముక్కున నీరుగారుట, తుమ్ములు గలుగుట, సర్వము బంధించుట, దురద గలిగి కణతలు నొచ్చుట, వాగింద్రియదౌర్బల్యమున వాక్కును జడత్వము ఆవలింతలు గలుగుట, తేనుపులు వచ్చుట, పాదేంద్రియదౌర్బల్యమున కాళ్ళయందు సత్వములేకుండుట, కాళ్లు తీయుట, కాళ్లుకృశించుట, పాణీంద్రియదౌర్బల్యమున చేతులుమండుట, తరతరలాడుట, పాయ్వింద్రియదౌర్బల్యమున బొడ్డు గుండె వీనిమధ్యమున గుబులుజనించి కడుపు కుతికె వీనియందు మెదలుట, ఉబ్బసమువలన కుతికె పట్టుకొనుట, కడుపు ఉబ్బుట, మలము

బంధించుట, మూత్రంబధికముగ వెడలుట, గుహ్యేంద్రియదౌర్బల్యమున వీర్యము స్ఖలనం బగుట)- ఈలక్షణముకలది అవర్ణపైత్య మని తెలియవలయును. (ఇది ఊర్ధ్వగతమైన రెండువత్సరంబులేని, లేక మూడువత్సరంబులేని శరీరమున నెలకొని బాధింపుచుండును.)

### అవర్ణాదిపైత్యములకు పైత్యాంతకరసము

మృతసూతాభ్రముండార్క తీక్ష్ణం మాక్షిక తాళకం,
గంధకం మర్దయే త్తుల్యం యష్టి ద్రాక్షామృతద్రవైః. 9
జలమంటపకః పాఠాద్రవైః క్షీరవిదారికా,
మర్దయేచ్చ దినం ఖల్వే సితా క్షౌద్రయుతావటీ. 10
నిష్కమాత్రీ నిహంత్యాశు పిత్తం పిత్తజ్వరం క్షయం,
దాహ తృష్ణా శమశ్శోషం హంతి పిత్తాంతకో రసః. 11
సితాక్షీరం పిబేచ్చాను యష్టికాక్వథం సితాన్వితం,
పిబేద్వా పిత్తశాంత్యర్థం శీతతోయేన వాలుకమ్. 12

తా. రసభస్మము, అభ్రకభస్మము, ఇనుపభస్మము, తామ్రభస్మము, లోహభస్మము, శుద్ధిజేసిన మాక్షికము, శుద్ధిజేసినతాళకము, శుద్ధిజేసిన గంధకము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి యష్టిమధుకము, ద్రాక్షపండు, తిప్పతీగె, *నీరుతూటు, విషబొద్ది, పాలుగల నేలగుమ్మడిగడ్డ అనువానిరసములతో ఒక దినము మర్దించి నిష్కప్రమాణమంత వటికములు జేసి యందొకదానిని పంచదారతోగాని లేక తేనెతోగాని లేక పంచదార పాలు అనువానితోగాని లేక పంచదారతోగూడియుండు యష్టిమధుక కషాయముతో గాని లేక కూతురుబుడమ చూర్ణములో శీతోదకమును కలిపి దానినిసేవించిన అవర్ణపైత్యము మొదలగు ఇరువదినాలుగు పైత్యములు, పిత్తజ్వరము, క్షయరోగము, దాహము, దప్పి, శోష హరించును. (మఱియు అవర్ణపైత్యము ఊర్ధ్వగతంబైనదాని నివారణార్థంబై ఈపైత్యాంతకరసమును ఒక వత్సరంబేని లేక ఆరుమాసములేని సేవింపవలయును.)

### అవర్ణాదిపైత్యోపచారము

తత్సిందూరం వినిక్షిప్య గుంజామాత్రప్రమాణకం,
వాలుకం శీతతోయేన హ్యాశువర్ణాదిపైత్యజిత్. 13

తా. కూతురుబుడమను శీతోదకముతో నూరి పావుసేరురసమును పిండికొని అందు

* ఇదే నీళ్ళమీఁద బలిసిన పాకెడుకూర యనియు జెప్పంబడును.

గురిగింజంత సిందూరము కలిపి నాలుగుమాసములు సేవించిన ఆవర్ణాది పైత్యములు శీఘ్రముగ హరించును.

విపర్ణపైత్యలక్షణము

రోమనాశ శ్శిరఃకంప స్సర్వాంగం స్ఫుటితం భవేత్,
రోమహర్షణకం శూలం వివర్ణం పైత్తమాదిశేత్. 14

(మాధవనిదానే)

తా. రోమములు నశించుట, తల వణకుట, శరీరమంతట పగులుట, గగుర్పొడుచుట, కడుపులో శూలించుట-ఈలక్షణములు గలిగి శరీరము వివర్ణమై యుండుటయే వివర్ణపైత్యమని తెలియవలయును.

వివర్ణపైత్యమునకు బడబాగ్నిరసము

పారదం గంధకంచైవ భస్మలోహాష్టకం సమం,
కుమారీ స్వరసేనైవ మర్దితం యామమాత్రకమ్. 15
గుంజామాత్రం ప్రదాతవ్యం వివర్ణపిత్తనాశనం,
నిహన్యా త్సర్వపిత్తార్తిం యోగోఽయం బడబాగ్నికః. 16

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, ఉక్కుభస్మము, ఇనుపభస్మము, తగరభస్మము, నాగభస్మము, రజతభస్మము, సువర్ణభస్మము, తామ్రభస్మము, కాంతభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి కలబందరసముతో ౧ ఝామము మర్దించి గురిగింజలంతేసి మాత్రలు చేసి యందొకదానిని పిప్పలితో సేవించిన సర్వపైత్యములు, వివర్ణపైత్యము హరించును. ఇదియ బడబాగ్నిరస మనంబడును.

ఊర్ధ్వగత పిత్తలక్షణము

నాభికాపాశయస్వేదః పైత్తమూర్ధ్వగతం స్మృతమ్. 17

తా. బొడ్డు, గుండె వీని మధ్యమున చెమటగలిగిన పిత్తము ఊర్ధ్వగతమైన దని తెలియవలయును. (ఇది హరించుటకై బడబాగ్నిరసమునేని, పైత్తాంతకరసమునేని, పాణిబద్ధరసమునేని నాలుగుమాసములు సేవింపవలయును.)

సూర్యవర్ణపైత్యలక్షణము

సూర్యోదయేచ దృష్టీనాం భ్రమణంచైవ మూర్ఛనం,
అతితీవ్రగతిర్దాహ స్సూర్యవర్ణే చ పైత్తకే. (చరకే) 18

తా. మూర్ఛ, పలుమారు దాహము గలుగుట-ఈలక్షణములు గలిగి సూర్యోదయమును చూచినతోడనే నేత్రములు తిరుగుటయే సూర్యవర్ణపైత్య మని తెలియవలయును.

### సూర్యవర్ణపైత్త్యమునకు మృగజరసము

శుద్ధసూతం సమం గంధం టంకణం చ మనశ్శిలా,
ఏలా తక్కోల జాజీ చ సమభాగం చ ఖల్వకే. 19
శతావరీకషాయేణ దివసం మర్దయే ద్దృఢం,
శర్కరా మధుసంయుక్తం సూర్యవర్ణం నిహంతి చ. 20

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన వెలిగారము, శుద్ధిచేసిన మణిశిల, ఏలకులు, తక్కోలపుట్లు, జాజికాయ-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి పిల్లి పీచరవేళ్లకషాయముతో ఒకదినము మర్దించి గురిగింజలంతేసి మాత్రలు జేసి యందొక దానిని జీలకఱ్ఱ పంచదార అనుపానితోనేని, లేక తేనె చక్కెరతోనేని సేవించిన సూర్యవర్ణపైత్త్యము హరించును.

### కామిలాపైత్త్యలక్షణము

ముఖే హారిద్రావర్ణశ్చ చక్షుషో రతిపాండుతా,
మలం నిరశనం తృష్ణా కామిలా పైత్తలక్షణమ్. 21

తా. ముఖము పచ్చగనుండుట, మలము వెడలకుండుట, ఆకలి లేకుండుట, దప్పి గలుగుట-ఈలక్షణములు గలిగి నేత్రములు పాండువర్ణముగ నుండుటయే కామిలాపైత్త్యమని తెలియవలయును.

యచ్ఛంఖం యేనదృష్టంస్యా త్తచ్ఛంఖం పీతమాప్నుయాత్,
తదేవ కామిలాత్వం చ ఏవముక్తం పురాతనైః. (గ్రంథాంతరే)

తా. శంఖమును పచ్చగ గాంచెడువాడు కామిలారోగియని పూర్వులు వచించిరి.

### కామిలాపైత్త్యమునకు కపర్దకరసము

రసభస్మ సమం గంధ మేలా వాలుక టంకణం,
అమృతాశీరకుష్ఠాబ్దాః సమభాగం విచూర్ణయేత్. 23
ఆర్ద్రకస్య రసైః ఖల్వే ద్వియామాంతం విమర్దయేత్,
జీరకస్యకషాయేణ ద్విగుంజం భక్షయేత్సదా. 24
కామిలా పిత్తనాశాయ దాహశాంతిహరః పరః,

తా. రసభస్మము, శుద్ధిచేసిన గంధకము, ఏలకులు, కూతురుబుడమ, శుద్ధిచేసిన వెలిగారము, తిప్పసత్తు, వట్టివేళ్ళు, చెంగల్వకోష్టు, తుంగగడ్డలు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ఖల్వములో నునిచి అల్లపురసముతో రెండుఝాములు మర్దించి ౨ గురిగింజ

లంత మాత్రలుచేసి యందొకదానిని జీలకఱ్ఱకషాయముతో సేవించిన కామిలాపైత్యము, దాహము హరించును.

అమ్లపైత్యలక్షణము

ఆమ్లోద్గార స్తథా తృష్ణా ప్యరుచి స్స్వరహీనతా. 25
జిహ్వావాత్పరిదోషశ్చ హ్యామ్లపైత్తస్య లక్షణం,

తా. దప్పి, అరుచి, హీనస్వరముగలుగుట, నాలుక నోరు కంపువేయుట-ఈలక్షణములు గలిగి పులితేనుపులు వచ్చుటయే ఆమ్లపైత్యమని తెలియవలయును.

అమ్లపైత్యమునకు సుధానిధిరసము

గంధకం పారదం చాభ్ర మేలా గ్రంథిక కేసరమ్. 26
సమభాగయుతం ఖల్వే జీరకేణ చ మర్దితం,
కాచకుప్యాం నివేశ్యాథ ద్వియామంతు తుషాగ్నినా. 27
సాంగశీతలముద్ధృత్య ద్విగుంజం భక్షయేత్సదా,
శర్కరా మధుసంయుక్త మామ్లపైత్తవికారనుత్. 28

తా. శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన రసము, అభ్రకభస్మము, ఏలకులు, గ్రంథితగరము, నాగకేసరములు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి జీలకఱ్ఱరసముతో ఒకదినము మర్దించి, గాజుకుప్పెలో నునిచి ఉముకమంటలో ౨ ఝాములు వండి సాంగశీతలమున దీసి ౨ గురిగింజలయెత్తును తేనెతోగాని, లేక పంచదారతోగాని సేవించిన ఆమ్లపైత్యము హరించును.

స్వేదపైత్యలక్షణము

అతిస్వేదం చ దౌర్బల్యం దేహేఽంగం జలపూరితం,
అగ్నిమాంద్యం దృఢాపీడా స్వేదపైత్తం వినిర్దిశేత్. 29

తా. శరీరము దుర్బలముగ నుండుట, అంగముల నీరుపూరించి యుండుట, అగ్నిమాంద్యము, శరీరమున మిక్కుటముగ పీడ గలుగుట-ఈలక్షణములు గలిగి శరీరమంతట మిక్కుటముగ చెమట స్రవించుటయే స్వేదపైత్యమని తెలియవలయును.

స్వేదపైత్యమునకు అమృతేశ్వరరసము

రసం గంధం వత్సనాభం వాసా త్రికటుకం వచా,
జీరకం చిత్రకం శుంఠీ త్రిఫలా చ సమంసమమ్. 30
తత స్తత్ఖల్వమధ్యస్థం త్రియామం మర్దయే ద్భిషక్,
కాచకుప్యాం నివేశ్యాథ త్రిదినం మందవహ్నినా. 31

సాంగశీతలముద్ధృత్య ద్విగుంజం భక్షయేత్సదా,
శర్కరా మధుసంయుక్తం స్వేదపైత్తవికారనుత్. 32

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన నాభి, అడ్డసరము, త్రికటుకములు, వస, జీలకఱ్ఱ, చిత్రమూలము, శొంఠి, త్రిఫలములు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి 3 ఝాములు నిమ్మపండ్లరసముతో మర్దించి గాజుకుప్పెలో నునిచి మందాగ్నిలో 3 దినములు పాకముచేసి సాంగశీతలమున దీసి ౨ గురిగింజలయెత్తును పంచదారతోగాని, లేక తేనెతోగాని సేవించిన స్వేదపైత్యము హరించును.

స్వేదపైత్యమునకు మృతసంజీవనీరసము

మారీచం టంకణం సూతం మాక్షికం కాంతలోహకం,
అభ్రకం చ సమాంశాని వహ్నిక్వాథేన మర్దయేత్. 33
కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాయంత్రపాచితం,
మరీచార్ద్రకసంయుక్తం ద్విగుంజం భక్షయేత్సదా. 34
పథ్యం క్షీరోదనంచైవ తాపే దద్యాత్సశర్కరం,
ప్రాతఃకాలే తు సేవేత సద్యస్స్వేదో విముంచతి. (చరకే) 35

తా. మిరియాలు, శుద్ధిచేసిన వెలిగారము, రసభస్మము, శుద్ధిచేసిన హేమమాక్షికము, కాంతభస్మము, లోహభస్మము, అభ్రకభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి చిత్రమూలకషాయముతో మర్దించి గాజుకుప్పెలో నునిచి వాలుకాయంత్రమున ౧ ఝాము వండి అందు రెండుగురిగింజలయెత్తును మిరియపుచూర్ణము, అల్లపురసము అనువానియనుపానముతో ప్రాతఃకాలమున సేవింపుచుండిన స్వేదపైత్యము తత్క్షణమున హరించును. దీనియందు పాలఅన్నమును భుజించుట పథ్యకరము. తాపము జనించిన పైపథ్యములో పంచదారనుకూడా కలిపి భక్షింపవలయును.

ఉన్మాదపైత్యలక్షణము

విదాహశ్చ వికారశ్చ వాంతిర్మూర్ఛా పరిభ్రమః,
మలమూత్రం త్యజేచ్ఛీఘ్రమున్మత్తస్య చ దోషకృత్. 36

తా. శరీరము విదాహించుట, వికారము వాంతి, మూర్ఛగలుగుట, శరీరము తిరుగుట, మలమూత్రములు శీఘ్రముగ వెడలుట-ఈలక్షణములు గలిగి ఉన్మాదపుమాటలాడుటయే ఉన్మాదపైత్యమని తెలియవలయును.

### ఉన్మాదపైత్యమునకు చండభైరవరసము

రసభస్మ త్రయో భాగా హేమభస్మైకభాగకం,
టంకణం రవిదుగ్ధేన సర్వం తుల్యం చ ఖల్వకే. 37
ద్వియామం మర్దయే త్సమ్య గుద్ధృత్య గోళకం తథా,
కాచకుప్యాం నివేశ్యాథ సప్తవస్త్రం మృదా లిపేత్. 38
వాలుకాయంత్రమధ్యస్థం ద్వియామం మందవహ్నినా,
సాంగశీతలముద్ధృత్య ద్విగుంజం వటకీకృతమ్. 39
శర్కరా మధుసంయుక్త మున్మత్తపైత్తనాశకృత్,

తా. రసభస్మము 3 భాగములు, సువర్ణభస్మము ౧ భాగము, శుద్ధిచేసిన వెలిగారము ౪ భాగములు-ఇటుల వీనిని ఖల్వములో నునిచి జిల్లేడు పాలతో రెండుఝాములు మర్దించి ఉంటజేసి గాజుకుప్పెలో నునిచి ఏడుచీలమన్ను లిచ్చి వాలుకాయంత్రమున మందాగ్నితో రెండుఝాములు వండి సాంగశీతలమున దీసి రెండుగురిగింజలయెత్తును పంచదారతో గాని, లేక తేనెతో గాని సేవించిన ఉన్మాదపైత్యము హరించును.

### ఉన్మాదపైత్యమునకు పిప్పలీఘృతము

పిప్పలీ ద్విగుణం సర్పి స్సర్పిషో ద్విగుణం సితా. 40
సితాయా ద్విగుణం క్షౌద్రం క్షౌద్రస్యాష్టగుణం పయః,
ఏతద్ధి పాచితంచైవ ప్రాతరుత్థాయ భక్షయేత్. 41
ఉన్మాదం చ విదాహం చ సర్వపైత్తవికారనుత్,

తా. నెయ్యి ౨ భాగములు, తేనె ౮ భాగములు, పాలు ౬౪ భాగములు-ఇటుల వాని నేకముజేసి సూక్ష్మాగ్నితో వండి ఘృతము తేనె పక్వమగునపుడందు పిప్పలిచూర్ణము ౧ భాగము, పంచదార ౪ భాగములు కలిపి దించుకొని ప్రాతఃకాలమున ఒకటిన్నరతులముచొప్పున సేవింపుచుండిన ఉన్మాదపైత్యము, విదాహము, సర్వపైత్యములు హరించును.

### పుండరీకపైత్యలక్షణము

దేహమాంతం పుండరీకం రోమహర్షణకండుతా. 42
ఉష్ణాతిశయనం తృష్ణా పుండరీకే చ పైత్తకే,

తా. గగుర్పొడుచుట, శరీరమున దురద గలుగుట, శరీరము కడు ఉష్ణముగ

నుండుట, దప్పిగలుగుట-ఈలక్షణములుగలిగి శరీరమున తెల్లదామరపువ్వువంటి దద్దులు గలుగుటయే పుండరీకపైత్యమని తెలియవలయును.

పుండరీకపైత్యమునకు విశ్వమూర్తిరసము

శుద్ధసూతం సమం గంధం తామ్రభస్మ మనశ్శిలా. 43
చందనం త్రిఫలా వాసా కుష్ఠ జీరక దీప్యకం,
ఏతాని సమభాగాని హంసపాదిరసేన చ. 44
తతస్సర్వం ఖల్వమధ్యే త్రిదినం మర్దయేద్భిషక్,
తతస్తు గోళకం కృత్వా వజ్రమూషాంతరే క్షిపేత్. 45
భూధరేయంత్రకే పాచ్యం సాంగశీతలముద్ధరేత్,
ద్విగుంజం భక్షయే న్నిత్యం పుండరీపైత్తనాశనమ్. 46

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, తామ్రభస్మము, శుద్ధిజేసిన మణిశిల, శ్రీగంధము, త్రిఫలములు, అడ్డసరము, చెంగల్వకోష్టు, జీలకఱ్ఱ, ఓమము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో 3 దినములు మర్దించి-ఉంటచేసి వజ్రమూసలో నునిచి భూధరయంత్రమున పుటంబిడి సాంగశీతలమున దీసి రెండు గురిగింజలయెత్తును ప్రతిదినము సేవింపుచుండిన పుండరీకపైత్యము హరించును.

కరపాదపిత్తలక్షణము

కరపాదవిదాహశ్చావయవానాం చ శోషకృత్,
మధ్యే పిత్తస్య తృష్ణా చ కరపాదే చ పైత్తకే. 47

తా. అవయవములు ఎండుట, దప్పిగలుగుట-ఈలక్షణములు గలిగి అరికాళ్లు అరిచేతులు మండుటయే కరపాదపైత్యమని తెలియవలయును.

సర్వపైత్యములకు పాణిబద్ధరసము

గంధకం పారదంచైవ భస్మలోహాష్టకం సమం,
జీరకస్య కషాయేణ మర్దితం యామమాత్రకమ్. 48
కుప్పికాయాం వినిక్షిప్య వాలుకాగ్నిప్రయోజితం,
గాఢాగ్నౌ త్రిదినంచైవ సాంగశీతలముద్ధరేత్. 49
గుంజామాత్రం ప్రదాతవ్యం పైత్తే పాచకరే స్మృతం,
నిహన్యాత్సర్వపిత్తార్తిం యోగోఽయం పాణిబద్ధకః. 50

తా. శుద్ధిచేసిన గంధకము, శుద్ధిజేసిన రసము, ఉక్కుభస్మము, తగరభస్మము, రజతభస్మము, స్వర్ణభస్మము, ఇనుపభస్మము, నాగభస్మము, తామ్రభస్మము, కాంతభస్మము-వీనిని

సమభాగములుగ ఖల్వములో నునిచి జీలకఱ్ఱకషాయముతో ఒకఝామము మర్దించి గాజుకుప్పెలోనునిచి వాలుకాయంత్రమున మూడుదినములు గాఢాగ్నిలో వండి సాంగశీతలమున దీసి గురిగింజంతయెత్తును తేనె, పిప్పలిచూర్ణముతోనేని, లేక ఉసిరికెరసము, పంచదార వీనితోనేని సేవించిన కరపాదపైత్యము మొదలగు సర్వపైత్యములు హరించును.

## శీతపైత్యలక్షణము

అరుచి శ్శీతమంగేషు మందాగ్ని ర్భ్రమ కోపితా,
మహాపిత్తంచ మూర్ఛా చ శీతపిత్తం వినిర్దిశేత్. (చరకే) 51

తా. అరుచి, అగ్నిమాంద్యము గలుగుట, తబ్బిబ్బులాడుట, కోపము, కడు పైత్యము, మూర్ఛగలుగుట-ఈలక్షణములు గలిగి శరీరము కడుశీతలముగ నుండుటయే శీతపైత్యమని తెలియవలయును.

## శీతపైత్యమునకు పూర్ణాభ్రరసము

శుద్ధసూతం సమం గంధ మభ్రకం చ మనశ్శిలా,
మర్దితం వరుణా ద్రావై ర్మర్దయే ద్దివసద్వయమ్. 52
కాచకుప్యాం నివేశ్యాథ వాలుకాయంత్రకే పచేత్,
షడ్యామాంతే సముద్ధృత్య సూక్ష్మచూర్ణం తు కారయేత్. 53
ద్విగుంజం భక్షయే న్నిత్యం శీతపైత్తనివారణం,

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, అభ్రకభస్మము, శుద్ధిజేసిన మణిశిల-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి చూర్ణముచేసి ఉలిమిడిచెక్కరసముతో రెండు దినములు మర్దించి గాజుకుప్పెలో నునిచి వాలుకాయంత్రమున ౬ ఝాములు వండి సాంగశీతలమున దీసి మర్దించి సూక్ష్మచూర్ణముచేసి రెండు గురిగింజలయెత్తును తేనె, పిప్పలితోనేని, లేక నెయ్యి, మిరియపు చూర్ణముతోనేని ప్రతిదినము సేవింపుచుండిన శీతపైత్యము హరించును. (మఱియు నీశీతపైత్యము హరించుటకై బడబాగ్నిరసమునేని, లేక పాణిబద్ధరసమునేని, స్వయమగ్నిరసమునేని సేవింపవలయును.)

## మూర్ఛాపైత్యలక్షణము

అతిమూర్ఛాతిశీతం చ మూర్ఛం నచ ప్రతీక్షణమ్. 54
అతితృష్ణాంగశోషశ్చ మూర్ఛాపిత్తే చ విభ్రమః, (చరకే)

తా. కడుమూర్ఛగలుగుట, శరీరము కడుచల్లగనుండుట, కడుదప్పిగలుగుట, అంగ

ములు శోషించుట, భ్రమగలుగుట-ఈలక్షణములు గలిగి ప్రతిక్షణమును మూర్ఛ గలుగుటయే మూర్ఛాపైత్యమని తెలియవలయును.

మూర్ఛాపైత్యాంకుశరసము

శుద్ధపారద గంధం చ టంకణం చాభ్రభస్మకమ్. 55
ఏతాని సమభాగాని ఖల్వమధ్యే వినిక్షిపేత్,
భద్రముస్తకషాయేణ మర్దయే త్రిదినం తథా. 56
కాచకుప్యాం వినిక్షిప్య పుటమేకం తు భూధరం,
సాంగశీతలముద్ధృత్య గుంజామాత్రం ప్రదాపయేత్. 57
మూర్ఛాపిత్తవినాశాయ సర్వపైత్తనివారణం,

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన వెలిగారము, అభ్రకభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములోననిచి తుంగముస్తెలకషాయముతో మూడుదినములు మర్దించి గాజుకుప్పెలోనునిచి భూధరయంత్రమున పుటంబిడి సాంగశీతలమున దీసి మరల ఖల్వములో నునిచి తుంగముస్తెలకషాయముతో మర్దించి గురిగింజలంతమాత్రలు జేసి యందొకదానిని నారికడపుకాయనీరుతో సేవించిన మూర్ఛాపైత్యము, సర్వపైత్యములు హరించును. (సిందూరమును నారికడపుకాయ నీరుతో సేవించిన మూర్ఛాపైత్యము హరించును.)

మధురపైత్యలక్షణము

అరుచి ర్మధురోద్రేక ఉషఃకాలే చ కోపితా. 58
శిరోభ్రమణమాధుర్యం ఛర్ది రోమ్ణాం చ హర్షణం,
(మాధవనిదానే)

తా. నోరు రుచిలేకుండుట, ఉషఃకాలమున కోపముగలుగుట, తలతిరుగుట, వాంతిగలుగుట, రోమములు గగుర్పొడుచుట-ఈలక్షణములు గలిగి నోరు తీపిగనుండుటయే మధురపైత్యమని తెలియవలయును. (ఇది హరించుటకై బడబాగ్నిరసమునేని, పాణిబద్ధరసమునేని సేవింపవలయును.)

మధురపిత్తమునకు పైత్యకజాంకుశరసము

శుద్ధగంధక టంకం చ తాళకం చ మనశ్శిలా. 59
సర్వం హంసపదీ ద్రావై ర్దినమేకం విమర్దయేత్,
వాలుకాయంత్రకే పాచ్యం షడ్యామాంతం నిరుధ్య చ. 60
దేయా గుంజానుపానేన మధుపిత్తం వినాశయేత్,

తా. గంధకము, వెలిగారము, తాళకము, మణిశిల-వీనిని శుద్ధిచేసి సమభాగము లుగ ఖల్వములో నునిచి *హంసపాదియాకురసముతో ఒకదినము మర్దించి గాజుకుప్పెలో నునిచి వాలుకాయంత్రమున ౬ ఝాములు వండి గురిగింజయెత్తును అనుపానవిశేషము లతో సేవించిన మధురపిత్తము హరించును.

కుసుమపైత్యలక్షణము

ఆతాపో నాసికా రక్త మతితృష్ణా ప్రపీడనమ్. 61
క్వచిచ్ఛోణితవాహశ్చ కుసుమం శీర్షసంభవం,

(సిద్ధవిద్యాభూః)

తా. శరీరము మండుట, కడుదప్పి గలుగుట, ఒకానొకపుడు నోటనుండి నెత్తురు వెడలుట-ఈలక్షణములు గలిగి ముక్కున నెత్తురు గారుటయే కుసుమపైత్య మని తెలియ వలయును. ఇది శిరమున జనించును.

నాసికాకుసుమపైత్యవివరణము

శిరశ్శూలే తు సంజాతే వాతాద్ఘ్రాణాదసృక్స్రవేత్. 62
దాడిమీపుష్పదూర్వాశ్చ రసకర్పూరమాక్షికం,
సమం దుగ్ధం శిరోభ్యంగే నస్యే పానే సితా మధు. 63
దాపయే త్పిత్తరోగాచ్చ శిరశ్శూలేతు దారుణే, (అశ్వినీకల్పే)

తా. తలనొచ్చి ముక్కున నెత్తురుగారుటయే వాతకుసుమపైత్యమనియు, శిరమున మంటగలిగి శిరము శూలించి ముక్కున నెత్తురుగారుటయే పైత్యకుసుమమనియు తెలియ వలయును. వానియందు దానిమ్మపువ్వులను, గరికెవేళ్ళను పాలతో నూరి రసము పిడిచికొని అందు రసకర్పూరము, శుద్ధిజేసిన హేమమాక్షికము అనువానిని సమముగ కలిపి అభ్యంజ నము, నస్యము సేయుటయే కాక పంచదారను, తేనెను కలిపి సేవించిన రెండువిధములైన కుసుమపైత్యములు హరించును.

నాసికాకుసుమములకు ఉదుంబరాదికల్పము

ఉదుంబరఫలం పక్వం ఘృతపక్వం సితాయుతమ్. 64
ఏలా మరిచ సిందూరై ర్భక్షితం స్యాద్రక్తశాంతయే, (చరకే)

తా. మేడిపండ్లు, పంచదార, ఏలకులు, మిరియాలు అనువాని చూర్ణములో ఆవు నెయ్యి కలిపి వండి అందు సిందూరమునునిచి సేవించిన నాసికాకుసుమములు హరించును.

* హంసపాదియాకు—అనగా చెప్పుతట్టాకు.

నాసికాకుసుమములకు గజకేసరీరసము

శుద్ధసూతం విషం చాభ్రం గంధకం హింగు తాళకమ్. 65
ఏతాని సమభాగాని ఖల్వమధ్యే వినిక్షిపేత్,
మర్దయే ద్భృంగనీరేణ కాచకుప్యాంతరే క్షిపేత్. 66
వాలుకాయంత్రకే పాచ్యం దినైకం మందవహ్నినా,
స్వాంగశీతలముద్ధృత్య చణమాత్రం చ భక్షయేత్. 67
సుమపిత్తవినాశాయ సర్వపిత్తవినాశకః, (సిద్ధవిద్యాభూః)

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినవసనాభి, అభ్రకభస్మము, శుద్ధిజేసినగంధకము, శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసిన తాళకము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గుంటగలగరాకురసముతో ఒకదినము మర్దించి గాజుకుప్పెలో నునిచి ఒకదినము మందాగ్నిలో వాలుకాయంత్రమున వండి స్వాంగశీతలమున దీసి శనగగింజప్రమాణము తేనెతోగాని, లేక నేతితోగాని సేవించిన కుసుమపైత్యములు, సర్వపైత్యములు హరించును.

నాసికాకుసుమములకు నస్యము

నస్యం దాడిమపుష్పోత్థో రసో దూర్వా భవోఽథవా. 68
ఆమ్రాస్థితః పలాండోర్వా నాసికాచ్యుతరక్తజిత్, (బాహటే)

తా. దానిమ్మపువ్వు, గరికెవేళ్ళు అనువానినిగాని, లేక గరికెవేళ్ళు, మామిడిపప్పు అనువానినిగాని, (లేక ఇప్పపువ్వు, తెల్లనీరుల్లిగడ్డ అనువానినిగాని) చనుబాలతో నూరి నస్యము చేసినను, లేక తెల్లనీరుల్లిగడ్డను కుమ్ములో కుక్కి ఉడికించి రసముతీసి నస్యముచేసినను నాసికాకుసుమములు హరించును. (లేక జమ్మిఆకులను మూడు మిరియపుగింజలను ఉదకముతో నూరి నస్యముజేసినను, లేక పట్టుబట్టకాల్చినమసిని, గవ్వలభస్మమును, పైడిప్రత్తిపువ్వులరసముతో నూరి నస్యముచేసినను, లేక నాసికావాతచికిత్సలం జేసినను నాసికాకుసుమములు హరించును.)

క్రోధపైత్యలక్షణము

సదాచ తామసాచారో దుర్భాషా తీవ్రతాగుణః. 69
శిరోభ్రమణదోషశ్చ క్రోధపిత్తం వినిర్దిశేత్,

(మాధవనిదానే)

తా. దుర్భాషలాడుట, అన్నిపనులయందు తీవ్రముగ నడుచుట, తలతిరుగుట-ఈలక్షణములు గలిగి ఎల్లప్పుడు తామసక్రియల సేయుచుండుటయే క్రోధపైత్యమని తెలియవలయును.

## క్రోధపైత్యమునకు నారాచరసము

రసభస్మ సమం గంధం విషం మరిచ నాగరమ్. 70
త్రిక్షారం పంచలవణం సమభాగం చ ఖల్వకే,
జీరకస్య కషాయేణ ద్వియామాంతం విమర్దయేత్. 71
కాచకుప్యాంతరే క్షిప్త్వా వాలుకాయంత్రకే పచేత్,
శనై ర్మృద్వగ్నినా పాచ్యం సాంగశీతలముద్ధరేత్. 72
గుంజామాత్రం ప్రదాతవ్యం క్రోధపిత్తం వినశ్యతి,

తా. రసభస్మము, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసిన నాభి, మిరియాలు, శొంఠి, త్రిక్షారములు, పంచలవణములు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి జీలకఱ్ఱ కషాయముతో రెండుఝాములు మర్దించి గాజుకుప్పెలో నునిచి చీలమన్ను లేపనముచేసి వాలుకాయంత్రమున మృద్వగ్నిలో ४ ఝాములు మెల్లగవండి సాంగశీతలమున దీసి గురిగింజప్రమాణమును తేనెతోగాని, లేక జీలకఱ్ఱ, పంచదార అనువాని యనుపానముతోగాని సేవించిన క్రోధపైత్యము హరించును. (మఱియు దీనినే ఆమ్లపైత్యమునందును సేవింపవగును.)

## భ్రంశపైత్యలక్షణము

అపభ్రంశో మతిస్తంభ స్సదాచింతా నిరీక్షణమ్. 73
సంభాషణమతిక్రోధా ద్భ్రంశపిత్తస్య లక్షణం,

(మాధవనిదానే)

తా. ఎరుగనటులుండుట, సదా చింతించుట, రెప్పపాటువేయక చూచుట; కడు కోపముగ మాటలాడుట - ఈలక్షణములుగలిగి తబ్బిబ్బులాడుటయే భ్రంశపిత్తమని తెలియవలయును.

## భ్రంశపైత్యమునకు భృంగరాజచూర్ణము

భేకరాజరసే ప్రస్థే సాధితం మరిచాంజలిమ్. 74
అభయా పిప్పలీభార్జ్గి సైంధవం పుష్కరాహ్వయం,
అక్షప్రమాణకం చూర్ణం మిశ్రయిత్వా మధుప్లుతమ్. 75
భక్షయేత్ప్రాతరుత్థాయ భ్రంశపిత్తం నియచ్ఛతి,

తా. అంజలిప్రమాణముగల మిరియాలను ఒకప్రస్థము గుంటగలగరాకు రసముతో భావనజేసి ఎండించి చూర్ణముచేసి అందు కరక్కాయలు, పిప్పళ్ళు, గంటుభా

రంగి, సైంధవలవణము, పుష్కరమూలము అనువానిలో ప్రతిదానిచూర్ణమును అర్థ ప్రమాణము గలిపి గచ్చకాయంతచూర్ణమును ప్రాతఃకాలమున తేనెతో సేవించిన భ్రంశపిత్తము హరించును.

## శిరఃపిత్తలక్షణము

శిరోభ్రమణ సంతాప మరుచ్యాప్యతిపీడనమ్. 76
ఆమ్లోద్గారశ్చ హృద్రోగ శ్శిరఃపిత్తస్య లక్షణం,

తా. శరీరతాపము, కడు అరుచిగలుగుట, పులితేనుపులు వచ్చుట, ఱొమ్ము నొచ్చుట-ఈలక్షణములుగలిగి తలతిరుగుటయే శిరఃపైత్యమని తెలియవలయును.

## శిరఃపిత్తమునకు పైత్యకాలాంతకరసము

శుద్ధసూతం సమం గంధం నేపాళం దరదం విషమ్. 77
ఖల్వమధ్యే వినిక్షిప్య వహ్నిమూలకషాయకే,
మర్దితం తద్ద్వియామంచ డోలాయంత్రే దినం పచేత్. 78
స్నుహీక్షీరే విమర్ద్యాథ ద్వియామం ఖల్వమధ్యకే,
గుంజామాత్రం ప్రదాతవ్యం శిరఃపిత్తం నియచ్ఛతి. 79

తా. రసము, గంధకము, నేపాళములు, ఇంగిలీకము, నాభి-వీనిని శుద్ధి జేసి సమభాగములుగ ఖల్వములో నునిచి చిత్రమూల కషాయములో రెండుఝాములు మర్దించి చిత్రమూలకషాయముతోనే ఒకదినము డోలాయంత్రమున వండి బొంత జెముడుపాలతో రెండుఝాములు మర్దించి గురిగింజంత మాత్రలుజేసి యందొకదానిని ఆవునెయ్యి సున్నపుతేటనీరు అనువానితోగాని, లేక బొల్లిబూరుగకషాయము పిప్పలి అనువానితోగాని, లేక జీలకఱ్ఱ, పంచదార అనువానితోగాని సేవింపుచుండిన శిరః పైత్యము హరించును.

## క్షుధాపైత్యలక్షణము

క్షుధా శీఘ్రాతిభుంజీత దేహమాంతం విదాహికా,
నేత్రశూలం తథా హిక్కా క్షుధాపిత్తస్య లక్షణమ్. 80

తా. కడుశీఘ్రముగ మిక్కుటముగ భుజించుట - శరీరమంతట విదాహించుట, నేత్రములు శూలించుట, ఎక్కిళ్ళుగలుగుట, ఈలక్షణములు గలిగి మిక్కుటముగ ఆకలి గలుగుటయే క్షుధాపైత్యమని తెలియవలయును.

## క్షుధాపైత్యమునకు పిత్తభంజనరసము

రస గంధాభ్రకం తుల్యం దినమేకం విమర్దయేత్,

భృంగరాజరసే ఖల్వే వజ్రమూషాంతరే క్షిపేత్, 81
కుక్కుటీపుటపాకే చ స్వాంగశీతలముద్ధరేత్,
ఆర్ద్రికస్యానుపానేన గుంజామాత్రం పిబేత్తథా. 82
క్షుధాపిత్తవినాశస్స్యాత్సర్వపిత్తవినాశకః,

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, అభ్రకభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గుంటగలగరాకురసముతో ఒకదినము మర్దించి వజ్రమూషలోగాని, గాజుకుప్పెలోగాని నునిచి కుక్కుటపుటంబిడి స్వాంగశీతలముగ దీసి గురిగింజప్రమాణమును అల్లపురసముతో సేవించిన క్షుధాపైత్యము సర్వపైత్యములు హరించును.

### తృష్ణాపైత్యలక్షణము

ఉషఃకాలేచాతితృష్ణా శీతలస్య సముద్భవః.  83
కుక్షౌ కంఠే విదాహశ్చ తృష్ణాపైత్తస్య లక్షణం,

తా. చలువపుట్టుట, కడుపు, కంఠము వీనియందు విదాహించుట - ఈలక్షణములు గలిగి ప్రాతఃకాలమున కడుదప్పిగలుగుటయే తృష్ణాపైత్యమని తెలియవలయును.

### తృష్ణాపైత్యమునకు పైత్యహింసకరసము

విషం మణిశిలా సూతం గంధకం టంకణం కణా. 84
ధూర్తబీజం సమం ఖల్వే దినం హంసపదీరసే,
మర్దితం కజ్జలీం కృత్వా శరావసంపుటే పచేత్. 85
స్నుహీక్షీరేణ సంమర్ద్యం గుంజామాత్రం పిబేదను,
సర్వపైత్తవినాశస్స్యాత్తృష్ణాపిత్తం చ నశ్యతి. 86

తా. శుద్ధిచేసిన నాభి, శుద్ధిచేసిన మణిశిల, శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిజేసిన వెలిగారము, పిప్పళ్ళు, శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో ఒకదినము కజ్జలిగ మర్దించి మూకుళ్ళలో నునిచి చీలమన్ను లేపనముచేసి పాకముజేసి స్వాంగశీతలమున దీసి మరల ఖల్వములో నునిచి బొంతజెముడుపాలతో మర్దించి గురిగింజంత మాత్రలుజేసి యందొకదానిని కురువేరు కషాయానుపానముతోగాని, లేక ఉసిరికెరసముతోగాని సేవించిన తృష్ణాపైత్యము సర్వపైత్యములు హరించును.

### తృష్ణాపైత్యమునకు నారికేళయోగము

నారికేళస్య తోయేన సంమిశ్రం కదళీఫలం,

భ్రమ తృష్ణా జ్వరహరం వృష్యం చక్షుష్యముత్తమమ్. 87

తా. నారికడపునీరులో అరటిపండును కలిపి సేవించిన భ్రమ, తృష్ణాపిత్తము, జ్వరము హరించుటయేగాక వీర్యవృద్ధి నేత్రములకు హితము సగా గలుగును.

తృష్ణాపైత్యమునకు ధాన్యకాదియోగము

ధాన్యకం కుష్ఠ పిష్ఠం చ నారికేళజలం సితా,
పీతం పైత్తవికారే తు తృష్ణాపైత్తవినాశనమ్. 88
ధారోష్ణం శర్కరాయుక్తం పిబేత్ప్రాతర్నరో యది,
కామిలా దాహశమనం రూక్షా తృష్ణాహరం తథా. 89

తా. కొతిమెర్లు, చెంగల్వకోష్టు - వీనిని చూర్ణముజేసి నారికడపుకాయనీరులో కలిపి అందు శర్కరవైచి పానముచేసిన తృష్ణాపైత్యము హరించును. లేక ధారోష్ణములో శర్కర కలిపి ప్రాతఃకాలమున సేవించిన కామిల, దాహము, రూక్ష, తృష్ణాపైత్యము హరించును.

దుర్భావపైత్యలక్షణము

శరీరకార్శ్యయుక్తశ్చ సర్వసంగవివర్జితః,
స్వప్నే భ్రంశో వపుశ్శీర్ణ దుర్భావపైత్తకం విదుః. 90

తా. శరీరము కృశించుట, ఏవస్తువయం దాసక్తి లేకుండుట, దుస్స్వప్నముల గాంచుట, శరీరము శైథిల్యమును జెందుట - ఈలక్షణములు గలిగి దుర్భాషలాడుటయే దుర్భావపైత్యమని తెలియవలయును. (ఇది హరించుటకై ఆవర్ణాదిపైత్యచికిత్సలం జేయవలయును.)

చర్మపైత్యలక్షణము

జిహ్వాంగే చర్మశీర్ణత్వం కరపాదోష్ఠకాదికే,
శీఘ్రకండ్వబలం హిక్కా చర్మపిత్తస్యదోషజాః. 91

తా. నాలుక, శరీరము, చేతులు, కాళ్ళు, పెదవులు మొదలగువానియందు చర్మము వూడుట, శరీరమున కడుదురద గలుగుట, సత్వములేకుండుట, ఎక్కిళ్లు గలుగుట - ఈలక్షణములు గలిగి చర్మమువూడుటయే చర్మపైత్యమని తెలియవలయును. (ఇది హరించుటకై రసకర్పూరమును సేవింపవలయును. మఱియు రసఉబ్బను చేయవలయును.)

చర్మపైత్యమునకు సిత్తవిధ్వంసనరసము

శుద్ధసూతం విషం చాభ్రం తూత్థషణం గంధ టంకణం,

ధూర్తబీజం సైంధవం చ తుల్యాం తుల్యాం విచూర్ణితమ్. 92
ఖల్వమధ్యే వినిక్షిప్య కటిల్లద్రవమర్దితమ్,
వజ్రమూషా గతం కృత్వా వాలుకాయంత్రకే పచేత్. 93
ద్వియామాంతే సముద్ధృత్య మాష మేవానుపానతః,
భక్షయే చ్చర్మపైత్తే తు సర్వపైత్తనివారణమ్. 94

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన నాభి, అభ్రకభస్మము, త్రికటుకములు, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన వెలిగారము, శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు, సైంధవలవణము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి కాకరాకురసముతో మర్దించి కుప్పెలో బెట్టి వాలుకాయంత్రమున రెండుఝాములు వండి స్వాంగశీతలమున దీసి మాషప్రమాణమును హంసపాదియాకురసము, పావుసేరునాటాకు, తులము మేకనెయ్యి, మిరియపుచూర్ణము అనువాసితోగాని, లేక బోడతరపాకురసముతోగాని, లేక తేనె, పంచదారతోగాని సేవించిన చర్మపైత్యము సర్వపైత్యములు హరించును.

### దుర్గంధపైత్యలక్షణము

దేహం దుర్గంధ మలినం తథా స్వేదశ్చ పాండురం,
కుక్షావుష్ణం బహిశ్శీతం దుర్గంధే పిత్తకే విదుః. 95

తా. శరీరము కడుమలినముగ నుండుట, చెమట గలుగుట, శరీరము పాండురవర్ణముగ నుండుట, కడుపులో మండుట, వెలపట శీతలముగ నుండుట - ఈలక్షణములు గలిగి శరీరము దుర్గంధముగ నుండుటయే దుర్గంధపైత్యమని తెలియవలయును. (ఇది హరించుటకై పైత్యాంతకరసమునుగాని, లేక బడబాగ్ని రసమునుగాని సేవింపవలయును.)

### మదనపైత్యలక్షణము

దేహస్య మదనం మూర్ఛా స్వేదస్స్యా చ్చర్మపీడితం,
శిరోనేత్రభ్రమశ్చైవ మదనపిత్తలక్షణమ్. 96

తా. మూర్ఛ, చెమట గలుగుట, చర్మమువూడుట, తల, నేత్రములు తిరుగుట - ఈలక్షణములు గలిగి శరీరము మదమెక్కినట్టుండుటయే మదనపైత్యమని తెలియవలయును.

### మదనపైత్యమునకు శ్రీరామబాణరసము

శుద్ధసూతం విషం చాభ్రం దినం ఖల్వే విమర్దయేత్,
కాకజంఘా కషాయేణ డోలాయంత్రే ద్వియామకమ్. 97

ఆర్ద్రకస్యానుపానేన మదనపైత్తనాశనమ్. 93

తా. శుద్ధిచేసిన రసకర్పూరము, శుద్ధిజేసినవసనాభి, అభ్రకభస్మము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి ఒకదినము వెలుమసంధికషాయముతో మర్దించి డోలాయంత్రములో రెండుఝాములు వెలుమసంధికషాయముతోడనే వండి గురిగింజ ప్రమాణమును అల్లపురసానుపానముతో సేవించిన మదనపైత్యము హరించును.

విసర్పిపైత్యలక్షణము

సిద్మం చ సర్వాంగగ మభ్రవర్ణః క్రోధోఽతికండూరరుచి ర్మహీయసీ,
చిరప్రవృత్తి ర్బలహీనతా చ విసర్పిపిత్తం తదసాధ్యకం విదుః. 99
(ఆయుర్వేదే)

తా. శరీరము మెరయుట, కోపము, శరీరమున కడు దురద, కడు అరుచి, పనులయం దాలస్యముగలుగుట, సత్వములేకుండుట - ఈలక్షణములుగలిగి శరీరమంతట తోలు శిబ్బెమువలె రాలుటయే విసర్పిపైత్యమని తెలియవలయును. ఇది అసాధ్యము.

విస్తీర్ణమండలైస్సాంద్రైః ఖండూభి శ్శోణితప్రభైః,
శీతపిత్తం విజానీయా త్తచ్చికిత్సితముచ్యతే. (నిత్యనాథీయే) 100

తా. శరీరమున వెడలుపాటి మండలములు గలిగి దళమై దురదతోగూడి ఎఱ్ఱనై యుండుటయే శీతపిత్తవిసర్పి యని తెలియవలయు. (ఇది యాప్యము.) ఇక దానికి చికిత్సను వచించెదను.

విసర్పిపైత్యమునకు పిత్తకులాంతకరసము

రసగంధామృతం తీక్ష్ణం తుల్యమౌదుంబరం సమం,
హంసపాదరసైః ఖల్వే మర్దితం దివసత్రయమ్. 101
కాచకుప్యాం నివేశ్యాథ విలేప్య వస్త్రమృత్తికాం,
వాలుకాయంత్రకే పాచ్యం శనైర్మృద్వగ్నినా తథా. 102
ద్వియామం చ సముద్ధృత్య చూర్ణయే న్మాషమాత్రకం,
జీరకస్యానుపానేన విసర్పిపైత్తనాశనమ్. 103

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసిననాభి, ఉక్కుభస్మము, తామ్రభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో మూడుదినములు మర్దించి గాజుకుప్పెలోనునిచి చీలమన్ను లేపనము జేసి ఎండించి వాలుకాయంత్రమున రెండుఝాములు మృద్వగ్నిలో వండి సాంగశీతలమున దీసి ఖల్వములో నునిచి మోదుగచెక్కరసముతో మర్దించి మాషప్రమాణమంత మాత్రలుజేసి అందొక

దానిని జీలకఱ్ఱకషాయానుపానముతోగాని, లేక చంద్రచెక్కరసముతోగాని లేక చంద్రచెక్క తగరంచివిత్తులు అనువానికషాయముతోగాని నాలుగుమాసములు సేవింపుచుండిన శీతపైత్యవిసర్పి హరించును. (మఱియు దీనిని తేనె పిప్పలితో సేవించిన గుబులు గల పైత్యములు హరించును.)

శీతపైత్యవిసర్పికి లేపనములు

క్షారసింధూత్థతైలేన గాత్రాభ్యంగం ప్రయోజయేత్,
శీతపైత్తవినాశాయ యోగోఽయం కథితో బుధైః. 104

తా. యవక్షారము, సర్జక్షారము, సైంధవలవణము, నూనె కలిపి శరీరమునకు లేపనము సేయుచుండిన శీతపైత్యవిసర్పి హరించును.

అభ్యంగం తిక్తతైలేన శీతసోష్ణాంబుభిర్నిశి. 105

తా. చేతిబీరవిత్తులతైలముతీసి శరీరమునకు లేపనముజేసికొని రాత్రులయం దుష్ణోదకములో స్నానముచేసిన శీతపైత్యవిసర్పి హరించును.

సిద్ధార్థరజనీకల్కం ప్రపున్నాటతిలైస్సహ,
తిక్తతైలేన సంమిశ్రం పిత్తోద్వర్తనకే హితమ్. 106

తా. ఆవాలు, పసపు, తరగంచివిత్తులు, నువ్వులనూనె-వీనిని సమముగ కల్కము చేసి అందు చేతిబీరవిత్తుల తైలమును కలిపి మూడునెలలు లేపనము సేయుచుండిన శీతపిత్తవిసర్పి హరించును.

కపిత్థ శిగ్రుపత్రంచ నవనీతం సమంయుతం,
ముహుురుద్వర్తితం చైవ శీతపిత్తహరం పరమ్. 107

తా. వెలగాకురసము, మునగాకురసము, వెన్న వీని నేకముచేసి శరీరమునందు పలుమారు లేపనముసేయుచుండిన శీతపిత్త విసర్పి హరించును. (ఇది హరించుటకై గంధక కల్పమును సగా సేవింపందగును.)

రక్తపైత్యలక్షణము

అథాన్యత్సంప్రవక్ష్యామి సంక్షిప్తం సూక్తముత్తమం,
ఆయుర్వేదోపదేశేఽస్మిన్ రక్తపిత్తం నిగద్యతే. 108

తా. ఇఁక ఆయుర్వేదమున జెప్పంబడినప్రకారము రక్తపిత్తలక్షణమును సంక్షిప్తముగ వచించెదను.

ఉష్ణామ్ల లవణ క్షార కటుభిః పిత్తదూషణైః,
యకృత్ప్లీహాశ్రితం రక్తమూర్ధ్వంచాధఃప్రవర్తతే. (ఆయుర్వేదే)

తా. ఉష్ణద్రవ్యములు, పులుసు, ఉప్పు, యవక్షారము, సర్జక్షారము, కారము, పిత్తవికారద్రవ్యములు - ఈ మొదలగువానిసేవసవలన [1]యకృత్తు [2]ప్లీహాములయందు రక్తము ప్రవేశించి ఊర్ధ్వాధోముఖములుగ వెడలుటయే రక్తపైత్యమని తెలియవలయును.

రక్తపైత్యవర్ణవివరణము

వాతే శ్యామారుణం రూక్షే శోణితం తనుఫేనిలం,
కఫజ స్నిగ్ధ మాపాండు పిచ్ఛిలం బహుళం తథా. 110

తా. వాతజనితరక్తము నలుపుగ, ఎఱ్ఱగ, పిత్తజనితరక్తము సూక్ష్మమైన నురుగు గలదిగ, స్నిగ్ధముగ, శ్లేష్మజనితరక్తము చిక్కగ, ఒకింత తెలుపుగ, బంకగ అధికముగ నుండును.

రక్తపిత్తసాధ్యాసాధ్యములు

అధోగమానిలం యాప్య మసాధ్యం శ్లేష్మమూర్ధ్వగం,
కఫానిలసముద్భూతం దుశ్చికిత్స్యం ద్విమార్గగమ్. 111

తా. వాతజనితరక్తము గుదద్వారమువలన వెడలును. ఇది యాప్యము. శ్లేష్మజనిత రక్తము నోటివలన వెడలును. ఇది సాధ్యము. ఏకకాలంబున వాతశ్లేష్మములు ప్రకోపించి గుదము, నోరు అనువానిమూలముగ వెడలును. ఇది అసాధ్యము.

రక్తపిత్తనివర్తకోపాయములు

విధేయం రక్తపిత్తే చ యథాశక్తివిలంఘనం,
అధోగే వమనం శస్త మూర్ధ్వగేతు విరేచనమ్. 112

తా. రక్తపైత్యము నివర్తించుటకై శక్త్యనుగుణముగ లంఘనమును, రక్తము అధోముఖముగ బ్రవర్తించిన వమనమును, ఊర్ధ్వముగ బ్రవర్తించిన విరేచనమును జేయింపవలయును.

జ్వరాదులయందు చికిత్సానిషేధకాలము

జ్వరే తథాతిసారే చ రక్తపైత్తే దృగామయే,
ఆదౌ నప్రతికర్తవ్యం వ్యాధివేగశ్చ దుర్జయః. (చరకే) 113

తా. జ్వరము, అతిసారము, రక్తపిత్తము, నేత్రరోగము ఇవి జనించునపుడు వానియందు వేగం బధికముగ నుండుటవలన తొలుతనే చికిత్స జేయఁజనదు.

---

1 యకృత్తన కడుపులోని క్లోమముక్రింద నుండెడి నల్లనిమాంసదళము. 2 ప్లీహమన హృదయమునకు వామభాగమునందుండెడి పచ్చనిమాంసము.

### ప్రకారాంతరరక్తపైత్యలక్షణము

ఘర్మ వ్యాయామ శోకాధ్య వ్యవాయై రతిసేవితైః,
తీక్ష్ణోష్ణ క్షార లవణై రమ్లైః కటుభిరేవ చ. 114
పిత్తం విదగ్ధం స్వగుణై ర్విదహత్యాశు శోణితం,
తతః ప్రవర్తతే రక్త మూర్ధ్వవాధో ద్విధాపి వా. 115
(నిత్యనాథీయే)

తా. మిక్కుటముగ ఎండలో సంచరించుట, ఆయాసము జెందుట, దుఃఖించుట, మార్గము నడచుట, మైథునము సేయుట, మిరపకాయలు మొదలగు తీక్ష్ణపదార్థములను, అగ్నితాపమును, యవక్షారము, ఉప్పు, పులుసు, కారము గలద్రవ్యములను మిక్కుటముగ సేవించుట, వీనివలన పిత్తము ప్రకోపించి తీవ్రముగ ద్రవించి దుర్గంధయుక్తమై తీవ్రముగ రక్తమును తపింపంజేసి ఊర్ధ్వమార్గమువలనగాని, లేక అధోమార్గములవలనగాని, లేక ఇరుమార్గములవలనగాని స్రవింపంజేయును.

### ఊర్ధ్వాధోగత రక్తపిత్తలక్షణము

ఊర్ధ్వం నాసాక్షికర్ణాస్యైర్మేఢ్రయోనిగుదైరధః,
కుపితం రోమకూపైశ్చ సమస్తైస్తత్ప్రవర్తతే. 116

తా. మఱియు రక్తపిత్తము, ఊర్ధ్వగతంబైన ముక్కు, నేత్రములు, చెవులు, నోరు అనువానివలనను, అధోగతంబైన మేఢ్రము, యోని, గుదము అనువానివలనను, మిక్కుటముగ కుపితంబైన సర్వరోమకూపములవలనను రక్తము స్రవించును.

### వాతాదిరక్తపిత్తలక్షణము

సాంద్రం సపాండు సస్నేహం పిచ్ఛిలం చ కఫాన్వితం,
శ్యావమారుణం సఫేనం చ తనురూక్షం చ వాతికమ్. 117
రక్తపిత్తం కషాయాభం కృష్ణ గోమూత్రసన్నిభం,
మేచకాగారధూమాభ మంజనాభం చ పైత్తికమ్. 118
సంసృష్టలింగం సంసర్గా త్త్రిలింగం సాన్నిపాతికం,
ఊర్ధ్వగం కఫసంసృష్ట మధోగం మారుతానుగమ్. 119
ఊర్ధ్వం సాధ్య మధో యాప్య మసాధ్యం యుగపద్గతం,
యేనచోపహతో రక్తం రక్తపిత్తేన మానవః, 120
పశ్యేద్దృశ్యం వియచ్చాపి తచ్చాసాధ్యమసంశయమ్. (చరకే)

తా. రక్తపిత్తమున రక్తము దట్టముగ, ఒకింత పాండురవర్ణముగ, చమురుతో తుల్యముగ, బంకగ నుండిన శ్లేష్మయుక్తరక్తపిత్తమనియు, నలుపుగ, ఎఱ్ఱగ, ఒకింత నురుగుతో గూడినదిగ, తేటగ, రూక్షముగ నుండిన వాతికరక్తపిత్తమనియు, మఱ్ఱి పాదరి అనువాని కషాయవర్ణముగ, నల్లగ, గోమూత్రముతో తుల్యముగ, నెమలియాకె, లేక కరుదూపము, లేక కాటుక అనువానితో తుల్యముగ నుండిన పైత్తికరక్తపిత్తమనియు, రెండువర్ణములుగలదిగ నుండిన ద్వంద్వజనితరక్తపిత్తమనియు, మూడువర్ణములు గలదిగ నుండిన త్రిదోషజనితరక్తపిత్తమనియు తెలియవలయును. మఱియు ఊర్ధ్వముగ రక్తము వెడలిన శ్లేష్మగుణమనియు, అధోముఖముగ వెడలిన వాతగుణ మనియు తెలియవలయును. మఱియు రక్తము ఊర్ధ్వముగ వెడలిన సాధ్యము. అధోముఖముగ వెడలిన *యాప్యము. ఊర్ధ్వాధోముఖములుగ వెడలిన అసాధ్యము. మఱియు రక్తపిత్తమువలన పీడితుఁడుగ నుండు మానవుఁడు ఘటపటాది వస్తువులను, ఆకాశమును ఎఱ్ఱగ గాంచిన వానియొక్క రక్తపిత్తము నిస్సంశయముగ అసాధ్య మని తెలియవలయును.

### ప్రకారాంతరరక్తపిత్తలక్షణము

వాంతీ రక్తస్య హిక్కా చ తాంబూలస్య చ వర్జనమ్. 121
దృఢాస్యా ద్దేహపీడా చ రక్తపైత్తవికారకే, (అశ్వినీకల్పే)

తా. నెత్తురు గ్రక్కుట, ఎక్కిళ్లు గలుగుట, తాంబూలమునం దిచ్ఛలేకుండుట, శరీరమున దృఢమైనపీడ గలుగుట-ఈలక్షణములుగలది రక్తపైత్యమని తెలియవలయును.

### మేఢ్రమున స్రవింపుచుండు రక్తపిత్తమునకు ఉపచారము

రక్తాతిసారకర్మాణి ప్రయోజ్యాని భిషగ్వరైః,
రక్తప్రవాహికే కృత్స్నం మేఢ్రగే సన్నియోజయేత్. 122

తా. మేఢ్రమున రక్తము స్రవింపుచుండిన రక్తాతిసారచికిత్సలం జేయవలయును.

### అసృగ్దరరోగవివరణము

అపత్యమార్గగం స్త్రీణాం రక్తపిత్తమసృగ్దరం,
తదేవ ప్రదరం ప్రోక్తం క్రియాకార్యాస్రపైత్తకే. (మతాంతరే)

తా. స్త్రీలకు రక్తపైత్యము యోనిమార్గముగ వెడలుచుండిన అసృగ్దర మనియు ప్రదలమనియు జెప్పంబడును. ఇదిహరించుటకై రక్తపైత్యరోగచికిత్సలం జేయవలయును.

### సర్వరక్తపైత్యములకు రక్తమాహేశ్వరరసము

సూతం గంధం మృతం స్వర్ణం రసం సిందూర కాంతకం,

* యాప్య మన-సాధ్యాసాధ్యము.

అభ్రకం సర్వద్విగుణం తామ్రభస్మ ద్విభాగకమ్. 124
వంగం నాగం తథా రౌప్యం ప్రత్యేకం సూతసామ్యకం,
లోహభస్మ త్రిభాగం చ ముండసిందూరకం తథా. 125
సర్వం ఖల్వే వినిక్షిప్య మర్దయే దతియత్నతః,
ఖర్జూర యష్టికా ద్రాక్షా మధుపుష్పశతావరి. 126
లోధ్ర కాశ్మర్య హ్రీబేర పద్మకేసరపద్మకం,
మృణాల చందనోశీర నీలోత్పలఘునం సమమ్. 127
శ్రీగంధం వాలుకం కుష్ఠం బలా శాల్మలిమూలకం,
రంభా కందం గోక్షురకం మాధవీసహదేవికా. 128
పరూషణ కషాయేణ భావయే చ్ఛతవారకం,
వల్లప్రమాణకం చైవ శర్కరామృతశర్కరైః. 129
భక్షయే ద్ఘృతమిశ్రం తు రక్తపిత్తహరం పరం.
సర్వపైత్తహరో నృణాం రక్తమాహేశ్వరో రసః. 130

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, సువర్ణభస్మము, రససిందూరము, కాంతభస్మము - ఇవి దినుసు కొక్కొకభాగము, అభ్రకసిందూరము ౧౦ భాగములు, తామ్రభస్మము ౨ భాగములు, వంగభస్మము, నాగభస్మము, రజతభస్మము ఇవి దినుసు కొక్కొకభాగము, లోహభస్మము, ఇనుపభస్మము ఇవి దినుసు ఒకటింటికి 3 భాగములు- ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి ఖర్జూరపండు, యష్టిమధుకము, దీపద్రాక్ష, ఇప్పపువ్వు పిల్లిపీచరవేళ్ళు, లొద్దుగచెక్క, కవ్వపుగుమ్ముడుచెక్క, కురువేరు, తామరఅగరులు, పద్మకాష్ఠము, తామరతూండ్లు, రక్తచందనము, వట్టివేళ్ళు, నల్లకలువగడ్డలు, కుంగ ముస్తెలు, శ్రీగంధము, కూతురుబుడమ, చెంగల్వకోష్టు, ముత్తవపులగపువేళ్ళు, బూరుగ వేళ్ళు, అరటిగడ్డ, పల్లేరువేళ్లు, పువ్వులగురివెంద, సహదేవి, పేరీత అనువానిని సమభాగ ములుగ దంచి కషాయముకాచి దీనిచే నూరుమార్లు మర్దించి ఎండించి నూరుమార్లు భావన చేసి రెండువల్లములంతేసి మాత్రలుజేసి యందొకదానిని పంచదార, తిప్పసత్తు, ఆవు నెయ్యి అనువానియనుపానముతోడ సేవించిన రక్తపైత్యము, సర్వపైత్యములు హరించును. (మఱియు నిది ఆవర్ణపైత్యమునకు ప్రసిద్ధ మగుటంజేసి దానియందు సగా బ్రయోగిం పందగును.)

### రక్తపిత్తమునకు సిందూరకల్పము

తత్సిందూరం వినిక్షిప్య గుంజామాత్రప్రమాణకం,

మృద్వీకేన సితాయుక్తం రక్తపిత్తహరం పరమ్. 131
(సిందూరమణిదర్పణే)

తా. సిందూరము, దీపద్రాక్షపండు, పంచదార అనువాని నేకముచేసి మర్దించి వించినను (లేక ఈయనుపానముతోడనే పూర్ణచంద్రోదయమును సేవించినను) క్తపైత్యమును హరించును.

రక్తపిత్తమునకు రసభస్మకల్పము

రసభస్మకనిష్కం చ షడ్భాగం మృద్వీకాసితా,
క్షయ కాస తృషా ఛర్ది రక్తపిత్తవికారజిత్. 132

తా. రసభస్మము నిష్కప్రమాణము, దీపద్రాక్ష, పంచదార ఇవి ౬ నిష్కములు-టుల వీనిని మర్దించి ౩౦ మాత్రలుచేసి యందొకదానిని అడ్డసరపాకురసము, తేనె అను ాసితో సేవించిన క్షయ, కాస, దప్పి, వాంతి, రక్తపైత్యము హరించును.

రక్తపిత్తమునకు పైత్యముద్గరరసము

పారదం హింగులీకం చ హ్యూర్ధ్వయంత్రే చ మేళయేత్,
కుక్కుటాండరసో భాగో టంకణక్షారమేవ చ. 133
గంధకస్య తథా భాగో మృతేన పరిమర్దయేత్,
సిద్ధం రసం సమాధాయ జీరతోయేన దాపయేత్. 134
మాషత్రయం ప్రతిదినం గ్రహణీ రక్తదోషనుత్,
జ్వరదాహవినాశశ్చ రక్తపిత్తనిబర్హణః. (చరకే) 135

తా. రసము, ఇంగిలీకము-వీనిని సమభాగములుగ శుద్ధిజేసి మర్దించి ఊర్ధ్వయంత్రములో నునిచి రెండుర్యామములు పాకముజేసిన రసము పైకుండయందు వ్యాపించును. ఇట్టిసంస్కారముచే శుద్ధమైన పాదరసమును సాంగశీతలమున గ్రహింపవలయును. అట్టి పాదరసము, కోడిగుడ్లరసము, టంకణక్షారము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన వసనాభి వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి బాగుగమర్దించి మూడుమాషములంతేసి మాత్రలు జేసి యందొకదానిని జీలకఱ్ఱకషాయముతోగాని, లేక దీపద్రాక్ష, తేనె, పంచదార అనువానితోగాని, లేక ఖర్జూరపండు, తేనె అనువానితోగాని సేవించిన గ్రహణి, రక్తదోషము, జ్వరము, దాహము, రక్తపైత్యము హరించును.

రక్తపిత్తములకు మహాచంద్రకళారసము

ప్రత్యేకం తోలమానేన * సూతకాంతాభ్రభస్మకం,

---

* సూతకం తామ్రభస్మకమ్=రసము, తామ్రభస్మము.

సమంసమం గంధకం చ కృత్వా కజ్జలికాం తథా. 1[illegible]
ముస్తా మాలతి దూర్వాభిః కేతకీ స్తనవారిణా,
సహదేవ్యాః కుమార్యాశ్చ పర్పటస్య చ వారిణా. 1[illegible]
మృణాళస్య శతావ్హయా శ్శతావర్యారసేన చ,
భావయిత్వా ప్రయత్నేన దివసేదివసే పృథక్. 13[illegible]
త్వచా ద్ధుళూచికా సత్వం పర్పటోశీర మాగధి,
శ్రీగంధం శారిబై తేషాం సమాంశం సూక్ష్మచూర్ణితమ్. 13[illegible]
ద్రాక్షాదికకషాయేణ సప్తధా పరిభావయేత్,
ఛాయాయాం పరిశోష్యాథ వట్యః కార్యాశ్చణోపమాః. 14[illegible]
అయం చంద్రకళా నామ రసేంద్రః పరికీర్తితః,
సర్వపైత్తగదధ్వంసీ వాతపైత్తగదాపహః. 14[illegible]
అంతర్బాహ్యమహాదాహ విధ్వంసోఽయం మహారసః,
గ్రీష్మకాలే శరత్కాలే విశేషేణ ప్రశస్యతే. 14[illegible]
కురుతే నాగ్నిమాంద్యం చ మహాతాపజ్వరం హరేత్,
శోషం మూర్ఛాం హరత్యాశు స్త్రీణాం రక్తం మహాస్రవమ్. 143
ఊర్ధ్వాధో రక్తపిత్తం చ రక్తవాంతిం విశేషతః,
మూత్రకృచ్ఛ్రాణి సర్వాణి నాశయే న్నాత్రసంశయః. 144

(ఆయుర్వేదే)

తా. శుద్ధిజేసినరసము, కాంతభస్మము, అభ్రకభస్మము, శుద్ధిచేసిన గంధకము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి కాటుకతో సమానముగ మర్దించి పిదప భద్ర ముస్తెలు, విరజాజిపువ్వులు, గరికెవేళ్ళు, మొగలిచన్ను, సహదేవి, కలబంద, పర్పాట కము, తామరతూండ్లు, అడవిసదాప, పిల్లిపీచరవేళ్లు అనువానిని శీతోదకముతో ప్రత్యేక ప్రత్యేకములుగ దంచి రసముతీసి ప్రతిదానితో ఒక్కొకదినము మర్దించి అందు తిప్పసత్తు, పర్పాటకము, వట్టివేళ్ళు, పిప్పళ్లు, శ్రీగంధము, సుగంధపాల అనువానిని సమ భాగములుగ చూర్ణముజేసి కలిపి దీనిని ద్రాక్షపండు, ఖర్జూరపండు. పంచదార, ఇప్ప పువ్వు, తేనె, తవక్షీరి, యష్టిమధుకము అనువానికషాయముతో ఏడుదినములు భావన చేసి నీడనెండించి శనగగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని దీపద్రాక్షపండు, తేనె అనువానియనుపానముతోడ ఆరు మాసములు సేవించిన సర్వపైత్యములు, వాతపిత్త జనితరోగములు, కడుపులో మంట, వెలపట తారము, కడుదాహము, అగ్నిమాంద్యము,

కడుతాపజ్వరము, శోష, మూర్ఛ అనురోగములును, జాజికాయల చూర్ణయుక్తముగ పాకముచేయఁబడిన గోఘృతానుపానముతోడగాని, లేక మామిడిచెక్కరసములో సున్నపునీరు మూడునూనె బొట్లు కలిపిగాని, సేవించిన కుసుమరోగములును, ఖర్జూర పండు, తేనె లేక గుమ్మడుపండు, తేనె అనువానిలో దేనితోగాని సేవించిన ఊర్ధ్వ గత, అధోగతరక్తపైత్యములును, రక్తవాంతులును, మూర్ఛయు, సర్వమూత్రకృచ్ఛ్ర ములును, గుబులుగలపైత్యములును, అస్థిస్రావరోగములును హరించును. ఈచంద్రకళా రసము రక్తపిత్తముల బోకడుచుటయందు కడుప్రసిద్ధి జెందియున్నది. మఱియు నీరసము గ్రీష్మశరత్కాలములయందు విశేషముగ ప్రశస్తంబులు. (మఱియు దీనిని లవంగపుచూర్ణ యుక్తముగఁ జేయఁబడిన చిన్నంగిసమూలము, ఇంగువ, కరక్కాయ అనువానికషాయము తోడగాని, లేక లవంగపు చూర్ణయుక్తముగఁ జేయఁబడిన చిన్నంగియాకులరసముతోడ గాని, లేక శేలగంధము, వేల్చినఇంగువ, సైంధవలవణము, మిరియాలు, శొంఠి - అను వానిచూర్ణముతోడగాని, లేక జీడిగింజల చూర్ణముతోడగాని ఆరునెలలు భక్షించిన గుబులుగల పైత్యములు హరించును.

### రక్తపిత్తమునకు వేణుపత్త్రాదికషాయము

వేణుపత్రోశీరముస్తాః కేశీదాడిమవాలుకం,
క్వాథోనాగరమిశ్రస్తు రక్తపిత్తనిబర్హణః. 145

తా. వెదురాకు, వట్టివేళ్ళు, తుంగగడ్డలు, కురువేరు, దానిమ్మకాయ, కూతురు బుడమ-వీనిని సమభాగములుగ దంచి కషాయముకాచి అందు శొంఠి చూర్ణము గలిపి పానముచేసిన రక్తపైత్యము హరించును.

### రక్తపిత్తమునకు అలక్తకల్పము

అలక్తకరసం క్షౌద్రం రక్తవాంతిహరం భవేత్. 146

తా. లక్క, తేనె కలిపి సేవించిన రక్తపైత్యము హరించును.

### రక్తపిత్తమునకు కాకతుండ్యాదిచూర్ణము

పుష్యార్కే కాకతుండ్యాస్తు మూలం గోక్షీరభావితం,
రక్తవాంతిహరం పేయం ప్రత్యహం నిష్కనిష్కకమ్. 147

తా. పుష్యమీనక్షత్రము ఆదివారము కూడిన దినమునందు బండిగురిజవేరు చెక్కను దెచ్చి చూర్ణముజేసి ఆవుపాలతో ఏడుమారులు భావనచేసి ప్రతిదినము నిష్కప్రమాణమును సేవింపుచుండిన రక్తపిత్తము హరించును.

రక్తపిత్తమునకు చందనాదిఘృతము

చందనసారకషాయవిపక్వం శారిబయా మధుకేన సుసర్పిః,
శర్కరయా మధుకేన చ మిశ్రం శోణితపిత్తమపోహతి సద్యః. 148

తా. రక్తచందన కషాయములో సుగంధిపాల, ఇప్పపువ్వులు, నెయ్యి కలిపి ఘృతపక్వముగ కాచి అందు శర్కర, తేనె కలిపి సేవించిన తత్క్షణము రక్తపిత్తము హరించును.

రక్తపిత్తమునకు ఉశీరకాదిచూర్ణము

ఉశీరం తగరం శుంఠీ కంకోలం చందనద్వయం,
లవంగం పిప్పలీమూలం త్వక్షైలా నాగకేసరమ్. 149

ముస్తామలకకర్పూరం తవక్షీరీ చ పత్రకం,
కృష్ణాగరుసమం చూర్ణం సితాస్యాదష్టమాంశకమ్. 150
రక్తవాంతిం హృదస్తాపం నాశయే న్నాత్ర సంశయః,

తా. వట్టివేళ్లు, గ్రంథితగరము, శొంఠి, కంకోలములు, శ్రీగంధము, రక్తచందనము, లవంగములు, మోడి, పిప్పళ్ళు, ఏలకులు, నాగకేసరములు, తుంగముస్తెలు, ఉసిరికపప్పు, కర్పూరము, తవక్షీరి, ఆకుపత్రికె, కృష్ణాగరు-వీనిని సమభాగములుగ దంచి చూర్ణము చేసి దాని కెనిమిదవభాగము పంచదార గలిపి పిల్లియడుగంత భక్షించిన రక్తవాంతి, ఱొమ్ములో మంట నిస్సంశయముగ హరించును.

రక్తపిత్తమునందు పథ్యములు

ముద్గ గోధూమ షష్టికాశాలీ జాంగలజామిషమ్. 151
పక్వకూశ్మాండవత్తూర పటోలం తండులీయకం,
ద్రాక్షా దాడిమ ఖర్జూరం ధాత్రీఫలఘృతం మధు. 152
ప్రదరే రక్తపిత్తే చ పథ్యవర్గ ఉదాహృతః,

తా. పెసరకట్టు, గోధుమలు, అరువైదినములకు ఫలించినవడ్లు, జాంగలమాంసము, ముదురుగుమ్మడుకాయ, పొన్నగంటికూర, పొట్లకాయ, చిర్రికూర, ద్రాక్షపండు దానిమ్మపండు, ఖర్జూరపండు, ఉసిరికపప్పు, ఆవునెయ్యి, తేనె ఇవి రక్తపైత్యరోగులకు కుసుమరోగులకు పథ్యకరంబులు.

రక్తపిత్తమునం దపథ్యములు

కట్వామ్ల లవణ క్షారం మత్స్య మద్య విదాహినః. 153

మాషానిష్పావతిలజ కుళుత్థ లశునం దధి,
ప్రదరే రక్త పిత్తే చ హ్యాపథ్యమితి కథ్యతే. 154

తా. కారము, పులుసు, ఉప్పు, క్షారము, మత్స్యములు, మద్యము, విదాహకర ద్రవ్యములు, మినుములు, అనుములు, ఆవాలు, నూనె, ఉలవలు, వెల్లుల్లి, పెరుగు-ఇవి రక్తపైత్యరోగులకు, కుసుమరోగులకు అపథ్యకరంబులు.

## ఆమ్లపైత్యలక్షణము

అథాన్యత్సం ప్రవక్ష్యామి సంక్షిప్తం సూక్తముత్తమం,
ఆయుర్వేదోపదేశేఽస్మి న్నామ్లపిత్తం నిగద్యతే. 155
విరుద్ధదుష్టామ్లవిదాహి పిత్తప్రకోపి పానాన్నభుజో విదగ్ధం,
పిత్తం స్వహేతూపచితం పురాయ తదామ్లపిత్తం ప్రవదంతి సంతః.
(ఆయుర్వేదే)

తా. ఇక ఆయుర్వేదమున జెప్పఁబడిన ప్రకారము ఆమ్లపిత్తోత్పత్తిని సంక్షిప్తముగ వచించెదను. విరుద్ధక్షీరమత్స్యాద్యాహారములు, పులుసు, విదాహకరద్రవ్యములు అనువానిసేవనవలన, వర్షాదిఋతువులవలన, పిత్తము ప్రకోపించి భుజించిన యన్నాదులు జీర్ణముగాక పులితేనుపులు వచ్చుటయే ఆమ్లపైత్యమని తెలియవలయును.

ఆమ్లాత్పిత్తాచ్ఛిరోర్తిజ్వరిత తనువపుః కోష్ఠ హృత్కంఠదాహ
స్స్వేదో మూర్ఛా పిపాసా కఫసహిత వమిశ్చామ్లశేషో రసస్య,
వాచా ఘ్రాణేన తస్మిన్ జఠరముపగతే చామ్లశేషస్యవాంతి
స్తిక్తామ్లోద్గార కండూ బహువిధపిటకా మండలాన్యామ్లపిత్తే. 157

తా. తలనొచ్చుట, జ్వరము గలుగుట, శరీరము కృశించుట, లోకడుపు, హృదయము, మెడ అనువానియందు తాపము గలుగుట, చెమట, మూర్ఛ, దప్పి గలుగుట, శ్లేష్మమును పులుసును గ్రక్కుట, కడుపులో వ్యాపించిన ఆమ్లపిత్తమువలన నోరు ముక్కు అనువానియందు పులుసు వెడలుట, చేదుగ పుల్లగ తేనుపులు వచ్చుట, దురద, పలువిధపిటికలు మండలములు గలుగుట - ఈలక్షణములు గలది ఆమ్లపైత్యమని తెలియవలయును.

అవిపాకక్లమోత్క్లేశతిక్తామ్లోద్గారగౌరవైః,
అరుచిః కంఠహృద్దాహ మోహ మూర్ఛాః క్వచిద్భ్రమః. 158
తిక్తామ్ల కటుకోద్గార శ్వాసహృల్లాసతాపతృట్,
ప్రలాపః కుక్షిరోధశ్చ హ్యామ్లపిత్తస్యలక్షణమ్. (మాధవనిదానే)

తా. అన్నము జీర్ణము గాకుండుట, ఆయాసము గలుగుట, శరీరము పగులుట చేదుగ, పుల్లగ తేనుపులు వచ్చుట, శరీరము బరువుగ నుండుట, అరుచి గలుగుట, కంఠము ఎండుట, తాపము, మోహము, మూర్ఛ, ఒకానొకప్పుడు భ్రమగలుగుట, చేదుగ పుల్లగ, పగరుగ వమనము సేయుట, శ్వాస, ఓకర గలుగుట, ప్రలాపించుట, కడుపులో శూలించుట- ఈలక్షణములు గలవి అమ్లపైత్యమని తెలియవలయును.

ఆమ్లోద్గారాస్యవమనం శిరోర్తిర్జ్వరితం వపుః,
అమ్లపిత్తస్య లింగాని స్వేద తృష్ణా విమూర్ఛనమ్. 160
తత్కృచ్ఛ్రసాధ్యం ప్రత్యగ్రం దుశ్చికిత్సం పురాతనం,
(చికిత్సాసారసంగ్రహే)

తా. పులితేనుపులు గలిగి పులుసును గక్కుట, తలనొచ్చుట, జ్వరము, చెమట, దప్పి, మూర్ఛ గలుగుట - ఈలక్షణములు గలది అమ్లపైత్య మని తెలియవలయును. ఇది లేతగ నుండిన కష్టసాధ్యము. ముదిరి వాత, పిత్త, శ్లేష్మయుక్తంబై జ్వరయుక్తంబై యుండిన అసాధ్యము.

ఊర్ధ్వాధోముఖామ్లపిత్తమునకు ఉపచారము

ఊర్ధ్వామ్లపిత్తే వమనం విరేచనమధోగతే. 161
సర్వత్రానశనం శస్తం నిరూహం చ ప్రశస్యతే,
కఫపిత్తాప్రశమనం యచ్చ పానాన్న భేషజమ్. 162

తా. అమ్లపిత్తము ఊర్ధ్వముఖంబైన వమనమును, అధోముఖంబైన విరేచనమును, ఊర్ధ్వాధోముఖంబైన లంఘనమును, నిరూహవస్తికర్మమును, మఱియు శ్లేష్మపిత్తరక్తశమనోపయుక్తపానాన్నసేవనను చేయించి దానిని పోగడపవలయును.

అమ్లపిత్తమునకు సంజీవరసము

రస గంధక తామ్రం చ కాంతభస్మ సమాంశకం,
ముసలీరస సంమర్ద్యం కాచకుప్యాం వినిక్షిపేత్. 163
పాచయేద్వాలుకాయంత్రే ద్వియామాంతే సముద్ధరేత్,
సిందూరం త్రిఫలా వ్యోషం క్షారం లవణపంచకమ్. 164
హింగు గుగ్గులు వహ్నీ చ కుబేరాక్షశ్చ టంకణం,
దీప్యత్రయం చ జాతిశ్చ సూరణం విశ్వవత్సకమ్. 165
శిగ్రుద్వయం తథాపుంఖి వ్యాఘ్రీత్రయపటోలకం,

రాక్షసీ వజ్రవల్లీ చ కటభిక్షురపీలుకమ్. 166
సమభాగాని సంచూర్ణ్య ఖల్వమధ్యే వినిక్షిపేత్,
గృంజనస్య శృంగబేర జంబీరరసభావనా. 167
నిష్కార్ధం మధునా లేహ్యం యామేయామే చ భక్షితం,
ఆమ్లపిత్తం నిహంత్యాశు సర్వవ్యాధిహరః పరః. 168
కుర్యాత్ప్రాణపరిత్రాణం సంజీవరసఉత్తమః,
(సిందూరమణిదర్పణే)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, తామ్రభస్మము, కాంతభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నేలతాటిగడ్డ రసముతో మర్దించి మాత్రలుచేసి ఎండించి గాజుకుప్పెలో బోసి వాలుకాయంత్రమున రెండుర్ఘామములు వండి సాంగశీతలమున దీసి ఖల్వములో నునిచి చూర్ణముచేసి అందు సిందూరము, త్రిఫలములు, త్రికటుకములు, త్రిక్షారములు, పంచలవణములు, ఇంగువ, శుద్ధిచేసిన మహిసాక్షి, గుగ్గిలము, చిత్రమూలము, గచ్చపలుకులు, శుద్ధిజేసిన వెలిగారము, ఖురాసాని, ఓమము, మంచి ఓమము, అజామోదము, జాజికాయలు, అడవికంద, అడవియల్లము, కొడిసెపాల, మునగ గడ్డ, కారుమునగగడ్డ, ములువెంపలివేళ్లు, నేలములకవేళ్లు, పెద్దములకవేళ్లు, రామ ములకవేళ్ళు, చేతిపొట్లి, బలురక్కసిగడ్డ, నల్లేరు, ఒరగొమ్ము, నేలగొలిమిడి, గాడిదె గడపరవేళ్ళు అనునాని చూర్ణమును ప్రత్యేక ప్రత్యేకముగ రసప్రమాణము కలిపి మర్దించి వెల్లుల్లిపాయలరసము, అల్లము, నిమ్మపండ్లు అనువానిరసములలో ప్రతిదానితో మూడుమార్లు భావనజేసి ప్రతిర్ఘామునందు అర్ధనిష్కప్రమాణమును తేనెతోగాని, లేక తమలపాకుతోనేని భక్షించి ఉష్ణోదకమును పానము చేసిన ఆమ్లపైత్యము, గ్రహణి, అజీర్ణము, గుల్మశూల మొదలగు సర్వరోగములు శీఘ్రముగ హరించును. ఇది ప్రాణముల రక్షించుటచే సంజీవరస మనఁబడును. (దీని సేవనవలన నీరు వెడల కుండిన దొండాకురసమును పానము సేయవలయును.)

ఆమ్లపిత్తమునకు పిత్తభంజనరసము

పారదం గంధకం అభ్రం ముసలీరసమర్దితమ్. 169
కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాయంత్రకే తథా,
పచేద్భిషక్చ సంచూర్ణ్యం ఖల్వమధ్యే వినిక్షిపేత్. 170
త్రిక్షారం పంచలవణం హింగు గుగ్గులు కుష్ఠకం,
కటుత్రయం చ త్రిఫలా గంధారీ జాతికద్వయమ్. 171

దీప్యత్రయం త్రిఫేనం చ ముస్తాంబ్రం విషవత్సకం,
ఏలాద్వయం చ సౌభాగ్యం కుబేరావహ్నిమూలకమ్. 172
తింత్రిణీ ఫలగ్రంథీ చ చూతం దాడిమఖం పలం,
సమభాగాని సంచూర్ణ్యం ఖల్వమధ్యేవినిక్షి పేత్. 173
భావయే త్సప్తవారం చ శృంగబేర రసేన చ,
నిష్కార్ధం మధునాలేహ్యం యామేయామే చ భక్షయేత్. 174
అమ్లపిత్తం నిహంత్యాశు గ్రహణీ చ వినశ్యతి, (చరకే)

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, తామ్రభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి నేలతాటిగడ్డలరసముతో మర్దించి మాత్రలుజేసి ఎండించి గాజుకుప్పెలో బోసి వాలుకాయంత్రమున రెండుఝాములు వండి స్వాంగశీతలమున దీసి అందు త్రిక్షారములు, పంచలవణములు, నేతితో పొంగించిన ఇంగువ, శుద్ధిజేసిన మహిసాక్షి, గుగ్గిలము, చంగల్వకోష్టు, త్రికటుకములు, త్రిఫలములు, గంజావివిత్తులు, జాజికాయలు, జాపత్రి, ఓమము, ఖురాసాని ఓమము, అజామోదము, పోస్తుకాయ, గసగసాలు, నల్లమందు, ముస్తాంబ్రము, అతివస, కొడిసెపాల, ఏలకులు, బొంతయేలకులు, శుద్ధిచేసిన వెలిగారము, గచ్చపలుకులు, చిత్రమూలము, చింతయానెలు, మయాఫలములు, కాచు, మోడి, మామిడిపప్పు, దానిమ్మకాయ అనువానిని సమభాగములుగ చూర్ణము చేసి కలిపి ఏడుమార్లు అల్లపురసముతో భావనజేసి అర్ధనిష్కప్రమాణమును ప్రతిఝామున తేనెతో సేవింపుచుండిన అమ్లపైత్యము, గ్రహణి (ఛర్ది, అజీర్ణము) హరించును.

## అమ్లపిత్తమునకు లీలావిలాసరసము

శుద్ధసూతం తథా గంధం మృతతామ్రాభ్రరుచ్యకమ్. 175
తుల్యాంశం మర్దయేద్యామం రుద్ధ్వా పాచ్యం లఘుపుటే,
అక్షం ధాత్రీం చ పథ్యాం చ క్రమవృద్ధ్యా విపాచయేత్. 176
జలేనాష్టగుణేనైవ గ్రాహ్య మష్టావశేషితం,
అనేన భావయేత్పూర్వం పక్వసూతం పునఃపునః. 177
పంచవింశతివారం చ తావతాభృంగజైర్ద్రవైః,
సంశోష్య భక్షయేద్ద్రావైః పంచగుంజం మధుప్లుతమ్. 178
రసోలీలావిలాసోఽయ మామ్లపిత్తం నియచ్ఛతి, (మాధవనిదానే)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, తామ్రభస్మము, అభ్రకభస్మము, సౌవర్చలవణము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గిమ్మపండ్లరసముతో ఒక

ఝామము మర్దించి గాజుకుప్పెలో నునిచి లఘుపుటంబిడి పిదప ౧ భాగము గచ్చపలుకు లును, ౨ భాగములు ఉసిరికపప్పును, 3 భాగములు కరక్కాయలును దంచి వానికెనిమి దింతలు నీళ్ళుపోసి, అష్టావశేషముగ కషాయముకాచి యాకషాయముతో ౨౧ మార్లును, గుంటగలగరాకురసముతో ౨౧ మార్లును పైయౌషధమును ఖల్వములో మర్దించి ఎండించి చూర్ణముజేసి అందు ౫ గురిగింజలయెత్తులో గురిగింజయెత్తుసిందూరము, తేనె కలిపి సేవించిన కడుదుర్ఘటమైన ఆమ్లపైత్యములు హరించును.

## ఆమ్లపైత్యమునకు ప్రాణేశ్వరరసము

గంధకాభ్రం సమం సూతం వారాహీ రసమర్దితమ్. 179
కాచకుప్యాం వినిక్షిప్య ముఖం ఖండేన రోధయేత్,
పాచితం వాలుకాయంత్రే ద్వియామాంతే సముద్ధరేత్. 180
సిందూరం వత్సనాభం చ త్రిఫలా వ్యోష చిత్రకం,
త్రిక్షారం పంచలవణం హింగు గుగ్గులు దీప్యకమ్. 181
అజామోదం చేంద్రయవం పృథగ్రససమైర్యుతం,
ఆర్ద్రికస్య ద్రవేణైవ భావయేత్సప్తవారకమ్. 182
ద్విమాషమనుపానేన ద్విపలేనోష్ణవారిణా,
అనుపానవిశేషేణ సర్వరోగాన్ వినాశయేత్. 183
అభిన్యాసం చామ్లపిత్తం గ్రహణీ పాండు గుల్మజిత్,
కాసశ్వాసం చ ప్లీహం చ జ్వరాతీసారమేవ చ. 184
వాతశూలం చ మందాగ్నిం సర్వజ్వరవినాశకః,
కుర్యాత్ప్రాణపరిత్రాణ మయం ప్రాణేశ్వరో రసః. 185
(రసరత్నాకరే.

తా. శుద్ధిజేసిన గంధకము, అభ్రకభస్మము, శుద్ధిజేసిన రసము-వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నేలతాటిగడ్డలరసముతో మర్దించి మాత్రలుచేసి గాజుకుప్పెలో పోసి బలపపుబిళ్లచే దానిమూతినిమూసి వాలుకాయంత్రమున రెండుఝాములు వంసాంగశీతలమునదీసి ఖల్వములోనునిచి అందు సిందూరము, శుద్ధిచేసిననాభి, త్రిఫలముల త్రికటుకములు, చిత్రమూలము, త్రిక్షారములు, పంచలవణములు, ఇంగువ, శుద్ధిచేసిన మహిసాక్షిగుగ్గిలము, ఓమము, ఖురాసానిఓమము, కొడిసెపాల-అనువానిలో ప్రదానిచూర్ణమును రసమెత్తు కలిపి అల్లపురసముతో ౭ మార్లు భావనచేసి రెండు మాములయెత్తును తేనెతో సేవించినను లేక తమలపాకులో నునిచి భక్షించి చేరెడు ఉ

దకమును త్రాగినను, అభిన్యాసము, ఆమ్లపైత్యము, గ్రహణి, పాండువు, గుల్మము, కాస శ్వాసలు, ప్లీహరోగము, జ్వరాతిసారము, వాతశూలలు, అగ్నిమాంద్యము, సర్వజ్వరములు హరించును. ఇది ప్రాణముల రక్షించుటచే ప్రాణేశ్వరరసమని చెప్పంబడును.

### ఆమ్లపైత్యమునకు మహాప్రాణేశ్వరరసము

గంధకాభ్రం సమం సూతం వారాహీ రసమర్దితం,
హంసపాదిరసేనాపి మర్దయే త్త్రిదినం మృదు. 186
కాచకుప్యాంతరే క్షిప్త్వా తన్ముఖం చ నిరుధ్య చ,
పాచయే ద్వాలుకాయంత్రే తథా యామచతుష్టయమ్. 187
స్వాంగశీతలమాదాయ మర్దయేదేభిరౌషధైః,
పంచకోలం చ త్రిక్షారం జీరకద్వయ దీప్యకమ్. 188
మరీచాః పంచలవణం గుగ్గులుం చ విషద్వయం,
త్రిజాతకం లవంగం చ వరారాస్నాశ్వగంధికా. 189
జంబీరార్ద్రకభృంగాణాం రసైస్సంమర్దయేత్పృథక్,
సప్తరాత్రం తతో గుంజాప్రమాణం వటకీకృతమ్. 190
తత్తద్రోగేఽనుపానేన సేవయేత్సర్వరోగజిత్,
సన్నిపాత మభిన్యాసం ధనుర్వాతం చ తాంద్రికమ్. 191
కాసశ్వాసాగ్నిమాంద్యం చ పాండుకామలిపీనసాః,
శోఫం గుల్మం తథార్శాంసి క్షయం చ గ్రహణీ గదాః. 192
జ్వరకుష్ఠ ప్రమేహం చ నాశయే న్నాత్రసంశయః,
సర్వేషాం పిత్తరోగాణాం మహాప్రాణేశ్వరో రసః. (శారీరే)

తా. శుద్ధిజేసిన గంధకము, అభ్రకభస్మము, శుద్ధిజేసినరసము - వీనిని సమభాగము లుగ ఖల్వములో నునిచి నేలతాటిగడ్డలరసము, హంసపాదియాకురసము వీనితో మూడు దినములు నున్నగమర్దించి గాజుకుప్పెలోనునిచి దానిమూతినిమూసి వాలుకాయంత్రమున ౪ ఝాములువండి స్వాంగశీతలమునదీసి అందు పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, ఓమము, మిరియాలు, పంచలవణములు, శుద్ధిజేసిన మహిసాక్షి, గుగ్గిలము, శుద్ధిజేసిన నాభి, అతి వస, లవంగపుచెక్క, ఏలకులు, లవంగపత్రిక, లవంగములు, త్రిఫలములు, దుంపరా స్నము, డొమ్మడోలుగడ్డ అనువానిలో ప్రతిదానిచూర్ణమును రసమునకు సమముగ కలిపి నిమ్మపండ్లు, అల్లము, గుంటగలగర అనువాని రసములలో ప్రతిదానిలో ఏడుదిన

ములు మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి అనుపానవిశేషములతో సేవించిన సన్నిపాతము, అభిన్యాసము, ధనుర్వాతము, తాంద్రికసన్ని, కాసశ్వాసలు, అగ్నిమాంద్యము, పాండువు, కామిల, పీనసము, శోభ, గుల్మము, మూలవ్యాధి, క్షయరోగము, గ్రహణి, జ్వరము, కుష్ఠువు, ప్రమేహము, అమ్లపైత్యము మొదలగు సర్వపైత్యరోగములు హరించును.

అమ్లపైత్యమునకు రసభస్మాదికల్పము

మృతసూతార్కలోహానాం తుల్యం పథ్యాం విచూర్ణయేత్,
మాషత్రయం లిహేత్క్షౌద్రేణామ్లపిత్తప్రశాంతయే. 194

తా. రసభస్మము, తామ్రభస్మము, లోహభస్మము-ఇవి దినుసు కొక్కొకతులము, కరక్కాయలు 3 తులములు-ఇటుల వాని నేకముజేసి తేనెలో కలిపి మూడుమాషముల యెత్తును సేవించిన అమ్లపైత్యము హరించును.

అమ్లపైత్యమునకు అభ్రకాదికల్పము

మృదాభ్రకం మృతం లోహం క్షౌద్రేర్లిహ్యాద్ద్విగుంజకం,
ఫలత్రయం పటోలం చ తిక్త్వా క్వాథం సితాయుతమ్. 195
అమ్లపిత్తహరంచాశు పిబేచ్ఛర్దిం జ్వరం జయేత్,

తా. అభ్రకభస్మము, లోహభస్మము-వీనిని తేనెతో సేవించినను లేక త్రిఫలములు, చేతిపొట్ల, కటుకరోహిణి - వీనిని కషాయముకాచి పంచదార కలిపి త్రాగినను, అమ్లపైత్యము, ఛర్ది, జ్వరము శీఘ్రముగ హరించును.

అమ్లపైత్యమునకు తామ్రాదికల్పము

మృతతామ్రంచైకగుంజం మధునా సహ భక్షయేత్. 196
ద్రాక్షాం పథ్యాం సమం ఖాదేన్మధునాచామ్లపిత్తజిత్,

తా. గురిగింజంత తామ్రభస్మముగాని, లేక ద్రాక్షపండు, కరక్కాయ అనువానిని సమముగ చూర్ణముచేసిగాని తేనెతో సేవించిన అమ్లపైత్యము హరించును.

*ఛర్దినిదానము

దుష్టైర్దోషైః పృథక్సర్వైర్భీభత్సాలోకనాదిభిః. 197
ఛర్దయః పంచవిజ్ఞేయాస్తాసాం లక్షణముచ్యతే,
అతిద్రవై రతిస్నిగ్ధై రహృద్యైర్లవణైరపి. 198

* అన్నపానాధులయందు ద్వేషము గలిగి వమనం బగుటయే ఛర్దిరోగ మనం బడును.

అకాలేచాతిమాత్రైశ్చ తథా సాత్మ్యైశ్చ భోజనైః,
శ్రమాద్భయాదథోద్వేగా వజీర్ణాత్క్రిమిదోషతః. 19
నార్యాశ్చాపన్నసత్వాయా స్తథాతిద్రుతమశ్నతః, (ఆయుర్వేదే

తా. కడు ద్రవము, స్నిగ్ధముగలపదార్థములు, మనస్సునకు ఇంపుగాని పదార్థములు, లవణపదార్థములు అనువానిసేవనవలన, అకాలభోజనము, లేక అధికభోజనము లేక శరీరప్రకృతికనుగుణముగాని భోజనము అనువానివలన, శ్రమ, భయము, దుఃఖము అజీర్ణము, క్రిమిదోషము, గర్భిణీస్త్రీలకు గలుగు గర్భపీడ, అతితీవ్రభోజనము అను వానివలన వాత పిత్త శ్లేష్మములు ప్రకోపించి వాతఛర్ది, పిత్తఛర్ది, శ్లేష్మఛర్ది, అరోచక ఛర్ది, ఆగంతుకఛర్ది అను ఐదువిధ ఛర్దుల గలుగంజేయును.

ఛర్దిపూర్వరూపము

హృల్లాసోద్గారసంరోధౌ ప్రసేకో లవణ స్తనుః. 200
ద్వేషోన్నపానే చ భృశం వమీనాం పూర్వలక్షణం,

తా. ఓకరగలుగుట, తేనుపులు వచ్చుట, మలమూత్రములు వెడలకుండుట, నోట నీరుగారుట, నోరు కొంచెము ఉప్పగ నుండుట, అన్నపానములయందు మిక్కుటముగ ద్వేషము గలుగుట-ఈలక్షణములవలన ఛర్దిరోగము జనించు నని తెలియవలయును.

ఛర్దులయందు సామాన్యోపచారము

అస్యాం చ లంఘయే త్పూర్వం ముహుః కార్యం విరేచనమ్.

తా. పైఁజెప్పఁబడిన అయిదువిధ ఛర్దులయందు తఱుచుగ లంఘనమును, విరేచనమును చేయించవలయును.

వాతఛర్దిలక్షణము

ఛర్దిర్భవేత్కృష్ణకషాయ ఫేనై
ర్ముహుర్ముహుః శూలకకుక్షిదాహా
వాతోద్భవాం ఛర్దిమిమాం బ్రువంతి
వక్త్రే చ శోషోఽశ్వినిముఖ్య వైద్యాః. (ఆయుర్వేదే) 202

తా. నల్లగ, వగరుగ, నురుగుగ గ్రక్కుట, పలుమారు శూల, కడుపులో మంట గలుగుట, నోరు ఎండుట - ఈలక్షణములు గలది వాతఛర్ది యని అశ్వినీదేవతలు వచించెదరు.

### పైత్యఛర్దిలక్షణము

మూర్ఛాపిపాసాముఖశోషశీర్షతాల్వక్షిసంతాపమోహభ్రమార్తః,
పీతం భృశోష్ణం హరితంసతిక్తం ధూమ్రంచ పిత్తేనవమేత్సదాహమ్.

తా. మూర్ఛ, దప్పి గలుగుట, ముఖము వాడియుండుట, తల, దవడలు, నేత్రములు మండుట, అజ్ఞానము, భ్రమ గలుగుట; పచ్చగ, కడుఉష్ణముగ, ఆకుపసరువర్ణముగ, వగరుగ, ఊదావర్ణముగ, దాహాయుక్తముగ గ్రక్కుట - ఈలక్షణములు గలది పైత్యఛర్ది యని తెలియవలయును.

### శ్లేష్మఛర్దిలక్షణము

వాంతోఽరుణో యత్రవర్ణః పిచ్ఛిలః పూతిశీతలః,
శ్లేష్మాఛర్దివికారోఽయం మునిభిః పరికీర్తితః. (సిద్ధసంగ్రహే) 204

తా. ఎఱ్ఱగ, బంకగ, దుర్గంధముగ, చల్లగ వమనం బగుట- ఈలక్షణములు గలది శ్లేష్మఛర్ది యని తెలియవలయును.

### ఛర్ద్యరుచిలక్షణము

హృచ్ఛూల పీడనయుతం వమనేన పిత్తా
త్తృడ్దాహ శోష బహుళం సతతం ప్రలాపః,
శ్లేష్మాధికం హ్యరుచికం వమిరోగకేతు
వైవర్ణ్యమోహజడతాగురుకంపనం చ. 205

తా. పిత్తప్రకోపమువలన వమనంబై ఱొమ్మునొచ్చుట, దప్పిగలుగుట, ఎల్లపుడు శరీరము మండుట, శోష, కడుప్రలాపము, శ్లేష్మాధిక్యము, అరుచి గలుగుట, ముఖము వెల్లబోవుట, మోహము, జడత్వము, మిక్కుటముగ వణకు గలుగుట - ఈలక్షణములు గలది ఛర్ది అరోచక మని తెలియవలయును. (ఛర్దిరోగము త్రిదోషలక్షణయుక్తంబుగ నుండిన అసాధ్యము. ద్వంద్వలక్షణయుక్తంబుగ నుండిన యాప్యము. ఏకదోషలక్షణయుక్తంబుగ నుండిన సాధ్యము.)

### ఆగంతుకఛర్దిలక్షణము

బీభత్సజాదౌ హృదజాఽమజాచ
యాఽసాత్మ్యజావా కృమిజాచ యాహి,
సా పంచమీ తాం చ విభావయేత్తు
దోషోచ్ఛ్రియేణైవ యథోక్తమాదౌ. 206

తా. రోతపదార్థదర్శనము, వేవిళ్ళు, అజీర్ణము, శరీరమున కనుగుణ్యాముగా భోజనము, గర్భసక్రిములు - అను నీయైదుకారణములవలన వాతాదిదోషములు ప్రకో పించి ఐదవది యగు ఆగంతుకఛర్దిని గలుగంజేయును. మఱియు దీనియందు వాతాదిఛ లక్షణములే గలిగియుండును.

## ఆసాధ్యఛర్దిలక్షణము

విట్స్వేదమూత్రాంబువహాని వాయుః
స్రోతాంసి సంరుధ్య యదోర్ధ్వమేతి,
ఉత్పన్నదోషస్య సమాచితం తం
దోషంసముద్ధూయ నరస్యకోష్ఠాత్. 20
విణ్మూత్రయో స్తత్సమగంధవర్ణం
తృట్శ్వాసకాసా ర్తియుతం ప్రసక్తం,
ప్రచ్ఛర్దయే ద్దుష్టమిహాతివేగా
త్తమార్దితశ్చాశు వినాశమేతి. 20

తా. వాయువు - పురీషము, స్వేదము, మూత్రము, ఉదకము అనువాని వహింపుచుండు స్రోతస్సుల నడ్డగించి ఊర్ధ్వముఖంబై మలమూత్రసమానగంధవ ములు గలదై దప్పిని, శ్వాసమును, దగ్గును గలుగంజేయునదియై నరునియొక్క కో ములోనుండి లేచి కఫమునుగాని, లేక పిత్తమునుగాని పలుమారు కడువేగముగ వమ బగునటుల జేయుచున్నయది. ఇట్టివమనముచే పీడితుఁడుగ నుండువాఁడు కడుశీఘ్రమ నశించును.

## వాతఛర్దియందు ఉపచారము

క్షీరోదకసమాపీతా ఛర్దిర్వాతేన సంభవా,
స సైంధవం పిబేత్సర్పి ర్వాతఛర్దినివారణమ్. 2

తా. పాలు, నీళ్ళు, పసపువర్ణము - వీనివలె వమనంబైన వాతఛర్ది యని తెలి వలయును. ఇది నివర్తించుటకై నెయ్యిగో సైంధవలవణమును కలిపి సేవి వలయును.

## వాతఛర్దికి విళంగాదిచూర్ణము

విళంగం సైంధవోపేతం సౌవర్చలకటుత్రయం,
భక్షయేన్మధునా చైవ వాతఛర్ది చ్ఛిదంజనః. 2

తా. వాయువిడంగములు, సైంధవలవణము, సౌవర్చలవణము, త్రికటుకములు - వీనిని సమభాగములుగ చూర్ణముచేసి తేనెతో సేవించిన వాతఛర్ది హరించును.

పిత్తఛర్దియందు ఉపచారములు

చందనం చాక్షమాత్రం చ నియోజ్యామలకే రసే,
పిబేన్మాక్షిక సంయుక్తం పిత్తఛర్ది వినాశనమ్. (ఆయుర్వేదే) 211

తా. అక్షప్రమాణము శ్రీగంధములో ఉసిరికరసము, తేనె కలిపి సేవించిన పైత్యఛర్ది హరించును.

హరీతకీనాం చూర్ణం తు లిహేన్మాక్షికసంయుతం,
అధోర్ధ్వ చ కృతే దోషే ఛర్దిస్తేన వినశ్యతి. 212

తా. కరక్కాయలపొడిని తేనెతో భక్షించిన ఊర్ధ్వాధోగతదోషములు, పైత్యఛర్ది హరించును.

కఫఛర్దికి పిప్పలాదియోగము

కఫాన్వితాయాం పవనోత్థితాయాం సపిప్పలీసర్షపనింబతోయం,
పిబేత్తథాసైంధవసంప్రయుక్తం ఛర్ద్యాంకఫామాశయశోధనం చ.

తా. పిప్పళ్లు, ఆవాలు, సైంధవలవణము వీనిని సమభాగములుగ చూర్ణముచేసి మంచివేపచెక్కరసముతో సేవించిన శ్లేష్మవాతఛర్ది హరించును. మఱియు నిది కఫమును, ఆమాశయమును శోధించును.

కఫఛర్దియందు కపిత్థాదికల్పము

కపిత్థం మాలతీపత్ర పిప్పలీ మరిచాన్వితం,
శర్కరా మధుసంయుక్తం శ్లేష్మఛర్దియుతో జనః (ఆయుర్వేదే) 214

తా. వెలగాపురసములో జాజిపువ్వు, పిప్పలి, మిరియాలు అనువానిచూర్ణమును పంచదారను, తేనెను కలిపి సేవించిన శ్లేష్మఛర్ది హరించును.

మధునా మాతులుంగం చ లాజ పిప్పలికాన్వితం.
కపిత్థం రజనీచూర్ణం కఫఛర్ది వినాశనమ్. (శారీరే) 215

తా. పుల్లమాదీఫలపుపండ్లరసము, పేలపుసత్తు, పిప్పళ్ళు వీనిని తేనెతోగాని, లేక వెలగపండ్లగుజ్జులో పసపుచూర్ణమును కలిపిగాని సేవించిన కఫఛర్ది హరించును.

పంచఛర్దులకు పూర్ణచంద్రోదయసిందూరము

తుల్యంతుల్యం రసం గంధం ఖల్వమధ్యే వినిక్షిపేత్,
కపిత్థమూలసారేణ మర్దితం చ దినత్రయమ్. 216

వటికాం ఛాయయా శుష్కాం భాండమధ్యే వినిక్షిపేత్,
కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాభిః ప్రపూరయేత్. 217
దీపాగ్నౌ చ ద్విషడ్యామం సాంగశీతం సముద్ధరేత్,
కపిత్థమూలసారేణ త్రిదినం మర్దయేత్క్రమాత్. 218
బిల్వమూలకషాయేణ మర్దయేత్త్రిదినం పునః,
చాతుర్జాతకకర్పూర లవంగకుసుమాన్వితమ్. 219
సర్వం రససమంచైవ మేళయిత్వాథ చూర్ణకం,
లాజచూర్ణసితామిశ్రం మధునా సహ సేవయేత్. 220
వల్లద్వయమితం సూతం వమనస్తంభనం తథా,
కాసాదిపంచఛర్దీనాం హ్యరుచేర్నాశకస్తథా. 221
హృద్రోగం స్వరభంగం చ మందాగ్నిం చ నివారయేత్,
పూర్ణచంద్రోదయో నామ నిర్మితశ్శూలపాణినా. 222

(సిందూరమణిదర్పణే)

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి వెలగవేళ్ళరసముతో మూడుదినములు మర్దించి వటికములుచేసి నీడ నెండించి గాజుకుప్పెలో నుంచి కుండలో నిసుకపోసి దానిపై కుప్పె నునిచి పన్నెండు ఝాములు దీపాగ్నితో వండి సాంగశీతలమున దీసిచూచిన యది సిందూరించును. పిదప దానిని ఖల్వములో నునిచి వెలగవేళ్ళరసముతో 3 దినములు, మారేడువేళ్ళకషాయముతో 3 దినములు మరల మర్దించి అందు సిందూరమునకు సమముగ ఏలకులు, [1]లవంగపుచెక్క, [2]ఆకుపత్రికె, నాగకేసరములు, పచ్చకర్పూరము, లవంగములు అనువాని చూర్ణమును కలిపి రెండువల్లముల ప్రమాణమును పేలపుసత్తు, పంచదార, తేనె వీనితో సేవించిన వమనము, కాసశ్వాసములు, పంచఛర్దులు, అరుచి, హృద్రోగము, స్వరభంగము, మందాగ్ని హరించును. ఇదియ శూలపాణిచే నిర్మింపఁబడిన పూర్ణచంద్రోదయ సిందూరము.

### ఛర్దులకు ఊషణాదిచూర్ణము

ఊషణా చ కపిత్థాబ్ద త్వగేలాపత్రకం సమం,
సక్షౌద్రం చ రసోరాగ స్సప్తైతే ఛర్దినాశకాః. 223

1 ఇదే దాచినిచెక్క యనియు జెప్పంబడును. 2 ఇదే లవంగపత్రి యనియు జెప్పంబడును.

తా. పిప్పళ్ళు, వెలగపండ్లగుజ్జు, తుంగముస్తెలు, దాచినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికె, సిందూరము అను నీ యేడుద్రవ్యముల చూర్ణముచేసి తేనెతో సేవించిన వాంతి హరించును.

ఛర్దులకు లాజాదికల్పము

లాజచూర్ణం సితాయుక్తం సిందూరం మధునా సహ,
లిహ్యాత్సకలరోగేషు ఛర్దిస్తేన వినశ్యతి. 224

తా. పేలపుసత్తు, పంచదార, సిందూరము వీనిని తేనెతో సేవించిన సర్వపైత్య వికారములు, వాంతి హరించును.

సర్వఛర్దులకు బిల్వాదిలేహ్యము

త్రింశత్పలం బిల్వమూల మర్ధకుంభాంభసా పచేత్,
అష్టభాగావశేషేఽస్మిన్ కషాయమవతారయేత్. 225
త్రింశత్పలం గుడం దత్వా కించిత్పక్వం చ కారయేత్,
త్రిపలం శృంగిబేరస్య మరీచస్య చతుష్పలమ్. 226
పిప్పల్యాః కుడవార్ధం చ చవినాయాః ప్రకుంచకమ్,
ముష్టిం తాళీసపత్రస్య ముష్ట్యర్ధం కేసరస్య చ. 267
ద్విపలం పిప్పలీమూలం చిత్రకస్య పలం తథా,
పృథక్త్రిజాతకం చైవ కర్షం జీరపలద్వయమ్. 228
చూర్ణం తస్మిన్ వినిక్షిప్య యుక్త్వా పుష్పరసం క్షిపేత్,
ఏతద్బిల్వాదికం లేహ్యం సర్వఛర్దినివారణమ్. 229
హృద్రోగ కామిలా గుల్మ గ్రహణ్యరుచి పీనసం,
హిక్కా కాస క్రిమి శ్వాస ప్లీహానాహ గరామయాన్. 230
అర్శాంసి పాండురోగం చ హన్యాత్కాలే నిషేవితః,

తా. ముప్పదిపలములు మారేడువేళ్ళను చిదియగొట్టి ఒకభాండములో వైచి తూమెడునీళ్ళుబోసి ఎనిమిదవభాగముగ కషాయము కాచి అందు బెల్లము ౩౦ పలములు కలిపి చిక్కగ కాచి పిదప నందు శొంఠిచూర్ణము ౩ పలములు, మిరియాలచూర్ణము ౪ పలములు, పిప్పలిచూర్ణము ౨ పలములు, చవ్యపుచూర్ణము ౧ పలము, తాళిసెపత్రిచూర్ణము ౧ పలము, నాగకేసరములచూర్ణము ½ పలము, మోడిచూర్ణము ౨ పలములు, చిత్రమూలచూర్ణము ౧ పలము, ఏలకులచూర్ణము ౧ పలము, లవంగపుచెక్కచూర్ణము ౧ పలము, ఆకుపత్రికెచూర్ణము ౧ పలము, జీలకఱ్ఱచూర్ణము ౨ పలములు

వైచి బాగుగ కలియబెట్టి కించిదుష్ణముగ నుండునపు డందు తేనెబోసి బాగుగ యథోక్తకాలమున సేవింపుచుండిన సర్వఛర్దులు, హృద్రోగము, కామిల, గుల్మ గ్రహణి, అరుచి, పీనసము, ఎక్కిళ్లు, కాసము, క్రిమిరోగము, శ్వాసము, ప్లీహరోగ కడుపుబ్బరము, విషదోషము, మూలరోగము, పాండువు హరించును.

## సర్వఛర్దులకు లఘుబిల్వాదిలేహ్యము

బిల్వార్ధాఢకమంభసోర్ధకలశే పక్త్వా చతుర్థాంశకం
తస్మిన్ జీర్ణగుడం చ షోడశపలం మిశ్రీకృతం చూర్ణితం,
కర్షాంశం ఘనధాన్యజీరకత్రుటి త్వక్కేసరత్ర్యూషణం
లీఢం ఛర్ద్యరుచి ప్రసేకశమనం శ్వాసాగ్నిమాంద్యం జయేత్.

తా. ముప్పదిరెండుపలములు మారేడు వేళ్ళను దంచి తూమెడునీళ్లు బోసి న భాగముగ కషాయము కాచి అందు ప్రాతబెల్లము ౧౬ పలములు కలిపి లేహ్యపక్వః కాచి అందు తుంగముస్తెలు, కొతిమిర్లు, జీలకఱ్ఱ, ఏలకులు, దాచినిచెక్క, నాగ ములు, త్రికటుకములు అనువాని చూర్ణమును దినుసుకు ౧ పలముచొప్పున వైచి బా కలియబెట్టి సేవించిన సర్వవాంతులు, అరుచి, ఎల్లప్పుడు నోట నీరు గారుట, శ్వాస అగ్నిమాంద్యము హరించును.

## ఛర్దులకు కృష్ణాదికల్పము

కృష్ణా లాజ కపిత్థామ్ల కోల మజ్జా త్రిజాతకైః,
వాసా పుష్పోద్భవం వారి గుడూచీ కాండజం జలమ్. 2
సక్షౌద్రస్స్వాదితో యోగ స్సర్వఛర్ది నిబర్హణః,

తా. అడ్డసరపు పువ్వులరసములోగాని, లేక తిప్పతీగెరసములోగాని, పిప్ప పేలపుసత్తు, వెలగగుజ్జు, రేగుపప్పు, ఏలకులు, లవంగపుచెక్క, ఆకుపత్రికె అను చూర్ణమును తేనెను కలిపి సేవించిన సర్వఛర్దులు హరించును.

## ఛర్దులకు కార్పాసాస్థికల్పము

కార్పాసాస్థి త్రుటీ కృష్ణా రాజచూర్ణేన శర్కరామ్. ౬
లిహ్యాచ్ఛర్ది వినాశాయ రహస్యమిదముత్తమం,

తా. ప్రత్తిగింజలపలుకులు, ఏలకులు, పిప్పళ్లు, పేలపుపిండి - వీనిచూర్ణ సమభాగములుగకలిపి సేవించిన ఛర్ది హరించును. ఇది రహస్యమైన క్రియ (తెల్లనిజు నలె వమనం బగుచుండిన శుద్ధిచేసినహరిదళమును ఆవువెన్నతో నూరివస్త్రమునకు పట్టి

వర్తిజేసి దీపము ముట్టించిన యందు తైలము స్రవించును. దానిని తమలపాకునందు లేపనము జేసి భక్షించిన తెల్లనిజున్నువలె వమనంబగుట హరించును.)

ఛర్దులయందు లేపనము

గీ. నెమలియీకలమసియును విమలముగను
వసుధఁ జెంగల్వకోష్టువు మసియుఁ గూర్చి
గవ్వబూడిదె దేనెయుఁ గలిపి కంఠ
మందుఁ బూసిన వాంతులు మానునపుడు.

ఛర్దియం దనుపానములు

జాతీ లవంగకం లాజ మధుకం శర్కరా మధు. 234
పథ్యా గుళూచికా సత్వ మేలా వై కాంజికం తథా,
మాతులుంగం కపిత్థం చ బిల్వమూలం కరంజకమ్. 235
ఏతాని వాంతినాశాయ రసరాగానుపానతః. (నిత్యనాథీయే)

తా. జాజికాయలు, లవంగములు, పేలాలు, యష్టిమధుకము, పంచదార, తేనె, కరక్కాయలు, తిప్పసత్తు, ఏలకులు, కలి, మాదీఫలరసము, వెలగపండు, మారేడువేరు, కానుగచెక్క-వీనిని సిందూరసేవనకాలంబున ఛర్దిరోగములయం దనుపానములుగ నునిచి కొనవలయును.

ఛర్దులకు ఏలాదిచూర్ణము

ఏలా లవంగ గజకేసర కోల మజ్జా
లాజ ప్రియంగు ఘనచందన * పిప్పలీనాం,
చూర్ణం తథా చ మధునా సహ సేవ్యమానం
ఛర్దిం నిహంతి కఫమారుతపిత్తజాతామ్. 237

తా. ఏలకులు, లవంగపత్రి, నాగకేసరములు, రేగుపలుకులు, పేలపుసత్తు, ప్రేంకణము, తుంగముస్తెలు, చందనము, పిప్పళ్లు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి తేనెతో సేవించిన శ్లేష్మవాతపిత్తములవలన జనించిన ఛర్ది హరించును.

ఛర్ద్యరోచకమునకు కుస్తుంబరీలేహ్యము

ఘృతే కుస్తుంబరీచూర్ణం పాచయే చ్ఛర్కరాయుతం,
ఏలామరిచసంయుక్తం ఖాదేదరుచిశాంతయే. 238

---

* చంద్రహాసమ్-మార్జ్ఞికృతం-పచ్చకర్పూరము.

తా. కొత్తిమెర్లు, ఏలకులు, మిరియాలు-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి పంచదార నెయ్యి గలిపి లేహ్యాపక్వముగ వండి సేవించిన అరోచకఛర్ది హరించును.

ఛర్ద్యరోచకహరయోగములు

భ్రష్టకుస్తుంబరీకం చ నిస్తుషం శర్కరాయుతం,
ఖాదేదరుచిశాంత్యర్థ మార్ద్రకం వాసమాక్షికమ్. 239

(మాధవనిదానే)

తా. పొట్టుతీసివేయించిన కొత్తిమెర్లచూర్ణములో పంచదార గలిపి సేవించినను లేక అల్లపుముక్కలను తేనెలో నానబెట్టి భక్షించినను అరుచి ఛర్ది హరించును.

ఛర్ద్యరోచకమునకు ధాన్యకలేహ్యము

ధాన్యకం జీరక సితా ఘృత మగ్నినిపాచితం,
అరుచే ర్దోషశమనం వాంతిపిత్తవినాశనమ్. 240

తా. కొత్తిమెర్లు, జీలకఱ్ఱ-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి పంచదార ఆవు నెయ్యి కలిపి లేహ్యాపక్వముగ వండి సేవించిన ఛర్ది వాంతి పిత్తము హరించును.

*ఛర్ద్యరోచకమునకు ఖండార్ద్రకలేహ్యము

విత్వాగార్ద్రకఖండాంశ్చ సూక్ష్మాన్ పశ్చాచ్చ కారయేత్,
పలషోడశకం యావ ద్గవ్యసర్పిషి భర్జయేత్. 241
పలద్వాదశకే యావద్గౌరవర్ణం భవేత్తతః,
చూర్ణ మావాప్య మారీచం నిష్కద్వాదశమానతః. 242
కృష్ణాష్టనిష్కం తన్మూలం చతుర్నిష్కం సమావపేత్,
వంశాఖ్యజాతిఫలయో స్త్రుటిశుంఠ్యోః పృథక్ పృథక్. 243
చిత్రకం రసనిష్కంస్యా త్పశ్చాత్ఖండస్య షోడశ,
పలాని సమ్యగాలోడ్య చుల్యా ఉద్ధృత్య తత్పునః. 244
ప్రాతఃకాలేచైకకర్షం హన్యా చ్ఛర్ది మరోచకం,
దీపనస్యక్షయం హన్యా త్పాచనం పుష్టివర్ధనం. 245
రాజ్ఞాం చ సుకుమారాణాం ప్రశస్తం చామ్లపిత్తకే,

తా. పదియాఱుపలములు పొట్టువాలిచిన సూక్ష్మపు అల్లపుతునకలను ౧౨ పల

* ఈలేహ్యపాకకాలంబున తొలుత పంచదారను పాకుబట్టిన పిదప వేయించిన అల్లపుతునకలను, తక్కినవానిచూర్ణమును వైచి వండి పొయిమీదనుండి దించి నెయ్యి పోసి బాగుగ కలియఁబెట్టవలయును.

ములయావునేతితో సెట్టిగ వేయించి అందు మిరియములచూర్ణము ౧౨ నిష్కములు, పిప్పళ్ళచూర్ణము ౮ నిష్కములు, మోడిచూర్ణము ౪ నిష్కములు, వెదురుబియ్యము లేక వెదురుప్పు, జాజికాయ, ఏలకులు, శొంఠి అయవానిచూర్ణము దినుసుకు ౪ నిష్కములు, చిత్రమూలపు చూర్ణము ౧౧ నిష్కములు, పంచదార ౧౬ పలములు గలిపి లేహ్యాపక్వముగవండి బాగుగ కలియబెట్టి ప్రాతఃకాలమున కర్షప్రమాణమును సేవింపుచుండిన ఛర్ద్యరోచకము, అగ్నిమాంద్యము, వాంతి, ఆమ్లపి_త్తము హరించుటయే గాక పాచనము, బలము సహా గలుగును. ఇది రాజులకు సుకుమారులకు ప్రశ_స్తములు.

## మూర్ఛానిదానము

క్షీణస్య బహుదోషస్య విరుద్ధాహారసేవినః. 246
వేగాఘాతాదభీఘాతా ద్ధీనసత్వస్య వా పునః,
కరణాయతనేషూగ్రా బాహ్యేష్వాభ్యంతరేషు చ. 247
నివిశంతే యదా దోషా తథా మూర్ఛంతి మానవాః,
సంజ్ఞావహాసు నాడీషు పిహితా స్వనిలాదిభిః. 248
తమోఽభ్యైతి సహసా సుఖదుఃఖవ్యపోహకృత్,
సుఖదుఃఖవ్యపోహాశ్చ నరః పతతి కాష్ఠవత్. 249
మోహో మూర్ఛేతి తామాహు ష్షడ్విధా సా ప్రకీ_ర్తితా,
వాతాదిభి శ్శోణితేన మద్యేన చ విషేణ చ. 250
షట్స్వప్యేతాసు పి_త్తం తు ప్రభుత్వేనావతిష్ఠతే,

తా. క్షీణుఁడై పలుదోషములతోఁ గూడియుండునరుఁడు విరుద్ధాహారముల సేవించుటవలన మలమూత్రముల బంధించుటవలన, కాష్ఠాదులచే నభిఘాతము జెందుటవలన లేక సత్వగుణక్షయముగల నరునియొక్క శ్రోత్రాది బాహ్యేంద్రియముల యందు, అభ్యంతరమనోవహనాడులయందు, లేక కర్మేంద్రియజ్ఞానేంద్రియములయందు, వాతాదిదోషములు ప్రవేశించుటవలన, మనుజుఁడు మూర్ఛంజెంది సుఖదుఃఖజ్ఞానరహితుండై భూమిపై కాష్ఠమువలె బ్రెళ్లును. (మూర్ఛ యనఁగా సంజ్ఞావహనాడులయందు వాతాదిదోషము లావరించుటవలన సుఖదుఃఖజ్ఞానమును నష్టపరచెడి అజ్ఞాన మకస్మాత్తుగ ప్రాప్తంబగుటయ. ఇది వాతజమూర్ఛ, పి_త్తజమూర్ఛ, శ్లేష్మజమూర్ఛ, రక్తజమూర్ఛ, విషజమూర్ఛ, మద్యజమూర్ఛ, అన ఆరువిధంబులు. ఈ ఆరుమూర్ఛలయందును పి_త్తము రాజుగ నుండును.

### పూర్వరూపము

హృత్పీడా జృంభణం గ్లాని స్సంజ్ఞా దౌర్బల్యమేవ చ. 251
సర్వాసాం పూర్వరూపాణి యథాస్వం చ విభావయేత్,

తా. హృదయమున పీడ, ఆవలింతలు, వమనము, బడలిక భ్రాంతి అనునవి సర్వమూర్ఛలకు పూర్వరూపములు. ఈమూర్ఛలక్షణముల వాతాదిభేదములవలన తెలియవలయును.

### వాతజమూర్ఛాలక్షణము

నీలం వా యది వా కృష్ణ మాకాశమథవారుణమ్. 252
పశ్యం స్తమః ప్రవిశతి శీఘ్రం చ ప్రతిబుధ్యతే,
వేపథుశ్చాంగమర్దశ్చ ప్రపీడా హృదయస్య చ. 253
కార్శ్యంశ్యామారుణాఛాయా మూర్ఛాయే వాతసంభవే,

తా. ఆకాశమును నీలవర్ణముగ, నల్లగ లేక ఎఱ్ఱగ గాంచుట, మూర్ఛిల్లుట, కడు శీఘ్రముగ తెలివివచ్చుట, శరీరము వణకుట, ఒడలు విరుచుట, మిక్కుటముగ రొమ్ము నొచ్చుట, శరీరము కృశించుట, శరీరవర్ణము నల్లగగాని, లేక నీలముగగాని ఉండుట- ఈలక్షణములు గలది వాతజమూర్ఛ యని తెలియవలయును.

### పిత్తజమూర్ఛాలక్షణము

రక్తహరితవర్ణం వా వియత్పీతమథాపి వా. 254
పశ్యం స్తమః ప్రవిశతి సస్వేదశ్చ ప్రబుధ్యతే,
సపిపాస స్ససంతాపో రక్తపీతాకులేక్షణః. 255
సంభిన్నవర్చాః పీతాభో మూర్ఛాయే పిత్తసంభవే,

తా. ఆకాశమును ఎఱ్ఱగ, లేక ఆకుపసపు వర్ణముగ లేక పసపువర్ణముగ గాంచి తత్క్షణమున మూర్ఛిల్లుట, తెలివిగలుగునపుడు చెమట, దప్పి, సంతాపము గలుగుట, నేత్రములు ఎఱ్ఱగ, లేక పసపువర్ణముగ నుండుట, మలము పచ్చగ వెడలుట, శరీర కాంతి పసపువర్ణముగ నుండుట - ఈలక్షణములు గలది పిత్తమూర్ఛ యని తెలియవలయును.

### కఫజమూర్ఛాలక్షణము

మేఘసంకాశ మాకాశ మావృతం వా తమోఘనైః. 256
పశ్యం స్తమః ప్రవిశతి చిరాచ్చ ప్రతిబుధ్యతే,
గురుభిః ప్రావృతైరంగై ర్యథైవార్ద్రేణ చర్మణా. 257

సప్రసేకస్సహృల్లాసో మూర్ఛాయే కఫసంభవే,

తా. మేఘములచేగాని, లేక చీకటిచేగాని గప్పంబడినటుల ఆకాశమును గాంచి తక్షణమున మూర్ఛిల్లి దీర్ఘకాలముమీఁద తెలివిని జెందుట, శరీరముపై దట్టమైన వస్త్రముగాని, లేక పచ్చి చర్మముగాని, కప్పంబడినటు లుండుట, ముఖమువలన చొంగకారుట, వాంతివచ్చునటు లుండుట - ఈలక్షణములు గలది కఫజమూర్ఛ యని తెలియవలయును.

సన్నిపాతజమూర్ఛాలక్షణము

సర్వాకృతిస్సన్నిపాతా దపస్మారఇవాగతః. 258
స జంతుం పాతయత్యాశు వినా బీభత్సచేష్టితైః,

తా. వాతపిత్తశ్లేష్మలక్షణయుక్తంబై నోట నురుగుకారుట, పండ్లుకొరుకుట, నేత్రములు త్రిప్పుట - ఈమొదలగు అపస్మారలక్షణవిహీనంబై రెండవ అపస్మారమువలె నుండునది సన్నిపాతమూర్ఛ యనంబడును. (ఇది వాతాదిమూర్ఛలలో అంతర్భావమును జెందియుండుటవలన ఆరుగ గణనము చేయఁబడియెను.)

రక్తమూర్ఛా సంప్రాప్తి

పృథివ్యాపస్తమోరూపం రక్తగంధస్తదన్వయః. 259
తస్మాద్రక్తస్యగంధేన మూర్ఛంతి భువి మానవాః,
ద్రవ్యస్వభావఇత్యేకే దృష్ట్వా యదభిముహ్యతి. 260

తా. పృథ్వి, ఉదకములు తమోగుణవిశిష్టములు, మఱియు రక్తముయొక్క గంధమును పృథ్వి ఉదకసంబంధము గలదిగ నుండుటంజేసి తమోగుణవిశిష్టంబు, దానం జేసి తామసప్రాధాన్యము గలవారలు రక్తగంధమువలన మూర్ఛంజెందెదరు. రక్తగంధము రాక రక్తమును చూచినమాత్రముననే మూర్ఛిల్లుట ద్రవ్యస్వభావగుణమని కొందఱు వచించెదరు.

విషమద్యజనిత మూర్ఛావివరణము

గుణాస్తీవ్రతరత్వేన స్థితాస్తు విషమద్యయోః,
తఏవతస్మాదాభ్యాంతు మోహౌ స్యాతాం యథేరితౌ. 261

తా. తైలాదులయందు (శ్లో. లఘురూక్షమాశువిశదం వ్యవాయితీక్ష్ణం వికాసి సూక్ష్మం చ, ఉష్ణమనిర్దేశ్యరసం దశగుణముక్తం విషంతత్ జ్ఞేయః)అనఁగా లఘు, రూక్ష, ఆశు, విశద, వ్యవాయి, తీక్ష్ణ, వికాసి, సూక్ష్మ, ఉష్ణ, అనిర్దిశ్యరసము లను నీపదిగుణంబు

లలో కొన్ని తీవ్రముగ నుండుటవలన మూర్ఛ గలుగకుండును. మఱియు పైఁజెప్పఁబడిన పదిగుణంబులు విషమద్యములయందు కడుతీవ్రతరములుగ నుండుటవలన పైఁజెప్పఁబడిన ప్రకారము మోహము గలుగును. విషమద్యములలో విషము జీర్ణము జెందకుండును. దానంజేసి విషసంబంధమువలన జనించిన మోహము స్వయముగ వదలక బాధింపుచుండును. మద్యము జీర్ణము జెందును. దానంజేసి మద్యమువలన జనించిన మోహము స్వాభావికముగ శాంతము జెందును.

### రక్తజాదిమూర్ఛాలక్షణము

స్తబ్ధాంగదృష్టి స్త్వసృజాగూఢో చ్ఛ్వాసశ్చ మూర్ఛితః,
మద్యేన విలపఞ్ శేతే నష్టవిభ్రాంతమానసః. 262
గాత్రాణి విక్షిపఞ్ భూమౌ జరాం యావన్నయాతి తత్,
వేపథు స్స్వప్నతృష్ణాస్స్యు స్తమశ్చ విషమూర్ఛితే. 263
వేదితవ్యం తీవ్రతరం యథాస్వం విషలక్షణైః,

తా. శరీరము నేత్రములు స్తంభించుట, శ్వాసము అస్పష్టముగ వెడలుట, మద్యపానమువలన తఱుచుగ మాటలాడుట, నిద్రించుట, స్మృతి లేకుండుట, భ్రమించుట, మద్యము జీర్ణము కాకుండువఱకు భూమిపైఁబడి కాళ్ళను చేతులనుగొట్టుట - ఈలక్షణములుగలది రక్తజమూర్ఛయని తెలియవలయును. కంపము, నిద్ర, దప్పి, అజ్ఞానము అనువానితోఁగూడినదై సుశ్రుతకల్పస్థానమున చెప్పంబడిన మూల, పత్ర, క్షీరాది సేవనవలన జనించెడి విషలక్షణయుక్తంబై యుండునది విషజమూర్ఛ యనంబడును.

### మూర్ఛా, భ్రమ, తంద్ర, నిద్ర అనువానిభేదములు

మూర్ఛా పిత్తతమః ప్రాయా రజః పిత్తానిలాద్భ్రమః. 264
తమోవాతకఫా తంద్రా నిద్రా శ్లేష్మతమో భవా,

తా. మూర్ఛారోగమున పిత్త, తమోగుణములు ప్రబలముగ నుండును. రజోగుణపిత్తవాతములవలన భ్రమ గలుగును. తమోగుణవాతకఫములవలన తంద్ర గలుగును. కఫము, తమోగుణము అనువానివలన నిదుర గలుగును.

### తంద్రాలక్షణము

ఇంద్రియార్థేష్వసంప్రాప్తి ర్గౌరవం జృంభణం క్లమః. 265
నిద్రార్తస్యేవయస్యేహే తస్య తంద్రాం వినిర్దిశేత్,

తా. ఇంద్రియములకు స్వస్వవిషయగ్రాహికశక్తివిహీనత, శరీరగౌరవము, ఆవలింతలు, బడలిక అనునవి నిద్రార్తపురుషునికి గలుగునటుల జాగ్రదవస్థయం దుండువానికి

గలిగిన తంద్ర యని జెప్పంబడును. (చరకే. "శ్లో. యదా తు మనసి క్లాంతే కర్మాత్మానః క్లమాన్వితాః, విషయేభ్యో నివర్తంతే తదా స్వపితి మానవః." అనఁగా నెప్పుడు మనస్సు ఇంద్రియములు బడలి విషయగ్రాహకశక్తివిహీనంబులుగ నుండెడినో అపుడు నిదుర గలిగిన దని తెలియవలయును. (భ్రమయొక్క లక్షణము ప్రసిద్ధం బగుటచేనిచట జెప్పంబడదయ్యెడు.)

దోషేషు మదమూర్ఛాద్యా గతవేగేషు దేహినామ్. 266
స్వయమేవోపశామ్యంతి సన్యాసేనౌషధై ర్వినా,

తా. దోషములయొక్క వేగము శమించిన మదమూర్ఛాదులు తమంతట తామే శమించును. మూర్ఛాది వ్యతిరిక్తసన్యాసమునందైతేనో దోషములయొక్క వేగము ఔషధము లేకయే శమించ నేరదు.

## సన్యాసలక్షణము

వాగ్దేహమనసాం చేష్టా ఆక్షిప్యాతిబలామలాః. 267
సన్యస్యంత్య బలం జంతుం ప్రాణాయతనమాశ్రితాః,
ససాసం న్యాససంన్యస్తః కాష్ఠీభూతో మృతోపమః. 268
ప్రాణై ర్విముచ్యతే శీఘ్రం ముక్త్వా సద్యఃఫలాం క్రియాం,

తా. కడుబలిష్ఠమైన దోషము వాగ్దేహ మనోవ్యాపారములకు ప్రతిబంధమును గలుగంజేసి హృదయమున నెలకొని దుర్బలులైనవారిని మోహింపంజేయునది సన్యాసమనంబడును. దీనివలన పీడితుఁడుగ నుండువాఁడు భూమిపై కాష్ఠమువలె ద్రెళ్లును. దీని యందు సూదులతో పొడుచుట, యంత్రములతో త్రిప్పుట, దీపపువత్తినిముట్టించి దానిపొగను నాసికాద్వారములయం దునుచుట - యీ మొదలగు చికిత్సలను చేయవలయును. అట్లు చేయనియెడల శీఘ్రముగా మృతి జెందును.

## సర్వమూర్ఛలకు శిరీషబీజాద్యంజనము

శిరీషబీజం సింధూత్థం వచా మారీచా మాగధీ. 269
మనశ్శిలాం సమంచైవ బస్తమూత్రేణ పేషయేత్,
తత్కల్కేనాంజయేన్మూర్ఛాం సన్నిపాతోద్భవాం జయేత్. 270

తా. దిరిసెనపువిత్తులు, సైంధవలవణము, వస, మిరియాలు, పిప్పళ్ళు, రక్తమణిశిల-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గొఱ్ఱెమూత్రముతో మర్దించి కల్కముచేసి కన్నులఁబెట్టిన సన్నిపాతమూర్ఛ హరించును.

## వాతాదిస్వస్థానస్థతాలక్షణము

దోషాయుక్తశ్చ సుఖకృద్దోషోయుక్తో సుఖావహః,
హృదయే నాభిమధ్యే చ జాయతే పిత్తకోపతా. (ఆయుర్వేదే) 271

తా. వాతపిత్తశ్లేష్మములు తమతమస్థానములయం దుండిన శరీరము సుఖకరముగ నుండును లేక ఒకటితోనొకటి గలసియుండిన అనేకరోగముల గలుగంజేయును. బొమ్మ, బొడ్డు-వీనినడుమ గుబులుజనించిన పిత్తము ఊర్ధ్వగత మైనదని తెలియవలయును. ఇది కష్టసాధ్యము. (ఇది నివర్తించుటకై బడబాగ్నిరసమునుగాని, లేక ప్రాణిబద్ధరసమును గాని, లేక పైత్యాంతకరసమునుగాని, లేక ఆముదము, తిప్పసత్తు, మిరియమునుగాని లేక గచ్చపలుకులనుగాని లేక చిన్నంగిరసములో నెయ్యి, మిరియపుచూర్ణము, చింతపులుసు అనువానిని కలిపిగాని సేవింపవలయును. మఱియు దీనియందు పిత్తాంతకరసము, మహా ద్రాక్షాదిచూర్ణమును ప్రసిద్ధముగాన సేవింపవలయును.)

## పిత్తప్రకోపకారణము

అతికట్వమ్ల తీక్ష్ణోష్ణ శుష్కశాకాత్పురాన్నతః,
విషమాశన క్రోధాగ్ని ధూమఘర్మాధ్వసేవనాత్, 272
శరద్గ్రీష్మోద్గమే పిత్త ప్రకోపో జాయతే నృణాం,
వాంతి భ్రాంతిక్లమా మూర్ఛా ప్రలాపోఽతిశిరోరుజా. 273
దాహోఽరుచి స్తృషా దోషాః పిత్తాస్స్యురతిదారుణాః,
శీతలై ర్మధురాహారై స్స్నానపానై రుపాచరేత్. 274

తా. కడుచేదు, పులుసు, తీక్ష్ణపదార్థములు, ఉష్ణపదార్థములు, ఎండినకూరలు, దుష్టాన్నము అనువానిసేవనవలన, విషమాశనము, కడుకోపము, అగ్నితాపము, పొగ, ఎండ, మార్గము నడుచుట అనువానివలన, శరద్గ్రీష్మకాలములవలన, పైత్యము ప్రకోపించి వాంతి, భ్రాంతులు, బడలిక, మూర్ఛ, ప్రలాపము, తలనొప్పి, తాపము, అరుచి, దప్పి అనులక్షణములతో గూడినవై దారుణములగు ఇతర పైత్యరోగముల జనింపంజేయును. వానియందు శీతలద్రవ్యసేవన, మధురద్రవ్యములయొక్కసేవన, స్నానపానములు హితకరంబులు.

శిరోర్తిమూర్ఛా వమిదాహమోహాఃకంపోఽతిశోషారుచిపర్వభేదాః,
ఉన్నిద్రతా తృడ్భ్రమరోమహర్ష జృంభాతివాక్యాపి మదశ్చ పిత్తే.
(మతాంతరే)

తా. తలనొచ్చుట, మూర్ఛ, వాంతి, మోహము, కంపము, కడుశోష, అరుచి గలుగుట, వ్రేళ్ళగణుపులు నొచ్చుట, నిదుర పట్టకుండుట, (మిక్కుటముగ ఆఁకలి గలు

గుట) దప్పి, భ్రమ గలుగుట, శరీరము గగుర్పొడుచుట, ఆవలింతలు గలుగుట, త్వరపడి మాటలాడుట, శరీరము గురుతెరుగకుండుట-ఈలక్షణములుగలది పైత్త్యరోగమని తెలియవలయును. (పైఁజెప్పఁబడిన పిత్తరోగనిదానాదుల బాగుగా నెఱింగి చికిత్సింపవలయును.

వాతపైత్త్యగుబులు గలరోగములకు త్రివిక్రమరసము

సూతం గంధం మృతం తామ్రం శిలా తాళం చ శోధితం,
కృష్ణా నాగబలా పథ్యా శ్రీఖండం చ విదారికా. 276
ఏరండం మర్దయే త్తుల్యం ద్రవై శ్చ్ఛిన్నపునర్నవైః,
నిష్కమాత్రాం వటీం ఖాదే ద్వాతపిత్తహరం భవేత్. 277
(సిద్ధరసార్ణవే)

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, తామ్రభస్మము, శుద్ధిచేసిన శిలాజిత్తు, శుద్ధిచేసిన తాళకము, పిప్పళ్ళు, జిబిలికవేళ్లు, కరక్కాయలు, శ్రీగంధము, నేలగుమ్మడుగడ్డ, ఆముదపువేరు - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి చిత్రమూలరసముతోను, గలిజేరువేళ్ళరసముతోను మర్దించి నిష్కప్రమాణము మాత్రలుజేసి తేనెతో సేవించిన వాత పిత్త సంకలితరోగములు, గుబులుగలరోగము హరించును. (లేక ఇది నివర్తించుటకై పైత్తాంతకరసమునుగాని, లేక ద్రాక్షాదిచూర్ణమునుగాని సేవింపందగును.)

వాతపైత్తమూర్ఛలకు ప్రచండభైరవరసము

పలాని పంచ సూతస్య పలం వై తామ్రచూర్ణకం,
జంబీరాణాం ద్రవైః పిష్టం సూతతుల్యం చ గంధకమ్. 278
నాగవల్లీద్రవైః పిష్టం తామ్రపాత్రే ప్రదాపయేత్,
రుద్ధ్వా లఘుపుటే పాచ్యం త్ర్యూషణైస్సమమిశ్రితమ్. 279
అర్ధాంగకంపవాతార్తో భక్షయేత్తు ద్విగుంజకం,
దాహ సంతాప మూర్ఛాసు వాయుపిత్తసమన్వితే. (సిద్ధరసార్ణవే)

తా. శుద్ధిజేసిన రసము ౫ భాగములు, తామ్రభస్మము ౧ భాగము, శుద్ధిచేసిన గంధకము ౫ భాగములు-ఇటుల వీనిని ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసము, తమలపాకు రసము వీనితోమర్దించి తామ్రపాత్రలోగాని (లేక కుప్పెలోగాని) నునిచి దానిమూతిని మూసి లఘుపుటంబిడి చూర్ణముజేసి దానికి సమముగ త్రికటుకచూర్ణమును గలిపి రెండు గురిగింజలయెత్తును సేవించిన అర్ధాంగవాతము, కంపవాతము, దాహము, శరీరతాపము, మూర్ఛ, వాత పైత్త్య సంకలితరోగములు (గుబులుగలరోగములు) హరించును.

### వాత, శ్లేష్మసంకలితమునకు గగనగర్భికారసము

సూతాభ్ర తీక్ష్ణ తామ్రం చ మృత తాళక గంధకం,
భార్గీ శుంఠీ వచా ధాన్యా కట్ఫలం చ విషా భయమ్. 28
మర్ద్యం పర్పటికా ద్రావైర్నిష్కం వై భక్షయే ద్వటీం,
వాతశ్లేష్మహరత్యాశు వటీగగనగర్భికా. 29

తా. రసభస్మము, అభ్రకభస్మము, ఉక్కుభస్మము, తామ్రభస్మము, శుద్ధిచేసి తాళకము, శుద్ధిచేసిన గంధకము, గంటుభారంగి, సొంటి, వస, కొతిమెర్లు, గుము తేకు, శుద్ధిచేసిన నాభి, కరక్కాయలు - వీనిని సమభాగములుగ ఖల్వములో నుని పర్పాటకరసముతో మర్దించి నిష్కప్రమాణము మాత్రలుచేసి తేనెతో సేవించిన వా శ్లేష్మ సంకలితరోగములు హరించును.

### వాతపైత్త మూర్ఛాహరకల్పములు

క. కానుగవిత్తులు పిప్పలి, వేనీళ్లను నూరి ద్రాగ వేగమె మఱి ర
మేననునంటినమూర్ఛల, నానాటను సంహరించు నయగుణశీల
గీ. బొడ్డుకాకరగడ్డయుఁ బొడియుఁ జేసి
గలిపి నీటను ద్రావంగఁ గడిదియైన
మూర్ఛగణముల నిర్మూలముగ హరించు
నగ్గి మిడతలుపడి మ్రగ్గినట్లు వేగ.
క. శ్రీగంధ రేలగంధము
బాగుగ మఱి చారెడేసి భక్షణసేయ
నాగాభరణునికృపచే
వేగంబున మాను మూర్ఛవితతులు ధాత్రిన్.

[మణుగు నమిలివేళ్ళచెక్క, మణుగు వావిలివేళ్లు, ఆయాకు, అడ్డెడు తెల్ల ఉ వలు-ఇవి కూడా కుండనుబెట్టి నలుతూములనీళ్ళుపోసి అష్టావశేషముగా కషాయముగ అది వడియబోసి అందు రెండుసేర్లు నూనెపోసి అది లేహముగానువండి ముప్పాతికయె వెల్లుల్లిపాయలముద్ద కలిపి ఆరునెలలు సేవించేది. మూర్ఛ, కుందేటితెవులు, తీపు వాతములు మానును. ఆకుదీసిన ఉలవపప్పు, మునుగకూర, కందిపప్పు సేవించే ఈయోగము మాకు లభించిన గ్రంథములయందు సంస్కృత శ్లోకవిహీనంబై ఔ సిద్ధిగ ననుగుణ్యంబై గన్పట్టుచుండినను గ్రంథస్థంబగుదాని వదలనేరక యిందు ముద్రి పించినారము.

ముండీపంచాంగచూర్ణం వా తత్తద్రోగం వినాశయేత్,
తచ్చూర్ణం క్షీరమధునా సర్వమూర్ఛాహరం పిబేత్. 283

తా. కర్షప్రమాణ బోడతరసమూలచూర్ణమును ఆవుపాలలోగాని, లేక తేనెతోగాని ప్రత్యహము సేవింపుచుండిన సర్వమూర్ఛలు, ఆయారోగములు హరించును.

మూర్ఛలకు నస్యము

మధూకపిష్టం సితయా చ యుక్తం
స్తన్యేన నస్యం వినిహంతి మూర్ఛాం,
స్తన్యేన హీక్షుస్వరసేన నస్యం
సచందనం చైవ నిహంతి మూర్ఛామ్. (నిత్యనాథీయే) 284

తా. ఇప్పపిండి, పంచదార-వీనిని చనుబాలతో నూరి నస్యము జేసినను, లేక చనుబాలు, చెఱకురసము, శ్రీగంధము వీనిని నస్యము జేసినను మూర్ఛ హరించును.

కుంకుమం శర్కరాయుక్తం ఘృతేన పయసా తథా,
మూర్ఛావికారదోషఘ్నం వాయుజోన్మాదపిత్తజిత్, 285
(ఆయుర్వేదే)

తా. కుంకుమపువ్వు, పంచదార, ఆవునెయ్యి, ఆవుపాలు - వీనిని నస్యము గాని లేక సేవనగాని జేసిన మూర్ఛ, వాతోన్మాదము, పిత్తము హరించును.

నారీపయస్సమధుకం శర్కరామాక్షికం ఘృతం,
మూర్ఛా మద వికారఘ్నం వాయుజోన్మాదపిత్తజిత్. 286

తా. చనుబాలు, యష్టిమధుకము, పంచదార, తేనె, నెయ్యి, నస్యము జేసిన మూర్ఛ, మదము, వాతోన్మాదము, పిత్తము హరించును.

కుంకుమం ఘృతసంయుక్తం మూర్ఛా పిత్తవికారనుత్,
శిరోభ్రమహరం శ్రేష్ఠం నస్యం వై నాత్రసంశయః. 287

తా. కుంకుమపువ్వును ఆవునేతితో నూరి నస్యము జేసిన మూర్ఛ, పిత్తము, తల తిరుగుట, నిస్సంశయముగ హరించును.

క. జిల్లేడుకొనలరసమును
సల్లలితము ముక్కుదొండ్ల సరగునఁ బోయఁగా
వెల్లి యగు మూర్ఛరోగము
లెల్లను దా మానుసుమ్మి యిలలో వెలయన్.

## పైత్తరోగములయందు పథ్యము

పురాణశాలి గోధూమ పటోలం తండులీయకం,
ధాత్రీ వయస్థా ఝషరసీ ద్రాక్షా దాడిమ చందనమ్. 288
చతుర్వింశతిపైత్తే తు సేవితం చ హితం సదా,

తా. ప్రాతవడ్లు, గోధుమలు, పొట్లకాయ, చిర్రికూర, ఉసిరికపప్పు, పొన్నగంటికూర, చాతలాసికూర, ద్రాక్షపండు, దానిమ్మపండు, శ్రీగంధము-ఇవి ౨౪ పైత్తరోగములయందు పథ్యకరంబులు.

## పైత్తరోగములయం దపథ్యము

దధి క్షీర గుడం సర్పి ర్మాష నిష్పావ సర్షపమ్. 289
విదాహి గురువస్తూని వ్యాయామః క్రోధ ఆతపః,
చతుర్వింశతిపైత్తే చ హ్యపథ్యం సముదాహృతమ్. 290

తా. పెరుగు, పాలు, బెల్లము, నెయ్యి, మినుములు, అనుములు, ఆవాలు, విదాహకరద్రవ్యములు, గురుకరద్రవ్యములు, సంచారము, కోపము, ఉష్ణము, ఎండసేవ ఇవి ౨౪ పైత్తరోగములయం దపథ్యకరంబులు.

సప్తమప్రకరణమ్.

# అష్టమప్రకరణమ్



అవతరణిక. ఇపుడు గ్రంథకర్త విఘ్నబాహుళ్యశంకగలవాఁడై తనచే జేయంబడు నీగ్రంథము నిర్విఘ్నముగ పరిసమాప్తిచెందుటకై గ్రంథమధ్యమున తనకిష్టదేవతయగు ఈశ్వరునియొక్క నమస్కారాత్మక మంగళమును "ఖట్వాంగధారిణం రుద్రం" అను శ్లోకముచే జేయుచున్నాఁడు:—

శ్లో. ఖట్వాంగధారిణం రుద్రం చంద్ర సూర్యాగ్నిలోచనం,
విష్ణువల్లభ మీశానం దేవదేవమహం భజే. 1

తాత్పర్యము. ఖట్వాంగమే యాయుధముగ గలవాఁడు, చంద్ర సూర్యాగ్నులే నేత్రములుగ గలవాఁడు, విష్ణువునకు ప్రియకరుఁడు, సకలైశ్వర్యసంపన్నుఁడు, సర్వదేవతలకు ప్రభువు నగు ఈశ్వరుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశ మనెడిక్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజు అని పేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథముయొక్క అష్టమప్రకరణమును వచింపుచున్నాఁడను.

## కాసరోగనిదానము

ధూమోపఘాతాద్రజసస్తథైవ వ్యాయామరూక్షాన్న నిషేవణాచ్చ,
విమార్గగత్వాదపి భోజనస్య వేగావరోధాత్క్షవథో స్తథైవ. 3
ప్రాణోహ్యుదానానుగతః ప్రదుష్టస్సంభిన్న కాంస్యస్వనతుల్యఘోషః,
నిరేతివక్త్రాత్సహసా సదోషో మనీషిభిః కాసఇతి ప్రదిష్టః. 4
(ఆయుర్వేదే)

తా. ముఖ, నాసికాద్వారముల పొగ దుమ్ము ప్రవేశించి శ్వాసము నడ్డగించుట, మిక్కుటముగ సంచారము మొదలగు వాసిని సేయుట, రూక్షాన్నముల ప్రతిదినము సేవించుట, కడుతీవ్రముగ భుజించుటవలన అన్నము విరుద్ధమార్గమును జెందుట, (అనఁగా పొరబోవుట) మలమూత్రముల తుమ్ముల నడ్డగించుట-ఈకారణములవలన ప్రాణవాయువు

మిక్కుటముగ దుష్టంబై ఉదానవాతమును దోషయుక్తముగ జేసి దానితోఁ గలసి కఫ పిత్తయుక్తంబై పగిలినకంచుపాత్రతో తుల్యమైన శబ్దము గలదై వాద్ద్వారంబుననుండి అకస్మాత్తుగ బైలువెడలును. దీనినే విద్వజ్జనులు [1]కాస మని వచించెదరు.

కాసరోగభేదవివరణము

పంచకాసాః స్మృతా వాత పిత్త శ్లేష్మ క్షత క్షయైః,
క్షయాయోపేక్షితాస్సర్వే బలినశ్చోత్తరోత్తరమ్. 5

(మాధవనిదానే)

తా. కాసరోగము, వాత, పిత్త, శ్లేష్మ, క్షత, క్షయమువలన నైదువిధంబులు. వానియం దౌషధోపచారము సేయబడకుండుటచే సర్వధాతువులు క్షయించి ఒకదానికన్న నొకటి బలవత్తరముగ నగును. (అనఁగా వాతకాసాపేక్ష యా పిత్తకాసము, పిత్తకాసాపేక్ష యా శ్లేష్మకాసము, శ్లేష్మకాసాపేక్ష యా క్షతకాసము, క్షతకాసాపేక్ష యా క్షయకాసము జనించు ననుట.)

కాసరోగ పూర్వరూపములు

పూర్వరూపం భవేత్తేషాం శూకపూర్ణగళాస్యతా,
[2]కంఠే కండూశ్చ భోజ్యానా మవరోధశ్చ జాయతే. 6

(నిత్యనాథీయే)

తా. కంఠము, నోరు, పీసియందు ముండ్లుబారుట, కంఠమునందు దురదగలుగుట, కంఠములో అన్నము దిగకుండుట-ఈలక్షణములవలన కాసముజనించునని తెలియవలయును.

వాతకాసలక్షణము

వాతకాసే కంఠశూలం మూర్ధ్ని పార్శ్వోదరేఽపి చ,
క్షామాననం బలక్షీణం భిన్నకాంస్యస్వరస్తథా. 7

తా. కంఠము, శిరము, పార్శ్వములు, కడుపు శూలించుట, ముఖము కృశించుట, సత్వము క్షయించుట, స్వరము పగిలిన కంచుపాత్రతో తుల్యముగ నుండుట-ఈలక్షణములు గలది వాతకాస మని తెలియవలయును.

పైత్యకాసలక్షణము

ఉరోదాహో [3]వక్త్రశోష స్తిక్తాస్యత్వం జ్వరస్తృషా,
కటుతిక్తం వమిశ్చోష్ణం పీతం చ పిత్తకాసకే. (మాధవనిదానే) 8

---

1 కాస మనదగ్గు. 2 కంఠే కండూర్భవేచ్చైవ భుక్తా రోధశ్చ జాయతే
3 రక్తశోషరక్తము శోషించుట.

తా. బొమ్మలలో మండుట, నో రెండుట, నోరు చేదువేయుట, జ్వరము, దప్పి గలుగుట, కారముగ ఒగరుగ ఉష్ణముగ పచ్చగ వాంతి యగుట, చక్రాకారమువలన శరీరము పాండురవర్ణముగ నుండుట-ఈలక్షణములు గలది పిత్తకాసమని తెలియవలయును.

### శ్లేష్మకాసలక్షణము

శిరో ర్తికఫపూర్ణాస్యం హృద్దాహో గురుతారుచిః,
కాసే సాంద్రకఫః కండూ శ్లేష్మకాసస్య లక్షణమ్. 9

తా. తల నొచ్చుట, ముఖము కఫముచే పూయంబడినటు లుండుట, బొమ్మలలో మండుట, శరీరము బరువుగ నుండుట, అరుచిగలుగుట, దగ్గిన దట్టముగ కఫము వెడలుట, శరీరమున దురద గలుగుట- ఈలక్షణములు గలది శ్లేష్మకాస మని తెలియవలయును.

### క్షతకాసలక్షణము

పర్వభేద జ్వర శ్వాస తృష్ణా వై స్వర్యపీడితః,
స పూర్వం కాసతే శుష్కం తతః ష్ఠీవతి శోణితమ్. 10
పారావతఇవాకూజః కాసవేగాత్క్షతోద్భవే, (ఆయుర్వేదే)

తా. వేళ్ళగణుపులు నొచ్చుట, జ్వరము, ఉబ్బసము, దప్పి గలుగుట, బొంగుపోయినటుల మాటలాడుట, తొలుత పొడిదగ్గుగలిగి పిదప రక్తము నుమియుట, క్షతజకాస వేగమువలన పావురపిట్టవలె గుర్గురుశబ్దమును జేయుట- ఈలక్షణములు గలది క్షతకాస తెలియవలయును.

### క్షయకాసలక్షణము

గాత్రశూలం జ్వరో దాహో మోహః ప్రాణక్షయ శ్శ్వసన్. 11
శుష్కం నిష్ఠీవయే త్కృచ్ఛ్రాత్పూయం శోణితం చ యః,
ఇత్యేష క్షయజః కాస స్సాధ్యో బలవతాం క్వచిత్. 12
క్షీణానాం దేహనాశాయ సఏవా సాధ్యతాం వ్రజేత్,
(మాధవనిదానే)

తా. శరీరము నొచ్చుట, జ్వరము, తాపము, మోహముగలుగుట, ప్రాణవాతము క్షయించుట, వాతప్రకోపమువలన మిక్కుటముగ నిట్టూర్పువాయువు వెడలుట, పొడి దగ్గు గలుగుట, కష్టముమీద చీము నెత్తురుతో గూడియుండుకఫమును ఉమియుట- ఈలక్షణములు గలది క్షయకాస మని తెలియవలయును. ఇది సత్వముగలవారిలో ఒకానొకనికి సాధ్యం బగును. సత్వము లేకుండువానికి అసాధ్యం బగును.

## కాసరోగసాధ్యాసాధ్యములు

కాసః పంచవిధ స్తత్ర శుష్కో వాతాత్మకే మతః. 1
పైత్తికే దాహసంయుక్త శ్లేష్మికే పీనసాన్వితః,
క్షతేభిఘాతాదురసి క్షయజస్తు క్షయాకృతిః. 1
యాప్యః క్షతసముద్భూతః క్షయకాసో న సిధ్యతి,

తా. పైఁజెప్పఁబడినప్రకారము కాసరోగము ౫ విధంబులు. అందు వాతకాసమున పొడిదగ్గుగాని, లేక శరీరకృశత్వముగాని గలిగియుండును. (ఇది సాధ్యము.) పి కాసమున సర్వాంగములయందు తాపము గలుగును. (ఇది సాధ్యము) శ్లేష్మకాసము పీనస గలుగును. (ఇది సాధ్యము.) క్షతకాసమున అభిఘాతమువలన ఱొమ్మునందలి రక్తవ చెడి దగ్గు గలుగును. ఇది యాప్యము. క్షయకాసమున క్షయరోగలక్షణములు గలుగున ఇది అసాధ్యము.

## పంచకాసాదులకు అమృతాంకరసము

రస గంధ త్రికటుకం గ్రంథికం చవ్యచిత్రకమ్. 1
అమృతం లవణం తుల్యం భృంగస్వరసమర్దితం,
గుంజామాత్రాశ్చ వటికాః పంచకాసాన్ వినాశయేత్. 1
అమృతాంకరసో నామ్నా వింశతి శ్లేష్మరోగజిత్,
అశీతివాతరోగాంశ్చ నాశయే న్నాత్రసంశయః. (మాధవనిదానే) 1

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, త్రికటుకములు, మోడి, చవ్యవ చిత్రమూలము, శుద్ధిచేసిన నాభి, సైంధవలవణము-వీనిని సమభాగములుగ ఖల్వము నునిచి గుంటగలగరాకురసముతో బాగుగ మర్దించి గురిగింజంత మాత్రలుజేసి యం దానిని తేనె, పిప్పలితో సేవించిన ౫ కాసములు, ౨౦ శ్లేష్మరోగములు, ౮౦ వ రోగములు, చకారమువలన గళరోగము, తాలురోగము, శిరోరోగము, కర్ణవ నాసారోగము నిస్సంశయముగ హరించును.

## తిలాదిలేహ్యము

తిలా భల్లాతకం పథ్యా గుడంచేతి సమాంశకం,
దుర్నామ శ్వాసకాసఘ్నం ప్లీహ పాండు రుజాపహమ్.
(నిత్యనాథీర

తా. ఎఱ్ఱనువ్వులు, శుద్ధిజేసిన జీడిగింజలు, కరక్కాయలు - వీనిని సమభ ములుగ చూర్ణముజేసి దానికి సమముగ బెల్లమును గ్రహించి పాకుబట్టి యం

చూర్ణమును గలిపి లేహ్యాపక్వముగ వండి ప్రత్యహము నాలుగునూడల యెత్తును గాని, లేక ధరణమెత్తునుగాని, తేనెతో సేవింపుచుండిన మూలరోగము, శ్వాసకాసలు, ప్లీహరోగము, పాండువు హరించును. (లేక ఈగ్రంథములో జ్వరప్రకరణమునందు జెప్పఁబడిన చండభానురసమునుగాని, లేక సూతరాజీయ మను రసమునుగాని సేవించిన కాసశ్వాసములు హరించును.

### చిత్రకాదిలేహ్యము

చిత్రకం పిప్పలీమూలం వ్యోషం ముస్తా దురాలభా,
శఠీ పుష్కరమూలం చ శ్రేయసీ సురసా వచా. 19
భార్గి ఛిన్నరుహా రాస్నా కర్కటాఖ్యా చ కర్షికా,
కల్కాగ్నిదగ్ధద్వితులం కషాయే పలవింశతిః. 20
మత్స్యండికాయా దశవా సర్పిషః కుడవం పచేత్,
సిద్ధే శీతే పృథక్క్షౌద్ర పిప్పలీ కుడవాన్వితమ్. 21
చతుః పలం తు గాక్షీర్యా శ్చూర్ణం తత్ర ప్రదాపయేత్,
లేహయే త్కాస హృద్రోగ శ్వాస గుల్మ నివారణమ్. 22
(ఆయుర్వేదే)

తా. చిత్రమూలము, మోడి, త్రికటుకములు, తుంగముస్తెలు, *దురదగొండి వేరు, కచోరములు, పుష్కరమూలము, కరక్కాయలు, తులసి, వస, గంటుభారంగి, తిప్పతీఁగె, సన్నరాస్నము, కర్కాటకశృంగి-వీనిలోఁ ప్రతిదానిని కర్షప్రమాణము గ్రహించి కల్కముజేసి అందు ౨౦౦ పలములయెత్తు నీళ్ళుపోసి ౨౦ పలములు శేషించునటుల కషాయము కాచి వడియగట్టి అందు ౧౦ పలములయెత్తు ఖండశర్కర, కుడవప్రమాణము నెయ్యి కలిపి లేహ్యాపక్వముగ వండి చల్లారినపిదప తేనె ౧ కుడవము, పిప్పలిచూర్ణము ౧ కుడవము, వెదురుప్పు ౪ పలములు వైచి కలియఁబెట్టి సేవించిన కాసము, ఱొమ్మునొప్పి, శ్వాసము, గుల్మము హరించును.

### అగస్త్యహరీతక్యవలేహ్యము

దశమూలీ స్వయం గుప్తా శంఖపుష్పీ శఠీ బలా,
హస్తిపిప్పల్యపామార్గ పిప్పలీమూలచిత్రకమ్. 23
భార్గీ పుష్కరమూలం చ ద్విపలాంశం యవాఢకం,

---

* ఇదే తీటకసింద, మఱియు ఇదే దూలగొండి యనియు జెప్పఁబడును.

హరీతకీ శతం చైవ జలే పంచాఢకే పచేత్. 24
యవేస్విన్నే కషాయే చ పూతేతచ్చాభయాశతం,
పచేద్గుడతులాం దత్వా కుడపం చ పృథగ్ఘృతమ్. 25
తైలం పిప్పలిచూర్ణం చ సిద్ధే శీతే చ మాక్షికం,
లిహ్యాద్ద్వే చాభయే నిత్య మతః ఖాదేద్రసాయనమ్. 26
వలిం చ పలితం హన్యా ద్వర్ణాయుర్బలవర్ధనం,
పంచకాసాన్ క్షయాన్ శ్వాసాన్ హిక్కాం చ విషమజ్వరాన్. 27
హన్యాత్తథాగ్రహణ్యర్శో హృద్రోగారుచిపీనసాన్,
అగస్త్యవిహితం ధన్య మిదం శ్రేష్ఠం రసాయనమ్. 28

తా. దశమూలములు, దురదగొండివిత్తులు, శంఖపుష్పి, కచ్చూరములు, ముత్తవపులగపువేళ్ళు, ఏనుగపిప్పళ్ళు, ఉత్తరేణి, మోడి, చిత్రమూలము, గంటుభారంగి, పుష్కరమూలము-ఇవి దినుసు ఒకటింటికి ౨ పలములు, యవధాన్యము ఆఢకప్రమాణము, కరక్కాయలు ౧౦౦ పలములు - ఇటుల వీనినెల్ల నొకభాండములో వైచి అంౖదైదు ఆఢకముల ప్రమాణము నుదకము పోసి కషాయము కాచవలయును. ఆభాండమందలి యవలు పక్వమైనతోడనే కషాయమును వడియగట్టి యందు కరక్కాయలు ౧౦౦ పలములు, బెల్లము ౧౦౦ పలములు, నెయ్యి ౪ పలములు, నూనె ౪ పలములు, పిప్పలిచూర్ణము ౪ పలములు కలిపి లేహ్యపక్వముగ వండి దించుకొని చల్లార్చి పిదప ౪ పలములు తేనె పోసి బాగుగ కలియబెట్టి నేతితో మాగినకుండయం దునిచి ప్రత్యహము రెండుకరక్కాయల సేవింపుచుండిన ముదిమి, పంచకాసములు, క్షయరోగము, శ్వాసము, ఎక్కిళ్ళు, విషమజ్వరము, గ్రహణి, మూలరోగము, ఱొమ్మునొప్పి, అరుచి, పీనసము - ఇవి నశించుటయేగాక శరీరకాంతి, ఆయుర్వృద్ధి, బలము నహా గలుగును. ఈ హరీతకీలేహ్యరసాయనము అగస్త్యులచే జెప్పంబడియెను.

## ఇంద్రవారుణికాదిచూర్ణము

ఇంద్రవారుణికా సూతం దేవదారు కటుత్రయం,
శర్కరాసహితం ఖాదే చ్ఛ్వాసకాసహరం పరమ్. 29
(మాధవనిదానే)

తా. పాపరకేరు, దేవదారు, త్రికటుకములు, పంచదార - వీని చూర్ణమును దినుసు ఒకటింటికి ఒకటిన్నర తులముచొప్పున గ్రహించి అందు రసభస్మము ౧౦ చిన్నములయెత్తు కలిపి ౨౦ దినములు తేనె, పిప్పలి వీనియనుపానముతో సేవింపుచుండిన శ్వాసలు కాసలు హరించును.

స్వయమగ్నిరసము

శుద్ధసూతం ద్విభాగంధం కుర్యాత్ఖల్వే చ కజ్జలీం,
తయోస్సమం తీక్ష్ణచూర్ణం [1]మర్దయేత్కన్యకాద్రవైః. 30
ద్వియామాంతే కృతం గోళం తామ్రపాత్రే వినిక్షిపేత్,
ఆచ్ఛాద్యైరండపత్రేణ [2]యామాంతేప్యుష్ణతాం వ్రజేత్. 31
ధాన్యరాశౌ న్యసేత్పశ్చా [3]ద్ద్వియామాంతే సముద్ధరేత్,
సంపేష్య గాలయేద్వస్త్రే సద్యోవారితరం భవేత్. 32
త్రికటు త్రిఫలాచైలా జాతీఫల లవంగకం,
[4]ఏతేషాం నవభాగానాం సమం పూర్వోదితం భవేత్. 33
సంచూర్ణ్య లోడయేత్క్షౌద్రై ర్భక్ష్యం నిష్కద్వయం తథా,
స్వయమగ్నిరసో నామక్షయకాసనికృంతకః. 34
ఇంద్రవారుణికామూలం భృంగీకృష్ణా తిలైస్సహ,
భక్షయేత్క్షయకాసార్తో నిష్కమాత్రప్రశాంతయే. 35
(మాధవనిదానే)

తా. శుద్ధిజేసిన రసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు-ఈరెంటిని ఖల్వములో నునిచి కాటుకవలె మర్దించి దానికి సమముగ ఉక్కుభస్మము కలిపి కలబంద రసముతోగాని, లేక ఇందుపుకాయరసముతోగాని, రెండుఝాములు మర్దించి ముద్దజేసి రాగిసంపుటములో నునిచి దానిపై ఆముదపాకులుజుట్టి ఒకఝాముపఱకు నునిచిన ఉష్ణం బగును. పిదప దానిని ధాన్యరాశియందు రెండుఝాములుగాని (లేక రెండుదినములుగాని) ఉనిచి యందుండి తీసి ఖల్వములో మెత్తగ నూరి వస్త్రగాళితముజేసి నీళ్ళపై వైచిన నది తేలును పిదప ఈలోహచూర్ణమునకు సమముగ త్రికటుకములు, త్రిఫలములు, ఏలకులు, జాజికాయ, లవంగములు అను నీతొమ్మిది వస్తువులయొక్క చూర్ణమును గలిపి తేనెలో వైచి కలియబెట్టి రెండు నిష్కములయెత్తును సేవింపుచుండినను, లేక నిష్కప్రమాణమును వెఱ్ఱిపుచ్చవేరు, గుంటగలగర, పిప్పళ్లు, నువ్వులు అనువాని అనుపానముతోడ సేవింపు చుండినను క్షయకాసము హరించును.

---

1 మర్దయేత్కతకద్రవైః. 2 యామార్ధేప్యుష్ణతా భవేత్. 3 ద్విదినాంతే. 4 ఏషాం చ పరభాగానాం సమం పూర్వరసోభవేత్ - ఇటులను పాఠాంతరములు గలవు.

### వాతకాసమునకు భూతాంకుశరసము

శుద్ధసూతస్య భాగైకం ద్విభాగం శుద్ధగంధకం,
భాగత్రయం మృతం తామ్రం మరీచం దశభాగకమ్. 36
మృతాభ్రస్య చతుర్భాగం భాగమేకం విషం క్షిపేత్,
భూతాంకుశస్య భాగైకం సర్వమామ్లేన [1]మర్దయేత్. 37
[2]యామం భూతాంకుశో నామ మాషైకం వాతకాసజిత్,
అనుపానం లిహేత్క్షౌద్రే విభీతకఫలత్వచః. 38
వాసాపాఠామలకీభార్గీ వ్యాఘ్రీభిః క్వథితం జలమ్,
కాసానశేషాంశ్చ చిరా త్పీతమాశు వ్యపోహతి. 39
మాషైకంచ లిహేత్క్షౌద్రే రక్తకాసం నియచ్ఛతి,

(ఆయుర్వేదే)

తా. శుద్ధిజేసిన రసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు, తామ్రభస్మము 3 భాగములు, మిరియాలు ౧౦ భాగములు, అభ్రకభస్మము ౪ భాగములు, శుద్ధిజేసిన నాభి ౧ భాగము, భూతాంకుశము ౧ భాగము - ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో నొకఝామము మర్దించి మాషమెత్తు మాత్రలుజేసి యందొకదానిని తేనెతో సేవించి వెంబడిగ తానికాయలబెరడు, త్రికటుకములు, ఉసిరికవరుగు, గంటుభారంగి, నేలములకవేళ్లు అనువానికషాయమును త్రాగిన దీర్ఘకాలముగ బాధింపుచుండు వాతకాసము మొదలగు సర్వకాసములు శీఘ్రముగ హరించును. మఱియు నీభూతాంకుశరసములో మాషప్రమాణమును తేనె (పిప్పలి) తోడ సేవించిన రక్తకాసము హరించును.

### వింశతి శ్లేష్మరోగవివరణము

పూర్వోక్తకాసః క్షయః కాసో రక్తకాసశ్చ చిప్పికా. 40
వాతకాసః పైత్తకాస క్షతకాసశ్చ శుక్తికా,
ఆమకాసః పాండుకాసః కృష్ణకాస స్తథైవ చ. 41
శ్లేష్మకాసో దధికాసః కాసశ్చ శ్లేష్మజిహ్వకః,
కంఠజిహ్వోపజిహ్వా చ హంతిజిహ్వకకాసకః. 42
ఊర్ధ్వకాస శ్లేష్మభంగ శ్లేష్మకుష్ఠశ్చ సంజ్ఞితః,
ఇత్యేతే వింశతిః కాసాః వక్ష్యామి విధివత్క్రమాత్. 43

(మాధవనిదానే)

1 భావయేత్. 2 రసోభూతాంకుశోనామ.

తా. పూర్వకాసము, క్షయకాసము, రక్తకాసము, చిప్పికాకాసము, వాతకాసము, పైత్యకాసము, క్షతకాసము, శుక్తికాకాసము, ఆమకాసము, పాండుకాసము, కృష్ణకాసము, శ్లేష్మకాసము, దధికాసము, శ్లేష్మజిహ్వకకాసము, కంఠజిహ్వకకాసము, ఉపజిహ్వకకాసము, జిహ్వకకాసము, (ఇది చంపును) ఊర్ధ్వకాసము, శ్లేష్మభంగాళికాసము, శ్లేష్మశుష్కకాసము - అన నీయిరువదియు శ్లేష్మరోగము లని తెలియవలయును.

### పూర్వకాసలక్షణము

జన్మప్రభృత్యవీర్యం చ సతతం కాసపీడనం,
అనారోగ్యం ప్రభాతేచ పూర్వకాసస్యలక్షణమ్. (ఆయుర్వేదే) 44

తా. కాసము జనించినది మొదలు ఇంద్రియములకు సత్వము లేకుండుట, ఎల్లపుడు దగ్గు కలిగియుండుట, లేక మూల్గుచుండుట, ప్రాతఃకాలమున మిక్కుటముగ దగ్గు గలుగుట-ఈలక్షణములు గలది పూర్వకాస మని తెలియవలయును.

### పూర్వకాసమునకు కాసకర్తరీరసము

అమృతం పారదం గంధం నేపాళం చ సమాంశకం,
అర్కమూలకషాయేణ మర్దయేద్యామమాత్రకమ్. 45
డోలాయంత్రే ద్వియామాంతం పాచితం చ సముద్ధరేత్,
గుంజామాత్రం ప్రదాతవ్యం పూర్వకాసం నియచ్ఛతి. 46

తా. నాభి, రసము, గంధకము, నేపాళములు - వీనినెల్ల శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వములో నునిచి జిల్లేడువేళ్ళ కషాయముతో నొకఝాము మర్దించి జిల్లేడువేళ్ళ కషాయముతోడనే రెండుఝాములు డోలాయంత్రమున వండి గురిగింజలంతేసిమాత్రలు జేసి యందొకదానిని తేనె, పిప్పలితో సేవింపుచుండిన పూర్వకాసము హరించును.

### క్షయకాసలక్షణము

దేహం శుష్కం చాంగ కుష్ఠ మన్నం క్షీణం చ పాండుతా,
శిరోభ్రమశ్చ హిక్కా చ క్షయకాసస్య లక్షణమ్. 47
(మాధవనిదానే)

తా. శరీరము శుష్కించుట, శరీరము కుష్ఠురోగము పట్టినట్టులుండుట, అన్నమునం దిచ్ఛ లేకుండుట, శరీరము పాండురవర్ణముగ నుండుట, తలదిరుగుట, ఎక్కిళ్ళు గలుగుట-ఈలక్షణములతోడ దగ్గును గలిగియుండిన క్షయకాస మని తెలియవలయును. (ఇది అసాధ్యము.)

దేహం శుష్యతి శూలరోగసహితం కుక్షివ్యథారోచకం
హిక్కా శుక్లవినాశగద్గదగళం కంపోగ్నిమాంద్యం జ్వరః,
శ్లేష్మాగ్రంథి నిభశ్చ దుఃఖవిపులం మాంసస్య నిష్ఠీవనం
శ్వాసశ్చ క్షయకాసలక్షణమిదం వైవర్ణ్యతృష్ణాన్వితమ్. 48

(ఆయుర్వేదే)

తా. శరీరము కృశించుట, శూల గలుగుట, కడుపు నొచ్చుట, అరుచిగనుండుట, ఎక్కిళ్ళు గలుగుట, శుక్లము నశించుట, డగ్గుత్తికపడుట, శరీరము వణకుట, అగ్నిమాంద్యము, జ్వరము గలుగుట, కఫము ఉంటలుగట్టి వెడలుట, చకారమువలన కఫము కంపువేయుట, కడుపీడగలుగుట, ఉమిసిన నెత్తురు గడ్డలుగట్టి వెడలుట, శ్వాసము గలుగుట, శరీరమున కాంతి లేకుండుట, దప్పి గలుగుట-ఈలక్షణములు గలది క్షయకాసమని తెలియవలయును. ఇది అసాధ్యము. (ఐనను దీనియందు స్వయమగ్నిరసమును ప్రయోగింపందగును.)

## రక్తకాసలక్షణము

శోణితశ్లేష్మయుక్స్రావః హృద్దాహః కాంతహీనతా,
ఉష్ణాతిశయరూక్షే చ రక్తకాసే బలక్షయః. (చరకే) 49

తా. దగ్గిన కఫమువెంట నెత్తురుపడుట, ముక్కున నెత్తురు గారుట, ఱొమ్ములో మండుట, శరీరమున కాంతిలేకుండుట, శరీరము కడు ఉష్ణముగ నుండుట-ఈలక్షణములు గలది రక్తకాసమని తెలియవలయును (దీనియందు జ్వరము, బలక్షయము గలిగియుండిన అసాధ్యము. లేకుండిన సాధ్యము. ఈరక్తకాసము హరించుటకై పైఁజెప్పఁబడిన ఘూతాం కుశరసములో మాషప్రమాణమును తేనె, పిప్పలితో సేవింపవలయును.)

## వృష్ణాదికషాయము

వృషౌషధాభ్యాం వృషపిప్పలీభ్యాం
వృషోషణాభ్యాం చ కృతాన్ కషాయాన్,
క్రమేణ వాతాదిసముద్భవేషు
రక్తే చ కాసే సముదాహరంతి. 50

తా. అడ్డసరము, శొంఠి, అనువానికషాయము వాతరక్తకాసములను, అడ్డసరము, పిప్పళ్లు అనువానికషాయము పిత్తరక్తకాసములను, అడ్డసరము, మిరియాల అనువానికషాయము శ్లేష్మరక్తకాసములను హరింపంజేయును. (మేక, ఆవు అనువా పంచితములను రెండు అడ్డల ప్రమాణము గ్రహించి అందు శేలచెక్క ౧౦ పలముల

చంద్రవేరుచెక్క ౧౦ పలములు వైచి చాతుర్భాగము కషాయము గాచి వడియగట్టి అందు త్రికటుకములు, చవ్యము, గంటుభారంగి, అక్కలకఱ్ఱ, దుంపరాష్ట్రము, లవంగములు, త్రిఫలములు, కలబందదుంపలు, అభ్రకభస్మము - అనువాని చూర్ణమును దినుసుకు సస్కాని (రెండుడబ్బుల) యెత్తుగలిపి లేహ్యపక్వముగ వండి సాంగశీతలమున తగుమాత్రము తేనెపోసి బాగుగ కలియబెట్టి సాయంప్రాతఃకాలముల ఉసిరికకాయంత సేవింపుచుండిన రక్తకాసము హరించును.)

### చిప్పికాకాసలక్షణము

వక్త్రే దుర్గంధతా కాంతి రరుచి ర్గురుగాత్రతా,
దేహకాంతిహరః కుష్ఠో మందాగ్ని శ్చిప్పికాసకే. (చరకే) 51

తా. నోరు కంపువేయుట, శరీరము మెఱయుట, అరుచి గలుగుట, శరీరము బరువుగ నుండుట, శరీరకాంతి చెడుట, శరీరము కుష్ఠురోగము పట్టినటు లుండుట, అగ్నిమాంద్యము గలుగుట-ఈలక్షణములతోడ దగ్గును గలిగియుండిన చిప్పికాకాస మని తెలియవలయును. (దీనియందు ధాతుక్షయము ప్రధానముగ నుండిన అసాధ్యము. లేకుండిన సాధ్యము.)

### చిప్పికాకాసమునకు సర్వాంగసుందరరసము

శుద్ధసూతం విషం గంధం శుద్ధతాళక మాక్షికం,
ఏతాని సమభాగాని ఖల్వమధ్యే వినిక్షిపేత్. 52
హంసపాదిరసేనైవ ద్వియామం మర్దయేద్దృఢం,
కాచకుప్యాం నివేశ్యాథ వాలుకాభిః ప్రపూరయేత్. 53
సాంగశీతలముద్ధృత్య ద్విగుంజం భక్షయేత్సదా,
చిప్పికాసం నిహంత్యాశు సర్వకాసం నియచ్ఛతి. 54
సర్వాంగసుందరో హ్యేష రోగరాజనికృంతనః,
దశభిర్మరిచైర్యుక్తాం పథ్యాం పిష్ట్వాంభసా తథా. 55
నాభిజానాతి కాసం చ నిద్రా సుఖకరం పరం,

తా. రసము, నాభి, గంధకము, తాళకము, *హేమమాక్షికము-వీనినెల్ల శుద్ధిచేసి సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో రెండుఝాములు బాగుగ మర్దించి గాజుకుప్పెలో నునిచి వాలుకాయంత్రమున రెండుఝాములు మృదువగ్నితో వండి సాంగశీతలమున దీసి యందు రెండుగురిగింజలయెత్తును పదిమిరియాలు, ఒక

* హేమమాక్షిక మన-బంగారునిమ్మ.

కరక్కాయ అనువానిని ఉదకముతో నూరి దానియనుపానముతోడ సేవించిన చిప్పి కాకాసము, సర్వకాసములు, క్షయరోగము హరించును. మఱియు నీయౌషధసేవన వలన కాసోపద్రవరహితుండై సుఖముగ నిద్రించును. (కరక్కాయచూర్ణము 4 సేరు, ఉప్పు 4 సేరు, అక్కలకఱ్ఱ, దుంపరాష్ట్రము, పంచకోలములు అనువానిచూర్ణము దినుసుకు 14 తులము ఇటుల వానినెల్ల నేకముజేసి గుంటగలగరాకురసముతో మర్దించి *భావనజేసి ప్రతిదినము ఉసిరికకాయంతచూర్ణమును తేనెతో సేవింపుచుండిన చిప్పి కాకాసము హరించును.)

మందూరం కఫవాతఘ్నం దీపనస్య వివర్ధనమ్. 56

తా. మందూరమును గంజితోడ త్రాగిన వాతకాసము హరించుటయేగాక అగ్ని దీపనము సహా గలుగును.

## వాతకాసలక్షణము

హృచ్ఛంఖమూర్ధోదరపార్శ్వశూలీ క్షామాననః క్షీణబలస్వరౌజాః,
ప్రసక్తవేగస్తు సమీరణేన భిన్నస్వరః కాసతిశుష్కమేవ. 57

(ఆయుర్వేదే)

తా. హృదయము, కణత, శిరము, ఉదరము, పార్శ్వములు వీనియందు శూల గలుగుట, నోరెండుట, బలము, స్వరము, ధాతువులు వీనియొక్క తేజస్సు క్షయించుట, పలుమారు దగ్గుట, స్వరభేదము, పొడిదగ్గు గలుగుట-ఈలక్షణములు-గలది వాతకాసమని తెలియవలయును.

## రుద్రపర్పటీరసము

శుద్ధసూతం ద్విధాగంధం సంమర్ద్యం లోధ్రజద్రవైః,
వాతాదిరార్ద్రకం భృంగీ కాకమాచీ ద్వికర్ణికా. 58
దినైకం మర్దయేత్ఖల్వే పాచయేత్పర్పటీం తథా,
ద్వయోః పాదం మృతం తామ్రం క్షిప్త్వా మృద్వగ్నినాపచేత్. 59
రక్తవర్ణం భవేద్యావత్తావద్దర్వ్యా ప్రచాలయేత్,
ప్రక్షిపేత్కదలీపత్రే స్థాప్యస్నిగ్ధపుటే పునః. 60
ఆచ్ఛాద్య తేన యోగేన హ్యధశ్చోర్ధ్వం చ గోమయం,
దగ్ధం విచూర్ణయేత్పశ్చాచ్చూర్ణపాదం విషం క్షిపేత్. 61
రుద్రపర్పటికా హ్యేషా దేయాగుంజాద్వయం ద్వయం,

* భావన యనఁ- ఊరఁబెట్టుట.

చూర్ణితం కటునిర్గుండ్యా మూలం నిష్కద్వయం పిబేత్. 62
భృంగరాజరసేనైవ లిహేద్వా మధునా సహ,
వాతకాసం నిహంత్యాశు సర్వథైవ న సంశయః. 63
(మాధవనిదానే)

తా. శుద్ధిచేసినరసము ౧ భాగము, శుద్ధిచేసిన గంధకము ౨ భాగములు-ఈరెంటిని కాటుకవలె నూరి లొద్దుగచెక్కరసము, ఆముదపువేళ్ళు, అల్లము, గుంటగలగర, కాచియాకు, తెల్లగంటెన, నల్లగంటెన-అనువాని రసములతో ఒకదినము ఖల్వములో మర్దించి సన్నగ బిళ్ళజేసి అగ్నిపై నునిచి అప్పడమువలె కాల్చి దానికి నాలవభాగము తామ్రభస్మము గలిపి మర్దించి చూర్ణముజేసి మూకుటిలో నునిచి మందాగ్నిని ఎఱ్ఱగ నగువఱకు గరిటెతో వేయించి లేత అరటియాకులో నునిచి పొట్లము గట్టి గోమయములో పొదిగి లఘుపుటంబిడి సాంగశీతలమునదీసి చూర్ణముచేసి. దానికి నాలవభాగము శుద్ధిచేసిన నాభి గలిపి మర్దించి రెండుగురిగింజలయెత్తును రెండునిష్కములయెత్తు చేతిపొట్ల, వావిలివేరు-అనువాని చూర్ణానుపానముతోడగాని లేక గుంటగలగరాకు రసానుపానముతోడగాని లేక తేనె యనుపానముతోడగాని సేవించిన వాతకాసము నిస్సంశయముగ హరించును.

## పైత్యకాసలక్షణము

ఉరోవిదాహ జ్వరవక్త్రశోషై రభ్యర్దిత స్తిక్తముఖ స్తృషార్తః,
పిత్తేనపీతాని వమేత్కటూని కాసేనపాండుః పరిదహ్యమానః. 64
(చరకే)

తా. ఱొమ్ములో మండుట, జ్వరము గలుగుట, నోరెండుట, నోరు చేదుగనుండుట, కడుదప్పి గలుగుట, పచ్చగ కారముగ వమనం బగుట, దగ్గు గలుగుట, శరీరము పాండురవర్ణముగ నుండుట, శరీరమున తాపము గలుగుట - ఈలక్షణములు గలది పైత్యకాస మని తెలియవలయును.

శిరఃకంపో భ్రమ స్స్వేద శ్ఛర్దిదోషశ్చ క్షీణతా,
తృష్ణా చ శ్లేష్మశమనం మూర్ఛా వై పైత్తకాసకే. 65
(గ్రంథాంతరే)

తా. తల వణకుట, తబ్బిబ్బులాడుట, చెమటు, వాంతి గలుగుట, సత్వములేకుండుట, దప్పి గలుగుట, ఒకింతదగ్గు, మూర్ఛగలుగుట-ఈలక్షణములు గలది పైత్యకాసమని తెలియవలయును.

## విజయభైరవరసము

రసభాగో భవేదేకో గంధకో ద్విగుణో మతః,
త్రిభాగా పిప్పలీ గ్రాహ్యా చతుర్భాగా హరీతకీ. 66
విభీతః పంచభాగస్తు వాసా షడ్గుణికామతా,
భార్గీ సప్తగుణా గ్రాహ్యా త్వేతచ్చూర్ణం ప్రకల్పయేత్. 67
బబ్బరక్వాథమాదాయ భావయే దేకవింశతి,
విభీతకీప్రమాణేన మధునా గుళికా క్రియా. 68
ఏకైకాం భక్షయే త్ప్రాతః కాసశ్వాసవినాశనీ,
బ్రహ్మణా నిర్మితో హ్యేష రసో విజయభైరవః. (రసరత్నాకరే) 69

తా. శుద్ధిచేసిన రసము ౧ భాగము, శుద్ధిచేసిన గంధకము ౨ భాగములు, పిప్పళ్ళు 3 భాగములు, కరక్కాయలు ౪ భాగములు, తానికాయలబెరడు ౫ భాగములు, అడ్డసరపుఆకులు ౬ భాగములు, గంటుభారంగి ౭ భాగములు-ఇటుల వీనినెల్ల గ్రహించి చూర్ణముజేసి వాయింటాకు కషాయముతో ౨౧ మారు భావనచేసి తానికాయ గింజలంత మాత్రలుజేసి ఎండించి యందొకదానిని ప్రాతఃకాలమున తేనెతో సేవించిన సర్వకాసశ్వాసములు హరించును. ఇది బ్రహ్మచే నిర్మింపఁబడియెను.

## త్రినేత్రకరసము

భస్మతామ్రాభ్రతీక్ష్ణానాం కాసమర్దవరీరసైః,
మునిజైర్వేతసామ్లేన దినం మర్ద్యం సుపిండితమ్. 70
*నిష్కార్థం పిత్తకాసార్తో సర్వకాసం నియచ్ఛతి, (పూజ్యపాదీయే)

తా. తామ్రభస్మము, అభ్రకభస్మము, ఇనుపభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి కసివెంద, పిల్లిపీచరవేళ్ళు, అవిశాకు, పుల్లప్రబ్బలి అనువాని రసముతో ప్రత్యేక ప్రత్యేకముగ నొక్కొకదినము మర్దించి రెండుగురిగింజలంత గాని లేక అర్ధనిష్కప్రమాణముగాని మాత్రలుజేసి ఎండించి యందొకదానిని సేవించిన పైత్యకాసము, సర్వకాసములు హరించును.

## క్షతకాసలక్షణము

అతివ్యవాయ భారాధ్వ యుద్ధాశ్వగజనిగ్రహైః. 71
రూక్షస్యోరఃక్షతం వాయు ర్గృహీత్వా కాసమావహేత్,

* ద్విగుంజం పిత్తకాసార్తో భక్షయేచ్చ త్రినేత్రకమ్. ఇటులను పాఠాంతరము గలదు.

సపూర్వం కాసతే శుష్కం తతఃష్ఠీవేత్సశోణితమ్. 72
కంఠేన రుజతాత్యర్థం విభిన్నేనైవ చోరసా,
సూచీభిరివ తీక్ష్ణాభి స్తుద్యమానేన శూలినా. 73
దుఃఖస్పర్శేన శూలేన భేదపీడాభితాపినా,
పర్వభేదజ్వరశ్వాస తృష్ణా వై స్వర్యపీడితః. 74
పారావతఇవాకూజ న్కాసవేగాత్క్షతోద్భవాత్. (సిద్ధరసార్ణవే)

తా. అతిమైధునము జేయుట, కడుభారమును మోయుట, మిక్కుటముగ మార్గము నడచుట, మల్లయుద్ధముసేయుట, గుఱ్ఱము ఏనుగు మొదలగునవి పరుగులిడునపుడు వాని నడ్డగించిపట్టుట- ఈకారణమువలన రూక్షగలపురుషునియొక్క ఱొమ్ముపగిలి దాని యందు వాతము ప్రకోపించి దగ్గును గలుగంజేయును. ఈకాసరోగము జనించుటకు ముందు పొడిదగ్గు గలిగి పిదప రక్తయుక్తముగ కఫముపడుట, కంఠము మిక్కుటముగ నొచ్చుట, ఱొమ్ము పగిలినట్లుండుట,ఱొమ్ములో సూదులచే బొడుచునటుల శూలగలు. గుట, శూలవలన ఱొమ్ములో స్పర్శసహనము లేకుండుట,పార్శ్వములయందు గొడ్డలితో గొట్టునటుల తాపయుక్తమైన శూల గలుగుట, సంధులు పగిలినటు లుండుట, జ్వరము, శ్వాసము, దప్పి, స్వరభేదము గలుగుట, క్షతజన్యకాస వేగమువలన పావురపుపిట్టవలె గుర్గురుశబ్దముసేయుట- ఈలక్షణములు క్షతకాసమున గలుగును.

క్షతకాసమునకు తాలేశ్వర రసము

రసపాదం మృతం తారం శిలాతాప్యం చతుర్గుణమ్. 75
ఇక్షువాసా రసాభ్యాంచ మర్దయే త్ప్రహరద్వయం,
ద్వియామం వాలుకాయంత్రే స్వేద్యమాదాయ చూర్ణయేత్. 76
గుంజాద్వయం నిహంత్యాశు కాసం *శ్వాసం క్షతోద్భవం,
రసస్తాలేశ్వరోనామ్నా హ్యనుపానంచ కథ్యతే. 77
వచాకుష్ఠహరిద్రాభి స్సైంధవం టంకణం విషం,
పాఠాచ లాంగలీ వ్యోషం చాక్షం ప్రత్యేకభాగకమ్. 78
భావితం భృంగసారేణ దినైకం తంచ భక్షయేత్,
మాషం తాలేశ్వరోనామ్నా హిక్కావైస్వర్యకాసజిత్. 79
దాడిమం త్రిఫలా వ్యోషం త్రయాణాంచ సమం గుడం,
చూర్ణితం భక్షయే త్కర్షం క్షతకాసాపనుత్తయే. (ఆయుర్వేదే)

* క్షతభవం ధ్రువమ్.

తా. రసభస్మము ౧ భాగము, రజతభస్మము పాతికభాగము, శుద్ధిజేసినమణిశిల ౨ భాగములు, శుద్ధిజేసిన హేమమాక్షికము ౨ భాగములు- ఇటుల వీనిని ఖల్వములో నునిచి చెఱకు, అడ్డసరము అనువాని రసముతో రెండు ఝాములు మర్దించి గాజు కుప్పెలో నునిచి వాలుకాయంత్రమున రెండు ఝాములు వండి స్వాంగశీతలమునదీసి చూర్ణము జేసి రెండుగురిగింజలయెత్తును వస, చెంగల్వకోష్టు, పసపు, సైంధవలవణము, వెలిగారము, అతివస, చిరుబొద్ది, చెన్న చెర్లగడ్డ, త్రికటుకములు అనువానిని అక్షప్రమాణము ప్రత్యేక ప్రత్యేకముగ చూర్ణముజేసి గుంటగలగరాకురసముతో ఒకదినము భావనజేసి ఈ చూర్ణానుపానముతోడ సేవించిన క్షతమువలన జనించిన కాసశ్వాసములు హరించును. మఱియు దీనిని మాషప్రమాణము పైయనుపానముతోడ సేవించినను ఎక్కిళ్లు, స్వరభంగము, కాసము హరించును. మరియును దాడిమబెరడు, త్రిఫలములు, త్రికటుకములు అనువానిని చూర్ణముజేసి దీనికి సమముగ బెల్లము కలిపి కర్షప్రమాణానుపానముతోడ పై తాలేశ్వర రసమును సేవించిన క్షతకాసము హరించును.

### శుక్తికాస లక్షణము

శుక్తికాసేచ మందాగ్నిః కంఠేచ శ్లేష్మసంస్థితిః,
అంగానాంచైవ వైకల్యం శుక్తికాసం విదుర్బుధాః. 81
(మాధవనిదానే)

తా. అగ్నిమాంద్యము గలుగుట, కుతికలో తెమడనిలుచుట, అవయవములు శిథిలంబులగుట- ఈలక్షణములు గలది శుక్తికాకాసమని తెలియవలయును.

### సూర్యరసము

రసమేకం ద్విభాగంధం త్రితాస్యం పంచతాళకం,
సర్వశుద్ధం విచూర్ణ్యాథ చతుర్భాగం మృతాభ్రకమ్. 82
వచా కుష్ఠ హరిద్రాగ్ని టంకణం సైంధవం విషం,
పాఠాచ లాంగలీ వ్యోషం సర్వం ప్రత్యేక కర్షకమ్, 83
భావితం భృంగసారేణ దినైకం తంచ భక్షయేత్,
మాషం సూర్యరసోనామ *శుక్తికా సంజయేత్తతః. 84
పిప్పల్యాసహ నిర్గుండ్యాః క్వాథంచానుప్రపాయయేత్,
అష్టగుంజామితాభక్ష్యా విఖ్యాతా రసపర్పటీ. 85

* హిక్కా-వైస్వర్య్యకాసజిత్ = ఎక్కిళ్ళు, స్వరభంగము, శుక్తికాకాసము ౹౹ మనును.

త్రికంటమూల శుంఠీచ హ్యజాక్షీర సమోదకం,
క్షీరావశిష్టం తం క్వాథం సకణం పాయయేన్నిశి. (నిత్యనాథీయే)

తా. శుద్ధిజేసినరసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు, శుద్ధిచేసిన స్వర్ణమాక్షికము 3 భాగములు, అభ్రకభస్మము ౪ భాగములు, శుద్ధిచేసినతాళకము ౫ భాగములు- ఇటుల వీని నెల్ల నేకముజేసి యందు వస, చెంగల్వకోష్టు, పసపు చిత్రమూలము, టంకణక్షారము, సైంధవలవణము, శుద్ధిచేసినవసనాభి, చిరుబొద్ది, చన్నచర్లగడ్డ, త్రికటుకములు అనువానిచూర్ణమును దినుసుకు కర్షప్రమాణముచొప్పున గలిపి గుంటగలగరాకురసముతో ఒకదినము భావనజేసి మాషప్రమాణమును పన్నెండు పిప్పళ్ళు, వావిలియాకు అనువానికషాయముతోడ సేవించినను, లేక ౧ గురిగింజలయెత్తు రసపర్పటెని సేవించి పల్లేరువేళ్ళు, శొంఠి అనువానిని దంచి యందు మేకపాలు, మేకపాలకు సమముగ నుదకము పోసి పాలుశేషించువఱకు కషాయముకాచి యందు పిప్పలిచూర్ణమును గలిపి రాత్రులయందు త్రాగినను, శుష్కకాసము హరించును.

## ఆమకాసలక్షణము

అతిశీతంచ కాసశ్చ దధ్యాహారవివర్జితః,
శిరోర్తి క్షీణతా తృష్ణా హ్యామకాసస్య లక్షణమ్. (ఆయుర్వేదే)

తా. కడుశీతలము, దగ్గు గలుగుట, పెరుగన్నమునం దిచ్ఛ లేకుండుట, తల నొచ్చుట, శరీరము కృశించుట, దప్పి గలుగుట- ఈలక్షణములు గలది ఆమకాస మని తెలియవలయును. (ఇది కష్టసాధ్యము.)

## ఆమకాసమునకు చంద్రామృతరసము

శుద్ధసూతామృతం గంధం నేపాళంచ సమాంశకం,
అర్కమూలకషాయేణ మర్దితంచ త్రియామకమ్, 88
డోలాయంత్రే యామమాత్రం పాచితం చ సముద్ధరేత్,
గుంజామాత్రం ప్రదాతవ్య మామకాసం నియచ్ఛతి. 89
అయం చంద్రామృతో నామ చంద్రనాథేన నిర్మితః,

తా. రసము, నాభి, గంధకము, నేపాళములు- వీనిని శుద్ధిచేసి సమభాగములుగ ఖల్వములో నునిచి జిల్లేడువేళ్ళ కషాయములో మూడుఝాములు మర్దించి ముద్దచేసి జిల్లేడువేళ్ళకషాయముచే డోలాయంత్రమున నొకఝాము వండి గురిగింజంతమాత్రలు జేసి ఎండించి యందొకదానిని సేవించిన ఆమకాసము హరించును. ఇది చంద్రనాథునిచే నిర్మింపఁబడియెను.

## పాండుకాసలక్షణము

దేహేచ పాండురచ్ఛాయా రాత్రౌ శ్లేష్మసముద్భవః. 9(
దివా శ్లేష్మవినాశశ్చ పాండుకాసస్య లక్షణం. (మతాంతరే

తా. శరీరము పాండురవర్ణముగ నుండుట, రాత్రులయందు మిక్కుటముగ దగ్గు గలుగుట, పగటియందు దగ్గు లేకుండుట-ఈలక్షణములు గలది పాండుకాస మని దెలియవలయును.

## పాండుకాసమునకు కాససంహారభైరవము

మృతసూతం సమంచాభ్రం హింగుళం విషతాళకమ్. 9
తుల్యంతుల్యం ఖల్వమధ్యే క్షిపేన్మర్ద్యం దినద్వయం,
హంసపాదికషాయేణ కుక్కుటీపుటపాచితమ్. 9
చూర్ణీకృతం చ తత్సమ్య గ్మాషమాత్రం ప్రదాపయేత్,
పాండుకాసవినాశస్స్యా త్సర్వకాసక్షయో భవేత్. 9
శ్రీమద్గహనానాథేన కాససంహారభైరవః,
రసోఽయం నిర్మితో యత్నా ల్లోకరక్షణహేతవే. 9
(మాధవనిదానే

తా. రసభస్మము, అభ్రకభస్మము, శుద్ధిచేసిన ఇంగిలీకము, శుద్ధిచేసిన నాభి శుద్ధిచేసిన తాళకము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకు కషాయముతో రెండుదినములు మర్దించి కుక్కుటపుటం బిడి సాంగశీతలమున దీసి చూర్ణము జేసి మాషప్రమాణమును తేనె, పిప్పలితో సేవించిన పాండుకాసము, సర్వకాసములు హరించును. ఇది గహననాథునిచే లోకహితార్థమై నిర్మింపఁబడియెను.

## కృష్ణకాసలక్షణము

రాత్రౌ శ్లేష్మప్రకోపశ్చ నిద్రాభోగవివర్జితః,
రాత్రౌ దుఃఖం చ కృష్ణత్వం కృష్ణకాసస్య లక్షణమ్. 9
(పూజ్యపాదీయే

తా. రాత్రులయందు మిక్కుటముగ దగ్గు గలుగుట, నిదుర పట్టకుండుట రాత్రులయందు దుఃఖము గలుగుట, శరీరము నలుపుబారియుండుట-ఈలక్షణములుగల కృష్ణకాస మని తెలియవలయు.

## కృష్ణకాసమునకు రసేంద్రగుటిక

విషసూతాభ్రకం గంధం వ్యోషం హింగుళ సైంధవం,

లవంగం పిప్పలీమూలం తుల్యంతుల్యం విమర్దయేత్. 96
దినం హంసపదీద్రావైః కుక్కుటీపుటపాచితమ్,
చూర్ణీకృతం తతో దేయం మాషమాత్రం భిషగ్వరైః. 97
కృష్ణకాసం నిహంత్యాశు సర్వకాసం నియచ్ఛతి,

తా. శుద్ధిజేసిననాభి, శుద్ధిచేసినరసము, అభ్రకభస్మము, శుద్ధిచేసినగంధకము, త్రికటుకములు, శుద్ధిజేసిన ఇంగిలీకము, సైంధవలవణము, లవంగములు, మోడి- వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో నొకదినము మర్దించి కుక్కుటపుటంబిడి సాంగశీతలమున దీసి చూర్ణముజేసి మాషప్రమాణమును లేనె, పిప్పలితో సేవించిన కృష్ణకాసము, సర్వకాసములు శీఘ్రముగ హరించును.

## శ్లేష్మకాసలక్షణము

శ్లేష్మప్రకోపితః కంఠ స్సతతం రోగవిగ్రహః. 98
దివారాత్రప్రకోపశ్చశ్లేష్మకాసం వినిర్దిశేత్, (బాహటే)

తా. కుతికలో తెమడకట్టుట, ఎల్లపుడు శరీరమున శ్లేష్మము వ్యాపించియుండుట, జేయుంబగలు దగ్గు గలుగుట - ఈలక్షణములు గలది శ్లేష్మవాత మని దెలియవలయును.

## శ్లేష్మకాసమునకు బోళబద్ధరసము

రసభస్మ విషం తుల్యం బోళాద్యం ద్విగుణం మతమ్. 99
బోళతాళక పాఠాగ్నికర్కోటీ మాక్షీకం నిశా,
కంటకారీ యవక్షారం లాంగలీ జీర సైంధవమ్. 100
మధూకసారం సంచూర్ణ్యం సప్తాహం చార్ద్రకద్రవైః,
ఛాయాయాం భావయేత్పశ్చాత్సప్తాహం చిత్రకద్రవైః. 101
గుటికాబదరాకారా శ్లేష్మకాసాపనుత్తయే,
భక్షయేద్బోళబద్ధోఽయం రసస్స్యాచ్ఛ్వాసపాండుజిత్. 102
కటుత్రయం పావకదేవదారు రాస్నావిడంగ త్రిఫలామృతానాం,
చూర్ణం సమాంశం సితయాసమేతం కాసంజయేద్విష్ణుగదేవదైత్యాః.
(సిద్ధరసార్ణవే)

తా. రసభస్మము, శుద్ధిచేసిననాభి ఇవి సమభాగములు.- బోళము, శుద్ధిచేసిన * హరిదళము, చిరుబొద్ది, చిత్రమూలము, చేతిబీరవిత్తులు, శుద్ధిజేసిన హేమమాక్షికము,

* హరిదళ మన తాళకము.

పసపు, ప్రాకుడు, యవక్షారము, చన్నచర్లగడ్డ, జీలకఱ్ఱ, సైంధవ లవణము, యష్టిమధు కము అనువానిచూర్ణము దినుసుకు రెండుభాగములు- ఇటుల వీనిని ఖల్వములో నునిచి అల్లపురసముతో నేడుదినములు మర్దించి నీడ నెండించి పిదప ఏడుదినములు చిత్రమూల రసముతో భావనజేసి రేగుగింజలంతమాత్రలు జేసి యందొకదానిని త్రికటుకములు చిత్రమూలము, దేవదారు, దుంపరాష్ట్రము, వాయువిడంగములు, త్రిఫలములు, లిప్ప తీగె అనువానిని సమభాగములుగ చూర్ణముజేసి, దానికి సమముగ పంచదార గలి ఈయనుపానముతోడ సేవించిన "విష్ణుమూర్తియొక్క గదాయుధము దైత్యుల నిర్మూలము జేయుభంగి శ్లేష్మకాసము, శ్వాసము, పాండువు వీనిని నిర్మూలముజేయును.

## దధికాసలక్షణము

శ్లేష్మోద్రేకశ్చ రోగేచ దధిభుక్తివివర్జితః,
రాత్రౌ శ్లేష్మా దివా నిద్రా దధికాసస్యలక్షణమ్. (మాధవనిదానే

తా॥ దగ్గు గలుగుట, పెరుగునం దిచ్ఛ లేకుండుట, రాత్రులయం దధికముగ దగ్గు పగటియందు నిద్ర గలుగుట- ఈలక్షణముగలది దధికాస మని తెలియవలయును.

## దధికాసమునకు కాసవిధూననరసము

రస గంధక పిప్పల్యో హరీతక్యక్షవాసకం,
యష్ట్యుత్తరం సమంచూర్ణం బర్బరక్వాథభావితమ్, 105
ఏవం వింశతివారేణ భావయిత్వా విచూర్ణయేత్,
భక్షయే న్మధునాచైవ దధికాసం వినాశయేత్. 106
విధూననరసోహ్యేష మహాదేవేన భాషితః,

తా॥ శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, పిప్పళ్ళు, కరక్కాయలు, గచ్చపల కులు, అడ్డసరము, యష్టిమధుకము-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి వామింటాకు కషాయముతో ౨౦ మారులు భావనజేసి ఎండించి చూర్ణముజేసి మాడయెత్తును తేనెతో సేవించిన దధికాసము హరించును.

## శ్లేష్మజిహ్వాకకాసలక్షణము

జిహ్వాచాపి సమండలా సపిటికా దేహేచ కండూర్భవేత్
తీక్ష్ణశ్లేష్మవివర్ణశీర్ణతనుతా పీడా హ్యసంభాషితా,
నిర్నిద్రత్వ మహర్నిశం చ చలతా కర్ణేచ బాధిర్యకం
ఏష శ్లేష్మకజిహ్వాకస్తు గదిత శ్చైవహ్యసాధ్యో భవేత్. 107
(ఆయుర్వేదే

తా. నాలుకయందు మండలములు, పొక్కులు గలుగుట, శరీరమున దురద గలుగుట, కఫము ఒగరుగ వెడలుట, శరీరము వివర్ణముగ శిథిలముగ నుండుట, మాటలాడుటకు శక్తిలేకుండుట, నిదురపట్టకుండుట, జేయింబగలు దిరుగుచుండుట, చెవులు వినరాకుండుట-ఈలక్షణములుగలది శ్లేష్మజిహ్వాక కాస మని దెలియవలయును. ఇది అసాధ్యము.

శిలాతాళకరసము

త్రికంటకరసైర్భావ్యం తాళకంచ మనశ్శిలా,
దినం వాసారసైః పిష్ట్వా వాలుకాయన్త్రంపాచితమ్. 108
ద్వియామాంతే సముద్ధృత్య తత్తుల్యం చ కటుత్రయం,
నిర్గుండీమూలచూర్ణం చ త్ర్యూషతుల్యం విచూర్ణయేత్. 109
శిలా తాళరసో నామ్నా మాషైకం శ్లేష్మజిహ్వకే,
వైజయంతీజయాక్వాథ మాతీకేనైవ కాసజిత్. 110
త్రిశూలీమూలజక్వాథ త్రికటోస్స్యాచ్ఛ కాసజిత్.
(ఆయుర్వేదే)

తా. శుద్ధిజేసినతాళకము, శుద్ధిజేసినమణిశిల-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి అడ్డసరపాకురసముతో నొకదినము మర్దించి పల్లేరువేళ్ళరసముతో ఒకదినము భావనజేసి గాజుకుప్పెలో నునిచి వాలుకాయంత్రమున రెండుఝాములు వండి స్వాంగ శీతలమునదీసి ఖల్వములోనునిచి చూర్ణముచేసి దానికిసమముగ త్రికటుకచూర్ణము, త్రికటుకచూర్ణమునకు సమముగ వావిలివేళ్ళచూర్ణము గలిపి మర్దించి యందు మాషప్రమాణమును తక్కిలి, కరక్కాయ - అనువాని కషాయములో తేనె గలిపి ఈయనుపానముతోడగాని లేక పల్లేరువేళ్ళకషాయములో త్రికటుకచూర్ణమును గలిపి ఈయనుపానముతోడగాని సేవించిన శ్లేష్మజిహ్వకకాసము హరించును.

కంఠజిహ్వక కాసలక్షణము

గరళా జిహ్వికా శ్లేష్మావాంతి ర్మూర్ఛా పరిశ్రమః 111
నిద్రాభంగో విహారశ్చ కంఠజిహ్వాకలక్షణం, (అశ్వినీనిఘంటౌ)

తా. నాలుక విషతుల్యముగ నుండుట, దగ్గు గలుగుట, వాంతి, మూర్ఛ, బడలిక గలుగుట, నిదుర పట్టకుండుట, తిరుగులాడుచుండుట - ఈలక్షణము గలది కంఠజిహ్వక కాస మని దెలియవలయు.

భృంగరాజగుటికలు

భృంగరాజస్య పత్రంతుచూర్ణితం మధునా సహ. 112

పసపు, ప్రాకుడు, యవక్షారము, చన్నచర్లగడ్డ, జీలకఱ్ఱ, సైంధవ లవణము, యష్టిమధుకము అనువానిచూర్ణము దినుసుకు రెండుభాగములు- ఇటుల వీనిని ఖల్వములో నునిచి అల్లపురసముతో నేడుదినములు మర్దించి నీడ నెండించి పిదప ఏడుదినములు చిత్రమూలరసముతో భావనజేసి రేగుగింజలంతమాత్రలు జేసి యందొకదానిని త్రికటుకములు, చిత్రమూలము, దేవదారు, దుంపరాష్ట్రము, వాయువిడంగములు, త్రిఫలములు, తిప్పతీగె అనువానిని సమభాగములుగ చూర్ణముజేసి, దానికి సమముగ పంచదార గలిపి ఈయనుపానముతోడ సేవించిన "విష్ణుమూర్తియొక్క గదాయుధము దైత్యుల నిర్మూలము జేయుభంగి శ్లేష్మకాసము, శ్వాసము, పాండువు వీనిని నిర్మూలముజేయును.

## దధికాసలక్షణము

శ్లేష్మోద్రేకశ్చ రోగేచ దధిభుక్తివివర్జితః,
రాత్రౌ శ్లేష్మా దివా నిద్రా దధికాసస్యలక్షణమ్. (మాధవనిదానే

తా. దగ్గు గలుగుట, పెరుగునం దిచ్ఛ లేకుండుట, రాత్రులయం దధికముగ దగ్గు పగటియందు నిద్ర గలుగుట- ఈలక్షణముగలది దధికాస మని తెలియవలయును.

## దధికాసమునకు కాసవిధూననరసము

రస గంధక పిప్పల్యో హరీతక్యక్షవాసకం,
యష్ట్యుత్తరం సమంచూర్ణం బర్బరక్వాథభావితమ్, 105
ఏవం వింశతివారేణ భావయిత్వా విచూర్ణయేత్,
భక్షయే న్మధునాచైవ దధికాసం వినాశయేత్. 106
విధూననరసోహ్యేష మహాదేవేన భాషితః,

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, పిప్పళ్ళు, కరక్కాయలు, గచ్చపలుకులు, అడ్డసరము, యష్టిమధుకము-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి తుమ్మింటాకు కషాయముతో ౨౦ మారులు భావనజేసి ఎండించి చూర్ణముజేసి మాడయెత్తును తేనెతో సేవించిన దధికాసము హరించును.

## శ్లేష్మజిహ్వాక కాసలక్షణము

జిహ్వాచాపి సమండలా సపిటికా దేహేచ కండూర్భవేత్
తిక్తశ్లేష్మవివర్ణశీర్ణతనుతా పీడా హ్యసంభాషితా,
నిర్నిద్రత్వ మహర్నిశం చ చలతా కర్ణేచ బాధిర్యకం
ఏష శ్లేష్మకజిహ్వాక స్తు గదిత శ్చైషహ్యసాధ్యో భవేత్. 107
(ఆయుర్వేదే

తా. నాలుకయందు మండలములు, పొక్కులు గలుగుట, శరీరమున దురద గలుగుట, కఫము ఒగరుగ వెడలుట, శరీరము వివర్ణముగ శిథిలముగ నుండుట, మాటలాడుటకు శక్తిలేకుండుట, నిదురపట్టకుండుట, ఊయింబగలు దిరుగుచుండుట, చెవులు వినరాకుండుట-ఈలక్షణములుగలది శ్లేష్మజిహ్వక కాస మని దెలియవలయును. ఇది అసాధ్యము.

శిలాతాళకరసము

త్రికంటకరసైర్భావ్యం తాళకంచ మనశ్శిలా,
దినం వాసారసైః పిష్ట్వా వాలుకాయంత్రంపాచితమ్. 108
ద్వియామాంతే సముద్ధృత్య తత్తుల్యం చ కటుత్రయం,
నిర్గుండీమూలచూర్ణం చ త్ర్యూషతుల్యం విచూర్ణయేత్. 109
శిలా తాళరసో నామ్నా మాషైకం శ్లేష్మజిహ్వకే,
వైజయంతీజయాక్వాథ మాతుకేనైవ కాసజిత్. 110
త్రిశూలీమూలజక్వాథ త్రికటోస్స్యాచ్ఛ కాసజిత్.
(ఆయుర్వేదే)

తా. శుద్ధిజేసినతాళకము, శుద్ధిజేసినమణిశిల-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి అడ్డసరపాకురసముతో నొకదినము మర్దించి పల్లేరువేళ్ళరసముతో ఒకదినము భావనజేసి గాజుకుప్పెలో నునిచి వాలుకాయంత్రమున రెండుయామములు వండి పొంగ శీతలమునదీసి ఖల్వములోనునిచి చూర్ణముచేసి దానికిసమముగ త్రికటుకచూర్ణము, త్రికటుకచూర్ణమునకు సమముగ వావిలివేళ్ళచూర్ణము గలిపి మర్దించి యందు మాషప్రమాణమును తక్కలి, కరక్కాయ - అనువాని కషాయములో తేనె గలిపి ఈయనుపానముతోడగాని లేక పల్లేరువేళ్ళకషాయములో త్రికటుకచూర్ణమును గలిపి ఈయనుపానముతోడగాని సేవించిన శ్లేష్మజిహ్వకకాసము హరించును.

కంఠజిహ్వక కాసలక్షణము

గరళాజిహ్వకా శ్లేష్మావాంతి ర్మూర్ఛా పరిశ్రమః 111
నిద్రాభంగో విహారశ్చ కంఠజిహ్వకలక్షణం, (అశ్వినీనిఘంటౌ)

తా. నాలుక విషతుల్యముగ నుండుట, దగ్గు గలుగుట, వాంతి, మూర్ఛ, బడలిక గలుగుట, నిదుర పట్టకుండుట, తిరుగులాడుచుండుట - ఈలక్షణము గలది కంఠజిహ్వక కాస మని దెలియవలయు.

భృంగరాజగుటికలు

భృంగరాజస్య పత్రంతుచూర్ణితం మధునా సహ. 112

గోళకం ధారయే ద్వక్త్రే కంఠజిహ్వాం వినాశయేత్,

తా. గుంటగలగరాకుచూర్ణములో తేనె గలిపి ముద్దజేసి దానిని నోటిలో నునిచికొని రసముమ్రింగుచుండిన కంఠజిహ్వాకకాసము హరించును.

దంతీధూమపానము

దంతిమూలస్య ధూమం వా నిర్గుండీంచాపి యోజయేత్. 113
కంఠజిహ్వాం నిహంత్యేచ ధూమపానేన తత్క్షణాత్,

తా. నేలదంతివేళ్ళనుగాని, వావిలియాకునుగాని ఎండించి చూర్ణముజేసి అగ్నిలో వైచి పొగను పానముజేసిన తత్క్షణమున కంఠజిహ్వాకకాసము హరించును.

ఉపజిహ్వాకకాసలక్షణము

జిహ్వోపరి తథా జిహ్వా ప్యన్నక్షీణ స్తథైవచ. 114
రాత్రౌ శ్లేష్మప్రకోపశ్చా ప్యుపజిహ్వాకలక్షణం, (ఆయుర్వేదే)

తా. నాలుకపై నాలుక మొలచినట్టుండుట, అన్నమును భుజించుటకు శక్తి లేకుండుట, రాత్రులయందు మిక్కుటముగ దగ్గు గలుగుట - ఈలక్షణములు గలది ఉపజిహ్వాకకాస మని తెలియవలయును. (ఇది హరించుటకై కృష్ణకాసమునకుఁ జెప్పఁబడిన రసేంద్రగుటికను ఆరునెలలు సేవింపవలయును. మఱియు ఉపజిహ్వాకకాసము పురుషునికి జనించినయెడల కుడిచన్ను మొనకు మూడువ్రేళ్ళక్రింద చంకలోరక్షవేయవలయును. స్త్రీకైనయెడల ఎడమచన్ను మొనకు మూడువ్రేళ్ళక్రింద చంకలో రక్షవేయవలయును. లేక చిత్రమూలపువేళ్ళచెక్కను దెచ్చి కట్టగట్టి దానిపై కొట్టులపిండిని మెత్తి దానిపై రావియాకులవిస్తరిని పొదిగి దానిపై పుట్టమన్ను మెత్తి ఎండించి పుట్టమన్ను ఇటికె నగువఱకు పుటంబిడి దీసి యందలిపిండిని ప్రతిదినము సేవింపుచుండిన నాలుగుమాసములలో ఉపజిహ్వాకకాసము హరించును.

జిహ్వాకకాసలక్షణము

శ్లేష్మలేపశ్చ జిహ్వాయాః క్షీణవాక్కృశతా తథా. 115
నిద్రాహాని ర్నిశి శ్లేష్మా జిహ్వాకాసస్య లక్షణం, (చరకే)

తా. నాలుక కఫముచే పూయంబడినటు లుండుట, మాటలాడుటకు శక్తి లేకుండుట, శరీరము కృశించుట, నిదుర పట్టకుండుట, రాత్రులయందు దగ్గుగలుగుట-ఈలక్షములుంగలది జిహ్వాకకాసమని తెలియవలయు.

జిహ్వాకకాసమునకు నీలకంఠరసము

సూతకం గంధకం లోహం విషం చిత్రకపత్రకమ్. 116

వరాంగం రేణుకా ముస్తా గ్రంథికం నాగకేసరమ్,
ఫలత్రికం త్రికటుకం శుల్బం తుల్యం తథైవచ. 117
ఏతాని సమభాగాని గుడో ద్విగుణముచ్యతే,
సంమర్ద్య గుటికాం కృత్వా భక్షయే చ్చణమాత్రకమ్. 118
జిహ్వాకాసే తథాగుల్మే ప్రమేహే విషమజ్వరే,
మూత్రకృచ్ఛ్రే మూఢగర్భే వాతరోగేచ దారుణే. 119
నీలకంఠరసో నామ శంభునా నిర్మితస్స్వయమ్,

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, లోహభస్మము, శుద్ధిజేసిననాభి, చిత్రమూలము, ఆకుపత్రిక, లవంగములు, రేణుకలు, తుంగముస్తెలు, మోడి, నాగకేసరములు, త్రిఫలములు, త్రికటుకములు, తామ్రభస్మము ఇవి సమభాగములు-వీనికన్నిటికి రెండింతలు బెల్లము- ఇటుల నేకముచేసి బాగుగ మర్దించి సెనగలంతమాత్రలు జేసి సేవించిన జిహ్వాకాసము, గుల్మము, ప్రమేహము, విషమజ్వరములు, మూత్రకృఛ్రము, మూఢగర్భము, దారుణమైన వాతరోగము- వీనిని హరింపజేయును ఈనీలకంఠరసమును ఈశ్వరుఁడు స్వయముగ గల్పించెను.

## ఊర్ధ్వకాసలక్షణము

ఆకర్షణంచ తీవ్రేణ వాయునా శ్లేష్మణ స్తథా. 120
మహామేఘాశ్శత్రవస్స్యురూర్ధ్వశ్లేష్మప్రపీడితః, (చరకే)

తా. తీవ్రమైనవాతము శ్లేష్మము నాకర్షించుట (అనఁగా ఉబ్బసము గలుగుట), మేఘము లావరించియుండునపుడు మిక్కుటముగ ఉబ్బసముగలుగుట - ఈలక్షణములు గలది ఊర్ధ్వకాస మని తెలియవలయును. (దీనినే కొందఱు మేఘరంజి యనియు వచించెదరు.)

## ఊర్ధ్వకాసమునకు కాసకేసరివటికములు

గంధం త్రికటుకం చాభ్రం రోహిణీ తాళకం సమమ్. 121
పంచకోలకషాయేణ మర్దయే ద్దివసత్రయం,
యూషమయే ద్వ్యాధరే పాచ్యం సాంగశీతం సముద్ధరేత్, 122
మధునాచానుపానేన హన్త్యూర్ధ్వకాసం వినశ్యతి,

తా. శుద్ధిచేసినగంధకము. త్రికటుకములు, అభ్రకభస్మము, కటుకరోహిణి, శుద్ధిజేసినతాళకము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి పంచకోలకషాయ

ముతో మూడుదినములు మర్దించి మూసలో నునిచి చీలమన్ను లేపనము జేసి భూధర యంత్రమున పుటంబిడి సాంగశీతలమునదీసి గురిగింజంతయెత్తును తేనెతో ఒకసంవత్సరము సేవింపుచుండిన ఊర్ధ్వశ్వాసము (అనఁగా ఉబ్బసము) హరించును.

ఊర్ధ్వశ్వాసమునకు అంకోలాదిచూర్ణము

అంకోలస్య పలాన్యష్టౌ త్రిగుణైర్మరిచైస్సహ. 123
తథాలిహ్యాచ్చ తచ్చూర్ణం మధునా చోర్ధ్వశ్వాసకే,

తా. ఊడుగచెక్క ౮ పలములు, మిరియాలు ౨౪ పలములు - వీనిని దంచి చూర్ణముజేసి తేనెతో సేవించిన ఉబ్బసము హరించును.

ఆ. ఉసిరికాయపప్పు నొప్పగునల్లేరు
సిందురంబుఁ గూర్చి చెలువు మీఱ
దాని నొక్కయేఁడు పూని సేవించిన
సకలరోగసమితి సమసిపోవు. (బాహటము)

క. బలురక్కసి నల్లేరును
జెలువుగ మఱి యుప్పుఁ గూర్చి సేవించినచో
సెలపాలు మేఘరంజిని
కుల మెల్లను వేగ నడఁచు గోపతిగమనా.

ఆ. సొంటి పంచదార సున్నపురాళ్ళలో
బట్ట ముల్లెఁ గట్టిపెట్టి నీరు
వోసి వండి దించి పూని సిందూరంబు
సేవఁ జేయ మాను శీఘ్రముగను.

శ్లేష్మభంగాళిలక్షణము

ఆవిః శ్లేష్మలః కంఠా దంగే పీతం చ నేత్రయోః. 124
బాధిర్యం శ్లేష్మణాప్రోక్తం భ్రమ మూర్ఛా శ్రమ క్లమాః,
స్యాద్రూపం శ్లేష్మణా జిహ్వా భంగాళిశ్లేష్మకే తథా. (అన్యశాస్త్రే)

తా. నోట మేక తెమడవలె వెళ్ళుట, శరీరము నేత్రములు పచ్చగ నుండుట, శ్లేష్మ ప్రకోపమువలన చెవుడు గలుగుట, తబ్బిబ్బులాడుట, మూర్ఛ, శ్రమ, ఆయాసము గలుగుట, నాలుక శ్లేష్మముతో పూయంబడినటు లుండుట - ఈలక్షణములు గలది శ్లేష్మ భంగాళి యని దెలియవలయును.

సర్వకాసములకు స్వర్ణభూపతి

శుద్ధసూతం సమం గంధం మృతశుల్బం తయోస్సమమ్,
అభ్ర లోహకయోర్భస్మ కాంతభస్మ సువర్ణజమ్. 126
రాజతం చ విషం సౌమ్యక్పృథక్సూతసమం భవేత్,
హంసపాదీరసై ర్మర్ద్యం దినమేకం వటీకృతమ్. 127
కాచకుప్యాం వినిక్షిప్య మృదా సంలేపయేద్బహిః,
శుష్కా సా వాలుకాయంత్రే శనైర్మృద్వగ్నినా పచేత్. 128
చతుర్గుంజామితం దేయం పిప్పల్యార్ద్రద్రవేణతు,
క్షయం త్రిదోషజం హంతి సన్నిపాతాం స్త్రయోదశ. 129
అనువాతం ధనుర్వాతం శృంఖలావాతమేవచ,
ఆఢ్యవాతం పంగువాతం కఫవాతాగ్నిమాంద్యనుత్. 130
కటీవాతం సర్వశూలం నాశయేన్నాత్ర సంశయః,
గుల్మశూలముదావర్తం గ్రహణీమతిదుస్తరామ్. 131
ప్రమేహ ముదరం సర్వా మశ్మరీం మూత్రవిడ్గ్రహం,
భగందరం సర్వకుష్ఠం విద్రధిం మహతీం తథా. 132
శ్వాసం కాస మజీర్ణంచ జ్వర మష్టవిధం తథా.
కామిలాం పాండురోగం చ శిరోరోగం చ నాశయేత్. 133
అనుపానవిశేషేణ సర్వరోగా న్వినాశయేత్,
యథా సూర్యోదయే నశ్యే త్తమస్సర్వగతం తథా. 134
సర్వరోగవినాశాయ సర్వేషాం స్వర్ణభూపతిః, (మాధవనిదానే)

తా. శుద్ధిజేసినరసము ౧ భాగము, శుద్ధిజేసినగంధకము ౧ భాగము, తామ్రభస్మము ౨ భాగములు, అభ్రకభస్మము, లోహభస్మము, కాంతభస్మము, స్వర్ణభస్మము, రజతభస్మము, శుద్ధిచేసినవసనాభి- ఇవి దినుసొకటింటికి కొక్కొకభాగము- ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో ఒకదినము మర్దించి ముద్దజేసి ఎండించి గాజుకుప్పెలో నునిచి దానిపై చీలమన్ను లేపనముజేసి ఎండించి వాలుకాయంత్రములో నునిచి మందాగ్నితో మెల్లగవండి సాంగశీతలమున దీసి నాలుగు గురిగింజలయెత్తును పిప్పళ్లు, అల్లపురసము అనువాని యనుపానముతోడ సేవించిన సన్నిపాతక్షయము, ౧౩ సన్నిపాతములు, అనువాతము, ధనుర్వాతము, శృంఖలావాతము, ఆఢ్యవాతము, పంగువాతము, కఫవాతము, అగ్నిమాంద్యము, కటివాతము, సర్వశూలలు,

గుల్మశూల, ఉదావర్తము, కడుబలిష్ఠమయిన గ్రహణీరోగము, ప్రమేహము, సర్వ ఉదరరోగములు, అశ్మరీరోగము, మూత్రకృచ్ఛ్రము, మలబద్ధము, భగందరము, సర్వ కుష్ఠములు, బలిష్ఠమైన విద్రధులు, శ్వాసము, కాసము, అజీర్ణము, లా విధములైన జ్వరములు, కామిల, పాండురోగము, శిరోరోగము, "సూర్యోదయుదయించుటవలన అంధకారము నశించుభంగి" నిస్సంశయముగ నశించుటయేగాక అనుపానవిశేషములవలన సర్వరోగముల నశింపజేయును.

## శ్లేష్మభంగాళీకాసమునకు నిదిగ్ధికాదిచూర్ణము

నిదిగ్ధికామూలకాస్థికం చ హింగూషణాభ్యాంమధునాచయుక్తాం,
లిహ్యన్నరశ్శ్వాసపీడితశ్చశ్లేష్మాళిభంగం వినిహంతి శీఘ్రమ్, 136

తా. రామములకపండు, ఉసిరికపప్పు, ఇంగువ, పిప్పళ్లు - వీనిని సమభాగములుగ చూర్ణచేసి తేనెతో సేవించిన మూలరోగము, శ్లేష్మభంగాళికాసము శీఘ్రముగ హరించును.

## కుష్ఠకాసలక్షణము

అత్యర్థమూత్రోప్యనాకారో ప్యంగవైకల్యదుఃఖితా,
కండూశ్చ దేహపాండుశ్చ శ్లేష్మకుష్ఠస్య లక్షణమ్. 137
(మాధవనిదానే)

తా. ఉలికిపడుట, ఆకారముచెడుట, అంగములు నొచ్చుట, శరీరమున దురద గలుగుట, శరీరము పాండురవర్ణముగ నుండుట - ఈలక్షణములు గలది కుష్ఠకాస మని తెలియవలయును.

## కుష్ఠకాసమునకు అగ్నిరసము

శుద్ధసూతం విషం గంధం శిఖీ తుత్థంచ టంకణమ్,
దరదం తాళకంచైవ సమభాగాని కారయేత్, 138
పునర్నవామూలరసై ర్మర్దితం ప్రహరత్రయమ్,
పాచయే ద్యామమాత్రంతు డోలాయంత్రేచ బుద్ధిమాన్. 139
గుంజాద్వయం తథా నిత్యం శ్లేష్మకుష్ఠవినాశనః,
భక్షయేన్మధునా హంతి కాసమగ్నిరసోహ్వయమ్. 140
(రసరత్నాకరే)

తా. రసము, గంధకము, మైలుతుత్తము, వెలిగారము, ఇంగిలీకము, తాళకము- నీనిని శుద్ధిచేసి సమభాగములుగ ఖల్వములో నునిచి గలిజేరువేళ్ళరసముతో మూడు

ఝాములు మర్దించి గలిజేరువేళ్ళరసముతో డోలాయంత్రమున నొకఝాము వండి రెండుగురిగింజలయెత్తును తేనెతో ప్రతిదినము సేవింపుచుండిన శుష్కకాసము హరించును.

సర్వకాసములకు క్షుద్రాదిలేహ్యము

వ్యాఘ్రీశతంస్యా దభయాశతంచ ద్రోణేజలస్యప్రపచేత్కషాయమ్,
తులాప్రమాణేన గుడేన యుక్తం పక్వాభయాభి స్సహతాభిరత్ర.
శీతేక్షిపేత్తన్మధునః పలాని పలానిచత్రీణికటుత్రయస్య,
త్వక్పత్రకైలాగరుకేసరాణాం చూర్ణాత్పలంచేతి విదేహదృష్టః. 142
క్షుద్రావలేహః కఫజాన్వికారాన్ సశ్వాసశోషానపి పంచకాసాన్,
హిక్కామురోరోగమపస్మృతించ హత్వా వివృద్ధిం కురుతేనలస్య.
(మాధవనిదానే)

తా. నేలములకవేళ్ళు ౧౦౦ పలములు, కరక్కాయలు ౧౦౦ పలములు - ఈ రెంటిని చిదియగొట్టి ద్రోణప్రమాణము నీళ్లు పోసి చతుర్థాంశముగ కషాయముగాచి వడియగట్టి అందు ప్రాతబెల్లము ౧౦౦ పలములు గలిపి పైకషాయములోని కరక్కాయల నిందువైచి పక్వముజేసి చల్లారినపిదప యందు తేనె ౬ పలములు, త్రికటుక చూర్ణము 3 పలములు, లవంగపట్ట, ఆకుపత్రిక, ఏలకులు, అగరు, నాగకేసరములు అనువానిచూర్ణము దినుసుకొక్కొక పలముచొప్పున గలిపి లేహ్యపక్వముగ వండి సేవింపుచుండిన శ్లేష్మరోగములు, ౫ శ్వాసములు, శోష, ౫ కాసములు, ఎక్కిళ్లు, రొమ్మునొప్పి, అపస్మారము వీనిని నశింపజేసి అగ్నిదీపనమును గలుగజేయును.

సర్వకాసములకు మహాక్షుద్రాదిలేహ్యము

వ్యాఘ్రీమూలం తులాచైవ పంచకోలం తదర్ధకం,
తదర్ధం గ్రంథికంచైవ భార్గి రాస్నా పృథక్పలమ్. 144
హరీతక్యా శ్శతంచైవ ద్వికుంభం జలమేవచ,
వాసాభృంగం చ నిర్గుండీ కురంట క్షుద్రమేవచ. 145
స్వరసం ప్రస్థమేకైకం ప్రస్థం గో ఛాగమూత్రయోః,
పురాణగుడమాదాయ తులామేకాం నిధాపయేత్. 146
త్రికటు త్రిఫలా గ్రంథి చాతుర్జాతకసైంధవం,
ద్విక్షారం పంచలవణం టంకణం రామఠం పృథక్. 147
పలంపలం వినిక్షేప్యం కాసానాం వింశతిం జయేత్,
మహాక్షుద్రాదికోనామ లేహ్యరాజో నసంశయః. (మతాంతరే)

తా. నేలములకవేళ్లు ౧౦౦ పలములు, [1]పంచకోలములు ౫౦ పలములు, మోడి ౨౫ పలములు, గంటుభారంగి, దుంపరాష్ట్నము - ఇవి దినుసుకొక్కొక పలము, కర క్కాయలబెరడు ౧౦౦ పలములు - ఇటుల వీనినెల్ల నేకముజేసి ౭ కుంభముల నీళ్లు పోసి చతుర్థాంశముగ కషాయముగాచి అందు అడ్డసరపాకు, గుంటగలగరాకు, వావిలి యాకు, ములుగోరింటాకు, నేలములకవేళ్ళు అనువానిరసముల దినుసొకటింటి కొక్కొక ప్రస్థము, ఆవుపంచితము, మేకపంచితము దినుసుకొక్కొక ప్రస్థము, ప్రాతబెల్లము ౧౦౦ పలములు గలిపి పక్వంబగునపు డందు త్రికటుకములు, త్రిఫలములు, మోడి, [2]చాతు ర్జాతకములు, సైంధవలవణము, యవక్షారము, సర్జక్షారము, [3]పంచలవణములు, వేల్చినవెలి గారము, వేల్చినయింగువ అనువానిని దినుసుకొక్కొక పలము చొప్పున గలిపి లేహ్యపక్వ ముగ వండి దించుకొని సేవించిన ౨౦ కాసములు హరించును. ఇది సర్వలేహ్యములలో శ్రేష్ఠంబైనది.

## మేఘురంజిదగ్గునకు చికిత్స

క. చేఁదయినబీరవిత్తుల, మోదంబున వేఁడినీళ్ళ ముద్ధగనూరన్
వేదన నొందక త్రాగిన, భేదించును మేఘురంజి పీనసమానున్.148

తా. శరీరదార్ఢ్యముగలవారు ౨౧ చేదుబీరవిత్తులగాని, లేక ౧౬ చేదుబీరవిత్తుల గాని, ఉష్ణోదకముతోనూరి ఉబ్బసము గలిగినప్పుడు త్రాగిన వమనంబులై విత్తులు పడును. పిదప శొంఠియుక్తముగ మజ్జిగయన్నమును భక్షించిన వాంతులు నిలుచును.

## అసాధ్యశ్లేష్మరోగోపద్రవములు

కపాల జిహ్వాకా శూలం జ్వరః పాండుశ్చ నేత్రయోః,
రోమహర్షః ప్రతిశ్వాసోఽప్యసాధ్యో నాస్తి భేషజమ్. 149

(ఆయుర్వేదే)

తా. కపాలము నాలుక శూలించుట, జ్వరము గలుగుట, నేత్రములు పాండుర వర్ణముగ నుండుట, రోమములు గగుర్పొడుచుట, మిక్కుటముగ శ్వాసము గలుగుట - ఈలక్షణములు గల కాసరోగి జీవించుట దుర్లభ మని తెలియవలయును

1 పంచకోలము లన పిప్పలి, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి. 2 చాతుర్జాతకము లన ఏలకులు, లవంగపుచెక్క, ఆకుపత్రిక, నాగకేసరములు. 3 పంచ లవణము లన సైంధవలవణము, కాచలవణము, సముద్రలవణము, సౌవర్చలవణము, బిడాలవణము.

### కాసములకు కదళీఫలయోగము

వికారశ్లేష్మణా జాతే భక్షయే త్కదళీఫలం,
మర్దితై ర్మరిచై స్సార్థం హంతి శ్లేష్మచిరంతనమ్. 150

తా. అరటిపండులో మిరియపుచూర్ణము గలిపి సేవించిన దీర్ఘకాలముగ నుండు కాసరోగములు హరించును.

### కాసరోగములయందు పథ్యము

శాలిషష్టిక గోధూమ మాష ముద్గ కుళుత్థకాః,
ఛాగాః పయో ఘృతం బింబీ వార్తాకం బాలమూలకమ్. 151
కాస మర్దక జీవంతీ వాస్తుకం బీజపూరకం,
గోస్తనీ లశునం లాజా వ్యోష ముష్ణోదకం మధు. 152
పథ్య మేతద్యథా దోష ముక్తం కాసగదాతురే,
(ఆయుర్వేదే)

తా. ౬౦ దినములకు ఫలించిన ధాన్యము, గోధుమలు, మినుములు, పెసలపప్పు, ఉలవలు, మేకపాలు, మేకనెయ్యి, దొండకాయ, లేతవంకాయ, లేతముల్లంగి, కసివెంద, పాలకూర, చక్రవర్తపుకూర, మాదీఫలము, ద్రాక్షపండు, వెల్లుల్లి, పేలాలు, త్రికటుకములు, ఉష్ణోదకము, తేనె - ఇవి కాసరోగములయందు పథ్యకరంబులు.

పటోల మిసి ఝిల్లీక వాస్తుకం బాలమూలకమ్.
ఘురసీ తిక్తకంచైవ బాలంచ కదళీఫలం,
కుటజం పక్వకూశ్మాండం కషాయ కటు తిక్తకమ్. 154
మధూకం తండులీయంచ పయో వింశతికాసినాం,
(మాధవనిదానే)

తా. పొట్లకాయ, పిన్నసదాప, కొయ్యతోటకూర, చక్రవర్తపుకూర, లేతముల్లంగి, చాతలాసికూర, చేతిబీర, లేతఅరటికాయ, కొడిసెకాయ, ముదురు గుమ్మడుకాయ, ఒగరు, కారము, చేదుగలపదార్థములు, ఇప్పపువ్వు, చిఱ్ఱికూర, పాలు - ఇవి ౨౦ కాసములయందు పథ్యకరంబులు.

### కాసరోగములయం దపథ్యము

మైథునం స్నిగ్ధ మధురం దివా స్వాపః పయో దధి. 155
పిష్టాన్నం పాయసాదీని కాసీధూమంచ వర్జయేత్, (ఆయుర్వేదే)

తా. స్త్రీసంగమము, జిగట గల పదార్థములు, మధుర పదార్థములు, పగ
యందు నిద్రించుట, పాలు, పెరుగు, పిండివంటకములు, పాయసము మొదలగునవి,
పొగయం దుండుట - ఇవి కాసరోగములయం దపథ్యకరంబులు. అట్లగుటం జేసి వీని
నివర్తింపవలయును.

మత్స్యాలాబు చ వార్తాకం కందామ్లం తిలతైలకమ్. 156
ఉపోతకీ దధి క్షీరం మహిషం శుష్కరూక్షకం,
తథా వింశతికాసేషు త్యజే ద్ద్రవ్యాణి బుద్ధిమాన్. 157
(మాధవనిదానే)

తా. మత్స్యములు, [1]అనుపకాయ, వంకాయ, కందగడ్డ, పులుసు, నూనె,
బచ్చలికూర, బఱ్ఱె పెరుగు, బఱ్ఱెపాలు, ఎండిన ద్రవ్యములు, రూక్షపదార్థములు - ఇవి
౨౦ కాసములయం దపథ్యకరంబులు. కావున వీనిని వర్జింపవలయును.

[2]శ్వాసనిదానము

మహోర్ధ్వచ్ఛిన్నతమక క్షుద్రభేదై స్తు పంచధా,
భిద్యతే సమహావ్యాధి శ్శ్వాసయేకోఽపి శేషతః. 158
(ఆయుర్వేదే)

తా. ఒకశ్వాసరోగమే మహత్తు, ఊర్ధ్వము, ఛిన్నము, తమకము, క్షుద్రము
అన నైదువిధంబులుగ నగును.

శ్వాసరోగపూర్వరూపములు

ప్రాగ్రూపం తస్య హృత్పీడా శూల మాధ్మాన మేవచ,
ఆనాహో వక్త్రవైరస్యం శంఖనిస్తోదఏవచ. 159

తా. హృదయమున పీడ, శూల గలుగుట, కడు పుబ్బుట, కడు పీడ్చుట, నోరు
చేదుగ నుండుట, కణతయందు పొడుచునటుల పీడ గలుగుట-ఇవి శ్వాసరోగమునకు
పూర్వరూపంబులు.

మహాశ్వాసలక్షణము

ఉద్ధూయమానవాతోయ శ్శబ్దవద్దుఃఖితో నరః,
ఉచ్చైశ్శ్వసితి సంరుద్ధో మత్తర్షభ ఇవానిశమ్. 160
ప్రణష్టజ్ఞానవిజ్ఞాన స్తథా విభ్రాంతలోచనః,
విస్తబ్ధాక్ష్యాననో బద్ధ మూత్రవర్చా విశీర్ణవాక్. 161

1 అనుపకాయ అనఁగా-సొరకాయ. 2 శ్వాస మనఁగ ఉబ్బసము.

దీనః ప్రశ్వసితంచాస్య దూరా ద్విజ్ఞాయతే భృశం,
మహాశ్వాసోపసృష్టస్తు క్షిప్రమేవ విపద్యతే. (మాధవనిదానే) 162

తా. వాతము పైకి ఈడువఁబడుటవలన మనుజుఁడు కడుదుఃఖితుఁడై "మదించిన వృషభమును బంధించుటవలన గొప్పశబ్దమును చేయుమాడ్కి" శ్వాసమును విడుచుచు పేయుం బగలు శ్వాసమువలన పీడితుఁడుగ నుండుట, శాస్త్రము, శాస్త్రార్థనిశ్చయము నశించుట, ఒకానొకపుడు నేత్రములు తిరుగుట, నేత్రములు, నోరు తెరచికొని జడముగ నుండుట, జలమలాదులు వెడల కుండుట, మాట్లాడుటకు శక్తి లేకుండుట, లేక మాట్లాడినను హీనస్వరముగ మాటలాడుట, మనస్సు ఖిన్నం బగుట, దూరముగ నుండునపుడే శ్వాసవేగము తెలియవచ్చుట - ఈలక్షణములు గలది మహాశ్వాస మని తెలియవలయును. ఇది గలనాడు నశించును.

## ఊర్ధ్వశ్వాసలక్షణము

ఊర్ధ్వం స్వసితియో దీర్ఘం నచ ప్రత్యాహరత్యధః,
శ్లేష్మావృతముఖస్రోతాః క్రుద్ధగంధవహార్దితః. 163
ఊర్ధ్వదృష్టి ర్విపశ్యంశ్చ విభ్రాంతాక్షఇతస్తతః,
ప్రముహ్యన్వేదనార్తశ్చ శుష్కాస్యోఽరతిపీడితః. (ఆయుర్వేదే)

తా. దీర్ఘకాలమువఱకు ఊర్ధ్వశ్వాసము వెడలుచుండుట, ఊర్ధ్వశ్వాసమును దించుటకు శక్తి లేకుండుట, నోరు, నేత్రములు, నాసికారంధ్రములు, కర్ణరంధ్రములు కఫముచే నడ్డగింపంబడుట, వాతప్రకోపమువలన పీడితుఁడై పొడవుగ జూచుచు చంచలమైన దృష్టితో ఇటు అటు చూచుట, మూర్ఛ, వేదన అనువానివలన కడుపీడితుఁడుగ నుండుట, నోరెండుట, ఎల్లపుడు దేనియం దాసక్తిలేకుండుట - ఈలక్షణములు గలది ఊర్ధ్వశ్వాస మని తెలియవలయును.

## శ్వాసాధోముఖనిషేధకారణము

ఊర్ధ్వశ్వాసే ప్రకుపితే హ్యధశ్శ్వాసో నిరుధ్యతే,
ముహ్యతస్తామ్యతశ్చోర్ధ్వం శ్వాసస్తస్యైవ హంత్యసూన్. 165

తా. ఊర్ధ్వశ్వాసము ప్రకోపించుటవలన అధశ్శ్వాసము నడ్డగింపబడును. (అనఁగా హృదయమునందే నడ్డగింపంబడు ననుట) లేక శ్వాస మనఁగా నధోముఖమును జెందకుండును. దానివలన రోగి మోహమును, బడలికను జెందును. ఈయూర్ధ్వశ్వాసను ప్రాణముల హరింపం జేయును.

## ఛిన్నశ్వాసలక్షణము

యస్తు శ్వసితి విచ్ఛిన్నం సర్వప్రాణేన పీడితః,
నవాశ్వసితి దుఃఖార్తో మర్మచ్ఛేదరుగర్దితః. 166
ఆనాహ స్వేద మూర్ఛార్తో దహ్యమానేన వస్తిరా,
విప్లుతాక్షః పరిక్షీణ శ్శ్వసన్ రక్తైకలోచనః. 167
విచేతాః పరిశుష్కాస్యో వివర్ణః ప్రలపన్నరః
ఛిన్నశ్వాసేన విచ్ఛిన్న స్సశీఘ్రం విజహాత్యసూన్. 168

తా. సిలిపి నిలిపి శ్వాసములు విడుచుట, శక్తికొలఁదిశ్వాసమును విడువయత్నించి నను సాధ్యపడ కుండుట, లేక క్లేశమును జెంది శ్వాసమును విడుచుట, అరోమ్ములో గొడ్డలితో భేదించునటుల పీడ గలుగుట, కడుపుబ్బరము, చెమట, మూర్ఛ అనువానితో పీడింపఁబడుట, పొత్తికడుపునందు మండుట, నేత్రములను గిరగిర త్రిప్పుట, లేక సత్వహీనుఁడై నేత్రములు చలింపక నిట్రబొడిచికొనుట, శ్వాసమును పలుమారు విడుచుటవలన క్షయించుట, ఒకనేత్రము ఎఱ్ఱగ నుండుట, మనస్సు ఖిన్న మగుట, నో రెండుట, కాంతి చెడుట, వదురుట, సంధిబంధములు శిథిలంబు లగుట-ఈలక్షణములు గలది ఛిన్నశ్వాసమని తెలియవలయును. ఇది గలవాఁడు కడుశీఘ్రముగ ప్రాణముల విడుచును.

## తమకశ్వాసలక్షణము

ప్రతిలోమం యదావాయు స్స్రోతాంసి ప్రతిపద్యతే.
గ్రీవాంశిరశ్చ సంగృహ్య శ్లేష్మాణం సముదీర్యచ. 169
కరోతి పీనసం తేన నిరుద్ధో ఘుర్ఘురం తథా,
అతీవ తీవ్ర వేగంచ శ్వాసం ప్రాణప్రపీడకమ్, 170
ప్రతామ్యతి సవేగేన త్రస్యతే సన్నిరుద్ధ్యతే,
ప్రమోహం కాసమానశ్చ సగచ్ఛతి ముహుర్ముహుః. 171
శ్లేష్మణ్యాముచ్యమానేతు భృశం భవతి దుఃఖితః,
తస్యైవచ విమోక్షాంతే ముహూర్తం లభతే సుఖమ్. 172
తథాస్యోద్ధ్వంసతేకంఠః కృచ్ఛ్రాచ్ఛక్నోతి భాషితుం,
సచాపి నిద్రాం లభతే శయాన శ్శ్వాసపీడితః. 173
పార్శ్వే తస్యావగృహ్ణాతి శయానస్య సమీరణః,
ఆసీనో లభతే సౌఖ్య ముష్ణంచైవాభినందతి 174
ఉచ్ఛ్రితాక్షో లలాటేన స్విద్యతా భృశమార్తిమాన్,

విశుష్కాస్యో ముహుశ్శ్వాసో ముహుశ్చైవావధమ్యతే. 175
మేఘాంబుశీతప్రాగ్వాతై శ్లేష్మలైశ్చ వివర్ధతే,
సయాప్యస్తమకశ్వాస స్సాధ్యోవాస్యాన్నవోద్ధితః. (చరకే) 176

తా. వాతము మెడ, శిరము అనువాని నాశ్రయించి అధోముఖముగ స్రోతోమార్గములం జెంది కఫమును బ్రకోపింపం జేసి కఫమువలన నడ్డగింపఁ బడినదై పడిసెమును, గొంతులో గురగురశబ్దమును గలుగం జేయుచు కడుతీవ్రవేగయుక్తమైనహృదయ ప్రపీడకమైన శ్వాసమును గలుగంజేయుట, దాని వేగమువలన మోహమును జెంది మిక్కుటముగ దుఃఖించుట, నిశ్చేష్టితుం డగుట, పలుమారు దగ్గుటవలన మోహమును జెందుట, కఫము వెడలకుండునప్పుడు కడుపీడం జెందుట, కఫము వెడలిన పిదప కొంత కాలము సుఖముగ నుండుట, మరల కంఠములో కఫము చేరుటవలన దురద గలుగుట, కడుకష్టముచే మాటలాడుట, శ్వాసపీడవలన పరుండినను నిదుర రాకుండుట, పరుండియుండినను వాతము ఇరుపార్శ్వముల నీడ్చుట, కూర్చుండియుండిన సుఖముగ నుండుట, ఉష్ణపదార్థసేవనవలన సంతోషమును జెందుట, కండ్లుబ్బుట, నుదుట చెమటపట్టుటవలన కడుపీడం జెందినటుల తోఁచుట, నోరెండుట, పలుమారు శ్వాసము వెడలుట, ఏనుగుపై గూర్చుండియుండువాని శరీరము కదలునటుల పలుమారు కదలుట, మేఘములు, వర్షము, చలి, తూర్పుగాలి, కఫకరపదార్థసేవన అనువానివలన శ్వాసము వృద్ధిం జెందుట-ఈ లక్షణములు గలది తమకశ్వాసమని తెలియవలయును. ఇది యాప్యము. నూతనముగ జనించిన సాధ్యము.

### క్షుద్రశ్వాసలక్షణము

రూక్షాయాసోద్భవః కోష్ఠే క్షుద్రోవాత ముదీరయేత్,
క్షుద్రశ్వాసోనసోత్యర్థం దుఃఖేనాంగప్రబాధకః. 177
హినస్తి నసగాత్రాణి నచ దుఃఖో యథేతరే,
సచ భోజనపానానాం నిరుణద్ధ్యుచితాంగతిమ్. 178
నేంద్రియాణాం వ్యథాంచాపి కాంచిదాపాదయేద్రుజం,

తా. రూక్షపదార్థసేవన, ఆయాసము వీనివలన ఒకింత శ్వాసము జనించి కోష్ఠగత వాతము నూర్ధ్వముగ జేసి కడుదుఃఖమును, శరీరమున కెవ్విధమైన బాధను, ప్రాణవియోగమును, ఊర్ధ్వశ్వాసాదులయందు గల దుఃఖములును గలుగంజేయక భోజనపానాదికముల గతిని నిరోధింపక, ఇంద్రియముల కెవ్విధమైన వ్యథయును గలుగంజేయక నుండునది క్షుద్రశ్వాస మనంబడును.

### శ్వాససాధ్యాసాధ్యావిచారము

ససాధ్యఉక్తో బలిన స్సర్వేచావ్యక్తలక్షణాః. 179
క్షుద్రస్సాధ్యతమ స్తేషాం తమకః కృఛ్రఉచ్యతే,
త్రయశ్శ్వాసా న సిధ్యంతి తమకో దుర్బలస్యచ. (ఆయుర్వేదే) 180

తా. క్షుద్రశ్వాసము సాధ్యము. మఱియు సత్వముగలవానియొక్క మహాశ్వాసాదులు అల్పలక్షణయుక్తంబులుగనుండిన సాధ్యంబు. అందు క్షుద్రశ్వాసము కడు సాధ్యంబు. మఱియు తమకశ్వాసము కష్టసాధ్యంబు. మహత్తు, ఊర్ధ్వము, ఛిన్నము అను నీమూడుశ్వాసములు సంపూర్ణలక్షణ యుక్తంబులుగ నుండిన అసాధ్యంబులు. మఱియు దుర్బలునికి జనించిన తమకశ్వాసము సగా అసాధ్యంబు.

### రోగసంప్రాప్తి, తల్లక్షణములు

యదా స్రోతాంసి సంరుధ్య మారుతః కఫపూర్వకః,
విష్వగ్వ్రజతి సంరుద్ధ స్తదాశ్వాసం కరోతి సః. 181
ప్రణష్ట జ్ఞాన విజ్ఞాన స్తథా విభ్రాంతలోచనః,
ఊర్ధ్వం శ్వసితి యో దీర్ఘం నచ ప్రత్యాహరత్యధః. 182
శ్లేష్మావృతముఖస్రోతా హ్యూర్ధ్వదృష్ట్యాచ పశ్యతి,
ఆనాహ స్వేదమూర్ఛార్తో భృశంభవతిదుఃఖితః (మాధవనిదానే).183

తా. వాతము కఫయుక్తమై ప్రాణాన్నోదకముల వహించు స్రోతోమార్గముల నడ్డగించి విరుద్ధమార్గముగలదై సర్వశరీరమునవ్యాపించి శ్వాసరోగమును గలుగంజేయును. అందు శాస్త్రజ్ఞానము, శాస్త్రార్థజ్ఞానమునశించుట, నేత్రములు దిరుగుట, దీర్ఘకాలము వఱకు ఎగయూపిరి విడుచుట, ఎగయూపిరిని దించుటకు శక్తి లేకుండుట, నోరు, కర్ణ నాసికారంధ్రములు, నేత్రములు వీనియందు శ్లేష్మము వ్యాపించియుండుట, పొడవుగ జూచుట, కడు పుబ్బుట, చెమటు, మూర్ఛ, కడుదుఃఖము గలుగుట-అను నీలక్షణములు గలుగును.

### శ్వాససామాన్య లక్షణములు

శ్వాసః పంచవిధ స్తత్ర మహాశ్వాసో మహాస్వనః,
ఊర్ధ్వశ్వాస శ్చోర్ధ్వదృష్టి శ్ఛిన్నో విచ్ఛిన్నసంజ్ఞకః. 184
తమోభ్రమ ఘనశ్చైవ క్షుద్రాఖ్యో మందవేదనః,
క్షుద్రస్సాధ్య స్తమో యాప్య శ్శేషాః ప్రాణహరా స్త్రయః. 185
(ఆయుర్వేదే)

తా. పూర్వోక్తపంచవిధశ్వాసములలో మిక్కుటముగ శబ్దము గలది మహాశ్వాస మనియు, ఊర్ధ్వదృష్టి గలది ఊర్ధ్వశ్వాస మనియు, నిలిచి నిలిచి శ్వాసమువచ్చునది ఛిన్నశ్వాస మనియు, నేత్రములు గనుపడక భ్రమసిన ట్లుండునది తమకశ్వాస మనియు, స్వల్పముగ నొప్పిగలది క్షుద్రశ్వాసమనియు తెలియవలయును. అందు క్షుద్రశ్వాసము సాధ్యము. తమకశ్వాసము యాప్యము. మహాశ్వాసము, ఊర్ధ్వశ్వాసము, ఛిన్నశ్వాసము అను నీమూడు మృత్యుప్రదంబులు.

## శ్వాసోపద్రవములు

కాసవృద్ధ్యా భవే చ్ఛ్వాసః పూర్వై ర్వా దోషకోపనైః,
ఆమాతిసార వమథు తృష్ణా పాండు జ్వరై రపి. 186
ఉర స్తు కురు తే శ్వాసో హ్యామాశయసముద్భవః,
ప్రాగ్రూపంచ భవే త్తేషాం పార్శ్వశూల మరోచకమ్. 187
ఆనాహ శ్శంఖభేదశ్చ తత్రాయాసశ్చ భోజనే,
ప్రేరితః ప్రేరయే త్క్షుద్రం స్వయం నశమయేన్మరుత్. 188
అతీవ తీవ్రవేగశ్చ శ్వాసః ప్రాణప్రపీడనః,
ప్రశామ్యతి నవేగశ్చ హ్యంతర్వేగనిపీడితః. 189
పూర్వరూపీ భవేచ్ఛ్వాసః స్సవృద్ధః కృశదేహితా
త్రయశ్శ్వాసా నసిధ్యంతి చైతఏవ హ్యుపద్రవాః. 190

తా. కాసము వృద్ధిచెందుటవలనగాని, లేక వాత, పిత్త, శ్లేష్మములు ప్రకోపించుటవలనగాని, శ్వాసము జనించి ఆమాతిసారము, ఓకర, దప్పి, పాండువు, జ్వరము అనువానితో గూడి ఱొమ్ము నాశ్రయించి ఆమాశయమునుండి శ్వాసమును గలుగం జేయును. వానిపూర్వరూపంబు లెవ్వి యనిన.—ప్రక్కశూల, అరోచకము, కడుపుబ్బరము గలుగుట, కుతికలో శ్లేష్మముగట్టి పగిలినటుల నొచ్చుట, శ్వాసమువలన అన్నమును కుడువలేక యుండుట, వాతగ్రస్తంబై తొలుత క్షుద్రశ్వాసమును గలుగం జేసి తాను శమింపకుండుట అనునవియు—ఈపూర్వరూపములతోడ శ్వాసము వృద్ధిం జెంది శరీరము కృశించియుండినను, లేక కడుతీవ్రవేగముగల శ్వాసము జనించి ప్రాణుల పీడించుచుండినను, లేక శ్వాసవేగము శమింపక అంతర్వేగము గల శ్వాసము గలిగియుండినను ఈలక్షణములుగలమూడుశ్వాసరోగములు అసాధ్యములని తెలియవలయును. (ఈలక్షణములు లేకుండెడిశ్వాసరోగములే సాధ్యములని యెఱింగి చికిత్సింపవలయును.)

అతిసంచితదోషస్య భక్తచ్ఛేదకృశస్యచ,

వ్యాధిభిః క్షీణదేహస్య వృద్ధస్యాతివ్యవాయినః. 191
ఆసాం యాసా సముత్పన్నా హిక్కా హంత్యాశు జీవితం,
సర్వేషు రోగినాశాయ హిక్కేయం శీఘ్రకారిణీ. 192
హిక్కా శ్వాసౌ యదాతౌ ద్వౌ మృత్యుకాలే కృతాలయౌ,

తా. కడుసంచిత దోషము గలవానికి, అన్నద్వేషమువలన కృశించినవానికి, పలువిధరోగమువలన శరీరక్షయముగలవానికి, వృద్ధునికి, మిక్కుటముగ మైథునముసేయువానికి, సాధ్యహిక్కలలో నేది జనించినను అది వానిని శీఘ్రముగ జంపును. మఱియు సర్వరోగములయం దెక్కిళ్ళు జనించిన రోగి శీఘ్రముగ మృతిజెందును. మఱియు ఎక్కిళ్లు, శ్వాసము అను నీరెండును మృత్యుకాలమునందే జనించును.

### ఊర్ధ్వశ్వాసమునకు సూర్యావర్తరసము

సూతార్ధం గంధకం మర్ద్యం యామైకం కన్యకాద్రవైః. 193
ద్వయోస్తుల్యం తామ్రపత్రం పూర్వకల్కేన లేపయేత్,
దినైకం హండికాయంత్రే పక్వమాదాయ చూర్ణయేత్. 194
సూర్యావర్తో రసోనామ ద్విగుంజం శ్వాసజిద్భవేత్,
ఇంద్రవారుణికామూలం దేవదారు కటు*త్రయమ్. 195
శర్కరాసహితం ఖాదే దూర్ధ్వశ్వాసప్రశాంతయే,
నిష్కైకాం లేహయేద్వాపి క్షౌద్రేణ కటురోహిణీమ్. 196
శ్వాసం చారోచకం హంతి మరిచం దాడిమం గుడం,

(మాధవనిదానే)

తా. శుద్ధిజేసిన రసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౪ భాగము ఈరెంటిని ఖల్వములో నునిచి కలబందరసముతో నొకఝాము మర్దించి ౧౪ భాగము శుద్ధిజేసిన తామ్రపురేకులకు లేపనముజేసి ఎండించి హండికాయంత్రమున ఒకదినము వండి సాంగశీతమున దీసి ఖల్వములో నునిచి చూర్ణముజేసి రెండుగురిగింజలయెత్తును సేవించిన శ్వాసమును, పాపరవేరు, దేవదారు, త్రికటుకములు, పంచదార అనువాని చూర్ణానుపానముతోడ సేవించిన ఊర్ధ్వశ్వాసమును, నిష్కప్రమాణము కటుకరోహిణి చూర్ణము, తేనె అనువాని యనుపానముతోడగాని, లేక నిష్కప్రమాణము మిరియాలు, దాడిమవిత్తులు, బెల్లము అనువానిని నూరి దాని యనుపానముతోడగాని సేవించిన శ్వాసమును, అరోచకమును హరించును.

* త్రికమ్.

సర్వశ్వాసములకు ఉదయభాస్కర రసము

ధాన్యాభ్రం సూతకం గంధం శ్వేతాపామార్గజద్రవైః. 197
తుల్యాంశం మర్దయే చ్చాయఃపాత్రే పాతనకే పచేత్,
ఊర్ధ్వలగ్నం తతో గ్రాహ్యం రసో హ్యుదయభాస్కరః. 198
శ్వాసం పంచవిధం హంతి [1] గుంజామాత్రం పిబేదను,

తా. ధాన్యాభ్రకము, రసము, గంధకము-వీనిని శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వములో నునిచి తెల్లయుత్తరేణిరసములో నొకదినము మర్దించి ఇనుపపాత్రలో నునిచి పాతనాయంత్రమున పాకముచేసిన నది యూర్ధ్వయంత్రమున కెగయున్న. దానిని దీసికొని యందొకగురిగింజయెత్తును నిమ్మప్రమాణము కటుకరోహిణి, తేనె అనువాని యనుపానముతోడగాని, నిమ్మప్రమాణము మిరియాలు, దాడిమవిత్తులు, బెల్లము అనువానిని నూరి ముద్దచేసి దానితోడగాని సేవించిన ౫ శ్వాసములు, అరోచకము హరించును.

శ్వాసములకు గంధకయోగము

గంధకం మరిచం సాజ్యం పిబే [2] చ్ఛ్వాసకఫాపహమ్. 199
గంధకం ఘృతపానేన శ్వాసక్షతక్షయాపహం,

తా. శుద్ధిచేసిన గంధకము, మిరియాలు వీనిని నేతితో నూరి సేవించిన శ్వాస కాసలు హరించును. శుద్ధిచేసిన గంధకమును నేతితోడ సేవించిన శ్వాసము, క్షతక్షయము హరించును.

శ్వాసములకు భార్గ్యాదికషాయము

భార్గీ వచా భాను శివా హరిద్రా
వాసామృతా నాగర ధాన్యకానాం,
క్వాథోజయేచ్ఛ్వాసమిమం ప్రసిద్ధం
తథాచ నిద్రా సుఖ మాప్నుయాచ్చ. 200

తా. గంటుభారంగి, వస, జిల్లేడువేరు, కరక్కాయలు, పసపు, అడ్డసరపుయాకులు, తిప్పతీగె, శొంఠి, కొతిమెర్లు-వీనిని సమభాగములుగ దంచి కషాయము గాచి సేవించిన శ్వాసములు హరించుటయేగాక నిద్రాసుఖమును గలుగును.

శ్వాసములకు విభీతకాదికషాయము

విభీతభాస్వగ్నిచవిశ్వభార్గ్యా కణాభయా ముస్తకృతఃకషాయః

1 గుంజాద్వయానుపానతః. 2 ద్వాత.

వమింహరేచ్ఛ్వాసమిమంపి బేచ్చ ప్రవృద్ధకాసం ప్రబలాంచహిక్కామ్.

తా. తానికాయలు, జిల్లేడువేరుపట్ట, చిత్రమూలము, శొంఠి, గంటుభారంగి పిప్పళ్ళు, కరక్కాయలు, తుంగముస్తెలు- వీనిని సమభాగములుగ దంచి కషాయము గాచి సేవించిన వాంతి, శ్వాసము, ప్రబలమైనకాసము, ప్రబలమైనఎక్కిళ్ళు హరించును.

శ్వాసాదులకు కంటకార్యావలేహము

కంటకారీ తులాం ద్రోణ నీరే పక్త్వా కషాయకం,
పాదశేషం గృహీత్వా చ తస్మింశ్చూర్ణానిదాపయేత్. 202
పృథక్పలాని చైతాని గుడూచీ చవ్యచిత్రకాః,
ముస్తం కర్కటశృంగీచ త్ర్యూషణం ధన్వయాసకః. 203
భార్గీ రాస్నా శఠీచైవ శర్కరా పలవింశతిః,
ప్రత్యేకంచ పలాన్యష్టౌ ప్రదద్యాద్ఘృతతైలయోః 204
పక్త్వా లేహత్వమానీయ శీతే మధుపలాష్టకం,
చతుఃపలంతుగాక్షీర్యాః పిప్పలీనాం చతుఃపలమ్. 205
క్షిప్త్వా నిదధ్యాత్సుదృఢే మృణ్మయే భాజనే శుభే,
లేహోఽయంహంతిహిక్కార్తిశ్వాసకాసానశేషతః. (ఆయుర్వేదే)

తా. నూరు పలముల వాకుడువేళ్ళుదంచి ద్రోణప్రమాణము గల నుదకమునందు వైచి నాలవభాగము మిగులునటుల కషాయము గాచి వడియగట్టి అందు తిప్పతీగె, చవ్యము, చిత్రమూలము, తుంగముస్తెలు, కర్కాటకశృంగి, త్రికటుకములు, దురదగొండి, గంటుభారంగి, * సన్నరాస్నము, కచ్చూరములు అనువానిచూర్ణము దినుసొకటింటి కొక్కొకపలము, పంచదార ౨౦ పలములు, నెయ్యి ౮ పలములు, తెల్లఆవనూనె ౮ పలములు గలపి లేహ్యపక్వముగ వండి చల్లారినపిదప తేనె ౮ పలములు, వెదురుప్పు ౪ పలములు, పిప్పలిచూర్ణము ౪ పలములు గలిపి మంచిమట్టిపాత్రలో నునిచి సేవించుచుండిన ఎక్కిళ్ళు, శ్వాస, కాసములు నిశ్శేషముగ హరించును.

సర్వశ్వాసములకు భార్గీగుడము

శతం సంగృహ్య భార్గ్యాస్తు దశమూల్యాస్తథా శతం
శతం హరీతకీనాంచ పచేత్తోయే చతుర్గుణే. 207
పాదావశేషే తస్మింస్తు రసే వస్త్రనిపీడితే,
ఆలోడ్యచ తులాం పూతాం గుడస్యాప్యభయాం తతః. 208

* ఇదే దుంపరాస్నము.

పునఃపచేత్తు మృద్వగ్నౌ యావల్లేహత్వమేతి తత్,
శీతే చ మధున స్తత్ర షట్పలాని వినిక్షిపేత్. 209
త్రికటు త్రిసుగంధంచ పలమాత్రం పృథక్పృథక్,
యవక్షారం కర్ష యుగ్మం సంచూర్ణ్య ప్రక్షిపే త్తతః. 210
భక్షయే దభయా మేకాం లేహస్యార్ధపలం తథా,
శ్వాసం సుదారుణం హంతి కాసం పంచవిధం తథా. 211
అర్శాంస్యరోచకం గుల్మం శకృద్భేదం క్షయం తథా,
స్వరవర్ణప్రదో హ్యేష జఠరాగ్నేః ప్రదీపనః. 212
నామ్నా భార్గీ గుడః ఖ్యాతో భిషగ్భిస్సకలైర్మతః. (నిత్యనాథీయే)

తా. గంటుభారంగి, దశమూలములు, కరక్కాయలు-వీనిని దినుసుకు ౧౦౦ *పలములు చొప్పున నొకభాండములోవైచి ౧౨౦౦ పలములు నీళ్ళుపోసి నాలవభాగము మిగులునటుల కషాయము గాచి వడియగట్టి యందు బెల్లము ౧౦ం పలములు, కరక్కాయలు ౧౦ం పలములు వైచి మరల మందాగ్నితో చిక్కగనగువఱకు పాకము జేసి చల్లారినపదప తేనె ౬ పలములు, త్రికటుకములు, దాచినిచెక్క, ఆకుపత్రిక, ఏలకులు అనువాని చూర్ణము దినుసు కొక్కొకపలము, యవక్షారచూర్ణము ౨ కర్షములు కలిపి లేహ్యమును సిద్ధపఱచి యందర్ధపలమును, ఒకకరక్కాయను ప్రతిదినమును ప్రాతఃకాలమున సేవించిన భయంకరమైన శ్వాసము, ౫ విధకాసములు, మూలవ్యాధి, అరోచకము, గుల్మము, అతిసారము, క్షయము-వీనిని నశింపజేయుటయేగాక స్వరము, వర్ణము, అగ్ని దీపనము అనువానినిసహా గలుగంజేయును. ఈభార్గ్యాదిగుడము సకలవైద్యసమ్మతము.

## శ్వాసములకు వాసాద్యవలేహము

వాసా తులామష్టగుణేచ నీరే విపాచ్యతాం పాదజలేనపాకం,
క్షుణ్ణాధకంతద్విపచేచ్ఛివానాంఖండాఃప్రయోజ్యాస్సకలస్యతుల్యాః.
తతస్సముత్తార్య పలానిచాష్టౌ క్షౌద్రస్యచ ద్వే కిల వంశజాయాః,
క్షిపే త్తథా మాగధికా పలార్ధం పలంచతుర్జాతభవంప్రయోజ్యమ్.
యోజ్యం పలార్ధం శ్వసనేచకాసే క్షయేస్రపిత్తే కఫపీనసేచ,
హృద్రోగకార్శ్యే కిల విద్రధౌచ హ్యురఃక్షతేశోణితవాంతికోపే.
(ఆయుర్వేదే)

* పల మన ౪ తులములు.

తా. నూరుపలముల అడ్డసరములో ౮౦౦ పలములు నీళ్లుపోసి చతుర్థాంశముగ కషాయము గాచి అందు కరకచూర్ణము ఆఢకప్రమాణము గలిపి గట్టియగువఱకు మరల పాకముచేసి దానిని దించి చల్లారినపిదప తేనె ౮ పలములు, వెగురుప్పుచూర్ణము ౨ పలములు, పిప్పలిచూర్ణము ౪ పలము, చాతుర్జాతకచూర్ణము ౧ పలము కలిపి అర్ధపలమును సేవించుచుండిన శ్వాస కాసములు, క్షయము, రక్తపిత్తము, కఫము, పీనసము, హృద్రోగము, కృశత్వము, విద్రధి, ఉరఃక్షతము, రక్తవాంతి వీనిని హరింపంజేయును.

సర్వశ్వాసములకు శ్వాసకాళేశ్వరరసము

మృతంవంగం మృతంలోహం మృతార్కం మృతమభ్రకమ్,
శుద్ధసూతం తథా గంధం మాక్షీకం హింగుళం విషమ్. 217
జాతీఫలం లవంగం చ త్వగేలా నాగకేసరం,
ఉన్మత్తకస్య బీజాని జైపాలం రాత్రిదుర్లభమ్. 218
ఏతాని సమభాగాని మరిచం హరనేత్రకం,
సర్వం తద్వ్యాక్షిపేత్ఖల్వే లోహదండేన మర్దయేత్. 219
తావచ్చూర్ణీకృతం ధీమాన్ యావత్సూతం నదృశ్యతే.
శక్రాసనస్య స్వరసే ర్భావనాచైకవింశతిః. 220
ద్విగుంజాప్యుత్తమామాత్రా హ్యార్ద్రికస్వరసైర్యుతా,
తదర్ధం బాలవృద్ధేషు పథ్యం దేయం తథోచ్యతే. 221
పంచశ్వాసాన్ క్షయం కాసం రాజయక్ష్మనివారణం,
శ్వాసకాళేశ్వరో నామ దేవానామపి దుర్లభః. 222

తా. వంగభస్మము, లోహభస్మము, తామ్రభస్మము, అభ్రకభస్మము, శుద్ధిజేసినరసము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన సువర్ణమాక్షికము, శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసినవసనాభి, జాజికాయ, లవంగములు, దాచినిచెక్క, ఏలకులు, నాగకేసరములు, శుద్ధిజేసిన ఉమ్మెత్తవిత్తులు, శుద్ధిచేసిన నేపాళములు, పసపు, కచోరములు ఇవి సమభాగములు, మిరియాలు 3 భాగములు - వీనినెల్ల ఖల్వములో నుసిచి రసము దెలియకుండువఱకు లోహదండముతో మర్దించి కొడిసెరసముతో ౨౧ మారు భావనజేసి వయోవంతులు రెండుగురిగింజలయెత్తును, బాల వృద్ధులు ఒక గురిగింజయెత్తును, అల్లపురసముతో సేవించి పథ్యముగ నుండిన ౫ విధశ్వాసములు, శరీరక్షయము, కాసము, రాజయక్ష్మ వీనిని నశింపజేయును. ఈశ్వాసకాళేశ్వరరసము లభించుట దేవతలకు సహా దుర్లభంబు.

### హిక్కానిదానము

విదాహి గురు విష్టంభి రూక్షాభిష్యంది భోజనైః,
శీతపానాశనస్నానైర్హిక్కా భవతి ధావనాత్. 223

(మాధవనిదానే)

తా. దాహజనకద్రవ్యములు, జడకరద్రవ్యములు, మలబద్ధకర రూక్షకరద్రవ్యములు, జిగటగలపదార్థములు వీనిని భుజించుటవలన, శీతాన్నపానముల సేవించుటవలన, శీతోదకములో స్నానము జేయుటవలన, పరుగులిడుటవలన ఎక్కిళ్ళు జనించును.

### హిక్కాభేద, తత్సంప్రాప్తి

అన్నజాం యమలాం క్షుద్రాం గంభీరాం మహతీం తథా,
వాయుః కఫేనానుగతం పంచహిక్కాః కరోతి హి. 224

తా. వాతము కఫముతో గలసి అన్నజహిక్క, యమళహిక్క, క్షుద్రహిక్క, గంభీరహిక్క, మహాహిక్క అన నైదువిధములైన హిక్కల గలుగంజేయును.

### హిక్కాపూర్వరూపములు

కంఠోరసో ర్గురుత్వంచ వదనస్య కషాయతా,
హిక్కానాంపూర్వరూపాణి కుక్షేరాటోపఏవచ. (ఆయుర్వేదే)

తా. కంఠము, రొమ్ము అనువానియందు జడత్వముగలుగుట, నోరు వగరుగ నుండుట, కడుపులో ఆరాటము గలుగుట-ఇవి హిక్కకు పూర్వరూపంబులు.

### అన్నజహిక్కాలక్షణము

పానాన్నైరతిసంభుక్తైః సహసా పీడితోఽనిలః,
హిక్కయత్యూర్ధ్వగో భూత్వా తాం విద్యా దన్నజాం భిషక్. 226

తా. అన్నపానాదుల మిక్కుటముగ సేవించుటవలన వాతం బకస్మాత్తుగ పీడింపఁ బడినదై ఊర్ధ్వగతంబై ఎక్కిళ్ళను గలుగంజేసిన అన్నజహిక్క యని తెలియవలయును.

### యమళహిక్కాలక్షణము

చిరేణ యమలైర్వేగైర్యా హిక్కా సంప్రవర్తతే,
కంపయంతీశిరోగ్రీవాం యమలాంతాంవినిర్దిశేత్. (మాధవనిదానే)

తా. చిరకాలముమీఁద ఎక్కిళ్ళు రెండుగ గలసి కడుతీవ్రముగ వచ్చుట, శిరము కంఠము వణుకుట- ఈలక్షణములు గలది యమళహిక్క యని తెలియవలయును.

క్షుద్రహిక్కాలక్షణము

ప్రకృష్టకాలై ర్యావేగై ర్మందై స్సమభివర్తతే,
క్షుద్రికానామ సా హిక్కా జత్రుమూలాత్ప్రధావతి, 228
(నిత్యనాథీయే)

తా. చిరకాలముమీఁద ఎక్కిళ్ళు మందవేగముగ వచ్చుట, * జత్రుమూలముల లోనుండి జనించుట-ఈలక్షణములు గలది క్షుద్రహిక్క యని తెలియవలయును.

గంభీరహిక్కాలక్షణము.

నాభిప్రవృత్తా యా హిక్కా ఘోరా గంభీరనాదినీ,
అనేకోపద్రవవతీ గంభీరానామ సా స్మృతా. 229

తా. ఎక్కిళ్ళు బొడ్డువద్దనుండి లేచి గంభీరశబ్దమును గలుగఁజేయుట, దప్పి, జ్వరము మొదలగు పలు నుపద్రవములతోఁడగూడి భయంకరముగ నుండుట - ఈలక్షణములుగలది గంభీరహిక్క యని తెలియవలయును.

మహాహిక్కాలక్షణము.

మర్మాణ్యుత్పీడయంతీవ సతతం యా ప్రవర్తతే,
మహాహిక్కేతి సాజ్ఞేయాసర్వగాత్రప్రకంపినీ.(ఆయుర్వేదే) 230

తా. ఱొమ్ము, నాభి, పొత్తికడుపు మొదలగు మర్మస్థలములయందు పీడగలుగుట, ఎల్లపుడు ఎక్కిళ్ళువచ్చుట, సర్వాంగములు వణకుట-ఈలక్షణములు గలది మహాహిక్క యని తెలియవలయును.

హిక్కాస్వరూప తత్సాధ్యాసాధ్యములు.

యమళా యుగళై ర్వేగై ర్మహాంతే మహతీధ్వనిః,
గంభీరానాభిసంభూతా క్షుద్రాఖ్యా మందవేగిని. 231
అన్నజాపి తథైవస్యా త్పూర్వా స్తిస్రో వివర్జయేత్. (ఆయుర్వేదే)

తా. ఎక్కిళ్లు వేగముతోఁగూడి జంటగ వెడలిన యమళహిక్క యనియు, మహాధ్వనితోఁ గూడి వెడలిన మహాహిక్క యనియు, నాభినుండి వెడలిన గంభీరహిక్క యనియు, మందవేగముతోఁ గూడి పలుమారు వెడలుచుండిన క్షుద్రజహిక్క యనియు, అన్నపానాదులవలన ఎక్కిళ్లు జనించిన అన్నజహిక్కయనియు తెలియవలయును. అందు యమళహిక్క, మహాహిక్క, గంభీరహిక్క అన నీమూడు నసాధ్యంబులు. క్షుద్రహిక్క, అన్నజహిక్క అన నీరెండును సాధ్యంబులు.

---

*జత్రుమూలము లన మెడకొంకులు.

## అసాధ్యహిక్కాలక్షణము

ఆయమ్యతే హిక్కతో యస్య దేహో
దృష్టిశ్చోర్ధ్వం తామ్యతే యస్య నిత్యం,
క్షీణోన్నద్విట్ క్షౌతి యశ్చాతిమాత్రం
తౌ ద్వౌ చాంత్యౌ వర్జయే ద్ధిక్కమానౌ. 232

తా. క్షుద్రజ, అన్నజములను సాధ్యహిక్కలలో సగా ఎక్కిళ్ల వేగమువలన నేత్రములు విస్తరించి ఊర్ధ్వదృష్టి గలిగి ఎల్లపుడు మోహమును జెందుచుండు హిక్కా రోగిని, శరీరక్షయము అన్నద్వేషము పలుమారు ఎక్కిళ్ళు గలహిక్కారోగిని వైద్యుఁడు వర్జింపవలయును.

అతిసంచితదోషస్య భక్తచ్ఛేదకృశస్యచ,
వ్యాధిభిః క్షీణదేహస్య వృద్ధస్యాతివ్యవాయినః. 233
ఆసాం యాసా సముత్పన్నా హిక్కా హంత్యాశు జీవితమ్,
(గ్రంథాంతరే)

తా. కడుసంచితదోషముగలవానికి, అన్నద్వేషమువలన కృశించినవానికి, పలువిధములైన రోగములవలన శరీరకృశత్వముగలవానికి, వృద్ధునికి, అతిమైథునముసేయువానికి సాధ్యహిక్కలలో నేదిజనించినను యది వానిని శీఘ్రముగు జంపును.

## హిక్కలకు మేఘడంబరరసము

తండులీయద్రవైః పిష్టం సూతతుల్యంచ గంధకమ్. 234
*వజ్రమూషాగతం పాచ్యం భూధరేఽంత్రం సముద్ధరేత్.
దశమూలకషాయేణ భావయే త్త్రివారద్వయమ్. 235
గుంజాద్వయం హరత్యేష హిక్కాం శ్వాసం జ్వరం కిల,
అనుపానేన దాతవ్యో రసోఽయం మేఘడంబరః. 236
నాగరం పిప్పలీ భార్గీ పుష్కరం కర్షకం శఠీ,
శర్కరాష్టగుణం చూర్ణ మనుపానం ప్రకల్పయేత్. 237
(మాధవనిదానే)

తా. రసము, గంధకము వీనిని శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వములో నునిచి చిర్రివేళ్ళరసముతో మర్దించి వజ్రమూషలో నునిచి భూధరయంత్రమున పుటంబిడిన

---

* వజ్రమూషాగతంచైవ భూధరే భస్మతాం వ్రజేత్.

నది భస్మంబగును. పిదప దానిని సాంగశీతలమున దీసి మఱల ఖల్వములోనునిచి దశమూల కషాయముతో రెండుఝాములుభావన జేసిరెండుగురిగింజలయెత్తునుశొంఠి,పిప్పళ్ళు, గంటు భారంగి, పుష్కరమూలము, (దీనియభావంబున నేలములకవేళ్లు) కచ్చూరములు—వీనిని దినుసుకు కర్షప్రమాణము చొప్పున ఛూర్ణముజేసి దీనికెనిమిదవపాలు పంచదార గలిపి యీయనుపానముతోడ సేవించిన ఎక్కిళ్లు, శ్వాసము, జ్వరము హరించును. (మఱియు నీరసమును చిట్టివేళ్లరసముతో సేవించిన యమళహిక్క హరించును.)

## హిక్కలకు యోగవాహకరసము

రసస్యతుల్యభాగేన తామ్రభస్మప్రకల్పయేత్,
జంబీరోత్థద్రవైర్మర్ద్యం దినాంతే తత్సముద్ధరేత్. 238
బధ్వా వస్త్రోటికాయంత్రే తుల్యం గంధేన పాచయేత్.
ఏవంతు షడ్గుణం కార్యం తతః పిష్టం సముద్ధరేత్. 239
పాషాణభేదిమత్స్యాక్షీ ద్రవైః పిష్టంతు మర్దయేత్,
తద్గోళం లేపయేచ్ఛోష్యం కల్కే పాషాణభేదినః. 240
మత్స్యాక్ష్యాశ్చ ఘనం లేప్యం దత్వా పాతనయంత్రకే,
స్వేదయే ద్యామమాత్రంతు రసోఽయం యోగవాహకః. 241
గుంజాద్వయం ప్రదాతవ్యం హిధ్మా వైస్వర్యశ్వాసజిత్,
దశమూలం పిబేచ్చానుకుళుత్థంచ కషాయకమ్. (ఆయుర్వేదే)

తా. రసభస్మము, తామ్రభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో నొకదినము మర్దించి బట్టలోమూటగట్టి వేష్టికాయంత్రములో నునిచి ఆరింతలగంధకము జీర్ణంబగువఱకు పుటంబిడి ఖల్వములో నునిచి * కొండపిండివేళ్లు, పొన్నగంటివేళ్లు-వీనిరసములతో ప్రత్యేకముగ మర్దించి ముద్దజేసిదానిపైకొండపిండాకును నూరి లేపనముజేసి ఎండనెండించి పాతనాయంత్రమున నొకఝాము పుటంబిడి సాంగ శీతలమున దీసి రెండుగురిగింజలయెత్తును దశమూలకషాయముతోగాని, ఉలవకషాయము తోగాని సేవించిన యమళహిక్క మొదలగు సర్వహిక్కలు, స్వరభంగము, శ్వాసము హరించును.

## హిక్కలకు గంధామృతరసము

రసం గంధకతైలేన మర్దయేత్పాదటంకణం,
తత్పిండం బంధయేద్వస్త్రే గంధకార్యంచ పూర్వవత్. 243

* ఇదే పిండిబండయనియు జెప్పంబడును.

చూర్ణం వై వేష్టికాయంత్రే యావజ్జీర్యతి షడ్గుణం,
అయంగంధామృతో నామ్నా రసో హిక్కావినాశకః. 244
గుంజాత్రయం లిహేత్క్షౌద్రైః కషాయంచ చ పిబేదను,
అమృతాగ్నిశుళుత్థానాం పాయయేత్క్వథితైర్జలైః. 245
(ఆయుర్వేదే)

తా. శుద్ధిజేసినరసము గంధకతైలముతో మర్దించి పిదప రసమునకు నాలవభాగము శుద్ధిజేసిన వెలిగారము గలిపి మరల మర్దించి బట్టలో నునిచి మూటగట్టి దీనిని శుద్ధిచేసిన గంధకములోబెట్టి వేష్టియంత్రమున ఆరింతలగంధకము జీర్ణంబగువఱకు పుటంబిడి మూడుగురిగింజలయెత్తురు తేనెతో సేవించి తోడనే తిప్పతీఁగె, చిత్రమూలము, ఉలవలు అనువాని కషాయమును ద్రాగిన ఎక్కిళ్లు హరించును.

## హిక్కలకు నిదిగ్ధికాదియోగము

నిదిగ్ధికాం చామలకప్రమాణాం
హింగూ కణాభ్యాం మధునాచ యుక్తాం,
లిహ్యన్నరశ్శ్వాసనపీడితశ్చ
హిక్కాం జయత్యేష బలాత్క్షణేన. 246

తా. ఉసిరికకాయంత వ్రాకుడువేళ్లముద్దలో పేల్చిన ఇంగువ, పిప్పళ్ళు అనువానిచూర్ణమును, తేనెను గలిపి సేవించిన శ్వాసము, ఎక్కిళ్లు తత్క్షణమున హరించును.

## హిక్కలకు కుళీరాదికషాయము

కుళీర మధుకం ధాన్య మేలాచోశీర కోలకం,
వరా బిల్వాయుతం క్వాథం హిక్కా ఛర్ది నివారణమ్. 247

తా. కర్కాటకశృంగి, యష్టిమధుకము, కొతిమెర్లు, ఏలకులు, వట్టివేరు, తక్కోలపుట్లు, త్రిఫలములు, మారేడువేరు-వీనిని సమభాగములుగ దంచి కషాయము గాచి సేవించిన ఎక్కిళ్ళు, వాంతి హరించును.

## హిక్కలకు విభీతకాదికషాయము

విభీతకాబ్దామలవిశ్వభార్జ్గి కణాభయాసాధిత మంబుపీతం,
సమీరణ శ్వాస వమిం హరేచ్చ ప్రబద్ధకాసం ప్రబలాంచ హిక్కామ్.

తా. తానికాయలు, తుంగముస్తెలు, ఉసిరికపప్పు, శొంఠి, గంటుభారంగి, పిప్పళ్లు

కరక్కాయలు-వీనిని సమభాగములుగ దంచి కషాయముగాచి సేవించిన వాతము, శ్వాస
వాంతి, ప్రబలమైన కాసములు, ఎక్కిళ్ళు హరించును.

హిక్కలకు వ్యాఘ్ర్యాదికషాయము

వ్యాఘ్రీ దురాలభా భార్గీ బిల్వ మజ్జా త్రికంటకైః,
కషాయశ్చానుపానం చ క్షౌద్రం హిక్కాతిశ్వాసజిత్. 2

తా. ములకవేళ్లు, రేగటిదూలవేళ్లు, గంటుభారంగి, మారేడుగుజ్జు, పల్లేరు-వీ
సమభాగములుగ దంచి కషాయము గాచి యందొకింత తేనె వైచి సేవించిన ఎక్కి
ప్రబలమైన శ్వాసము హరించును.

హిక్కలకు మయూరపింఛయోగము

మయూరపింఛభస్మాపి మధుకంచ కణాయుతం,
కులీరరక్తే సంమర్ద్య మధునా వాసితాయుతమ్. 2
గండూషం కురుతే క్షిప్రం హిక్కామాశు వినాశయేత్,
(మాధవనిదా

తా. నెమలియాకలభస్మము, యష్టిమధుకము, పిప్పళ్ళు - వీనిని సమభాగముల
ఖల్వములోనునిచి ఎండ్రకాయరక్తముతో మర్దించి తేనె గాని లేక పంచదారగాని క
గండూషముజేసిన ఎక్కిళ్ళు శీఘ్రముగ హరించును.

హిక్కాహరయోగములు

కర్కటీపలిలం యష్టి మయూరస్యచపింఛజమ్. 2
భస్మభ్రమరగేహంచ హ్యాపామార్గస్య బీజకం,
మధునా యోజితం దేయం హిక్కామాశు వినాశయేత్. 2

తా. ఎండ్రకాయబొక్కలలోని యుదకము, యష్టిమధుకము, నెమలియా
భస్మము, తుమ్మెదలగూడు, ఉత్తరేణివిత్తులు అనువానిలో దేనినేని తేనెతోగూర్చి సేవిం
ఎక్కిళ్ళు శీఘ్రముగ హరించును.

క. వెలిగార మాకుపత్రిక, సిల దాచినిచెక్క కోష్ఠు వేలకిచూర్ణం
బులుచేసి తేనెతోడను, నెలమిని సేవింప హిక్కలెల్లనుమానున్. 2

హిక్కలకు మధూచ్ఛిష్టాధూమపానము

మధూచ్ఛిష్టం సర్జరసం ఘృతం మనశ్శిలాసమం,

ధూమపానే హరేద్ధిక్కాం ధూమైర్వా శిఖిపక్షజైః. 253

(మాధవనిదానే)

తా. మైనము, గుగ్గిలను, మణిశిల - వీనిని సమభాగములుగ గాని, లేక నెమలి యీకలుగాని, ఆవునేతిలోదడిపి నిప్పులోవైచి దానిపొగను ద్రాగిన ఎక్కిళ్ళుహరించును.

క. గోశృంగంబును భుజగపు
కూసంబును నెమలిఱెక్క గుగ్గులమును మే
ల్వాసిపసపగరుగంధము
గోసర్పుల ధూమ్రసేవఁ గూలును హిక్కల్.

తా. ఆవుకొమ్ము, పాముకూసము, నెమలియీకలు, గుగ్గిలము, పసపు, శ్రీగంధము, కృష్ణాగరు-వీనిని ఆవునేతిలో దడిపి అగ్నిలోవైచి దానిపొగను ద్రాగిన ప్రబలమైన ఎక్కిళ్ళ హరించును.

హిక్కలయందు పథ్యము

కచోరం పుష్కరం యోషం మాతులుంగామ్లవేతసం,
శాలిషష్టిక గోధూమ యవ ముద్గ కుళుత్థకమ్. 254
నిద్రా హిధ్మా శ్వాస కాస పిపాసాశ్చ వినాశయేత్,

(మాధవనిదానే)

తా. కచోరములు, పుష్కరమూలము, త్రికటుకములు, మాదీఫలము, పుల్లప్రబ్బలి ౬౦ దినములకు ఫలించెడివడ్లు, గోధుమలు, యవలు, పెసలు, ఉలవలు, నిద్ర-ఇవి హిక్కా శ్వాస కాస తృష్ణారోగములయందు పథ్యకరంబులు.

హిక్కయం దపథ్యము

విష్టంభీని విదాహీని రూక్షాణి కఫదాని చ. 255
నిష్పావమాష పిణ్యాక వారిజానూపమామిషం,
అవిదగ్ధం దంతకాష్ఠం వస్తి మత్స్యాంశ్చ సర్షపాన్. 256
ఆమ్ల తుంబీఫలం కందం తైలభ్రష్ట ముపోదకీం,
గురుశీతం చాన్నపానం హిక్కారోగి వివర్జయేత్. 257

తా. మలబద్ధకరద్రవ్యములు, వెదురుమొలక, మద్యము, మరీచము మొదలగు విదాహకరద్రవ్యములు, రూక్షకరద్రవ్యములు, కఫకరద్రవ్యములు, అనుములు,

మినుములు, తెలికపిండి, నీటిలో జనించిన ద్రవ్యములు, ఊటభూమిలో జనించిన జంతు మాంసము, పక్వముచేయఁబడని ద్రవ్యములు, దంతకాష్ఠము, *వస్తికర్మ, మత్స్యములు, ఆవాలు, పులుసు, ఆనుగపుకాయ, గడ్డలు, నూనెతో వేయించఁబడిన ముట్టుబచ్చలి కూర, జడముగ శీతకరముగ నుండు అన్నపానములు - వీనిని ఎక్కిళ్ళుగలవారు వర్జింపవలయును.

## అష్టమప్రకరణమ్.



---

* చిమ్మనగొట్టములో తైలాదుల నాకర్షించుటకై దానిమధ్యభాగమున బంధింపంబడి నధోభాగంబున కర్ణికలవలెను, అం దాకర్షింపఁబడిన తైలాదుల బైలుపరుచుటకైన నగ్రభాగంబున గుండ్రముగను నిర్మింపంబడి చిమ్మనగ్రోవిలో బంధింపఁబడియుండు దండమే వస్తి యనంబడును. కావున దానిలో రోగోపయుక్తతైలాదుల నాకర్షించుకొని గుదమేఢ్రముల ప్రయోగించుటయ వస్తికర్మ యనంబడును.

# నవమప్రకరణమ్



## మేహరోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లో. సర్వజ్ఞం సచ్చిదానందం లోకనాథం జగద్గురుం,
వ్యోమకేశం భవానీశం రాజభూషమహం భజే. 1

తాత్పర్యము. సర్వజ్ఞుఁడు, సచ్చిదానందస్వరూపుఁడు, లోకేశుఁడు, జగద్గురువు, ఆకసమే కేశములుగఁ గలవాఁడు, పార్వతికి ప్రభువు, శిరమున చంద్రుఁడే భూషణముగఁ గలవాఁడు నగు నీలకంఠుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజు అని పేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీ గ్రంథముయొక్క నవమప్రకరణమును వచింపుచున్నాఁడను.

### మేహరోగనిదానము

నవాన్న దధి మద్యాంబు గుడ ధూమ నిషేవణాత్,
దూషయంతి పలం మేద శ్శుక్లం మజ్జాం రసం రజః. 3
జాయంతే వింశతిర్మేహా దశసాధ్యాః కఫోత్థితాః,
పిత్తోత్థితాశ్చ షడ్యాప్యా శ్చతురో మారుతాత్త్యజేత్. 4
సాధ్యాన్ యాప్యా నసాధ్యాంశ్చ క్రమేణేత్థం వినిర్దిశేత్,
(ఆయుర్వేదే)

తా. క్రొత్తయన్నము, పెరుగు, మద్యము, ఉదకము, బెల్లముతో జేయఁబడిన ద్రవ్యములు, పొగ అనువానిని మిక్కుటముగ సేవించుటవలన మాంసము, మేదస్సు, శుక్లము, మజ్జ, రసము, రక్తము దుష్టంబులై ఇరువదిమేహముల జనింపఁజేయును. అందు పదిమేహములు శ్లేష్మజనితంబులు. ఆరు పైత్యజనితంబులు. నాలుగు వాతజనితంబులు. అట్లగుటంజేసి శ్లేష్మమువలన జనించిన పదిమేహములు సాధ్యంబులు. పైత్యమువలన జనించిన ఆరుమేహములు కష్టసాధ్యంబులు. వాతమువలన జనించిన నాలుగు మేహములు

అసాధ్యంబులు. ఈ క్రమానుగుణ్యముగ మేహరోగముల సాధ్య కష్టసాధ్య అసాధ్యత్వ ముల నెఱుంగదగును.

ఆస్యాసుఖం స్వప్నసుఖం దధీని గ్రామ్యోదకానూపరసాః పయాంసి
నవాన్నపానం గుడవైకృతం చ ప్రమేహహేతుః కఫకృచ్చ సర్వమ్
(మతాంతరే

తా. సుఖముగ కూర్చుండుట, నిద్రాసుఖమును జెందుట, పెఱుగును గ్రామ ఊరు, ఉదకము అనువానియందలి ప్రాణులయొక్క మాంసరసమును, పాలను, క్రొ యన్నమును, క్రొత్తయుదకమును, బెల్లముతో జేయఁబడిన భక్ష్యములను, లేక బెల్లప యొక్క వికారముగల పదార్థములను, కఫకర సర్వపదార్థములను మిక్కుటముగ సే చుట - ఈకారణములవలన ప్రమేహము జనించును.

కఫాదిమేహసంప్రాప్తి

మేదశ్చ మాంసం చ శరీరజం చ క్లేదం కఫో వస్తిగతః ప్రదూష్య,
కరోతి మేహాన్ సముదీర్ణ ముష్ణై స్తానేవ పిత్తం పరిదూష్యచాపి.
క్షీణేషు దోషేష్వవకృష్య ధాతూన్సందూష్య మేహాన్కురుతేఽనిలశ్
సాధ్యాః కఫోత్థా దశపిత్తజాష్షడ్యాప్యా నసాధ్యం పవనాచ్చతుష్క
సమక్రియత్వాద్విషమక్రియత్వాన్మహాత్యయత్వాచ్చ యథాక్రమం
(నిత్యనాథీర

తా. వస్తిగతకఫము మేదస్సును, మాంసమును, శరీరమునందలి క్లేదమును జె శ్లేష్మమేహమును గలుగంజేయును. ఇవ్విధంబున ఉష్ణపదార్థసేవనవలన పిత్తము ప్ర పించి పైఁజెప్పఁబడిన మేదాదులం జెరచి పిత్తమేహమును గలుగంజేయును. పిత్త ములు క్షయింపుచుండ వాతము వసామజ్జాదిధాతువుల నాకర్షించికొని వాని జె వస్తియొక్క ముఖమునందు జేర్చి వాతజమేహమును గలుగంజేయును. అందు పదిమే ములు కఫజనితంబులు. అవి సమక్రియ (అనఁగా కఫముయొక్క కటుతిక్తాదిక్రియ మేదస్సు మొదలగు వానియొక్క కటుతిక్తాదిక్రియలు, వ్యాధిబలము సమానంబుల నుండుటచే సమక్రియత్వము) గలవి యగుటంజేసి సాధ్యంబులు. ఆరుమేహమ పిత్తజనితంబులు. అవి విషమచికిత్సలవలన (అనఁగా పిత్తమును హరింపంజేసెడి మధురాది ద్రవ్యములవలన మేదస్సును, మేదోవృద్ధిని హరింపంజేసెడి ఉష్ణకటు ద్రవ్యములవలన పిత్తమును) వృద్ధిచెందుటచే క్రియావైషమ్యముగలవి యగుట యాప్యంబులు. నాలుగుమేహములు వాతజనితంబులు - అవి గంభీరములైన మ

ధాతువుల నాకర్షించి కడుపీడను గలుగంజేయుటవలన, విషమక్రియగలవి యగుటవలన అసాధ్యంబులు.

మేహరోగభేదములు

ఉదకేక్షు సాంద్ర సురా సికతా శుక్ల శీతళం,
పిష్ట లాలాతిమూత్రం చ క్షార హారిద్ర రక్తకమ్. 9
మంజిష్ఠా నీల కాలాశ్చ వసా మజ్జా మధూత్థితం,
హస్తిమేహో వింశతిస్స్యుర్జ్ఞాత్వా వర్ణేన లక్షయేత్. 10

(ఆయుర్వేదే)

తా. ఉదకమేహము, ఇక్షుమేహము, సాంద్రమేహము, సురామేహము, సికతామేహము, శుక్లమేహము, శీతమేహము, పిష్టమేహము, లాలామేహము, బహుమూత్రమేహము, క్షారమేహము, హారిద్రామేహము, రక్తమేహము, మంజిష్ఠామేహము, నీలమేహము, కాలమేహము, వసామేహము, మజ్జామేహము, మధుమేహము, హస్తిమేహము అని మేహములు ఇరువదివిధంబులు. వాసిలక్షణముల వర్ణనమువలన దెలియవలయును.

## కఫజనితదశమేహములు

ఉదకమేహలక్షణము

స్వచ్ఛం బహుసితం శీతం నిర్గంధ ముదకోపమం,
[1]జ్ఞేయశ్చోదకమేహోఽయం కించిదావిలపిచ్ఛిలమ్. 11

తా. మూత్రము నిర్మలముగ, అధికముగ, తెల్లగ, చల్లగ, గంధవిహీనముగ, ఉదకతుల్యముగ, ఒకింత కలగినట్లుగ, జిగటగ వెడలిన ఉదకమేహమని తెలియవలయును.

ఇక్షుమేహలక్షణము

ఇక్షోరసమివాత్యర్థం మధురంచేక్షుమేహత,

తా. మూత్రము చెఱకురసతుల్యంబై కడుమధురముగ వెడలిన ఇక్షుమేహ మని తెలియవలయును.

సాంద్రమేహలక్షణము

సాంద్రీభవే త్పర్యుషితం [2]సాంద్రమేహం తదుచ్యతే. 12

1 మేహత్యుదకమేహేన కించిదావిలపిచ్ఛిలమ్. 2 సాంద్రమేహేన మేహతి.

తా. మూత్రము విడిచిన నొకరఘ్యామునకు పేరిన సాంద్రమేహ మని తెలియ వలయును.

సురామేహలక్షణము

సురామేహీ సురాతుల్య ముపర్యచ్ఛ మధో ఘనం,

తా. మూత్రము కల్లువలె వెడలుట, మూత్రముపై నిర్మలముగ, అడుగునగట్టి నుండుట - ఈలక్షణములుగలది సురామేహ మని తెలియవలయును.

సికతామేహలక్షణము.

మూత్రాణూన్సికతామేహీ సికతారూపిణో మలాన్. 1

తా. మూత్రకణములు ఇసుకవలెవెడలిన సికతామేహ మని తెలియవలయును.

శుక్లమేహలక్షణము

శుక్లాభం శుక్లమిశ్రం వా శుక్లమేహీ ప్రమేహతి,

తా. మూత్రము శుక్లమువలెగాని, లేక శుక్లయుక్తముగగాని వెడలిన శు మేహ మని తెలియవలయును.

శీతమేహలక్షణము

శీతమేహీ సుబహుశో మధురం [1]చాతిశీతలమ్.

తా. మూత్రము మాధుర్యము, కడుశీతలము గలదై పలుమారు వెడలిన శీతమే మని తెలియవలయును.

పిష్టమేహలక్షణము

సంహృష్టరోమాపిష్టేన పిష్టవద్బహుళం సితం,

తా. మూత్రము కలిపినపిండివలె దట్టమై తెల్లగ వెడలుట, మూత్రోత్సర్జన లంబున రోమములు నిక్కపొడిచికొనుట-ఈలక్షణము గలది [2]పిష్టమేహ మని తెలి వలయును.

శనైర్మేహలక్షణము

శనైశ్శనై శ్శనైర్మేహీ మందం మందం ప్రమేహతి.

తా. మూత్రము మెల్లగ మెల్లగ, మందమందముగ వెడలిన శనైర్మేహమని తెలి వలయును.

---

1 భృశశీతలమ్. 2 పిష్టమేహ మన పిచ్ఛిలమేహము.

### లాలామేహలక్షణము

లాలాతంతుయుతం మూత్రం లాలామేహేన పిచ్ఛిలం,

తా. మూత్రము చొంగవలె తంతియుక్తముగ, జిగటగ వెడలిన లాలామేహమని తెలియవలయును.

### బహుమూత్రలక్షణము

శోషస్తాపోంగకార్శ్యం చ బహుమూత్రం తృషాభ్రమః. 16
అస్వాస్థ్యసర్వగాత్రేషు మేహోఽయం బహుమూత్రకః,

తా. శోష, తాపము గలుగుట, మూత్రము అధికముగ వెడలుట, దప్పి, భ్రమ గలుగుట, సర్వావయవముల సత్వములేకయుండుట - ఈలక్షణములు గలది బహుమూత్రమేహ మని (గ్రంథాంతరేణ శనైర్మేహ మని) తెలియవలయును.

---

## పిత్తజనితప్రమేహములు

### క్షారమేహలక్షణము.

గంధవర్ణరసస్పర్శైః క్షారేణ క్షారతోయవత్. 17

తా. మూత్రము క్షారోదకమువలె గంధ, వర్ణ, రుచి, స్పర్శలం గలదిగ వెడలిన క్షారమేహ మని తెలియవలయును.

### హారిద్రమేహలక్షణము

హారిద్రమేహీ కటుకం హారిద్రాసన్నిభం దహాత్,

తా. మూత్రము కారముగ, పసపువర్ణముగ, తాపయుక్తముగ వెడలిన హారిద్రామేహ మని తెలియవలయును.

### రక్తమేహలక్షణము

విస్రముష్ణం సలవణం రక్తాభం రక్తమేహతః. 18

తా. మూత్రము దుర్గంధముగ, ఉష్ణముగ, ఉప్పగ, రక్తమువలె నెఱ్ఱగ వెడలిన రక్తమేహ మని తెలియవలయును.

### మంజిష్ఠామేహలక్షణము

విస్రం మాంజిష్ఠమేహేన మంజిష్ఠాసలిలోపమం,

తా. మూత్రము దుర్గంధముగ, మంజిష్ఠాకషాయముపంటి ఛాయగలదిగ వెడలిన మంజిష్ఠామేహ మని తెలియవలయును.

నీల, కాలమేహలక్షణములు

నీలమేహేన నీలాభం కాలమేహీ మషీనిభమ్. 19

తా. మూత్రము నీలవర్ణముగ వెడలిన నీలమేహ మనియు, బొగ్గువలె నల్లగ వెడలిన కాలమేహ మనియు తెలియవలయును.

---

## వాతజనితచతుర్మేహములు

మజ్జామేహలక్షణము

మజ్జాభం మజ్జిమిశ్రంవా మజ్జామేహీ ముహుర్ముహుః,
వసామేహచికిత్సాయా తాం చికిత్సాం చ కారయేత్. 20

తా. మూత్రము మజ్జతో సమానవర్ణముగగాని, లేక మజ్జాయుక్తముగగాని పలుమారు వెడలిన మజ్జామేహ మని తెలియవలయును. దీనియందు వసామేహచికిత్సం చేయవలయును.

వసామేహలక్షణము

వసామేహీ వసామిశ్రం వసాభం మూత్రయేన్ముహుః,

తా. మూత్రము క్రొవ్వుతో గలసిగాని, క్రొవ్వుతో సమానముగగాని, పలుమారు వెడలిన వసామేహ మని తెలియవలయును.

హస్తిమేహలక్షణము

హస్తీమత్తఇవాజస్రం మూత్రం వేగవివర్జితమ్. 21
సలసీకం విబద్ధం చ హస్తిమేహీ ప్రమేహతి,

తా. మూత్రము మదించిన యేనుగుమదముతో సమానంబై ఎల్లపుడు వేగరహితముగ, త్వఙ్మాంసమధ్యగతరసయుక్తముగ, నిలచినిలచి వెడలిన హస్తిమేహ మని తెలియవలయును.

మధుమేహలక్షణము

మధుమేహే మధుసమం మధునా తస్యలక్షణమ్. 2

తా. మూత్రము తేనెవలె వెడలుట, చీమలు ఈగలు ఆవరించుట - ఈలక్షణములు గలది మధుమేహ మని తెలియవలయును.

కషాయమధురం రూక్షం క్షౌద్రమేహం వదేద్బుధః. (మతాంతరే

తా. మూత్రము ఒగరుగ, మధురముగ, బంకగ వెడలిన క్షౌద్రమేహ మ తెలియవలయును.

### వింశతిమేహపూర్వరూపములు

శీతప్రసక్తం గళతాలుశోషో మాధుర్యమాస్యేకరపాదదాహః,
భవిష్యతో మేహగుణస్వరూపం మూత్రేభిధావంతి పిపీలికాశ్చ,
అనిష్టాహారచేష్టాభ్యాం స్యాన్మేహామయవింశతి. (సిద్ధరసార్ణవే)

తా. శీతలపదార్థములయం దిచ్ఛ గలుగుట, కంఠము, దవడలు ఎండుట, నోరు తీపిగ నుండుట, చేతులు కాళ్లు మండుట, మూత్రము విడచినస్థలమునందు గండుచీమలు ప్రాకుట-ఇని గలుగఁబోయెడి మేహరోగమునకు లక్షణంబులు. పైఁజెప్పఁబడిన ఇరువది మేహములు విరుద్ధాహారచేష్టలవలన జనించును.

### వాతాదిమేహవిభాగము

చత్వారో వాతజా మజ్జా వసా క్షౌద్రేభసంజ్ఞికాః,
క్షారహారిద్ర మంజిష్ఠా నీల కాలాశ్చ రక్తజమ్. 24
తోయేక్షుసికతా పిష్ట శుక్లసాంద్ర సురా శనైః,
శీతలం బహుమూత్రత్వం దశమేహాః కఫోద్భవాః. 25

తా. మజ్జామేహము, వసామేహము, మధుమేహము, హస్తిమేహము అను నాలుగు మేహములు వాతజనితంబులు. క్షారమేహము, హారిద్రమేహము, మంజిష్ఠామేహము, నీలమేహము, కాలమేహము, రక్తమేహము అన నారుమేహములు పిత్తజనితంబులు. ఉదకమేహము, ఇక్షుమేహము, సికతామేహము, పిష్టమేహము, శుక్లమేహము, సాంద్రమేహము, సురామేహము, శనైర్మేహము, శీతమేహము, బహుమూత్ర (లాలా) మేహము అను పదిమేహములు శ్లేష్మజనితంబులు.

### శ్లేష్మమేహోపద్రవములు

అవిపాకోఽరుచిచ్ఛర్ది జ్వరః కాస స్సపీనసః,
ఉపద్రవాః ప్రజాయంతే మేహానాం కఫజన్మనామ్. 26

తా. భుజించినయన్నము జీర్ణము గాకుండుట, అరుచి, వాంతి, జ్వరము, కఫముతోఁగూడిన దగ్గు, పడిసెముగలుగుట - ఈయుపద్రవములు కఫజనితమేహములయందు గలుగును.

### పైత్యమేహోపద్రవములు

వస్తి *మేహనయోస్తోదో ముష్కావదరణం జ్వరః,
దాహస్తృష్ణామేహమూర్ఛా విడ్భేదః పిత్తజన్మనామ్. 27

---

* మేహనయోశ్శూలమ్.

తా. పొత్తికడుపు, మేఢ్రము అనువానియందు సూదులచే బొడుచునటుల పీడ గలుగుట, వృషణములయందలి చర్మముపండి పగులుట, జ్వరము, తాపము, దప్పి గలుగుట, పుల్లని తేనుపులు వచ్చుట, మూర్ఛ గలుగుట, మలము ద్రవముగ వెడలుట-ఈయుపద్రవములు పిత్తమేహములయందు గలుగును.

వాతమేహోపద్రవములు

వాతజానా ముదావర్త కంఠహృద్గ్రహలోలతాః,
శూలమున్నిద్రతా శోషః కాసశ్శ్వాసశ్చ జాయతే. 28

తా. ఉదావర్తరోగము గలుగుట, కంఠము రొమ్ము బంధింపంబడినటు లుండుట, సర్వరసభక్షణమునం దిచ్ఛ, శూల, నిద్రాభంగము, శోష, పొడిదగ్గు, శ్వాసము గలుగుట - ఈయుపద్రవములు వాతజమేహములయందు గలుగును.

అసాధ్యమేహలక్షణము

యథోక్తోపద్రవావిష్టో హ్యతిప్రస్రుత [1]వేదనా,
పిటికా పీడితం [2]ఘోరం ప్రమేహో హంతి మానవమ్. 29

తా. పైఁజెప్పఁబడిన అవిపాకాద్యుపద్రవయుక్తుఁడై, మూత్రమును మిక్కుటముగ, వేదనాయుక్తముగ విసర్జించువాఁడై, ఉత్తరోత్తరజెప్పంబడు శరావికాదిపిటకాయుక్తుఁడైయుండు మేహరోగి మృతి జెందు నని తెలియవలయును.

మేహరోగములయందు మూత్రపరీక్ష

వాతపిత్తకఫమేహసముత్థం మూత్రమగ్నిక్వథితం పరిపాకాత్,
పంచసప్తనవభాగతః క్రమాత్కల్కముద్భవతి చేత్తదసాధ్యమ్. 30
(నిత్యనాథీయే)

తా. వాతమేహరోగియొక్క మూత్రమును వెడల్పుమూతిగల వెంకులోబట్టి సన్నపుసెగను మాడకుండా కల్కమువలె గాచిన చిక్కనై ఐదవభాగము శేషించి కరగవలెనుండిన అసాధ్యంబనియు, పిత్తమేహరోగియొక్క మూత్రము ఏడవభాగము శేషించి బెల్లపుకరగువలె నుండిన అసాధ్యంబనియు, శ్లేష్మమేహరోగియొక్క మూత్రము తొమ్మిదవ భాగము శేషించిన అసాధ్యం బనియు తెలియవలయును.

మూత్రపరీక్ష

అతిరక్తం మేహరోగే జ్వరే హారిద్రవర్ణకం,

1 మేవచ. 2 గాఢం.

జ్వరే వా మేహరోగే వా ప్యసాధ్యం బహుమూత్రకమ్. 31
(నిత్యనాథీయే)

తా. మూత్రము కడురక్తవర్ణముగ వెడలిన మేహరోగం బనియు, పచ్చగ వెడలిన జ్వరరోగం బనియు, జ్వరమునందేని మేహరోగమునందేని బహుమూత్రము గలిగిన అసాధ్యం బనియు తెలియవలయును.

యస్య మూత్రం స్రవేత్తైలం మధుమధ్యం స్రవేత్తదా,
యమేన నీయతే శీఘ్రం కారితః పశుపాలకః. (సిద్ధరసార్ణవే) 32

తా. ఏరోగియొక్క మూత్రము తైలము, తేనె, కల్లువలె వెడలెడినో అట్టిరోగి కడుశీఘ్రముగ మృతిజెందు నని తెలియవలయును.

అసాధ్యమేహోపద్రవములు

అరుచిశ్చాంగమర్దశ్చ తృష్ణా కాస భ్రమా స్తథా,
శూలేన పిటికా కండూః ప్రమేహాణా ముపద్రవాః. 33
(చికిత్సాసారసిద్ధసంగ్రహే)

తా. అరుచి గలుగుట, శరీరము నొచ్చుట, దప్పి దగ్గు గలుగుట, భ్రమమాట లాడుట, పొక్కులు జనించి శూల దురద గలుగుట-ఇవి అసాధ్యమేహోపద్రవము లని తెలియవలయును.

మేహరోగపూర్వరూపములు

స్వేదోఽంగగంధ శ్శిథిలత్వగంగే శయ్యాసనస్వప్న సుఖాభిలాషః,
హృన్నేత్రజిహ్వాశ్రవణోపదాహో ఘనాంగతా కేశనఖాతివృద్ధిః.
శీతప్రియత్వంగళతాలుశోషోమాధుర్యమాస్యే కరపాదదాహః,
భవిష్యతో మేహగుణస్యలింగం మూత్రేభిధావంతి పిపీలికాశ్చ.
తృష్ణాప్రమేహోమధురస్సపిచ్ఛో మధూపమస్స్యాద్ద్వివిధోవికారః.
(మాధవనిదానే)

తా. శరీరమున చెమటపట్టుట, వాసన వేయుట, చర్మమూడుట, పడక ఆసనము నిద్ర అనువానియం దిచ్ఛగలుగుట, హృదయము, నేత్రములు, జిహ్వా, చెవులు అను వానియందు తాపము, శరీరమున ఒకింతజడత్వము గలుగుట, వెంట్రుకలు, గోళ్లు వృద్ధిం జెందుట, శీతపదార్థములయం దిచ్ఛ, గొంతు, లోదౌడ అనువానియందు శోష గలుగుట, నోరు తీపిగ నుండుట, చేతులు, కాళ్లు మండుట, మూత్రమున చీమలుగాని, లేక ఈగలుగాని వ్యాపించుట, దప్పి గలుగుట, మూత్రము తీపిగ, జిగటగనుండినదై తేనెలో

తుల్యంబైన పలువిధ వికారములతో గూడియుండుట - ఇవి కలుగబోయెడి మేహమునకు పూర్వరూపములు.

ఆస్యే స్వాదుస్తృషా దాహో దంతేషు మలసంచయః,
దేహేచిక్కణతా వాపి విదాహః పాణిపాదయోః. 37
ప్రభూతనీలమూత్రత్వం మేహలక్షణమగ్రజం, (అశ్వినీ)

తా. నోరు తీపిగ నుండుట, దప్పి గలుగుట, శరీరము మండుట, దంతములు కడు పాచి గలుగుట, శరీరము మినమినలాడుట, కాళ్లు చేతులు మండుట, మూత్రము నీల వర్ణము గలదై మిక్కుటముగ వెడలుట - ఈలక్షణములు గలుగబోయెడి మేహమునకు పూర్వరూపంబులు.

### మేహపిటకోపద్రవములు

ముఖేపాయౌ చ మేఢ్రే చ హస్తే పాదే తథైవ చ. 38
హృన్మస్తకే పృష్ఠదేశే పిటికా మరణాంతికం, (పూజ్యపాదీయే)

తా. ముఖము, గుదము, మేఢ్రము, హస్తము, పాదము, ఱొమ్ము, మస్తకము, వీఁపు అనువానియందు మేహపిటకలు జనించి ఆయామేహోపద్రవములతో గూడి వేధింపుచుండిన అట్టిమేహరోగి మృతిజెందు నని తెలియవలయును.

### ప్రమేహపిటకాభేదము

శరావికా కచ్ఛపికా జాలినీ వినతాలజీ. 39
మసూరికా సర్షపికా పుత్రిణీ సవిదారికా,
విద్రధిశ్చేతి పిటికాః ప్రమేహోపేక్షయాదశ. 40
సంధిమర్మసు జాయంతే మాంసలేషుచ ధామసు, (పూజ్యపాదీయే)

తా. మేహరోగము నుపేక్షించుటవలన శరావిక, కచ్ఛపిక, జాలినీ, వినత, అలజి, మసూరికా, సర్షపిక, పుత్రిణి, విదారిక, విద్రధి - అని దశవిధమేహ *పిటకలు, సంధులు మర్మస్థలము, మాంసస్థానము అనువానియందు జనించును.

### సర్వపిటికాలక్షణములు

అంతోన్నతా చ తద్రూపా నిమ్నమధ్యాశరావికా. 41
సదాహకూర్మసంస్థానాజ్ఞేయాకచ్ఛపికా బుధైః,
జాలినీ తీవ్రదాహా తు మాంసజాలసమావృతా. 42
అవగాఢరుజోక్లేదా పృష్ఠేవాప్యుదరేపి వా,

* పిటిక యన పొక్కులు.

మహతీ పిటికా నీలా సా బుధై ర్వినతాస్మృతా. 43
రక్తాసితా స్ఫోటవతీ దారుణాత్వలజీభవేత్,
మసూరదళసంస్థానా విజ్ఞేయా తు మసూరికా. 44
గౌరసర్షపసంస్థానా తత్ప్రమాణా చ సర్షపీ,
మహత్యల్పచితాజ్ఞేయా పిటికాచాపి పుత్రిణీ. 45
విదారకందవద్వృత్తా కఠినా చ విదారికా,
విద్రధే ర్లక్షణైర్యుక్తా జ్ఞేయా విద్రధికాతు సా. 46

తా. చుట్టూ మూకుడువలె మబ్బుగ, మధ్యమున గుండ్రముగ నుండుపిటిక శరావికయనియు, తాఁబేటివీఁపువలెనుండినదై మంటలతో గూడియుండునది కచ్ఛపిక యనియు, తీవ్రమైన మంటలతో గూడి మాంసజాలములతో వ్యాప్తమైయుండునది జాలిని యనియు, వీఁపుపైనగాని, లేక కడుపుపైనగాని లోతుగ పిటికలు జనించి పీడతో గూడి నవై గొప్పవియై నీలవర్ణముగలవై యుండునవి వినత యనియు, ఎఱ్ఱనై, లేక తెల్లనై సన్నపిటికలతో వ్యాప్తమై భయంకరముగనుండునది అలజియనియు, చిఱుసెనగపప్పుతో సమానముగనుండునది మసూరిక యనియు, తెల్లఆవాలయొక్కసమూహామువలె జనించి తత్ప్రమాణతుల్యంబుగనుండునది సర్షపికయనియు, ఒకటి పెద్దకురుపై దానిచుట్టు సన్నని కురుపులుగలది పుత్రికయనియు, నేలగుమ్ముడుగడ్డవలె గుండ్రముగ, కఠినముగ నుండునది విదారికయనియు, విద్రధిలక్షణంబులుగలది విద్రధిక యనియు జెప్పంబడును.

అసాధ్యపిటికాలక్షణము

పిటికామర్మహృత్పృష్ఠస్థానాం సగుద మూర్ధ్ని వా,
పర్వపాదకరస్థాశ్చ ఘ్నంతి తీవ్రం ప్రమేహినమ్. 47

తా. ఱొమ్ము మొదలగు మర్మస్థానములు, వీఁపు, భుజశిరస్సులు, గుదము, శిరము, వ్రేళ్లు, పాదములు, ముంజెయ్యి, చకారమువలన చండ్లు, ముఖము అనువానియందు మేహపిటికలు జనించిన రోగి శీఘ్రముగ మృతిజెందునని తెలియవలయును.

మేహపిటికాచికిత్స

అన్యస్థానోత్థితాం చైవ జలూకాభిర్హరేదసృక్,
పక్వాని పాట్య మతిమా న్వ్రణవత్సముపాచరేత్. 48

తా. పైఁజెప్పఁబడిన స్థానములయందుగాక ఇతరస్థలముల మేహపిటికలు జనించిన జలగలచే రక్తమును స్రవింపంజేసి *పంచపల్లవముల నూరి దానిపై గట్టుకట్ట

* పంచపల్లవము లన మామిడి, రావి, మఱ్ఱి, బ్రహ్మమేడి, జువ్వి అనువానిచిగుళ్లు.

వలయును. మఱియు నాపిటికలు పక్వంబులైన వానిని భేదించి మేహవ్రణమువలెనే చికిత్సం జేయవలయును.

చ. శిరమునఁ జండ్ల వీఁపునను జేతులఁ గాళ్ళను గీళ్ళయందున
న్నురమున నంసయుగ్మమున నొయ్యన మోమున మేఢ్రమందునం
జిఱుచిఱుపొక్కు లుబ్బినను జెన్నుగ మేహము మానదంచు సు
స్థిరముగ నీలకంఠకులశేఖరుఁగొట్టురుచెప్పె లెస్సగన్.

## అసాధ్యమేహలక్షణములు

జాతః ప్రమేహీ మధుమేహినా యో వసాధ్యరోగస్సహిబీజదోషాత్,
ఏ చాపికేచిత్కులజావికారా భవంతితాంశ్చప్రవదంత్యసాధ్యాన్. 49
(ఆయుర్వేదే)

తా. మధుమేహివలన జనించిన పురుషునికి మేహరోగము గలిగిన నది బీజదోషమువలన అసాధ్యం బగును. (ఇచట మధుమేహమను శబ్దము సామాన్యమేహపర్యాయం బని తెలియవలయును.) మఱియు వంశపరంపర జనించు కుష్ఠాదిరోగములు సగా అసాధ్యంబులు.

## మర్మస్థానవివరణము

భ్రూమధ్యే మూర్ధ్నిమధ్యే చ కంఠే చ శిరసస్తథా,
హృదయే నాభిమధ్యేచా ప్యక్ష్ణోర్వృషణయోరపి. 50
గుల్ఫయో ర్జంఘయోః కట్యాం పాదాంగుష్ఠేష్వవస్థితం,
తర్జన్యాం బాహుమూలే చ మర్మస్థానం చతుర్దశ. 51

తా. కనుబొమలమధ్యప్రదేశము, శిరోమధ్యప్రదేశము, కంఠము, శిరము, హృదయము, నాభిమధ్యప్రదేశము, నేత్రములు, వృషణములు, చీలమండ, పిక్కలు, నడుము, కాలిబొట్టనవ్రేలు, జుట్టనవ్రేలు, చంక అనునీపదునాలుగును మర్మస్థానంబులు. అట్లగుటం జేసి వానియందు మేహపిటికలు జనించిన అసాధ్యంబులు.

## మేహకులాంతకరసము

సూతం వంగం మృతం తుల్యం మృతాభ్రం సూతికాత్రిధా,
లశునం సర్వతుల్యస్యా న్నిస్త్వగేకత్ర మర్దయేత్. 52
బదరాభాం వటీం కుర్యా న్నామ్నా మేహకులాంతకః,
లశునం హ్యాజమూత్రం చ తద్వయం హ్యనుదాపయేత్, 53
(మాధవనిదానే)

తా. రసభస్మము ౧ భాగము, వంగభస్మము ౧ భాగము, అభ్రకభస్మము 3 భాగములు, వెల్లుల్లిపాయలు ౫ భాగములు-ఇటుల వీని నేకముజేసి మర్దించి రేగుగింజలంత మాత్రలుజేసి యందొకదానిని వెల్లుల్లిపాయలరసము, మేకమూత్రము అనువానియనుపానముతోడ సేవించిన సర్వమేహములు హరించును.

మధుమేహమునకు లోధ్రాదికషాయము

లోధ్ర ముస్తాభయం తుల్యం కట్ఫలం చ జలైస్సహ,
క్వాథయిత్వా పిబేచ్చాను మధునా మధుమేహజిత్. 54

తా. లొద్దుగచెక్క, తుంగముస్తెలు, కరక్కాయలు, గుమ్ముడు తేకు - వీనిని సమభాగములుగ దంచి కషాయము గాచి యందొకింత తేనె గలిపి సేవించిన మధుమేహముశమించును.

సర్వమేహములకు హరగౌరీసృష్టిరసము

శుద్ధసూతం చతుర్భాగం సూతార్థం [1]మృతమభ్రకం,
గంధకం చ ద్వయోస్తుల్యం మస్తునా మర్దయేద్దినమ్. 55
గోళకం బంధయేద్వస్త్రే [2]వాలుకాయంత్రగం పచేత్,
మందాగ్నినాపచేత్తావద్యావత్తప్తాశ్చ వాలుకాః. 56
స్వశ్లిష్టం నశకాశ్య స్తప్తాస్తా స్తదుద్ధృత్య విచూర్ణయేత్,
ధాత్రీఫలరసేభావ్యం సప్తధా గోక్షురస్య చ. 57
[3]శ్లక్ష్ణచూర్ణం తతఃకృత్వా వింశద్భాగాన్ప్రకల్పయేత్.
భాగైకం పూర్వజం చూర్ణం సర్వం క్షీరేణ గోళయేత్. 58
నిష్కద్వయవటీం కుర్యాద్ఘృతమధ్యే విపాచయేత్,
సాంగశీతాం తథా ఖాదేత్ప్రత్యహం పాచితాం ఘృతైః. 59
మహిషీక్షీరకశైరేక మనుపానం చ సర్వదా,
హరగౌరీసృష్టిరస స్సర్వమేహకులాంతకః. 60
దుగ్ధోదనం ఘృతం పథ్యం శాకం బింబఫలం భవేత్,
(ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసినరసము ४ భాగములు, అభ్రకభస్మము (లేక తామ్రభస్మము) ౨ భాగములు, శుద్ధిజేసినగంధకము ౬ భాగములు-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి పెరుగుమీఁది మీగడతో నొకదినము మర్దించి ముద్దజేసి బట్టలో మూటగట్టి వాలుకా

1 మృతతామ్రకమ్. 2 సికతా. 3 సూక్ష్మ.

యంత్రమునం దిడి ఇసుకనుతాకిన దానియుష్ణము జేతికి సహింపకుండువఱకు మందాగ్నిని వండి సాంగశీతలమున దీసి ఖల్వమునం దిడి చూర్ణముజేసి ఉసిరికెపండ్లరసముతో ౨ దినములు, పల్లేరురసముతో ౨ దినములు భావనజేసి సూక్ష్మచూర్ణముగావించి దానిని ఇరువదిభాగములుగ విభజించి యందు ప్రతిభాగమును పాలలో గలిపి యుంటలుజేసి ఘృతముతో వండి సాంగశీతలమున రెండునిష్కములంత మాత్రలుజేసి యందొకదానిని కర్షప్రమాణము బఱ్ఱెపాల యనుపానముతోడ ప్రతిపూట సేవించిన సర్వమేహములు హరించును. దీనియందు పాలయన్నము, నెయ్యి, దొండకాయకూర వీనిని భుజించుట పథ్యకరంబులు.

మేహములకు చంద్రప్రభావటికములు

మృతసూతం చ కాసీస మేలా జాతీఫలం జటా. 61
మధుకం మధుయష్టీ చ ధాత్రీ దాడిమ శర్కరా,
కర్పూరం ఖాదిరం సారం శతాహ్వా కంటకారికా. 62
ఆమ్లవేతసతుల్యాంశం దినైకం లాంగలీద్రవైః,
భావయే న్మేషదుగ్ధైశ్చ నాగవల్ల్యా దినం దినమ్. 63
వటికా బదరాకారా నామ్నా చంద్రప్రభావటీ,
భక్షయే త్తీవ్ర[1]మేహార్త స్సర్వమేహకులాంతకః. 64
ధాత్రీపటోల [2]నింబానాం కషాయం వా ఘృతాన్వితం,
సక్షౌద్రం పాయయేచ్చాను సర్వమేహాపనుత్తయే. 65
(మాధవనిదానే

తా. రసభస్మము, శుద్ధిచేసిన అన్నభేది, ఏలకులు, జాజికాయ, జటామాంసి ఇప్పపువ్వు, యష్టిమధుకము, ఉసిరికెపప్పు, దాడింబయొలుపు, పంచదార, కర్పూరము చంద్రబంక, సదాప, ప్రాకుడు, పుల్లప్రబ్బలి - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి చన్నచెర్లగడ్డరసముతో నొకదినము, మేకపాలతో నొకదినము, తమలపాకు రసముతో నొకదినము భావనజేసి రేగుగింజంత మాత్రలుజేసి యందొకదానిని ఉసిరికెపప్పు పొట్లు, వేము అనువానికషాయములో నొకింత నెయ్యిగాని లేక తేనెగాని గలిపి సేవించి సర్వమేహములు హరించును.

హారిద్రమేహమునకు మేహహరరసము

మృతసూతం మృతంతామ్రం తారభస్మ చ హాటకం,

1 మేహార్తః మేహాన్ హరతి సుదుస్తరాన్. 2 పత్రాణాం.

హంసపాదిరసేనైవ సమభాగం చ ఖల్వకే. 66
దినైకం మర్దయే ద్గోళం కాచకుప్యాం నివేశయేత్,
వాలుకాయంత్రకే చైవ ద్వియామం చ విపాచయేత్. 67
సాంగశీతలముద్ధృత్య గుంజామాత్రం ప్రదాపయేత్,
పంచాంగం నింబతుల్యానాం కషాయమనుపాయయేత్. 68
హారిద్రమేహం సంహంతి సర్వమేహకులాంతకః,

తా. రసభస్మము, తామ్రభస్మము, వెండిభస్మము, స్వర్ణభస్మము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో నొకదినము మర్దించి ముద్దజేసి ఎండించి గాజుకుప్పెలో నునిచి వాలుకాయంత్రమున రెండుర్ఝాములు, వండి సాంగశీతలమున దీసి గురిగింజయెత్తును వేపాకు, వేపపువ్వు, వేపకాయలు, వేపచెక్క, వేపవేరు అనువానికషాయానుపానముతోడ సేవించిన హారిద్రామేహము, సర్వమేహములు హరించును.

## మంజిష్ఠామేహమునకు విద్యావాగీశ్వరరసము

శుద్ధసూతం విషంచాభ్రం విష టంకణ గంధకమ్. 60
మృతలోహాష్టకంచైవ కర్షమాత్రం చ ఖల్వకే,
జంబీరోన్మత్తవాసాభి స్త్రికటు త్రిఫలేన చ. 70
యామమాత్రం తు ప్రత్యేకం మర్దయిత్వా తు గోళకం,
కాచకుప్యాం నివేశ్యాథ సప్తవస్త్రం మృదా బహిః. 71
లవణపూరితయంత్రే చ త్రిదినం మందవహ్నినా,
సాంగశీతలముద్ధృత్య గుంజామాత్రం ప్రదాపయేత్. 72
ఆర్ద్రికస్యానుపానేన మంజిష్ఠాయా నికృంతనం,
విద్యావాగీశ్వరోనామ్నా రసేంద్రగ పరికీర్తితః. (రసరత్నాకరే) 73

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన వసనాభి, అభ్రకభస్మము, అతివస, పేల్చిన వెలిగారము, శుద్ధిజేసిన గంధకము, స్వర్ణభస్మము, వెండిభస్మము, తామ్రభస్మము, వంగభస్మము[1], సీసభస్మము, కాంతభస్మము, ఉక్కుభస్మము, ఇనుపభస్మము-వీనిని దిను సొకటింటికి కర్షప్రమాణముచొప్పున ఖల్వములో నునిచి నిమ్మపండ్లు, ఉమ్మెత్త అడ్డసరము, త్రికటుకములు, త్రిఫలములు అనువానిరసముతో ప్రత్యేకముగ నొక్కొకఝాము మర్దించి ముద్దజేసి ఎండించి గాజుకుప్పెలోనునిచి ఏడుచీలమన్ను లిచ్చి

1 వంగ మన తగరము.

లవణపూరితయంత్రమున మూడుదినములు మందాగ్నితో వండి సాంగశీతలమున దీసి గురిగింజయెత్తుగ అల్లపురసానుపానముతో సేవించిన మంజిష్ఠామేహము హరించును. ఇది సర్వరసములలో కడుశ్రేష్ఠంబైనది.

### నీలమేహమునకు హరిశంకరరసము

మృత[1]తామ్రాభ్రకం తుల్యం ధాత్రీఫలనిజైర్ద్రవైః,
సప్తాహం భావయేత్ఖల్వే యోగోఽయం హరిశంకరః. 74
మాషమేకం వటీం ఖాదేన్నీలకాలప్రశాంతయే,
మహానింబస్య బీజాని [2]మర్దయేత్తండులోదకైః. 75
సఘృతం పాయయేచ్చానుహ్యసాధ్యం సాధయేత్క్షణాత్,
అనేనైవానుపానేన [3]పంచవక్త్రరసోహితః. 76

తా. తామ్రభస్మము (లేక రసభస్మము), అభ్రకభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి ఉసిరికపండ్లరసముతో నేడుదినములు భావనజేసి మాషప్రమాణమంత మాత్రలుజేసి యందొకదానిని సాయంప్రాతఃకాలముల పెద్దవేపవిత్తుల బియ్యపుకడుగుతో నూరి నేతిలో గలిపి యీయనుపానముతోడ సేవించిన అసాధ్యమైన నీలమేహము, కాలమేహము తత్క్షణమున హరించును. ఈమేహములయందీయనుపానముతోడనే పంచవక్త్రరసమునుకూడ సేవింపందగును.

### రక్తమేహమునకు వేదవిద్యారసము

రసభస్మ త్రిభాగం చ భాగైకం తారభస్మకం,
మృతమభ్రం చ లోహం చ కాసీసంతు మనశ్శిలామ్. 77
ఏతాని సమభాగాని ఖల్వమధ్యే వినిక్షిపేత్,
నిర్గుండీ ముసలీ వాసా జయాజైరగ్నిమంథజైః. 78
అభయార్ద్రికజైర్ద్రవ్యైం సప్తాహం చ పృథక్పృథక్,

---

1 సూతాభ్రకం. 2 పూర్వవ. 3 పంచవక్త్రరసము-"శ్లో. శుద్ధసూతం సమం గంధం మరీచం టంకణం కణాః, మర్దయేద్ధూర్తజద్రావైర్దినమేకం చ శోషయేత్, పంచవక్త్రరసోనామ ద్విగుంజం సర్వమేహజిత్." తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసిన గంధకము, మిరియాలు, పేల్చిన వెలిగారము, పిప్పళ్ళు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి ఉమ్మెత్తాకురసముతో నొకదినము మర్దించి రెండుగురిగింజలంత మాత్రలుజేసి నీడ నెండించి యందొకదానిని సేవించిన సర్వమేహములు హరించును.

తద్గోళం కూపికాయంత్రే పచేద్యామం తు తుషాగ్నినా. 79
ద్విగుంజం భక్షయే న్నిత్యం రక్తమేహ ప్రశాంతయే,
నింబబీజకషాయం చ బోళయుక్తం పిబేదను. 80
వేదవిద్యారసోనామ్నా రక్తమేహకులాంతకః, (సిద్ధరసార్ణవే)

తా. రసభస్మము 3 భాగములు, రజతభస్మము, అభ్రకభస్మము, లోహభస్మము, [1]కాసీసము, శుద్ధిచేసిన మణిశిల - ఇవి దినుసు కొక్కొక భాగము - ఇటుల వీని నెల్ల ఖల్వములో నునిచి వావిలి, నేలతాటిగడ్డలు, అడ్డసరము, తక్కెలి, నెల్లి, కరక్కాయ, అల్లము అనువానిరసముతో ప్రత్యేక ప్రత్యేకముగ నొక్కొక్కదినము మర్దించి ముద్దజేసి కూపికాయంత్రములో నునిచి ఉముకమంటను ౬ ఝాములు వండి సాంగశీతలమున దీసి రెండుగురిగింజలయెత్తుచు వేపవిత్తులు, బోళము అనువానికషాయాను పానముతోడ ప్రతిదినము సేవింపుచుండిన రక్తమేహము హరించును.

మేహబద్ధరసము

భస్మసూతం మృతంకాంతం [2]తీక్ష్ణభస్మ శిలాజతు. 81
తుత్థం తాప్యం శిలా వ్యోషం త్రిఫలాం కోలబీజకం,
కపిత్థం రజనీచూర్ణం [3]భృంగరాజేన భావయేత్. 82
వింశద్వారం విశోష్యాథ మధుయుక్తం లిహేత్సదా,
నిష్కమాత్రం హరేన్మేహః న్మేహబద్ధరసో మహాన్. 83
మహానింబస్యబీజాని [4]పిష్ట్వా షట్సమ్మితాని చ,
పలతండులతోయేన ఘృతనిష్కద్వయేన చ. 84
ఏకీకృత్య పిబేచ్చాను హంతి మేహం చిరంతనం,

తా. రసభస్మము, కాంతభస్మము, ఉక్కుభస్మము (లేక ఇనుపభస్మము), శుద్ధిచేసిన కర్పూరశిలాజిత్తు, శుద్ధిచేసిన కర్పరీతుత్థము, [5]స్వర్ణమాక్షికభస్మము, శుద్ధిచేసిన మణిశిల, త్రికటుకములు, త్రిఫలములు, ఊడుగవిత్తులు, వెలగపంటిబేసము, పసపుచూర్ణము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గుంటగలగరాకురసముతో ౨౦ మార్లు భావనజేసి ఎండించి తేనెలో నిష్కప్రమాణమును సేవించి వెంబడిగ ఆరునిష్కములయెత్తు పెద్దవేపవిత్తులను పలిమెడుబియ్యపు కడుగుతో నూరి యందు రెండునిష్కములయెత్తు నెయ్యిగలిపి సేవించిన చిరకాలముగనుండు మేహము హరించును.

---

1 కాశీస మన అన్నభేది. 2 ముండ. 3 తుల్యం భావ్యం తు భృంగిణా. 4 షణ్ణిష్కం పేషితాని చ. 5 స్వర్ణమాక్షిక మన బంగారుసిమ్ము.

### సర్వమేహములకు వేదవిద్యావటికములు

పారదాభ్రక కాంతానాం నాగభస్మసమం సమమ్. 85
దినం బ్రహ్మీరసై ర్మర్ద్యం స్వేద్యం తస్యకషాయకైః,
దినైకం వాలుకాయంత్రే వస్త్రే బధ్వా విపాచయేత్. 86
ఉద్ధృత్య చూర్ణయేత్ శ్లక్ష్ణం [1]రాజావర్తం శిలాజతు,
తాప్యం మండూర వైక్రాంతం కాసీసం తుల్యమేవ చ. 87
[2]సమం పూర్వరసం కృత్వా సర్వం చూర్ణం ప్రకల్పయేత్,
ముస్తా చందన పున్నాగ నారికేళస్య మూలకమ్. 88
కపిత్థ రజనీ దార్వీ చూర్ణం సర్వం సమం భవేత్,
జంబీరాణాం ద్రవైర్మర్ద్యం ద్వియామం వటికీకృతమ్. 89
వేదవిద్యావటీనామ్నా [3]భక్షణాత్సర్వమేహజిత్,
మధు ధాత్రీరసంచాను క్షౌద్రైః క్వాథో గుళూచికా. 90
అంకోలస్య తు బీజానాం రాత్రౌ దాహహరం పిబేత్,

తా. రసభస్మము, అభ్రకభస్మము, కాంతభస్మము, నాగభస్మము- వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి మోదుగచెక్కరసముతో నొకదినము మర్దించి ముద్దచేసి బట్టలోగట్టి మోదుగకషాయముతోడనే డోలాయంత్రమున నొకదినము వండి ఎండించి గాజుకుప్పెలో నునిచి వాలుకాయంత్రమున మరల నొకదినము వండి సాంగశీతలమున దీసి మరల ఖల్వములో నునిచి సూక్ష్మముగ చూర్ణము గావించి యందు రాజవర్తము, శుద్ధిచేసిన శిలాజిత్తుభస్మము, స్వర్ణమాక్షికభస్మము, మండూరము, వైక్రాంతము, కాసీసము అనువానిలో ప్రతిదానిని పై రసభస్మమునకు సమముగ గలిపి చూర్ణముజేసి దీనిలో తుంగముస్తెలు, శ్రీగంధము, సురపొన్న, నారికెడపువేళ్ళు, వెలగ, పసపు, మ్రానిపసపు అనువాని చూర్ణమును సమభాగములుగ గలిపి నిమ్మపండ్ల రసముతో రెండుఝాములు మర్దించి మాత్రలుజేసి యందొకదానిని తేనె, ఉసిరికపండ్ల రసము అనువాని యనుపానముతోడగాని, లేక తిప్పతీగె కషాయములో తేనె గలిపి యీయనుపానముతోడగాని సేవించిన సర్వమేహములు హరించును. రాత్రులయందు శరీరమున తాపము గలిగిన యది హరించుటకై ఊడుగవిత్తులకషాయము గాచి పానముసేయవలయును.

---

1 జారితాభ్రం. 2 సర్వం సర్వసమంచూర్ణం కల్పయేచ్చ తతఃపునః. 3 భక్షణాదిక్షు మేహజిత్.

శీతమేహమునకు నాగేంద్రఘుటికలు

మృతనాగస్య భాగైకం భాగైకేన వృషాభయా. 91
*దార్వ్యంకోలఫలం ధాత్రీ హ్యక్షబీజం పలంపలం,
కనకస్యఫలద్రావైః పిష్ట్వా తద్గుళికాకృతా. 92
నాగేంద్రఘుటికా ఖ్యాతా తక్రైః పీతా చ మేహజిత్,
నిశామృతా ద్వినిష్కంచ మధునా లేహయేదను. 93
వేదవిద్యావటీవాత్ర హ్యనుపానం చ యోజయేత్,

(పూజ్యపాదియే)

తా. సీసభస్మము, అడ్డసరము, కరక్కాయలు, మ్రానిపసపు, ఊడుగవిత్తులు, ఉసిరికపప్పు, గచ్చపలుకులు - వీనిని దినుసు కొక్కొకపలముచొప్పున ఖల్వములో నునిచి మోదుగుకాయలరసముతో మర్దించి మాత్రలుజేసి యందొకదానిని మజ్జిగతోగాని, లేక రెండునిష్కములప్రమాణము పసపు, తిప్పతీగె అనువాని చూర్ణమును తేనెతో గలిపి యీ యనుపానముతోగాని సేవించిన శీతమేహము హరించును. లేక పైజెప్పంబడిన వేదవిద్యావటికములను ఈయనుపానముతోనే సేవించిన శీతమేహము హరించును.

పిష్టమేహమునకు మేహారిరసము

వంగభస్మ మృతంసూతం తుల్యం క్షౌద్రైర్విమర్దయేత్. 94
ద్విగుంజం లేహయేన్నిత్యం హంతి మేహం చిరంతనం,
గుంజామూలం పిబేచ్చాను క్షీరైరేవ ప్రశామ్యతి. 95

తా. వంగభస్మము, రసభస్మము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి తేనెతో మర్దించి రెండుగురిగింజలంత మాత్రలుజేసి యందొకదానిని సేవించి వెంబడిగ గురిజవేరుచెక్కను పాలతోనూరి త్రాగిన దీర్ఘకాలముగ నుండు పిష్టమేహము శమించును.

శుక్లమేహమునకు మేహద్విరదసింహరసము

పారదాభ్రకయో ర్భస్మ మృతలోహాష్టకం సమం,
టంకణం చైవ మధ్వాజ్యం ప్రత్యేకం సూతతుల్యకమ్. 96
చండాలీరాక్షసీపుష్పై ర్దినం మర్ద్యం నిరుధ్య చ,

---

* దార్వ్యంకోలఫలం అనగా రేగుపండు.

మూషాయాం [1]భూధరేపక్వం దినైకం తంచ చూర్ణయేత్. 97
మేహద్విరదసింహోఽయం రసః ఖ్యాతో ద్విమాషకం,
లిహేచ్చానుపిబేత్తక్రై ర్నిష్కైకం టంకణం సదా. 98
పంచవక్త్రరసోప్యత్ర దేయశ్శుక్రప్రమేహజిత్, (మాధవకల్పే)

తా. రసభస్మము, అభ్రకభస్మము, స్వర్ణభస్మము, రజతభస్మము, తామ్రభస్మము, నాగభస్మము, వంగభస్మము, కాంతభస్మము, ఉక్కుభస్మము, లోహభస్మము, పేల్చిన వెలిగారము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి తేనె, నెయ్యి, నీలి, బలురక్కసిపువ్వులు అనువాసిరసములతో నొక్కదినము మర్దించి ముద్దజేసి ఎండించి మూసలో పెట్టి ఒకదినము భూధరపుటంబిడి సాంగశీతలమున దీసి చూర్ణముజేసి యందు రెండుమాషములయెత్తును ప్రతిదినము తేనెతో సేవించినతోడనె నిష్కమెత్తు వెలిగారమును మజ్జిగతో నూరి త్రాగిన శుక్లమేహము హరించును. ఈశుక్లమేహము హరించుటకై పంచవక్త్రరసమునైనను సేవింపందగును.

## సాంద్రమేహచికిత్స

ధాత్రీఫలరసంవాథ హరిద్రామాక్షికాన్వితమ్. 99
దార్వీముస్తా దేవదారు త్రిఫలా క్వాథితే జలే,
యోజయే దనుపానేన మేహబద్ధరసోపి వా. 100
దేయశ్చ సాంద్రమేహం తు నాశయే న్నాత్రసంశయః,

తా. పైఁ జెప్పఁబడిన మేహబద్ధరసమును ఉసిరికపండ్లరసము, పచ్చిపసపు, తేనె అనువానియనుపానముతోడగాని, లేక మ్రానిపసపు, తుంగముస్తెలు, దేవదారు, త్రిఫలములు అనువాని కషాయానుపానముతోడగాని సేవించిన సాంద్రమేహము నిస్సంశయముగ హరించును.

## సురామేహమునకు మృగమాలరసము

మారితంత్రపుసంసీసం [2]దగ్ధం హారిణశృంగకమ్. 101
కార్పాసబీజమజ్జా చ తుల్య మంకోలబీజకం,
పేషయేన్మహిషీతక్రై ర్దినైకం వటకీకృతమ్. 102
మాషద్వయం సదాఖాదే న్మృగమాలా ప్రమేహజిత్,
అక్షపాఠాభయాదార్వీ కషాయ మనుపాయయేత్. 103

తా. వంగభస్మము, సీసభస్మము, ఇఱ్ఱికొమ్ముభస్మము, ప్రత్తిపలుకులు, ఊడుగ

1 అంతరే పక్వం. 2 సుదగ్ధం మృగశృంగకమ్.

పలుకులు - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి బట్టెమజ్జిగతో నొకదినము మర్దించి రెండుమాషములంత మాత్రలుజేసి యందొకదానిని గచ్చపలుకులు, శిరుబొద్ది, కరక్కాయలు, మ్రానిపసపు అనువాని కషాయానుపానముతోడ సేవించిన సురామేహము హరించును.

లాలామేహమునకు నిత్యారోగ్యేశ్వరరసము

సూతం మృతాభ్ర వంగాభ్యాం తుల్యభాగం ప్రకల్పయేత్,
మహానింబోత్థపంచానాం చూర్ణం యోజ్యం త్రిభిస్సమమ్. 104
మధునా లేహయేన్మాషం లాలామేహస్య శాంతయే,
సక్షౌద్రరజనీంవాత్ర లిహ్యా న్నిష్కత్రయం సదా. 105
అసాధ్యం నాశయే న్మేహం నిత్యారోగ్యేశ్వరో రసః,
(సిందూరమణిదర్పణే)

తా. రసభస్మము, అభ్రకభస్మము, వంగభస్మము ఇవి సమభాగములు - ఈ మూడింటికి సమము పెద్దవేపచెక్క, దానివిత్తులు, దానిపువ్వులు, దానియాకులు, దానివేరు - వీనినెల్ల చూర్ణముజేసి మాషప్రమాణమును తేనెతో సేవించిన శీతమేహము హరించును. మఱియు మూడునిష్కములయెత్తును ఒకరూపాయయెత్తు పసుపుచూర్ణము, తేనె అనువానియనుపానముతోడ సేవించిన అసాధ్యమేహములు హరించును.

లాలామేహచికిత్స

శీతమేహస్తు బహుళో మధురశ్చాతిశీతలః. 106
ద్విగుంజం దాపయేదత్ర రసమానందభైరవం,
పాఠార్జునం విడంగానాం కషాయం మధుసంయుతమ్. 107
అనుపానం ప్రయుంజీత శీతమేహస్య శాంతయే,

తా. శీతమేహము బహుళముగ, మధురముగ, కడుశీతలముగ స్రవించును. ఇది నివర్తించుటకై రెండుగురిగింజలయెత్తు *ఆనందభైరవరసమును శిరుబొద్ది, ఏటిమద్ది, వాయువిడంగములు అనువానికషాయములో ఒకింత తేనెగలిపి సేవింపవలయును.

---

*ఆనందభైరవము—"శ్లో. హింగుళం చ విషం వ్యోషం గంధకం టంకణం సమమ్, జంభీరఫలజద్రావైర్మర్ద్యం యామచతుష్టయమ్, గుంజైకం చ ప్రదాతవ్యం రసో హ్యానందభైరవః." తా. శుద్ధిచేసిన ఇంగిలీకము, శుద్ధిజేసిన నాభి, త్రికటుకములు, శుద్ధిచేసిన గంధకము, వెలిగారక్షారము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో నాలుగుఝాములు మర్దించి గురిగింజంత మాత్రలుచేసి సేవింపవలయును.

బహుమూత్రమునకు తాళకేశ్వరరసము

మృతసూతం మృతంవంగం మృతంలోహాభ్రకం సమమ్. 108
మర్దయే న్మధునాచాహ్నా రసోఽయం తాళకేశ్వరః,
[1]మాషమేకం లిహేత్క్షౌద్రై ర్బహుమూత్రాపనుత్తయే. 109
ఉదుంబరఫలం పక్వం చూర్ణితం కర్షమాత్రకం,
సంలిహేన్మధునాసార్థ మనుపానం సుఖావహమ్. 110
ముద్గామలకయూషేణ పథ్యం దేయం సతక్రకం,

తా. రసభస్మము, వంగభస్మము, లోహభస్మము, అభ్రకభస్మము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి తేనెతో నొకదినము మర్దించి మాషమెత్తు మాత్రలు జేసి యందొకదానిని కర్షప్రమాణము మేడిపండ్లచూర్ణము, తేనె అనుపానియనుపానము తోడ సేవించిన బహుమూత్రము హరించును. మఱియు పెసలు, ఉసిరికపప్పు అనువాని [2]యూషమును తక్రయుక్తముగ జేసి సేవించుట పథ్యకరంబులు.

బహుమూత్రమునకు ఆకుల్యాదిపుటపాకము

ఆకుల్యాయాః ప్రవాళాశ్చ ముకుళాస్సమభాగకాః. 111
రంభా కేసరసంయుక్తా స్సంవేష్ట్య కదలీదళైః,
కృష్ణమృత్తికయాలిప్య పుటపాకే విపాచితమ్. 112
కదుష్ణకల్కం సంమర్ద్య తైలమధ్యే వినిక్షిపేత్,
కుక్కుటాండప్రమాణం తు భక్షయే న్మధునా సహ. 113
మాసమాత్రప్రయోగేణ మూత్రరోగం నిహంతి చ,
(నిత్యనాథీయే)

తా. నేలతంగేడుచిగుళ్ళు, నేలతంగేడుమొగ్గలు, అరటికేసరములు - వీనిని సమభాగములుగ నూరి ముద్దజేసి అరటియాకులో నునిచి దానిపై రేగటిమన్ను పెట్టి మాడకుండా పుటంబిడి ఒకింత యుష్ణముగనుండునపు డందుండి తీసి మర్దించి ముద్దజేసి తెల్లయావనూనెలో నునిచి కోడిగుడ్డంతప్రమాణమును తేనె యనుపానముతోడ ఒకమాసము వఱకు ప్రత్యహము సేవింపుచుండిన బహుమూత్రము హరించును.

బహుమూత్రచికిత్సలు

సీ. తనరారు నవభాగమును మాషపిష్టంబు
నుర్వి షడ్భాగంబు పూర్వగుడము

---

1 మాషైకంభక్షయేత్ క్షౌద్రైః. 2 యూష మన కట్టు.

క్రముకంబు లక్కలకట్టయు రెండేసి
భాగము ల్గూర్చి యింపార గున్న
చింతగింజలపొట్టు చెన్నొంద నొక్కొక్క
భాగంబు మఱియుఁ బర్పాటకంబు
సురలవంగంబులు సొంపుగ నభయంబు
నొక్కొకభాగంబు నునిచి కల్వ

గీ. మందు భల్లాతకీబీజ మమరఁ గూర్చి
త్రొక్కి యుంటలుచేసియుఁ దులము నరయు
ననుభవము చల్లయన్నంబు నారగింప
మహిని బహుమూత్రవ్యాధులు మానుచుండు.

సీ. ప్రాచినీరును శుభ్రభస్మంబు దాఁలమెత్తు
దగ మూఁడుదినములు ద్రాగవలయు
మఱియు జిలతలపచ్చి బెఱడు గంధము నావు
పాలతో మూన్నాళ్లు గ్రోలవలయుఁ
బెనుజీడిగింజల బెల్లము మూఁడేసి
నేరలు గూరిచి చెన్నుమీఱఁ
గను రసకర్పూరమును నేఁడు చిన్నాల
నఱత్రొక్కి నేయియు నాముదంబుఁ

గీ. దైలమును నేరు బావులు దేనెఁ గూర్చి
క్రమము దప్పక లేహ్యపాకముగ వండి
తులము భక్షింప బహుమూత్రములు దొలంగు
భుజగరిపుఁ జూచి పాములు పోవునట్లు.

మ. మొదల న్నోవమను జీడిగింజ లభయమ్ము న్రెండుభాగమ్ములుం
బదిభాగంబులు నింబపర్ణవితతు ల్పాత్రంబున న్వండి యిం
పొదవం జూర్ణముచేసి యౌషధము సంభోగింపఁ బథ్యంబుచే
విదితంబై బహుమూత్రజాలగదము ల్విఖ్యాతిగా మానదే.

సీ. భాండంబులో నావుపాలువోసియుఁ బాత
వస్త్రంబుగట్టి తద్వస్త్రమందుఁ

దిలపిష్టచూర్ణంబు దీరుగా జెన్నంగి
యాకుముద్దను వేడ్క నమరఁగాను
నుంచి పాకము చేసి యొనర యారసముతోఁ
బంచదారయు వంగభస్మమునను
జేర్చి సేవించియు జెన్నొందఁ బథ్యంబు
నాపిష్టమును నన్న మనుభవింప
గీ. వాసికెక్కిన బహుమూత్రవర్గములును
దేహతాపంబుచే గల్గు దాహములును
శాంతిఁ బొందును నత్యంతసమ్మతంబు
నై సుఖంబున నుండుదు రనుదినంబు.

క. మరి నాగరంబు సేరం
తరదామరపాకుచూర్ణతతియుఁ దులంబుల్
వరగోక్షీరంబులతోఁ
బరిపాకతఁ గ్రోలఁ బోవు బహుమూత్రంబుల్.

క. చెలువార వంగభస్మము
వెలిగారముఁ దేనెతోడ వెలయఁగఁ గ్రోలన్
నల కందికట్టుచే లో
పలికిం గొన మానిపోవు బహుమూత్రంబుల్.

సీ. పరగ విష్ణుక్రాంత పసిగడ్డతో నూరి
జీలకఱ్ఱయు శీతవారి సేవ
మదనబుడుతలము మఱి గడుగున నూరి
జీలకఱ్ఱయు శీతవారి సేవ
వరసురాకారంబు ధర నింబఫలసార
మునఁ ద్రాగ మానును మూత్రకృచ్ఛ్రి
మరయ కవ్వపుగుమ్ము డాకుపిసికిననీళ్ళ
పంచదారయుఁ బెట్టి పాన మొకటి
గీ. యమరఁ జిన్నంగియాకు శీతాంబుచింత
బెరడు గంధంబు నచ్చుంపుబఱ్ఱెనెయ్యి

యనుభవించిన రక్తమేహములు దొలఁగుఁ
బథ్యములు చేయవలయును భవ్యముగను.

## బహుమూత్రమునకు జాత్యాదివటికములు

జాతీఫలైకభాగంతు జాతీపత్రం తథా మహత్. 114
అఫేన మేకభాగంతు ద్విభాగం దీప్యకం తథా,
గాంధారీచ చతుర్భాగం ఖల్వమధ్యే వినిక్షిపేత్. 115
నారికేళోదకేనాథ మర్దయే త్త్రిదినం దృఢం,
చణకస్యప్రమాణంతు మండలం భక్షితం యది. 116
మధురాహారభోజీతు బహుమూత్రప్రశాంతయే. (నందినాథీయే)

తా. జాజికాయ, జాపత్రి, పెద్దములక, నల్లమందు-ఇవి దినుసుకొక్కొకభాగము, ఖురాసానిఓమము ౨ భాగములు, గంజాయియాకు ౪ భాగములు-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి కొబ్బరికాయనీటితో మూడుదినములు దృఢముగ మర్దించి సెనగగింజలంతేసి మాత్రలుజేసి ఒకమండలమువఱకు సాయంప్రాతఃకాలముల సేవింపుచుండిన బహుమూత్రము హరించును. పథ్యము, మధురాహారముల భుజింపవలయును. (పావుసేరు ఉత్తరేణియాకురసములో అరతులము మిరియపుచూర్ణము గలిపి త్రాగిన రక్తమేహము హరించును. మఱియు రక్తమేహమునందు చంద్రకళారసమునుకూడ సేవింపందగును.)

## వంగావలేహయోగము

మారితం త్రపుసంసీసం హరిణశ్శృంగమాకులమ్. 117
కర్పాసనాకులీతక్రం మహిషం చ ప్రమేహజిత్, (సిద్ధరసార్ణవే)

తా. వంగభస్మము, సీసభస్మము, ఇఱ్ఱికొమ్ముగంధము, ప్రత్తిపలుకులు, తంగేడువిత్తులు-వీనిని సమభాగములుగ నూరి, బఱ్ఱె మజ్జిగలో గలిపి త్రాగిన మేహరోగములు హరించును.

పిచుమందస్య నిర్యాసం ధాత్రీక్వాథేన పేషితం,
శిలాధాతుసమాయుక్తం శుక్లమేహవినాశనం,

తా. మంచి వేపబంకను ఉసిరికపప్పుకషాయముతో నూరి పదిచిన్నములయెత్తు కర్పూరశిలాజిత్తుభస్మము గలిపి నలువది దినములు సేవించిన శుక్లమేహము హరించును.

## మేహములకు వసంతకుసుమాకరము

పృథగ్ద్వౌ హాటకం చంద్రం త్రయోవంగాహి కాంతజమ్. 119
చత్వార స్సూతమభ్రంచ ప్రవాళం మౌక్తికం తథా,

భావనా గవ్యదుగ్ధేషు వాసాశ్రీద్విజలైర్నిశా. 120
మోచకందరసైస్సప్త క్రమాద్భావ్యం పృథక్పృథక్,
శతపత్రరసేనైవ మాలత్యాః కుసుమైస్తథా. 121
పశ్చాన్మృగమదైర్భావ్య సుసిద్ధోరసరాట్భవేత్,
కుసుమాకరవిఖ్యాతో వసంతపదపూర్వకః. 122
వల్లద్వయమితస్సేవ్య స్సితాజ్యమధుసంయుతః,
వలీపలితహృన్మేధ్యః కామద స్సుఖదస్సదా. 123
మేహఘ్నః పుష్టివశ్శ్రేష్ఠః పరం వృష్యో రసాయనః,
ఆయుర్వృద్ధికరః పుంసాం ప్రజాజననముత్తమమ్. 124
క్షయకాసతృషోన్మాద. శ్వాసరక్తవిషార్తిజిత్,
సితాచందనసంయుక్త మమ్లపిత్తాదిరోగజిత్. 125
హంతిపాండ్వామయాన్ శూలాన్ మూత్రఘాతాశ్మరీంహరేత్,
యోగవాహిత్వదం సేవ్యం కాంతిశ్రీర్బలవర్ధనమ్. 126
సుసాత్మ్యమిష్టభోజీచ రమయేత్ప్రమదాశతం,
మదనం మదయన్మదముజ్వాలయన్ప్రమదానివహానతివిహ్వాలయన్,
సురతైస్సుఖదైర్గతివిష్వచనై ర్భవసారజుషామయమేవసుహృత్.127
(ఆయుర్వేదే)

తా. సువర్ణభస్మము ౨ భాగములు, రజతభస్మము ౨ భాగములు, వంగభస్మము ౩ భాగములు, సీసభస్మము ౩ భాగములు, లోహకాంతభస్మము ౩ భాగములు, రసభస్మము ౪ భాగములు, అభ్రకభస్మము ౪ భాగములు, పగడభస్మము ౪ భాగములు, ముత్తియపుభస్మము ౪ భాగములు-ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి ఆవుపాలు, చెఱుకు, అడ్డసరము అనువాని కషాయములతోను, చందనము, వట్టివేరు, కురువేరు, పసపు అనువాని కషాయములతోను, అరటిగడ్డ, దామెర, జాజిమొగ్గలు అనువానిరసములతోను వెవ్వేరుగ ఏడేసిమార్లు భావనజేసి పిదప కస్తూరితో భావనజేసిన వసంతకుసుమాకరమను పేరంబరఁగు నీయౌషధము శ్రేష్ఠంబైనదిగ నగుచున్నయది. పిదప అందు రెండువల్లములయెత్తును శర్కర, నెయ్యి, తేనె అనువాని యనుపానముతోడ సేవించిన ముదిమి, మేహము, క్షయము, కాసము, దప్పి, ఉన్మాదము, శ్వాసము, రక్తవిషదోషములు, పాండువులు, శూలలు, మూత్రాఘాతము, అశ్మరి అనురోగముల హరింపఁజేయుటయేగాక కామసుఖము, పుష్టి, వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి, ప్రజోత్పత్తి, కాంతి, బలము అనువానిని

నగా గలుగంజేయును. మఱియు నీరసాయనమును పంచదార, చందనము అనువానియను పానముతోడ సేవించిన అమ్లపిత్తాదిరోగములు హరించును. పథ్యములేక యథేష్టముగ భుజింపుచు నీయౌషధమును సేవింపుచుండిన నూరుగురు స్త్రీలతో రమించుటకు దగిన శక్తిగలవాఁడై కడుకామాతురుఁడై కడుసుఖకర సురతములవలన మదోన్మత్తుఁడై స్త్రీల మదము నణంచువాఁడైయుండును. కావున సంసారసుఖము నెఱింగినవానికీ యౌషధము స్నేహితునివలె హితమును సేయుచుండును.

### సర్వమేహములకు మహావంగేశ్వరరసము

వంగం కాంతం చ గగనం హేమపుష్పం సమంసమమ్. 128
కుమారీరసతో భావ్యం సప్తవారం భిషగ్వరైః,
ఏషవంగేశ్వరోనామ ప్రమేహాన్ వింశతింజయేత్. 129
మూత్రకృఛ్రం సోమరోగం పాండురోగం మహాశ్మరీం,
రసాయనవర శ్రేష్ఠో నాగార్జునవినిర్మితః. 130

తా. వంగభస్మము, లోహకాంతభస్మము, అభ్రకభస్మము, నేలతంగేడువిత్తులు- వీనిని సమభాగములుంగ ఖల్వములోనునిచి కలబందరసముతో నేడుమార్లు భావనజేసి రోగ బలానుగుణ్యముగ సేవించిన ౨౦ మేహములు, మూత్రకృఛ్రము, సోమరోగము, పాండు రోగము, అశ్మరి అనువానిని హరింపజేయుటయం దీరసాయనము శ్రేష్ఠంబైన దని నాగార్జునుఁడు వచించెను.

### మేహకుంజర కేసరీరసము

రసగంధాయు సాభ్రాణి నాగం వంగం సువర్ణకం,
వజ్రకం మౌక్తికం సర్వ మేకీకృత్య విచూర్ణయేత్. 131
శతావరీరసేనైవ గోళకం శుష్కమాతపే,
తథాశుష్కం సముద్ధృత్య శరావే సుదృఢే క్షిపేత్. 132
సంధిలేపం మృదాకుర్యా ద్గర్తాయాం గోమయాగ్నినా,
పుటేద్యావచ్చతుర్యామ ముద్ధృత్య స్వాంగశీతలమ్. 133
శ్లక్ష్ణం ఖల్వే వినిక్షిప్య గోళంతం మర్దయేద్దృఢం,
దేవబ్రాహ్మణపూజాం చ కృత్వా ధృత్వా చ కుప్యకే. 134
ఖాదేద్వల్లద్వయం ప్రాత శ్శీతంచానుపిబేజ్జలం,
తథా సర్వప్రమేహాంశ్చ జయేన్నానప్రయోగతః. 135
తుష్టిం తేజోబలం వర్ణ శుక్రవృద్ధించ దారుణం,

అగ్నేర్బలం వితనుతే మోహకుంజరకేసరీ. 136
దివ్యం రసాయనం శ్రేష్ఠం నాత్ర కార్యా విచారణా, (అన్యశాస్త్రే)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, లోహభస్మము, అభ్రకభస్మము, సీసభస్మము, వంగభస్మము, సువర్ణభస్మము, వజ్రభస్మము, ముత్తియపుభస్మము-వీనినెల్ల సమభాగములుగ, ఖల్వములో నునిచి పిల్లిపీచరవేళ్ళరసముతో మర్దించి బిళ్ళజేసి ఎండనెండించి దృఢమైన శరావములయం దునిచి దానిచుట్టు చీలమన్ను లేపనముజేసి గుంటత్రవ్వి దానిలో నునిచి నాలుగుఝాములు ఆవుపిడకలతో పుటంబిడి సాంగశీతలమునదీసి దేవ, గురు, బ్రాహ్మణ, అతిథుల పూజించి ఖల్వములో నునిచి బాగుగ మర్దించి చూర్ణముజేసి కుప్పెలో నునిచికొని యందు రెండువల్లములయెత్తును ప్రాతఃకాలమున సేవించి ఒకింత శీతోదకమును వెంబడిగ త్రాగవలయును. ఇటుల నొకమాసమువఱకు సేవింపుచుండిన సర్వమేహముల హరింపంజేసి సంతోషము, తేజస్సు, బలము, వర్ణము, వీర్యవృద్ధి, అగ్నిదీపనము అనువానిని నిస్సంశయముగ గలుగంజేయును. ఇది శ్రేష్ఠంబైన రసాయనంబుగనున్నయది.

## పంచలోహరసాయనము

మృతాభ్రం కాంతలోహం చ నాగవంగౌ విశోధినౌ. 137
యథోత్తరం భాగవృద్ధ్యా ఖల్వమధ్యే వినిక్షిపేత్,
తలపోటేన వారాహ్యా శతావర్యా హిమాంబునా. 138
భావనాత్ర ప్రకర్తవ్యా యామం యామం పృథక్పృథక్,
చణమాత్రాం వటీం కృత్వా నవనీతేన సేవయేత్. 139
ప్రాతరుత్థాయ విధినా సర్వమేహకులాంతకః,
శాల్యన్నం చ పటోలం చ తండులీయక వాస్తుకమ్. 140
మత్స్యాక్షీ ముద్గయూషంచాప్యపక్వం కదలీఫలం,
అర్శాంసి గ్రహణీదోష మూత్రకృచ్ఛ్రాశ్మరీ ప్రణుత్. 141
కామిలాం పాండుశోథం చాప్యపస్మారం క్షతక్షయాన్,
రక్తకాసం నిహంత్యాశు పంచలోహరసాయనమ్. 142
(సిద్ధరసార్ణవే)

తా. అభ్రకభస్మము ౧ భాగము, లోహకాంతభస్మము ౨ భాగములు, సీసభస్మము ౩ భాగములు, వంగభస్మము ౪ భాగములు-ఇటుల వానిని ఖల్వములో నునిచి తంగేడు, నేలతాటిగడ్డలు, పిల్లిపీచరవేళ్లు, రక్తచందనము అనువానికషాయములలో ప్రతి

జానిచే నొక్కొకకర్షాము మర్దించి సెనగగింజలంత మాత్రలుజేసి యందొకదానిని ప్రాతః కాలమున వెన్నతో సేవించిన సర్వమేహములు హరించును. మఱియు దీనియందు వరివంటకము, పొట్లకాయ, చిఱ్ఱికూర, చక్రవర్తికూర, పొన్నగంటికూర, పెసరకట్టు, అరటికాయ అనువానిని భుజించుట పథ్యకరము. మఱియు నీయౌషధసేవనవలన మూలరోగము, సంగ్రహణి, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, కామిల, పాండువు, వాపు, అపస్మారము, క్షతక్షయము, రక్తకాసము హరించును.

సర్వమేహములకు చంద్రోదయరసము

అభ్రకం గంధకం సూతం వంగభస్మ సమాంశకం,
ఏలా శిలాజతుంచైవ రంభాసారేణ మర్దయేత్. 143
ప్రమేహా న్వింశతిం హన్యా త్కామిలా పిత్తనాశనః,

తా. అభ్రకభస్మము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన రసము, వంగభస్మము, ఏలకులు, శుద్ధిజేసిన కర్పూరశిలాజిత్తు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి అరటిగడ్డరసముతో మర్దించి మాత్రలుజేసి యందొకదానిని సేవించిన ౨౦ ప్రమేహములు, కామిల, పిత్తరోగము హరించును.

మేహశూలలకు

క. తాళకపువంగభస్మము, క్రాలగ దంగేడు పంచకంబును ధరణిన్
గ్రోలంగ శుద్ధకట్టులు, కూలారిన మేహశూలకులముదొలంగున్.

పంచపాదిచంపకమాలిక:—

ఉలిమెడువేళ్లు పల్లెరును నొప్పగుకొమ్మను బెండివేరునున్
వెలసినభూమిధాత్రిముల వేరులనాములు దోసవిత్తులున్
బలుపసిగడ్డతో మరియు బాగుగ మర్దనచేసి శీఘ్రమున్
జెలువుగ వంగభస్మమున సేవను మానును శుద్ధకట్టులున్
బలుమఱు మేహదోషములు పాయు నిజంబుగ ధారుణీస్థలిన్.

అసాధ్యమేహపిటికాలక్షణము

గుదే హృది శిరస్యంసే పృష్ఠే మర్మసు చోత్థితాః. 144
సోపద్రవాదుర్బలాగ్నిః పిటికాః పరివర్జయేత్, (మాధవనిదానే)

తా. గుదము, హృదయము, శిరము, భుజశిరస్సులు, వీపు, మర్మస్థలము అనువానిపై మేహపిటికలు జనించి "శ్లో. తృట్కాసమాంససంకోచా మేహహిక్కామదజ్వరాః, విసర్పమర్మసంరోధాః పిటికానాముపద్రవాః." అనఁగా దప్పి, పొడిదగ్గు,

మాంసపంకోచము, మోహము, ఎక్కిళ్లు, మదజ్వరము, విసర్పి, మర్మస్థలములయందు పట్లు అను నుపద్రవములు గలవాఁడై అగ్నిదీపనములేకుండెడి పిటికారోగిని వైద్యుఁడు వర్జింపవలయును. (మఱియుతంత్రాంతరసములయందు "శ్లో.రజఃప్రసేకాన్నారీణాం మాసి మాసి విశుద్ధ్యతి, కృత్స్నం శరీరం దోషాంశ్చ న ప్రమేహంత్యతస్స్త్రియః." అనఁగా స్త్రీలు ప్రతిమాసమునందు ఋతువగుటవలన సర్వశరీరదోషములు శుద్ధంబులగును. దానం జేసి స్త్రీలకు ప్రమేహము జనించుట లేదనియు, జనించియుండుట నిదివఱ కెవ్వరికి నను భవసిద్ధంబుగ లేదనియు, తదితరరోగములు జనించుట అసంభవములనియు జెప్పంబడి యున్నయది. ఐనను నీవిషయము వాదాస్పదముగ నున్నయది. దీనిసెవ్వరు విశదముగ నిర్ణయము జేయలేదు.)

మర్మణ్యంసే గుదే పాణ్యో స్తనే సంధిషు పాదయోః. 145
పిటికా యది జాయంతే ప్రమేహీ నచ జీవతి,

తా. మర్మస్థలములు, భుజశిరస్సులు, గుదము, చేతులు, స్తనములు, కీళ్లు, పాదములు అనువానియందు మేహపిటికలు జనించిన ఆమేహరోగి జీవింపఁడని తెలియవలయును.

మేహపిటికాచికిత్సాక్రమము

శరావికాదిపిటికా శ్శోఫవత్సముపాచరేత్. 146
అపక్వవ్రణవత్సర్వం సాక్షాత్పూర్వరూపమేవ చ,
పిటికా స్సంధిజాతాశ్చ త్వరయా రక్తముద్ధరేత్. 147
జలూకాలాబుశృంగైర్వా పచనైర్వా చికిత్సకైః, (ఆయుర్వేదే)

తా. శరావికాది మేహపిటికల శోఫవలెనే చికిత్సింపవలయును. పిటికలయందపక్వవ్రణపూర్వరూపములే గలిగియుండును. సంధిజనితపిటికలయందు జలగలు, సొరకాయబుఱ్ఱలు, కొమ్ములు అనువానిచే శీఘ్రముగ రక్తమునైన స్రవింపం జేయవలయును. లేక వానిని పడునటులంజేసియైన జికిత్సింపవలయును.

మేహవ్రణచికిత్స

అరుష్కరాఖ్యబీజాని చాతుర్జాతం సమంతథా. 148
రసభస్మ తదర్ధం చ గంధకం క్షౌద్రమర్దితం,
ఖాద్యం ఘృతే సనిష్కార్ధం మేహవ్రణప్రశాంతయే. 149

తా. జీడిపలుకులు, ఏలకులు, దాల్చినిచెక్క, ఆకుపత్రిక, నాగకేసరములు ఇవి దినుసుకు సమభాగములు-వీనికర్ధభాగము శుద్ధిజేసిన రసభస్మము, శుద్ధిజేసిన గంధకను - ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి తేనెతో మర్దించి అర్ధనిష్కప్రమాణము మాత్రలు జేసి

యందొకదానిని సాయంప్రాతఃకాలముల నొకమాసమువఱకు సేవించుచుండిన మేహ పిటికలు హరించును. పథ్యము: చప్పిడియన్నము, ఆవుపాలు, ఆవుమజ్జిగ వీనిని సేవింప వలయును.

మ. పొసఁగన్ మ్లేచ్ఛము నావు వెన్నయును దాంబూలీసహాదేవియు
న్నొసఁగన్ బంగరు ప్రత్తియాకురసము న్నింపార మర్దించియున్
వసుధ న్మేలుఫిరంగిచెక్కతునుక ల్వన్వంబుగాఁ బోఁకలున్
వసగాదేడును రెండునేర్లు నిడి యాభాగాలు మిశ్రించి సం
తస మొందన్ విడియంబు సేయఁ జనుగాత న్మేహగ్రంథ్యాదులున్.

క. వెలుమసంధ్యాకురసమును
దిలసారము రెండుఁ గూర్చి తెలివిగఁ ద్రాగన్
నెలకొన్న మేహవ్రణములు
దొలఁగును రవిగన్నఁ దమము దొలఁగినరీతిన్.

మేహములయందు పథ్యము

పురాణశాలి గోధూమ షష్టి జాంగలజామిషం,
పిణ్యాకం తిలజం తక్రం నవనీతముపోదకీ. 150
తండులీయక ధుత్తూరం జీవంతీ శిగ్రుపల్లవం,
ముద్గ మూషా మృతా ధాత్రీ పటోలం వత్సకం మధు. 151
ఔదుంబరఫలం బాల మపక్వం కదళీఫలం,
రంభాప్రసూనం గాంగేరీ ఝురసీ డుండుకం తథా. 152
కపిత్థం మేషశృంగీ చ ముష్కకం కతకం తథా,
కారవల్యాఖుకర్ణీ చ తిక్తవర్గాణియానిచ. 153
వ్యాయామస్నానమభ్యంగం ప్రమేహేషు హితం సదా.

(మాధవనిదానే)

తా. ప్రాతబియ్యము, గోధుమలు, ఉందినములకు ఫలించెడివడ్లు, జాంగల మాంసము, తెలికపిండి, మజ్జిగ, వెన్న, బచ్చలికూర, చిట్టికూర, పొన్నగంటికూర, మనుబాలకూర, లేఁతమునగకూర, పెసరకట్టు, తిప్పతీఁగె, ఉసిరికకాయ, పొట్లకాయ కొడిసెకాయ, తేనె, మేడికాయ, లేఁతఅరటికాయ, అరటిపువ్వు, పులిచింత, చాతలా సికూర, దుందిలపుకాయ, వెలగపండు, వద్దికూర, మొక్కపుకాయ, ఇండుపుకాయ,

కాకరకాయ, ఎలుకచెవికూర, చేదుగలపదార్థములు, సంచారము, అభ్యంజనస్నానము, వీనిని సేవించుట మేహరోగములయందు పథ్యకరంబులు.

మేహములయం దపథ్యము

దధి మధు గుడసర్పిః క్షీర మామ్లంచ హింగు
లవణ లశున నిద్రా సంగమం మత్స్యమాంసం,
తిలసర్షపశుంఠీ నారికేలాంబు పిష్టం
బృహతి పనస కందం మేహినాం శత్రువర్గః. 154

తా. పెరుగు, కల్లు, బెల్లము, నెయ్యి, పాలు, పులుసు, ఇంగువ, ఉప్పు, వెల్లుల్లి పగటినిద్ర, స్త్రీసంగమము, మత్స్యమాంసము, నువ్వులు, ఆవాలు, శొంఠి, టెంకాయనీరు, పిండివంటకములు, ములకకాయలు, పనసపండు, కందగడ్డ- ఇవి మేహరోగములయం దపథ్యకరంబులు.

మూత్రకృచ్ఛ్రనిదానము

వ్యాయామ తీక్ష్ణ రూక్షాచ్చ మద్య మత్స్యాతిసేవనాత్,
అజీర్ణాదతివేగాచ్చ మూత్రకృచ్ఛ్రాష్టకం భవేత్. (చరకే)

తా. మిక్కుటముగ సంచారము సేయుట, తీక్ష్ణము, రూక్షముగలపదార్థములు, కల్లు, మత్స్యములు వీనిని మిక్కుటముగ సేవించుట, అన్నము జీర్ణము గాకుండుట, గుఱ్ఱము మొదలగువాని నెక్కి కడువేగముగ సంచరించుట- ఈకారణములవలన ఎనిమిది విధములైన మూత్రకృచ్ఛ్రములు జనించును.

వాతమూత్రకృచ్ఛ్రలక్షణము

మూత్రాష్ఠీలాద్భవేత్పీడా కష్టాన్మూత్రాయతే ముహుః,
మేఢ్రవంక్షే వేదనా చ కృచ్ఛ్రో వాతాధికో భవేత్. 156

తా. కడువేదనాయుక్తమై కడుకష్టముమీఁద పలుమారు కొంచెకొంచెముగా మూత్రము వెడలుట, మేఢ్రము, అండసంధులు, చకారమువలన పొత్తికడుపు, మూత్రాశయము అనువానియందు తీవ్రమైనవేదన గలుగుట-ఈలక్షణములుగలది వాతమూత్రకృచ్ఛ్రమని దెలియవలయును.

పైత్యమూత్రకృచ్ఛ్రలక్షణము

పీతం రక్తం సరుగ్దాహం మూత్రకృచ్ఛ్రం చ పిత్తళం,
శీతలే చావగాహాశ్చ పిత్తే యోజ్యం సుశీతళమ్. 157

తా. పోట్లతోఁగూడి పచ్చనివర్ణముగాని, లేక ఎఱ్ఱనివర్ణముగాని గలదై నిప్పువలె

మండుచు కొంచెకొంచెముగ మూత్రముపెడలిన పిత్తజమూత్రకృఛ్రమని తెలియవలయును. దీనియందు శీతోదకములో గ్రుంకుట, శీతలపదార్థముల సేవించుట హితకరము.

## శ్లేష్మమూత్రకృఛ్రలక్షణము

వస్తౌ లింగే గురుత్వం చ మూత్రే పిచ్ఛిలతాకఫాత్,
శ్వయథుశ్చ భవే త్కృచ్ఛ్రం వమనస్వేదనం జయేత్. 158
(రసరత్నాకరే)

తా. పొత్తికడుపు, మేఢ్రము వాచి జడముగనుండుట, మూత్రము జిగటగ వెడలుట-ఈలక్షణములుగలది శ్లేష్మజమూత్రకృఛ్రమని తెలియవలయును. దీనిని వమనస్వేదన క్రియలచే శమింపంజేయవలయును.

## శుక్లమూత్రకృఛ్రలక్షణము

ఆధ్మానవాతం శూలం చ మూత్రసంగం కరోతి చ,
అశ్మరీహేతుకం పూర్వం మూత్రాఘాతోహ్యయం భవేత్. 159
సశుక్లం మూత్రయేత్కృచ్ఛ్రా దిదంచాశ్మరిలక్షణం,

తా. వెన్నునుగుదియదీయుట, లేక కడుపుబ్బుట, మేఢ్రములో శూలగలుగుట, మూత్రోత్సర్జనము గాకుండుట, ఈమూత్రాఘాతము అశ్మరీరోగోత్పత్తికి కారణంబుగ నగుట, మూత్రముతోడ శుక్రధాతువు కొంచెకొంచెముగ స్రవించుట ఈలక్షణములు గలది శుక్రమూత్రకృఛ్రమని తెలియవలయును. మఱియు నీలక్షణములే అశ్మరీకృఛ్రము నందు సగా గలిగియుండును.

## వాతకుండలిమూత్రకృఛ్రలక్షణము

మూత్రమల్పంచ రంధ్రార్తి రాధ్మానం గురుకందుతా. 160
సరుజం మూత్రరోధశ్చ కృచ్ఛ్రోఽయం వాతకుండలీ,
(మాధవనిదానే)

తా. మూత్రద్వారమున మూత్రము వెడలునపుడు చురుకుగలిగి ఒక్కొక్కబొట్టుగ స్రవించుట, వెన్నును గుదియదీయుట, జడత్వము, దురదగలుగుట, పొత్తికడుపునందు వాతవేదన, మూత్రప్రతిబంధము గలుగుట - ఈలక్షణములుగలది వాతకుండలీ మూత్రకృఛ్ర మని తెలియవలయును.

## శల్యజమూత్రకృఛ్రలక్షణము

మూత్రవాహిషు శల్యేన క్షతే ష్వభిహతేషు చ.
మూత్రకృచ్ఛ్రం తదా ఘాతా జ్జాయతే భృశదారుణం, 161

వాతకృచ్ఛ్రేణ తుల్యాని తస్యలింగాని లక్షయేత్. (ఆయుర్వేదే)

తా. మూత్రమును వహించు స్రోతస్సులయందు శల్యము ప్రవేశించుటవలన గాయముగాని, లేక దెబ్బగాని గలుగుటచే కడుదారుణమైన మూత్రకృఛ్రిముజనించును. ఇదియు శల్యజమూత్రకృఛ్రి మనఁబరఁగు. దీనియందు వాతమూత్రకృఛ్రి లక్షణంబులే గలిగియుండును.

పురీషజమూత్రకృఛ్రిలక్షణము

శకృతస్తు ప్రతీఘాతా ద్వాయుర్విగుణతాంగతః,
ఆధ్మానం వాతసంగంచ మూత్రసంగం కరోతి చ. 163

తా. మలము బాధించుటవలన వాతము వికారమునుజెంది ఆధ్మానము, వాతశూల, మూత్రప్రతిబంధము అనువానిని గలుగంజేసిన పురీషజన్యమూత్రకృఛ్రి మని తెలియవలయును.

సన్నిపాతమూత్రకృఛ్రిలక్షణము

వాతపిత్తకఫే చిహ్నం వాదుక్తంచ పృథక్పృథక్,
తత్సమస్తంభవేద్యత్ర సకృఛ్రిస్సాన్నిపాతికః. (నిత్యనాథీయే)

తా. వాత పిత్త శ్లేష్మ మూత్రకృఛ్రిములకు ప్రత్యేక ప్రత్యేకంబుగ జెప్పంబడిన లక్షణంబులన్నియుం గలది సన్నిపాతమూత్రకృఛ్రిమనంబడును. కడువేగముగలదై మూత్రం బొట్కొట్కబొట్టుగ వెడలుట, మూత్రము వెడలునపుడు మేఢ్రిములో నొచ్చుట, పొత్తికడుపులో గడ్డలుకట్టి మెదలుట, పచ్చగగాని, ఎఱ్ఱగగాని, మూత్రమువెడలుట మేఢ్రిములో పోట్లుపొడుచుట, దప్పిగలుగుట, తఱుచుగ మూత్రము కొంచెకొంచెముగ వెడలుట, మేఢ్రిము వాచుట, అన్నము జీర్ణము గాకుండుట, శరీరమువాచుట, వమనంబలగుట - ఈలక్షణంబులుంగల మూత్రకృఛ్రిరోగి యమాలయంబున కేఁగునని తెలియవలయును.

అష్టస్యుర్మూత్రకృఛ్రాణి రూక్షా తీక్ష్ణోష్ణఖాదనాత్,
వాతాత్సశూలం స్రవతి మూత్రం పిత్తేన దాహకృత్. 16
కఫేన శీతలం సాంద్రం దుశ్చికిత్స్యం త్రిదోషజం,
రక్తజం రక్తసంస్రావి శుక్లసంస్రావి శుక్లజమ్. 16
అశ్మాశ్మరీ వస్తిగతా భిన్నా సా శర్కరాశ్మరీ. (ఆయుర్వేదే

తా. తీక్ష్ణద్రవ్యములు, రూక్షద్రవ్యములు, ఉష్ణకరభోజనము - వీనినిసేవించుటవలన ఎనిమిదివిధములగు మూత్రకృఛ్రిములు జనించును. అందు మేఢ్రిమున శూల గ

మూత్రం బొక్కకబొట్టుగ వెడలిన వాతమూత్రకృచ్ఛ్రమనియు, మూత్రము వెడలునపుడు మేఢ్రమున నగ్నివలె మండుచుండిన పైత్యమూత్రకృచ్ఛ్రమనియు, మూత్రము చల్లగ దట్టముగ వెడలిన శ్లేష్మమూత్రకృచ్ఛ్రమనియు తెలియవలయును. త్రిదోషమూత్రకృచ్ఛ్రం బసాధ్యంబు. రక్తజమూత్రకృచ్ఛ్రమున రక్తము స్రవించును. శుక్లజమూత్రకృచ్ఛ్రమున శుక్లముగాని, లేక మూత్రము శుక్లవర్ణముగగాని స్రవించును. పొత్తికడుపునందు రాళ్ళు జనించి మూత్రద్వారము నడ్డగించిన మూత్రకృచ్ఛ్రాశ్మరి యనియు, ఇసుకవలె మూత్రమువెడలిన శర్కరాశ్మరిమూత్రకృచ్ఛ్రం బనియు తెలియవలయును. కావున ఈయెనిమిదివిధములైన మూత్రభేదములవలన, తల్లక్షణములవలన వానిసాధ్యాసాధ్యంబుల నెఱింగి చికిత్సం జేయవలయును.

ప్రయోగశ్శమయేద్వ్యాధి మన్యామయముదీరయేత్, 167
వ్యాధినాశావశుద్ధస్తు శమయేన్నసమీరయేత్, (సిద్ధసంగ్రహే)

తా. ఔషధప్రయోగమువలన ఏకదోషజనితరోగములు హరించును. మఱియు ద్వంద్వ, త్రిదోషజనితరోగములయం దౌషధమును బ్రయోగించిన తదితరరోగములు జనించును. అట్లగుటం జేసి ఏకదోషజనితంబులగు వాత, పిత్త, శ్లేష్మ, మూత్రకృచ్ఛ్రములకే చికిత్సం జేయవలయును. ద్వంద్వ, త్రిదోషజనితమూత్రకృచ్ఛ్రములు కుదురుట దుర్లభం బగుటచే వానియందు చికిత్స జేయంజనదు.

## వాతమూత్రకృచ్ఛ్రమునకు మూత్రకృచ్ఛ్రాంతకరసము

[1] మృతంసూతం తామ్రభస్మ శిఖితుత్థం చ టంకణమ్. 168
శతావరీరసేనైవ దినైకం మర్దయేద్దృఢం,
తద్గోళం సార్షపే తైలే పాచ్యం యామం చ చూర్ణయేత్. 169
మూత్రకృచ్ఛ్రాంతకః ఖ్యాతో ర్దేయం గుంజాచతుష్టయం,
భక్షణాన్నాత్ర సందేహో మూత్రకృచ్ఛ్రం నిహంత్యలమ్. 170
తులసీ తిలపిణ్యాకం బిల్వం మూలం తుషాంబునా,
కర్షైకమనుపానేన [2]వాతకృచ్ఛ్రాంతకోభవేత్. (మాధవనిదానే)

తా. రసభస్మము, తామ్రభస్మము, శుద్ధిజేసిన మైలుతుత్తము, పేల్చిన వెలిగారము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి పిల్లిపీచరవేళ్ళరసముతో నొకదినము

---

1 శతావరిరసైఃపిష్ట్వా మృతసూతంచ తామ్రకమ్, శిఖితుత్థం చ తుల్యాంశం దినైకం మర్దయేద్దృఢమ్. 2 సురయావాసువర్చలైః.

బాగుగమర్దించి ముద్దజేసి ఆవనూనెతో నొకఝామువరకు వండి చూర్ణముజేసి నాల
గురిగింజలయెత్తును తేనెతో సేవించిన మూత్రకృఛ్రములు హరించును. లేక ఈమూ
కృఛ్రాంతకరసమును తులసియాకు, గానుగపిండి, మారేడువేరుపట్ట అనువానిని కర్ష
మాణము గ్రహించి ఉమకనీటితో ద్రొక్కి *సొటాకుప్రమాణము రసము దీసి
యనుపానముతోడ నాలుగుమాసములుసేవించుచుండిన వాతమూత్రకృఛ్రముహరించు

## పైత్యమూత్రకృఛ్రమునకు లఘులోకేశ్వరరసము

రసభస్మ చ భాగైకంచతుష్కం శుద్ధగంధకం,
పిష్ట్వా వరాటికాః పూర్వాశ్చ రసపాదం చ టంకణమ్. 1
క్షీరేణ పిష్ట్వా రుధ్వాస్యం భాండే రుధ్వా పుటే పచేత్,
స్వాంగశీతం పిచూర్ణ్యాథ లఘులోకేశ్వరోరసః. 1
చతుర్గుంజో ఘృతైర్దేయో మరిచైకోనవింశతిః,
ధాత్రీమూలం పలైకం తు హ్యజాక్షీరేణ పాచయేత్. 1
శర్కరాభావితంచానుపీతం కృఛ్రహరం పరం, (ఆయుర్వే

తా. రసభస్మము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౪ భాగములు - ఇ
వీనిని ఖల్వములో నునిచి మర్దించి గవ్వలలోనునిచి పాదరసమునకు ౪-వ భా
వెలిగారమును మేకపాలతో నూరి గవ్వలమూతులపై మెత్తి గట్టికుండలో నునిచి
మూతి మూకుడుచే మూసి చీలమన్ను లేపనముజేసి మాడకుండా లఘుపుటంబిడి స్వ
శీతలమున దించి యందలిగవ్వల దీసి మర్దించి చూర్ణముజేసి నాలుగు గురిగింజలయె
నెయ్యి, ౧౯ మిరియములు అనువానియనుపానముతోగాని, లేక ఒకపలము ఉ
వేళ్ళను నూరి పావుసేరు మేకపాలలో గలిపి కాచిగాని, లేక శర్కరతో భ
జేసిగాని సేవించిన పిత్తమూత్రకృఛ్రము హరించును.

## పిత్తమూత్రకృఛ్రమునకు యష్ట్యాదికషాయము.

యష్టీ గోక్షురకం పథ్యా విదారీచ కశేరుకమ్.
కషాయం ససితా క్షౌద్రం రసభస్మయుతం పిబేత్,
మూత్రకృఛ్రం హరత్యాశు సప్తాహాత్పిత్తసంభవమ్.

తా. అతిమధురము, పల్లేరు, కరక్కాయలు, నేలగుమ్మడు, సెమ్మటములు
వానికషాయములో శర్కర, తేనె రసభస్మము గలిపి ఏడుదినములు ద్రాగిన పి

* సొటాకు అన సేరున కెనిమిదవభాగము.

మూత్రకృఛ్రము శీఘ్రముగహరించును. (నీరుకట్టువ్యాధియందు నాలుగు గురిగింజలయెత్తు లఘులోకేశ్వరరసమును, కమికెదు అందుగాకు, పాలెదు ఉసిరికపప్పు, నాటాకుప్రమాణము జీలకఱ్ఱ అనుపానికషాయానుపానముతోడ సేవించిన నీరుకట్టువ్యాధి హరించును.

### శ్లేష్మమూత్రకృఛ్రమునకు చక్రధరరసము

సూతం స్వర్ణంచ వైక్రాంతం మృతం తుల్యం వినుర్దయేత్,
చాండాలీ రాక్షసీద్రావైర్ద్వియామాంతం చ గోళకమ్. 177
శుష్కం బధ్వా పుటేచ్ఛాహః కరీషాగ్నౌ మహాపుటే,
మాషమాత్రం లిహేత్క్షౌద్రై ర్మూత్రకృఛ్రం ప్రశాంతయే.
జయంతీంవాజయాం శ్లేష్మకృఛ్రిప త్తండులోదకైః,
(మాధవనిదానే)

తా.రసభస్మము, స్వర్ణభస్మము, వైక్రాంతభస్మము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి వీని బలురక్కసిగడ్డ అనుపానిరసములతో రెండుయామములు మర్దించి యుంటజేసి నీడ నెండించి దానిని మూసలో నునిచి చీలమన్ను లేపనము చేసి ఏఱు పిడకలతో నొకదినము పెద్దపుటంబిడి మాషప్రమాణమును తేనెతో సేవించిన మూత్ర కృఛ్రము, లేక తక్కలివేరునుగాని, కరక్కాయనుగాని బియ్యపుకడుగుతో నూరి ఈయనుపానముతోడ సేవించిన శ్లేష్మమూత్రకృఛ్రము హరించును.

### శుక్లమూత్రకృఛ్రమునకు చికిత్స

రసః పాషాణభేదీచ రజనీ గుడకాంజికైః. 179
అన్నైవానుపానేన మూత్రాఘాతాశ్మరీ ప్రణుత్,

తా. ఉత్తరోత్తరజెప్పంబడు పాషాణభేది యనురసమును పసపుచూర్ణము, బెల్లము, కలి అనుపానియనుపానముతోడ సేవించిన మూత్రఘాతము, శుక్లాశ్మరి హరించును.

### మూత్రకృఛ్రమునకు తిలాదిక్షారము

తిలాపామార్గ కదళి పాలాశ యవసంభవః. 180
దగ్ధ్వా తద్భస్మ చాదాయ వస్త్రఘాతజలైః కురు,
జలే శుష్కేతు తత్క్షారం ద్వినిష్కం మూత్రకృఛ్రనుత్. 181
(ఆయుర్వేదే)

తా. నువ్వులదంటు, ఉత్తరేణు, అరటి, మోదుగ, యవలదంటు - వీనిని సమభాగములుగ గాల్చి బూడిదజేసి నీళ్ళలో గలిపి వస్త్రగాలితము చేసి నీరుగురువర కెండించి

యందు రెండునిష్కములయెత్తును పాచినీళ్ళతో సేవించిన వాతకుండలి మూత్రకృఛ్రము హరించును.

సన్నిపాతమూత్రమునకు ద్రాక్షాదికషాయము

ద్రాక్షా శఠీ బలా యష్టీ క్వాథం చందనసంయుతం,
వైక్రాంతభస్మ సంపీత్వా కృఛ్రంహంతి త్రిదోషజమ్. 182

తా. ద్రాక్షపండు, నల్లయతివస, ముత్తవపులగము, యష్టిమధుకము, శ్రీగంధము- వీనిని సమభాగములుగ కషాయము గాచి యందు వైక్రాంతభస్మము గలిపి సేవించిన సన్నిపాతమూత్రకృఛ్రము హరించును. (మూత్రకృఛ్రమునుహరించుటకై పైఁజెప్పబడిన చంద్రకళారసమును సగా సేవింపదగును.)

మూత్రకృఛ్రములయందు పథ్యము

పటోలం మత్స్యాక్షీ దధి మధుర బింబీఫలగుడం
కుమారీ కూశ్మాండం త్రపుసమథవోర్వారుకఫలం
సితా రంభాపుష్పం ఘృతపనసధాత్రీద్రుమఫలం
సముద్గాజీవంతీహిమ మఖిలకృఛ్రేషు విహితమ్. (మాధవనిదానే)

తా. పొట్లకాయ, పొన్నగంటికూర, ఆవు పెరుగు, మధురపదార్థములు, దొండకాయ, బెల్లము, కలబంధ, ముదురుగుమ్మడుకాయ, ములుదోస, నక్కదోసకాయ, పంచదార, అరటిపువ్వు, నెయ్యి, పనసపండు, ఉసిరికకాయ పెసలు, పాలకూర, శీతోదకము ఇవి సర్వమూత్రకృఛ్రములయందు పథ్యకరంబులు.

మూత్రకృఛ్రములయం దపథ్యము

తిల సర్షప పిణ్యాకం సతైలం బృహతీద్వయం.
అత్యుష్ణం హింగు లవణ మాతపం మత్స్యసూరణమ్. 184
ఆమ్లం మద్యవిదాహ్యన్నం కరీరం మిసిమాషకం,
పునర్నవం సతాంబూలం కృఛ్రే వింశతిశత్రవః. 185

తా. నువ్వులు, ఆవాలు, తెలికపిండి, నూనె, చిన్నములక, పెద్దములక, అత్యుష్ణకరపదార్థములు, ఇంగువ, ఉప్పు, ఎండ, మత్స్యములు, కందగడ్డ, పులుసు, మద్యము, విదాహకరమైన యన్నము, వెదురుమొలక, సదాప, ఉద్దులు, గలిజేరు, తాంబూలము అను నీయిరువదియు మూత్రకృఛ్రములయం దపథ్యకరంబులు.

మూత్రాఘాతనిదానము

జాయంతే కుపితై ర్దోషై ర్మూత్రాఘాతా స్త్రయోదశ,

ప్రాయో మూత్రవిఘాతాద్యై ర్వాతకుండలికాదయః. 186
(ఆయుర్వేదే)

తా. మూత్ర, పురీష, శుక్రాదివేగముల నడ్డగించుట, రూక్షాన్నాదుల భుజించుట-వీనివలన వాతాదిదోషములు ప్రకోపించి వాతకుండలికాది పదమూడువిధములైన మూత్రాఘాతముల గలుగంజేయును.

**వాతకుండలికాలక్షణము**

రౌక్ష్యా ద్వేగవిఘాతాద్వా వాయుర్వస్తౌ సవేదనః,
మూత్ర మావిశ్య చరతి విగుణః కుండలీకృతః. 187
మూత్రమల్పాల్పమథవా సరుజం సంప్రవర్తతే,
వాతకుండలికాం తాం తు వ్యాధిం విద్యాత్సుదారుణమ్. 188

తా. రూక్షకరపదార్థముల సేవించుటవలనగాని, లేక మల మూత్ర శుక్ర వేగముల నడ్డగించుటవలనగాని, వాతము ప్రకోపించి వస్తిగతంబై వేదనను గలుగంజేయుచు మూత్రమును ప్రతిబంధించి వ్యత్యస్తముగలదై కుండలాకారముగ దిరుగుచు మూత్రము కొంచెకొంచెముగ చురుకుయుక్తముగ వెడలింపంజేయునది వాతకుండలీమూత్రాఘాతమని తెలియవలయును. ఇది భయంకరమైనది.

**అష్ఠీలాలక్షణము**

ఆధ్మాపయన్ వస్తి గుదం రుద్ధ్వా వాయుశ్చలోన్నతాం,
కుర్యాత్తీవ్రార్తిమష్ఠీలాం మూత్రమార్గావరోధినీమ్. 189

తా. వాతము పొత్తికడుపు నుబ్బింపంజేసి గుదము నడ్డగించి చంచలముగ, ఉన్నతముగనుండు అష్ఠీలమును గలుగంజేసి మూత్రమార్గము నడ్డగించిన వాతాష్ఠీలయని తెలియవలయును.

**వాతవస్తిలక్షణము**

వేగం విధారయేద్యస్తు మూర్ఖస్సాన్య ద్వ్యాకులోనరః,
నిరుణద్ధి ముఖం తస్య వస్తేర్వస్తిగతోఽనిలః. 190
మూత్రసంగో భవేత్తేన వస్తి కుక్షీ నిపీడితః,
వాతవస్తి స్సవిజ్ఞేయో వ్యాధిః కృచ్ఛ్రప్రసాధనః. (నిత్యనాథీయే)

తా. మూర్ఖుండైనమనుజుండు మూత్రమును బంధించుటవలన పొత్తికడుపునందలివాతము వస్తిముఖమును నడ్డగించి మూత్రమును ప్రతిబంధించి వస్తి, కుక్షి అనువానియందు పీడను గలుగంజేయుచుండిన వాతవస్తియని తెలియవలయును. ఇదికష్టసాధ్యము.

## మూత్రాతీతలక్షణము

చిరం దారయతో మూత్రం త్వరయా నప్రవర్తతే,
మేహమానస్య మందంవా మూత్రాతీతస్స ఉచ్యతే. 19?

తా. దీర్ఘకాలమువఱకు మూత్రమును బంధించి యుంచుటవలన శీఘ్రముగ వె[illegible]
లక మెల్లమెల్లగ వెడలిన మూత్రాతీతమని తెలియవలయును.

## మూత్రజఠరలక్షణము

మూత్రస్య వేగేఽభిహతే తదుదావర్తహేతుకః,
అపానః కుపితో వాయు రుదరం పూరయేద్భృశమ్. 19?
నాభేరథస్తాదాధ్మానం జనయే త్తీవ్రవేదనం,
తన్మూత్రజఠరం విద్యా దధోవస్తినిరోధజమ్ 19

తా. మూత్రవేగము నడ్డగించుటవలన ఉదావర్తరోగమునకు కారణభూతమైన
యపానవాతము ప్రకోపించి మిక్కుటముగ కడుపుబ్బరమును, బొడ్డుక్రింద ఆధ్మానమున
గలుగంజేయుట, మిక్కుటముగ వేదనను గలుగంజేయుట, అధోవస్తివేగము నడ్డగించుట
ఈలక్షణములు గలది మూత్రజఠర మని తెలియవలయును.

## మూత్రోత్సంగలక్షణము

వస్తావాప్యథవా నాళే మణౌవా యస్య దేహినః,
మూత్రంప్రవృత్తం సజ్జేత సరక్తంవా ప్రవాహతః. 19?
స్రవేచ్ఛనైరల్పమల్పం సరుజంవాథ నీరుజమ్,
విగుణానిలజో వ్యాధి స్సమూత్రోత్సంగసంజ్ఞితః. (మాధవకల్పే

తా. దుష్టమైనవాతము వెడలినమూత్రమును వస్తిమధ్యమునందు గాని, లే[illegible]
మేఢ్రమునందుగాని, లేక మేఢ్రముయొక్క యగ్రభాగమునందుగాని జేర్చుటచే ముక్కి
ముక్కి బలాత్కారముమీద మూత్రమును వెడలింపంజేయుటవలన వాతము వస్తి[illegible]
జనించి మెల్లమెల్లగ, కొంచెకొంచెముగ, * దాహయుక్తముగ, లేక దాహవిహీనముగ
రక్తమును స్రవింపంజేసిన మూత్రోత్సంగమని తెలియవలయును.

## మూత్రక్షయలక్షణము

రూక్షస్యక్లాంతదేహస్య వస్తిగౌ పిత్తమారుతౌ,
మూత్రక్షయం సరుగ్దాహం జనయేతాం తదాహ్వయమ్, 19?

* దాహ మన చురుకు.

తా. రూక్ష మలినదేహముకల పురుషునియొక్క వస్తియందుండు వాతపిత్తముల వలని మూత్రము క్షయించి చురుకు మంటల గలుగంజేయుచుండిన మూత్రక్షయ మని తెలియవలయును.

మూత్రగ్రంథిలక్షణము

అంతర్వస్తిముఖే వృత్తః స్థిరోఽల్ప స్సహసా భవేత్,
అశ్మరీతుల్యరుగ్గంథి ర్మూత్రగ్రంథి స్స ఉచ్యతే. 198

తా. వస్తియొక్క ముఖమునందు గుండ్రముగ, స్థిరముగ, చిన్నదిగ నుండుగ్రంథి యకస్మాత్తుగ జనించి అశ్మరితో తుల్యమైన పీడను గలుగం జేయుచుండిన మూత్రగ్రంథి యని తెలియవలయును.

మూత్రశుక్రలక్షణము

మూత్రితస్య స్త్రియం యాతో వాయునా శుక్రముద్ధతం,
స్థానాచ్యుతం మూత్రయతః ప్రాక్పశ్చాద్వా ప్రవర్తతే. 199
భస్మోదకప్రతీకాశం మూత్రశుక్రం తదుచ్యతే, (మాధవనిదానే)

తా. మూత్రము వచ్చినపుడు దానిని విసర్జింపక స్త్రీసంగమము సేయుటవలన వాతము శుక్రము నెగరగొట్టి స్థానభ్రష్టముజేసి మూత్రము వెళలునపుడు తొలుత గాని, లేక కడపట గాని, నీళ్ళలో భస్మము గలపఁబడినచందంబున వెడలింపంజేసిన మూత్ర శుక్ర మని తెలియవలయును.

ఉష్ణవాతలక్షణము

వ్యాయామాధ్వాతపైః పిత్తం వస్తిం ప్రాప్యానిలాయుతమ్. 200
వస్తిం మేఢ్రం గుదంచైవ ప్రదహేత్స్రావయేదధః,
మూత్రం హారిద్రమథవా సరక్తం రక్తమేవ వా. 201
కృచ్ఛాత్పునః పునర్జంతో రుష్ణవాతం వదంతి తం,

తా. మిక్కుటముగ వ్యాయామము సేయుట, మార్గమునడుచుట, ఎండలోసంచ రించుట - ఈకారణములవలన పిత్తము ప్రకోపించి వస్తిగతంబై వాతముతోడం గలసి వస్తి, మేఢ్రం, గుదములయందు మంటను గలుగంజేయుచు కష్టముమీఁద మూత్రమును పలుమారు పచ్చగ, లేక రక్తయుక్తముగ, లేక ఎఱ్ఱగ వెడలింపంజేసిన ఉష్ణవాత మని తెలియవలయును.

మూత్రసాదలక్షణము

పిత్తం కఫోవా ద్వావాపి సంహన్యేతేఽనిలేన చేత్. 202

కృచ్ఛాన్మూత్రం తదా పీతం రక్తం శ్వేతం ఘనం సృజేత్,
సదాహం రోచనా శంఖచూర్ణవర్ణం భవేత్తు తమ్. 204
శుష్కం సమస్తవర్ణంవా మూత్రసాదం వదంతి తం,

తా. వాతము పిత్తమునుగాని, లేక కఫమునుగాని, లేక పిత్తకఫముల రెంటినిగాని గట్టిగ జేయుటవలనమూత్రము శుష్కించి స్వల్పమై పసపుగ, లేక ఎఱ్ఱగ, లేక తెలుపుగ, కష్టముమీద వెడలుట, మూత్రమును విడుచునపుడు మండుట, మూత్రము భూమిపై బడి యెండిన గోరోచనము, శంఖచూర్ణము అనువానివర్ణముతో సమానముగగాని, లేక సర్వ వర్ణములుగలదిగగాని యుండుట-ఈలక్షణములుగలది మూత్రసాదమని తెలియవలయును.

## విడ్విఘాతలక్షణము

రూక్ష దుర్బలయో ర్వాతే నోదావర్తం శకృద్యదా.
మూత్రస్రోతోఽనుపద్యేత విడ్విసృష్టం తదా నరః,
విడ్గంధం మూత్రయేత్కృచ్ఛ్రా ద్విడ్విఘాతం వినిర్దిశేత్. 205

తా. రూక్ష, దౌర్బల్యము గల పురుషునియొక్క వాతమలముల నూర్ధ్వముఖంబుగ జేసి మూత్రవాహినులగు నాడులం జెందించి మూత్రమార్గమువలన మలముయొక్క వాసనగలమూత్రమును కడుకష్టముమీఁద వెడలింపంజేసిన విడ్విఘాతమని తెలియ వలయును.

## వస్తికుండలలక్షణము

ద్రుతాధ్వలంఘనాయాసై రభిఘాతాత్ప్రపీడనాత్,
స్వస్థానాద్వస్తిరుద్వృత్త స్థూలస్తిష్ఠతి గర్భవత్. 206
శూలస్పందనదాహార్తో బిందుబిందుం స్రవత్యపి,
పీడితస్తు సృజేద్ధారాం సంరంభోద్వేష్టనార్తిమాన్. 207
వస్తికుండలమాహుస్తం ఘోరం శస్త్రవిషోపమం,
పవనః ప్రబలం ప్రాయో దుర్నివార మబుద్ధిభిః. 208
తస్మిన్ పిత్తాన్వితే దాహ శ్శూలం మూత్రవివర్ణతా,
శ్లేష్మణా గౌరవం శోఫ స్స్నిగ్ధం మూత్రం ఘనం సితమ్. 209
శ్లేష్మరుద్ధబిలో వస్తిః పిత్తోదీర్ణేన సిధ్యతి,
అవిశాంతబిలస్సాధ్యో న చ యః కుండలీకృతః. 210
స్యాద్వస్తౌ కుండలీభూతే తృణ్మోహశ్శ్వాస ఏవచ, (ఆయుర్వేదే)

తా. శీఘ్రముగ మార్గమున నడుచుట, దుముకుట, ఆయాసముజెందుట, ఱాయి, కట్టె అనువానివలన ఘాతంజెందుట, పిసుకుట - ఈకారణములవలన వస్తిస్వస్థానమును విడనాడి పొరలి యుబ్బి గర్భమువలె కఠినమైనశూల, కంపనము, తాపము అనువానితోడంగూడి యొక్కొకబొట్టుగ మూత్రమువెడలుట, వస్తిని బలాత్కారముగ పిసుకుటవలన మూత్రధార పెద్దదిగ వెడలుట, వస్తియందు తొందరగలుగుట, పొర్లాడుట, పీడగలుగుట - ఈలక్షణములుగలది వస్తికుండలమూత్రాఘాతమని తెలియవలయు. ఇదిశస్త్రవిషతుల్యంబై భయంకరముగనుండును. ఇందు వాతము తఱుచుగ ప్రబలంబై యుండును. దానంజేసి మందబుద్ధిగలవైద్యుఁడు దీని నివారింపంజేయుట కసమర్థుండుగ నుండును. మఱియు దీనియం దన్యదోషసంబంధమువలన గలుగు లక్షణంబు లెవ్వి యనిన—పిత్తయుక్తంబున దాహము, శూల, మూత్రవివర్ణత గలుగును. కఫయుక్తంబున జడత్వము, వాపు గలిగి మూత్రము దట్టముగ, గట్టిగ, తెల్లగ వెడలును. వస్తిముఖమును కఫము నడ్డగించి పిత్తోద్రేకముగనుండిన అసాధ్యంబనియు, వస్తిముఖము నడ్డగింపఁబడక కుండలీకృతము గాకయుండిన సాధ్యంబనియు, వస్తికుండలీభూతమై దప్పి, మోహము, శ్వాసము అనువానితోఁ గూఁడియుండిన అసాధ్యం బనియు తెలియవలయును.

### మూత్రాఘాతమునకు ముస్తాదిచూర్ణము

సదాభద్రాశ్మభిస్తాలం శతావర్యాశ్చ చిత్రకమ్. 211
రోహిణీ కోకిలాక్షౌచ క్రౌంచస్తాలత్రికంటకం,
శ్లక్ష్ణం పిష్ట్వా సురాపీతం మూత్రాఘాతనిషూదనమ్. 212
(చికిత్సాసారసంగ్రహే)

తా. తుంగగడ్డలు, కొండపిండివేళ్లు, చల్లపిల్లిగడ్డలు, చిత్రమూలము, కటుకరోహిణి, నీరుగొబ్బివిత్తులు, తామరవిత్తులు, సన్నపల్లేరుకాయలు - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి యందొకతులమును మద్యముతో గలిపి సేవించిన మూత్రాఘాతము నశించును.

### మూత్రాఘాతమునకు క్షీరయోగము

శృతశీతం పయోమాంసీ చందనం తండులాంబునా,
పిబేత్సశర్కరం శ్రేష్ఠ ముష్ణవాతే సశోణితే. 213

తా. ఆవుపాలను జక్కగ కాచి చల్లార్చి యందు జటామాంసిచూర్ణము, శ్రీగం

ధపుచూర్ణము, బియ్యపుకడుగు, పంచదార-వీనిని తగుమాత్రముగ గలిపి పుచ్చుకొనిన నుష్ణ వాతముచే జనించిన రక్తయుక్తమూత్రాఘాతము హరించును.

త్రికంటకైరండశతావరీభి స్సిద్ధం పయో వాతమయే సశూలే,
గుడప్రగాఢంసఘృతంపయోవా రోగేషు కృఛ్రాదిషుశస్తమేతత్.

తా. సన్నపల్లేరుకాయలు, ఆముదపువేళ్లు, చల్లపిల్లిగడ్డలు - వీనిని సమభాగము లుగదంచి కషాయముగాచి త్రాగిన వాతముచే జనించి పొట్టతోగూడియుండెడి మూత్రా ఘాతము నశించును. మఱియు పాలలో బెల్లము, నెయ్యి, కలిపి త్రాగిన మూత్ర కృఛ్రము లన్నియు నశించును.

### *అశ్మరీరోగభేదములు

వాతపిత్తకఫై స్తిస్ర శ్చతుర్థీ శుక్రజా మతా,
ప్రాయశ్శ్లేష్మాశ్రయాస్సర్వా హ్యశ్మర్యస్సర్వమోపమాః. 21[illegible]

(మాధవనిదానే)

తా. వాతాశ్మరి, పిత్తాశ్మరి, శ్లేష్మాశ్మరి, శుక్లాశ్మరి అన అశ్మరీరోగములు నాలుగ విధములు. ఈనాలుగును తఱుచుగ శ్లేష్మాశ్రితంబులై మృత్యుతుల్యంబులుగ నుండును.

### అశ్మరీసామాన్యలక్షణము

సామాన్యలింగం రుజ్నాభిసేవనీ వస్తి మూర్ధసు,
విశీర్ణధారం మూత్రంస్యా త్తయామార్గనిరోధనే. 21[illegible]
తద్వ్యపాయాత్సుఖం మేహే దచ్ఛం గోమేధకోపమం,
తత్సంక్షోభాత్క్షతేసాస్ర మాయాసాచ్చాతిరుగ్భవేత్. 21[illegible]

తా. నాభి, అస్థిసంధులు, వస్తియొక్క-అగ్రము అనువానియందు శూల గల గుట, అశ్మరీసంబంధమువలన మూత్రద్వారము నిరోధింపఁబడి ఛిన్నాభిన్నములు మూత్రము వెడలుట, అశ్మరి వెడలినపిదప మూత్రము కష్టములేక స్వచ్ఛముగ, గోమే ధకమణి వర్ణతుల్యముగ వెడలుట, అశ్మరీసంబంధమువలన వస్తియందు గాయము గలిగిన మూత్రము రక్తమిశ్రితముగ వెడలుట, బలాత్కారముగ మూత్రము

* అశ్మరి యన మూత్ర, శుక్రములు ఘనీభవింప ఱాయివలె నగుటయు, ఏరోగ మునం దిట్టిఱాయి మూత్రద్వారము నిరోధించి కడుకష్టముమీఁద మూత్రమును వె డలింపం జేసెడినో అది యశ్మరీరోగ మనంబడును.

విడుచుటవలన క్లేశము, పీడ గలుగుట - ఇవియు అశ్మరీరోగములయందు సామాన్య లక్షణంబులు.

## వాతాశ్మరీలక్షణము

తత్ర వాతాద్భృశార్త్యార్తో దంతాన్ ఖాదతి వేపతే,
మృద్నాతి మేహనం నాభిం పీడయత్యనిశం క్వణన్. 218
సానిలం ముంచతి శకృన్ముహుర్మేహతి బిందుశః,
శ్యావారూక్షాశ్మరీచాస్య స్యాచ్చితా కంటకైరివ. (ఆయుర్వేదే)

తా. కడు పీడగలుగుట, దంతముల కటకటగొరుకుట, వణకుట, మేహనము పిసికికొనుట, బొడ్డును గోకుట, దుఃఖమువలన, ఎల్లప్పుడు బొబ్బరిడుట, మూత్రమును విడుచునప్పుడు వాతముతోడ మలోత్సర్జనముజేయుట, బొట్లుబొట్లుగ మూత్రమును విడుచుట, అశ్మరి నీలవర్ణముగ, రూక్షముగ, ముండ్లుగలదిగ నుండుట - ఈలక్షణములుగలది వాతాశ్మరి యని తెలియవలయును.

## పిత్తాశ్మరీలక్షణము

పిత్తేన దహ్యతే వస్తిః పచ్యమానఇవోష్మవాన్,
భల్లాతకాస్థిసంస్థానా రక్తా పీతా సితాశ్మరీ. 220

తా. పొత్తికడుపుసెగ మండుట, క్షారమువలన కాల్పబడినటుల తాపము గలుగుట, పొత్తికడుపుపై హస్తమునుంచిన వేడిగనుండుట, అశ్మరి జీడిగింజవలెనుండినదై యెఱ్ఱగగాని, లేక పసపువర్ణముగగాని, నల్లగగానియుండుట-ఈలక్షణములుగలవి పైత్యాశ్మరి యని తెలియవలయును.

## శ్లేష్మాశ్మరీలక్షణము

వస్తిర్నిస్తుద్యతఇవ శ్లేష్మణా శీతలాగురుః,
అశ్మరీ మహతీ శ్లక్ష్ణా మధువర్ణాథవాసితా. 221

తా. పొత్తికడుపు పొడవబడినటుల నుండుట శీతలముగ, జడముగ నుండుట, అశ్మరి పెద్దదిగ నునుపుగలదిగ తేనెవర్ణముగలదిగ, లేక తెల్లగ నుండుట - ఈలక్షణములు గలది శ్లేష్మాశ్మరి యని తెలియవలయును.

ఏతాభవంతి బాలానాం తేషామపి చ భూయసా,
ఆశ్రయోపచయాల్పత్వా ద్గ్రహణాహరణే సుఖాః. 222

తా. బాలురు గురుత్వము, మధురము, శీతలము, స్నిగ్ధము గలయాహారముల భుజించుటవలన వాత, పిత్త, శ్లేష్మాద్యశ్మరులు తఱుచుగ బాలురకును జనించుట గలదు.

ఐనను వారలయొక్క వస్తి చిన్నదిగ, వృద్ధిజెందనిదిగ నుండుటవలన దానిని బట్టికొని ఈడ్చిదీయుటకు సులభసాధ్యంబుగ నుండును.

### శుక్రాశ్మరీలక్షణము

శుక్లాశ్మరీతు మహతాం జాయతే శుక్రధారణాత్,
స్థానాచ్చ్యుతమముక్తంహి ముష్కయోరంతరేఽనిలః. 223
శోషయత్యుపసంహృత్య శుక్రం తచ్ఛుష్కమశ్మరీ,
వస్తిరుక్కృచ్ఛ్రమూత్రత్వ ముష్కశ్వయథుకారిణీ. 224
తస్యాముత్పన్నమాత్రాయాం శుక్రమేతి విలీయతే,
పీడితే త్వవకాశేఽస్మి న్నశ్మర్యేవచ శర్కరా. 225

తా. యౌవనానంతరము శుక్రధారణమువలన శుక్రము ఘనీభవించి మైథున కాలమునందు స్వస్థానమునుండి వెడలి పూర్తిగ మైథునము సేయబడకుండుటచే విసర్జనము గాక శిశ్న, వృషణములయందు వాతముచే జేర్పఁబడి శోషింపంజేసి శుక్రాశ్మరిగనై దానిసంబంధమువలన వస్తియందు శూల, మూత్రకృఛ్రము, వృషణములయందు వాపుగలిగి ఆవాపు గలిగిన తత్ క్షణముననే శుక్రము వెడలుట, మేఢ్ర వృషణమధ్యము లయం దదిమిన పలచనగుట - ఈలక్షణములు గలది శుక్రాశ్మరి యని తెలియవలయును. ఇదియే సికతాశ్మరిగ, శర్కరాశ్మరిగ నగుచున్నదని నిశ్చయింపవలసియున్నయది. శర్కర, సికత అను నీరెండశ్మరులయందు భేదంబు గలదు. ఎట్లనిన-శర్కరాశ్మరి లావుగనుండును, సికతాశ్మరి సన్నగ నుండును.

### అశ్మరీమారకోపద్రవములు

*మూత్రరోధ స్తృషా ఛర్ది పాండు ర్హృత్పీడతా క్లమః,
అశ్మరీ మారయత్యాశు సికతా శర్కరాన్వితా. 226

తా. మూత్రము వెడలకుండుట, దప్పి, వాంతి గలుగుట, శరీరము పాండుర వర్ణముగ నుండుట, ఱొమ్ములో మండుట, బడలిక గలుగుట - ఈలక్షణములతో గూడియుండు శర్కరాశ్మరి, సికతాశ్మరి రోగిని శీఘ్రముగ మృత్యువుపాలు గావించును.

మిశ్రేణ వాతపిత్తస్య గంధకృచ్ఛ్రజ్వరారుచి. 227

* త్రిశూలనాభివృషణం బద్ధమూత్రం రుజాన్వితమ్, అశ్మరీక్షపయత్యాశు శర్కరాసికతాన్వితా. అనియు పాఠాంతరము కలదు. వృషణములు వాచుట, మూత్రము వెడలకుండుటచే వేదన గలుగుట.

తా. వాతపిత్త, పిత్తశ్లేష, శ్లేష్మవాత, అశ్మరీరోగములలో మూత్రము దుర్గంధముగ వెడలుట, మేహోపద్రవములు, జ్వరము, అరుచి గలిగియుండుట - ఈలక్షణములుగల అశ్మరీరోగములు అసాధ్యంబు లని తెలియవలయును.

అశ్మర్యామతిరోధాయాం దారావస్త్ర్యాదికేషుచ,
ఆమయేషు యథాదోష మిమమేవోపచారయేత్. 228

(మాధవనిదానే)

తా. వాతాద్యశ్మరులయందు మూత్రధార, వస్తి మొదలుగునవి అడ్డగింపఁబడకుండినను, లేక వాతాదిదోషములు దుష్టంబులు గాకుండినను సాధ్యమని యెఱింగి చికిత్సింపవలయును. దారుణముగానుండు అశ్మరీరోగములు దినదినే వృద్ధిం బొందుచుండును. అశ్మరీరోగములు అసాధ్యంబులు.

అశ్మరికి పాషాణభేదరసము

శుద్ధసూతం ద్విధాగంధం శిఖితుత్థం రసోపమమ్,
శ్వేతా పునర్నవావాసా గిరికర్ణీరసోద్భవైః. 229
ప్రతిద్రావై స్త్ర్యహం మర్ద్యం శుష్కం తచ్చారుసంపుటే,
స్వేదయే ద్వాలుకాయంత్రే దినైకం తం విచూర్ణయేత్. 230
రసఃపాషాణభిన్నాను ద్విగుంజో హ్యశ్మరీహరః,
గోపాల కర్కటీ దుగ్ధం భూధాత్రీఫలపేషితమ్. 231
కులుత్థక్వాథ సంపీత మనుపానం ప్రశస్యతే,
సఘృతైరోత్కురక్వాథం రాత్రౌ తైలేన లేహయేత్. 232

(మాధవనిదానే)

తా. శుద్ధిచేసినరసము ౧ భాగము, శుద్ధిజేసిన ఆమ్లశిలగంధకము ౨ భాగములు, శుద్ధిజేసినమైలుతుత్తము ౧ భాగము - ఇటుల వీనిని ఖల్వములో నునిచి తెల్లగలిజేరువేళ్ళు, అడ్డసరపాకు, గంటెన అనువానిరసములలో ప్రతిదానిచే మూఁడేసిదినములు మర్దించి నీడ నెండించి గాజుకుప్పెలో నునిచి వాలుకాయంత్రమున నొకదినము మందాగ్నిలోవండి స్వాంగశీతలమునదీసి చూర్ణముజేసి రెండుగురిగింజలయెత్తుదు బుడమదోస, నేలయుసిరికవేరు అనువానిని పాలతోనూరి యీ యనుపానముతోగాని, లేక ఉలవకషాయానుపానములోగాని, లేక పల్లేరుకషాయములో నెయ్యి గలిపిగాని సేవించిన అశ్మరీరోగములు హరించును. రాత్రియందైనయెడల పల్లేరుకషాయములో తెల్లఆవనూనె ఔషధము గలిపి సేవింపవలయును.

## అశ్మరీరోగమున శిలాదిచూర్ణము

శిలాజతు తథా ద్రాక్షా దంతిపాషాణభేదకం,
నీశావహ్న్యభయం తుల్యం మాషైకం చాశ్మరీహరమ్. 233
బాలానా మర్ధమాషంచ హ్యనుపానమిదం భవేత్,
తిలకాండస్య వై భస్మ క్షీవే న్నిష్కద్వయం పిబేత్. 234

తా. శుద్ధిజేసిన కర్పూరశిలాజిత్తు, ద్రాక్షపండ్లు, నేలదంతివిత్తులు, కొండపిండివేరు, పచ్చిపసపు, చిత్రమూలము, కరక్కాయ-వీనిని సమభాగములుగా దంచి చూర్ణము జేసి యౌవనముగలవారు మాషమెత్తును, బాలు రర్ధమాషమెత్తును, రెండు నిష్కములయెత్తు నువ్వులక్షారానుపానముతోగాని (లేక లేమిడిచెక్కరసము, వారకొమ్ము చెక్కరసము, పిప్పలి, మోడి అనువానియనుపానముతోడగాని) సేవించిన అశ్మరి హరించును.

సీ. వెన్నయు ములుదోసవిత్తులు వంగభస్మము:గూర్చిసేవింపమానునొకటి
పంచదారయు హంసపాదియాకును జీలకట్టు త్రపుభస్మంబుజుట్టు నొకటి
రామపురీశర్కరయసు గుండు త్తరేణువు వంగభస్మము నూ రియొకటి
ఖండశర్కర నాకుదొండయు నలజీలకట్టువంగంబుతోఁ గలయ నొకటి
గీ. వెలయు శీతాంబుచిఱుబొద్దివేళ్ళరసము
వంగభస్మంబు సేవింప వరుస నొకటి
రూఢికెక్కిన యశ్మరీరోగతతులు
పథ్యముగ నున్న మానును తథ్యముగను.

## పాషాణవజ్రరసము

శుద్ధసూతం ద్విథా గంధం ద్రవై శ్శ్వేతపునర్నవైః,
మర్దయిత్వా దినం ఖల్వే రుధ్వా తం భూధరే పచేత్. 235
దినాంతే తత్సముద్ధృత్య చూర్ణయే దితిచిక్కణం,
పాషాణభేదసంయుక్తం చూర్ణతుల్యం ద్విమాషకమ్. 236
భక్షయే దశ్మరీం హంతి రసః పాషాణవజ్రకః,
గోపాలకర్కటీ మూల క్వాథం మధుయుతం పిబేత్. 237
గోకంటకశుభా భద్రా మూలక్వాథం పిబేన్నిశి, (నిత్యనాథీయే)

తా. శుద్ధిజేసినరసము ౧ భాగము, శుద్ధిజేసినగంధకము ౨ భాగములు - ఈరెంటిని ఖల్వములో నునిచి తెల్లగలిజేరువేరురసముతో నొకదినము మర్దించి కుప్పెలో

నునిచి భూధరయంత్రమునం దిడి దానిమూతినిమూసి ఒకదినము పుటంబిడి సాంగశీతల మున దీసి సూక్ష్మముగ చూర్ణముజేసి దానికి సమముగ కొండపిండివేళ్ళచూర్ణము గలిపి రెండుమాషములయెత్తును పగటియందు బుడమవేరుకషాయములో తేనెగలిపి యీయను పానముతోడను, రాత్రులయందు పల్లేరుకాయ, వెనురుప్ప, భద్రముస్తెలు అనువాని కషాయానుపానముతోడను నాలుగుమాసములు సేవించిన నాలుగువిధములైన అశ్మరీ రోగములు హరించును.

## శుక్లాశ్మరీచికిత్స

యేలా హింగుయుతం క్షీరం సర్పిర్మిశ్రం పిబేన్నరః. 233
మూత్రదోషవిశుద్ధ్యర్థం శుక్లాశ్మరీ హరంపరమ్, (మతాంతరే)

తా. ఆవుపాలలో ఏలకులు, ఇంగువ, నెయ్యి కలిపి త్రాగిన మూత్రదోషము, శుక్లాశ్మరి హరించును.

## శుక్లాశ్మరికి శ్వదంష్ట్రాదియోగము

శ్వదంష్ట్రా మాతులుంగాగ్ని శోభాంజన కరంజకమ్. 239
శుక్లాశ్మరీహరం శ్రేష్ఠం మూత్రకృఛ్రహరం పరమ్,

తా. ఏనుగుపల్లేరు, మాదీఫలము, చిత్రమూలము, కారుమునగ, కానుగ-వీనిని సమభాగములుగా నుదకముతోనూరి సేవించిన శుక్లాశ్మరి, మూత్రకృఛ్రము హరించును.

## శర్కరాశ్మరీచికిత్స

సింధువారనిశాదార్వీ దారయే న్మేఢ్రశర్కరాః. 240
నారికేళాంబునాపీతం తయోఃకల్కంచ తద్గుణమ్,
క్వాథో వరుణమూలస్య తత్కల్కేన చ సంయుతః. 241
పీతో నివారయే త్సద్య శ్శర్కరాశ్మరికామపి, (సిద్ధరసార్ణవే)

తా. వావిలి, పసపు, మ్రానిపసపు-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి సేవించి నను, లేక ఆచూర్ణమును టెంకాయనీళ్ళతోనూరి కల్కముజేసి త్రాగినను, లేక పైచూర్ణ మును కల్కముజేసి ఉలిమిడివేళ్ళకషాయముతో జేర్చి త్రాగినను శర్కరాశ్మరి, మూత్ర కృఛ్రము తత్క్షణమున హరించును.

రసోమృగాక్షీ పత్రోత్థో నిశా తీక్ష్ణరజోన్వితః. 242
ప్రతీతః ప్రాతయత్యాశు దుస్తరాం శర్కరాశ్మరీం,

తా. పాపరాకురసములో పసపు, మండూరము గలిపి త్రాగిన ప్రబలమైన శర్కరాశ్మరి శీఘ్రముగ హరించును.

శర్కరాశ్మరికి తిలాదిక్షారము

తిలాపామార్గకదళీ పాలాశయవసంభవః. 243
క్షారః పేయో విమూత్రేణ శర్కరాస్వశ్మరీషుచ,

తా. నువ్వులదంటు, ఉత్తరేణి, అరటి, మోదుగు, యవలదంటు - వీనిని సమభాగములుగ గాల్చి క్షారము జేసి గొఱ్ఱెమూత్రముతో సేవించిన శర్కరాశ్మరి హరించును.

అశ్మరికి విషాదివటికములు

విషం పాషాణభేదశ్చ క్షారస్సింధూత్థగోజలమ్. 244
వటీః కృత్వాశ్మరీ హంతి సప్తరాత్రం పిబేదను,
జయంత్యావా జయాయావా తండులోదకపానతః 245
అశ్మరీం హంతి నోచిత్రం మూత్రకృచ్ఛ్రం మహాద్భుతమ్,

తా. అతివస, కొమ్మనపిండివేళ్ళు, యవక్షారము, సైంధవలవణము - వీనిని సమభాగములుగ గోమూత్రముతో నూరి మాత్రలుజేసి తక్కలివేరునుగాని, లేక కరక్కాయనుగాని బియ్యపుకడుగుతో నూరి యీయనుపానముతోడ నేడుదినములు సేవించిన అశ్మరి, మూత్రకృచ్ఛ్రము హరించును.

అశ్మరికి త్రివిక్రమరసము

తామ్రభస్మత్వజాక్షీరే పాచ్యం తుల్యే ఘృతే పచేత్. 246
తత్తామ్రం శుద్ధసూతంచ గంధకంచ సమంసమమ్,
నిర్గుండ్యుత్థద్రవైర్మర్ద్యం దినం తద్గోళముద్ధరేత్. 247
[1]దినైకం వాలుకాయంత్రే పాచ్యం యోజ్యం ద్విగుంజకమ్,
బీజపూరస్యమూలంతు సజలంచానుపాయయేత్. 248
రసస్త్రివిక్రమో నామ్నా [2]మాసైకంచాశ్మరీప్రణుత్,

తా. తామ్రభస్మమును మేకపాలలో వైచి కాచి దానికి సమముగ నెయ్యిపోసి పాకము జేసి పిదప తామ్రభస్మమునకు సమముగ శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము కలిపి వావిలియాకురసముతో నొకదినము మర్దించి యుంటజేసి వాలుకాయంత్రమునం దునిచి ఒకదినము పాకము జేసి రెండుగురిగింజలయెత్తును ఒకమాసమువఱకు మాదీఫలపువేరు కషాయానుపానముతోడ సేవించుచుండిన అశ్మరి హరించును.

అశ్మరీరోగములయందు పథ్యము

కుళుత్థ ముద్గగోధూమా జీర్ణశాలీ యవాహితాః. 249

---

1 యామైకం 2 సికతాచాశ్మరీప్రణుత్.

ధన్వామిషం తండులీయం జీర్ణం కూశ్మాండకంఫలమ్,
ఆర్ద్రకం యవశూకశ్చ పథ్య మశ్మరి రోగినామ్ (మాధవనిదానే)

తా. ఉలవకట్టు, పెసరకట్టు, గోధుమలు, ప్రాంతబియ్యము, యవలు, నిర్జలదేశమున జనించు జంతుమాంసము, చిఱ్ఱికూర, ముదురుగుమ్మడుకాయ, అల్లము, యవక్షారము-ఇవి అశ్మరీరోగములయందు పథ్యకరంబులు.

వస్తిర్విరేకో వమనం చ లంఘనం స్వేదోవగాహోపిచవారిసేచనమ్,
యవాఃకుళుత్థాశ్చపురాణశాల్యోమద్యానిధన్వాండజసంభవోరసః.
పురాణకూష్మాండఫలంచదూలోగోకంటకోవారుణశాకమార్ద్రకమ్,
పాషాణభేదోయవశూకవైణవాః భిత్వాసమాకర్షణమశ్మనామపి.
ఏతానిసర్వాణిభవంతిసర్వదా ముదేఽశ్మరీరోగనిపీడితాత్మనామ్,
(మతాంతరే)

తా. వస్తికర్మ, విరేచనము, వమనము, లంఘనము, చెమటతీయుట, స్నానము, శరీరముపై నీళ్ళుచిలకరించుట, యవలు, ఉలవలు, ప్రాంతబియ్యము, మద్యము, నిర్జలదేశమున జనించుజంతుమాంసరసము, ప్రాంతగుమ్మడికాయ, చిల్లీశాకము, పల్లేరు, ఉలిమిడికూర, అల్లము, కొండపిండివేరు, యవక్షారము, వెదురుమొలక, భేదించి మూత్రస్థానమునందుండు ఱాయిని వెలిపఱచుట-ఇవి ఎల్లపుడు అశ్మరీరోగములయందు హితకరములని పథ్యవర్గములో జెప్పంబడియున్నయది.

### అశ్మరీరోగములయందపథ్యము

మూత్రస్యశుక్రస్యమలస్యరోధం విష్టంభిరూక్షంగురుచాన్నపానమ్.
విరుద్ధపానాశనమశ్మరీవాన్వివర్జయేత్సతతంచాప్రమత్తః.
(మాధవనిదానే)

తా. మూత్ర శుక్ర మలవేగముల నడ్డగించుట, మలబద్ధకరాన్నమును, రూక్షగలయన్నమును జడత్వముగలయన్నమును సేవించుట, విరుద్ధపానాన్నముల సేవించుట-ఇవి అశ్మరీరోగములయందపథ్యకరంబులగుటచే వానిని ముఖ్యముగ వర్జింపవలయును.

## నవమప్రకరణమ్.



# దశమప్రకరణము.

---

శ్లో॥ మహాదేవం విరూపాక్షం శంకరం పరమేశ్వరమ్,
దేవేశం కరుణాపాంగం జగదీశమహం భజే.

తా. మహాదేవుఁడు, విరూపాక్షుఁడు, శంకరుఁడు, కరుణారసయుక్తమైనకడకంటి చూపుగలవాఁడు, జగదీశ్వరుఁడు నగు పరమేశ్వరుని నేను భజియించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేరొందఁబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ గ్రంథము యొక్క దశమప్రకరణమును వచించుచున్నాఁడను.

గ్రహణీరోగనిదానాదులు

అత్యాశనా దజీర్ణాచ్చ వేగరోధాతిమైథునాత్,
అతిసారే నివృత్తేపి హ్యహితాహారసేవనాత్. 3
అగ్నిమాంద్యం భవేత్తేన గ్రహణీసంభవో నృణాం,
సామపక్వం సరక్తం వా ముహుర్బద్ధం ముహుర్ద్రవమ్. 4
సగంధం స్రవతే మిశ్ర మాలస్యం తృడ్బలక్షయః,
చిరాద్భుక్తస్య పాకశ్చ గ్రహణీపూర్వలక్షణమ్. (మాధవనిదానే)

తా. మిక్కుటముగ భుజించుట, అన్నముజీర్ణముకాకుండుట, మూత్రమును బంధించుట, మిక్కుటముగ స్త్రీసంభోగముసేయుట, అతిసారము నివృత్తించినతోడనే అహితకరభోజనముల సేవించుట-ఈకారణములవలన అగ్నిమాంద్యము జనించి గ్రహణీరోగము గలుగంజేయును. అందన్నము కొంతపక్వంబై కొంతపక్వంబుగాక మలముతో గలసిగాని, మల రక్తములతో గలసిగాని, పలుమారు బద్ధకముగగాని, ద్రవముగగాని, దుర్గంధముగగాని, మిశ్రముగగాని వెడలును, ఆలస్యము, దప్పి, బలక్షయము, భుజించిన యన్నము దీర్ఘకాలముమీఁద పాకము జెందుట-అను నీలక్షణంబులు గలిగిన గ్రహణీరోగము జనించునని తెలియవలయును.

### వాతగ్రహణిలక్షణము

కంఠశోషశ్చ హృత్పీడా తృష్ణా కాస విషూచికే,
అన్నే జీర్ణే సదాధ్మానం భుక్తే రుగ్వంక్షణే భవేత్. 6
చిరాద్దుఃఖం ద్రవం శుష్కం తన్వామం శబ్దఫేనవత్,
పునఃపునస్సృజేద్వర్చః కాసశ్వాస మజీర్ణతా. 7
గ్రహణీ వాతజా జ్ఞేయా దీపనై స్తా ముపాచరేత్,
(సిద్ధవిద్యాభూః)

తా. కంఠము శోషించుట, హృదయపీడ, దప్పి, దగ్గు, విషూచిగలుగుట, అన్నము జీర్ణముగాకుండునపుడు భుజించుటయం దిచ్ఛ గలుగుట, గజ్జలలో వేదన గలుగుట, మలము ద్రవముగ, శుష్కముగ, అల్పముగ, ఆమయుక్తముగ, శబ్దము, నురుగు అనువాని యుక్తముగ, సావకాశముమీఁద పీడతోఁగూడి పలుమారు వెడలుట, కాసము, శ్వాసము, అజీర్ణముగలుగుట- ఈలక్షణములుగలది వాతగ్రహణియని తెలియవలయును. దీనియం దగ్నిదీపనమును గలుగంజేసెడి చికిత్సలం జేయవలయును.

### పైత్యగ్రహణిలక్షణము

పూత్యంల మ్లోద్గార హృత్కంఠ దాహా స్తృట్ఛ్వాసరుక్లమాః. 8
అజీర్ణం పీతనీలాభం పిత్తాద్వై [1]స్రవతి ద్రవం,
సమయే ద్రేచయేత్క్వాథైః పిత్తోత్థాంచ ప్రవాహికామ్. 9
మధురై శ్శీతలై ర్ద్రవ్యై ర్నాతిరూక్షై రుపాచరేత్,

తా. దుర్గంధముగ పులితేనుపులువచ్చుట, ఱొమ్ము, కుతిక అనువానియందు మండుట, దప్పి, శ్వాసము, శ్రమ, అజీర్ణముగలుగుట, మలము పచ్చగ, నల్లగ, ద్రవముగ వెడలుట- ఈలక్షణములుగలది పైత్యగ్రహణియని తెలియవలయును. దీనియందు వమన రేచనకర కషాయముల నివ్వందగును. మఱియు మధురము శీతలము గల ద్రవ్యములు, కడురూక్షవిహీనద్రవ్యములు అనువానిచే నుపచరింపవలయును.

### శ్లేష్మగ్రహణిలక్షణము

కాస నిష్ఠీవనం ఛర్దిః మధురాస్య మరోచకమ్. 10
భిన్నామ [2]శ్లేష్మమిశ్రంచ సార్యతేచోదకంగురు,
దుష్టోమధురఉద్గారః [3]పీనసశ్చ కఫాదికే. 11

---

1 సార్యతే ద్రవమ్. 2 శ్లేష్మసంసృష్ట గురువర్చః ప్రసర్తనమ్. 3 సదనం స్త్రీష్వహర్షణమ్-అనఁగాశరీరము శిథిలంబగుట. స్త్రీయం దిచ్ఛలేకుండుట,

అకృశస్యాపి దౌర్బల్య మాలస్యంచ కఫాత్మకే,
శ్లేష్మకే పంచకర్మాణి కర్తవ్యాణి బలాధికే. 12
బలహీనేనకర్తవ్యం దీపనైః పాచనైర్హితం,
ఏతాని వైద్యనాథేన రోగిక్లేశ ప్రశాంతయే (ఆయుర్వేదే)

తా. దగ్గియుమియుట, వమనంబగుట, నోరు తీపిగనుండుట, అరుచిగలుగుట, మలము భిన్నంబై ఆమశ్లేష్మయుక్తంబై యుదకమువలె ద్రవముగ, జడముగ వెడలుట, వికారముగ, మధురముగ, ఓకరింతలుగలుగుట, పీనసగలుగుట, శరీరము కృశింపకయే దౌర్బల్యము, ఆలస్యముగలుగుట - ఈలక్షణములుగలది శ్లేష్మగ్రహణియని తెలియవలయును. దీనియందు రోగికి బలముగలిగియుండిన పంచకర్మలను, బలము లేకుండిన దీపనపాచనకర కర్మలనుచేయుట హితకరంబు. అట్లగుటంజేసి, వైద్యశ్రేష్ఠులగువారు రోగశమనార్థంబై పైఁజెప్పంబడిన చికిత్సలం జేయవలయును.

### ద్వంద్వ, త్రిదోష గ్రహణీ లక్షణములు

మిశ్రితే ద్వంద్వజా జ్ఞేయా త్రిదోషే సర్వరూపిణీ. 14

తా. వాతపిత్తాది ద్వంద్వలక్షణములంగలది ద్వంద్వగ్రహణియనియు, వాత పిత్త శ్లేష్మలక్షణములంగలది త్రిదోషగ్రహణియనియు తెలియవలయును. (ఇవి యసాధ్యములు.)

### ఆమవాతగ్రహణిలక్షణము

సుప్తిః పార్శ్వార్తితాయస్య గళజ్జలఘటధ్వనిః,
ప్రవర్తతే ఘటీయంత్రా త్సశబ్దం మందవేదనమ్. 15
ద్వాత్రింశద్దివసాద్వాపి పక్షాన్మాసాచ్చ వాసరాత్,
ఆమస్రావస్స ఫేనశ్చ స్నిగ్ధం శుద్ధం ఘనం స్రవేత్. 16
దివా కోపో నిశా శాంతి శ్శూష్కకంపాంగకృద్భవేత్,
గ్రహణీ హ్యామవాతేన దుశ్చికిత్స్యా భిషగ్వరైః. (చరకే)

తా. నేత్రములు మసకగనుండుట, ఒకపార్శ్వమున శరీరము గదలకయుండుట, మలము వెడలుటకుముందు కడుపులో గడబిడయను శబ్దముగలిగి కుండలతో గుమ్మరించు నటుల శబ్దముగలదై కొంచెముగ వేదనగలదై అధికముగ వెడలుట, ముప్పది రెండుదినములకుగాని, అపిశబ్దమువలన పదిదినములకుగాని, లేక ౧౫ దినములకుగాని, లేక ఒకమాసమునకుగాని, చకారమువలన ప్రతిదినముగాని, లేక ఎనిమిదిదినముల కొకమారుగాని,

ఆమము నుఱుగుతోఁగూడి దట్టముగ, నిర్మలముగ, బిరుసుగ వెడలుట, పగటియందు ప్రకోపించి రాత్రులయందు శాంతిజెందుట-ఈలక్షణములతో శరీర మెండి వణకుచుండిన ఆమవాత గ్రహణియని తెలియవలయును. ఇది అసాధ్యము. (ఇది వాతగ్రహణిలో నంతర్భావమును జెందియుండును.)

## గ్రహణీభేదములు

నష్టాగ్నిర్దూషితై ర్దోషైః పృథక్సర్వైశ్చ తుర్విధా,
గ్రహణ్యాలక్షణం తాసాం చికిత్సాచాతిసారవత్. 18

తా. వాత, పిత్త, శ్లేష్మములు ప్రత్యేకములుగ దుష్టంబులై గాని, లేక త్రిదోషములు దుష్టంబులై గాని, జాఠరాగ్నిని జెరచి నాలుగువిధగ్రహణుల గలుగంజేయును. వీని లక్షణములను పైఁజెప్పంబడినప్రకారము తెలియవలయును. మఱియు దీనియం దతిసార చికిత్సలనే జేయఁగలయును.

## గ్రహణీరోగోపచారక్రమము

గ్రహణ్యా మబలోఽగ్నిర్హి న తస్య గ్రహణీబలం,
తస్మాదతిప్రయత్నేన వహ్నిమేవ ప్రదీపయేత్. (బాహటే) 19

తా. అగ్నిదౌర్బల్యమువలన గ్రహణి జనించును. గ్రహణి యగ్నికి బలకరము కానేరదు. (అనఁగా గ్రహణివలన మిక్కుటముగ యగ్నిమాంద్యము గలుగుట) కావున గ్రహణిరోగమున సర్వప్రయత్నములచే యగ్నిదీపనమును గలుగంజేయవలయును. (ద్వంద్వదోషములవలన జనించిన గ్రహణులు కష్టసాధ్యంబులు. త్రిదోషగ్రహణులు అసాధ్యంబులు.)

## అతిసారనిదానము

విరుద్ధాతిగురు స్నిగ్ధ రూక్షోష్ణాద్యశనాదిభిః.
అగ్నిం హత్వా తథా దోషై రతిసారః ప్రవర్తతే. 20
(చికిత్సాసారసిద్ధసంగ్రహే)

తా. విరుద్ధపదార్థములు, కడుజడకరపదార్థములు, జిగటగలపదార్థములు, రూక్షకరపదార్థములు, ఉష్ణకరపదార్థములు మొదలగువానిని సేవించుటవలన వాత, పైత్య, శ్లేష్మములు ప్రకోపించి జాఠరాగ్నిం జెరచి అతిసారమును గలుగంజేయును.

## అతిసారభేదములు

ఏకైకేన సమస్తైస్తు దోషై శ్శోకాద్భయాదపి,
షడ్విధశ్చైవ బోద్ధవ్య స్తస్య లక్షణముచ్యతే. 21

తా. వాతాతిసారము, పిత్తాతిసారము, శ్లేష్మాతిసారము, సన్నిపాతాతిసారము శోకాతిసారము, భయాతిసారము అన అతిసారములు ఆఱువిధంబులు. వానిలక్షణంబ లెవ్వియనిన:—

వాతాతిసారలక్షణము

*అరుణం ఫేనిలం రూక్ష మల్పమల్పం ముహుర్ముహుః,
సామం సశూలశబ్దశ్చ సారో వాతాత్ప్రవర్తతే. (సిద్ధసంగ్రహే) 22

తా. మలము ఎఱ్ఱనై నుఱుగుతోఁగూడి యుష్ణముగ, బంక, శూల, శబ్దము - అన వానియుక్తముగ, పలుమారులు కొంచెకొంచెముగ వెడలిన వాతాతిసార మని తెలియ వలయును.

పైత్త్యాతిసారలక్షణము

అరుణం హారితం పీతం నీల దుర్గంధసంయుతం,
శూల సంతాప పాకాశ్చ తాపశ్చ కరపాదయోః,
మూర్ఛా స్వేద పిపాసాశ్చ పిత్తాతీసారలక్షణమ్. 23
(మాధవనిదానే)

తా. మలము దుర్గంధమై ఎఱ్ఱగగాని, లేక ఆకుపసరువర్ణముగగాని, లేక పసపు వర్ణముగగాని, లేక నీలవర్ణముగగాని వెడలుట, శూల, శరీరతాపము, ఆసనమున పాకము గలుగుట, చేతులు, కాళ్లు మండుట, మూర్ఛ, చెమట, దప్పి గలుగుట - ఈలక్షణములు గలది పిత్తాతిసారమని తెలియవలయును.

శ్లేష్మాతిసారలక్షణము

శుక్లం సాంద్రం సకఫం శ్లేష్మణాతు
విస్రంశీతం హృష్టరోమా మనుష్యః. 24

తా. మలము తెల్లగ, గట్టిగ కఫమిశ్రితముగ, ఆమగంధయుక్తముగ, చల్లగ వెడలుట, రోమములు గగుర్పొడుచుట - ఈలక్షణములుగలది కఫాతిసారమని తెలియ వలయును.

సన్నిపాతాతిసారలక్షణము

వారాహస్నేహ మాంసాంబు సదృశం సర్వరూపిణం,

---

* శ్లో. అరుణం ఫేనిలం రూక్ష మల్పమల్పం ముహుర్ముహుః, శకృదామం సరుక్ఛబ్ద మారుతేనాతిసార్యతే. ఇట్లును పాఠాంతరము గలదు.

కృచ్ఛ్రసాధ్య మతీసారం విద్యాద్దోషత్రయోద్భవమ్. 25

తా. మలము పందిక్రొవ్వుతో తుల్యముగగాని, లేక మాంసముగడిగిన నీళ్లవలె గాని వెడలుటయేగాక పైఁజెప్పఁబడిన వాతాదిదోషలక్షణయుక్తంబైయుండిన సన్నిపాతాతిసారమని తెలియవలయును. (ఇది కష్టసాధ్యము.)

శోకాతిసారలక్షణము

తైస్తైర్భావైశ్శోచతోఽల్పాశనస్య బాష్పోష్మావైవహ్నిమావిశ్యజంతోః.
కోష్ఠంగత్వా క్షోభయేత్తస్యరక్తం తచ్చాధస్తాత్కాకణంతీప్రకాశమ్.
నిర్గచ్ఛేద్వైవిడ్విమిశ్రంహ్యవిడ్వా నిర్గంధంవా గంధవద్వాతిసారః,
(ఆయుర్వేదే)

తా. ధనబంధునాశనాదికములచే దుఃఖించుటవలన అన్నము హీనమై దానివలన ధాతుక్షయముగలవానియొక్క శరీరమునందలి యూష్మము నేత్రనాసాగళాదులయందు వ్యాపించియుండు జలముతోడంగలసి కోష్ఠగతంబై జాఠరాగ్నికి మాంద్యమును గలుగంజేసి రక్తమును క్షోభపరచి (క్షోభయనఁగా రక్తమునందు ఉష్ణద్రవత్వములు గలుగంజేసి) గురిగింజవలె నెఱ్ఱగనుండు రక్తమును మలమిశ్రితముగగాని, లేక మలరహితమై గంధ విహీనముగగాని, లేక దుర్గంధయుక్తముగగాని స్రవింపఁజేసిన శోకాతిసారమని తెలియవలయును. ఇది వాతపిత్తములవలన జనించు నని ఆయుర్వేదవేత్త లగువారందఱు వచించెదరు.

శోకాతిసారకృచ్ఛ్రసాధ్యత్వము

శోకోత్పన్నో దుశ్చికిత్స్యోఽతిమాత్రం
రోగో వైద్యైః కష్టఏష ప్రదిష్టః. 27

తా. శోకాతిసారమున శోకము శాంతిజెందుటకు ముందు ఔషధమువలన శాంతి గలుగనేరదు. అట్లగుటంజేసి దీనిని కష్టసాధ్యమని వైద్యులు వచించెదరు.

రక్తాతిసారలక్షణము

పిత్తకృంతి యదాత్వర్థం ద్రవ్యాణ్యశ్నాతి పైత్తికే,
తదోపజాయతేఽభీక్ష్ణం రక్తాతిసారఉల్బణః. 28

తా. పిత్తాతిసారముగలిగి యుండునపుడుగాని, లేక పిత్తాతిసారపూర్వలక్షణంబులు గలిగియుండునపుడుగాని, పిత్తకరద్రవ్యముల మిక్కుటముగగాని, లేక ఎల్లప్పుడు గాని సేవించుటవలన, బలిష్ఠమైనరక్తాతిసారము జనించి పలుమారు వెడలును. మఱియు నది వాతాదిదోషములవలన ఎఱుపు, నలుపు మొదలగువర్ణములుగ వెడలునని కొందఱు

వచించెదరు. (ఈరక్తాతిసారము నేడవదిగవచించిన షట్త్వసంఖ్యకు బాధకముగ లుగును. దానంజేసి దీనిని పిత్తముయొక్క అవస్థాభేదమని జెప్పందగి యున్నది.)

ఆమాతిసారలక్షణము

అన్నాజీర్ణాత్ప్రద్రుతాః క్షోభయంతః
కోష్ఠం దోషా ధాతుసంఘాన్ మలాంశ్చ,
నానావర్ణం నైకశస్సారయంతి
శూలోపేతం షష్ఠమేనం వదంతి. 29

తా. అన్నము జీర్ణముగాకుండుటవలన త్రిదోషములు స్వమార్గమును విడనాడి కోష్ఠగతంబులై క్షోభను గలుగంజేసి రక్తాదిధాతువులను, పురీషాదులను పలుమారు గుదద్వారమువలన ననేకవర్ణములుగ స్రవింపంజేయుచు కడుపును విశేషముగ నులియ పెట్టుచునుండునది ఆమాతిసార మనంబడును. ఇది ఆరవసంఖ్యగలదిగనుండును.

అతిసారే జ్వరేచైవ రక్తపిత్తే దృగామయే,
ఆదౌ నప్రతికుర్వీత వ్యాధివేగో హి దుస్తరః. 30

(మాధవనిదానే)

తా. అతిసారము, జ్వరము, రక్తపిత్తము, నేత్రరోగము-ఇవి జనించునపుడే చికిత్స జేయంజనదు. అటుజేసిన నవి ప్రబలంబులై చికిత్స కసర్వాంబులగును.

అసాధ్యాతిసారలక్షణములు

జ్వరాతిసార శ్శోభాంతే శ్వయథౌ చ తథా క్షయే,
దుర్బలస్య విశేషేణ కాయే సంతాపపీడనమ్. 31
హస్తపాదాంగులీసంధి ప్రవృద్ధి ర్మూత్రనిగ్రహః,
ఆధ్మానంచ తృషా ఛర్దిః పురీషస్యాతిచోష్ణతా. 32
విశేషేణ నరం వృద్ధ ముష్ణాతీసారిణం త్యజేత్,

తా. జ్వరము, శోఫ, వాపు, క్షయము అనువానియంతమున గ్రహణ్యతిసారములు జనించినను, లేక దుర్బలునికి గ్రహణ్యతిసారములు జనించినను, లేక గ్రహణ్యతిసారములు గలిగియుండునపుడు శరీరతాపము, చేతులు, కాళ్లు, వ్రేళ్లు, సంధులు అనువానియందు వాపు, మూత్రప్రతిబంధము, కడుపుబ్బరము, దప్పి, వాంతి, మలమువెడలునపుడు కడుమంట గలిగియుండినను, లేక వృద్ధునికి గ్రహణ్యతిసారములు జనించినను, లేక గ్రహణ్యతిసారములు ఉష్ణముగ వెడలుచుండినను అసాధ్యంబు. అట్లగుటచేవారిని వర్జింపవలయును.

క్షౌద్రస్నేహమపి క్షారతోయపూయేన మాంసకృత్. 33
నానావర్ణోత్కటం పూతి శకృన్నార్శ్యే నసిధ్యతి,
(సిద్ధసా॥ సంగ్రహే)

తా. తేనె, స్నేహము, ఉప్పునీరు, చీము, మాంసము అనువానితో తుల్యముగ గాని, నానావర్ణయుక్తంబై దుర్గంధముగగాని, మలము వెడలెడి గ్రహణ్యాతిసారములు అసాధ్యంబులు.

మిశ్రంచ కృష్ణవర్ణంచ బహువర్ణంతు రక్తకమ్. 34
దుర్గంధం జ్వరయుక్తంచాప్యసాధ్య మతిసారకం,

తా. మలము మిశ్రవర్ణముగగాని, లేక నల్లగగాని, లేక నానావిధవర్ణములుగ గాని లేక రక్తవర్ణముగగాని వెడలుట, దుర్గంధము వేయుట - ఈలక్షణములుగల అతిసారముతోడ జ్వరమును గలిగియుండిన అసాధ్యంబు.

ఏరండతైలవర్ణంచ మాంసమాక్షికయోస్తథా. 35
స్వనసారంచ దుర్గంధ మసాధ్య మతిసారకం. (చిన్తామణౌ)

తా. మలము ఆముదము, మాంసముగడిగిననీళ్లు, తేనె - అనువానివర్ణములతో సమానమై శబ్దయుక్తమై వెడలుట, మలము కడుదుర్గంధమువేయుట - ఈలక్షణములుగల యతిసారము అసాధ్యంబు.

పక్వజాంబవసంకాశం యకృత్పిండనిభం తను. 36
ఘృత తైల వసా మజ్జా వేసవార పయో దధి,
మాంసధావన తోయాభం కృష్ణం నీలారుణప్రభమ్. 37
మేచకం కర్బురం స్నిగ్ధం చంద్రకోపగతం ఘనం,
కుణపం మస్తులుంగాభం దుర్గంధం కుథితం బహు.
తృష్ణా దాహారుచి శ్వాస హిక్కా పార్శ్వాస్థి శూలినం,
సంమూర్ఛా రతిసంమోహాయుక్తం పక్వవలీగుదమ్. 39
ప్రలాపయుక్తంచ భిషగ్వర్జయే దతిసారిణం, (ఆయుర్వేదే)

తా. పండిన నేరేడుపండువర్ణముగ, యకృత్పిండముతో సమానముగ, (అనఁగా నల్లగ, ఎఱ్ఱగ) నెయ్యి, నూనె, క్రొవ్వు, మజ్జ, * వేసవారము, పాలు, పెరుగు, మాంసము గడిగిననీరు అనువానివర్ణములుగలదిగ, పిత్తాతిసారమునందు దప్ప తక్కినయతి

* వేసవార మన-మాంసమునందుండు నెముకలదీసి దంచి పెరుగు, పాలు, మిరియాలు, ఏలకులు వేసి చేసెడిపదార్థము.

సారములలో కాటుకవలె నల్లగ, నీలవర్ణముగ, ఎఱ్ఱగ, మృదంగమునకు పూసెడికా వలె నలుపుశాయివర్ణముగ, మెఱయుచు బలువిధవర్ణములుగలదిగ, ధాతువులయొ చమురు స్రవించుటవలన నెమలిఱెక్కలతో సమానమైన ఛాయగలదిగ, గట్టిగ, శ వలె దుర్గంధముగ, మస్తకమునందుండు చమురుతో తుల్యముగ, కుళ్ళిపోయిన దుర్గంధముగలదిగ నుండినదై విశేషముగ మలమువెడలుట, దప్పి, తాపము, ద్వేషము, ఉబ్బసము, ఎక్కిళ్లు, ప్రక్కటెముకలయందు పోట్లు, మనోమోహము గుట, దేనియందిచ్ఛలేకుండుట, ఇంద్రియములకు మోహముగలుగుట, గుదము కొనియుండుట, వదరుట-ఈలక్షణములుగల యతిసారరోగిని వైద్యుఁడు వ వలయును.

అసంవృతగుదం క్షీణం దురాధ్మానముపద్రుతమ్.
గుదే పక్వే గతోష్మాణమతిసారిణ ముత్సృజేత్, (మాధవనిదా

తా. ఆసనము తెరచికొనియుండుట, బలము, శరీరవృద్ధిలేకుండుట, మిక్కు ముగ కడుపుబ్బరము, శోభాద్యుపద్రవములు గలుగుట, గుదపాకారంభకపిత్తము యుండునపుడుసగా శరీరము చల్లగనుండుట, లేక అగ్నినష్టమైయుండుట-ఈలక్షణవ గల యతిసారరోగిని వైద్యుఁడు వర్జింపవలయును.

శోభం శూలం జ్వరం తృష్ణా శ్వాసం కాసమరోచకమ్.
ఛర్దిం మూర్ఛాంచ హిక్కాంచ దృష్ట్వాతీసారిణం త్యజేత్,

తా. వాపు, శూల, జ్వరము, దప్పి, శ్వాసము, దగ్గు, అన్నద్వేషము, వా మూర్ఛ, ఎక్కిళ్లు గలయతిసారరోగిని వర్జింపవలయును.

శ్వాస శూల పిపాసార్తం క్షీణం జ్వరనిపీడితమ్.
విశేషేణ నరం వృద్ధ మతిసారో వినాశయేత్,

తా. శ్వాసము, శూల, దప్పి గలవానికి, సత్వక్షయముగలవానికి, జ్వరము కడుపీడితుఁడుగ నుండువానికి, వృద్ధునికి అతిసారము జనించిన వారలు మృతి జెంద

ద్విధా సర్వాతిసారశ్చ స్యాదామః పక్వఇత్యపి.
మజ్జతేచ శకృత్తోయే పక్వం తత్ప్లవతేఽంభసి,

(సిద్ధసారసంగ్రహే

తా. ఆమ, పక్వాతిసారములన అతిసారము రెండువిధంబులు. అం దామ సారమున మలమును నీళ్ళలోవేసిన మునుంగును. ఇది అసాధ్యము. పక్వాతిసారమున మును ఉదకములోవేసిన తేలును. ఇది సాధ్యము.

## ఆతిసారసామాన్యోపచారము

తత్రాదౌ వమనం కార్యం లంఘనం చ యథాబలమ్. 44
లంఘితాయ హితం పేయం తక్రం వైవిశ్వసాధితం,

తా. అతిసారమునందు తొలుత వమనమును, సత్త్వానుగుణ్యముగ లంఘనమును జేయించి పిదప శొంఠియుక్తముగ కాచబడినచల్లను పానము చేయించవలయును.

## గ్రహణ్యతిసారోపచారవిధి

గ్రహణ్యామతిసారేచాప్య ఫేనం మాతృవత్పుషేత్. 45

తా. గ్రహణ్యతిసారరోగులను నల్లమందు తల్లివలె బోషించుచుండుగావున నల్లమందుగలసిన యౌషధములవలననే గ్రహణ్యతిసారముల హరింపంజేయవలయును.

## వాతగ్రహణికి బడబాముఖరసము

శుద్ధసూతం సమంగంధం మృతతామ్రాభ్రటంకణం,
సాముద్రంచ యవక్షారం సర్జాసైంధవ నాగరమ్. 46
అపామార్గస్యచ క్షారం పాలాశం వరుణద్వయం,
ప్రత్యేకం సూతతుల్యాంశం చుక్రికామ్లేన మర్దయేత్. 47
హస్తిశుండ్యా ద్రవైశ్చాపి మర్దయిత్వా పచేల్లఘు,
మాషైకం భక్షయేన్నిత్యం రసోఽయం బడబాముఖః. 48
పాఠా త్రికటు పథ్యాగ్ని శారిబా బృహతీద్వయం,
త్రిక్షారేంద్ర యవా జాజీ తుల్యం లవణపంచకమ్. 49
ఆరనాళైః పిబేచ్చాను వాతోత్థాం గ్రహణీం జయేత్.

(ఆయుర్వేదే)

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసిన గంధకము, తామ్రభస్మము, అభ్రకభస్మము, టంకణక్షారము, సముద్రలవణము, యవక్షారము, సర్జక్షారము, సైంధవలవణము, శొంఠి, ఉత్తరేణుక్షారము, మోదుగక్షారము, ఉలిమిడి, పాపర వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి పులిచింతరసముతో నొకదినము, హస్తిశుండిరసముతో నొకదినము మర్దించి లఘుపుటంబిడి మాషమెత్తును చిరుబొద్ది, త్రికటుకములు, కరక్కాయ, చిత్రమూలము, గూడపాల, పిన్నములక, పెద్దములక, సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము, కొడిసెపాల, జాజికాయ, పంచలవణములు - అనువానిని సమభాగములుగ కలిపి నూరి ఘ్రాయనుపానముతోడ సేవించిన వాతగ్రహణి హరించును.

### వాతగ్రహణికి వజ్రకవాటరసము

మృతసూతాభ్రకం గంధం యవక్షారం సటంకణమ్. 50
అగ్నిమంథం వచాం కుర్యా త్సూతతుల్యానిమా న్సుధీః,
తతో జయంతీ జంబీర భృంగద్రావై ర్విమర్దయేత్. 51
త్రివాసరం తతో గోళం కృత్వా సంశోష్య ధారయేత్,
లోహపాత్రే శరావంచ దత్వోపరి విముద్రయేత్.
అధోవహ్నిం శనైః కుర్యా ద్యామార్ధం తత ఉద్ధరేత్,
రసతుల్యా మతివిషాం దద్యా న్మోచరసం తథా. 53
కపిత్థవిజయాద్రావై ర్భావయే త్సప్తధా పృథక్,
ధాతకీంద్రయవా ముస్తా లోధ్రప్రతివిషావృతాః. 54
ఏతద్ద్రవై ర్భావయిత్వా దినైకంచ విశోషయేత్,
రసో వజ్రకవాటాఖ్యో మాషైకం మధునా లిహేత్. 55
వహ్నిం శుంఠీ విడం బిల్వం లవణం చూర్ణయేత్సమం,
పిబేదుష్ణాంబునాచాను * వాతజాం గ్రహణీం జయేత్. 56

(మాధవనిదానే)

తా. రసభస్మము, అభ్రకభస్మము, శుద్ధిజేసినగంధకము, యవక్షారము, టంకణక్షారము, కూరసెల్లి, వస-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి తక్కడ, నిమ్మపండు, గుంటగలగరాకు అనువాని రసములతో మూడుదినములు మర్దించి ముద్దజేసి ఎండించి ఇనుపగిన్నెలో నునిచి దానిపై మూకుడు మూసి చీలమన్ను లేపనముజేసి మంద్రాగ్నితో ఝాముపఱకు మెల్లగవండి సాంగశీతలమునదీసి మరల ఖల్వములోనునిచి రసభస్మప్రమాణము అతివసను, బూరుగబంకను కలిపి వెలగ, గంజాయియాకు అనువాని రసములతో యేడుమార్లు ప్రత్యేకప్రత్యేకముగా భావనలుజేసి పిదప ఆరెపువ్వు, కొడిసెపాల, తుంగముస్తెలు, లొద్దుగ, అతివస, తిప్పతీగ అనువానిరసములతో ప్రత్యేకప్రత్యేకముగ నొక్కదినము భావనజేసి యెండించి మాషప్రమాణమును తేనెతో సేవించి వెంబడిగ చిత్రమూలము, శొంఠి, వాయువిడంగములు, మారేదుబెరడు, సైంధవలవణము అనువానిని సమభాగములుగ గ్రహించి ఉష్ణోదకముతో నూరి త్రాగిన వాతగ్రహణి నశించును.

---

* సర్వజాం.

## పైత్యగ్రహణికి చిత్రాంబరసము

శుద్ధసూతం మృతంచాభ్రం గంధకం మర్దయేత్సమం,
లోహపాత్రే ఘృతాభ్యక్తే క్షణం మృద్వగ్నినా పచేత్. 57
చాలయే ల్లోహదండేన త్వవతార్యనిభావయేత్,
త్రిదినం జీరకక్వాథై ర్మాషైకం భక్షయేత్సదా. 58
గ్రహణీ శాంతి మాయాంతి సర్వోపద్రవసంయుతా,
రసః చిత్రాంబరోనామ గ్రహణీగ్రహహృన్మతః. 59
శమయే దనుపానేనా ప్యామశూలం ప్రవాహికాం,

(రసరత్నాకరే)

తా. శుద్ధిజేసినరసము, అభ్రకభస్మము, శుద్ధిజేసినగంధకము-వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మర్దించి నెయ్యిపూసిన ఇనుపగిన్నెలోనునిచి మృద్వగ్నిని నొకక్షణమువండి ఇనుపకాడతో బాగుగ గలియబెట్టి దించి జీలకఱ్ఱకషాయముతో 3 దినములు భావనజేసి మాషప్రమాణమును ఎల్లపుడు సేవించుచుండిన సర్వోపద్రవములతోగూడియుండు పిత్తగ్రహణి హరించును. మఱియు సీరసము అను పానవిశేషమువలన ఆమశూల, ప్రవాహిక అనువానినిసగా హరింపజేయును.

## శ్లేష్మగ్రహణికి అర్కలోకేశ్వరరసము

శుద్ధసూతం పలం మర్ద్య మర్కక్షీరై ర్దినావధి. 60
ద్విపలం గంధకంచాథ మహాశంఖం పలాష్టకం,
ద్వయం వహ్నిరసై ర్భావ్యం శోష్యం పేష్యం దినత్రయమ్. 61
మేళయే త్పూర్వసూతేన సర్వార్థం టంకణం క్షిపేత్,
అర్కక్షీరైః పునస్సర్వం యామైకం మర్దయే ద్దృఢమ్. 62
తచ్చుష్కంచ నివేశ్యాథ భాండే రుద్ధ్వా పుటే పచేత్,
చతుర్గుంజామితం ఖాదే న్మరీచాజ్యేన సంయుతమ్. 63
అర్కలోకేశ్వరోనామ గ్రహణీ రోగనాశకః,
దేయం దివోదనం పథ్యం విజయా సగుడం నిశి 64

తా. పలప్రమాణము శుద్ధిజేసినరసమును ఖల్వములోనునిచి జిల్లేడుపాలతో నొకదినము మర్దించి పిదప ౨ పలములు శుద్ధిజేసినగంధకము, ౮ పలములు పెద్దశంఖమును చూర్ణముజేసి చిత్రమూలరసముతో 3 దినములు భావనజేసి ఎండించి మూడుదినములు మర్దించి, మర్దించియునిచిన పైరసముతోడంగలిపి అన్నిటికి సగము వెలిగారమును జేర్చి

జిల్లేడుపాలతో నొకయఝాము బాగుగమర్దించి ఎండనెండించి కుండలలో నునిచి దాని చీలమన్ను లేపనముజేసి లఘుపుటంబిడి నాలుగు గురిగింజలయెత్తును ప్రాతఃకాలమ మిరియపుచూర్ణము, నెయ్యి అనుపానియనుపానముతోడను, రాత్రులయందు గంజాయాకు, బెల్లము అనువానియనుపానముతోడను సేవించిన శ్లేష్మగ్రహణి హరించును. ఔ యందు పగటియందుమాత్ర మన్నమును భుజింపవలయును.

## త్రిదోషగ్రహణికి కుటజాద్యవలేహ్యము

కుటజత్వక్పలశతం జలేద్రోణే విపాచయేత్,
అష్టభాగావశేషంతు కషాయ మవతారయేత్. 6
వస్త్రపూతం పునఃక్వాథం పచే ల్లేహత్వ మాగతం,
భల్లాతకవిడంగాని త్రికటు *త్రిఫలా తథా. 6
రసాంజనం చిత్రకంచ కుటజస్యఫలానిచ,
వచా మతివిషాం బిల్వం ప్రత్యేకంచ పలంపలమ్. 6
త్రింశత్పలం గుడంచైవ చూర్ణీకృత్య నిధాపయేత్,
మధునఃకుడవం దద్యా ద్ఘృతస్యకుడవం తథా. 6
లేహోఽయం శమయత్యర్శో యస్యరక్తసముద్భవం,
వాతికం పైత్తికంచైవ శ్లైష్మికం సాన్నిపాతికమ్. 6
యేచ దుర్నామజా రోగా స్తాన్ సర్వా న్నాశయత్యపి,
అమ్లపిత్తమతీసారం పాండురోగ మరోచకమ్. 7
గ్రహణీ మార్తవం కార్శ్యం శ్వయథుం కామిలామపి,
అనుపానం ఘృతం దద్యా న్మధుతక్రం జలం పయః. 7
అనేకరోగనాశాయ కౌటజో లేహ్యఉచ్యతే,
(చికిత్సాసారసిద్ధసంగ్రహే

తా. నూరుపలముల కొడిసెచెక్కనువంచి యందు ద్రోణప్రమాణము నీళ్ళుపోసి యష్టావశేషముగ కషాయముగాచి వడియగట్టి మరల దానిని చిక్కగకాచి అందు శుద్ధిజేసిన జీడిగింజలు, వాయువిడంగములు, త్రికటుకములు, త్రిఫలములు, రసాంజనము చిత్రమూలము, కొడిసెపండ్లు, వస, అతివస, మారేడుబెరడు, అనువానిచూర్ణము దినుస

---

* హరీతక్యా స్త్రయోభాగా శివా ద్వాదశభాగికా, షడ్భాగాస్స్యుర్విభీతస్య త్రిఫలేయం ప్రకీర్తితా, అనఁగా కరక్కాయలు 3 భాగములు, ఉసిరికపప్పు ౧౨ భాగములు, తానికాయ ౬ భాగములుచేరిన త్రిఫలము లనంబడు నసుట.

కొక్కొకపలము, బెల్లము ౩౦ పలములు, తేనెకుడవము, నెయ్యికుడవము కలిపి లేహ్యాపక్వముగవండి నాలుగుమాడలయెత్తుచు సేవించుచుండిన రక్తార్శస్సు, వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాతములవలన జనించిన మూలరోగములు, మూలరోగమువలన జనించిన తదితరరోగములు, ఆమ్లపిత్తము, అతిసారము, పాండువు, అరుచి, గ్రహణి, రజస్సంబంధములవలన జనించినరోగము, కృశత్వము, వాపు, కామిల హరించును. మఱియు దీనిని నెయ్యి, తేనె, మజ్జిగ, ఉదకము, పాలు అనువాని యనుపానములతోడ సేవించిన తదితరసర్వరోగములు హరించును.

## అమవాతగ్రహణికి గ్రహణ్యాంకుశరసము

శుద్ధసూతం సమంగంధం సూతార్ధం మృత మభ్రకమ్. 72
మర్దయే న్మాతులుంగాద్భిః పేష్యం శోష్యంచ సప్తధా,
త్ర్యూషణం నీలికామూలం దుత్తూరస్యచ బీజకమ్. 73
ప్రత్యేకం సూతతుల్యం స్యా త్సర్వం తద్విజయాద్రవైః,
శ్వేతాపరాజితాకన్యా మత్స్యాక్షీ కాకమాచికా. 74
ఆర్ద్రికం పర్పటీవహ్ని ర్ముసలీచ రుదంతికా,
ద్రవై ర్దినత్రయం భావ్యం మాషమాత్రంచ భక్షయేత్. 75
గ్రహణ్యంకుశకోనామ్నా హ్యసాధ్యంచాపి సాధయేత్,
ద్విపలం జీరకక్వాథ మనుపానంచ పాయయేత్. (మతాంతరే)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిజేసినగంధకము ఇవి దినుసుకొక్కొకభాగము, అభ్రకభస్మము ½ భాగము-ఇటుల వానినెల్ల ఖల్వములోనునిచి మాదీఫలరసముతో నేడుమార్లు మర్దించి ఏడుమా ర్లెండించి అందు త్రికటుకములు, నీలిపేళ్ళు, ఉమ్మెత్తవిత్తులు అనువాని చూర్ణమును దినుసుకొక్కొకభాగము చొప్పున కలిపి గంజాయియాకు, తెల్లగంటెన, కలబంద, పొన్నగంటి, కాచియాకు, అల్లము, పర్పాటకము, చిత్రమూలము, నేలతాటిగడ్డలు, రుదంతి అనువానిరసములతో మూడుదినములు భావనజేసి మాషప్రమాణమును రెండుపలముల జీలకఱ్ఱ కషాయానుపానముతోడ సేవించిన అసాధ్యగ్రహణి హరించును.

## ఆమకుఠారరసము

జాజీఫలం త్రికటుకం టంకణం రస గంధకం,
నిర్యాసం వత్సనాభంచ ముస్తా కుటజ చిత్రకమ్. 77
వరాచాతివిషారోచ నిర్యాసక్షారరామఠం,

సర్వం సంమర్ద్య విజయా స్వరసేన దినత్రయమ్. 78
వల్లప్రమాణవటికాం శుంఠీద్రావానుపానతః,
ఆమశూల మతీసారం గ్రహణీంచ చిరంతనామ్. 79
ఏషఆమకుఠారాఖ్యో రసస్త్రైలోక్యపూజితః,
(సిందూరమణిదర్పణే)

తా. జాజికాయ, త్రికటుకములు, పేల్చినవెలిగారము, శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, శుద్ధిజేసినవల్లమందు, శుద్ధిజేసినవసనాభి, తుంగముస్తెలు, కొడిసెపాల, చిత్రమూలము, త్రిఫలములు,, అతివస, బూరుగబంక, యవక్షారము, నేతిలో పొంగించిన ఇంగువ వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి గంజావియాకురసముతో 3 దినములు మర్దించి వల్లప్రమాణము మాత్రలుచేసి శొంఠికషాయానుపానముతో సేవించిన ఆమశూల, అతిసారము, చిరకాలముగనుండు గ్రహణి హరించును. ఈ ఆమకుఠారరసము త్రిలోకములయందు శ్రేష్ఠంబైనదిగ నున్నయది.

## గ్రహణులకు ఆనందరసము

జాతీఫలం హింగుళ సైంధవంచ వరాట శుంఠీ విష హేమబీజమ్.80
సపిప్పలీకం వటికాం ప్రకుర్యా ద్ధుత్తూరమూలస్వరసేన మర్ద్యం,
గుంజాప్రమాణం జఠరామయఘ్నం నిహంతి వాతం కఫశూలకంచ.
ఆమాతిసారం గ్రహణీవికారం నిహంతి శుష్కం సితయాసమేతమ్,
రసోఽయ మానందఇతి ప్రదిష్టః గ్రహణీగదానాం యమపాణిదండః.
(చరకే)

తా. జాజికాయ, శుద్ధిజేసిన ఇంగిలీకము, సైంధవలవణము, గవ్వలభస్మము, శొంఠి, శుద్ధిజేసినవసనాభి, ఉమ్మెత్తవిత్తులు, పిప్పళ్లు, - వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ఉమ్మెత్తవేళ్ళరసముతో మర్దించి గురిగింజంత మాత్రలుజేసి నీడనెండించి సేవించిన జఠరరోగము, వాత, కఫ, శూలలు హరించును. మఱియు దీనిని పంచదారయనుపానముతోడ సేవించిన ఆమాతిసారము, గ్రహణీవికారము, శరీర కార్శ్యము హరించును. మఱియు నిది గ్రహణులకు యమునిదండమువలెనే భయంకరమైయుండును.

పిత్తాధికగ్రహణ్యాంతు కపిత్థాష్టకమిష్యతే,
కఫవాతోత్తరాయాం తు పాఠాత్క్రం హారీతకీ. 83

తా. పైత్యోద్రేకగ్రహణుల హరింపంజేయుటయందు కపిత్థాష్టకంబును, శ్లేష్మవాతోద్రేకగ్రహణులయందు పాఠాత్క్రహరీతకియును శ్రేష్ఠంబులు.

### పిత్తాధిక గ్రహణికి కపిత్థాష్టము

యవానీ పిప్పలీమూల చాతుర్జాతక నాగరం,
మరిచాగ్నిజలం జాజీ ధాన్యసౌవర్చలం సమమ్. 84
ద్విగుణం జలకాంబష్ఠా సమం గావరకాత్వచం.
వృక్షామ్లధాతకీ కృష్ణా బిల్వ దాడిమ దీప్యకమ్. 85
త్రిగుణం షడ్గుణసితం కపిత్థాష్టగుణీకృతం,
చూర్ణాతిసారగ్రహణీ క్షయగుల్మాన్ గళామయాన్. 86
*కాసశ్వాసాగ్నిమాంద్యార్శః పీనసారోచకం జయేత్,

తా. ఓమము, మోడి, ఏలకులు, ఆకుపత్రిక, దాచినిచెక్క, నాగకేసరములు, శొంఠి, మిరియాలు, చిత్రమూలము, కురువేరు, జీలకఱ్ఱ, కొతిమెర్లు,సౌవర్చలవణము- ఇవి దినుసుకొక్కొకభాగము, తుంగముస్తెలు, శిరుబొద్ధి, మంజిష్ఠ, లవంగపుచెక్క- ఇవి దినుసుకు రెండుభాగములు, పులిచింత, ఆరెపువ్వు,పిప్పళ్లు, మారేడు, దాడింబకాయ, ఖురాసాని వోమము ఇవి దినుసొకటింటికి 3 భాగములు, పంచదార ౬.భాగములు, వెలగపండ్ల గుజ్జు ౮ భాగములు - ఇటుల వీనినెల్లదంచి చూర్ణముజేసి సేవించిన అతిసారము,గ్రహణి క్షయము, గుల్మము, కంఠరోగము, కాసశ్వాసములు, అగ్నిమాంద్యము, మూలవ్యాధి, పీనస, అరుచి హరించును.

### గ్రహణులకు తక్రాభయము

పాఠాకరంజ యుగ్మాగ్ని శరపుంఖా పునర్నవా.
కృష్ణనింబ మహానింబ లశునం బర్బురం పచేత్, 87
పృథగ్దశపలం ద్రోణే జలే పాదావశేషితమ్. 88
కాంస్యపాత్రం దధిపటు ప్రస్థం ద్విప్రస్థకాంజికం,
క్షిప్త్వా తన్మధ్యఖండాని పథ్యా త్వక్చ శతద్వయమ్. 89
తద్వచ్చ నాగరం తైలం ఘృతంచ కుడవద్వయం,
సుసిద్ధే లేహ్యతాం యాతే యవానీ జరకద్వయమ్. 90
హింగు వ్యోష యవ క్షారం ద్విపలంచ విచూర్ణితం,
సమవాప్య తతః ఖాదేత్తక్రేణాలోడ్యవా పిబేత్. 91
ఇయం తక్రాభయా హంతి సకలాన్ గ్రహణీ గదాన్;
షడ్విధానప్యతీసారా నజీర్ణాన్ వివిధానపి. 92

* కాసశ్వాసారుచీ హిక్కాః కపిత్థాష్టమిదం జయేత్.

అగ్నిమాంద్యంచ గుల్మంచ శీఘ్రం హన్యా న్నసంశయః,
(మాధవనిదానే)

తా. శిరుబొద్దివేరు, క్రానుగచెక్క, నెమలిచెక్క, చిత్రమూలము, ములువెంపలివేరు, గలిజేరువేరు, కరివేపాకు, పెద్దమ్రానుచెక్క, వెల్లుల్లి, వాయింట - వీనిని దినుసొకటింటికి పదిపలములచొప్పున గ్రహించి దంచి ద్రోణప్రమాణము నీళ్లుపోసి నాలవభాగము శేషించునటుల కషాయముగాచి వడియగట్టి అందు పెరుగొకఆఢకము, సైంధవలవణము ఒకప్రస్థము, బియ్యపుకడుగు ౨ ప్రస్థములు, ౨౦౦ కరక్కాయలబెరడు చూర్ణము కరక్కాయలకుసమముగ శొంఠిచూర్ణము కలిపి పిదప తెల్లఆవనూనె, నెయ్యి, రెండుకుడపములుపైచి మృద్వగ్నిలో లేహ్యపక్వముగ కాచి అందు ఓమము, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, నేతితో పొంగించినఇంగువ, త్రికటుకములు, యవక్షారము అనువానిచూర్ణమును దినుసుకు ౨ పలముచొప్పున కలిపి ఒకపాత్రలోనునిచి ప్రతిదినము కర్షమెత్తును అనుపానరహితముగాగాని, లేక చల్లయొక్క యనుపానముతోడగాని సేవించిన సర్వగ్రహణులు, ఆరువిధములైన అతిసారములు, సర్వాజీర్ణములు, అగ్నిమాంద్యము, గుల్మము శీఘ్రముగ హరించును.

### గ్రహణీరోగోపచారవిశేషములు

దీపనీయాని సర్వాణి చూర్ణారిష్టఘృతానిచ. 93
ప్రవిభజ్య యథావస్థం యోజయే ద్గ్రహణీగదే,

తా. దీపనకరసర్వచూర్ణములు, అరిష్టములు, ఘృతములు- వీనిని గ్రహణీరోగములయం దవస్థాంతరభేదముల నెఱింగి ప్రయోగింపవలయును.

### సర్వాతిసారములకు పథ్యాదివటికములు

పథ్యా విశ్వపున ర్నవాగులికణా పూతీకయుగ్మం ఝషా
వారాపాటలికా కలాయ కదళం పుంఖీజలప్రస్థకే,
క్వాథే హింగుక దీప్యకం త్వతివిషా వ్యోషం పలార్ధం పృథక్
క్షిప్త్వా మాతుకపాద మాఢకయుగం తక్రంచ యోజ్యం తతః.
తద్వద్వోజ్యపలాష్టకంచ కుటజం షష్టిం క్షిపేచ్చాభయాః
చూర్ణీకృత్యఘృతంసుయోజ్య కుడవంతద్వచ్చ తైలం క్షిపేత్,
తద్వన్నాగరచూర్ణ కేనసహితం వాలంచ జాతీఫలం
మారీచంచ పలంపలం సువిపచేత్పూగప్రమాణావటీః

లిహ్యాన్నిత్యమిమాం వటీంతు మధునా సర్వాతిసారాంజయేత్.

(ఆయుర్వేదే)

తా. కరక్కాయ, శొంఠి, గలిజేరు, తంగేడు, పిప్పళ్లు, నెమలిచెక్క, క్రానుగు, జిబిలికవేళ్ళు, నేలతాటిగడ్డలు, కలిగొట్టు, సెనగాకు, ములువెంపలివేళ్ళు - వీనిని సమభాగములుగ దంచి ప్రస్థప్రమాణ ముదకముపోసి చిక్కగకషాయముకాచి వడియగట్టి అందు ఇంగువ, ఓమము, అతివస, త్రికటుకములు అనువానిచూర్ణము దినుసుకు అరపలము, తేనె కషాయమున నాలవభాగము, మజ్జిగ ౨ ఆఢకములు, కొడిసె చూర్ణము ౮ పలములు, ౬౦ కరక్కాయలచూర్ణము, నెయ్యి ౧ కుడవము, ఆవనూనె ౧ కుడవము, శొంఠిచూర్ణము ౧ కుడవము, వట్టివేరు, జాజికాయ, మిరియాలు అనువానిచూర్ణమును దినుసు కొక్కొకపలముచొప్పున కలిపి పాకముజేసి పోకలంతమాత్రలుజేసి యందొకదానిని తేనెతో సేవించిన సర్వాతిసారములు (గ్రహణులు) హరించును.

గ్రహణులకు పూతికాదియోగము

పూతీక శర పుంఖాగ్ని శుంఠీ చవ్య పునర్నవైః,
బిల్వ ముస్తాలుకకణా మూలపాఠారసోనకైః. 96
నక్తమాలకభార్గీవా కైడర్యక్షుద్రకంటకైః,
క్వాథ మష్టావశేషంతు లవణం మథితం తథా. 97
ధాన్యామ్లమాఢకం పథ్యా శతం సింధుపలాష్టకం,
పునారసాంతం విపచే ద్ద్వాదశాహం విచక్షణః. 98
సుచూర్ణితైః ప్రతీవాత్య ప్రత్యేకం కర్షసమ్మితం
త్వక్పత్రవహ్నివ్యోషాబ్ద పాఠా దీప్యకధాన్యకైః 99
కర్కోటహింగుళం చైలా నిశా ద్విక్షారజీరకైః,
మోచాహ్వా బర్బరీ దంతి వచా తిందుక సైంధవైః. 100
భక్షయే త్ప్రాతరుత్థాయ భుక్తాంతేచ మితాశనః,
సర్వశూల గ్రహణ్యర్శో వహ్నిమాంద్య మరోచకమ్. 101
జాఠరం క్రిమిజాలంచ పాండురోగం కఫాత్మకం,
ఆనాహ శూల ప్లీహంచ హంతి చక్రమివాసురాన్. 102

(సిద్ధసంగ్రహే)

తా. *నెమలిచెక్క, ములువెంపలివేళ్లు, చిత్రమూలము, సొంటి, చవ్యము, గలి రువేరు, మారేడు, తుంగముస్తెలు, తంగేడు, అగరులు, మోడి, శిరుబొద్ది, వెల్లుల్లిపాయల క్రానుగచెక్క, పెద్దగురిజవేరు, పెద్దమ్రానుచక్క, నేలములక-వీనిని సమభాగములుగ దం మణుగునీరుపోసి ఎనిమిదవభాగముగ కషాయముగాచి వడియగట్టి అందు ఉప్పు, మ గ, పులిగడుగు అనువానిని దినుసొకటింటికి అథకప్రమాణము-౧౦౦ కరక్కాయలజెరడ ౦ పలములు సైంధవలవణము గలిపి ౧౧ దినములు చిక్కగవండి దించికొని యం ఆకుపత్రిక, చిత్రమూలము, త్రికటుకములు, తుంగముస్తెలు, శిరుబొద్ది,ఓమము, కొలిమెర్ ఆకాకర, ఇంగువ, ఏలకులు, పసపు, సర్జక్షారము,జీలకఱ్ఱ, బూరుగబంక, వామింట, నే దంతి, వస, ముచ్చుతుమికి, సైంధవలవణము అనువానిచూర్ణమును దినుసుకు కర్షప్రమా ముచొప్పున కలిపి నాలుగుమాడలయెత్తున ప్రాతఃకాలమున సేవించి పిదప మితముగ న్నమును భుజించిన సర్వశూలలు, గ్రహణులు, మూలవ్యాధులు, అగ్నిమాంద్యము, అరో చకము, ఉదరమునందలి క్రిములు, పాండువులు, కఫరోగము (అనఁగా దగ్గు), ఆనాహమ పార్శ్వశూల, ప్లీహరోగము - వీనిని "విష్ణుచక్రము నసురుల నాశనముజేయుభంగి "న శనముజేయును.

## గ్రహణ్యాతిసారములకు అగ్నికర్మవిధి

శృణు దేవి ప్రవక్ష్యామి దేవత్వం కథయ స్స మే,
అగ్నివైద్య మతఃకార్యం శృణుష్వాయతలోచనే. 10
ఇత్యాదేశేన మతిమాన్ దహే ల్లోహశలాకయా,
వీణాస్థివమూలే శత్రాభం నాభేచ్ఛ ద్వ్యంగుళాదధః. (శారీరే) 10

తా. పైయౌషధముల సేవనవలన గ్రహణ్యాతిసారములు నివర్తింపకుండిన అగ్ని కర్మను జేయవలయునని ఈశ్వరుడు పార్వతి కుపదేశించినందున ఇనుపశలాకనుకాల్చి ముడ్డిపూసటెముకతిరుగువారల చక్రాకారముగను, బొడ్డుకురెండు వ్రేళ్ళక్రింద నడ్డము ను రతవేయవలయును (శూలపుట్టి గ్రహణ్యాతిసారములు నివర్తింపకుండిన బొడ్డుదిరుగ వార రతవేయవలయును. ఈగ్రహణ్యాతిసార సాధ్యాసాధ్యములనెఱింగి అం దసాధ్యమ లగు వానిని వర్జించి సాధ్యంబులగువానికే చికిత్సంజేయవలయును.

## వాతాతిసారమునకు కనకసుందరరసము

శుద్ధసూతం సమంగంధం మరీచం టంకణం కణా,

* ఇదే నెమలడుగుచెక్క.

స్వర్ణబీజం సమం మర్ద్యం భృంగిద్రావై ర్దినార్ధకమ్. 105
సూతతుల్యం విషం యోజ్యం రసః కనకసుందరః,
దేయం గుంజాద్వయం హంతి వాతాతీసారమద్భుతమ్. 106
దధ్యన్నం దాపయే త్పథ్య మాజంవాథ గవాందధి,
(మాధవనిదానే)

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, మిరియాలు, వెలిగారము, పిప్పళ్లు, శుద్ధిజేసిన ఉమ్మెత్తవిత్తులు, శుద్ధిజేసిననాభి - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గుంటగలగరాకురసముతో ౨ ఝామలు మర్దించి రెండుగురిగింజలంతేసి మాత్రలుచేసి యందొకదానిని తేనె, పిప్పలితో సేవించిన వాతాతిసారము హరించును. పథ్యము - మేక పెరుగన్నమునుగాని, లేక ఆవుపెరుగన్నమును గాని భుజింపవలయును.

వాతాతిసారహితకరద్రవ్యములు

భంజీ శాల్మలి రక్తాక్షీ కపిత్థం దాడిమాన్యథ. 107
శ్లేష్మాటో బదరీవాథ క్షీరిణీవాకుచీశివా,
తక్కారీవా బలీచైషాం బాలపత్రాణి వా పునః. 108
పక్వాని వ్యంజనార్థాయ యోజయే దతిసారిణామ్. 109

తా. భారంగి, బూరుగ, గుగ్గిలము, వెలగ, దాడింబ, విరిగి, జేగు, పాల చెట్టు, భావంచి, కరక, తక్కెడ వీనిలేతయాకులనుగాని, లేక ముదిరినయాకులనుగాని యథా రోగ్యముగ కూరగవండి భుజించుట వాతాతిసారమునందు హితకరంబు.

సర్వగ్రహణ్యతిసారములకు మృతసంజీవనీరసము

కర్పూరం రసగంధకంచ దరదం తీక్ష్ణోద్భవం భస్మకం
కాలేయేంద్రయవాజమోద హుతభుక్చించాస్థికం ధాతకీ,
ఏలామాంసి లవంగ శాల్మలి మలం జాతీఫలం టంకణం
నీకాసింధుభవం విషం సమమిదం ప్రత్యేకనిష్కాన్వితమ్. 110
సర్వేషాం సదృశంచ బిల్వఫలకం కాంతాభ్రసిందూరకం
సిందూరంచ సఫేనకంచ తులితం దుత్తూరబీజం క్షిపేత్,
భంగాపత్రక కోకిలాక్షసహితం సర్వంచ చూర్ణీకృతం
దుత్తూరస్వరసేన సంతతమిదం సమ్మర్దయేద్యామకమ్. 111
జంబీరస్వరసేన మర్దితమిదం గుంజాప్రమాణావటీ
సేవ్యాచేన్మధునా జయేద్భృశమిమం రక్తాతిసారం పరం,

సర్వంచ గ్రహణీగదేషు సహజే ష్వామాతిసారేషుచ
తద్వచ్ఛూలయుతాంశ్చ దుస్తరతరాన్ నానాతిసారాన్ జయేత్.

(సిద్ధరసార్ణవే)

తా. కర్పూరము, శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, శుద్ధిచేసిన ఇంగిలీకము, ఇనుపభస్మము, కస్తూరిపసపు, కోడిసెపాల, అజామోదము, చిత్రమూలము, చింతగింజలు, ఆరెపువ్వు, ఏలకులు, జటామాంసి, లవంగములు, బూరుగబంక, జాజికాయ, వెలిగారము, సముద్రఫలపువిత్తులు, సైంధవలవణము, శుద్ధిచేసిననాభి - ఇవి దినుసుకొకటింటికి నిష్క ప్రమాణము - వీనికన్నిటికిసమము మారేడుజేసము, కాంతభస్మము, అభ్రకసిందూరము, రససిందూరము, శుద్ధిచేసినల్లమందు, శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు, శుద్ధిచేసిన గంజావియాకు, నీరుగొలిమిడివిత్తులు అనువానిచూర్ణము - ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి ఉమ్మెత్త వేళ్ళరసముతో నొకఝాము, నిమ్మపండ్లరసముతో నొకఝాము మర్దించి గురిగింజలంత మాత్రలుచేసి యందొకదానిని తేనెతో సేవించిన రక్తాతిసారము, సర్వగ్రహణులు, సహజాతిసారము, ఆమాతిసారము, శూలతోగూడి అసాధ్యములుగనుండు పలువిధాతిసారములు హరించును.

## గ్రహణులకు మరీచవటికములు

దుత్తూరమూలజం కల్కం మరీచ్యాచ సమన్వితం,
ఇమాం గుంజద్వయాం మాత్రాం తైలయుక్తేన యేన్నరః. 113
మలవేగం రుణద్ధ్యేత త్సేతుబంధ ఇవోదధిం,

తా. ఉమ్మెత్తవేళ్లకల్కమునకు సమముగ మిరియపుచూర్ణముగలిపి మర్దించి రెండు గురిగింజలయెత్తు మాత్రలుజేసి తెల్లఆవనూనెతో సేవించిన "సముద్రమును శ్రీరాములు వారధి కట్టినభంగి" గ్రహణ్యాతిసారములు బంధించును.

## గ్రహణ్యాతిసారాదులకు మదవారణసింహరసము

సురభిపారదహింగుళచిత్రకాన్ గగనభ్రష్టసుటంకణజాతికాన్,
కనకబీజమథోఽతివిషా కటుత్రయ హారీతకిభస్మసుదీప్యకాన్. 114
గరళ బిల్వ కపిత్థ కళింగకాన్ నలదమోచక దాడిమ ధాతకీ,
జలదశాల్మలి పిచ్ఛయుతాన్ సమాన్ కనకసామ్యమ ఫేనమిదంద్రుఢమ్.
కనకపత్రరసైః పరిమర్దయే న్మరిచ మానవటీ మధుసంయుతా,
వినిహరేద్గ్రహణీగదముత్కటం జ్వరయుతామసతీంచవిషూచికామ్

అగ్నిమాంద్య మథ శూల విబంధకం
గుల్మశూల మథ పాండు మమందకం,
సరుధిరామమతీవ సముత్కటం
గ్రహణికా మదవారణసింహకః. (ఆయుర్వేదే) 117

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిజేసిన ఇంగిలీకము, చిత్రమూలము, అభ్రకభస్మము, పేల్చినవెలిగారము, జాజికాయలు, శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు, అతివస, త్రికటుకములు, కరక్కాయపసి, ఓమము, శుద్ధిచేసినవాభి, మారేడుగుజ్జు, వెలగబేసము, కొడిసెకాయ, వట్టివేరు, అరటిదుంప, దాడింబకాయ, ఆరెపువ్వు, తుంగముస్తెలు, బూరుగబంక, శుద్ధిచేసిననల్లమందు - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి ఉమ్మెత్తాకురసముతో మర్దించి మిరియపుగింజలంత మాత్రలుచేసి తేనెతో సేవించిన ప్రబలమైన గ్రహణులు, జ్వరముతోగూడి దుష్టముగనుండు విషూచి, అగ్నిమాంద్యము, శూల, మలబద్ధము, సర్వగుల్మశూలలు, తీవ్రమైన పాండురోగములు, దారుణమైన రక్తస్రావముతోగూడియుండు ఆమము - వీనిని హరింపంజేయును.

### సర్వగ్రహణ్యాతిసారములకు లోకనాథరసము

శుద్ధసూతం విషం గంధం టంకణం లోహభస్మకమ్,
జాతీఫలం ధాతకీచ వరాంగం చిత్రమూలకమ్. 118
జీరకం నాగరం సింధు చూతబీజం సపిప్పలీ,
మోచాపిచ్ఛం బిల్వమజ్జా ముస్తాచాతివిషా పృథక్. 119
సప్తభాగ మఫేనంచ సర్వతుల్యం మృతాభ్రకం,
దుత్తూరత్వక్కషాయేణ మర్దితం యామమాత్రకమ్. 120
బదరాస్థి సమం ఖాదే ద్వహ్నిదీప్తికరం పరం,
అనుపానవిశేషేణ గ్రహణీంచ చిరంతనామ్. 121
సర్వాజీర్ణప్రశమన మనుపానంచ మాక్షికం, (సిద్ధరసార్ణవే)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినవసనాభి, శుద్ధిచేసినగంధకము, వెలిగారము, లోహభస్మము, జాజికాయ, ఆరెపువ్వు, లవంగపుచెక్క, చిత్రమూలము, జీలకఱ్ఱ, శొంఠి సైంధవలవణము, మామిడిపప్పు, పిప్పళ్లు, బూరుగబంక, మారేడుబేసము, తుంగముస్తెలు; అతివస - ఇవి దినుసు కొక్కొక భాగము, శుద్ధిజేసిననల్లమందు 2 భాగములు, వీనికన్నిటికిసమము అభ్రకభస్మము-ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి నల్లఉమ్మెత్తవేళ్లపట్టకషాయముతో నొకరఝాముమర్దించి రేగుపండంత మాత్రలు జేసి అనుపాన

పానవిశేషములతో సేవించిన అగ్నిమాంద్యము, చిరకాలముగనుండు సర్వగ్రహణులు (అతిసారములు) హరించును. మఱియు దీనిని తేనెతో సేవించిన సర్వాజీర్ణములు హరించును.

### కనకసుందరరసము

హింగుళం మరిచం గంధం పిప్పలీ టంకణం విషమ్. 122
కనకస్యచ బీజాని సమాంశం విజయాద్రవైః,
మర్దయే ద్యామమాత్రంతు చణమాత్రా వటీకృతా. 123
భక్షణాద్గ్రహణీం హంతి రసః కనకసుందరః,
అగ్నిమాంద్యం జ్వరం తీవ్ర మతిసారంచ నాశయేత్. 124
దధ్యన్నం దాపయే త్పథ్యం తథా తక్రోదనం చరేత్,

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము, మిరియాలు, శుద్ధిచేసిన గంధకము, పిప్పళ్లు, వెలిగారము, శుద్ధిజేసిననాభి, శుద్ధిజేసిన ఉమ్మెత్తవిత్తులు - వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి గంజాయియాకురసముతో నొకఝాము మర్దించి సెనగగింజలంత మాత్రలుజేసి సేవించిన అగ్నిమాంద్యము, తీవ్రజ్వరము, సర్వాతిసారములు, గ్రహణులు హరించును. దీనియందు పెరుగు లేక మజ్జిగయన్నమును భుజించుట పథ్యకరము.

### గ్రహణీగజకేసరిరసము

పారదం వ్యోమ గరళం హింగుళం సురభిర్బలిః. 125
ఆయసం టంకణంచైవ ధూర్తబీజం సవత్సకం,
వ్యోషా చిత్రకజాజీచ వయస్థా దగ్ధభస్మచ. 126
అజామోదా ప్రతివిషా కుబేరాక్షీ తథైవచ,
కపిత్థ బిల్వ పైశాచ మేతేచ సమభాగినః. 127
ఏతత్సమ మహిఫేనంచ ధుత్తూరరసమర్దితం,
వాసరం మర్దితం కల్కం మరీచస్య ప్రమాణతః. 128
మాక్షికేణ లిహే దేవం శుంఠీరససమన్వితం,
జ్వరాతిసార గ్రహణి గుల్మ శూల మజీర్ణకమ్. 129
రక్తాతిసార ప్రదరం విషూచీ పాండురోగనుత్,
దీపనం కురుతేఽతీవ గ్రహణీ గజకేసరీ. (ఆయుర్వేదే) 130

తా. శుద్ధిజేసినరసము, అభ్రకభస్మము, శుద్ధిజేసిననాభి, శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసినగంధకము, ఉక్కుభస్మము, వెలిగారము, శుద్ధిజేసిన ఉమ్మెత్తవిత్తులు, కొడిసెపాల,

త్రికటుకములు, చిత్రమూలము, జాజికాయ, కరక్కాయలమసి, అజామోదము, అతివస, గచ్చపలుకులు, వెలగపంటిబేసము, మారేడుబేసము, లేక మారేడుపిందెలు, బూరుగబంక - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి ఖల్వములోనునిచి దానికి సమముగ శుద్ధిజేసిన నల్లమందుగలిపి ఉమ్మెత్తవేళ్ళరసముతో నొకదినము మర్దించి మిరియపుగింజలంత మాత్రలుజేసి యందొకదానిని తేనెతోగాని, లేక శొంఠిరసముతోగాని సేవించిన జ్వరము, అతిసారము, గ్రహణులు, గుల్మము, శూల, అజీర్ణము, రక్తాతిసారము, ప్రదరము, విషూచి, పాండువు వీనిని హరింపజేసి మిక్కుటముగ అగ్నిదీపనమును గలుగంజేయును.

## అతిసారాదులయందు పథ్యము

పటోల కుటజా జాజీ చక్రికా కదళీఫలం,
బిల్వం దధిచ ఛాగ్యాశ్చ తైల కైడర్య వాస్తుకమ్. 131
నిద్రాకరంచ శాకం చ కపిత్థం తువరీరసం,
అతిసారే గ్రహణ్యాంవా రంభాపుష్పం హితం విదుః. 132
(మాధవనిదానే)

తా. పొట్లకాయ, కొడిసెకాయ, జాజికాయ, పులిచింత, అరటిపండు, మారేడుకాయ, మేకపెరుగు, తెల్లఆవనూనె, పెద్దమ్రానుచెక్క, చక్రవర్తికూర, నిద్ర, క్రానుగచిగుళ్లు, వెలగపండు, కందికట్టు, అరటిపువ్వు-ఇవి గ్రహణ్యతిసారములయందు హితకరంబులు.

## అతిసారాదులయం దపథ్యము

తిల నిష్పావ కూష్మాండ కర్కోటక ముపోదికీ,
అలాబు కంద పూపంచ మాంసం మద్యం గుడం హిమమ్. 133
ఆమ్లాంబుపాన తాంబూలం స్నానం జాగర సంగమం,
గ్రహణీష్వతిసారేషు త్యాజ్యం మానం గురూణి చ. 134

తా. నువ్వులు, అనుములు, గుమ్మడుకాయ, కాకరకాయ, బచ్చలికూర, ఆనుగపుకాయ, కందగడ్డ, పిండివంటకములు, మాంసము, కల్లు, బెల్లము, శీతకరవస్తువులు, పులుసు, మిక్కుటముగ నీరు త్రాగుట, తాంబూలము, స్నానము, జాగరణము, స్త్రీసంగమము, కోపము, జడకరపదార్థములు - వీనిని గ్రహణ్యతిసారములయందు వర్జింపవలయును.

## దశమ ప్రకరణమ్.

# ఏకాదశప్రకరణము

## ఉదరరోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లో॥ శంకరం నిర్మలాకారం బాలచంద్రకళాధరం,
స్థాణుం చోమాపతిం శర్వం భజేహం మల్లికార్జునమ్. 1

తాత్పర్యము. సుఖకరుఁడు, నిర్మలస్వరూపుఁడు, బాలచంద్రకళాధరుఁడు, అచంచలుఁడు, పార్వతీవల్లభుఁడు, శర్వుఁడు నగుమల్లికార్జునుని నేను భజియించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేరొకానంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథము యొక్క ఏకాదశప్రకరణమును వచింపుచున్నాఁడను.

### ఉదరనిదానము

రోగాస్సర్వేపి మందేఽగ్నౌ సుతరా ముదరాణిచ,
అజీర్ణా న్మలినై శ్చాన్నై ర్జాయంతే మలసంచయాత్. 3

(ఆయుర్వేదే)

తా. అగ్నిమాంద్యము త్రిదోషజనితంబగుటచే సర్వరోగములు జనించుటకు కారణంబుగనుండును. అందు ఉదరము ముఖ్యముగ జనించును. మఱియు అజీర్ణము, మలినాన్నము (అనఁగా విరుద్ధాద్యశనాదికములు), మలసంచయము (అనఁగా దోషపురీషాదులసంచయము) అనువానివలనకూడా ఉదరరోగము జనించును.

### ఉదరసంప్రాప్తి

రుద్ధ్వా స్వేదాంబువాహీని దోషా స్స్రోతాంసి సంచితాః,
ప్రాణాగ్న్యపానా స్సందూష్య జనయంత్యుదరం నృణామ్. 4

తా. వాతాదిదోషములు స్వేదము, ఉదకము అనువానిని వహించుచుండు స్రోతస్సులయందు సంచితంబులై వృద్ధిం జెంది ప్రాణవాయువు, అగ్ని, అపానవాయువు అనువానిని కడుదుష్టయుక్తంబుగ జేసి మనుజులకు ఉదరరోగమును గలుగం జేయును.

ఉదరరోగసామాన్యరూపము

ఆధ్మానం గమనే శక్తి ర్దౌర్బల్యం దుర్బలాగ్నితా,
శోఫస్సదనమంగానాం సంగో వాతపురీషయోః. 5
దాహ స్తంద్రాచ సర్వేషు జఠరేషు భవంతిహి, (మాధవనిదానే)

తా. కడుపుబ్బుట, నడుచుటకు శక్తిలేకుండుట, దౌర్బల్యము, అగ్నిమాంద్యము, వాపు, అంగములయందు గ్లానిగలుగుట, వాతము, మలము బద్ధగించుట, తాపము, తంద్ర గలుగుట - ఈలక్షణములు సర్వోదరములయందు గలుగును.

ఉదరసామాన్యలక్షణము

యేన శుష్యతి సర్వాంగం జఠరం వర్ధతే భృశమ్. 6
ఉదరం తం విజానీయా త్తదష్టవిధముచ్యతే, (శారీరే)

తా. సర్వాంగములు కృశించి మిక్కుటముగ కడుపుబ్బిన ఉదరరోగమని తెలియవలయును. ఆ యుదరరోగములు ౮ విధంబులు.

ఉదరరోగవిశేషలక్షణములు

పృథగ్దోషైస్సమస్తైశ్చ ప్లీహాబద్ధక్షతోదకైః. 7
సంభవంత్యుదరాణ్యష్టౌ తేషాం లింగం పృథక్ఛృణు,
క్షతమూర్ధ్వమధోబద్ధ ముదకంతు సమంతతః. 8
నాభేః ప్లీహా వామపార్శ్వే దోషజం దోషలక్షణం,
సాధ్యం ప్లీహం చైకదోషం శేషం త్యాజ్యం చతుష్టయమ్. 9
(ఆయుర్వేదే)

తా. వాతోదరము, పిత్తోదరము, శ్లేష్మోదరము, త్రిదోషోదరము, ప్లీహోదరము, బద్ధోదరము, క్షతోదరము, జలోదరములన ఉదరరోగము ౮ విధంబులు. వానిలక్షణముల ప్రత్యేకముగ వచించెద వినుము. బొడ్డుకు పైభాగమున జనించునది క్షతోదరమనియు, బొడ్డుకు క్రిందిభాగమున జనించునది బద్ధోదరమనియు, బొడ్డుకుచుట్టూ జనించునది జలోదరమనియు, బొడ్డు కెడమపార్శ్వమున జనించునది ప్లీహోదరమనియు, వాత పిత్త శ్లేష్మములవలన జనించునవి దోషజోదరములనియు, వాతపిత్త శ్లేష్మలక్షణయుక్తంబై జనించునది త్రిదోషోదరమనియు తెలియవలయును. అందు ప్లీహోదరము, వాత, పిత్త, శ్లేష్మోదరములు అనునీనాలుగును సాధ్యంబులు. తక్కినవి నాల్గుగును అసాధ్యంబులు.

### ఉదరరోగసామాన్యచికిత్స

ఉదరాణి మలం ధృత్వా బహుశో రేచనం హితం,
లశునాదిక మేరండతైలం తత్ర ప్రశస్యతే. 10

(సిద్ధరసార్ణవే)

తా. పైఁజెప్పఁబడిన యెనిమిదియుదరములు మలాధిక్యమువలన జనించును. అట్లగుటంజేసి వానియందు తఱుచుగ లశునాద్యేరండతైలమువలన విరేచనము చేయించుట ప్రశస్తంబు.

### వాతోదరలక్షణము

తత్ర వాతోదరే శోఫః పాణి పన్నాభి కుక్షిషు,
కుక్షి పార్శ్వోదర *కటి సవ్యథంచ కృశాంగతా. 11
ముహుర్ముహుశ్చ సంతాపో శుష్కకాసేన లక్షయేత్,

(మతాంతరే)

తా. మీఁజేతులు, మీఁగాళ్లు, నాభి, కుక్షి అనువానియందు శోఫగలుగుట, కుక్షి, పార్శ్వములు, కడుపు, కటిప్రదేశము అనువానియందు సూదులతో బొడుచునటుల వేదనగలుగుట, శరీరము కృశించుట, పలుమారు సంతాపము, పొడిదగ్గు గలుగుట-ఈలక్షణములు గలది వాతోదర మని తెలియవలయును.

### పైత్త్యోదరలక్షణము

జ్వరో మూర్ఛాచ తృడ్దాహశ్చ కటుకాస్యంచ జృంభణమ్. 12
భ్రమోఽతిసార స్వేదశ్చ పిత్తజోదరలక్షణం, (మాధవనిదానే)

తా. జ్వరము, మూర్ఛ, దప్పి, తాపము గలుగుట, నోరు చేదుగ నుండుట, ఆవలింతలు గలుగుట, తబ్బిబ్బులాడుట, అతిసారము, చెమటగలుగుట-ఈలక్షణములు గలది పిత్తోదర మని తెలియవలయును.

### శ్లేష్మోదరలక్షణము

శ్వయథు ర్గౌరవం నిద్రా కాసశ్వాసశ్చ పాండుకృత్. 13
ఉదరం స్తిమితం స్నిగ్ధం శీతస్పర్శః కఫోదరే,

తా. వాపు గలుగుట, శరీరము జడముగనుండుట, ఎల్లపుడు నిదురగలుగుట, దగ్గు, ఉబ్బసముగలుగుట, చర్మాదులు తెల్లగనుండుట, కడుపు కదలక మెఱయుచుండుట, కడుపుదాకిన చల్లగనుండుట-ఈలక్షణములుగలది శ్లేష్మోదరమని తెలియవలయును.

---

* కటీ పృష్ఠరుక్పర్వభేదనమ్.

## సన్నిపాతోదరలక్షణము

త్రిదోషలక్షణైర్యుక్తం సన్నిపాతోదరం భవేత్. 14
దేహంచ పాండురం మూత్ర మగ్నిరక్షణముత్తమం,
(మాధవనిదానే)

తా. వాత, పిత్త, శ్లేష్మలక్షణంబు లన్నియుంగలది సన్నిపాతోదరమని తెలియవలయును. దానియందు శరీరము, మూత్రము, పాండువర్ణముగనుండును. మఱియు "రోగాస్సర్వేఽపి మందేగ్నౌ సుతరా ముదరాణిచ" అను వచనప్రకారము ఉదరమునకు మందాగ్నియే ప్రధానంబు. అట్లగుటంజేసి దీనియందు ముఖ్యముగ నగ్నిదీప్తికరములగు నౌషధముల నొసంగవలయును.

## జలోదరలక్షణము

ఉదరం సజలం యస్య వర్ధతే శ్వయథుస్తథా.
హస్తపాదే కృశత్వం చ స్యాజ్జలోదరలక్షణం, (మాధవనిదానే)

తా. ఉదరంబంతయు జలయుక్తమై మిక్కుటముగ పెరుగుట, బొడ్డువాయుట, చేతులు కాళ్లు కృశించుట-ఈలక్షణములుగలది జలోదరమని తెలియవలయును.

## ప్లీహోదరలక్షణము

ప్లీహోదరంకీర్తయతో నిబోధవిదాహ్యభిష్యందిరతస్యజంతోః,
ప్రదుష్టమత్యర్థమసృక్కఫశ్చ ప్లీహాభివృద్ధిం కురుతః ప్రవృద్ధౌ. 16
ప్లీహోత్థమేతజ్జఠరం వదంతి తద్వామపార్శ్వే పరివృద్ధిమేతి,
విశేషతస్సీదతిచాతురోఽత్ర మందజ్వరాగ్నిః కఫపిత్తలింగైః. 17
ఉపద్రుతః క్షీణబలోఽతిపాండుః ప్లీహోదరం సాధ్యమితిబ్రువంతి

తా. ప్లీహోదరలక్షణమును వచించెదను వినుము. [1]విదాహకరపదార్థముల [2]అభిష్యంది పదార్థముల ఎల్లపుడు సేవించుటవలన రక్తకఫములు మిక్కుటముగదుష్టంబులై వృద్ధిజెంది ఎడమపార్శ్వమున ప్లీహాభివృద్ధిని గలుగంజేయును. దీనినే ప్లీహోదరమని వచించెదరు. అందు మిక్కుటముగ శరీరశైథిల్యము, స్వల్పజ్వరము, అగ్నిమాంద్యము, కఫపిత్తోదర లక్షణములు, బలక్షయము, శరీరమున తెలుపువర్ణము గలుగును. ఈప్లీహోదరము సాధ్యము.

---

1 విదాహి యన - వంశకరీరాదులు. 2 అభిష్యంది యన-దధ్యాదిజిగటపదార్థములు.

ప్లీహాణాం పృష్ఠదేశేచ రక్తస్రావం చ కారయేత్. 18
(రసరత్నాకరే)

తా. ప్లీహోదరమున వీపునందు రక్తస్రావముఁ జేయింపవలయును.

బద్ధగుదోదరలక్షణము

యస్యాంత్రమన్నై రుపలేపిభిర్వా బాలాశ్మభిర్వాపిహితంయథావత్,
సంచీయతే తస్యమలస్సదోష శ్శనై శ్శనై స్సంకరవచ్ఛనాడ్యామ్. 19
నిరుధ్యతే తస్యగుదేపురీషం నిరేతి కృఛ్రాదతిచాల్పమల్పం,
హృన్నాభిమధ్యే పరివృద్ధిమేతి తస్యోదరం బద్ధగుదం వదంతి. 20
(ఆయుర్వేదే)

తా. జిగటగనుండు అన్నశాకశాలూకాదిపదార్థసేవనవలన, సూక్ష్మమైనఱాళ్ళు ఉదరమున బ్రవేశించుటవలన మలవాహినులగు ప్రేగులడ్డగింపఁబడి దానివలన వాతపిత్త శ్లేష్మములు దుష్టంబులై వానితోఁడ మలముకలసి గుదస్థానమునందుండు బోల్లునరముల యందు ఊడవఁబడిన కుప్పవలె క్రమముగ సంచితంబై కడుకష్టముమీఁద కొంచెకొంచె ముగ బైలువెడలును. దానివలన నుదరము, హృదయము, నాభి అనువాని మధ్యమున (అనఁగా అన్నపాకస్థానమున) వృద్ధిజెందును. దానినే బద్ధగుదోదరమని వచించెదరు.

క్షతోదరలక్షణము

శల్యం తథాన్నోపహితం యదంత్రం భుక్తంభినత్త్యాగతమన్యథావా,
తస్మాత్స్రుతోంత్రాత్సలిలప్రకాశస్రావస్రవేద్వై గుదతస్తుభూయః.
నాభేరధశ్చోదరమేతి వృద్ధిం నిస్తుద్యతేదాల్యతిచాతిమాత్రం,
ఏతత్పరిస్రావ్యుదరంప్రదిష్టం క్షతోదరంకీర్తయతో నిబోధ. 22

తా. శల్యములన కంటకశర్కరాదు లన్నముతోఁడఁగలసి పక్వాశయగతంబైయం దుండి బైలువెడలునపుడు నాడులయం దడ్డముగ ప్రవేశించుటవలనగాని, లేక ఆవలిం తచేగాని మిక్కుటముగ భుజించుటవలనగాని ప్రేగులు భిన్నంబులై వానిఛిద్రములవలన పలుమారు స్రవించెడునీరు గుదము, ప్రేగులు అనువానియందు పూరితంబై బొడ్డుక్రింద ఉదరమును గలుగంజేయును. ఇదే క్షతోదరమనియు, పరిస్రావ్యుదరమనియు, గ్రంథాం తరేణ ఛిద్రోదరమనియు జెప్పంబడును. దానియందు సూదులతో బొడుచునటుల, బద్దలు సేయునటుల మిక్కుటముగ వేదనగలుగును. దీని నుపేక్షించుటవలన నిదియ శీఘ్రముగ జలోదరంబగును.

## జలకూర్మోదరలక్షణము

జలకూర్మంతు తంవిద్యా శ్లేష్మవాయుసముద్భవః,
సచ కృఛ్రప్రయత్నేన ప్లీహోదరగుణాన్వితః. 23

(మతాంతరే)

తా. శ్లేష్మవాతమువలన జనించి ప్లీహోదరలక్షణయుక్తంబై కూర్మాకారమైన నుదరముగలదియే జలకూర్మోదర మనంబడును. (ఇది కష్టసాధ్యము. ఇది జలోదరమునం దంతర్భావమును జెందియుండును.)

## అష్టోదరసాధ్యాసాధ్యములు

జన్మనైవోదరం సర్వం ప్రాయఃకృఛ్రతనుం విదుః,
బలినస్తదజాతాంబుయత్నసాధ్యం నవోత్థితమ్. (సిద్ధరసార్ణవే)

తా. ఉదరరోగంబులన్నియు నుత్పత్తిమొదలుకొని తఱచుగ కష్టసాధ్యంబులు. ఐనను సత్వముగలవానికి నవీనముగ జనించిన అజాతోదకోదరము కడుప్రయత్నము వలన సాధ్యంబగును. అజాతోదకోదరలక్షణం బెద్దియనిన (చరకే. శ్లో. "అశోఫ మరుణాభాసం సశబ్దం నాతిభారికమ్, సదాగుడగుడాయంతం సిరాజాలంగవాక్షితమ్, నాభిం విష్టభ్యపాయాతు వేగం కృత్వా ప్రణశ్యతి, హృద్యం క్షణకటీ నాభీగుదం ప్రత్యేక శూలినః, కర్కశం శృజతోపానం నాతిమందేచ పావకే, లోలస్య విరసేచాస్యే మూత్రేఽల్పే సంహతే వశి, అజాతోదకమిత్యేతై ర్వ్యక్తం విజ్ఞాయ లక్షణై" రితి. అనఁగా వాపు, లేక ఎఱుపై శబ్దముతోగూడి బరువులేక ఎల్లపుడు గుడుగుడుశబ్దముతో గూడి గవాక్షిరూపమగు సిరలతో వ్యాప్తంబై యుండ అపానవాతము నాభిలోనుండి లేచి గుదస్థానమువఱకు వ్యాపించియుండు వేగముతోగూడినదై ఱొమ్ము, గజ్జలు, కటిప్రదేశము, బొడ్డు, గుదము అనువానియందు శూలను గలుగంజేయుచు గుదస్థానమును కఠినముగజేయుచు కుక్షి మిక్కుటముగ వృద్ధిం జెంది నీటిచే పూరింపంబడినతోలుతిత్తిని తాకిన పెట్టిన్స్పర్శ, క్షోభ కల్గునో అట్టివానితో తుల్యంబై యగ్నిమాంద్యము, అరుచి, అల్పమూత్రము, మలబద్ధము అనువానితో గూడియుండునది అజాతోదకోదరమని తెలియవలయుననుట.

పక్షాద్బద్ధగుదం తూర్ధ్వం సర్వం జాతోదకం తథా,
ప్రాయో భవ త్యభావాయ ఛిద్రాంత్రం చోదరం నృణామ్. 25

(ఆయుర్వేదే)

తా. బద్ధగుదోదరము ౧౫ దినములకుపిదప నసాధ్యంబగును. ఇత్తెఱంగున నే సరో దరములు నీరైనయెడల మృత్యుప్రదంబులగును. మఱియు ఛిద్రాంత్రోదరము తఱుచు మృత్యుప్రదంబు. ఐనను ఒకానొకపుడు [1]శల్యచికిత్సవలన గాని, లేక శస్త్రచికిత్సవ గాని ఉదకపూరితం బగు ఛిద్రాంత్రము, బద్ధగుదము సాధ్యంబులగును.

ఉదరాసాధ్యలక్షణములు

శూనాక్షం కుటిలోపస్థ ముపక్లిన్నతనుత్వచం,
బల శోణిత మాంసాగ్ని పరిక్షీణం చ వర్జయేత్.

తా. నేత్రములుబ్బుట, శిశ్నము వంకరగనగుట, చర్మము క్లేదయుక్తమై పల్చ నుండుట, సత్వము రక్తము మాంసము జాఠరాగ్ని క్షయించుట - ఈలక్షణములు యుదరరోగిని వర్జింపవలయును.

పార్శ్వభంగాన్నవిద్వేష శోథాతీసారపీడితం,
[2]బలశోణిత మాంసాగ్ని క్షీణం చోదరిణం త్యజేత్.
(మతాంత

తా. పార్శ్వములు పగిలినటులుండుట, అన్నద్వేషము, వాపు, అతిసారము గ గుట, సత్వము, రక్తమాంసములు క్షయించుట, అగ్నిమాంద్యము గలుగుట - ఈలక్ష ములుగల యుదరరోగిని వైద్యుఁడు వర్జింపవలయును.

వాతోదరమునకు అగ్నికుమారరసము

శుద్ధసూతం సమంగంధం శుద్ధతాళం మనశ్శిలా,
తుల్యాంశం చిత్రమూలంచ [3]యామం దుత్తూరజైర్ద్రవైః.
జంబీరైశ్చ తథా మర్ద్యం తదోళం క్రావసంపుటే,
రుథ్వా బహిర్మాషపిష్టై స్తయోర్లేప్యంచ సంపుటమ్.
గోధూమపిష్టికావాథ విలేప్యావస్త్రమృత్తికా,

---

1 బహువిధములగుతృణములు, కాష్ఠములు, పాషాణములు, లోహములు, వ గడ్డలు మొదలగునవి శరీరమునుండి వెడలకుండిన వానిని యంత్ర, శస్త్ర, క్షారాగ వలన వెలికిందీయు నుపాయంబును ప్రణనిశ్చయమును బోధించునది శల్య మనంబడ ఈశల్యచికిత్స సుశ్రుతమున జెప్పంబడియున్నయది. చూడుఁడు.

2 విరిక్తంచాప్యుదరిణం పూర్వ్యమాణం వివర్జయేత్ = విరేచనము జేయించిన సగా కడుపుబ్బుట. 3 యవమాసూరజైర్ద్రవైః.

విశోష్య పాచయేద్యంత్రే ద్విషడ్యామం సువాలుకే. 30
క్రమవృద్ధ్యాగ్నినా పాచ్యం స్వాంగశీతం సముద్ధరేత్,
దశమాంశం విషం దత్వా విషాంశం మృతతామ్రకమ్. 31
జ్వాలాముఖీద్రవైస్సర్వం భావయిత్వా త్రిసప్తధా,
త్ర్యూషణంచ సహైవార్ద్ర ద్రవైర్భావ్యం త్రిసప్తధా.
రసోహ్యగ్నికుమారోఽయం సేవ్యం గుంజాద్వయం సదా,
తాంబూలపత్రసంయుక్త ముదరం వాతగుల్మజిత్. 33
కాకజంఘా కషాయంచ హ్యనుపానం సదాపిబేత్,

(మాధవనిదానే)

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, శుద్ధిజేసినతాళకము, శుద్ధిజేసినమణిశిల, చిత్రమూలము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ఉమ్మెత్తాకు, నిమ్మపండు అనువానిరసములలో ప్రతిదానిచే నొక్కొకర్ఝాము మర్దించి ముద్దజేసి మూకుళ్లలో నునిచి వానిచుట్టు మినుపపిండినిగాని, లేక గోధుమపిండినిగాని మెత్తి పిదప వానిచుట్టు చీలమన్ను లేపనముజేసి ఎండించి వాలుకాయంత్రమునందునిచి మృదు, మధ్య, గాఢాగ్నులతో క్రమముగ ౧౨ ఝాములువండి స్వాంగశీతలమున దీసి ఖల్వములోనునిచి దానికి పదియవభాగము శుద్ధిజేసిననాభి, నాభికిసమముగ తామ్రభస్మము గలిపి జ్వాలాముఖిరసముతో ౨౧ మారుభావనజేసి అందుత్రికటుకచూర్ణముగలిపి అల్లపురసముతో ౨౧ మారు మరల భావనచేసి యందు రెండుగురిగింజలయెత్తును తమలపాకులోనునిచి సేవించి తోడనే పెలుమసంధివేరుకషాయమునుద్రాగినవాతోదరము, గుల్మము హరించును.

వాతోదరమునకు వ్యోషాదిగణచూర్ణము

కటుత్రయం వచా హింగు యవక్షారం విషద్వయమ్. 34
చవ్య తిక్త విడంగాని గజాహ్వాలవణాని చ,
గ్రంథిబిల్వాజమోదంచ గణోవ్యోషాదికస్తథా. 35
ఏతాని సమభాగాని సూక్ష్మచూర్ణాని కారయేత్,
లేహ్యమేరండతైలేన తచ్చూర్ణం బుద్ధిమాన్నరః. 36
బిడాలపతకంచైవ పిబేద్వాకోష్ణవారిణా,
వాతోదరవినాశాయ సర్వోదరవినాశకృత్. 37

తా. త్రికటుకములు, వస, ఇంగువ, యవక్షారము, అతివస, శుద్ధిజేసిననాభి, చవ్యము, చేదుపొట్ల, వాయువిడంగములు, ఏనుగపిప్పలి, పంచలవణములు, గ్రంథితగ

రము, మారేడు, ఓమను-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి బిడాలపదక ప్రమాణ మును ఆముదముతోగాని, లేక యొకింత ఉష్ణోదకముతోగాని సేవించిన వాతోదరము, సర్వోదరములు హరించును.

### పైత్త్యోదరమునకు త్రైలోక్యసుందరరసము

శుద్ధసూతం ద్విధాగంధం మృతాభ్రం సైంధవం విషం,
కృష్ణజీరం విడంగంచ గుడూచీ సత్వమేవచ.
*వాసాచైవ యవక్షారం ప్రత్యేకం స్యాద్రసార్ధకం,
నిర్గుండికాద్రవైశ్చాపి బీజపూరరసైర్దినమ్.
మర్దయేచ్ఛోషయేత్సోయం రసస్త్రైలోక్యసుందరః,
గుంజాద్వయం ఘృతైర్లేహ్యం పైత్త్యోదరకులాంతకమ్. 40
పలైకం చిత్రకం శ్లక్ష్ణం ద్విగోమూత్రశకృజ్జలైః,
పాచ్యం పాదావశేషం చ ఘృతప్రస్థం విపాచయేత్. 41
పలైకం చ యవక్షారం క్షిప్త్వా పక్త్వావతారయేత్,
తత్కార్షికం పిబేచ్చాను స్నిగ్ధముష్ణంచ భోజయేత్. 42
(మాధవనిదానే)

తా. శుద్ధిజేసిన రసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు, అభ్రక భస్మము, శుద్ధిజేసినసైంధవలవణము, శుద్ధిజేసిననాభి. నల్లజీలకఱ్ఱ, వాయువిడంగములు, తిప్పసత్తు, అడ్డసరము, లేక వస, యవక్షారము ఇవి దినుసుకర్ధభాగము - ఇటుల వీని నెల్ల ఖల్వములోనునిచి వావిలియాకురసముతో నొకదినము, మాదీఫలరసముతో నొక దినము మర్దించి ఎండించి రెండుగురిగింజలయెత్తును నేతితో సేవించి తోడనే ఒక పలము చిత్రమూలమును సూక్ష్మముగ చూర్ణముజేసి ౨ పలములు గోమూత్రము, ౨ పలములు గోమయరసము గలిపి నాలవభాగముగ గాచి అందు ప్రస్థప్రమాణము ఘృతము, ౧ పలము యవక్షారము గలిపి పాకముజేసి దించుకొని కర్షప్రమాణమును పాకముజేసిన పైత్త్యో దరము హరించును. మఱియు స్నిగ్ధమై యుష్ణముగ నుండునన్నమును భుజింప వలయును.

### శ్లేష్మోదరమునకు వైశ్వానరీవటికములు

శుద్ధసూతం సమంగంధం మృతార్కాయశ్శిలాజతు,
రసాయసం ప్రకర్తవ్యం రసస్య ద్విగుణం విషమ్. 43

త్రికటు శ్చిత్రకం కుష్ఠం నిర్గుండీ ముసలీరజః,
అజమోదాం విషాంశేన ప్రత్యేకంచ ప్రకల్పయేత్. 44
పంచాంగ నింబక్వాథేన భావనాశ్చైకవింశతిః,
భృంగరాజరసై స్సప్త దత్వా క్షౌద్రేణ లోడయేత్. 45
భక్షయే ద్బదరీమాత్రాం వటికాం తాం దివానిశి,
శ్లేష్మోదరం నిహంత్యాశు నామ్నా వైశ్వానరీవటీ.
దేవదార్వగ్నిమూలస్య కల్కం క్షీరేణ పాయయేత్,
భోజనం వ్యోషదుగ్ధేన కుళుత్థస్య రసేన వా. (ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిజేసినగంధకము, తామ్రభస్మము, లోహభస్మము, శుద్ధిజేసినశిలాజిత్తు - ఇవి దినుసుకొక్కొకభాగము, శుద్ధిజేసిననాభి, త్రికటుకములు, చిత్రమూలము, చంగల్వకోష్టు, వావిలి, నేలతాటిగడ్డలు, పసపు, ఓమము - ఇవి దినుసు కొకటింటికి రెండుభాగములు - ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి వేపచెక్క, దాని పువ్వులు, కాయలు, ఆకులు, వేళ్లు అనువానికషాయముతో ౨౧ మారులు, గుంటగల గరాకురసముతో ౭ మార్లును భావనజేసి తేనెగలిపి కలియబెట్టి రేగు పండంతమాత్రలు జేసి యందొకదానిని దేవదారు, చిత్రమూలము అనువానిలో పాలుపోసి కల్కముగ గాచి యీయనుపానముతోడ సాయంప్రాతఃకాలములయందు సేవించుచుండిన శ్లేష్మోదరము హరించును. భోజనమునందు త్రికటుకయుక్తముగ గాచబడిన పాలనుగాని, ఉలవ కట్టునుగాని జేర్చికొనవలయును.

సన్నిపాతోదరమునకు బృహదగ్నిముఖచూర్ణము

సర్జక్షారం యవక్షారం భల్లాతం గజపిప్పలీం,
అజమోదా వచా ముస్తా దేవదారు విళంగకమ్. 48
పాఠాదారు నిశా హింగు ధాత్రీ దాడిమ పుష్కరం,
వృద్ధదారు త్రివృచ్చించా యవానీ జీరకద్వయమ్. 49
కర్పూరం నాగరం భార్ఙి మరిచం చామ్లవేతసం,
మండూర మభయా శుంఠీ చాతుర్జాతకరంజకమ్. 50
ఆరగ్వధం తథా పంచలవణాని విచూర్ణయేత్,
శిగ్రుబ్రహ్మీత్వచాక్షారం వారుణీపత్రచించికామ్.
తిలకాండం కోకిలాక్షం క్షారంచైవాపమార్గజం,
తుల్యాంశం మాతులుంగామ్లై ర్భావనాత్రయభావితమ్. 52

ముస్తాక్వాథై స్త్రిధా భావ్య మార్ద్రకోత్థద్రవైస్త్రిధా,
బృహదగ్నిముఖోనామ్నా కర్షైకముదరాపహమ్. 53
గోమూత్రైర్వా సురాభిర్వా హ్యేరనాళైరథాపివా,
సన్నిపాతోదరంచైవ గుల్మం హంతి త్రిదోషజమ్.

(మాధవనిదానే)

తా. సర్జక్షారము, యవక్షారము, శుద్ధిజేసినజీడివిత్తులు, ఏనుగపిప్పళ్లు, అజామోదము, వస, తుంగముస్తెలు, దేవదారు, వాయువిడంగములు, శిరుబొద్ది, మ్రానిపసపు, పసపు, ఇంగువ, ఉసిరికవరుగు, దాడిమబెరడు, పుష్కరమూలము, వృద్ధదారు, (బొద్దియాకు) తెగడ, చింతచెక్కలక్షారము, ఓమము, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, కర్పూరము, శొంఠి, గంటుభారంగి, మిరియాలు, పుల్లప్రబ్బలి, చిట్టెపుపొడి, కరక్కాయ, శొంఠి, చాతుర్జాతకములు, క్రానుగుచెక్క, రేలచెక్క, పంచలవణములు, కాదుమునగక్షారము, మోదుగచెక్కక్షారము, అడవికలిగొట్టాకుక్షారము, చించాక్షారము, నువ్వులక్షారము, గొలిమిడిక్షారము, ఉత్తరేణుక్షారము - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి మాదీఫలరసము తుంగముస్తెలకషాయము, అల్లపురసము అనుపానితో ప్రతిదానిచే మూడేసిమార్లు భావన జేసి కర్షప్రమాణమును గోమూత్రముతోగాని, సురతోగాని సేవించిన సన్నిపాతోదరము, త్రిదోషజనితగుల్మము హరించును.

స్నుహీక్షీరేణ సంభిన్నం పిప్పలీచూర్ణభక్షణం,
సప్తాహే శమనం యాతి చిరజాతం జలోదరమ్. 55

తా. పిప్పలిచూర్ణమును బొంతజముడుపాలతో తడిపి ఎండించి ౫ చిన్నముల యెత్తును బియ్యపుకడుగుతో ౭ దినములు సేవించిన చిరకాలముగనుండు జలోదరము హరించును.

జలోదరమునకు వహ్నివీర్యరసము

చతుస్స్నాతంచ గంధోష్ఠా రజనీ త్రిఫలా శిలా,
ప్రత్యేకంచ ద్విభాగంస్యా త్త్రివృన్నేపాలచిత్రకమ్. 56
ప్రత్యేకంచ త్రిభాగంస్యా త్త్ర్యూషణం జీరదంతికా,
ప్రత్యేక మష్టభాగంస్యా దేకీకృత్య విచూర్ణయేత్. 57
జయంతిస్నుక్పయోభృంగీ వహ్నివాతారితైలకైః,
ఏకైకేనక్రమాద్భావ్యం సప్తవారం పృథక్పృథక్. 58
వహ్నివీర్యరసోనామ నిష్కముష్ణజలైః పిబేత్,

విరేచనం భవేత్తేన తక్రభుక్తం ససైంధవమ్. 59
దినాంతే దాపయేత్పథ్యం వర్జయేచ్ఛీతలంజలం,
సర్వోదరహరః ప్రోక్తో మూఢవాతహరః పరః. (నిత్యనాథీయే)

తా. శుద్ధిజేసినరసము ౪ భాగములు, శుద్ధిజేసినగంధకము ౭ భాగములు, పసపు, త్రిఫలములు, శుద్ధిజేసినమణిశిల ఇవి దినుసుకు ౨ భాగములు: శుద్ధిచేసినతెగడ, శుద్ధిచేసినసేపాళములు, చిత్రమూలము ఇవి దినుసుకు 3 భాగములు, శొంఠి, పిప్పలి, మిరియాలు జీలకఱ్ఱ, నేలదంతిచెక్క-ఇవి దినుసుకు ౭ భాగములు-వీనినెల్ల దంచి చూర్ణముజేసి తక్కలి, బొంతజెముడుపాలు, గుంటగలగర, చిత్రమూలము, ఆముదము అనువానిరసములలో ప్రతిదానిచే నేడేసిమార్లు క్రమముగభావనజేసి నిష్కప్రమాణమును ఉష్ణోదకముతో సేవించిన విరేచనమై జలోదరము, సర్వోదరములు, మూఢవాతము హరించును. పథ్యము మూడవఝామున మజ్జిగలో సైంధవలవణమును గలిపి దీనితోడ నన్నమును భుజింపవలయును. మఱియు నీయౌషధసేవనకాలమున శీతోదకమును వర్జింపవలయును.

### ప్లీహోదరమునకు వంగేశ్వరరసము

సూతభస్మ వంగభస్మ పలైకైకం ప్రకల్పయేత్,
మృతం తామ్రం గంధకంచ ప్రత్యేకంచ పలంపలమ్. 61
అర్కక్షీరైర్దినం మర్ద్యం సర్వం తద్గోళకీకృతం,
రుద్ధ్వాథ భూధరే పాచ్యం పుటైకేన సముద్ధరేత్. 62
ఏష వంగేశ్వరోనామ ప్లీహగుల్మోదరం జయేత్,
ఘృతైర్గుంజాద్వయం లేహ్యం నిష్కం శ్వేతపునర్నవామ్. 63
గవాంమూత్రంపిబేచ్చాను రజనీంవా గవాంజలైః,
పంచాంగం దేవదారోస్తు చూర్ణం కర్షం శివాంబునా. 64
మాషమాత్రం పిబేద్యస్తు ప్లీహాతస్య కరోతి కిం,

తా. రసభస్మము, వంగభస్మము, తామ్రభస్మము, శుద్ధిజేసినగంధకము-వీనిని దినుసుకొక్కొక పలముచొప్పున ఖల్వములోనునిచి జిల్లేడుపాలలో నొకదినము మర్దించి ముద్దజేసి మూకుళ్ళలోనునిచి క్రింద, పైన చీలమన్ను లేపనముజేసి భూధరపుటంబిడి స్వాంగశీతలమునదీసి రెండుగురిగింజలయెత్తును నేతితో సేవించి తోడనే నిష్కప్రమాణము తెల్లగలిజేరువేరు చూర్ణమునుగాని, లేక పసపుచూర్ణమునుగాని గోమూత్రముతోగలిపి సేవించిన ప్లీహోదరము, గుల్మము హరించును. లేక కర్షప్రమాణముదేవదారు *పంచాంగముల

* పంచాంగములన-ఆకు, వేరు, విత్తులు, పువ్వులు, పట్ట అనునవియ.

చూర్ణమును ఉసిరికపండ్లరసముతో గలిపి మాష ప్రమాణము పై నౌషధమును గలిపి సేవిం చిన ప్లీహోదరము హరించును.

సర్వోదరములకు బ్రహ్మావటికములు

విడంగం దాడిమం కుష్ఠం [1]నింబత్వ గ్ధహనం వచా. 65
త్ర్యూషం పాఠా దేవదారు నిశా వ్యాఘ్రినఖాభయా,
రేణుకం రోహిణీచైలా త్రివృత్ప్రత్యేకకార్షికమ్. 66
నేపాళబీజచూర్ణంచ దంతిమూలం పలంపలం,
బ్రహ్మదండీరసప్రస్థం ప్రస్థమాజ్యం పురాతనమ్. 67
పూర్వకల్కయుతం పాచ్యం మృద్వగ్నౌచ సుపాచితం,
భక్షయే ద్బదరాకారాం నిత్యబ్రహ్మావటీం శుభామ్. 68
చతుష్షష్ట్యుదరవ్యాధీన్ సాధ్యాసాధ్యాన్నిహంత్యలం,
(ఆయుర్వేదే)

తా. వాయువిడంగములు, దాడిమపరుగు, చెంగల్వకోష్టు, వేపపట్ట, చిత్రమూల ము లేక శ్రీగంధము, వస, త్రికటుకములు, శిరుబోద్ది, దేవదారు, పసపు, [2]వ్యాఘ్రనఖ ము, కరక్కాయలు, రేణుకలు, కటుకరోహిణి, ఏలకులు, తెగడ- వీనిని దినుసుకు కర్షప్ర మాణముచొప్పున ఖల్వములోనునిచి చూర్ణముచేసి ౧ పలము శుద్ధిచేసిన నేపాళచూర్ణము ను, ౧ పలము నేలదంతివేళ్ళచూర్ణమును, ఒకప్రస్థము బ్రహ్మదండివేళ్ళరసముతో నూరి కల్కము చేసి పైచూర్ణముతోగలిపి ౧ ప్రస్థము ప్రాతనెయ్యిని చేర్చి మృద్వగ్నితో పక్వ ముగవండి రేగుపండంత ప్రతిదినముసేవించుచుండిన సాధ్యాసాధ్యోదరములు, గుల్మము, శూల, విద్రధి మొదలగు ౬౪ ఉదరరోగములు హరించును.

ఉదరములకు కదళీయోగము

గోదుగ్ధే కదళీపత్రం పిష్టమంతఃపుటం పచేత్. 69
తద్భస్మోదకపానేన సమస్తోదరనాశనం, (మాధవనిదానే)

తా. అరటిపరుగును ఆవుపాలతోదడిపి ముద్దగనూరి పుటంబిడిన భస్మంబగును. ఆభస్మమును నుదకములో గలిపి త్రాగిన సర్వోదరములు హరించును.

అనాహరోగనిదానము

ఆమంశకృద్వా నిచితం క్రమేణ భూయోవిబద్ధం విగుణానిలేన,
ప్రవర్తమానంనయథాస్వమేనంవికారమానాహముదాహరంతి.

1 నిబంత్వక్చందనంవచా. 2 పులిగోరుగు.

తస్మిన్భవంత్యామసముద్భవేతు తృష్ణా ప్రతిశ్యాయశిరోవిదాహాః,
ఆమాశయేశూలమథోగురుత్వంహృత్స్తంభఉద్గారవిఘాతనంచ.
స్తంభఃకటీ పృష్ఠపురీషమూత్రే శూలంచ మూర్ఛాచశకృతశ్చ ఛర్దిః,
శ్వాసశ్చ పక్వాశయజే భవంతి తథాలసోక్తానిచ లక్షణాని. 72

(ఆయుర్వేదే)

తా. దుష్టవాతమువలన ఆమముగాని, లేక పురీషముగాని, క్రమముగ సంచితంబై పలుమారు బద్ధగింపఁబడినదై స్వమార్గమునందు బాగుగా ప్రవర్తింపక వికారమును గలుగంజేయుచుండునది ఆనాహ మనంబడును. ఆమమువలన జనించిన ఆయానాహమునందు దప్పి, పడిసెము, తలయందుతాపము, ఆమాశయమున శూల, జడత్వము, డ్రోమ్మడచుట, తేనుపులు వెడలకుండుట, నడుము, వీపు, మలము, మూత్రము స్తంభించుట. శూల, మూర్ఛ గలుగుట, మలమును గ్రక్కుట, శ్వాసము-ఈలక్షణంబులు గలుగు. పక్వాశయమున జనించిన ఆనాహమునందు అలసరోగోక్తలక్షణంబులుగలుగును. (అలసరోగలక్షణంబులెవ్వియనిన—"శ్లో. కుక్షిరానహ్యతేత్యర్థం ప్రతామ్యేత్పరికూజతి, నిరుద్ధో మారుతశ్చైవం కుక్షావుపరిధావతి, వాతవర్చోనిరోధశ్చ యస్యాత్యర్థం భవేదపి, తస్యాలసకమాచష్టే తృష్ణోద్గారౌతు యస్యచ." అనఁగా మిక్కుటముగ ప్రక్కలు స్తంభించుట, ప్రజ్ఞావిహీనుఁడై భూమిపైఁబడి గొప్పధ్వనితో బొబ్బలిడుట, వాతమున కధోముఖవ్యాప్తిలేక నడ్డగింపఁబడుటవలన కుక్షిపైభాగము, హృదయము, కంఠము, మొదలగువానియందు వాతము సంచరించుట, వాతము, మలము బంధింపఁబడుట, మిక్కుటముగ దప్పి, తేనుపులు గలుగుట- ఈలక్షణములుగలది అలసక మనంబడుననుట.)

ఆనాహమత్యుగ్రరుజంసశబ్దంకృత్వానిలోఽంత్రేద్వయమార్గరోధాత్,
అపూపయుక్తో జఠరోయతిస్యాదానాహమాద్యాఃపరిచక్షతేచ. 73

(చరకే)

తా. విరుద్ధములగు నన్నపానాదిసేవనలవలన వాతము ప్రకోపించి ఊర్ధ్వాధోమార్గప్రతిబంధముగలదై ప్రేగులయందు శబ్దమును, కడుభయంకరమైననొప్పి గలుగంజేయుచు అపూపాకారముగ గడుపును నుబ్బునటులంజేయునది ఆనాహరోగమని పెద్దలు వచించెదరు.

## ఉదావర్తనిదానము

రూక్షైః కోద్రవముద్గచూర్ణచణకైః క్రుద్ధోఽనిలోధస్సిరా
రుధ్వా వర్త్యమలంచ శోష్యకురుతే షణ్మాత్రసంగం తతః,

హృత్పృష్ఠేష్వథ వస్తిమస్తకరుజం సశ్వాసకాసజ్వరం
గచ్ఛన్మూర్ధ్వమసౌహి శూనమరుచిః కండూహ్యుదావర్తకృత్.
(చికిత్సాసారసిద్ధసంగ్రహే)

తా. రూక్షకరద్రవ్యములు, కొఱ్ఱలు, పెసలు, జొన్నలు, సెనగలు, అనువానిని మిక్కుటముగ భుజించుటవలన వాతము ప్రకోపించి అధోగతసిరలబంధించి మలము నూర్ధ్వముగ జేసి ఎండించి మలమూత్రముల నడ్డగించి ఱొమ్ము, వీఁపు, కణతలు, పొత్తి కడుపు, తల అనువానియందు నొప్పిని, శ్వాసము, కాసము, జ్వరము, శోఫ, అరుచి, కంఠముఃగో నవ (అనగా ఓకరింతలు) అనువానిని గలుగంజేసి యూర్ధ్వముఖంబై ఉదావర్త రోగమును గలుగంజేయును. (ఉదావర్త మన మలము నోటినుండి వెడలుట.)

వాయుః కోష్ఠానుగో రూక్ష కషాయ కటుతిక్తకైః,
భోజనైః కుపితస్సద్య ఉదావర్తం కరోతిచ. 75
వాతమూత్రపురీషాశ్రు కఫమేదోవహానివై,
స్రోతాంస్యుదావర్తయతి పురీషంచాతివర్తయేత్. 76
తతోహృద్వస్తి శూలార్తో హృల్లావార్త్యతిపీడితః,
వాతమూత్రపురీషాణి కృచ్ఛ్రేణ లభతే నరః. 77
శ్వాసకాస ప్రతిశ్యాయ దాహ మోహ తృషా జ్వరాన్,
వమి హిక్కా శిరోరోగ మనశ్శ్రవణవిభ్రమాన్. 78
బహూనన్యాంశ్చలభతే వికారా న్వాతకోపజాన్, (మతాంతరే)

తా. రూక్ష, వగరు, కారము, చేదుగలపదార్థముల భుజించుటవలన కోష్ఠగత వాతము ప్రకోపించి తత్క్షణమున ఉదావర్తరోగమును గలుగంజేయును. మఱియు వాతము మూత్ర, మల, అశ్రు, కఫ, మేదస్సుల వహించుచుండు స్రోతోమార్గములయందు వ్యాపించి మలమును శోషింపజేసి ఊర్ధ్వముగ వెడలింపజేయును. దానివలన హృదయము, పొత్తి కడుపు అనువానియందు మిక్కుటముగ శూల, ఓకర, అస్వాస్థ్యము గలిగి మల మూత్ర వాతములు కడుకష్టముమీఁద వెడలుటయేగాక శ్వాసము, దగ్గు, పడిసెము, తాపము, మోహము, దప్పి, జ్వరము, వాంతి, ఎక్కిళ్లు, శిరోరోగము, మనస్సునకు భ్రాంతి, మందముగ వినుట- ఈమొదలగు పలువిధ కారములు వాతప్రకోపమువలనగలుగును.

## ఉదావర్తాసాధ్యలక్షణము

తృష్ణార్దితం పరిక్లిష్టం క్షీణం శూలైరుపద్రుతమ్. 79

శకృద్వమంతం మతిమా నుదావ_ర్తినముత్సృజేత్,

తా. దప్పి, క్లేశము, క్షయము, శూల అనువానివలన పీడితుఁడై మలమును వమనము సేయునట్టిఉదావ_ర్తరోగిని బుద్ధిమంతుఁడగువైద్యుఁడు వర్జింపవలయును.

ఆనాహావదుదావ_ర్తం విధినా సముపాచరేత్. 80

ద్వయేహితం విశేషేణ చూర్ణమగ్నిముఖం సదా,

తా. ఆనాహచికిత్సలనే ఉదావ_ర్తమునందుసగా జేయందగును. మఱియు ఆనాహోదావ_ర్తములయందు అగ్నిముఖచూర్ణము విశేషముగ హితకరంబు.

అగ్నిముఖచూర్ణము

చిత్రకాతివిషా కుష్ఠ హింగు సౌవర్చలం వచా. 81

మాగధీ పౌష్కరం భార్గీ యవానీ విశ్వభేషజం,

యవక్షారం విడంగాని మరిచం గంధిశౌండికమ్. 82

ఏతాని సమభాగాని సర్వతుల్యా హారీతకీ,

ఏతదగ్నిముఖంనామ చూర్ణమాశు సుఖావహమ్. 83

శుంఠ్యంబునా కోష్ణజలైః ప్రాతస్సేవ్యం ఘృతేనవా,

హన్త్యాదజీర్ణమానాహం జ్వరోదావ_ర్తకుండలి. 84

అర్శాంసి గ్రహణీదోషం ప్లీహోథ్మానంచ దారుణం,

హిక్కాంశ్వాసం జయేత్కాసం దీపయేచ్చ హుతాశనమ్. 85

వస్తి హృన్నాభి కోష్టస్థం మహాంతం దోషసంచయం,

నిర్హరేద్వివిధంచాన్నం భస్మీభవతి తత్క్షణాత్. 86

తా. చిత్రమూలము, అతివస, చెంగల్వకోష్టు, ఇంగువ, సౌవర్చలవణము, వస, పిప్పళ్లు, పుష్కరమూలము (దీనియభావంబున నేలములకవేళ్ళు) గంటుభారంగి, ఆమము, శొంఠి, యవక్షారము, వాయువిడంగములు, మిరియాలు, మోడి, గజపిప్పళ్ళు వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి దానికి సమముగ కరక్కాయలచూర్ణము గలిపి ఒకటి, లేక రెండుమాడలయెత్తుచు శొంఠిరసముతోగాని, లేక ఉష్ణోదకముతోగాని, లేక ఆవునేతితోగాని ప్రాతఃకాలమున సేవించిన అజీర్ణము, ఆనాహము, పురాణజ్వరములు, ఉదావ_ర్తము, వాతకుండలి, అర్శస్సు, గ్రహణి, భయంకరమైన ప్లీహోదరము, కడుపుబ్బరము, ఎక్కిళ్ళు, శ్వాసకాసములు, పొత్తికడుపు, ఱొమ్ము, నాభి, కోష్ఠము అనువానియందు వాత పిత్త శ్లేష్మసంకలితములవలన జనించురోగములు, అగ్నిమాంద్యము వీనిని హరింపజేసి

పలువిధాన్నముల భక్షించినను తత్క్షణమున భస్మంబగునటులం జేయును. ఇది అగ్నిముఖ చూర్ణమనంబడును. దీనిసేవనవలన కడుసుఖము గలుగును.

### ఆనాహోదావర్తములకు యోగసారరసము

సూతం గంధం విషం తామ్రభస్మ నేపాళ తాళకం,
క్షారత్రయం పటోలంచ పంచకోలం సరామఠమ్. 87
శంఖచూర్ణం సమాలోడ్య జంబీరామ్లేన మర్దయేత్,
లశునస్య కషాయేణా ప్యత్తు చేనగ సేనచ. 88
తాంబూలవల్లీ నిర్గుండీ మాతులుంగార్ద్రక ద్రవైః,
తతశ్చ వటికాం మాషమాత్రాం కృత్వా ప్రయోజయేత్. 89
సర్వగుల్మేషు శూలేషు శ్వాసకాసోదరేషుచ,
ఆనాహే చాప్యుదావర్తే సన్నిపాతేచ దారుణే. 90
యోగసారరసోహ్యేష జాతుకర్ణేన నిర్మితః, (జాతుకర్ణే)

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, శుద్ధిజేసిననాభి, తామ్రభస్మము, శుద్ధిజేసిననేపాళములు, రేకులుగ వొలిచి శుద్ధిజేసిన తాళకము, యవక్షారము, సర్జక్షారము, టంకణక్షారము, చేదుపొట్ల, పంచకోలములు, ఇంగువ, శంఖభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసము, వెల్లుల్లిపాయలకషాయము, గచ్చవిత్తులరసము, తమలపాకురసము, వావిలాకురసము, మాదీఫలరసము, అల్లపురసము అనువానితో బాగుగమర్దించి మాషప్రమాణము మాత్రలుజేసి అనుపానవిశేషములతో సేవించినసర్వగుల్మములు, శూలలు, శ్వాసకాసములు, ఉదరములు, ఆనాహము, ఉదావర్తము, దారుణమైనసన్నిపాతము నశించును. (తవ్వెడుజొన్నకలిలో మూడుబొట్లు ఉమ్మెత్తాకురసము గలిపి త్రాగిన ఇరువాయికట్టక మూత్రము వెడలుటయే గాక రక్తమూత్రమునగూహరించును. ఈతవేళ్ళకషాయము గిద్దెడు, గొమ్మనపిండివేళ్ళరసము తవ్వెడు, ములుదోసవిత్తులు సోలెడు-వీనినెల్ల నేకముజేసి సోలెడురసములో సస్యానియెత్తు పంచదార, ఒకతులము జీలకఱ్ఱ,ఒకతులము ఏలకులు, మాడయెత్తు శుద్ధిచేసిన నేపాళపుగింజలుగ్రహించి యుదకముతోనూరిగలిపి సేరు రసమును త్రాగిన బంధింపఁబడినమలమూత్రములు వెడలును.)

ఉదావర్తే సమభ్యజ్య స్విన్నగాత్రముపాచరేత్. 91
ఆనాహేచ తథాకార్యం వస్త్యావర్తేశ్చ కర్మణా,

తా. ఉదావర్తము, ఆనాహము అనువానియందు శరీరమునకు చమురు బట్టించి గాచి చెమటను స్రవింపంజేయుటయే గాక వస్తికర్మంజేసి పిదప ఆసనములో భేదనవర్తి నునిచి మలమును వెడలింపంజేయవలయును.

ఉద్గారస్యావరోధేతు సైంహికం ధూమమాచరేత్. 92
ఛర్ది నిగ్రహసంజాతే వమనం లంఘనం హితం,
విరేచనంచాత్రమతం తైలేనాభ్యంజనం హితమ్ 93
వస్తిశుద్ధికరై స్స్నిగ్ధం చతుర్గుణజలంపయః, (మతాంతరే)

తా. తేనుపుల నడ్డగించుటవలన జనించిన ఉదావర్తమున స్నిగ్ధపదార్థము నగ్ని యందువైచి దానిధూమము పానముసేయవలయును. వాంతిని నడ్డగించుటచే జనించిన ఉదావర్తమున వమనము, లంఘనము, విరేచనము, తైలాభ్యంజనము అనువానిని మఱియు వస్తిశుద్ధికరౌషధయుక్తముగ గాచబడిన కషాయములో నాలవభాగము పాలుగలిపి దాని సేవనను జేయించవలయును.

ఉదావర్తమునకు నారాచచూర్ణము

ఖండంపలం ప్రవృత్తాక్షః కృష్ణాకర్షద్వయంచూర్ణం,
ప్రాగ్భోజనస్యమధునా బిడాలపతకం నరోలిహ్యాత్. 94
ఏతద్గాఢపురీషే జ్ఞేయంవిజ్ఞైరుదావర్తే,
మధురం నరపతియోగ్యం చూర్ణం నారాచకంనామ. (చరకే) 95

తా. ఖండశర్కర ౧ పలము, శుద్ధిచేసిన తెగడచూర్ణము అక్షప్రమాణము, పిప్పలి చూర్ణము ౨ కర్షములు- ఇటుల వానినెల్ల నేకముజేసి భోజనాత్పూర్వము బిడాలపతక మును (అనగా ఒకరూపాయయెత్తును) తేనెతో భక్షించిన మలబద్ధమును,ఉదావర్తమును హరించును. ఇవి మధురముగనుండుటచే భూపతులకు యోగ్యంబు.

ఫలచూర్ణము

ఫలంచమూలంచవిరేచనోక్తంహింగ్వర్కమూలందశమూలమగ్ర్యం,
స్నుక్చిత్రకశ్చేతిపునర్నవాచ తుల్యాని సర్వైర్లవణాని పంచ. 96
స్నేహైస్సముత్రైస్సహ జర్జరాణి సశంఖపంథా విపచేత్సులిప్తే,
పక్వం సుపిష్టం లవణంతదన్నైః పానైస్తథానాహరుజామయఘ్నమ్.

తా. రేచనకరములైన ఫలములు, లేక వేళ్ళు, ఇంగువ, జిల్లేడువేరు, దశమూల ములు, త్రిఫలములు, జెముడు, చిత్రమూలము, గలిజేరు ఇవి సమభాగములు, వీనికి సమము పంచలవణములు-ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి శంఖమునందునిచి దానిసంధులకు ఉప్పు పేలాలును నేతితోనూరి పూసి పుటంబిడి సాంగశీతలమున దీసి ఖల్వములో నునిచి అన్నముతోడగాని, లేక యుదకముతోడగాని సేవించిన ఆనాహము హరించును,

## తుంబురుచూర్ణము

తుంబురుశ్చాభయా హింగు పౌష్కరం లవణత్రయం,
యవానీచ యవక్షారం విడంగేన సమానిచ. 98
త్రివృత్త్రిగుణితం చూర్ణం పిబేదుష్ణేనవారిణా,
ఆనాహాముదరాణ్యష్టౌ విడ్బంధంచాపి నాశయేత్. 99

తా. ధనియాలు, కరక్కాయ, ఇంగువ, పుష్కరమూలము సైంధవలవణము, బిడాలవణము, కాచలవణము, ఓమము, యవక్షారము, వాయువిడంగములు అనువానిని సమభాగములుగ చూర్ణముచేసి దానికి 3 భాగములు శుద్ధిచేసిన తెగడచూర్ణము గలిపి ఉష్ణోదకముతో సేవించిన ఆనాహము, సర్వోదరములు, మలబద్ధము నశించును.

## భేదనవర్తి

గోమూత్రఛర్దఫలరామరదంతికైశ్చకంకుష్ఠసైంధవబిడైశ్చగుడప్రగాఢైః,
ఆగారధూపసహితైరితివస్త్రలేపా ద్వర్తిర్గుదేగ్రథితపిడ్వటికామయఘ్నః.
(అన్యశాస్త్రే)

తా. మ్రంగపండు, ఇంగువ, నేలదంతిచెక్క, కుంకుడుపండు, సైంధవలవణము, బిడాలవణము, బెల్లము, కరుధూపము-వీనిని సమభాగములుగ గోమూత్రముతో నూరి కోకబట్టకుపట్టించి వర్తిజేసి ఆసనమునం దునిచిన ఉంటగట్టి వెడలకుండెడిమలము సగా వెడలును.

త్రివృత్కృష్ణా హరీతక్య స్త్రిచతుః పంచభాగతః,
గుళికాగుదతుల్యాస్యా ద్విడ్బంధనగదాపహా. 101

తా. తెగడ 3 భాగములు, పిప్పళ్ళు ౪ భాగములు, కరక్కాయలు ౫ భాగ ములు-ఇటుల వానిని కలితోనూరి గుదద్వారమునకు దగినటుల యుంటజేసి ఆసనములో నుంచిన బంధింపఁబడియుండుమలము వెడలును.

## విద్రధినిదానము

త్వగ్రక్తమాంసమేదాంసి ప్రదూష్యాస్థిన మాశ్రితాః,
దోషాశ్శోథంశనైర్ఘోరం జనయంత్యుచ్ఛ్రితాభృశమ్. 10
మహామూలం రుజావంతం వృత్తంవాప్యథవాయతం,
సవిద్రధిరితిఖ్యాతో విజ్ఞేయష్షడ్విధశ్చ సః 10
పృథగ్దోషై స్సమస్తైశ్చ క్షతేనాప్యసృజాతథా,
షణ్ణామపిహి తేషాంతు లక్షణం సంనిగద్యతే. (ఆయుర్వేదే) 10

తా. వాతాదిదోషములు కడుదుష్టంబులై అస్థులనాశ్రయించి త్వక్, రక్త, మాంస, మేదస్సులం జెఱచి ఉత్పత్తియగునపుడే కడుశూల పీడతోఁగూడి అస్థిపర్యంతము వ్యాపించియుండు మూలమునుగలదై గుండ్రముగగాని, లేక నిడుపుగగానియుండు భయంకరమైనవాపును మెల్లమెల్లగ గలుగంజేయును. ఇదియ విద్రధి యనంబడును. ఇది వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, క్షత, రక్తములన నారువిధంబులు. ఇఁక వాని లక్షణంబుల వచించెదను.

## వాతవిద్రధిలక్షణము

కృష్ణోరుణోవా విషమో భృశమత్యర్థవేదనః,
చిత్రోత్థాన ప్రపాకశ్చ విద్రధిర్వాతసంభవః.

తా. నల్లగగాని, ఎఱ్ఱగగాని, విషమమన ఒకానొకపుడు సన్నగ, ఒకానొకపుడు లావుగ నుండినదై కడువేదనాయుక్తమై జనించిన పలువిధములైన ఉత్పత్తిపాకములతోఁ గూడియుండునది వాతవిద్రధియని తెలియవలయును.

## పిత్తవిద్రధిలక్షణము

పక్వోదుంబరసంకాశ శ్యామలో జ్వరదాహవాన్,
క్షిప్రోత్థానప్రపాకశ్చ విద్రధిః పిత్తసంభవః. (చరకే) 106

తా. పండినయత్తిపండువలెగాని, లేక నలుపువర్ణముగగాని నుండినదై జ్వరదాహములతోఁడంగూడి తీవ్రమైన ఉత్పత్తిపాకములం గలది పిత్తవిద్రధి యని తెలియవలయును.

## శ్లేష్మవిద్రధిలక్షణము

శరావసదృశః పాండు శ్శీతస్స్నిగ్ధోఽల్పవేదనః,
చిరోత్థానప్రపాకశ్చ విద్రధిః కఫసంభవః. 107

తా. మూఁకుడుతోఁ సమానమైనయాకారము, పాండురవర్ణము, శీతలము, స్నిగ్ధత్వము, అల్పవేదనగలదై స్వావకాశముమీఁద ఉత్పత్తిపాకములం జెందునది కఫవిద్రధియని తెలియవలయును.

## పండిన విద్రధియొక్కస్రావము

తనుపీతసితాశ్చైషామాస్రావాః క్రమశః స్మృతాః, 108

తా. పైఁజెప్పఁబడిన వాత, పిత్త, శ్లేష్మవిద్రధులు పండినయెడల వానియందు వాతాదిక్రమముగ, సన్నగ, పసపువర్ణముగ, తెల్లగ స్రావము గల్గును.

## సన్నిపాతవిద్రధిలక్షణము

నానావర్ణరుజా స్రావో ఘంటాలో విషమోమహాన్,

విషమం పచ్యతేచాపి విద్రధిస్సాన్నిపాతికః. 109
(మాధవనిదానే)

తా. పలువిధములైనపీడ, స్రావముగలుగుట, గంటపలెనుండుట, చిన్నదిగగాని, విషమముగ (అనఁగా అసాధ్యముగనుండుట) పెద్దదిగనుండుట, విషమపాక మన (కొంతభాగము చిరకాలముమీఁద మఱికొంతభాగము తీవ్రముగ, గంభీరముగ, ఉత్తానముగ, పొడవుగ క్రిందుగ పండుట) ఈలక్షణములు గలది సన్నిపాతవిద్రధి యని తెలియవలయును.

## అభిఘాతజవిద్రధిలక్షణము

తైస్తై ర్భావై రభిహింతే క్షతేవా పథ్యకారిణః,
క్షతోష్మావాయువిసృత స్సరక్తం పిత్తమీరయేత్. 110
జ్వరస్తృష్ణాచ దాహశ్చ జాయంతే తస్య దేహినః,
ఆగంతువిద్రధిర్జ్ఞేయః పిత్తవిద్రధిలక్షణః. 111

తా. కాష్ఠలోష్ఠపాషాణాదికములవలన అభిఘాతముగాని, లేక గాయముగాని గలిగియుండునపుడు అపథ్యము చేయుటవలన వాతము ప్రకోపించి తన్మూలంబున వృద్ధిజెందిన క్షతోష్ణరక్తసహితంబై, పిత్తమును ప్రకోపింపజేసి జ్వరము, దప్పి, తాపము అనువానిని గలుగంజేయుచు పిత్తవిద్రధిలక్షణయుక్తంబైయుండిన అభిఘాతజవిద్రధియని దెలియవలయును.

## రక్తవిద్రధిలక్షణము

కృష్ణాస్ఫోటావృతశ్శ్యావ స్తీవ్రదాహరుజాకరః.
పిత్తవిద్రధిలింగస్తు రక్తవిద్రధి రుచ్యతే. 112

తా. నల్లనిస్ఫోటకములతో వ్యాప్తంబై శ్యామలవర్ణము, తీవ్రమైనతాపము, పోటు, జ్వరము గలదై పిత్తవిద్రధిలక్షణయుక్తంబైయుండునది రక్తవిద్రధి యనంబడును.

పవనేన స్తనసిరా స్సంవృతాః ప్రాప్యయోషితాం,
శూతానాం గర్భిణీనాంతు సంభవే చ్ఛ్వయథుర్ఘనః. 113
స్తనేః స్త్రియస్సదుగ్ధేవా బాహ్యావిద్రధిలక్షణః,
నాడీనాంసూక్ష్మవక్త్రత్వాత్కన్యానాం నసజాయతే. (ఆయుర్వేదే)

తా. ప్రసవించిన స్త్రీలయొక్కగాని, లేక గర్భిణీస్త్రీలయొక్కగాని పాలతోఁగూడియుండు స్తనములయందు వాతము ప్రకోపించి సిరలంజెంది వానిముఖముల సంకుచితంబులుగ చేసి బాహ్యావిద్రధి లక్షణంబులుగల కఠినమైనవాపును గలుగంజేయును. ఇదియు

స్తనవిద్రధియనంబడును. కన్యకలయొక్క స్తననాడీముఖములు సూక్ష్మంబులుగ నుండుటవ లన వారలకీ స్తనవిద్రధి జనింపకుండును. (ఇది వాతాదివిద్రధులయందే అంతర్భావమును జెందియుండును.)

## అంతర్విద్రధిలక్షణము

పృథక్సంభూయవాదోషాః కుపితా గుల్మరూపిణం,
వల్మీకవత్సముమ్నద్ధ మంతఃకుర్వంతి విద్రధిమ్. 115

తా. శరీరమధ్యమున వాతాదిదోషములు ప్రత్యేకములుగగాని, లేక ఒకటిగచేరి గాని ప్రకోపించి గుల్మరూపంబై పుట్టవలెపెరిగి విద్రధిని గలుగంజేయును. ఇదియ అంతర్విద్రధి యనంబడును.

## విద్రధిస్థానములు

గుదేవస్తిముఖేనాభ్యా కుక్షౌవంక్షణయోస్తథా,
వృక్కయోఃప్లీహ్ని యకృతి హృదయేక్లోమ్నిచాప్యథ.
ఏషాముక్తాని లింగాని బాహ్యవిద్రధిలక్షణైః,
గుదేవాతనిరోధస్తు వస్తౌ కృచ్ఛ్రాల్పమూత్రతా.
నాభ్యాం హిక్కా తథాటోపః కుక్షౌ మారుతకోపనం,
కటీపృష్ఠగ్రహస్తీవ్రో వంక్షణోత్థేచ విద్రధౌ.
వృక్కయోః పార్శ్వసంకోచ ప్లీహ్న్యుచ్ఛ్వాసావరోధనం,
సర్వాంగప్రగ్రహస్తీవ్రో హృది కంపశ్చ జాయతే. 119
శ్వాసో యకృతి హిక్కాచ క్లోమ్ని పే పీయతే పయః,
(మాధవనిదానే)

తా. గుదము, మూత్రద్వారము, బొడ్డు, కుక్షి, అండసంధులు, కుక్షిపిండము, ప్లీహము, యకృత్తు, హృదయము, క్లోమము (పిపాసాస్థానము) అను నీ స్థలములయందు విద్రధి జనించి బాహ్యవిద్రధిలక్షణయుక్తంబైయుండు విద్రధి గుదమధ్యమున జనించిన వాతమునకు ప్రతిబంధముగలుగును. పొత్తికడుపుమధ్యమునజనించిన కష్టముమీఁద కొంచె కొంచెముగ మూత్రము వెడలు. నాభిమధ్యమునజనించిన ఎక్కిళ్ళు రుజాపూర్వకమైనక్షోభగలుగును. ప్రక్కలయందు జనించిన వాతము ప్రకోపించును. గజ్జలమధ్యమున జనించిన నడుము, వీఁపు ఇవి బలముగనీడ్చును. కుక్షిపిండమధ్యమున జనించిన పార్శ్వములయందీడుపుగలుగును. ప్లీహస్థానమునజనించినఎగయూపిరి నడ్డగింపంబడును. హృదయమునజనించిన

సర్వాంగముల నీరుపు కంపనము గలుగును. యకృత్తుమధ్యమునజనించిన శ్వాసము, ఎక్కిళ్ళు గలుగును. క్లోమస్థానమునందు జనించిన పలుమారు ఉదకపానమునం దిచ్ఛగలుగును.

విద్రధిస్రావనిర్గమనము

నాభేరుపరిజాః పక్వా యాంత్యూర్ధ్వమిత రేత్వధః. 120
అధస్స్రుతేషు జీవేత్తు స్రుతేషూర్ధ్వం న జీవతి,

తా. నాభికి పైనజనించినవిద్రధిపండినయెడల ముఖమువలన నాస్రావముగలుగును. (నాభికి క్రిందుగ జనించినవిద్రధియందు గుదద్వారమువలన స్రావముగలుగును. నాభియందు జనించినవిద్రధియం దిరుమార్గములుగ స్రావముగలుగును) విద్రధియం దధోభాగము వలన స్రావముగలరోగి జీవించుననియు, ఊర్ధ్వభాగమువలన స్రావము గల రోగి మృతి జెందునని తెలియవలయును.

విద్రధిసాధ్యాసాధ్యములు

హృన్నాభివస్తివర్జ్యం యే తేషు భిన్నేషు బాహ్యతః. 121
జీవేత్కదాచిత్పురుషో నేతరేషు కథంచన,
సాధ్యావిద్రధయః పంచ వివర్జ్య స్సాన్నిపాతికః.
ఆమపక్వవిదగ్ధత్వం తేషాంశోథవదాదిశేత్,

తా. రొమ్ము, నాభి, పొత్తికడుపు అను నీస్థానములయందు గాక తక్కినస్థానముల (అనఁగా ప్లీహము, క్లోమము మొదలగుస్థానముల) విద్రధి జనించి వెలపట పగిలిన యెడల ఒకానొకపుడు రోగి జీవించు. హృన్నాభివస్తువులయందైనయెడల రోగి మృతి జెందును. మఱియు పైఁజెప్పఁబడిన నైదువిద్రధులు సాధ్యంబులు. సన్నిపాతవిద్రధి అసాధ్యంబు. వానిలో ఆమ, పక్వ, విదగ్ధావస్థలు మూఁడును వాపువంటివని తెలియవలయును.

అసాధ్యవిద్రధిలక్షణము

ఆధ్మాతం బద్ధనిష్యందం ఛర్ది హిక్కా తృషాన్వితమ్. 123
రుజా శ్వాససమాయుక్తం విద్రధి ర్నాశయేన్నరం,

తా. విద్రధియందు కడుపుబ్బరము, మూత్రప్రతిబంధము, వాంతి, ఎక్కిళ్లు, దప్పి, పోట్లు,శ్వాసము అనునవి గలిగిన రోగి మృతిజెందునని తెలియవలయును.

కోష్ఠే బహిర్వా హితరు కోష్ఠభో విద్రధిరుచ్యతే. 124
విద్రధిర్హంతి హిధ్మావాన్ శ్వాసవాన్ నాభిదేశతః,
(చికిత్సాసారసిద్ధసంగ్రహే)

తా. కోష్ఠమునకు లోపగాని, లేక వెలుపలగాని కడునొప్పి, వాపు గలిగిన విద్రధి యనంబడును. దీనియందు ఎక్కిళ్ళు, శ్వాసము, నాభిలోనుండి జనించిన రోగి మృతిజెందును.

విద్రధిసామాన్యచికిత్స

గుదే వాతనిరోధంతు వస్తౌ కృచ్ఛ్రాల్పమూత్రతామ్, 125
కురుతే విద్రధిః పుంసాం తస్యాదౌ రక్తమోక్షణం,
(మాధవనిదానే)

తా. గుదము, వస్తి అనుస్థలముల పురుషునికి జనించిన విద్రధియందు వాత ప్రతిబంధము, అల్పమూత్రత్వము క్రమముగ గలుగును. దానియందు తొలుత రక్తస్రావమును చేయింపవలయును.

వాతవిద్రధిచికిత్స

క్వాథే వరుణవల్కస్య పిబేద్వా సైంధవం తథా, 126
శిలాజతుసమం హింగు మసాధ్యం విద్రధిం జయేత్,
(మాధవనిదానే)

తా. సైంధవలవణము, శిలాజిత్తుభస్మము, ఇంగువ - వీనిని సమభాగములుగ నునిచికొని ఉలిమిడివేళ్ళకషాయముతో సేవించిన అసాధ్యవిద్రధులు హరించును.

క్వాథం శిగ్రోర్వచాయాశ్చ హింగు సైంధవచూర్ణకైః. 127
సంయుక్తం పాయయేచ్ఛాంత్యై విద్రధిరోగపీడితం,

తా. ఇంగువ, సైంధవలవణము - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి మునగచెక్క, వస అనువాని కషాయములోగలిపి సేవించిన విద్రధిహరించును.

చిత్రకాదిలేహ్యము

చిత్రమూలస్య త్వక్పంచాఢక ధన్వయాసవాసాపాఠాచ,
ఉగ్రాపునర్నవాద్వయ శిగ్రు త్వగ్బలాభూపీలునిర్గుండ్యః.
చవ్యారూషేంద్రయవఖదిరసార కింశుక త్రిఫలా,
ద్వికరంజం త్రివృద్ధం త్రిపుష్కరకణామూలసహచరైరండాః.
పృథక్పలాన్యేషాం సప్తదశమూలకస్య పృథగ్ద్విపలంచ,
సర్వమిదం ద్వాదశద్రోణే జలేచ పాచయేద్విధినా. 130
అష్టాంశేచ శేషితే తస్మిన్నవవస్త్రపరిస్రుతం భవతి,
క్వాథేతథావైర్విశతపలం గుడంచ నిక్షిపేత్సమ్యక్. 131

కోశామృతాకుమారీ తపస్వినీ మధుహంతభుక్ప్రఖ్యాచ,
ఆర్ద్రికరజనీపునర్నవాగోమయరసంచ మిశ్రయేత్తత్ర. 132
గవాంమూత్రం సర్పిస్తైలంచ పృథక్పృథక్ప్రస్థంచాదాయ,
అథయానాంచసహస్రంగోమూత్రస్విన్నంజర్ఝరితంలోడ్యశనైర్భాయః.
ఏతద్దర్భ్యాలోడ్య విపచే దవతార్యహింగు శుంఠీ మరీచకణానాం,
పృథక్త్రిపలానాం చూర్ణమయోంజసపష్టప్పలాని తత్రావపేత్, 134
శీతేతతోమధునః ప్రస్థచతుష్కం తద్ధాన్యేనిధాపయేత్పక్షం,
ఏతత్కాంకాయనేన కథితోయం కబలగ్రహం లేహయేత్ప్రాతః
ఏతద్గుల్మాన్ పరంచ నిహన్యాద్వివిధాని దారుణాని,
శూలానష్ఠీలానాహక్షయ విషమజ్వరతృడ్విద్రధీంశ్చాపి. 136
(ఆయుర్వేదే)

తా. చిత్రమూలపుష్కరమూలములు, ఆఢకములు, రేగటిదూల. అడ్డసరము, శిరుబొద్ది, వెల్లుల్లి, తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు, మునగపట్ట, ముత్తపపులగము, ముచ్చుతుమికి, వావిలి, చవ్యము, నల్లజీడి, కొడిసెపాల, కాచు, ములుమోదుగ, త్రిఫలములు, క్రానుగచెక్క, సెమలిచెక్క, తెగడ, నేలదంతి పుష్కరమూలము (దీనియభావంబున ఆముదపువేళ్లు), మోడి, గోరింట, ఆముదపువేళ్లు-ఇవి దినుసుకు 2 పలములు, దశమూలములు (అనఁగా మారేడు, గుమ్ముడు, తక్కలి, కలిగొట్టు, కోలపొన్న, నేలములక, నక్కపొన్న, పెద్ద ములక, పల్లేరు) ఇవి దినుసుకు ౨ పలములు - ఇటుల వానినెల్ల దంచి ౧౨ ద్రోణముల యుదకముపోసి ఎనిమిదవభాగముగ కషాయముగాచి క్రొత్తవస్త్రములో వడియగట్టి అందు ౨౦౦ పలముల బెల్లము, నేతిబీర, తిప్పతీఁగ, కలబంద, తపసివేరు, ఇప్పపువ్వు, చిత్రమూలము, కరక్కాయలు, అల్లము, పసపు, గలిజేరు అనువానిచూర్ణము, గోమయ రసము, గోమూత్రము, నెయ్యి, తెల్లఆవనూనె, - ఇవి దినుసుకు ౪ సేరులు గలిపి పిదప ౧౦౦౦ కరక్కాయలను విత్తులుదీసి గోమూత్రములో నానబెట్టి ఎండించి పైదానిలో బాగుగగలిపి గరిటెకాడతో గలియబెట్టుచు పాకముజేసి దించునపుడు ఇంగువ, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు అనువానిచూర్ణము దినుసుకు 3 పలములు, ఉక్కపొడి ౬ పలములతో గలిపి సాంగశీతలమున ౪ ప్రస్థములు తేనెపోసి, ధాన్యరాశియం దొకపక్షంబునిచి ప్రాతఃకాలమున ఒకరూపాయయెత్తును సేవించిన గుల్మము, దారుణమైన పలువిధశూలలు, అష్ఠీలము, క్షయము, విషమజ్వరము, దప్పి, విద్రధి హరించును. ఇది కాంకాయనునివలన జెప్పంబడియెను.

విద్రధౌ వ్రణవత్సర్వం కర్మ కుర్యా ద్భిషగ్వరః. 137

తా. విద్రధిరోగమును వ్రణమువలెనే చికిత్సింపవలయును.

రక్తవిద్రధియం దుపచారము

రక్తాధికస్థితౌ వస్త్యాం పిత్తవిద్రధివత్క్రియా,
న్యగ్రోధస్యత్వచశ్చైవ మంజిష్ఠాయాః కషాయకమ్. 138
ఆరగ్వధకషాయేణ నిశావహ్నినికుంభకం,
పిష్ట్వా ఖాదే జ్జయే త్తేన విద్రధించ రజోఽధికమ్.

(మాధవనిదానే)

తా. పొత్తికడుపునందు జనించు రక్తవిద్రధియందు పిత్తవిద్రధి చికిత్సంజేయవలయును. మఱ్ఱిపట్ట, మంజిష్ఠ అను నీరెంటిని సమభాగములుగ దంచి కషాయము గాచి త్రాగినను, లేక పసపు, చిత్రమూలము, పెద్దమ్రానుచెక్క అనువానిని రేలచెక్కకషాయముతో నూరి త్రాగినను రక్తవిద్రధి హరించును.

పిత్తవిద్రధియం దుపచారము

కటుకం వత్సకోశీర భూనింబాతివిషాకణా,
ముస్తాచందనదార్వ్యశ్చ భూనింబోశీరవత్సకమ్. 140
పద్మా దురాలభా శుంఠీ వత్సకత్వగ్విపాచితం,
రక్తా పిత్తాతిసారఘ్నం పిత్తవిద్రధినాశనమ్. 141

తా. కటుకరోహిణి, కొడిసెపాల, వట్టివేరు, అతివస, నేలవేము, పిప్పళ్లు-వీనిని సమభాగములుగ దంచి కషాయముగాచి త్రాగినను, లేక తుంగముస్తెలు, శ్రీగంధము, మ్రానిపసపు, నేలవేము, వట్టివేరు, కొడిసెపాల, పద్మకాష్ఠము, దురదగొండి, శొంఠి, కొడిసెచెక్క-వీనిని సమభాగములుగ దంచి కషాయముగాచి త్రాగినను, రక్త, పిత్తాతిసారములు, పిత్తవిద్రధి హరించును.

శ్లేష్మవిద్రధికి త్రివృతాదితైలము

త్రివృతాప్యగ్ని సింధూకం దంతి బిల్వకులుత్థకం.
కర్షాంశం ప్రస్థగోమూత్రే తిలతైలం చతుష్పలమ్. 142
పాచ్యం తైలావశేషంతు కఫజే లేపనం హితం,

(మాధవనిదానే)

తా. శుద్ధిజేసిన తెల్లతెగడ, చిత్రమూలము, వావిలి, నేలదంతి, మారేడు, ఉలవలు-ఇవి దినుసుకొక్కకర్షము, గోమూత్రము ౧ ప్రస్థము, నువ్వులనూనె ౪ పల

ములు-ఇటుల వీనినెల్ల నేకముజేసి తైలము శేషించువఱకుగాచి విద్రధులయందు లేప నముజేసిన శ్లేష్మ విద్రధి హరించును.

## అరిమేదాదిఘృతము

అంజలిశ్చారిమేదత్వక్కాథ్యాప్యష్టగుణేఽంభసి.
కుడవం తత్ర వై ధాత్రీ స్వరసః క్షీరకం ఘృతం,
కర్షాశం కల్కితం తిక్తా త్రాయంతీ ధన్వయాసకః.
ముస్తాచామలకీచైవ జీవంతీ చందనోత్పలం,
పచేదేకత్ర సంయోజ్య తద్ఘృతం పాయయేజ్జయేత్.
విద్రధించ సగుల్మంచ దాహ మోహ జ్వరం తథా,
తృష్ణామూర్ఛా ఛర్ది హృద్రోగాన్ పిత్తరక్తం సకామలమ్. 146

తా. ఒకఅంజలిప్రమాణము నల్లతుమ్మచెక్కను దంచి ౮ అంజలిప్రమాణము నీళ్లలో వైచి కషాయముగాచి అందు ఉసిరికపండ్లరసము, ఆవుపాలు, ఆవునెయ్యి అను వానిని దినుసుకొక్కొకకుడవమును, చేదిబీర, కలుత్రానుగుపేరు, రేగటిదూల, తుంగ ముస్తెలు, ఉసిరికపప్పు, మనుబాల, శ్రీగంధము, కలువగడ్డలు అనువానికల్కమును దినుసుకొక్కొక కర్షప్రమాణమును గలిపి చక్కగ (అనగా ఘృతపక్వముగ) వండి సేవించిన శ్లేష్మవిద్రధి, గుల్మము, చకారమువలన విసర్పి, తాపము, మోహము, జ్వరము దప్పి, మూర్ఛ, వాంతి, ఱొమ్మునొప్పి, పిత్తరక్తము, కామిల హరించును.

## ఉదరరోగములయందు పథ్యము

కుళుత్థావాస్తు బృహతీ ద్విపటోలం పునర్నవా,
పక్వకూశ్మాండకతక మిసీ హింగు సజీరకమ్.
గవ్యం తక్రం పృశ్నికాళీ ముండీ నారంగ బిల్వకం,
ప్లీహాష్ఠీలోదరానాహ గుల్మ విద్రధిమిత్రకమ్. (మాధవనిదానే)

తా. ఉలవకట్టు, తోటకూర, లేక చక్రవర్తికూర, ములకకాయ, పొట్లకాయ చేదిపొట్ల, గలిజేరుకూర, ముదిరిన గుమ్మడుకాయ, ఇండుపుకాయ, సదాప, ఇంగువ జీలకఱ్ఱ, ఆవుచల్ల, కోడిపొన్న, బోడతరము, నారంజిపండు, మారేడుపండు - ఇవి ప్లీహము, అష్ఠీలము, ఉదరము, ఆనాహము, గుల్మము, విద్రధి అనువానియందు పథ్య కరంబులు.

## ఉదరరోగములయం దపథ్యము

నింబధాన్యాని నిష్పావ శాలూరం పిష్టవైకృతం,
తథా పిండాలపిణ్యాక మాంసం మధురసంభవమ్. 149
అలాబూ దధిచామ్లాని కలుషాణి గురూణిచ,
ప్లీహాష్ఠీలోదరానాహ గుల్మవిద్రధిశత్రవః. 150

తా. వేపపండు, క్రొత్తిమెర్లు, అనుములు, కలువగడ్డలు, పిండివంటకము, *చారకంద, తెలికపిండి, మాంసము, మధురజనితమద్యవిశేషములు, ఆనుగపుకాయ, పెరుగు, పులుసు, కల్మషద్రవ్యములు, గురుకరద్రవ్యములు - ఇవి ప్లీహము, అష్ఠీలము, ఉదరము, ఆనాహము, గుల్మము, విద్రధి అనువానియం దపథ్యకరంబులు.

ఏ కా ద శ ప్ర క ర ణ మ్.



---

* ఇదే పెండలమనియుం జెప్పంబడును.

# ద్వాదశ ప్రకరణము.

## తృష్ణారోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లోకః. నీలకంఠం మహాదేవం తారకం కరుణార్ణవం,
దేవేశం భక్తమందార మష్టమూర్తిమహం భజే. 1

తా. మహాదేవుఁడు, సంసారతారకుఁడు, కరుణారసపరిపూర్ణుఁడు, సర్వదేవతలకు ప్రభువు, భక్తులకోర్కెలీడేర్చువాఁడు, అష్టమూర్తిస్వరూపుఁడు నగునీలకంఠుని నేను భజించుచున్నాఁడను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథము యొక్క ద్వాదశప్రకరణమును వచింపుచున్నాఁడను.

### తృష్ణానిదానము

భయశ్రమాభ్యాంబలసంక్షయాద్వాప్యూర్ధ్వంచితంపిత్తవివర్ధనైశ్చ,
పిత్తంసవాతంకుపితంనరాణాం తాలుప్రపన్నంజనయేత్పిపాసాత్. 3
(ఆయుర్వేదే)

తా. భయము, శ్రమ, బలక్షయము, పిత్తమును ప్రకోపింపంజేసెడి క్రోధము, ఉపవాసము మొదలగువానివలన స్వస్థానమున జేరియుండు పిత్తవాతములు ప్రకోపించి ఊర్ధ్వగతంబులై లోదౌడను (అనఁగా పిపాసస్థానమును) జెంది దప్పిని గలుగంజేయును.

### తృష్ణాసామాన్యలక్షణము

జిహ్వా బహిర్గమన కర్కశ కంఠజిహ్వా
కాంతిప్రలాపముఖశోషజలాభిలాషా,
ద్వేషాశనేంద్రియమనస్స్వరహానితంద్రా
సామాన్యలక్షణమిదం కథితం తృషోస్యాః. 4

తా. నాలుక బైలువెడలుట, కంఠము, నాలుక బిరుసుగనుండుట, కాంతి చెడుట, ప్రలాపించుట, నోరెండుట, నీరుద్రాగుటయం దిచ్ఛగలుగుట, అన్నద్వేషము.

గలుగుట, పంచేంద్రియములు సత్వవిహీనంబులుగ నుండుట, మనస్సు, కంఠస్వరము చెడుట, తంద్ర గలుగుట - ఇవియ తృష్ణారోగసామాన్యలక్షణంబులు.

### వాతజతృష్ణాలక్షణము

క్షామాస్యతా మారుతసంభవాయాం తోద స్తథాశంఖశిరస్సుచాపి,
స్రోతోనిరోధో విరసంచవక్త్రం శీతాభిరద్భిశ్చ వివృద్ధిమేతి. 5
(సిద్ధరసార్ణవే)

తా. ముఖ మెండి దీనుఁ డగుట, కణతి, మస్తకము అనువానియందు సూదులతో బొడుచునటుల పీడగలుగుట, రసవాహినీనాడులు, ఉదకవాహినీనాడులు అడ్డగింపం బడుట, ముఖను విరసంబగుట, శీతోదకమును ద్రాగిన దప్పి వృద్ధిఁజెందుట, చకారము వలన నిదురపట్టకుండుట - ఈలక్షణములుగలది వాతజతృష్ణయని తెలియవలయును.

### పిత్తజతృష్ణాలక్షణము

మూర్ఛాన్నవిద్వేష విలాపదాహా రక్తేక్షణత్వం ప్రతతశ్చశోషః,
శీతాభిలాషో ముఖతిక్తతాచ పిత్తాత్మికాయాం పరిదూయనంచ.

తా. మూర్ఛ, అన్నద్వేషము, తలుచుమాటలు, తాపము, నేత్రములయందెఱుపు వర్ణము, కడుశోష, శీతపదార్థములయం దిచ్ఛగలుగుట, ముఖము చేదువేయుట, సంతాపముగలుగుట - ఈలక్షణములుగలది పిత్తజతృష్ణయని తెలియవలయును.

### కఫజతృష్ణాలక్షణము

బాష్పావరోధాత్కఫసంవృతేఽగ్నౌ తృష్ణాబలాసేనభవేత్తథాతు,
నిద్రాగురుత్వం మధురాస్యతాచ తృష్ణార్దితశ్శుష్యతిచాతిమాత్రమ్.
(మాధవనిదానే)

తా. స్వకారణమువలన బ్రకోపించినకఫము జాఠరాగ్నినాచ్ఛాదించుటచే దాని వేఁడిమి నడ్డగింపఁబడినదై అధోముఖంబై ఉదకమును వహించుచుండు స్రోతస్సుల శోషింపంజేసి కఫతృష్ణను గలుగంజేయును. దానియందు నిద్ర, జడత్వము గలిగి నోరు తీపిగనుండును. ఈతృష్ణవలన పీడింపంబడినవాఁడు కడుశోషంజెందును.

### క్షతజతృష్ణాలక్షణము

క్షతస్యరుక్శోణితనిర్గమాభ్యాం తృష్ణాచతుర్థీక్షతజామతాతు,

తా. శస్త్రాదికములవలన క్షతముగలవానికిపీడ, రక్తస్రావము గలుగును. వాని వలన క్షతజతృష్ణ జనించును. ఇది నాలుగవదిగనుండును. (క్షత మన గాయము.)

సబాహ్యాభ్యంతరం దేహం ప్రదహే న్మందచేతనః, 16
సంశుష్కగళతాల్వోష్ఠో జిహ్వాం నిష్కృష్య వేపతే,
(సిందూరమణిదర్పణే)

తా. దప్పి నడ్డగించుటవలన ఉదకరూపమైన ధాతువు క్షయించి దానివలన పిత్తోష్మము వృద్ధిఁజెంది శరీరమునకు లోపల, వెలపల దాహమును గలుగఁజేయును. దానం జేసి రోగి జ్ఞానశూన్యుండగుటయే గాక గొంతు, లోదౌడ, పెదవి అనువానియందు శోష గలవాఁడై నాలుకను బైటికిదీసి కదలించుచుండును.

శస్త్రఘాతజదాహలక్షణము

అసృజాపూర్ణకోష్ఠస్య దాహోన్యస్స్యాత్సుదుస్సహః. 17

తా. శస్త్ర ప్రహారమువలన రక్తము కోష్ఠమున (అనఁగా హృదయాదులయందు) నిండి దాహమును గలుగఁజేయును. ఇదియ శస్త్రజన్యదాహ మనంబడును. ఇది కడు నసాధ్యము.

ధాతుక్షయజన్యదాహలక్షణము

ధాతుక్షయోత్థో యోదాహ స్తేన మూర్ఛా తృషాన్వితః,
క్షామస్వరః క్రియాహీన స్ససీదే ద్భృశపీడితః. 18

తా. రసాదిధాతువులు క్షయించుటవలన దాహము జనించును. దానియందు మూర్ఛ, దప్పి, స్వరభంగము, నిశ్చేష్టత, కడుపీడ గలవాఁడై మృతిఁజెందును.

క్షతజదాహలక్షణము

క్షతజోనశ్నతశ్చాన్య శ్శోచతోవాప్యనేకధా,
తేనాంతర్దహ్యతేఽత్యర్థం తృష్ణా మూర్ఛా ప్రలాపవాన్. 19

తా. క్షతమువలన జనించినదాహములో అన్నద్వేషముగలుగును. లేక పలువిధము లుగ దుఃఖించుటవలన లోపల మిక్కుటముగ దాహముజనించును. దానియందు దప్పి, మూర్ఛ, తలుచుమాటలు గలుగును.

మర్మాభిఘాతజదాహలక్షణము

మర్మాభిఘాతజోప్యస్తి సోఽసాధ్య స్సప్తమోమతః,
సర్వఏవచ వర్జ్యాస్స్యు శ్శీతగాత్రస్య దేహినః. 20

తా. మర్మముపై దెబ్బదగులుటవలన దాహముజనించును. ఇది అసాధ్యము. ఈ దాహము ఏడవసంఖ్యగలదిగనుండును. సర్వదాహములయం దెవనిశరీరము వెలపటచల్లగ నుండెడినో, అట్టివానియొక్క సర్వదాహముల వర్జింపవలయును.

## తృష్ణకు పునర్ణవాదికల్పము

పునర్నవాహ్వాపామార్గమూలకం జీకద్వయం,
తక్రపిష్టం పిబేచ్చాపి ముఖశోషప్రశాంతయే. 21

(చికిత్సాసారసిద్ధసంగ్రహే)

తా. గలిజేరువేరు, ఉత్తరేణివేరు, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ-వీనిని సమభాగములుగ మజ్జిగతోనూరి త్రాగిన దప్పిహరించును.

పర్పటీ మాగధీమూలం పిచుమందార్ద్రకద్రవైః,
మర్దయిత్వా వటీకార్యా ముఖశోషప్రశాంతయే. 22

(మాధవనిదానే)

తా. పర్పాటకము, మోడి - వీనిని సమభాగములుగ గ్రహించి వేపచెక్క, అల్లము అనువానిరసములతోనూరి మాత్రలుజేసి సేవించిన దప్పిహరించును.

## తృష్ణకు ఖర్జూరాదికషాయము

[1]ఖర్జూర యష్టి కాశ్మీర మృద్వీకా పద్మకేసరం,
ధాత్రీపరూషం వ్యాఘ్రీచ బలా [2]ద్వయంచ చందనమ్. 23
మధూకపుష్పకాశ్మర్యం తోయైశ్చైవ చతుర్గుణైః,
పక్వం పర్యుషితం రాత్రౌ స్థితౌ భాండేన వేదృఢే. 24
లాజాచూర్ణప్రతీవాపం శర్కరా మధుసంయుతం,
తృష్ణా దాహహరం పానే జాతీపుష్పాధివాసితమ్. 25
మూర్ఛా దాహ భ్రమం హంతి దీప్తం గృహ మివాంబునా,

(ఆయుర్వేదే)

తా. ఖర్జూరపండ్లు, యష్టిమధుకము, కుంకుమపువ్వు, ద్రాక్షపండ్లు, తామరయగరులు, ఉసిరికపప్పు, పెద్దయీంత, పెద్దములక-పిన్నములక, ముత్తవపులగము, పెద్దముత్తవపులగము, శ్రీగంధము, ఇప్పపువ్వు, గుమ్ముడు-వీనిని సమభాగములుగ దంచి నాలుగింతలు నీళ్ళుపోసి నాలవభాగముగ కషాయముకాచి వడియగట్టి క్రొత్తకుండలో నునిచి అందు పేలపుసత్తు, పంచదార, తేనె గలిపి జాజిపూలువైచి ఒకరాత్రియునిచి సేవించిన "అగ్నిచే దహింపంబడుచుండు గృహము నుదకమువలన శాంతిజెందుచుందంబున" దప్పి, తాపము, మూర్ఛ, భ్రమ అనునవి శాంతి జెందును.

---

1 ఖర్జూరోశీరమృద్వీకం పద్మకం పద్మకేసరమ్, 2 యష్టిక.

### తృష్ణకు వాలుకాదిలేహ్యము

ద్వాత్రింశత్తాపలై స్తోయైః పలైకం వాలుకం పచేత్. 26
పాదశేషం వస్త్రపూతం లాజాసక్తుసితామధు,
యుక్తం లేహ్యం నిహంత్యాశు దాహ తృష్ణా మదాత్యయాన్.

తా. ౩౨ పలముల నుదకములో నొకపలము కూతురుబుడమనువైచి యారవభాగముగ కషాయముగాచి వడియగట్టి అందు పేలపుసత్తు, పంచదార, తేనె గలిపి లేహ్యపక్వముగవండి సేవించిన తాపము, దప్పి, మదాత్యయరోగము శీఘ్రముగ హరించును.

### దాహమునకు సైంధవకల్పము

నిష్కైకం సైంధవం చూర్ణం సురాపలచతుష్టయం,
పిబేత్సద్యశ్శమంయాతి మద్యపానోత్థదాహకమ్. 28

తా. నిష్క ప్రమాణము సైంధవలవణమును ౪ పలముల కల్లులోగలిపి సేవించిన మద్యపానమువలన జనించిన తాపము తత్ క్షణమున హరించును.

### తృష్ణకు దధిమస్తుకల్పము

దధిమస్తు గుడం క్షౌద్రం మద్యంచైవామ్లకాంజికైః,
సఘృతై స్సక్తుభి స్తృష్ణాం ప్రాతఃపానాత్ర్యహాజ్జయేత్. 29

తా. పెరుగుమీఁదిమీగడ, బెల్లము, తేనె, మద్యము, పులిసినకలి, నెయ్యి, పేలపుసత్తు-వీనిని ప్రాతఃకాలమున సేవించిన మూఁడుదినములలో దప్పి హరించును.

### యవసక్తుకల్పము

యవబీజోత్థసక్తూనాం ససైంధవసువర్చలం,
సజీరకం జలం పీతం పానాత్యయహరం పరమ్. 30

తా. యవలపేలపుసత్తు, సైంధవలవణము, సౌవర్చలవణము, జీలకఱ్ఱ-వీనిని సమభాగములుగ నుదకముతోనూరి డ్రాగిన మద్యపానమువలన జనించినదాహము హరించును.

### వాతతృష్ణకు బదర్యాదికల్పము

కోల దాడిమవృక్షామ్ల మాతులుంగద్రవం పృథక్,
పలైకం హపుషా శుంఠీ యవానీ జీరకస్సమమ్. 31
స్తోకం క్షిప్త్వా పిబేచ్ఛామ్లే వాతతృష్ణాత్యయం హరేత్,
(సిద్ధసంగ్రహే)

తా. రేగుపండు, దాడిమపండు, చింత, మాదీఫలము-అనువానియొక్క రసమును

దినుసు కొక్కొకపలముచొప్పున గ్రహించి అందు బోడతరము, శొంఠి, ఓమము, జీలకఱ్ఱ అనువానిచూర్ణమును దినుసుకర్థపలముచొప్పున గలిపి సేవించిన వాతతృష్ణ హరించును.

**పైత్యతృష్ణకు సితాదికల్పము**

సితా దాడిమ ఖర్జూర ద్రాక్షా చవ్య పరూషకమ్. 32
ప్రతిచూర్ణంతు కర్షైకం పలమాత్రంతు సక్తుకం
ఉదకం మదిరాచైవ ప్రతియోజ్యం పలత్రయమ్. 33
పిత్తతృష్ణాత్యయంచాశు పిబేచ్ఛాంతి మవాప్నుయాత్,

తా. పంచదార, దాడిమపండు, ఖర్జూరపండు, ద్రాక్షపండు, చవ్యము, చిట్టీతపండు అనువానిని దినుసుకు కర్ష ప్రమాణముచొప్పున దంచి చూర్ణముజేసి ఒకపలము పేలపుసత్తు గలిపి అందు నీళ్ళు, కల్లు, మూడుమూడుపలములు గలిపి సేవించిన పిత్తతృష్ణ శీఘ్రముగ హరించును.

**శ్లేష్మజతృష్ణకు శారిబాదికషాయము**

శారిబా ధాన్యకం ద్రాక్షా వాలుకం చందనం సమమ్. 34
సర్వతుల్యం భవేల్లాజా స్సర్వాం తోయై శ్చతుర్గుణైః,
పాదశేషం పచేచ్ఛీతం ససితం శ్లేష్మజాం జయేత్. 35

తా. మనుబాల, కొత్తిమెర్లు, ద్రాక్షపండు, కూతురుబుడమ, శ్రీగంధము-వీనిని సమభాగములుగదంచి చూర్ణముజేసి దీనికి సమముగ పేలపుసత్తుగలిపి యీయన్నిద్రవ్యములకు నాలుగింతలు నీళ్లుపోసి చతుర్థాంశముగ కషాయముగాచి పంచదారగలిపి త్రాగిన శ్లేష్మజతృష్ణ హరించును.

**తృష్ణకు చందనాదికల్పము**

చందనం శారిబా ద్రాక్షా ముస్తా బదరకం సమం,
సర్వతుల్యా స్తథాలాజా ద్విరష్టగుణితై ర్జలైః. 36
అష్టావశేషకం పాచ్యం సితా క్షౌద్రయుతం పిబేత్,
ఛర్దిం తృష్ణాం నిహంత్యాశు క్షౌద్రై ర్వామతీకామలమ్. 37
అత్యంతమద్యపానేన తంహారే ద్దాహమేవహి,
తృష్ణాం భ్రాంతిం క్లమం శోషం తథా పానాత్యయం హరేత్. 38
(ఆయుర్వేదే)

తా. శ్రీగంధము, గూడపాల, ద్రాక్షపండు, తుంగముస్తెలు, రేగుపండు-ఇవి దినుసుకొక్కొకభాగము, పేలాలు ౫ భాగములు, ఉదకము ౧౬౦ భాగములు - ఇటులవాని

ళ్లు నేకముజేసి ఎనిమిదవ భాగముగ కషాయముగాచి వడియగట్టి పంచదారగాని, లేక తేనెగాని కలిపి త్రాగిన వాంతి, దప్పి హరించును. మైనము, తేనె గలిపి త్రాగిన కడుమద్యపానమువలన జనించినతాపము, దప్పి, భ్రాంతి, శ్రమ, శోష, పానాత్యయరోగము హరించును.

ధాన్యకం జీరకం కేళీ హ్యుశీరం చందనం ఘనం.
శీతకర్పూరకం కుష్ఠం మధుకంచ మృణాలకమ్. 39
పంచత్వక్పల్లవాః పంచ ధాత్రీఫల వటాదికం,
ఇదంస్యా దనుపానేన దాహశాంతికరం పరమ్. 40

(సిద్ధసంగ్రహే)

తా. కొత్తిమెర్లు, జీలకఱ్ఱ, కురువేరు, శ్రీగంధము, వట్టివేరు, తుంగముస్తెలు, పచ్చకర్పూరము, చెంగల్వకోష్టు, అతిమధురము, తామరతూండ్లు, పంచత్వక్కులు, పంచపల్లవములు, ఉసిరికపండు, వటాదులు అనువానియొక్క యనుపానమువలన దాహము శమించును.

తామ్రాదికరసము

తామ్రం చక్రికయాబద్ధం సూతం తాళం సతుత్థకం,
వటాంకురరసైర్మర్ద్యం తృష్ణా హృద్వల్లమాత్రతః. 41

తా. తామ్రభస్మము, శుద్ధిజేసినరసము, శుద్ధిజేసిన తాళకము, శుద్ధిజేసిన మైలుతుత్తము-వీనిని మఱ్ఱిచిగుళ్ళరసముతో మర్దించి బిళ్ళచేసి ఎండించి పుటంబిడి వల్లప్రమాణమును సేవించిన దప్పి హరించును.

రసాదిచూర్ణము

రసగంధకకర్పూరై శ్శైలోశీరమరీచకైః,
ససితైః క్రమవృద్ధైశ్చ సూక్ష్మం కృత్వా త్వహర్ముఖే. 42
త్రిగుంజాప్రమితం ఖాదే త్పిబే త్పర్యుషితాంబుచ,
భృశం తృష్ణాం నిహంత్యేవ మశ్విభ్యాంచ ప్రకాశితమ్. 43

(మాధవనిదానే)

తా. శుద్ధిజేసినరసము ౧భాగము, శుద్ధిచేసిన గంధకము ౨ భాగములు, పచ్చకర్పూరము 3 భాగములు, శుద్ధిచేసిన శిలాజిత్తు ౪ భాగములు, వట్టివేరు ౫ భాగములు

1 పంచత్వక్కులన—మఱ్ఱి, రావి, అత్తి, జువ్వి, మామిడి అనువాని పట్టలు
2 పంచపల్లవములన మామిడి, నేరేడు, వెలగ, మాదీఫలము, మారేడు అనువాని చిగుళ్ళు

మిరియాలు ౬ భాగములు, పంచదార ౭ భాగములు-ఇటుల వీనిని ఖల్వములో నునిచి. మెత్తగానూరి 3 గురిగింజలయెత్తును ప్రాతఃకాలమున సేవించి వెంబడిగ ఒకరాత్రి యుంచబడినసీరును త్రాగిన అత్యంతమైన దప్పి హరించును. ఇది అశ్వినీదేవతలచే ప్రకటింపబడియెను.

### తృష్ణాహరయోగము

రోగోపసర్గజాతాయాం ధాన్యాంబుససితం మధు,
వటప్రరోహాయష్ట్యాహ్వా కణా మధుకృతా వటీ. 44
ముఖస్థాచిరకాలోత్థాం తృష్ణాం హన్యాత్సుదుస్తరాం,

తా. రోగమువలన దప్పిగలిగిన ధనియాలనీళ్ళలో తేనె, పంచదార గలిపిత్రాగవలయును. లేక మఱ్ఱిచిగుళ్ళనుగాని, లేక లేతమఱ్ఱియూడలు, అతిమధురము, పిప్పళ్ళు అను వానినిగాని నూరి యుంటజేసి పుక్కిలియం దునిచికొని దానిరసమును మ్రింగుచుండిన చిరకాలముగ జనించి యసాధ్యంబుగనుండు దప్పి హరించును.

### క్షౌద్రాదిగండూషము

సక్షౌద్రమామ్ర జంబూత్థం పిబేత్క్వాథం సుఖోష్ణకమ్. 45
సతృష్ణో మధునా కుర్యాద్గండూషాఞ్సలిలాశ్రితం,

తా. మామిడి, నేరేడు, అనువానినిసమభాగములుగ దంచి కషాయముగాచి తేనె వైచి చల్లార్చి త్రాగినను, లేక తేనెలోనీళ్ళుగలిపి పుక్కిలించి యుమిసినను దప్పిశమించును.

### దాహమునకు చంద్రకళారసము

గగనదరదయుక్తం శుద్ధసూతంచ గంధం
ప్రహరమధుసుపిష్టం వల్లయుగ్మం నరోద్యాత్
జ్వరహరగదసింహో శృంగబేరోదకేన
ప్రథమజనితదాహం తక్రభుక్తంచ భోజ్యమ్. (నిత్యనాథీయే)

తా. అభ్రకభస్మము, శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి తేనెతో నొకఝాము మర్దించి రెండు వల్లముల యెత్తును అల్లపురసానుపానముతో సేవించిన వాతప్రకోపమువలన గలిగిన దాహము, జ్వరము శమించును. పథ్యము మజ్జిగయన్నమును భుజింపవలయును. ఇది గదసింహరస మనియు జెప్పంబడును.

### రసాదిగుటికలు

రసబలిఘనసారచందనానాం సనలదసేవ్యపయోదజీవనానామ్,

అపహరతిగుటీముఖస్థితేయం సకలసముత్థితదాహమాశ్రయేత్తామ్.

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, పచ్చకర్పూరము, చందనము జటామాంసి, వట్టివేరు, తుంగముస్తెలు-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి నేతిలోగలిపి యుంటలుజేసి నోటియందునిచికొనిన త్రిదోషమువలనజనించిన దాహము హరించును. కావున నీరసాదిగుటికలను ఎల్లప్పుడు నోటియం దునిచికొనవలయును.

## మృతసంజీవనీగుటికలు

మధుయష్టి లవంగంచ శిలాజతు తృటిస్తథా,
సహస్రభావనా కార్యా నవతండులవారిణా. 48
యామమాత్రం దృఢం మర్ద్య వటీకోల సమాస్మృతా,
కృష్ణకార్పాసనీరేణ తృష్ణా దాహ జ్వరాన్ జయేత్. 49
మూర్ఛాద్యముగ్రరోగంచ వాతం పిత్తంచ నాశయేత్,
మృతసంజీవనీ ప్రోక్తా పూజ్యపాదై రుదీరితా. (సిద్ధరసార్ణవే) 50

తా. అతిమధురము, లవంగములు, శుద్ధిజేసినశిలాజిత్తు, ఏలకులు అనువానినిసమభాగములుగ చూర్ణముజేసి క్రొత్తబియ్యపుకడుగుతో ౧౦౦౦ మార్లు భావనజేసి పిదప నొకఝాము బాగుగమర్దించి రేగుబండంత మాత్రలుజేసి యందొకదానిని నల్లప్రత్తియాకురసానుపానముతో సేవించిన దప్పి, దాహము, జ్వరము, మూర్ఛ మొదలగు భయంకరరోగములు, వాతజ, పిత్తజరోగములు నశించును. ఇది పూజ్యపాదునిచే జెప్పంబడియెను.

## ఖర్జూరాదిచూర్ణము

ఖర్జూరామలబీజాని పిప్పలీచ శిలాజతు,
ఏలా మధుక పాషాణ చందనోర్వారుబీజకమ్. 51
ధాన్యకం శర్కరాయుక్తం పాతవ్యం యష్టివారిణా,
అంగదాహం లింగదాహం గుదజం క్షీణశుక్రజమ్. 52
శర్కరాశ్మరి శూలఘ్నం వృష్యం బలకరం పరం,
నాశయే న్మూత్రరోగాంశ్చ తథా శుక్రభవానపి. 53

తా. ఖర్జూరము, ఉసిరికవరుగు, పిప్పళ్ళు, శుద్ధిజేసినశిలాజిత్తు, ఏలకులు, అతిమధురము, కొండపిండివేరు, చందనము, దోసవిత్తులు, కొలిమెర్లు, పంచదార - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అతిమధురకషాయానుపానముతోడ త్రాగిన శరీరము, మేఢ్రము, గుదము అనువానియందలితాపము, శుక్రక్షయమువలన జనించిన తాపము,

శర్కరాశ్మరి, శూల, మూత్రరోగము, శుక్లదోషములవలన జనించినరోగము - వీనిని హరింపజేసి వీర్యవృద్ధిని, బలమును, గలుగజేయును.

## పిత్తజదాహమునకు చికిత్స

పిత్తజ్వరహరైస్సర్వైః పిత్తదాహే విధిర్మతః. 54

తా. పిత్తజదాహమునందు సంపూర్ణముగ పిత్తజ్వరనాశనకరచికిత్సలం జేయవలయును. (అత్తిపాలను పంచదారలో కలిపి భక్షించిన దాహము హరించును.)

## చందనాదిచూర్ణము

చందనోశీర కుష్ఠాబ్ద ధాత్రీ చోరక ముత్పలం,
మధుకం మధుపుష్పంచ ద్రాక్షా ఖర్జూరకం తథా. 55
చూర్ణం కృత్వా సమసితం ప్రాతశ్శీతాంబునాపిబేత్,
రక్తపిత్తం తథాశ్వాసం పైత్తం గుల్మం సముద్ధరేత్. 56
అంగదాహం శిరోదాహం శిరో విభ్రమమేవచ,
కామలాంచ ప్రమేహాంశ్చ పైత్తజ్వరవినాశనమ్. 57
చందనాద్యమిదం చూర్ణం పూజ్యపాదేన భాషితం,

(భైరవకల్పే)

తా. చందనము, వట్టివేరు, చెంగల్వకోష్టు, తుంగముస్తెలు, ఉసిరికవరుగు, కచ్చూరములు, కలువగడ్డలు, అతిమధురము, ఇప్పపువ్వు, ద్రాక్షపండు, ఖర్జూరము-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి సమముగ పంచదారగలిపి ప్రాతఃకాలమున నొకరాత్రియుంచబడిన నుదకముతో ద్రాగిన రక్తపిత్తము, శ్వాసము, పిత్తగుల్మము, అంగతాపము, శిరోదాహము, తలదిరుగుట, కామిల, ప్రమేహము, పిత్తజ్వరము హరించును. ఇది పూజ్యపాదునిచే జెప్పంబడియెను.

## పునర్నవాదితైలము

శ్వేతంపునర్నవామూలం పలశతమితం శుభమ్. 58
కృష్ణాజ్యదుగ్ధమధ్యేచ పేషయేదాఢకే భిషక్,
తత్సమం తిలతైలంచ పృథగ్ద్రవ్యాణి యోజయేత్. 59
ధూపం షోడశభాగంచ మరీచాష్టవరాళకం,
కచోరోశీరకం శ్వేతం కృష్ణోశీర స్తథైవచ. 60
మంజిష్ఠం రంగచూర్ణంచ శ్రీగంధం రక్తచందనం,
కృష్ణాగరుంచ రుద్రాక్ష స్పలమేకం ప్రయోజయేత్. 61

తచ్చూర్ణం తైలమధ్యేచ నిక్షిపే త్పాచయే త్సుధీః,
మేహారికాష్ఠయుక్తేన పాచయే త్కోమలాగ్నినా. 62
సుపక్వం తైలముద్ధృత్య రాత్రావంగంచ మర్దయేత్.
అంగశూలం చాంగదాహా న్నేత్రరోగా న్నపీనసాన్. 63
పాండు కామల ముష్ణాని సూతికా సన్నిపాతజిత్,
కరదాహా న్పాదదాహా న్తంద్రాం కటి సమీరజాన్. 64
క్షయ కుష్ఠాంశ్చ కండూంశ్చ గజకర్ణాదికం తథా,
శిరోరోగా న్భ్రమా న్పిత్తం నేత్రాణాం దృష్టిగోచరమ్. 65
తథైవామృతతుల్యంచ జ్వరాణాం జీర్ణినామపి,
అస్థిగంతు జ్వరంచైవ మేహజ్వర ప్రశాంతయే. 66
సర్వాంగే మర్దనం చైవ మంగళస్నానమాచరేత్,
శివోదితమిదం తైల మశ్విభ్యాం గోచరీకృతమ్. 67
సర్వరోగహరంచైవ దుర్లభం భిషజాం భువి,
సాధయేద్గురుముఖేనైవ సిద్ధిర్భవతి నాన్యథా, 68
(పూజ్యపాదీయే

తా. ౪౦౦ రూపాయలయెత్తు తెల్లగల్జేరువేరును, ౨౪౬ రూపాయలయెత్త నల్లావునెయ్యి, నల్లావుపాలు అనువానితో నూరి అందు నువ్వులనూనె ౪౦౦ రూపాయ యెత్తు, కరుధూపము ౧౬ రూపాయలయెత్తు, మిరియాలు, లవంగపుచెక్క ౪ భాగములు కచోరములు, వట్టివేరు, కురువేరు, మంజిష్ఠ, కాచు, చందనము, రక్తచందనము, కృష్ణాగరు రుద్రాక్ష అనువానిచూర్ణము దినుసొకటింటికి ౪ రూపాయలయెత్తుచొప్పున గలి మేహారికష్ఠములతో మందాగ్నితో తైలపక్వముగ గాచి దించుకొని రాత్రుల సర్వాం మునందు మర్దనముజేసికొని మంగళస్నానముజేసిన అంగశూల, అంగతాపము, నేత్ర రోగములు, పడిసెము, పాండురోగము, కామిల, శరీరమునందలియుష్ణము, బాలింతరో గము, సన్నిపాతము, చేతులు కాళ్ళు మండుట, తంద్ర, కటివాతము, క్షయము, కుష్ఠము దురద, గజకర్ణము, మస్తకరోగము, భ్రమ, పిత్తము, నేత్రరోగము, దృష్టిరోగము, జీర్ణ జ్వరము, అస్థిగతజ్వరము, మేహజ్వరము-వీనిని హరింపజేయును. ఈతైలము పూర్వము ఈశ్వరునిచే జెప్పంబడియెను. దాని నశ్వినీదేవతలు ప్రసిద్ధపఱచిరి. మఱియు నీతైలవ సర్వరోగముల హరింపజేయును. ఇదిభూమియందుండు వైద్యులకులభించుట దుర్లభమ

ఈతైలమును గురుముఖముగ నెఱింగిన ఔషధసిద్ధి గలుగును. తద్విపరీతంబున సిద్ధి గలుగనేరదు.

సర్వాంగే చందనాలేప శ్చంద్ర కస్తూరికాయుతః,
సితనీరజలేపోవా ధారాగారనివేశనమ్. 69

తా. పచ్చకర్పూరము, కస్తూరి అనువానితోగూడియుండు శ్రీగంధమును పూసికొనినను, లేక తెల్లతామరపువ్వుల ధరించినను, లేక జలయంత్రములు గలగృహమందు నివసించుచుండినను తాపము హరించును.

తృష్ణారోగములయందు పథ్యము

భృష్టముద్గైర్మసూరైర్వా చణకైర్వా కృతోరసః,
రంభాపుష్పం తక్రకూర్చం ద్రాక్షా పర్పట వాలకమ్. 70
కపిత్థం మాలికా కోలం కూశ్మాండక ముపోదికా,
ఖర్జూరం దాడిమం ధాత్రీ కర్కటీలలదంబుచ. 71
జంబీరం కిరమర్దశ్చ బీజపూరో గవాంపయః,
మధూకపుష్పం హ్రీబేరం తిక్తాని మధురాణిచ. 72
బాలతాళాంబు శీతాంబు పయః పేయ ప్రపానకం,
మాతులికం సరసీతోయం శతాహ్వా నాగకేసరమ్. 73
ఏలా జాతీఫలం పథ్యా కుస్తుంబరి కుచందనం,
ఘనసారో గంధసారః కౌముదీ శిశిరోఽనిలః.
చందనార్ద్ర ప్రియాశ్లేషో ముక్తాభరణధారణం,
గాహనం లేపనంచాస్య పథ్యమేత త్తృషాతురే. 75

(మాధవనిదానే)

తా. వేయించిన పెసలు, చిఱుసెనగలు, సెనగలు అనువానిలో దేనితోనైనను జేయబడినకట్టు, అరటిపువ్వు, మజ్జిగ, జున్ను, ద్రాక్షపండు, పర్పాటకము, వట్టివేరు, వెలగపండు, పువ్వులదండ, రేగుపండు, గుమ్మడుకాయ, బచ్చలికూర, ఖర్జూరపండు, దాడింబపండు, ఉసిరికపండు, దోసకాయ, పారేనీరు, నిమ్మపండు, ఓకఫలము, మాదీఫలము, ఆవుపాలు, ఇప్పపువ్వు, కురువేరు, చేదుగలరసము, మధురరసము, లేతతాటినీరు, శీతోదకము, పాలు, పానకము, తేనె, చెరువులోనినీరు, చల్లకిల్లిగడ్డలు, నాగకేసరములు, ఏలకులు, జాజికాయ, కరక్కాయ, కొతిమెర్లు, రక్తచందనము, పచ్చకర్పూరము, కచోరములు, వెన్నెల, చల్లనిగాలి, చందనముపూసికొనిన స్త్రీలయొక్క యాలింగనము,

ముత్యాలహారముల ధరించుట, నదులయందు స్నానముజేయుట, లేపనము-ఇవి తృష్ణా రోగమునందు పథ్యకరంబులు.

తృష్ణారోగమునం దపథ్యము

స్నేహాంజనం స్వేదనధూమపానం వ్యాయామనస్యాతపదంతకాష్ఠం,
గుర్వన్నమమ్లం లవణం కషాయం కటుత్రికం దుష్టజలానితీక్ష్ణమ్. 76

తా. శరీరమునకు తైలముపూసికొనుట, అంజనమువేసికొనుట, చెమటదీయుట, ధూమపానముసేయుట, మిక్కుటముగ సంచరించుట, నస్యముసేయుట, ఎండలోదిరుగుట, చెడ్డదంతకాష్ఠము, జడాన్నము, పులుసు, ఉప్పు, ఒగరుగలరసములు, శొంఠి, పిప్పలి, మిరియాలు, చెడ్డనీరు, కారము అనువానిసేవంజేయుట-ఇవి యన్నియు తృష్ణారోగమునం దపథ్యకరంబులు. అట్లగుటచే వానిని వర్జింపవలయును.

దాహరోగమునందు పథ్యము

శాలయష్షష్టికా ముద్గా మసూరా శ్చణకా యవాః,
ధన్వమాంసరసాలాజా మండంపై సక్తువాసితా. 77
శతధౌతం ఘృతం దుగ్ధం నవనీతం పయోభవం,
కూశ్మాండం కర్కటీ మోచా పనస స్వాదు దాడిమమ్. 78
పటోల పర్పటీ ద్రాక్షా ధాత్రీఫల పరూషకం,
బింబీ తుంబీ తథావేతః ఖర్జూరం ధాన్యకం మిసీ. 79
బాలతాలం ప్రియాళంచ శృంగాటంచ కసేరుకం,
మధూకపుష్పం హ్రీబేరం పథ్యా తిక్తాని సర్వశః. 80
సితాప్రదేహః భూవేశ్మ సేకోఽభ్యంగావగాహనం,
ఫుల్లోత్పలదళక్షౌమ శయ్యాశీతలకాననమ్. 81
కథావిచిత్రాగీతాని వాద్యం మంజుళభాషణం,
ఉశీరచందనోలేప శ్శీతాంశు శ్శిశిరోఽనిలః. 82
ధారాగృహం ప్రియాస్పర్శో ప్రతీరం హిమవాలుకం,
సుధాంశురశ్మయస్స్నానం మణయో మధురోరసః. 83
పూర్వోక్తాని విధేయాని పిత్తహారిణి తానిచ,
ఇతి దాహవతాం నృణాం పథ్యవర్గ ఉదాహృతః. 84

(మాధవనిదానే)

తా. ౬౦ దినములకు ఫలించెడివడ్లు, పెసలు, చిఱుసెనగలు, సెనగలు, యవలు, మిట్టభూమియందలి జంతుమాంసరసము, [1] లాజమండము, పేలపిండి, పంచదార, నూరు మార్లు ఉదకముతో గడుగఁబడినఘృతము, పాలు, పాలయందు తీయఁబడిన వెన్న, బూడిదెగుమ్మడుకాయ, దోసకాయ, అరటిపండు, పనసపండు, తీపిగలదాడిమపండు, పొట్లకాయ, పర్పాటకము, ద్రాక్షపండు, ఉసిరికయొలుపు, పెద్దయీతపండు, దొండ కాయ, అనుపకాయ, అల్లము, ఖర్జూరపండు, ధనియాలు, సదాప, లేతతాటిముంజలు, సారపప్పు, పరికెగడ్డ, నెమ్ముటములు, పంచదార, శీతపదార్థలేపనము, భూగృహము, [2] సేచనము, అభ్యంజనస్నానము, వికసించిన కమలములయొక్క శయ్యపై పరుండుట, పట్టుమెత్తపైపరుండుట, చల్లనితోట, చిత్రకథలను, సంగీతమును, వాద్యమును వినుట, మంచిమాటలాడుట, వట్టివేరువిసనకఱ్ఱలయొక్క గాలిని సేవించుట, చందనమును బూసికొనుట, వెన్నెల, చల్లనిగాలి, జలగృహము, స్త్రీలయొక్క యాలింగనము, ఏటిగట్టునందు గూర్చుండుట, పచ్చకర్పూరము, చంద్రకిరణము, స్నానము, రత్నధారణము, మధురరసము, పూర్వోక్తపిత్తనాశనకరయోగములు . ఇవియన్నియు దాహరోగమునందు పథ్యకరంబులు.

## దాహరోగమునందపథ్యము

విరుద్ధాన్యన్న పానాని క్రోధో వేగవిదారణం,
శ్రమస్త్ర్యవాయ మార్ధ్మానం క్షారం పిత్తకరాణిచ. 85
వ్యాయామ మాతపం తక్రం తాంబూలం మధురామఠం,
వ్యవాయి కటు తీక్ష్ణోష్ణాన్ దాహవాన్ పరివర్జయేత్. 86

తా. క్షీరమత్స్యాదివిరుద్ధన్నమును, విరుద్ధపానమును సేవించుట, క్రోధమును జెందుట, మలమూత్రాదులవేగము నడ్డగించుట, శ్రమ, స్త్రీగమనము, కడుపు నుబ్బించెడి పదార్థములు, క్షారము, పిత్తకరవస్తువులు-వీనిని మిక్కుటముగ సేవించుట, మిక్కుటముగ సంచారముసేయుట, ఎండ, మజ్జిగ, తాంబూలము, తేనె, ఇంగువ, చేదు, కారము, ఉష్ణము గలపదార్థములు వీనిని సేవించుట-ఇవి దాహరోగమునం దపథ్యకరంబులు. అట్లగుటచే వానిని వర్జింపవలయును.

---

1 లాజమండ మన—ఒకభాగము పేలాలలో ౧౪ భాగములనీరుపోసి పేలాలం ద్రవించి గంజిగనగుపఱకు నుడికించుటయ. 2 సేచన మన— శీతోదకము మొదలగు వానిని శరీరముపైఁ జిలకరించుటయ.

### హృద్రోగనిదానము

అత్యుష్ణామ్లకషాయంచ హ్యాతిస్త్రీవ్యసనం తథా,
హృది బాధాం ప్రకుర్వంతి హృద్రోగం తం ప్రచక్షతే. 87
(మాధవనిదానే)

తా. అత్యుష్ణము, పులుసు, ఒగరుగల ద్రవ్యములను మిక్కుటముగ సేవించుట, మిక్కుటముగ స్త్రీసంభోగముసేయుట-వీనివలన రొమ్మునందు పీడజనించును. ఇదియె హృద్రోగ మనంబడును. (హృద్రోగ మన రొమ్మునొప్పి.)

### హృద్రోగభేదములు

హృద్రోగః పంచధా దోషైః పృథక్సర్వైశ్చ జంతుభిః,
వాతాత్సశూలం హృదయం పిత్తాద్దాహసమన్వితమ్. 88
కఫతోఽతిగురు స్తబ్ధం సర్వత స్సర్వలక్షణం,
సత్యాజ్యః క్రిమిభిశ్చిత్థో హ్యతికండూసమన్వితః. 89

తా. విరుద్ధాహారవిహారములవలన వాతాదిదోషములు ప్రకోపించి వాతజ, పిత్తజ, శ్లేష్మజ, సన్నిపాతజ,కృమిజములన నైదువిధములైనహృద్రోగములనుగలుగంజేయును.అందు వాతమువలన జనించినహృద్రోగములో రొమ్మునందు నొప్పి గలుగును. పిత్తమువలన జనించినదానిలో రొమ్ములోతాపము గలుగును. శ్లేష్మమువలన జనించినదానిలో వాత, పిత్త, శ్లేష్మలక్షణంబులు గలిగియుండును. ఇది అసాధ్యము. *క్రిములవలన జనించినదానిలో మిక్కుటముగదురదగలుగును. (ఏకదోషమువలన జనించిన హృద్రోగములే సాధ్యంబులు. ద్విదోష, త్రిదోషములవలన జనించిన హృద్రోగములు అసాధ్యంబులు.)

మారుతాద్ధృదయం యస్య స్ఫుటితం చాతివేదనం,
పిత్తాన్మూర్ఛాక్లమస్వేదో ముఖశోషః ప్రజాయతే. 90
శ్రమోఽరుచిశ్చ మందాగ్నిః కఫస్రావః కఫాధికే,
మిశ్రితం ద్వంద్వజం జ్ఞేయం సర్వలింగం త్రిదోషజమ్. 91

తా. వాతజహృద్రోగమున రొమ్ము పగిలినటుల మిక్కుటముగ నొచ్చును. పిత్తహృద్రోగమున మూర్ఛ, బడలిక, చెమట గలిగి ముఖము వాలినట్లుండును. శ్లేష్మజహృద్రోగమున శ్రమ, అరుచి, అగ్నిమాంద్యము గలిగి నోటినుండి కఫము వెడలును. ద్వంద్వహృద్రోగమున రెండేసిదోషలక్షణంబులు గలిగియుండును. త్రిదోషజహృద్రోగమున వాత, పిత్త, శ్లేష్మలక్షణంబు లన్నియు గలిగియుండును. (ఇది అసాధ్యము.)

---

* క్రిము లన పురుగులు.

### కృమిహృద్రోగలక్షణము

విద్యాత్త్రిదోషంత్వపిసర్వలింగం తీవ్రార్తితోదం క్రిమిజంసకండుకమ్.
ఉత్క్లేదష్ఠీవనం తోదశ్శూలం హృల్లాసకస్తమః,
అరుచి శ్శ్యావనేత్రత్వం శోషశ్చ కృమిజే భవేత్. 93

తా. తీవ్రమైనపీడ, శూల, దురద గలుగుట, నోటిలో నీరూరుట, ఉమియుట, సూదులతో బొడుచునటుల పీడ గలుగుట, ఓకరింతలు గలుగుట, అరుచి, నేత్రముల యందు నలుపువర్ణము, శోష గలుగుట- ఈలక్షణంబులు క్రిమిజహృద్రోగమునగలుగును.

### హృద్రోగోపద్రవములు

క్లోమసాదో భ్రమశ్శోషో జ్ఞేయాస్తేషా ముపద్రవాః,
క్రిమిజే క్రిమిజాతీనాం శ్లైష్మికాణాం చ యేమతాః. 94
సంస్తంభ స్సజ్వరం ఘోరం రూక్ష స్పర్శా సహం గురు,
ఆధ్మాన కుక్షి హృత్కంఠ వాతవిణ్మూత్రరోధతా. 95
తంద్రారోచకశూలాని తస్య లింగాని నిర్దిశేత్,

తా. పిపాసాస్థానమున బడలిక, భ్రమ, శోష గలిగిన హృద్రోగోపద్రవము లని తెలియవలయును. మఱియు క్రిమిజహృద్రోగమున "శ్లో. హృల్లాసమాస్యస్రవణ మతిపాకమరోచకమ్, మూర్ఛాఛర్ది తృషానాహ కార్శ్యశ్వయథుపీనసాః." (అనఁగా ఓకరింతలు, నోట నీరుగారుట, అన్నము పాకముగాకుండుట, అరుచి, మూర్ఛ, వాంతి, దప్పి, కడుపుబ్బరము, శరీరకృశత్వము, వాపు, పీనసము అన కఫజక్రిమిరోగోపద్రవంబులును, శరీరస్తంభనము, భయంకరమైనజ్వరము, హృదయమున రూక్ష, జడత్వము గలిగి యుష్ణస్పర్శను సహింప లేకుండుట, కడుపుబ్బరము, కడుపు, ఱొమ్ము, కంఠము, అపానవాతము, మలమూత్రములు అడ్డగింపఁబడుట, తంద్ర, అరుచి, శూల అను నుపద్రవంబులును గలుగును.

### హృద్రోగమునకు రసాయనము

రసగంధాభ్రభస్మాని పార్థవృక్షత్వగంబునా. 96
ఏకవింశతిధా ఘర్మే భావితాని విధానతః,
మాషమాత్రమిదం చూర్ణం మధునాసహ లేహయేత్. 97
వాతజం పిత్తజం శ్లేష్మ సంభూతం వా త్రిదోషజం,
క్రిమిజంచాపి హృద్రోగం నిహంత్యేవ నసంశయః. 98

(ఆయుర్వేదే)

తా. రసభస్మము, గంధకభస్మము, అభ్రకభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి ఎండయందునిచి మద్దిచెక్కరసముతో ౨౧ మారు భావనజేసి మాషప్రమాణమును తేనెతో సేవించిన వాత, పిత్త, శ్లేష్మ, త్రిదోష, క్రిమిజహృద్రోగములు నిస్సంశయముగ హరించును.

## పైత్తహృద్రోగమునకు పంచసారరసము

శుద్ధసూతం సమంగంధం ధాత్రీఫలద్రవైర్దినం,
యష్టి ఖర్జూర ద్రాక్షాణాం క్వాథేన మర్దయేద్దినమ్ 99
పంచసారరసోనామ భక్షయే న్మాషమాత్రకం,
ధాత్రీచూర్ణం సితాచాను పిత్తహృద్రోగ*శాంతయే. 100
(మతాంతరే)

తా. శుద్ధిచేసినరస, గంధకములను సమభాగములుగ ఖల్వములో నునిచి ఉసిరికపండ్లరసముతో నొకదినము, యష్టిమధుకము, ఖర్జూరపండు, దీపద్రాక్ష అనువాని కషాయముతో నొకదినము మర్దించి మాషమెత్తుమాత్రలు జేసి ఉసిరికపప్పుచూర్ణము, పంచదార అనువానియనుపానముతోడ సేవించిన పైత్తహృద్రోగము హరించును.

## శ్లేష్మహృద్రోగమునకు హృదయార్ణవరసము

శుద్ధసూతం సమంగంధం మృతం తామ్రం ద్వయోస్సమం,
మర్దయే త్త్రిఫలాద్రావైః కాకమాచీద్రవైర్దినమ్. 101
చణమాత్రాం వటీం ఖాదే ద్రసోఽయం హృదయార్ణవః,
కాకమాచీఫలం శుష్కం త్రిఫలాపలసంయుతమ్. 102
ద్వాత్రింశత్పలైస్తోయైః క్వాథ మష్టావశేషకం,
అనుపానం పిబేచ్చాంత్యై హృద్రోగేచ కఫోత్థితే. 103
(మాధవనిదానే)

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము-ఇవిసమభాగములు, ఈరెంటికిసమము తామ్రభస్మము-ఇటుల వానినేకముజేసి త్రిఫలములు, నల్లకాచాకు అనువానిరసములతో నొకదినము మర్దించి సెనగగింజలంత మాత్రలుజేసి యందొకదానిని ఎండిన నల్లకాచిపండ్లు, త్రిఫలములు అను వానిని దినుసుకొక్కొక పలముచొప్పున దంచి ౩౨ పలములు నీళ్ళుపోసి అష్టావశేషముగ కషాయముగాచి యీయనుపానముతోడ సేవించిన శ్లేష్మహృద్రోగము హరించును.

---

* జిద్భవేత్.

## హృద్రోగమునకు గుంజాభద్రరసము

నిష్కత్రయం శుద్ధసూతం నిష్కద్వాదశగంధకం,
గుంజాబీజంచ షణ్ణిష్కం నింబబీజం జయాతథా. 104
ప్రత్యేకం నిష్కమాత్రంతు సమం నేపాళబీజకం,
జయా జంబీర ధుత్తూర కాకమాచీ ద్రవైర్దినమ్, 105
మర్ద్యం సర్వం రసం కుర్యా ద్ఘృతైర్గుంజాద్వయం లిహేత్,
గుంజాభద్రరసోనామ హింగు సైంధవసంయుతమ్. 106
శమయత్యేవ కించిత్ర ముర స్తంభంచ దుస్సహం,
అర్కక్షీరేణ సింధూత్థం లేపోవక్షసి దాపయేత్. 107
పద్మకేసరకం ద్రాక్షా నింబబీజం జయాతథా,
తుల్యం చతుర్గుణం క్షీరం క్షీరాత్తోయం చతుర్గుణమ్, 108
క్షీరావశేషంచ పచే త్సద్యోద్రం పాయయేద్భిషక్,
ఉదరాణి క్షతంచైవ హృద్రోగం రక్తపిత్తనుత్. 109

(ఆయుర్వేదే)

శుద్ధిజేసినరసము 3 నిష్కములు, శుద్ధిజేసినగంధకము ౧౨ నిష్కములు, గురిగింజలు ౬ నిష్కములు, వేపవిత్తులు ౧ నిష్కము, తక్కలివిత్తులు ౧ నిష్కము, శుద్ధిజేసిన నేపాళములు ౧ నిష్కము-ఇటుల వానినెల్ల ఖల్వములోనునిచి తక్కలి, నిమ్మపండు, ఉమ్మెత్తాకు, నల్లకాచాకు అనువానిరసములతో నొకదినము మర్దించి రెండు గురిగింజలంత మాత్రలుజేసి నెయ్యి, ఇంగువ, సైంధవలవణము అనువానియనుపానముతోడ సేవించిన కడుదుస్తరమైన హృద్రోగము హరించును. మఱియు సైంధవలవణమును జిల్లేడుపాలతో నూరి ఱొమ్మునందు లేపనము జేసిన దుస్తరమైనహృద్రోగము హరించును. తామరకేసరములు, ద్రాక్షపండు, వేపవిత్తులు, తక్కలి అనువానిని సమభాగములుగ గ్రహించి దానికి నాలుగింతలు ఆవుపాలు, ఆవుపాలకు నాలుగింతలు నీళ్ళుపోసి పాలుశేషించు నటులగాచి అందొకింత తేనె, రెండుగురిగింజలయెత్తుఔషధమునుగలిపి సేవించిన ఉదరము, గాయము, హృద్రోగము, రక్తపిత్తము హరించును.

## హృద్రోగమునందు పథ్యము

స్వేదో విరేకో వమనంచ లంఘనం వస్తిర్విలేప శ్చిరరక్తశాలయః,
మృగాజెజం జాంగలసంజ్ఞయాన్వితం యూషారసాముద్గకుళుత్థసంభవాః,
పురాణకూశ్మాండరసానదాడిమం శమ్యాకశాకంతు పటోలకంచ,

ఏరండతైలం గగనాంబుసైంధవ మాజావితక్రంచ పురాతనోగుడః.
శుంఠీ యవానీ లశునం హరీతకీ కుష్ఠంచ కుస్తుంబరు కృష్ణమార్ద్రికం,
సౌవీరశుక్లం మధు వారుణీరసః కస్తూరికా చందనకం ప్రమాణమ్.
తాంబూలమప్యేషగణస్సఖాభవే న్మర్త్యస్యహృద్రోగనిపీడితాత్మనః,
(మాధవనిదానే)

తా. చెమటదీయుట, విరేచనము, వమనము జేయించుట, లంఘనము వేయుట, వస్తి కర్మంజేయుట, లేపనముల జేయించుట, కడుప్రాతసెట్టిబియ్యపువంటకము, అడవియందుండు పశుపక్షులమాంసము, పెసరకట్టు, ఉలవకట్టు, ప్రాతగుమ్మడుకాయ, మామిడికాయ, దాడిమపండు, ఉలాకు, పొట్లకాయ, ఆముదము, వానసీరు, సైంధవలవణము, మేక, గొఱ్ఱె అనువానిమజ్జిగ, ప్రాతబెల్లము, శొంఠి, ఓమము, వెల్లుల్లి, కరక్కాయ, చెంగల్వ కోష్టు, కొతిమెర్లు, మిరియాలు, అల్లము, కలి, తెల్లనితేనె, సారాయి, కస్తూరి, చందనము, తాంబూలము, అనునవి హృద్రోగమునందు పథ్యకరంబులు.

హృద్రోగమునం దపథ్యము

తృట్ఛర్దిమూత్రానిలశుష్కకాసోద్గార శ్రమ శ్వాసవిడ శ్రు వేగాః,
సింధ్వేందువింధ్యాద్రినదీజలాని మేషీపయోదుష్ట జలంకషాయం.

తా. దప్పి, వాంతి, మూత్రము, వాతము, పొడిదగ్గు, తేనుపు, శ్రమ, శ్వాసము, మలము, రోదనము అనువానివేగము నడ్డగించుట, సింధునది, హిమాలయము, వింధ్య పర్వతము అనువానియొక్క జలము, బఱ్ఱెపాలు, దుష్టజలము, ఒగరు (ఉప్పు, కారము, దంతకాష్ఠము, రక్తమోక్షణము) ఇవి హృద్రోగమునం దపథ్యకరంబులు.

విషూచీలక్షణము

వివిధై ర్వేదనాభేదై ర్వాయురైర్వ భృశకోపితః. 114
సూచీభిరివ గాత్రాణి విధ్యతీతి విషూచికా, (మాధవనిదానే)

తా. వాతము మిక్కుటముగ ప్రకోపించుటవలన పలువిధ వేదనాభేదములు గలిగి సూదులతో బొడుచునటుల శరీరమును వేధించునది విషూచి యనంబడును.

వాతవిషూచీలక్షణము

తత్ర శూల భ్రమానాహ కంప స్తంభాదయోఽనిలాత్. 115

తా. కడుపునొచ్చుట, భ్రమగలుగుట, కడుపుబ్బుట, శరీరము వణకుట. శరీరము స్తంభించుట-ఈలక్షణములు గలది వాతవిషూచి యని తెలియవలయును.

## పైత్తవిషూచీలక్షణము

పిత్తాజ్జ్వరోఽతిసారశ్చ తంద్రా తృట్ప్రలపాదయః,

తా. జ్వరము, అతిసారము, తంద్ర, దప్పి గలుగుట, వదరుట - ఈలక్షణములు గలది పిత్తవిషూచి యని తెలియవలయును.

## శ్లేష్మవిషూచీలక్షణము

కఫాచ్ఛర్ద్యంగ గురుతా వాక్సంగః ష్ఠీవనాదయః. 116
విషూచ్యా మతివృద్ధాయాం పార్ష్ణిదాహః ప్రశస్యతే,
సదాహశ్చాపదాశ్చైవం విధివచ్చోపచారయేత్. 117

తా. వమనంబు లగుట, శరీరము బరువుగ నుండుట, నోరు బంధింపంబడి మాట లాడుటకు శక్తిలేకుండుట, నోట జొల్లుగారుట - ఈలక్షణములుగలది శ్లేష్మవిషూచియని తెలియవలయును. విషూచి మిక్కుటముగ వృద్ధిం జెందిన మడమలు మొదలు పాదముల వఱకు రక్ష వేసి యథావిధిగ చికిత్సింపవలయును.

## విషూచ్యుపద్రవములు

నిద్రానాశో రతిః కంపో మూత్రాఘాతో విసంజ్ఞతా,
అమీ ఉపద్రవా ఘోరా విషూచ్యాం పంచదారుణాః. 1'8

తా. నిద్రాభంగము, ఏపదార్థమునం దిచ్ఛ లేకుండుట, వణకు, మూత్రప్రతిబంధము, మూర్ఛ-అనునీయైదును విషూచియందు దారుణోపద్రవము లని తెలియవలయును.

## అసాధ్యవిషూచీలక్షణము

శూలం విరేక వమన మానాహో దాహ తాపనం,
విషూచ్యాం షట్ప్రకారేణ మృత్యురేవ నసంశయః. 119
(ఆయుర్వేదే)

తా. పైచెప్పంబడిన విషూచులలో శూల, విరేచనము, వాంతి, కడుపుబ్బరము, దాహము, తాపము అను నాఱుపద్రవములు గలిగిన రోగి నిస్సంశయముగ మృతిజెందును.

రసనాదంతనఖాధరకృష్ణతా నయనమజ్జనకంపశ్రుతిక్షయః,
స్మృతివినాశనకం శిథిలాంగతా మరణకారణమేతి విషూచికా.
(మాధవకల్పే)

తా. నాలుక, దంతములు, గోళ్ళు, పెదవులు నల్లగ నుండుట, నేత్రములు గుంటలుపడుట, శరీరము వణకుట, చెవులు వినరాకుండుట, స్మృతి లేకుండుట, అవయవ

ములు శిథిలంబులగుట-ఈలక్షణములు విషూచిరోగమునందు గలిగిన మరణము గలుగునని తెలియవలయును. (ఈదుర్గుణములు లేకుండెడి విషూచులే సాధ్యంబులని యెఱింగి చికిత్సింపవలయును.)

అలసకలక్షణము

కుక్షిరానహ్యతేత్యర్థం ప్రతామ్యేత్పరికూజతి,
నిరుద్ధోమారుతశ్చైవం కుక్షౌ వుపరిధావతి. 121
వాతవర్చో నిరోధశ్చ యస్యాత్యర్థం భవేదపి,
తస్యాలసకమాచష్టే తృష్ణోద్గారౌతు యస్యచ. (ఆయుర్వేదే)

తా. మిక్కుటముగ కడుపుబ్బుట, మోహమును జెందుట, దీనముగ శబ్దించుట, అజీర్ణమువలన వాతం బధోముఖప్రతిబంధము గలదై హృదయకంఠాదులయందు సంచరించుట, వాత మలములు మిక్కుటముగ బంధింపబడుట, దప్పి, తేనుపులు గలుగుట-ఈ లక్షణములు గలది అలసకరోగమని తెలియవలయును.

విలంబికాలక్షణము

దుష్టంతు భుక్తం కఫమారుతాభ్యాం
ప్రవర్తతేనోర్ధ్వమధశ్చ యస్యాం,
విలంబికాంతాం భృశదుశ్చికిత్సా
మాచక్షతే శాస్త్రవిదః పురాణాః. 123

తా. కఫ, వాతములవలన భుజించినయన్నము దుష్టంబై ఊర్ధ్వముగగాని, లేక అధోమార్గముగగాని, వెడలకుండిన విలంబికయని తెలియవలయును. దీని నాయుర్వేద వేత్తలు అసాధ్యమని వచించెదరు.

అసాధ్యవిషూచి, అలసకలక్షణము

యశ్శ్యావదంతోష్ఠనఖోఽల్పసంజ్ఞో వమ్యర్దితోఽభ్యంతరయాతనేత్రః,
క్షామస్వరస్సర్వవిముక్తసంధి ర్యాయాన్నరోసౌపునరాగమాయః.

తా. దంతములు, పెదవి, గోళ్ళు నల్లనగుట, ఒకింత తెలివిగలిగియుండుట, వాంతి గలుగుట, నేత్రములు లోనికేగుట, హీనస్వరముగలుగుట, సర్వసంధులు శైథిల్యమును జెందుట-ఈలక్షణములుగల విషూచి, అలసకరోగులు మృతిజెందెదరు.

విషూచులకు చికిత్స

విషూచ్యామతివృద్ధాయాం * మస్తుదేయం ముహుర్ముహుః,

* తక్రం దధిసమం జలమ్.

దధి తక్రం సదా శీఘ్రం పేయం జీవనహేతవే. 125

(మాధవనిదానే)

తా. అధికముగవృద్ధిజెందిన విషూచులయందు పెరుఁగుమీఁదినీళ్ళు, పెరుగు, చల్ల అనువానిలో దేనినిగాని పలుమారు త్రాగిన రోగి జీవించును.

గాఢం ప్రచ్ఛర్దనం ప్రాక్సలవణ సలిలై ర్భృంగతో యేనసస్యం
చించాపత్రాంభసా సత్రికటు పటుయుతేనాగ్నినా పార్ష్ణిదాహః,
కల్కం శుంఠీ కణానామపి శృతసలిలైః పేయమగ్ని ప్రకోపః
లుంగామ్లైరోష్ణ్వషనక్తాహ్వాయఫలరజనీత్వ్యంజనంస్యాద్విషూచ్యామ్.

తా. విషూచులయందు తొలుత గాఢముగ వమనముచేయించి విదప సైంధవలవణమును నీళ్ళతోనూరి గుంటగలగరాకురసముతో గలిపి నస్యముజేయించినను, లేక చింతాకు రసముతో త్రికటుకములు, సైంధవలవణము గలిపి నస్యము జేయించినను, లేక మడమల యందు రక్షలువేసినను విషూచి హరించును. మఱియు త్రికటుకములను నూరి కల్కము జేసి ఉష్ణోదకములో గలిపి త్రాగిన విషూచి హరించి అగ్నిదీపనము గలుగును. త్రికటుకములు, క్రానుగవిత్తులు, పసపు- వీనిని మాదీఫలరసముతో నూరి అంజనమువేసిన విషూచి హరించును.

## అగ్నిముఖరసము

సూతం గంధం విషం తుల్యం మర్దయేదార్ద్రిక ద్రవైః,
అశ్వత్థచించాపామార్గ క్షారః క్షారౌచ టంకణమ్. 127
జాతీఫలం లవంగంచ త్రికటు త్రిఫలాసమం,
శంఖక్షారం పంచపట్కం హింగు జీరం ద్విభాగకమ్. 128
మర్దయే దమ్లయోగేన గుంజామాత్రం వటీకృతా,
పాచనీ దీపనీ సద్యో జీర్ణశూల విషూచికాః. 129
హిక్కాం గుల్మం చోదరంచ నాశయే న్నాత్రసంశయః,
రసేంద్రసంహితాయాంచ నామ్నా వహ్నిముఖో రసః. 130

(నిత్యనాథీయే)

తా. రసము, గంధకము, వసనాభి- వీనిని శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వములో నునిచి అల్లపురసముతో మర్దించి, అందు రావి, చింత, ఉత్తరేణు అనువాని క్షారములను, యవక్షారము, సర్జక్షారము, వెలిగారక్షారము, జాజికాయ, లవంగములు, త్రికటుకములు, త్రిఫలములు, శంఖభస్మము, యవక్షారము అనువాని చూర్ణములను, పుష్కర

శూలము, సర్జక్షారము, మోదుగు, నువ్వులదంటు, యవలు అనువానిక్షారములను స॰ భాగములుగ గలిపి దానితో ఇంగువ, జీలకఱ్ఱ అనువానిని ౭ భాగములు జేర్చి ని॰ పండు, పులిచింత మొదలగు పుల్లనిద్రవ్యములరసములతో మర్దించి గురుగింజంతమాత్ర॰ జేసి సేవించిన అజీర్ణము, శూల, విషూచిక, ఎక్కిళ్లు, గుల్మము, ఉదరము అను వాని నిస్సంశయముగ హరింపజేసి పాచన దీపనముల గలుగంజేయును.

## శంకవటిక

చించాశ్వత్థ స్నుహీ క్షార మపామార్గార్కకం తథా,
లవణం పంచ సంగృహ్య తతో లవణపంచకాః. 13
సైంధవాద్యాః సమాదాయ సర్వమేతత్పలద్వయం,
ద్వాకర్షాచ పృథక్కార్యా తథావై శంఖచూర్ణతః. 13
ఫలత్రయాచ్చ కర్షైకం ద్వికర్షంతు లవంగకం,
ఏతత్సర్వం సమాసాద్య శ్లక్ష్ణచూర్ణీకృతం శుభమ్. 13
భావయే ద్దమ్లయోగేన సప్తధాచ ప్రయత్నతః,
రసశ్శంఖవటీనామ సేవిత స్సర్వరోగజిత్. 13
గుంజామాత్రమిమంఖాదే ద్భవే ద్దీపనపాచనం,
అజీర్ణం వాతసంభూతం పిత్తశ్లేష్మభవంతథా. 13
విషూచీం శూలమానాహం హన్యా దత్ర న సంశయః,
(మాధవనిదానే

తా. చింత, రావి, జెముడు, ఉత్తరేణు, జిల్లేడు అనువానిక్షారములు, పంచలవ॰ ములు- ఇవి దినుసు కెసిమిది రూపాయలయెత్తు, శంఖభస్మము ౨ రూపాయలయెత్తు త్రిఫలములు ౧ రూపాయయెత్తు, లవంగములు ౨ రెండురూపాయలయెత్తు-ఇటుల వీ॰ నెల్ల దంచి చూర్ణముజేసి నిమ్మపండ్లరసముతో నేడుమార్లు భావనజేసి ఒక గురిగింజయె త్తును సేవించిన సర్వరోగములు, వాత, పిత్త, కఫములవలన జనించినఅజీర్ణము,విషూచి శూల, ఆనాహము- వీనిని నిస్సంశయముగ హరింపజేయుటయేగాక దీపన, పాచనమ లనగా గలుగంజేయును.

## సంజీవనీగుటికలు

విడంగం నాగరం కృష్ణా పథ్యా వహ్నీ విభీతకాః. 136
వచా గుడూచీ భల్లాత విషంచాత్ర ప్రయోజయేత్,
ఏతాని సమభాగాని గోమూత్రేణైవ పేషయేత్. 137

గుంజాభాం వటికాం కుర్యా ద్దద్యాదార్ద్రికజై రసైః,
ఏకామజీర్ణయుక్తస్య ద్వేవిషూచ్యాం ప్రదాపయేత్. 138
తిస్రోభుజంగదష్టస్య చతస్రస్సన్నిపాతినః,
గుటికా జీవనీనామ్నా సంజీవయతి మానవమ్. 139

తా. వాయువిడంగములు, శొంఠి, పిప్పలి, కరక్కాయ, చిత్రమూలపుపట్ట, తానికాయ, వస, తిప్పతీఁగె, జీడి, అతివస-వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి గోమూత్రముతో ఖల్వమున మర్దించి గురిగింజంతమాత్రలుజేసి అల్లపురసముతో నొకమాత్రను సేవించిన అజీర్ణమును, రెండుమాత్రలు సేవించిన విషూచిని, మూఁడుమాత్రలు సేవించిన సర్పవిషమును, నాలుగుమాత్రల సేవించిన సన్నిపాతమును హరింపంజేయును. ఇది మనుజునకు సంజీవితుల్యంబుగ నుండుటచే సంజీవని యని జెప్పంబడును.

విలంబిక, అసలక చికిత్స

విలంబికాలసకయో రూర్ధ్వాధశ్శోధనం హితం,
నాళేన ఫలవర్త్యాచ తథా శోధనభేషజైః. 140
దండాద్యలసకేప్యేవ్యే రయమేవ క్రియాక్రమః,

తా. విలంబిక, అసలకము అను నీరెండురోగములయందు వమనము, విరేచనము చేయించుట హితకరంబు. మఱియు ఫలవర్తి, శోధనౌషధము హితకరంబు. మఱియుం దండాలసకరోగమునందుకూడ ఈచికిత్సలనే జేయవలయును.

అగ్నిమాంద్యనిదానము

మంద స్తీక్ష్ణోఽథ విషమ స్సమశ్చేతి చతుర్విధః. 141
కఫపిత్తానిలాధిక్యా త్తత్సామ్యాజ్జాఠరోఽనలః, (మాధవనిదానే)

తా. కఫ, పిత్త, వాతాధిక్యమువలనగాని, లేక వానిసమత్వమువలనగాని, జాఠరాగ్నికి నాలుగవస్థలు గలుగును. అవెవ్వియనిన—కఫమువలనమాంద్యావస్థ, పిత్తమువలన తీక్ష్ణావస్థ, వాతమువలన విషమావస్థ, త్రిదోషసమత్వమువలన సమావస్థ అనునవియ.

అగ్నిమాంద్యస్వరూపము

విషమో వాతజా న్రోగాన్ తీక్ష్ణం పిత్తనిమిత్తజాన్. 142
కరోత్యగ్ని స్తథా మందో వికారాన్ కఫసంభవాన్,

తా. విషమాగ్ని వాతజన్యములైన ౮౦ రోగములయం దేదైననొకరోగమును, సామాన్యజ్వరాతిసారములను గలుగంజేయును, తీక్ష్ణాగ్ని పిత్తజన్యములైన ౪౦ రోగముల

యందు ఓమ, చోషాదికరోగములలో దేనినేని గలుగంజేయును. మందాగ్నికఫజన్యములైన అం రోగములయం ధాలస్యాదుల గలుగంజేయును.

సమాగ్న్యాదిలక్షణము

సమాసమాగ్నేరశితా మాత్రాసమ్యగ్విపచ్యతే. 143
స్వల్పాపి నైవ మందాగ్నే ర్విషమాగ్నేస్తు దేహినః,
కదాచి త్పచ్యతే సమ్య క్కదాచి న్న విపచ్యతే. 144
మాత్రాతిమాత్రాప్యశితా సుఖం యస్య విపచ్యతే,
తీక్ష్ణాగ్నిరితి తం విద్యా త్సమాగ్నిశ్శ్రేష్ఠ ఉచ్యతే. 145

తా. సమాగ్నియందు భుజించినయాహారము బాగుగ పచనంబగును. మందాగ్నియందు అల్పాహారమును భుజించనను పచనము గాకుండును. విషమాగ్నియం దొకపుడు బాగుగ పచనంబై మఱియొకపుడు పచనము గాకుండును. తీక్ష్ణాగ్నియందు మిక్కుటముగ భుజించినను సుఖముగ పచనంబగును. కావున సర్వాగ్నులలో సమాగ్నియే శ్రేష్ఠంబు. (భస్మక మనునగ్ని తీక్ష్ణాగ్నికి వ్యతిరిక్తంబు. కడుతీక్ష్ణాగ్నియే భస్మక మను పేరం బరగు నని చరకగ్రంథమున జెప్పంబడియున్నయది). ఎట్లనిన—

తీక్ష్ణాగ్నిలక్షణము

నరే క్షీణకఫే పిత్తం కుపితం మారుతానుగం,
సోష్మణా పాచకస్థానే బలమగ్నేః ప్రయచ్ఛతి. 146
తదాలబ్ధబలో దేహం రూక్షయే త్సానిలోనలః,
అభిభూయ పచత్యన్నం తైక్ష్ణ్యాదాశు ముహుర్ముహుః 147
పక్త్వాన్నం సతతో ధాతూ ఞ్ఛోణితాదీ న్పచత్యపి,
తతో దౌర్బల్య మాతంకం మృత్యుంచోపానయేత్పరమ్. 148
భుక్తేఽన్నే లభతే శాంతిం జీర్ణమాత్రే ప్రతామ్యతి,
తృట్కాస దాహ మోహాస్స్యు ర్వ్యాధయోఽత్యగ్నిసంభవాః.
(చరకే)

తా. కఫము క్షయించుటవలన ప్రకోపించినపిత్తము వాతముతో గలసి ఊష్మసహితముగ వర్తమానపాచకస్థానమును జెంది అగ్నికి బలమును గలుగంజేయుచుండ ఆయగ్ని వాతసహాయమువలన ప్రబలి శరీరమున రూక్షను గలుగంజేయును. మఱియు అగ్ని తనతీవ్రమువలన భుజించిన యన్నమును శీఘ్రముగ పచనముజేసి తదనంతరము రక్తాది

ధాతువులసహా పలుమారు పచనముసేయును. దానివలన సత్వహాని, రోగము, మరణము నగా గలుగును. మఱియు నన్నము పచనమైనతోడనే మరల భుజించిక సుఖకరంబుగ నుండును. ఐనను అన్నము జీర్ణమైనతోడనే మూర్ఛజెందు ఈయత్యగ్నియందు మూర్ఛ, దప్పి, దగ్గు, దాహము గలుగును.

ఆధ్మానం శిరసో జాడ్యం స్తైమిత్యం ఛర్ద్యరోచకం,
ఆలస్య మాస్యవైవర్ణ్యం సర్వంచై వాగ్నిమాంద్యజమ్. 150
(మాధవనిదానే)

తా. కడుపుబ్బుట, తలలో జాడ్యముగలుగుట, శరీరము ప్రాసువలెనుండుట, వాంతి, అరుచి, ఆలస్యముగలుగుట, ముఖము వివర్ణంబగుట - ఈలక్షణములన్నియు నగ్నిమాంద్యమువలన గలుగును.

## అజీర్ణరోగభేదములు

ఆమం విదగ్ధం విష్టబ్ధం కఫపిత్తానిలై స్త్రిభిః,
అజీర్ణం కేచి దిచ్ఛంతి చతుర్థం రసశేషతః. 151
అజీర్ణం పంచమం కేచి న్నిర్దోషం దినపాకిచ,
వదంతి షష్ఠంచాజీర్ణం ప్రాకృతం ప్రతివాసరమ్. (ఆయుర్వేదే)

తా. కఫ, పిత్త, వాతములవలన క్రమముగ ఆమాజీర్ణము, విదగ్ధాజీర్ణము, విష్టబ్ధాజీర్ణము అన మూడు అజీర్ణములు జనించును. మఱియు ఆహారరసశేషమువలన నాలవయజీర్ణము జనించు నని కొందఱు వచించెదరు. మఱియు ఱేయింబగళ్లలో పచనం బగునపుడు కడుపుబ్బరము మొదలగునవి లేకుండిన ఐదవయజీర్ణమని కొందఱిమతము. మఱియు బ్రతిదినము స్వాభావికముగ (అనఁగా వికృతిజన్యముగాక) నుండునది ఆరవది యని కొందఱు వచించెదరు. (భుజించినయన్నము పచనంబగునిమిత్తము సుశ్రుతమున జెప్పంబడియుండు కొన్నియాచారముల ప్రతిదినము తప్పక నాచరింపవలయు నని బోధించెడినిమిత్తము ఈయారవయజీర్ణము జెప్పంబడియె. అ వెవ్వి యనిన:—("శ్లో. భుక్త్వా శతపదం గచ్ఛే ద్వామపార్శ్వేన సంవిశేత్ । శబ్దరూపరసస్పర్శగంధాంశ్చమనసః ప్రియాన్ । భుక్త్వా నుపసేవేత తేనాన్నం సాధు తిష్ఠతి." అనఁగా భోజనానంతరము నూరు అడుగులు నడచి ఎడమపార్శ్వముగ పరుండుట, మనస్సునకు ప్రియకరమైనశబ్ద, రూప, రస, స్పర్శ, గంధాదుల సేవించుట - వీనివలన అన్నము బాగుగ పచనమును జెందుననుట.)

### ఆజీర్ణ కారణము

అత్యంబుపానాద్విషమాశనాశ్చ సంధారణాత్స్వప్నవిపర్యయాచ్చ,
కాలేపి సాత్మ్యం లఘుచాపి భుక్త మన్నం నపాకం భజతే నరస్య.
ఈర్ష్యాభయక్రోధపరిక్షితేన లుబ్ధేనశుగ్దైన్యనిపీడితేన,
ప్రద్వేషయుక్తేనచ సేవ్యమాన మన్నం నసమ్యక్పరిపాకమేతి. 154

తా. మిక్కుటముగ నీరుద్రాగుట, అకాలమున భుజించుట, మలమూత్రాది వేగముల నడ్డగించుట, పగటియందు నిద్రించుట - ఈకారణములవలన భోజనకాలమును స్నిగ్ధోష్ణాదిగుణయుక్తంబై శరీరప్రకృతి కనుగుణ్యంబై చులకనగ నుండునన్నమును భుజించినను బాగుగ పచనము జెందకుండును. మఱియు *ఈర్ష్య, భయ, క్రోధముల యొక్క వ్యాప్తివలన, లోభ, శోక, దైన్యములయొక్క పీడవలన మత్సరయుక్తుడుగ నుండువాడు భుజించినయన్నము బాగుగ పచనముగాకుండును. (ఈర్ష్య, భయ, క్రోధాదులు మానసికదోషాజీర్ణవిషయమై జెప్పంబడియున్నవని కొందఱు వచించెదరు.)

### ఆమాజీర్ణలక్షణము

తత్రామే గురుతోత్క్లేద శ్శోథో గండాక్షికూటగః,
ఉద్గారశ్చ యథాభుక్త మవిదగ్ధః ప్రవర్తతే. 155

తా. శరీరమున జడత్వము,ఉత్క్లేదము గలుగుట, చెక్కిళ్లు, నేత్రములు అనువాని యందు వాపుగలుగుట, భుజించినటుల తేనుపులు వచ్చుట - ఈలక్షణములు గలది ఆమాజీర్ణ మని తెలియవలయును.

### విదగ్ధాజీర్ణలక్షణము

విదగ్ధేభ్రమ తృణ్మూర్ఛాః పిత్తాచ్చ వివిధా రుజః,
ఉద్గారశ్చ సధూమామ్లు స్స్వేదో దాహశ్చ జాయతే. 156

తా. భ్రమ, దప్పి, మూర్ఛగలుగుట, పిత్తమువలన పలువిధ ఓష చోషాదికపీడలు గలుగుట, పొగయుక్తముగ, తేనుపులువచ్చుట, శరీరమున చెమట, దాహము గలుగుట - ఈలక్షణములు గలది విదగ్ధాజీర్ణ మని తెలియవలయును.

### విష్టబ్ధాజీర్ణలక్షణము

విష్టబ్ధే శూల మధ్మానం వివిధా వాతవేదనాః,
మలవాతాప్రవృత్తిశ్చ స్తంభో మోహోఽంగపీడనమ్. 157

* ఈర్ష్య మన-ఒకనిమేలు నోర్వకుండుట.

తా. శూల, కడుపుబ్బరము, పలువిధవాతభేదాదిరూపవేదనలుగలుగుట, మలము, వాతము బంధించుట, శరీరము స్తంభించుట, మోహము, అంగపీడనము (అనఁగా ఆమ వాతలక్షణము) గలుగుట - ఈలక్షణములు గలది విష్టబ్ధాజీర్ణ మని తెలియవలయును.

రసశేషాజీర్ణలక్షణము

రసశేషేఽన్నవిద్వేషో హృదయా శుద్ధిగౌరవే. 158

తా. అన్నద్వేషము, హృదయమున అస్వస్థత, శరీరజడత్వముగలది రసశేషాజీర్ణ మని తెలియవలయును.

వాతాజీర్ణలక్షణము

విష్టంభో వమనం భ్రాంతిస్తృడ్దాహః పూతిగంధతా,
ముఖే శోషస్తృషార్తిశ్చ వాతాజీర్ణస్యలక్షణమ్. 159
(మాధవనిదానే)

తా. మలబద్ధము, వాంతి భ్రమ, ఒళ్లో మంట, ముఖమున దుర్గంధము, శోష, దప్పి, పీడ గలిగిన వాతాజీర్ణ మని తెలియవలయును.

పిత్తాజీర్ణలక్షణము

రేచనం జఠరే శూలం వమనంచ ముహుర్ముహుః,
హస్తపాదాతిసంకోచః పైత్తాజీర్ణస్యలక్షణమ్. 160

తా. విరేచనములు, కడుపులోశూల, పలుమారు వమనము, హస్త పాదముల యందు సంకోచము గలిగిన పిత్తాజీర్ణ మని తెలియవలయును.

శ్లేష్మాజీర్ణ లక్షణము

వాంతిర్భ్రాంతిర్ముఖే స్వేదో జడతా సీతతా తథా,
కాష్ఠవజ్జాయతే దేహః కఫాజీర్ణస్యలక్షణమ్. 161

తా. వాంతి, భ్రమ, ముఖమునందుచెమట, జడత్వము, శీతలముగలుగుట, శరీరము కొయ్యబారుట - ఈలక్షణములు గలిగిన శ్లేష్మాజీర్ణ మని తెలియవలయును.

అజీర్ణోపద్రవములు

మూర్ఛా ప్రలాపో వమథుః ప్రసేక స్సదనం భ్రమః,
ఉపద్రవాభవంత్యేతే మరణంచాప్యజీర్ణతః. 162

తా. మూర్ఛ, తలుచుమాటలు, ఓకర, నోటనీరూరుట, శరీరశైథిల్యము,బడలిక- అను నీయుపద్రవములు అజీర్ణమువలన గలుగును. మఱియు అజీర్ణము మిక్కుటముగ ప్రకోపించుటవలన మరణము సగా గలుగును.

## అజీర్ణమునకు ముఖ్యకారణము

అనాత్మవంతః పశువద్భుంజతే యేఽప్రమాణతః,
రోగానీకస్య తే మూల మజీర్ణం ప్రాప్నువంతి హిః. 163

తా. అత్యాశచే జ్ఞానశూన్యులై పశువువలె మిక్కుటముగ తినుటవలన అనేక రోగములకు మూలంబైన అజీర్ణరోగము జనించును.

## అజీర్ణహరయోగములు

లవణం కాంజికంచైవ గుడం జంబీరపల్లవం,
పిబేదజీర్ణశాంత్యర్థం వజ్రక్షారం యథాజలైః. 164
నింబ కౌసుంబతైలేన మర్దనంచ ప్రశస్యతే, (మాధవనిదానే

తా. ఉప్పు, కలి, బెల్లము, నిమ్మయిగుళ్లు-వీనిని సమభాగములుగ నూరి భక్షించినను, లేక బ్రహ్మజెముడుబూడిదను నీళ్ళలోగలిపి త్రాగినను, లేక వేపవిత్తులనూనెనుగాని లేకకుసుమవిత్తులనూనెనుగాని, శరీరమునకు లేపనముజేసినను అజీర్ణములు హరించును

## అజీర్ణహరకల్పము

లాజాచూర్ణయుతం క్షౌద్రం పథ్యాదేయం ప్రయత్నతః. 165
జాతీఫలస్య సంచూర్ణం ద్విగుంజం పర్పటీరసం,
పిబేచ్ఛీతలతోయేన తథాఽజీర్ణప్రశాంతయే. 166

తా. పేలపుసత్తు, తేనె, కరక్కాయలు అనువానిని సేవించినను, లేక జాజికాయ చూర్ణములో రెండుగురిగింజలయెత్తు పర్పటీరసమునుగలిపి శీతోదకముతోడ సేవించినను అజీర్ణము హరించును.

## అజీర్ణములకు పథ్యాదిచూర్ణము

పథ్యా పలత్రయం చూర్ణం త్రికటుంచ పలత్రయం,
పలైకం పిప్పలీమూలం త్వగేలాపత్రకం పృథక్. 167
కర్షాంశం చూర్ణితం యోజ్యం పంచవింశత్పలైర్గుడైః,
పలార్ధవటికాం ఖాదే త్సర్వాజీర్ణప్రశాంతయే. 168

తా. కరక్కాయలు 3 పలములు, త్రికటుకములు 3 పలములు, మోడి ౧ పలము లవంగపట్ట, ఏలకులు, ఆకుపత్రిక-ఇవి దినుసుకొక్కొకకర్షము-ఇటుల వీనినెల్ల చూర్ణముజేసి ఖల్వములో నునిచి ౨౫ పలముల బెల్లము గలిపి మర్దించి అరపలమెదుచొప్పున మాత్రలుజేసి సేవించిన సర్వాజీర్ణములు హరించును.

### సర్వాజీర్ణములకు అగ్నికుమారరసము

శుద్ధసూతం విషం గంధం ప్రతినిష్కత్రయం త్రయం,
మరిచం సర్వతుల్యంస్యా త్కంటకారీఫలద్రవైః. 169
మర్దయే ద్భావయే త్తేన భావనాచైకవింశతిః,
దేయాగుంజాద్వయం ఖాదే త్సర్వాజీర్ణప్రశాంతయే. 170
విషూచికాం నిహంత్యాశు రసోహ్యగ్నికుమారకః,
(మాధవనిదానే)

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిచేసిననాభి, శుద్ధిచేసిన గంధకము-ఇవి దినుసుకు 3 నిష్కములు, మిరియాలు ౯ నిష్కములు-ఇటుల వీనిని ఖల్వములో నునిచి నేలములక పండ్లరసముతో ౨౧ మారు మర్దన, భావనలుజేసి రెండుగురిగింజలయెత్తును అల్లపురసముతో సేవించిన సర్వాజీర్ణములు, విషూచి శీఘ్రముగ హరించును.

### అగ్నికుమారరసము

రసేంద్రగంధౌ సహటంకణేన సమంవిషంయోజ్యమిహత్రిభాగమ్.
కపర్దికం శంఖమిహత్రిభాగం మరీచకుత్రాష్టగుణంప్రదేయం,
సుపక్వజంబీరరసేనఘస్రం సిద్ధోభవేదగ్నికుమారఏషః.
[1]విషూచికారోచకసన్నిపాతే [2]దేయాద్విగుంజావటికాస్త్వజీర్ణే,
శ్రీపర్ణఖండేన యథా బలంచ శీతంజలంచానుపిబేత్సరంతి.

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, పేల్చినవెలిగారము - ఇవి దినుసు కొక్కొకభాగము, శుద్ధిచేసిననాభి, గవ్వలభస్మము, శంఖభస్మము - ఇవి దినుసు ఒకటింటికి 3 భాగములు, మిరియములచూర్ణము 8 భాగములు - ఇటుల వానినెల్ల ఖల్వములోనునిచి బాగుగపండిన నిమ్మపండ్లరసముతో నొకదినము మర్దించి రోగబలాను గుణ్యముగ రెండుగురిగింజలయెత్తును తమలపాకులలో నునిచి భక్షించి వెంబడిగ చారెడు శీతోదకమును త్రాగిన విషూచి, అరుచి, సన్నిపాతములు, అజీర్ణములు హరించును.

### క్రవ్యాదరసము

ద్విపలం గంధకం శుద్ధం ద్రావయిత్వా వినిక్షిపేత్,
పారదం పలమానేన మృతశుల్బ్యమపి పునః.
తేన మానేన సమ్మిశ్ర్య పంచాంగుళదళే క్షిపేత్,

---

1 'విషూచికాజీర్ణసమీరణార్తే' - మఱియు 'దద్యాద్విబంధేగ్రహణీగదేచ, అనియు పాఠాంతరములు గలవు. 2 దద్యాద్వివల్లం వటికాస్త్వజీర్ణే.

తతో విచూర్ణ్య యత్నేన నిక్షిప్యాయసపాత్రకే. 175
ఘుల్యా నివేశ్య యత్నేన జ్వాలయే న్మృదుచాలనం,
ప్రస్థమాత్రం రసం సమ్యగ్జంబీరస్య ప్రయోజయేత్. 176
సంమర్ద్యం పంచకోలోత్థైః కిషాయై స్సామ్లవేతసైః,
భావనాఖలు దాతవ్యా పంచాశత్ప్రమితా స్తథా. 177
భృష్టటంకణచూర్ణేన తుల్యేన సహ మేళయేత్,
తదర్ధం కృష్ణలవణం సర్వతుల్యం మరీచకమ్. 178
స_ప్తథా భావయే త్పశ్చా చ్చణకక్షారవారిణా.
తతస్సంశోష్య సంపిష్య కుర్యాస్తు జఠరే క్షిపేత్. 179
అత్యర్థగురుమాంసాని గురుభోజ్యాన్యనేకశః,
భక్షిత్వా కంఠపర్యంతం చతుర్వల్లమితం రసమ్. 180
కట్వమ్లతక్రసహితం పిబే త్తదనుపానతః,
క్షిప్రం తజ్జీర్యతే భుక్తం జాయతే దీపనం పునః. 181
రసః క్రవ్యాదనామాయం ప్రోక్తోమంథానభైరవైః,
సింహళక్షోణిపాలస్య భూరిమాంసప్రియస్యచ.
దష్ట్వోగ్రోమాంసమాసాద్య భైరవానందయోగినా,
కుర్యాద్దీపనముద్ధృతంచ పవనం దుష్టామయోచ్ఛోషణం
తుందస్థౌల్యనిబర్హణం గదహతిం మూలార్తిశూలాపహం,
గుల్మప్లీహవినాశనం గ్రహణికా విధ్వంసనం ప్రంసనం
వాతగ్రంథిమహోదరాపహరణం క్రవ్యాదనామారసః 183
(భైరవకల్పే)

టీ. శుద్ధిచేసి కరగించిన అమ్లసారగంధకము ౨ పలములు, శుద్ధిచేసినరసము ౧ పలము, తామ్రభస్మము, ఇనుపభస్మము-ఇవి దినుసుకొక్కొకపలము. ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి చూర్ణముజేసి ఆముదపాకులోజుట్టి ఇనుపపాత్రలో నునిచి వానిపైమఱి యొకయినుపపాత్రనుమూసిపొయిమీఁదనునిచి మృద్వగ్నితోపాకముజేసిఅందొక ప్రస్థము నిమ్మపండ్లరసముపోసి ఇగురునటులగాచి మరల మర్దించి పంచకోలముల దినుసుకొక్కొక తులముచొప్పున దంచి కషాయముగాచి దానితోడను, పుల్లప్రబ్బలి రసముతోడను మర్దనభావనలు చేయవలయును. ఇటుల యేఁబై మర్దనలు, భావనలుజేసి దానికిసమముగా వేఁచిన వెలిగారమును, వీనికన్నిటికిసమము మిరియములచూర్ణమును గలిపి, సెనగబూడిదె

నీళ్ళతో నేడుభావనలుజేసి పిదపనూరి ఎండించి గాజుకుప్పెలో నునిచి పాకముజేసి నాలుగువల్లములయెత్తును సైంధవలవణము, పులిసినచల్ల అనువానియనుపానముతోడ సేవించి కంఠపర్యంతము మిక్కుటముగ గురుమాంసముల, అనేక గురుభోజనముల భక్షించిన నవి శీఘ్రముగజీర్ణంబై అగ్నిదీపనము గలుగును ఈక్రవ్యాదరసము మంథానభైరవునిచేఁజెప్పఁబడియెను. మఱియు దీనిని భైరవానందయోగి బహుమాంసప్రియుండగు సింహలద్వీపపురాజుకుంజెప్పెను. ఇయ్యది అగ్నిదీపనమును గలుగంచేయుటయేగాక ప్రకోపించిన వాతమును, దుష్టరోగములను, కడుపు పెరుగుట, శరీరతాపము, మూలరోగము, శూల, గుల్మము, ప్లీహము, గ్రహణి, ప్రంసనము, వాతగ్రంథులు, మహోదరము అనురోగములను హరింపజేయును.

## అగ్నిముఖయోగము

కుడవద్వయంకణాయాః మరీచాశ్చత్వారిచ కుడవాని,
కుడవత్రయం కృశానో సైంధవస్యకుడవచతుష్టయంహరీతక్యాః.
విశ్వౌషధ సౌవర్చల బిడాలకానాం పృథగ్ద్వికుడవం,
కుడవాష్టతకాంజికే క్షిప్త్వా సాంద్రం యథాభవేద్విపచేత్. 185
దథాగ్నిముఖనామాయం ప్రియమజీర్ణేగ్నిమాంద్యశూలహరః.

తా. పిప్పళ్లు ౨ కుడవములు, మిరియాలు ౪ కుడవములు, చిత్రమూలము 3 కుడవములు, సైంధవలవణము 3 కుడవములు, కరక్కాయలు ౪ కుడవములు, శొంఠి, సౌవర్చలవణము, బిడాలవణము - ఇవి దినుసొకటింటికి ౨ కుడవములు- ఇటుల వానినెల్ల దంచి చూర్ణముజేసి అందు ౧౦౮ కుడవములు కలిపోసి ముద్దయగునటుల పాకముజేసి సేవించినఅజీర్ణము, అగ్నిమాంద్యము, శూల-వీనిని హరింపంజేయును.

## అగ్నికుమారరసము

శుద్ధసూతం విషం గంధం త్రిక్షారం పటుపంచకం,
దశకం తుల్యతుల్యాంశం భర్జితా విజయాఘృతైః.
దశానాం తుల్యభాగానాం తస్యార్ధం శిగ్రుమూలకం,
తత్సర్వవిజయాద్రావై శ్శిగ్రుచిత్రకభృంగజైః. 188
ద్రవైర్దినద్వయం మర్ద్యం రుధ్వా భాండే పచేల్లఘు,
దీపాగ్నినాతు యామైకం శుద్ధపక్వం సముద్ధరేత్. 189
సప్తధాచార్ద్రకద్రావై శ్చిత్రకై ర్భావయేద్భిషక్,
దీప్యతోఽగ్నికుమారోఽయం నిష్కైకం మధునా లిహేత్. 190

ప్రతికర్షం గుడం శుంఠీ మనుస్యాదగ్ని దీపనః,

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిచేసిననాభి, శుద్ధిజేసినగంధకము, త్రిక్షారములు, పంచలవణములు, దశమూలములు (అనఁగా మారేడు, పెద్దగుమ్ముడు, తక్కలి, కలిగొట్టు, దుందిలము, కోలపొన్న, నక్కపొన్న, చిన్నములక, పెద్దములక, పల్లేరు అనువానిమూలములు) ఇవి సమభాగములు, దశమూలములకు సమము నేతితో వేయించిన గంజాయియాకు, దానిలోసగము మునగవేళ్లు ఇటుల వానినెల్ల ఖల్వములో నునిచి గంజాయియాకు, మునగ, చిత్రమూలము, గుంటగలగర అనువానిరసములతో రెండుదినములు మర్దించి కుప్పెలో నునిచి చీలమన్ను లేపనముజేసి కుండలోనునిచి దీప్తాగ్నితో నొకయామము లఘుపుటంబిడి స్వాంగశీతలమునదీసి ఖల్వములోనునిచి అల్లము, చిత్రమూలము అనువానిరసములతో ఏడేడుమార్లు భావన చేసి నిష్కప్రమాణమును తేనెతో సేవించి వెంబడిగ బెల్లము, శొంఠి అనువానిని కర్షప్రమాణము చొప్పున నూరి కల్కముచేసి త్రాగిన అగ్నిమాంద్యము హరించును.

అగ్నిమాంద్యవటికములు

మృతసూతం విషం గంధ మజామోదా ఫలత్రయమ్. 191
సర్జక్షారం యవక్షారం వహ్నిసైంధవజీరకం,
సువర్చలం విడంగాని సాముద్రం త్ర్యూషణం సమమ్. 192
విషముష్టిం సర్వతుల్యం జంబీరామ్లేన పేషయేత్,
మరిచాభాం వటీం ఖాదే ద్వహ్నిమాంద్యప్రశాంతయే. 193
పథ్యా శుంఠీ గుడంచానుపలార్ధం భక్షయేత్సదా,
అగ్నిమాంద్యవటీం ఖాదే త్సర్వాజీర్ణప్రశాంతయే. (ఆయుర్వేదే)

తా. రసభస్మము, శుద్ధిజేసిననాభి, శుద్ధిజేసినగంధకము, ఓమము, త్రిఫలములు, సర్జక్షారము, యవక్షారము, చిత్రమూలము, సైంధవలవణము, జీలకఱ్ఱ, సౌవర్చలవణము, వాయువిడంగములు, సముద్రలవణము, త్రికటుకములు - ఇవి సమభాగములు వీని కన్నిటికి సమము పెనుముష్టిచెక్క-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి నిమ్మపండ్ల రసముతో మర్దించి మిరియపుగింజలంత మాత్రలుజేసి యందొకదానిని కరక్కాయ, శొంఠి, బెల్లము, అనువానిని సమభాగములుగా నూరి అర్ధపలము ముద్దజేసి యీాయను పానముతోడ ప్రత్యహము సేవించుచుండిన అగ్నిమాంద్యము,సర్వాజీర్ణములుహరించును.

అగ్నిమాంద్యమునకు క్షారాసవటికములు

త్రిక్షారం పంచలవణం మరీచం పంచకోలకం,

అజామోదం తథా హింగు మాతులుంగద్రవైస్సహ,
కోలదాడిమతోయైర్వా మర్దితం గోళకీకృతం,
కర్షంచ భక్షయేన్నిత్యసప్తాహం వహ్నిదీప్తయే. 196

తా. సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము, పంచలవణములు, మిరియాలు, పిప్పళ్ళు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, ఓమము, ఇంగువ-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి మాదీఫలరసముతో మర్దించి పిదప రేగుపండ్లరసముతోగాని, లేక దాడింబపండ్లరసముతోగాని మర్దించి కర్షప్రమాణము మాత్రలుజేసి ఏడుదినములు సేవించిన అగ్నిదీపనమును గలుగంజేయును.

## అగ్నిమాంద్యమునకు తామ్రభస్మయోగము

మృతతామ్రం కణాచూర్ణం తుల్యం క్షౌద్రైర్విమిశ్రితం,
నిష్కార్ధం భక్షయేన్నిత్యం దుష్టవహ్నిం ప్రదీపయేత్. 197

తా. తామ్రభస్మము, పిప్పళ్ళు-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి తేనెలో గలిపి అర్ధనిష్కప్రమాణమును ప్రత్యహము సేవించుచుండిన దుష్టమైన అగ్నిమాంద్యమును హరింపంజేయును.

## అగ్నిమాంద్యమునకు ఆర్ద్రికకల్పము

ఆర్ద్రికస్య రసం క్షౌద్రం పలమాత్రం పిబేదను,
యథేష్టం ఘృతమాంసాని సద్యో భవతి పావకః. 198

తా. ఒకపలము అల్లపురసములో నొకపలము తేనె గలిపి సేవించి పిదపయథేష్టముగ నేతిని, మాంసమును భక్షించిన తత్క్షణమున అగ్నిదీపమును గలుగంజేయును.

గోమూత్రే భృంగవాసానాం స్వరసేషు పృథక్పృథక్,
సప్తవారంచ మండూరం భృష్ట్వా సంచూర్ణ్య సూక్ష్మకమ్
తచ్చూర్ణం వ్యోషచూర్ణేన సమాంశేన ఘృతాన్వితం,
కేవలంవా నిషేవేత శీతలంచాశు నాశయేత్.
జీర్ణజ్వరం పాండురోగం శోథంచానలసాధనం,
(చికిత్సాసారసిద్ధసంగ్రహే)

తా. ప్రాతచిట్టెమును చూర్ణముజేసి కొలిమిలో నునిచి యూది గోమూత్రము, గుంటగలగర, అడ్డసరము అనువానిరసములలో ప్రతిదానిలో నేడేసిమార్లు వైచి పిదప దాని నెండించి సూక్ష్మముగ చూర్ణముజేసి దానికి సమముగ త్రికటుకచూర్ణము గలిపి

గాని. లేక కలపకగాని నేతితో సేవించిన శీతలము, పురాణజ్వరము, పాండువు, శోఫ వీనిని మారింపంజేయుటయేగాక అగ్నిదీపనమును గలుగంజేయును.

చింతామణిరసము

రసం గంధం మృతం శుల్బం మృతమభ్రం ఫలత్రికమ్. 20
త్ర్యూషణం జయపాలంచ సమం ఖల్వే విమర్దయేత్,
ద్రోణపుష్పీరసే భావ్యం శుష్కం తద్వస్త్రగాలితమ్, 20
చింతామణిరసోహ్యేష హ్యజీర్ణే శస్యతే సదా
జ్వరమష్టవిధం హంతి సర్వశూలహరః పరః. 20
గుంజైకంవా ద్విగుంజంవా హ్యామవాతహరఃపరః, (ఆయుర్వేదే

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, తామ్రభస్మము, అభ్రకభస్మము త్రిఫలములు, త్రికటుకములు, శుద్ధిజేసిన నేపాళవిత్తులు - వీనినెల్ల సమభాగములుగ ఖల్వములో నునిచి తుమ్మిపూలరసముతో మర్దించి భావనజేసి ఎండించి వస్త్రగాలితము జేసి యొకగురిగింజయెత్తుగాని, లేక రెండుగురిగింజలయెత్తునుగాని సేవించిన సర్వాజీర్ణములు ఎనిమిదివిధములైన జ్వరములు, సర్వశూలలు, ఆమవాతము హరించును.

ఆదిత్యరసము

దరదంచ విషం గంధం త్రికటు త్రిఫలాసమమ్. 204
జాతీఫలం లవంగంచ లవణానిచ పంచవై,
సర్వమేకీకృతంచూర్ణ మమ్లయోగేన సప్తధా. 205
భావయిత్వా వటీ కార్యా గుంజార్ధప్రమితాబుధైః,
రసోహ్యాదిత్యసంజ్ఞోఽయ మజీర్ణక్షయకారకః. 206
భుక్తమాత్రం పాచయతి జఠరానలదీపనః,

తా. శుద్ధిచేసిన ఇంగిలీకము, శుద్ధిచేసిననాభి, శుద్ధిచేసినగంధకము, త్రికటుకములు, త్రిఫలములు, జాజికాయ, లవంగములు, పంచలవణములు, - వీనినెల్ల సమభాగములుగ ఖల్వములోనునిచి * ఆమ్లవర్గరసముతో నేడుమార్లు భావనజేసి అరగురిగింజ యెత్తును సేవించిన అజీర్ణమును హరింపంజేయుటయేగాక అగ్నిదీపనమునుసగా గలుగంజేసి దేనిని భక్షించినను పచనంబగునటులంజేయును.

అజీర్ణబలకాలానలరసము?

ద్విపలం శుద్ధసూతంచ గంధకంచ సమంమతమ్. 207

* ఆమ్లవర్గమనగ రేగు, దాడిమ, పులిచింత, పుల్లప్రబ్బలి, మాదీఫలము అనునవి,

లౌహం తామ్రం హరితాళం విషం తుత్థం లవంగకం,
పలప్రమాణంచ పృథగ్లవంగం టంకణం తథా. 208
దంతిమూలం త్రివృచ్చూర్ణ మేకైకం పలసమ్మితం,
అజామోదా యవానీ చ ద్విక్షారలవణానిచ. 209
పృథగర్ధపలం గ్రాహ్య మేకీకృత్యచ భావయేత్,
ఆర్ద్రికస్వరసేనైవ వింశతిః పంచకోలజైః. 210
దశధా భావయేత్తోయై ర్గుడూచీనాం రసైర్దశ,
సర్వార్ధం మరిచం దత్వా కాచకుప్యాంచ ధారయేత్,
చణమాత్రాం వటీం కృత్వా ఛాయాయాం పరిశోషయేత్,
రసోఽజీర్ణబలకాలానలఏష ప్రకీర్తితః.
అనేకకాలనష్టాగ్నే ర్దీపనః పరమస్మృతః,
ఆమవాతకులధ్వంసీ ప్లీహాపాండుగదాపహః.
ప్రమేహానాహవిష్టంభ సూతికాగ్రహణీ హరః,
శ్వాసకాసప్రతిశ్యాయ యక్ష్మక్షయవినాశనః. 214
ఆమ్లపిత్తంచ శూలంచ భగందర గుదోద్భవౌ,
అష్టోదరాణి ప్లీహంచ యకృతం హంతి దారుణమ్. 215
ఆకంఠం భోజయిత్వాతు ఖాదయేచ్చ రసోత్తమం,
అర్ధయామేన తత్సర్వం భస్మీభవతి నిశ్చితమ్. 216
చతుర్విధరసోపేతం మహాభోజనమిచ్ఛతః,
భోజస్య నృపతేః కాంక్షా భోజనే కృపయా కృతః. 217
గహనానందనాథేన సర్వలోకహితైషిణా,

తా. శుద్ధిచేసినరసము ౨ పలములు, శుద్ధిచేసినగంధకము ౨ పలములు, లోహభస్మము, తామ్రభస్మము, శుద్ధిచేసినతాళకము, శుద్ధిచేసిననాభి, శుద్ధిచేసిన మైలుతుత్తము, తగరభస్మము, లవంగములు, పేల్చినవెలిగారము, దంతివేరు, శుద్ధిచేసినతెగడ-ఇవి దినుసు కొక్కొకపలము, అజామోదము, ఓమము, సర్జక్షారము, యవక్షారము, పంచలవణములు ఇవి దినుసు కర్ధపలము - ఇటుల వానినెల్ల ఖల్వమునంచి నునిచి అల్లపురసముతో ౨౦ భావనలు, పంచకోలములరసముతో ౧౦ భావనలు తిప్పతీఁగెరసముతో ౧౦ భావనలు జేసి ఈ యౌషధమున కర్ధభాగము మిరియపుచూర్ణముగలిపి సెనగలంత మాత్రలుజేసి గాజుపాత్రలోనునిచి నీడనెండించి యందొకదానిని సేవించిన చిరకాలముగనుండు అగ్నిమాంద్యము,

ఆమవాతము, ప్లీహము, పాండువు, ప్రమేహము, ఆనాహము, మలబద్ధము, సూతికా
హాని, కాసము, శ్వాసము, పడిసెము, క్షయరోగము, శరీరకృశత్వము, ఆమ్లపిత్తము, శూ
భగందరము, మూలరోగము, ఎనిమిదివిధములైన యుదరములు, దారుణమైన యకృత్ప్లీహ
ములు - వీనిని హరింపఁజేయును. మఱియు నిది తృప్తిగ భుజింపఁబడిన యన్నప
నంతయు అర్ధఘాములోపల జీర్ణము గావించును. మఱియు నీరసము భక్ష్య భోజ్య
లేహ్య, శోష్య, రసయుక్తమైన మహాభోజనమునం దిచ్ఛగల భోజమహారాజునకు మిక్కి
టముగ భోజనేచ్ఛను గలుగఁజేయుటకై సర్వలోకహితమును గోరునట్టి గహనానం
నాథుని చే జెప్పంబడియెను.

## శంఖద్రావకము

లవణాని తథా క్షారాః ప్రత్యేకం పంచభాగకాః. 2
కాసీసం టంకణం తుత్థం గంధకం నింబకద్రవం,
తిలాపామార్గజం క్షారం ప్రత్యేకం వేదభాగకమ్. 2
నవసాగర సౌరాష్ట్రీ నిర్జికా నేత్రభాగికాః,
ఏతత్సర్వం సమాలోడ్య భావ్యం జంబీరనీరతః. 2
సరంధ్రే నలికాయంత్రే యామయుగ్మం విపాచయేత్,
శంఖద్రావో భవేదేష సర్వాజీర్ణనికృంతనః. 2
లోహపాషాణశంఖానాం ద్రావకోఽయం న సంశయః,

తా. పంచలవణములు, [1]సర్వక్షారములు - ఇవి దినుసుకు ౫ భాగములు, శుద్ధిజే
అన్నభేది, వెలిగారము, శుద్ధిజేసిన మైలుతుత్తము, శుద్ధిజేసిన గంధకము, నిమ్మపండ్లరసః
నువ్వులక్షారము, ఉత్తరేణుక్షారము-ఇవి దినుసుకు ౪ భాగములు, నవాసాగరము, :
కారము, లేక తొవరిమన్ను, సర్జక్షారము-ఇవి దినుసుకు ౨ భాగములు-ఇటుల వీని
నేకము జేసి నిమ్మపండ్లరసముతో మర్దించి రంధ్రముతోగూడియుండు నళి
యంత్రమున రెండుఝాములు పాకము జేసిన శంఖద్రావకము సిద్ధంబగును.

1 సర్వక్షారములన—మొక్కము, కొడిసె, మోదుగ, ఏపి, దేవదారు, తా
రేల, జిల్లేడు, బొంతజెముడు, కలిగొట్టు, క్రానుగ, అడ్డసరము, ఆరటె, చిత్రమూల
నేలమడుగుమ్రాను, ఎఱ్ఱకాంచనము, ఏడాకులయరటి, కూరనెల్లి, పూసగురువింద,
అనువానివేళ్ళను, ఫలములను, ఆకులను, కొమ్మలను ప్రత్యేకముగ కాల్చి బూడిదె జే
వలయు ననుట.

సర్వాజీర్ణముల నశింప చేయుటయే గాక ఇనుము, ఱాయి, శంఖము అనువానినిసగా నిస్సంశయముగ ద్రవింపజేయును.

అజీర్ణములయందు పథ్యము

శ్లైష్మికే వమనంపూర్వం పైత్తికే మృదురేచనం, 222
వాతికే స్వేదనంవాథ యథావస్థం హితంచ తత్,
నానాప్రకారవ్యాయామో దీపనాని లఘూనిచ. 223
బహుకాలసముత్పన్నా ముద్గా లోహితశాలయః,
విలేపో లాజమండశ్చ మండో ముద్గరసస్తథా. 224
ఏణోబర్హిశ్శశోలావః క్షుద్రమత్స్యాశ్చ సర్వశః,
శాలిం శాకంచ వేత్రాగ్రం వాస్తుకం బాలమూలకమ్. 225
లశునం వృద్ధకూష్మాండం నవీనం కదలీఫలం,
శోభాంజనం పటోలంచ వార్తాకం లలదంబుజమ్. 226
కర్కోటకం కారవేల్లం బార్హతంచ మహార్ద్రకం,
ప్రసారణీచచాంగేరీ తథైవ సువిషణ్ణకమ్. 227
ధాత్రీఫలం నాగరంచ దాడిమం యవ పర్పటాః,
ఆమ్లవేతస జంబీర మాతులుంగాని మాక్షికమ్. 228
నవనీతం ఘృతం తక్రం సౌవీరక తుషోదకం,
ధాన్యామ్లం కటుతైలంచ రామఠం లవణం తథా. 229
యవానీ మరిచం మేంధీ ధాన్యకం జీరకం దధి,
తాంబూలం తప్తసలిలం కటుతిక్తో రసోపివా. 230
మందానలేప్యజీర్ణేచపథ్యమేతన్నృణాంభవేత్, (మాధవనిదానే)

తా. శ్లేష్మాధిక్యమువలన అగ్నిమాంద్యము, అజీర్ణము, విషూచి, భస్మకము అనునవి జనించును. ఐనను వానియందు తొలుత వమనము జేయించవలయును. మఱియు పిత్తాధిక్యమున మృదువుగ రేచనమున కొసంగవలయును. వాతాధిక్యమున స్వేదనక్రియం జేయవలయును. ఇట్లులం జేసినహితకరంబుగనుండును. మఱియు పలువిధములైన* వ్యాయామములు, దీపన లఘుకర శాకాదికములు, దీర్ఘకాలముమీఁద ఫలించెడి పెసలు, ఎఱ్ఱబియ్యము, పేలాలమండము, పెసల మండము, జింక, నెమలి, కుందేలు, లావుకపక్షి, సన్నజాతిమత్స్యములు అనువానిమాంసము, గోలుగుకూర, వెదురుగొమ్ము, చక్రవర్తికూర,

* వ్యాయామ మన-సంచారము.

లేతముల్లంగిగడ్డలు, వెల్లుల్లి, పండినగుమ్ముడుకాయ, క్రొత్తఅరటికాయ, మునగకాయ, పొట్లకాయ, వంకాయ, తామరయగరులు, నక్కదోసకాయ, కాకరకాయ, బార్హాత్రము, అల్లము, గొంతెమగోరుకూర, పులిచింత, సువిషణ్ణకము, ఉసిరికకాయ, శొంఠి, కానింబ, యవలు, పర్పాటకము, పుల్లప్రబ్బలి, నిమ్మపండు, మాదీఫలము, తేనె, వెన్న, నెయ్యి, మజ్జిగ, రేగుపండు, కలి, కూటిసీళ్లు, కారము, నూనె, ఇంగువ, లవణము, ఓమము, మిరియాలు, మెంతులు, కొతిమెర్లు, జీలకఱ్ఱ, పెరుగు, తాంబూలము, కాచిననీరు, చేదు, ఒగరుగలరసము ఇవి అగ్నిమాంద్యము, అజీర్ణము అనువానియందు పథ్యకరంబులు.

అజీర్ణములయందపథ్యము

విరేచనాని విణ్మూత్ర వాతవేగవిధారణమ్. 231
అతిరిక్తంచాధ్యశనం జాగరం విషమాశనం,
రక్తస్రుతిం శింబిధాన్యం మత్స్యమాంస ముపోదకమ్, 232
జలపానంచ విష్టంభం జాంబవత్సర్వశాలుకం,
కూర్చికాం మోరటం క్షీరం కిలాటీ దుష్టవారిచ. 23
విరుద్ధాసాత్మ్యపానానాం విష్టంభీని గురూణిచ,
అగ్నిమాంద్యేప్యజీర్ణేచ సర్వాణి పరివర్జయేత్. 23

తా. రేచనము, మల మూత్ర అపానవాతముల బంధించుట, అధికము భుజించుట, జాగరణము, విషమాశనము, రక్తస్రావము, శింబిధాన్యము, మత్స్యమాంసము బచ్చలికూర, జలపానము, సెనగలుమొదలగు కడుపునుబ్బించెడి పదార్థములు, నేరేడ కలువదుంపలు మొదలగుసర్వదుంపలు, ఈనిన యేడుదినములకుపిదప పితుకబడినయా పాలు, జున్ను, విరిచినపాలు, విరుగుడుజున్ను, దుష్టమైననీరు, విరుద్ధమైన అన్నపా ములు, మలబద్ధకరద్రవ్యములు, జడపదార్థములు, అగ్నిమాంద్యము, అజీర్ణము అనువా యందపథ్యకరంబులు.

ద్వాదశప్రకరణమ్.



# త్రయోదశప్రకరణము.



## కుష్ఠరోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లో. మహాదేవం మహాత్మానం దేవేశం శేషభూషణం,
శంకరం పార్వతీనాథం నీలకంఠమహం భజే. 1

తాత్పర్యము. దేవతలలో పెద్దవాఁడు, మహాత్ముఁడు, దేవతలకు ప్రభువు, నాగాభరణుఁడు, భక్తులకు సుఖమునిచ్చువాఁడు, పార్వతీవల్లభుఁడు నగు నీలకంఠుని నేను భజియించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథముయొక్క త్రయోదశప్రకరణమును వచించుచున్నాఁడను.

### కుష్ఠనిదానము

విరోధీన్యన్నపానాని ద్రవస్నిగ్ధగురూణిచ,
భజతా మాగతాం ఛర్దిం వేగాంశ్చాన్యాన్ ప్రతిఘ్నతామ్. 3
వ్యాయామ మతిసంతాప మతిభుక్త్వా నిషేవినాం,
శీతోష్ణలంఘనాహారాన్ క్రమం ముక్త్వా నిషేవినామ్. 4
ఘర్మశ్రమభయార్తానాం ద్రుతం శీతాంబుసేవినాం,
అజీర్ణాధ్యశనానాంచ పంచకర్మాపచారిణామ్. 5
నవాన్నదధిమత్స్యాని లవణామ్లనిషేవిణాం,
మాషమూలకపిష్టాన్న తిలక్షీరగుడాశినామ్. 6
వ్యవాయంచాప్యజీర్ణేఽన్నే నిద్రాంచ భజతాం దివా,
విప్రాన్ గురూన్ ధర్షయతాం పాపం కర్మచ కుర్వతామ్. 7
వాతాదయస్త్రయోదుష్టా స్త్వగ్రక్తం మాంసమంబుచ,
దూషయంతి సకుష్ఠానాం సప్తకో ద్రవ్యసంగ్రహః. 8
అతః కుష్ఠాని జాయంతే సప్తచైకాదశైవచ, (ఆయుర్వేదే

తా. క్షీరమత్స్యాదివిరుద్ధాన్నపానములు, ద్రవము, స్నేహము, జడత్వముగల యన్నపానములు సేవించుట, వాంతి మూత్రపురీషాదివేగముల నడ్డగించుట, భుజించిన తోడనే మిక్కుటముగ వ్యాయామముసేయుట, ఎండలోదిరుగుట, శీతలము, ఉష్ణ ముగలయాహారములను, లంఘనమును చెప్పఁబడినక్రమమునకు విరుద్ధముగ సేవించుట, వేఁడి, శ్రమ, భయము అనువానివలన పీడితుఁడై తత్‌క్షణమునశీతోదకమును త్రాగుట, అపక్వమైన యన్నమును భుజించుట, భుజించినతోడనే మరల భుజించుట, వమన, విరేచన, వస్తి, స్వేద, నస్య, పంచకర్మల జేయునపు డుపచారము జేయుట, నవీనాన్నము, పెరుగు, మత్స్యములు, ఉప్పు, పులుసు, ఉద్దులు, ముల్లంగి, పిష్టాన్నము, నువ్వులు, పాలు, బెల్లము, అనువానిని సేవించుట, భుజించినయన్నము జీర్ణమగుటకుముందు మైథునము సేయుట, పగటియందు నిద్రించుట, గురుబ్రాహ్మణుల దిరస్కరించుట, పాపకర్మలు సేయుట-ఈకారణమువలన వాతాదిదోషములు ప్రకోపించి దుష్టంబులై త్వగ్రక్త మాంసోదకములం జెఱచి కుష్ఠురోగమును గలుగంజేయును. మఱియు కుష్ఠురోగము జనించుటకు వాత, పిత్త, శ్లేష్మములు, త్వగ్రక్తమాంసోదకములు అను నీయేడును ముఖ్యకారణభూతంబులు. అట్లగుటచే పదునెనిమిదికుష్ఠువులు జనించుచున్నయవి. అందు మహాకుష్ఠువులు ౭, క్షుద్రకుష్ఠువులు. ౧౧.

### కుష్ఠరోగపూర్వరూపము

అతిశ్లక్ష్ణఖరస్పర్శ స్వేదా స్వేదవివర్ణతాః. 9
దాహః కండూస్త్వచిస్వాప స్తోదః కోఠోన్నతిః క్లమః,
వ్రణానామధికం శూలం శీఘ్రోత్పత్తిశ్చిరస్థితిః. 10
రూఢానామపి రూక్షత్వం నిమిత్తేఽల్పేపి కోపనం,
రోమహర్షో సృజః కార్ష్ణ్యం కుష్ఠలక్షణమగ్రజమ్. 11

తా. కుష్ఠురోగము గలుగబోయెడిస్థలమునుదాఁకిన మిక్కిలి నున్నగగాని, లేక గరగరయనిగాని యుండుట, ఆస్థానమున చెమటబట్టుట, లేకపట్టకుండుట, ఆస్థలము వివర్ణంబై తాపము, దురదగలుగుట, చర్మమున స్పర్శజ్ఞానము లేకుండుట, పొడిచి నటుల పీడగలుగుట, కందిరీగగరచినటుల దద్దులులేచుట, ఆయాసమునుజెందకనే శ్రమ గలుగుట, వ్రణమున మిక్కుటముగ పోట్లుగలుగుట, వ్రణము శీఘ్రముగ జనించి చిర కాలంబుండుట, పుట్టినవ్రణము రూక్షగనుండుట, కొంతనిమిత్తమువలన ప్రకోపించుట, రోమాంచముగలుగుట, రక్తము నల్లగనగుట-ఇవియకుష్ఠురోగమునకు పూర్వరూపంబులు.

### కుష్ఠరోగభేదములు

పుండరీకం సవిస్ఫోటం పామాన్యం గజచర్మకం,
కాకణం కచ్ఛుకం ఋశ్యజిహ్వాకం చాష్టమం స్మృతమ్. 12
గళితంచ మహాకుష్ఠం కాపాలం చాప్యుదుంబరం,
మండలంచ విచర్చ్యాఖ్య వైపాదీ కిట్టిభం తథా. 13
చర్మదద్రు తథా సిధ్మ శతారుష్యం దశాష్టకం,
శ్విత్రికాఖ్యం విసర్పంచ వింశద్భేదాః ప్రకీర్తితాః. 14
(మాధవనిదానే)

తా. పుండరీకకుష్ఠము, విస్ఫోటకకుష్ఠము, పామాకుష్ఠము, గజచర్మకుష్ఠము, కాకణకుష్ఠము, కచ్ఛకకుష్ఠము, ఋశ్యజిహ్వాకకుష్ఠము, గళకుష్ఠము అన నీయెనిమిదియు మహాకుష్ఠములు. కపాలకుష్ఠము, ఉదుంబరకుష్ఠము, మండలకుష్ఠము, విచర్చికకుష్ఠము, వైపాదికకుష్ఠము, కిట్టిభకుష్ఠము, చర్మదద్రుకుష్ఠము, సిధ్మకుష్ఠము, శతారుష్యకుష్ఠము అనికుష్ఠరోగములు ౧౮ విధంబులు. మఱియు శ్విత్రకుష్ఠము, విసర్పకుష్ఠము అన నీరెంటితోఁడ కుష్ఠరోగము ౨౦ విధంబులు.

### పుండరీకకుష్ఠలక్షణము

పుండరీక [1]దళా కారం శ్వేతం రక్తాద్ఘనం గురు,
[2]క్లేదం కండూ స్సరాగంచ పుండరీకం కఫాదికే (మాధవనిదానే). 15

తా. తామరరేకులవలెనుండుట, రక్తమువ్యాపించియుండువఱకు తెలుపుగ, దట్టముగ, బరువుగ నుండుట, నీరుగారుచుండుట, దురదగలుగుట, మధ్యమున రక్తవర్ణముగనుండుట-ఈలక్షణములుగలవి పుండరీకకుష్ఠమని దెలియవలయును. ఇది కఫాధిక్యము వలన జనించును. (ఇది మహాకుష్ఠము.)

### విస్ఫోటకకుష్ఠలక్షణము

స్ఫోట కండూ తీవ్రదాహా మరుణం స్నిగ్ధ పాండురం,
పాణి కుక్షీ రుజాక్లేదం కుష్ఠవిస్ఫోటలక్షణమ్. 16

తా. స్ఫోటకము, దురద, తీవ్రదాహముగలుగుట, ఎఱ్ఱగనుండుట, మెఱయుచుండుట, పాండురవర్ణముగనుండుట, చేతులు, కడుపు అనువానియందు పీడగలుగుట, నీరుగారుట-ఈలక్షణములుగలదివిస్ఫోటకకుష్ఠమని దెలియవలయును. (ఇది మహాకుష్ఠము.)

---

1 దళంతామ్రం శ్వేతరక్తం ఘనం గురుమ్, 2 గళగండ సరాగంఛ.

పామాకుష్ఠలక్షణము

సూక్ష్మాశ్చ బహ్వ్యః పిటకా స్రావవత్యో గుణాన్వితాః,
దాహః కండూః కఫాజ్జాతా పామేత్యుక్త్వా చికిత్సయేత్. 17

(మాధవనిదానే)

తా. సూక్ష్మమైనట్టి పిటికలు మిక్కుటముగ గలిగియుండుట, పిటికలయందు తెల్లని పులినీరుగారుట, తాపము, దురదగలుగుట-ఈలక్షణములుగలది పామాకుష్ఠమని తెలియవలయును. ఇది కఫమువలన జనించును. (ఇది మహాకుష్ఠము.)

గజచర్మకుష్ఠలక్షణము

[1]అస్వేదం ఘనకండూశ్చ యన్మత్స్యశకలోపమం,
[2]బహుళం హస్తిచర్మాభం తత్కృష్ణం గజచర్మకమ్. 18

(మాధవనిదానే)

తా. చెమటపట్టకుండుట, మిక్కుటముగ ఉదరముగలుగుట, మత్స్యపుతునకల వలె నధికముగనుండుట, ఏనుగచర్మముతో సమానముగ నలుపువర్ణముగనుండుట-ఈలక్షణములుగలది గజచర్మకుష్ఠమని తెలియవలయును. (ఇది వాతశ్లేష్మాధిక్యమువలన జనించును. ఇది మహాకుష్ఠము.)

కాకకుష్ఠలక్షణము

యత్కాకచంచుకావర్ణం సపాకం తీవ్రవేదనం
త్రిదోషలింగం తత్కుష్ఠం కాకణం నైవసిధ్యతి. 19

(మాధవనిదానే)

తా. కాకిముక్కుతో సమానమైన వర్ణముగలదిగనుండుట, ఒకింతపాకము, తీవ్రవేదనగలుగుట, త్రిదోషలక్షణయుక్తంబుగనుండుట - ఈలక్షణములుగలది కాకణకుష్ఠమని తెలియవలయును. ఇది అసాధ్యము. (ఇది మహాకుష్ఠము.)

కచ్ఛుత్వక్కుష్ఠలక్షణము

రక్తం స్నిగ్ధం ఘనం శ్యామ మతికండూ కఫోద్భవం,
ఊరు కక్ష కటీష్వేవం కచ్ఛుత్వక్కుష్ఠకాహ్వయమ్. 20

(మాధవనిదానే)

తా. ఎఱ్ఱనై మెఱయుచుండుట, ఘనమై నల్లగనుండుట, కడుదురదగలుగుట, తొడలు, చంక, మొల అనువానియందు జనించుట-ఈలక్షణములుగలది కచ్ఛుత్వక్కుష్ఠమని తెలియవలయును.

1 అస్వేదనం మహావాస్తు. 2 తదేవకుష్ఠంచర్మాఖ్యం బహుళం హస్తిచర్మవత్.

### ఋష్యజిహ్వాకుష్ఠలక్షణము

కర్కశం రక్తపర్యంత మంతశ్శ్యామం సవేదనం,
యదృశ్యజిహ్వా సంస్థాన మృశ్యజిహ్వాం తదుచ్యతే. 21

తా. కఠినముగనుండుట, చుట్టూ నెఱ్ఱగనుండుట, మధ్యనల్లగనుండుట, వేదనతోఁ గూడియుండుట, దుప్పినాలుకవంటి యాకారముగలదిగ నుండుట-ఈలక్షణములు గలది ఋష్యజిహ్వాకకుష్ఠ మని తెలియవలయును. (ఇది మహాకుష్ఠము.)

### గళకుష్ఠలక్షణము

జిహ్వాకా కృష్ణవర్ణాయా హంతి సత్యం త్రిమాసకే,
పాదయోశ్చ తథా తాపో వళిస్త్ర్యంగుళికాపివా. 22
నాసాప్రస్వరభంగంచ గళత్కుష్ఠం త్రిదోషజం,
(మాధవనిదానే)

తా. నాలుక నల్లగనుండుట, కాళ్ళయందు తాపము గలుగుట, మూడంగుళముల ప్రమాణము వళులుగలిగియుండుట, ముక్కున నెత్తురుగారుట, స్వరము జెడుట - ఈలక్షణములుగలది గళత్కుష్ఠమని తెలియవలయును. ఇది త్రిదోషజనితంబగుటచే మూడుమాసములలోఁ నిశ్చయముగ జంపును. (ఇది మహాకుష్ఠము.)

### కపాలకుష్ఠలక్షణము

కృష్ణారుణకపాలాభం యద్రూక్షం [1]కర్కశంతను. 23
[2]వాతోత్థతోదబహుళం కాపాలకుష్ఠమీదృశం,
(మాధవనిదానే)

తా. నల్లనిమచ్చలు, ఎఱ్ఱనిమచ్చలు గలుగుట, రూక్షముగ, బిరుసుగ, సూక్ష్మముగ నుండుట, సూదులతోఁ బొడుచునటుల మిక్కుటముగ పీడగలుగుట - ఈలక్షణములు గలది కపాలకుష్ఠ మని తెలియవలయును. (ఇది అసాధ్యము.) ఈకుష్ఠము వాతాధిక్యము వలన జనించును.

### ఔదుంబరకుష్ఠలక్షణము

రుగ్దాహ రాగ కండూభిః పిత్తోత్థం లోమపింజరమ్. 24
ఉదుంబరఫలాభాసం కుష్ఠమౌదుంబరం వదేత్, (మాధవనిదానే)

తా. శూల, మంట, ఎఱుపువర్ణము, దురద అనువానితోఁ వ్యాప్తమైయుండుట,

---

1 పరుషం. 2 కాపాలాంతోదబహుళం తత్కుష్ఠం విషమంస్మృతమ్.

వెంట్రుకలు *పీతరక్తాధిక్యముగ నుండుట, మేడిపండుచాయవలెనుండుట-ఈలక్షణములు గలది ఔదుంబరకుష్ఠమని తెలియవలయును. ఇది పిత్తాధిక్యమువలన జనించును.

మండలకుష్ఠలక్షణము

శ్వేతం రక్తం స్థిరం స్త్యానం స్నిగ్ధముత్పన్నమండలమ్. 25
కృచ్ఛ్రమన్యోన్యసంయుక్తం కుష్ఠం మండల ముచ్యతే,

(మాధవనిదానే)

తా. తెల్లగ, ఎఱ్ఱగ, కఠినముగ, దట్టముగ, స్నిగ్ధముగ, మండలాకారముగనుండుట, మండలము లొకదానితోనొకటి గూడియుండుట-ఈలక్షణములు గలది మండలకుష్ఠమని తెలియవలయును. ఇది కష్టసాధ్యము-ఈమండలకుష్ఠము కఫాధిక్యమువలనజనించును.

ప్రసూతికుష్ఠలక్షణము

అంగతోదో మండలాశ్చ దేహస్పర్శ నవిందతి. 26
తథా మారుతపిత్తోత్థం కుష్ఠం ప్రసూతికా క్వచిత్,

(మాధవనిదానే)

తా. అంగములలో సూదులతో బొడుచునటుల వేదన, మండలము గలుగుట, శరీరమున స్పర్శజ్ఞానములేకుండుట-ఈలక్షణములుగలది ప్రసూతకుష్ఠమని కొందఱు వచించెదరు. ఇదే గ్రంథాంతరేణ మహాకుష్ఠమని జెప్పంబడును. ఇది వాతపిత్తప్రకోపము వలన జనించును.

విచర్చికకుష్ఠలక్షణము

శ్వేత రక్తా ఘనా క్లిన్నా వాతపైత్తోద్భవా బహూ. 27
సకండూ దాహసంయుక్తాజ్ఞేయం కుష్ఠం విచర్చికా,

(మాధవనిదానే)

తా. దట్టమైన మచ్చలుగలిగి తెల్లగ ఎఱ్ఱగనుండుట, నీరుగారుచుండుట, దురద, మంట గలుగుట- ఈలక్షణములుగలది విచర్చికకుష్ఠమని తెలియవలయును. ఇది తఱచుగ వాతపిత్తాధిక్యమువలన జనించును.

వైపాదికకుష్ఠలక్షణము

శ్లేష్మవాతోద్భవం కుష్ఠం స్ఫుటితం తీవ్రవేదనమ్. 28
రూక్షారుణం పాణిపాదం ఖ్యాతం వైపాదికం వదేత్,

(మాధవనిదానే)

* అనఁగా ఎఱుపధికముగాఁగల పచ్చరంగు.

తా. పగిలియుండుట, తీవ్రమైన వేదనగలుగుట, చేతులు కాళ్ళు ఉష్ణముగ ఎఱ్ఱగ నుండుట-ఈలక్షణములుగలది వైపాదికకుష్ఠమని తెలియవలయును. ఇది వాత శ్లేష్మాధిక్యమువలన జనించును.

కిట్టిభకుష్ఠలక్షణము

శ్యావం కిణం ఖరస్పర్శం సకండూ పరుషం ఘనమ్. 29
వాతశ్లేష్మోద్భవం ఖ్యాతం కిట్టిభం కుష్ఠమీదృశం,

(మాధవనిదానే)

తా. మచ్చలు నీలవర్ణముగ బిరుసుగనుండుట, దురదగలుగుట, రూక్షగ దళముగ నుండుట-ఈలక్షణములుగలది కిట్టిభకుష్ఠమని తెలియవలయును. ఇది వాతశ్లేష్మాధిక్యము వలన జనించును.

చర్మదళకుష్ఠలక్షణము

రక్తం శూలం ఖరం కండూః క్లేదస్ఫోటం దళత్యపి. 30
స్పర్శం సహ్యం ఘనం స్నిగ్ధం కుష్ఠం వై చర్మకం వదేత్,

(మాధవనిదానే)

తా. ఎఱ్ఱనిమచ్చలుగలుగుట, శూలయుక్తమై బిరుసుగనుండుట, దురదగలుగుట, నీరుగారుట, బొబ్బలులేచుట, పగులుట, తాఁకిన వేదనలేకుండుట, దట్టముగనుండుట, మెఱయుట-ఈలక్షణములుగలదిచర్మదళకుష్ఠమని తెలియవలయును. (ఇదిమహాకుష్ఠము.)

దద్రుకుష్ఠలక్షణము

కండూమద్భిస్సరాగైశ్చ గండైరలసకంచితమ్. 31
పిటికా మండలాశ్శుభ్రా దద్రూః పిత్తకఫోద్భవం,

(మాధవనిదానే)

తా. వ్రణములు దురదతోగూడి ఎఱ్ఱగనుండుట, అలసకమువలెనే వ్యాపించి యుండుట, పిటికలు గుండ్రముగ తెల్లగనుండుట-ఈలక్షణములుగలది దద్రుకుష్ఠమని తెలియవలయును. ఇది కఫపిత్తప్రకోపమువలన జనించును. (ఇది మహాకుష్ఠము.)

సిధ్మకుష్ఠలక్షణము

శ్వేతం తామ్రంచ తనుయద్రజోఘృష్టం విముంచతి. 32
*వాత శ్లేష్మోద్భవం సిధ్మ మలాబుకుసుమోపమం,

(మాధవనిదానే)

తా. తెలుపు, ఎఱుపుగలిసిన సూక్ష్మపుమచ్చలుగలుగుట, ఒరసికొనిన పిండివలె

* ప్రాయేణోరసి తత్సిధ్మ.

రాలుట, ఆనుగపువ్వులతో సమానముగనుండుట (తలుచుగ అ్ర్ముగంచే జనించుట) - ఈలక్షణములు గలది సిధ్మకుష్ఠ మని తెలియవలయును. (ఇది వాతశ్లేష్మాధిక్యమువలన జనించును.)

◄ శతారుష్యకుష్ఠలక్షణము ►

రక్తశ్యావం ఘనం క్లేదం స్నిగ్ధం కండ్వార్తిదాహకమ్. 33
పిత్తశ్లేష్మోత్థితం కుష్ఠం శతారుష్యం బహువ్రణం,

(మాధవనిదానే)

తా. మచ్చలెఱుపుగ, నలుపుగ, దట్టముగనుండుట, నీరుగారుచుండుట, మెఱయుచుండుట, దురద, శూల, మంట, అనేకవ్రణములుగలుగుట-ఈలక్షణములు గలది శతారుష్యకుష్ఠమని తెలియవలయును. ఇది పిత్తశ్లేష్మాధిక్యమువలన జనించును.

◄ శ్విత్రకుష్ఠలక్షణము ►

శంఖవర్ణం భవేచ్ఛ్విత్రే సాధ్యం సర్వాంగగోపివా. 34
శుష్కాంవై కృచ్ఛ్రసాధ్యంచ గుహ్యపాణితలాసుగం,
అగ్నిదగ్ధమసాధ్యం స్యాత్తథా వర్జ్యం చిరంతనమ్. 35

(మాధవనిదానే)

14 తా. *శ్విత్రకుష్ఠము శంఖవర్ణముగలదై సర్వాంగముల వ్యాపించి యుండిన అసాధ్యంబనియు, శరీరమంతట వ్యాపించి శరీరముకృశించియుండిన కష్టసాధ్యంబనియు, గుహ్యము, అరచెయ్యి అనువానియందు జనించి అగ్నివలె మండుచుండిన అసాధ్యంబనియు తెలియవలయును. మఱియు చిరకాలముగనుండు కుష్ఠువుసగా అసాధ్యంబు. (ఇది వాతపిత్తాధిక్యమువలన జనించును.)

◄ కుష్ఠరోగసాధ్యాసాధ్యములు ►

ఉదుంబరం తత్సదృశం శ్విత్రంస్యాచ్ఛంఖసన్నిభం,
కాకణం పక్వగుంజాభం చర్మాఖ్యం గజచర్మవత్. 36
పుండరీకం స్వసంజ్ఞాభం ఋశ్యజిహ్వం తథైవచ,
బహువ్రణం శతారుష్య మేకాఖ్యం మత్స్యశుక్తివత్. 37
పాణిభేద శ్చర్మదళం పాదభేదో విపాదికా,
దశైతాని నసాధ్యంతే శేషాణ్యష్టౌచ సాధ్యవత్. 38
కపాల మసితం రూక్షం విస్ఫోటాఖ్యం విసర్పవత్,
కిట్టిభం కిణవచ్ఛ్యామం దద్రుస్స్యాత్త్వచిపాకితా. 39

---

* శ్విత్రకుష్ఠ మన-శిబ్బెము.

తుంబీపుష్పనిభం సిధ్మ స్నిగ్ధం స్యా న్మండల స్థిరం,
విస్ఫోటదారుణా పామా సామస్రావా విచర్చికా. 40

తా. ఉదుంబరకుష్ఠము మేడిపండువర్ణముగ, శ్విత్రకుష్ఠము శంఖవర్ణముగ, కాకణకుష్ఠము పండిన గురివిందవర్ణముగ, గజచర్మకుష్ఠము ఏనుగుతోలుతో సమానముగ, పుండరీకకుష్ఠము తెల్లితామరపువ్వుతో సమానముగ, ఋశ్యజిహ్వాకుష్ఠము దుప్పినాలుకతో సమానముగ, శతారుష్కకుష్ఠము బహువ్రణయుక్తముగ, ఏకాఖ్యకుష్ఠము మీనుచిప్పతో సమానముగ, చర్మదళకుష్ఠము నరచేతులు దళమై పగిలినట్లుగ, వైపాదికకుష్ఠము కాళ్లు పగిలినట్టుగ నుండును ఈపదియు నసాధ్యంబులు. కపాలకుష్ఠము నల్లనైరూక్షముగ, విస్ఫోటకకుష్ఠము విసర్పితోసమానముగ, కిట్టిభకుష్ఠము మచ్చలతోఁగూడి నల్లగ, దద్రుకుష్ఠము పొక్కులతోఁ గూడినదిగ, సిధ్మకుష్ఠము సొరపువ్వుతో సమానముగ, మండలకుష్ఠము మెరుపు, కాఠిన్యముగలదిగ, పామాకుష్ఠము దారుణమైన పొక్కులతోఁగూడినదిగ, విచర్చికాకుష్ఠము పులిసీరును కార్చునదిగనుండును. ఈ యెనిమిదియు సాధ్యంబులు.

## కుష్ఠరోగచికిత్సాక్రమము

స్విన్నస్నిగ్ధస్యమోక్తవ్యాః కుష్ఠినో బలినస్సిరాః,
కుష్ఠీ వక్షః క్షతం పాత్యం శృంగాలాబు జలూకకైః. 41
పునఃపునశ్చ వమనం రేచనంచ ముహుర్ముహుః,

తా. సర్వకుష్ఠములయందు దార్ఢ్యముగలవానికి శరీరమున జెమటుం దీసి చమురు బట్టించి సిరావేధనుగాని, లేక ఱొమ్మున గత్తివాట్లువేసి కొమ్ములు, సొరకాయబుఱ్ఱలు, జలగలు అనువానితో రక్తస్రావమునుగాని జేయించవలయును. మఱియు కుష్ఠురోగమున పలుమారు వమన విరేచనంబుల కొసంగవలయును.

సర్వేషాం కుష్ఠినామాదౌ పంచకర్మ సమాచరేత్. 42
పక్షేపక్షేచ వమనం మాసేమాసే విరేచనం,
షణ్మాసేచ సిరామోక్షః నస్యం సప్తదినాంతరే. 43
ఇదం చిరస్థిరే కారం లేపనంచ త్ర్యహాం చరేత్,

తా. చిరకాలముగనుండు సర్వకుష్ఠములయందు తొలుత పంచకర్మలు అనఁగా, ప్రతిపక్షమునకొకతూరి వమనంబును, ప్రతిమాసమునకొకతూరి విరేచనంబును, ఆరుమాసములకొకతూరి * సిరామోక్షణమును, ఏడుదినములకొకతూరి నస్యంబును, మూడుదినములకొకతూరి లేపనమును చేయవలయును.

---

* సిరామోక్షణ మన నరమును వేధించుట.

## వాతాదిభేదకుష్ఠలక్షణము

వాతజం సక్రిమిశ్యామం వేదనారుణవర్ణవత్. 44
సదాహం స్వేదసంయుక్తం రక్తం కుష్ఠంతు పిత్తజం,
స్నిగ్ధకం పిచ్ఛిలం గౌరం కండూయుక్తంచ శీతలమ్. 45
లక్షణం కఫకుష్ఠస్య సంమిశ్రంతు త్రిదోషజం,

తా. వాతమువలన జనించిన కుష్టువు క్రిములతోఁగూడి వేదనాయుక్తమై నల్లగ గాని, లేక ఎఱ్ఱగగాని యుండును. పిత్తజకుష్టువు తాపము, చెమట, ఎఱుపువర్ణముగలదిగ నుండును. శ్లేష్మజకుష్టువు మెరుపు, బంక, గౌరవర్ణము, నవ, శీతలముగలదిగనుండును. త్రిదోషజకుష్టువు వాత, పిత్త, కఫలక్షణయుక్తంబుగనుండును. (అది అసాధ్యము.)

## కుష్ఠరోగసాధ్యాసాధ్యంబులు

సాధ్యం త్వగ్రక్తమాంసస్థం వాతశ్లేష్మాధికంచ యత్. 46
మేదసి ద్వంద్వజం యాప్యం వర్జ్య మజ్జాస్థి సంశ్రితం,
క్రిమి హృల్లాస మందాగ్ని సంయుక్తం యత్రిదోషజమ్. 47
ప్రభిన్నం ప్రస్రుతాంగంచ రక్తనేత్రం హతస్వరం,
పంచకర్మగుణాతీతం కుష్ఠంహంతీహకుష్ఠినమ్. (ఆయుర్వేదే) 48

తా. త్వక్, రక్త, మాంసధాతువులవఱకు వ్యాపించియుండుకుష్టువును, వాతకఫములు ప్రధానంబుగనుండు కుష్టువును సాధ్యంబులు. మఱియు మేదోధాతుగతకుష్టువు, ద్వంద్వజకుష్టువు యాప్యంబులు. మఱియు మజ్జ, అస్థులవఱకు వ్యాపించియుండుకుష్టువు, శుక్రధాతుగతకుష్టువు, మఱియు క్రిమి, హృల్లాసము, మందాగ్ని అనువానితోఁ గూడి యుండు కుష్టువు, త్రిదోషజకుష్టువు అసాధ్యంబులు. కుష్ఠము పగిలి నీరుగారుచుండుకుష్టురోగియు, ఎఱ్ఱనినేత్రములుగాని, లేక హీనస్వరముగాని గలకుష్టురోగియు, వమనవిరేచనాదిపంచకర్మల కనర్హుండగు కుష్టురోగియు మృతిజెందెదరు.

## అసాధ్యకుష్ఠలక్షణము

గుహ్యపాణితలోష్ఠేషు జాతమప్యచిరంతనం,
వర్జనీయం విశేషేణ కిలాసం సిద్ధిమిచ్ఛతా. 49

తా. గుహ్యము, అరచెయ్యి, పెదవి అనువానియందు కుష్టువు తత్కాలమున జనించినను దానిని విశేషముగ వర్జింపవలయును. మఱియు యశస్సుగోరెడువైద్యుఁడు కిలాసకుష్టువునుసగా వర్జింపవలయును.

ద్విలింగంచ భవేత్కుష్ఠం విశేషేణ త్యజేద్భిషక్,
బహ్వాపద్రవసంయుక్త మసాధ్యముదితం బుధైః. 50

తా. మఱియు ద్వంద్వలక్షణముతో గూడియుండు కుష్ఠవులను వైద్యుఁడు వర్జింపవలయును. మఱియు పలు ఉపద్రవములతో కూడియుండు కుష్ఠరోగం బసాధ్యంబని ఆయుర్వేదవేత్తలు వచించెదరు.

## సంసర్గజరోగములు

ప్రసంగా ద్గాత్రసంస్పర్శా న్నిశ్వాసాత్సహ భోజనాత్,
సహశయ్యాసనాచ్చాపి వస్త్రమాల్యానులేపనాత్.
కుష్ఠంజ్వరశ్చ *శోషశ్చ నేత్రాభిష్యందఏవచ,
ఔపసర్గికరోగాశ్చ సంక్రామంతి నరాన్నరమ్. (మాధవనిదానే) 52

తా. కుష్టువు జ్వరము, ధాతుశోష, నేత్రరోగముగలవారితో సాంగత్యము చేయుట, వారిశరీరమును దాఁకుట, వారియొక్క శ్వాసోచ్ఛ్వాసములు సోఁకుట, ఏక పాత్రలో భుజించుట, ఒకటిగ పరుండుట, ఒకయాసనమున నేకముగ గూర్చుండుట, వారుధరించిన వస్త్రములను, పుష్పములను ధరించుట, వారు తాఁకిన గంధమును బూసి కొనుట-ఈకారణములవలన పూర్వోక్తకుష్ఠాదిరోగములు ఒకనివద్దనుండి మఱియొకని కంటును.

## శ్వేతకుష్టువుకు భృంగ్యాదిచూర్ణము

భృంగీ వహ్ని త్రిఫలా వచాకణా వాకుచీ బ్రహ్మీశుంఠీ సకోష్ఠం,
భల్లాతాచాశ్వగంధా శిఖిగరకవిశాషోడశీభస్మసూతమ్. 53
కాంస్యేపాత్రేరజశ్చ త్రిఫలజయుతం ప్రాతరుత్థాయ పీతం,
షణ్మాసాద్రోగహారీ ఫలితవలితహృత్స్వర్ణ దేహీ శరీరీ. 54
(చింతామణౌ)

తా. గుంటగలగర, చిత్రమూలము, త్రిఫలములు, వస, పిప్పళ్ళు, భావంచివిత్తులు, మండూకబ్రహ్మి, మలయాళపుశొంఠి, చెంగల్వకోష్ఠు, శుద్ధిజేసినజీడిగింజలు, పెన్నేరుగడ్డ, శుద్ధిచేసిన మైలుతుత్థము, శుద్ధిచేసిననాభి, పసపు, రసభస్మము - వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి త్రిఫలకషాయముతో భావనజేసి ఎండించి కాంతపుగిన్నెలోనునిచి ప్రాతఃకాలమున ప్రత్యహము ధరణమెత్తుచూర్ణమును సేవించి వెంబడిగ చారెడు త్రిఫలకషాయమును పానముసేయవలయును. ఇటుల నారుమాసములు

---

* శోభశ్చ.

సేయుచుండిన శ్వేతకుష్ఠును, వలీపలితములు హరించి బంగారుఛాయతో తుల్యమైన శరీరము గలుగును.

శ్వేతకుష్ఠునకు పశుపతిచూర్ణము

సురతరుకృతమాలా వ్యాలదారుర్వరాచ
తపనకనకపుష్పీచాపి గౌరీవిశాలా,
సమకృతశశిరేఖా సూతభస్మాపి భుక్త్వా
పశుపతికృతచూర్ణం శ్వేతకుష్ఠం నిహంతి. (మాధవనిదానే) 55

తా. దేవదారు, శేల, చిత్రమూలము, త్రిఫలములు, జీడిగింజలు, నేలతంగేడు, సమూలము - ఇవి పావుసేరు, పసపు నాటాకు, పాపరవేరు నాటాకు, వీనికన్నిటికి సమము క్రానుగచ్చవిత్తులు - ఇటుల వీనినెల్లదంచి చూర్ణముజేసి యొకతులము చూర్ణములో వీస మెత్తురసభస్మముగలిపి ఆవునేతితో ప్రతిదినము సేవించుచుండిన నారుమాసములకు శ్వేతకుష్ఠువు హరించును. ఇది శివునిచే జెప్పంబడియెను.

గీ. తామ్రభస్మంబు తెలగాచు తపనదుగ్ధ
మునను మర్దించి యచ్చోటఁ బూయవలయు
మేఁకయెలు వాముదపుకాయమీఁదిపొట్టు
సెగనుగాచిన మానును శ్వేతకుష్ఠు.

పుండరీకకుష్ఠమునకు సర్వాంగసుందరరసము

విష్ణుక్రాంతా దేవదాలీ సర్పాక్షీ తండులీ మునిః,
నీలీ బ్రహ్మీ పలాశంచ యథాలాభం ద్రవం హరేత్. 56
ద్విత్రాణామేవ నిర్యాసై స్సూతకం మర్దయే ద్దినం,
సూతైకం ద్విగుణం గంధ మేకీకృత్య క్షణం పచేత్. 57
లోహపాత్రే ధృతం యావ త్తథా శుల్బాభ్రకామృతం,
కర్పూరంచైవ ప్రత్యేకం సూతపాదాంశకం క్షిపేత్. 58
పుండరీకం హరే న్నిష్క మనుపానవిశేషతః, (ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసినరసము ౧ భాగము, శుద్ధిచేసినగంధకము ౨ భాగములు - ఇటుల వీనిని ఖల్వములోనునిచి విష్ణుక్రాంతము, దావరదంగి, సర్పాక్షి, చిట్టి, అవిసె, నీలి, మండూకబ్రహ్మి, మోదుగ అనువానిలో దొరకినవానిని గ్రహించి రసముతీసి ప్రతిదానితో నొక్కొకదినము మర్దించి అందు పైఁజెప్పఁబడిన వృక్షములలో రెండు, లేక మూడువృక్షములయొక్క బంకనువైచి మరల మర్దించి ముద్దజేసి ఇనుపగిన్నెలోనునిచి

క్షణకాలము పాకముజేసి ఖల్వములో నునిచి అందు తామ్రభస్మము, అభ్రకభస్మము, శుద్ధిచేసిననాభి, కర్పూరము, అనువానింగో ప్రతిదానిని రసమునకు నాలవభాగము గలిపి మర్దించి నిష్కప్రమాణము మాత్రలుజేసి బాడిదెపాకురసముతో (ఒకటిన్నరవత్సరము) సేవించుచుండిన పుండరీకకుష్ఠము హరించును.

### ఉదుంబరకుష్ఠమునకు కనకసంకోచరసము

మృతతామ్రాభ్రకం తుల్యం ద్వయోస్సూతం చతుర్గుణమ్. 59
యామైకం మర్దయే త్ఖల్వే రాష్టవిష్టంచ గోళకం,
త్రిభిస్తుల్యం శుద్ధగంధం లోహపాత్రాంతరే క్షిపేత్. 60
తన్మధ్యే గోళకం పాచ్యం యావజ్జీర్ణంతు గంధకం,
తావన్మృద్వగ్నినా యత్నా త్సముద్ధృత్య విచూర్ణయేత్. 61
గుగ్గులుం నింబ పంచాంగం త్రిఫలాచ మృతం విషా,
పటోలం ఖాదిరంసారం వ్యాధిఘాతం సమంసమమ్. 62
చూర్ణితం మధునాలేహ్యం నిష్కసౌదుంబరాపహం,
(మాధవనిదానే)

తా. తామ్రభస్మము ౧ భాగము, అభ్రకభస్మము ౧ భాగము, రసభస్మము ౪ భాగములు-ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి విష్ణుక్రాంతము, వావరడంగి, సర్పాక్షి, చిత్రి, అవిసె, నీలి, మండూకబ్రహ్మి, మోదుగ, అనువానిరసముతో నొక్కొకఝామము మర్దించి యుంటజేసి ౧౦ భాగములు శుద్ధిజేసినగంధకమును ఇనుపగిన్నెలోవైచి దానిపై యుంటనునిచి దానిపై మరల గంధకమువైచి జీర్ణంబగువఱకు మృద్వగ్నితోవండి సాంగ శీతలమునదీసి ఖల్వములోనునిచి చూర్ణముజేసి శుద్ధిజేసిన మహిసాక్షిగుగ్గిలము, వేపపువ్వు, తానికాయలు, దానియాకు, దానిపట్ట, దానివేరు, త్రిఫలములు, శుద్ధిచేసిననాభి, అతివస, చేతిపొట్ల, కాచు, రేల అనువానిని సమభాగములుగ చూర్ణముజేసి గలిపి నిష్కప్రమాణమును తేనెతో (సాయంప్రాతఃకాలములయందు ౧౪ మాసములు) సేవించిన ఉదుంబరకుష్ఠము హరించును.

### శ్విత్రకుష్ఠమునకు చంద్రప్రభావరసము

శుద్ధసూతం ద్విభాగంధం మర్ద్యం నింబమయూరయోః. 63
ద్వయోర్ద్రావైః స్నగోమూత్రై ర్దినం కాకుచికాద్రవైః,
ముస్తా పిండీతకం క్షిప్త్వా తం రుద్ధ్వా భూధరే పుటేత్. 64
స్వాంగశీతం సముద్ధృత్య చూర్ణార్ధశగుణం క్షిపేత్,

తథాచ వాకుచీబీజం గోమూత్రే మర్దయే ద్దినమ్ 65
ద్వినిష్కాం వటికాం ఖాదే చ్ఛ్విత్రకుష్ఠవినాశిని,
ఖ్యాతాచంద్రప్రభాహ్యేషా కుర్యా త్తక్రేణ భోజనమ్. 66
కాకోదుంబరికామూలం జలైర్ఘృష్టం పిబేదను, (నిత్యనాథీయే)

తా. శుద్ధిచేసినరసము ౧ భాగము, శుద్ధిజేసినగంధకము ౨ భాగములు-ఇటుల వీనిని ఖల్వములోనునిచి వేప, సెమలియాకు అనువానిరసములతో నొక్కొకదినము మర్దించి పిదప గోమూత్రముతోను, భావంచాకురసముతోను మర్దించి, తుంగముస్తెలు ప్రంగవేళ్లు అను వానిచూర్ణమును గలిపి, భూధరపుటంబిడి సాంగశీతలమునదీసి ఖల్వములోనునిచి చూర్ణము జేసి దానికిపదింతలు భావంచివిత్తులచూర్ణముగలిపి గోమూత్రముతో నొకదినము మర్దించి రెండునిష్కములంత మాత్రలుజేసి యందొకదానిని సేవించి వెంబడిగ బ్రహ్మమేడివేరు నుదకముతోనూరి దాసిరసమును ద్రాగిన ౧౦ మాసములకు శ్వేతకుష్టువు హరించును. పథ్యము మజ్జిగన్నమును భుజింపవలయును. (మఱియు చిత్రమూలమును నిమ్మపండు రసముతో గంధముదీసి సురాకారముగలిపి లేపనముజేసిన శ్వేతకుష్ఠము నశించును.)

కాకణకుష్ఠమునకు సూర్యకాంతరసము

పలత్రయం మృతం తామ్రం సూతమేకం ద్విగంధకమ్. 67
త్రికటు త్రిఫలాచూర్ణం ప్రత్యేకం స్యా త్పలంపలం,
నిర్గుండీచార్ద్రికద్రావై ర్వహ్నిద్రావై ర్విమర్దయేత్. 63
దినైకం తం నిరుధ్యాథ తుషాగ్నౌచ పచేద్దినం,
సముద్ధృత్య విమూర్ణ్యాథ వాకుచీతైలమర్దితమ్. 69
త్రిదినం భావయేత్తేన నిష్కమాత్రంచ భక్షయేత్,
కుష్ఠంచ కాకణం హంతి సర్వకుష్ఠం నిహంత్యలమ్. 70

తా. తామ్రభస్మము 3 పలములు, శుద్ధిచేసినరసము ౧ పలము, శుద్ధిచేసిన గంధకము ౨ పలములు, త్రికటుకములు ౧ పలము, త్రిఫలములు ౧ పలము-ఇటుల వీనినెల్ల చూర్ణముజేసి ఖల్వములోనునిచి వావిలాకు, అల్లము, చిత్రమూలము అనువానిరసములతో నొక్కొకదినము మర్దించి ఇనుపగిన్నెలోనునిచి పైరమూసి వరియుముకతో నొక దినము పాకముజేసి సాంగశీతలమునదీసి మరల ఖల్వములోనునిచి భావంచివిత్తుల తైలముతో మర్దించి మూడుదినములు భావనచేసి నిష్కప్రమాణముచొప్పున ౧౦ మాసములు సేవించుచుండిన కాకణకుష్ఠము మొదలగు సర్వకుష్ఠువులు హరించును.

### కాకణకుష్ఠమునకు కరంజతైలాదిలేపనము

తైలం కరంజబీజోత్థం వహ్నిసైంధవగాహితం,
చూర్ణితం లేపయేద్ధంతి శీఘ్రమేవతు కాకణమ్. 71

తా. చిత్రమూలము, సైంధవలవణము అనువానిచూర్ణమును క్రానుగవిత్తులతైలములో గలిపి లేపనము సేయుచుండిన కాకణకుష్ఠువు శీఘ్రముగ హరించును.

### గజచర్మకుష్ఠువునకు లంకేశ్వరరసము

పలైకం శుద్ధసూతంచ కర్షైకం శుద్ధగంధకం,
గంధతుల్యం మృతం తామ్రం సూతాంశం మర్దయేద్విషమ్. 72
సర్వతుల్యం పునర్గంధం దద్యాత్ కించిద్విమర్దయేత్,
ఘృతాభ్యక్తై లోహపాత్రే పచేద్యామం సముద్ధరేత్. 73
రంభపత్రే పుటీచాథ పాచయేత్పర్పటీం యథా,
మాషైకం చూర్ణితం ఖాదేద్గజచర్మ నియచ్ఛతి. 74
నిష్కైకం వాకుచీం క్షౌద్రై ర్లేహ్యోఽయం గజచర్మణి,

తా. శుద్ధిచేసినరసము ౧ పలము, శుద్ధిచేసినగంధకము ౧ కర్షము, తామ్రభస్మము ౧ కర్షము, శుద్ధిచేసినాభి ౧ పలము-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి మర్దించి దీనికిసమముగ గంధకముకలిపి ఒకింత మరల మర్దించి నెయ్యిపూసినయినుపగిన్నెలో నునిచి యొకఝాముపండి·దించికొని సాయంత్రమున అరటియాకులో బిళ్ళజేసి యునిచి సన్నపుమంటను నప్పడమువలె గాల్చి చూర్ణముజేసి మాషప్రమాణమును సేవించి వెంబడిగ నిష్కప్రమాణము భావంచి విత్తులచూర్ణములో తేనెగలిపి సేవించుచుండిన గజచర్మ కుష్ఠువు హరించును.

### విచర్చికాకుష్ఠాంతకరసము

శుద్ధసూతం విషం గంధం తుల్యం తాప్యం శిలాజతు. 75
శుల్బం తీక్ష్ణం మృతం లోహం సర్వం మర్ద్యం దినత్రయం,
కాకమాచీ దేవదాల్యోః కర్కోటస్యద్రవైర్దృఢమ్, 76
శోషయేద్భూధరే పాచ్యం త్రిదినంతు తుషాగ్నినా,
ఆదాయ భావయేచ్ఛాహ స్త్రైలైర్వాకుచిసంభవైః. 77
నిష్కార్ధం లేహయేత్క్షౌద్రైః రసః కుష్ఠనికృంతనః,
భల్లాత వాకుచీ పథ్యా విడంగం చిత్రకం తథా. 78

జీరకం బదరీమూలం కటుతైలేంగుదేనతు,
భక్షయేదనుపానేన హంతి కుష్ఠం విచర్చికామ్. (ఆయుర్వేదే)79

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసిననాభి, శుద్ధిజేసినగంధకము, శుద్ధిజేసినస్వర్ణమాక్షికము, శుద్ధిజేసినశిలాజిత్తు, తామ్రభస్మము, ఉక్కుభస్మము, ఇనుపభస్మమువీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నల్లకాచాకు, డావరడంగి, గొడ్డుకాకర అనువానిరసములతో ప్రతిదానిచే నొక్కొకదినము చొప్పున 3 దినములు మర్దించి ఎండించి మూసలోనునిచి ఉముకతో మూడుదినములు భూధరపుటంబిడి సాంగశీతలమునదీసి భావంచివిత్తులతైలముతో నొకదినము భావనజేసి అర్ధనిష్కప్రమాణము తేనెతో సేవించి వెంబడిగ శుద్ధిజేసిన జీడిగింజలు, భావంచివిత్తులు, కరక్కాయ, వాయువిడంగములు, చిత్రమూలము, జీలకఱ్ఱ, రేగువేరు అనువానిచూర్ణములో తెల్లఆవనూనెగాని, * కటుతైలముగాని, ఇంగుదీతైలముగాని గలిపి సేవించిన ౧౹౼ మాసములకు విచర్చికకుష్ఠువు హరించును.

## బుష్యజిహ్వాకకుష్ఠువునకు శైలేంద్రరసము

శుద్ధసూతం సమం గంధం కాంతభస్మ విషం తథా,
వాకుచీ త్రిఫలాచూర్ణం నింబ వహ్ని గుళూచిజైః. 80
దినం భృంగీద్రవైర్మర్ద్యం వాకుచ్యాశ్చ కషాయకైః,
భక్షయేల్లోహపాత్రస్థం కర్షార్ధం జహ్వికాప్రణుత్. 81
గుంజాభల్లాతతైలాభ్యాం నిష్కం వాకుచిచూర్ణకం,
లేపయేదనుపానేన సర్వకుష్ఠవినాశనః. (పూజ్యపాదీయే) 82

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిజేసినగంధకము, కాంతభస్మము, శుద్ధిజేసిననాభి భావంచివిత్తులచూర్ణము, త్రిఫలచూర్ణము - వీనిని సమభాగములుగ ఖల్వములోనుని వేము, చిత్రమూలము, తిప్పతీగె, గుంటగలగర అనువానిరసములలో ప్రతిదానితోడను భావంచివిత్తుల కషాయముతోడను, ఒక్కొకదినము మర్దించి ఇనుపగిన్నెలోనునిచి అర్ధకర్షమును సేవించుటయేగాక గురిగింజవిత్తులు, జీడివిత్తులు అనువానితైలములో నిష్కప్రమాణము భావంచివిత్తులచూర్ణముగలిపి శరీరమునకు లేపనముజేసిన బుష్యజిహ్వాకకుష్ఠువు మొదలగు సర్వకుష్ఠువులు హరించును.

---

* కటుతైలమన—శ్లో. పృథ్వీకామూల జీమూతా దంతీ కవచ శిగ్రుజమ్ నింబాతసీకరంజార్క హస్తికర్ణీంగుదీ భవమ్, శంఖినీ నింబకం తైలం తైలం జ్యోతిష్మతీకృతమ్, కుసుంభసర్షపోద్భూతం తైలం సౌవర్చలం తథా. (ఇవియ కటుతైలములు.

## శతారుష్యకుష్ఠమునకు లంకాధిపేశ్వరరసము

సూతాభ్ర శుల్బభస్మాని గంధం, [1]తాప్యం శిలాజతు,
ఆమ్లవేతస తుల్యాంశం చామ్లేన మర్దయేత్తతః. 83
మధ్వాజ్యాభ్యాం వటీః కుర్యా ద్ద్విగుంజం భక్షయే త్సదా.
[2]కుష్ఠం శతారుషం హంతి రసో లంకాధిపేశ్వరః. 84
త్రిఫలా నింబ మంజిష్ఠా వచా పటోలమూలకం,
కటుకీ రజనీతుల్యం క్వాథోఽయమనుపానతః. 85

తా. రసభస్మము, అభ్రకభస్మము, తామ్రభస్మము, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసిన హేమమాక్షికభస్మము, లేక శుద్ధిచేసినతాళకము, శుద్ధిచేసినశిలాజిత్తు - వీనిని సమభాగములుగ ఖల్వములో నుసిచి వీనికి సమముగ పుల్లప్రబ్బలిచూర్ణముగలిపి నిమ్మపండ్లరసము, తేనె, నెయ్యి అనువానితో మూడుఝాములు మర్దించి రెండుగురిగింజలయెత్తు మాత్రలుజేసి యందొకదానిని త్రిఫలములు, వేము, మంజిష్ఠ, వస, చేదుపొట్లవేరు, ఆకాకర, పసపు అనువానికషాయానుపానముతోడ సాయంప్రాతఃకాలముల సేవించిన శతారుష్యకుష్ఠము హరించును.

## కచ్ఛుకకుష్ఠమునకు కుఠారరసము

సూతాభ్ర శుల్బ కాంతానాం మృతానాం గంధకం సమమ్
తేషాం చతుర్గుణం చాజ్య మేతత్క్వాథై ర్విపాచయేత్. 86
అమృతా ముసలీ ముండీ హస్తికర్ణీ శతావరీ,
అయం పంచామృతక్వాథో ఘృతాచ్చాతుర్గుణో భవేత్. 87
మార్కవామృతజీవంతీ విదార్యాశ్చ కషాయకం,
పూర్వాంశం నిక్షిపే జ్జీర్ణే తస్మిన్ జీర్ణమిదం భవేత్. 88
ఘృతావశేషకం పక్త్వా సదా సేవేత బుద్ధిమాన్,
సర్వకుష్ఠా న్నిహంత్యాశు కచ్ఛుకంచ వ్యపోహతి. 89
(మాధవనిదానే)

తా. రసభస్మము, అభ్రకభస్మము, తామ్రభస్మము, కాంతభస్మము - ఇవి దినుసుకొక్కొకభాగము, శుద్ధిచేసినగంధకము ౪ భాగములు, నెయ్యి ౩౨ భాగములు, పంచామృతమన - తిప్పతీగె, నేలతాటిగడ్డలు, బోడతరము, సముద్రపాదపాకు, పిల్లిపీచర అనువానికషాయము ౧౨౮ భాగములు గలిపి ఘృతము శేషించునటుల గాచి

---

1 తాళం. 2 కుష్ఠం హంతి నసందేహః.

దీనికి నాలుగింతలు గుంటగలగర, తిప్పతీగె, మనుబాల, నేలగుమ్ముడు అనువానికషాయ మును గలిపి అది జీర్ణంబై ఘృతము శేషించువఱకు మరల గాచి సేవించిన కచ్ఛపకుష్ఠువు హరించును.

## మండలకుష్ఠువునకు సర్వేశ్వరరసము

శుద్ధసూతం చతుర్గంధం పలం యామం విమర్దయేత్.
మృతతామ్రాభ్రలోహానాం హింగుళంచ పలంపలమ్. 90
జంబీరోన్మత్తవాసాభి స్స్నుహ్యర్కముష్టిజైర్ద్రవైః,
మర్ద్యం హయారిజద్రావైః ప్రత్యేకంచ దినందినమ్. 91
ఏవం సప్తదినం మర్ద్యం తద్గోళం వస్త్రవేష్టితం,
వాలుకాయంత్ర[1]కే పాచ్యం త్రిదినం లఘునాగ్నినా. 92
ఆదాయ చూర్ణయేచ్ఛ్లక్ష్ణం పలైకం యోజయేద్విషం,
ద్విపలం పిప్పలీచూర్ణం మిశ్రం సర్వేశ్వరో రసః. 9
ద్విగుంజం లేహయేత్క్షౌద్రై [2]స్సుప్తమండలకుష్ఠనుత్,
వాకుచీం దేవదారుంచ కర్షమాత్రం విచూర్ణితమ్. 9
లిహేదేరండతైలేన చానుపానం సుఖావహం,

(మాధవనిదా

తా. శుద్ధిచేసినరసము ౧ పలము, శుద్ధిచేసినగంధకము ౪ పలములు - ఈరెంటి ఖల్వములోనునిచి ఒకఝాము మర్దించి అందు తామ్రభస్మము, అభ్రకభస్మము, లోహ భస్మము, శుద్ధిచేసినఇంగిలీకము అనువానిని దినుసుకొక్కొకపలముచొప్పున గలిపి ని పండ్లరసము, ఉమ్మెత్తాకురసము, అడ్డసరపాకురసము, బొంతజెముడుపాలు, జిల్లేడుపా ముష్టిచెక్క, గన్నేరు అనువానిరసములలో ప్రతిదానిచే నొక్కొకదినము వంతున దినములు మర్దించి ముద్దజేసి బట్టలోగట్టి దానిపైచీలమన్ను లేపనముచేసి లఘ్వగ్నిచే మూడుదినములు వాలుకాయంత్రమున పాకముజేసి యందుండితీసి మరల ఖల్వము నునిచి నున్నగ చూర్ణముజేసి శుద్ధిజేసిననాభిచూర్ణము ౧ పలము, పిప్పలిచూర్ణము పలములు గలిపి రెండుగురిగింజలయెత్తును తేనెతో భక్షించి వెంబడిగ కర్షప్రమాణ భావంచి, దేవదారు అనువాని రసములో నాముదముగలిపి త్రాగిన మొద్దుబారియుం మండలకుష్ఠువు హరించును.

1 సంస్వేద్యం. 2 శ్విత్ర.

వైపాదికకుష్టువునకు మహాకాళరసము

శుద్ధసూతం మృతం తామ్రం కుష్ఠం గంధక టంకణమ్. 95
పిప్పలీచ సమం మర్ద్యం మాతులుంగద్రవైర్దినం,
త్రిఫలాం సర్వతుల్యాంశ మేకీకృత్యచ భక్షయేత్. 96
నిష్కైకం చ లిహేచ్చామ మృద్భాండే వాకుచీరసం,
కుష్ఠం వైపాధికం హంతి మహాకాళరసాహ్వయమ్. 97
ద్విగుంజం భక్షయేన్నిత్యం తథా విజయపర్పటీం,
మాలార్జునం పటుర్వహ్ని శాల్మలీ భృంగముండికాః. 98
కురంట నింబ పంచాంగం నిర్గుండీ వాకుచీసమం,
మధ్వాజ్యైర్లేహయేత్కర్ష మనుస్యా త్సర్వకుష్ఠజిత్. 99

తా. శుద్ధిచేసినరసము, తామ్రభస్మము, చెంగల్వకోష్టు, శుద్ధిచేసినగంధకము, వెలిగారము, పిప్పళ్లు-వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మాదీఫలరసముతో నొక దినము మర్దించి దానికిసమముగ త్రిఫలచూర్ణముగలిపి మర్దించి మట్టిపాత్రలో నునిచి నిష్కప్రమాణమును భావంచివిత్తుల రసానుపానముతోడ సేవించిన వైపాదిక కుష్టువు హరించును. మఱియు మాలార్జునము, (కాచు), సైంధవలవణము, చిత్రమూలము, బూరుగ, గుంటగలగర, బోడతరము, గోరింట, వేపపువ్వు, దానికాయలు, ఆకు, చెక్క, వేరు, వావిలి, భావంచివిత్తులు - వీనిని సమముగ కర్షప్రమాణము గ్రహించి తేనె, నెయ్యి వీనితోనూరి రెండుగురిగింజలయెత్తు విజయపర్పటీరసమునుగలిపి సేవించిన ౧౮ మాసములకు సర్వకుష్టువులు హరించును.

విస్ఫోటకకుష్ఠువునకు బడబానలరసము

సూతకస్యపలేద్వేచ చత్వారీ గంధకస్యచ,
వాలుకాయంత్రపక్వంతు జాయతే భస్మసూతకమ్. 100
అస్యసూతస్య భాగైకం టంకణం సప్తమాంశకం,
గంధకంచ క్షిపే త్తత్ర శుల్బచూర్ణం తథైవచ. 101
నాగరం కుష్ఠచూర్ణంచ పిప్పలీచూర్ణ మేవచ,
మాతులుంగరసైర్భావ్యం లేహయే న్మధుసర్పిషా. 102
సప్తసప్తప్రయోగేణ హంతి కుష్ఠాష్టకం దశ,
షణ్మాసంచ ప్రయోగేణ దేహసిద్ధిః ప్రజాయతే. 103
సంవత్సరప్రయోగేణ భవే దీశ్వరసన్నిభః,

తస్యమూత్రపురీషాణి శుల్బం భవతి కాంచనమ్. 104

(మాధవనిదానే)

తా. శుద్ధిచేసినరసము ౨ పలములు, శుద్ధిచేసినగంధకము ౪ పలములు - ఈ రెంటిని ఖల్వములోనునిచి మర్దించి కుప్పెలోనునిచి వాలుకాయంత్రమున పాకముజేసిన రసము భస్మంబగును. పిదప నారసభస్మము ౧ సేరు, పేల్చినవెలిగారము, శుద్ధిచేసిన గంధకము, తామ్రభస్మము, శొంఠి, చెంగల్వకోష్టు, పిప్పలి అనువానిలో ప్రతిద్రవ్య చూర్ణము రసభస్మమున కేడవభాగము గలిపి మాదీఫలరసముతో భావనజేసి ప్రతిదినము ౫౯ చిన్నములయెత్తును తేనె, నెయ్యి అనువానియనుపానముతోడ నేడేసిదినములచొప్పున నేడుమార్లు సేవించిన ౧౮ కుష్టువుల హరింపంజేయును. మఱియు దీనిని ౬ మాసములు సేవించుచుండిన కాయసిద్ధిగలుగును. ఒకవత్సరము సేవించుచుండిన ఈశ్వరునితో సమానుండగుటయేకాక వానిమూత్రపురీషములయందు తామ్రస్వర్ణము లుత్పత్తియగును.

## పామాకుష్ఠచికిత్స

వాకుచ్యాస్తైలలేపేన తైలైర్వా రాజవృక్షజైః,
పుత్రజీవోత్థతైలైర్వా లేపః పామాం వినాశయేత్. 105

(ఆయుర్వేదే)

తా. భావంచివిత్తుల తైలమునుగాని, లేక ఱేలతైలమునుగాని, లేక పుత్రజీవితైలమునుగాని లేపనముజేసిన పామాకుష్టువు హరించును.

గంధకం తిలతైలేన నిష్కమాత్రం సదా పిబేత్,
క్షీరశాల్యన్నభోజ్యంచ పామా కండూహరం పరమ్. 106

తా. నువ్వులనూనెలో నిష్కప్రమాణము శుద్ధిచేసినగంధకమును గలిపి పానము జేసిన పామాకుష్టువు, దురద హరించును. పథ్యము పాలతోడ వరిబియ్యపు వంటకమును భుజింపవలయును.

## కపాలకుష్ఠువునకు సోమేశ్వరరసము

శుద్ధసూతం మృతంచాభ్రం గంధకం మర్దయేత్సమమ్,
దినం నిర్గుండికాద్రావై రుధ్వాహ్నా భూధరేపచేత్. 107
ఉద్ధృత్య వాకుచీతైలే వాకుచ్యావా కషాయకే,
దినైకం భావయేద్ఘర్మే నిష్కమాత్రంతు భక్షయేత్. 108
వాకుచీం కాకమాచీంచ త్రిఫలాం చూర్ణయేత్సమం,

మధ్వాజ్యే కర్షమాత్రంచ లేహయే దనుపానకమ్, 109
కపాలం విషమం కుష్ఠం హంతి సోమేశ్వరో రసః, (నిత్యనాథీయే)

తా. శుద్ధిచేసినరసము, అభ్రకభస్మము, శుద్ధిచేసినగంధకము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి వావిలియాకురసముతో నొకదినము మర్దించి మూసలో నునిచి దానిమూతినిమూసి భూధరపుటంబిడి సాంగశీతలమునదీసి భావంచివిత్తుల తైలముతోగాని, లేక భావంచిసమూల కషాయముతోగాని, నొకదిన మెండలో నునిచి భావన చేసి నిష్క-ప్రమాణమును భావంచివిత్తులు, కాచాకు, త్రిఫలములు అనువాని యొక్క కర్షప్రమాణ చూర్ణములో తేనె, నెయ్యి గలిపి ఈయనుపానముతోడ భక్షించిన కపాలకుష్టువు, విషమకుష్టువు హరించును.

## మండలకుష్ఠువునకు విద్యాధరరసము

శుద్ధసూతం ద్విభాగంధం లోహపాత్రే క్షణం పచేత్,
శీతలం చూర్ణయే త్ఖల్వే బధ్వా వస్త్రే చతుర్గుణే. 110
శోషయే త్పాచయే త్పశ్చా ద్దశాంశం వత్సనాభకం,
క్షిప్త్వా సర్వంత్ర్యహం భావ్యం తైలై ర్వాకుచిజైర్భవేత్. 111
గుగ్గులు త్రిఫలాగంధం సమమేరండతైలకే,
ద్వినిష్క మనుపానంస్యా న్నిష్కం మండలకుష్ఠనుత్. 112
(ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసినరసము ౧ భాగము, శుద్ధిచేసినగంధకము ౨ భాగములు-ఈరెంటిని ఖల్వములోనునిచి మర్దించి ఇనుపగిన్నెలో నునిచి క్షణకాలమువండి చల్లారినపిదప ఖల్వములో నునిచి చూర్ణముజేసి నాలుగుమడతలుగల బట్టలోనునిచి చీలమున్ను లేపనము జేసి యెండించి పాకముజేసి పిదప పైయౌషధమునకు పదియవభాగము శుద్ధిజేసిననాభి గలిపి భావంచివిత్తులతైలముతో మూడుదినములు భావనజేసి నిష్క-ప్రమాణమును శుద్ధి చేసిన మహిసాక్షిగుగ్గిలము, త్రిఫలములు, శుద్ధిచేసిన గంధకము-వీనిని సమభాగములుగ నాముదముతో మర్దించి రెండునిష్కములయెత్తు ముద్దజేసి ఈయనుపానముతోడ సేవించిన మండలకుష్టువు హరించును.

## కిట్టిభకుష్ఠువునకు వజ్రపాణిరసము

శుద్ధసూతం మృతంచాభ్రం మృతం తామ్రం విషం సమం,
మర్దయే ద్వాకుచీతైలే యామైకం కృతగోళకమ్. 1 ౩
ద్విగుణే పాచయే ద్గంధే సతైలే లోహపాత్రకే,

గంధతైలే విజీర్ణేతు తద్గోళాంశం మృతాయసమ్.
పంచాంగ నింబసంయుక్తం మధునా గోళకీకృతం,
నిష్కైకం కిట్టిభం హంతి వజ్రపాణి ర్మహారసః. 115
నిశాకణా నాగరంచ వేల్లచిత్రక తాప్యకం,
క్రమోత్తరగుణం పిష్ట్వా గోమూత్రేణ పిబేదను. 116
(మాధవనిదానే)

తా. రసభస్మము, అభ్రకభస్మము, తామ్రభస్మము, శుద్ధిజేసిననాభి వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి భావంచివిత్తుల తైలముతో నొకరుఘాము మర్దించి ముద్దచేసి ఇనుపగిన్నెలో నునిచి దానికిరెండింతలు శుద్ధిజేసినగంధకము, తెల్ల ఆవనూనె గలిపి గంధకము, తెల్లఆవనూనె, జీర్ణమగువరకువండి ముద్దచేసి దానికి సమముగ అయోభస్మము, వేపపంచాంగములచూర్ణము గలిపి తేనెతో మర్దించి నిష్కప్రమాణము మాత్రలుచేసి యందొకదానిని సేవించి వెంబడిగ పసపు ౧ భాగము, పిప్పళ్లు ౨ భాగములు, శొంఠి ౩ భాగములు, పెద్దమ్రానుచెక్క ౪ భాగములు, చిత్రమూలము ౫ భాగములు, శుద్ధిచేసిన హేమమాక్షికము ౬ భాగములు-ఇటుల వీనిని గోమూత్రముతో నూరిత్రాగిన కిట్టిభ కుష్టువు హరించును.

దద్రుకుష్టువునకు పారిభద్రరసము

మూర్ఛితం సూతకం ధాత్రీఫలం నింబస్య చాహరేత్.
తుల్యాంశం ఖదిరక్వాథై ర్దినం మర్ద్యంచ భక్షయేత్. 117
నిష్కైకం దద్రుకుష్ఠఘ్నః పారిభద్రాహ్వయో రసః,
మయూరముష్కకక్షారం శుద్ధసూతంచ గంధకమ్.
త్ర్యూషణం టంకణం సర్జ తామ్రచూర్ణం సమం దినం,
మేషశృంగీద్రవైర్మర్ద్యం లేపా ద్దద్రువినాశనమ్. (రసరత్నాకరే

తా. మూర్ఛంజెందిన రసము, ఉసిరికపండు, వేపపండు-వీనిని సమభాగములు ఖల్వములోనునిచి తెల్లతుమ్మచెక్కకషాయముతో నొకదినము మర్దించి నిష్కప్రమాణవ మాత్రలుజేసి యందొకదానిని సేవించుటయేగాక నెమలిచెక్కక్షారము, మొక్కపుచెట్ట క్షారము, శుద్ధిచేసినరసము, శుద్ధిజేసినగంధకము, త్రికటుకములు, వెలిగారము, సర్జక్షారము, తామ్రభస్మము అనువానిని సమభాగములుగ ఖల్వములోనునిచి మొక్కపుచెక్కర ముతో ౧ దినము నూరి శరీరమున కొరుమాసములు లేపనముచేసిన దద్రుకుష్ట హరించును.

### సిధ్మకుష్ఠమునకు పారదాదిలేపనము

పారదం టంకణం గంధం మూలకార్ద్రకయోర్ద్రవైః,
దినం మర్ద్యంచ తల్లేపా త్సిధ్మహంతి మహాద్భుతమ్. 120
(మాధవనిదానే)

తా॥ రసము, వెలిగారము, గంధకము, - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి ముల్లంగి, అల్లము అనువానిరసములతో నొకదినము మర్దించి శరీరమున కారు మాసములు లేపనముజేసిన సిధ్మకుష్ఠువు హరించును.

### భేతాళరసము

అభ్రకం మృతలోహంచ శుద్ధసూతం శిలాజతు,
తాప్యం [1]చాంకోలబీజాని త్రిఫలా ముసలీసమమ్. 121
నవ్యోషం చూర్ణితం లేహ్యం మధునా నిష్కమాత్రకం,
మాసైకం నాశయే త్సిధ్మ భేతాళోఽయం మహారసః. 122
(మాధవనిదానే)

తా॥ అభ్రకభస్మము, లోహభస్మము, శుద్ధిజేసినరసము, శుద్ధిజేసిన శిలాజిత్తు, స్వర్ణమాక్షికభస్మము, ఊడుగవిత్తులు, లేక భావంచివిత్తులు, త్రిఫలములు, నేలతాటిగడ్డలు - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అందు త్రికటుకచూర్ణము గలిపి నిష్కప్రమాణమును తేనెతో నొకనెలసేవించిన సిధ్మకుష్ఠముహరించును.

### విచర్చికాకుష్ఠువునకు కుష్ఠనికృంతనరసము

శుద్ధసూతం విషం గంధం తుల్యం తాప్యం శిలాజతు,
శుల్బం తీక్ష్ణం మృతం లోహం సర్వం మర్ద్యం దినత్రయమ్.
కాకమాచీ దేవదాళ్యోః కర్కోట్యాశ్చ ద్రవైర్దృఢం,
రుధ్వావహ్నౌ భూధరే పాచ్యం త్రిదినంతు తుషాగ్నినా. 124
నిష్కార్ధం లేహయేత్క్షౌద్రైరసః కుష్ఠనికృంతనః,
భల్లాత వాకుచీపథ్యా [2]విడంగా లాంగలీ తిలః. 125
జీరకం బందరీమూలం [3]తుల్యం తుల్యం గుడంసమం,
భక్షయే దనుపానేన హంతి కుష్ఠం విచర్చికామ్. (శారీరే)

తా॥ శుద్ధిచేసినరసము, శుద్ధిజేసిననాభి, శుద్ధిచేసినగంధకము, శుద్ధిజేసిన స్వర్ణమాక్షికము, శుద్ధిచేసినశిలాజిత్తు, తామ్రభస్మము, ఉక్కుభస్మము, లోహభస్మము-వీనిని సమ

1 వాకుచిబీజాని. 2 విడంగం చిత్రకం తథా. 3 కటుతైలేంగుదేనతు.

భాగములుగ ఖల్వములో నునిచి కాచివేళ్ళరసముతో నొకదినము, డావరడంగిచెక్క-
సముతో నొకదినము, కాకరాకురసముతో నొకదినము మర్దించి ముద్దజేసి మూసలోనుని
దానిమూతిని మూసి ఒకదినము భూధరపుటములోగాని, లేక మూడుదినములు ఉమ
మంటలోగాని పాకముజేసి అర్ధనిష్కమును తేనెతోడగాని, లేక జీడివిత్తులు, భావం
విత్తులు, కరకపప్పు, వాయువిడంగములు, చెన్నచర్లగడ్డ, నువ్వులు, జీలకఱ్ఱ, రేగువేరు
ఇవి సమభాగములు వీసికన్నిటికి సమము బెల్లముగలిపి త్రొక్కి ముద్దజేసి యీయ
పానముతోడగాని ౧౨ మాసములు సేవించుచుండిన విచర్చిక కుష్ఠము హరించును.

గీ. కోలముక్కి చెక్క నాలుగుభాగాలు
వోమమొక్క పాలు ప్రేమతోడ
సిందురంబు గూర్చి సేవింప మానును
గుష్ఠువ్యాధులెల్లఁ గుపలయమున.

క. వారిజపుచెక్క రసమునఁ, బేరెన్నిక సిందురంబు బిప్పలి మోడిక్
గూరిచి సేవించినచో, మారాడెడికుష్ఠు గండమాల లడంగున్.

గీ. కలియుగంబున మున్నూఱు కరకకాయ
లించుకని చూడఁబోవక యేపుమీఱ
మడలం బారగించ భూమండలమున
గండమాలలుఁ గుష్ఠురోగములు మాను.

కుష్ఠురోగమునకు రసభస్మయోగము

గంధకస్యపలే ద్వేతు సూతకస్య పలం తథా,
కచ్ఛపయంత్రగతం పక్వం లేహయేన్మధుసర్పిషా. 127
మాషమాత్రప్రయోగేణ కుష్ఠం దహతి దారుణం,
(మాధవకల్పే)

తా. శుద్ధిచేసినగంధకము ౨ పలములు, శుద్ధిచేసినరసము ౧ పలము - ఈ రెంటిని ఖల్వములో నునిచి మర్దించి కచ్ఛపయంత్రమున పాకముజేసిన భస్మంబగును అందు మాషప్రమాణమును అడ్డుగయెత్తు తేనెతోగాని, లేక నేతితోగాని ౧౨ మాసములు సేవించిన దారుణమైన కుష్ఠమును హరింపజేయును.

గంధకం త్రిఫలాయుక్తం ఘృతేన మధునా సహ. 128
భక్షితం తు మహారోగాన్ హంతి మాషేన దారుణం,

తా. శుద్ధిచేసినగంధకము, కరక్కాయ, తానికాయ, ఉసిరికపఱుగు - వీనిని

దినుసుకొక్కొక్కసేరుచొప్పున గలిపి ప్రతిదినము మాషమెత్తును నేతితోగాని, లేక తేనెతోగాని ౧౮ మాసములవఱకు సేవించుచుండిన *మహారోగముల హరింపజేయును. (లేక ఈగ్రంథములో జెప్పంబడిన గంధకకల్పమును సేవించినను సర్వకుష్ఠువులు హరించును.)

కుష్ఠములకు బడబానలరసము

హింగూలసంభవం సూతం గంధకం మృతతామ్రకమ్. 129
సమ్యక్సూతం తథాకాంతం వంగంచాపి శిలాజతు,
తుత్థం రసాంజనంచైవ తాళకం శుద్ధమేవచ. 130
వరాటకంచాపితుల్యం నేపాళం ద్విగుణీకృతం,
హపుషా పంచలవణం పంచైవ కటుకానిచ. 131
విడంగం పిప్పలీమూలం ప్రియంగు ఽజమోదకం,
ద్వాక్షారౌ కుష్ఠమేలాచ లవంగం జీరకద్వయమ్. 132
శటీదంతీ త్రివృచ్చైవ త్రిఫలా గజపిప్పలీ,
సర్వమేకత్ర సంచూర్ణ్య భావయే త్త్రిఫలాజలైః. 133
సప్తధా లఘుపాషాణే ప్రచండాతపశోషితం,
హరీతకీ రసేనాథ పునస్సంచూర్ణ్య యత్నతః. 134
పంచరక్తిప్రమాణంతు వటికాం కారయేద్భిషక్,
ఏకైకాం ఖాదయేత్ప్రాత శ్శృంగబేరరసాప్లుతామ్. 135
హంతి కుష్ఠం తథామేద ఆమమారుతమేవచ,
శ్లీపదం గండమాలాంచ గళగండం భగందరమ్. 136
నాడీదుష్టవ్రణంచైవ హ్యంత్రవృద్ధించ దారుణం,
అమ్లపిత్తం రక్తపిత్తం పక్తిశూలం హలీమకమ్. 137
వాతరక్తం వాతకఫ ముపదంశం సపీనసం,
పంచగుల్మాం స్తథాఽఽనాహం ప్లీహ శోఫ జ్వరానపి. 138
ఉదరాణి తథా కాసా౯ రసోఽయం బడబానలః, (ఆయుర్వేదే)

* శ్లో. వాతవ్యాధ్యశ్మరీకుష్ఠ మేహోదరభగందరాః, అర్శాంసి గ్రహణీత్యష్టౌ మహారోగాః ప్రకీర్తితాః. వాతరోగము, అశ్మరి, కుష్ఠువు, మేహము, ఉదరము, భగందరము. అర్శస్సు, గ్రహణి అన నెనిమిదియు మహారోగంబులు.

తా. ఇంగిలీకముచేత దీయఁబడినరసము, శుద్ధిచేసినగంధకము, తామ్రభస్మము, రసభస్మము, కాంతభస్మము, వంగభస్మము, శుద్ధిచేసినశిలాజిత్తు, శుద్ధిచేసిన మైలుతుత్థము, * రసాంజనము శుద్ధిచేసినతాళకము, గవ్వలభస్మము-ఇవి సమభాగములు-వీనికి రెండింతలు శుద్ధిజేసిననేపాళములు, బోడతరము, పంచలవణములు, పంచకటుకములు, వాయువిడంగములు, మోడి, ప్రేంకణము, అజామోదము, సర్జక్షారము, యవక్షారము, చెంగల్వకోష్టు, ఏలకులు, లవంగములు, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, కచ్చూరములు, దంతివేరు, శుద్ధిజేసిన తెగడ, త్రిఫలములు, ఏనుగపిప్పలి - ఇటుల వీనినెల్లదంచి చూర్ణము జేసి త్రిఫలరసముతో నేడుమారులు భావనజేసి దళములేని పెంకులోనునిచి తీక్ష్ణమైన యెండ నెండించి మరల కరకాయలరసముతో మర్దించి ౨ రక్తికాప్రమాణములంత మాత్రలుజేసి యందొకదానిని ప్రాతఃకాలమున అల్లపురసములో గలిపిసేవించిన సర్వకుష్ఠములు, మేదోరోగము, ఆమవాతము, శ్లీపదము, గండమాల, కంఠగండమాల, భగందరము, పాడీవ్రణము; దుష్టవ్రణము, దారుణమైన ఆంత్రవృద్ధి, అమ్లపిత్తము, రక్తపిత్తము, పక్తిశూలము, హలీమకము, వాతరక్తము, వాతకఫము, ఉపదంశము, పీనసము, పంటగుల్మములు, ఆనాహము, ప్లీహము, శోఫ, జ్వరము, ఉదరరోగములు, కాసము - వీనిని హరింపంజేయును.

## తాళకభస్మయోగము

అపామార్గస్యభస్మాని ఘటే నిక్షిప్య యత్నతః. 139
తన్మధ్యే తాళకం క్షిప్త్వా పచేద్ద్వాదశయామకం,
ధవళం జాయతే భస్మ సర్వకుష్ఠనివారణమ్. 140
సర్వవాతప్రశమనం సర్వరోగనివారణం, (సిద్ధరసార్ణవే)

తా. ఉత్తరేణుబూడిదెను నీళ్ళతోనూరి పెద్దయుంటగజేసి యెండించి దానిం దొలిచి శుద్ధిచేసినతాళకముతో నిండిచి దానిపై ఉత్తరేణుబూడిదెను దళముగ పెత్తి దానిముఖముల చీలమన్ను లేపనముజేసి యెండించి అడుగున రంధ్రము జేయఁబడిన కుండలోనునిచి ౧-౨ ఝాములువండిన తాళకము తెల్లగ భస్మంబగును. అందొకభాగమును రెండుభాగములు పిప్పలిచూర్ణములో గలిపి తెల్లఆవనూనెతోగాని, లేక తేనెతో

---

* రసాంజనమన—మ్రానిపసపును అష్టమాంశముగ కషాయముగాచి దానికిసమముగ మేకపాలుపోసి గట్టియగుపఱకు నినుపబాణలిలో గాచి యెండించి చూర్ణము జేయుట.

గాని సేవించిన ౧౮ కుష్ఠములు. ౮౦ వాతరోగములు, సర్వరోగములు - వీనిని హరింపం జేయును.

కునటీ తాళకం తుల్యం స్నుహీక్షీరేణ మర్దితమ్. 141
కృత్వా తచ్చక్రికాం శోష్య కింశుకస్యతు భస్మనా,
ఖర్పరీం ఘటమాత్రంచ విధాయాస్మిన్ నివేశయేత్. 142
చక్రికోపరిచించాద్య క్షారైశ్చుల్యాం విపాచయేత్,
పూరితంచ ఘటీయంత్రే క్షారేణైవ పిధాయచ. 143
క్రమాగ్నినాచైకదినం సాంగశీతళముద్ధరేత్,
సంమర్ద్యచ వ్రీహిమాత్రం శర్కరేణ ఘృతేనవా. 144
ప్రాతస్సాయం ప్రదాతవ్యం సర్వవాతవికారజిత్,
వాతగ్రంథౌ ధాతుశోషే ప్రసృతౌ రసవైకృతౌ. 145
అష్టాదశసు కుష్ఠేషు గవ్యాజ్యం దధి తక్రకం, (ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసిన తాళకమునకు సమముగ శుద్ధిచేసిన మణిశిలచూర్ణముగలిపి బ్రహ్మజెముడుపాలతో మర్దించి బిళ్ళచేసి యెండించి మోదుగక్షారమును నూరి, మూకుడువలె నోరు వెడల్పుగనుండునటుల నొకకుండనుజేసి అందు చింత మొదలగువానిక్షారముల పరచి దానిపై తాళకపుబిళ్ళల నునిచి దానిపై చింత మొదలగువాని క్షారములపరచి మఱియొకకుండలోనునిచి దానినిండ చింత మొదలగువాని క్షారములుపోసి గట్టించి బాగుగ చీలమన్ను లేపనముజేసి పొయిమీఁదనునిచి క్రమాగ్నులతో నొకదినమువండి యందలితాళకపుబిళ్ళల సాంగశీతలమునదీసి ఖల్వములోనునిచి మర్దించిన తెల్లగ భస్మంబగును. ఈతాళకభస్మములో వరిగింజయెత్తును పంచదారతోగాని, లేక నేతితోగాని, సాయంప్రాతఃకాలముల సేవించుచుండిన ౮౦ వాతరోగములు, వాతగ్రంథులు, సప్తధాతువులు శోషించుట, వాపు, రసవైకృతము, ౧౮ కుష్ఠములు - వీనిని నశింపంజేయును. పథ్యము: ఆవునెయ్యి, పెరుగు, చల్ల - వీనిని సేవింపవలయును. (శుద్ధిచేసిన తాళకమును ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో నొకదినము, వేపాకురసముతో 3 దినములు మర్దించి నిడుపుగ కణికలుజేసి యెండించి పిదప ఏపిబిభూతిని యుంటగగట్టి దానిందొలిచి అందు తాళకపుకణికెలనునిచి దానిపై ఏపిబూడిదెపోసి గట్టించి దానిపై చీలమన్ను లేపనముజేసి ఎండించి ౪ ఝామములువండిన భస్మంబగును. ఇట్టి తాళకపుభస్మములో నొకభాగమును గ్రహించి దానితోడ రెండుభాగముల పిప్పలిచూర్ణమునుగలిపి తేనెతోనూరి సేవించిన క్షయము, పాండువు, చిప్పికాశ్వాసము,

అతిసారము, వాతరోగము, కుష్ఠము - వీనిని హరింపజేయును. పథ్యము-నల్లవరిబియ్యపు వంటకము, నెయ్యి, తోటకూర - వీనిని భుజింపవలయును.)

దేహే కిలాసే సంజాతే కండ్వావా చర్మపీడితమ్. 146
కాసమర్దకబీజాని మూలకానాం తథైవచ,
గంధపాషాణమిశ్రాణి సిధ్మహంతి న సంశయః. 147

తా. శరీరమున శిబ్బెముగలిగి దురదవలన చర్మము పొట్టువలె రాలుచుండిన దురదగొండివిత్తులు, ముల్లంగివిత్తులు, గంధకము, ఉల్లిపాషాణము - వీనినుదకముతో నూరి లేపనము జేసిన శిబ్బెము నిస్సంశయముగ హరించును.

గంధకోత్పత్తి,తత్సేవనాక్రమము

శృణు దేవి ప్రవక్ష్యామి యత్రోత్పన్నశ్చ గంధకః,
తమహం కథయిష్యామి శృణుష్వాయతలోచనే. 148
అమృతోదోత్థితస్సాక్షా ద్దివ్యతేజా మహాగుణః,
పీతశ్చైవ తథా శ్వేతః కపోతశ్చ తృతీయకమ్. 149
ఆరక్తశ్చ చతుర్థస్స్యా త్క్రమోత్తరగుణం ప్రియే,
తస్యగంధస్య గంధేన మోహితాశ్చాపి దానవాః, 150
గంధకో నామ తేనైవ విఖ్యాతః క్షితిమండలే,
తథాక్రమగుణాశ్చైవ భవంతి గిరిజాఅపి. 151
తత్ర క్షేత్రోత్థితస్యైవ శుద్ధిం కుర్యా ద్విచక్షణః,
తత్రానీతక్రమేణైవ తృతీయంచ సమాహితః. 152
*వమనం రేచనం కుర్యా త్కర్తవ్యస్యచ నిశ్చయః,
క్రియాం కృత్వా ప్రయత్నేన శుచిర్గంధం సమాచరేత్. 153
శుభే ముహూర్తే నక్షత్రే హ్యర్చయిత్వా జగద్గురుం,
విధినైవతు సుప్రాజ్ఞః కర్తవ్యో నిత్యమేవహి. (సిద్ధరసార్ణవే). 154

తా. ఓపార్వతీ! గంధకము జనించునట్టిస్థలమును వచించెద వినుము. గంధకము క్షీరసముద్రమున జనించి దివ్యమైన తేజస్సు, మహాగుణసంపత్తి గలదై పసుపువర్ణము, శుభ్రవర్ణము, కపోతవర్ణము, ఒకింతరక్తవర్ణము అను నాలుగు విధంబులుగలదై ఒకదానికంటె నొకటి గుణాధిక్యము గలదిగనుండును. ఈగంధకముయొక్క పరిమళమువలన దానవులు మోహితులైనందున దీనికి గంధకమను నామము భూమండలమునగలిగెను. ఇటు

* వమనం రేచనం పూర్వం శుద్ధించైవ సమాచరేత్.

లనే పర్వతమున జనించినగంధకమునగా నాలుగు విధంబులుగలదై ఒకదానికంటె నొకటి గుణాధిక్యము గలదిగనుండును. భూమియందు జనించిన నాలుగువిధములగు గంధకముల లోపమూడవదియైన కపోతక మనుదానిని బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు క్రమముగ శుద్ధిచేసి రోగికి వమనవిరేచనంబులు చేయించి తాను స్నానాదులచే శుద్ధుఁడై సుముహూర్త నక్షత్రంబున విధిప్రకారము జగద్గురువును బూజించి గంధకకల్పము నొసంగవలయును. మఱియు గంధకకల్పము నొసంగునప్పుడెల్ల యీవిధినే వైద్యుఁడాచరింపఁదగును.

## గంధకసేవనయందు పథ్యాపథ్యంబులు

భోజ్యానిచ ప్రవక్ష్యామి త్యాజ్యాని వివిధానిచ,
షష్టికాశ్చ తథాశాలో్య గోధూమాశ్చ విశేషతః. 155
జాంగలానీచ మాంసాని *లాఘవాని ప్రదాపమేత్,
ఏవం ముద్గాసితా స్సర్పి స్సితా క్షీరం మధూత్కరమ్. 156
ఏవం భోజ్యం తథాపథ్యం మయాఖ్యాతం వరాననే,

తా. గంధకసేవనకాలమున ౬౦ దినములకు ఫలించినవడ్లబియ్యము, గోధుమలు, జాంగలమాంసము, లఘుకరద్రవ్యములు, నల్లపెసలు, నెయ్యి, పంచదార, పాలు, మద్యము అనువానిని పథ్యమునందు గ్రహింపవలయును. సుందరమైన ముఖముగల యోపార్వతీ! ఇటుల పథ్యాపథ్యంబులు నాచే జెప్పంబడియెను.

## గంధకసేవనోపయుక్తమంత్రము

అథ మంత్రం ప్రవక్ష్యామి గంధకస్య చ భక్షణే. 157
ఓం నమోఽమృతశిఖాయ అమృతరూపజీవనే,
దానవేంద్రేణచాజ్ఞాత అమృతత్వం దేహిస్వాహా 158

తా. గంధకమును సేవించునపుడు "ఓంనమో" అనుమంత్రమును బఠింపవలయును.

## కుష్ఠరోగమునకు గంధకకల్పము

గంధకస్య పలంచైవ సూతకస్య పలం తథా,
గగనస్య పలంచైవ హాటకస్య పలం తథా. 159
నీలాంజనం పలంచైవ త్రిఫలానాం పలత్రయం,
ద్విసప్తకంతు పక్షంవా షణ్మాసంవా ప్రయోగతః. 160
వలీపలితనిర్ముక్తో సర్వరోగవివర్జితః,
దివ్యదృష్టిః ప్రవర్తేత జీవే దబ్దాయుతం నరః. 161

---

*ఛాగలాని ప్రయోజయేత్ — మేకమాంసము.

వాతారితైలసంయుక్తం త్రిఫలా గుగ్గులేనచ,

తా. శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసినరసము, అభ్రకభస్మము, స్వర్ణభస్మము, శుద్ధిచేసిననీలాంజనము - ఇవి దినుసుకొక్కొకపలము, త్రిఫలములు 3 పలములు - ఇటుల వీనినెల్ల చూర్ణముజేసి ఆముదము, త్రిఫలములు, శుద్ధిచేసినమహిసాక్షిగుగ్గిలము అనువాని గాని సేవించిన వలీపలిత విముక్తుండై సర్వరోగవివర్జితుండై దివ్యదృష్టిగలవాఁడై పది వేల సంవత్సరములు జీవించును.

గంధకస్య పలంచైకం రసస్యార్ధం క్షిపేత్తథా. 162
కుమారీరససంఘృష్టం దినైకం గోళకీకృతం,
అంధమూషాకృతం ధ్మాతం లేహయేన్మధుసర్పిషా. 163
మాషమాత్రప్రయోగేణ జరాదారిద్ర్యనాశనం,

తా. శుద్ధిజేసినగంధకము ౧ పలము, శుద్ధిచేసినరసము ½ పలము - ఈరెంటిని కలబందరసముతో నొకదినము కాటుకవలె మర్దించి ముద్దజేసి అంధమూషలోనునిచి సంధిలేపనముచేసి నిప్పులో బెట్టి యూది దానిని దీసి మాషప్రమాణమును తేనె లేక నేతితో భక్షించిన జరాదారిద్ర్యముల హరింపంజేయును.

గంధకస్య పలే ద్వేతు సూతకస్య పలం తథా. 164
కచ్ఛయంత్రగతం పక్వం లేహయేన్మధుసర్పిషా,
మాషమాత్రప్రయోగేణ కుష్ఠం హంతి దారుణమ్. 165

తా. శుద్ధిజేసినగంధకము ౨ పలములు, శుద్ధిజేసినరసము ౧ పలము-ఈరెంటిని కజ్జలిగ నూరి కచ్ఛపయంత్రములో నునిచి పాకముజేసిన భస్మంబగును. అందొకమాష ప్రమాణమును తేనె, నేతితో భక్షించిన దారుణమైనకుష్ఠమును హరింపజేయును.

త్రిఫలా గంధకం చూర్ణం భృంగరాజసమన్వితం,
సంవత్సరప్రయోగేణ జీవేద్వర్షశతం నరః. 166

తా. త్రిఫలములు, శుద్ధిచేసినగంధకము - వీనిని చూర్ణముజేసి గుంటగలగరాకు రసముతో నొకవత్సరమువఱకు సేవించుచుండిన ౧౦౦ వత్సరములు జీవించును.

గంధకస్య పలంచైవ పిబేత్క్షీరేణవా నిశి,
అర్ధమాసప్రయోగేణ హంతి కండూం విచర్చికామ్. 167

తా. ఒకపలము శుద్ధిచేసినగంధకమును రాత్రులయందు పాలలో వైచి కాచి అర్ధమాసమువఱకు సేవించుచుండిన దురద, విచర్చిక, కుష్ఠము హరించును,

ఘృతం గవ్యం పలంచైవ తదర్ధంచైవ సూతకం,
గంధకం పలమాత్రేణ జరావ్యాధివినాశనమ్. 168
వాచస్పతిసమో బుద్ధ్యా షణ్మాసాచరణేనతు,

తా. ఆవునెయ్యి ౧ పలము, శుద్ధిచేసినరసము ౪ పలము, శుద్ధిచేసిన గంధకము ౧ పలము-ఇటుల వీనినేకముజేసి ౬ మాసములు సేవించిన ముదిమిని హరింపఁజేయుట యేగాక బృహస్పతితో సమానమైన బుద్ధిని గలుగంజేయును.

గంధకం త్రిఫలాయుక్తం ఘృతేన మధునా సహ. 169
భక్షితంతు మహారోగం హంతి మాసేన దారుణం,

తా. శుద్ధిజేసినగంధకము, త్రిఫలములు-వీనిని చూర్ణముజేసి నేతితోగాని, తేనెతోగాని ఒకమాసమువఱకు సేవింపుచుండిన దారుణమైన కుష్ఠువు హరించును.

### స్వర్ణకరణవిధి

గంధకంచాంధమూషస్థం సబీజంచైవ మర్దితమ్. 170
భూమిస్థం మాసమేకంతు తారం భవతి కాంచనం,

తా. శుద్ధిచేసినగంధకమును కాలకూటము, వత్సనాభి, శృంగము, ప్రదీపనము, హాలాహలము, బ్రహ్మపుత్రము, హారిద్రము, సక్తుకము, సౌరాష్ట్రికము అను మహావిషంబులచే మర్దింపంబడి సప్తకంచుకదోషరహితముగ చేయఁబడినరసమును నేకముజేసి కాటుకవలె మర్దించి అంధమూషలో నునిచి ఒకమాసము భూస్థాపనముజేసి దానిని గరిగించి వెండితోడ గలిపిన బంగార మగును.

### గంధకకల్పసేవనామహిమ

అభ్రకం హారబీజంచ షడంశేనతు కాంచనమ్. 171
ధ్మాతం ప్రసృతమూషాయాం గంధకేన సుసంయుతం,
మూషాం త్యక్త్వా సమారోహే దూర్ధ్వంతు ఖగవద్రసః. 172
రాజికార్ధార్ధమాత్రేణ పర్వతానపి వేధయేత్,
రాజసర్షపమాత్రేణ తద్రసం యది భక్షితమ్. 173
ఖేచరత్వ మవాప్నోతి క్రీడతే నిర్జరైస్సహ,

తా. అభ్రకభస్మము, పైప్రకారము శుద్ధిచేయఁబడినరసము-ఈరెంటికి నారవ భాగము సువర్ణభస్మము, శుద్ధిజేసినగంధకమును గ్రహించి విశాలమైనమూషలోనునిచి యూదిన రసము పక్షివలె పొడవుగ నెగురును. పిదప నారసములో రాజికార్ధప్రమాణ

మును సేవించిన పర్వతముల భేదింపదగిన బలము గలవాఁడగును. మఱియు తెల్లఆవగింజంతసేవించిన దేవత్వమును జెంది దేవతలతో గ్రీడించును.

తుల్యాయసం తథా సూతం గంధరాజేన రంజితమ్. 174
మ్లేచ్ఛంచ ఘటియంత్రేణ క్షారేణైవ పిధాయచ,
క్రమాగ్నినా చైకదినం సాంగశీతలముద్ధరేత్. 175
సంమర్ద్యంచ వ్రీహిమాత్రం శర్కరేణ ఘృతేనవా,
ప్రాతస్సాయం ప్రదాతవ్యం సర్వవాతవికారజిత్. 176
వాతగ్రంథౌ ధాతుశోషే ప్రసారే రసవైకృతౌ,
అష్టాదశసు కుష్ఠేషు గవ్యాజ్యం దధితక్రకమ్. 177

తా. ఇనుపభస్మము, శుద్ధిచేసినరసగంధకములు, తామ్రభస్మము-వీనిని సమభాగములుగ మర్దించి ఘటికాయంత్రములో నునిచి దానిని చింతమొదలగువానిక్షారములతో మూసి క్రమాగ్నులతో నొకదినము వండి సాంగశీతలమున దీసి మర్దించి వడ్లగింజంతను శర్కరతో గాని, నేతితో గాని, సాయంప్రాతఃకాలముల సేవింపుచుండిన సర్వవాతవికారములు, వాతగ్రంథులు, ధాతుశోష, అతిసారము, రసవైకృతము, ౧౮ కుష్ఠువులు-వీనిని హరింపజేయును. ఆవునెయ్యి, ఆవుపెరుగు, ఆవుచల్ల-వీనిని పథ్యమునం దునిచికొనవలయును.

### సువర్ణకరణవిధి

హేమగైరికసంయుక్తం సమాంశం గంధకం రసం,
దేవదాలీరసేనైవ తారం భవతి కాంచనమ్. 178

తా. బంగారు, కావిరాయి-ఇవి దినుసుకొక్కొకభాగము, శుద్ధిచేసినరసగంధకములు దినుసుకు ౨ భాగములు-ఇటుల వీనిని ఖల్వములో నునిచి దావరడంగిరసముతో మర్దించి వెండిపై లేపనముచేసి పుటంబిడిన బంగార మగును.

సూతకేనసమాయుక్తం ధాత్రీగంధకసంయుతం,
సంవత్సరప్రయోగేణ చిరాయుః పురుషో భవేత్. 179

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసిన నెల్లికాయగంధకము - ఈరెంటిని మర్దించి పుటంబిడిన రసభస్మం బగును. ఈరసభస్మమును నొకవత్సరము సేవింపుచుండిన నరుఁడు దీర్ఘాయువు గలవాఁ డగును.

తారం సుగంధంసహషోడశాంశం శుల్బంభవేత్సూర్యశశాంకవర్ణం,
మయూరకేణ సంయుక్తం పాండురోగం వినాశయేత్. 180

మహాకాలాయసంయుక్తం హరేత్కుష్ఠాన్యశేషతః,

తా. రజతభస్మము, శుద్ధిచేసిననల్లగంధకము - ఇవిసమభాగములు - ఈరెంటికి ౧౬ వ భాగము తామ్రభస్మము గలిపి మర్దించి పుటంబిడిన సూర్యచంద్రవర్ణతుల్యంబుగ నగును. దీనిని బ్రహ్మమేడిచూర్ణముతోఁగలిపి భక్షించిన పాండువును, మహామునిశిచెక్క-చూర్ణముతోడఁజేర్చి భక్షించిన కుష్ఠువులును హరించును.

శుల్బస్య గగనస్యాపి హేమధాతో రథాపి వా, 181
సమాంశం పిష్టకం కృత్వా అంధమూషా నివేశితం,
నింబపంచాంగసంయుక్తం కుష్ఠ మౌదుంబరం జయేత్. 182
శశిరేఖాసమాయుక్తం కల్పాయుర్జాయతే నరః. 183

తా. తామ్రభస్మము, అభ్రకభస్మము, సువర్ణభస్మము- వీనిని సమభాగములుగ నూరి ముద్దజేసి అంధమూషలో నునిచి పుటంబిడి వేపసమూలాను పానముతోడ భక్షించిన ఔదుంబరకుష్ఠమును హరింపఁజేయును. మఱియు దీనిని తిప్పసత్తుతోడ భక్షించిన నొక కల్పకాలమువఱకు జీవించును.

### గంధకరసాయనము

శుద్ధోబలిర్గోపయసావిభావ్య తతశ్చతుర్జాతగుడూచికాభిః,
పథ్యాక్షధాత్ర్యౌషధభృంగరాజైర్భావ్యోఽష్టవారంపృథగార్ద్రకేణ.
సిద్ధేసితాంయోజయతుల్యభాగాంరసాయనంగంధకసంజ్ఞితంస్యాత్,
ధాతుక్షయం మేహగణాగ్నిమాంద్యం శూలంతథాకోష్ఠగతాంశ్చరో
కుష్ఠాన్యథాష్టాదశభేదవంతి నివారయత్యేవచ రాజయోగం, [గాన్.
కర్షోన్మితం సేవితమేతి మర్త్యో వీర్యంచపుష్టిం బలవాన్ ప్రదీప్తిమ్. 186
వమనం రేచనం పూర్వం శుద్ధించైవ సమాచరేత్,
జాంగలానితు మాంసాని ఛాగలాని ప్రయోజయేత్. 187
(ఆయుర్వేదే)

తా. ఆవుపాలతో శుద్ధిచేయఁబడిన గంధకమును చాతుర్జాతకములు, తిప్పతీఁగె, కరక్కాయ, గచ్చపలుకులు, ఉసిరికవరుగు, శొంఠి, గుంటగలగర, అల్లము అను వానిరసములలో ప్రతిదానిచే నెనిమిదేసిమార్లు భావనజేసి పిదప దానికి సమముగ పంచదార గలిపిన గంధకరసాయన మనంబడును. దీని కర్షప్రమాణము సేవించిన ధాతుక్షయము, సర్వమేహములు, అగ్నిమాంద్యము, శూల, కోష్ఠగతోపద్రవములు, సర్వకుష్ఠువులు మొదలగు బలిష్ఠమైన రోగముల హరింపంజేయుటయేగాక పరాక్రమము, పుష్టి,

బలము-వీనిని సహా గలుగంజేయును. మఱియు నీరసాయనము నిచ్చుటకుముందు వమన, రేచనముల కొసంగవలయును. మఱియు జాంగలమాంసమును, మేకమాంసమును, భోజనమునందు జేర్చికొనవలయును.

యావనాళంచ తక్రంచ వ్యంజనం తైలపాచితం,
దుగ్ధం మాహిషసర్పిశ్చ లవణంచ వివర్జయేత్. 188
తథా తీక్ష్ణకషాయాంశ్చ కాంజికం కేవలం తథా,
అత్యుష్ణంచాతిశీతంచ నసేవేత కదాచన. 189
యవాన్నం క్షుద్రధాన్యాని విషమాన్నం వ్యవాయకం,
సంజాతంచ పతేద్వీర్యం తస్మాత్సర్వం పరిత్యజేత్. 190
స్త్రియం యానాధిరోహంచ వహ్నించైవాతపం తథా,
యదిదం పరమం గుహ్యం తతః ప్రీత్యా మయోదితమ్. 191
గోపనీయం ప్రయత్నేన నదేయం యస్యకస్యచిత్,
అమృతంచ తథాచైవ శుద్ధం కృత్వాతు గంధకమ్. 192
అమృతం విధిసంయుక్తం విధిహీనంచ తద్విషం,
యస్తు వై భక్షయేన్మోహా త్సాధక స్సిద్ధికాంక్షయా. 193
సమూఢో గంధకం ప్రాప్య క్షిప్రం పశ్యే ద్యమాలయం,

తా. పై యోగములను సేవించునపుడు జొన్నలు, మజ్జిగ, నూనెతో చేయఁబడిన పదార్థములు, బఱ్ఱెపాలు, బఱ్ఱెనెయ్యి, లవణము, తీక్ష్ణద్రవ్యములు, కషాయద్రవ్యములు, కలి, అత్యుష్ణము, అతిశీతలముగలద్రవ్యములు, యవాన్నము, క్షుద్రధాన్యములు, విషమాన్నము,*వ్యవాయికద్రవ్యములు, స్త్రీసంపర్కము, వాహనము, అగ్ని, ఎండ అనువానిని వర్జింపవలయును. ఇట్లుజేయనియెడల శుక్రమునష్టంబగును. ఓపార్వతీ! ఇట్టి మహారహస్యముగల యీయోగములను ప్రీతివలన నీకు నేను వచించితిని. కావున దీని నెవ్వరికింజెప్పక రహస్యముగనుంచు కొనుము. క్రమముగ శుద్ధిచేయఁబడిన గంధకమును సేవించిన అమృతప్రాయంబగును. విధివిహీనముగ సేవించిన విషతుల్యం బగును. గంధకభక్షణ యందిచ్ఛగలవాఁడు అజ్ఞానమువలన దానిని విధివిహీనముగ భక్షించిన యమాలయంబున కేగును.

గంధకస్య పలం న్యస్య సూతకస్య పలం తథా. 194
నాగస్యతు పలంచైవ టంకణస్య పలం తథా
కన్యాపలత్రయం చైవ విషాణస్య పలత్రయమ్. 195

* వ్యవాయికద్రవ్యములన-గంజావి యాకు, నల్ల మందు మొదలగునవియ.

ద్విసప్తకా ద్విశేషేణ షణ్మాసాత్తు ప్రజాయతే,
దివ్యదృష్టిః ప్రవర్తేత జీవే దాచంద్రతారకమ్. 196

తా. శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసినరసము, నాగభస్మము, వెలిగారము - ఇవి దినుసుకొక్కొకపలము, కలబంద 3 పలములు, దుప్పికొమ్ముభస్మము 3 పలములు ఇటుల వీని నేకముజేసి ౧౪ దినములు భక్షించిన సర్వకుష్ఠువులు హరించును. మఱియు దీనిని ౬ మాసములు భక్షించిన దివ్యదృష్టిగలవాడై చంద్రసూర్యులుండువఱకు జీవించును.

గంధకం త్రిఫలాయుక్తం మధురత్రయమిశ్రితం,
భక్షయే త్ప్రాతరుత్థాయ వలీపలితశాంతయే. 197

తా. శుద్ధిజేసిన గంధకముతో త్రిఫలచూర్ణముగలిపి పంచదార, తేనె, నెయ్యి అనువాని యనుపానముతో ప్రాతఃకాలమున సేవించిన వలీపలితములు హరించును.

### కుష్ఠువులయందు పథ్యము

శాలీయ యవ గోధూమా శ్శ్యామాకాశ్చ ప్రియంగవః,
ముద్గా మసూరా స్తువరీ తిక్తశాకాని జాంగలమ్. 198
వరాపటోల ఖదిర నింబశ్చ బృహతీఫలం,
కస్తూరీ గంధసారశ్చ కుంకుమంచ సరామఠమ్. 199
యథాదోషం సమస్తాని పథ్యాన్యేతాని కుష్ఠినాం,
(మాధవనిదానే)

తా. ప్రాతవడ్లు, యవలు, గోధుమలు, చామలు, కొఱ్ఱలు, పచ్చపెసలు, చిఱుసెనగలు, కందులు, చేదుగలకూరలు, జాంగలమాంసము, పిల్లపీచర, పొట్లకాయ, చండ్ర, వేపపువ్వు, నేలములకపండ్లు, కస్తూరి, చందనము, కుంకుమపువ్వు, ఇంగువ-ఇవి కుష్ఠువులయందు దోషానుగుణ్యముగ పథ్యకరంబులు.

### కుష్ఠువులయం దపథ్యము

అన్నపానం హితం కుష్ఠే నత్వమ్లలవణోషణమ్. 200
దధి దుగ్ధగుడం సూప తిలమాషాం స్త్యజేన్నరః,

తా. పులుసు, ఉప్పు, కారము గలయన్నపానములు, పెరుగు, పాలు, బెల్లము, పప్పు, నువ్వులు, మినుములు-ఇవి కుష్ఠురోగమునం దపథ్యకరంబులు.

### విసర్పనిదానము

లవణామ్ల కటూష్ణాది సంసేవా దోషకోపతః. 201
విసర్ప స్సప్తధా జ్ఞేయ స్సర్వతః పరిసర్పణాత్, (మాధవనిదానే)

తా. ఉప్పు, పులుసు, కారము, ఉష్ణము మొదలగుపదార్థముల సేవించుటవలన వాతాదిదోషములు ప్రకోపించి ఏడువిధములైన విసర్పరోగముల గలుగంజేయును. ఇది సర్వశరీరమునందు వ్యాపించుటచే విసర్ప మనంబడును.

రక్తం లసీకా త్వఙ్మాంసం దూష్యం దోషాస్త్రయో మలాః. 202
విసర్పాణాం సముత్పత్తౌ విజ్ఞేయా స్సప్తధాతవః,

తా. రక్త, రస, త్వఙ్మాంసములు, వాత పిత్త శ్లేష్మములు దుష్టంబు లగుటవలన సప్తధాతువులయందు విసర్పరోగము జనించును.

వాతవిసర్పలక్షణము

వాతాత్కుళుత్థ సదృశా స్ఫోటాస్స్యుశ్చాగ్నిదగ్ధవత్. 203
సంజ్ఞానాశో వ్యథా శోషో నిద్రాతిశ్వాసకజ్వరాః,
యథా వాతజ్వరే చిహ్నం తథా వాతవిసర్పకే. 204
విరేచ వమనంచైవ లేపనా సృగ్విమోక్షణైః, (మాధవనిదానే)

తా. ఉలవలతో సమానముగ పొక్కులు గలిగి కాలినట్టు లుండుట, ప్రజ్ఞలే కుండుట, వేదన, శోష గలుగుట, మిక్కుటముగ నిదుర, ఉబ్బసము, జ్వరము, వాతజ్వరచిహ్నము గలుగుట - ఈలక్షణములు గలది వాతవిసర్పియని తెలియవలయును. దీనియందు రేచన, వమనముల గొసంగుటయేగాక లేపనములను, జలగలవలన రక్తస్రావమును జేయింపవలయును.

పైత్తవిసర్పలక్షణము

పిత్తాత్పిత్తజ్వరే యస్య చిహ్నం ద్రుతగతిస్తథా. 205

తా. పిత్తజ్వరలక్షణంబులన్నియుం గలిగి పిత్తధాతువు తీవ్రముగ నడుచుచుండిన పైత్తవిసర్పియని తెలియవలయును.

శ్లేష్మవిసర్పలక్షణము

కఫాత్కండూయతస్నిగ్ధః కఫజ్వరసమానరుక్,

తా. దురద, మెఱుపు, శ్లేష్మజ్వరలక్షణములు గలిగియుండిన శ్లేష్మవిసర్పి యని తెలియవలయును.

సన్నిపాతవిసర్పలక్షణము

సన్నిపాతసముత్థశ్చ సర్వరూపసమన్వితః. 206

తా. వాత, పిత్త, శ్లేష్మవిసర్పిలక్షణంబు లన్నియుం గలది సన్నిపాతవిసర్పి యని తెలియవలయును.

## కర్దమవిసర్పలక్షణము

కఫపిత్తాజ్జ్వర స్తంభో నిద్రా తంద్రా శిరోరుజః,
అంగావసాద విక్షేప ప్రలాపారోచక భ్రమాః. 207
మూర్ఛాగ్నిహానిర్భేదోస్థ్నాం పిపాసేంద్రియగౌరవం,
ఆమోపవేశనం లేప స్స్రోతసాం సవిసర్పతి. 208
ప్రాయేణామాశయం గృహ్ణా నైకదేశం నచాతిరుక్,
పిండకైరివకీర్ణోతి పీతలోహితపాండురైః. 209
స్నిగ్ధోసితో మేచకాభో మలినశ్శోథవాన్ గురుః,
గంభీరపాకః ప్రాజ్యోష్మా స్పృష్టః క్లిన్నోవదీర్యతే. 210
పంకవచ్ఛీర్ణమాంసశ్చ స్పష్టస్నాయుసిరాగణః,
శవగంధిశ్చవీసర్పః కర్దమాఖ్య మథశంతి తమ్. (సిద్ధరసార్ణవే) 211

తా. కఫ, పిత్తములవలన తాపము గలుగుట, శరీరము స్తంభించుట, నిద్ర, తంద్ర, తలనొప్పి, శరీరమున బడలిక గలుగుట, కాళ్ళు చేతు లీడ్చుట, తలుచుగ వదరుట, అరుచి, భ్రమ, మూర్ఛ, అగ్నిమాంద్యము గలుగుట, ఎముకలు పగిలినటుల నొచ్చుట, దప్పి, ఇంద్రియములయందు జడత్వము గలుగుట, ఆమముపడుట, ముఖాదిస్రోతస్సులయందు కఫము నిండి లేపనము జేయంబడినటు లుండుట, ఆమాశయముపై జనించి కడువేదనారహితంబై పసపు, ఎఱుపు, తెలుపువర్ణముగల మొటిమలతో గూడినదై సర్వశరీరమునందు వ్యాపించియుండుట, మెఱయుచు నల్లనై నెమలికన్నుల యొక్కవర్ణముగలదై మలయుక్తమై వాపు, జడత్వము అనువానితో గూడియుండుట, లోనం బండుట, మిక్కుటముగ యూష్మముగలిగియుండుట, అదిమినతోడనే చెమ్మగలుగుట, చిట్లిన ట్టుండుట, బురదవలెనే మాంసము శిథిలంబై సిరాస్నాయువులు తెరచికొనియుండుట, పీనుగవాసన వేయుట - ఈలక్షణములు గలది కర్దమవిసర్పి యని తెలియవలయును.

## గ్రంథివిసర్పలక్షణము

కఫేన రుద్ధః పవనః భిత్వా తం బహుధా కఫం,
రక్తంవా వృద్ధరక్తస్య త్వక్సిరాస్నాయుమాంసగమ్. 212
దూషయిత్వాచ దీర్ఘాణు వృత్తస్థూలఖరాత్మనాం,
గ్రంథీనాం కురుతే మాలాం రక్తానాం తీవ్రరుగ్జ్వరామ్. 213
శ్వాసకాసాతిసారస్య శోష హిక్కా వమి భ్రమైః,

మోహావైవర్ణ్యమూర్ఛాంగ భంగాగ్నిసదనైర్యుతామ్. 214
ఇత్యయం గ్రంథివీసర్పః కఫమారుతకోపజః, (పూజ్యపాదీయే)

తా. స్వకారణమువలన ప్రకోపించినకఫముచే నడ్డగింపఁబడిన వాతము కఫమునుగాని, లేక వృద్ధిబొందినరక్తముగాని భేదించి చర్మము, సిరలు, స్నాయువులు, మాంసము అనువానిఁజెందించి దోషయుక్తముగ జేసి పొడవుగ, చిన్నదిగ, గుండ్రముగ, లావుగ, గరగరగ, ఎఱ్ఱగనుండు గ్రంథులసరమును గలుగంజేయుట, వానియందు మిక్కుటమైనశూల, బలమైనజ్వరము, శ్వాసము, దగ్గు, అతిసారము, నోరెండుట, ఎక్కిళ్ళు, వాంతి, భ్రమ, భ్రాంతి, వైవర్ణ్యము, మూర్ఛ, ఒడలువిరుపు, అగ్నిమాంద్యము గలుగుట-ఈలక్షణములుగలది గ్రంథివిసర్పియని తెలియవలయును. ఇది కఫవాతప్రకోపమువలన జనించును.

## అగ్నివిసర్పలక్షణము

వాతపిత్తాజ్జ్వరచ్ఛర్ది మూర్ఛాతీసారతృడ్భ్రమైః. 215
అస్థిభేదాగ్నిసదన తమకారోచకైర్యుతః,
కరోతి సర్వమంగంచ దీప్తాంగారావకీర్ణవత్. 216
యంయందేశం విసర్పశ్చ విసర్పతి భవేచ్చ సః,
శాంతాంగారాసితో నీలో రక్తోవాశూపచీయతే. 217
అగ్నిదగ్ధఇవస్ఫోటైః శీఘ్రగత్వా ద్రుతంచ సః;
మర్మానుసారీ విసర్ప స్స్యాద్వాతోఽతిబలస్తతః. 218
వ్యథేతాంగం హరేత్సంజ్ఞాం నిద్రాంచ శ్వాసమీరయేత్,
హిక్కాంచ సతతోఽవస్థా మీదృశీం లభతే నరః. 219
క్వచిచ్ఛర్మా రతిగ్రస్తో భూమిశయ్యాసనాదిషు,
చేష్టమానస్తతఃక్లిష్టో మనోదేహసముద్భవామ్. 220
దుర్బోధా మశ్నుతే నిద్రాం సోఽగ్నివీసర్పఉచ్యతే,
(ఆయుర్వేదే)

తా. వాతపిత్తమువలన గలిగిన విసర్పమునందు జ్వరము, వాంతి, మూర్ఛ, అతిసారము, దప్పి, ఒడలువిరుచుట, ఎముకలువిరిగినటుల నొచ్చుట, అగ్నిమాంద్యము, నేత్రములయందు మబ్బు, అన్నద్వేషము అనునవి గలుగును. దానిసంబంధమువలన సర్వశరీరముపై నిప్పులుపోసినటులుండుట, విసర్పి వ్యాపించుచుండుస్థలమున నల్లగ, నీలముగ, ఎఱ్ఱగనుండునదై త్వరితముగ వాపుగలుగుట, అగ్నిదగ్ధమైనటుల పైన బొబ్బలు

లేచి శీఘ్రగతిగలదై కడుతీవ్రముగ హృదయమునుజెందుట, లేక వాతము కడుబలిష్ఠం బగుటవలన శరీరమున వ్యథను గలుగంజేయుట, సంజ్ఞను నిద్రను నశింపంజేయుట, శ్వాసమును వృద్ధిపఱచుట, ఎక్కిళ్ళుగలుగుట, భూమిమీఁదగాని, లేక పడకమీఁదగాని గూర్చుండినను సుఖముగలుగకుండుట, సంచారమువలన క్లేశముగలుగుట, మనోదేహ ములకు క్లేశమువలనగలిగెడు దుర్బోధనిద్ర (అనగా మరణరూపకమైననిద్ర) ప్రాప్తం బగుట - ఈలక్షణములుగలది అగ్నివిసర్పియని తెలియవలయును.

### క్షతవిసర్పలక్షణము

బాహ్యహేతోః క్షతాత్క్రుద్ధ స్సరక్తం పిత్తమీరయన్. 221
విసర్పం మారుతః కుర్యా త్కుళుత్థసదృశై శ్చితం,
స్ఫోటై శ్శోథ జ్వర రుజా దాహాఢ్యం శ్యావశోణితమ్. 222

తా. బాహ్యకారణమువలన గాయముగలిగి దానివలన వాతము ప్రకోపించి రక్తసహితపిత్తమును వ్రణమునందుజేర్చి విసర్పమును గలుగంజేయుట, దానిపై ఉలవ లతోసమానమైన శ్యామలవర్ణముగల కురుపులు, వాపు గలుగుట, జ్వరమువచ్చుట, శూల, దాహముగలుగుట, రక్తము, శ్యామలవర్ణముగనుండుట - ఈలక్షణములు గలది క్షతజవిసర్పి యని తెలియవలయును.

### విసర్పోపద్రవములు

జ్వరాతిసార వమథు స్త్వఙ్మాంసదరణం క్లమః,
అరోచకా విపాకౌచ విసర్పాణా ముపద్రవాః. 223

తా. జ్వరము, అతిసారము, వాంతి, దప్పి గలుగుట, మాంసము పగులుట, అనా యాసముగ శ్రమ, అరుచి గలుగుట, అన్నము జీర్ణముగాకుండుట అనునవియ విసర్పి రోగపద్రవంబులు.

### విసర్పసాధ్యాలక్షణము

సిధ్యంతి వాతకఫపిత్తకృతా విసర్పా
స్సర్వాత్మకః క్షతకృతశ్చ నసిద్ధిమేతి,
పిత్తాత్మకోఽంజనవపుశ్చ భవే దసాధ్యః,
కృచ్ఛ్రాశ్చ మర్మసు భవంతి హి సర్వఏవ. 224

తా. వాత, పిత్త, కఫములవలన గలిగిన విసర్పము సాధ్యము. సన్నిపాత, క్షత ములవలన గలిగినవిసర్పము అసాధ్యము; పిత్తమువలనగలిగిన విసర్పములో ఒడలు నల్లగ నగుటవలన నసాధ్యంబు. మర్మస్థానమునగలుగు సర్వవిసర్పులు కష్టసాధ్యంబులు.

అంతర్బహిశ్చ విస్ఫోటై ర్విసర్పి స్స్యాన్న ద్విసర్పణాత్,
సామాన్యం తస్య సంస్థానం సజ్వర శ్శోభ దాహరుక్. 225
అంతఃకృచ్ఛ్రో౽బహిస్సాధ్యో దుశ్చికిత్సో౽న్య ద్వారాశ్రయం,

(ఆయుర్వేదే)

తా. లోపల, వెలుపల పొక్కులు వ్యాపించుటవలన విసర్పి యనంబడును. దీని యందు జ్వరము, వాపు, దాహము, వేదన గలిగియుండుట సామాన్యలక్షణము, లోనం బుట్టిన విసర్పి కష్టసాధ్యము. వెలపటజనించిన విసర్పిసాధ్యము. లోన, వెలపట జనించినది యసాధ్యము.

### విసర్పులకు కాలాగ్నిరుద్రరసము

సూత కాంతాభ్ర తీక్ష్ణానాం భస్మమాక్షిక గంధకమ్. 226
వంధ్యా కర్కోటకీద్రావై స్తుల్యం మర్ద్య దినావధి,
వంధ్యా [1]కర్కోటకీ కందే క్షిప్త్వా లేప్యం మృదా బహిః. 227
భూధరాఖ్యే పుటే పాచ్యం దినైకం తద్విచూర్ణయేత్,
దశమాంశం విషం యోజ్యం మాషమాత్రంతు భక్షయేత్. 228
రసః కాలాగ్నిరుద్రో౽యం దశాహేన విసర్పనుత్,
పిప్పలీ మధుసంయుక్త మనుపానం ప్రకల్పయేత్. 229

(మాధవనిదానే)

తా. రసభస్మము, కాంతభస్మము, అభ్రకభస్మము, ఉక్కుభస్మము, శుద్ధిజేసిన హేమమాక్షికము, శుద్ధిజేసినగంధకము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గొడ్డుకాకరాకురసముతో నొకదినము మర్దించి ముద్దజేసి మధ్యమున ఛిద్రము జేయఁబడిన గొడ్డుకాకరగడ్డలో నునిచి దానిపై చీలమన్ను లేపనము జేసి యొకదినము భూధరపుటంబిడి సాంగశీతలమున దీసి ఖల్వములో నునిచి చూర్ణముజేసి దానికి పదియవ భాగము శుద్ధిజేసిననాభిని గలిపి మర్దించి మాషప్రమాణమును పిప్పలి, తేనె అనువాని యనుపానముతోడ పదిదినములు సేవించిన వాతవిసర్పి హరించును.

### పైత్తవిసర్పికి ప్రపౌండరీకాదిలేపనము

ప్రపౌండరీక మంజిష్ఠా పద్మకోశీర చందనైః,
[2]మేషశృంగీ సమంయష్టీ క్షీరమిశ్రం ప్రలేపయేత్. 230

---

1 కర్కోటికాం పిష్ట్వా స్థాప్యం లేప్యం మృదా బహిః.

2 సయష్టీందీవరైః పిత్తే క్షీరపిష్టైః ప్రలేపనమ్.

దినసప్తప్రయోగేణ విసర్పం పైత్తికం హరేత్, (శారీరే)

తా. అంతరదామర, మంజిష్ఠ, పుష్కరమూలము, వట్టివేరు, శ్రీగంధము, ఒద్ది, యష్టిమధుకము - వీనిని సమభాగములుగ పాలతోనూరి యేడుదినములు శరీరమున లేపనముజేసిన పిత్తవిసర్పి హరించును.

క. చందనమును జమ్మాకును,చందనమును గూడపాల సద్యోఘృతముగా
పొందించి త్రాగి యలందిన,సందియమును లేదు వేవిసర్పులు మానున్.

శ్లేష్మవిసర్పికి మదనాదిచూర్ణము

మదనం మధుకం నింబం వత్సకస్య ఫలానిచ. 231
*అనేన వమనం దేయం విసర్పే కఫసంభవే, (మాధవనిదానే)

తా. మ్రంగ, ఇప్ప, వేము, కొడిసెకాయ, - వీనిని సమముగ చూర్ణముజేసి వమనమునకొసంగిన శ్లేష్మవిసర్పులు హరించును.

శ్లేష్మపిత్తవిసర్పికి వారిసాగరరసము

శుద్ధసూతం విషం గంధం మృతాభ్రం టంకణం శిలామ్. 232
ముసలీం హయమారంచ ప్రత్యేకంచ విమర్దయేత్,
ద్విగుంజం భక్షయే న్నిత్యం శ్లేష్మపిత్తవిసర్పనుత్. 233
దురాలభా పర్పటికం పటోలం కటుకీ తథా,
త్రిఫలా గుగ్గులూం తుల్యం కషాయ మనుపాయయేత్. 234
(సిందూరమణిదర్పణే)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసిననాభి, శుద్ధిచేసినగంధకము, అభ్రకభస్మము, వెలిగారము, శుద్ధిచేసినమణిశిల - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి తాటిగడ్డల రసముతో నొకదినము, గన్నేరురసముతో నొకదినము మర్దించి ౨ గురిగింజలయెత్తును దురదగొండి, పర్పాటకము, చేతిపొట్ల, కాకర, త్రిఫలములు, శుద్ధిచేసిన గుగ్గిలము - వీనిని సమభాగములుగ దంచి కషాయము గాచి ఈయనుపానముతోడ సేవించిన శ్లేష్మపిత్తవిసర్పులు హరించును.

శ్లేష్మవాతవిసర్పికి చికిత్స

సూతం గంధం దగ్ధశంఖం మాక్షికంచ శిలాజతు,
ద్వినిశాచామృతాచైవ తుల్యాంశం నీలికారసైః. 235
మధ్వాజ్యాభ్యాం సహాపేష్యం విసర్పే లేపయేత్తథా,

* వమనంచ విధాతవ్యం విసర్పే కఫపిత్తజే.

దేయః కాలాగ్నిరుద్రోత్ర రసం గుంజాద్వయం హితమ్. 236
పటోల త్రిఫలా నింబం మధునా లేహయేదను,

తా. రసము. గంధకము, కాల్చినశంఖము, హేమమాక్షికము, శిలాజిత్తు, పచ్చిపసపు, మ్రానిపసపు, తిప్పతీఁగె - వీనిని సమభాగములుగ ఖల్వములోనుసిచి నీలియాకురసము, తేనె, నెయ్యి అనువానితో మర్దించి విసర్పియందు లేపనముజేయుట యేగాక రెండుగురిగింజలయెత్తు కాలాగ్నిరుద్రరసమును చేదిపొట్లవిత్తులు, త్రిఫలములు, వేపచిగుళ్ళు - వీనిని తేనెతోనూరి యీయనుపానముతోడ సేవించిన శ్లేష్మవాతవిసర్పులు హరించును.

## వాతపిత్తవిసర్పికి గుళూచ్యాదిలేపము

గుళూచీ పిచుమందాంబు బదరేంద్రయవాంబుదాః. 237
విస్ఫోటం నాశయంత్యాశు వాయుపిత్తవిసర్పకం,

తా. తిప్పతీఁగె, వేము, కురువేరు, రేగు, కొడిసెపాల, తుంగముస్తెలు - వీనిని సమభాగములుగ నూరి లేపనముజేసి విస్ఫోటకము, వాత, పిత్త, విసర్పులు హరించును.

## విసర్పమునకు శోభాంజనాదిలేపము

శోభాంజనం గంధమూలం లవణం కాంజికైస్సహ. 238
లేపాత్స్నాయుగతం హంతి విసర్ప మతిదుస్సహం,

తా. మునగచెక్క, కురువేరు, ఉప్పు - వీనిని కలితోనూరి శరీరమున లేపనము జేసిన కడుదుస్సహమైన స్నాయుగతవిసర్పిని హరింపజేయును.

## సన్నిపాతవిసర్పమునకు చికిత్స

రసః కాలాగ్నిరుద్రోఽత్ర మధుమాగధిమిశ్రితమ్. 239
పటోల నింబవాసాశ్చ సప్తపర్ణి ఫలత్రికం,
గుళూచీ కటుకీ ముస్తా ఏభిస్సంపాచయేద్ఘృతమ్. 240
పానాచ్చ లేపనా ద్ధంతి సవిస్ఫోటం విసర్పకం,

తా. కాలాగ్నిరుద్రరసమును తేనె, పిప్పలితో సేవించినను, లేక చేదిపొట్ల, వేము, అడ్డసరము, ఏడాకులయరటిగడ్డ, త్రిఫలములు, తిప్పతీఁగె, కాకర, తుంగముస్తెలు అనువానిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి నేతిలోఁగలిపి వండి సేవన, లేపనముల జేయుచుండినను బొబ్బలతోఁగూడియుండు విసర్పి హరించును. (శ్రీగంధము, చందనపుచూర్ణము, గూడపాలగంధము, జమ్మియాకురసము, ఆవునెయ్యి - వీనిని సమముగ

గలిపి అందు సగమును పానముజేసి తక్కినసగమును శరీరమున లేపనముజేసిన సర్వ విసర్పులు హరించును.)

విసర్పోపచారక్రమము

తత్ర వై శోధనం శస్తం తథా శోణితమోక్షణమ్. 241
ప్రశస్తం సర్వవిసర్పా పర్ణినాం వా చతుష్టయం,
బలాత్రయంవా సఘృతం పానలేపనసేచనైః. (అశ్వనీనిఘంటౌ)

తా. పైజెప్పఁబడిన సర్వవిసర్పులయందు వమన, విరేచనములు, రక్తస్రావము జేయించుట ప్రశస్తము; మఱియు కోలపొన్న, ముయ్యాకుపొన్న, కారుపెసలు, కారు మినుములు వీనిని సమముగ కషాయముగాచి అందావుసెయ్యి గలిపిగాని, లేక *బలాత్రయమును కషాయముగాచి అందావుసెయ్యిగలిపిగాని, సేవన, లేపన, సేచనములు జేయుచుండిన సర్వవిసర్పులు హరించును.

పక్వేతు వ్రణనిర్దిష్టాం చికిత్సాం కారయేద్భిషక్. 243

తా. విసర్పులు పక్వంబులైన వైద్యుఁడు వ్రణచికిత్సం జేయవలయును.

ప్రపున్నాటాదిలేపము

ప్రపున్నాటబీజం నిశానింబపత్రం నవంవైకపాలం తథైవాభయా చ,
స్నుహీపత్రతోయేనపిష్ట్వాప్రలేపః క్షణాద్దేహదద్రూవిసర్పాపహంతా.

తా. తగిరిసెవిత్తులు, పసపు, వేపాకు, క్రొత్తచిల్లపెంకులు, కరక్కాయలు - వీనిని జెముడాకురసముతోనూరి (పటుదామెరపైన) మంగలకత్తితోగీచి లేపనముజేసిన పటుదామెర, దద్రువు, విసర్పులు తత్క్షణమున హరించును.

(శొంఠి, మిరియాలు, నల్లేరు, తేనె, నువ్వులు, ఆవాలు, తగిరిసెవిత్తులు, ఓమము, వెల్లుల్లి, పంచదార - వీనిని సమభాగములుగ నుదకముతోనూరి పటుదామెరను రేగగోకి దానిపై లేపనము జేసినను, లేక నాగమల్లెవేరును నిమ్మపండ్లరసముతో గంధము దీసి లేపనముజేసినను, లేక పటుదామెరను మంగలకత్తితో రేగగోకి బీట్లవేరును కలితో గంధముదీసి లేపనముజేసినను, లేక రేలకొనలు, వెల్లుల్లి, చిన్నంగివేరు, కరక్కాయ, మైలుతుత్థము - వీనిని నిమ్మపండ్లరసముతో గంధముదీసి పటుదామెరను రేగగోకి లేపనముజేసినను, లేక ముప్పాతికయెత్తు తగిరిసెవిత్తులను, ముప్పాతికయెత్తు కరకపప్పును, నీరు కలియని ఒకసేరు బఱ్ఱెపాలలో మూడుదినములు నానబెట్టి యందరతులము మణిశిల,

---

* బలాత్రయమన - ముత్తవపులగము, పెదముత్తవపులగము, నాగబలయనునవి.

ముప్పాతికయెత్తు బెల్లము గలిపి భాగుగనూరి సేగగోకి పటుదామెరపై లేపనముజేసినను, పటుదామెర మానును. ఈక్రియల నొకమండలమువఱకు జేయవలయును.

విసర్పమునందు పథ్యము

పురాణ యవ గోధూమ కంగు షష్టికశాలయః,
ముద్గా మసూరా శ్చణకా స్తువర్యో జాంగలోరసః. 245
నవనీతం ఘృతం ద్రాక్షా దాడిమం కారవేల్లకం,
వేత్రాగ్రం కులకం ధాత్రీ ఖదిరో నాగకేసరః. 246
ద్రాక్షా శిరీష కర్పూరం చందనం తిలలేపనం,
యథాదోషం పథ్యమిదం సేవితవ్యం విసర్పిభిః. (మాధవనిదానే)

తా. ప్రాతయవలు, గోధుమలు, కొఱ్ఱలు, ౬౦ దినములకు ఫలించెడివడ్లు, పెసలు, చిరుసెనగలు, కందులు, జాంగలమాంసరసము, వెన్న, నెయ్యి, ద్రాక్షపండు, దాడిమపండు, కాకరకాయ, వెదురుగొమ్ము, చిట్టితుమికికూర, ఉసిరికపండు, చండ్ర, నాగకేసరములు, ద్రాక్ష, దిరిసెనము, కర్పూరము, చందనము, నువ్వులు అనువానిలేపనము దోషానుగుణ్యముగ విసర్పిరోగమునందు పథ్యకరంబులు.

విసర్పమునం దపథ్యము

వ్యాయామ మహ్నిశయనం సురతం ప్రవాతం
క్రోధం శుచం వమనవేగవిధారణంచ,
గుర్వన్నపాన మఖిలం లశునం కుళుత్థాన్
మాషాం స్తిలాన్ సకలమాంసమజాంగలంచ. 248
స్వేదం విదాహి లవణామ్ల కటూని మద్య
మర్కప్రభామపి విసర్పగదీ త్యజేత్తత్,

తా. సంచారము, పగలునిద్ర, మైధునము, గాలి, క్రోధము, దుఃఖము, వమన, మల మూత్ర వేగధారణము, జడాన్నము, జడకరమైనపానము, వెల్లుల్లి, ఉలవలు, మినుములు నువ్వులు, అరణ్యమునందలి సర్వజంతుమాంసము, చెమటదీయుట, విదాహకర ద్రవ్యములు, ఉప్పు, పులుసు, కారము, మద్యము, ఎండ - వీనిని విసర్పరోగములవారు వర్జింపవలయును.

సీ. వాయువిడంగ లవంగము లేలకుల్ జాపత్రి కాచును జాజికాయ
ప్రాతకొబ్బెరకడుంబాఱితబెల్లంబును బోఁకలు త్రికటంబువామపొట్టు
పిప్పలిమూలంబు వెసజీడిగింజలు గుల్లైనయట్టి యాఁకొడిసెపాల

యిన్నియుసమకూర్చియన్నియు సమభాగములు గూర్చి త్రొక్కియుఁ
గీ. లమరఁజేసియు మండలం బవనియందు [భోసఁగమాత్ర]
శ్వేతరోగంపుమనుజులు సేవఁజేసి
పరఁగఁ బథ్యంబు లుండినఁ బాఱిపోవుఁ
బ్రళయమేఘుని వాయువు తోలచునట్లు.

విస్ఫోటకనిదానము

కట్వమ్ల తీక్ష్ణోష్ణవిదాహి రూక్ష క్షారైరజీర్ణాధ్యశనాతపైశ్చ,
తథర్తుదోషేణ విపర్యయేణ కుప్యంతి దోషాః పవనాదయస్తు.
త్వచమాశ్రిత్య తే రక్త మాంసాస్థీని ప్రదూష్యచ,
ఘోరాన్ కుర్వంతి విస్ఫోటాన్ సర్వాన్ జ్వరపురస్సరాన్. 250

(మాధవనిదానే)

తా. కారము, పులుసు, తీక్ష్ణము, ఉష్ణము, విదాహము, రూక్ష, క్షారము గల రసముల సేవించుటవలనగాని, లేక అజీర్ణమువలనగాని, లేక అధికముగ భుజించుటవలన గాని, ఎండ ఋతువిపర్యయదోషము అనువానివలనగాని, వాతాదిదోషములు దుష్టంబులై చర్మము నాశ్రయించి రక్త, మాంసము, అస్థులం జెరచి కడుభయంకరమైన కురుపుల గలుగంజేసిన విస్ఫోటక మనంబడును. దానియందు జ్వరము గలిగియుండును. (సర్వవిస్ఫోటకములకు రక్తపిత్తములే ముఖ్యకారణంబులు.)

విస్ఫోటకస్వరూపము

అగ్నిదగ్ధనిభా స్ఫోటా స్సజ్వరా రక్తపిత్తజాః,
క్వచిత్సర్వత్రవా దేహే విస్ఫోటా ఇతి తే స్మృతాః. 251

తా. రక్తపిత్తమువలన గలిగిన సర్వవిస్ఫోటకములయందు తొలుత జ్వరముగలిగి అగ్నివలన గాల్చఁబడినట్టి కాంతిగల విస్ఫోటకములు శరీరముయొక్క నొకప్రదేశమునందుగాని, లేక సర్వశరీరమునందుగాని జనించును. దీనినే విస్ఫోటక మనియెదరు.

వాతవిస్ఫోటకలక్షణము

శిరోరుక్శూల భూయిష్ఠం జ్వర తృట్పర్వభేదనం,
సకృష్ణవర్ణతా చేతి వాతవిస్ఫోటలక్షణమ్. 252

తా. కపాలము నొచ్చుట, కురుపులయందు కడుశూలగలుగుట, జ్వరము, దప్పి గలుగుట, సంధులుపగిలినటుల నొచ్చుట, కురుపులు నల్లగ నుండుట - ఈలక్షణములు గలది వాతవిస్ఫోటక మని తెలియవలయును.

### పిత్తస్ఫోటకలక్షణము

జ్వర దాహ రుజా స్రావ పాక తృష్ణాభిరన్వితం,
పీత లోహిత వర్ణంచ పిత్తవిస్ఫోటలక్షణమ్. 253

తా. జ్వరము. దాహము, పోట్లు, స్రావము, పాకము, దప్పి గలుగుట పచ్చగ గాని, రేక ఎఱ్ఱగ గానియుండుట-ఈలక్షణములు గలది పిత్తవిస్ఫోటకమని తెలియవలయును.

### కఫవిస్ఫోటకలక్షణము

ఛర్ద్యరోచక జాడ్యాని కండూ కాఠిన్య పాండుతాః,
అవేదన శ్చిరాత్పాకీ సవిస్ఫోటః కఫాత్మకః. 254

తా. వాంతి, అరుచి, జడత్వము, దురద, కాఠిన్యముకలుగుట, తెల్లగనుండుట, అల్పవేదన, చిరకాలముమీఁద పాకము - ఈలక్షణములుగలది కఫవిస్ఫోటకమని తెలియవలయును.

### కఫపిత్తవిస్ఫోటకలక్షణము

కండూ ర్దాహో జ్వర శ్ఛర్ది రేతై స్తు కఫపైత్తికః. 255

తా. దురద, దాహము, జ్వరము, వాంతి గలిగిన కఫపిత్తవిస్ఫోటకమని తెలియవలయును.

### వాతపిత్తవిస్ఫోటకలక్షణము

వాతపిత్తకృతో యస్తు కురుతే తీవ్రవేదనాం,

తా. మిక్కుటముగ పోట్లుగలిగిన వాతపిత్తస్ఫోటకమని తెలియవలయును.

### కఫవాతవిస్ఫోటకలక్షణము

కండూ స్తైమిత్య గురుభి ర్జానీయా త్కఫవాతికమ్. 256

తా. దురద, స్తబ్ధత్వము, జడత్వముగలది వాతకఫవిస్ఫోటకమని తెలియవలయును.

### సన్నిపాతవిస్ఫోటకలక్షణము

మధ్యే నిమ్నోన్నతోఽంతేచ కఠినోఽల్పప్రపాకవాన్,
దాహ లాలా తృషా మోహ ఛర్ది మూర్ఛారుజో జ్వరః 257
ప్రలాపో వేపథు స్తంద్రాసోఽసాధ్యశ్చ త్రిదోషజః,

తా. మధ్యప్రదేశముపల్లముగ, చుట్టూ మిట్టగ, కఠినముగ గాని, లేక యొకింతపం డినట్టుగ గాని యుండిన త్రిదోషజవిస్ఫోటకమని తెలియవలయును. దానిసంబంధమువలన దాహము, జొల్లుగారుట, దప్పి, మోహము, ఓకర, మూర్ఛ, పోట్లు, జ్వరము, తఱు చుమాటలు, కంపము, మబ్బు అనునవి గలుగును. ఈవిస్ఫోటక మసాధ్యము.

### రక్తజ విస్ఫోటకలక్షణము

రక్తారక్తసముత్థానా గుంజా ఫలనిభా స్తథా. 258
వేదితవ్యాస్తు రక్తేన పైత్తికేనచ హేతునా,
నతే సిద్ధిం సమాయాంతి సిద్ధైర్యోగశతైరపి. 259

తా. గురిగింజవలె నెఱ్ఱనై పిత్తదోషయుక్తంబై రక్తదూష్యంబై యుండునది రక్తజవిస్ఫోటకమని తెలియవలయును. దీనియం దనేకోపచారములంజేసినను సాధ్యంబు గాకుండును.

### విస్ఫోటకసాధ్యాసాధ్యలక్షణము

ఏకదోషోత్థిత స్సాధ్యః కృచ్ఛ్రసాధ్యో ద్విదోషజః,
సర్వరూపాన్వితో ఘోర స్త్వసాధ్యో భూర్యుపద్రవః. 260

తా. ఏకదోషవిస్ఫోటకము సాధ్యము. ద్విదోషజవిస్ఫోటకము కష్టసాధ్యము. త్రిదోషజనితంబై యనేకోపద్రవయుక్తంబై భయంకరముగనుండు విస్ఫోటక మసాధ్యము.

### విస్ఫోటకోపద్రవములు

హిక్కా శ్వాసోఽరుచి స్తృష్ణా *చాంగసాదో హృదివ్యథా
విసర్ప జ్వర హృల్లాసా విస్ఫోటానా ముపద్రవాః. 261

తా. ఎక్కిళ్ళు, ఉబ్బసము, అరుచి, దప్పి, ఒడలు గృశించుట, ఱొమ్మునొప్పి, విసర్పము, జ్వరము, నోట కారముగ నీళ్ళూరుట-ఇవి విస్ఫోటకోపద్రవము లని దెలియవలయును.

### విస్ఫోటకమునందు సామాన్యోపచారము

తత్రాదౌ లంఘనం కార్యం వమనం పథ్యభోజనం,
యథాదోషం బలం వీక్ష్య ప్రోక్తం యుక్తంచ రేచనమ్. 262
(ఆయుర్వేదే)

తా. విస్ఫోటకమున తొలుత లంఘనముజేయించి పిదప వమనమున కొసంగి పథ్యకరమైన భోజనముల భుజింపంజేయవలయును. మఱియు, విస్ఫోటకదోషబలము నెఱింగి యథాయోగ్యముగ విరేచనము జేయించవలయును.

### ద్విపంచమూలాదికషాయము

ద్విపంచమూలం రాస్నాచ దార్వీ శీరం దురాలభాం,
సామృతం ధాన్యకం ముస్తాం క్వాథయిత్వా కృతం పిబేత్. 263

* చాంగమర్దో.

విస్ఫోటం వాతసంభూతం హంత్యేతన్నాత్ర సంశయః,

తా. దశమూలములు, సన్నరాస్నము, మ్రానిపసపు, వట్టివేరు, దురదగొండి, తిప్పతీఁగె, ధనియాలు, తుంగముస్తెలు-వీనిని సమభాగములుగ దంచి కషాయము గాచి త్రాగిన వాతవిస్ఫోటకము నిస్సంశయముగ నశించును.

## ద్రాక్షాదికషాయము

ద్రాక్షా కాశ్మర్య ఖర్జూర పటోలారిష్టవాసకైః. 264
లాజా కుశక దుస్పర్శైః క్వాథ శ్శర్కరయా యుతః,
విస్ఫోటం పిత్తజం హంతి సోపద్రవ మసంశయమ్. 265

తా. ద్రాక్ష, గుమ్ముడు, ఖర్జూరము, చేదిపొట్ల, వేప, అడ్డసరము, పేలాలు, చిట్టితుమికి, దురదగొండి-వీనిని కషాయముగాచి అందు శర్కరగలిపి త్రాగిన ఉపద్రవ ముతోఁగూడియుండు పిత్తవిస్ఫోటకము నిశ్చయముగ హరించును.

## భూనింబాదికషాయము

భూనింబ నింబ యాసాశ్చ త్రిఫలేంద్రసవాసకాః,
పిచుమందః పటోలీచ క్వాథ మేషాం సశర్కరమ్. 266
పీత్వా విముచ్యతే నూనం కఫవిస్ఫోటకా న్నరః,

తా. నేలవేము, వేము, దురదగొండి, త్రిఫలములు, కొడిసెపాలవిత్తులు, అడ్డసరము, కటునింబ, చేదిపొట్ల,-వీనిని కషాయము గాచి అందు పంచదారగలిపి త్రాగిన కఫ విస్ఫోటకము హరించును.

## ద్వాదశాంగకషాయము

కిరాత తిక్తకారిష్ట యష్ట్యాహ్వాంబుద పర్పటైః. 267
పటోల వాసకోశీర త్రిఫలా కౌటజై శ్శృతం,
ద్వాదశాంగం నరః పీత్వా విస్ఫోటేభ్యో విముచ్యతే. 268
ద్వంద్వజేభ్య త్రిదోషోత్థ రక్తజేభ్యో హితాశనః,

తా. నేలవేము, వేము, అతిమధురము, తుంగముస్తెలు, పర్పాటకము, చేదిపొట్ల, అడ్డసరము, వట్టివేరు త్రిఫలములు, కొడిసెపాలవిత్తులు,-వీనిని కషాయము గాచి త్రాగిన ద్వంద్వ, త్రిదోష, రక్తదోషములవలనగలిగిన విస్ఫోటకము హరించును. మఱియు దీని యందు లఘుకరముగ నుండుపదార్థముల సేవించుట పథ్యకరము.

## అమృతాదికషాయము

అమృతవృషపటోలం ముస్తకం సప్తపర్ణం
ఖదిరససితవేత్రం నింబపత్రం హరిద్రే,

శృతమితి సవిసర్పాన్ కుష్ఠ విస్ఫోట కండూ
రపనయతి మసూరిం శీతపిత్తజ్వరంచ. 269

తా. తిప్పతీఁగె, అడ్డసరము, చేతిపొట్ల, తుంగముస్తెలు, ఏడాకులరటి, చంద్ర పెదురుగొమ్ము, వేపాకు, పసపు, మ్రానిపసపు-వీనిని కషాయము గాచి పంచదార గలిపి త్రాగిన విసర్పి, కుష్ఠువు, విస్ఫోటకము, దురద, మసూరిక, పిత్తజ్వరము హరించును.

పటోలాదికషాయము

పటోలామృత భూనింబ వాసారిష్టక పర్పటైః,
ఖదిరాష్టయుతైః క్వాథో విస్ఫోటజ్వరశాంతయే. 270

తా. చేతిపొట్ల, తిప్పతీఁగె, నేలవేము, అడ్డసరము, వేము, పర్పాటకము, ఖదిరాష్టకము-వీనిని కషాయముగాచి త్రాగిన విస్ఫోటకము, జ్వరము హరించును. (ఖదిరాష్టకమన—చంద్ర, త్రిఫలములు, చేతిపొట్ల, తిప్పతీఁగె, అడ్డసరము, వేము అనునవి.)

విస్ఫోటకములయందు పథ్యము

విస్ఫోటక హితార్థాయ సేవయేచ్చ యవాదిభిః,
ముద్గాఢకి మసూరాణాం రసైర్వా విశ్వసంయుతైః, 271
సునిషణ్ణక వేత్రాగ్రం తండులీయకటిల్లకైః,
కులకా భీరుకైరేభి స్సపర్పటసతీనకైః. 272
తిక్తయూషసమాయుక్తై ర్భోజనం సంప్రయోజయేత్,
(మాధవనిదానే)

తా. యవలు, పెసలు, కందులు, చిఱుసెనగలు-వీనికట్టుతో శొంఠిచూర్ణమును గలిపిగాని, చెంచలికూర, వెదురుగొమ్ము, చిట్టికూర, కాకరకాయ, చిట్టితమ్మాకు, పిల్లిపీచర, పర్పాటకము, లంకలసెదువడ్లు, చేదుగలయూషము అనువానినిగాని విసర్పి రోగమునందు భుజించుట పథ్యకరము.

విస్ఫోటకములయం దపథ్యము

తిలాన్మాషాన్ కుళుత్థాంశ్చ లవణామ్ల కటూనిచ. 273
విదాహి రూక్ష ముష్ణంచ విస్ఫోటీ పరివర్జయేత్.

తా. నువ్వులు, ఉద్దులు, ఉలవలు, ఉప్పు, పులుసు, కారము, దాహకరపదార్థములు, రూక్ష, ఉష్ణము-వీనిని విస్ఫోటకరోగముగలవారు వర్జింపవలయును.

త్రయోదశ ప్రకరణమ్.

# చతుర్దశ ప్రకరణము.



శ్లో. శ్రీజంగమేశపాదాబ్జభృంగం శుద్ధం మహేశ్వరం,
సర్వజ్ఞం సకలాధారం బసవేశ మహం భజే. 1

తాత్పర్యము. జంగమేశ్వరుని పాదపద్మముల సేవించువాఁడు, శుద్ధుఁడు, మహేశ్వరుఁడు, సర్వజ్ఞుఁడు, సకలజగత్తున కాధారభూతుఁడు నగు బరమేశ్వరుని నేను భజియించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేర్కొనంబడిననేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథముయొక్క చతుర్దశప్రకరణమును వచించుచున్నాఁడను.



అర్శోరోగస్వరూపము

అర్శాంసి శుకజిహ్వాశ్చ కౌక్కుటం జలుక స్తథా,
ప్లక్షోదుంబరసంకాశా న్యేతాన్యర్శాంసి పంచచ. 3

(చికిత్సాసారసిద్ధసంగ్రహే)

తా. కొన్నిమూలరోగములు చిలుకనాలుక, కోడిజుట్టు, జలగ, జువ్వికాయ మేడికాయ అనువానితో దుల్యములుగనుండును. ఇటుల మూలరోగం బైదువిధంబులు

బింబీ కర్కంధు ఖర్జూర కార్పాసీ ఫలసన్నిభాః,
కేచిత్కదంబపుష్పాభాః కేచిత్సిద్ధార్థకోపమాః.
బహుస్రావీచోష్టజిహ్వా శంబూకావర్తతుల్యభం,
భేషజక్షారశస్త్రాగ్ని *సాధ్యానాంచ ప్రశస్యతే

తా. మఱియు మూలరోగములు దొండపండు, రేగుపండు, ఖర్జూరకాయ ప్రత్తికాయ, అనువానితో తుల్యములుగ, కొన్ని కడిమిపువ్వులతో తుల్యములుగ, మఱి కొన్ని ఆవాలతో తుల్యములుగ, ఎల్లపుడు స్రావముగలవిగ, లొటిపిటనాలుకతో

---

* సాధ్యత్వం యాప్యముచ్యతే.

సమానములుగ, నత్తగుల్లతో సమానమైనవలయములు గలవిగనుండును. అందు సాధ్యంబులుగనుండు అర్శోరోగముల ఔషధ, క్షార, శస్త్రాగ్నికర్మలవలన జికిత్సింపవలయును.

### శస్త్రోపయుక్తయంత్రలక్షణము

బాలానాం గోస్తనాకారం యంత్రకం చతురంగుళం,
సహి పంచాంగుళం పుంసాం ప్రమదానాం షడంగుళమ్. 6
ద్విచ్ఛిద్రమర్శసాం వేధే త్వేకచ్ఛిద్రంతు కర్మణి,
అధస్థం త్ర్యంగుళం ఛిద్ర మంగుష్ఠోదరవిస్తృతమ్. 7

తా. మూలరోగోపయుక్తయంత్రము గోస్తనాకారముగలదై పట్టికొనుటకు క్రిందిభాగమున మూడంగుళములపొడవు అంగుష్ఠోదరప్రమాణమైన వెడల్పుగలదై రెండుఛిద్రములుగలదిగ నుండవలయును. మఱియు నాలుగంగుళములపొడవుగల యంత్రముతో బాలురకును, ఐదంగుళములపొడవుగలదానితో పురుషులకును, ఆరంగుళముల పొడవుగలదానితో స్త్రీలకును చికిత్సింపవలయును. మఱియు రెండుఛిద్రములుగలయంత్రమును మూలరోగమును వేధించుటయందును, ఒకఛిద్రముగలదానిని శస్త్రకర్మయందును నుపయోగింపందగును.

### అర్శోరోగసామాన్యగుణములు

అరోచకాగ్నిమాంద్యంచ హ్యాంత్రకూజనమేవచ,
గుల్మం ప్లీహంచ శ్వయథు ర్నేత్రే కర్ణధ్వనిర్భ్రమః. 8
అష్ఠీలక ముదావర్తో మలబంధస్తథైవచ,
కటూర్వోరు వంక్షణే శూలం జ్వరమన్నేచ ద్వేషితా. 9
శోషా వివర్ణతా దేహే హ్యర్శసాం లక్షణం విదుః,

తా. అరుచి, అగ్నిమాంద్యము, ప్రేగులరచుట, గుల్మము ప్లీహము, నేత్రములయందు వాపు, చెవిలో ధ్వనిగలుగుట, ఒడలుదిరుగుట, అష్ఠీలికావాతము, ఉదావర్తముగలుగుట, మలము బద్ధగించుట, నడుము, తొడలు, గజ్జలు అనువానియందు శూలగలుగుట, జ్వరము, అన్నద్వేషము, శోష, శరీరవైవర్ణ్యము గలుగుట-ఇవియ మూలరోగమున సామాన్యలక్షణంబులు.

### అర్శోరోగభేదములు

అర్శాంసి షట్ప్రకారాణి రక్తదోషా త్రిదోషతః. 10
జాయంతే మారుతా త్పిత్తా త్కఫాద్ద్వంద్వాద్వళీత్రయే,
(మాధవనిదానే)

తా. రక్తార్శస్సు, త్రిదోషార్శస్సు, వాతార్శస్సు, పిత్తార్శస్సు, శ్లేష్మార్శస్సు, ద్వంద్వార్శస్సు అను మూలరోగ మారువిధంబులు.

## అర్శోరోగసాధ్యాసాధ్యములు

ఏకదోషోత్థితం బాహ్యం సుఖసాధ్యం తథాచిరాత్. 11
ద్వంద్వజం యాప్యకంచైవ కృఛ్రసాధ్యం భిషగ్వరైః
అంతర్వృత్తి త్రిదోషోత్థా న్యసాధ్యార్శాంసి తానిచ. 12
కుర్వంతి సర్వరోగాంశ్చ తస్మాద్యత్నేన తజ్జయేత్,

తా. మూలరోగము ఏకదోషమువలనగాని, లేక వెలపటివళియందుగాని జనించి యుండినను, మఱియు జనించి చిరకాలముగాకయుండినను సుఖసాధ్యంబు. ద్వంద్వ దోషమువలన జనించిన మూలరోగము కష్టసాధ్యం బగుటచే యాప్యంబు. అంతర్వ యందు జనించిన మూలరోగంబును, త్రిదోషమువలనజనించిన మూలరోగంబును అస ధ్యంబులు. మఱియు మూలరోగము సర్వరోగోత్పత్తికి కారణంబగుటచే దానిని సర ప్రయత్నములవలన హరింపజేయవలయును.

## అర్శోరోగపూర్వరూపము

విష్టంభో జఠరాటోప శ్చార్శాంసి గ్రహణీతథా. 1
కార్శ్య ముద్గారబాహుళ్యం పూర్వలక్షణముచ్యతే,

తా. అన్నము, జీర్ణముగాకుండుట, కడుపులోగుడగుడశబ్దముగలుగుట, గ్రహ రోగముగలుగుట, శరీరము కృశించుట, మిక్కుటముగ ఓకరింతలుగలుగుట-ఇవి అర్శోరోగపూర్వలక్షణములు.

## వాతార్శస్సునకు కారణము

కటుతిక్తకషాయైశ్చ రూక్షతీక్ష్ణాతిశీతలైః. 1
భోజనైర్లంఘనైర్వాపి మద్యమైథునసేవనైః,
జాయంతే హ్యంకురైశ్యామై శ్శుష్కార్శాంసిచమారుతాత్.

తా. కారము, చేదు, వగరు, రూక్ష, తీక్ష్ణము, కడుశీతలముగల పదార్థము భుజించుట, ఉపవాసముసేయుట, మిక్కుటముగ మద్యపానము, స్త్రీసంభోగముసేయు ట-ఈకారణములవలన నల్లనై శుష్కమైన మొలకలతో గూడియుండు వాతార్శస్సు జనించును.

## వాతార్శస్సులక్షణము

బింబ సర్షప కార్పాస బీజవ త్స్ఫుటితాననః,

సశబ్దధూమసంయుక్తం స్తోకంవాథ ప్రవాహికా 16
విష్టంభదాహకం శూలం నానారోగాశ్చ మారుతాత్,
(ఆయుర్వేదే)

తా. మొలకలు దొండపండు, ఆవాలు, ప్రత్తిగింజ అనువానితో సమానంబై లియుండుట, గుదమున శబ్దముగలుగుట, పొగవెడలుచుండుట, పలుమారు కొంచె ంచెముగ విరేచనము లగుట మలము బద్ధగించుట, మంటలు, శూల, పలువిధరోగములు ఁగుట. ఈలక్షణములుగలది వాతార్శస్సని దెలియవలయును.

వాతార్శకారణ తల్లక్షణములు

కట్వమ్ల లవణోష్ణాని వ్యాయామాగ్న్యాతపశ్రమాః. 17
సేవనాత్స్రవతే రక్తం నీలపీతోష్ణవర్చసః,
రక్తానీలాస్సితాః పీతా మృదవశ్చాంకురాస్తథా. 18
దాహపాక జ్వర స్వేద తృణ్మూర్ఛాః పిత్తజార్శసాం, (చరకే)

తా. కారము, పులుసు, ఉప్పు, ఉష్ణము, వ్యాయామము, అగ్ని, ఎండ, శ్రమ నువానిసేవనవలన రక్తముగారుట, మలము నల్లగ, పచ్చగ, ఉష్ణముగవెడలుట, ఎఱ్ఱగ, ల్లగ, తెల్లగ, పచ్చగ, మృదువుగ నుండు మొలకలు జనించుట, మంట, పాకము, ్వరము, చెమట, దప్పి, మూర్ఛ, కలుగుట - ఈలక్షణములుగలది పిత్తార్శస్సని తెలియ లయును.

శ్లేష్మార్శనిదాన, తల్లక్షణములు

అతిశీతగురుస్నిగ్ధ క్షారామ్లస్య నిషేవణాత్. 19
శ్లేష్మోల్బణాత్ స్థిరం శుభ్రం పిత్తార్శః గోస్తనోపమం,
స్పర్శే కండ్వాః ప్రియం స్నిగ్ధం నానారోగకరం కిల. 20
వసాభసకఫప్రాయః పురీషాస్సప్రవాహికాః,
జ్ఞేయాశ్శ్లేష్మార్శసాహ్యేషాం రక్తమోక్షాత్సుఖావహమ్. 21
శ్లేష్మార్శసాంగుదే పార్శ్వే రక్తమోక్షం జలూకయా,
కృత్వాచార్కరసైర్లేప్యం దాహశ్చాత్రాపి శస్యతే. 22
(సిద్ధవిద్యాభూః)

తా. కడుశీతలము, జడము, స్నిగ్ధము, క్షారము, పులుసుగలపదార్థముల సేవిం చుటవలన శ్లేష్మము ప్రకోపించి కఠినముగ, తెల్లగ, పచ్చగ, గోస్తనాకారముగ నుండు మొలకల గలుగంజేయుట, తాకిన నవ శమించుట, మెఱయుచుండుట, పలువిధరోగ

ములకు గారణంబుగ నుండుట, మలము మాంసముక్రొవ్వుతో సమానముగ ఆమయుక్తముగ నీరుతో సమానముగ వెడలుట-ఈలక్షణములుగలది శ్లేష్మార్శస్సని దెలియవలయును. దీనియందు రక్తస్రావమును జేయించుట సుఖకరము. మఱియు దీనియందు గుదపార్శ్వమున జలగలతో రక్తస్రావమును జేయించుటయే గాక జిల్లేడుపాలలేపనమును, దాహకర్మను సహా జేయుట ప్రశస్తంబు.

అర్శోభేదలలితము

గుదద్వారా త్పృష్ఠదేశే జాయంతే పాండురాంకురాః,
లలితా స్తే విశుష్యంతే మూలరోగస్య లక్షణమ్. 23
శ్లేష్మార్శసామయం భేదో హన్యాల్లేపరసాయనైః,
(పూజ్యపాదీయే)

తా. గుదమునకు పైభాగమున మృదువైన తెల్లని మొలకలు జనించి శుష్కించును. ఇదియ మూలరోగలక్షణము, ఇది శ్లేష్మార్శస్సునకు భేదముగలదిగనుండును. దీనిని లేపన రసాయనములచే హరింపం జేయవలయును.

ద్వంద్వ, త్రిదోషార్శోలక్షణము

మిశ్రితే ద్వంద్వజం జ్ఞేయం సర్వరూపం త్రిదోషజమ్. 24
న స్రవంతే నభిద్యంతే స్నిగ్ధపాండుత్వ గాదయః, (మాధవనిదానే)

తా. రెండుదోషలక్షణములుగలది ద్వంద్వజార్శస్సనియు, వాత, పిత్త, శ్లేష్మ లక్షణయుక్తంబై స్రావభేదనరహితంబై చర్మాదులు మెఱయుచు, పాండురవర్ణముగ నుండిన త్రిదోషార్శస్సనియు తెలియవలయును.

రక్తార్శోలక్షణము

రక్తోల్బణా గుదే కీలాః పిత్తాకృతిసమన్వితాః. 25
శృంగాద్యైశ్శోణితస్రావో హ్యధో వాయు ర్నగచ్ఛతి,
వాతపిత్తకఫాహ్యత్ర ద్వంద్వజాశ్చ త్రిదోషజాః 26
లక్షణైః పూర్వవద్జ్ఞాత్వా చికిత్సా శోణితార్శసాం,
(భేషజకల్పే)

తా. గుదమున రక్తము స్రవించుట, మొలకలు పిత్తార్శలక్షణయుక్తంబులుగ నుండుట, వాత మధోముఖముగ సంచరింపకుండుట, పూర్వోక్తవాత, పిత్త, శ్లేష్మ, ద్వంద్వ, త్రిదోషలక్షణయుక్తంబుగనుండుట-ఈలక్షణములుగలది రక్తార్శస్సని దెలియవలయును. దీనియందు కొమ్ములు, సొరకాయబుఱ్ఱలు మొదలగువానిచే రక్తస్రావమును

జేయించుటయేగాక వాత,పిత్త,శ్లేష్మ,ద్వంద్వ, త్రిదోషార్శచికిత్సలనుసహా జేయవలయును.

### అర్శోరోగసామాన్యలక్షణములు

మాంసకీలాని గుదజా న్యర్శాంసి మునయో విదుః. 27
తదస్రజంచ సహజం దోషజం సాన్నిపాతికం,
సామాన్యలక్షణం తేషాం మలస్రంసోఽగ్నిమందతా. 28
నిస్సారతా వివర్ణత్వం సకలామయసంభవః, (మతాంతరే)

తా. గుదమున మాంసపుమొలకలుజనించిన అర్శస్సని మునులు వచించెదరు. అది రక్తజ,సహజ,పిత్తజ,వాతజ,శ్లేష్మజ,సన్నిపాతజములన నారువిధంబులు. అందు మలము పలచగవెడలుట, అగ్నిమాంద్యము గలుగుట, సత్వములేకుండుట, శరీరము వివర్ణంబగుట, సర్వరోగోత్పత్తికి గారణంబుగనుండుట - అనునవి సామాన్యలక్షణములు.

దోషజం రక్తజం సాధ్యం శిష్టే ద్వేతు పరిత్యజేత్. 29
(మతాంతరే)

తా. అం దేకదోషమువలన జనించిన అర్శస్సు రక్తార్శస్సుసాధ్యంబులు. ద్వంద్వజ త్రిదోషార్శస్సులు అసాధ్యంబులు.

### అసాధ్యార్శోపద్రవములు

హస్త పాదే ముఖే నాభౌ శోథా వృషణయో ర్గుదే,
హృత్పార్శ్వశూల మోహంచ ఛర్ది స్తృష్ణా జ్వరారుచి. 30
రక్తాతిసారో రుక్కార్శ్య మర్శాంసి మారయంతి తం,
(బాహటే)

తా. చేతులు, కాళ్లు, ముఖము, నాభి, వృషణములు, గుదము అనువానియందు వాపుగలుగుట; ఱొమ్ము, పార్శ్వములు శూలించుట; మోహము, వాంతి, దప్పి, జ్వరము, అరుచి, రక్తాతిసారము, పీడ, శరీరకృశత్వముగలుగుట-ఈయుపద్రవములు గల అర్శోరోగులు మరణము జెందెదరు.

సహజాని త్రిదోషాణి యానిచాభ్యంతరాం వలిమ్. 31
జాయంతేఽర్శాంసి సంశ్రిత్య తాన్యసాధ్యాని నిర్దిశేత్,

తా. జననకాలము మొదలు స్వాభావికముగ గలిగియుండు అర్శస్సు, త్రిదోషార్శస్సు, లోనివళులయందు జనించియుండు అర్శస్సు అసాధ్యంబులు.

హృత్పార్శ్వశూలం సంమోహ శ్ఛర్ది రంగస్య రుగ్జ్వరః. 32
తృష్ణా గుదస్య పాకశ్చ నిహన్యు ర్గుదజాతురం,

తా. హృదయపార్శ్వములయందు శూల, ఇంద్రియమనస్సులయందు మోహము, వాంతి, శరీరశూల, జ్వరము, దప్పి, గుదవ్రణము-ఈలక్షణములతో గూడియుండు మూలరోగి మృతిజెందును.

తృష్ణారోచక శూలార్త మతిప్రస్రుతశోణితమ్. 33
శోథాతిసారసంయుక్త మర్శాంసి క్షపయంతి హి,

తా. దప్పి, అరుచి, శూల, కడురక్తస్రావము శోథ అతిసారముగల మూలరోగి మృతిజెందును.

అర్శోరోగసుఖసాధ్యలక్షణము

బాహ్యాయాంతు వలౌ జాతా న్యేకదోషోల్బణానిచ. 34
అర్శాంసి సుఖసాధ్యాని నచరోత్పతితానిచ,

తా. వెలపటివళియందు జనించిన మూలరోగము, ఏకదోషప్రకోపమువలన జనించిన మూలరోగము, ఒక సంవత్సరకాలము గతించకుండెడి మూలరోగము సుఖసాధ్యంబులని తెలియవలయును.

అర్శోరోగకృఛ్రసాధ్యలక్షణము

ద్వంద్వజాని ద్వితీయాయాం వలౌ యాన్యాశ్రితానిచ. 35
కృఛ్రసాధ్యాని తాన్యాహుః పరిసంవత్సరాణిచ,

తా. ద్వంద్వదోషమువలన జనించిన అర్శస్సు, రెండవవళియందు జనించిన అర్శస్సు, ఒకసంవత్సరకాలము గతించినఅర్శస్సు కష్టసాధ్యంబులని తెలియవలయును.(మఱియు వెలపట ద్విదోషప్రకోపమువలన జనించినఅర్శస్సు, మఱియు ఏకదోషప్రకోపమువలన రెండవవళియందు జనించిన అర్శస్సు కష్టసాధ్యంబులు.)

అర్శోత్పత్తికి స్థానాంతరము

మేఢ్రాదిష్వపి వక్ష్యంతే యథాస్వం నాభిజాన్యపి. 36
గండూపదాస్యరూపాణి పిచ్ఛిలాని మృదూనిచ,

తా. మేఢ్రము, నాసిక, కర్ణములు, మొదలగువానియందు దోషభేదమువలన అర్శస్సు (అంకురము) జనించుచున్నదని ముందుగ జెప్పందగియున్నయది. అట్లేయగునపే నాభియందుసహా అర్శస్సు జనించి ఆడు ఎఱ్ఱముఖములో సమానముగ, జిగటగ, మృదువుగ నుండును.

వాతార్శస్సునకు అర్శఃకుఠారరసము

శుద్ధసూతం పలైకంతు ద్విపలం శుద్ధగంధకమ్. 37
మృతం తామ్రం మృతం లోహం ప్రత్యేకంచ పలత్రయం,
త్ర్యూషణం లాంగలీ దంతీ చిత్రకం [1]పీలుకం తథా. 38
ప్రత్యేకం ద్విపలం యోజ్యం యవక్షారంచ టంకణం,
ఉభే పంచపలే యోజ్యే సైంధవం పలపంచకమ్. 39
ద్వాత్రింశత్పలగోమూత్రం స్నుహీక్షీరంచ తత్సమం,
[2]మృద్వగ్నినా పచేత్సమ్యక్ స్థాల్యాం యావత్సుపిండితమ్. 40
మాషద్వయం సదాఖాదే ద్రసో హ్యర్శ కుఠారకః,

(మాధవనిదానే)

తా. శుద్ధిచేసినరసము ౧ పలము, శుద్ధిజేసినగంధకము ౨ పలములు, తామ్రభస్మము, లోహభస్మము-ఇవి దినుసుకు 3 పలములు, త్రికటుకములు, చెన్నచర్లగడ్డ, నేలదంతి, చిత్రమూలము, దొండ, లేక పుష్కరమూలము-ఇవి దినుసుకు రెండేసిపలములు, యవక్షారము, టంకణక్షారము-ఇవి ౫ పలములు, సైంధవలవణము ౫ పలములు-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి నూరి చూర్ణముజేసి గోమూత్రము 3౨ పలములు, బొంతజెముడుపాలు 3౨ పలములు గలిపి మృద్వగ్నితో ముద్దయగువఱకు బాగుగవండి రెండు మాషములయెత్తును ఎల్లపుడు సేవించుచుండిన మూలరోగము హరించును.

వచా హింగు విళంగాని సైంధవం జీర నాగరైః 41
మరీచం పిప్పలీ కుష్ఠం పథ్యాచ హ్యజమోదకం,
క్రమోత్తరగుణం చూర్ణం సర్వేషాం ద్విగుణం గుడమ్. 42
అక్షం ముద్గజలైశ్చాను పిబేద్వాతార్శసాం జయేత్,

తా. వస ౧ భాగము, ఇంగువ ౨ భాగములు, వాయువిడంగములు 3 భాగములు, సైంధవలవణము ౪ భాగములు, జీలకఱ్ఱ ౫ భాగములు, శొంఠి ౬ భాగములు, మిరియాలు ౭ భాగములు, పిప్పళ్ళు ౮ భాగములు, చెంగల్వకోష్టు ౯ భాగములు, కరక్కాయ ౧౦ భాగములు, చిత్రమూలము ౧౧ భాగములు, ఓమము ౧౨ భాగములు-ఇటుల వీనినెల్ల చూర్ణముజేసి దీనికిరెండింతలు బెల్లముగలిపి మర్దించి అక్షప్రమాణమును భక్షించి వెంబడిగ పెసరునీరుత్రాగిన వాతార్శస్సు హరించును.

---

[1] పుష్కరంతథా. [2] మృద్వగ్నినా పచేత్సర్వం యావత్తచ్చ సుపిండితమ్.

### పిత్తార్శస్సునకు రాజవల్లభరసము

లోహభస్మ విడంగాని త్రిఫలాని శిలాజతు. 43
త్ర్యూషణం పిప్పలీమూలం చవ్యం కృష్ణతిలాస్సమం,
లోహస్య త్రిగుణం వహ్నే ర్లోహా ద్భల్లాతకీ తథా. 44
చాతుర్జాతంచ లోహాంశం సర్వస్య ద్విగుణం గుడం,
కర్షం భుక్త్వా నిహంత్యాశు హ్యర్శో మందాగ్ని పాండుకమ్.
శ్వాసం భగందరం కాసం శ్వయథుంచ వినాశయేత్,

తా. లోహభస్మము, వాయువిడంగములు, త్రిఫలములు, శుద్ధిచేసినశిలాజిత్తు, త్రికటుకములు, మోడి, చవ్యము, నల్లనువ్వులు-ఇవి దినుసుకొక్కొకభాగము, చిత్రమూలము 3 భాగములు, శుద్ధిచేసినజీడివిత్తులు 3 భాగములు, ఏలకులు, లవంగములు, ఆకుపత్రిక, నాగకేసరములు-ఇవి దినుసుకొక్కొకభాగము-ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి దీనికి రెండింతలు బెల్లముగలిపి కర్షప్రమాణమును నాలుగు మాసములవఱకు సేవించుచుండిన పిత్తార్శస్సు, అగ్నిమాంద్యము, పాండువు, శ్వాసము, భగంధరము, కాసము, వాపు వీనిని హరింపంజేయును.

### సామాన్యచికిత్స

సూరణం కాసమర్దంచ శిగ్రు వార్తాక వాలుకమ్. 46
సుపక్వం యోజయేచ్ఛాకం పథ్యం గోధూమ తండులం,
కుసుంభ మృదుపత్రాణి హ్యారనాళేన పేషయేత్. 47
భక్షయే చ్ఛాకవచ్చాంత్యే స్స్వయమగ్నిరస స్తథా,
నిష్కత్రయంత్రయం నిత్యం గుంజంవానందభైరవమ్. 48
(రసరత్నాకరే)

తా. కందగడ్డ, తీటకసింద, మునగ, వంకాయ, కూతురుబుడమ-వీనిని పక్వముగ వండి భుజింపవలయును. పథ్యము-గోధుమలను, బియ్యపువంటకమును భుజింపవలయును. మఱియు లేతకుసుంబచిగుళ్ళను కలితోనూరి శాకమువలెనే భక్షింపవలయును. మఱియు మూడునిష్కములయెత్తు స్వయమగ్నిరసమునుగాని, లేక గురిగింజయెత్తు ఆనందభైరవమునుగాని ప్రత్యహము సేవింపవలయును.

శాకతుండీంద్ర వారుణ్యో ర్దేవదాళ్యాశ్చ బీజకం,
సగుడం గుదలేపేన మూలరోగహరం పరమ్. 4[illegible]

తా. పెద్దగురిజవేరు, పాపర, డావరడంగివిత్తులు, బెల్లము-వీనిని నూరి గుదమునందు లేపనముచేసిన మూలరోగము హరించును.

సూరణాదిలేపనము

సూరణం రజనీ వహ్ని టంకణం గుడమిశ్రితం,
పిష్ట్వారనాళకై ర్లేపో హంత్యర్శాంసి మహాంత్యపి. 50

తా. కంద, పసపు, చిత్రమూలము, వెలిగారము, బెల్లము-వీనిని కలితోనూరి లేపనముజేసిన త్రిదోషార్శస్సు మొదలగు బలిష్ఠములైన అర్శస్సులు హరించును.

నింబాదిలేపము

నింబాశ్వత్థస్య పత్రాణాం లేపో దుర్నామనాశనః,
ఆరనాళేనవాహన్యా త్సగుడాశటుతుంబికా. 51

తా. వేపాకు, రావియాకు-వీనిని నూరి లేపనముజేసినను, లేక చేదుసొరాకు, బెల్లము-వీనిని కలితోనూరి లేపనముజేసినను మూలవ్యాధి హరించును.

స్నుహ్యాదిలేపము

స్నుహ్యగ్నిలాంగలీ దంతిమూలై ర్లేపోఽర్శసాం హితః,

తా. బొంతజెముడుపాలు, చిత్రమూలము, చెన్నచర్లగడ్డ, దంతివేరు - వీనిని నూరి మూలరోగమునందు లేపనముజేయుట హితకరంబు.

అర్కాదిలేపము

అర్కం పయ స్నుధాకాండం కటుకాలాబుపల్లవాః. 52
కరంజో బస్తమూత్రేణ లేపనం శ్రేష్ఠ మర్శసాం,

తా. జిల్లేడుపాలు, జెముడుపాలు, కటుకరోహిణి. చేదుసొరచిగుళ్ళు, క్రానుగవిత్తులు - వీనిని మేకమూత్రముతోనూరి మూలరోగమునందు లేపనముజేయుట కడు శ్రేష్ఠకరంబు.

న్యగ్రోధపత్రపము

దగ్ధ్వా న్యగ్రోధపత్రాణి తైలేన సహ లేపయేత్. 53

తా. మఱ్ఱియాకులగాల్చి బూడిదజేసి నూనెతో మర్దించి లేపనముజేసిన మూలరోగము హరించును.

దేవదాల్యాదిలేపము

దేవదాల్యాశ్చ బీజాని సైంధవేన సుచూర్ణితం,

ఆరనాళేన లేపోఽయం మూలరోగనివృత్తయే. (శారీరే) 54

తా. డావరదంగివిత్తులు, సైంధవలవణము - వీనిని కలితో నూరి లేపనముజేసిన మూలరోగము హరించును.

## త్రిదోషార్శస్సునకు వైక్రాంతాఖ్యరసము

మృతసూతాభ్ర వైక్రాంత కాంత తామ్రం సమంసమం,
సర్వతుల్యేన గంధేన మర్ద్యం భల్లాతకాన్వితమ్. 55
దినైకం తద్ద్రవైరేవ వటీం కుర్యా ద్ద్విగుంజకాం,
భక్షయే ద్గుదజా న్హంతి ద్వంద్వజంచ త్రిదోషజమ్. 56
ప్రత్యష్టముసలీ వహ్ని భాగాః కుష్ఠస్య షోడశ,
పిప్పలీ పిప్పలీమూలం శుంఠీ ద్భాగద్వయం ద్వయమ్. 57
చతుష్కంతు విడంగస్య మరిచం కటుశుంఠికా,
బ్రహ్మదండి తథైకైకం చూర్ణితం ద్విగుణం గుడమ్. 58
కర్షాంశం భక్షయేచ్చాను హ్యర్శోరోగప్రశాంతయే,
వైక్రాంతాఖ్యో రసోనామ సాధ్యాసాధ్యార్శశాంతయే. 59
(రసరత్నాకరే)

తా. రసభస్మము, అభ్రకభస్మము, వైక్రాంతభస్మము, కాంతభస్మము, తామ్రభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి వీనికి సమముగ శుద్ధిచేసినగంధకచూర్ణము, శుద్ధిచేసినజీడిగింజలచూర్ణము కలిపి జీడివిత్తులతైలముతో నొకదినము మర్దించి రెండుగురిగింజలంత మాత్రలుచేసి యందొకదానిని నేలతాటిగడ్డలు ౮ భాగములు, చిత్రమూలము ౮ భాగములు, చెంగల్వకోష్టు ౧౬ భాగములు, పిప్పళ్ళు, మోడి, రెండేసి భాగములు, వాయువిడంగములు ౪ భాగములు, మిరియాలు, చేతిబీర, శొంఠి, బ్రహ్మదండి - ఇవి దినుసుకొక్కొకభాగము-ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి దీనికి రెండింతలు బెల్లముగలిపి కర్షప్రమాణానుపానముతో సేవించిన అర్శస్సు, ద్వంద్వార్శస్సు, త్రిదోషార్శస్సు, సాధ్యాసాధ్యార్శస్సులు హరించును.

## అభ్రకహరీతకి

మృతాభ్రకపలం వింశ న్మృతలోహస్య పంచకం,
గంధకస్య పలం పంచ త్రిభి ర్ద్విగుణమాక్షికమ్. 60
పథ్యా శతపలం యోజ్యం ధాత్రీపలశతద్వయం,
సర్వమేకత్ర తచ్చూర్ణం జంబీరై ర్భావయే ద్దినమ్. 61

భృంగీ పునర్నవాద్రావైః *కుమార్యా గుడసంయుతైః,
భల్లాతవహ్నికోరంటైర్హస్తిశుండీతు లాంగలీ. 62
క్షీరిణీ జలకుంభీచ ప్రత్యేకం ప్రత్యహం ద్రవైః,
భావయే న్మర్దయేదిత్థం మధ్వాజ్యాభ్యాం విలోలయేత్. 63
స్నిగ్ధభాండే స్థితం ఖాదే న్నిత్యం నిష్కద్వయం ద్వయం,
సిద్ధశాబరయోగోఽయం త్రిదోషార్శాంసి నాశయేత్. 64
(మాధవనిదానే)

తా. అభ్రకభస్మము ౨౦ పలములు, లోహభస్మము ౫ పలములు, శుద్ధిచేసినగంధకము ౫ పలములు, స్వర్ణమాక్షికము ౬౦ పలములు, కరకబెరడు ౧౦౦ పలములు, ఉసిరికపప్పు ౨౦౦ పలములు-ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి నిమ్మపండ్లరసముతో ౧ దినము భావనచేసి యెండించి పిదప గుంటగలగర, గలిజేరు, కలబంద, బెల్లము, జీడిపలుకులు, చిత్రమూలము, గోరింట, హస్తిశుండి, ఏనుగపిప్పళ్లు, చెన్నచర్లగడ్డ, తవక్షీరి (అడవిబత్తాయిపాలు), చేదానుగ అనువానిరసములచే ప్రతిదానిచే నొక్కొకదినము మర్దించి భావనచేసి తేనె, నెయ్యి, గలిపి నేతితో మాగిన కుండలోబెట్టి ప్రతిదినము రెండునిష్కముల యెత్తును సేవించుచుండిన త్రిదోషార్శస్సు హరించును. ఈయోగము సిద్ధశాబరునిచే జెప్పంబడియెను.

## అర్శోరోగములకు సూరణవటికములు

పలాని పంచ పథ్యాయాః పలం మరిచకం తథా,
పిప్పలీ పిప్పలీమూల చవ్య చిత్రక నాగరమ్. 65
పలవృద్ధిక్రమేణైవ యవక్షారం పలత్రయం,
సూరణస్య పలాన్యష్టౌ తథా భల్లాతకస్యచ. 66
గుడేన గుళికాం కుర్యా దక్షమాత్ర ప్రమాణికామ్,
సా భక్షితా హరత్యర్శ శ్చామ్లతక్రానుపానతః. 67
కాంకాయనేన కథితం శస్త్రక్షారాగ్నిభీరుణః,

తా. కరకబెండు ౫ పలములు, మిరియాలు ౧ పలము, పిప్పళ్ళు ౧ పలము, మోడి ౨ పలములు, చవ్యము 3 పలములు, చిత్రమూలము ౪ పలములు, శొంఠి ౫ పలములు, యవక్షారము ౪ పలములు, కందగడ్డ ౮ పలములు, శుద్ధిచేసినజీడిగింజలు ౮ పలములు-ఇటుల వీనినెల్ల దంచి చూర్ణముచేసి బెల్లముగలిపి త్రొక్కి అక్షప్రమాణము

* పాతాళగరుడాకుమార్యైః=దూసరితీగె, నేలతంగేడు.

మాత్రలుచేసి పుల్లనిచల్లతో నొకవత్సరముపఱకు సేవించుచుండిన అర్శోరోగము హరించును. ఈయోగమును కాంకా యనుడనువాఁడు శస్త్రక్షారాగ్నికర్మలకు భయపడువారి నిమిత్తమై వచించెను.

### అర్శోరోగచికిత్స

అరుష్కరే మూలరోగే చిత్రకం వాప్యరుష్కరమ్. 63

తా. చిత్రమూలమునుగాని, లేక శుద్ధిచేసినజీడిగింజలనుగాని సేవించిన వేదనతో గూడియుండు అర్శోరోగము హరించును. (లేక నేలగొలిమిడిచూర్ణము ౧ భాగము, చానమల్లెచూర్ణము ౧ భాగము, పిప్పళ్ళు ౪ భాగము, మోడి ౪ భాగము-ఇటుల వీనినెల్ల నేకముచేసి సేవించినను, లేక పుల్లకందనునూరి వెన్నతో సేవించినను వేదనతో గూడియుండు అర్శోరోగము హరించును. పథ్యము పుల్లకందవంటకమును భుజింపవలయును. మఱియు చానమల్లెను నేతితో వేయించి దానితోఁడ కమ్మికెడన్నమును భుజింపలయును.)

### రక్తార్శస్సునకు భల్లాతకామృతము

భల్లాతక చతుష్షష్టిపలం దుగ్ధంచ తత్సమం,
దుగ్ధా చ్చతుర్గుణం వారి పాచ్యం దుగ్ధావశేషకమ్. 69
దుగ్ధతుల్యం ఘృతం యోజ్యం ఘృతపాదం సితాం క్షిపేత్,
మధు ధాత్రీ సితాతుల్యం సితార్ధ మభయారజః. 70
మృతలోహం గుడూచ్యాశ్చ ప్రత్యేక మభయార్ధకం,
క్షిపే త్స్నిగ్ధఘటే సర్వం ధాన్యరాశౌ నివేశయేత్. 71
సప్తాహాదుద్ధృతం తత్తు ఖాదే న్నిష్కత్రయం త్రయం,
భల్లాతకామృతంనామ హంతి రక్తార్శసాం కిల. 72
క్షారతీక్ష్ణం నభో క్తవ్యం తైలాభ్యంగంచ వర్జయేత్,

(సూత్రస్థానే)

తా. శుద్ధిచేసిన ౬౪ పలముల జీడిగింజలకు ౬౪ పలములపాలు, ౨౫౬ పలముల నీళ్ళుపోసి పాలు మిగులునటుల కాచి ఆ పాలకు సమముగ నెయ్యి, నేతికి నాలవ భాగము పంచదార, పంచదారయెత్తు తేనె, ఉసిరికపప్పు, పంచదార కర్ధభాగము కరక్కాయలపొడి, కరకపొడి కర్ధభాగము లోహభస్మము, లోహభస్మమునకు సమము తిప్పతీఁగ చూర్ణముగలిపి నేతితో మాగినకుండలో నునిచి ధాన్యరాశిలో ౭ దినంబు లిడి మూఁడేసినిష్కములయెత్తుగ సేవించుచుండిన రక్తార్శస్సు హరించును. దీనిసేవనకాలంబున

ఉప్పు, తీక్ష్ణద్రవ్యము, తైలాభ్యంజనము అనువానిని వర్జింపవలయును. (రక్తార్శస్సు హరించుటకై యోగరాజగుగ్గులమును సగా సేవింపవలయును.)

## అర్శోరోగోపచారము

అర్శస్సు చ గుడంచైవ కాకోదుంబరికాన్వితమ్. 73
ముండ్యార్ద్రికరసంచైవ ఖాదిరం చ ప్రయోజయేత్,

తా. బెల్లము, బ్రహ్మమేడికాయలరసము అనువానిలోగాని, లేక బోడతరరసము, అల్లపురసము అనువానిలోగాని, లేక చంద్రచెక్కరసములోగాని సిందూరము గలిపి సేవించిన అర్శోరోగము హరించును.

## ఔషధసేవనకాలనియమము

క్షయార్శశ్శూలరోగే చ గుల్మే మాస చతుష్టయమ్. 74

తా. క్షయము, అర్శస్సు, శూల, గుల్మము గలవారలు తత్తద్రోగోక్తౌషధముల ౪ మాసములవఱకు సేవింపవలయును. (పైఁజెప్పఁబడిన ఔషధములవలన అర్శోరోగము మానకుండిన మాడయెత్తు గౌరీపాషాణమును, కమికెడు మంచివేపకొనలను ఉదకముతో ౪ ఝాములు నూరి ౦ దినములు పట్టించి అగ్నియందుకాచిన అర్శస్సులు ఊడిపడును. పిదప వేపాకు నుడికించి కట్టిన వ్రణము మానును.)

## గౌరీపాషాణలేపము

గౌరీపాషాణైకకర్షం స్నుహీకాండే వినిక్షిపేత్,
పాచయేత్పుటపాకేన తత ఉద్ధృత్య యత్నతః. 75
రేవాచినీచ కుష్ఠం చ కల్కీకృత్య త్రయం సమం,
లేపయేత్తేనచార్శాంసి నివార్యంతే న సంశయః. 76

తా. జెముడుకాడలయం దొకకర్షప్రమాణము గౌరీపాషాణము నునిచి *పుటపాకముతో పక్వముజేసి పిదప దానితోడ రేవల్చిన్ని, చెంగల్వకోష్టు, సన్నరాష్ట్రము అనువానిని సమభాగములుగఁజేర్చి మర్దించి కల్కముజేసి లేపనముచేసిన మూలరోగము నిస్సంశయముగ హరించును.

---

* పుటపాకమన—పచ్చివనస్పతులను దంచి ముద్దజేసి దానిని గుమ్ముడు, మఱ్ఱి, నేరేడు మొదలగువానియాకులలో దేనిచేనైనను జుట్టి రెండంగుళములప్రమాణంబైనను, అంగుళప్రమాణంబైనను మన్ను లేపనముజేసి యది యెఱ్ఱగనగువఱకు పిడకలపుటంబున నునిచి పిదప దానియందుండి తీసి పైమంటిని ఆకులను నూడదీసి లోపలిముద్దను బిసికి రసమును దీసికొనుట యగును.

## అర్శోరోగహరరూపము

అర్కమూలం శమీపత్రం నృకేశా స్సర్పకంచుకః,
మార్జాలచర్మ సాజ్యం చ గుదే ధూపోఽర్శసాం హితః. (చరకే) 77

తా. జిల్లేడువేళ్ళు, జమ్మియాకు, మనుజుని వెంట్రుకలు, నాగుబాముకుబుసము, పిల్లిచర్మము - వీనిని చూర్ణముజేసి నేతితో దడిపి ౪౦ దినములు ఆసనమున పొగ వేసిన అర్శోరోగములు హరించును. మఱియు ఎండిన ఏదుపందికొక్కులచర్మము, సోలెడు మంచివేపవిత్తులు, తులముతాళకము - వీనిని చూర్ణముచేసి కానుగకాయలగాల్చి నిప్పుజేసి దానిపై నీచూర్ణమును వైచి ౭ దినములు రేపుమాపు ఆసనమున పొగవేయుచుండిన అర్శోరోగములు మానును. పిదప గచ్చకొనల నానుదముతో దడిపి వెచ్చజేసి రేపుమాపు ఆసనమున కట్టుగట్టవలయును. మఱియు నాసనమునుపసపునీళ్ళతో గడుగుచుండవలయును. నేలగొలిమిడియాకురసములో మిరియపు చూర్ణము, ఆవునెయ్యి గలిపి త్రాగవలయును. చప్పిడియన్నము, ఆవుపాలు - వీనిని పథ్యమునం దుని చికొనవలయును. మఱియు పందిపురీషమును పొగ వేసిన అర్శోరోగము హరించును.

## కపిత్థాదియోగము

కపిత్థ బిల్వ మజ్జాశ్చ శుంఠీ సైంధవకం సమం,
పిబే త్తక్రేణ చార్శాంసి ప్రవాహం గ్రహణీ జయేత్. 78

తా. వెలగగుజ్జు, మారేడుగుజ్జు, శొంఠి, సైంధవలవణము - వీనిని సమభాగములుగ చల్లతోనూరి సేవించిన అర్శస్సు, అతిసారము, గ్రహణి హరించును.

## మూలరోగమునందుపథ్యము

కతకకందపటోలపునర్నవం తక్రమాజ్యనవనీతరామఠం,
మరిచకం సురదారుఫలం తథా పటుబృహతీద్వయజీవనీవచా. 79
సమసినవ్యముదుంబరవాస్తుకం ఇతిహితం గుదకీలగదేషు చ. 80

తా. ఇందుపుకాయ, కందగడ్డ, పొట్లకాయ, గలిజేరుకూర, ఆవుచల్ల, ఆవునెయ్యి, ఆవువెన్న, ఇంగువ, మిరియాలు, దేవదారుకాయలు, సైంధవలవణము, చిన్నములకకాయలు, పెద్దములకకాయలు, మనుబాలకూర, వస, చేతలాసికూర, లేతమేడికాయ, చిట్టికూర - ఇవి అర్శోరోగమునందు పథ్యకరంబులు.

## మూలరోగమునం దపథ్యము

పిండాల మాష పిణ్యాక దధీ మత్స్యాతిశీతలం,
అలాబూ వార్తకంచైవ పిష్ట బిల్వా ముపోదకీ. 8

హిమాంబు సూపమాంసాని కఠినం కుక్కుటాసనం,
అశ్వాద్యారోహణం స్నాన మపథ్యం ప్రాహురర్శసామ్. 82

తా. చారకంద, మినపప్పు, తెలికపిండి, పెరుగు, మత్స్యములు, కడుశీతకర ద్రవ్యములు, అనుగపుకాయ, వంకాయ, పిండివంటకము, మారేడుకాయ, బచ్చలికూర, శీతోదకము, పప్పు, మాంసము, కఠినపదార్థములు, గొంతుకూర్చుండుట, గుఱ్ఱము మొదలగువాని నెక్కుట, స్నానము - ఇవి అర్శోరోగమునం దపథ్యకరంబులు.

## * ఉపదంశరోగనిదానము

హస్తాభిఘాతాన్నఖదంతఘాతా దధావనాద్రత్యతిసేవనాద్వా,
యోనిప్రదోషాచ్చ భవంతి శిశ్నే పంచోపదంశావివిధాపచారైః.
(నిత్యనాథీయే)

తా. చేతులతో బిసుకుట, గోళ్ళతో గీచుట, దంతములతో గొరుకుట - ఈ మొదలగువానియొక్క యభిఘాతమువలన సురతానంతరము మేఢ్రమును గడుగక నుపేక్షించుట, కడుమైథునముసేయుట, యోనిదోషము, చకారమువలన దుర్గంధముగల యుదకముతో గడుగుట - ఈకారణముల వలన శిశ్నమున ౫ విధములైన ఉపదంశరోగములు జనించును.

శేఫోపర్యుపదంశస్స్యా త్సచ పంచవిధస్స్మృతః,
స్తబ్ధమేఢ్రోఽతిరుగ్వాతా త్పిత్తాద్రక్తాతిదాహవాన్. 84
కఫాత్కాఠిన్యకండూవాన్ రక్తజః పిత్తలక్షణః,
సర్వలింగస్త్రిదోషాఖ్య స్సతు లింగవినాశకః. (మతాంతరే) 85

తా. మేఢ్రముమీఁద వాత, పిత్త, శ్లేష్మ, రక్త, త్రిదోషజములన నైదువిధములైన యుపదంశరోగములు జనించును. అందు వాతోపదంశమున మేఢ్రము మ్రానుపడి కడునొప్పితో గూడియుండును. పైత్త్యోపదంశమున మేఢ్రము ఎఱ్ఱనై మంటలతో గూడియుండును, శ్లేష్మోపదంశము న మేఢ్రము కఠినమై దురదతో గూడియుండు. రక్తోపదంశమున పైత్త్యోపదంశలక్షణయుక్తంబుగ నుండును. త్రిదోషోపదంశమున మేఢ్రము నశించును. (ఇది అసాధ్యము.)

## వాతోపదంశలక్షణము

సతోదభేదస్ఫురణై స్సకృష్ణై స్స్ఫోటై ర్వ్యవస్యేత్పవనోపదంశం,

తా. మేఢ్రమున నల్లనికురుపులు జనించి సూదులతో బొడుచునటుల వేదన, పగుళ్లు, చలనము అనునవి గలిగియుండిన వాతోపదంశ మని తెలియవలయును.

* ఉపదంశ మన కొరుకుజాడ్యము.

## పిత్త, రక్తోపదంశలక్షణములు

పీతై ర్బహుక్లేదయుతై స్సదాహైః పిత్తేనరక్తాత్పిశితావభాసైః. 86

తా. పసపువర్ణముగలకురుపులు జనించి కడుస్రావము, మంటలు గలిగియుండిన పిత్తోపదంశ మనియు, మాంసమువంటి ఎఱ్ఱనికురుపులు జనించిన రక్తోపదంశ మనియు దెలియవలయును.

## కఫోపదంశలక్షణము

సకండురై శ్శోథయుతైర్మహద్భి శ్శుక్లై ర్ఘనస్రావయుతైః కఫేన,

తా. దురద, వాపు అనువానితోడంగూడి తెల్లనివర్ణముగల పెద్దకురుపులవలన వ్యాప్తంబై గట్టిగ చీమును గార్చుచుండిన కఫోపదంశమని దెలియవలయును.

## సన్నిపాతోపదంశలక్షణము

నానావిధస్రావరుజోపపన్న మసాధ్యమాహు స్త్రిమలోపదంశమ్. 87

తా. పలువిధస్రావవేదనలంగలది సన్నిపాతోపదంశ మని దెలియవలయును. ఇది అసాధ్యము.

## అసాధ్యోపదంశలక్షణము

విశీర్ణమాంసం కృమిభిః ప్రజగ్ధం ముష్కావశేషం పరివర్జయేత్తు,

తా. శిథిలమై మాంసముగల ఉపదంశరోగిని, క్రిములవలన మేఢ్రము భక్షింపంబడి వృషణములుమాత్రము శేషించియుండు ఉపదంశరోగిని వైద్యుఁడు వర్జింపవలయును.

సంజాతమాత్రే నకరోతిమూఢః క్రియాం నరో యోవిషయే ప్రసక్తః.
కాలేన శోథ క్రిమి దాహపాకై ర్విశీర్ణశిశ్నో మ్రియతే సతేన,

తా. ఉపదంశరోగము జనించినతోడనే చికిత్సంజేసికొనక విషయాసక్తుఁడై యుండు మూర్ఖపురుషునియొక్క మేఢ్రము కొంతకాలమున్నను పిదప వాపు, పురుగులు, తాపము, పాకము అనువానితోడంగూడి శిథిలం బగును. దానివలన ఆయుపదంశరోగి మృతిజెందును.

## లింగవర్తిలక్షణము

అంకురైరివ సంఘాతై రుపర్యుపరి సంస్థితైః,
క్రమేణ జాయతే వర్తి స్తామ్రచూడశిఖోపమా. 89
కోశస్యాభ్యంతరే సంధౌ సర్వసంధిగతాపి వా,

లింగవర్తిరితిఖ్యాతా లింగార్శ ఇతిచాపరే. 90
కులుత్థాకృతయః కేచి త్కేచి త్పద్మదళోపమాః,
మేఢ్రసంధౌ నృణాం కేచి త్కేచి త్సర్వాశ్రయాస్మృతాః. 91
రుజా దాహార్తి బహులా స్తృష్ణా తోదసమన్వితాః,
స్త్రీణాం పుంసాం చ జాయంతే హ్యుపదంశా స్సుదారుణాః. 92

తా. మేఢ్రముపై మాంసపుమొలక లేక దానిపై నొకటి జనించిన కోడిజుట్టువలె వర్తిగనై వృషణములకు లోనగాని, లేక సర్వసంధులయందుగాని జనింపుచున్నయవి. ఈరోగమును లింగవర్తియనియు, కొందఱు లింగార్శమనియు వచించెదరు. అందు కొన్ని ఉలవలతో సమానముగ, కొన్ని తామరదళముతో సమానముగ కొన్ని మేఢ్రసంధులయందుగాని, మఱికొన్ని సర్వశరీరమునందుగాని జనించి త్రిదోషజన్యంబుగ నుండుటచే మిక్కుటముగ వేదన, తాపము, కడుపీడ, దప్పి, సూదులతో బొడుచునటుల వేదన అనువానితోడం గూడియుండును. మఱియు త్రిదోషజన్యంబై దారుణముగ నుండును.నీ యుపదంశము స్త్రీపురుషుల కిరువురికి జనించుట గలదు.

### ఉపదంశమునకు ప్రక్రియ

స్నిగ్ధస్విన్న శరీరస్య మేఢ్రమధ్యే సిరావ్యథః,
జలూకా పాతినంవాస్యా దూర్ధ్వాధశ్శోధనం తథా. 93
సద్యోహి హృతదోషస్య రుక్ఛోఫా వుపశామ్యతః,
పాకోరక్ష్యః ప్రయత్నేన శిశ్నక్షయకరోహి సః. 94

తా. సర్వాంగమున చమురుపట్టించి గాచి మేఢ్రమధ్యముననుండు సిరను వేధించుటవలనగాని, లేక జలగలవలనగాని రక్తమును స్రవింపంజేసి పిదప వమనవిరేచనంబుల కొసంగిన దోషము నివర్తించి తత్క్షణమున రుక్ఛోఫలు హరించును. మఱియు సిరావ్యథవలనగాని, జలగలవలనగాని గలిగిన వ్రణమును ప్రయత్నపూర్వకముగ మాన్పవలయును. తల్లోపంబున మేఢ్రము నశించును.

### లింగరోగచికిత్స

పక్వం విపాట్య మతిమాన్ వ్రణవ త్సముపాచరేత్. 95

తా. ఉపదంశము పక్వంబైనపిదప మేఢ్రమునందలి దుర్మాంసమును చివ్వి వ్రణము వలెనే బుద్ధిమంతుఁడగువాఁడు చికిత్సం జేయవలయును.

### లింగరోగహరలేపనములు

మహాశంఖం జలైఃపిష్ట్వా తేన లింగం ప్రలేపయేత్,

లింగరోగం నిహంత్యాశు లేపోఽయం వ్యాధినాశకః.
కుష్ఠం పూగం వచా తోయై స్సారం వా ఖాదిరోత్థితం,
జలైర్ఘృష్టం ప్రలేపోఽయం లింగరోగహరః పరమ్.
క్షాళయే త్త్రిఫలాక్వాథైః పక్వం లింగం పునఃపునః,
తచ్చూర్ణలేపమాత్రేణ చాంకురం చ జయేద్ధ్రువమ్.

తా. పెద్దశంఖము నుదకముతో నూరి లింగమునందు లేపనము జేసిన లింగరో శీఘ్రముగ నశించును. లేక చెంగల్వకోష్టు, పోకచెక్క, వస వీనిని గాని, కా గాని నీళ్ళతో నూరి లింగముమీఁద లేపనము జేసి లింగరోగము హరించును. లేక పక్వమైనపిదప త్రిఫలకషాయముతో లింగమును పలుమారు గడిగిన లింగముయొ వాపు హరించును. లేక త్రిఫలముల గాల్చి మసిజేసి దానినిపట్టించిన మేఢ్రమున అంకురములు నిశ్చయముగ హరించును.

సగంధక ఘృతైర్లేప్యం పక్వం లింగం సుఖావహం,
నింబం ఖదిర మంజిష్ఠ చూర్ణం వా లేపయేజ్జయేత్.
పటోదుంబర మశ్వత్థ చూత జంబూ త్వచం సమం,
జలైః క్వాథ్యం చ తేనైవ క్షాళయే ల్లింగపాకనుత్.

తా. గంధకమును నేతితో వండి పక్వమైన లింగముపై లేపనము జేసినను, వేపాకు, చండ్రచెక్క, మంజిష్ఠ - వీనిచూర్ణమును లేపనము జేసినను, లేక మఱ్ఱి, రావి, మామిడి, నేరేడు అనువానిచెక్కలను సమభాగములుగ చూర్ణము జేసి నీరు పోసి కషాయముగాచి దానిచే లింగమును గడుగుచుండినను లింగపాకము హరించును

కుమారీరససంపిష్టం జీరకం లేపయేచ్చ రుక్,
తేన దాహశ్చ పాకశ్చ శాంతిమాప్నోతి నిశ్చితమ్.

తా. కలబందరసముతో తెల్లజీలకఱ్ఱను నూరి లేపనము జేసిన లింగరోగము, రోగమునందలి నొప్పి, మంట, పాకము నిశ్చయముగ శమించును.

### పంచారవిందకఘృతము

మృణాళం పద్మబీజాని నాళం పద్మం చ కేసరం,
సర్వం సప్తపలం కుర్యా త్త్రింశత్పలం చ గోఘృతమ్.
ఘృతా చ్చతుర్గుణం క్షీరం ఘృతశేషం విపాచయేత్,
పాకాంతే చూర్ణమేషాం చ క్షిప్త్వా తదవతారయేత్.
పాయయే ల్లింగరోగఘ్నం ఘృతం పంచారవిందకం,

తా. ఆవునెయ్యి ౩౦ పలములు, ఆవుపాలు ౧-౨౦ పలములు - వీనిని గలిపి నెయ్యి శేషించునటుల గాచి పాకాంతమున తామరగడ్డలు, తామరవిత్తులు, తామరతూండ్లు, దానిపువ్వులు, దానికేసరములు అనుసైదుదినుసులను నేడేసిపలములు గ్రహించి చూర్ణము జేసి వైచి దించుకొని సేవింపుచుండిన లింగరోగమును హరించును.

తుత్థం [1]గైరిక కాసీసం శిలాతాళం రసాంజనమ్. 104
సౌరాష్ట్రీ సైంధవం చైలాం [2]లోధ్రకం రేణుపుష్పకం,
పిష్ట్వా క్షౌద్రేణ సంయోజ్య లేపోలింగరుజాపహః. 105
(మాధవనిదానే)

తా. మైలుతుత్థము, కావిరాయి, అన్నభేది, శిలాజిత్తు, తాళకము, రసాంజనము, తొవరిమన్ను, సైంధవలవణము, ఏలకులు, బొద్దుగచెక్క, రేణుకలు-వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముజేసి తేనెతో గలిపి లేపనముజేసిన లింగపీడ హరించును.

తిలకల్కం క్షౌద్రయుతం లేపో లింగరుజాపహః,

తా. నువ్వులకల్కములో తేనెగలిపి లేపనముజేసిన, లింగరోగము హరించును.

## సర్వఉపదంశములకు వ్యాధిహరణరసము

హింగుళోత్థరసం భాగం ద్వౌభాగౌ రసకర్పూరం,
రసతుల్యం బలిం దద్యా త్ఖల్వమధ్యే తు కజ్జలీమ్. 106
దక్షాండే మృత్పుటం పంచ వాలుకాయంత్రగం పచేత్,
దినైకం తు క్రమాగ్నౌతు స్వాంగశీతం సముద్ధరేత్. 107
పూజయే ద్గురువిప్రాదీ న్వ్యథారోగం ప్రయోజయేత్,
గుంజా చతుష్టయం ఖాదే న్నాగవల్లీదళైర్యుతమ్. 108
షండోఽపి లభతే పుంస్త్వం వాజీకరణ ముత్తమమ్,
అపుత్రః పుత్ర మాప్నోతి జీవేచ్చ శరదాంశతమ్. 109
వలీపలితహృచ్ఛూలం వాతశ్లేష్మ నిబర్హణం,
అయంవ్యాధిహర స్సూతః పూజ్యపాదేన నిర్మితః. 110

తా. ఇంగిలీకములో దీయఁబడిన రసము ౧ భాగము, శుద్ధిచేసిన రసకర్పూరము-౨భాగములు, శుద్ధిచేసిన గంధకము ౧ భాగము-ఇటుల వీనిని ఖల్వములో నునిచి మూఁడు దినములు మర్దించి కజ్జలిచేసి దానిని కోడిగ్రుడ్డులో నునిచి దాపైని చీలమన్నులిచ్చి ఒకదినము వాలుకాయంత్రమున క్రమాగ్నులతో వండి సాంగశీతలమున

1 టంకణ, 2 సిందూరం రేణుభూషణమ్.

దీసి గురుబ్రాహ్మణుల బూజించి నాలుగుగురిగింజలయెత్తును రోగబలానుగుణ్యాముగ తమల పాకులో నునిచి సేవించిన షండత్వము, ముదిమి, బొమ్మనొప్పి, కఫవాతము, ఉపదంశము- వీనిని హరింపంజేసి పుంసత్వమును, అపుత్రునికి సంతానంబును, ౧౦౦ సంవత్సరంబు లాయువును, మిక్కుటముగ వీర్యవృద్ధిని గలుగంజేయును. ఈరసము పూజ్యపాదునిచే జెప్పంబడియెను.

## సూతాదివటికములు

శుద్ధసూతం చ భల్లాతం పిప్పలీమూలపిప్పలీ,
ఆకల్లకం జాతిపత్రీ ఖురకం దేవపుష్పకమ్. 111
మర్దయే త్సమభాగేన పురాణగుడమిశ్రితం,
ఉపదంశేషు సర్వేషు ప్రమాణం రక్తికావటీ. 112

తా. శుద్ధిజేసిన రసము, జీడి, మోడి, పిప్పళ్ళు, అక్కలకఱ్ఱ, జాపత్రి, వంగభస్మము, లవంగములు - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి ప్రాతబెల్లము గలిపి మర్దించి గురుగింజంత మాత్రలుజేసి యందొకదానిని సేవించిన సర్వమైన ఉపదంశములు హరించును.

## ఉపదంశకుఠారము

కంకుష్ఠం కుష్ఠకంచైవ తోలైకం తు పృథక్పృథక్,
తోలార్ధం తుత్థకం గ్రాహ్యం శృంగబేరరసేన తు. 113
మర్దయిత్వా వటీకార్యా బదరాస్థిమితాభిషక్,
శృంగబేరరసేనైవ సాయంప్రాతశ్చ భక్షయేత్. 114
మధురామ్లం మత్స్య దుగ్ధం కూశ్మాండం చ వివర్జయేత్,
ఉపదంశకుఠారోఽయం రసస్సర్వత్ర పూజితః. 115

తా. ముదారుసింగు ౧ తులము, చెంగల్వకోష్టు ౧ తులము - శుద్ధిజేసిన మైలుతుత్థము ½ తులము - ఇటుల వీనినేకముజేసి అల్లపురసముతో మర్దించి రేగువిత్తంతమాత్రలు చేసి సాయంప్రాతఃకాలముల అల్లపురసానుపానముతో సేవించిన ఉపదంశము హరించును. దీనిసేవన కాలంబున మధురము, పులుసు, మత్స్యములు, పాలు, గుమ్మడుకాయ అను వానిని వర్జింపవలయును. ఈరసము సర్వత్ర పూజింపంబడును.

## రసగంధకకజ్జలి

కర్షమాత్రం రసం శుద్ధం ద్వికర్షం గంధకం స్మృతం,
విధివత్కజ్జలీం కృత్వా తచ్చ గోఘృతసంయుతమ్. 116

మాషమాత్రం ప్రతిదినం దద్యాదేవ త్రిసప్తకం,
గోధూమాన్నం ఘృతం పథ్యం కారయే ల్లవణం వినా. 117
ఉపదంశాపహ శ్రేష్ఠో యోగో మునిభిరీరితః,

తా. శుద్ధిచేసిన రసము ౧ కర్షము, శుద్ధిచేసిన గంధకము ౨ కర్షములు-ఈరెంటిని కాటుకవలె మర్దించి మాషమెత్తును ఆవునేతితో గలిపి ౨౧ దినము సేవించిన ఉపదంశము హరించును. దీనియందు లవణమును వర్జించి గోధూమాన్నమును, నెయ్యిని సేవింపవలయును.

బాలహరీతక్యాదియోగము

బాలపథ్యా పలైకం చ తుత్థం శాణమితం తథా. 118
నింబద్రవేణ సంమర్ద్యం దృఢం సప్తదినాని వై,
గుటికాం చణకప్రాయాం ఛాయాశుష్కాంతు కారయేత్. 119
శీతోదకానుపానేన నిత్యమేకాం ప్రదాపయేత్,
ఘస్రాణా మేకవింశత్యా ముచ్యతే తూపదంశతః. 120
శాలి గోధూమ ముద్గాశ్చ గోసర్పిః పథ్యమీరితం,

తా. కరకపిందెలు ౪ రూపాయలయెత్తు, శుద్ధిచేసిన మైలుతుత్తము ౪ రూపాయయెత్తు-ఈరెంటిని నిమ్మపండ్లరసముతో ౭ దినములు భావనజేసి మర్దించి సెనగగింజంత మాత్రలుజేసి నీడనెండించి శీతోదకముతో ౨౧ దినము సేవించిన ఉపదంశము హరించును. దీనియందు వరిబియ్యపువంటకము, గోధూమాన్నము, పెసలు, ఆవునెయ్యి అను వానిని పథ్యమునందు జేర్చికొనందగును.

పారదాదిలేపము

పారదం గంధకం తాళం దరదం చ మనశ్శిలామ్. 121
పృథక్కర్షం ద్వికర్షం చ ముద్దారం శంఖజీరకం,
విధాయ కజ్జలీం శ్లక్ష్ణాం మర్దయే త్సురసారసైః. 122
ఛాయాశుష్కం తతఃకృత్వా పునరున్మత్తజద్రవైః,
విమర్ద్యాథ వటీకార్యా హ్యుపదంశే ప్రయోజయేత్. 123
గోఘృతేన ప్రలేపోఽయం వ్రణానాం రోపణే హితః,

తా. రసము, గంధకము, తాళకము, ఇంగిలీకము, మణిశిల-ఇవి దినుసు కొక్కొక కర్షము, ముదారుసింగు, సీమరాతినార-ఇవి దినుసుకు రెండుకర్షములు-ఇటుల వీనిని ఖల్వములో నునిచి కాటుకవలె నూరి పిదప తులసియాకురసముతో మర్దించి నీడనెండించి

మరల ఉష్ణోత్తాపరసముతో, మర్దించి యుండజేసి ఆవునేతితో చాది లేపనము ఉపదంశము హరించుటయేగాక వ్రణమును మాంసపూరితంబగును.

త్రిఫలాదిప్రక్షాళనము

త్రిఫలాయాః కషాయేణ భృంగరాజరసేన వా.
వ్రణప్రక్షాళనం కుర్యా దుపదంశప్రశాంతయే,

తా. త్రిఫలకషాయముతోగాని, లేక గుంటగలగర కషాయముతోగాని ఉపదంశమును గడిగిన శమించును.

శూకదోషనిదానము

అక్రమా చ్ఛేఫసో వృద్ధిం యోఽభివాంఛతి మూఢధీః.
వ్యాధయ స్తస్య జాయంతే దశచాష్టౌ చ శూకజాః,

తా. మందబుద్ధివలన క్రమవిహీనుండై మేఢ్రము లావుగ నిడుపుగా వలయుననియిచ్చుచే విషజంతువును (అనఁగా జలమునందుండుకప్పను) లేపనము సేయుటవలన, దుష్టయోని సంబంధమువలన, యోనియందు వెంట్రుకలుగల స్త్రీసంబంధమువలన ౧౮ విధము శూక రోగములు జనించును.

సర్షపికలక్షణము

గౌరసర్షపసంస్థానా శూకదుర్భగ్నహేతుకా.
పిటికా శ్లేష్మవాతాభ్యాం జ్ఞేయా సర్షపికాచసా,

తా. జలమునందుండుకప్పను లేపనముసేయుటవలన, దుష్టయోనిసంబంధమువలన కఫవాతములు ప్రకోపించి తెల్లయావాలప్రమాణముగలకురుపు మేఢ్రమునందు గలుగఁజేయును. ఇదియ సర్షపిక మనంబడును.

అష్ఠీలికాలక్షణము

కఠినావిషమైర్భగ్నై ర్వాయునాష్ఠీలికా భవేత్.

తా. అప్రశస్తమైన *శూకముల లేపనము సేయుటవలన వాతము ప్రకోపించి గుండ్రముగ, కఠినముగ నుండుకురుపుల గలుగంజేయును. ఇదియ అష్ఠీలిక మనంబడును.

గ్రథితలక్షణము

శూకైః ర్యత్పూరితం శశ్వ ద్గ్రథితం నామ తత్కఫాత్,

తా. ఎల్లపుడు శూకముల లేపనముసేయుటవలన కఫము ప్రకోపించి మేఢ్రముపై గంట్లు జనించును. ఇది గ్రథిత మనంబడును.

*శూకము అనఁగా జలమునందుండు కప్ప.

కుంభికాలక్షణము

కుంభికా రక్తపిత్తోత్థా జాంబవాస్థినిభాశుభా. 128

తా. శూకలేపనమువలన రక్తపిత్తము ప్రకోపించి నేరేడువిత్తులవంటి నల్లని కురుపుల గలుగంజేయును. ఇదియ కుంభిక మనంబడును.

అలజీలక్షణము

తుల్యజాం త్వలజీం. విద్యాద్యథా ప్రోక్తాం విచక్షణైః,

తా. శూకలేపనమువలన ప్రమేహపిటికానిదానమున జెప్పంబడిన అలజీలక్షణ తుల్యంబైయుండు కురుపులు జనించిన అలజి యనంబడును.

మృదితలక్షణము

మృదితం పీడితం యత్తు సంరబ్ధం వాతకోపతః. 129

తా. శూకలేపనానంతరము మేఢ్రమును బిసుకుటవలనగాని, లేక అదుముట వలనగాని, వాతము ప్రకోపించి మేఢ్రమునవాపు గలుగంజేసి మృదిత మనంబడును.

సంమూఢపిటికాలక్షణము

పాణిభ్యాం భృశసంమూఢే సంమూఢ పిటికా భవేత్,

తా. లేపనానంతరము రెండుచేతులతో మేఢ్రమును మిక్కుటముగ బిసుకుట వలన నోరులేకుండు పిటికలు జనించును. ఇదియ మూఢపిటిక యనంబడును.

అవమంథలక్షణము

దీర్ఘాబహ్వ్యశ్చ పిటికా దీర్యంతే మధ్యతస్తుయాః. 130
సోఽవమంథః కఫా సృగ్భ్యాం వేదనా రోమహర్షకృత్,

తా. శూకలేపనమువలన కఫరక్తము ప్రకోపించి పొడవుగ, మిక్కుటముగ, మధ్యమధ్య పగిలినవిగ నుండు కురుపుల మేఢ్రముపై గలుగంజేయును. దానిసంబంధము వలన, వేదన, రోమాంచము గలుగును. ఇదియ అవమంథ మనంబడును.

పుష్కరికాలక్షణము

పిత్తశోణితసంభూతా పిటికా పిటికాచితా. 131
పద్మకర్ణకసంస్థానా జ్ఞేయా పుష్కరికాచసా,

తా. శూకదోషజనితపిత్తరక్తమువలన కురుపులు జనించి పండి చుట్టు సన్నని కురుపులతో వ్యాప్తంబై ఒకటిగ జేరుటవలన కమలముయొక్క కర్ణికమువలె గనుపించును. ఇదియ పుష్కరిక యనంబడును.

### స్పర్శహానిలక్షణము

స్పర్శహానిం తు జనయే చ్ఛోణితం శూకదూషితమ్. 132

తా. శూకలేపనమువలన రక్తము దుష్టంబై చర్మమున స్పర్శజ్ఞానము లేకుండు నటులంజేయును. ఇదియ స్పర్శహాని యనంబడును.

### ఉత్తమాలక్షణము

ముద్గమాషోద్గమారక్తా రక్తపిత్తోద్భవాశ్రయాః,
వ్యాధిరేషోత్తమానామ శూకాజీర్ణనిమిత్తజః. 133

తా. శూకములను పలుమారు లేపనముసేయుటవలన రక్తపిత్తము కుపితంబై పెసలు, ఉద్దులు అనువాని ప్రమాణముగలదై యెఱ్ఱగ నుండుకురుపుల మేఢ్రమున గలుగం జేయును. ఇదియ ఉత్తమ మనంబడును.

### శతపోనకలక్షణము

ఛిద్రైరణుముఖైర్లింగం చితంయస్య సమంతతః,
వాతశోణితజో వ్యాధిర్విజ్ఞేయ శ్శతపోనకః. 134

తా. శూకదోషజనితవాతరక్తమువలన లింగముపై ననేక సూక్ష్మముఖములుగల ఛిద్రములు గలిగిన శతపోనక మనంబడును.

### త్వక్పాకలక్షణము

వాతపిత్తకృతో యస్తు త్వక్పాకో జ్వరదాహవాన్,

తా. శూకదోషజనిత వాతపిత్తమువలన మేఢ్రముయొక్క చర్మము పండి జ్వర దాహములు గలిగిన త్వక్పాక మనంబడును.

### శోణితార్బుదలక్షణము

కృష్ణైస్ఫోటైస్సరక్తాభిః పిటికాభిర్నిపీడితమ్. 135
యస్యవాస్తు రుజాచోగ్రా జ్ఞేయం తచ్ఛోణితార్బుదం,

తా. శూకదోషమువలన మేఢ్రముపై నల్లగ, లేక ఎఱ్ఱగనుండుకురుపులు జనించి వ్రణస్థానమున మిక్కుటముగ పోట్లుగలిగిన శోణితార్బుద మనంబడును.

### మాంసార్బుదలక్షణము

మాంసదోషేణ జానీయా దర్బుదం మాంససంభవమ్. 136

తా. శూకదోషముచే మాంసము దుష్టంబగుటవలన మాంసార్బుదము జనించును.

### మాంసపాకలక్షణము

శీర్యంతే యస్యమాంసాని యస్యసర్వాశ్చ వేదనాః,
విద్యాత్తం మాంసపాకం తు సర్వదోషకృతం భిషక్. 137

తా. శూకదోషమువలన మేఢ్రమునందలి మాంసమ్ముకుళ్ళి ఊడిపడి పలువిధ పీడల గలుఁగఁజేయుచుండిన మాంసపాక మనంబడును. ఇది త్రిదోషమువలన జనించును.

### విద్రధిలక్షణము

విద్రధిం సన్నిపాతేన యథోక్త మభినిర్దిశేత్,

తా. శూకదోషమువలన జనించి విద్రధిరోగనిదానమున జెప్పఁబడిన సన్నిపాత విద్రధిలక్షణతుల్యంబై యుండునది విద్రధి యనంబడును.

### తిలకాలకలక్షణము

కృష్ణాని చిత్రాణ్యథవా శూకాని సవిషాణి తు. 138
పాతితాని పచంత్యాశు మేఢ్రం నిరవశేషతః,
కాలాని భూత్వా మాంసాని శీర్యంతే యస్యదేహినః. 139
సన్నిపాతసముత్థాంస్తు తాన్విద్యాత్తిలకాలకాన్,

తా. నల్లగ లేక చిత్రవిచిత్రమైన ఛాయగలవిగనుండు విషశూకముల లేపనము సేయుటవలన తత్క్షణమున మేఢ్రంబంతయు పండి అందలిసర్వమాంసము తిలలవలె నల్లనై రాలిన తిలకాలక మనంబడును. ఇది త్రిదోషమువలన జనించును.

### అసాధ్యశూకదోషలక్షణము

తత్ర మాంసార్బుదం యచ్చ మాంసపాకశ్చ యస్స్మృతః. 140
విద్రధిశ్చ న సిధ్యంతి యేచ స్యుస్తిలకాలకాః,

తా. శూకదోషములో మాంసార్బుదము, మాంసపాకము, విద్రధి, తిలకాలకము అనునవి అసాధ్యంబులు.

### శూకదోషచికిత్స

హితం చ సర్పిషః పానం పథ్యంచాపి విరేచనమ్. 141
హితశ్శోణితమోక్షశ్చ శూకరోగేషు దేహినాం,

తా. శూకరోగమున ఘృతపానము, విరేచనము, రక్తమోక్షణము హితకరంబులు.

### సార్షపచికిత్స

ఉల్లిఖ్య సార్షపి తిలపత్రేణాథ ప్రలేపయేత్. 142

తిందుక త్రిఫలా లోధ్రైర్గోమూత్రపరివేషితైః,

తా. సార్షపమును శూకదోషమున నువ్వులయాకుతో *లేఖనక్రియం జేసి తుమికి త్రిఫలములు, లొద్దుగచెక్క అనువానిని గోమూత్రముతో నూరి లేపనము సేయ వలయును.

అష్ఠీలికాచికిత్స

అష్ఠీలాయాం హృతే రక్తే శ్లేష్మగ్రంథిక్రియాం చరేత్. 143

తా. అష్ఠీలికమను శూకరోగమున రక్తస్రావము జేయించి శ్లేష్మగ్రంథివలెనే చికిత్సింపవలయును.

గ్రథితచికిత్స

స్వేదయేద్గ్రథితం యచ్చ నాడీ స్వేదేన బుద్ధిమాన్,
సుఖోష్ణై రుపనాహైశ్చ వ్రణోక్తై రుపనాహయేత్. 144

తా. గ్రథితమనుశూకదోషమున బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు గొట్టముతో శాకమునిచ్చి చెమటను దీయుటయేగాక వ్రణమునకై జెప్పంబడియుండు కట్లను సుఖోష్ణముగ దీనియందును గట్టవలయును.

కుంభికాచికిత్స

కుంభికాయాం హరేద్రక్తం పక్వాయాం శోధితే వ్రణే,
తిందుక త్రిఫలా లోధ్రైర్లేపస్తైలం చ రోపణమ్. 145

తా. కుంభికమను శూకదోషమున రక్తమును దీయవలయును. అది పండినయెడల వ్రణశోధనక్రియం జేసి పిదప తుమికి, త్రిఫలములు, లొద్దుగుచెక్క అనువానిలేపనమును, మఱియు నాద్రవ్యములతో సిద్ధముజేయఁబడిన తైలలేపనమును జేసిన వ్రణము మానును.

అలజికాచికిత్స

అలజ్యాం హృతరక్తాయాం పూర్వవచ్చ క్రియా క్రమః,

తా. అలజి యను శూకదోషమున పైఁజెప్పఁబడిన ప్రకారము రక్తమును దీసి కుంభికమువలెనే చికిత్సింపవలయును.

అవమంథచికిత్స

క్రియేయ మవమంథేపి రక్తం శోధ్యం యథోభయోః. 146

* లేఖనక్రియ యన రుద్దుట.

తా. అవమంథమను శూకరోగమున పూర్వోక్తకుంభిక అలజీవలెనే రక్తస్రావము నుం జేయింపవలయును.

పుష్కరీమూఢపిటికాచికిత్స

క్రమః పిత్తవిసర్పోక్తః పుష్కరీ మూఢయో ర్హితః,

తా. పుష్కరికము, మూఢపిటికము అను నీరెండు శూకదోషములయందును పిత్తవిసర్పమునకై చెప్పంబడిన చికిత్సం జేయవలయును.

ఉత్తమాశూకరోగచికిత్స

ఉత్తమాఖ్యాం తు పిటికాం సంస్వేద్య బహుశో ఘృతైః. 147
కల్కచూర్ణైః కషాయైశ్చ క్షౌద్రయుక్తై రుపాచరేత్,

తా. ఉత్తమాఖ్యమను శూకరోగమున విశేషముగ నొత్తడమునిచ్చి పిదప ఘృత కల్క చూర్ణకషాయములలో మద్యమునుజేర్చి దానితో నుపచరించవలయును.

శతపోనకచికిత్స

రసక్రియా విధాతవ్యా లిఖితే శతపోనకే. 148
పృథక్పర్ణ్యాదిభి స్సిద్ధం తైలం దేయ మనంతరం,

తా. శతపోనకమను శూకరోగమున తొలుత లేఖనక్రియం జేసి పిదప పారదక్రియను జేయుటయేగాక శాలిపర్ణి మొదలగువానియుక్తముగ సిద్ధము జేయఁబడిన తైలము నొసంగవలయును.

త్వక్పాక, స్పర్శహాని, మృదితములకు చికిత్స

త్వక్పాకే స్పర్శహానౌ చ సేచయే న్మృదితే పునః. 149
బలాతైలేన కోష్ణేన మధురై శ్చోపనాహయేత్,

తా. త్వక్పాకము, స్పర్శహాని, మృదితము అను శూకరోగములయందు మందోష్ణముగల బలాతైలమువలన సేచనక్రియంజేసి వానిపై మధురౌషధముల నునిచి కట్టుగట్టవలయును.

తిలకాలకచికిత్స

తిలకాలం సముల్లిఖ్య క్షురేణ లఘుపాణినా. 150
భిషజా ధాత్రికర్తవ్య స్సద్యోవ్రణవినిర్మితః,

తా. తిలకాలకమను శూకరోగమును మంగలకత్తితో లఘువుగ గీచి సద్యోవ్రణచికిత్సం జేయవలయును. (ఇటులనే మాంసార్బుదము, మాంసపాకము, విద్రధి అను వానిని సగా చికిత్సింపందగును.)

### ఉపదంశములయందు పథ్యము

ఛర్దిర్విరేకో ధ్వజమధ్యనాడీ వేధోజలూకా పరిపాతనం చ,
సేకః ప్రలేపో యవశాలయశ్చ ధన్వామిషం ముద్గరసో ఘృతాని.
కటిల్లకం శిగ్రుఫలం పటోలం శాలిం చ శాకం నవమూలకం చ,
తిక్తంకషాయం మధుకూపవారి తైలం చ హన్యా దుపదంశరోగమ్.

తా. వమనవిరేచనముల జేయించుట, లింగమధ్యమున నుండు సిరను వేధించుట, జలగల నంటించుట, సేచన లేపనములంజేయుట, యవధాన్యము, అరణ్యసంబంధమైన మాంసము, పెసరకట్టు, నెయ్యి, కాకరకాయ, మునక్కాయ, పొట్లకాయ, వరియన్నము, * శాకము, లేతముల్లంగి, చేదు, వగరు, తీపిగలరసములు, బావినీళ్ళు, నూనె-ఇవి యుపదంశరోగమున పథ్యకరంబు లగుటచే ఉపదంశరోగమును హరింపజేయును.

### ఉపదంశాదులయం దపథ్యము

దివానిద్రా మూత్రవేగం గుర్వన్నం మైథునం గుడం,
వ్యాయామ మమ్లం తక్రం చ వర్జయే దుపదంశవాన్. 153

తా. పగలునిద్రించుట, మూత్రవేగము నడ్డగించుట, జడాన్నమును సేవించుట, మైథునముసేయుట, బెల్లమును భుజించుట, వ్యాయామముసేయుట, పులుసు, మజ్జిగ అనువానిని సేవించుట-ఇవి యుపదంశరోగమునం దపథ్యకరంబు లగుటచే వానిని వర్జింపవలయును.

### అండవృద్ధినిదానము

క్రుద్ధోనూర్ధ్వగతి ర్వాయు శ్శోథశూలకర శ్చరన్,
ముష్కౌ వంక్షణతః ప్రాప్య ఫలకోశాభివాహినీః. 154
ప్రపీడ్య ధమనీర్వృద్ధిం కరోతి ఫలకోశయోః,

తా. అన్నపానాది వైషమ్యమువలన అధోముఖముగ సంచరించువాతము దుష్టంబై వృషణములయందు వ్యాపించి వాపును, శూలను గలుగంజేయుచు గజ్జలమూలముగ వృషణకోశములయందు వ్యాపించెడి నాడుల దుష్టంబులుగ జేసి వృషణములయందలి విత్తులలో నొకటినైనను, లేక రెంటినైనను, వృద్ధి జేయుచున్నయది.

---

*శాక మన—బచ్చలిమొదలగు ఆకుకూరలు, అరటిమొదలగు వానిపువ్వులు, వెదురుగొమ్ము మొదలగునవి, ములక, లవంగము మొదలగువానిపట్టలు, గుమ్మడు మొదలగువానికాయలు, కంద మొదలగువానిగడ్డలు, పులిచింత మొదలగువానిచిగుళ్ళు, కందులు మొదలగువానిపప్పు, హస్తిశాకము మొదలగువానికాడలు అనునవి.

### అండవృద్ధిభేదములు

దోషాస్రమేదో మూత్రాంత్రైస్సవృద్ధిస్సప్తధా గదః. 155
మూత్రాంత్రజావప్యనిలా ద్ధేతుభేదస్తు కేవలం,

తా. అండవృద్ధి వాతజము, పిత్తజము, శ్లేష్మజము, రక్తజము, మేదోజము, మూత్రజము, ఆంత్రజము, (అనఁగా నరములు దిగబడుట) అని యేడువిధంబులు. అందు మూత్రజము, ఆంత్రజము అన నీ రెండువృద్ధులు వాతమువలన జనించును. ఐనను కారణముమాత్రము వేరుగ నుండును.

### వాతాద్యండవృద్ధిలక్షణము

వాతపూర్ణదృతిస్పర్శో రూక్షో వాతా దహేతురుక్. 156
పక్వోదుంబరసంకాశః పిత్తాద్దాహోష్మ పాకవాన్,
కఫాచ్ఛీతో గురుస్నిగ్ధః కండూమాన్ కఠినోఽల్పరుక్. 157
కృష్ణస్ఫోటావృతః పిత్తావృద్ధిలింగశ్చ రక్తజః,
కఫవన్మేదసోవృద్ధి ర్మృదుస్తాలఫలోపమః. 158

తా. వాయువువలన పూరింపఁబడినతిత్తిని దాఁకిన యెట్టిస్పర్శగలుగునో, అట్టిస్పర్శతో దుల్యంబై రూక్ష, నిష్కారణముగ నొప్పి గలదై యుండునది వాతజవృద్ధియనియు, మేడిపండుతో సమానంబై తాపము, ఉష్ణము, పాకము అనువానితోఁగూడి యుండునది పిత్తజవృద్ధి యనియు, చల్లగ, జడముగ, నునుపుగ, దురదగ, కాఠిన్యముగ, అల్పవేదనగలదిగ నుండునది శ్లేష్మజవృద్ధియనియు, నల్లనికురుపులతో వ్యాప్తంబై పిత్తవృద్ధిలక్షణయుక్తంబై యుండునది రక్తజవృద్ధియనియు, కఫలక్షణయుక్తంబై మృదువుగ, పండిన తాళఫలమువలె నల్లనిఛాయగలదిగ, గుండ్రముగ నుండునది మేదోజవృద్ధి యనియు తెలియవలయును.

### మూత్రవృద్ధిలక్షణము

మూత్రధారణశీలస్య మూత్రజస్సతు గచ్ఛతః,
అంభోభిః పూర్ణదృతివ త్క్షోభం యాతి సరుఙ్మృదుః. 159
మూత్రకృచ్ఛ్రమథస్స్యాచ్చ చలయస్ఫలకోశయోః,

తా. మూత్రము నడ్డగించెడి యభ్యాసముగలవానియొక్క అండము నడుచుచుండునపుడు రక్తముతో నిండింపఁబడిన తోలుతిత్తివలె క్షోభ, ఒకింతనొప్పి, చేతితో దాఁకిన మృదుత్వముగలదై మూత్రము సాధారణముగ వెడలక అండతిత్తులయందు పూరితంబై ఇటునటు చలించుచుండిన మూత్రవృద్ధి యని తెలియవలయును.

### ఆంత్రవృద్ధిలక్షణము

వాతకోపిభిరాహారై శ్శీతతోయావగాహనైః. 160
ధారణే రణభారాధ్వ విషమాంగప్రవర్తనైః,
క్షోభణైః క్షుభితోఽన్యైశ్చ క్షుద్రాంత్రావయవం యదా. 161
పవనో విగుణీకృత్య స్వనివేశాదధోనయేత్,
కుర్యా ద్వంక్షణసంధిస్థో గ్రంథ్యాభం శ్వయథుం తదా. 162

తా. వాతమును బ్రకోపింపంజేసెడి యాహారముల సేవించుట, శీతోదకములో గ్రుంకుట, ఉపస్థిత మలమూత్రాదివేగము నడ్డగించుట, మలమూత్రాదులయొక్క అప్రాప్త వేగమును ప్రేరణసేయుట, కడుభారమును మోయుట, బహుదూరము నడచుట, వక్రముగ నడుచుట మొదలగుకార్యములసేయుట, ఇతరులచే జేయంబడు బలవద్విగ్రహాదుల వలన క్షోభంజెందుట-ఈకారణములవలన వాతము బ్రకోపించి సన్ననిప్రేగులయొక్క నొకభాగము నాశ్రయించి వానిసంకోచమునుగాని, లేక స్వస్థానముననుండి క్రిందికి దిగునపుడు గజ్జలసందులయందు గంటువలె వాపునుగాని గలుగంజేయుచున్నది.

### ఉపేక్షిత అండవృద్ధిపరిణామము

ఉపేక్ష్యమాణస్యచ ముష్కవృద్ధి మాధ్మానరుక్స్తంభవతీంసవాయుః,
ప్రపీడితోఽంతస్స్వనవాన్ప్రయాతి ప్రధ్మాపయన్నేతిపునశ్చముక్తః.

తా. వాపు, పోట్లు, ఈడుపుగల యండవృద్ధియందు చికిత్సంజేయక నుపేక్షించుటవలన అండముబిసికిన యందలివాతము కొకో యను శబ్దమును జేయుచుపైకెగును. దానినివిడిచిన మరల నా వాయువు దిగి యండమునందు వాపును గలుగంజేయును.

### అసాధ్యాండవృద్ధిలక్షణము

క్షుద్రాంత్రావయవాశ్లేషా న్ముష్కయో ర్వాతసంచయాత్,
ఆంత్రవృద్ధిరసాధ్యోఽయం వాతవృద్ధిసమాకృతిః. 164

తా. సన్ననినరములయొక్క సంబంధమువలన, అండమునందు వాతముజేరుట వలన, వాతవృద్ధిలక్షణయుక్తంబై జనించునట్టి ఆంత్రవృద్ధిఅసాధ్యము. (ఈయండవృద్ధినే కొందరు కురంటమనియు, ఆంత్రవృద్ధియనియు వచించెదరు. మఱియు గ్రంథాంతరములయందు అండవృద్ధినిదానంబున వర్ధ్మనిదానంబును చెప్పంబడియున్నయది. ఎట్లనిన ("శ్లో. అత్యభిష్యంది గుర్వాను సేవనా న్నిచయంగతః, కరోతి గ్రంథివచ్ఛోఫందోషో వంక్షణసంధిషు, జ్వరశూలాంగతాపార్తిం తం వర్ధ్మమితి నిర్దిశేత్." అనఁగా అత్యంత

స్రోతస్సావి, జడము, ఆమము గలయన్నము సేవించుటవలన వృద్ధిచెందినదోషము గజ్జలయొక్క సంధులయందు గంటువలె వాపును గలుగం జేయుచున్నయది. దాని వలన జ్వరము, పోట్లు, శరీరమున జిలజిల అనునవి గలుగును. ఈరోగమును వర్ధ్మమని వచించెదరు.)

## దార్వ్యాదిచూర్ణము

చూర్ణం దార్వ్యా హరిద్రాయా గవాంమూత్రేచ నిష్కకం,
పిబే చ్ఛిరోద్భితాం హంతి చాంత్రవృద్ధిం న సంశయః. 165

తా. మ్రానిపసపు, పసపు - వీనిని చూర్ణముజేసి నిష్కప్రమాణమును గోమూత్రములో గలిపి త్రాగిన చిరకాలముగనుండు ఆంత్రవృద్ధి హరించును.

## వృద్ధినాశనరసము

రసగంధౌ సమౌ తాభ్యాం ద్విగుణం హేమమాక్షికం,
పథ్యారసేన త్రిదినం రుబుతైలేన వాసరమ్. 166
మర్దితం సిద్ధిమాయాతిం రసేంద్రో వృద్ధినాశనః,

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము-ఇవి దినుసుకొక్కొకభాగము, శుద్ధిజేసిన స్వర్ణమాక్షికము 2 భాగములు-ఇటుల వీనిని ఖల్వములో నునిచి కరక్కాయకషాయముతో 3 దినములు, ఆముదముతో నొకదినము మర్దించి సిద్ధముజేసి దానిని సేవించిన అండవృద్ధి నశించును.

## అజాజ్యాదిలేపనము

అజాజీ హపుషా కుష్ఠం గోమయం బదరాన్వితమ్. 167
కాంజికేన తు సంపిష్టం కుర్యా ద్వర్ధ్మప్రలేపనం,

తా. జీలకఱ్ఱ, సోపు, చెంగల్వకోష్టు, ఆవుపేడ, రేగు-వీనిని కలితో నూరి లేపనముజేసిన అండవృద్ధి, ముష్కరోగము, ఆంత్రవృద్ధి హరించును.

## లాక్షాదిలేపము

లాక్షా కరంజబీజంచ శుంఠీ దారు సగైరికమ్. 168
కుందరంచ సమం కృత్వా చూర్ణయే న్మతిమాన్ భిషక్,
కాంజికేన తు సంపేష్యా ముష్కశ్వయథునాశనః. 169

తా. లక్క, క్రానుగవిత్తులు, శొంఠి, దేవదారు, కావిరాయి - ఇవి సమభాగములు-వీనికి సమము కుందురుగడ్డిచూర్ణము గలిపి కలితో మర్దించి కించిదుష్ణముజేసి లేపనముజేసిన అండవృద్ధి నశించును.

### అసాధ్యాంత్రవృద్ధిలక్షణము

వృద్ధిస్సప్తవిధా జ్ఞేయా ఫలకోశవిదూషణాత్,
ఆంత్రజాధ్మాతవస్తిస్స్యాచ్ఛ్వాసశూలానకిధ్యతి. (మాధవనిదానే

తా. అపానవాతము ప్రకోపించిన సప్తవృద్ధుల గలుగంజేయును. అపానవాతమ అండములయందు వ్యాపించి దోషయుక్తంబుగజేసి వస్తియందు ప్రేగుల నుబ్బించినః లేక శ్వాస, శూల అనువానిని గలుగంజేసినను ఆంత్రవృద్ధిరోగము అసాధ్యము.

లశునాదిక మేరండతైలం వృద్ధివినాశనం,
స్రావయేన్మూత్రజాం వృద్ధి మాంత్రవృద్ధిం దహేద్భిషక్. 17
(మాధవనిదానే

తా. లశునాద్యేరండతైలము సర్వవృద్ధుల హరింపంజేయును. మూత్రవృద్ధియంం శలాకతోడంబొడిచి నీరును స్రవింపంజేయవలయును. ఆంత్రవృద్ధియందు రక్షవేం వలయును.

పిత్తే రక్తం స్రావయేచ్చ జలూకాభిర్విశేషతః, (శారీ

తా. పిత్తమువలనజనించిన ఆంత్రవృద్ధియందు జలగలచేత రక్తమును బైలువుఃః వలయును. (పాదములయందు శూలజనించి పాదములయొక్క వెనుకటిపార్శ్వమః భుజమునందు వ్యాపించి యందుండి వృషణములం జొచ్చి ఆవృషణనరముల ఎఱ్ఱలవ జుట్టికొనునటులంజేసి వానినుబ్బించిన పాదవృద్ధి యనంబడును. శిరమునం దొకపార్శ మున శూల జనించి భుజములమూలముగ వృషణములందు జొచ్చి ఒకబీజమును ప్రక వాటుగ నొరగదీసిన పార్శ్వవృద్ధి యనంబడును. ఒకవృషణం బుబ్బి శూలించిన ఒరః మనంబడును.)

### సప్తవృద్ధిచికిత్సలు

సప్తవృద్ధిషు కర్తవ్యం కరంజార్కపునర్నవైః. 17
పురందరలతాభిర్వా లేపనం శోభనాశనం,

తా. క్రానుగాకు, జిల్లేడాకు, గలిజేరాకు అనువానినిగాని, లేక పాపరవేరు గాని నూరి సప్తవృద్ధులయందు లేపనముజేసిన వాపు హరించును.

మూలైరేరండనిర్గుండీ నాసారేయశృతం జలమ్. 17
సైంధవైరండతైలాఢ్యం సప్తవృద్ధిషు పాయయేత్,

తా. చిట్టాముదపువేరు, వావిలివేరు, మేలుగోరింటవేరు - వీనిని సమభాగముల

దంచి కషాయము గాచి అందు సైంధవలవణము, ఆముదము కలపి త్రాగిన సప్తవృద్ధులు హరించును.

సరామఠం కుబేరాక్షీ కుళుత్థ లశునైర్వృతమ్. 174
సలిలం ఘృతసంయుక్తం సప్తవృద్ధిషు పాయయేత్,
ఇంద్రవల్లీ ప్రసారిణ్యోః క్వాథస్సాన్య త్సప్తవృద్ధిజిత్. 175
మహిషాక్షస్య చూర్ణంతు శర్కరామధుసంయుతం,
పిబే ద్గుళూచీక్వాథేన సప్తవృద్ధ్యుపశాంతయే. (మతాంతరే)

తా. ఇంగువ, గచ్చపలుకులు, ఉలవలు, వెల్లుల్లి-వీనిలో నుదకముపోసి కషాయము గాచి అందు నెయ్యి గలిపి త్రాగినను, లేక పాపరవేరు గొంతెమగోరువేరు-వీనినికషాయము గాచి త్రాగినను, లేక తిప్పతీఁగెకషాయముతో శుద్ధిజేసిన మహిసాక్షి గుగ్గిలచూర్ణమును, పంచదారను, తేనెను గలిపి త్రాగినను సప్తవృద్ధులు హరించును.

మోరటమూలకషాయవిమిశ్రంహింగుమహౌషధసైంధవకృష్ణాః,
చూర్ణమిదం ప్రపిబేచ్చ దినాదౌ సప్తవృద్ధి మపహంతిచ సద్యః.
సువర్చకంసైంధవహింగుజీరకైః కరంజయుగ్మశ్రవణాహ్వభేషజైః,
కటుత్రికైశ్చూర్ణయుతంపయః పిబేత్తరోతిముష్కంకరిముష్కసన్నిభమ్.

తా. చాగవేరు కషాయములో ఇంగువ,శొంఠి, సైంధవలవణము, పిప్పళ్ళు అనువానిచూర్ణముగలిపి ప్రాతఃకాలమున త్రాగిన తత్క్షణమున సప్తవృద్ధులు హరించును. సౌవర్చలవణము, సైంధవలవణము, ఇంగువ, జీలకఱ్ఱ, క్రానుగచెక్క, సెమలిచెక్క, బోడతరము, శొంఠి, త్రికటుకములు-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి పాలలో గలిపి త్రాగిన వృషణములు ఏనుగువృషణములవలె చిన్నవిగ నగును.

జటిలాముండిశిగ్రూచ చించాపత్రరసాఢకే,
తైలం ప్రస్థం పచే ల్లేపా త్సప్తవృద్ధిమపోహతి. 179

తా. ఆఢకప్రమాణము చింతాకురసముతో నొకప్రస్థము నూనె గలిపి తైలము శేషించునటుల గాచి అందు వస బోడతరము, మునగచెక్క అనువానిచూర్ణమును గలిపి దించికొని ఆరుమాసములు లేపనముసేయుచుండిన సప్తవృద్ధులు హరించును. (సప్తవృద్ధుల యందు బెండాకును, పుట్టమన్నును నూరి దానితో నాలుగుగడియలు నొత్తడము నిచ్చి కట్టుగట్టవలయును. ఇటుల నాలుగుమాసములు చేసిన కోడిగుడ్లముట్టువలె స్రవించెడి సప్త వృద్ధులు హరించును.)

గీ. వెలయ నీచేతరాసియు వేళ్ళరసము
మిరియమునుగూర్చి వేగమ మెసఁగ నొకటి
చెలఁగి దుశ్చేరుగంధంబు సేవతూడి
యాకు కబళాన బుడ్డలు నడఁగిపోవు.

కర్షైకం తిలతైలం తు పలైకః చార్ద్రికద్రవం,
యఃపిబే త్ప్రాతరుత్థాయ తస్యాంత్రవృద్ధిహృద్భవేత్. 18
(మాధవనిదానే

తా. కర్షప్రమాణము నూనెలో ఒకపలము అల్లపురసము గలిపి ప్రాతఃకాలము త్రాగిన అంత్రవృద్ధి హరించును.

గోమూత్ర మేరండతైలం ఛాగమాంసరసస్తథా,
త్రిఫలా క్వాథ తుల్యాంశం తైలశేషం విపాచయేత్. 18
తత్తైలంతు పిబే త్కర్ష మాంత్రవృద్ధిప్రశాంతయే,

తా. గోమూత్రము, మేకమాంసరసము, త్రిఫలములు-వీనిని సమభాగములు కషాయముగాచి దీనికి సమముగ నాముదము గలిపి చిక్కఁగ గాచి కర్షమెత్తును సేవించి అంత్రవృద్ధి హరించును.

అంత్రవృద్ధౌ మహావృద్ధౌ శస్యతేచ పునర్నవా. (శారీరే) 18

తా. అంత్రవృద్ధి, మహావృద్ధులయందు గలిజేరాకు నుడికించి ఆరునెలలు కట్టి గట్టుటప్రశస్తంబు. (లేక అంత్రవృద్ధియందు చక్రాకారముగ రక్ష వేయవలయును. మూత్ర వృద్ధియందు దానిం జించి కార్చవలయును. ఆసనవృషణములమధ్యమున నడ్డముగ రక్ష సిన బుడ్డ హరించును. మఱియు బీజముయొక్కనరము ఎఱ్ఱవలె జుట్టుకొని దిరుగుచుండి దానియందును రక్ష వేయవలయును.

అంత్రవృద్ధిహరం పానం మాయూరై స్తిత్తిరిద్రవైః,
వాతాంత్రే కౌక్కుటం పాచ్యం తద్రసం పానభోజనే. 18
భోజయే దాంత్రవృద్ధ్యార్తో శమమాప్నోతి నాన్యథా,
(మాధవనిదానే

తా. నెమలి, తిత్తిరిపక్షి అనువానిరసములం త్రాగిన అంత్రవృద్ధి హరించును మఱియు కోడిరసమును పానభోజనములయం దుపయోగించుకొనిన వాతాంత్రవృద్ధి శమించును.

షణ్మాసం సేవయే న్నిత్యం సప్తవృద్ధిహరం పరమ్. 18

తా. పైఁజెప్పఁబడిన యౌషధముల నారుమాసములు ప్రత్యహము సేవించుచు కబళనములం గట్టుచుండిన సప్తవృద్ధులు హరించును.

ఆంత్రవృద్ధియందు పథ్యము

సంశోధనం వస్తికసృగ్విమోక్ష స్స్వేదః ప్రలేపోఽరుణశాలయశ్చ,
ఏరండతైలం సురభీజలంచ ధన్వామిషం శిగు ఫలం పటోలమ్. 185
పునర్నవాగోక్షురకాగ్నిమంథ తాంబూలపథ్యారసనారసోనం,
వాంతి స్తథాగృంజనకంమధూని కౌంభంఘృతంత ప్తజలంచతక్రమ్.
అర్ధాకృతిర్వంక్షణయోశ్చదాహోవ్యత్యాసతోబాహుసిరావ్యధశ్చ,
యథామయంశస్త్రవిధిశ్చవర్గో దుర్వృత్తవృద్ధ్యామయినాంసుఖాయ.

తా. విరేచనముజేయించుట, వస్తికర్మంజేయుట, రక్తముదీయుట, చెమటనుదీయుట, లేపము, ఎఱ్ఱబియ్యము, ఆముదము, గోమూత్రము, నిర్జలప్రదేశమునందలి జంతుమాంసము, మునగకాయ, పొట్లకాయ, గలిజేరు, పల్లేరు, కూరనెల్లి, తాంబూలము, కరక్కాయ, సన్నరాస్నము, వెల్లుల్లి అనువానిని సేవించుట, వమనముసేయించుట, ఎఱ్ఱ ఉల్లిగడ్డ, తేనె, కుండలోనినెయ్యి, ఉష్ణోదకము, మజ్జిగ అనువానిని సేవించుట-అండసంధులయం దర్ధచంద్రాకారముగ గోల్లువేయుట, కుడిశట్టు వృద్ధిజెందియుండిన ఎడమచేతియొక్కసిరను వేధించుట,ఎడమతట్టయిన కుడిపార్శ్వము చేతియొక్కసిరను వేధించుట, శస్త్రముజేయుట-ఇవి వర్మ, అండవృద్ధి అనువానియందు హితకరంబులు.

ఆంత్రవృద్ధియం దపథ్యము

ఆనూపమాంసానిదధీనిమాషాః పిష్టాన్నదుష్టాన్నముపోదికాంచ,
గురూణిశుక్రోత్థితవేగరోధ స్సర్వర్త్మవృద్ధ్యామయినామమిత్రమ్.

తా. జలముగలప్రదేశమునందుండు జంతుమాంసము, పెరుగు, ఉద్దులు, పిష్టాన్నము, దుష్టమైన యన్నము, బచ్చలికూర, గురుకరపదార్థములు అనువానిని సేవించుట, శుక్రవేగము నడ్డగించుట-ఇవి వర్మ, అండవృద్ధి అనువానియందపహితకరంబులు.

వేగాహతిః పృష్ఠయానం వ్యాయామం మైథునం తథా,
అత్యాశనమథాధ్వాన ముపవాసం పరిత్యజేత్. (మతాంతరే)

తా. మలమూత్రవేగము నడ్డగించుట, గుఱ్ఱము మొదలగువాని నెక్కి సంచరించుట, శ్రమనుజెందుట, మైథునముసేయుట, మిక్కుటముగ భుజించుట, మార్గమునడుచుట, ఉపవాసముసేయుట-వీనిని అండవృద్ధిగలవారు వర్జింపవలయును.

చతుర్దశ ప్రకరణమ్.

---



# పంచదశ ప్రకరణము.



శ్లో. సర్వజ్ఞం జగదాధారం శూలహస్తం నగేశ్వరం,
ముక్తిప్రదాయకం దేవం నీలకంఠ మహం భజే. 1

తా. సర్వజ్ఞుఁడు, జగత్తున కాధారభూతుఁడు, శూలహస్తుఁడు, కైలాసపర్వతమునకధిపతి, ముక్తిప్రదాత, స్వయంప్రకాశభూతుఁడు నగునీలకంఠుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథము యొక్క పంచదశ ప్రకరణమును వచించుచున్నాఁడను.

## వంధ్యానిదానము

అష్టదోషా స్త్రియః పుంసాం నవమీ శుక్లహీనతా,
రక్తపిత్తమరుచ్ఛ్లేష్మ సన్నిపాతాభిచారకృత్. 3
దేవగ్రహకృతాదోషా రేతోహీనస్తతఃపుమాన్, (నిత్యనాథీయే)

తా. స్త్రీపురుషులకు రక్తదోషము, పైత్యదోషము, వాతదోషము, శ్లేష్మదోషము, సన్నిపాతదోషము, అభిచారదోషము, దేవద్రోహదోషము, గ్రహకోపదోషము అను నీ యెనిమిదిదోషంబులు సహజంబుగ జనించును. ఐనను పురుషులకు మాత్రము తొమ్మిదవది యగు శుక్లహీనతదోషం బొకటి యధికంబుగ జనించును.

## వంధ్యావిభాగము

మృతవంధ్యా జన్మవంధ్యా కాకవంధ్యాతు మోచికా. 4
గర్భస్రావీతి గీయంతే దోషైరేతైర్యుతః స్త్రియః,

తా. మృతవంధ్య, జన్మవంధ్య, కాకవంధ్య, కదళీవంధ్య అన వంధ్యలు నాలుగువిధంబులు. (అందు సంతానముగలిగి మృతిజెందిన మృత్యువంధ్యయనియు, సంతానమే గలుగకుండిన జన్మవంధ్యయనియు, రెండుసంతానములంబడసి గొడ్రాలైనస్త్రీ కాకవంధ్యయనియు, ఒకసంతానముం బడసి గొడ్రాలైనస్త్రీ కదళీవంధ్యయనియు జెప్పంబడును) మఱియు పూర్వోక్తదోషములవలన స్త్రీకి గర్భస్రావమును గలుగును.

ఏతద్దోషాంశ్చ విజ్ఞాయ తతఃకర్మ సమాచరేత్ 5

తా. పైవాతాదిదోషముల నెఱింగి చికిత్స చేయవలయును.

## వాతదుష్టార్తవలక్షణము

అతిస్వచ్ఛతరం రక్తం తన్వాదంభోజసన్నిభమ్,
కటిశూలం భవేద్యస్యా యోనిశూలంచ సజ్వరమ్. 6
మారుతస్య వికారోఽయ మౌషధం తత్ర కథ్యతే,

తా. ఋతుకాలమున వెడలెడు రక్తము నిర్మలమై ఎఱ్ఱతామరపువ్వువంటి వర్ణము గలదైయుండుట, రొంటిశూల, యోనిశూల, జ్వరము గలుగుట-ఈలక్షణములతో కూడి యుండునది వాతజదోషమని తెలియవలయును. దానికి నౌషధమును వచించెదను.

## వాతార్తవమునకు త్రివృదాదియోగము

త్రివృదేరండచూతానాం మూలం క్షీరేణ పాయయేత్. 7
పంచాహం సప్తరాత్రంవా యావత్స్రవతి శోణితమ్,

తా. శుద్ధిజేసిన తెగడ, ఆముదపువేరు, మామిడివేరు - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి ప్రత్యహము ४ మాడలయెత్తును ఆవుపాలలో గలిపి ౫ దినములుగాని, లేక ౭ దినములుగాని, లేక, స్రవించెడురక్తము నిలుచువఱకుగాని సేవించుచుండిన యోని శుద్ధం బగును.

## వాతదుష్టార్తవచికిత్స

వాతాదోన్యో విశుద్ధాయాం లక్ష్మణా క్షీరసంయుతా. 8
నస్యపానేచ దాతవ్యా తేన సా లభతే సుతమ్,
పురుషం దక్షిణే ఘ్రాణే వామే కన్యాం మనోహరాం. 9
యస్య వాతాహతం పుష్పం ఫలం తస్యా న విద్యతే,

తా. పైయౌషధసేవనవలన యోనిగతవాతదోషము శుద్ధంబైనపిదప లక్ష్మణ పంజిసమూలమును చూర్ణముజేసి నస్యమునుర మాడలయెత్తును ఆవుపాలలో గలిపి పానమును జేయించవలయును. కుడిముక్కునందు నస్యముజేయించిన పురుషశిశువును, ఎడమ ముక్కునందు నస్యముజేయించిన సౌందర్యవతియైన స్త్రీశిశువును గనును. వాతదోషము వలన పుష్పము హతమైనస్త్రీకి సంతానము గలుగ నేరదు.

## శ్లేష్మదోషలక్షణము

ఏవంశ్లేష్మణి వాతేన తస్య రూపం నిగద్యతే. 10
పిచ్ఛిలం బహుళం రక్తం నాభిశూలం తు దారుణమ్,

తా. పైఁజెప్పఁబడిన వాతదోషలక్షణంబులే శ్లేష్మదోషమునందును కలిగిఁ డును. ఐనను శ్లేష్మదోషమున ఋతుకాలరక్తము బంకగ, అధికముగ, బొడ్డులో ద మైన శూలయుక్తముగ స్రవించుచుండును.

## శ్లేష్మదోషమునకు అర్కమూలాదియోగము

అర్కమూలం ప్రియంగుశ్చ కుంకుమం నాగకేసరమ్.
బలాచాతిబలా ఛాగీ క్షీరం పీత్వా దినత్రయం,
విశుద్ధాయాం తథా యోనౌ దద్యాన్మూత్రే మహౌషధమ్.

తా. జిల్లేడువేరుపట్ట, ప్రేంకణపుపువ్వు, కుంకుమపువ్వు, నాగకేసరవ ముత్తవపులగము, పెద్దముత్తవపులగము - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి మేక లో గలిపి 3 దినములు త్రాగిన యోని శుద్ధంబగును. పిదప శొంఠిని గోమూత్రమ నూరి సేవింపవలయును.

లక్ష్మణాం గోపయోయుక్తాం నస్యే పానే ప్రదాపయేత్,
తేన స్త్రీ లభతే పుత్రం లక్షణాఢ్యం సుపండితమ్.

తా. లక్ష్మణపంజి సమూలమును చూర్ణముజేసి నాలుగుమాడలయెత్తును ఆఁ లలో గలిపి త్రాగుటయేగాక ఈచూర్ణమునే ఆవుపాలతో నస్యముజేసిన గొడ్రాలై లక్షణవంతుఁడు, సుపండితుఁడగు కొమరునిం గనును.

## పిత్తదోషలక్షణము

పక్వజంబూఫలాకారం కృష్ణం స్రవతి శోణితం,
కటిశూలేన సంతాపో హ్యేతత్పిత్తస్య లక్షణమ్.

తా. ఋతుకాలంబున రక్తము నేరేడువలె నల్లగస్రవించుట, నడుము నొచ్చు శరీరము మండుట - ఈలక్షణములుగలది పైత్యరక్తదోష మని దెలియవలయును.

## పిత్తదోషమునకు ఉత్పలాదియోగము

ఉత్పలం తగరం కుష్ఠం యష్టిమధుక చందనం,
అజాక్షీరేణ సంపేష్య దాపయేత్పంచవాసరమ్.

తా. నల్లకలువగడ్డ, గ్రంథితగరము, చెంగల్వకోష్టు, యష్టిమధుకము, శ్రీ థము - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి మేకపాలలోగలిపి 5 దినములుగాని, రక్తస్రావము నిలుచువఱకుగాని, త్రాగుటయేగాక నస్యముగా చేసిన పైత్యరక్తదోష హరించును.

### సన్నిపాతదోషలక్షణము

సన్నిపాతహతే పుష్పే కృష్ణ ముష్ణంచ శోణితం,
కుక్షౌ నాభ్యుదరే శూలం నిద్రాతీవ్రాంగభంగతా. 16

తా. పుష్పనుచెడి రక్తమునలుపుగ, ఉష్ణముగ స్రవించుట, కుక్షి, నాభి, ఉదరము అనువానియందు శూల గలుగుట, నిదుర గలుగుట, శరీరము మిక్కుటముగ నొచ్చుట - ఈలక్షణములుగలది సన్నిపాతరక్తదోష మని తెలియవలయును. (ఇది యసాధ్యము.)

### సన్నిపాతదోషమునకు ఉత్పలాదియోగము

ఉత్పలం తగరం కుష్ఠం యష్టిచూతం చ రాక్షసీం,
చందనం ఛాగదుగ్ధేన దాపయే త్పంచవాసరమ్. 17

తా. నల్లకలువగడ్డలు, గ్రంథితగరము, చెంగల్వకోష్టు, యష్టిమధుకము, మామిడివేరు, బలురక్కసిగడ్డ, శ్రీగంధము - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి నాలుగు మాడలయెత్తును మేకపాలలోగలిపి ౫ దినములు త్రాగిన యోని శుద్ధంబగును. (పిదప తెల్లజిల్లేడువేరు, తెల్లగంటెనవేరు, గొల్లజిడ్డువేరు, గోడ్డుకాకరదుంపలు - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి ఆవుపాలలోగలిపి త్రాగుటయేగాక నస్యము సగా జేయవలయును. ఋతుకాలంబున స్త్రీసంగమంబొనర్చిన రోగములుహరించి సంతానముగలుగును. మఱియు పైజెప్పబడిన వంధ్యారోగములయందు ఉత్తరాభిముఖుండై చంద్రగసికెను ద్రష్ట్వ 'ఓం సర్వార్థసాధిన్యైస్వాహా'' అనుమంత్రమును జపించుచు చంద్రవేరును పెరికి దానిని ''ఓం కుమారజనన్యైస్వాహా'' అనుమంత్రముతోనభిమంత్రించి త్రాగింపవలయునని గ్రంథాంతరమున జెప్పంబడియున్నయది. వంధ్యారోగములయం దౌషధము నొసంగునపుడు ''ఓం కుమారజనన్యైస్వాహా'' అనుమంత్రమును నభిమంత్రింపవలయును.

### స్త్రీపురుషనపుంసకోత్పత్తికారణము

రక్తాధిక్యే భవేత్ స్త్రీ చ శుక్లాధిక్యే భవే త్పుమాన్,
తత్సమత్వేతు షండశ్చ పుంసో రేతః క్షయేబలా. 18
గర్భం గృహ్ణాతి నో వస్త్రా శుక్లవృద్ధౌ మహౌషధమ్,

తా. స్త్రీకి రక్తాధిక్యమువలన ఆడుశిశువును, శుక్లాధిక్యమువలన మొగశిశువును, శుక్లశోణిత సమత్వంబున నపుంసకుండును జనించును. శుక్లహీనతగల పురుషునివలన స్త్రీకి గర్భము నిలువకుండును. కావున శుక్లహీనతగలపురుషునికి వీర్యవృద్ధికరౌషధముల నొసంగందగును.

### శుక్రవృద్ధికి ధాత్రీఫలాదియోగము

ధాత్రీఫలోద్భవం చూర్ణం రసేచేక్షోస్స్వభావితమ్. 19
శర్కరా మధుసంయుక్తం గోక్షీరం వై పిబేన్నరః,
శుక్లం ప్రవర్ధతే తేన పుంసాం ప్రక్షీణతేజసామ్. 20

తా. ఉసిరికపప్పును చూర్ణముజేసి చెఱుకురసముతో ౨౧ మార్లు భావనచేసి నీడ నెండించి దానికి సమముగ పంచదార, తేనె గలిపి సేవించి వెంబడిగ ఆవుపాలను త్రాగవలయును. ఇటులె ౨ మండలములుజేసిన రేతోదోషము హరించుటయేగాక శుక్రవృద్ధిగలిగి సంతానమును గలుగును.

పిబేత్కల్యాణఘృతకం వంధ్యాచ లభతే సుతం, (నిత్యనాథీయే)

తా. గొడ్రాలు కల్యాణఘృతమును సేవించిన సంతానము గలుగును.

### కల్యాణఘృతము

విశాలా త్రిఫలా కాంత దేవదా ర్వేలవాలుకమ్ 21
స్థిరానంతా హరిద్రే ద్వే శారిబేద్వే ప్రియంగుకా,
నీలోత్పలైలా మంజిష్ఠా దంతి దాడిమ కేసరమ్. 22
విడంగం పృశ్నిపర్ణీచ కుష్ఠం చందనపత్రకం,
తాళీసపత్రం బృహతీ మాలత్యాః కుసుమం సమమ్. 23
అష్టావింశతిభిః కల్కై సితా మక్షిసమన్వితం,
చతుర్గుణం జలం దత్వా ఘృతం ప్రస్థం విపాచయేత్. 24
అపస్మారే జ్వరే కాసే శోషే మందానలే క్షయే,
వాతరక్తే ప్రతిశ్యాయే తృతీయక చతుర్థకే. 25
మూత్రకృచ్ఛ్రేషు సర్వేషు విసర్పే దాహకేషు చ,
కండూపాండ్వామయోన్మాద వింశ స్మేహజ్వరేషుచ. 26
భూతావేశేపి చింతాయాం తద్గదే కామచేతసాం'
శస్త్రం స్త్రీణాంచ వంధ్యానాం ధన్య మాయుర్బలప్రదమ్. 27
అలక్ష్మీ పాపరక్షోఘ్నం సర్వగ్రహనివారణం,
కల్యాణఘృత మేతద్ధి శ్రేష్ఠం త్రిభువనేపిచ. 28

తా. పెద్దపాపర, త్రిఫలములు, మామిడివిత్తులు, దేవదారు, కూతురుబుడమ, ముయ్యాకుపొన్న, దురదగొండి, పసపు, మ్రానిపసపు; సుగంధిపాల, నల్లసుగంధిపాల, పేంకణము, నల్లకలువగడ్డలు, ఏలకులు, మంజిష్ఠి, దంతివేరు, దాడిమచిగుళ్ళు, వాయు

విడంగములు, కోలపొన్న, చెంగల్వకోష్టు, శ్రీగంధము, లవంగపత్రిక, తాళీశపత్రి, పెద్దములక, చిన్నములక, జాజిపువ్వులు-అను నీ ౨౮ ద్రవ్యములను సమభాగములుగనూరి కల్కముజేసి నాలుగింతలునీళ్ళు, ఘృతము ౧ ప్రస్థము గలిపి ఘృతావశేషముగ గాచి పంచదార, తేనె గలిపి సేవించిన అపస్మారము, జ్వరము, కాసము, శోష, అగ్నిమాంద్యము, క్షయము, వాతరక్తము, పీనస, త్ర్యాహిక, చాతుర్థికజ్వరములు, సర్వమూత్రకృఛ్రములు, విసర్పి, తాపము, దురద, పాండురోగము, ఉన్మాదము, ౨౦ మేహములు, జ్వరములు, భూతావేశము, చింత, స్వరభంగము, కామమువలన్ గలిగినరోగము - వీనిని హరింపంజేయును. దీనిసేవనవలన ఆయుర్వృద్ధి, బలము గలుగుటయేగాక అభాగ్యము, పాపము, బ్రహ్మరక్షస్సు, సర్వగ్రహములు సగా దొలంగును. మఱియు వంధ్యాస్త్రీ గర్భమును ధరించును. ఈకల్యాణఘృతము త్రిలోకములయందు కడుశ్రేష్ఠంబు. (ఈ కల్యాణఘృతసేవనవలన గర్భిణిస్త్రీయొక్క సంతానము జీవించును. వెణుతురువేళ్ళరసములో నూనెగలిపి తైలపక్వముగ గాచి దానిని సేవించినను, లేక వెణుతురువేళ్ళరసములో ఆవునెయ్యి గలిపి ఘృతపక్వముగగాచి ఏడవమాసమున సేవించినను, ఘృతవంధ్యాత్వము హరించును. వెణుతురువేళ్ళచెక్క, కారినపవేళ్ళు, పెద్దమానిచక్క, చేతలాసి అనువానిరసములో నూనెగలిపి కాచి సేవించిన మృతవంధ్యాస్త్రీసంతానము జీవించును.)

### కాకవంధ్యకు విష్ణుక్రాంతయోగము

పూర్వం పుత్రవతీ యా సాక్వచిద్వంధ్యా భవేద్యది,
కాకవంధ్యాతు సా జ్ఞేయా చికిత్సా తస్య కథ్యతే. 29
విష్ణుక్రాంతాం సమూలాంతు పిష్ట్వా క్షీరైశ్చ మాహిషైః,
మహిషీ నవనీతేన ఋతుకాలేతు భక్షయేత్, 30
ఏవం సప్తదినం కుర్యా ద్వత్సయుక్తాచ పూర్వవత్,
గర్భంచ లభతే నారీ కాకవంధ్యా శుభప్రదమ్. 31

తా. తొలుత బుత్రవతియై కొంతకాలమునకు బిదప గొడ్రాలైన స్త్రీ కాకవంధ్య యనంబడును. దానికి చికిత్స వచించెదను. విష్ణుక్రాంతసమూలమును నీడ నెండించి చూర్ణముజేసి బఱ్ఱెపాలతో భావనజేసి బఱ్ఱెవెన్నతో ౭ దినములు ఋతుకాలమునందు కాకవంధ్య సేవించిన శుభప్రదమగు సంతానము గల్గును. మఱియు పలుమారులు గర్భమును ధరించుచుండును.

వంధ్యలకు మహాద్రాక్షాదిచూర్ణము

ద్రాక్షా దాడిమ ఖర్జూర చాతుర్జాత కటుత్రయం,
తవక్షీరీ నారికేళం చందనం మకధుం శివమ్. 32
ప్రియాలు మజ్జా హ్రీబేర ముశీరం జాతిపత్రకం,
విదారీ గోక్షురం మోచా కపికచ్ఛూ భవం తథా. 33
జాతీఫలంచ తక్కోలం రుజ్మాషా స్తిలవంశజం,
యవమజ్జా లోధ్రపుష్పం ముస్తా నాగబలా శణా 34
ద్విజీరకే హ్యజామోదం మిశ్రా తాళీసపత్రకం,
సైంధవం ధాన్యకం భార్గీ శృంగీ భృంగీ పునర్నవా. 35
అరుష్కరామ్రబీజంచ సమ్యక్జారితమభ్రకం,
ఏతత్సర్వం సమం కృత్వా ద్విగుణాం శర్కరాం క్షిపేత్. 36
అస్యచూర్ణస్య కర్షాంశం ఘృతక్షీరయుతం పిబేత్,
దినపూర్వే తథా పశ్చాదృతుకాలే విశేషతః. 37
క్షయంచ రక్తపిత్తంచ పాదదాహ మసృగ్ధరం,
వినిహంతి ప్రమేహంచ సోమరోగంచ శర్కరామ్. 38
మూత్రాఘాతం మూత్రకృచ్ఛ్రం వాతకుండలికాం తథా,
వాంత్యరోచక మత్యుగ్రం శ్వాస కాస జ్వర భ్రమమ్. 39
పీనసంచ ప్రతిశ్యాయం ప్లీహానం చోదరామయం,
ఆమ్లపిత్తాంగదాహంచ ధాతునాశం జరామయమ్. 40
సర్వం దుర్నామరోగంచ తథా పాండుక కామిలం,
హృద్రోగంచ శిరశ్శూల మానాహ మతిదారుణమ్. 41
కండూతిం శీతపిత్తంచ విబంధా న్ద్వివిధానపి,
సంసేవ్యం భేషజంచైవ వృద్ధోపి జనయేత్సుతమ్. 42
పుత్రం సర్వగుణోపేతం శతాయుష మనామయం,
మృతగర్భాచ యా నారీ యాచ గర్భాపసారిణీ. 43
సాపి సూతే సుతం తద్వ న్నారాయణపరాయణం,
వంధ్యాపి లభతే పుత్రం వృద్ధోపి తరుణాయతే. 44
తురంగమివ సంధృష్టో మాతంగబలవిక్రమః,
సదా భేషజ్య సేవీ యో భవేన్మారుతివిక్రమః. 45

## మహాద్రాక్షాదిచూర్ణోఽయం సర్వరోగనికృంతనః, (ఆయుర్వేదే)

తా. ద్రాక్షపండు, దాడింబపండు, ఖర్జూరపండు, చాతుర్జాతకములు; త్రికటుకములు, అడవిబత్తైపాలు, కొబ్బరి, శ్రీగంధము, యష్టిమధుకము, ఉసిరికపప్పు సారపప్పు, కురువేరు, వట్టివేళ్లు, జాపత్రి, నేలగుమ్ముడుగడ్డ, పత్లేరు, అరటిగడ్డ, దూలగొండివిత్తులు, జాజికాయ, తక్కోలపుట్లు, చెంగల్వకోష్టు, మినుములు, నువ్వులు, వెదురుబియ్యము, యవలబియ్యము, లొద్దుగపువ్వు, తుంగముస్తెలు, జిబిలికవేళ్ళు, జనపవిత్తులు, నల్లజీలకఱ్ఱ, జీలకఱ్ఱ, అజామోదము, మెంతులు, తాళిశపత్రి, సైంధవలవణము, కొతిమెర్లు, గంటుభారంగి, కర్కాటకశృంగి, గుంటగలగర, గలిజేరువేళ్ళు, జీడిపలుకులు, మామిడిపలుకులు, తళుకులేకుండు అభ్రికసిందూరము - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి రెండింతలు పంచదార గలిపి కర్షమెత్తును ఆవునేతితోగాని, ఆవుపాలతోగాని, ఋతుకాలము మొదలుకొని నాలుగు మాసములు ప్రాతస్సాయంకాలమున సేవించి క్షయము, రక్తపిత్తము, పాదదాహము, అసృగ్దరము, ప్రమేహము, సోమరోగము, మూత్రశర్కర, మూత్రాఘాతము, మూత్రకృఛ్రము, వాతకుండలి, అత్యుగ్రమైనశాంతి, అరుచి, శ్వాసకాసలు, జ్వరము, భ్రమ, పీనస, పడిశము, ప్లీహము, ఉదరరోగము, ఆమ్లపిత్తము, అంగదాహము, రసాదిధాతునాశనము, ముదిమి, సర్వార్శస్సులు, పాండువు, కామిల, ఱొమ్మునొప్పి, తలనొప్పి, కడుదారుణమైన కడుపుబ్బరము, దురద, శీతపిత్తము, మలమూత్రబద్ధము - వీనిని హరింపంజేయును. దీనిసేవనవలన వృద్ధుఁడు సహా పుత్రోత్పత్తిని గలుగంజేయఁదగిన వీర్యవృద్ధిగలవాఁడగును. మఱియు మృతగర్భముగలస్త్రీ, గర్భస్రావముగలస్త్రీ సర్వగుణయుక్తుఁడై రోగవిహీనుఁడై నారాయణభక్తిగలవాఁడై నూరువత్సరంబులు జీవింపందగినపుత్రునింగనును. మఱియు దీనిసేవనవలన గొడ్రాలుసహా పుత్రునింగనును. మఱియు వృద్ధులుసగా యౌవనముగలవారై గుఱ్ఱముతో సమానమైనగర్వము, ఏనుగుతో సమానమైనబలము, పరాక్రమము గలవారలయ్యెదరు. దీనిని సదా సేవించుచుండువాఁడు హనుమంతునితో సమానమైన బలముగలవాఁడగును. ఈద్రాక్షాచూర్ణము సర్వరోగముల హరింపజేయును.

వంధ్యా కర్కోటకీ మూల చూర్ణం గోపయసా తథా. 46
ఋతుస్నాతా ప్రియం పీతా గర్భపాతం నివారయేత్,

తా. నాలుగుమాడలయెత్తు గొడ్డుకాకరచూర్ణమును ఆవుపాలలో గలిపి ఋతుకాలమునందు సేవించిన గర్భపాతము హరించును,

వంధ్యలకు మంజిష్ఠాదిఘృతము

మంజిష్ఠామధుకోత్పలం ద్విబృహతీకాంత్యశ్వగంధామృతా
తిక్తాగ్రాహిక హింగు గ్రంథితగరం రుక్మాంచనీ పద్మకమ్,
సిద్ధం భాస్కరకాక్షలోచనవృషా శుక్లామృతే పాచతాః
శార్ఙ్గిష్టా స్వరసేషు గర్భజననం వంధ్యా ప్రసూతే సుతం,

తా. మంజిష్ఠ, యష్టిమధుకము, నల్లకలువ, చిన్నములక, పెద్దములక, రేణుకలు, పెన్నేరుగడ్డ, తిప్పతీఁగె, చేతిపొట్లు, వెలగ, ఇంగువ, గ్రంథితగరము, చెంగల్వకోష్టు, పసపు, తామరతూండ్లు, జిల్లేడు, గచ్చపలుకులు, నారికేళము, అడ్డసరము, నేలగుమ్ముడు, కాకిదొండ - వీనిలో సమభాగములుగ రసముదీసి నేతిలోవైచి ఘృతపక్వముగ కాచి సేవించిన వంధ్యత్వము, మృతవంధ్యత్వము హరించి పుత్రునిం గనును.

తిలాదియోగము

తిలాశ్చ శర్కరాః పద్మకందేన మధునాన్వితాః,
భక్షితా ధారయత్యేవ పతంతం గర్భ మంగనా. (నిత్యనాథీయే)

తా. ఎల్లుపువ్వులు, పంచదార, తామరగడ్డలు - వీనిని సమభాగములుగ చూర్ణము జేసి జుంటితేనెలో గలిపి సేవించిన గర్భస్రావముగల స్త్రీ గర్భము ధరించును.

గర్భపాతమునకు లజ్జాళుయోగము

లజ్జాళు ధాతకీపుష్ప ముత్పలం మధు లోధ్రకం,
ఋతుస్నాతస్త్రియా పీతం గర్భపాతం నివారయేత్. 49

తా. ముడుఁగుదామర, ఆరెపువ్వు, నల్లకలువగడ్డలు, యష్టిమధుకము, లొద్దుగ చెక్క - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి ఆవుపాలలోగలిపి ఋతుస్నానముజేసిన నాలవదినమున సేవించిన గర్భస్రావము గలుగకుండును.

సమభాగసితాయుక్తం శాలితండులచూర్ణకం,
ఉదుంబరశిఫా క్వాథం పీతం గర్భ స్సురక్షితః. (మతాంతరే) 50

తా. పంచదార, రాజనబియ్యపుపిండి - వీనిని సమభాగములుగ గూర్చి మేడిచెట్టు యొక్క యూడలకషాయముతో సేవించిన గర్భస్రావముగల స్త్రీకి గర్భము స్థిరముగ నిలుచును. (యష్టిమధుకము, తామరగడ్డలు, పంచదార - వీనిని సమభాగములుగ గూర్చి మర్దించి ఉదకములో గలిపి త్రాగిన గర్భస్రావము గలుగకుండుటయేగాక మంటలు శమించి చల్లగ నుండును.)

## ఉత్పలాదియోగము

ఉత్పలోత్పల శాలూర శ్యామా లోధ్రక చందనం,
తండులోదకపీతం చ గర్భస్రావం నివారయేత్. 51

తా. నల్లకలువగడ్డలు, కలువగడ్డలు, సుగంధిపాల, లొద్దుగచెక్క, శ్రీగంధము-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి బియ్యపుకడుగులో గలిపి సేవించిన గర్భస్రావము గలుగక గర్భము స్థిరముగ నిలుచును.

## ఆమ్రమూలయోగము

ఆమ్రికామూల మాహృత్య పిష్ట్వా క్షీరేణ పాయయేత్,
నారీణాం నష్టపుష్పాణాం తథా రక్తం ప్రవర్తయేత్. (మతాంతరే)

తా. మామిడివేరుచెక్కను ఆవుపాలతో నూరి త్రాగిన రజోనష్టముల స్త్రీలకు రజస్సు బైలు వెడలును.

## గర్భస్థక్రిమినాశకరయోగము

పత్రం నిధాయజఠరే పరిబంధనేనపాతాళమూలజనితం నిశిసప్తవారం,
శూలానిసూక్ష్మబహుళక్రిమయఃపతంతిస్త్రీణామపత్యకరబీజహరశ్చకీటః.
(మాధవకల్పే)

తా. దూసరితీగెయాకులను కడుపుపై నునిచి రాత్రులయం దేడుదినములు గట్టిన యోనిశూల హరించుటయేగాక కడుపులో మిక్కుటముగ గర్భనాశనకరముగ నుండు సూక్ష్మమైన యనేకపురుగులు, పుత్రోత్పత్తికి కారణభూతమైనబీజమును పానముజేసెడి పురుగులు ఊడిపడును. (పల్లేరువేరు, మజ్జిచెక్క, రావిచెక్క, మేడిచెక్క, యష్టిమధుకము-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అందు శర్కర, పాలు గలిపి త్రాగిన స్త్రీల ఋతుశూల, రక్తశూల హరించి గర్భము నిలుచును.)

## అభయాదియోగము

అభయా దీప్యకం హింగు కృష్ణజీరక సైంధవం,
యవశూరార్కమూలాని వర్షాభూ వ్యోషమక్షకమ్. 54
లశునం చ సమాంశేన ఛాగక్షీరేణ పేషయేత్,
తత్క్షీరం పాయయే ద్వంధ్యా మృతుకాలేచ సేవయేత్. 55
రక్తశూలం యోనిశూలం పిత్తశూలం తథైవ చ,
మక్కల్లశూలకంచైవ సర్వశూలహరం పరమ్. (సిద్ధవిద్యాభూః) 56

తా. కరక్కాయలు, ఓమము, ఇంగువ, నల్లజీలకఱ్ఱ, సైంధవలవణము, యవక్షారము, జిల్లేడువేరుచెక్క, గలిజేరువేరు, త్రికటుకములు, గచ్చపలుకులు, వెల్లుల్లిపాయలు- వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి మేకపాలతో నేడుమార్లు మర్దించి భావన జేసి నీడ నెండించి నాలుగుమాడలయెత్తును మేకపాలతో ఋతుకాలము మొదలు నాలుగుమాసములు గోడ్రాలు సేవించిన యోనిశూల, పిత్తశూల, మక్కల్లశూల మొదలగు సర్వశూలలు హరించును.

శంఖద్రావ మితిఖ్యాత మృతుకాలే తు సేవయేత్,
రక్తశూలం యోనిశూలం సర్వశూలం నిబర్హయేత్. 57

తా. ప్రసిద్ధమైన శంఖద్రావకము ఋతుకాలము మొదలుకొని సేవింపుచుండిన రక్తశూల, యోనిశూల, సర్వశూలలు హరించును. (మఱియు సర్వశూలలు హరించుటకై గుదికాలులోపల చీలమండకు మూడువ్రేళ్ళ ప్రదేశమున రక్ష (గొల్లు) వేయవలయును. మఱియు వంధ్యారోగనిదానమున పురుషునికి జనించు రేతోహీనదోషము హరించి వీర్యవృద్ధిగలుగుటకై జెప్పంబడిన చికిత్సలనే గర్భస్రావముగల స్త్రీలకును జేయందగును.)

గీ. మెట్టదాసరి తాఁబేటిమీఁద దీప
ముంచఁ దలవెళ్ళ నదియును ద్రుంచి మసియుఁ
జేసి వెన్నయుఁ జేరిచి పూసెనేని
కాంతలకు యోనిదుర్మాంసగణము లడఁగు.

శ్లో. అకస్మాత్ప్రథమే మాసే గర్భే భవతి వేదనా,
గోక్షీరే పేషయేత్తుల్యం పద్మకోశీర చందనమ్. 58
పలమాత్రం పిబేన్నారీ త్వాద్యగర్భస్థిరో భవేత్, (సిద్ధరసార్ణవే)

తా. అకస్మాత్తుగ ప్రథమమాసమున గర్భవేదనగలిగిన పైలందామర, వట్టివేరు, శ్రీగంధము-వీనిని సమభాగములుగ నావుపాలతోనూరి ఒకపలమెత్తును సేవించిన ప్రథమ మాసమున గర్భిణిస్త్రీకి గలిగిన గర్భవేదన హరించి గర్భము స్థిరముగ నిలుచును.

రెండవమాసగర్భచికిత్స

నీలోత్పలమృణాళంచ శశి కర్కటశృంగికమ్. 59
మాసే ద్వితీయే గోక్షీరైః పీత్వా శామ్యతి వేదనా,

తా. నల్లకలువగడ్డ, తామరతూండ్లు, బొల్లిపూసవిత్తులు, కర్కాటకశృంగి-వీనిని సమభాగములుగ నావుపాలతోనూరి ఒకపలమెత్తుగ సేవించిన రెండవమాసమున గర్భిణీ స్త్రీకి గలిగిన గర్భవేదన హరించి గర్భము స్థిరముగ నుండును.

మూడవమాసగర్భచికిత్స

శ్రీఖండం తగరం కుష్ఠం మృణాళం పద్మ కేసరమ్. 60
పిబే చ్ఛీతోదకైః పిష్టం తృతీయే వేదనావతీ,

తా. శ్రీగంధము, గ్రంథితగరము, చెంగల్వకోష్టు, తామరతూండ్లు, తామర అగరులు-వీనిని సమభాగములుగ శీతోదకముతోనూరి ఒకపలమెత్తుగ త్రాగిన మూడవ మాసమున గర్భిణి స్త్రీకి గలిగిన గర్భవేదన హరించును.

నాలవమాసగర్భచికిత్స

నీలోత్పలమృణాళాని గోక్షురం సకశేరుకమ్. 61
చతుర్థమాసే గోక్షీరైః పిబే చ్ఛామ్యతి వేదనా,

తా. నల్లకలువగడ్డలు, తామరతూండ్లు, పల్లేరు, నెమ్మటములు- వీనిని ఆవుపాలతో నూరి పావుసేరెత్తుగ త్రాగిన నాలవమాసమున గర్భిణిస్త్రీకి గలిగిన గర్భవేదన హరించును.

ఐదవమాసగర్భచికిత్స

పునర్నవాథ కాకోలీ తగరం నీలముత్పలమ్. 62
గోక్షీరైః పంచమే మాసే గర్భక్లేశహరం పిబేత్,

తా. గలిజేరు, కాకోళి, గ్రంథితగరము, నల్లకలువదుంపలు-వీనిని సమభాగములుగ నావుపాలతోనూరి త్రాగిన నైదవమాసమున గర్భిణిస్త్రీకి గలిగిన గర్భవేదన హరించును.

ఆరవమాసగర్భచికిత్స

సితా కపిత్థ మంజిష్ఠ శీతతోయేన పేషయేత్. 63
షష్ఠే మాసే గవాంక్షీరైః పిబే చ్ఛామ్యతి వేదనా,

తా. పంచదార వెలగపంటిబేసము, మంజిష్ఠ-దీనిని శీతోదకముతోగాని, లేక నావుపాలతోగాని నూరి త్రాగిన ఆరవమాసమున గర్భిణిస్త్రీకి గలిగిన గర్భవేదన హరించును.

ఏడవమాసగర్భచికిత్స

కశ్రోవం పౌష్కరం మూలం తోయైర్వా నీలముత్పలమ్. 64

పీత్వాతు సప్తమేమాసే పిష్ట్వా క్షీరైః ప్రశామ్యతి,

తా. కచోరములు, పుష్కరమూలము, నల్లకలువగడ్డలు-వీనిని నుదకముతోగాని, ఆవుపాలతోగాని నూరి త్రాగిన నేడవమాసమున గర్భిణిస్త్రీకి గలిగిన గర్భవేదన హరించును.

ఎనిమిదవమాసగర్భచికిత్స

యష్టి పద్మాక్షుకం ముస్తా కశేరు గజపిప్పలీ. 65
నీలోత్పలం గవాంక్షీరైః పిబే న్మాసాష్టకే సతీ,

తా. యష్టిమధుకము, బయలుదామర, గచ్చపలుకులు-తుంగముస్తెలు, సెమ్మటములు, గజపిప్పళ్ళు, నల్లకలువగడ్డలు-వీని నావుపాలతో నూరి త్రాగిన నెనిమిదవమాసమున గర్భిణిస్త్రీకి గలిగిన గర్భవేదన హరించును.

తొమ్మిదవమాసగర్భచికిత్స

విశాలాబీజ మంకోలం మధునా సహ లేపయేత్. 66
వేదనా నవమేమాసే శమమాప్నోతి నిశ్చయం,
నవమే మధుకానంతా శారిబాః పయసా పిబేత్. 67

తా. పాపరవిత్తులు, ఊడుగవిత్తులు-వీనిని తేనెతోనూరి కడుపుపై బూసిన తొమ్మిదవమాసమున గర్భిణిస్త్రీకి గలిగిన గర్భవేదన నిశ్చయముగ హరించును. మఱియు యష్టిమధుకము, దురదగొండి, సుగంధిపాల-వీనిని పాలతోనూరి త్రాగవలయును.

పదియవమాసగర్భచికిత్స

పిష్టాతు శర్కరాం ద్రాక్షాం సక్షౌద్రం నీలముత్పలం,
పాయయే ద్దశమేమాసి గవాంక్షీరైః ప్రశాంతయే. 68

తా. పంచదార, ద్రాక్షపండ్లు, నల్లకలువగడ్డలు-వీనిని పాలతోనూరి తేనెలోగలిపి సేవించిన పదియవమాసమున గర్భిణిస్త్రీకి గలిగిన గర్భవేదన హరించును.

గర్భశూలహరచికిత్సలు

పద్మకందస్రుతం వారి సక్షీరం పాయయే ద్వధూమ్,
గర్భస్రావహరం శ్రేష్ఠం శర్కరామిశ్రితం నిశామ్. 69
బలాశుంఠ్యోశ్చ నిక్వాథం గర్భిణీ సర్పిషా సహ,
తైలేనవా సమం పీత్వా గర్భశూలా త్ప్రముచ్యతే. 70

తా. తామరదుంపలదంచి రసముదీసి అందు పాలు, పంచదార, పసపు గలిపి స్త్రీ

సేవించిన గర్భస్రావము హరించును. మఱియు ముత్తవపులగమును, శొంఠిని నూరి యుడికించి నేతితోగాని, లేక నూనెతోగాని సేవించిన గర్భశూల హరించును.

బలా నాగర చిత్రాణాం క్వాథం పాఠాగ్నిమంథయోః,
పీత్వా విముచ్యతే సాజ్యం గర్భిణీగర్భశూలతః (మాధవనిదానే)

తా. ముత్తవపులగము, శొంఠి, చిత్రమూలము, శిరుబొద్ది, కూరసెల్లి-వీనిని కషాయముగాచి అందు నెయ్యి గలిపి త్రాగిన గర్భిణిస్త్రీయొక్క శూలలు హరించును.

శుంఠీ బిల్వ బలా క్వాథం భ్రష్టసైంధవసంయుతమ్,
సరామఠం పిబేత్సర్పి ర్గర్భిణీశూలనాశమ్. (మాధవనిదానే) 72

తా. శొంఠి, మారేడువేరు, ముత్తవపులగము-వీనిని సమభాగములుగ దంచి కషాయముగాచి అందు వేల్చిన సైంధవలవణము, ఇంగువ, నెయ్యి గలిపి సేవించిన గర్భిణీస్త్రీశూలలు మానును.

ఆర్ద్రక క్వథితం సిద్ధం సక్షీరాజ్య గుడం పిబేత్,
పిప్పలీచూర్ణసంయుక్తం గర్భిణీశూలనాశనమ్. (అన్యశాస్త్రే) 73

తా. అల్లపుకషాయములో పాలు, నెయ్యి, బెల్లము, పిప్పలిచూర్ణము గలిపి సేవించిన గర్భిణీశూలలు హరించును.

### అహిపత్యచూర్ణము

ధాత్రీవిడంగంత్రిసుగంధముస్తా వ్యోషంచపథ్యాత్రివృతంత్రిభాగమ్,
చూర్ణంసమంశర్కరమానమేత ద్యుష్ణోదకేనైవ పిబేన్నిహంతి. 74
శూలాగ్నిమాంద్యంగుదజాంకురాణి కుష్ఠప్రమేహ క్రిమిగర్భశూలమ్,
వాతంచపైత్తంచకఫంచపాండు హృద్రోగమాశుత్వహిపత్యచూర్ణమ్.

తా. ఉసిరికపప్పు, వాయువిడంగములు, ఏలకులు, లవంగపుచెక్క, ఆకుపత్రిక, తుంగముస్తెలు, త్రికటుకములు-కరక్కాయలు, వీనిచూర్ణము దినుసుకొక్కొకభాగము, తెగడచూర్ణము 3 భాగములు-ఈరెంటికి సమముగ పంచదారగలిపి యుష్ణోదకముతో సేవించిన విరేచనంబై శూల, అగ్నిమాంద్యము, మూలరోగము, కుష్టువు, ప్రమేహము, క్రిములు, గర్భశూల, వాత, పిత్త, కఫ, పాండువులు, హృద్రోగము వీనిని హరింపం జేయును.

### యోనిశూలచికిత్స

యోనౌ క్రిమౌచ సంజాతే తేన శూలం భవేద్యదా,

తన్నామ క్రిమిశూలంచ కర్తవ్యం భిషగుత్తమైః. 76
నింబద్రావై స్సుసంపిష్టం నింబైరండస్యభీజకమ్,
యోనిశూలహరత్క్షిప్తం గోళకం యోనిమధ్యగమ్. (ఆయుర్వేదే)

తా. యోనియందు క్రిములుజనించి దానివలన శూలగలిగిన క్రిమిశూల యనం బడును. దీని నివారణార్థంబై వైద్యుఁడు చికిత్సంజేయవలయును. ఎట్లనిన—వేపవిత్తులు, ఆముదపుపప్పు-వీనిని వేపాకురసముతో నూరి ముద్దజేసి యోనియందు ధరింపంజేయువల యుననుటం.

సోమరాజీ దేవదారు నిశా నింబా స్సమాంశకాః,
తచ్చ పిష్ట్వా ప్రలేపోఽయం యోనిశూలహరఃపరః (అశ్వినీకల్పే)

తా. భావంచివిత్తులు, దేవదారు, మంచిపసపు, వేపాకు-వీనిని సమభాగములుగ నూరి యోనియందు లేపనముజేసిన యోనిశూల హరించును.

లశునం గృహధూమంచ విశాలంచ విళంగకం
కంటకారీ ఫలరసైః పిష్ట్వా యోనిం ప్రలేపయేత్. 7
క్రిమిశూలహరం ఖ్యాతం సప్తరాత్రమసంశయం

తా. వెల్లుల్లిపాయలు, కరుధూపము, పాపర, వాయువిడంగములు-వీనిని సః భాగములుగ ఖల్వములో నునిచి నేలములకపండ్లరసముతో నూరి యోనియం దేడుది ములు లేపనముజేసిన యోనియందలి క్రిమిశూల నిస్సంశయముగ హరించును.

## యోనిదుర్మాంసనిదానతచ్చికిత్స

గుహ్యవాయురథమన్మథస్థలం సంపిశేద్భవతి దుష్టమాంసకం
తత్ర వాతహరఛాదనేనవా ఛాదయేదితరభేషజేన కిమ్.

తా. అపానవాతము యోనిగతంబైన యోనియందు దుర్మాంసము జనించు దానియందు నెయ్యిచరిమి వాతహరమైన యాకులుబెట్టి కట్టుగట్టినను, (లేక కాలు బ్రహ్మమేడికాయలద్రొక్కి యుడికించి కట్టుగట్టినను) యోనిదుర్మాంసము హరించును.

యస్యావాతాహతం పుష్పం వ్రణదుర్గంధ పీడితమ్,
తత్రదోష స్సువిజ్ఞేయ స్తతః కర్మ సమాచరేత్.

తా. ఏస్త్రీకి వాతదోషమువలన పుష్పముచెడి, యోనియందు వ్రణముపుట్టి ఁ ధము గలిగియుండెడినో, ఆట్టిస్త్రీయొక్క-దోషమును బాగుగ నెఱింగి చికిత్సింపవలయ

జాతీ నింబ పటోలపత్ర కటుకా దార్వీ నిశా శారిబా
మంజిష్ఠాభయ తుత్థ సిక్థ మధుకై ర్నక్తాహ్వబీజై స్సమైః,
సర్పిస్సిద్ధమనేన సూక్ష్మవదనే యోనౌ సదా స్రావిణీ
దుర్గంధశ్చ రుజా వ్రణానిచ గదా శ్శుద్ధ్యంతి లేపేనచ. 82
నిత్యం ప్రక్షాళితం కుర్యా ద్యోనిదుర్గంధనాశనమ్,

తా. జాపత్రి, మంచివేపకొనలు, చేతిపొట్లాకు, చేతిబీరపలుకులు, మ్రానిపసపు, పసపు, గూడపాల, మంజిష్ఠ, కరక్కాయలు, మైలుతుత్తము, మైనము, యష్టిమధుకము, క్రానుగవిత్తులు-వీనిని సమభాగములుగగూర్చి నేతినివండి యోనియందుబూసిన యోనిసంకుచితదోషము, సదా యోనియందు స్రావము, యోనిదుర్గంధము, యోనిశూల, యోనివ్రణము శుద్ధమై మానును. కావున ప్రతిదినమును గడిగి లేపనము జేయవలయును. (యోగరాజగుగ్గులమును సేవింపవలయును.)

## గుదభ్రంశచికిత్స

గుదభ్రంశం ఘృతాభక్తం వాతఘ్నై రుపనాహయేత్. 83

తా. వాతదోషము గుదగతంబైన గుదభ్రంశము గలుగును. దానియందు నెయ్యి చరిమి లోనికి ద్రోసి వాతహరమైన యూకులం గట్టవలయును. (లేక బ్రహ్మమేడికాయలగాని, అంతరదామరనుగాని, కాలుపడి త్రొక్కి యుడికించి కట్టుగట్టవలయును. ఈ యుపచారములచే గుదభ్రంశము హరించును.

## పుష్పావరోధనిదానము

వాతోల్బణాచ్చ యోనిస్థం పుష్పస్థానచలం భవేత్,
పుష్ప రోధనమిత్యుక్తం తన్నామ మునిపుంగవైః. 84

తా. వాతము ప్రకోపించి యోనిగతంబై పుష్పస్థానమును తొలగించి నొప్పిగలుగంజేసిన పుష్పావరోధనమని మునులు వచించెదరు.

లాంగలీకందచూర్ణంచ మూలం వాహ్యపమార్గజమ్,
ఇంద్రవారుణికామూలం యోనిస్థం పుష్పరోధనుత్. 85
(సిద్ధసంగ్రహే)

తా. చెన్నచర్లగడ్డ, ఉత్తరేణువేరు, పాపరవేరు-వీనిలో దేనినేని నూరి ముద్ద జేసి యోనియం దునిచికొనిన పుష్పావరోధము నివృత్తించును.

తిలమూలకషాయేణ బ్రహ్మదండీయమూలకమ్,

యష్టి త్రికటుకం చూర్ణం క్వాథయుక్తంచ పాయయేత్. 86
పుష్పరోధే రక్తగుల్మే స్త్రీణాం పథ్యం ప్రశస్యతే,(మాధవనిదానే)

తా. బ్రహ్మదండివేళ్ళను నువ్వులవేళ్ళకషాయముతో నూరి పుష్పావరోధనము నందు లేపనము చేయుటయేగాక నువ్వులవేళ్ళకషాయములో యష్టిమధుకము, త్రికటుకములు అనువానిచూర్ణమునుగలిపి సేవించిన పుష్పావరోధము, రక్తగుల్మము నివృత్తించును.

తిలక్వాథే గుడం వ్యోషం తిలభార్గియుతేఽపివా. 87
పాతేరక్తస్రవే గుల్మే నష్టపుష్పే చ పాయయేత్, (అశ్వినీకల్పే)

తా. నువ్వులకషాయములో బెల్లము, శొంఠి, పిప్పలి, మిరియాలు అనువానినిగాని, లేక నువ్వులు, గంటుభారంగి అనువానిలో బెల్లమును, త్రికటుకచూర్ణమునుగాని గలిపి సేవించిన గర్భపాతము, రక్తస్రావము, గుల్మము, పుష్పావరోధనము నివృత్తించును.

చణకానాం రసంచైవ శృతం క్షీరఘృతేనవా. 88
శర్కరా మధుసంయుక్తం రక్తదోషహరం పిబేత్,

తా. సెనగకట్టుతో పాలు, నెయ్యి గలిపి కాచి పంచదారగాని, తేనెగాని కలిపి సేవించిన రక్తదోషము (పుష్పావరోధము) హరించును.

షణ్మాసం సేవయేన్నిత్యం పుష్పరోధో నివర్తతే. 89

తా. పుష్పావరోధము నివర్తించుటకై ఆరుమాసములవఱకు పూర్వోక్తౌషధముల సేవింపవలయును.

## గర్భిణీజ్వరచికిత్స

పయస్యా శారిబా పాఠా తోయతోయద నాగరైః,
శృతం శీతం పిబేద్వారి గర్భిణీజ్వరనాశనమ్.

తా. కరక్కాయలు, గూడపాల, శిరుబొద్ది, కురువేరు, తుంగముస్తెలు, శొంఠి- వీనిని సమముగ దంచి కషాయముగాచి చల్లార్చి త్రాగిన గర్భిణీస్త్రీజ్వరము హరించును.

## గర్భిణ్యతిసారచికిత్స

దురాలభా బలాపాఠా నాగరాంబుద సంశృతమ్,
గర్భిణీం పాయయేత్తోయమతిసారేషుసర్వదా. (మాధవనిదానే)

తా. దురదగొండి, ముత్తవపులగము, శిరుబొద్దివేరు, తుంగముస్తెలు, శొంఠి-వీనిని కషాయముగాచి త్రాగిన గర్భిణిస్త్రీ అతిసారము హరించును.

గర్భిణీశోఫచికిత్స

పునర్నవార్ద్రకక్వాథం సక్షీర మనిశం పిబేత్,
శోభోదావర్త గుల్మార్శ శ్శాంత్యర్థం గర్భిణీ నిశి. 92

తా. గలిజేరువేరు, అల్లము-వీనిని కషాయముగాచి అందు పాలుగలిపి రాత్రులయందు త్రాగిన గర్భిణిస్త్రీ శోఫ, ఉదావర్తము, గుల్మము, అర్శస్సు హరించును.

వర్షాభూమూల నిర్యాసం సఘృతం గుడసంయుతం,
గర్భిణీం పాయయే దేతచ్ఛోభోదావర్తనాశనమ్. 93

తా. గలిజేరువేరును కషాయముగాచి నెయ్యి, బెల్లము కలిపి త్రాగిన గర్భిణీస్త్రీ శోఫలు, ఉదావర్తము హరించును.

గర్భిణీకాసరోగచికిత్స

చూర్ణం వై మరిచానాంతు సితా క్షౌద్ర ఘృతై స్సహ,
లిహ్యాత్కాసహరం సత్యం గర్భిణీనాం ప్రశస్యతే. (మాధవకల్పే)

తా. మిరియపుచూర్ణము, పంచదార-వీనిని తేనెలోగాని, నేతిలోగాని గలిపి సేవించిన గర్భిణీస్త్రీ దగ్గు హరించును.

గర్భిణీశ్వాసచికిత్స

స్వరసం మాతులుంగస్య పిప్పలీ మరిచాన్వితం,
గర్భిణీం పాయయే ద్యుక్త్యా శ్వాసహృద్రోగ కాసహృత్. 95
(ఆయుర్వేదే)

తా. మాదీఫలరసముతో పిప్పలిచూర్ణము, మిరియపుచూర్ణము గలిపి సేవించిన గర్భిణీస్త్రీ శ్వాసము, హృద్రోగము, కాసము హరించును.

శృంగీ భార్ఙ్గీవచా వ్యోషా గిరిమృత్కటుకాభయాః,
గర్భిణీశ్వాసకాసస్య పిబేత్సఘృతమాక్షికాః. (ఆయుర్వేదే)

తా. కర్కాటకశృంగి, గంటుభారంగి, వస, త్రికటుకములు, కావిరాయి, కటుకరోహిణి, కరక్కాయలు-వీనిని సమభాగములుగ నూరి కల్కముజేసి అందు నెయ్యిగాని, లేక తేనెగాని కలిపి సేవించిన గర్భిణీస్త్రీ కాసశ్వాసలు హరించును.

### గర్భిణీరక్తపిత్తచికిత్స

ద్రాక్షా స్థిరా బలా ధాత్రీ వాసా మధుక వాలుకం,
క్వాథః క్షీర యవాగూర్వా గర్భిణ్యా రక్తపిత్తజిత్. 97

తా. ద్రాక్షపండు, మయ్యాకుపొన్న, ముత్తవపులగము, ఉసిరికపప్పు, అడ్డసరపు టీసెలు, యష్టిమధుకము, కూతురుబుడమ-వీనిని కషాయముగాచి గాని, లేక ఆద్రవ్యముల దంచి పాలుపోసి యవాగుగాచిగాని సేవించిన గర్భిణీస్త్రీ రక్తపిత్తము హరించును.

### గర్భిణీనాసారక్తచికిత్స

ఉదుంబరఫలక్వాథం ఘృతైః పక్వం సితాయుతం,
ఏలా మరిచ సేవ్యైశ్చ తోయతోయదనాగరైః. 98
శృతమేతత్పిబేద్వారి గర్భిణీనాసరక్తజిత్,

తా. మేడిపండుకషాయముతో నెయ్యి, పంచదార గలిపి పక్వముజేసిగాని, లేక ఏలకులు, మిరియాలు, వట్టివేరు, కురువేరు, తుంగముస్తెలు, శొంఠి - వీనిని కషాయము గాచిగాని సేవించిన గర్భిణీస్త్రీలకు ముక్కునగారెడిరక్తము హరించును.

### గర్భిణీఛర్ది చికిత్స

బిల్వ లాజాంబుసేవ్యైశ్చ పిబేచ్ఛర్దిషు గర్భిణీ. 99

తా. మారేడువేరు, పేలాలు, కురువేరు, వట్టివేరు - వీనికల్కములు త్రాగిన గర్భిణీస్త్రీవాంతులు హరించును.

మధుకోశీరసిద్ధంవా ద్రాక్షా మధుకసాధితం,
పీతం సశర్కరం స్త్రీణాం ఛర్దిం దాహరుజాం జయేత్. 100
(సిద్ధరసార్ణవే)

తా. యష్టిమధుకము, వట్టివేరు అనువాని కషాయములోగాని, లేక ద్రాక్షపండ్లు, యష్టిమధుకము అనువాని కషాయములోగాని పంచదారగలిపి సేవించిన గర్భిణిస్త్రీవాంతులు, దాహము హరించును.

### గర్భిణీఅగ్నిమాంద్యచికిత్స

అజామోదాశ్వగంధాభ్యాం జీరకం పిప్పలీద్వయం,
సక్షౌద్రం సగుడం లేహ్యం గర్భిణ్యా వహ్నిదీపనమ్. 101
(మాధవనిదానే)

తా. ఓమము, పెన్నేరుగడ్డ, జీలకఱ్ఱ, పిప్పలి, మోడి - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి తేనె, బెల్లము గలిపి లేహ్యపక్వముగ వండి సేవించిన గర్భిణీస్త్రీలయొక్క-

అగ్నిమాంద్యము హరించును. (స్త్రీకి ప్రసవించినపిదప అగ్నిమాంద్యము తఱచుగ జనించును. తన్నివారణార్థంబును, గ్రహణ్యతిసారములు జనించిన తన్నివారణార్థంబును అన్లపైత్యమునకై జెప్పంబడిన మహాసంజీవనరసమునుగాని, లేక ప్రాణేశ్వరరసమునుగాని సేవింపవలయును. దీనిచే బాలింతరోగములు హరించును.)

గర్భిణీవాతచికిత్స

బిల్వాగ్నిమంథపక్వంవా పాటలీ నాగరేణవా,
సిద్ధం క్షీరం రసోవాపి గర్భిణీవాతరోగనుత్. 102
(సిందూరమణిదర్పణే)

తా. మారేడువేరు, కూరనెల్లి అనువానినేని, లేక కలిగొట్టు, శొంఠి అనువానినేని పాలయుక్తముగ కాచిగాని, లేక కల్కముజేసిగాని సేవించిన గర్భిణిస్త్రీవాతరోగము హరించును.

అథవా దశమూలాంబు విశ్వోషణసమాయుతం,
దేవదారు బలా రాస్నా శుంఠ్యైరండక సాధితమ్. 103
సలిలం తైలసంమిశ్ర మనిలార్తా సదాపిబేత్,

తా. మారేడు, కూరనెల్లి, గుమ్ముడు, తక్కలి, కలిగొట్టు, దుందిలము, కోలపొన్న, సక్కపొన్న, పెద్దములక, నేలములక - అను నీదశమూల కషాయములో శొంఠి, పిప్పలిచూర్ణము గలిపి సేవించిన గర్భిణీస్త్రీ వాతనొప్పులు హరించును. లేక దేవదారు, ముత్తవపులగము, దుంపరాస్నము, శొంఠి, ఆముదపువేరు-వీనిని కషాయము గాచియం దాముదపుబొట్లు గలిపి త్రాగిన గర్భిణీస్త్రీ వాతనొప్పులు హరించును.(ఇక ప్రసవానంతరముగలుగు వాతములకు చికిత్స వచించెదను.)

సూతికావాతమునకు బడబానలరసము.

శుద్ధసూతస్య భాగస్యా త్తామ్రచూర్ణంచ తత్సమమ్. 104
ద్విభాగం గంధకంచైవ త్రిభాగంచ కటుత్రయం,
వహ్నితత్పరభాగైకం కుష్ఠం భాగసమన్వితమ్. 105
జ్వాలాముఖీరసైర్మర్ద్యం బదరాస్థి ప్రమాణకం,
బడబానలకః ప్రోక్తః ప్రసూతీవాతనాశనః. (రసరత్నాకరే) 106

తా. శుద్ధిచేసినరసము ౧ భాగము, తామ్రభస్మము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము 3 భాగములు, శొంఠి, పిప్పలి, మిరియాలు, చిత్రమూలము, చెంగల్వకోష్టు ఇవి దినుసుకొక్కొకభాగము.-ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి జ్వాలాముఖీరసముతో ౪ ఝాములు మర్దించి రేగువిత్తంత వటికముజేసి యందొకదానిని ఆవునెయ్యి, మిరియపుచూర్ణము అనువానితోగాని, లేక మినుపకట్టు, వెల్లుల్లిరసము అనువానితో సూతికా

బొట్టు వైచి ఈయనుపానముతోడగాని, లేక నీరుగొలిమిడాకురసము, మిరియపుచూర్ణము అనువానితోగాని సేవించిన ప్రసూతివాతము హరించును. (లేక ప్రసూతివాతమున వాత విధ్వంసనీరసమునైనను సేవింపందగును.)

## గర్భిణీస్త్రీలకు పథ్యము.

ముద్గ గోధూమ షష్టికశాలి జాంగలజారసాః,
బిల్వ కూశ్మాండ పత్తూర పటోలం బాలమూలకమ్. 107
కారవేల్లక వార్తాక జీవంతీ తండులీయకం,
ద్రాక్షా దాడిమ ఖర్జూరం క్షీరం తక్రం ఘృతాన్వితమ్. 108
లఘుపథ్యంచయద్ద్రవ్యంగర్భిణ్యాహితముచ్యతే (మాధవనిదానే)

తా. పెసలు, గోధుమలు, ౬౦ దినములకు ఫలించెడివడ్లు,జాంగలమాంసరసము, మారేడుకాయ, ముదురుగుమ్మడుకాయ, పొన్నగంటికూర, పొట్లకాయ, లేతముల్లంగి గడ్డలు, కాకరకాయ, వంకాయ, మనుబాలకూర, చిఱ్ఱికూర, ద్రాక్షపండు, దాడింబ పండు, ఖర్జూరపండు, ఆవుపాలు, చల్ల, నెయ్యి, లఘుకరద్రవ్యములు, మఱియు పథ్యకరద్రవ్యములు-ఇవి గర్భిణిస్త్రీలకు పథ్యకరంబులు.

## గర్భిణీస్త్రీలకు అపథ్యము.

అతివ్యాయామ నిద్రాచ భారస్య వహనం పరమ్. 109
అథ జాగరణం స్వప్నః కఠినే కుక్కుటాసనం,
శోక క్రోధ భయం వేగం పీడా వమన రేచనే. 110
ఉపవాసశ్చ తీక్ష్ణోష్ణం గురువిష్టంభిభోజనం,
రక్తం నిశ్వసనం శ్వభ్రే శయనం మద్యమాహిషమ్. 111
ఉత్తానశయనం యచ్చ గర్భిణీతు త్యజేత్సదా,

తా. మిక్కుటముగ సంచారము సేయుట, పగలు నిద్రించుట, కడుభారమును మ్రోయుట, జాగరణసేయుట, కఠినాసనమున నిద్రించుట, గొంతుగూర్చుండుట, ఏడ్చుట, కోపమును జెందుట, భయపడుట, మలమూత్ర వేగము నడ్డగించుట, పీడంజెందుట, వమనవిరేచనములకు సేవించుట, ఉపవాసము సేయుట, ఎండలో దిరుగుట, నిప్పుసెగ యం దుండుట, గురుకరద్రవ్యములను, మలబద్ధకరద్రవ్యములను సేవించుట, రక్తమును దీయుట, నిట్టూర్పువాతమును విడుచుట, పల్లములో గూర్చుండుట (నేలపై బరుండుట), కల్లును, బఱ్ఱెపెరుగును ద్రాగుట, వెల్లకిల బరుండుట-ఇవి గర్భిణీస్త్రీల కపథ్యకరంబు లగుటచే వానిని వర్జింపవలయును.

పంచదశ ప్రకరణమ్.

# షోడశప్రకరణము.

---

## అసృగ్ధరరోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లో. శంభుం పినాకినం బాలచంద్రభూషం కృపార్ణవమ్,
సర్వపాపహరం నిత్యం నీలకంఠ మహం భజే. 1

తా. సుఖస్వరూపుఁడు, పినాక మనుధనుస్సు ధరించినవాఁడు, చంద్రశేఖరుఁడు, కరుణాపరిపూర్ణుఁడు, సర్వపాతకముల బోకడచువాఁడు, ఆద్యంతరహితుఁడు నగు నీలకంఠుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథము యొక్క షోడశప్రకరణమును వచించుచున్నాఁడను.

### అసృగ్ధరనిదానము.

శాకోపవాసా దతిమైథునాచ్చ విదాహిభి శ్చాప్రమతీవదుష్టమ్,
ప్రవర్తతే యోనిషునాదశాలిహ్యసృగ్ధరంతంప్రబలంహివిద్యాత్
(ఆయుర్వేదే)

తా. మిక్కుటముగ కూరల భుజించుట, ఉపవాసము సేయుట, అతిమైథునము సేయించికొనుట, దాహకరద్రవ్యముల సేవించుట-ఈకారణములవలన రక్తము మిక్కుటముగ జెడి శబ్దముతోఁగూడి యోనిమూలముగ స్రవించును. ఇదియ అసృగ్ధర మనంబడును. (అసృగ్ధర మన కుసుమరోగము.)

### వాతాద్యసృగ్ధరలక్షణము.

వాతాత్సశూలం సంజాతం సఫేనం కింశుకం భవేత్,
పిత్తాచ్చ రక్తం కృష్ణం వా రక్త ముష్ణం ధృతజ్వరమ్. 4
పాండువర్ణం కఫా ద్రక్తం పిచ్ఛిలం బహుళం స్థిరం,
త్యజే న్మూర్ఛాజ్వరయుతం త్రితయం సాన్నిపాతకమ్. 5
(ఆయుర్వేదే)

తా. శూలగలుగుట, రక్తము నురుగుతోగూడి మోదుగపువ్వువర్ణముగ వెడలుట-ఈలక్షణములుగలది వాతాసృగ్ధరమనియు, రక్తము ఎఱ్ఱగ, లేక నల్లగ వెడలుట, ఉష్ణముగ, రూక్షముగ నుండుట-ఈలక్షణములుగలది పిత్తాసృగ్ధర మనియు, రక్తము పాండురవర్ణమై జిగటగ, విస్తారముగ, గట్టిగ వెడలిన శ్లేష్మాసృగ్ధర మనియు, వాత, పిత్త, శ్లేష్మాసృగ్ధరలక్షణములం గలది సన్నిపాతాసృగ్ధర మనియు తెలియవలయును. ఈసన్నిపాతాసృగ్ధరం బసాధ్యము. ఈనాల్గువిధములైన అసృగ్ధరములలో దేనియందేని మూర్ఛ జ్వరము గలిగియుండిన అసాధ్యంబు.

వాతాత్సశూలం రుధిరం పిత్తే నీలం జ్వరాన్వితమ్,
కఫాత్పిచ్ఛం త్రిలింగంతు త్యజేత్సర్వం జ్వరాన్వితమ్. 6
అపథ్య వర్త్మగం స్త్రీణాం రక్తపిత్త మసృగ్ధరమ్,
శాల్యన్నం పయసః పానం శీతం శస్తం విరేచనమ్. 7

(మాధవనిదానే)

తా. యోని శూలించి రక్తము వెడలిన, వాతాసృగ్ధర మనియు, నీలముగ, ఉష్ణముగ వెడలిన పిత్తాసృగ్ధర మనియు, బంకగవెడలిన శ్లేష్మాసృగ్ధర మనియు, వాత, పిత్త, శ్లేష్మాసృగ్ధరలక్షణంబులం గలది సన్నిపాతాసృగ్ధర మనియు తెలియవలయును. ఈసన్నిపాతాసృగ్ధరం బసాధ్యము. కుసుమరోగములయం దపథ్యము సేయుటవలన రక్తపిత్తాసృగ్ధరము జనించును. (మఱియు జ్వరముగాని, లేక క్షయముగాని, లేక శ్వాసముగాని, లేక క్షయోపద్రవంబులుగాని గలకుసుమరోగిని వర్జింపవలయును.) కుసుమరోగమున శాల్యన్నమును, పాలను సేవించుట పథ్యకరంబు. మఱియు కుసుమరోగమున చల్లని విరేచనమున కొసంగవలయును.

అపథ్యదోషిత్ స్త్రీణాంవై రక్తపిత్తమసృగ్ధరం,
తదేవ ప్రదరం ప్రోక్తం క్రియాకార్యాస్రపైత్తకే. (నిత్యనాథీయే)

తా. అసృగ్ధరరోగములలో స్త్రీలు అపథ్యంబులుజేసిన రక్తపైత్తాసృగ్ధరము జనించును ఇదియ ప్రదరరోగ మనంబడును. ఇది హరించుటకై రక్తపిత్తచికిత్సం జేయవలయును.


అసృగ్ధరచికిత్స

ససితం శైలనిర్యాసం పీతం తండులవారిణా,
అసృగ్ధరం నిహంత్యాశు సుపర్ణ ఇవ పన్నగాన్. 9

తా. మాడయెత్తు శుద్ధిజేసినశిలాజిత్తు, పంచదార - ఈరెంటిని బియ్యపుకడుగుతో నూరి త్రాగిన "గరుత్మంతునిచే సర్పములు హతంబు లగుచందంబున" కుసుమరోగములు హతంబులగు. (లేక నేతిబీరాకురసముతో రాయపురిపంచదార, జీలకఱ్ఱచూర్ణము గలిపి త్రాగిన కుసుమరోగములు హరించును.)

పద్మకేసరసంసృష్టం నవనీతం సలోధ్రకం,
సితా సనాథం జయతి మహావేగ మసృగ్ధరమ్. 10

తా. తామరయగరులు, లొద్దుగచెక్క—వీనిని నూరి ఆవువెన్న, పంచదార గలిపి సేవించిన ప్రబలమైన కుసుమరోగములు హరించును.

గీ. ఆరెచెక్కలయూటయు నందుఁ బంచ
దారయును నూనెఁ జేరిచి త్రాగ నొకటి
జాతిఫలములఁ దగ నావునేత వండి
కడఁగి సేవింపఁ గుసుమరోగములు మాను.

సీ. శ్రీకరంబుగ గొల్లజిడ్డియాకురసంబు బత్తెపెర్గున ననుపాన మొప్ప
నరుదొండపులి సేరు నాకురసంబును బత్తెపెర్గున ననుపాన మొప్పఁ
జేకొని దుచ్చేరునాకురసంబును బత్తెపెర్గున ననుపాన మొప్ప
రక్తమండలపాకు రససంయుతముచేసి బత్తెపెర్గున ననుపాన మొప్ప
గీ. రమణతోఁ బొట్ల బెండాకురసముపెరుగు
సరవిగా రావిచెక్కరసంబు పెరుగు
పథ్యముగ నారగింపంగ భవ్యముఁగను
గామినీజాలకుసుమరోగములు మాను.

సీ. వెండియు కొమ్మనపిండివేళ్ళరసంబు దగఁ బంచదారతోఁ ద్రాగవలయు
నరయఁగఁ జిన్నంగియాకురసంబును దగఁబంచదారతోఁ ద్రాగవలయు
సన్నపావలిమున్గజొన్నలకడుగును దగఁబంచదారతోఁ ద్రాగవలయు
వెలగయాకురసంబు వెసజీలకఱ్ఱయుఁదగఁబంచదారతోఁ ద్రాగవలయు
గీ. మేలుగా రేఁగుకంతులు మేకపాలు
చౌటపరిఘాకురసమును ఛాగదుగ్ధ
పానములు సేయునప్పుడు పథ్యమున్నఁ
గామినీజాలకుసుమరోగములు మాను,

## ప్రదరాంతకరసము

శుద్ధసూతం తథా గంధం శుద్ధ వంగక రూప్యకం,
ఖర్పరంచ వరాటంచ శాణతోలం పృథక్పృథక్. 11
తృతీయతోలకం గ్రాహ్యం లోహచూర్ణం దదేత్సుధీః,
కన్యానీరేణ సంమర్ద్య దినమేకం భిషగ్వరః. 12
అసాధ్యప్రదరం హంతి భక్షణా న్నాత్రసంశయః, (చరకే)

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, తగరభస్మము, రజతభస్మము, శుద్ధిజేసిన కపరి, గవ్వలభస్మము - ఇవి దినుసొకటింటికి శాణప్రమాణము, లోహభస్మము తులములో మూడవభాగము - ఇటుల వీనినెల్ల నేకముజేసి ఖల్వములో నునిచి కలబంద రసముతో నొకదినము మర్దించి మాత్రలుజేసి సేవించిన అసాధ్యప్రదరము నిస్సంశయముగ హరించును.

## కుసుమములకు బాలసూర్యోదయము

సూతం త్రైగుణ్యగంధం పరిమితమమృతం భానుతీక్ష్ణంచ నేత్రం
ఆరూఢం తచ్చతుర్థం గగనశరయుతం మారిచం సర్వతుల్యం,
ఏతం దద్యాన్నిహంతి జ్వరవనదహనం శ్వాసకాసంచ ఛర్దిం
పాండుప్లీహప్రమేహంక్షయగుదజరుజంలింగదోషంచ పుంసామ్. 13
నారీణాంయోనిదోషం బహువిధప్రదరాంమూత్రకృచ్ఛ్రంచసర్వం,
నామ్నాయం బాలసూర్యోదయ కుసుమహరఖ్యాపితోఽయం
మునీంద్రైః. (చరకే) 14

తా. శుద్ధిజేసినరసము ౧ భాగము, శుద్ధిజేసినగంధకము 3 భాగములు, శుద్ధిజేసినవసనాభి 3 భాగములు, తామ్రభస్మము, ఉక్కుభస్మము - ఇవి దినుసుకు ౨ భాగములు, ఇంగువ ౪ భాగము, అభ్రకభస్మము ౫ భాగములు, మిరియాలు ౧౬౪ భాగములు - ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి చూర్ణముజేసి ఐదుచిన్నములయెత్తును (ఆవునేతితోగాని, లేక జాజికాయచూర్ణముతోగాని, లేక మేడిచెక్కరసముతోగాని, లేక ఆరెచెక్కరసముతోగాని, లేక తత్తద్రోగానుగుణ్యానుపాన విశేషములతో గాని) సేవించిన జ్వరము, శ్వాసకాసములు, వాంతి, పాండువు, ప్లీహములు, ప్రమేహము, క్షయము, మూలవ్యాధి, ఉపదంశాదిలింగరోగములు, యోనిదోషము, ప్రదరము మొదలగు కుసుమరోగములు, సర్వమూత్రకృచ్ఛ్రములు - వీనిని హరింపజేయును.

(మఱియు నీబాలసూర్యోదయమును తామరయగరులు, ఆవువెన్న, పంచదార అనువాని యనుపానముతోడ సేవించిన గుసుమరోగము హరించును.

## చంద్రకళారసము

ప్రత్యేకం [1]కర్షమాత్రం స్యాత్సూతం [2]తామ్రం తథాభ్రకం,
ద్విగుణం గంధకం చైవ కృత్వా కజ్జలికాం శుభామ్. 15
ముస్తా దాడిమదూర్వోత్థైః కేతకీస్తనజద్రవైః,
సహదేవ్యాః కుమార్యాశ్చ పర్పటస్యాపి వారిణా. 16
రామశీతలికాతోయై శ్శతావర్యా రసేన చ,
భావయిత్వా ప్రయత్నేన దివసే దివసే పృథక్. 17
తిక్తా గుడూచికా సత్వం పర్పటోశీర మాగధీ,
శ్రీగంధం శారిబాచైషాం సమాంశం సూక్ష్మచూర్ణితమ్. 18
ద్రాక్షాదికకషాయేణ సప్తధా పరిభావయేత్,
తతో ధాన్యాశ్రయం కృత్వా వట్యః కార్యాశ్చణోపమాః. 19
అయం చంద్రకళానామ్నా రసేంద్రః పరికీర్తితః,
సర్వపిత్తగదధ్వంసీ వాతపిత్తగదాపహః. 20
అంతర్బాహ్య మహాదాహ విధ్వంసన మహాఘనః,
గ్రీష్మకాలే శరత్కాలే విశేషేణ ప్రశస్యతే. 21
కురుతే నాగ్నిమాంద్యం చ మహాతాపజ్వరం హరేత్,
భ్రమం మూర్ఛాం హరత్యాశు స్త్రీణాం రక్తం మహాస్రుతిమ్. 22
ఊర్ధ్వాధో రక్తపిత్తం చ రక్తవాంతిం విశేషతః,
మూత్రకృచ్ఛ్రాణి సర్వాణి నాశయే న్నాత్ర సంశయః. 23
(ఆయుర్వేదే)

తా. శుద్ధిజేసిన రసము, తామ్రభస్మము, లేక కాంతభస్మము, అభ్రకభస్మము-ఇవి దినుసుకు కర్షప్రమాణము, శుద్ధిజేసిన ఆమ్లశిలగంధకము ౨ కర్షములు- ఇటుల వానినెల్ల ఖల్వములో నునిచి కాటుకవలె మర్దించి పిదప భద్రముస్తెలు, దాడిమపండు, గరికెవేళ్ళు, మొగలిచన్ను, సహదేవి, కలబంద, పర్పాటకము, తామరతూండ్లు, అడవిసదాప, పిల్లి పీచర అనువానిరసములలో ప్రతిదానిచే నొక్కొకదినము భావనజేసి దానికి సమముగ చేతిబీర, తిప్పసత్తు, పర్పాటకము, వట్టివేరు, పిప్పళ్ళు, శ్రీగంధము, సుగంధపాలవేరు అను

---

1 తోలమాదాయ సూతం. 2 కాంతం.

వానిని సమభాగములుగ సూక్ష్మముగ చూర్ణముజేసి గలిపి పిదప ద్రాక్షపండు, ఖర్జూర పండు, పంచదార, ఇప్పపువ్వు, తేనె, తవక్షీరి, యష్టిమధుకము అనువానికషాయముతో నేడుదినములు భావనజేసి సెనగగింజలంత మాత్రలుజేసి ౧౫ దినములు ధాన్యరాశియం దునిచి ద్రాక్షపండు, తేనె అనువానియనుపానముతోడ సేవించిన సర్వపిత్తరోగములు, వాతపిత్తరోగము, లోన మిక్కుటముగ తాపము, వెలుపటితాపము, అగ్నిమాంద్యము, కడుతాపజ్వరము, భ్రమ, మూర్ఛ, అధికమైన స్రావముగల కుసుమరోగములు, ఊర్ధ్వా ధోగతరక్తపిత్తములు, రక్తపువాంతి, సర్వమూత్రకృచ్ఛ్రములు-వీనిని నిస్సంశయముగ హరింపం జేయును. మఱియు నీరసము గ్రీష్మ శరత్కాలములయందు సేవించుట కడు ప్రశస్తంబు. లేక ఈరసమును జాజికాయ, నెయ్యి- వీనిని నేతితో వండి యీయనుపాన ముతోడగాని, లేక ఖర్జూరపండు. తేనె అనువానితోగాని, లేక గుమ్ముడుపండు, తేనె అనువానితోగాని సేవించిన కుసుమరోగములు, అస్థిస్రావము, రక్తపిత్తము, హరించును. లేక కరక్కాయచూర్ణము, అభ్రకభస్మము, పంచదార, సిందూరము-వీనిని సేవించినను, లేక పూర్వోక్త బాలసూర్యోదయరసమునకు మహాచంద్రకళారసము ననుపానముగ జేసి సేవించినను, అసృగ్ధరము, అస్థిస్రావము-వీనిని హరింపంజేయును. మామిడిచెక్కరసములో ౭ నూనెబొట్లు, ౪ సున్నపుబొట్లు గలిపి త్రాగిన యెట్టికుసుమరోగమైనను హరించును.

## సిందూరాదివటికములు

సిందూరం గోస్తనీ క్షౌద్రం భక్ష్యతే మాసపంచకం,
అసృగ్ధరాస్థిప్రదరం శామ్యతేనాత్ర సంశయః.(సిందూరమణిదర్పణే)

తా. దీపద్రాక్షపండు, చందిరము (అనఁగా సిందూరము) వీనిని తేనెతో మర్దించి మాత్రలుజేసి ౫ మాసములు సేవించిన కుసుమరోగము, అస్థిస్రావము-వీనిని నిస్సంశయ ముగ హరింపంజేయును.

## పాఠాదిఘృతము

పాఠాగైరికమోచదాడిమ మహానింబప్రియంగ్వంబుదైః
ద్రాక్షోదుంబరచందనాగరువిషాలోధ్రాంబుజంబ్వస్థిభిః,
హ్రుష్మైస్త్రైస్మసలీమృణాలకదలీకందాన్వితైస్సాధయేత్
సక్షీరం తు జపారసే ఘృతమిదం స్త్రీణాం మహాశోణితమ్. 25
(మాధవనిదానే)

తా. శిరుబొద్ది, కావిరాయి, బూరుగబంక, దాడింబపండు, పెద్దవేపచెక్క, ప్రేంకణము, కురువేరు, ద్రాక్షపండు, మేడిచెక్క, శ్రీగంధము, అగరు, అతివస, లొద్దుగు

చెక్క, పట్టివేరు, నేరేడుపలుకులు, బోడతరపాకు, నేలతాటిగడ్డలు, తామరతూండ్లు, అరటిదుంపలు-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి వానికి నాలుగింతలు దాసానిపువ్వులు గలిపి వీని కన్నిటికి రెండింతలు ఆవుపాలు, ఆవునెయ్యి గలిపి పక్వముగ వండి నాలుగు మాడలయెత్తును సేవించిన కుసుమరోగములు హరించును.

## జంబ్వాదిఘృతము

ఆదాయ శుష్కం జంబూనా మాఢకం సాధుకుట్టితం,
వల్కలస్య ద్రోణజలే పక్త్వా పాదావశేషితే. 26
దధిమస్తు గుడంచైవ ఘృతం పాతాళగారుడం,
ప్రస్థంప్రస్థం ప్రదాతవ్యం కల్కం కుడవ మావపేత్. 27
బిల్వం స మధుకం లోధ్ర మోచం పద్మం సకేసరం,
ద్రాక్షా కుటజబీజాని ధాతకీ కుసుమం తథా. 23
ఖర్జూరం నాగపుష్పంచ సమంగా దాడిమీఫలం,
పాఠా ముస్తాజమోదం చ చూత జంబూఫలం తథా. 29
కశేరుక కపిత్థం చ కారభిః పృశ్నిపర్ణికా,
ఏతైః పక్వైశ్శుభే భాండే ప్రయోజ్యం భిషగుత్తమైః. 30
రక్తపిత్తమతీసారం సరక్తంచాప్యసృగ్ధరం,
యోనిదోషాస్థినిస్రావం రక్తార్శశ్చవినాశయేత్. (పూజ్యపాదీయే)

తా. ఆఢకప్రమాణ మెండిన నేరేడుపట్టను జిదియగొట్టి ద్రోణప్రమాణము నీళ్లు పోసి నాలవభాగముగ కషాయము గాచి అందు పెరుగుమీఁదిమీగడ, బెల్లము, ఆవునెయ్యి, దూసరతీఁగెరసము అనువానిని దినుసు కొక్కొక ప్రస్థము చొప్పున గలిపి పిదప నందు మారేడువరుగు, ఇప్పపువ్వు, లొద్దుగచెక్క, బూరుగుబంక, తామరయగరులు, ద్రాక్షపండు, కొడిసెపాలవిత్తులు, ఆరెపువ్వులు, ఖర్జూరపండు, సంపంగిపూలు, మంజిష్ఠ, దాడింబపండు, శిరుబొద్ది, తుంగముస్తెలు, అజామోదము, మామిడివరుగు, నేరేడుపలు కులు, సెమ్ముటములు, వెలగపండు, ఇలిందవేరు, సక్కతోకపొన్న అనువాని కల్కమును దినుసుకు కుడవప్రమాణముచొప్పున గలిపి పక్వముగ వండి సేవించిన రక్తపిత్తము, రక్తాతిసారము, అసృగ్ధరము, యోనిదోషము, అస్థిస్రావము, రక్తార్శస్సు హరించును.

## కుసుమరోగ చికిత్స

జంబూదుంబరపల్కలం ఖదిరజాసారం ప్రసూనం తథా
నారికేళభవం చ కృష్ణకదళీకందం తథా తండులం,

లాక్షాచూర్ణవిమిశ్రితం మధుయుతం రాత్రిస్థితం పాయయేత్,
గర్భాసృక్ప్రదరాస్రపిత్తసికతా మేహార్భ్రశం పీడితాన్. 32

(మాధవనిదానే)

తా. నేరేడుచెక్క, మేడిచెక్క, చంద్రకొనలు, నారికడపుపువ్వు, నల్లయరటిగడ్డ, బియ్యము, లక్క- వీనిని సమభాగములుగ చూర్ణముచేసి తేనెలో గలిపి యొకరాత్రి యునిచి సేవించిన గర్భిణీస్త్రీయొక్క రక్తస్రావము, ప్రదరము (అనఁగా చీరవ్యాధులు), రక్తపిత్తము, సికతామేహము హరించును.

అస్థిస్రావలక్షణము

సీ. వసుధ విష్ణుక్రాంతరసము లవంగంబు జీలకఱ్ఱయు వండి సేవ నొకటి
మేడిచెక్కలపూటతోడ లవంగంబు నేలకి గూరిచి క్రోల నొకటి
వెస పైడిప్రత్తాకు రసజాతిఫలలవంగంబు లేలకి జీలకఱ్ఱ నొకటి
యేడుతాడులకల్లునేడు సేరులనూనె బెల్లంబుమిరియంబునెల్ల మూఁడు

గీ. సేరులును గూర్చి వేడ్కగ సేవ నొకటి
అరయ నేయౌషధంబైన ననుభవించి
పథ్యములు సేయ మానును దథ్యముగను
గౌటిలంబైన కుసుమరోగంబులెల్ల.

గీ. తమిదపిండిని జెన్నునఁ దడిపి కొన్ని
కుడుములుగ వండి యవియును గోవునేత
రాయపురిఁ జంచదారయు రమణతోడఁ
బానములు సేయఁ గుసుమరోగములు మాను.

ఉ. చిక్కనిజీడిగింజ లోకసేరును నోమపుపొట్టు సేరునుం
జక్కెర పాతకొబ్బెరయుఁ జయ్యన రెండును రెండుపావులున్
ద్రాక్షి కలంగపత్రమును దోరపుచిక్కుడుపత్రతోయముల్
మక్కువ నేతితో గొనఁగ మానును గాంతలయెఱ్ఱజీరలున్.

అస్థిస్రావలక్షణము

శుభ్రం రక్తం వాథవా శారవర్ణ మచ్ఛం విస్రం యోనిజం స్రావమాహుః,
అస్థిస్రావం త్వస్థిమజ్జాపకర్షమాంత్రే శీస్యాచ్ఛోషశూలప్రదం చ. 33

(మాధవనిదానే)

తా. రక్తము తెల్లగగాని, లేక * శారవర్ణముగగాని, లేక తేటగగాని, గలదై

* శారవర్ణ మన—ఎచ్చగుపచ్చనిరంగు గల నీలవర్ణము.

దుర్గంధముగ యోనిమార్గముగ వెడలిన అస్థిస్రావ మనంబడును. ఇది యస్థులయందలి మజ్జ నాకర్షించి ప్రేగులయందు శోషను, శూలను గలుగంజేయును.

## అస్థిస్రావనిదానము

భవే ద్రసావిదాహేన యథా తద్వర్ణమార్తవం,
తదస్థిస్రావ మాఖ్యాత మతికార్శ్య ప్రదర్శనమ్. 34

తా. స్త్రీకి రసవిదాహమువలన రక్తము రసవర్ణముగ బైలువెడలిన అస్థిస్రావ మనంబడును. దీనియం దధికముగ శరీరము కృశించును. (మఱియు అస్థిస్రావరోగమున జ్వరముగాని, లేక క్షయోపద్రవములుగాని, లేక శ్వాసముగాని, లేక మహోపద్రవంబులుగాని గలిగియుండిన యసాధ్యం బనియు, లేకుండిన సాధ్యం బనియు దెలియవలయును. మఱియు సాధ్యంబుగా నుండు అస్థిస్రావరోగము నివర్తించుటకై నాలుగుమాసములు పూర్ణచంద్రోదయమును సేవింపవలయును.)

## శతావరీఘృతము

పచేద్ఘృతస్య ద్విప్రస్థం శతావర్యారసాఢకే,
ఆఢకం మహిషక్షీరం ప్రస్థం గోక్షురకం తథా. 35
ప్రస్థం చ మాషయూషస్య దత్వా కల్కీకృతైర్ఘటే,
శారిబా మధుకం ద్రాక్షా చందనోశీరవత్సకైః 36
ముస్తయాచ మృణాళేన కాకోల్యాదిగణేన చ,
పరూష పద్మకింజల్క సమంగోత్పలకర్షకైః 37
సిద్ధేపూతే క్షిపే త్ప్రస్థం సితాయా మాక్షికస్య వా,
ఏతత్సమ్యక్ప్రయుంజీత ప్రదరేఽస్థిం వినిస్రుతే. 38
అంతర్దాహే రక్తపిత్తే క్షీణే రేతసి పైత్తకే,
మూత్రకృచ్ఛ్రేక్షయోన్మాదే తృష్ణాయాం బృంహణం పరమ్. 39

తా. ఆవునెయ్యి ౨ ప్రస్థములు, పిల్లిపీచరవేళ్ళరసము ౨ ఆఢకములు, బఱ్ఱెపాలు ఆఢకము, పల్లేరురసము ౧ ప్రస్థము, మినుపకట్టు ౧ ప్రస్థము - ఇటుల వీని నెల్ల గట్టి బానలోఁ బోసి అందు గూడపాల, యష్టిమధుకము, ద్రాక్షపండు, శ్రీగంధము, వట్టివేరు, కొడిసెపాల, తుంగముస్తెలు, తామరతూండ్లు, కాకోల్యాదిగణములోఁ జెప్పఁబడిన ద్రవ్యములు, ఖర్జూరపండు, తామరకేసరములు, మంజిష్ఠ, నల్లకలువదుంపలు అనువానికల్కమును దినుసు కొక్కొకకర్షముచొప్పున గలిపి పక్వముగ గాచి వడియగట్టి అందు పంచదారగాని, తేనెగాని యొకప్రస్థము గలిపి సేవించిన ప్రదరము, అస్థిస్రావము, అంత

ర్దాహము, రక్తపిత్తము, క్షీణరేతోదోషము, పిత్తరోగము, మూత్రకృఛ్రము, క్షయము, ఉన్మాదము, దప్పి - వీనిని హరింపజేయుటయేగాక శరీరపుష్టిని నగా గలుగంజేయును.

### ముసల్యాదికషాయము

ముసలీఖదిరామలకీ త్రికంటక జంబూత్వగ్వరీక్వాథః,
అస్థిస్రావం ప్రదరం ప్రవాహికాస్రపిత్తమాశునాశయతిద్రువమ్.
(ఆయుర్వేదే)

తా. నేలతాటిగడ్డలు, చంద్రచెక్క, ఉసిరికెపప్పు, పల్లేరు, నేరేడుచెక్క, పిల్లిపీచరవేరు - వీనిని సమభాగములుగ దంచి కషాయము గాచి త్రాగిన అస్థిస్రావము, ప్రదరము, ప్రవాహిక, రక్తపిత్తము శీఘ్రముగ హరించును.

### బలాదికషాయము

బలా ఛిన్నరుహా ధాత్రీ వల్కలం చారిమేదకం,
క్వాథోఽసృగ్ధరపిత్తాసృగస్థిస్రావనిషూదనః. (మతాంతరే) 41

తా. ముత్తవపులగము, తిప్పతీగె, ఉసిరికెపప్పు, తెల్లతుమ్మకొనలు - వీనిని కషాయముగాచి త్రాగిన ప్రదరము, రక్తపిత్తము, అస్థిస్రావము (తెల్లచీరరోగము) వీనిని హరింపంజేయును. (లేక ఆరెదొండవేరుగంధములో కొతిమెర్లు, పిప్పలి అనువాని చూర్ణముగాని, లేక యోగరాజగుగ్గులమునుగాని గలిపి సేవించిన అస్థిస్రావము హరించును.)

ఉ. తంగేడువేరుచెక్కయు నుదారత నల్లనిప్రత్తియాకులు౯
సంగతి నుత్తరేణుపురసంబును నొక్కొకద్రవ్యమందున౯
వంగవిభూతి శర్కరయు వర్యమరీచము గూర్చి సేవచే
తంగడువేగ మాను వసుధాస్థలి కాంతలచీరరోగముల్.

సీ. గోడ్డుకాకరచెట్టుగడ్డరసంబును జల్లయు వంగభస్మంబు నొకటి
కువలయంబును దుప్పికొమ్ముగంధంబును జల్లయువంగభస్మంబునొకటి
వెలసినతంగేడువిత్తులచూర్ణంబు చల్లయు వంగభస్మంబు నొకటి
మీఱిన యాదొండ వేరును గొతిమెర్లు చల్లయు వంగభస్మంబు నొకటి

గీ. చెలఁగి యీయౌషధంబును సేవఁజేసి
పథ్యముగ నున్న మానును బరగ వేగ
వ్యాధులెల్లను ధరణి నవశ్యముగను
తేలువిషమెక్కి మంత్రాన దిగినయట్లు.

గీ. తాటిరేకులచూర్ణంబు తగినపంచ
దార మిరియంబు గూర్చియుఁ ద్రాగినపుడె
మీననేత్రలకడుపులలోన నున్న
పలువిధంబులఁ దెల్లజీరలు దొలంగు.

కుసుమరోగమునందు పథ్యము

ముద్గ గోధూమ షాష్టికశాలి జాంగలజారసాః,
పక్వకూష్మాండ పత్తూర పటోలం తండులీయకమ్. 42
ద్రాక్షా దాడిమ ఖర్జూరం ధాత్రీఫలఘృతం మధు,
ప్రదరే రక్తపిత్తే చ పథ్యవర్గ ముదాహృతమ్. (మాధవనిదానే) 43

తా. పెసరకట్టు, గోధుమలు, ౬౦ దినములకు పండినవడ్లు, జాంగలమాంసరసము, ముదురుగుమ్మడికాయ, పొన్నగంటికూర (కొయ్యతోటకూర), పొట్లకాయ, చిర్రికూర, ద్రాక్షపండు, దాడింబపండు, ఖర్జూరపండు, ఉసిరికెపండు, నెయ్యి, తేనె - ఇవి కుసుమ రక్తపిత్తరోగములయందు పథ్యకరంబులు.

పయసా ముద్గయూషేన భోజనంస్యాదసృగ్ధరే,
ఉదుంబరశలాటూని దుగ్ధం మధు పిబేత్తథా. 44
అసృగ్ధరవినాశాయ తథాసృక్పిత్తశాంతయే, (అన్యశాస్త్రే)

తా. పాలయుక్తముగ గాచఁబడిన పెసరకట్టు, ముదిరిన *మేడికాయలు, ఆవుపాలు, తేనె - ఇవి అసృగ్ధర పిత్తరోగములయందు హితకరంబులు.

కుసుమరోగమునం దపథ్యము.

కట్వమ్ల లవణ క్షార మత్స్య మద్య విదాహినః. 45
మాషా నిష్పావ తిలజ కుళుత్థం లశునం దధి,
ప్రదరే రక్తపిత్తేచా ప్యపథ్యమితి కథ్యతే. 46

తా. కారము, పులుసు, ఉప్పు, క్షారములు, మత్స్యములు, కల్లు, విదాహకర ద్రవ్యములు, మినుములు, అనుములు (చిక్కుడుకాయ), నువ్వులు, ఉలవలు, వెల్లుల్లిపాయ, పెరుగు - ఇవి ప్రదర, రక్తపిత్త, అస్థిస్రావరోగములయం దపథ్యకరంబులు.

యోనివ్యాపత్తినిదానము

వింశతి ర్వ్యాపదో యోనే ర్నిర్దిష్టా రోగసంగ్రహే,
మిథ్యాచారేణతాస్త్రీణాం ప్రదుష్టేనార్తవేన చ. 47

---

* ఇదే అత్తికాయ.

జాయంతేబీజదోషాచ్చదైవాచ్చశృణుతాః పృథక్, (ఆయుర్వేదే)

తా. యోనిదోషములు ౨౦ విధంబులని రోగసంగ్రహమునందు జెప్పంబడియున్నయది. ఇవి మిథ్యాహారవిహారములవలన, దుష్టరక్తమువలన, బీజదోషమువలన, దైవయోగమువలన స్త్రీలకు జనించును. వానిలక్షణంబులఁ బ్రత్యేకంబుగ వచించెదను.

సా ఫేనిలముదావృత్తా రజః కృచ్ఛ్రేణ ముంచతి. 48
వంధ్యాం దుష్టార్తవాం విద్యా ద్విప్లుతాం నిత్యవేదనం,
పరిప్లుతాయాం భవతి గ్రామ్యధర్మేణరుగ్భృశమ్. 49
వాతలా కర్కశా స్తబ్ధా శూల నిస్తోదపీడితా,
చతసృష్వపిచాద్యాసు భవం త్యనిలవేదనాః. 50

తా. యోనివలన నార్తవము నుఱుగుతోఁగూడి కడుకష్టమువలన వెడలిన ఉదావర్త మనంబడును. ఆర్తవము దుష్టంబగుటవలన వంధ్య యనంబడును. ఎల్లప్పుడు వేదనగలిగియుండిన విప్లుత మనంబడును. మైథునమువలన కడుపీడ గలిగిన పరిప్లుత మనంబడును. - కాఠిన్యము, శూల గలిగియుండిన వాత మనంబడును. మఱియు పైఁజెప్పఁబడిన ఉదావర్త. వంధ్య, విప్లుత, పరిప్లుతములను నాలుగు యోనిరోగములయందు వాతవేదన గలిగియుండును.

సదాహం క్షీయతే రక్తం యస్యాస్సా లోహితక్షయా,
సవాతముద్వమేద్బీజం వామినీ రజసాన్వితమ్. 51
ప్రస్రంసినీ స్రంసతే తు క్షోభితా దుఃప్రజాయినీ,
స్థితం స్థితం హంతి గర్భం పుత్రఘ్నీ రక్తసంక్షయాత్. 52
అత్యర్థం పిత్తలాయోని ర్దాహపాకజ్వరాన్వితా,
చతసృష్వపిచాద్యాసు పిత్తలింగోచ్ఛ్రయో భవేత్. 53

తా. యోనివలన వేడిగ, అధికముగ రక్తమువెడలిన లోహితక్షయ మనంబడును. రజోయుక్తశుక్రము వాతయుక్తముగ స్రవించిన వామిని యనంబడును. యోనిస్థానము వలన నార్తవము భ్రష్టంబైన ప్రస్రంసిని యనంబడును. దీనియందు మర్దనవలన సగా బాగుగా స్రావము గలుగకుండును. దానంజేసి దుఃఖప్రసవమునకు కారణం బగును. యోనియందు రక్తక్షయమువలన గర్భము నిలువకుండిన పుత్రఘ్ని యనంబడును. యోని కడు దాహయుక్తమై పండి జ్వరయుక్తముగనుండిన పిత్తళ యనంబడును. పైఁజెప్పఁబడిన రక్తక్షయ, వామిని, స్రంసిని, పుత్రఘ్ని అనునాలుగు యోనిరోగములయందు పిత్తలక్షణంబులే యధికముగ గలిగియుండును.

అత్యానందాతసంతోషం గ్రామ్యధర్మేణ గచ్ఛతి,
కర్ణిన్యాం కర్ణికా యోనౌ శ్లేష్మాసృగ్భ్యాం ప్రజాయతే. 54

మైథునాచరణాత్పూర్వం పురుషా దతిరిచ్యతే,
బహుశ శ్చాతిచరణా తయోర్బీజం న విందతి. 55
శ్లేష్మలా పిచ్ఛిలా యోనిః కండూయుక్తాతిశీతలా,
చతసృష్వపిచాద్యాసు శ్లేష్మలింగోచ్ఛ్రయో భవేత్. 56

తా. దృఢమైథునమువలనసగా సుఖమును జెందకుండెడియోని అత్యానంద మనంబడును. యోనియందు కఫరక్తమువలన కమలముయొక్క మిద్దెవలె మాంసకందము గలిగిన కర్ణిక యనంబడును. పురుషునికి సురతమువలన సుఖము గలుగుటకుముందే ద్రవించి విరామమును జెందెడియోని చరణ మనంబడును. పలుమారు రతికేళిం దేలినను ద్రవింపక పురుషునికిబిదప ద్రవించెడియోని అతిచరణ మనంబడును. (చరణ అతిచరణదోషములుగల యోనియందు గర్భధారణము గలుగకుండును. బంకగ, కండూయుక్తముగ, కడుచల్లగ నుండుయోని శ్లేష్మల మనంబడును. పూర్వోక్త అత్యానంద, కర్ణిక, చరణ, అతిచరణములను నాలుగు యోనిరోగములయందు కఫలక్షణములే యధికముగ గలిగియుండును.)

అనార్తవా స్తనీ షండీ ఖరస్పర్శా తు మైథునే,
అతికాయగృహీతాయా స్తరుణ్యా స్త్వండినీ భవేత్. 57
వివృతాతిమహాయోని స్సూచీవక్త్రాతిసంవృతా,
సర్వలింగసముత్థానా సర్వదోషప్రకోపజా. 58
చతసృష్వపి చాద్యాసు సర్వలింగనిదర్శనం,
పంచాసాధ్యాభవంతిహ యోనయ స్సర్వదోషజాః. 59

తా. ఋతువు, స్తనములు లేక మైథునకాలమున గరగరగనుండు భగముగల స్త్రీ షండిని యనంబడును. యౌవనముగలస్త్రీకి స్థూలమైన లింగసంబంధమువలన యోనియందమువలె బైలువెడలిన అండిని యనంబడును. యోనిముఖము కడువివృతంబై యుండిన మహాయోని యనంబడును. కడుసంకుచితమైన ద్వారముగలయోని సూచీవక్త్ర మనంబడును. సర్వదోషములయొక్క ప్రకోపమువలన సర్వలక్షణంబులుంగలయోని సాన్నిపాతిక మనంబడును. మఱియు పూర్వోక్త షండిని, అండిని, మహాయోని, సూచీవక్త్రము అను నాలుగును యోనిరోగములలో సర్వదోషలక్షణంబులు గలిగియుండుటవలన నా నాలుగును, త్రిదోషమువలన జనించిన నైదవది యగు సాన్నిపాతికయోనిరోగంబును అసాధ్యంబులు.

## కదంబాదికషాయము

కదంబమూలవల్కం చ ఖదిరాంగార మిశ్రితం,

మాసం నారీపిబేత్క్వాథం యోనిశూల నిపీడితా. (మాధవనిదానే)

తా. మొగలుకడిమివేరుపట్ట, చంద్ర, గుంటగలగర-వీనిని కషాయము గాచి యొకమాసము స్త్రీ త్రాగిన యోనిశూల హరించును.

రాస్నాశ్వగంధా వాసాభి శ్శృతం వా శూలనుత్పయః,
వాసోపకుంచికా జాజీ వచా రాస్నా చ చిత్రకమ్. 61
యవానీ సైంధవం క్షారం పిష్ట్వాయుక్తం ఘృతేన తు,
మర్మయోనిజశూలఘ్నం పేయముష్ణోదికాదిభిః. (మాధవనిదానే)

తా. సన్నరాస్నము, పెన్నేరుగడ్డ, అడ్డసరము-వీనిని పాలలో వైచి గాచి త్రాగినను, లేక అడ్డసరము, నల్లజీలకఱ్ఱ, జాజికాయ, వస, సన్నరాస్నము, చిత్రమూలము, ఓమము, సైంధవలవణము-వీని నుష్ణోదకముతో నూరి యందు నెయ్యి గలిపి త్రాగినను మర్మస్థానములయందలి శూల, యోనిశూల హరించును.

పేటికామూల లేపాచ్చ యోనిర్భిన్నా ప్రశామ్యతి. 63

తా. పేటికామూలమును నూరి లేపనముజేసిన యోనిపగుళ్ళు మానును.

ఫలఘృతము

మంజిష్ఠా మధుకం కుష్ఠం త్రిఫలా శర్కరా బలా,
మేదా పయస్యా కాకోలీ మూలంచైవాశ్వగంధజమ్. 64
అజమోదా హరిద్రే ద్వే తథా కటుకరోహిణీ,
ఉత్పలం కుముదం ద్రాక్షా కాకోలా చందనద్వయమ్. 65
ఏతేషాం కార్షికై ర్భాగై ర్ఘృతప్రస్థం విపాచయేత్,
శతావరీరసం క్షీరం ఘృతాద్దేయం చతుర్గుణమ్. 66
సర్పిరేతన్నరః పీత్వా స్త్రీషు నిత్యం వృషాయతే,
పుత్రాన్సంజనయే న్నారీ మేధాఢ్యా న్ప్రియదర్శనాన్. 67
యాచైవాస్థిరగర్భాస్యా ద్యాచవా జనయే న్మృతం,
స్వల్పాయుషం వా జనయే ద్యాచకన్యాం ప్రసూయతే. 68
యోనిదోషే రజోదోషే పరిస్రావే చ శస్యతే,
ప్రజావర్ధన మాయుష్యం సర్వగ్రహనివారణమ్. 69
నామ్నా ఫలఘృతం హ్యేత దశ్విభ్యాం నిర్మితం పురా, (అశ్వినే)

తా. మంజిష్ఠ, అతిమధురము, చెంగల్వకోష్టు, త్రిఫలములు, పంచదార, ముత్తవపులగము, మేద, పిన్నపాల, తేలుమణివేరు, పెన్నేరుగడ్డ, అజామోదము, పసపు,

ఘ్రానిపసపు, కటుకరోహిణి, నల్లకలువగడ్డలు, తెల్లకలువగడ్డలు, ద్రాక్షపండు, కాకోళి, క్షీరకాకోళి, చందనము, రక్తచందనము-వీనిలో ప్రతిదానిని కర్షప్రమాణము గ్రహించి కల్కముజేసి ప్రస్థప్రమాణము నేతిలో గలిపి నేతికి నాలుగింతలు పిల్లిపీచరవేళ్ళరసము, పాలు గలిపి ఘృతము శేషించునటుల గాచి పురుషుఁడు సేవించిన వీర్యవృద్ధిగలవాఁడై ప్రతిదినము స్త్రీతో సంభోగముసేయును. మఱియు దీనిని గర్భస్రావము, మృతప్రసవము గలస్త్రీ, అల్పాయువుగల సంతానమును పుట్టించెడిస్త్రీ, కన్యకల ప్రసవించెడి స్త్రీ సేవించిన మేధ, సౌందర్యముగల పుత్రులం గనును. ఈఘృతము యోనిరోగము, రజోదోషము (పరిస్రావదోషము, సర్వగ్రహదోషములు)-వీనిని హరింపంజేసి సంతానవృద్ధిని, ఆయువును గలుగంజేయును. ఈఫలఘృతము అశ్వినీదేవతలవలన నిర్మింపంబడియెడిది.

## సిద్ధార్థకాదిఘృతము

సిద్ధార్థకం వచా బ్రాహ్మీ శంఖపుష్పీ పునర్నవా. 70
పయస్యా త్రిఫలా కుష్ఠం తథా కటుకరోహిణీ,
శారిబా ద్వయయష్ట్యాహ్వా చోరకం సుమనోలతా. 71
వృషాపుష్పం సమంజిష్ఠా దేవదారు ర్మహౌషధం,
పిప్పల్యౌ భృంగరాజంచ నిశా శ్యామా సువర్చలా. 72
దశమూల మపామార్గ మశ్వగంధా శతావరీ,
జలద్రోణే పచే దేతా న్భాగై ర్ద్విపలకై రిమాన్. 73
తత్కషాయం పరిస్రావ్య ఘృతస్యార్ధాఢకే పచేత్,
పాచితం తద్ఘృతం యుక్త్వా గాయత్ర్యాచాభిమంత్రితమ్. 74
ద్విమాసగర్భిణీ నారీ షణ్మాసాదుపయోజయేత్,
సర్వజ్ఞం జనయే త్పుత్రం సర్వామయవివర్జితమ్. 75
అస్యప్రభావాత్కుక్షిస్థ స్ఫుటవాగ్వ్యాహరత్యపి,
యోనిదుష్టాశ్చ యానార్యో రేతో దుష్టాశ్చ యేనరాః. 76
వంధ్యాపి లభతేగర్భం శూరంపండితమానినం, (మాధవనిదానే)

తా. తెల్లావాలు, వస, మండూకబ్రహ్మి, శంఖపుష్పి, గలిజేరు, పిన్నపాల, త్రిఫలములు, చెంగల్వకోష్టు, కటుకరోహిణి, * గూడపాల, నల్లగూడపాల, అతిమధురము, చోరకము, జాజితీగె, అడ్డసరపుపువ్వులు, మంజిష్ఠ, దేవదారు, శొంఠి, పిప్పలి, గజపిప్పలి, గుంటగలగర, పసపు, నల్లతెగడ, సౌవర్చలవణము, దశమూలములు, ఉత్తరేణు, పెన్నేరు

* ఇదే సుగంధిపాల.

గడ్డ, పిల్లిపీచర-వీనిని దినుసుకు రెండుపలములచొప్పున దంచి ద్రోణప్రమాణ ముదకము పోసి కషాయము గాచి వడియగట్టి ఆఢకప్రమాణమునెయ్యిగలిపి ఘృతము శేషించునటులగాచి గాయత్రీమంత్రముతో నభిమంత్రించి గర్భముధరించిన రెండుమాసములుమొదలు ఆరవ మాసమువఱకు సేవించిన సర్వరోగవివర్జితురాలై సర్వజ్ఞుఁడైన పుత్రునిం గనును. ఈఘృతముయొక్క ప్రభావమువలన గర్భమందలి శిశువుకు స్ఫుటమైనవాక్కు గలుగును. మఱియు నిది స్త్రీయొక్కయోనిరోగమును, పురుషునియొక్క శుక్రదోషమును హరింపఁ జేయును. మఱియు గొడ్రాలైన స్త్రీ గర్భముధరించి పండితుఁడగు కొమరునిం గనును.

## వచాద్యవలేహము

వచోపకుంచికా జాజీ కృష్ణా వృషభ సైంధవమ్. 77
అజమోదా యవక్షార చిత్రకం శర్కరాన్వితం,
పిష్ట్వా ప్రసన్నయాలోడ్య ఖాదే త్తద్ఘృతభర్జితమ్. 78
యోనిపార్శ్వార్తిహృద్రోగ గుల్మార్శో వినివృత్తయే,

తా. వస, నల్లజీలకఱ్ఱ, జీలకఱ్ఱ, పిప్పళ్ళు, అడ్డసరము, సైంధవలవణము, అజామోదము, యవక్షారము, చిత్రమూలము, అనువానిచూర్ణమును నేతిలోవేయించిశర్కర గలిపి ప్రసన్నమను పేరుగల మద్యముయొక్క యనుపానముతోడ సేవించిన యోనిపార్శ్వభాగమునందలి శూల, హృద్రోగము, గుల్మము, అర్శస్సు-వీనిని హరింపఁజేయును.

## యోనికందనిదానము

దివా స్వప్నా దతిక్రోధా ద్వ్యాయామా దతిమైథునాత్. 79
క్షతాచ్చ నఖదంతాద్యై ర్వాతాద్యాః కుపితామలాః,
పూయశోణితసంకాశం లకుచాకృతిసన్నిభమ్. 80
ఉత్పద్యతేయదాయోనౌనామ్నాకందస్సయోనిజః.(మాధవనిదానే)

తా. పగలు నిద్రించుట, కడుక్రోధమును, శ్రమను జెందుట, అతిమైథునమునందు బ్రవర్తించుట, నఖదంతాదులవలన యోనియందు గాయము దగులుట-ఈకారణములవలన యోనియందు వాతాదిదోషములు ప్రకోపించి చీము, రక్తము అనువానితో దుల్యమైనవర్ణము, నిమ్మపండుయొక్క ప్రమాణముగలదై గుండ్రముగనుండు మాంసపుయుంటలను గలుగఁజేసిన నది యోనికంద మనంబడును.

## వాతయోనికందలక్షణము

రూక్షం వివర్ణం స్ఫుటితం వాతకందం వినిర్దిశేత్. 81

తా. రూక్ష, వివర్ణముగలిగి పగిలియుండిన వాతయోనికందమని తెలియవలయును.

## యోనికందచికిత్స

గైరికామ్రాస్థి జఠర రిజన్యం జినకట్ఫలాః,
పూరయే ద్యోనిమేతేషాం చూర్ణైః క్షౌద్రసమాన్వితైః. 82

త్రిఫలాయాః కషాయేణ సక్షౌద్రేణ చ సేచయేత్,
ప్రమదా యోనికందేన వ్యాధినా పరిముచ్యతే. 83

తా. కావిరాయి, మామిడిపప్పు, పసపు, సురమఞాయి, కాయఫలము-వీనిని చూర్ణముజేసి తేనెలోగలిపి యోనియందు ధారణముజేసినను, లేక త్రిఫలకషాయములో తేనె గలిపి సేచనముజేసినను యోనికందము హరించును.

## ఆఖుతైలము

ఆఖోర్మాంసం సపది బహువా సూక్ష్మఖండీకృతం త
త్తైలేపాచ్యం ద్రవతి నియతం యావదేతేన సమ్యక్,
తత్తైలాక్తం వసనమనిశం యోనిభాగే దధానా
సత్యం వ్రీడా జనక మబలా యోనికందం నిహంతి. 84

తా. ఎలుకమాంసముయొక్క సన్ననితునకల నూనెలోవైచి ద్రవించి తైలముతో గలియువఱకుగాచి దానిలో వస్త్రము దడిపి యోనియందు ధరించిన లజ్జాకారక యోనికందము హరించును.

## పిత్తజయోనికందలక్షణము

దాహరాగజ్వరయుతం విద్యా త్పిత్తాత్మకం తు తం,

తా. దాహయుక్తముగ, ఎఱ్ఱగ, తాపయుక్తముగ నుండిన పైత్తకయోనికందమని దెలియవలయును.

## కఫజయోనికందలక్షణము

నీలపుష్పప్రతీకాశం కండూమంతం కఫాత్మకమ్. 85

తా. నీలపుష్పవర్ణముగ కండూయుక్తముగ నుండిన కఫజయోనికంద మని తెలియవలయును.

## సన్నిపాతజయోనికందలక్షణము

శర్వలింగసమాయుక్తం సన్నిపాతాత్మకం వదేత్,

తా. పూర్వోక్త వాత, పిత్త, కఫలక్షణయుక్తంబుగ నుండిన సన్నిపాతకయోని కంద మని తెలియవలయును.

### గుడూచ్యాదివర్తి

గుడూచీ త్రిఫలా దంతి క్వాథేన పరిపేషితైః. 86
పిప్పలీ మరిచై ర్మాషై శ్శతాహ్వా కుష్ఠ సైంధవైః,
వర్తిస్తుల్యా ప్రదేశిన్యా ధార్యా యోనివిశోధినీ. 87

తా. తిప్పతీఁగె, త్రిఫలములు, దంతివేరు-వీనికషాయముతో పిప్పళ్ళు, మిరియాలు, ఉద్దులు, పిల్లిపీచర, చెంగల్వకోష్టు, సైంధవలవణము అనువానిని నూరి వస్త్రమునకు బట్టించి జుట్టున వ్రేలులావంత వర్తిజేసి యోనియందు ధరించిన యోనిరోగము హరించి యోని స్వచ్ఛముగ నగును.

### పిష్టజంబూకలేపము

పిష్టజంబూక సంపిష్టం పక్వం తింతిండిసంయుతం,
లేపమాత్రేణ నారీణాం యోనికందహరం పరమ్. 88

వా. పిష్టజంబూకమును (పీతలోధ్రమును) దంచి చూర్ణముజేసి చింతపండులో గలిపి పక్వముగ వండి యోనిపైఁబూసిన యోనికందము హరించును.

### గర్భపాతనిదానము

భయాభిఘాత తీక్ష్ణోష్ణపానాశన నిషేవణాత్,
గర్భః పతతి రక్తస్య సశూలం దర్శనం భవేత్. (ఆయుర్వేదే) 89

తా. భయము, అభిఘాతము-వీనింజెందుట, తీక్ష్ణము, ఉష్ణముగలయన్నోదకముల సేవించుట-ఈకారణములవలన శూలయుక్తముగ గర్భస్రావము, రజోదర్శనము గలుగును.

### గర్భస్రావపాతనకాలము

ఆచతుర్థా త్తతోమాసా త్ప్రస్రవే ద్గర్భవిద్రవః,
తతస్స్థిరశరీరస్య పాతః పంచమషష్ఠయోః. 90

తా. నాలుగుమాసములవఱకు గర్భము ద్రవముగ నుండును. ఇది స్రవించిన స్రావమనంబడును. ఐదవ, లేక ఆరవమాసమున గర్భము కఠినంబుగనుండును. ఇది పడిన గర్భపాత మనంబడును.

### గర్భస్రావకారణము

గర్భోఽభిఘాత విషమాసనపీడనాద్యైః
పక్వంద్రుమాదివ ఫలం పతతి క్షణేన. 91

తా. అభిఘాతము, విషమముగ గూర్చుండుట, పీడ మొదలగుకారణములవలన "పక్వమైన ఫల మొకింత యభిఘాతమువలన వృక్షముననుండి పడుచందంబున, గర్భము స్వస్థానమునందుండి తత్క్షణమున పతనం బగును."

### గర్భపాతోపద్రవములు

ప్రస్రంసమానే గర్భేస్యా ద్దాహ శ్శూలశ్చ పార్శ్వయోః,
పృష్ఠరుక్ప్రదరానాహౌ మూత్రసంగశ్చ జాయతే. 92

తా. గర్భస్రావకాలంబున దాహము, పార్శ్వ, పృష్ఠములయందు శూల, ప్రదరము, ఆనాహము, మూత్రప్రతిబంధము అను నుపద్రవంబులు గలుగును.

### స్థానాంతరగతగర్భోపద్రవము

స్థానాత్స్థానాంతరే తస్మి న్ప్రయాత్యపి చ జాయతే,
ఆమపక్వాశయాదౌ తు క్షోభపూర్వాహ్యుపద్రవాః. 93

తా. గర్భము స్వస్థానముననుండి చలించి యితరస్థానగతంబైన ఆమ, పక్వాశయములయందు క్షోభపూర్వకమైన యుపద్రవములు గలుగును.

### ప్రతిమాసగర్భౌషధములు

మధుకం శిగ్రుబీజం చ పయస్యాసురదారు చ,
అశ్మంతకః కృష్ణతిలా స్తామ్రవల్లీ శతావరీ. 94
వృక్షాదనీ పయస్యా చ లతాచోత్పల శారిబా,
అనంతా శారిబా రాస్నా పద్మా మధుకమేవ చ. 95
బృహతీద్వయకాశ్మర్యః క్షీరిశృంగా స్త్వచో ఘృతమ్,
పృశ్నిపర్ణీ బలా శిగ్రు శ్శ్వదంష్ట్రా మధుపర్ణికా. 96
శృంగాటకం బిసం ద్రాక్షా కసేరు మధుకం సితా,
సప్తైతా న్పయసా యోగా న్నర్ధశ్లోకసమాపనాత్. 97
క్రమాత్స ప్తసు మాసేషు గర్భే స్రవతి యోజయేత్,
వాక్యమ్. ఏతా ఓషధయః కర్షమితాశ్శీతతోయేన సంపిష్య పలమితేన దుగ్ధే నాలోడితాః పాతవ్యాః. 98

తా. ప్రథమమాసమున గర్భపాతము గలిగిన అతిమధురము, మునగవిత్తులు, క్షీరకాకోళి, దేవదారు అనువానిని, రెండవమాసమున అశ్మంతకము, నల్లనువ్వులు, మంజిష్ఠ, పిల్లిపీచర అనువానిని, మూడవమాసమున బదనిక, క్షీరకాకోళి, నల్లకలువ, సుగంధిపాల అనువానిని, నాలవమాసమున దురదగొండి, సుగంధిపాల, సన్నరాస్నము, ముణుగుదామర, అతిమధురము అనువానిని, ఐదవమాసమున చిన్నములక, పెద్దములక, నేలగుమ్ముడు, ర్కాటకశృంగి, దాల్చిని, నెయ్యి అనువానిని, ఆరవమాసమున కోలపొన్న, ముత్తవపులము, మునగ, పల్లేరు, గుమ్ముడు అనువానిని, ఏడవమాసమున పరికెగడ్డ, తామరతూండ్లు,

ద్రాక్షపండ్లు, కచోరములు, అతిమధురము, శర్కర అనువానిని, ప్రతిమాసమున కొక కర్షప్రమాణము చొప్పున నెచ్చించి శీతోదకముతో నూరి పలమెత్తు పాలలో గలిపి త్రాగిన గర్భపాతము గలుగకుండును.

### గర్భపాతమునకు లజ్జాళుకాదికషాయము

లజ్జాళు ధాతకీపుష్ప ముత్పలం మధులోధ్రకం,
జలస్థయా స్త్రియాపీతం గర్భపాతం నివారయేత్. (మాధవనిదానే)

తా. అంతరదామర, ఆరెపువ్వు, నల్లకలువ, అతిమధురము, లొద్దుగ-వీని కషాయము గాచి స్త్రీని నీళ్ళలో గూర్చుండబెట్టి పానముచేయించిన గర్భపాతము హరించును.

### గర్భపాతమునకు శర్కరాదియోగము.

శర్కరాబిసతిలంసమాంశకం మాక్షికేనసహాభక్ష్యతేయదా,
నాస్తి గర్భపతజోద్భవం భయం పాపభీతిరివ తీర్థసేవయా. 100

తా. శర్కర, తామరతూండ్లు, నువ్వులు-వీనిని సమభాగములుగ నూరి తేనె యనుపానముతోడ భక్షించిన తీర్థసేవన జేయువారలకు పాపభీతి లేకుండుచందంబున గర్భపాతభీతి గలుగకుండును.

### గర్భచలనమున హ్రీబేరాదికషాయము

హ్రీబేరాతివిషా ముస్తా మోచశక్రైః శృతంజలం,
దద్యాద్గర్భే ప్రచలితే ప్రదరే కుక్షిరుజ్యపి. 101

తా. వట్టివేరు, అతివస, తుంగముస్తెలు, బూరుగబంక, కొడిసెపాలవిత్తులు-వీనిః కషాయము గాచి త్రాగిన గర్భచలనము, ప్రదరము, శూల హరించును.

### మూఢగర్భలక్షణము

మూఢః కరోతి పవనః ఖలు మూఢగర్భం
శూలం చ యోనిజఠరాదిషు మూత్రసంగమ్. 10

తా. కుంఠితగతిగలవాతము యోని, కడుపు అనువానియందు శూలను, మూత్ర ప్రతిబంధమును గలుగంజేయుటవలన గర్భము బైలువెడలకుండును. ఇదియ మూఢగర్ మనంబడును.

### మూఢగర్భగతి, తద్భేదములు

భుగ్నోఽనిలేన విగుణేన తతస్సగర్భ
స్సంఖ్యామతీత్య బహుధా సముపైతి యోనిం,
ద్వారం నిరుధ్య శిరసా జఠరేణ కశ్చి

ఏకేన కశ్చిదపరస్తు భుజద్వయేన
తిర్యగ్గతో భవతి కశ్చి దవాఙ్ముఖోఽన్యః,
పార్శ్వాపవృత్తగతిరేతి తథైవ కశ్చి
దిత్యష్టధా గతిరియం హి పరా చతుర్ధా. 104
సంకీలకః ప్రతిఖురః పరిఘోఽథ బీజ
స్తేషూర్ధ్వబాహుచరణై శ్శిరసాచ యోనిం,
సందీచయో భవతి కీలకవత్సకీలో
దృశ్యైః ఖురైః ప్రతిఖురస్సహికాయసంగీ. 105
గచ్ఛేద్భుజద్వయశిరా స్సచ బీజకాఖ్యో
యోనౌ స్థిత స్సపరిఘః పరిఘేన తుల్యః. (ఆయుర్వేదే) 106

తా. విగుణవాతమువలన గర్భము విపరీతమై అడ్డమై అనేకవిధములుగ యోని ద్వారముల జెందును. అది ముఖ్యముగ నెనిమిదివిధంబులు. ఎట్లనిన—గర్భము యోనిముఖమును మస్తకమువలననడ్డగించుట, ఉదరముచే నడ్డగించుట, శరీరము పొర్లుటచే సంకుచిత దేహముగలదై యడ్డగించుట, ఒకభుజముతోగాని, లేక రెండుభుజములతో గాని యడ్డగించుట, అడ్డమైన ముఖముగలదై యడ్డగించుట, అధోముఖమై యడ్డగించుట, పార్శ్వభంగమువలన మళ్ళినగతిగలదై యడ్డగించుట-ఈప్రకారముగ యోనిముఖమునకు గర్భమువలన ఎనిమిదివిధములైన గతులు గలుగును. (రెండవప్రకారముగ గతిగల గర్భమును వచించెదను.) గర్భమునకు సంకీలకము, ప్రతిఖురము, పరిఘము, బీజము అను నాలుగువిధములైన గతులు గలుగును. అందు గర్భము హస్తపాదముల పొడవుగ నునిచికొని శిరమును ముందుగ జేసికొని యోనిముఖమునుజెంది గూటమువలె ద్వారమునందుండిన సంకీలకమనియు, హస్తపాదములు గొరిసెలవలె బైట గనుపించుచు తక్కిన శరీరము లోననే దగులుకొనియుండిన ప్రతిఖురమనియు, రెండుభుజములు, తల ముందుగ గలదై దగులుకొనియుండిన బీజకమనియు, గడియవలె యోనిముఖమునం దడ్డపడియుండిన పరిఘమనియు తెలియవలయును.

## అసాధ్యమూఢగర్భలక్షణము

అపవిద్ధశిరాయా తు శీతాంగీ నిరపత్రపా,
నీలోద్ధితసిరా హంతి సాగర్భం సచ తాం తథాః. 107

తా. మెడవిరిగినటుల నిలువకుండుట, శరీరము చల్లగనుండుట, ప్రజ్ఞలేకుండుట, ప్రక్కలయందు పచ్చనివర్ణము లేక నీలవర్ణముగల సిరలు వ్యాపించియుండుట - ఇట్టి

లక్షణములు గల గర్భిణిగాని, లేక దానియొక్క గర్భముగాని మృతిచెందు నని తెలియ వలయును.

గర్భమూలలక్షణము

గర్భాస్పందనమావీనాం ప్రణాశశ్శ్యావపాండుతా,
భవేదుచ్ఛ్వాసపూతిత్వం శూనతాంతర్మృతే నిశౌ. 108

తా. గర్భము చలింప కుండుట, ప్రసవవేదన నిలుచుట, ఒడలు కపిలవర్ణముగ గాని, లేక తెల్లవర్ణముగ గాని యుండుట, శ్వాసోచ్ఛ్వాసములయందు దుర్గంధము వేయుట, కడుపుబ్బుట-ఈలక్షణములవలన లోన గర్భము మృతి చెందిన దని తెలియవలయును.

గర్భమరణహేతువు

మానసాగం తు భిర్మా తు రుపతాపైః ప్రపీడితః,
గర్భో వ్యాపద్యతే కుక్షౌ వ్యాధిభిశ్చ ప్రపీడితః. 109

తా. మాతయొక్క మానసిక, ఆగంతుకదుఃఖములవలన గాని, లేక వ్యాధివలన గాని, గర్భపీడగలిగి గర్భము గర్భాశయమున మృతి జెందును.

అసాధ్యగర్భిణీలక్షణము

యోనిసంవరణం సంగః కుక్షౌ మక్కల్లఏవచ,
హన్యు స్త్రియం మూఢగర్భే యథోక్తాశ్చాప్యుపద్రవాః. 110

తా. వాయువుయొక్క సంబంధమువలన యోని సంకోచంబగుట, ప్రక్కల యందు గర్భము దగులుకొనియుండుట, మక్కల్లశూల, ఆక్షేపకము, కాసము, శ్వాసాద్యుపద్రవములు గలుగుట-ఈలక్షణములు గల గర్భిణి మృతిచెందునని తెలియవలయును.

వికృతాకృతిగర్భలక్షణము

ఋతుస్నాతా తు యానారీ స్వప్నే మైథునమాచరేత్,
ఆర్తవం వాయురాదాయ కుక్షౌ గర్భం కరోతి హి. 111
మాసిమాసి వివర్ధేత గర్భిణ్యా గర్భలక్షణం,
కలలం జాయతే తస్యా వర్జితం పైతృకైర్గుణైః. 112
సర్పవృశ్చిక కూశ్మాండ వికృతాకృతయశ్చయే,
గర్భాశ్చైతే త్రయశ్చైవ జ్ఞేయాః పాపకృతో భృశమ్. 113

తా. ఋతుస్నానముజేసినదినమున మైథునము జేయఁబడినటుల స్వప్నముగాం చెడిస్త్రీయొక్క వాతము రక్తమును గ్రహించి ప్రక్కలయందు గర్భమువలె పిండాకృతిగం జేసి ప్రతిమాసమున వృద్ధింజెందింపుచు సర్వగర్భలక్షణయుక్తంబుగ సేయును. ఐనను దాని

యందు పితృగుణసంబంధంబు లగు అస్థులు, వెండ్రుకలు మొదలగునవి లేకుండుటం జేసి సర్పము, తేలు, గుమ్మడుకాయ మొదలగువానిలో నేదైన నొకదానియొక్క యాకారముగలదిగ నగును. ఈమూఁడాకృతులు గలగర్భము పాపకృతం బని దెలియందగును.

## యోనిసంవరణలక్షణము

వాతలాన్యన్నపానాని గ్రామ్యధర్మం ప్రజాగరం,
అత్యర్థం సేవమానాయా గర్భిణ్యా యోనిమార్గజః. 114
మాతరిశ్వా ప్రకుపితో యోనిద్వారస్య సంవృతిం,
కురుతే రుద్ధమార్గత్వా పునరంతర్గతోఽనిలః. 115
నిరుణద్ధ్యాశయద్వారం పీడయ న్గర్భసంస్థితిం,
నిరుద్ధవదనోచ్ఛ్వాసో గర్భశ్చాశు విపద్యతే. 116
ఉచ్ఛ్వాస రుద్ధ హృదయాం నాశయత్యథ గర్భిణీం,
యోనిసంవరణం నామ వ్యాధిమేతం ప్రచక్షతే. 117
అంతకప్రతిమం ఘోరం నారభేత్తు చికిత్సితుం, (మాధవనిదానే)

తా. వాతకర అన్నపానములు, మైథునము, జాగరణము అనువానిని మిక్కుటముగ గర్భిణి సేవించుటవలన యోనిమార్గమునందు వాతము ప్రకోపించి యోనిముఖమును సంకుచితముగ జేసి దానివలన లోనం బ్రవేశించి గర్భాశయముఖము నడ్డగించి పీడను గలుగంజేయును. దానివలన గర్భముయొక్క నోరును ముక్కు నడ్డగింపంబడి శ్వాసోచ్ఛ్వాసములు వెడలక గర్భమునేని, లేక గర్భిణియొక్క శ్వాసోచ్ఛ్వాసములు బంధింపఁబడుటవలన గర్భిణినేని నశింపంజేయును. ఈరోగమును యోనిసంవరణ మని వచించెదరు. ఇది యమునితో తుల్యంబగుటచే చికిత్సానర్హంబు.

## వాతసంకుచితగర్భలక్షణము

వాతేన గర్భసంకోచా త్ప్రసూతిసమయేపి వా. 118
గర్భం నజనయే న్నారీ తస్యాశ్శృణు చికిత్సితం,
కుట్టయే న్ముసలేనైషా కృత్వా ధాన్య ముటూఖలే. 119
విషమంచాసనం యానం సేవేత ప్రసవార్థినీ,

తా. ప్రసవకాలమున వాతమువలన గర్భము సంకోచమును జెంది ప్రసవము గాకుండిన రోటిలో ధాన్యమువేసి రోకలితో చాలాకాలమువఱకు దంచునటులం జేయవలయును. మఱియు విషమమైనయానసమును సేవించునటులం జేయవలయును.

## కృష్ణాదిలేపము

కృష్ణా-వచాచాపి జలేన పిష్ట్వా సైరండతైలాఖలునాభిలేపాత్

సుఖప్రసూతిం కురుతేఽంగనానాం నిపీడితానాం బహుభిః ప్రమాదైః.

తా. పిప్పళ్ళు, వస వీని నుదకముతో నూరి అం దాముదము గలిపి బొడ్డుపై లేపనము జేసిన కడుప్రమాదమువలన మిక్కుటముగ పీడజెందుచుండు స్త్రీ సుఖముగ ప్రసవించును.

## మాతులుంగాదిలేపము

మాతులుంగస్యమూలం తు మధుకం సంయుతం తథా,
ఘృతేన సహితం పీత్వా సుఖం నారీ ప్రసూయతే. 121

తా. మాదీఫలపువేరు, అతిమధురము అనువానిచూర్ణమును నేతిలో గలిపి త్రాగిన స్త్రీ సుఖముగ ప్రసవించును.

## ఇక్షుమూలబంధము

ఇక్షోరుత్తరమూలం నిజతనుమానేన తంతునా బధ్వా,
కటివిషయే గర్భవతీ సుఖేన సూతే విలంబతేనాపి. 122

తా. చెఱకుయొక్క ఉత్తరపుతట్టువేరును తనంత పొడవుగలనూలుతో బంధించి నడుమునందుగట్టుకొనిన ఆలస్యములేక స్త్రీ సుఖముగ ప్రసవించును.

## సుఖప్రసవము

తాళస్యచోత్తరం మూలం స్వప్రమాణేన తంతునా,
బధ్వా కట్యాం తు నియతం సుఖం నారీ ప్రసూయతే. 123

తా. తాటిచెట్టుయొక్క ఉత్తరపుకట్టువేరును తనంతపొడవుగల నూలుతో బంధించి నడుమునందు గట్టికొనిన స్త్రీసుఖముగ ప్రసవించును.

## అపామార్గబంధము

ప్రత్యక్పుష్ప్యాః పారిభద్రస్యయద్వా
మూలంయేద్వా కాకజంఘా సముత్థం,
కట్యాం బద్ధం యోషితాం సత్ప్రసూతిం
యోగే యుక్త్వా సంహృతం సాధుకుర్యాత్. 124

తా. తెల్లయుత్తరేణువేరు, వేపవేరు, వెలుమసంధివేరు అనువానిలో దేనినిగాని శుభవారనక్షత్రయోగములయందు దెచ్చి నడుమునందు గట్టికొనిన స్త్రీ సుఖముగ ప్రసవించును.

## గర్భోద్ధరణవిధి

హస్తేన సర్పిషాక్తేన యోనే రంతర్గతేన స్త్రా,
మృతేతు గర్భే గర్భిణ్యా యోనౌ శస్త్రం ప్రవేశయేత్. 125

శస్త్రశాస్త్రార్థనిపుణా లఘుహస్తాభయోజ్ఝితాః, (ఆయుర్వేదే)

తా. గర్భమున శిశువు మృతిజెందిన శస్త్రశాస్త్రార్థనిపుణుఁడు, హస్తలాఘవము ఁడు నగువైద్యుఁడు హస్తమునకు నెయ్యినిబూసికొని భయవిహీనుఁడై శస్త్రమును ఁయందు ప్రవేశింపం జేసి మృతగర్భమును ఛేదింపవలయును.

సచేతనం తు శస్త్రేణ న కథంచన దారయేత్. 126

సదార్యమాణో జననీం మాత్మానంచాపి మారయేత్,

సోపేక్షేత మృతం గర్భం ముహూర్తమపి పండితః. 127

సచాశు జననీం హంతి ప్రభూతాన్నం యథా పశుం,

తా. గర్భస్థశిశువు జీవించియుండిన సాహసాదులచే ఛేదింపంజనదు. అటుజేసిన ు, గర్భిణీస్త్రీ నశించెదరు. మఱియు మృతగర్భమును బుద్ధిమంతుఁ డగువైద్యుఁడు కాలంబైన నుపేక్షింపం జనదు. ఏలనిన, మిక్కుటముగ పశువుచే భుజింపఁబడిన ౖము జీర్ణముగాక దానిం జంపుచందంబున శిశువు గర్భిణిని జంపును.

## మృతగర్భచ్ఛేదనవిధి

యద్యదంగం హి గర్భస్య యోనౌ సజ్జతి తద్భిషక్. 128

సమ్యగ్వినిర్హరేచ్ఛిత్వా రక్షే న్నారీం ప్రయత్నతః,

తా. యోనిద్వారమున దగులుకొనియుండు మృతశిశువుయొక్క అంగముల జాగ ఁడై ఛేదించి వెలిపరచి స్త్రీని రక్షింపవలయును.

## సూతికారోగనిదానము

అంగమర్దో జ్వరః కంపః పిపాసా గురుగాత్రతా. 129

శోథ శ్శూలాతిసారౌ చ సూతికారోగలక్షణం,

మిథ్యోపచారా త్సంక్లేశాద్విషమాజీర్ణభోజనాత్. 130

సూతికాయాశ్చ యేరోగా జాయంతే దారుణాస్తుతే,

వాయుః ప్రకుపితః కుర్యా త్సంరుధ్య రుధిరం చ్యుతమ్. 131

సూతాయాస్తు హృచ్ఛిరో వస్తి శూలం మక్కల్లసంజ్ఞకం,

జ్వరాతిసార శోఫాశ్చ శూలానాహ బలక్షయాః. 132

తంద్రారుచి ప్రసేకాద్యాః కఫవాతామయోద్భవాః,

కృచ్ఛ్రసాధ్యాహి తే రోగాః క్షీణమాంసబలాగ్నితః. 133

తే సర్వే సూతికానామ్నా రోగాస్తే చాప్యుపద్రవాః,

తా. ఒడలునొప్పి, జ్వరము, వణకు, దప్పి, శరీరమున ఱరువు, వాపు, శూల, విరేచనములు-ఈలక్షణములు గలిగిన సూతికా (బాలింత)రోగ మని తెలియవలయును. మఱియు బాలింత యగు స్త్రీకి అన్యథోపచారములం జేయించుటవలనగాని, క్లేశమువలనగాని, లేక దుష్టాన్నపానములవలనగాని, విషమాశనము, అజీర్ణభోజనము మొదలగు వాని సేవనవలనగాని కడుభయంకరమైన సూతికారోగము జనించును. మఱియు నీసూతికారోగంబున వాతము ప్రకోపించి స్వస్థానమువలన విడువఁబడినరక్తము నడ్డగించి బాలింతయొక్క హృదయము, మస్తకము, పొత్తికడుపు అనువానియందు శూలను గలుగంజేయును. ఈశూల మక్కల్లక మనుపేరం బరగును. మఱియు జ్వరము, విరేచనములు, వాపు, శూల, కడుపుబ్బరము, అశక్తత, కఫవాతరోగములవలన గలిగిన తంద్ర అన్నద్వేషము, నోటిలోనీ రూరుట-ఇట్టివికారంబులు గలిగిన కఫవాతమువలన సూతికారోగ మని తెలియవలయును. అందు మాంసము, బలము, అగ్ని క్షీణించియుండిన కష్టసాధ్యంబులు. ఇవియన్నియు సూతికారోగములనియు, సూతికోపద్రవము లనియు తెలియందగును.

## సూతికారోగసామాన్యచికిత్స

సూతికారోగశాంత్యర్థం కుర్యా ద్వాతహరీం క్రియామ్. 134

తా. సూతికారోగము శమించుటకై వాతనాశకరచికిత్సం జేయవలయును.

## అమృతాదికషాయము

అమృతానాగరసహచర భద్రోత్కటపంచమూలకంజలదః,
శృతశీతం మధుయుక్తం శమయత్యచిరేణ సూతికాతంకమ్. 135

తా. తిప్పతీఁగె, శొంఠి, ములుఁగోరింట, వావిలి, లవంగపట్ట, పంచమూలములు, తుంగముస్తెలు—వీనిని కషాయము గాచి చల్లార్చి యొకింత తేనె గలిపి త్రాగిన తత్క్షణమున సూతికారోగము హరించును.

## దేవదార్వాదికషాయము

దేవదారు వచా కుష్ఠం పిప్పలీ విశ్వభేషజం,
కట్ఫలం ముస్త భూనింబ తిక్తా ధాన్యహరీతకీ. 136
గజకృష్ణా చ దుస్స్పర్శా గోక్షురం ధన్వయాసకం,
బృహత్యతివిషా ఛిన్నా కర్కటం కృష్ణజీరకమ్. 137
సమభాగాన్వితై రేతై స్సింధురామఠసంయుతైః,
క్వాథ మష్టావశేషం తు ప్రసూతాం పాయయేత్ స్త్రియమ్. 138
శూల కాస జ్వర శ్వాస మూర్ఛా కంప శిరో౽ర్తిభిః,
యుక్తం ప్రలాప తృడ్దాహ తంద్రాతీసార వాంతిభిః. 139

నిహంతిసూతికారోగం వాతపిత్తకఫాన్వితం, (సిందూరమణిదర్పణే)

తా. దేవదారు, వస, చెంగల్వకోష్టు, పిప్పళ్ళు, శొంఠి, గుమ్ముడుతేకు, తుంగముస్తెలు, నేలవేము, కటుకరోహిణి, ధనియాలు, కరక్కాయ, గజపిప్పలి, రేగటిదూలాల, పల్లేరు, దురదగొండి, నేలములక, అతివస, తిప్పతీగె, కర్కాటకశృంగి, నల్లజీలకఱ్ఱ-వీనిని సమభాగములుగ దంచి అష్టావశేషముగ కషాయము గాచి అందు సైంధవలవణము, నేతిలో పొంగించఁబడిన ఇంగువ గలిపి బాలింత త్రాగిన శూల, కాసము, జ్వరము, శ్వాసము, మూర్ఛ, వణకు, తలనొప్పి, వదరుట, దప్పి, దాహము, తంద్ర, అతిసారము, వాంతులు అనువానితోఁ గూడియుండు సూతికారోగమును, త్రిదోషజనిత సూతికారోగమును హరింపఁజేయును.

## వజ్రకాంజికము

పిప్పలీ పిప్పలీమూలం చవ్యం శుంఠీ యవానికా. 140
జీరకేద్వే హరిద్రేచ బిడా సౌవర్చలం తథా,
ఏతైరేవౌషధైః పిష్టై రారనాళం విపాచయేత్. 141

ఆమవాతహరం వృష్యం కఫఘ్నం వహ్నిదీపనం,
వజ్రకం కాంజికం నామ స్త్రీణా మగ్నివివర్ధనమ్. 142
సూతికారోగశమనం శూలఘ్నం క్షీరవర్ధనం,

తా. పిప్పలి, మోడి, చవ్యము, శొంఠి, ఓమము, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, పసపు, మ్రానిపసపు, బిడాలవణము, సౌవర్చలవణము-వీనిని దంచి సమముగ గలిపి కాచి స్త్రీ త్రాగిన ఆమవాతము, కఫము, బాలింతరోగము, శూల-వీనిని హరింపఁజేయుటయేగాక వీర్యవృద్ధిని, అగ్నిదీపనమును, స్తనములయందు పాలయొక్కవృద్ధిని గలుగఁజేయును.

## గర్భవిలాసరసము

రస గంధక తుత్థం చ త్ర్యహం జంబీర మర్దితమ్. 143
త్రిర్భావితం త్రికటునా దేయం గుంజా చతుష్టయం,
గర్భిణ్యా శ్శూలవిష్టంబ జ్వరాజీర్ణేషు కేవలమ్. (ఆయుర్వేదే)

తా. రసము, గంధకము, మైలుతుత్థము-వీనిని శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో మూడుదినములు మర్దించి పిదప త్రికటుకకషాయముతో మూడుభావనలుచేసి నాలుగుగురిగింజలయెత్తును సేవించిన గర్భిణీశూల విష్టంభము, జ్వరము, అజీర్ణము హరించును.

## గర్భచింతామణిరసము

జాతీఫలం టంకణం చ వ్యోషం దైత్యేంద్ర రక్తకం,

తచ్చూర్ణం సమభాగేన మర్దితం ప్రహరద్వయమ్ 145
జంబీరరసయోగేన వటీం కుర్యా ద్విచక్షణః,
గుంజాద్వయం ప్రమాణేన కృత్వా వైద్యః ప్రయత్నతః. 146
ఆర్ద్రికస్య రసేనైవ భక్షయే దుష్టవారిణా,
నిహంతి సూతికారోగం భాస్కర స్తిమిరం యథా. 147

తా. జాజికాయ, వెలిగారము, త్రికటుకములు, బలురక్కసి, కొడిసె, కుంకుమపువ్వు-వీనిచూర్ణమును సమభాగములుగ ఖల్వములో నునిచి రెండుర్యామములు నిమ్మపండ్లరసముతో మర్దించి రెండుగురిగింజలంత మాత్రలుచేసి అల్లపురసముతోగాని, లేక ఉష్ణోదకానుపానముతోగాని సేవించిన సూర్యుఁ డుదయించుటచే నంధకారము దొలంగు భంగి సూతికారోగము దొలంగును.

రసం తాళం తథా లోహం ప్రత్యేకం కర్షమాత్రకం,
కర్షత్రయం తథాచాభ్రం కర్పూరం వంగ తామ్రకం. 148
జాతీఫలం తథా వ్యోషం గోక్షురం చ శతావరి,
బలాతిబలయో ర్మూలం ప్రత్యేకం తోలకం శుభమ్. 149
వారిణా వటికాకార్యా ద్విగుంజఫలమానతః,
సన్నిపాతం నిహంత్యాశు స్త్రీణాంచైవ విశేషతః. 150
గర్భిణ్యాజ్వరదాహం చ ప్రదరం సూతికామయం, (మతాంతరే)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిచేసిన తాళకము, లోహభస్మము-ఇవి దినుసుకు కర్షప్రమాణము, అభ్రకభస్మము 3 కర్షములు, కర్పూరము, వంగభస్మము, తామ్రభస్మము, జాజికాయ, త్రికటుకములు, పల్లేరు, చల్లపిల్లిగడ్డలు, ముత్తవపులగపువేరు, పెద్దముత్తవపులగపువేరు-ఇవి దినుసుకు తులప్రమాణము-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి ఉష్ణోదకముతో మర్దించి రెండుగురిగింజలంత మాత్రలుజేసి సేవించిన విశేషముగ స్త్రీలయొక్క సన్నిపాతము, గర్భిణిస్త్రీ జ్వరదాహములు, ప్రదరము, సూతికారోగము హరించును.

## బృహద్గర్భచింతామణిరసము

సూతం గంధం తథా స్వర్ణం లోహం రజత మాక్షికమ్. 151
హరితాళం వంగభస్మా ప్యభ్రకం సమభాగకం,
భావనాఖలు దాతవ్యా రసై రేషాం పృథక్పృథక్. 152
బ్రాహ్మీ వాసా భృంగరాజ పర్పటం దశమూలకం,
సప్తథా భావయే ద్వైద్యో గుంజామానం వటీంచరేత్. 153

గర్భచింతామణిరయంపూర్వవత్కథితాగుణాః, (మాధవనిదానే)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, స్వర్ణభస్మము, లోహభస్మము, రజత భస్మము, స్వర్ణమాక్షికము, శుద్ధిచేసినతాళకము, తగరభస్మము, అభ్రకభస్మము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి మండూకబ్రహ్మి, అడ్డరసము, గుంటగలగర, పర్పాటకము, దశమూలములు అనువానిరసములలో ప్రతిదానిచే నేడేసిమార్లు భావనజేసి గురిగింజలంత మాత్రలుజేసి సేవించిన పూర్వోక్తగర్భచింతామణిరసములో జెప్పంబడిన రోగముల హరింపంజేయును.

### గర్భవినోదరసము

త్రిభాగం త్రికటుం దేయం చతుర్భాగం చ హింగుళమ్. 154
జాతీకోశం లవంగం చ ప్రత్యేకం చ త్రికర్షకం,
సువర్ణమాక్షికం చైవ పలార్ధ్రం ప్రక్షిపే ద్బుధః. 155
జలేన మర్దయిత్వాథ చణమాత్రా వటీకృతా,
నిహంతి గర్భిణీరోగం భాస్కర స్తిమిరం యథా. 156

తా. త్రికటుకములు 3 భాగములు, శుద్ధిజేసిన ఇంగిలీకము ౪ భాగములు, జాజిమొగ్గలు, లవంగములు ఇవి దినుసుకు 3 కర్షములు, శుద్ధిజేసిన స్వర్ణమాక్షికము ౪ పలము - ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి ఉష్ణోదకముతో మర్దించి సెనగగింజలంత మాత్రలుజేసి సేవించిన సూర్యుఁ డుదయించుటచే నంధకారము దొలంగుభంగి, గర్భిణిరోగము హరించును.

### బృహత్సూతివినోదరసము

శుంఠ్యాభాగో భవేదేకో ద్వౌ భాగౌ మరిచస్య చ,
పిప్పల్యాశ్చ త్రిభాగంస్యా దర్ధభాగం చ రోమకమ్. 157
జాతికోశస్య భాగౌ ద్వౌ ద్వౌ భాగౌ తుత్థకస్య చ,
సింధువారజలేనైవ మర్దయే దేకయామతః. 158
మధునా సహ భోక్తవ్యం సూతికాతంకనాశనమ్. (నిత్యనాథీయే)

తా. శొంఠి ౧ భాగము, మిరియాలు ౨ భాగములు, పిప్పలి 3 భాగములు, పాదరలవణము ౪ భాగము, జాజిమొగ్గలు ౨ భాగములు, శుద్ధిజేసిన మైలుతుత్థము ౨ భాగములు - ఇటుల వీనిని ఖల్వములో నునిచి వావిలాకురసముతో నొకఝాము మర్దించి మాత్రలుజేసి తేనెతో సేవించిన సూతికారోగము హరించును.

### సూతికారిరసము

రస గంధక కృష్ణాభ్రం తదర్ధం మృతతామ్రకమ్. 159
చూర్ణితం మర్దయే ద్యత్నా ద్భేకపర్ణీరసేన చ,

ఛాయాశుష్కా వటీ కార్యా ద్విగుంజా ఫలమానతః. 160
క్షీర త్రికటునాయుక్తా సూతికాతంకనాశినీ,
జ్వరం తృష్ణారుచీ శోథం హంత్యసాధ్యం న సంశయః. 161

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన కృష్ణాభ్రకము-ఇవి నుసు కొక్కొకభాగము, తామ్రభస్మము 4 భాగము-ఇటుల వీనిని చూర్ణముజేసి ఖల్వములో నునిచి మండూకపర్ణిరసముతో మర్దించి గురిగింజలంత మాత్రలుజేసి నీడ నెండించి మందొక దానిని త్రికటుకములపాలతో నూరి యీయనుపానముతోడ సేవించిన అసాధ్యమైన సూతికారోగము, జ్వరము, దప్పి, అరుచి, శోఫ - వీనిని నిశ్చయముగ హరింపజేయును.

### సూతికాహరరసము

లవంగం రస గంధౌ చ యవక్షారం తథాభ్రకం,
లోహం తామ్రం సోమకం చ పలమానం సమాహరేత్. 162
జాతీఫలం కేసరాహ్వ వరాంగై లేయ ముస్తకం,
ధాతకీంద్రయవా పాఠా శృంగీ బిల్వం చ వాలకమ్. 163
కర్షప్రమాణం సంచూర్ణ్య సర్వమేకత్ర కారయేత్,
బదరాస్థ్యా ప్రమాణేన వటికాం కాలయేత్సుధీః. 164
గంధాలికాపత్రరసై రనుపానం ప్రదాపయేత్,
సర్వాతిసారశమనం సర్వశూలనివారణమ్. 165
సూతికా శోఫ పాండుఘ్నం సర్వజ్వరనివారణం, (ఆయుర్వేదే)

తా. లవంగములు, శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, యవక్షారము, భ్రకభస్మము, తామ్రభస్మము, గుమ్ముడు - ఇవి దినుసు కొక్కొకపలము, జాజికాయ, ాదీఫలము, లవంగపుచెక్క, కూతురుబుడమ, తుంగముస్తెలు, ఆరెపువ్వు, కొడిసెపాల, రుబొద్ది, కర్కాటకశృంగి, మారేడువేరు, కురువేరు - ఇవి దినుసుకు కర్షప్రమాణము - టుల వీనినెల్ల నేకముజేసి యుష్ణోదకముతో నూరి రేగుగింజంత మాత్రలుజేసి తృణకుం మరసముతో సేవించిన సర్వాతిసారములు, సమస్తశూలలు, బాలింతరోగము, వాపు, ాండువు, సర్వజ్వరములు - వీనిని హరింపంజేయును.

### స్తనరోగనిదానము

సక్షీరౌ వాప్యదుగ్ధౌ వా దోషః ప్రాప్య స్తనౌ స్త్రియః. 166
ప్రదూష్య మాంసరుధిరే స్తనరోగాయ కల్పతే,
పంచానామపి తేషాం హి రక్తజం విద్రధిం వినా. 167

లక్షణాని సమానాని బాహ్యావిద్రధిలక్షణైః, (మాధవనిదానే)

తా. వాతాదిదోషంబులు దుష్టంబులై గర్భిణికిగాని, లేక ప్రసవించిన స్త్రీకిగాని, ...ులయందు జేరి వానియందలి మాంసరక్తముల జెఱచి వాత, పిత్త, కఫ, సన్నిపాత ...తుకభేదములవలన నైదువిధములైన స్తనరోగముల గలుగంజేయును. ఇవి రక్త ...ధిలక్షణహీనంబులై తక్కినవి బాహ్యావిద్రధిలక్షణయుక్తంబులై యుండును.

స్తనరోగచికిత్స

లేపో విశాలమూలేన హంతి పీడాం స్తనోత్థితామ్. 168

తా. పాపరవేరును గంధముదీసిగాని, (లేక అడవిప్రత్తిగింజలనేని, లేక సొరకాయ ...నేని, గోధుమగంజితో నూరిగాని) లేపనము జేసిన స్తనసంబంధమైనపీడ హరించును.

వాతాదిదుష్టదుగ్ధలక్షణము

కషాయం సలిలప్లావి స్తన్యమారుతదూషితం,
కట్వమ్లం లవణం పీత రాజమత్పిత్తసంజ్ఞితమ్. 169
కఫదుష్టం ఘనం తోయే నిమజ్జతి సుపిచ్ఛిలం,
ద్విలింగం ద్వంద్వజం విద్యాత్సర్వలింగం త్రిదోషజమ్. 170

తా. ఒగరుగ, నీళ్ళలోవేసిన తేలునదిగ నుండుపాలు వాతదుష్టమనియు, కార..., పుల్లగ, ఉప్పగ, పైన పచ్చనిరేఖలుగలదిగ నుండుపాలు పిత్తదుష్టమనియు, ..., నీళ్ళలోవేసిన మునుఁగునదిగ, బంకగనుండుపాలు కఫదుష్టమనియు, రెండుదోష...ణములం గలపాలు ద్వంద్వదుష్టమనియు, మూఁడుదోషలక్షణములంగలది త్రిదోష మనియుం తెలియవలయును.

వాతరోగస్తన్యచికిత్స

జాతే వాతాత్మకే స్తన్యే దశమూలం త్ర్యహం పిబేత్,
వాతవ్యాధిహరం సర్పిః పీత్వా మృదువిరేచయేత్. 171

తా. వాతదోషమువలన స్తన్యము దుష్టంబైయుండిన మూడుదినములు దశ...ల కషాయమును పానము జేయించుటయేగాక వాతహరఘృతపానమువలన లఘువిర...వనంబులు చేయించవలయును.

శుద్ధదుగ్ధలక్షణము

అదుష్టం చాంబునిక్షిప్త మేకీభవతి పాండురం,
మధురం చావివర్ణం చ తత్ప్రసన్నం వినిర్దిశేత్. 172

తా. పాలను ఉదకములోవేసిన నీళ్ళతో గలసి తెల్లగ, మధురరసముగలదిగ నై...ము జెందకుండిన శుద్ధమైన దని తెలియవలయును.

### కఫదుష్టస్తన్యచికిత్స

కఫే దుష్టే ఘృతం పేయం యష్టీసైంధవసంయుతం,
రామపుష్పైః స్తనౌ లింపే చ్ఛిశోశ్చ దశనచ్ఛదౌ. 173
సుఖమేవం వమేద్బాలః కఫకోపశ్చ శామ్యతి,

తా. కఫమువలన స్తన్యము దుష్టంబైన అతిమధురచూర్ణమును, సైంధవలవణచూర్ణమును నేతితో గలిపి త్రాగించుటయేగాక అశోకపుష్పమును నూరి స్తనములయందును, శిశువుయొక్క పెదవియందును, లేపనముజేసిన శిశువునకు సుఖముగ వమనంబై కఫప్రకోపము శమించును.

### పిత్తస్తన్యదుష్టచికిత్స

పిత్తే దుష్టే మృతా భీరు పటోలం నింబ చందనమ్. 174
ధాత్రీం కుమారం చ పిబే త్క్వాథయిత్వా సశర్కరం,

తా. పిత్తమువలన స్తన్యము దుష్టంబైన తిప్పతీగె, పిల్లిపీచర, చేదుపొట్ల, వేప, చందనము అనువానిని కషాయము గాచి అందు శర్కరగలిపి స్త్రీ, శిశువు లిరువురికి పానము జేయింపవలయును.

### స్తన్యజననవిధి

భూమికూశ్మాండమూలస్య క్షీరపిష్టస్య యో రసః 175
పిబే త్సశర్కరం తస్యాః క్షీరం బహువివర్ధతే,

తా. నేలగుమ్మడిగడ్డను పాలతో నూరి దానిరసమును పిండికొని అందు శర్కర గలిపి త్రాగిన పాలు వృద్ధిజెందును.

### శతావరీపానము

శతావరీ క్షీరపిష్టా పీతా స్తన్యవివర్ధినీ. 176
కవోష్ణం కణయా పీతం క్షీరం క్షీరవివర్ధనం,

తా. పిల్లిపీచరవేళ్ళను పాలతో నూరి త్రాగినను, లేక మందోష్ణముగనుండు పాలతో పిప్పలిచూర్ణము గలిపి త్రాగినను పాలు వృద్ధిజెందును.

### సోమరోగనిదానము

శోకాచ్ఛ్రమాద్వైవనితాతిసంగా ద్గరేణచాపఃక్షుభితాస్రవంతి,
దేహస్థితావస్తిముఖంప్రపన్నాహ్యైరుత్కరానిర్గతగంధవర్ణాః. 177
శీతాశ్శితాస్తేనముఖోష్ఠతాలు శోషశ్శిరశ్శూలమశక్తతా చ.
జిహ్వావిలేపోవివిధైశ్చభక్ష్యైరతృప్తితామూర్ఛనజృంభతృష్ణా. 178
భవే ద్దేహా క్షమాదేహీ నిశ్చేష్టః కష్టఆమయః,

సోమరోగమితి ప్రాహుః దేహసారక్షయంనృణామ్.(సిద్ధవిద్యాభూః)

తా. శోకము, శ్రమ, అతిమైథునము, విషదోషము అనువానివలన శరీరమంతట వ్యాపించియుండునుదకము క్షోభంజెంది స్రవించి వస్తిగతంబై వేదనతోగూడి గంధవర్ణహితంబై నిర్మలమై చల్లగ మూత్రద్వారమువలన బైలువెడలును. అందు ముఖము, పెదవి, దవడలు ఎండుట, తలలో సూదులతో బొడుచునటుల నొచ్చుట, సత్వము లేకుండుట, నాలుక బంకగనుండుట, పలువిధభక్ష్యముల సేవించినను తృప్తిలేకుండుట, మూర్ఛ, ఆవలింతలు; దప్పి గలుగుట, శరీరమున నోర్పులేకుండుట, చేష్టావిహీనుఁడగుట అనునీలక్షణంబులు గలుగును. ఇదియ సోమరోగ మనంబడును. ఇది కష్టసాధ్యము. దీనియందు శరీరమునందలి బలము క్షయించును.

సోమరోగచికిత్స

ధాత్రీఫలస్య స్వరసేన రంభాఫలం మధూకం ససితం పిబేద్వా,
పీతంమధూకం మధుకం విదారిమాషంచదుగ్ధైస్సహసోమరోగీ.

(భేషజకల్పే)

తా. ఉసిరికపండురసములో అరటిపండు, ఇప్పపువ్వు, పంచదార గలిపి త్రాగినను, లేక ఇప్పపువ్వు, యష్టిమధుకము, నేలగుమ్మడు అనువానియొక్క మాషప్రమాణ చూర్ణమును పాలలో గలిపి త్రాగినను సోమరోగము హరించును.

ఉశీరం వాలుకా పత్రం కుష్ఠం ధాత్రీ చ మోసలీ,
ఏలా చ రేణుకా ద్రాక్షా కుంకుమం నాగకేసరమ్. 181
పద్మకేసరకందం చ కర్పూరం చందనద్వయం,
వ్యోషా మధూకం లాజాశ్చ హ్యశ్వగంధా శతావరీ. 182
గోక్షురం కర్కటాఖ్యం చ జాతీ తక్కోలమేవ చ,
ఏతాని సమభాగాని ద్విగుణా మృతశర్కరా. 183
మధ్వాజ్యసితయాయుక్తం భక్షయే త్ప్రీతరుత్థితః,
క్షయం చ రక్తపిత్తం చ పాదదాహ మసృగ్ధరమ్. 184
మూత్రాఘాతం మూత్రదోషం కృచ్ఛ్రం వై వాతకుండలీం,
వినిహన్యా త్ప్రమేహంచ సోమరోగం హలీమకమ్. 185
సర్వాంగదాహశమనం రక్తస్రావామయేషు చ, (సిద్ధరసార్ణవే)

తా. వట్టివేరు, కురువేరు, ఆకుపత్రిక, చెంగల్వకోష్టు, ఉసిరికవరుగు, నేలతాటిగడ్డలు, ఏలకులు, రేణుకలు, ద్రాక్ష, కుంకుమపువ్వు, నాగకేసరములు, తామరకేసరములు, తామరగడ్డలు, కర్పూరము, చందనము, రక్తచందనము, త్రికటుకములు, ఇప్పపువ్వు, పేలాలు, పెన్నేరుగడ్డ, పిల్లిపీచర, పల్లేరు, కర్కాటకశృంగి, జాజిమొగ్గలు,

తక్కోలపుట్లు - వీనిని సమభాగములుగ గ్రహించి రెండింతలు తిప్పసత్తు గలిపి తేనె, నెయ్యి, పంచదార అనువాని యనుపానముతోడ ప్రాతఃకాలమున సేవించిన క్షయము, రక్తపిత్తము, కాళ్ళమండుట, అసృగ్ధరము, మూత్రాఘాతము, మూత్రదోషము, మూత్రకృచ్ఛ్రము, వాతకుండలి, ప్రమేహము, సోమరోగము, హలీమకము, సర్వాంగతాపము, రక్తస్రావరోగములు - వీనిని హరింపజేయును.

గర్భిణీరోగములయందు పథ్యము

శాలయష్షష్టికా ముద్గ గోధూమా లాజసక్తవః. 186
నవనీతం ఘృతం క్షీరం రసాస్సమధుశర్కరాః,
పనసం కాదళం ధాత్రీ ద్రాక్షామ్లం స్వాదుశీతలమ్. 187
కస్తూరీ చందనం మాలా కర్పూరం మధు లేపనం,
చంద్రికాస్నాన మభ్యంగో మృదుశయ్యా హిమానిలాః. 188
సంతర్పణం ప్రియాశ్లేషో విహారాశ్చ మనోరమాః,
ప్రియంకరంచాన్నపానంగర్భిణీనాంహితంసదా. (మాధవనిదానే)189

తా. ౬౦ దినములకు ఫలించెడి వడ్లబియ్యము, పెసలు, గోధుమలు, పేలపిండి, వెన్న, నెయ్యి, పాలు, తేనె, పంచదార అనువానితో గూడియుండురసములు, పనసపండు, అరటిపండు, ఉసిరికపండు, పుల్లద్రాక్షపండు, తీపిగలపదార్థములు, శీతకరపదార్థములు, కస్తూరి, చందనము, పుష్పమాల, కర్పూరము, తేనె, లేపనము, వెన్నెల, స్నానము, అభ్యంజనము, మృదువుగ నుండుపడక, చల్లనిగాలి, తృప్తికరమైన యన్నము, ప్రియాలింగనము, మనోహరమైనవిహారము, ప్రియమైనయన్నపానములు - ఇవి గర్భిణీరోగములయం దెల్లపుడు హితకరంబులు.

గర్భిణీరోగములయం దపథ్యము

స్వేదనం వమనం క్షారం కదన్నం విషమాశనం,
అపథ్యమిద ముద్దిష్టం గర్భిణీనాం మహర్షిభిః. 190
సూతికాఖ్యేషు రోగేషు వాతశ్లేష్మోద్భవేషు చ,
తత్ర రోగానుకల్పేన పథ్యాపథ్యాని నిర్దిశేత్. 191

తా. వేడిగా నొత్తడము నిచ్చుట, వాంతి, క్షారము, కుత్సితాన్నము, విషమాశనము - ఇవి గర్భిణీస్త్రీల కపథ్యకరంబులు. మఱియు సూతికారోగము, వాతకఫాత్మకరోగము అనువానియందు యుక్త్యానుసారముగ పథ్యము నొసంగవలయును.

షోడశప్రకరణమ్.

# సప్తదశ ప్రకరణము.



## నేత్రరోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లో. వీరభద్రం విరూపాక్షం నారసింహమదాంతకం,
అహిభూషం శుభాకారం భజేఽహం వీరశేఖరమ్. 1

తాత్పర్యము. విషమదృష్టిగలవాఁడు, నృసింహునిమదము నణంచినవాఁడు, సర్పములే భూషణముగఁగలవాఁడు, మంగళకరమైన యాకారముగలవాఁడు, శూరాగ్రగణ్యుఁడు నగు వీరభద్రుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేరొక్క నంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథముయొక్క సప్తదశప్రకరణమును వచింపుచున్నాఁడను.

### నేత్రరోగసంఖ్య

కృష్ణే పంచనవైవసంధిషు దశత్రీణ్యత్ర శుక్లేఽఖిలే,
జాతాష్షోడశవర్త్మజాః ఖలు చతుర్వింశా స్తథా వింశతిః,
సప్తాతంతుయుతా శ్చతుర్నవతి రిత్యక్ష్ణో రశేషామయాః
యో వేత్తి వ్యపహర్తు మేషవిదుషామగ్రేసమర్థో భవేత్. (సిద్ధరసార్ణవే)

తా. నేత్రములయందు జనించురోగములు ౯౪ విధంబులు. అందు కంటినల్లగ్రుడ్డునందు ౫, సంధులయందు ౯, తెల్లగ్రుడ్డునందు ౧౩, నేత్రములయందంతట ౧౬, కంటిఱెప్పలయందు ౨౪, నేత్రనాడులయందు ౨౭, అన ౯౪ విధంబులు. వీనిభేదముల నెఱింగి చికిత్సించువాఁడే వైద్యులలో శ్రేష్ఠుండును.

### అభిష్యందభేదము

వాతపిత్తకఫాద్రక్తా దభిష్యంద శ్చతుర్విధః,
తత్ర తానుచితైః పత్రైర్బధ్నీయా త్త్రిదివం భిషక్. (సిద్ధసార్ణవే)

తా. * అభిష్యందము వాత, పిత్త, శ్లేష్మ, రక్తభేదములవలన నాలుగువిధంబులు. (అందు వాతాభిష్యందమున నేత్రము లెఱ్ఱనై నీరు గారుచు పోట్లతో గూడియుండును. పిత్తాభిష్యందమున కన్నులెఱ్ఱనై కడుమంటలతోఁడం గూడి మెరమెరలాడుచుండును. శ్లేష్మాభిష్యందమున కండ్లు పుసిగట్టి దురదతో గూఁడియుండును. రక్తాభిష్యందమున కండ్లలో

---

* అభిష్యంద మన - నేత్రముల నీరు గార్చుట.

దుర్మాంసము పెరిగియుండును.) వానియందు దోలుత క్రానుగాకును గట్టి పిదప ఉష్మే కును, తమలపాకును మూడుదినములు గట్టిన నేత్రాభిష్యందము హరించును.

## నేత్రరోగనిదానము

ఉష్ణాభిత ప్తస్యజలప్రవేశా దూరేక్షణాత్స్వప్నవిపర్యయాచ్చ,
స్వేదేత్రజోధూమనిషేవణాచ్చఛర్దేర్విఘాతాద్వమనాతియోగా
ద్రవాన్నపానాతినిషేవణాచ్చ విణ్మూత్రవాతక్రమనిగ్రహాచ్చ,
ప్రసక్తసంరోదనశోకకోపా చ్ఛిరోభిఘాతాదతిమద్యపానాత్.
తథాఋతూనాంచవిపర్యయేణక్లేశాభిఘాతాదతిమైథునాచ్చ,
బాష్పగ్రహాత్సూక్ష్మనిరీక్షణాచ్చ నేత్రేవికారాన్జనయంతిదోషాః.
(ఆయుర్వే

తా. ఎండలో నొడలిని గాచికొనినపిదప శీతోదకములో బ్రవేశించుట (అనఁగా శరీరము చలివలన వ్యాప్తంబై శరీరమునందలి యుష్ణమూర్ధ్వగతంబై నేత్ర యందలి తేజస్సును పరాభవపఱచి నేత్రరోగమును గలుగంజేయుననుట) దూర నుండు పదార్థములం జూచుట, స్వప్నవిపర్యయము (అనఁగా పగలు నిద్రించుట, రా యందు జాగరణముసేయుట), కండ్లయం దావిరి దగులుట, లేక చెమటపట్టి కంటిల జీర్ణంబగుట, కంటిలో దుమ్ముపడి యందు నిలిచియుండుట, పొగదగులుట, వాంతి వే నడ్డగించుట, అధికముగ వమనంబులగుట, ద్రవముగనుండు నన్నపానాదుల మిక ముగ సేవించుట, మల, మూత్ర, అపానవాతవేగము నడ్డగించుట, ఎల్లపుడు కన్ విడుచుట, దుఃఖించుట, కోపమునుజెందుట, తలపై నభిఘాతమును జెందుట, మిక ముగ మద్యపానముసేయుట, శీతకాలమున ఉష్ణము, ఉష్ణకాలమున శీతలము గలు క్లేశము (అనఁగా మనోదుఃఖమునుగాని, లేక కామాదిదుఃఖములనుగాని) జెందుట, ఘాతము (అనఁగా పీడనుగాని, లేక దుఃఖమునుగాని) జెందుట, మిక్కుటముగ మై మునేయుట, కంటినీరుయొక్క వేగము నడ్డగించుట, సూక్ష్మపదార్థములం జూచుట - కారణములవలన వాతాదిదోషములు ప్రకోపించి నేత్రరోగములను గలుగంజేయుం యవి. మఱియు (సుశ్రుతే. శ్లో. "సిరానుసారిభిర్దోషైః ద్విగుణైరూర్ధ్వమాశ్రి జాయంతే నేత్రభాగేషురోగాః పరమదారుణాః." అనఁగాఁ బ్రకోపించిన వాతా షములు కంటినీరలయందు వ్యాపించి వాత, పిత్త, కఫ, రక్త, సన్నిపాత, ఆగంతుకభే లవలన ౭౬ విధంబులుగ భయంకరమైన నేత్రరోగముల గలుగంజేయుననుట సుశ్రు చార్యునియొక్క మతము.)

## అభిష్యందరోగములు

వాతాత్పిత్తాత్కఫా ద్రక్తా దభిష్యంద శ్చతుర్విధః,

ప్రాయేణ జాయతే ఘోర స్సర్వనేత్రామయాకరః. 8

తా. అభిష్యందోరోగము వాత, పిత్త, కఫ, రక్త భేదములవలన నాలుగువిధంబులు. వానివేదనను సహించుట గడునశక్యము. ఇది అధిమంథాది సర్వనేత్రరోగములకు నుత్పత్తిస్థానంబు. (ఇఁక సర్వనేత్రములయందు జనించు రోగముల వచించెదను)

వాతాభిష్యందలక్షణము

నిస్తోదన స్తంభనరోమహర్ష పారుష్యశిరోభితాపాః,
విశుష్కభావ శ్శిశిరాశ్రుతాచ వాతాభిపన్నే నయనే భవంతి.

తా. సూదులతో బొడుచునటుల పీడగలుగుట, నేత్రములు జడముగనుండుట, శరీరమున రోమాంచముగలుగుట, కంటిరెప్ప లొరసికొనుట, కఠినముగ నుండుట, శిరము వేడిగనుండుట, నేత్రము లెండియుండుట, నేత్రములయందు చల్లనినీరుగారుట-ఈలక్షణములుగలది వాతాభిష్యందమని తెలియవలయును.

పిత్తాభిష్యందలక్షణము

దాహః ప్రపాకౌశిశిరాభినందో ధూమాయనంబాష్పసముచ్ఛ్రియశ్చ
ఉష్ణాశ్రుతాపీతకనేత్రతాచ పిత్తాభిపన్నేనయనేభవంతి 10

తా. మిక్కుటముగ మండుట, నేత్రములచుట్టు కురుపులు జనించుట, నేత్రములయందు శీతపదార్థమును పూయుటయం దిచ్ఛగలుగుట, నేత్రముల పొగవెడలుట, నేత్రములయందెల్లపు డొకింతవేడిగ నీరుస్రవించుట, నేత్రములు పచ్చగనుండుట - ఈలక్షణములుగలది పిత్తాభిష్యందమని తెలియవలయును.

కఫజాభిష్యందలక్షణము

ఉష్ణాభినందోగురుతాక్షిశోథః కండూపదేహావతిశీతతాచ,
స్రావోబహుఃపిచ్ఛిలఏవచాపి కఫాభిపన్నేనయనేభవంతి. 11

తా. కండ్లకావిరి నివ్వవలయుననెడియిచ్ఛ, జడత్వము, నేత్రములయందు వాపు, దురదగలుగుట, నేత్రములు బంకగ చల్లగ నుండుట, మిక్కుటముగ బంకగనుండు నీరుగారుట-ఈలక్షణములుగలది కఫాభిష్యందమని తెలియవలయును.

రక్తాభిష్యందలక్షణము

తామ్రాశ్రుతాలోహితనేత్రతాచ రాజ్యస్సమంతాదతిలోహితాశ్చ
పిత్తస్యలింగానిచయానితాని రక్తాభిపన్నేనయనే భవంతి. 12

తా. కంటిలో నెఱ్ఱనినీరు గారుట, నేత్రము లెఱ్ఱగనుండుట, కంటిచుట్టు యెఱ్ఱగనుండురేఖలు వ్యాపించియుండుట, పిత్తాభిష్యందలక్షణయుక్తంబుగ నుండుట - ఈలక్షణములు గలది రక్తాభిష్యందమని తెలియవలయును.

వృద్ధైరేతై రభిష్యందై ర్నరాణామక్రియావతాం,
తావంత స్త్వధిమంథాస్స్యుర్నయనే తీవ్రవేదనాః. (గ్రంథాంతరే)

తా. అభిష్యందరోగమున ఉపచారము సేయంబడకుండుటచే వృద్ధిం జెంది ౪ విధములైన * అధిమంథరోగముల గలుగం జేయును. దానిసంబంధమువలన నేత్రముల యందు తీవ్రవేదన గలుగును. అధిమంథసామాన్యలక్షణము.

ఉత్పాట్యత ఇవాత్యర్థం నేత్రం నిర్మథ్యతే తథా,
శిరసోఽర్థంచ తం విద్యా దధిమంథం స్వలక్షణైః. 14

తా. శిరముయొక్క అర్థభాగము పగలగొట్టినటుల నొచ్చుట, కండ్లలో నిసుక పోసినటుల గడువేదనగలుగుట, రోగప్రభావమువలన నర్థతలయందు వేదనగలుగుట - ఈలక్షణములుగలది అధిమంథమని తెలియవలయును. మఱియు దీనియందు వాతాభిష్యందలక్షణములే గలిగియుండును.

దోషభేదమువలన కాలావధి

హన్యాద్దృష్టిం శ్లైష్మికస్సప్తరాత్రాదోఽధిమంథోర క్తజఃపంచరాత్రాత్
షడ్రాత్రాద్వావాతికోవై నిహన్యా న్మిథ్యాచారాత్పైత్తికస్సద్య ఏవ.

తా. శ్లైష్మిక అధిమంథము 7 దినములకు, రక్తజ అధిమంథము ౫ దినములకు వాతిక అధిమంథము ౬ దినములకు, పైత్తిక అధిమంథము మిథ్యోపచారములవలన తత్కాలమున (అనఁగా మూడుదినములలో) కండ్లదృష్టిని నశింపంజేయును. (కావున లంఘన, ప్రలేపాదిక్రియార్థంబై అంజననిషేధార్థంబై వ్యాధిస్వభావమునుబట్టి కాలావధి జెప్పంబడియెను.

ఆమనేత్రలక్షణము

ఉదీర్ణవేదనం నేత్రం రాగోద్రేకసముచ్ఛ్రితం,
ఘర్షనిస్తోద శూలాశ్రు యుక్తమామాన్వితం విదుః. 1

తా. నేత్రములు మిక్కుటముగ వేదనాయుక్తంబులై కడునెఱ్ఱనై యిసుకపోసినటుల గరగరలాడుచు సూదులతో బొడుచునటుల వేదనగలవై చురుకుతోగూడ నీరు గార్చుచుండిన ఆమయుక్తనేత్రములని తెలియవలయును. (ఈలక్షణము అంజనాది నిషేధమునకొఱకై, లఘ్వన్నము నిచ్చుటకై జెప్పంబడియెను.)

నిరామలక్షణము

మందవేదనతా కండూ స్సంరంభాశ్రు ప్రశాంతతా,
ప్రసన్నవర్ణతాచాక్ష్ణో స్సంపక్వం దోషమాదిశేత్. 1

* అధిమంథ మన కండ్లు కలకబారి పోట్లు గలుగుట.

తా॥ వేదన, దురద తగ్గి వాపుతీసి నేత్రములు నిర్మలముగనుండిన దోషము పక్వమైనదని తెలియవలయును.

శోఫయుక్తఅక్షిపాతలక్షణము

కండూపదేహాశ్రుయుతః పక్వోదుంబరసన్నిభః,
సంరంభీ పచ్యతే యస్తు నేత్రపాక స్సశోఫజః. 18
శోథహీనాని లింగాని నేత్రపాకే త్వశోథజే,

తా॥ నేత్రములయందు వాపు జనించి పండుటవలన పండిన మేడిపండుతో సమానంబై దురదగలిగి జిగటగ నీరుగారిన శోఫజన్యనేత్రపాకమని తెలియవలయును. మఱియు వాపులేక నేత్రపాకముకలిగి తక్కినలక్షణములతో గూడియుండిన త్రిదోషజనితఅధిమంథమని తెలియవలయును.

వాతాధిమంథలక్షణము

ఉపేక్షణాదక్షియదాధిమంథో వాతాత్మకస్సాదయతి ప్రసహ్య,
రుజాభిరుగ్రాభిరసాధ్యఏష హతాధిమంథఃఖలునేత్రరోగః. 19

తా॥ వాతజ అధిమంథమునకు జికిత్సంజేయక నుపేక్షించుటవలన నేత్రములు శోషించి దానివలన సూదులతో బొడుచునటుల వేదన, తాపము మొదలగు కడుపీడలు గలుగును. ఇదియ హతాధిమంథ మనంబడును. ఈనేత్రరోగం బసాధ్యము.

వాతపర్యయలక్షణము

వారంవారంచ పర్యేతి భ్రువౌ నేత్రేచ మారుతః,
రుజశ్చ వివిధాస్తీవ్రా స్సజ్ఞేయో వాతపర్యయః. 20

తా॥ వాతము క్రమముగ పలుమారు కనుబొమలయందుజేరియందుండి నేత్రములయందు పలుమారు వ్యాపించి పలువిధములైన తీవ్రపీడల గలుగంజేసిన వాతపర్యయ మనంబడును.

శుష్కాక్షిపాకలక్షణము

యత్కూణితం దారుణరూక్షవర్త్మ సందహ్యతేచావిలదర్శనంచ,
సుదారుణంయత్ప్రతిబోధనేచ శుష్కాక్షిపాకోపహతంతదక్షి.

తా॥ నేత్రములు మూతపడి ఱెప్పలు కఠినంబులై రూక్షముతోగూడినవై మంటలుహెచ్చుట, నేత్రములు లోనికేగుట, తెరచుట కశక్యంబగుట-ఈలక్షణములు గలది శుష్కాక్షిపాకమని తెలియవలయును. ఇది రక్తదోషమువలన గలుగును.

అన్యతోవాతలక్షణము

యస్యావటూకర్ణశిరోహనుస్థో మన్యాగతో వాప్యనిలోఽన్యతో వా,

కుర్యాద్రుజంవై భ్రువిలోచనేచ తమన్యతో వాతముదాహరంతి. 2

తా. ముచ్చిలిగుంట, చెవులు, శిరము. *కటుమర్లు, పెడతల, పెద్దనరము అనువా యందేని, ఇతరస్థలములయందేని యుండువాతము కనుబొమలమధ్యమునగాని, నే నేత్రములయందుగాని తోద, భేదాదిపీడల గలుగంజేయును. ఈరోగమును అన్యత వాతమని వచించెదరు.

## అమ్లాధ్యుషితలక్షణము

శ్యావం లోహితపర్యంతం సర్వంచాక్షి ప్రపచ్యతే,
సదాహ శోథం సస్రావ మమ్లాధ్యుషితమమ్లతః.

తా. మధ్యమున నొకింత నీలవర్ణముగ, చుట్టు ప్రక్కల యెఱ్ఱగనుండినదై స నేత్రము పండుట (పండుట అనఁగా పసపుఛాయగల కురుపులు లేచుట), ఒకింత తాపః వాపు గలుగుట, నీరుగారుట-ఈలక్షణములుగలది అమ్లాధ్యుషితమని తెలియవలయు ఇది పులుసుగల భోజనాదుల మిక్కుటముగ సేవించుటవలన జనించును.

## సిరోత్పాతలక్షణము

అవేదనా వాపి సవేదనావా యస్యాక్షిరాజ్యోహిభవంతితామ్రా
ముహుర్విరజ్యంతిచయాస్సతాదృ గ్వ్యాధిస్సిరోత్పాతఇతిప్రదిష్టః

తా. నేత్రమునందుండుసిరలు వేదనారహితంబులైగాని, లేక వేదనాయు బులైగాని, యెఱ్ఱనై పలుమారు అధికాధికముగ యెఱ్ఱగ నగుచుండిన సిరోత్పాత తెలియవలయును. (ఇది రక్తదోషమువలన జనించును.)

## సిరాహర్షలక్షణము

మోహాత్సిరోత్పాతఉపేక్షితస్తు జాయేతరోగస్తు సిరాప్రహర్షః,
తామ్రాస్రమచ్ఛం స్రవతిప్రగాఢం తథానశక్నోత్యభివీక్షితుంచ

తా. అవివేకమువలన సిరోత్పాతరోగమునకు జికిత్సంజేయక ఉపేక్షించు సిరాప్రహర్షమనురోగము జనించును. దీనియందు నేత్రములయం దెఱ్ఱగ, స్వచ్ఛః నీరును గార్చుచుండుటవలన నేత్రములు తెరచి చక్కగ చూచుట కశక్యంబుగ నుండ (ఇటుల నేత్రమునందంతట జనించును. ౧౬ విధంబులగు రోగలక్షణంబులు జె బడియెను.)

---

# నల్లగ్రుడ్డునందు జనించురోగములు

## సవ్రణశుక్రలక్షణము

నిమగ్నరూపంతుభవేద్ధికృష్ణే సూచ్యేవవిద్ధం ప్రతిభాతియద్వై

* కటుమర్లు అనఁగా—కంటిక్రిందమొదలుకొని చెక్కిళ్ళపార్శ్వభాగము.

స్రావంస్రవేదుష్ణమతీవయచ్చ తత్సవ్రణంశుక్రముదాహరంతి

తా. (నేత్రములయొక్క నల్లగ్రుడ్డునందు జనించురోగము సవ్రణశుక్ల మనం బడును.) నేత్రములయొక్క నల్లగ్రుడ్డునందు పువ్వుజనించి లోన మునింగినట్లుగ, మధ్య భాగమున సూదితో బెజ్జము వేయఁబడినట్టుగ నుండినదై అత్యుష్ణముగ, మిక్కుటముగ నీరును గార్చుచుండిన సవ్రణశుక్ల మనంబడును. (దీనిలో పీడగలిగియుండును. క్షతమున పీడగలుగుట సహజంబే యైనను నేత్రములవంటి సుకుమారస్థలంబున గలిగెడి విశేషపీడను సహించుట కశక్యంబని భోజాదికులు వచించెదరు. ఈ వ్రణశుక్లం బసాధ్యము. ఐన నవ స్థాభేదమువలన ఒకానొకపుడు సాధ్యంబగును. అవస్థాభేదం బెద్ది యనిన.

## అవస్థాభేదసాధ్యశుక్రవివరణము

దుష్టేస్సమీపేనభవేత్తుయత్తు వచావగాఢం వచసంస్రవేద్ధి,
అవేదనంవా నచయుగ్మశుక్రం తత్సిద్ధిమాయాతి కదాచిదేవ 27

తా. పువ్వు దృష్టికి సమీపమున గలుగక, లేక లోతుగ వ్యాపించక, లేక కడు స్రావము పోట్లులేకయుండెడి శుక్ర మొకానొకప్పుడు సాధ్యంబగును. మఱియు రెండు శుక్రములు జనించిన యసాధ్యంబు.

## అవ్రణశుక్రలక్షణము

స్యందాత్మకంకృష్ణగతం సచోషం శంఖేందుకుందప్రతిభావభాసం,
వైహాయసాభ్రప్రతనుప్రకాశ మథావ్రణంసాధ్యతమంవదంతి.

తా. అభిష్యందమువలన జనించి కంటియొక్క నల్లగ్రుడ్డునందు చోషముతో గూడి శంఖము, చంద్రుఁడు, మొల్లపువ్వు అనువానివలెనే తెల్లనై ఆకాశమునందుండు మేఘమువలె సూక్ష్మప్రకాశముగలదై వ్రణరహితంబై యుండుశుక్రము సుఖసాధ్యమని వచించెదరు.

## అవ్రణశుక్రకృఛ్రసాధ్యత్వము

గంభీరజాతంబహుళంచశుక్రం చిరోత్థితంవాపివదంతికృఛ్రమ్. 29

తా. కంటినల్లగ్రుడ్డునందు రెండుపొరలకులోన జనించి విశాలంబై బహుకాలము నకు ముందు జనించియుండు శుక్రము కష్టసాధ్యంబు.

## అవ్రణశుక్రాసాధ్యత్వము

విచ్ఛిన్నమధ్యంపిశితావృతంవా చలంసిరాసూక్ష్మమదృష్టికృచ్చ,
ద్విత్వగ్గతం లోహితమంతతశ్చ చిరోత్థితంచాపి వివర్జనీయమ్. 30

తా. శుక్రయొక్క మధ్యమునందుండు మాంసముకరిగి దానివలన ఛిద్రము అనఁగా మధ్యమునందు పల్లము) గలదిగగాని, లేక శుక్రమునకుచుట్టూ మాంసము

పెరిగి చలనముగలదిగాని నుండినదై సిరలవలన వ్యాప్తంబగుటవలన సూక్ష్మమై దృష్టిని నశింపం జేయుచు రెండవపటమునందు వ్యాపించి చుట్టుప్రక్కలెఱ్ఱనై జనించి చిరకాలంబైయుండు శుక్రము అసాధ్యంబు. అట్లగుటచే దానిని వర్జింపవలయును.

ప్రకారాంతర అవ్రణశుక్రాసాధ్యత్వము

ఉష్ణాశ్రుపాతఃపిటికాచనేత్రే యస్మిన్భవేన్ముద్గనిభంచశుక్రం,
తదప్యసాధ్యం ప్రవదంతి కేచి దన్యచ్చయత్తిత్తిరిపక్షతుల్యమ్.

తా. నేత్రములయొక్క రెండవపటలమునందు శుక్రము వ్యాపించుటవలన కడువేడిమిగ అశ్రువులు స్రవించుటయేగాక సన్ననిగుల్లలవలన వ్యాప్తంబై పెసరపప్పుతో సమానంబైన శుక్రముగలిగిన యసాధ్యము. మఱియు నాశుక్రము తిత్తిరిపక్షియొక్క ఱెక్కవర్ణముతో సమానముగనుండిన అసాధ్యమని కొందఱు వచించెదరు.

అక్షిపాకాత్యయలక్షణము

శ్వేతస్సమాక్రామతిసర్వతోహి దోషేణయస్యాసితమండలంతు,
తమక్షిపాకాత్యయమక్షిపాకం సర్వాత్మకంవర్జయితవ్యమాహుః.

తా. కంటియొక్కనల్లగ్రుడ్డునందు దోషసంబంధమువలన గ్రుడ్డునందంతటశుక్రము వ్యాపించిన సన్నిపాతజ అక్షిపాకాత్యయ మనంబడును. ఇది అసాధ్యంబగుటచే వైద్యుఁడు వర్జింపవలయును.

అజాకాజాతలక్షణము

అజాపురీషప్రతిమోరుజావా౯ సలోహితోలోహితపిచ్ఛిలాశ్రుః,
విగృహ్యకృష్ణంప్రచయోభ్యుపైతి తచ్చాజకాజాతమితివ్యవస్యేత్.

తా. నల్లగ్రుడ్డుయొక్క మూడవపొరయందు నాశ్రయించియుండెడి మేదస్సు ఉంటగనై నల్లగుడ్డును పగులఁగొట్టి యెండిన గొఱ్ఱెపెంటికవలె నున్నతమై నొప్పిగలదై యొకింత నెఱ్ఱనై ఎఱ్ఱగ, ఛిక్కగ, నీరును గార్చుచుండిన అజకాజాత మనంబడును (ఇటుల కంటినల్లగ్రుడ్డునందు జనించు నేత్రరోగములు జెప్పంబడియె.)

---

## దృష్టిగతతిమిరరోగములు

ప్రథమపటలస్థదోషలక్షణము

ప్రథమేపటలే యస్య దోషాదృష్ట్యాం వ్యవస్థితః,
అవ్యక్తానిచ రూపాణి కదాచిదథ పశ్యతి. 3

తా. నేత్రముయొక్క మొదటిపటమున (అనఁగా అంతటికి లోపల, వాతాదోషములు వ్యాపించి దృష్టికి పైన నుండును. దానివలన నొకానొకపుడు ఘటపటాపదార్థములు స్పష్టములుగ గనుపించును.

### ద్వితీయపటలస్థదోషలక్షణము

దృష్టి ర్భృశం విహ్వలతి ద్వితీయం పటలం గతే,
మక్షికా మశకా న్కేశా న్జాలకానిచ పశ్యతి. 35
మండలాని పతాకాంశ్చ మరీచిం కుండలానిచ.
పరిప్లవాంశ్చ వివిధా న్వర్షమభ్రం తమాంసిచ. 36
దూరస్థానిచ రూపాణి మన్యతేచ సమీపతః,
సమీపస్థాని దూరేచ దృష్టే ర్గోచరవిభ్రమాత్. 37
యత్నవానపిచాత్యర్థం సూచీపాశం న పశ్యతి,

తా. రెండవపటలమున దోషము వ్యాపించుటవలన దృష్టికి పదార్థము బాగుగ గనుపించకుండును. ఇట్లులనే నేత్రములయెదుట ఈఁగలు, దోమలు, వెంట్రుకలు, వలలు, మండలము, పతాకము, కిరణము, కుండలము, నానాప్రకారముగ కప్పలుమొదలగు నవి మెదలునట్టుల, వర్షము, మబ్బు, అంధకారము, ఇవి లేకుండునపుడు దృష్టికగుపడుట, దృష్టిభ్రాంతివలన దూరమునందు పదార్థములు సమీపముగ సమీపముగనుండు పదార్థములు దూరముగనుండునట్టుల దోఁచుట, కడుప్రయత్నము జేసినను సూదిముఖము గనుపించకుండుట-అనులక్షణంబులు గలుగును.

### తృతీయపటస్థ తిమిరలక్షణము

ఊర్ధ్వం పశ్యతి నాధస్తా త్తృతీయం పటలంగతే. 38
మహాంత్యపి చ రూపాణి ఛాదితానీవచాంబరైః,
కర్ణనాసాక్షిహీనాని వికృతానిచ పశ్యతి. 39
యథాదోషంచ రజ్యేత దృష్టిర్దోషే బలీయసి,
అథఃస్థేతు సమీపస్థం దూరస్థం చోపరిస్థితే 40
పార్శ్వస్థితే పునర్దోషే పార్శ్వస్థం నైవ పశ్యతి,
సమంతతస్థితే దోషే సంకులానీవ పశ్యతి. 41
దృష్టిమధ్యస్థితే దోషే మహద్ధ్రస్వంచ పశ్యతి,
ద్విధా స్థితే ద్విధా పశ్యే ద్బహుధా వానవస్థితే. 42
దోషే దృష్టిస్థితే తిర్య గేకం ద్వై మన్యతే ద్విధా,

తా. మూడవపటలమున దోషము వ్యాపించుటవలన పొడవుగనుండు పదార్థములు గనుపించుట, క్రిందనుండుపదార్థములు గనుపించకుండుట, పెద్దవిగనుండుపదార్థములు వస్త్రములో గప్పఁబడినట్టుల గనుపించుట, మనుజులు ముక్కు, చెవులు, కండ్లు లేనివారుగ, వికారరూపము గలవారుగ గనుపించుట, రక్తమాంసమేదాదికసహాయ్య

మువలనగాని వాతాదిదోషములు బలిష్ఠంబులగుచుండ దృష్టికి వాతాదిదోషములవలె, ఎఱుపు, పసపు, తెలుపు వర్ణములు గలుగుట, దోష మధోభాగమునందుండుటవలన సమీపముననుండు పదార్థములు బాగుగ గనుపించకుండుట, పైభాగమునం దుండుటవలన దూరముగనుండు పదార్థములు బాగుగ గనుపించకుండుట, ప్రక్కలయందుండుటవలన ప్రక్కలయందుండుపదార్థములు బాగుగ గనుపించకుండుట, దోషంబంతట వ్యాపించి యుండుటవలన పదార్థము లొకదానితో నొకటి జేరియుండునటుల గనుపించుట, దృష్టిమధ్యమునందుండుటవలన స్థూలపదార్థములు చిన్నవిగ గనుపించుట, రెండుస్థలయందు దోషము నిలిచియుండుటవలన రెండురెండుపదార్థములుగ గనుపించుట, దోషమచంచలముగ నుండుటవలన నొకపదార్థం బనేకరూపములు గలదిగ గనుపించుట, దృష్టిగతదోషము అడ్డముగ నుండిన ఒకపదార్థము రెండుగ గనుపించుట-అను నీలక్షణములు గలుగును.

## చతుర్థపటలస్థతిమిరలక్షణము

తిమిరాఖ్యస్సవై రోగశ్చతుర్థపటలంగతః. 43
రుణద్ధి సర్వతో దృష్టిం లింగనాశమతఃపరం,
అస్మిన్నపి తమోభూతే నాతిరూఢే మహాగదే. 44
చంద్రాదిత్యౌ సనక్షత్రా వంతరిక్షేచ విద్యుతః
నిర్మలానిచ తేజాంసి భ్రాజిష్ణూనిచ పశ్యతి. 45

తా. వాతాదిదోషములు నాలవపటలమును జెందుటచే తిమిర మనుపేరం బరంగుచు దృష్టి నంతట నడ్డగించును. ఇదియ *లింగనాశన మనంబడును. ఇది వృద్ధింజెందకుండు కాలమున ఆకాశమున చంద్ర, సూర్య, నక్షత్రములు, మెఱపులు, నిర్మలముగ దీప్తతేజములుగలవిగ గనుపించును.

## ప్రకారాంతరలింగనాశస్వరూపము

సఏవలింగనాశస్తు నీలికా కాచ సంజ్ఞితః,

తా. తృతీయపటలమున జెందియుండు కాచబిందువు నుపేక్షించుటవలన యది నాలవపటలమును జెందిన లింగనాశనమనియు, నీలికయనియు జెప్పంబడును. ఇది అసాధ్యము.

తత్ర వా తేన రూపాణి భ్రమంతీవ హి పశ్యతి. 46
ఆవిలా న్యరుణాభాని వ్యావిద్ధానీవ మానవః,
పిత్తే నాదిత్య ఖద్యోత శక్రచాప తటిద్గణాన్. 47

*ఇంద్రియశక్తిని నశింపంజేయుటచే లింగనాశన మనంబడును.

నృత్యతశ్చైవ శిఖిన స్సర్వం నీలంచ పశ్యతి,
కఫేవ పశ్యే ద్రూపాణి స్నిగ్ధానిచ సితానిచ. 48
సలిలప్లావితానీవ పరిజాడ్యాని మానవః,
పశ్యే ద్రక్తేన రక్తాని తమాంసి వివిధానిచ. 49
ససితా న్యథ కృష్ణాని పీతా న్యపిచ మానవః,
సన్నిపాతేన చిత్రాణి విప్లుతానిచ పశ్యతి. 50
బహుధావ ద్విధావాపి సర్వాణ్యేవ సమంతతః,
హీనాంగాన్యధికాంగాని జ్యోతింష్యపిచ పశ్యతి, 51

తా. పైఁజెప్పఁబడిన సర్వపటలములయందు వ్యాపించియుండు వాతదోషము వలన రూపము దిరుగునట్టుగ, కల్మషముగ, ఎఱ్ఱగ, వంకరగ గనుపించును. పిత్తదోషము వలన సూర్యుఁడు, మిణుగురుపురుగు, ఇంద్రధనస్సు, మెఱుపు అనువానిని, నృత్యముసలుపునట్టి నెమళ్ళను, సర్వవస్తువులను నీలముగ గాంచును. కఫదోషమువలన స్నిగ్ధముగ, తెల్లగ, నీటిలోముంచి తీసినట్టుగ, మందముగ గనుపించును. రక్తదోషమువలన ఎఱ్ఱగ, ఒకింత తెల్లగ, నల్లగ, పసపుగ గనుపించును. సన్నిపాతదోషమువలన పలువిధవర్ణములుగ, విపరీతముగ (అనఁగా ఒకవస్తువు రెండుగగాని, లేక అనేకరూపములుగగాని) గనుపించును. మఱియు జ్యోతిస్సులు హీనమైన అంగములుగలవిగగాని, లేక అధికాంగములుగలవిగగాని, నానాప్రకారములుగగాని గనుపించును.

## పరిమ్లాయికలక్షణము

పిత్తం కుర్యా త్పరిమ్లాయి మూర్ఛితం రక్తతేజసా,
పీతాదిశ స్తథోద్యోతా న్రవించాపి సపశ్యతి. 52
వికీర్యమాణా న్ఖద్యోతైర్వృక్షాం స్తేజోఽభిరేవచ,

తా. పిత్తమురక్తబలముతో మిశ్రమమై పరిమ్లాయి యను తిమిరరోగమును గలుగంజేయుచున్నయది. దానిసంబంధమువలన దిక్కులు, ఎండ, సూర్యుఁడు,పసపువర్ణముగ, మఱియు వృక్షములు మిణుగురుపురుగులు, తేజస్సు అనువానితో వ్యాప్తంబైనవిగ గనుపించును.

## రాగభేదమువలన లింగనాశవివరము

వక్ష్యామి షడ్విధం రాగై ర్లింగనాశ మతఃపరమ్. 53
రాగోఽరుణోమారుతజః ప్రదిష్టోమ్లాయీచనీలశ్చతథైవపిత్తాత్
కఫాత్సితశ్శోణితజస్సరక్త స్సమ స్తదోష ప్రభవోవిచిత్రః. 54

తా. వర్ణభేదసంఖ్యవలన లింగనాశన మనురోగము ఆరువిధంబులగును. అందు వాతజలింగనాశనం బెఱ్ఱగనుండును. పిత్తజలింగనాశనము పచ్చగ, నీలముగనుండును. కఫజ

లింగనాశనము తెల్లగనుండును. రక్తజలింగనాశనం బెఱ్ఱగనుండును. సర్వదోషజలింగనాశనములు పలువిధవర్ణములు గలవిగ నుండును.

పరిమ్లాయిరోగవిశేషలక్షణము

అరుణం మండలం దృష్ట్యాం స్థూలకాచారుణప్రభం,
పరిమ్లాయినిరోగేస్యాత్ మ్లాయి నీలంచ మండలమ్. 55
దోషక్షయాత్కదాచిత్స్యాత్స్వయం తత్ర ప్రదర్శనం,

తా. పరిమ్లాయిరోగమునందు దృష్టికిపైన లావుగ, గాజువలె నెఱ్ఱగ నుండుమండలము జనించి పచ్చగ, నీలముగ నుండును. దానియందు దోషము తగ్గినయెడల ఒకానొకప్పుడు నేత్రములుతనంతట తానేగనుపించును. (ఇచట దోషశబ్దమునకు కొందఱుజన్మాంతరకర్మమనియు వచించెదరు.)

దృష్టిమండలగతరోగలక్షణము

అరుణం మండలం వాతాచ్చంచలం పరుషం తథా. 56
పిత్తాన్మండలమానీలం కాంస్యాభం పీతమేవచ,
శ్లేష్మణా బహుళం స్నిగ్ధం శంఖ కుందేందు పాండురమ్. 57
చలత్పద్మపలాశస్థ శ్శుక్లో బిందురివాంభసః,
మృద్యమానేచ నయనే మండలం తద్విసర్పతి 58
ప్రవాళపద్మపత్రాభం మండలం శోణితాత్మకం,
దృష్టిరాగో భవేచ్చిత్రో లింగనాశే త్రిదోషజే. 59
యథాస్వం దోషలింగాని సర్వేష్వేవ భవంతి హి,

తా. వాతమువలన దృష్టిమండలము ఎఱ్ఱగ, చంచలముగ గరగరగనుండును. పిత్తమువలన ఒకింతనీలముగ, కాంస్యమువంటి వర్ణముగలదిగ, లేక పసపువర్ణముగలదిగ నుండును. కఫమువలన విస్తారముగ, జిగటగ, శంఖము, మొల్లపువ్వు, చంద్రుఁడు అనువానివలె తెల్లగ నుండును. మఱియు కన్నులనలచిన తామరాకుపై కదలుచుండు తెల్లని నీటిబిందువులవలె ఇటునటు నీరు కదలుచుండును. రక్తమువలన దృష్టిమండలము పగడమువలెగాని, లేక ఎఱ్ఱతామరపుష్పమువలె నెఱ్ఱగగానియుండును. త్రిదోషజలింగనాశనమున విచిత్రచ్ఛాయగల మండలములుగలుగును. మఱియు సర్వలింగనాశనరోగమునం దాయా రోగదోష లక్షణంబులు గలుగును.

దృష్టిరోగసంఖ్య.

షడ్లింగనాశాషడిమేచరోగా దృష్ట్యాశ్రయాష్షట్చపడేవచస్యుః. 60

తా. పూర్వోక్తమైన ౬ విధములైనలింగనాశనంబులును, ఉత్తరోత్ర జెప్పంబడు ౬ విధములైన పిత్తవిదగ్ధదృష్ట్యాదిరోగంబులును జేరి ౧౨ విధములైన దృష్టిరోగంబులుగ నగును.

పిత్తవిదగ్ధదృష్టిలక్షణము.

పిత్తేన దుష్టేన గతేన వృద్ధిం పీతాభవే ద్యస్య నరస్యదృష్టిః,
పీతానిరూపాణిచతేనపశ్యే త్సవై నరః పిత్తవిదగ్ధదృష్టిః. 61

తా. పిత్తము దుష్టంబగుటవలన వృద్ధిజెంది దృష్టియందు పసపువర్ణమును గలుగం జేయును. దానిసంబంధమువలన సర్వపదార్థములు పచ్చగ గనుపించును. ఇదియ పిత్తవిదగ్ధ దృష్టి యనబడును.

దివాంధ్యలక్షణము.

ప్రాప్తేతృతీయంపటలంచదోషే దివానపశ్యేన్నిశివీక్షతే సః,
రాత్రౌసశీతానుగృహీతదృష్టిః పిత్తాల్పభావాదపితానిపశ్యేత్. 62

తా. మూడవపటలమునందు పిత్తదోషము వ్యాపించుటవలన పగటియందు నేత్రములు గనుపించకుండును. రాత్రియందు చల్లగనుండుటచే పిత్తము కొరవడును. దానివలన రాత్రులయందు నేత్రములు గనుపించును. ఇదియ దివాంధ్య మనంబడును.

కఫవిదగ్ధదృష్టిలక్షణము.

తథానరశ్శ్లేష్మవిదగ్ధదృష్టి స్తాన్యేవశుక్లానిహిమన్యతేతు,

తా. అటులనే కఫవిదగ్ధదృష్టిగలవానికి సర్వపదార్థములును తెల్లగ గనుపించును.

*నక్తాంధ్యలక్షణము.

త్రిషుస్థితోయఃపటలేషుదోషో నక్తాంధ్యమాపాదయతిప్రసహ్య.
దివాససూర్యానుగృహీతదృష్టిఃపశ్యేత్తురూపాణికఫాల్పభావాత్,

తా. కఫముమూడవపటలమును జెందుటవలన నక్తాంధ్యము జనించును. అందు సూర్యునితాపమువలన పగటియందు కఫము కొరవడుటచే పగటియందు నేత్రములు గనుపించును.

ధూమదర్శలక్షణము.

శోకజ్వరాయాసశిరోభితాపై రభ్యాహతాయస్యనరస్యదృష్టిః.
ధూమ్రాం స్తథాపశ్యతిసర్వభావా న్సధూమదర్శీతినరఃప్రదిష్టః,

తా. శోకము, జ్వరము, ఆయాసము, మస్తకతాపము అనువానివలన పిత్తము ప్రకోపించి దృష్టియందు వికారమును గలుగంజేయుటవలన సర్వపదార్థములు పొగచే నావరింపఁబడినటుల గనుపించును. ఈరోగము శోకవిదగ్ధదృష్టి యని జెప్పంబడును.

---

* నక్తాంధ్య మన — రేచీకటి.

(అందు సర్వవస్తువులు పగటియందుమాత్రము పొగగమ్మినట్టుల గనుపించుచుసు. రాత్రియందు పిత్తము కొరపడుటవలన నిర్మలములుగ గనుపించును.)

ప్రాస్వదృష్టిలక్షణము.

యో హ్రస్వజాడ్యోదివసేషుకృచ్ఛ్రాద్ధ్రస్వాని రూపాణిచ తేనపశ్యేత్.

తా. దోషము దృష్టిమధ్యగతంబగుటవలన పగటియందు లావుగనుండు పదార్థములు సన్నగ గనుపించిన హ్రస్వదృష్టి యనంబడును.(ఈరోగము పిత్తమువలన జనించును.)

నకులాంధ్యలక్షణము.

విద్యోతతేయస్యనరస్యదృష్టి ర్దోషాభిపన్నా నకులస్యయద్వత్,
చిత్రాణిరూపాణిదివాసపశ్యేత్సవై వికారోనకులాంధ్యసంజ్ఞః.

తా. దృష్టిదోషముచే వ్యాప్తంబై ముంగిసదృష్టితో సమానంబై పగటియందు పలువిధరూపములుగ నగుపడుచూడిన నకులాంధ్య మనంబడును.

గంభీరదృష్టలక్షణము.

దృష్టిర్విరూపాశ్వసనోపసృష్టా సంకోచమభ్యంతరతశ్చయాతి,
రుజావగాఢంచ త మక్షిరోగం గంభీరికేతి ప్రవదంతి తద్జ్ఞాః. 67

తా. దృష్టి వాతమువలన వికృతంబై లోన సంకోచముగలదై పోట్లతో గూడియుండిన గంభీరదృష్టి యనంబడును.

ఆగంతుకలింగనాశనము.

బాహ్యౌపునర్ద్వావిహసంప్రదిష్టౌ నిమిత్తతశ్చాప్యనిమిత్తతశ్చ,
నిమిత్తతస్తత్ర శిరోఽభితాపో జ్ఞేయస్త్వభిష్యందనిదర్శనస్సః. 68

తా. అభిఘాతలింగనాశనము రెండువిధంబులు. అందొకటి యేదోయొకకారణంబునను, రెండవది నిష్కారణంబునను జనించును. అందు విషవృక్షపుష్పముపైనుండివచ్చిన గాలియొక్క స్పర్శవలన తల తపించి యుష్ణము కండ్లకు దిగి కండ్లు కానరాకుండం జేయునది శిరోభితాప మనంబడును. ఇది నిమిత్తజన్యము. దీనియందు రక్తాభిష్యంద లక్షణములే గలుగును.

అనిమిత్తజలింగనాశలక్షణము.

సురర్షి గంధర్వమహోరగాణాం సందర్శనేనాపిచభాస్కరస్య,
హన్యేతదృష్టిర్మనుజస్యయస్య సలింగనాశస్త్వనిమిత్తసంజ్ఞః. 69
తత్రాక్షివిస్పష్టమివావభాతి వైడూర్యవర్ణావిమలాచదృష్టిః,

తా. దేవ, ఋషి, గంధర్వ, మహాసర్ప, సూర్యాదుల నురిమిజూచుటవలన దృష్టి నష్టంబైన అనిమిత్తజలింగనాశనమని పరగి నేత్రములు స్వచ్ఛముగ, దృష్టి శ్యామలవర్ణముగ నుండును. (ఇటులు దృష్టిగత తిమిరరోగలక్షణంబులు జెప్పంబడియెను.)

## కంటితెల్లగ్రుడ్డునందు జనించురోగములు.

### * అర్మరోగభేదములు

ప్రస్తార్యర్మతను స్తీర్ణం శ్యావం రక్తనిభం సితే,
సశ్వేతం మృదుశుక్లార్మ శుక్లే తద్వర్ధతే చిరాత్. 70
పద్మాభం మృదురక్తార్మ యన్మాంసం చీయతే సితే,
పృథుమృద్వధిమాంసార్మ బహుళంచ యకృన్నిభమ్. 71
స్థిరం ప్రస్తారిమాంసాఢ్యం శుష్కంస్నాయ్వర్మపంచమం,

తా. అర్మరోగం బైదువిధంబులు. అందు కంటియొక్క తెల్లనిభాగముపై కేటగ, విస్తీర్ణముగ నల్లగ ఎఱ్ఱగనుండుమాంసము జనించిన ప్రస్తారికమనియు, తెల్లగ, మృదువుగనుండుమాంసము జనించిన కాలక్రమమున వృద్ధింజెందిన శుక్లార్మమనియు, తామరవలె నెఱ్ఱగ, మృదువుగనుండుమాంసము జనించిన రక్తార్మమనియు, విస్తీర్ణముగ, మృదువుగ, యకృత్తువలె స్థూలముగ, నల్లగ గనుపించిన అధిమాంసార్మమనియు కఠినంబై ప్రసరించునదియై స్రావరహితంబై యుండుమాంసము జనించిన స్నాయ్వర్మమనియు చెప్పంబడును.

### శుక్తిరోగలక్షణము

శ్యావాస్స్యుః పిశితనిభాస్తు బిందవోయే
శుక్త్యాభా స్సితనియతా స్సశుక్తిసంజ్ఞః. 72

తా. కంటియొక్క తెల్లగ్రుడ్డుపైనల్లగ, మాంసతుల్యముగ ముత్యపుచిప్పవర్ణ తుల్యముగ, బిందువులుజనించిన శుక్తి యనఁబడును.

### అర్జునలక్షణము.

ఏకోయశ్శశరుధిరోపమశ్చ బిందుశ్శుక్లస్థోభవతితదర్జునంవదంతి.

తా. కంటియొక్క తెల్లనిభాగమున రక్తమువలె నొకబిందువు జనించిన అర్జున మనంబడును.

### పిష్టకలక్షణము.

శ్లేష్మమారుతకోపేన శుక్లేమాంసం సమున్నతం,
పిష్టవ త్పిష్టకం విద్ధి మలాక్తాదర్శసన్నిభమ్. 74

తా. కఫవాతముల ప్రకోపమువలన నేత్రములయొక్క తెల్లనిగ్రుడ్డునందు పిండి వలె తెల్లగనుండు మాంసము జనించిన పిష్టక మనంబడును. ఇది మలయుక్తమైన యద్దము వలె కనుపించును.

---

* అర్మ మన దుర్మాంసము.

సిరాజాలలక్షణము.

జాలాభఃకఠినశిరోమహాంత్సరక్తస్సంతానస్మృతఇహజాలసంజ్ఞితస్తు,

తా. కంటియొక్క తెల్లనిగ్రుడ్డునందు కఠినముగ, గొప్పగ, ఎఱ్ఱగనుండు [1]సిరలు వ్యాపించి వలతో సమానంబై యుండిన సిరాజాల మనంబడును.

సిరాజపిటికలక్షణము.

శుక్లస్థా స్సితపిటికా స్సిరావృతాయా
స్తాబ్రూయా దసితసమీపజా స్సిరాజాః. 75

తా. కంటియొక్క తెల్లనిగ్రుడ్డుపైనుండు నల్లనిభాగమునకు సమీపమున సిరలు వ్యాపించి తెల్లనై సన్ననికురుపులు గలుగంజేసిన సిరాజపిటిక యనంబడును.

బలాసలక్షణము.

కాంస్యాభోమృదురథవారిబిందుకల్పో
విజ్ఞేయో నయనసితే బలాసపంజ్ఞః,

తా. కంటియొక్క తెల్లనిభాగమున కంచుతోసమానమైన కాంతిగలదిగ, కఠినముగ, లేక నీటిబిందువుతో తుల్యముగనుండు గ్రంథి జనించి యొకింతయుబ్బి గుండ్రముగనుండిన బలాసమనంబడును. (ఇటుల కంటి తెల్లగ్రుడ్డునందు జనించురోగములు చెప్పంబడియెను.)

పూయాలసలక్షణము

పక్వ శ్శోథ స్సంధిజో యస్సతోద
స్స్రావేత్పూయం పూతిపూయాలసాఖ్యః. 76

తా. నేత్రసంధియందు వాపు జనించి పండి సూదులతో పొడుచునటుల వేదనతోడంగూడి దుర్గంధముగ చీమును గార్చుచుండిన పూయాలస మనంబడును.

ఉపనాహలక్షణము.

గ్రంథిర్నాల్పో దృష్టిసంధావపాకీ కండుప్రాయోనీరుజస్తూపనాహః.

తా. నేత్రసంధియందు లావుగ. ఒకింతపక్వముగలదిగ, కడుదురదతో గూడినదిగ, వేదనారహితముగ నుండుగ్రంథి జనించిన ఉపనాహ మనంబడును.

నేత్రనాడీలక్షణము.

గత్వా సంధీ నశ్రుమార్గేణ దోషాః
కుర్యు స్స్రావాన్ లక్షణై స్సైస్స్వ రుపేతాన్,

[1] సిర యన భోలునరము.

తం హి స్రావం నేత్రనాడీతి చైకే
తస్యాలింగం కీర్తయిష్యే చతుర్ధా. 78

తా. వాతాదిదోషములు * అశ్రువులయొక్క మార్గమువలన సంధులయందు ప్రవేశించి తమతమలక్షణములతోడంగూడి స్రావము గలుగంజేసిన నేత్రనాడి యని కొందఱు వచించెదరు. అది నాలుగువిధంబులు. ఎట్లనిన:—

పాకస్సంధౌ సంస్రవేద్యస్తుపూయం పూయాస్రావోసౌగదస్సర్వజస్తు,
శ్వేతంసాంద్రంపిచ్ఛిలంసంస్రవేద్ధి శ్లేష్మస్రావోసౌవికారోమతస్తు. 79
రక్తాస్రావశ్శోణితాద్యోవికార స్స్రవేదుష్ణంతత్రరక్తంప్రభూతం,
హారిద్రాభంపీతముష్ణంజలంవా పిత్తాస్రావస్సంస్రవేత్సంధిమధ్యాత్. 80

తా. నేత్రసంధియందు వాపు జనించి పండి చీమునుగార్చుచు సన్నిపాతాత్మకయుక్తంబైయుండిన పూయస్రావ మనంబడును. మఱియు తెల్లగ, గట్టిగ, జంకగ చీమును గార్చుచుండిన శ్లేష్మస్రావి యనంబడును. రక్తప్రకోపమువలన విశేషముగ, ఉష్ణముగ నేత్రమువలన రక్తస్రావముగలది రక్తజస్రావ మనంబడును. నేత్రసంధుల యందు పసపుచాయగ, లేక పచ్చగ, ఉష్ణముగ నీరు గార్చుచుండునది పిత్తజస్రావ మనంబడును.

## పర్వణి అలజీలక్షణములు.

తామ్రాతన్వీదాహపాకోపపన్నా జ్ఞేయావైద్యైఃపర్వణీవృత్తశోథా,
జాతాసంధౌశుక్లకృష్ణేఽలజీస్యా త్తస్మిన్నేవఖ్యాపితాపూర్వలింగైః.

తా. కంటియొక్క తెల్లనిసంధిపైగాని, లేక నల్లనిసంధిపైగాని, ఎఱ్ఱగ, చిన్నవిగ, గుండ్రముగనుండు పిటకలు జనించి తాపయుక్తమై పండిన పర్వణియనియు, ఆస్థానంబుననే పూర్వోక్తమగుప్రమేహపిటకాలక్షణయుక్తంబై పెద్దవిగనుండుపిటికలు జనించిన అంజి యనియు జెప్పంబడును.

## క్రిమిగ్రంధిలక్షణములు.

క్రిమిగ్రంధిర్వర్త్మనఃపక్ష్మణశ్చ కండూంకుర్యుఃకృమయస్సంధిజాతాః,
నానారూపావర్త్మశుక్లాంతసంధౌ చరంత్యంతర్నయనందూషయంతః

తా. కంటిఱెప్పలయందును, ఱెప్పవెండ్రుకల సంధులయందును, పలువిధములైన క్రిములు, దురదజనించిన గ్రంధి యనంబడును. మఱియు నది కంటియొక్క తెల్లభాగమునందలి సంధులయందు వ్యాపించి కంటియొక్క లోభాగమును జెరచి లోన దిరుగుచుండిన క్రిమిగ్రంధి యనంబడును.

* అశ్రువులన—కంటినీరు.

వర్త్మరోగము, ఉత్సంగపిటికాలక్షణము.

అభ్యంతరముఖీ తామ్రా బాహ్యతో వర్త్మతశ్చయా,
సోత్సంగోత్సంగపిటికా సర్వజా స్థూలకండురా. 83

తా. కంటియొక్క లోభాగమున ముఖముగల కురుపుజనించి ఎఱ్ఱనై, కఠినంబై, దురదతోకూడినదై, కంటిరెప్పలయొక్క పైటిమధ్యభాగమున నుబ్బియుండిన ఉత్సంగపిటిక యనంబడును. ఇది త్రిదోషమువలన జనించును.

కుంభికాలక్షణము.

వర్త్మాంతే పిటికాధ్మాంతా భిద్యంతేచ స్రవంతిచ,
కుంభీకబీజసదృశాః కుంభికా స్సన్నిపాతజాః.

తా. కంటియొక్క యొకపార్శ్వమున దాడిమవిత్తువలెనుండు కురుపు జనించి యదిమిన నుబ్బుచు పగిలి మసివలె స్రావమును గలుగంజేయుచుండిన కుంభిక యనంబడును. ఇది త్రిదోషమువలన జనించును.

పోథకీలక్షణము

స్రావిణ్యః కండురాగుర్వ్యో రక్తసర్షపసన్నిభాః,
రుజావంత్యశ్చ పిటికాః పోథక్య ఇతి కీర్తితాః. 85

తా. రెప్పలయొక్క లోభాగములో ఎఱ్ఱావాల ప్రమాణముగల కురుపులు జనించిన రక్తమును గార్చుచు దురదతోగూడి జడత్వము, కడునొప్పిగలవై యుండిన పోథకి యనంబడును.

వర్మశర్కరాలక్షణము

పిటికాయాం ఖరా స్థూల సూక్ష్మాభి రభిసంవృతా,
వర్త్మస్థా శర్కరానామ సరోగో వర్త్మదూషకః. 86

తా. కంటియందు కఠినముగ, లావుగ నుండు కురుపుజనించి చుట్టుసన్నని కురుపులవలన వ్యాప్తంబైయుండిన వర్త్మశర్కర యనంబడును. ఇది కంటిరెప్పలం జెరచును.

అర్శోవర్త్మలక్షణము.

ఉర్వారుబీజప్రతిమాః పిటికా మందవేదనాః,
శ్లక్ష్ణాః ఖరాశ్చ వర్త్మస్థా స్తదర్శోవర్త్మ కీర్త్యతే. 87

తా. కంటిరెప్పలయందు దోసవిత్తులతో సమానంబులుగ, అల్పవేదన, నునుపు, కాఠిన్యము కలవిగనుండు కురుపులు జనించిన అర్శోవర్త్మ మనంబడును.

శుష్కార్శోలక్షణము.

దీర్ఘాంకురః ఖరస్తబ్ధో దారుణోఽభ్యంతరోద్భవః,

వ్యాధిరేషోఽతివిఖ్యాత శ్శుష్కార్శోనామ నామతః. 88

తా. కంటిలోపల పొడవుగ, గరగరగ, కఠినముగ, దుఃఖకరముగ నుండు మాంసపుమొలక జనించిన శుష్కార్శ మనంబడును. ఇది త్రిదోషమువలన జనించును.

## అంజనలక్షణము

దాహ తోదవతీ తామ్రా పిటికావర్త్మసంభవా,
మృద్వీ మంద రుజా సూక్ష్మా జ్ఞేయా సాంజననామికా. 89

తా. దాహము, పోట్లు అనువానితోడంగూడి ఎఱ్ఱగ, మృదువుగ, చిన్నదిగ, ఒకింతవేదన గలదిగనుండు కురుపు రెప్పలయందు జనించిన అంజన మనంబడును. ఇది త్రిదోషమువలన జనించును.

## బహుళవర్త్మలక్షణము

వర్త్మోపచీయతే యస్య పిటికాభి స్సమంతతః,
సవర్ణాభి స్థిరాభిశ్చ విద్యా ద్బహుళవర్త్మతత్. 90

తా. రెప్పలయొక్క సర్వప్రదేశము చర్మముతో సమానముగ, కఠినముగ నుండు కురుపులవలన వ్యాప్తంబై యుబ్బియుండిన బహుళవర్త్మ మనంబడును. ఇది త్రిదోషము వలన జనించును.

## వర్త్మబంధలక్షణము

కండూమతాల్పతోదేన వర్త్మశోథేన యో నరః,
నసమం ఛాదయేదక్షి యత్రాసౌ వర్త్మబంధకః. 91

తా. రెప్పలు వాచి దురద, ఒకింతవేదన అనువానితోడం గూడియుండుట వలన మూయుట కనుకూలించకుండిన వర్త్మబంధ మనంబడును. ఇది త్రిదోషమువలన జనించును.

## క్లిష్టవర్త్మలక్షణము

మృద్వల్పవేదనం తామ్రం యద్వర్త్మసమమేవ చ,
అకస్మాచ్చ భవే ద్రక్తం క్లిష్టవర్త్మేతి తద్విదుః. 92

తా. నేత్రములయొక్క క్రిందిరెప్పలు, పైరెప్పలు, ఏకకాలంబున మృదువులై అల్పవేదనగలవై ఎఱ్ఱనై యకస్మాత్తుగ గడుసెఱ్ఱగనైన క్లిష్టవర్త్మ మనంబడును. ఇది కఫరక్తమువలన జనించును.

## వర్త్మకర్దమలక్షణము

క్లిష్టం పునః పిత్తయుతం శోణితం విదహే ద్యదా,
తదాక్లిన్నత్వ మాపన్న ముచ్యతే వర్త్మకర్దమః. 93

తా. పూర్వోక్తక్లిష్టవర్త్మమునందు మరల పిత్తయుక్తరక్తం బెపు డుడిగెనో అపు డది బురదవలె నగును. ఇదియ వర్త్మకర్దమ మనంబడును. ఇది పిత్తాధికసన్నిపాతము వలన జనించును.

## శ్యావవర్త్మలక్షణము

వర్త్మయద్బాహ్యతోఽంతశ్చ శ్యావం శూనం స వేదనం,
తదాహు శ్శ్యావవర్త్మేతి వర్త్మరోగవిశారదాః. 94

తా. రెప్పలయొక్క పైభాగము, లోభాగము నల్లనై వాచి పోట్లతో గూడి యుండిన శ్యావవర్త్మ మనంబడును. ఇది వాతాధికత్రిదోషమువలన జనించును.

## ప్రక్లిన్నవర్త్మలక్షణము

అరుజం బాహ్యత శ్శూనం వర్త్మయస్య నరస్య హి,
ప్రక్లిన్నవర్త్మ తద్విద్యాత్ క్లిన్నమత్యర్థమంతతః. 95

తా. రెప్ప యొకింతవేదన వెలపట వాపుగలదై రెప్పకొలుకులకు సమీపమున మిక్కుటముగ చితచితలాడుచుండిన ప్రక్లిన్నవర్త్మ మనంబడును. ఇది కఫాధిక్యమువలన జనించును.

## అక్లిన్నవర్త్మలక్షణము

యస్య ధౌతాన్య ధౌతాని సంబధ్యంతే పునఃపునః,
వర్త్మాన్యపరిపక్వాని విద్యాదక్లిన్నవర్త్మతత్. 96

తా. కంటిరెప్పలం గడిగినను లేక గడుగకున్నను, బంకవలె పలుమారు కరచుకొని లోభాగము పండక చీముతో గూడకనుండిన అక్లిన్నవర్త్మ మనంబడును.

## వాతహతవర్త్మలక్షణము.

విముక్తసంధి నిశ్చేష్టం వర్త్మయస్య నమీల్యతే,
ఏతద్వాతహతం వర్త్మ జానీయా దక్షిచింతకః. 97

తా. రెప్పసంధులు వీడుటవలన, కన్నులు దెరచుటకును, మూయుట కశక్యంబై చిన్నవియై రెప్పలు మూతపడకుండిన వాతహతవర్త్మ మనంబడును.

## అర్బుదలక్షణము

వర్త్మాంతరస్థం విషమం గ్రంథిభూత మవేదనం,
ఆచక్ష తేఽర్బుదమితి సరక్త మవిలంబితమ్. 98

తా. రెప్పలయొక్క లోభాగము మందవేదనగలదై ఒకింత యెఱ్ఱనై శీఘ్రముగ వృద్ధిజెందునదియై విషమమై దానియందు గ్రంథిజనించిన అర్బుద మనంబడును. ఇది త్రిదోషమువలన జనించును.

నిమేషలక్షణము

నిమేషిణీ స్సిరా వాయుః ప్రవిష్టో వర్త్మసంశ్రయః,
ప్రచాలయతి వర్త్మాని నిమేషంనామ తం విదుః. 99

తా. ఱెప్ప నాశ్రయించియుండు వాయువు నిమేషోన్మేషముల జేయునట్టి సిరలయందుజేరి ఱెప్పల గదలింపుచుండిన నిమేష మనంబడును.

శోణితార్శోలక్షణము.

వర్త్మస్థో యో వివర్ధేత లోహితో మృదురంకురః,
తద్రక్తజం శోణితార్శ ఛిన్నం ఛిన్నం ప్రవర్ధతే. 100

తా. రక్తసంబంధమువలన ఱెప్పలయొక్క లోభాగమున యెఱ్ఱగ, మృదువుగ నుండు మొలకలు జనించిన శోణితార్శ మనంబడును. దీనిని పలుమారు గోసినను మరల మరలబె రుగుచుండును.

లగణలక్షణము.

అపాకీ కఠిన స్థూలో గ్రంథిర్వర్త్మ భవో రుజః,
సకండూః పిచ్ఛిలః కోల సంస్థానో లగణస్తు సః. 101

తా. ఱెప్పలయందు రేగుకాయవలె కఠినముగ, స్థూలముగ, కండూయుక్తముగ జిగటగ నుండుగ్రంథి జనించిన లగణ మనంబడును. ఇది కఫాధిక్యమువలన జనించును. దీనియందు పోట్లు, పాకము (పండుట) లేకుండును.

బిసవర్త్మలక్షణము.

త్రయోదోషా బహి శ్శోథం కుర్యు చ్ఛిద్రాణి వర్త్మనోః,
ప్రస్రవత్యంతరుదకం బిసవ ద్బిసవర్త్మ తత్. 102

తా. దోషత్రయ ప్రకోపమువలన ఱెప్పల పైభాగము వాచి ఛిద్రములతోగూడి తామరతూండ్లవలె లోన నీరును గార్చుచుండిన బిసవర్త్మ మనంబడును.

కుంచనలక్షణము.

వాతాద్యావర్త్మసంకోచం జనయంతి యదా మలాః,
తదా ద్రష్టుం న శక్నోతి కుంచనంనామ తద్విదుః. 103

తా. ప్రకోపించినవాతాదిదోషములు ఱెప్పలను చిన్నవిగజేసిన నేత్రములనుదెరచి చూచుట కశక్యంబగును. ఈరోగము కుంచనమనియు, లేక కృచ్ఛోన్మీలనమనియు జెప్పంబడును.

పక్ష్మకోపలక్షణము.

ప్రచాలితాని వాతేన పక్ష్మాణ్యక్షీ విశంతి హి,

ఘృష్యంత్యతః ముహుః స్తాని సంరంభం జనయంతిచ. 104
అసితే సితభాగేన మూలకోశా త్పతంత్యపి,
పక్ష్మకోప స్సవిజ్ఞేయో వ్యాధిః పరమదారుణః. 105

తా. వాతముచే కంటిరెప్పలు చలింపఁజేయఁబడుటవలన వెంట్రుకలు కంటిలో ప్రవేశించి పలుమారు తెల్లగ్రుడ్డునందుగాని, నల్లగ్రుడ్డునందుగాని యొరసికొనుటచే వాపుగలిగి వెంట్రుకలు మూలమునుండి వదలును. ఇదియ పక్ష్మకోప మనియు, అథవా ఉప పక్ష్మమనియు జెప్పంబడును. ఇది కడుభయంకరమైనది.

### పక్ష్మశాతలక్షణము

వర్త్మపక్ష్మాశయగతం పిత్తం రోమాణి శాతయేత్,
కండూం దాహంచ కురుతే పక్ష్మశాతం తమాదిశేత్. 106

తా. రెప్పలు, రెప్ప వెంట్రుకలు - వీనిమూలమునందుండుపిత్తము ప్రకోపించుట వలన వెంట్రుకలూడి రెప్పలయందు దురదను, దాహమును గలుగజేసిన పక్ష్మశాత మనఁబడును.

### త్రికటుకాద్యంజనము.

కటుత్రయంచాపిఫలత్రయంచ జ్యోతిష్మతీవేల్లకరంజబీజం,
ప్రపౌండరీకంమధుకంచతామ్రం సింధూద్భవంవై పటికంచశంఖమ్.
రసాంజనంగైరికచందనేద్వే ద్రాక్షానిశాశాబరలోధ్రకంచ,
తుత్థంచపీతాహ్వాయరోహిణీచ పేష్యంకరంజస్వరసేనసర్వమ్. 108
తుత్థాదిరేకోద్విగుణోరసాదిః ప్రపౌండరీకాదిగణంత్రిభాగం,
శేషంచతుర్భాగమిదంనిహన్యా ద్వర్తిస్సునేత్రస్సకలాంశ్చరోగాన్.
కాచంచపుష్పంపటలంవ్రణంచ దుర్మాంసకండూపిటకంకుకూనం,
దాహంచరాగంచనిశాంధతాంచ తథాధిమంథంవినిహంతిశీఘ్రమ్.
(ఆయుర్వేదే)

తా. త్రికటుకములు, కరకతాండ్రయుసిరికలు, వెక్కుడువిత్తులు, వాయువిడంగములు, క్రానుగవిత్తులు - ఇవి దినుసుకు నాలుగేసిభాగములు, ప్రపౌండరీకము, అతిమధురము, తామ్రభస్మము, సైంధవలవణము, పటిక, శంఖము - ఇవి దినుసుకు 3 భాగములు, రసాంజనము, కావిరాయి, శ్రీగంధము, రక్తచందనము, ద్రాక్షపండ్లు, పసపు, తెల్లలొద్దుగ, లొద్దుగ - ఇవి దినుసుకు రెండేసిభాగములు, మైలుతుత్తము, మ్రానిపసపు, కటుకరోహిణి - ఇవి దినుసుకొక్కొకభాగము, ఇటులవానినెల్ల ఖల్వములో నురిది క్రానుగచెక్కరసముతో మర్దించి కణికలుజేసి ఉదకముతో జాది కన్నునబెట్టిన కాచము, పువ్వులు, పటలములు, వ్రణములు, దుర్మాంసము, దురదలు,

పొక్కులు, కూనలు, కంటియందు మంట, కంటిపెఱుపులు, రేజీకటి, అధిమంథము మొదలగు సర్వనేత్రరోగములను తీవ్రముగ హరింపంజేయును.

**కతకాద్యంజనము**

కతకస్య ఫలం శంఖ సైంధవం త్ర్యూషణం సితా,
ఫేనో రసాంజనం క్షౌద్రం విడంగాని మనశ్శిలా. 111
కుక్కుటాండకపాలంచ ఖల్వమధ్యే వినిక్షిపేత్,
సర్వమేతత్సమం కృత్వా నారీక్షీరేణ పేషయేత్. 112
తిమిరం పటలం కాచ మర్మశుక్రం వ్యపోహతి,
కండూ క్లేదార్బుదం హంతి మలం బాహ్యం జయేత్తతః. 113
(మాధవనిదానే)

తా. చిల్లగింజ, శంఖము, సైంధవలవణము, త్రికటుకములు, పంచదార, సముద్రపునురుగు, రసాంజనము, తేనె, వాయువిడంగములు, మణిశిల, కోడిగ్రుడ్డు పెంకులు-వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి చనుబాలతో మర్దించి కణికలుజేసి నిమ్మపండ్ల రసముతో వాడి కన్నులబెట్టిన (వర్త్మరోగము, కండ్లదృష్టిని పోగొట్టెడిరోగము) తిమిరము, * పటలము, కాచము, అశ్మరోగము, కంటిపువ్వులు, దురద, నీరుగారుట, నేత్రార్బుదము, కండ్లపుసి హరించును.

**గరుడాంజనము**

త్రుటిచ మరిచ తుత్థం సైంధవం వారిఫేనం
పటిక దరద శంఖం చందనం కుష్ఠ లాక్షా,
రజని నరకపాలం కుక్కుటాండం కుసట్యౌ
కతకశశిసురాహ్వా తార్క్ష్యశైలం సరాళమ్. 114
అజపయసిచ వర్షామీనదృగ్భృంగినీలి
సలిలజ విజయాభిర్ఘృష్టతం సప్తవారం,
తిమిర పటల కాచం ధూమదృక్చాంధకారం
కుకున కుసుమ క్లేదం సిందురం నేత్రపాకమ్. 115
గరుడసదృశదృష్టిం నిర్మలత్వం ప్రభావం
మనుజహితకరార్థం భాషితం పూజ్యపాదైః. (పూజ్యపాదీయే)

తా. ఏలకులు, మిరియాలు, శుద్ధిజేసినమైలుతుత్థము, సైంధవలవణము, సముద్రపునురుగు, పటిక, ఇంగిలీకము, శంఖము, శ్రీగంధము, చెంగల్వకోష్టు, లక్కబియ్యము,

* పటల మన కంటిపొర.

పసపు, మనుజునితలపుఱ్ఱె, కోడిగ్రుడ్డుపెంకులు, మణిశిల, చిల్లగింజలు, పచ్చకర్పూరము, దేవదారు, రసాంజనము, గుగ్గిలము-వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మేకపాలు, గలిజేరు, పొన్నగంటి, గుంటగలగర, నీలి, తెల్లకలువ, తక్కాలి, అనువానిరసములలో ప్రతిదానిచే నొక్కొకమారు మర్దించి కణికలుజేసి ఉదకముతో చాది కన్నులబెట్టిన తిమిరము, పొరలు, కాచము, పొగగప్పినకన్నులు, గనుపించనికన్నులు, పూలు, కంటిపువ్వులు, కంటిపుసి, కంటియెఱుపు, నేత్రపాకము హరించి గరుడునితో సమానమైనదృష్టి, నైర్మల్యము గలుగును. ఇది లోకహితార్థమై పూజ్యపాదునిచే జెప్పంబడియెను.

## నయనామృతము

కర్పూర మంజనం తుత్థం యష్ట్యా పీతక రోహిణి,
వరాటం సైంధవం వ్యోషం ఫేనం మధుక చందనమ్. 117
శంఖంచ తత్సమం పిష్ట్వా మాతులుంగరసేనతు,
మధుసర్పిర్యుతంచైవ వ్యంజనం నయనామృతమ్. (ఆయుర్వేదే)

తా. పచ్చకర్పూరము, శుద్ధిజేసిన సౌవీరాంజనము, శుద్ధిజేసిన మైలుతుత్థము, రసాంజనము, మ్రానిపసపు, కటుకరోహిణి, గవ్వలు, సైంధవలవణము, త్రికటుకములు, సముద్రపునురుగు, యష్టిమధుకము, శ్రీగంధము, శంఖము-వీన్నిని సమభాగములుగ ఖల్వములో నునిచి మాదీఫలరసముతో మర్దించి కణికలుజేసి తేనెతోగాని, లేక నేతితోగాని, చాది కన్నులబెట్టిన సర్వనేత్రరోగములు హరించును.

## గరుడాంజనము

కతక సైంధవతుత్థకటుత్రయం పటికశంఖవరాటరసాంజనం,
కునటితామ్రమయోహిమరోహిణీ జలధిఫేనవచాన్నృకరోటికా.
ఉరగపారదటంకణమంజనం త్రిఫలయామధురోచనకంయుతం,
కరజవల్కరసేనసుపేషితం గరుడదృష్టిసమంకురుతే దృతమ్. 120
(రసరత్నాకరే)

తా. చిల్లగింజలు, సైంధవలవణము, శుద్ధిజేసినమైలుతుత్థము, త్రికటుకములు, పటిక, శంఖము, గవ్వలు, రసాంజనము, రక్తమణిశిల, తామ్రభస్మము, ఇనుపభస్మము, పచ్చకర్పూరము, కటుకరోహిణి, సముద్రపునురుగు, వస, మనుజునితలపుఱ్ఱె, సీసభస్మము, రసభస్మము, వెలిగారము, సౌవీరాంజనము, కరకతాండ్రయుసిరికలు, యష్టిమధుకము, గోరోజనము-వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి క్రానుగచెక్కరసముతో బాగుగ మర్దించి కణికలుచేసి నీళ్ళతోచాది కన్నులబెట్టిన గరుత్మంతునితో సమానమైన దృష్టి గలుగును.

## నేత్రరోగమునకు రసక్రియ

పారదో విద్రుమం నాగ కాసీసంచ రసాంజనం,
సైంధవం త్ర్యూషణం తామ్రం తుత్థం గైరిక లోధ్రకమ్. 121
పుత్రజీవీ శిలా ముస్తా గిరికర్ణ్యభయా సమం,
చించా సౌవీరకం శుద్ధంనింబపత్ర ద్రవైస్స్నితమ్. 122
పిష్ట్వాతామ్రతలేష్వార్ద్రైః వర్తికాచాస్మ శుక్లజిత్, (మాధవనిదానే)

తా. రసభస్మము, పగడము, సీసభస్మము, కాసీసము, రసాంజనము, సైంధవలవణము, త్రికటుకములు, తామ్రభస్మము, శుద్ధిజేసినమైలుతుత్థము, కావిరాయి,లొద్దుగచెక్క, పుత్రజీవివిత్తులు, శుద్ధిజేసినమణిశిల, తుంగముస్తెలు, తెల్లగంటెనవిత్తులు, కరక్కాయ, చింతగింజలు, శుద్ధిజేసిన సౌవీరాంజనము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి వేపాకురసములో మర్దించి ముద్దజేసి తామ్రపాత్రలో నునిచి తేనెపోసి రాగిగిన్నెతో మర్దించి కణికలుజేసి తేనెతోచాది కన్నులబెట్టిన అర్మము, కంటిపువ్వులు, హరించును.

## నేత్రాంజనము

కణా సౌవీర కర్పూర నాగ పారద తీక్ష్ణకమ్. 123
విషంచ లోహపాత్రేతు నంద్యావర్తరసైర్దినం,
మర్దయేల్లోహముష్ట్యాథ పటికం చూర్ణితం క్షిపేత్. 124
మర్దితం మర్దయేద్భూయోవర్తిశ్శుక్లామ్లపిత్తజిత్, (ఆయుర్వేదే)

తా. పిప్పళ్ళు, సౌవీరాంజనము, కర్పూరము, సీసభస్మము, రసభస్మము, ఇనుపభస్మము, శుద్ధిజేసినవసనాభి-వీనిని సమభాగములుగ ఇనుపపాత్రములోనునిచి నంద్యావర్తపురసముతో నొకదినము ఇనుపగుండుతో మర్దించి పటికచూర్ణము గలిపి, మరల మర్దించి కణికలుజేసి యెండించి కన్నులబెట్టిన కంటిపువ్వులు, ఆమ్లపిత్తము హరించును.

## తామ్రాద్యంజనము

మృతతామ్రం సధాన్యాభ్రం శిఖితుత్థంచ ఖర్పరీ. 125
దశనిష్కం పృథక్చూర్ణ్య క్షిప్త్వాచ ఖర్పరే,
క్షిప్త్వా మందాగ్నినా పాచ్యం తద్గర్భే శుద్ధగంధకమ్. 126
దత్వాల్పమల్పం భూయోపిరుద్ధ్వా ధూమం ప్రయత్నతః,
చూర్ణితం జాయతే శుద్ధం త్రింశత్కర్షంతు గంధకమ్. 127
సముత్తార్య క్షిపేత్తోయే ప్రస్థమాత్రేతు మర్దయేత్,

తజ్జలంచాన్యభాండస్థం కృత్వాథః కిట్టివర్జితమ్. 128
తజ్జలంచాతపే శోష్యం ఘనీభూతే విమిశ్రయేత్,
శిఖితుత్థం శిలాచూర్ణం కర్షాంశం వస్త్రగాలితమ్. 129
మధ్వాజ్యస్తన్యతో ఖ్యాతం సర్వనేత్రరుజాపహం,
(మాధవనిదానే)

తా. తామ్రభస్మము, ధాన్యాభ్రకము, మైలుతుత్థము, శుద్ధిజేసినకఫరి-వీనిని దినుసుకు ౧౦ నిష్కములయెత్తుచొప్పున చూర్ణముగావించి నేకముజేసి మూకుడులో నునిచి పొయిమీఁదబెట్టి అందు శుద్ధిజేయఁబడి చూర్ణముచేయఁబడిన ౩౦ కర్షముల గంధకమును పలుమారు కొంచెకొంచెముగ వేయుచు దానిపొగ బైలువెడలకుండునటుల పై మూకుడుమూతిని మఱియొకమూకుడుచే మూయుచు గంధకబంతయు జీర్ణంబగువఱకు పాకముచేసిన శుద్ధంబగును. పిదప దానిని సాంగశీతలమున దీసి ఒక ప్రస్థమునీళ్ళలో కలిపి మర్దించి నీళ్ళకడుగుననుండు మష్టును వర్జించి మఱియొక కుండలోపోసి గట్టియగువఱకు ఎండ నెండించి అందు కర్షప్రమాణము శుద్ధిజేసిన మైలుతుత్థమును, శుద్ధిజేసినశిలాజిత్తును చూర్ణముగావించి వస్త్రగాలితముజేసి గలిపి కణికలుజేసి తేనెతోగాని, లేక నేతితోగాని, లేక చనుపాలతోగాని చాది కన్నులబెట్టిన సర్వనేత్రరోగములు హరించును.

## రసాంజనాద్యంజనము

శుక్లార్మజే విషంకృష్ణా యుక్తం గోమూత్రభావితమ్. 130
సాముద్రఫేనం పటికం కురువింద రసాంజనం,
కూర్మపృష్ఠంచ తుల్యాంశం సర్వాంశంచ మనశ్శిలా. 131
శిలాయాద్విగుణం వ్యోషం వ్యోషా ద్ద్విగుణసైంధవం,
లోహచూర్ణం విషంచైవ ప్రత్యేకం సైంధవాంశకమ్. 132
పిష్ట్వా క్షౌద్రయుతం చాజ్యం పిల్లశుక్లార్మకం జయేత్, (చరకే)

తా. అతివస, పిప్పళ్ళు-ఈరెంటిని గోమూత్రముతో భావనజేసి చాది కన్నులబెట్టిన కంటిపువ్వులు, నీరుగారుట హరించును. మఱియు సముద్రపునురుగు, పటిక, ఇంగిలీకము, రసాంజనము, తాఁబేటివీఁపుపుట్టె ఇవి సమభాగములుగ వీనికిసమము శుద్ధిజేసిన రక్తమణిశిల, రక్తమణిశిలకు రెండింతలు త్రికటుకములు, దానికి రెండింతలు సైంధవలవణము, సైంధవలవణమునకు సమము లోహభస్మము, లోహభస్మమునకు సమము అతివస-ఇటుల వీనినెల్ల నేకముజేసి తేనెతోగాని, లేక నేతితోగాని, నూరి కణికలుజేసి కన్నులబెట్టిన కంటిపుసి, కంటిపువ్వులు, అర్మరోగము-వీనిని హరింపంజేయును.

### సైంధవాద్యంజనము

సైంధవం సూతకం నాగం ధాత్రీచూర్ణం రసాంజనమ్. 133
కణాఘృతం సితాక్షౌద్రం నాగవల్లీదళద్రవైః,
కాంస్యపాత్రే తామ్రముష్ట్యా దినమేకం విమర్దయేత్. 134
వర్తింకృత్వాంజనేహంతి సర్వనేత్రగదామయాన్, (వృంధవనిదానే)

తా. సైంధవలవణము, రసభస్మము, సీసభస్మము, ఉసిరికపప్పుచూర్ణము, రసాం ము, పిప్పళ్ళు-వీనిని సమభాగములుగ కంచుపాత్రలో నునిచి నెయ్యి, పంచదార, సకను, తేనె, తమలపాకురసము అనువానితో నొకదినము రాగిగుండుతో మర్దించి కలుజేసి కన్నుల బెట్టిన కంటిపుసి, పువ్వు, ఎఱ్ఱుపు, దురద మొదలగు సర్వనేత్ర గములు హరించును.

### తారకాద్యవటికములు

తారం తామ్రం రసం [1]తుత్థం ఖర్పరీ పీతరోహిణీ. 135
రసాంజనం కాంస్యశంఖం హంసపాద్యాద్రవైర్దినం,
వర్తింకృత్వాంజనాద్ధంతి సమస్తంనేత్రజామయమ్. (సిద్ధవిద్యాభూః)

తా. వెండిభస్మము, తామ్రభస్మము, రసభస్మము, శుద్ధిజేసిన మైలుతుత్థము, ద్ధిజేసినకఫరి, మ్రానిపసపు, కటుకరోహిణి, రసాంజనము, కంచుభస్మము, ంఖము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో కదినము మర్దించి కణికలుజేసి నీళ్ళలో జాది కన్నులబెట్టిన సర్వనేత్రరోగములు రించును.

### గజకేసరి

మనశ్శిలా హతంనాగం నాగాద్విగుణ [2]తుత్థకం,
కించిత్కర్పూరకం మర్ద్యం ద్రోణపుష్పరసైర్దినమ్. 137
వర్తిరేషా హ్యభిష్యంది నాశాయ గజకేసరీ, (చరకే)

తా. శుద్ధిజేసిన మణిశిల, సీసభస్మము, సీసభస్మమునకు రెండింతలు శుద్ధిజేసిన మైలుతుత్థము, ఒకింత పచ్చకర్పూరము-వీనిని ఖల్వములో నునిచి తుమ్మిపూలరసముతో నొకదినము మర్దించి కణికలుజేసి కన్నులబెట్టిన అభిష్యందము హరించును.

### చంద్రకాంజనములు

తుత్థం తామ్ర మయోరజో మధు వచాక్షీరం వరం సైంధవం
శంఖ వ్యోష విళంగ సూతకతకం దార్వీచ న్యగ్రోధకమ్,

---

1 సీసం కర్పూరం ఖర్పరం తథా. 2 రూప్యకమ్.

ధాత్రీ తాళ కరంజ మంజనయుతం చామ్లైశ్చ లుంగద్రవైః
పుష్పం నేత్రపికారకాశ్చ హరతీ చంద్రస్యవాక్చంద్రకమ్. 138
(చంద్రభాష్యే)

తా. శుద్ధిజేసిన మైలుతుత్థము, తామ్రభస్మము, ఇనుపభస్మము, యష్టిమధుకము, వస, పాలతుత్థము, లవంగములు, సైంధవలవణము, శంఖము, త్రికటుకములు, వాయువిడంగములు, రసభస్మము, చిల్లగింజలు, మ్రానిపసపు, మఱ్ఱియూడలు, ఉసిరికపప్పు, శుద్ధిజేసిన తాళకము, క్రానుగవిత్తులు, నీలాంజనము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతోను, మాదీఫలరసముతోను మర్దించి కణికలుజేసి నీళ్ళతోజాది కన్నులబెట్టిన పువ్వులు, సర్వనేత్రరోగములు హరించునని చంద్రుడు వచించెను.

పటికం లోధ్ర రసాంజనంచ తగరం తుత్థం తథానాగకం
రసకం సైంధవ నక్తమాల మధుకం వ్యోషం విడంగం సమం,
పథ్యా భృంగక మాతులుంగకరసైః రక్తే చ నేత్రే క్షిపేత్
పటలం పుష్పక కాచకండుహరతీ చంద్రస్యవాక్చంద్రకమ్. 139
(చంద్రభాష్యే)

తా. పటిక, లొద్దుగచెక్క, రసాంజనము, తగరభస్మము, శుద్ధిజేసినమైలుతుత్థము, సీసభస్మము, శుద్ధిజేసిన కఫరి, సైంధవలవణము, క్రానుగవిత్తులు, యష్టిమధుకము, త్రికటుకములు, వాయువిడంగములు, కరక్కాయ - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గుంటగలగరరసము, మాదీఫలరసము అనువానితో మర్దించి కణికలుజేసి కన్నులబెట్టిన కంటిరెప్పలు, పొరలు, పువ్వులు, కాచము, దురద-వీనిని హరింపజేయునని చంద్రుడు వచించెను.

కతక మణిశిలాహ్వా ధాత్రికాక్షీరతుత్థం
దరద మధుక లోధ్రం తాళకాఖ్యం సవీరం,
త్రికటుకద్వికరంజం దారు దార్వీ సవేల్లం
పటిక కుముద శంఖం తామ్రనాగాభ్రకాంతమ్. 140

కునటిమణిశిలా వై తాళకం తృష్ణకం చ
జలధిలవణ ఫేనం గైరికాఖ్యం చ సర్వం,
సరసపటక విశ్వా భృంగకం చార్ద్రకంచా
ప్యమృత మధు ఘృతైస్స్యా త్కల్పితం నేత్రవర్తిః. 141
పటల తిమిర పుష్పం కండుకం లోహితం చ

శ్వయథు జలనిబర్హాం చంద్రవాక్చంద్రకం చ. (చంద్రభాష్యే) 142

తా. చిల్లగింజ, శుద్ధిజేసిన మణిశిల, ఉసిరికపప్పు, శుద్ధిజేసిన పాలతుత్థము, శుద్ధిజేసిన ఇంగిలీకము, యష్టిమధుకము, లొద్దుగచెక్క, శుద్ధిజేసిన తాళకము, శుద్ధిజేసిన సౌవీరము, త్రికటుకములు, వ్రానుగచెక్క, నెమలిచెక్క, దేవదారు, మ్రానిపసపు, మిరియాలు, పటిక, తెల్లకలువ, శంఖము, తామ్రభస్మము, నాగభస్మము, అభ్రకభస్మము, కాంతభస్మము, శుద్ధిజేసిన రక్తమణిశిల, శుద్ధిజేసిన తాళకము, పిప్పళ్ళు, ఉప్పు, సముద్రపునురుగు, కావిరాయి-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి మట్టియూడలు, శొంఠి, గుంటగలగర, అల్లము అనువాని రసములతో మర్దించి కణికలుజేసి ఆవు వెన్నతోగాని, తేనెతోగాని, నేతితోగాని చాది కన్నులబెట్టిన కంటిపొరలు, తిమిరములు, కంటిపువ్వులు, దురద, ఎఱుపు, కంటివాపు, నీరుగారుట-వీనిని హరింపజేయునని చంద్రుడు వచించెను.

**నయనామృతము**

మయూరతుత్థం సింధూత్థం తుత్థం ఫేనం రసాంజనం,
టంకణం మరిచం తుల్యాం జంబీర రసపేషితమ్. 143
త్రిరాత్రం తామ్రపాత్రస్థం కాచార్మపటలాపహం,
కండూ వ్రణహరం నామ్నానయనామృతముత్తమమ్. (ఆయుర్వేదే)

తా. శుద్ధిజేసిన మైలుతుత్థము, సైంధవలవణము, శుద్ధిజేసిన పాలతుత్థము, సముద్రపునురుగు, రసాంజనము, వెలిగారము, మిరియాలు-వీనిని సమభాగములుగ తామ్రపుపాత్రలో నునిచి నిమ్మపండ్లరసముతో 3 దినములు మర్దించి కన్నుల బెట్టిన కాచము, అర్మము, పొరలు, దురద, వ్రణము హరించును.

**ఖర్పర్యాద్యంజనము**

ఖర్పరి తుత్థ రసాంజన ఫేనం శంఖ శిలా సపునర్నవత్రిఫలా,
నింబరసేన విమర్ద్య చ వటికాః కాచ తిమిరపటలాని చ పుష్పమ్. 145
(మాధవనిదానే)

తా. శుద్ధిజేసిన కఫరి, శుద్ధిజేసిన మైలుతుత్థము, రసాంజనము, సముద్రపునురుగు, శంఖము, శుద్ధిజేసిన మణిశిల, తెల్లగలిజేరు, త్రిఫలములు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో బాగుగ నూరి కణికలుజేసి నీళ్ళతోఁజాది కన్నులబెట్టిన కాచము, తిమిరము, పొరగప్పినకండ్లు, కంటిపువ్వు హరించును.

**తిలపుష్పాంజనము**

మరీచం ఖర్పరీచైవ తిలపుష్పం తథైవ చ,
ఏకైకం ద్విగుణం ప్రోక్తం జంబనీరేణ పేషయేత్. 146

నాశయేత్తిమిరం కండూం పటలాన్యర్బుదానిచ,
అతిరక్తాని మాంసాని హ్యేకరాత్రేణ నాశయేత్. (బాహటే) 147

తా. మిరియాలు ౨ భాగములు, శుద్ధిజేసినకపర్ది ౪ భాగములు, నువ్వులపువ్వు ౮ భాగములు-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో మర్దించి కణికలు జేసి కన్నులబెట్టిన [1]తిమిరములు, దురద, కంటిపొరలు, అర్బుదము, కంటి ఎఱుపు, దుర్మాంసము ఒకదినములో హరించును.

## మరిచాంజనము

మరిచామలకం కరంజబీజం క్రమవృద్ధ్యుత్తరభృంగతోయవర్తిః,
తిమిరంపటలంనిహంతికాచం సుకృతంకర్మయథాకృతం భవేత్తత్. 148
(ఆయుర్వేదే)

తా. మిరియాలు ౧ భాగము, ఉసిరికవరుగు ౨ భాగములు, క్రానుగవిత్తులు ౩ భాగములు-ఇటుల వీనిని ఖల్వములో నునిచి గుంటగలగరాకురసముతో నూరి కణికలు జేసి నేత్రములయం దంజనము వేసిన కానరానికన్నులు, పొరలు, కాచము, జన్మాంతర సుకృతకర్మవలన హరించును.

## చంద్రప్రభాంజనము

ఫేనంచముండంకతకస్యబీజం నారంకపాలంసహకుక్కుటాండం,
మనశ్శిలా మాగధసంప్రయుక్త మాజన్మజాతం కుసుమం నిహంతి.
(సిద్ధవిద్యాభూః)

తా. సముద్రపునురుగు, ఇనుపభస్మము, చిల్లగింజ, నరునికపాలము, కోడిగ్రుడ్ల పెంకులు, శుద్ధిజేసిన మణిశిల-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి జీలకఱ్ఱ కషాయముతో నూరి కణికలుజేసి కన్నులబెట్టిన జనించినది మొదలుకొని యుండుకంటిపువ్వులు హరించును.

## చంద్రోదయవర్తి.

[2]హరిద్రా నింబపత్రాణి పిప్పలీ మరిచానిచ,
[3]విభీతక కరంజాని శంఖ నాభి ర్మనశ్శిలా. 150
[4]ఏతాని సమభాగాని హ్యజామూత్రేణ పేషయేత్,
[5]నాశయే త్తిమిరం కండూం పటలాన్యర్బుదానిచ. 151

1 తిమిర మన కండ్లు గానరాకుండుట. 2 హరీతకీ వచాకుష్ఠం. 3 విభీతకస్య మజ్జాచ. 4 సర్వమే తత్సమం కృత్వా. 5 వాగికండూంచ తిమిర మర్బుదం పటలానిచ, అతిరక్తాని మాంసాని పుష్పం వర్త్మనిహంతిచ.

అపి త్రివార్షికం శుక్రం మాసేనైకేన నాశయేత్,
అధికానిచ మాంసాని రాత్ర్యంధత్వం తథైవచ. 152
వర్తిశ్చంద్రోదయానామ నృణాం దృష్టివిశోధినీ, (ఆయుర్వేదే)

తా. పసపు, వేపచిగురు, పిప్పళ్ళు, మిరియాలు, తానికాయలలోనిపలుకులు, త్రానుగవిత్తులు, శంఖము, శుద్ధిజేసిననాభి, శుద్ధిజేసినమణిశిల-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి మేకపంచితముతో నూరి కణికలుజేసి నీళ్ళతో జాది కన్నులబెట్టిన కండ్లు కానరాకుండుట, దురద, పొరలు, అర్బుదము, మూడువత్సరములుగ నుండుకంటిపువ్వులు, దుర్మాంసములు, రేజీకటి-వీని నొకమాసములో హరింపజేయును.

నేత్రరోగములకు దార్వ్యాద్యంజనము

దార్వ్యాంచ పటలం కాచం పిల్లం రక్తం తథార్జునమ్. 153
స్రావార్మ నక్తరోగాణి కండూ క్లేదం వ్యపోహతి,
యూథికా ఘర్షణాం శూలం వర్మరోగం వినాశయేత్. 154
నాశయే చ్ఛుక్లరోగాంశ్చ విజానీయా ద్విశేషతః, (శారీరే)

తా. రసాంజనము కన్నులబెట్టిన కంటిపొరలు, కాచము, కంటిపుసి, ఎఱుపు, అర్జునము, నీరుగారుట, అర్మరోగము, రేజీకటి, దురద కండ్లంటుకొనుట-వీనిని హరింపంజేయును. మఱియు అడవిమొల్లగంధమును కన్నులబెట్టిన కంటినొప్పి, వర్మరోగము, పువ్వులు-వీనిని హరింపంజేయును.

గిరికర్ణికాద్యంజనము

సితగిరికర్ణిమూలం బీజం పుష్పాణి పేషయేద్వర్తిమ్. 155
శఖం నిశాభయం శుంఠీ గతమపి చక్షుర్నివర్తయేత్, (అన్యశాస్త్రే)

తా. తెల్లగంటెనవేరు, దానివిత్తులు, పువ్వులు, శంఖము, పసపు, కరక్కాయ, శొంఠి - వీనిని సమభాగములుగ గ్రహించి గంటెనవేరురసముతో మర్దించి కన్నుల బెట్టిన పోయినకన్నులుకూడ మరల వచ్చును.

కుమారికావర్తి

అశీతి స్తిలపుష్పాణి మరిచానిచ షోడశ. 156
పంచాశ జ్జాతిపుష్పాణి షష్టిః పిప్పలితండులాః,
*ఇయం చంద్రప్రభానామ వర్తిస్తిమిరనాశినీ. (మతాంతరే)

తా. నువ్వులపువ్వులు ౮౦, మిరియాలు ౧౬, జాజిపువ్వులు ౫౦, పిప్పలి బియ్యము ౬౦-ఇటుల వీనినెల్ల నూరి కణికలుజేసి కన్నులబెట్టిన తిమిరములు హరించును.

* ఏషాకుమారికావర్తి ర్గతం చక్షు ర్నివర్తయేత్. పోయినకండ్లుకూడా మరల వచ్చును.

### శిలాద్యంజనము

శిలా మాగధి కర్పూరం పురాణం తింత్రిణీఫలం,
కరంజం సూరసూత్రేణ దివానక్షత్రదర్శనమ్. (సూరసూత్రే) 158

తా. శుద్ధిజేసినమణిశిల, పిప్పళ్ళు, పచ్చకర్పూరము, ప్రాతచింతపండు, క్రానుగ విత్తులు-వీని నుదకముతో నూరి కన్నులబెట్టిన పగటియందు నక్షత్రములు గనుపించును.

### నారికేళాంజనము

దార్వీవరా మధుక మంభసి నారికేళే
పక్త్వాష్టభాగ పరిశిష్టరసం పునస్తత్,
సాంద్రం విపాచ్య శశి సైంధవమాక్షికాఢ్యం
*హంత్యర్మ కాచ తిమిరార్బుద వర్త్మరోగాన్. (భేషజకల్పే) 159

తా. మ్రానిపసపు, కరక తాండ్ర యుసిరికలు, యష్టిమధుకము-వీనిని దిను సొకటింటి కొక్కొకపలముచొప్పున నలగగొట్టి కుంచెడు నారికేడపుకాయ నీటిలో వైచి ఎనిమిదవభాగము శేషించునటుల కషాయము గాచి మఱియొకకుండలోపోసి సన్నపుసెగను సోలెడు శేషించునటుల గాచి చల్లార్చి యందు నాలుగు మాడలయెత్తు పచ్చకర్పూరము, మాడయెత్తు సైంధవలవణము, ఐదుచిన్నములయెత్తు తేనె గలిపి కన్నుల బెట్టిన అర్మము, కాచము, తిమిరము, అర్బుదము, వర్త్మరోగము (నీరుగారుట)-వీనిని వారింపం జేయును.

### నేత్రరోగములకు మహానారికేళాంజనము

మధుకవరా దార్వీణాం పృథక్పలానాం నారికేళసలిలస్య,
ప్రస్థే విపచే దేతత్తుల్యాంశం తత్పునః పచేత్పాత్రే. 160
తుత్థం శశి ఫేన గైరిక సింధూత్థ రసాంజనాని మరిచంచ,
పృథకప్రథ క్పాదనిష్కం క్షిపే దాలోడ్య మాక్షిక విప్లుతమ్.
అంజన మఖిలేనేత్రే షడధికనవతిం నిహంత్యాశు, (ఆయుర్వేదే)

తా. యష్టిమధుకము, కరక తాండ్ర యుసిరికలు, మ్రానిపసపు-వీనిని దిను సొక్కొకపలముచొప్పున దంచి ౧ ప్రస్థపు నారికడపుకాయ నీటిలో వైచి ఎనిమిదవ భాగము మిగులునటుల కషాయము గాచి మరియొకకుండలోపోసి సన్నపుసెగను మరల గాచి ౫ పలములుగ దించికొని చల్లార్చి పిదప యందు శుద్ధిచేసిన మైలుతుత్థము, పచ్చ కర్పూరము, సముద్రపునురుగు, కావిరాయి, సైంధవలవణము, రసాంజనము, మిరియాలు

---

* యుంజాద్వ్రణార్తి తిమిరార్తిషు పిత్తజేషు—పిత్తమువలనగలిగిన నేత్రవ్రణ ము, తిమిరము.

అనువాని చూర్ణమును దినుసుకు కాలునిష్కముచొప్పున గలిపి తేనె ఒకటిన్నర తులము పోసి కన్నులబెట్టిన ౯౬ నేత్రరోగములు హరించును.

శంఖాదివటికములు

శంఖస్యభాగా శ్చత్వార స్తదర్థం చ మనశ్శిలా. 162
మనశ్శిలార్థం మరిచం మరీచార్థం చ * సైంధవం,
అజాక్షీరేణ సంమర్ద్య ఘుటికాం కారయే ద్బుధః. 163
నిశాంధ్యం తిమరం కాచం పుష్పాణి పటలాని చ,
అతిమాంసాని రక్తాని సప్తరాత్రేణ నాశయేత్. 164
వారిణా తిమిరం హంతి హ్యర్బుదం హంతి మస్తునా,
పిచ్చటం మధునా హంతి స్త్రీక్షీరేణ తథార్జునమ్. (ఆయుర్వేదే)

తా. శంఖము ౪ భాగములు, శుద్ధిజేసిన రక్తమణిశిల ౨ భాగములు, మిరియాలు ౧ భాగము, సైంధవలవణము ½ భాగము-ఇటుల వీనినెల్ల నేకముజేసి మేకపాలతో మర్దించి కణికలుజేసి కన్నులబెట్టిన రేజీకటి, కండ్లు గానరాకుండుట, కాచము, కంటిపూలు, పొరలు, దుర్మాంసములు, కంటి యెఱుపులు ఏడుదినములలో హరించును. నీళ్ళతో జాదివేసిన తిమిరము హరించును. పెరుగుమీది నీళ్ళతో జాదివేసిన అర్బుదము హరించును. తేనెతో జాదివేసిన పిచ్చటమను నేత్రరోగము, చనుబాలతో జాదివేసిన అర్జునము హరించును.

పుష్పాంజనము

మంజిష్ఠా మధుకోత్పలం దధి కణా త్వక్చవ్య గోరోచనం
మాంసీ చందన శంఖకం గ్గిరిమృదా తుత్థం సపుష్పాంజనం,
సర్వంచైవ సమాన మంజనమిదం యోజ్యం సదా చక్షుషాం
కండూం క్లేదమలం చ శోణిత రుజం పిల్లం చ శుక్లాపహమ్. 166

తా. మంజిష్ఠ, అతిమధురము, కలువపువ్వు, పెరుగు, పిప్పలి, లవంగపట్ట, చవ్యము, గోరోచనము, జటామాంసి, చందనము, శంఖము, కావిరాయి, శుద్ధిజేసిన మైలుతుత్థము, పుష్పాంజనము - వీనిని సమభాగములుగ నూరి నేత్రములయందు సదా అంజనమువేయుచుండిన దురద, నీరుగారుట, కంటిపుసి, ఎఱుపు, కంటినొప్పి, పిల్లము, శుక్రము హరించును.

గోదంతాద్యంజనము

గోదంతం కుక్కుటాండం మకరజదశనం శంఖచూర్ణం వరాటం
సారంగోద్భూతదంతా జలధిమలయుతం తామ్రచూర్ణం సతుత్థమ్.

* పిప్పలీ.

కర్పూరం రాస్నకం వై పటిక మణిమధూచ్ఛిష్ట మందాగ్నిఘృష్టే
పుష్పంచార్మార్జునం త త్తిమిర పటలకం కాచకం హంతి నేత్రే. 167

తా. ఆవుయొక్క దంతము, కోడిగ్రుడ్డుపెంకులు, మొసలిదంతము, శంఖచూర్ణము, గవ్వలచూర్ణము, జింకపండ్లు, సముద్రపునురుగు, తామ్రచూర్ణము, శుద్ధిజేసిన మైలుతుత్థము, పచ్చకర్పూరము, సన్నరాస్నము, చంద్రకాంతమణి, జుంటిమైనము - వీనిని పాత్రలో నిడి మందాగ్నిపై నునిచి బాగుగ మర్దించి పిదప నిమ్మపండ్లపులుసుతో మర్దించి కణికలుజేసి నేత్రములయం దంజనమువేసిన కంటిపువ్వులు, అర్మము, అర్జునము, తిమిరము, కంటిపొరలు, కాచము వీనిని హరింపంజేయును.

## ధాత్ర్యంజనము

ధాత్రీ పథ్యా విభీతానాం ఫలమజ్జా విచూర్ణితం,
వారిణాపూరితంచక్షు స్తిమిరంహంతినిర్భరమ్. (మాధవనిదానే) 168

తా. ఉసిరికపప్పు, కరక్కాయ, తానికాయ - వీనిపప్పును చూర్ణముజేసి నిమ్మపండ్లరసముతో మర్దించి కణికలుజేసి నేత్రములయం దంజనము వేసిన కండ్లలో నీరుగారుట, తిమిరము హరించును.

## ఉత్పలాద్యంజనము

ఉత్పలం సైంధవం రక్తచందనం త్రిఫలా తథా,
నిశాంధ్యం తిమిరం హంతి పటలం చక్షురంజనమ్. 169

తా. కలువపువ్వులు, సైంధవలవణము, రక్తచందనము, త్రిఫలములు - వీనిని నిమ్మపండ్లరసముతో మర్దించి అంజనమువేసిన రేజీకటి, తిమిరము, కంటిపొరలు హరించును.

## అర్ధచంద్రోదయము

కర్పూరం పటికం శంఖం చందనం మధు శారిబా,
మంజిష్ఠా రజనీ ద్వేచ కతకం గైరికం సమమ్. 170
సర్వైస్సమం చ తుత్థం చ జంబీరరసమర్దితం,
రాత్ర్యాంధ్యం తిమిరం కండూాం పటలం కాచమేవచ. 171
వర్త్మాంతే జాయతే పుష్పం మాసేనైకేన శామ్యతి,
అర్ధచంద్రోదయో నామ్నా సర్వనేత్ర రుజాపహః. 172

తా. పచ్చకర్పూరము, పటిక, శంఖము, చందనము, యష్టిమధుకము, సుగంధపాల, మంజిష్ఠ, పసపు, మ్రానిపసపు, చిల్లగింజ, కావిరాయి-ఇవి సమభాగములు, వీని కన్నిటికి సమము శుద్ధిజేసిన మైలుతుత్థము - ఇటుల వీనిని ఖల్వములో నునిచి నిమ్మపండ్ల రసముతో మర్దించి అంజనమువేసిన రేజీకటి, తిమిరము, దురద, పొరలు, కాచము,

కంటిరెప్పకొనయందు జనించురోగము, పుష్పులు మొదలగు సర్వనేత్రరోగములు ఒకమాసములో హరించును. (శుద్ధిచేసిన మైలుతుత్థము మూడేగానులయెత్తు, శుద్ధిచేసిన కఫరి ౧ తులము, శుద్ధిచేసినపటిక ౧ తులము, పదిజీడిగింజలమసి - ఇటుల వీనినెల్ల నిమ్మపండ్లరసముతో మర్దించి రాగితట్టలో నునిచి ఆవువెన్న గలిపి రాగిముంతతో మరల మర్దించి ౨౩ దినములు కరాటమున నునిచి పిదప దానిదీసి మరల మర్దించి మరల కరాటమున 33 దినము లునిచి కన్నులబెట్టిన నేత్రరోగములు, మాదకండ్లు, దూలమాదలు, తిమిరమాదలు, పుసిమాదలు, నీరుగారుట, దురద, కామిల, పసరుకామిల, రేజీకటి, పటలములు, శిరోవాతములు, కపాలశూలలు, కన్నులదురుట, పక్షాఘాతము, శిరోవాతము, దుర్మాంసము, కంటియెఱుపు, నిల్లువుకండ్లు, పిల్లములు, అభిష్యందము హరించును.

కాయకండ్లకు చికిత్స

సీ. పెనురేకు తాళకంబును రక్తమణిశిల పసపును మిరియంబు పటిక శంఖ
గంధకసారంబు సైంధవలవణంబు సమభాగములుగూర్చి జంబుఫలము
సారంబుతో నూరి సరవిగా మర్దించి కణికలుచేసియుఁ గన్నుఁగవల
గంధంబుదీసియుఘటియింపఁగాఁగాయకన్నులుదుర్మాంసగతులుపొరలు

గీ. గప్ప నవియును నెఱుఁగనికన్నుఁగవలు
నిశి విరిసి నీరు గారెడినేత్రములును
గంటిపువ్వులు మానుఁ బ్రఖ్యాతముగను
బ్రజలకెల్లను నానందప్రచురముగను.

సీ. ఘనతామ్రభస్మంబు గరకకాయలుజీడిగింజలమసియును మంజులముగ
వెన్నతోఁగూరిచి వెస రాగిముంతపై దగ మర్దనముచేసిధరణియందు
నక్షిరోగులకండ్ల నమరంగవైచిన కామిళ్ళు మాదలు కండ్లదూల
మాదలు తిమిరంపుమాదలుపుసిమాదదుర్మాంసరేచిక్కుదురదకండ్లు

గీ. నేత్రవాతంబు లెఱుపులు నేత్రశూల
పక్షవాత శిరోవాత పసరుకామి
లలు కపాలంపుశూల లత్యలఘుపన్ని
గండమాలలు మరి నూతిపుం డ్లడంగు.

నేత్రరోగములకు నృపవల్లభతైలము

ఏరండమూలం తగరం శతాహ్వా జీవంతిరాస్నాసహాసైంధవంచ,
భృంగం విడంగం మధుయష్టికంచ విశ్వౌషధంకృష్ణతిలస్యతైలమ్.

అజాపయస్తైలవిమిశ్రితంచ చతుర్గుణం భృంగరసంచ యుక్తమ్,
షడ్బిందవో నాసికయోర్విధేయా శ్శీఘ్రం నిహన్యుశ్శిరసోవికారాన్.
చ్యుతాంశ్చకేశాన్ పలితాంశ్చదంతాన్ దుర్గంధమూలాంశ్చవ్యపా
కరోతి, సుపర్ణదృష్టిప్రతిమంచచక్షు శ్శిరో ర్తినాశంచకరోతిసమ్యక్.
(మాధవనిదానే)

తా. ఆముదపువేరు, గ్రంథితగరము, సదాప, మనుబాల, దుంపరాస్నము, సైంధవలవణము, గుంటగలగర, వాయువిడంగములు, యష్టిమధుకము, శొంఠి - వీనిని సమభాగములుగ చూర్ణముచేసి యందు నల్లనువ్వులనూనె, మేకపాలు, శిలాజిత్తు, నూనెకు నాలుగింతలు గుంటగలగరాకురసము గలిపి చిక్కగ తైలము ౬ బిందువులను నస్యముజేయించిన శిరోరోగమును శీఘ్రముగ నశింపజేయును. మఱియు రాలి పోయినవెంట్రుకలు మరల మొలచును. నెరిసినవెంట్రుకలు నల్లగనగును. దంతమూలముల యందలి దుర్గంధము హరించును. నేత్రరోగములు మాని గరుత్మంతునితో సమానమైన దృష్టిగలుగును. తలనొప్పి హరించును.

### యష్ట్యాదితైలము

యష్టీకుష్ఠ మధూక చోరక వరా గోపీ విదారీ బలా
మోచాంభోరుహకంద కేసర నతం శీతాంబు పాండూత్పలైః,
శ్రీఖండేనయుతై శ్శృతం తిలభవం ధాత్రీ గుళూచీ జయా
భాంగీదుగ్ధసమం శిరోనయనజా న్నస్యాత్సమస్తాన్ గదాన్. 176

తా. యష్టిమధుకము, చెంగల్వకోష్టు, ఇప్పపువ్వులు, కచోరములు, పిల్లిపీచర, గూడపాల, నేలగుమ్ముడుగడ్డ, ముత్తవపులగము, పెద్దముత్తవపులగము బూరుగబంక, తామరగడ్డలు, తామరగరులు, గ్రంథితగరము, కురువేరు, తెల్లకలువగడ్డ, శ్రీగంధము, ఉసిరికపప్పు, తిప్పతీఁగె, కరక్కాయలు - వీనిని సమభాగములుగ దంచి కషాయము గాచి దానికి సమముగ మేకపాలు, నూనె గలిపి చిక్కగగాచి నస్యము చేయించిన సర్వశిరోరోగములు, కంటినొప్పి, సర్వనేత్రరోగములు హరించును. (తిప్పతీఁగాకు, గుంటగలగరాకు, దొండాకు, తులసియాకు, నేలతులసియాకు, పొన్నగంటాకు అనువానియొక్కరసము దినుసుకొక్కొకభాగము, నెయ్యి ౬ వ భాగము గలిపి చిక్కగ కాచి నస్యముజేయించిన నేత్రరోగములు హరించును.

### నేత్రరోగములయందు పథ్యము

శాలితండుల గోధూమ ముద్గ సైంధవ గోఘృతమ్,

గోపయశ్చ సిడా క్షౌద్రం పథ్యం నేత్రగదే స్మృతమ్. 177

తా. వరిబియ్యము, గోధుమలు, పెసలు, సైంధవలవణము, ఆవునెయ్యి, ఆవు పాలు, పంచదార, తేనె ఇవి నేత్రరోగములయందు పథ్యకరంబులు.

## నేత్రరోగములయం దపథ్యము

సర్వశాక మథ క్షుష్యం చక్షుష్యం శాకపంచకమ్,
జీవంతీవాస్తు మత్స్యాక్షీ మేఘనాదః పునర్నవా. 178
అచక్షుష్యం భవేచ్ఛాక మచక్షుష్యం సురా దధి,
కథావై హింగు లవణం పిణ్యాకం పిష్టమాషకమ్. 179
స్నానవ్యాయామతానీయం తాంబూలం క్రోధఆతపః,
తేజోనిరీక్షణం జ్వాలా మక్షిరోగీ వివర్జయేత్. 180

తా. మనుబాల, చక్రవర్తికూర, పొన్నగంటికూర, చిట్టికూర, గలిజేరు అను వైదుతప్ప తక్కినయాకుకూరలు, సర్వమైన యాకుకూరలు, కల్లు, పెరుగు, ఇంగువ, ఉప్పు, తెలికపిండి, పిండివంటకములు, స్నానము, సంచారము, ఉదకపానము, తాంబూలము, కోపము, ఎండ, తేజస్సునుజూచుట, అగ్నిజ్వాల - వీనిని నేత్రరోగము గల వారు వర్జింపవలయును.

## సప్తదశ ప్రకరణమ్.



# అష్టాదశ ప్రకరణము



## స్థౌల్యరోగనిదానలక్షణచికిత్సాదయః.

శ్లో. భూతేశం సర్వభూతేశం నాయకం సర్వనాయకమ్,
దేవం దేవ మహాదేవం శంభుమూర్తి మహం భజే. 1

తా. భూతప్రేతపిశాచాదులకు ప్రభువు, పృథివ్యాది పంచభూతములకు ప్రభువు, నాయకుఁడు, సర్వప్రపంచమునకు నాయకుఁడు, సర్వదేవతలకు దేవుఁడు, మహాదేవుఁడు నగుపరమేశ్వరుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేరొంనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథము యొక్క అష్టాదశప్రకరణమును వచించుచున్నాఁడను.

### స్థౌల్యరోగనిదానము

అవ్యాయామ దివాస్వప్న శ్లేష్మాహారనిషేవణాత్,
*సస్నేహై ర్మధురై ర్మాంసై ర్మేదో వర్ధతి నాన్యథా. 3
మేదసావృతమార్గత్వా త్పుష్యం త్యన్యేన ధాతవః,
మేదస్తు చీయతే యస్మా దశక్త స్సర్వకర్మసు. (మాధవనిదానే) 4

తా. సంచారము సేయకుండుట, పగలు నిద్రించుట, కఫకరపదార్థముల సేవించుట, స్నేహయుక్తపదార్థములగాని, లేక జిగటగలపదార్థములగాని, లేక మధురకరసములగాని సేవించుట, మిక్కుటముగ మాంసమును భుజించుట - ఈకారణముల వలన మేదోరోగము జనించును. మఱియు, మేదస్సుచే మార్గము అడ్డగింపఁబడుట వలన నితరధాతువులు వృద్ధిజెందకుండును. దానంజేసి స్థౌల్యరోగముగలవాఁడు సర్వకర్మలయందు అశక్తుఁడగును. (రసవాహినీసిరోమార్గములయందు మేదస్సు వ్యాపించి అస్థిమొదలగువానికి శుక్రమునకు పోషణను గలుగంజేయకుండుటవలన మేదస్సు అధికాధికముగ వృద్ధిజెందును.)

---

* మధురోఽన్నరసః ప్రాయ స్స్నేహాన్మేదో వివర్ధతే.

### స్థౌల్యరోగలక్షణము

స్థూలత్వం తుందవృద్ధిశ్చ క్షుద్రశ్వాసః క్రమాద్భవేత్,
అతిస్వేదోఽల్పదౌర్గంధ్య మల్పప్రాణోఽల్పమైథునః. 5
ఆహారః పచ్యతే శీఘ్రం పునఃకాంక్షతి భోజనమ్,
వికారాంశ్చాశ్నుతే ఘోరాన్ కాంశ్చి త్కాలవ్యతిక్రమాత్. 6
అతిస్థౌల్యే తృషా మోహా జ్వరం వాథ భగందరమ్,
వ్రణం కృచ్ఛ్రం మేహాకుష్ఠం కాసం శ్వాసం కరోతిచ. 7
తత్ర మేదోఽనిలశ్లేష్మ నాశనం సర్వమిష్యతే,
శ్యామా యవకుళుత్థాన్నం ముద్గాన్నై స్సముపాచరేత్. 8
మధూదకై స్సురాపానై ర్లఘురూక్షోష్ణభోజనైః,
కటుతిక్త కషాయాతిచింతా వ్యాయామ జాగరైః. 9
లంఘనై రుపవాసై ర్వా స్థౌల్యరోగముపాచరేత్,

తా. శరీరము బలిసి కడుపు పెరిగి క్షుద్రశ్వాసము గలుగుట, మిక్కుటముగ చెమటబట్టుట, శరీర మొకింత కంపువేయుట, బలము తగ్గుట, మైథునశక్తి లేకుండుట, కొంతకాలము గడచినపిదప భయంకరములగు కొన్నివాతాదివికారములు గలుగుట, అతిస్థౌల్యము గలుగుట, దప్పి, మోహము, జ్వరము, భగందరము, వ్రణములు, మూత్రకృచ్ఛ్రము, మేహము, కుష్టువు, దగ్గు, ఉబ్బసము గలుగుట, మేదోరోగమువలన మేదస్సు, వాతశ్లేష్మములు మొదలగునవియన్నియు నశించుట—ఈలక్షణంబులు స్థౌల్యరోగమున గలుగునని తెలియవలయును. దీనిని చామలవంటకము, యవలు, ఉలవయన్నము, పెసరపులగము, పానకము, సురాపానము, లఘువై రూక్షకరమై యుష్ణముగ నుండు వంటకము, కారము, ఒగరు, చేదుగలద్రవ్యములు, మిక్కుటముగ చింతించుట, వ్యాయామము, జాగరణము, లంఘనము, లేక ఉపవాసము అనువానివలన నుపచరింప వలయును.

### మేదోవృద్ధిలక్షణము

క్షుద్రశ్వాస తృషా మోహ స్వప్న క్రథనసాధనైః. 10
యుక్తః క్షుత్స్వేదదౌర్గంధ్యై రల్పప్రాణోఽల్పమైథునః,

తా. మేదస్సు వృద్ధిఁజెందుచుండ క్షుద్రశ్వాసము, దప్పి, మోహము, నిద్ర, అకస్మాత్తుగ శ్వాసమునకు ప్రతిబంధము, లేక నిద్రించునపుడు బలముగ గురకలు విడుచుట, శరీరమున బడలిక, తుమ్ములు, చెమట, దౌర్గంధ్యము, అల్పశక్తి, అల్పమైథునము అనునవి గలుగును.

మేదస్తు సర్వభూతానా ముదరే ష్వస్థిషు స్థితమ్. 11
అతఏవోదరే వృద్ధిః ప్రాయో మేదస్వినో భవేత్,

తా. మేదస్సు విశేషముగ సర్వప్రాణులయొక్క యుదరమధ్యమునందును, అస్థులయందు నుండును. దానివలన మేదస్సుగలపురుషునికి విశేషముగ నుదరము వృద్ధిం జెందును.

### స్థూలలక్షణము

మేదో మాంసాతివృద్ధత్వా చ్చలస్ఫిగుదర స్తనః. 12
అయథోపచయోత్సాహో నరోఽతిస్థూల ఉచ్యతే,

తా. మేదస్సు మాంసము మిక్కుటముగ వృద్ధింజెందుటవలన నరునియొక్క స్ఫిక్కు, ఉదరము, స్తనములు నడుచునపుడు దిగబడి కదలుట, మునుపటివలె శరీరవృద్ధి, ఉత్సాహము లేకుండుట-ఈలక్షణములుగలిగిన స్థూలరోగమని తెలియవలయును.

### మేదరోగాసాధ్యత్వము

మేదస్యతీవ సంవృద్ధే సహసైవానిలాదయః. 13
వికారాన్ దారుణాన్ కృత్వా నాశయంత్యాశు జీవితమ్,

తా. మేదస్సు మిక్కుటముగ వృద్ధింజెందుటవలన వాతాదిదోషములు దుష్టంబులై యకస్మాత్తుగా భయంకరవికారముల (అనఁగా ప్రమేహ, పిటికా, జ్వర, భగందర, విద్రధివాతరోగముల) గలుగంజేసి తీవ్రముగ ప్రాణముల హరింపంజేయును.

### చవ్యాదిచూర్ణము

సచవ్య జీరక వ్యోష హింగు సౌవర్చలానలాః. 14
మధునాసక్తవఃపీతా మేదోఘ్నా వహ్నిదీపనాః, (మాధవనిదానే)

తా. చవ్యము, జీలకఱ్ఱ, త్రికటుకములు, ఇంగువ, సౌవర్చలవణము, చిత్రమూలము-వీనిని చూర్ణముజేసి తేనెతో సేవించిన స్థౌల్యము, అగ్నిమాంద్యము హరించును.

### త్రికటుకాదిచూర్ణము

త్ర్యూషణం కటుకం శిగ్రు బృహతీ కంటకారికా. 15
శాలిపర్ణీ పృశ్నిపర్ణీ వారాహీచ సువర్చలమ్,
ద్వినిశాతివిషా హింగు యవానీ జీరకద్వయమ్. 16
విళంగం హపుషా ధాన్యా సర్వం మేదోత్థితం జయేత్,

తా. త్రికటుకములు, కటుకరోహిణి, కారుమునగ, చిన్నములక, పెద్దములక కోలపొన్న, నక్కతోకపొన్న, నేలతాటిగడ్డలు, సౌవర్చలవణము, పసపు, మ్రానిపసపు-అతివస, ఇంగువ, కొడిసెపాల, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, వాయువిడంగములు, బోడతరము,

కొలిమెర్లు-వీనిని సమభాగములుగ దంచి చూర్ణముచేసి (దీనికి సమముగ లోహభస్మమును గలిపి నాలుగుమాడలయెత్తును తేనెతో) సేవించిన స్థౌల్యరోగము హరించును.

## గుళూచ్యాదిచూర్ణము

గుళూచీ మభయాం ముస్తాం క్షౌద్రైః కర్షం లిహేదను. 17

(అన్యశాస్త్రే)

తా. తిప్పతీఁగె, కరక్కాయలు, తుంగముస్తెలు-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి (దీనికి సమముగ లోహభస్మమును గలిపి) కర్షమెత్తును తేనెతో సేవించిన స్థౌల్యరోగము హరించును.

## తామ్రభస్మయోగము

మృతతామ్రం కణా క్షౌద్రం మాషమాత్రం నియోజయేత్,

(మతాంతరే)

తా. తామ్రభస్మము, పిప్పళ్ళు-వీనిని నూరి తేనెతో మాషమెత్తును సేవించిన స్థౌల్యరోగము హరించును.

## జయంత్యాదిచూర్ణము

వత్సామలకచూర్ణేన జయంతీవా జయాభయా. 18

భక్షయే న్నాశయేత్ స్థౌల్యం మద మేదోత్థితాన్ గదాన్,

తా. కొండిసెపాల, ఉసిరికపప్పు, తక్కలి వీనినిగాని, లేక తక్కలి, కరక్కాయ అనువానినిగాని సమభాగములుగ దంచి చూర్ణముజేసి (ఉదకముతో) సేవించిన స్థౌల్యరోగము హరించును.

## గుగ్గుల్వాదిచూర్ణము

గుగ్గులు త్రిఫలా త్ర్యూషం వహ్ని ముస్తా విడంగకమ్. 19

తుల్యాంశం భక్షయేత్కర్షం మేదశ్లేష్మ మదాత్యనుత్, (బాహటే)

తా. శుద్ధిచేసిన మహిసాక్షిగుగ్గిలము, త్రిఫలములు, త్రికటుకములు, చిత్రమూలము, తుంగముస్తెలు, వాయువిడంగములు - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి కర్షమెత్తును (తేనెతో) సేవించిన మేదస్సు, శ్లేష్మరోగము, మదాత్యయము హరించును.

## గంధకకల్పము

గంధకం మధుతైలంచ కర్షమాత్రం లిహేత్సదా. 20

మేదో వాత కఫం హంతి మాసమాత్రే న సంశయః, (గ్రంథాంతరే)

తా. శుద్ధిజేసినగంధకమును ఇప్పనూనెతో మర్దించి కర్షమెత్తును సేవించిన నొక మాసములో స్థౌల్యరోగము, వాతకఫరోగములు నిశ్చయముగ హరించును.

### స్థూలాంతకరసము

వంధ్యా కర్కోటకీకంద ద్రవైర్మర్ద్యం దినత్రయమ్. 21
తాళకంచ మృతంతామ్రం ద్విగుంజం మధునా లిహేత్,
పిబే త్క్షారోదకంచాను స్థౌల్యరోగం వినాశయేత్. 22
(పూజ్యపాదీయే)

తా. శుద్ధిచేసినతాళకము, తామ్రభస్మము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గొడ్డుకాకరగడ్డరసముతో మూడుదినములు మర్దించి రెండుగురిగింజలయెత్తు మాత్రలుజేసి యందొకదానిని తేనెతో భక్షించి వెంబడిగ ఉప్పునీరును త్రాగిన స్థౌల్యరోగము హరించును.

### స్థౌల్యరోగహరోపాయములు

శ్రమ చింతా వ్యవాయాధ్వ క్షౌద్ర జాగరణం స్త్రియః,
హంత్యవశ్యమతిస్థౌల్యం యవశ్యామాకభోజనమ్. 23

తా. శ్రమ, చింత, మైథునము, మార్గగమనము, తేనె, జాగరణము, స్త్రీ, యవలు, శ్యామపంటకము అనువానిసేవనవలన స్థూలరోగము హరించును.

### బడబాగ్నిరసము

శుద్ధసూతం మృతంతామ్రం తాళం బోళ సమంసమమ్,
అర్కక్షీరై ర్దినం మర్ద్యం క్షౌద్రై ర్లేహ్యం ద్విగుంజకమ్. 24
బడబాగ్నిరసోనామ స్థౌల్యబృందం నియచ్ఛతి,
పలం క్షౌద్రపలం తోయ మనుపానం పిబేత్సదా. 25

తా. రసభస్మము, తామ్రభస్మము, శుద్ధిచేసినతాళకము, రక్తబోళము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి జిల్లేడుపాలతో నొకదినము మర్దించి రెండుగురిగింజల యెత్తు మాత్రలుజేసి తేనెతో సేవించి వెంబడిగ నొక *పలప్రమాణ ముదకములో పల ప్రమాణము తేనెగలిపి త్రాగిన స్థౌల్యరోగము హరించును.

### రసభస్మయోగము

రసభస్మ వల్లమాత్రం లీఢ్వా మధునా పిబేదనుక్షౌద్రమ్,
కోష్ణాంబునా సమేతం తత్స్థౌల్యం మేదకృతం జయతి. 26

తా. వల్లప్రమాణ రసభస్మమును తేనెలోకలిపి సేవించి వెంబడిగ సుఖోష్ణముగ నుండు నుదకములో తేనెగలిపి త్రాగిన స్థూలరోగము హరించును.

---

* పలమన - నాలుగురూపాయలయెత్తు.

## త్రిమూర్తిరసము

సూతం గంధ మయోభస్మ సమం సంయోజ్య భావయేత్,
నిర్గుండీపత్రతోయేన ముసలీకంద వారిణా. 27
తత స్సిద్ధ మముం మాషమాత్రం రసమనుత్తమం,
లోధ్ర క్షౌద్రేణ చాశ్నీయాచ్చూర్ణం మాషోన్మితం హితమ్. 28
త్రికటు త్రిఫలా పంచలవణా వల్గుజంచ తత్,
మేద శోథాగ్ని మాంద్యామ వాతశ్లేష్మగద ప్రణుత్. (ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, లోహభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి వావిలియాకు, నేలతాటిగడ్డలు అనువానిరసములో ప్రతిదానిచే భావనచేసి మాషమెత్తును, మాషమెత్తు లొద్దుగచూర్ణము, తేనె అనువానియనుపానముతోడ సేవించి పిదప త్రికటుకములు, మోడి, చవ్యము, చిత్రమూలము, త్రిఫలములు, పంచలవణములు, భావంచివిత్తులు అనువానిచూర్ణమును భక్షించిన మేదస్సు, వాపు, అగ్నిమాంద్యము, ఆమవాతము, కఫరోగము-వీనిని హరింపంజేయును.

## మేదోరోగమునందు పథ్యము

చింతా శ్రమం జాగరణం వ్యవాయం ప్రోద్వర్తనంలంఘనమాతపశ్చ,
హస్త్యశ్వయానం భ్రమణం విరేకః ప్రచ్ఛర్దనం చాప్యథతర్పణంచ. 30
పురాతనావైణవకోరదూష శ్యామాకనీవార ప్రియంగుచూర్ణాః,
యవాఃకుళుత్థాశ్చణకామసూరా ముద్గాస్తువర్యస్తుమధూనిలాజాః. 31
కటూనితిక్తానికషాయకాని తక్రంసురాపింగళమత్స్యఏవ,
దగ్ధానిదార్తాకఫలానిచాపి ఫలత్రయంగుగ్గులుపాలసంచ. 32
కటుత్రయంసర్షపతైలమేలా క్షారాణిసర్వాణ్యపిచాక్షతైలమ్,
పత్రోత్థశాకాగరుదీపనాని ప్రతప్తనీరాణిశిలాజతూని. 33
ఏతానిసర్వాణినిషేవితాని మేదోగదంసత్వరమాక్షిపంతి, (ఆయుర్వేదే)

తా. చింత, శ్రమ, జాగరణము, స్త్రీసంగమము, నలుగుబెట్టుకొనుట, లంఘనము, ఎండ, ఏనుగు, గుఱ్ఱముమొదలగువానినెక్కి సంచరించుట, విరేచనము, వాంతి, * తర్పణక్రియ, ప్రాతవెదురుబియ్యము, ఆరికలు, చామలు అనుధాన్యము, నీవారధాన్యము, కొఱ్ఱలు, జొన్నలు, యవలు, ఉలవలు, శనగలు, చిఱుశనగలు, పెసలు, కందులు, తేనె, పేలాలు, కారము, చేదు, ఒగరు గలరసములు, మజ్జిగ, మద్యము, పింగళవర్ణముగల మత్స్యములు, కాయించినవంకాయలు, త్రిఫలములు, గుగ్గిలము

---

* తర్పణ మన తృప్తికర మగునౌషధములతో జికిత్సించుట.

పాయసము, త్రికటుకములు, తెల్లావనూనె, ఏలకులు, సర్వక్షారములు, గచ్చనూనె, ఆకుకూరలు, అగరులేపనములు, ఓమము, ఉష్ణోదకము, శిలాజిత్తు అనువానిసేవనవలన మేదోరోగము హరించును.

**మేదోరోగమునం దపథ్యము**

స్నానం రసాయనం శాలీ౯ గోధూమా౯ సుఖశీలతాం,
క్షీరేక్షువికృతిం మాషా౯ స్త్రాహిత్యం స్వేదనానిచ. 34
మత్స్యం మాంసం దివానిద్రాం సుగంధా న్మధురాణిచ,
అతిమాత్రంతు పచితం త్వశేషా ద్వమనక్రియామ్. 35
స్వభావస్థా త్వమన్విచ్ఛ౯ మేదస్వీ పరివర్జయేత్,

తా. స్నానము, రసాయనము, శాలిబియ్యము, గోధుమలు, సుఖము, పాలు, చెఱకువలన నుత్పత్తిజేయఁబడుపదార్థములు, ఉద్దులు, తృప్తికరభక్షణము, చెమట దీయుట, మత్స్యములు, మాంసములు, పగటినిద్ర, సుగంధపదార్థములు, మధురాన్నము, చిమిడినయన్నము, వమనము-వీనిని మేదోరోగముగలవారు వర్జింపవలయును.

**కార్శ్యమునం దుపచారము**

కృశానాం బృంహణం దేయం సర్వపానాన్న భేదజైః. 36
నిద్రాచైవ దివారాత్రౌ ఛాగమాంసాశనం సదా, (ఆయుర్వేదే)

తా. కార్శ్యరోగమున హితకరాన్నపానాద్యౌషధములవలన బృంహణక్రియను జేయించుటయేగాక రేయుంబగలు నిద్రించునటులం జేయవలయును. మఱియు మేక మాంసము నెల్లపుడు భుజింపంజేయవలయును.

**కృశత్వమునకు పూర్ణచంద్రరసము**

మృతసూతాభ్ర లోహానాం శిలాజతు విశంగకమ్. 37
తాప్యం క్షౌద్రం సమం సర్పి రేకీకృత్య విమర్దయేత్,
పూర్ణచంద్రరసోనామ మాషైకం భక్షయే త్సదా. 38
శాల్మలీపుష్పచూర్ణంతు క్షౌద్రం కర్షం లిహేదను,
దుర్బలో బలమాప్నోతి మాసైకేన యథా శశీ. 39

తా. రసభస్మము, అభ్రకభస్మము, లోహభస్మము, శుద్ధిజేసినశిలాజిత్తు, వాయు విడంగములు, శుద్ధిజేసినస్వర్ణమాక్షికము, తేనె, నెయ్యి-వీనిని సమభాగములుగ ఖల్వ ములో నునిచి మర్దించి మాషప్రమాణమంత మాత్రలుజేసి యందొకదానిని కర్షప్రమా ణము బూరుగపువ్వుచూర్ణములో తేనె కలిపి ఈయనుపానముతోడ నొకమాసమువఱకు సేవించుచుండిన శరీరదార్ఢ్యముగలిగి చంద్రునివలె వృద్ధిం బెందును.

### కార్శ్యాపోటకరసము

రసభస్మ ద్వి ధా గంధ ముభౌ మర్ద్యా గవాంజలైః,
తేన పీతవరాటాని పూరయిత్వాథ టంకణమ్. 40
అశ్వగంధి పలైకంతు గవాంక్షీరైః పిబేదను,
కార్శ్యాపోటమితి ఖ్యాతం దుర్బలే బలదాయకమ్. (సిద్ధరసార్ణవే) 41

తా. రసభస్మము ౧ భాగము, గంధకము ౨ భాగములు-ఈరెంటిని ఖల్వములో నునిచి ఆవుపంచితముతో మర్దించి పచ్చనిగవ్వలలో నునిచి దానిపై వెలిగారమును నూరి మెత్తి పుటంబిడి సాంగశీతలమునదీసి యందొక గురిగింజయెత్తునుసేవించి వెంబడిగ నొక పలము పెన్నేరుగడ్డచూర్ణములో నావుపాలు కలిపి త్రాగిన కృశత్వము హరించి బలము గలుగును.

ముసలీ హయ గంధాభ్యాం మాషైకం సితయాయుతం,
భక్షయిత్వా పిబేచ్చాను క్షీరాజ్యం శర్కరాయుతమ్. 42
పుష్టిప్రదం కృశానాం తు దుర్బలత్వం నియచ్ఛతి, (మాధవదానే)

తా. నేలతాటిగడ్డ, పెన్నేరుగడ్డ, పంచదార-వీనిని సమభాగములుగ జేర్చి మాష ప్రమాణమును, పాలు, నెయ్యి, పంచదార అనుపానియనుపానముతోడ సేవించిన శరీర కృశత్వము హరించి పుష్టిగలుగును.

విష్ణుక్రాంతా మూలకంతు ఖాదేన్ముష్టిం బలం భవేత్. 43
బ్రహ్మదండ్యాశ్చ పాదాగ్రం క్షీరం పీత్వా బలప్రదం,
(సిందూరమణిదర్పణే)

తా. పిడికెడు విష్ణుక్రాంతపువేరును పావుసేరు ఆవుపాలతోనూరి సిందూరము కలిపి సేవించినను, లేక బ్రహ్మదండివేరును ఆవుపాలతోనూరి సిందూరము గలిపి సేవించినను కృశత్వము హరించి బలము గలుగును.

### కృశత్వరోగముగలవారికి ఉద్వర్తనము

రసం గంధం సమం శుద్ధం విష్ణుక్రాంతా ద్రవైర్దినమ్. 44
అలక్తాగస్తిజద్రావై స్త్రీస్తన్యేన విమర్దయేత్,
మథ్వాజ్యయవసంయుక్త మేతదుద్వర్తనం హితమ్. 45
కార్శ్యం జయతి షణ్మాసా ల్లేపనా న్మేదసం తథా, (రసరత్నాకరే)

తా. రసము, గంధకము-వీనిని శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వములో నునిచి విష్ణుక్రాంతరసముతో నొకదినము మర్దించి పిదప లత్తుకకషాయము, అగస్తిరసము, చనుబాలు

అనువానితో మర్దించి తేనె, నెయ్యి కోడిసెపాలు కలిపి ఆరుమాసములు శరీరమునకు లేపనముసేయుచుండిన కృశత్వము, స్థౌల్యరోగము హరించును.

ఉద్వర్తనము

భూతాంకుశస్య మూలంతు కృష్ణగోమూత్ర పేషితమ్. 46
అంగేషూద్వర్తనం నిత్యం వృద్ధి పుష్టి బలం భవేత్,

తా. భూతాంకుశపువేరును నల్లావు పంచితముతోనూరి ప్రతిదినము శరీరమున లేపనముసేయుచుండిన కృశత్వము హరించి వృద్ధి, పుష్టి, బలము గలుగును.

మదాత్యయనిదానము

యే విషస్యగుణాః ప్రోక్తా స్తేఽపి మద్యే ప్రతిష్ఠితాః. 47
తేన మిథ్యోపయుక్తేన భవత్యుగ్రో మదాత్యయః,
కింతు మద్యం స్వభావేన యథైవాన్నం తథా స్మృతమ్. 48
అయుక్తియుక్తం రోగాయ యుక్తియుక్తం యథామృతం,
(ఆయుర్వేదే)

తా. విషమునకు చెప్పంబడిన పదిగుణములు మద్యమునందుండును. అట్లగుటంజేసి మద్యమును విధివిహీనముగ పానము సేయుటవలన నుగ్రమైన మదాత్యయరోగము జనించును. మఱియు మద్యము స్వభావమువల్ల నన్నముతో దుల్యంబై యుండును. ఐనను విధివిహీనముగ పానముసేయుటవలన రోగము జనించును విధిపూర్వకముగ పానముజేసిన నన్నమువలె నమృతతుల్యంబగును. ఎట్లన—"శ్లో. ప్రాణాః ప్రాణభృతా మన్నం తదయుక్త్యా నిహం త్యసూన్, విషం ప్రాణహరం తచ్చ యుక్తియుక్తం రసాయనమ్." అనఁగా సర్వప్రాణులయొక్క ప్రాణ మన్నాశ్రయంబై యుండుటచే నన్నమే ప్రాణస్వరూపంబు. ఐనను దానిని ప్రమాణాతీతముగ భుజించిన ప్రాణముల నశింపంజేయును. మఱియు విషము సగా ప్రాణమును హరింపంజేయును. ఐనను దానిని యథాశాస్త్రముగ సేవించిన నది రసాయనతుల్యంబై శరీరధారణమును సేయుచుండుననుట. దానికి ప్రమాణంబెద్ది యనిన, "శ్లో. విధినామాత్రయాకాలే హితైరన్నైర్యథాబలమ్, ప్రహృష్టోయఃపిబేన్మద్యం తస్య స్యాదమృతం యథా, స్నిగ్ధైస్సదన్నైర్మాంసైశ్చ భక్ష్యైశ్చ సహసేవితమ్, భవేదాయుఃప్రకర్షాయ బలాయూపచయాయచ." యథోక్తవిధిగ ప్రమాణానుగుణ్యముగ యథాకాలమునందుగాని, లేక శరీరప్రకృతికనుగుణ్యముగగాని సేవింపఁబడినయన్నము బలమును గలుగంజేయును. ఇట్లైఅగుననే మద్యము స్నిగ్ధమై ప్రకృతి కనుగుణ్యమై యుండును. అనఁగా మాంసయుక్తముగగాని భక్ష్యయుక్తముగగాని సేవింపఁబడినమద్యమమృతతుల్యంబై సంతోషమును, ఆయుర్వృద్ధిని, బలమును, వృద్ధిని గలుగంజేయును.

కామ్యతా మనసస్తుష్టి స్తేజో విక్రమఏవచ. 49
విధివ త్సేవ్యమానేతు మద్యే సంతి హితాగుణాః,

తా. మద్యమును విధిపూర్వకముగ సేవించిన సౌందర్యము, మనస్సంతోషము, ఉత్సాహము, పరాక్రమము-వీనిని గలుగంజేయును. (ఆహారమును వర్జించి యెల్లపుడు మద్యమును పానము సేయుచుండుటవలన పలువిధవికారములు జనించి శరీరమును నశింపంజేయును.

వాతమదాత్యయలక్షణము

హిక్కా శ్వాస శిరఃకంప పార్శ్వశూల ప్రజాగరైః. 50
విద్యా ద్బహుప్రలాపస్య వాతప్రాయం మదాత్యయం,

తా. ఎక్కిళ్ళు, శ్వాసము, తలవణుకు, పార్శ్వశూల, నిద్రాభంగము, కడుప్రలాపము అనునీలక్షణంబులుగలిగిన వాతమదాత్యయమని తెలియవలయును.

పిత్తమదాత్యయలక్షణము

తృష్ణా దాహ జ్వర స్వేద మోహాతీసార విభ్రమైః. 51
విద్యా ద్ధరితవర్ణస్య పిత్తప్రాయం మదాత్యయం,

తా. దప్పి, దాహము, జ్వరము, చెమట, మోహము, అతిసారము, భ్రమ, శరీరమున కాకుపసపువర్ణము అనునీలక్షణంబులుగలిగిన పిత్తమదాత్యయమని తెలియవలయును.

కఫమదాత్యయలక్షణము

ఛర్ద్యరోచక హృల్లాస తంద్రా స్తైమిత్య గౌరవైః. 52
విద్యా చ్ఛీతపరీతస్య కఫప్రాయం మదాత్యయం,

తా. వాంతి, అరుచి, జొల్లుగారుట, తంద్ర, స్తబ్ధత్వము, జడత్వము, శీతప్రాబల్యము అనునీలక్షణంబులుగలిగిన కఫమదాత్యయమని తెలియవలయును.

త్రిదోషజమదాత్యయలక్షణము

జ్ఞేయ స్త్రిదోషజశ్చాపి సర్వలింగై ర్మదాత్యయః. 53

తా. వాత, పిత్త, శ్లేష్మ, మదాత్యయ లక్షణములంగలది త్రిదోషజమదాత్యయమని తెలియవలయును.

అసాధ్యమదాత్యయలక్షణము

హీనో త్తరౌష్ఠ మతిశీత మమందదాహం
తైలప్రభాస్య మతిపాన హతం త్యజేత్తు,

జిహ్వౌష్ఠ దంత మసితం త్వథవాపి నీలం
పీతేచ యస్య నయనే రుధిరప్రభేవా. 54

తా. పైపెదవి యొకింత న్యూనమై వ్రేలాడుచుండుట, శరీరముయొక్క వెలుపలిభాగము చల్లగ, లోభాగము తాపయుక్తముగ నుండుట, ముఖముపై నూనెపూసినటుల మినమినలాడుచుండుట-ఈలక్షణములుగల మద్యపానరోగిని నాలుక, పెదవి, దంతములు నల్లగ, లేక నీలవర్ణముగ నుండుట, నేత్రములు పచ్చగ, లేక రక్తవర్ణముగ నుండుట-ఈలక్షణములుగల మద్యపానరోగిని వైద్యుఁడు వర్జింపవలయును.

హిక్కా జ్వరౌ వమథు వేపథు పార్శ్వశూలాః,
కాస భ్రమా వపిచ పానహతం త్యజేత్తు.

తా. ఎక్కిళ్ళు, జ్వరము, వాంతి, వణుకు, పార్శ్వశూల, దగ్గు, భ్రమ మొదలగునుపద్రవములు మిక్కుటముగ మద్యపానము సేయువానికి జనించిన వానిం జంపును.

మదాత్యయరోగచికిత్స

మదాత్యయ శ్చాతిమదః తత్ర మద్యం ప్రదాపయేత్,
వ్యోషా సౌవర్చలోపేతం సక్తుభిర్వా సమాయుతమ్. 56

(మాధవనిదానే)

తా. మద్యపానమువలన గడుమదము గలిగిన మదాత్యయ మనంబడును. దానియందు త్రికటుకములు, సౌవర్చలవణము అనువాని యుక్తముగగాని, పేలపిండియుక్తముగ గాని మద్యమును పానము జేయించవలయును.

మదాత్యయే నింబనీరం సితాయుక్తంచ దాపయేత్. 57

తా. వేపాకురసములో పంచదారకలిపి సేవించిన మదాత్యయము హరించును.

వాతమదాత్యయమునకు సౌవర్చలాదియోగము

మద్యం సౌవర్చల వ్యోషయుక్తం కించిజ్జలాన్వితం,
జీర్ణమద్యాయ దాతవ్యం వాతపానాత్యయాపహమ్. 58

తా. మద్యము, సైంధవలవణము, త్రికటుకములు అనువాని నేకముజేసి యందొకింత యుదకముగలిపి మద్యపాన జీర్ణానంతరము త్రాగిన వాతమదాత్యయముహరించును.

సూక్తశృంగ్యాదియోగము

సూక్త సౌవర్చల శృంగీ త్ర్యూషణార్ద్రిక దీప్యకైః,
మద్యం పీత్వా జయత్యుగ్రం పవనోత్థం మదాత్యయమ్. 59

తా. కలి, సైంధవలవణము, కర్కాటకశృంగి, త్రికటుకములు, అల్లము, ఓమము

అనువానిచూర్ణమునకు సమముగ మద్యముగలిపి త్రాగిన భయంకరమైన వాతపానాత్యయమును హరింపంజేయును.

—॥ క్షుద్రామలకాదియోగము ॥—

క్షుద్రామలక ఖర్జూర పరూషక హిమం పిబేత్,
సితా విమిశ్రితం పీతం పానాత్యయవికారనుత్. 60

తా. నేలయుసిరికె, ఖర్జూరము, * ఫలాసాపండ్లు, పచ్చకర్పూరము, పంచదార అనువాని నేకముజేసి మద్యములోగలిపి త్రాగిన పిత్తపానాత్యయవికారమును హరింపంజేయును.

—॥ కఫమదాత్యయోపచారము ॥—

పానాత్యయే కఫోత్థేతు వమనాయ ప్రదాపయేత్,
యథా బలం లంఘనంచ దీపనీయౌషధానిచ. 61

తా. కఫమువలన జనించిన పానాత్యయమున వమనము, శక్త్యనుగుణ్యముగ లంఘనము, అగ్నిదీప్తికరౌషధసేవనము అనువానిని జేయింపవలయును.

—॥ సన్నిపాతమదాత్యయోపచారము ॥—

సర్వజే సర్వమేవేదం ప్రయోక్తవ్యం చికిత్సితమ్. 62

తా. త్రిదోషమువలన జనించిన మదాత్యయమున పైంజెప్పంబడిన సర్వచికిత్సలం జేయవలయును.

మథితం గోదధిసహితం తైలం కర్పూరసంమిశ్రం,
ఆస్వాద్య పీత మాశు క్షపయతి పానాత్యయం రోగమ్. 63

తా. ఆవుపెరుగు, నూనె-వీనినేకముజేసి బాగుగ జిలికి అందు కర్పూరము గలిపి నస్యపానములు జేయించిన పానాత్యయరోగము తత్క్షణమున హరించును.

మద్యం పీత్వా యదివా తత్క్షణమేవ లేహ్య శర్కరా సఘృతా,
మదయతి న జాతు మద్యం మనాగపి ప్రథితవీర్యమపి. 64

తా. మద్యపానానంతరము పంచదార, నెయ్యి-వీనినేకముజేసి భక్షించిన బలిష్ఠంబైన మద్యమునగా వీర్యవిహీనంబగును.

—॥ మదాత్యయమునందు పథ్యము ॥—

సంశోధనం సంయమనం స్వపనం లంఘనం భ్రమః,
సంవత్సరసముత్పన్నా శాలయ షష్టికాయవాః. 65
ముద్గాశ్చ మాష గోధూమా లావతిత్తిరికాదయః,

* ఇదే పేరీతపండనియు జెప్పంబడును.

వేసవారో విచిత్రాన్నం హృద్యం మద్యం పయస్సితా. 66
తండులీయం పటోలంచ మాతులుంగం పరూషకం,
ఖర్జూరం దాడిమం ధాత్రీ నారికేళంచ గోస్తనీ. 67
సర్పిఃపురాణం కర్పూరం ప్రతీరం శిశిరోఽనిలః,
ధారాగ్రహం చంద్రపాదా మణయో మిత్రసంగమః. 68
క్షౌమాంబరం ప్రియాశ్లేషో గీతం వాదిత్ర ముద్ధతం,
శీతాంబుచందనంస్నానం సేవ్యమేతన్మదాత్యయే. (మాధవనిదానే)

తా. విరేచనము, రతిబంధము, నిద్ర, లంఘనము, సంచారము, ఒకసంవత్సరము మాఁగిన ప్రాతవడ్లు, ౬౦ దినములకు ఫలించెడు యవధాన్యము, పెసలు, ఉద్దులు, గోధుమలు, లావుకపిట్టమాంసము, తిత్తిరిపక్షి మొదలగువాని మాంసములు, వేసవారము, కిచ్చిడి, ప్రియకరమైన మద్యము, పాలు, పంచదార, చిర్రికూర, పొట్లకాయ, మాదీఫలము, ఫలాసాపండ్లు, ఖర్జూరము, దానిమ్మపండ్లు, ఉసిరికపప్పు, టెంకాయ, ద్రాక్షపండ్లు, ప్రాతనెయ్యి, కర్పూరము, నదీతీరము, చల్లనిగాలి, జలమందిరము, చంద్రకిరణములు, మణిహారములు, మిత్రసమాగమము, పట్టువస్త్రములు, ప్రియాలింగనము, సంగీతము, వాద్యములు, శీతోదకము, చందనము, స్నానము అనునవి మదాత్యయరోగమున హితకరంబులు.

### మదాత్యయమునం దపథ్యము

స్వేదోఽంజనం ధూమపానం నావనం దంతఘర్షణం,
తాంబూలంచాప్యపథ్యంస్యా న్మదాత్యయవికారిణామ్. 70

తా. చెమటదీయుట, అంజనము, ధూమపానము, నస్యము, దంతధావనము, తాంబూలము అనునవి మదాత్యయమునం దపథ్యకరంబులు.

### నాసారోగనిదానము

ఆనహ్యతే యస్యవిశుష్యతేచ ప్రక్లిద్యతే ధూప్యతిచైవనాసా,
నవేత్తి యోగంధరసాంశ్చజంతు ర్జుష్టంవ్యవస్యేత్తంతుపీనసేన. 71
తం చానిలశ్లేష్మభవం వికారం బ్రూయాత్ప్రతిశ్యాయసమానలింగమ్.
(ఆయుర్వేదే)

తా. ముక్కడచికొనుట, ఎండుట, ముక్కులో నీరుగారుట, పొగవెడలునట్లుల సంతాపముగలుగుట, గంధరసము తెలియకుండుట-ఈలక్షణములుగలది పీనస మని తెలియవలయును. ఈవాతశ్లేష్మజవికారము ప్రతిశ్యాయతుల్యలక్షణయుక్తంబై యుండును.

### నాసారోగచికిత్స

సర్వేషు పీనసేష్వాదౌ నివాతాగారగో భవేత్,
శిరసోఽభ్యంజనై స్స్వేదైర్నసై్యర్మందోష్ణభోజనైః. 72
వమనై ర్ఘృతపానైశ్చ యథాదోష ముపాచరేత్,

తా. సర్వపీనసరోగములయందు తొలుత వాతవిహీనస్థలము, మస్తకాభ్యంజనము, స్వేదకర్మ, నస్యము, మందోష్ణభోజనము, వమనము, ఘృతపానము అనువానిచే దోషానుగుణ్యముగ నుపచరింపవలయును.

### సర్వపీనసములకు చికిత్స

సర్వేషు సర్వకాలం పీనసరోగేషు జాతమాత్రేషు,
మరిచం గుడేన దధ్నా భుంజీత నాసుఖం లభతే. 73

తా. సర్వపీనములయందు పెరుగులో మిరియాలపొడి, బెల్లము కలిపి యెల్లపుడు సేవించుచుండిన సర్వపీనసములు హరించి సుఖము గలుగును.

### గుడాదియోగము

గుడ మరిచవిమిశ్రం పీత మాశు ప్రకామం
హరతి దధి నరాణాం పీనసం దుర్నివారం,
యదితు సఘృత మన్నం శ్లక్ష్ణ గోధూమచూర్ణైః
కృత ముపహర తేఽసౌ తత్కృతోఽస్యావకాశః. 74

తా. బెల్లము, మిరియాలచూర్ణము-వీని నొకటిగ చేర్చి పెరుగులోకలిపి త్రాగిన దుర్నివారమైన పీనసమును శీఘ్రముగ హరింపజేయును. మఱియు నేతితోగూడియుండు గోధుమచూర్ణాన్నమును భుజించిన పీనసము హరించును. .

### వేల్లగోధూమయోగము

వేల్లగోధూమ భోజీచ నిద్రాకాలేచ శీతలం,
జలం పిబతి యో రోగి పీనసా న్ముచ్యతే నరః. 75

తా. మిరియాలపొడిని, గోధుమాన్నమును భక్షించి శయనించునపుడు శీతోదకమును త్రాగిన పీనసము హరించును.

### పూతినస్యలక్షణము

దోషైర్విదగ్ధైర్గళతాలుమూలే సంమూర్ఛితో యస్యసమీరణస్తు,
నిరేతిపూతిర్ముఖనాసికాభ్యాం తంపూతినస్యం ప్రవదంతి రోగమ్.

తా. గొంతు, లోదౌడ అనువానిమధ్యమున దుష్టమైనపిత్తరక్తాది దోషములతో

వాతము మిశ్రమమై నోరు, ముక్కు అనువానియందు దుర్గంధముగతో బైలువెడలిన పూతినస్య మనంబడును.

### వ్యాఘ్రీతైలము

వ్యాఘ్రీ దంతి వచా శిగ్రు సురసా వ్యోష సైంధవైః,
సిద్ధం తైలం నసి క్షిప్తం పూతినాసా గదాపహమ్. 77

తా. నేలములక, దంతివేరు, వస, మునగ, సన్నరాస్నము, త్రికటుకములు, సైంధవలవణము అనువానికల్కములోగాని, లేక కషాయములోగాని తైలము కలిపి పక్వముజేసి నస్యముజేయించిన పూతినాసరోగము హరించును.

### శిగ్రుతైలము

శిగ్రు సింహీ నికుంభానాం బీజై స్సవ్యోష సైంధవైః,
బిల్వపత్ర రసే సిద్ధం తైలం స్యాత్పూతినస్యనుత్. 78

తా. మునగవిత్తులు, నేలములకవిత్తులు, నాగదంతివిత్తులు, త్రికటుకములు, సైంధవలవణము, మారేడాకులరసము-వీనిలో తైలముపోసి పాకము చేసి నస్యము చేయించిన పూతినాసారోగము హరించును.

### నాసాపాకలక్షణము

ఘ్రాణాశ్రితంపిత్తమరూంషికుర్యాద్యస్మిన్వికారేబలవాంశ్చపాకః,
తన్నాసికాపాకమితివ్యవస్యే ద్విక్లేదకోథావథవాపియత్ర. 79

తా. నాసికము నాశ్రయించియుండు, పిత్తము దుష్టంబగుటవలన నాసికములో వ్రణము జనించి లోనపండి చీముచే తడిసి దుర్గంధముగ స్రావము కలిగిన నాసాపాక మనంబడును.

### సర్జకాదిఘృతము

సర్జార్జునోదుంబరవత్సకానాం త్వచాకషాయైః పరిథావనేన,
కషాయకల్కైరపిచేభిరేవ సిద్ధం ఘృతం ఘ్రాణవిపాకనాశి. 80

తా. సర్జరసము, మద్ది, అత్తి, కొడిసె అనువానిపట్టలను కషాయము కాచి దానిచే నాసావ్రణమును గడుగుటయే గాక పైద్రవ్యములయొక్క పట్టలకషాయములోగాని, లేక కల్కములోగాని ఘృతము గలిపి పాకముజేసి త్రాగిన నాసాపాకము హరించును.

### వ్యోషాదివటికములు

వ్యోషా చిత్రక తాలీస తిత్తిడీ చామ్ల వేతసం,
సచవ్యా జాజి తుల్యాంశ మేలా త్వక్పత్ర పాదికమ్ 81
వ్యోషాదికమిదం చూర్ణం పురాణగుడమిశ్రితం,

పీనస శ్వాస కాసఘ్నం రుచిస్వరకరంపరమ్. 82

తా. త్రికటుకములు, చిత్రమూలము, తాళీశపత్రి, చింత, పుల్లప్రబ్బలి, చవ్యము, జీలకఱ్ఱ-ఇవి దినుసుకొక్కొకభాగము, ఏలకులు, లవంగపట్ట, లవంగపత్రి-ఇవి దినుసుకు కాలుభాగము-ఇటుల వీనిసెల్ల చూర్ణముజేసి ప్రాతబెల్లములో గలిపి యుంటలు చేసి భక్షించిన పడిసెము, ఉబ్బసము, దగ్గు-వీనిని హరింపంజేసి నోటికి రుచిని గలుగం జేయును.

## పాఠాదితైలము

పాఠాద్విరజనీ మూర్వా పిప్పలీ జాతిపల్లవైః,
ఏభిశ్చ తైలం సంసిద్ధం నస్యతః పీనసాపహమ్ 83

తా. అగరుశొంఠి, లేక విషబొద్ది, పసపు, మ్రానిపసపు, చాగవేరు, పిప్పలి-వీని కషాయములో జాజియాకురసమును, తైలమును గలిపి చిక్కగ గాచి నస్యముజేయించిన పీనసము హరించును.

## పూయరక్తలక్షణము

దోషైర్విదగ్ధైరథవాపిజంతో ర్లలాటదేశేఽభిహతస్యతైస్తైః,
నాసాస్రవేత్పూయమసృగ్విమిశ్రం తంపూయరక్తం ప్రవదంతిరోగమ్.

తా. వాతాదిదోషములు దుష్టంబులగుటచేగాని, లేక నుదిటియందు దెబ్బతగులుటచేగాని ముక్కునందు చీము, రక్తము స్రవించిన పూయరక్త మనంబడును.

## పూయరక్తచికిత్స

పూయాస్రే రక్తపిత్తఘ్నాః కషాయా నావనానిచ,
పాకదాహాదిరోగేషు శీతలేపాదికా క్రియాః. 85

తా. చీము, రక్తము స్రవించెడి నాసారోగమున రక్తపిత్తహరకషాయములు నస్యములు మొదలగువానితో జికిత్సింపవలయును. మఱియు దానియందు పాకదాహాదులు గలిగియుండిన శీతకరలేపనము, సేకము మొదలగువానితో జికిత్సింపవలయును.

## షడ్బిందుఘృతము

భృంగం లవంగం మధుకంచ కోష్ఠం సనాగరం గోఘృతమిశ్రితంచ,
షడ్బిందునాసాస్థితంచ పీనసం శిరోగతం రోగశతం నిహంతి. 86

తా. గుంటగలగర, లవంగములు, యష్టిమధుకము, చెంగల్వకోష్టు, శొంఠి అనువాని కషాయములో నావునెయ్యికలిపి పక్వముజేసి యందారుబిందువులను నస్యముచేయించిన నాసాస్థితపీనసము, శిరోరోగము మొదలగు సర్వరోగములు హరించును.

## క్షవథులక్షణము

ఘ్రాణాశ్రితే మర్మణిసంప్రదుష్టో యస్యానిలోనాసికయానిరేతి
కఫానుయాతోబహుశో౽తిశబ్దం తంరోగమాహుఃక్షవథుంవిధి

తా. నాసికము నాశ్రయించియుండు శృంగాటకమను మర్మస్థానము వాతము దుష్టంబై కఫముతో గలసి గొప్పశబ్దమును సేయుచు నాసికమువలన బైలి లిన [1]క్షవథు వనంబడును.

## శుంఠ్యాదిఘృతము

శుంఠీ కుష్ఠ కణా బిల్వ ద్రాక్షా కల్క కషాయవత్,
తైలం పక్వ మథాజ్యంవా నస్యా త్క్షవథునాశనమ్.

తా. శొంఠి, చెంగల్వకోష్టు, పిప్పళ్ళు, మారేడు, ద్రాక్ష అనువాని కల్కమ గాని, లేక కషాయములోగాని నూనె, లేక నెయ్యి గలిపి పక్వముజేసి నస్యముచేయు క్షవథు నశించును.

## ఆగంతుకక్షవథులక్షణము

తీక్ష్ణోపయోగాదతిజిఘ్రితోవాభావాన్కటూనర్కనిరీక్షణాద్వా
సూత్రాదిభిర్వాతరుణాస్థిమర్మ ణ్యుద్ఘాటితే౽న్యఃక్షవథుర్నిరేతి.

తా. ఆవాలుమొదలగు తీక్ష్ణపదార్థముల సేవించుటచేత నేని లేక [2]కారముగల ర్థముల పీల్చుటచేతనేని, లేక సూర్యునిజూచుటచేతనేని, లేక నాసికములో వర్తినుం టచేతనేని తరుణాస్థిమర్మము (అనఁగా ఫణామర్మము) చలితంబై ఆగంతుకక్షవథును గంజేయును. మఱియు ఆగంతుక, దోషజక్షవథులు రెండును సమానంబులు.

## భ్రంశథులక్షణము

ప్రభ్రశ్యతే నాసికయాహియస్య సాంద్రోవిదగ్ధో లవణఃకఫశ్చ,
ప్రాక్సంచితోమూర్ధనిసూర్యతప్తే తం భ్రంశథుంవ్యాధిముదాహరం

తా. పూర్వము శిరమునందు సంచితంబై యుండుకఫము సూర్యతాపమున ద్రవించి గట్టిగ, రక్తాధికపీతవర్ణముగ, ఉప్పగ, నాసికారంధ్రమువలన నధికముగ వెడ భ్రంశథు వనంబడును.

## దీప్తనాసాలక్షణము

ఘ్రాణేభృశందాహసమన్వితేతు వినిస్సరేద్ధూమఇవేహవాయుః,
నాసాప్రదీప్తేవచయస్యజంతో ర్వ్యాధింతుతందీప్తముదాహరంతి

1 క్షవథువనఁగా తుమ్ము. 2 కారమనఁగా శొంఠి, వస, పిప్పలి మొదలుగునవి.

తా. నాసికము కడుతాపయుక్తమై యుండ వాతము పొగవలె బైలువెడలుచు నాసికమునకు బ్రదీప్తిని కలుగంజేయుచుండిన దీప్తనాసారోగ మనంబడును.

దీప్తనాసాచికిత్స

నస్యంహితంనింబరసాంజనాభ్యాం దీప్తేశిరస్స్వేదనమత్రశస్తం,
నస్యేకృతేక్షీరజలావసేకా॥ శంసంతిభుంజీతచముద్గయూషైః. 92

తా. వేపరసము, రసాంజనము అనువానియొక్క నస్యమును, కుంభీశాకములవలన నొకింత స్వేదమును, నస్యానంతరము పాలను, నీరును జేర్చి సేచనమును జేయించుటయే గాక పెసరకట్టును పథ్యమునం దొసంగిన దీప్తనాసారోగమును హరింపంజేయును.

ప్రతీనాహలక్షణము

ఉచ్ఛ్వాసమార్గంతు కఫ స్సవాతో
రుంధ్యాత్ప్రతీనాహ ముదాహరేత్తమ్. 93

తా. వాతసహితకఫము ఉచ్ఛ్వాసమార్గము నడ్డగించుటవలన నాసికారంధ్రముల శ్వాసము బాగుగ బ్రవర్తింపకుండిన ప్రతినాహ మనంబడును.

ప్రతీనాహచికిత్స

నాసావనాహే కర్తవ్యం పానం గవ్యస్య సర్పిషః,

తా. ఆవునెయ్యిని పానముజేయించిన ప్రతీనాహము హరించును.

నాసాస్రావలక్షణము

ఘ్రాణాద్ఘనః పీకసిత స్తనుర్వా దోషస్స్రవేత్స్రావముదాహరేత్తమ్.

తా. నాసికమువలన గట్టిగ, పసపువర్ణముగ, లేక తెల్లగ, లేటగ కఫము స్రవించిన నాసాస్రావ మనంబడును.

నాసాస్రావచికిత్స

నాసాస్రావే ఘ్రాణయో శ్చూర్ణయుక్తం
నాడ్యాదేయం చావపీడాశ్చ పథ్యాః,
తీక్ష్ణా ధూమా దేవదార్వగ్నికాభ్యాం
మాంసంచాజం పథ్యమత్రాదిశంతి. 95

తా. నాసాస్రావమునందు కరక్కాయచూర్ణమును గొట్టముతో ప్రయోగించుట, * అవపీడనము, దేవదారు, చిత్రమూలము మొదలగువానియొక్క తీక్ష్ణకరధూమ

---

* అవపీడన మన శొంఠి, మిరియాలు, వస మొదలగు తీక్ష్ణకరౌషధముల నూరి కల్కము జేసి నాసికములో పిండుట.

ములు - వీనిచే నుపచరింపవలయును. మఱియు దీనియందు మేకమాంసమును భుజించుట పథ్యకరంబు.

నాసాపరిశోషలక్షణము

ఘ్రాణాశ్రితే స్రోతసిమారుతేన గాఢం ప్రదీప్తే పరిశోషితేచ,
కృచ్ఛాచ్ఛ్వసేదూర్ధ్వమథశ్చజంతు ర్యస్మిన్ననాసాపరిశోషఉక్తః.

తా. వాతమువలన నాసికాద్వారములు మిక్కుటముగ తపించి యెండుటచే నరుఁడు కడుకష్టముమీఁద క్రింద, పైన శ్వాసమునువిడిచిన నాసాపరిశోష మనంబడును.

నాసాపరిశోషచికిత్స

నాసాశోషే క్షీరపానం ససితంచ ప్రశస్యతే. 97

తా. నాసాశోషమున పాలలో పంచదారకలిపి పానముసేయుట ప్రశస్తంబు.

అపక్వపీనసలక్షణము

శిరో గురుత్వ మరుచి ర్నాసాస్రావ స్తనుస్స్వరః,
క్షామః ష్ఠీవే త్తథాభీక్ష్ణ మామపీనసలక్షణమ్. 98

తా. శిరము జడముగ నుండుట, అరుచి గలుగుట, నాసికములో నుండి తేటనీరు గారుట, స్వరము హీనం బగుట, పలుమారు నాసికములయందుండి చీమిడి నాకర్షించి యుమియుట ఈలక్షణములు గలది అపక్వపీనస మని తెలియవలయును.

పక్వపీనసలక్షణము

ఆమలింగాన్వితశ్శ్లేష్మా ఘనస్స్వేషు నిమజ్జతి,
స్వరవర్ణవిశుద్ధిశ్చ పరిపక్వస్య లక్షణమ్. 99

తా. పూర్వోక్తఅపక్వలక్షణయుక్తంబై యుండుకఫము ఘనీభవించి నాసికము మొదలగువానిస్రోతస్సులయందు నిలుచుట, స్వరవర్ణములు స్పష్టములుగనుండుట - ఈలక్షణములు గలిగిన పీనసము పక్వంబైన దని తెలియవలయును.

ప్రతిశ్యాయోత్పత్తి

సంధారణాజీర్ణరజోఽతిభాషా క్రోధ ర్తువైషమ్యశిరోఽభితాపైః,
ప్రజాగరస్వప్నసవాంబుశీతా వశ్యాయయకై ర్మైథునబాష్పసేకైః.
సంస్త్యానదోషేశిరసిప్రవృద్ధో వాయుఃప్రతిశ్యాయముదీరయేత్తు,

తా. మలమూత్రాదివేగముల నడ్డగించుట, జీర్ణము గానుండుట, ముక్కులోదుమ్ము ప్రవేశించుట, మిక్కుటముగ మాటలాడుట, కోపముసేయుట, ఋతువుమారుట, ఎండ వలన శిరము తపించుట, జాగరణముసేయుట, పగలు నిద్రించుట, క్రొత్త నీరు త్రాగుట,

శీతపదార్థములను, మంచును సేవించుట, మిక్కుటముగ మైథునముసేయుట, నేత్రములయందు నీరుకారుట - ఈకారణములవలన మూలాధారమైనకఫము శిరమున ఘనీభావమునుజెందుటచే వాతము ప్రకోపించి పడిశమును గలుగంజేయును. ఈకారణములవలన తత్క్షణమున పడిశము గలుగును.

### ప్రతిశ్యాయోత్పత్తికారణము

చయంగతాషూర్ధనిమారుతాదయఃపృథక్సమస్తాశ్చతథైవశోణితం,
ప్రకుప్యమానావివిధైఃప్రకోపనైస్తతః ప్రతిశ్యాయకరాభవంతి.

తా. శిరమున ప్రత్యేకముగ వాతాదిదోషములు, సర్వదోషములు, రక్తము సంచితంబులై బలవద్విగ్రహదివాస్వప్నాదికారణములవలన ప్రకోపించి ప్రతిశ్యాయమును గలుగంజేయును.

### ప్రతిశ్యాయపూర్వరూపములు

క్షవప్రవృత్తి శ్శిరసోఽతిపూర్ణతా
స్తంభోఽఙ్గమర్దః పరిహృష్టరోమతా,
ఉపద్రవాశ్చాప్యపరే పృథగ్విధా
నృణాం ప్రతిశ్యాయ పురస్సరాస్మృతాః. 102

తా. తుమ్ములువచ్చుట, తల బరువుగ నుండుట, శరీరము స్తంభించుట, శరీరము నొచ్చుట, గగుర్పాడుచుట, పలువిధరోగములు (అనఁగా ఘ్రాణధూమాయనాదికములు) గలుగుట-ఇవియ ప్రతిశ్యాయమునకు పూర్వరూపములు.

### ప్రతిశ్యాయచికిత్స

ప్రతిశ్యాయేషు సర్వేషు గృహం వాతవివర్జితం,
వస్త్రేణ గురుణోష్ణేన శిరసా వేష్టనం హితమ్. 103

తా. సర్వప్రతిశ్యాయములయందు వాతవిహీనస్థలమునం దుండుట, దళముగ ఉష్ణముగ నుండు వస్త్రముల శిరమునకు జుట్టుట హితకరంబు.

### బాలమూలకయూషము

బాలమూలకయూషశ్చ కుళుత్థోత్థశ్చ పూజితః,
స్వేద ఉష్ణం హిమం భోజ్యం పాచనాయ ప్రసస్యతే. 104

తా. ప్రతిశ్యాయమునందు లేతముల్లంగి, ఉలవలు అనుపానీయయూషము, స్వేదకర్మ, ఉష్ణకరభోజనము, శీతోదకము అనువాని సేవనవలన ప్రతిశ్యాయము పక్వంబగును.

పిప్పల్యాదినస్యము

తతః పక్వం కఫం జ్ఞాత్వా హరే చ్ఛీర్ష విరేచనైః,
పిప్పల్య శ్శిగ్రుబీజాని విడంగం మరిచానిచ. 105
అవపీడః ప్రశస్తోఽయం ప్రతిశ్యాయనివారణః,

తా. కఫము, పక్వమైనపిదప మస్తకరేచనము చేయించి దానిని దీసివేయవలయును. మఱియు పిప్పళ్లు, మునగవిత్తులు, వాయువిడంగములు, మిరియాలు-వీనిని నస్యము జేయింపవలయును. ఇవి ప్రతిశ్యాయమును హరింపం జేయుటయందు ప్రశస్తంబులు.

వాతప్రతిశ్యాయలక్షణము

ఆనద్ధాపిహితానాసా తనుస్రావప్రసేకినీ.
గళతాల్వోష్ఠశోషశ్చ నిస్తోద శ్శంఖయోరపి,
భవేత్స్వరోపఘాతశ్చ ప్రతిశ్యాయేఽనిలాత్మజే.

తా. ముక్కు కట్టంబడినటు లుండుట, అడచికొనియుండుట, లేటగ నీరు గారుట, గొంతు, లోదౌడ, పెదవి యెండుట, కణతలలో పొడుచునటు లుండుట, గొంతులో ఘుర్ఘురశబ్దముగలుగుట - ఈలక్షణములుగలది వాతప్రతిశ్యాయ మని తెలియవలయును.

వాతజప్రతిశ్యాయచికిత్స

వాతికేతు ప్రతిశ్యాయే పిబే త్సర్పి ర్యథాక్రమం,
పంచభి ర్లవణై స్సిద్ధం ప్రథమేన గణేనచ. 108

తా. పంచలవణయుక్తముగగాని, లేక పంచమూలయుక్తముగగాని సిద్ధము జేయఁబడిన ఘృతమును పానముజేసిన వాతజప్రతిశ్యాయము హరించును.

పిత్తప్రతిశ్యాయలక్షణము

ఉష్ణ స్సపీతక స్స్రావో ఘ్రాణా త్స్రవతి పైత్తికే,
కృశోఽతిపాండు స్సంతప్తో భవే దుష్ణాభిపీడితః.
సధూమమగ్నిం సహసా వమతీ వచ నాసయా,

తా. నాసికమునుండి వేఁడిగ, పసుపువర్ణముగ స్రావము గలుగుట, దానిసంబంధమువలన శరీరముకృశించి కడుతెల్లగనుండుట, దాహముగలుగుట, ఊష్మమును సహింపలేకుండుట, నాసికమువలన పొగతోడ నగ్ని వెడలునటులుండుట - ఈలక్షణములుగలది పైత్తికప్రతిశ్యాయ మని తెలియవలయును.

చికిత్స

హితం పిత్తప్రతిశ్యాయే పాచనార్థం ఘృతం పయః. 110

శృంగబేరేణ పయసా శృంగబేర మథాపివా,

తా. పిత్తజప్రతిశ్యాయమునందు పాచనార్థమై నెయ్యి, పాలు, అల్లపురసము అనువాని నేకముజేసిగాని, లేక పాలలో అల్లపురసము కలిపిగాని పానము చేయించుట హితకరంబు.

కఫజప్రతిశ్యాయలక్షణము

ఘ్రాణాత్కఫః కఫకృతే శ్వేతశ్శీతస్స్రవే ద్బహుః. 111
శుక్లావభాస శ్శూనాక్షో భవే ద్గురుశిరానరః,
కంఠ తాల్వోష్ఠ శిరసాం కండూభి రభిపీడితః. 112

తా. నాసికమువలన చీమిడి తెల్లగ, శీతలముగ, మిక్కుటముగ పలుమారుకారుట, శరీరము తెల్లగనగుట, కండ్లుబ్బుట, తలబరువుగనుండుట, గొంతు, లోదౌడ, పెదవి, శిరము అనువానియందు దురదగలుగుట - ఈలక్షణములు గలదికఫజప్రతిశ్యాయ మని తెలియవలయును.

చికిత్స

కఫజే సర్పిషా స్నిగ్ధం తిల మాష విపక్వయా,
యవాగ్వాపాయయిత్వాతు శ్లేష్మఘ్నం క్రమమాచరేత్, 113

తా. కఫజనాసారోగమున తొలుత ఘృతమువలన స్నిగ్ధముగజేసి పిదప నువ్వులు, ఉద్దులు అనువానియుక్తముగ సిద్ధముజేయఁబడిన యవాగును పానముజేయించి కఫహరౌషధముల నొసంగవలయును.

ధూమపానవర్తి

దార్వీంగుద నికుంభైశ్చ కిణిహ్వా సరళేనచ,
వర్తయోఽత్ర కృతా యోజ్యా ధూమపానే యథావిధి. 114

తా. మ్రానిపసపు, గారెపట్ట, దంతి, ఉత్తరేణు, సర్జరసము-నీని నుదకముతో నూరి వస్త్రమునకు బట్టించి వర్తిజేసి యథావిధిగ ధూమపానము సేయవలయును.

సన్నిపాతనాసారోగలక్షణము

భూత్వా భూత్వా ప్రతిశ్యాయో యస్యాకస్మా న్నివర్తతే,
సంపక్వోవా ప్యపక్వోవా సతు సర్వభవస్స్మృతః. 115

తా. పడిసెము పలుమారు జనించి పండిగాని, లేక పండక నకస్మాత్తుగగాని నివర్తించిన త్రిదోషజప్రతిశ్యాయ మనంబడును.

దుష్టప్రతిశ్యాయలక్షణము

ప్రక్లిద్యతే పునర్నాసా పునశ్చ పరిశుష్యతి,



పునరానహ్యతేచాపి పునర్వివ్రియతే తథా. 116
నిశ్వాసో వాతిదుర్గంధో నరో గంధం న వేత్తిచ,
ఏవం దుష్టప్రతిశ్యాయం జానీయా త్కృచ్ఛ్రసాధనమ్. 117

తా. నాసికము పలుమారు తడిసినట్టుండుట, మర్ల నెండుట, మరల నాసిక మడచికొనుట, మరల నాసికము దెరచికొనుట, దుర్గంధముగ నిశ్వాసము బైలువెడలుట, వాసన తెలియకుండుట-ఈలక్షణములు గలది దుష్టప్రతిశ్యాయ మనంబడును. ఇది కష్ట సాధ్యము. (ఈప్రతిశ్యాయ మైదింటిలో నవస్థాభేదము గలదిగ నుండుటం జేసి ఆరవదిగ గణనము చేయందగదు.)

## చిత్రకహరీతకీరసాయనము

చత్వార్య త్రి శతాని చిత్రక జటాయు క్పంచమూలామృతా
ధాత్రీణా ముదకర్మణే త్రిభిరపాం ద్రోణైశ్చ సంక్వాథయేత్,
పాదస్థే క్వథనే గుడస్యచ శతం పథ్యాఢకేనాన్వితం
పక్తవ్యం శృతశీతలేచ మధునః ప్రస్థార్ధమాత్రం క్షిపేత్. 118
వ్యోషస్య త్రిసుగంధికస్యచ పలా న్యత్రైవ షట్ప్రక్షిపేత్
క్షారస్యార్ధపలం రసాయనమిదం సంసేవ్యతే సర్వదా,
శోష శ్వాస మలావకాశ వమథు శ్లేష్మ ప్రతిశ్యాయిభిః
క్షీణోరఃక్షత హిక్కికా కఫశిరోరోగ ప్రనష్టాగ్నిభిః. 119

తా. చిత్రమూలము, పంచమూలములు, తిప్పతీగె, ఉసిరికపరుగు-వీనిని ४०० పలములు గ్రహించి 3 ద్రోణముల నుదకములో వైచి చతుర్థాంశముగ కషాయము కాచి దించికొని అందు ౧౦౦ పలముల బెల్లము, ఆఢకప్రమాణము కరక్కాయలు వైచి పాక ముచేసి చల్లారినపిదప ५ ప్రస్థము తేనె, ౬ పలములు త్రికటుకములు, త్రిసుగంధములు, ५ పలము యవక్షారము గలిపి సదా సేవించుచుండిన శోష, శ్వాసము, మలబద్ధము, వాంతి, దగ్గు, పడిసెము, కృశత్వము, ఉరఃక్షతము, ఎక్కిళ్లు, కఫజశిరోరోగము, మందాగ్ని-వీనిని హరింపంజేయును.

## హింగ్వాదితైలము

హింగు వ్యోష విడంగ కట్ఫలవచా రుక్తీక్ష్ణగంధైర్యుతైః
లాక్షా శ్వేతపునర్నవాబ్దకుటజైః పుష్పోద్భవై స్సారభైః,
ఇత్యేభిః కటుతైల మేతదనలే మందే సమూత్రం శృతం
పీతం నాసికయా యథావిధి భవే న్నాసామయేభ్యో హితమ్.

తా. ఇంగువ, శొంఠి, మిరియాలు, పిప్పళ్ళు, వాయువిడంగములు, కాయఫలము

(గుమ్ముడుటేకు), వస, చెంగల్వకోష్టు, నల్లమునగ, లక్క, తెల్లగలిజేరు, తుంగముస్తెలు, కొడిసెవిత్తులు, లవంగములు అనువానికషాయములోగాని, లేక కల్కములోగాని తెల్లావనూనె, గోమూత్రము కలిపి మందాగ్నితో పాకముజేసి యథావిధిగ నస్యము జేయించిన నాసారోగము హరించును.

పీనససామాన్యచికిత్స

రక్తపిత్తంచ శోథశ్చ తథార్శాంస్యర్బుదానిచ,
నాసికాయాంస్యురేతేషాం స్వంస్వం కుర్యా చ్చికిత్సితమ్. 121

తా. రక్తపిత్తము, వాపు, అర్శస్సు, అర్బుదము అనురోగములు నాసికమున జనించిన ఆయారోగోక్తచికిత్సం జేయవలయును.

గృహధూమ కణా దారు క్షార నక్తాహ్వ సైంధవైః,
సిద్ధం శిఖరిబీజైశ్చ తైలం నాసార్శసాం హితమ్. 122

తా. కరుధూపము, పిప్పళ్ళు, దేవదారు, యవక్షారము, నఖము, సైంధవలవణము, ఉత్తరేణివిత్తులు- వీనితో తైలమును పక్వముగ జేసి నాసికములో వైచిన నాసార్శస్సు హరించును.

కరవీరాదితైలము

రక్తస్య కరవీరస్య పుష్పం జాతేశ్చ మల్లికా,
తిలతైలం సమంత్వేతైః పక్వం నాసార్శసాం హితమ్. 123

తా. ఎఱ్ఱగన్నేరుపువ్వులు, జాజిపువ్వులు, మల్లెపువ్వులు-వీనితో సమముగ తిలతైలమును పక్వముజేసి నాసికములో వైచిన నాసార్శస్సు హరించును.

నాసాశోషోపచారము

నాసాశోషే క్షీరసర్పిః ప్రధానం తైలం సిద్ధంచాణుతైలేనసన్యే,
సర్పిఃపానంభోజనంజాంగలైశ్చస్వేహాస్వేదైస్నేహికశ్చాత్రధూమః.

తా. నాసాశోషమున పాలు, నెయ్యి, నూనె అనువానితో ముఖ్యముగ నుపచరింపవలయును. మఱియు అణుతైలముయొక్క నస్యము, ఘృతపానము, జాంగలమాంసయుక్తభోజనము, స్నేహయుక్తద్రవ్యములచే చెమటను వెడలింపంజేయుట, స్నేహయుక్తధూమము హితకరంబులు.

రక్తప్రతిశ్యాయలక్షణము

రక్తజేతు ప్రతిశ్యాయే రక్తస్రావః ప్రవర్తతే,
తామ్రాక్షశ్చ భవే జ్జంతు రురోఘాత ప్రపీడితః. 125
దుర్గంధోచ్ఛ్వాసవదనో గంధానపి నవేత్తి సః,

తా. ముక్కులోనుండి రక్తము స్రవించుట, నేత్రము లెఱ్ఱగ నగుట, ఉరఃక్షత పీడతో సమానమైన పీడగలుగుట, ఉచ్ఛ్వాసము, నోరు అనువానియందు కంపువేయుట, వాసన తెలియకుండుట-ఈలక్షణములుగలది రక్తజప్రతిశ్యాయ మనంబడును.

చికిత్స

రక్తపిత్తోద్భవే పేయం సర్పిర్మధుకరైశ్శృతమ్. 126

తా. రక్తపిత్తమువలన గలిగిన ప్రతిశ్యాయమును తుమ్మెదలకషాయము గాచి అందు నెయ్యి గలిపి పాకముజేసి దానిని త్రాగవలయును.

ధాత్రీ లేపము

సర్పిషాభృష్టయా ధాత్ర్యా శిరసోలేపతః క్షణాత్,
నాసాయాంసంప్రసృత్తంచ రుధిరంచ వినశ్యతి. 127

తా. నేతితో ఉసిరికవరుగునునూరి శిరమున లేపనముచేసిన నాసికారక్తము తత్క్షణమున హరించును.

ప్రతిశ్యాయసామాన్యచికిత్స

విడంగం సైంధవం హింగు గుగ్గులు స్సమనశ్శిలః,
ప్రతిశ్యాయే వచాయుక్తం సక్తుధూమం పిబేన్నరః. 128
ఏతచ్చ చూర్ణ మాఘ్రాతం ప్రతిశ్యాయం వినాశయేత్,

తా. వస, పేలపిండి అనువానియొక్కధూమమును ప్రాశనముజేసి పిదప వాయువిడంగములు, సైంధవలవణము, ఇంగువ, గుగ్గిలము, మణిశిల అనువానిచూర్ణమును మూటగట్టి వాసనచూచుచుండిన ప్రతిశ్యాయము హరించును.

సక్తుధూమము

ఘృతతైలసమాయుక్తం సక్తుధూమం పిబేన్నరః 129
సధూమస్స్యాత్ప్రతిశ్యాయ కాస హిక్కా హరః పరః,

తా. నెయ్యి, నూనె-వీనిలో పేలపిండిని కలిపి దానిధూమమును పానముజేసిన పడిసెము, దగ్గు, ఎక్కిళ్ళు హరించును.

ధూమచూర్ణము

ప్రతిశ్యాయే పిబేద్ధూమం సర్వం గవ్యసమాయుతమ్. 130
చాతుర్జాతకచూర్ణంవా ఘ్రేయంవా కృష్ణజీరకం,

తా. అన్నిపడిసెములయందు ఆవునేతిలో యుక్తమైన ద్రవ్యముల గలిపి ధూమపానము చేయవలయును. మఱియు చాతుర్జాతకములగాని, లేక నల్లజీలకఱ్ఱనుగాని చూర్ణముచేసి బట్టలో గట్టి వాసనజూడవలయును.

### నవసాగరయోగము

ప్రతిశ్యాయేషు సశిరః పీడేషు నవసాగరమ్. 131
సమానం కాలికాచూర్ణం సూక్ష్మచంచూర్ణితం ద్వయమ్,
గుంజామాత్రంతు తచ్చూర్ణం నస్యప్రథమనం చరేత్. 132
నశ్యంత్యనేన యత్నేన ప్రతిశ్యాయశిరోరుజః,

తా. శిరమున శూలయుక్తముగ ప్రతిశ్యాయముగలిగిన నవాసాగరము, సున్నము-వీనిని సమభాగములుగ జేర్చి ఖల్వములో నునిచి నూరి గురిగింజయెత్తు నాసికము *ప్రథమనస్యము జేసిన పడిసెము, మస్తకశూల-వీనిని హరింపం జేయును.

### ప్రతిశ్యాయహరనస్యము

వచాయాశ్చూర్ణ మాఘ్రాయ వాససా పోటలీకృతమ్. 133
కారవీం త్రుబద్ధాం వా ప్రతిశ్యాయ మపోహతి,

తా. వసనుగాని, లేక ఓమముగాని, చూర్ణముజేసి బట్టలో గట్టి వాసనను బీల్చిన పడిసెము, హరించును.

### శట్యాదిచూర్ణము

శఠీ సామలకీ వ్యోషచూర్ణం సర్పి ర్గుడాన్వితమ్. 134
హరేద్ఘోరం ప్రతిశ్యాయం పార్శ్వ హృద్వస్తి శూలనుత్,

తా. కిచ్చిలిగడ్డ, ఉసిరికపరుగు, త్రికటుకములు-వీనిని చూర్ణముజేసి, నెయ్యి, బెల్లము-వీటిలోగలిపి భక్షించిన కడుభయంకరమైన పడిసెము, పార్శ్వము, ఱొమ్ము, వస్తి అనువానియందలిశూల హరించును.

### అసాధ్యప్రతిశ్యాయలక్షణము

సర్వఏవ ప్రతిశ్యాయా నరస్యాప్రతికారిణః. 135
దుష్టతాం యాంతి కాలేన తదాసాధ్యా భవంతిచ,
మూర్ఛంతి క్రిమయశ్చాత్ర శ్వేతాస్స్నిగ్ధా స్తథా నవః. 136
క్రిమిజో య శ్శిరోరోగ స్తుల్యంతేనాస్యలక్షణం,

తా. సర్వప్రతిశ్యాయముల నుపేక్షించుటవలన కాలాంతరమున దుష్టంబులై, అసాధ్యంబులై, తెల్లగ, నున్నగ, సన్నముగ నుండుక్రిములు నాసికములో జనించును. దానియందు క్రిమిజ శిరోరోగలక్షణంబులు గలుగును.

---

* ప్రథమనస్యమన ఆరంగుళములపొడవు, అగ్రమున రెండురంధ్రములు గల గొట్టమును సరళముగ జేయించి అందు చూర్ణమును వైచి నాసికమునం దునిచి ముఖవాతముతో నూదుట.

### ప్రతిశ్యాయోపేక్షజవికారములు

బాధిర్యమాంధ్యమఘ్రిత్వం ఘోరాంశ్చనయనామయాన్. 137
శోథాగ్నిసాదకాసాదీ న్వృద్ధాకుర్వంతి పీనసాః,

తా. సర్వపీనసములు వృద్ధిచెందిన చెవుడు, మందదృష్టి, వాసన తెలియకపోవుట, భయంకరమైన నేత్రరోగము, వాపు, అగ్నిమాంద్యము, దగ్గు మొదలగునవి గలుగును.

### క్రిమినాసాచికిత్స

క్రిమిఘ్నా యేక్రమాః ప్రోక్తా స్తా నైవ క్రిమిషు యోజయేత్.
భావనాని క్రిమిఘ్నాని భేషజానిచ బుద్ధిమాన్,

తా. క్రిమిరోగోక్తఔషధములవలనను, క్రిమినాశకఔషధములవలనను, క్రిమిజనాసారోగమును గడుగుటయేగాక క్రిమినాశకఔషధముల సేవనను జేయించవలయును.

### క్రిమిహరచికిత్స

రక్తామ్రస్వరస శ్శుద్ధ స్తక్రేణ సహ నస్యతః. 139
తస్య పర్ణాణి పిష్ట్వాచ బధ్నీయా న్నాసికాముఖే,
పతంతి కీటకా స్సద్యో యోగోఽయం త్రిదినే హితః. 140
పీనసా న్ముచ్యతే రోగీ శతశోఽనుమితం త్విదం,

తా. ఎఱ్ఱగోగుకూర స్వరసమును వడియగట్టి మజ్జిగలో కలిపి నస్యముజేయించుట యేగాక ఎఱ్ఱగోగాకును నూరి నాసికాముఖమున నునిచి కట్టుగట్టవలయును. ఇటుల మూడు దినములు జేసిన తత్క్షణమున పురుగులు, పడిసెము హరించును. ఇది యనుభవసిద్ధంబులు.

### నాసారోగములయందు పథ్యము

స్వేద స్స్నేహ శ్శిరోఽభ్యంగః పురాణాయవశాలయః, 141
కుళుత్థ ముద్గయో ర్యూషో గ్రామ్య జాంగలజారసాః,
వార్తాకం కుళకం శిగ్రు కర్కోటం బాలమూలకమ్. 142
లశునం దధి తప్తాంబు వారుణీచ కటుత్రయం,
కట్వమ్ల లవణం స్నిగ్ధ ముష్ణంచ లఘుభోజనమ్. 143
నాసారోగే పీనసాదౌ సేవ్యమేతద్యథామలం, (మాధవనిదానే)

తా. స్వేదము, స్నేహము, మస్తకాభ్యంజనము, పాతయవలు, బియ్యము, ఉలవలు, పెసలు అనువానియూషము, గ్రామ్యమాంస రసము, జాంగలమాంస రసము, వంకాయ, చేదుపొట్ల, మునగకాయ, మారేడుకాయలు, లేతముల్లంగి, వెల్లుల్లి, పెరుగు,

ఉష్ణోదకము, మద్యము త్రికటుకములు, కారము, పులుసు, ఉప్పు, జిగటగలపదార్థములు, ఉష్ణము, లఘుకరభోజనము - ఈమొదలగువానిని నాసారోగమునందు దోషానుగుణ్యముగ పథ్యమునందు గ్రహింపదగును.

నాసారోగములయందపథ్యము

స్నానం క్రోధం శకృన్మూత్ర వాతవేగాన్ శుచం ద్రవమ్. 144
భూమిశయ్యాంచ యత్నేన నాసారోగీ పరిత్యజేత్,

తా. స్నానము, క్రోధము, మల, మూత్ర, వాతవేగముల నడ్డగించుట, శోకము, ద్రవపదార్థములు, భూమిపై బరుండుట - వీనిని నాసారోగంబులు గలవారు ప్రయత్నపూర్వకముగ వర్జింపవలయును.

పీనసరోగనిదానము

పూయం స్రవతి దుర్గంధం నాసాయా మతితాపకృత్. 145
తత్రౌషధం ప్రదాతవ్యం శ్వేతజీర సితాద్రవైః,
ఘృతాక్తం కుంకుమం ఘృష్టం నస్యే త్పీనసరోగనుత్. (శారీరే)

తా. ముక్కున కడుతాపముగలిగి దుర్గంధముగ చీముకారిన తెల్లజీలకఱ్ఱ, పంచదార - వీని నుదకముతో నూరిగాని, లేక కుంకుమపువ్వును నేతితో నూరిగాని, నస్యముజేయించిన మురికిపీనసములు హరించును. (దుందిలపుచెక్క-, అనుములు-వీనిని వండి భక్షించిన మురికిపీనసములు, నాసికావ్రణములు హరించును )

పీనసరోగభేదములు

రక్తం పీతం తథా శ్వేతం నీలం హారిద్ర మిశ్రితం,
పూయం స్రవతి దుర్గంధం పీనసాఖ్యంచ సప్తకమ్. 147

తా. రక్తవర్ణము, పీతవర్ణము, శ్వేతవర్ణము, నీలవర్ణము, పసపువర్ణము, మిశ్రవర్ణము, పూయవర్ణము అని పీనసములు ౭ విధములు. ఇవి దుర్గంధములుగ స్రవించును.

పీనసహరనస్యములు

ఉష్ణోదకేనవా నస్యం పిప్పలీ నాగరం నిశా,
దేవదారుపలార్ద్రేణ గుంజైకం శీతవారిణా. 148
సప్తాహే పీనసం హంతి నాసారోగంచ నాశయేత్. (అశ్వినీకల్పే)

తా. పిప్పళ్లు, శొంఠి, పసుపు-వీని నుష్ణోదకముతో నూరి నస్యముజేయించిన పీనసములు హరించును, మఱియు దేవదారుపండు, అల్లము - వీనిని శీతోదకముతో నూరి గురిగింజ ప్రమాణముగ ౭ దినములు నస్యముజేయించిన పీనసము, నాసారోగము హరించును. (మఱియు పాపరపండును నస్యముజేయించిన పీనసము హరించును.)

### ద్రాక్షాదిస్నేహము

ద్రాక్షా శుంఠీ విశంగాని పిప్పలీ కుష్ఠ చూర్ణితమ్. 149
తతో దశగుణై స్తోయైః క్వాథయే త్పాదశేషితం,
ఘృతం చూర్ణసమం క్షిప్త్వా ప్యాజంవా తిలతైలకమ్. 150
స్నేహావశేషం తత్పాచ్యం నస్యే న్నాసామయం జయేత్,
(మాధవనిదానే)

తా. ద్రాక్షపండ్లు, శొంఠి, వాయువిడంగములు, పిప్పళ్లు, చెంగల్వకోష్టు - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దానికి పదింతలు ఉదకముపోసి నాలవభాగముగ కషాయముగాచి అందుపై చూర్ణమునకు సమముగ మేకనెయ్యినిగాని, నువ్వులనూనెనుగాని గలిపి స్నేహావశేషముగగాచి నస్యముజేయించిన నాసారోగము హరించును.

### జీవంత్యాదికషాయము

ద్వాత్రింశత్పలదుగ్ధంతు పాచయే త్సమవారిణా. 151
జీవంతి దశకం చూర్ణం తస్మి న్దశపలం క్షిపేత్,
క్వాథశేషం హరేత్పాదం నస్యేత్పీనసనాశనమ్. (మాధవనిదానే)

తా. మనుబాల, దశమూలములు - వీనిని దినుసుకు పలముచొప్పున దంచి చూర్ణముజేసి పాలు 32 పలములుగలిపి నాలవభాగముగ కషాయముకాచి నస్యముజేయించిన పీనసములు హరించును.

అశ్వగంధాదితైలేన నస్యే న్నాసారుజం హరేత్.
సైరేయకాదితైలేన శిరోలేపాచ్చ తం జయేత్. (సిద్ధరసార్ణవే)

తా. అశ్వగంధాదితైలమునుగాని, లేక సైరేయకాదితైలమునుగాని, నస్యము, అభ్యంజనము జేయించిన పీనసము హరించును.

### కణాదినస్యము

కణా సైంధవకం పిష్ట్వా హ్యుష్ణనీరేణ నస్యతః,
నాసా శ్రవణవాతంచ కంఠవాతంచనాశయేత్. (పూజ్యపాదీయే)

తా. పిప్పలి, సైంధవలవణము-వీని నుష్ణోదకముతోనూరి నస్యము జేయించిన పీనసము, చెవినొప్పి, కంఠవాతము హరించును.

కృష్ణజీరం వస్త్రబద్ధమాఘ్రాతం పీనసప్రణుత్,
ఆఘ్రాయ రజనీధూమం సద్యశ్లేష్మహరం భవేత్. 155
అర్కమూలకృతం నస్యం కామిలాం దుస్సహాం హరేత్,

తా. నల్లజీలకఱ్ఱను బట్టలో మూటగట్టి వాసన చూచిన పీనసము హరించును.

మఱియు పసపు పొగ నాఘ్రాణించిన దగ్గు తత్క్షణమున హరించును. జిల్లేడువేరును నస్యము జేయించిన ప్రబలమైన కామిల హరించును.

నిర్గుండీరసమాత్రేతు తైలప్రస్థం విపాచయేత్. 156
త్రిఫలా త్ర్యూషణంచైవ జీరకద్వయ సైంధవం,
పునర్నవాయా మూలంచ మాయూరం బీజమేవచ. 157
కల్కీకృత్య ప్రదాతవ్య మజాక్షీరంచ దాపయేత్,
నస్య మేతత్ప్రయోక్తవ్యం నాసారోగవినాశనమ్. (సిద్ధవిద్యాభూః)

తా. వావిలియాకురసము ౧ ప్రస్థము, నూనె ౧ ప్రస్థము - వీనిలో త్రిఫలములు, త్రికటుకములు, తెల్లజీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, సైంధవలవణము, తెల్లగలిజేరువేరు, నెమలివిత్తులు అనువాని కల్కమును, ౨ శేర్లు మేకపాలను గలిపి తైలపక్వముగ కాచి నస్యముచేయించిన నాసారోగము హరించును.

### నస్యములు

క. అల నాగరసపుగడ్డయు, దిలసారము గూర్చి వండి తెలివిగ ధర రో
గులకు న్మరి నస్యంబులు, సలుపంగను మురికిపీనసంబులు మానున్.

గీ. మోద మలరంగ విను ముసిమోరగడ్డ
త్రొక్కి యదియును దైలంబుతోడ వండి
నవయుచున్నట్టి ధరణిమానవులకెల్ల
నస్యములుచేయ మురికిపీనసలు మాను.

### విడంగాదిచూర్ణము

విడంగ త్ర్యూషణం హింగు గుగ్గులుంచ మనశ్శిలాం,
అభయాచూర్ణమాఘ్రాయ ప్రతిశ్యాయాత్ప్రముచ్యతే (ఆయుర్వేద)

తా. వాయువిడంగములు, త్రికటుకములు, గుగ్గిలము, మణిశిల, కరక్కాయ - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి ఆఘ్రాణించిన పీనసము హరించును.

ఉష్ణోదకై ర్గుడం శుంఠీ చూర్ణం వా సైంధవం కణాః,
ఉష్ణోదకే ఘృతం నస్యే ఘ్రాణేచే త్పీనసం హరేత్. 160

తా. బెల్లము, శొంఠి అనువానినిగాని, లేక సైంధవలవణము, పిప్పలి అనువానినిగాని, ఉష్ణోదకముతోగూర్చి నస్యముజేయించినను, లేక ఉష్ణోదకములో నెయ్యి గలిపి నస్యముజేయించినను పీనసము హరించును. (గుంటగలగర, దొండ, వావిలి, అల్లము, అడ్డసరము, పసపు, ఉస్తికాయ, దుంపరాష్ట్రము, మిరియాలు, శొంఠి అను

వాని కల్కములో నూనె గలిపి తైలశక్వముగ కాచి నస్యముజేయించిన పీనసములు హరించును.)

మ. గలిజేరు స్మలిదొండ వావిలియు లోకఖ్యాతిగా నున్నయా
నలముక్కడ్డరసంబు నూనె పసపు న్నాద్యంబు వుచ్చిత్తయు
న్వెలయ న్నిందుల రాస్నము న్మిరియము న్విశ్వంబులు న్నిండి యిం
పలరం దైలము వండి నస్యములు చేయం బీనస ల్మానవే.

నాసికార్శోలక్షణము

నాసికారంధ్రయశ్చైవ హ్యాజ స్తనవదుద్భవేత్,
తన్నామ మునిభిః ప్రోక్తం నాసికార్శఇతి ధ్రువమ్. (ఆయుర్వేదే)

తా. నాసికారంధ్రములయందు మేకచండ్లవలె జనించిన నాసికార్శస్సని మునులు వచించెదరు.

నాసికార్శనివర్తకోపాయము

నాసారంధ్రేఽంగులీ స్థాప్య నాసికార్శశ్చ పీడితం,
వక్త్రే ప్రవిష్టం యుక్త్యా వై పాతయే ద్వ్యాధివేదిభిః. 162

తా. నాసికారంధ్రములలో వ్రేళ్ళను బ్రవేశింపజేసి యదిమిన కొననాలిక వద్దగాని, లేక అంగిటియందుగాని నాసికార్శస్సు దిగును. దానిని వ్రేళ్ళతో బట్టికొని యుక్తిచే త్రెంపివేయవలయును.

అశ్వగంధాదితైలేన నస్యే న్నాసార్శసో హరం,
అహింసపత్రం లశునం మరీచంచ తథా స్మృతమ్, 163

తా. అశ్వగంధాదితైలమును నస్యముజేయించినను, లేక ఆరెదొండతైలములో వెల్లుల్లిపాయలు, మిరియాలు గలిపి మర్దించి ౧౧ మార్లు నస్యము జేయించినను నాసికార్శస్సు (ముక్కున చీముగారుట) హరించును.

పీనసరోగములయందు పథ్యము

లఘ్వన్నం స్నిగ్ధలవణ ముష్ణభోజన మార్ద్రకం,
పక్షిమాంసం గుడం క్షీరం చణకా స్త్రికటోత్కటమ్, 164
బాలమూలక జోయూష కుళుత్థస్యచ పూజితం,

తా. లఘుకరాన్నము, సముద్రలవణము, వేడిపంటకము, అల్లము, పిట్టమాంసము, బెల్లము, పాలు, శనగలు, త్రికటుకములు, లేతముల్లంగి యుక్తముగ గాచంబడినయూషము, ఉలవకట్టు, ఛకారమువలన పెసరకట్టు - ఇవి పీనసములయందు పథ్య

కరంబులు. (మఱియు ఒత్తడమునిచ్చుట, పొగ నాఘ్రాణించుట పీనసములయందు ప్రశస్తంబు.)

శిరోరోగభేదములు

శిరోరోగాశ్చ జాయంతే వాతపిత్తకఫైస్త్రిభిః. 165
సన్నిపాతేన రక్తేన క్షయేణ కృమిభి స్తథా,
సూర్యావర్తానంతవాతార్ధావభేదకశంఖకైః. 166

తా. వాత, పిత్త, కఫ, సన్నిపాత, రక్త, క్షయ, క్రిమి, సూర్యావర్త, అనంతవాత, అర్ధావభేదక, శంఖములన ౧౧ విధములైన శిరోరోగంబులు జనించును. వానిలక్షణంబు లెవ్వియనిన—

వాతజశిరోరోగలక్షణము

యస్యానిమిత్తం శిరసోరుజశ్చ భవంతి తీవ్రానిశిచాతిమాత్రం,
బంధోపతాపైః ప్రశమశ్చ యత్ర శిరోఽభితాపస్ససమీరణేన.

తా. కారణములేకయే యకస్మాత్తుగ తలనొచ్చుట, రాత్రులయందు మిక్కుటముగనొచ్చుట, కట్టువలనగాని, లేక ఆవిరిపట్టుటవలనగాని, తలనొప్పి శమించుట - ఈలక్షణములుగలది వాతశిరోరోగమని తెలియవలయును.

యస్యోష్ణమంగారచితంతథైవ భవేచ్ఛిరోదహ్యతివాక్షినాసా,
శీతేనరాత్రౌచభవేచ్ఛమశ్చ శిరోఽభితాపస్సతు పిత్తకోపాత్.

తా. మస్తకముపై నిప్పుజల్లినటుల తపించుట, నేత్రములు నాసికము అనువానియందు దావిరివెడలుట, శీతకరపదార్థములవలనగాని, లేక రాత్రులయందుగాని శమించుట- ఈలక్షణములుగలది పిత్తప్రకోపమువలన గలిగిన శిరశ్శూలయని తెలియవలయును.

కఫజశిరోరోగలక్షణము

శిరోభవేద్యస్యకఫోపదిగ్ధం గురుప్రతిస్తబ్ధమథోహిమంచ,
శూనాక్షికూటంవదనంచయస్య శిరోఽభితాపస్సకఫప్రకోపాత్.

తా. శిరము కఫమువలన పూయఁబడినటులుండుట, బరువుగనుండుట, బంధింపఁబడినటులుండుట, చల్లగనుండుట, కంటిరెప్పలు, ముఖము ఉబ్బుట - ఈలక్షణములుగలది శ్లేష్మజశిరశ్శూలయని తెలియవలయును.

సన్నిపాతశిరోరోగలక్షణము

శిరోఽభితాపే త్రితయప్రవృత్తే సర్వాణిలింగాని సముద్భవంతి,

తా. వాత, పిత్త, కఫశిరోరోగలక్షణంబులన్నియుఁ గలది సన్నిపాతజశిరోరోగమని తెలియవలయును.

### రక్తజ శిరోరోగలక్షణము

రక్తాత్మకః పిత్తసమానలింగ స్స్పర్శాసహత్వం శిరసోభవేచ్చ.

తా. పిత్తజ శిరోరోగలక్షణయుక్తంబై శిరమున స్పర్శసహనము లేకుండునది రక్తజ శిరోరోగమని తెలియవలయును.

### క్షయజ శిరోరోగలక్షణము

అసృగ్వసాశ్లేష్మసమీరణానాం శిరోగతానామిహసంక్షయేణ,
క్షవప్రవృత్తిశ్శిరసోఽభితాపః కష్టోభవేదుగ్రరుజోఽతిమాత్రమ్.
సంస్వేదనచ్ఛర్దనధూమనస్యై రసృగ్విమోక్షైశ్చవివృద్ధిమేతి,

తా. శిరమునందలి రక్తము, వస, కఫము, వాయువు క్షయించుటవలన కష్టకరమైన కడుభయంకరమైన మస్తకశూల జనించి మిక్కుటముగ తుమ్ములు వచ్చుట, శిరము తపించుట, స్వేదనక్రియ, వాంతి, ధూమపానము, నస్యము, రక్తస్రావము అను వానివలన వృద్ధిం జెందుట-ఈలక్షణములుగలది క్షయజ శిరోరోగమని తెలియవలయును.

### కృమిజ శిరోరోగలక్షణము

నిస్తుద్యతేయస్యశిరోఽతిమాత్రం సంభక్ష్యమాణంస్ఫురతీవచాంతః
ఘ్రాణాచ్చగచ్ఛేద్రుధిరంసపూయంశిరోఽభితాపఃకృమిభిస్సఘోరః,

తా. శిరమున సూదులతో పొడుచునటుల మిక్కుటముగ పీడగలుగుట, శిరమునందలి మెదడు పురుగులవలన భక్షింపఁబడునటులుండుట, శిరములో మిక్కుటముగ చలించునటులుండుట, ముక్కువలన చీముతోడ రక్తముస్రవించుట, ముక్కులోనుండి క్రిములొకానొకప్పుడు వెడలుట - ఈలక్షణములుగలది క్రిమిజ శిరోరోగమని తెలియవలయును. భయంకరమైన ఈరోగము ప్రాణముల హరింపంజేయును.

### సూర్యావర్తలక్షణము

సూర్యోదయంయాప్రతిమందమంద మక్షిభ్రువంరుక్సముపైతిగాఢా,
వివర్ధతేచాంశుమతాసహైవ సూర్యాప్రవృత్తౌ వినివర్తతేచ,
శీతేనశాంతింలభతేకదాచి దుష్ణేనజంతుస్సుఖమాప్నుయాద్వా. 174
సర్వాత్మకంకష్టతమంవికారం సూర్యాపవర్తం త ముదాహరంతి,

తా. సూర్యోదయము మొదలు నేత్రములు, కనుబొమలు, మెల్లమెల్లగనొచ్చుటకు ప్రారంభించి సూర్యుఁడు వృద్ధిజెందునటులనే శూలయు వృద్ధిజెంది అస్తంగతుండగు సూర్యునిచందంబున కొంచకొంచమున శూలతగ్గుచు సూర్యాస్తమయకాలమునకు నిశ్శేషంబగుట, ఒకానొకప్పుడు శీతోపచారమువలనగాని, లేక ఉష్ణోపచారమువలనగాని సుఖముగలుగుట, సన్నిపాతవికారముగనుండుట-ఈలక్షణములుగలది సూర్యావర్తమని తెలియవలయును. ఇది కష్టసాధ్యము.

### అనంతవాతలక్షణము

దోషాస్తుదుష్టాస్త్రయఏవమన్యాం సంపీడ్యగాఢంసరుజాంసుతీవ్రాం.
కుర్వంతిసాక్షిభ్రువిశంఖదేశే స్థితింకరోత్యాశువిశేషతస్తు,
గండస్యపార్శ్వేచకరోతి కంపం హనుగ్రహంలోచనజాంశ్చరోగాః
అనంతవాతం త ముదాహరంతి దోషత్రయోత్థం శిరసోవికారం,

తా. వాత, పిత్త, కఫములు దుష్టంబులై మెడయొక్క వెనకటిసిర నాశ్రయించి బలముగ నీడ్చుచు నేత్రములు, కనుబొమలు, కణతలు అనువానిం జెంది కడుతీవ్రమైనపీడను గలుగంజేయుట, దానిసంబంధమువలన చెంపలయొక్క పార్శ్వములు మిక్కుటముగ వణకుట, చెక్కిళ్ళు కొట్టికొనుట, నేత్రరోగము గలుగుట. ఈలక్షణములు గలది అనంతవాతమని తెలియవలయును. ఇవి త్రిదోషమువలన జనించును.

### అర్ధావభేదలక్షణము

రూక్షాశనాత్యధ్యశన ప్రాగ్వాతావశ్య మైథునైః,
వేగసంధారణాయాస వ్యాయామైః కుపితోఽనిలః. 177
కేవల స్సకఫోవార్ధం గృహీత్వా శిరసో బలీ,
మన్యాభ్రూ శంఖ కర్ణాక్షి లలాటేఽర్ధేతి వేదనామ్. 178
శస్త్రారణినిభాం కుర్యా త్తీవ్రాంసోఽర్ధావభేదకః,
నయనం వాజవా శ్రోత్ర మభివృద్ధో వినాశయేత్. 179

తా. రూక్షాన్నమును సేవించుట, అజీర్ణముగ నుండునపుడు భుజించుట, తూర్పుగాలి, మంచు, మైథునము వీనిని సేవించుట, మలమూత్రవేగము నడ్డగించుట, శ్రమ, వ్యాయామము-ఇవి మొదలగువానివలన వాతముగాని, లేక వాతకఫముగాని ప్రకోపించి అర్ధశిరము నాశ్రయించి పెడతల, పెద్దనరము, కనుబొమ, కణత, చెవి, నేత్రము, లలాటము అనువానియొక్క నొకపార్శ్వమునందు వ్యాపించి బలిష్ఠమై శస్త్రముతో బొడుచునటులగాని, లేక నగ్నిదిసెడికఱ్ఱను మథించునటులగాని తీవ్రవేదనను గలుగంజేసిన అర్ధావభేదక మనంబడును. ఇది మిక్కుటముగ వృద్ధింజెందిన ఆభాగముయొక్క నేత్రమునుగాని, లేక చెవినిగాని నశింపంజేయును.

### శంఖలక్షణము

పిత్త రక్తానిలా దుష్టా శంఖదేశే విమూర్ఛితాః,
తీవ్రరుగ్దాహ రాగంహి శోథం కుర్వంతి దారుణమ్. 188
సశిరో విషవద్వేగీ నిరుంధ్యాశు గళం తథా,
త్రిరాత్రాజ్జీవితం హంతి శంఖకోనామ నామతః. 181

త్ర్యహాజ్జీవతి భైషజ్యం ప్రత్యాఖ్యాయాస్య కారయేత్,

తా. పిత్తము, రక్తము, వాతము అనునవి దుష్టంబులై (కఫముతో గలసి మిక్కుటముగ వృద్ధిం జెంది) కణతలయందు వ్యాపించి మిక్కుటముగ పోట్లను, మంటను, ఎఱుపువర్ణమై భయంకరమైన వాపును గలుగంజేయును. ఈవాపు విషవేగముగలదై మస్తకమువలన గొంతువఱకు వ్యాపించి శీఘ్రముగ గొంతునుబట్టికొని మూడుదినములలో మనుజుని జంపును. అదియ శంఖక మనంబడును. రోగి మూడుదినములకు పిదప జీవించియుండిన సాధ్యమని యెఱింగి బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు చికిత్సంజేయవలయును.

వాతజశిరోరోగచికిత్స

శిరోఽభిఘాతేఽనిలజే వాతవ్యాధివిధిం చరేత్. 182
ఘృతేనాక్తంశిరో రాత్రౌ పిబేద్యూషంపయోనువా, (మాధవనిదానే)

తా. వాతజశిరోభిఘాతమునందు వాతరోగికి జికిత్సంజేయవలయును. మఱియు రాత్రియందు శిరమున నెయ్యిపట్టించి యూషమునుగాని, లేక పాలనుగాని పానము జేయింపవలయును.

ఏరండాదిలేపనము

ఏరండచక్రమర్దోత్థబీజం పిష్ట్వారనాళకైః. 183
లలాటే లేపనాద్ధంతి వాతకోపశిరోరుజం,

తా. ఆముదపువిత్తులు, తగిరిశవిత్తులు-వీనిని పుల్లనికలితో నూరి నుదుటియందు లేపనముజేసిన వాతజశిరోరోగము హరించును.

వాతజాతశిరోరోగే స్నేహస్వేదవిమర్దనమ్. 184
పానాహారోపనాహాంశ్చ కుర్యాద్వాతామయాపహాః,

తా. వాతజశిరోరోగమున వాతనాశకరస్నేహమువలన స్వేదము, మర్దనము, పానము, ఆహారము, కట్టుగట్టుట మొదలగునుపచారముల సేయవలయును.

కుష్ఠాదిలేపనము

కుష్ఠ మేరండమూలంచ నాగరం తక్రపేషితమ్. 185
కటూష్ణంచ శిరఃపీడాం మాత్రా లేపనతో హరేత్,

తా. చెంగల్వకోష్టు, ఆముదపువేరు, శొంఠి - వీనిని మజ్జిగతో నూరి యుడికించి కొంచముష్ణముగ, దళముగ లేపనముజేసిన వాతజశిరశ్శూల హరించును.

కుష్ఠ మేరండమూలంచ లేపః కాంజికపేషితః. 186
శిరోర్తిం వాతజాం హన్యాత్పుష్పంవా ముచుకుందజం,

తా. చెంగల్వకోష్టు, ఆముదపువేరును అనువానినిగాని, లేక ముచుకుందపూలను గాని కలితోనూరి లేపనముజేసిన వాతజశిరశ్శూలహరించున్సు.

### వాతజశిరోరోగహరవస్తికర్మ

వేశిరోవ్యాపితచ్చర్మ షోడశాంగుళముచ్ఛ్రితమ్. 187
తేనవేష్ట్య శిరోధస్తాన్మాషకల్కేన లేపయేత్,
నిశ్చలస్యోపవిష్టస్య తైలైః కోష్ణైః ప్రపూరయేత్. 188

ధారయేదారుజశ్శాంతే ర్యామం యామార్ధమేవవా,
శిరోవస్తి ర్హరత్యేష శిరోరోగంచ వాతజమ్. 189
హనుమన్యాక్షికర్ణానా మర్దితం మూర్ధకంపనం,
వినాభోజనమేవైష శిరోవస్తి ప్రయుజ్యతే. 190
పంచాహం షడహంవాపి సప్తాహంచైవ మాచరేత్,

తా. శిరోరోగమున శిరమునకుతగిన ౧౬ అంగుళములపొడవు, వెడల్పుగల తోలును తలయందు టొప్పివలెజుట్టి దానిచుట్టు ఉద్దిపిండిని లేపనముజేసి రోగినికూర్చుండఁబెట్టి నూనెను కాచి హితోష్ణముగ నుండునపు డందుపోసి తలనొప్పి శమించువఱకు గాని, ఒకఝాముగాని, లేక అర్ధఝాముగాని ధరింపఁజేయుటయు శిరోవస్తి యనఁబడును. ఈశిరోవస్తిని ౫ దినములేని, లేక ౬ దినములేని, లేక ౭ దినములేసి జేసిన వాతమువలనగలిగిన శిరోరోగము, చెక్కిళ్ళు, పెడతల, పెద్దనరములు, నేత్రములు, చెవులు అనువానియందు గలుగురోగములు, అర్దితవాతము, తలవణుకు-వీనిని హరింపఁజేయును. ఈశిరోవస్తిని భోజనాత్పూర్వమే జేయించవలయును.

### పిత్తజశిరోరోగచికిత్స

పిత్తాత్మకే శిరోరోగే స్నిగ్ధం సమ్యగ్విరేచనమ్. 191
మృద్వీకాత్రిఫలేక్షూణాం రసైః క్షీరై ర్ఘృతైరపి,

తా. పిత్తజశిరోరోగమున ద్రాక్షపండ్లు, త్రిఫలములు, చెఱుకు అనువానిరసములచేతను, పాలు, నెయ్యి అనువానిచేతను బాగుగ విరేచనము జేయించవలయును.

### కుముదాదిబంధనము

కుముదోత్పలపద్మానాం శీతానాం చందనాంబుభిః. 192
స్పర్శాస్సుఖాశ్చపవనా స్సేవ్యాదాహార్తిశాంతయే,

తా. తెల్లకలువ, నల్లకలువ, కమలము అనువానిపై చందనోదకమును చల్లి మస్తకమునందు కట్టుగట్టి సుఖకరమైనగాలిని యనుభవింపఁజేసిన దాహము, పోటు శమించును.

### కఫజ శిరోరోగ చికిత్స

శ్లైష్మికే చందనై రూక్షైః ర్లేపస్వేదాదికారయేత్. 193

తా. కఫజ శిరోరోగమున చందనము, రూక్షకరద్రవ్యములు అనువానిలేపనమును, స్వేదాదిక్రియలు చేయవలయును.

### హరేణ్వాదిలేపనము

హరేణు నతశైలేయ ముస్తైలాగరు దారుభిః,
మాంసీ రాస్నోరుబూకైశ్చ కోష్ణో లేపః కఫార్తినుత్. 194

తా. రేణుకలు, గ్రంథితగరము, శిలాజిత్తు, తుంగముస్తెలు, ఏలకులు, కృష్ణాగరు, దేవదారు, జటామాంసి, సన్నరాస్నము, ఆముదపువేరు-వీనిని నూరి యుడికించి హితోష్ణముగ లేపనము చేసిన కఫజశిరోరోగము హరించును.

### ప్రపున్నాటాదిలేపనము

శుంఠీ కుష్ఠ ప్రపున్నాట దేవకాష్ఠై స్సమాహిషైః,
మూత్రపిష్టై స్సుఖోష్ణైశ్చ లేపశ్శ్లేష్మశిరోర్తినుత్. 195

తా. శొంఠి, చెంగల్వకోష్టు, తగిరిసెవిత్తులు, దేవదారు, మహిసాక్షిగుగ్గిలము - వీనిని అవుపంచితముతో నూరి యుడికించి సుఖోష్ణముగ లేపనముజేసిన కఫమువలన జనించిన మస్తకశూలాను హరింపంజేయును.

### సాన్నిపాతికశిరోరోగచికిత్స

సన్నిపాతసముత్థేఽత్ర ఘృతం తైలంచ వస్తయః,
ధూమనస్య శిరోరేకో లేపస్స్వేదాద్యమాచరేత్. 196

తా. సన్నిపాతశిరోరోగమున నెయ్యి, నూనె అనువానితో శిరోవస్తి చేయించుటయేగాక నాసికమున ధూమపానమును జేయించవలయును. మఱియు మస్తకరేచనము, స్వేదము, లేపనము మొదలగుక్రియలను చేయించవలయును.

స్వేదనం ఘృతగోధూమై ర్నిర్గుండ్యాః క్వథితేనవా,
సన్నిపాతోద్భవాం హంతి పీడాం హి హితపాచనైః. 197

తా. సన్నిపాతశిరోరోగమున ఘృతగోధుమలనుగాని, లేక వావిలినిగాని, కషాయముకాచి దానివలన స్వేదనకర్మను జేయించుటయేగాక హితకరమైన పాచనమునకు సహా యొసంగిన సన్నిపాతశిరోరోగము శమించును.

### రక్తజశిరోరోగ చికిత్స

రక్తజే పిత్తవత్సర్వం భోజనా లేప సేచనం,

శీతోష్ణయోశ్చ విన్యాసో విశేషా ద్రక్తమోక్షణమ్. 198

తా. సర్వపిత్తనాశకరభోజనము, లేపనము, సేచనము, శీతోష్ణపదార్థముల శిరమున ధరించుట, విశేషముగ రక్తస్రావమును జేయించుట - ఈ మొదలగువానిని రక్తజ శిరోరోగమున జేయవలయును.

కృష్ణాదిలేపము

కృష్ణాంబు శుంఠీ మధుక శతాహ్వోత్పలవాలకైః,
జలపిష్టై శ్శిరోలేప స్సద్యశ్శూలనివారణః 199

తా. పిప్పలి, వట్టివేరు, శొంఠి, అతిమధురము, పిల్లిపీచర, నల్లకలువ, కురువేరు - వీని నుదకముతో నూరి మస్తకమున లేపనముజేసిన తత్క్షణమున శూల హరించును.

నాగరాదినస్యము

నాగరకల్కవిమిశ్రం క్షీరం నస్యేన యోజితం పుంసా,
నానాదోషోద్భూతాం శిరోరుజం హంతి తీవ్రాంచ. 200
శిరోర్తిం నాశయత్యాశు పుష్పంవా ముచుకుందజం,

తా. శొంఠికల్కములో పాలు గలిపి నస్యముజేయించిన పలువిధదోషములవలన గలిగిన తీవ్రమైన మస్తకశూల శీఘ్రముగ హరించును.

దాడింబాదియోగములు

శిరశ్శూలే తు సంజాతే నాసారక్తం ప్రవేద్యది. 201
దాడిమీపుష్ప దూర్వోత్థ రసం కర్పూర మాక్షికం,
క్షమం దుగ్ధం శిరోమర్దం నస్యే పానే సితా పయః. 202

తా. దాడింబపువ్వు, గరికె అనువానిరసమునుగాని, లేక కర్పూరము, తేనె, పాలు అనువానినిగాని, శిరోమర్దనము, నస్యము, పానముజేయించిన మస్తకశూలవలన గలిగిన రక్తస్రావము హరించును. మఱియు పానముసేయునెడల దానియందు పంచదార, పాలు కలుపవలయును.

ఉదుంబరఫలయోగము

ఉదుంబరఫలం పక్వం ఘృతపక్వం సితాయుతం,
ఏలా మరీచ సంయుక్తం భుక్తం స్యాద్రక్తశాంతయే. 203
కంటకారీఫలరసం లిప్త్వా హంతి శిరోరుజం,

తా. పండిన అత్తిపండులో నెయ్యి, పంచదార కలిపి పాకముజేసి ఏలకులు, మిరియాలు గలిపి భక్షించిన నాసికారక్తస్రావము హరించును. మఱియు ములకపండ్లలో రసముదీసి శిరమున లేపనము చేసిన మస్తకశూల హరించును.

### నింబాదిగుగ్గులము

నింబత్వక్ త్రిఫలా వాసా చూర్ణం కటుపటోలికా. 204
తోయై శ్చతుర్గుణే క్వాథే పాదాంశం వస్త్రగాలితం,
ఆదాయ గుగ్గులుం తుల్యం క్షిప్త్వా తస్మి న్పునఃపచేత్. 205
పిండితం భక్షయే త్కర్షం స్నిగ్ధముష్ణం చ భోజయేత్,
వాతశ్లేష్మోత్థితాం పీడాం దుస్సహాంచ శిరోరుజమ్. 206

తా. వేపపట్ట, త్రిఫలములు, అడ్డసరము, చేతిపొట్ల - వీనిని సమభాగములుగ దంచి నాలుగింత ఉదకముబోసి చతుర్థాంశముగ కషాయముగాచి వడియగట్టి దానికి సమముగ శుద్ధిజేసిన గుగ్గిలముగలిపి గట్టియగువఱకు మరల గాచి ప్రతిదినమొకకర్ష మెత్తును సేవించుచుండిన వాతకఫలములవలనగలిగిన దారుణమైన మస్తకశూలను హరింపంజేయును. దీనియందు స్నిగ్ధముగ, ఉష్ణముగనుండు భోజనమును భుజింపంజేయవలయును.

### శిగ్రుపత్రాదిలేపము

శిగ్రుపత్రరసై ర్మర్ద్యం మరీచం మూర్ధశూలజిత్. 207

తా. మునగాకురసముతో మిరియములను నూరి లేపనముజేసిన మస్తకశూల హరించును.

### పిప్పల్యాదినస్యము

పిప్పలీ సైంధవం పాచ్యం తైలే నాజ్యేన నస్యతః,
శిరశ్శూలం నిహంత్యాశు తమస్సూర్యోదయో యథా. 208

తా. పిప్పళ్లు, సైంధవలవణము-వీనిచూర్ణమును నూనెలోగాని, లేక నేతిలోగాని గలిపి పాకముజేసి నస్యముజేయించిన సూర్యోదయమువలన నంధకారము హరించుభంగి మస్తకశూల శీఘ్రముగ హరించును.

### కృమిజశిరోరోగచికిత్స

కృమిజే తు శిరోరోగే వ్యోష నక్తాహ్వ శిగ్రుజైః,
అజామూత్రేణ సంపిష్టై ర్నస్యం క్రిమిహరం పరమ్. 209

తా. త్రికటుకములు, కానుగపట్ట, మునగపట్ట-వీనిని మేకపంచితముతో నూరి నస్యముజేయించిన క్రిమిజశిరోరోగము హరించును. ఇది క్రిముల నశింపంజేయుటయందు కడుశ్రేష్ఠంబైనదిగ నున్నయది.

### విడంగాది తైలము

విడంగం సర్జికా దంతీ హింగు గోమూత్రసంయుతం,

విపక్వం సార్షపం తైలం కృమిఘ్నం నస్యతః స్మృతమ్. 210

తా. వాయువిడంగములు, సర్జక్షారము, దంతివేరు, ఇంగువ-వీని నావుపంచితము నూరి కల్కముజేసి అందు తెల్లావనూనెగలిపి కాచి నస్యముచేయించిన క్రిమిజ శిరోరోగము హరించును.

### సూర్యావర్తచికిత్స

సూర్యావర్త ప్రశమనం పాయయే త్సగుడం హవిః,
తిలదుగ్ధప్రలేపేన సూర్యావర్తం జయేత్ర్యహాత్. 211

తా. నెయ్యిలో బెల్లముగలిపి త్రాగినను, లేక నువ్వులను పాలతోనూరి లేపనముసినను మూడుదినములలో సూర్యావర్తము హరించును.

### సూర్యావర్తశిరోరోగచికిత్స

సూర్యావర్తే సిరా వేధో నావనం క్షీరసర్పిషోః,
హితః క్షీర ఘృతాభ్యాస స్తాభ్యామేవ విరేచనమ్. 212

తా. సూర్యావర్తమను శిరోరోగమున సిరను వేధించుటయేగాక పాలు, నెయ్యినువానియొక్కనస్యమును పానము చేయించవలయును. మఱియు వానిచేతనే విరేచనంను చేయించవలయును.

### సూర్యావర్తరసము

మృతసూతాభ్రకం తీక్ష్ణం ముండం తామ్రం మృతం సమం,
స్నుహీక్షీరే దినం మర్ద్యం పిండితం మాషమాత్రకమ్. 213
మధునా మర్దితం భక్షే ల్లోహపాత్రే దినేదినే,
సప్తాహా త్సూర్యవర్తాదీ౯ శిరోరోగా న్నివారయేత్. 214
సూర్యోదయరసానామ్నా సర్వమూర్ధగదాపహః,

తా. రసభస్మము, అభ్రకభస్మము, లోహభస్మము, ఇనుపభస్మము, తామ్రభస్మం-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి బొంతజముడుపాలతో నొకదినము, తేనెనొకదినము మర్దించి మాషప్రమాణము మాత్రలుచేసి లోహపాత్రలో నునిచి ప్రతిదినము సేవించుచుండిన నేడుదినములలో సూర్యావర్తము మొదలగు సర్వశిరోరోగములు, ర్థతలనొప్పి వీనిని హరింపంజేయును.

### మహాలక్ష్మీవినాశనీరసము

లోహ మభ్రం విషం ముస్తం త్రిఫలా త్రికటుం తథా. 215
ధుత్తూరం వృద్ధదారుం చ బీజమింద్రాశనస్య చ,
గోక్షురకద్వయం చైవ పిప్పలీమూలమేవ చ. 216

ఏతేషాం సమతాచూర్ణం రసైర్ధుత్తూరకస్య చ,
నిక్షిప్య వటికా కార్యా బదరాస్థిప్రమాణతః. 217
అనుపానం ప్రయోక్తవ్యం శుంఠీచూర్ణం ద్విమాషకం,
ఆర్ద్రకస్య రసం చైవ తోలకద్వయమేవచ 218
మహాలక్ష్మీవినాశోఽయం సన్నిపాతనివారకః,

తా. లోహభస్మము, అభ్రకభస్మము, అతివస, తుంగముస్తెలు, త్రిఫలములు, త్రికటుకములు, ఉమ్మెత్తవిత్తులు, బోద్ధివిత్తులు, ఇంద్రాశనము, పల్లేరు, ఏనుగపల్లేరు, మోడి - వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ఉమ్మెత్తరసముతో మర్దించి రేగుగింజంతమాత్రలుచేసి యందొకదానిని రెండుమాషములయెత్తు శొంఠిచూర్ణానుపానముతోగాని, లేక రెండుతులములయెత్తు అల్లపురసముతోగాని సేవించిన సన్నిపాతాత్మక మస్తకశూల హరించును.

దశమూలాదినస్యము

దశమూలీకషాయంతు సర్పిస్సైంధవసంయుతమ్. 219
నస్య మర్ధావభేదఘ్నం సూర్యావర్తం శిరోర్తినుత్,

తా. దశమూలములకషాయములో నెయ్యి, సైంధవలవణముగలిపి నస్యముచేయించిన అర్ధతలనొప్పి, సూర్యావర్తము, మస్తకశూల వీనిని హరింపంచేయును.

శారిబాదిలేపము

శారిబోత్పలకుష్ఠాని మధుకం చామ్లపేషితమ్. 220
సర్పిస్తైలయుతో లేపః సూర్యావర్తార్ధభేదయోః,

తా. సుగంధిపాలవేరు, నల్లకలువగడ్డలు, చెంగల్వకోష్టు, అతిమధురము - వీనిని అమ్లద్రవ్యములతో నూరి అందు నెయ్యి, నూనె గలిపి లేపనము చేసిన సూర్యావర్తము, అర్ధతలనొప్పి హరించును.

భృంగరాజాదినస్యము

భృంగరాజరసశ్ఛాగక్షీరతుల్యోఽర్కతాపితః. 221
సూర్యావర్తం నిహంత్యాశు నస్యేనైవ ప్రయోగరాట్,

తా. గుంటగలగరరసమునకు సమముగ మేకపాలుగలిపి సూర్యపుటంబిడి నస్యముచేయించిన సూర్యావర్తము శీఘ్రముగ హరించును.

అనంతవాతశిరోరోగచికిత్స

అనంతవాతే కర్తవ్య స్సూర్యావర్తహితోవిధిః. 222
సిరావేధశ్చ కర్తవ్యోఽనంతవాతప్రశాంతయే,

తా. అనంతవాతమున సూర్యావర్త నివారణార్థమై జెప్పంబడియుండు చికిత్సలను, సిరావేధనమును జేసిన అనంతవాతము శమించును.

శుంఠ్యాదినస్యము

శుంఠ్యానస్య మజాక్షీరే కృతం తద్ధి శిరోర్తినుత్. 223

తా. శొంఠిని మేకపాలతో జాది నస్యము జేయించిన తలనొప్పి హరించును.

కుంకుమఘృతము

కుంకుమం ఘృతసంయుక్తం నస్యే దర్ధశిరో వ్యథాం,
నాశయే త్తత్క్షణా దేవహిత మేతచ్ఛిరోరుజి. 224

తా. కుంకుమపువ్వును నేతితోనూరి నస్యముజేయించిన తత్ క్షణమున అర్ధతలనొప్పిని హరింపజేయును. ఇది తలనొప్పియందు కడుహితకరంబు.

గాంధార్యాదినస్యము

గాంధారీచ జటామాంసి ఘృతేన సహ పాచయేత్,
తదాజ్యం నస్యమాత్రేణ నిహంత్యర్ధశిరోరుజమ్ 225

తా. గంజాయి జటామాంసి అనువానికల్కములో నెయ్యిగలిపి కాచి నస్యము జేయించిన తక్షణమున అర్ధతలనొప్పి హరించును.

తువర్యాదినస్యము

అర్ధావభేదే తువరీదలోద్భవం రసంసుదూర్వారసమిశ్రితంచ,
నస్యేనయుక్త్వాపురుషస్తుబుద్ధిమాన్ శిరోరుజంనాశయతిస్మతత్క్షణమ్.

తా. కందియాకులు, గరిక అనువానిరసములను నస్యముజేయించిన తత్ క్షణమున అర్ధతలనొప్పి హరించును.

విడంగాదినస్యము

విడంగాని తిలాన్ కృష్ణాన్ సమాన్ పిష్ట్వా విలేపయేత్,
నస్యంచాథాచరే త్తస్మా దర్ధభేదం వ్యపోహతి. 227

తా. వాయువిడంగములు, నల్లనువ్వులు-వీనిని సమభాగములుగ నూరి లేపన, నస్యములు జేయించిన అర్ధతలనొప్పి హరించును.

గిరకర్ణ్యాదినస్యము

గిరికర్ణీఫలం మూలం సజలం నస్యమాచరేత్,
మూలంవా బంధయే త్కర్ణే నిహంత్యర్ధశిరోరుజమ్. 228

తా. తెల్లగంటెనవిత్తులనుగాని, లేక దానివేరునుగాని ఉదకముతోనూరి నస్యము జేయించినను, లేక దానివేరును చెవిలోగట్టినను అర్ధతలనొప్పి హరించును.

### మరీచాదిలేపము

మరీచం భృంగరాజైర్ద్రావ్యై ర్మరిచం శాలితండులైః,
అర్ధశీతవ్యథాం హంతి లేపోవా శుంఠివారిణా. 229

తా. మిరియాలనుగాని, లేక మిరియాలు, బియ్యము అనువానినిగాని గుంటగలగరాకు రసముతో నూరి లేపనముజేసినను, లేక శొంఠిని ఉదకముతో నూరి లేపనముజేసినను అర్ధతలనొప్పి హరించును.

### శారిబాదిలేపనము

శారిబా కుష్ఠ మధుక వచా కృష్ణోత్పలై స్తథా,
లేప స్సకాంజిక స్స్నేహ స్సూర్యావర్తార్ధభేదయోః. 230

తా. సుగంధిపాలవేరు, చెంగల్వకోష్టు, అతిమధురము, వస, పిప్పలి, నల్లకలువ వీనిని కలితోగాని, నేతితోగాని నూరి లేపనముజేసిన సూర్యావర్తము, అర్ధతలనొప్పి హరించును.

### దుగ్ధమర్దనాదినస్యము

సితోపలయుతం ఘృష్టం మదనం గోపయోఽన్వితం,
నస్యతోఽనుదితే సూర్యే నిహంత్యే వార్ధభేదకమ్. 231

తా. ఖండశర్కర, మ్రంగకాయ-దీనిని చూర్ణముజేసి ఆవుపాలతో గాచి సూర్యావర్తమను తలనొప్పి దగులుటకు ముందు నస్యముజేయించిన సూర్యావర్తము, అర్ధతలనొప్పి హరించును.

### శశాదియోగము

శశముండరసం పీత్వా మరిచై రవచూర్ణితం,
భోజనాదౌతు సప్తాహా త్సూర్యావర్తార్ధభేదకౌ.
హంతి సర్వాత్మకౌ శీఘ్రదుఃఖదౌ భృశదారుణౌ,

తా. బాలింతబోశము, బోడతరము అనువానిరసములో మిరియపుచూర్ణము గలిపి ఏడుదినములు భోజనాత్పూర్వము త్రాగిన కడుపీడతోగూడి భయంకరముగనుండు అర్ధావభేదకము, సన్నిపాతకసూర్యావర్తము వీనిని హరింపంజేయును.

### దార్వ్యాదిలేపము

దార్వీ హారిద్రా మంజిష్ఠా సనింబోశీర పద్మకమ్. 233
ఏతత్ప్రలేపనం కుర్యా చ్ఛంఖకస్య ప్రశాంతయే,

తా. మ్రానిపసుపు, పసుపు, మంజిష్టి, వేపవేరు, వట్టివేరు, పద్మకాష్టము-వీనిని నూరి లేపనముజేసిన శంకము హరించును.

బలాదిలేపము

బలా నీలోత్పలం దుర్వా తిలాఃకృష్ణాః పునర్నవా. 234
శంఖకేఽనంతవాతేచ లేపస్సర్వశ్శిరో ర్తినుత్,

తా. ముత్తవపులగము, నల్లకలువ, గరిక, నల్లనువ్వులు, తెల్లగలిజేరు-వీనిని నూరి లేపనము జేసిన శంఖకము, అనంతవాతము, సర్వమస్తకరోగము-వీనిని హరింపం జేయును.

కరంజాదిచూర్ణ విరేచనము

కరంజ శిగ్రుబీజాని పత్రకం సర్షపత్వచః 235
సర్వేషాం శీర్షరోగాణా మేతచ్ఛీర్ష విరేచనం,

తా. క్రానుగవిత్తులు, మునగవిత్తులు, లవంగపత్రి, తెల్లావాలు, లవంగపట్ట-వీని చూర్ణముతో శిరోవిరేచనము జేయించుట సర్వశిరోరోగములయందు ప్రశస్తము.

గుడాదినస్యము

నావనం సగుడం విశ్వం పిప్పలీ సైంధవాంబునా. 236
భుజస్తంభాదిరోగేషు సర్వమూర్ధగదేషుచ,

తా. బెల్లము, అల్లపురసము, పిప్పలి, సైంధవలవణము-వీనినుదకముతోనూరి నస్యము జేయించిన భుజస్తంభాదికరోగములు, సర్వశిరోరోగములు-వీనిని హరింపంజేయును.

శర్కరాదినస్యము

సశర్కరంకుంకుమమాజ్యభృష్టం నస్యంవిధేయంపవనాసృగుత్థే. 237
భ్రూశంఖకర్ణాక్షిశిరోఽర్ధశూలే దినాభివృద్ధిప్రభవేచరోగే,

తా. నేతితో వేయించఁబడిన కుంకుమపువ్వులు పంచదారలోగలిపి నస్యముచేయించిన వాతరక్తములవలన కనుబొమలు, కణతలు, చెవి, నేత్రములు అనువానియందు గలుగుశూల, అర్ధశిలనొప్పి, ప్రొద్దెక్కినట్టెల్ల వృద్ధిజెందెడి శూల హరించును.

క్షీరాదినస్యము

గుడ నాగరకల్కస్య నస్యం మస్తకశూలనుత్. 238
నాగరకల్కవిమిశ్రం క్షీరం నస్యేన యోజితం నృణాం,
నానాదోషోద్భూతాం శిరోరుజం హంతి తీవ్రతరామ్. 239

తా. బెల్లము, శొంఠి అనువానికల్కమును నస్యము చేయించిన తలనొప్పిని హరింపంజేయును. మఱియు శొంఠికల్కములో పాలుగలిపి నస్యము చేయించిన పలువిధదోషములవలన గలిగిన దారుణమైన తలనొప్పిని హరింపంజేయును.

నీలోత్పలాదితైలము

నీలోత్పల కణా యష్టి చందనం పుండరీకకం,
ప్రతినిష్క చతుష్కంస్యా త్తైలం షోడశకం పలమ్. 240

చతుష్షష్టిపలం ధాత్రీఫలానాం రసమాహరేత్,
పచే త్తైలావశేషంతు నస్యే నాభ్యంజనేన వా.
యోజ్యం హంతి శిరస్తోదం పలితంచ వినాశయేత్,

తా. నల్లకలువ, పిప్పళి, అతిమధురము, చందనము, తెల్లతామరపువ్వు-ఇవి దిను ఒకటింటికి ౪ నిష్కములు, నువ్వులనూనె ౧౬ పలములు, ఉసిరికకాయలరసము ౬౪ కములు- ఇటుల వీనినెల్ల నేకముజేసి తైలపక్వముగాచి నస్యము, అభ్యంజనము జేయించి మస్తకశూల, పలితము వీనిని హరింపంజేయును.

శిరోరోగమునందు పథ్యము

స్వేదోనస్యం ధూమపానం విరేకో లేపస్సేకోలంఘనంశీర్షవస్తిః,
రక్తోస్మృక్తిర్వహ్నికర్మోపనాహో జీర్ణంసర్పిశ్శాలయష్షష్టికాశ్చ. 24
యూషోదుగ్ధంధన్వమాంసంపటోలంశిగ్రుర్ద్రాక్షావాస్తుకంకారవేల్లం
ఆమ్రాధాత్రీ దాడిమంమాతులుంగంతైలం తక్రంకాజికంనారికేళమ్
పథ్యాకుష్ఠంభృంగరాజఃకుమారీ ముస్తోశీరంచంద్రికాగంధసారాః,
కర్పూరంచఖ్యాతిమానేషవర్గస్సేవోక్యమస్త్యైశ్శిరోరోగేయథాస్వమ్

తా. ఆవిరిమొదలగువానిచే చమటదీయుట, నస్యము, ధూమపానము, విరేనము, లేపనము, సేచనము, లంఘనము, శిరోవస్తి, రక్తస్రావము, రక్షవేయుట, కట్టుగట్టుట, ప్రాతనెయ్యి, అరువదిదినములకు ఫలించినబియ్యము, యూషము, పాలు, అడమృగమాంసము, పొట్లకాయ, మునక్కాయ, ద్రాక్షపండ్లు, చక్రవర్తికూర, కాకకాయ, మామిడికాయ, ఉసిరికకాయ, దాడింబకాయ, మాదీఫలము, నూనె, మజ్జిగకలి, టెంకాయ, కరక్కాయ, చెంగల్వకోష్టు, గుంటగలగర, కలబంద, తుంగముస్తెల వట్టివేరు, వెన్నెల, చందనము, కర్పూరము-ఇవి శిరోరోగమున పథ్యకరంబులు.

శిరోరోగమునం దపథ్యము

క్షవం జృంభాం మూత్ర బాష్పం నిద్రా విడ్వేగ మంజనం,
దుగ్ధం నీరం విరుద్ధాన్నం విరుద్ధజలమజ్జనమ్. 24
దంతకాష్ఠం దివానిద్రాం శిరోరోగీ పరిత్యజేత్.

తా. తుమ్ములు, ఆవలింతలు, మూత్రము, కంటినీరు, నిద్ర, మలవేగము, వీనినడ్గించుట, అంజనము, పాలు, ఉదకము, విరుద్ధాన్నము, దుష్టమైనయుదకములో స్నానముజేయుట, దంతకాష్ఠము, పగటినిద్ర-ఇవి శిరోరోగమున అపథ్యకరంబులగుటచే వానిని వర్జింపవలయును.

అష్టాదశ ప్రకరణమ్.

# ఏకోనవింశ ప్రకరణము



## గుల్మరోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లో. కందర్పనాగపంచాస్యం గజదైత్యవినాశనం,
మహాతాండవశాలీనం లింగమూర్తి మహం భజే. 1

తా. మన్మథజయశీలుండును, గజాసురసంహారకుండును, నటనప్రియుండును, లింగస్వరూపుండు నగు పరమేశ్వరుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుండై బసవరాజని పేరొందంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథము యొక్క ఏకోనవింశప్రకరణమును వచించుచున్నాఁడను.

### గుల్మరోగనిదానము

దుష్టావాతాదయోఽత్యర్థం మిథ్యాహారవిహారతః,
కుర్వంతి పంచధాగుల్మం కోష్ఠాంతర్గ్రంథిరూపిణమ్. (ఆయుర్వేదే)

తా. మిథ్యాహారవిహారమువలన వాత, పిత్త, శ్లేష్మములు మిక్కుటముగ ప్రకోపించి కోష్ఠమధ్యమున గ్రంథిరూపమైన అయిదువిధములైన గుల్మముల గలుగంజేయును.

### గుల్మరోగభేదములు

తేషాం పంచవిధం స్థానం పార్శ్వహృన్నాభివస్తయః,
సశోణితైః పృథగ్ద్వంద్వ సంఘాతైః కేచిదష్టధా. 4

తా. ఇరుపార్శ్వములు, హృదయము, నాభి, పొత్తికడుపు అనునవి యైదును గుల్మమునకు స్థానంబులు. మఱియు రక్తగుల్మము, వాతగుల్మము, పిత్తగుల్మము, శ్లేష్మగుల్మము, వాతపిత్తగుల్మము, వాతశ్లేష్మగుల్మము, పిత్తశ్లేష్మగుల్మము, సన్నిపాతగుల్మము అను గుల్మము లెనిమిది విధంబులని కొందఱు వచించెదరు.

### గుల్మరోగసామాన్యరూపములు

అరుచిః కృచ్ఛ్రవి *ణ్మూత్ర మగ్నిమాంద్యాంత్రకూజనం,
ఆనాహశ్చోర్ధ్వవాతత్వం సర్వగుల్మేషు లక్షయేత్. 5

---

*విణ్మూత్రం వా తేనాంత్రవికూజనమ్=వాతప్రకోపమువలన ప్రేగు లఱచుట.

తా. అరుచిగలుగుట, మలమూత్రములు కడుకష్టముమీఁద వెడలుట, అగ్నిమాంద్యము గలుగుట, వాతమువలన ప్రేగు లఱచుట, కడుపుబ్బుట, వాతమూర్ధ్వముఖంబగుట- ఈలక్షణములు సర్వగుల్మములయందు సాధారణంబుగ నుండును.

వాతగుల్మలక్షణము

యస్థానసంస్థానరుజావికల్పం విడ్వాతసంగంగళవక్త్రశోషం,
శ్యావారుణత్వం శిశిరజ్వరం చ హృత్కుక్షిపార్శ్వాంసశిరోరుజం చ. 6
కరోతిజీర్ణేత్వధికం ప్రకోపం భుక్తేమృదుత్వం సముపైతియశ్చ,
వాతాత్సగుల్మోనచతత్రరూక్షం కషాయతిక్తం కటుశందిశేన్న. 7

తా. ఒకానొకపుడు నాభి, వస్తిపార్శ్వములు అనువానియందు వ్యాపించుట, ఒకానొకప్పుడు సూక్ష్మముగ, లావుగ, గుండ్రముగ, లేక పొడవుగ నుండుట, ఒకానొకప్పుడు మృదువుగ, మఱియొకప్పుడు కఠినముగ, పలువిధవేదనలు గలదిగ నుండుట, మలవాతముల నడ్డగించుట, కంఠము, నోరు ఎండుట, శరీరము నీలవర్ణయుక్తముగగాని, లేక ఎఱ్ఱగగాని యుండుట, శీతజ్వరము గలుగుట, హృదయము, కడుపు, పార్శ్వములు, భుజశిరస్సులు అనువానియందు శూల గలుగుట, అన్నము జీర్ణంబైన పిదప మిక్కుటముగ బ్రకోపించుట, భోజనానంతరము మృదువగుట - ఈలక్షణములు గలది వాతగుల్మమని తెలియవలయును. దీనియందు రూక్షము, వగరు, చేదు, కారము గలపదార్థముల సేవింపఁజేసినను సుఖము గలుగకుండును.

పైత్తగుల్మలక్షణము

జ్వరస్తృష్ణాంగతాపశ్చ పక్వేజీర్ణేఽతిశూలతా,
స్పర్శాసహోభ్రమస్వేదః పైత్తగుల్మస్యలక్షణమ్. (ఆయుర్వేదే) 8

తా. జ్వరము, దప్పిగలుగుట, అవయవములు మండుట, అన్నము జీర్ణంబగునపుడు కడుపు మిక్కుటముగ శూలించుట, తాఁకిన నోర్చకుండుట, భ్రమ, చెమట గలుగుట-ఈలక్షణములుగలది పైత్తగుల్మమని తెలియవలయును.

శ్లేష్మగుల్మలక్షణము

శీతజ్వరశ్చ హృల్లాసః కాసో హృద్వేగ గౌరవం,
ఉన్నతం కఠినంతూక్తం కఫగుల్మస్య లక్షణమ్. 9

తా. శీతజ్వరము, ఓకరింతలు, దగ్గుగలుగుట, ఱొమ్మదరుట, శరీరము జడముగ నుండుట, గుల్మము పొడవుగ, కఠినముగ నుండుట - ఈలక్షణములుగలది శ్లేష్మగుల్మమని తెలియవలయును.

ద్వంద్వ, సన్నిపాతగుల్మలక్షణము

మిశ్రితే ద్వంద్వజం గుల్మం సర్వలింగం త్రిదోషజం,

వాతపిత్తాధికే గుల్మే దాతవ్య శ్శిఖిబాడబః. (అశ్వినికల్పే) 10

తా. వాతపిత్త, వాతశ్లేష్మ, పిత్తశ్లేష్మలక్షణంబులుంగలది ద్వంద్వగుల్మమనియు, వాత, పిత్త, శ్లేష్మలక్షణంబులుంగలది త్రిదోషగుల్మమనియు తెలియవలయును. వీని యందు శిఖిబాడబరసము నొసంగవలయును. (పూర్వోక్తపంచగుల్మములలో ద్వంద్వ త్రిదోషగుల్మము లసాధ్యంబులు. ఏకదోషజనితగుల్మములు సాధ్యంబులు.)

## రక్తగుల్మలక్షణము

ఆమగర్భస్స్రవేచ్చాథ యానారీ ముంచతి క్వచిత్,
వాయుఃప్రగృహ్య తద్రక్తం రక్తగుల్మం కరోతి చ. 11
పుంసాం చ రక్తఘాతేన రక్తపిత్తాధికే క్వచిత్,
పిత్తగుల్మం యథాచిహ్నం తథైవస్యాద్రుజాధికమ్. 12
సశూలం గర్భవత్పిండం గర్భవల్లక్షణం భవేత్,
చికిత్సేద్దశమేమాసే పుంసాంచేత్తత్క్షణే భవేత్. 13
గతప్రసవకాలాయై నార్యాగుల్మశ్చ సంభవేత్,
స్నిగ్ధస్విన్నశరీరాయై దద్యాత్స్నేహవిరేచనమ్. (ఆయుర్వేదే) 14

తా. స్త్రీ యపక్వగర్భము స్రవించినపుడుగాని, లేక ఒకానొకప్పుడు గర్భ స్రావము జేయించికొనినపుడుగాని, అపథ్యము, సేయుటవలన వాతము ప్రకోపించి రక్తమునుజేర్చి రక్తగుల్మమును గలుగంజేయును. మఱియు పురుషులకు రక్తఘాతము వలనగాని, లేక ఒకానొకప్పుడు రక్తపిత్తాధిక్యమువలనగాని, రక్తగుల్మము జనించి పిత్త గుల్మలక్షణయుక్తంబై యుండును. ఐనను దానియందు వేదనమాత్రం బధికంబై శూల, గర్భపిండాకారము, గర్భలక్షణములు గలిగియుండును. రక్తగుల్మము స్త్రీకి జనించిన పది మాసములు గడచినపిదప జికిత్సం జేయవలయును. పురుషునికైన తత్క్షణమున జికిత్సం జేయవలయును. మఱియు బ్రసవించిన స్త్రీలకు హితకరభోజనములు సేయుటచే తఱుచుగ రక్తగుల్మము జనించును. తన్నివారణార్థంబై శరీరమునకు చమురుబట్టించి చెమటం దీయు టయేగాక స్నేహముచే విరేచనమును జేయింపవలయును.

నవప్రసూతాహితభోజనాయా యాచామగర్భంవిసృజేదృతౌ వా,
వాయుర్హితస్యాఃపరిగృహ్యరక్తం కరోతిగుల్మంసరుజంసదాహమ్.
పైత్తస్యలింగేనసమానలింగం విశేషణంచాప్యపరంనిబోధ,
యస్స్పందతేపిండతఏవనాంగై శ్చిరాత్సశూలస్సమగర్భలింగః. 16
సరౌధిరఃస్త్రీభవఏవగుల్మో మాసేవ్యతీతేదశమేచికిత్స్యః,
(మతాంతరే)

తా. నవీనముగ ప్రసవించిన స్త్రీ యపథ్యకర భోజనముల సేయుటవలన గాని, అపక్వ గర్భపాతమువలనగాని, ఋతుకాలమున నపథ్యకరభోజనము సేవించుటవలనగాని, వాతము ప్రకోపించి ఋతుకాలరక్తమును గ్రహించి దాహాపీడల గలుగంజేయుచు పూర్వోక్తపిత్తగుల్మలక్షణయుక్తంబై రక్తగుల్మమును గలుగంజేయును. ఐనను దీనియందు మఱియొక విశేషముగలదు. అదెద్దియనిన - ఈరక్తగుల్మము అవయవయుక్తంబై చలింప శూలతోఁగూడి గర్భలక్షణయుక్తంబై (అనఁగా ఋతు వుడుగుట, నోటిలో నీళ్ళూరుట, స్తన్యముయొక్క యగ్రభాగము నల్లగనగుట - ఈమొదలగు రోగస్వభావలక్షణయుక్తంబై దీర్ఘకాలమువఱకు గుండ్రముగనే చలింపుచుండును. ఈరక్తగుల్మము స్త్రీలచే జనించును. దీనియందు పదియవమాసము గడచినపిదప జికిత్సం జేయవలయును. (మఱియు దీనినే కొందరు గర్భమనియు, మఱికొందరు రక్తగుల్మమనియు వచించెదరు. ఈసంశయము పదిమాసములు గడచుటకుముందు నివర్తిగాకుండుటచే నదివఱకు చికిత్సచేయంజనదు. మఱియు ౯ లేక ౧౦ యవమాసము సాధారణముగ ప్రసూతికాలంబులు. ఐన నిది రక్తగుల్మమునందు భేదంబగును. కావున "శ్లో. యస్స్పందతే పిండిత ఏవనాంగైః" ఇత్యాది విశేషలక్షణములు గనుపించుటవలన సంశయము నివర్తియగును. మఱియు గర్భ మెల్లపుడు ప్రత్యేక అవయవములవలన శూలను గలుగంజేయక చలింపుచుండును. రక్తగుల్మము తద్వ్యతిరిక్తంబుగ నుండును. జ్వరము జీర్ణంబైనపిదప క్షీరపానవిరేచనములు హితకరంబులగు చందంబున పదిమాసములు గడచినపిదప సుఖసాధ్యంబగుటచే తదనంతరము జికిత్సింపవలయునని జెప్పంబడియెను. మఱియు గ్రంథాంతరములయందు "శ్లో. రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యస్య లక్షణమ్" అనఁగా రక్తగుల్మమునకు పదిమాసములు గడచిన పిదపనే పురాణత్వము సంభవించిన సుఖసాధ్యంబగునని జెప్పంబడియున్నది.)

ఋతుకాలేపివాగర్భే స్రుతేరాదాహశూలవత్,
రక్తగుల్మం ప్రజాయేత గర్భలింగాభిసూచకః. 17
నార్యాలోహితగుల్మంస్యాత్సూతికాలేగతేభిషక్,
చికిత్సేత యథాశాస్త్రం శమయే న్నాత్రసంశయః. (గ్రంథాంతరే)

తా. స్త్రీలకు ఋతుకాలమునందుగాని, గర్భస్రావము గలిగినపుడుగాని, దాహశూలయుక్తముగ రక్తగుల్మము జనించును. దానియందు గర్భలక్షణములే గలిగియుండును. స్త్రీకిజనించిన రక్తగుల్మమునందు ప్రసవకాలము గడచినపిదప శాస్త్రోక్తముగ చికిత్సం జేసిన నిస్సంశయముగ శమించును.

## అసాధ్యరక్తగుల్మలక్షణము

కూర్మోన్నతం సిరారుద్ధం గుల్మం బహుగదాలయం,
వివర్జయే ద్భిషగ్దూరా త్పాణ్యంస్త్రీ నాభిశోభితా. 19

తా. రక్తగుల్మము తాఁబేలువలె సున్నతమై నరములతో వ్యాప్తంబై జ్వరాద్యుపద్రవములతోగూడి చేతులు, కాళ్ళు, బొడ్డు వాచియుండిన నాస్త్రీని వైద్యుఁడు చికిత్సయందు వర్జింపవలయును.

## రక్తగుల్మచికిత్స

అతిప్రవృద్ధమస్రంతు భిన్నే గుల్మే నివారయేత్,
ప్రయత్నలోభిషక్తూర్ణ మసృగ్దరచికిత్సయా. 20

తా. రక్తగుల్మము పగిలిన రక్తం బధికముగ స్రవించుచున్న దానియందు వైద్యుఁడు శీఘ్రముగ ప్రదరచికిత్సం జేయవలయును.

## అసాధ్యగుల్మలక్షణము

సంచితః క్రమశో గుల్మో మహావాస్తుపరిగ్రహః,
కృతమూలస్సిరానద్ధోయదాకూర్మఇవోన్నతః. 21
దౌర్బల్యారుచిహృల్లాస కాసచ్ఛర్ద్యరతి జ్వరైః,
తృష్ణా తంద్రా ప్రతిశ్యాయై ర్యుజ్యతే నససిద్ధ్యతి. (మాధవనిదానే)

తా. గుల్మము క్రమక్రమముగ వృద్ధింజెంది యుదరము నంతంతట వ్యాపించి ధాతుగత మూలముగలదై సిరలవలన వ్యాప్తంబై తాఁబేటివీఁపువలె పొడవై దౌర్బల్యము, అన్నద్వేషము, హృల్లాసము, దగ్గు, వాంతి, అసంతోషము, జ్వరము, దప్పి, తంద్ర, పడిసెము మొదలగులక్షణములుగలదై యుండిన నసాధ్యంబని తెలియవలయును.

గృహీత్వా సజ్వరం శ్వాస ఛర్ద్యతీసారపీడితం,
హృన్నాభి [1]హస్తపాదేషు శోథః కుషతిగుల్మినమ్. 23
శ్వాసశ్శూలం పిపాసాన్నవిద్వేషో గ్రంథిమూఢతా,
జాయతే దుర్బలత్వం చ గుల్మినాం మరణాయ వై. (ఆయుర్వేదే)

తా. వమన, విరేచనములవలన పీడితుఁడగు గుల్మరోగికి హృదయము, నాభి, హస్తములు, పాదములు అనువానియందు వాపును, జ్వరమును గలిగిన మృతిజెందునని తెలియవలయును. మఱియు ఉబ్బసము, శూల, దప్పి, అన్నద్వేషము గలుగుట, [2]గుల్మ

---

1 వస్తి. 2 అంతర్విద్రధి, గుల్మము అనువానియొక్క స్థానము, ఆకృతిసమానంబులుగ నుండుటవలన నెవ్విధభేదంబును గనుపించకుండును. ఐనను గుల్మము ముష్టిప్రమాణము గలదిగ, విద్రధి గుల్మమునకన్న పెద్దదిగ నుండునని సుశ్రుతమునందు జెప్పఁబడియున్నయది. గుల్మము నిరాశ్రయంబై యుండుటవలన పాకవిహీనంబగును. విద్రధి మాంసరక్తముల నాశ్రయించి యుండుటవలన పాకమునుజెందును.

మరియొక్కఉంట యకస్మాత్తుగ గనుపించకుండుట, శక్తి నశించుట - ఈలక్షణములుగల గుల్మరోగికి మరణం బాసన్నమైనదని తెలియవలయును.

రక్తగుల్మచికిత్స

అఫేనం హింగుసంయుక్తం రక్తగుల్మ వినాశనమ్. (మాధవనిదానే)

తా. నల్లమందు, ఇంగువ-వీనిని సమభాగములుగ నూరి మాషమెత్తును ఆవు వెన్నతో మూడుమండలములు సేవించిన రక్తగుల్మము హరించును.

రక్తగుల్మమునకు పారదాదివటికములు

పారదం శిఖితుత్థం చ నేపాళం గంధకం సమం,
ఆరగ్వధఫలం కృష్ణాం వజ్రక్షీరేణ పేషయేత్. 26
[1]మాషమాత్రాం వటీం ఖాదేంత్ స్త్రీణాం గుల్మోదరప్రణుత్,
[2]బింబీఫలరసంచాను పథ్యం దధ్యోదనం హితమ్. 27
రక్తోదరం హరేత్త్నైవ కఠినం లేపనేన తు,
రుధిరేతు ప్రవృత్తేఽపి రక్తపిత్తహరీక్రియా. 28
కార్యావాతరుజార్తానాం సర్వవాతహరీక్రియా, (పూజ్యపాదీయే)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన మైలుతుత్థము, శుద్ధిజేసిన నేపాళములు, శుద్ధిజేసిన గంధకము, రేలగుజ్జు, పిప్పళ్ళు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి బొంతజెముడుపాలతో నొకదినము మర్దించి మాషమెత్తును (ఉసిరికపండ్లరసముతోగాని) లేక దొండపండు రసముతోగాని, (లేక చింతాకరసముతోగాని) మూడుమండలములు సేవించిన రక్తగుల్మము హరించును. పథ్యము పెరుగువంటకమును భుజింపవలయును. ఈవటికల సేవనవలననే రక్తగుల్మము హరించును. అటుగాక ఱాయివలె కఠినంబుగనుండినను లేపనమును సేయవలయును. అది పగిలి రక్తము స్రవించుచుండిన రక్తపిత్తప్రకరణమున జెప్పంబడిన రక్తపిత్త చికిత్సలం జేయవలయును. వాతగుల్మమునందు వాతప్రకరణమున జెప్పంబడిన సర్వవాతహరక్రియలం జేయవలయును.

లశునాదికషాయము

లశునం కింశుకం బిల్వం క్వాథయిత్వా స హింగుకమ్. 29
ప్రాతఃకాలే నిషేవేత రక్తగుల్మహరం పరం,

తా. వెల్లుల్లిపాయలు, మోదుగచెక్క, మారేడువరుగు అనువానికషాయములో ఇంగువ కలిపి ప్రాతఃకాలమున సేవించిన రక్తగుల్మము హరించును.

---

1 ధాత్రీఫలరసైః ఖాదేత్ స్త్రీణాం రక్తోదరం హరేత్. 2 చించాదళరసంచానుపథ్యం దధ్యోదనం హితమ్.

కణాదికషాయము

కణాశతాహ్వాద్వికరంజదారు భార్గీకుళుత్థంసతిలైస్సుపక్వం,
తత్థారసోనాయుతసిద్ధమంభ స్సహింగుకల్కం హతరక్తగుల్మమ్. 30
(రసరత్నాకరే)

తా. పిప్పళ్ళు, సదాప, క్రానుగచెక్క, సెమలిచెక్క, సరళదేవదారు, గంటు
ంగి, ఉలవలు, నువ్వులు, వెల్లుల్లిపాయలు-వీనిని సమభాగములుగ కషాయముగాచి
పకల్కము గలిపి నాలుగుమాసములు త్రాగిన రక్తగుల్మము హరించును.

తిలాదికషాయము

తిలక్వాథో గుడ ఘృత వ్యోష భార్గీరజోఽన్వితః,
పీతో రక్తభవేగుల్మే నష్టేపుష్పే చ యోషితః. (మాధవనిదానే) 31

తా. నువ్వులకషాయములో బెల్లము, నెయ్యి గలిపి త్రికటుకములు, గంటుభా
పసపు అనువానిచూర్ణమును నాలుగుమాడలయెత్తు గలిపి నాలుగుమాసములు
చిన రక్తగుల్మమును, నష్టరజస్సును హరింపజేయును.

రక్తగుల్మమునకు కరంజలవణము

కరంజస్యత్వచంక్షుణ్ణాం ద్వితులాపరిసమ్మితాం,
ద్విద్రోణే కాంజికే పక్త్వా తస్మి న్నష్టావశేషితే. 32
లవణస్య చతుఃప్రస్థం ద్విప్రస్థం లశునస్యచ,
ప్రత్యేక మాఢకం దద్యా దజాక్షీరస్య మస్తునః. 33
దద్యాత్పృథగ్ద్వికుడవం తైలస్య చ ఘృతస్య చ,
సమ్యక్పాకేతు సకలే చూర్ణాన్యేతాని దాపయేత్. 34
సచిత్రకం త్రికటుక మజామోదా పునర్నవా,
హింగు సౌవర్చలం చవ్యం యవక్షారం బిడం తథా. 35
ముష్కకారుష్కకక్షారం తింత్రిణీ బ్రహ్మవృక్షయోః,
బ్రాహ్మీసోమారగ్వధానాం స్నుహీక్షారం తథైవ చ. 36
జీరకద్వయసంయుక్తం చూర్ణమేషాం పలద్వయం,
కరంజలవణంనామ స్నిగ్ధభాండస్థితంచ తత్. 37
గుల్మాష్ఠీల ప్లీహ శూల రక్తగుల్మం వినాశయేత్, (ఆయుర్వేదే)

తా. ౨౦౦ పలములు క్రానుగచెక్కను దంచి ౨ ద్రోణములప్రమాణము కలి
అష్టావశేషముగ కషాయము గాచి వడియగట్టి అందు ఉప్పు ౪ ప్రస్థములు, వెల్లుల్లి

౩ ప్రస్థములు, మేకపాలు ౧ ఆఢకము, పెరుగుమీఁదిమీగడ ౧ ఆఢకము, నూనె ౧ కుడవము, నెయ్యి ౧ కుడవము గలిపి బాగుగ పాకముజేసి చిత్రమూలము, త్రికటుకములు, ఓమము, గలిజేరువేరు, ఇంగువ, సౌవర్చలవణము, చవ్యము, యవక్షారము, బిడాలవణము, మొక్కాము, నల్లజీడి, చింత, మోదుగచెక్క, మండూకబ్రహ్మి, పుల్లతీఁగె లేక బొల్లిపూస, రేల, జెముడు అనువాని క్షారములు, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ అనువానిని దినుసుకు రెండుపలములచొప్పున గలిపి నేతితో మాఁగిన కుండయందు దునిచి సేవించిన గుల్మము, అష్ఠీలము, ప్లీహము, శూల, రక్తగుల్మము-వీనిని హరింపఁజేయును. (మఱియు ౫ చిన్నములయెత్తు ఇంగువను ఆవుపెన్నలో గలిపి సాయంప్రాతఃకాలముల సేవించిన రక్తగుల్మములు హరింపఁజేయును.)

వాతగుల్మశూలలకు శంఖద్రావకము

పలైకం పంచలవణా బాణం తుత్థం చ ఖర్పరీమ్. 38
ప్రటకీ కుడవార్ధం చ తదర్ధం నవసాగరం,
కాసీసం టంకణం సర్జ యవక్షారం పలార్ధకమ్. 39
సర్వమేకత్ర సంయోజ్యం డమరుయంత్రస్యమధ్యగే,
చుల్ల్యాం ప్రరోహయేత్తత్తు జ్వాలయేత్ఖదిరేంధనైః. 40
ద్రావితం తత్సమాదాయ తేజోరూపం జలప్రభం,
ద్రావయేదఖిలాన్ ధాతూన్ వరాటాంశ్చ నసంశయః. 41
శంఖద్రావఇతిఖ్యాతో గుల్మోదరహరఃపరః,
భక్షితం కురుతేచైవ కాయపుష్టిం నిరోగతామ్. 42
వాతానాం సర్వశూలం చ పంచగుల్మం నిహంతి చ, (ఆయుర్వేదే)

తా. పంచలవణములు దినుసు కొక్కొక్కపలముచొప్పున ౫ పలములు, శుద్ధిచేసిన మైలుతుత్థము ౫ పలములు, శుద్ధిజేసిన కపరి ౫ పలములు, పటిక ౪ కుడవము, నవాసాగరము పాతికకుడవము, అన్నభేది, పేల్చినవెలిగారము, సర్జక్షారము, యవక్షారము-ఇవి దినుసుకు ౪ పలము-ఇటుల వీనినెల్ల చూర్ణముగావించి నేకము జేసి యొకకుండలో వైచి దానికంఠమునకు దగినసారాయిబట్టిని దగిలించి పొగపోకుండునటుల వానిసందుకు చీలమన్ను లేపనముజేసి యెండించి సారాయిబట్టి పైభాగమున మఱియొకకుండను బోర్లించి సందులేకుండునటుల చీలమన్ను లేపనముజేసి యెండించుటచే డమరుకయంత్రమని పరఁగెడుదానిని పొయిమీఁద నునిచి చంద్రకట్టెలతో నరజాముపఱకు పాకముసేయుచు పైకుండపై తడివస్త్రమును వేసి యుదకమును బోయుచుండిన పైసారాయిబట్టియొక్క నొకతుండముగుండ బోయుచుండు యుదకమును మఱియొకతుండముగుండా దేజోరూపమై యుదకస్వరూపముగనుండు శంఖద్రావకమును స్రవించును. దానిని గాజుకుప్పెలోగాని, లేక గాజుగిన్నెలోగాని గ్రహించి ప్రతిదినము యూఁగాణియెత్తును ఓమపుపొట్టులో గలిపి

దంతములకు తగలక అంగ్రటిలో వేసుకొని మ్రింగిన రక్తగుల్మము, ఉదరములు, వాతరోగములు, సర్వశూలలు, పంచగుల్మములు మొదలగు సర్వరోగముల హరింపఁజేయుటయే గాక శరీరపుష్టిని, నిరోగత్వమును గలుగంజేయును. మఱియు నీద్రావకములో సువర్ణాది సర్వధాతువుల, గవ్వలవైచిన నిస్సంశయముగ ద్రవించును. (ఈశంఖద్రావకమును మూడుమండలములు సేవించిన దేయౌషధమువలన నివర్తింపక బాధింపుచుండు అసాధ్య శూలలు, గుల్మములు హరించును. మఱియు దీనినే తుని, ప్రతితునివాతములయందును సేవింపందగును. దీనిసేవనవలన కడుపులో మంట గలిగిన పెరుగన్నమును మూడుకబళములు భుజింపవలయును.)

## శిఖిబాడబరసము

మారితం సూత తామ్రాభ్రం గంధకం మాక్షికం సమమ్. 43
మర్ధయే చ్చిత్రకద్రావై ర్యవక్షారయుతం దినం,
త్రిగుంజం భక్షయే న్నిత్యం నాగవల్లీదళేనవా. 44
వాతగుల్మహరః ఖ్యాతో రసోఽయం శిఖిబాడబః,
హింగు సౌవర్చలం త్ర్యూషం సింధు దాడిమ దీప్యకైః. 45
పుష్కరాజాజిధాన్యాకై రమ్లవేతసచిత్రకైః,
అశ్వగంధా వచాచైవ నిర్గుండీ సకచోరకైః. 46
ప్రతిచూర్ణైః కర్షమాత్రైః ప్రస్థంప్రస్థం ఘృతం దధి,
పాచ్యం ఘృతావశేషం చ ప్రలార్ధ మనుశీలయేత్. 47
వాతగుల్మం తథా శూల మానాహం చ వినాశయేత్,

(నిత్యనాథీయే)

తా. రసభస్మము, తామ్రభస్మము, అభ్రకభస్మము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన స్వర్ణమాక్షికము, యవక్షారము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి చిత్రమూలరసములో నొకదినము మర్దించి మూడుగురిగింజలంతమాత్రలు జేసి యందొకదానిని తమలపాకుతోడ ప్రతిదినము సేవింపుచుండిన వాతగుల్మము, లేక ఇంగువ సౌవర్చలవణము, త్రికటుకములు, సైంధవలవణము, దాడింబబెరడు, ఓమము, పుష్కరమూలము, జీలకఱ్ఱ, కొతిమెర్లు, పుల్లప్రబ్బలి, చిత్రమూలము, పెన్నేరుగడ్డ, వస, వావిలి, కచోరములు అనువానిని దినుసుకు కర్షప్రమాణముచొప్పున చూర్ణముజేసి నెయ్యి ౧ ప్రస్థము, పెరుగు ౧ ప్రస్థము బోసి ఘృతము శేషించునటుల గాచి అర్ధపలప్రమాణముగల యీ ఘృతానుపానముతోడ సేవింపుచుండిన వాతగుల్మమును శూలలను, కడుపుబ్బరమును హరింపఁజేయును.

॥ గుల్మశూలలకు శంఖద్రావకము ॥

సైంధవం చ యవక్షారం పటకీ సురసారకమ్. 48
కాసీసం నవసారం చ సమభాగం తు కారయేత్,
మర్దయే ద్ఘటికామాత్రం పాచ్యం పాతనయంత్రకే. 49
శంఖద్రావరసోనామ సర్వవ్యాధివినాశకృత్,
పంచకాసాన్ తథా శ్వాసాన్ క్షయరోగం సుదారుణమ్. 50
మన్యాస్తంభం కంఠరోగం గుల్మ శూల జ్వరాపహం,
అగ్నిం చ కురుతే దీప్తం తేజోవృద్ధి బలప్రదమ్. (సిద్ధరసార్ణవే)51

తా. సైంధవలవణము, యవక్షారము, పటిక, సూరాకారను, శుద్ధిజేసిన అన్నభేది, నవాసాగరము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి యొకగడియ మర్దించి పాతనాయంత్రమునం దునిచి వండిన శంఖద్రావకము సిద్ధంబగును. దీనిని ఓమపు పొట్టుతో అరతులము-చొప్పున ప్రతిపూట సేవించుచుండిన సర్వశూలలు, (వాతగుల్మము, రక్తగుల్మశూలలు, ఋతుశూల, సప్తశూలలు) పంచకాసములు, శ్వాసములు, భయంకరమైన క్షయరోగము, మన్యాస్తంభము, కంఠరోగము, గుల్మశూల, జ్వరము-వీనిని హరింపంజేయును. మఱియు దీనిసేవనవలన అగ్నిదీపనము, తేజోవృద్ధి, బలము గలుగును.

॥ పైత్తగుల్మమునకు దండామరరసము ॥

శుద్ధసూతం సమంగంధం సూతాంశం మృతతామ్రకం,
పంచాంగం శాకవృక్షస్య ద్రవై ర్మర్ద్యం దినత్రయమ్. 52
సర్పాక్ష్యాశ్చ ద్రవైశ్చాహ్ని రుద్ధ్వా లఘుపుటే పచేత్,
పంచధా భూధరేవాథ చూర్ణం నేపాళతుల్యకమ్. 53
*ద్విగుంజం భక్షయేచ్చాజ్యైః పిత్తగుల్మప్రశాంతయే,
ద్రాక్షా హారీతకీ క్వాథ మనుపానం ప్రకల్పయేత్. 54
రసో డండామరోనామ పిత్తగుల్మం నియచ్ఛతి, (మాధవనిదానే)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, తామ్రభస్మము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గుమ్ముడుటేకుచెక్క, దానికాయలు, పువ్వులు, ఆకులు, వేరు అనువాని రసములతో మూడుదినములు మర్దించి పిదప సర్పాక్షిరసముతో నొకదినము మర్దించి భూధరయంత్రమునందునిచి లఘుపుటం బిడవలయును. ఇటుల ఐదుమార్లుమర్దించి ఐదుమార్లు లఘుపుటంబిడి చూర్ణముజేసి దానికి సమముగ శుద్ధిజేసిన నేపాళపువిత్తుల గలిపి మర్దించి రెండు, లేక మూడుగురిగింజలయెత్తును నేతితో గాని, లేక ద్రాక్షపండు,

---

* త్రిగుంజం.

కరక్కాయ అనువానికషాయముతో గాని, ఆరుమాసములవఱకు సేవించుచుండిన పిత్త గుల్మము నిశ్చయముగా హరించును.

శ్లేష్మగుల్మమునకు విద్యాధరరసము

గంధకం [1]తాళకం తాప్యం [2]మృతతామ్రం మనశ్శిలామ్. 55
శుద్ధసూతం చ తుల్యాంశం మర్దయే ద్భావయేద్దినం,
పిప్పల్యాస్తు కషాయేణ వజ్రీక్షీరేణ భావయేత్. 56
నిష్కార్ధం భక్షయే త్క్షౌద్రై ర్గుల్మం ప్లీహం వినాశయేత్,
రసో విద్యాధరో నామ గోమూత్రం చ పిబేదను. 57

తా. శుద్ధిజేసిన గంధకము, శుద్ధిచేసిన తాళకము, శుద్ధిచేసిన సువర్ణమాక్షికము, లేక తరగపుభస్మము, తామ్రభస్మము లేక అభ్రకభస్మము, శుద్ధిచేసిన మణిశిల, శుద్ధిజేసిన రసము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి పిప్పలికషాయముతో నొక దినము మర్దించి భావనచేసి పిదప బొంతజెముడుపాలతో ౭ దినములు భావనచేసి అరనిష్క ప్రమాణమంత వటికములుచేసి యందొకదానిని తేనెతో సేవించి వెంబడిగ గోమూత్రమును ద్రాగిన గుల్మము, ప్లీహరోగము హరించును.

కాంచనమోహనరసము

మృతంసూతం మృతంతామ్రం కాంచనాృ మర్దయే ద్రసైః,
అర్కవజ్రీరసేనైవ దినాంతే వటకీకృతమ్. 58
గుంజైకం గుడసంయుక్తం తథా గంధ సువర్చలం,
నిష్కైకం గుల్మశాంత్యర్థం రసః కాంచనమోహనః. 59
విశాలా కటుకా ముస్తం కుష్ఠ మింద్రయవం సమం,
చూర్ణయే ద్దేవదారుం చ కర్షైకం మధునా లిహేత్. 60
గుల్మోదరజ్వరం తాప మనుపానం నిహంత్యలం, (సిద్ధరసార్ణవే)

తా. రసభస్మము, తామ్రభస్మము వీనిని ఉమ్మెత్తాకు, జిల్లేడు, బొంతజెముడు అనువానిరసములతో నొకదినము మర్దించి నిష్కప్రమాణము బెల్లము, శుద్ధిజేసినగంధకము, సౌవర్చలవణము గలిపి మరల మర్దించి గురిగింజంత మాత్రలుచేసి యందొకదానిని పాపర, త్రికటుకములు, తుంగముస్తెలు, చెంగల్వకోష్టు, కొడిసెపాల, దేవదారు అనువాని చూర్ణములో కర్షప్రమాణమును తేనెలో గలిపి యీయనుపానముతోడ సేవించిన గుల్మములు, ఉదరములు, జ్వరము, తాపము-వీనిని హరింపజేయును.

---

1 తాళత్రపుసం. 3 మృతాభ్రంచ.

### తూని, ప్రతితూనులలక్షణము

పక్వాశయాత్తు క్రమజస్సమీరో వృద్ధో గుదోపస్థమతీవతుద్యాత్,
తూనీభవేత్సాపరివృత్య గచ్ఛన్నపవయాతి ప్రతితూనికేతి. (ఆయుర్వేదే)

తా. విరుద్ధాహారవిహారములవలన వాతము ప్రకోపించి క్రమముగ పక్వమూత్రాశయములం జెంది గుదోపస్థలయందు సూదులతో బొడుచునటుల కడు వేదనను గలుగం జేసిన తుని యనంబడును. ఈతునియే గుహ్యోపస్థములయందు ప్రకోపించి * ప్రతిలోమముగ సంచరింపుచు పక్వాశయను జెందిన ప్రతితూని యనంబడును.

### అష్ఠీలా, ప్రత్యష్ఠీలానిదానము

అష్ఠీలానాహ లింగా తు గ్రంథీరూర్ధ్వసమన్వితః,
తిర్యక్తథాకృతిస్సైవ ప్రత్యష్ఠీలా శిరోపమా. (ఆయుర్వేదే)

తా. సంచరింపుచు గాని, లేక సంచరింపక కఠినంబుగ గాని నుండు గ్రంథినాభికి క్రిందిభాగమున పొడవుగ జనించి అనాహలక్షణయుక్తంబై యుండిన అష్ఠీలమనంబడును. ఇదియే జఠరమున నడ్డముగ జనించి తాయివలె కఠినంబై వేదనతోఁగూడి వాత, మల మూత్రముల నడ్డగింపుచుండిన ప్రత్యష్ఠీల మనంబడును.

. ఇమావాతస్య గుల్మోక్త విధినా సముపాచరేత్. 63

తా. పూర్వోక్తతుని, ప్రతితుని, అష్ఠీల, ప్రత్యష్ఠీలవాతములయందు గుల్మచికిత్సలం జేయుటయే గాక శంఖద్రావకముయొక్క సేవనను సహా జేయింపవలయును.

### వాతికపరిణామశూలలక్షణము

ఆధ్మానాటోపవిణ్మూత్ర విబంధారతివేపనైః,
స్నిగ్ధోష్ణోపశమప్రాయం వాతికం తద్వదేద్బుధః. (ఆయుర్వేదే)

తా. కడుపుబ్బరము, కడుపులో గుడగుడశబ్దము, మలమూత్ర ప్రతిబంధము, అస్వస్థత, కంపము గలిగి స్నిగ్ధోష్ణపదార్థసేవనవలన తరుచుగ శాంతి జెందునది వాతిక పరిణామశూలయని తెలియవలయును.

### పైత్తికపరిణామశూలలక్షణము

తృష్ణా దాహారతి స్వేద కట్వమ్ల లవణోత్తరం,
శూలం శీతశమప్రాయం పైత్తికం లక్షయేద్బుధః. 65

తా. దప్పి, దాహము, అస్వాస్థ్యము, చెమటగలుగుట, కారము, పులుసు, ఉప్పు గలపదార్థములయం దిచ్ఛగలుగుట, శీతకరపదార్థములవలన శాంతిజెందుట-ఈలక్షణములు గలది పిత్తజపరిణామశూలయని తెలియవలయును.

---

* ప్రతిలోమ మన క్రిందినుంచి పైకేగుట.

## శ్లేష్మపరిణామశూలలక్షణము

ఛర్ది హృల్లాస సంమోహం స్వల్పరుగ్దీర్ఘసంతతి,
కటుతిక్తోపశాంతం చ తచ్చ జ్ఞేయం కఫాత్మకమ్. 66

తా. ఓకర, హృల్లాసము, ఇంద్రియమోహము మిక్కుటముగ గలుగుట, ఒకింత వేదనగలుగుట, శూల దీర్ఘకాలమువఱకుండుట, కారము చేదుగలపదార్థములవలన శాంతి జెందుట - ఈలక్షణములుగలది కఫజశూల యని తెలియవలయును.

## శూలనిదానము

యానాభిఘాతా చ్ఛోకాచ్చాప్యతిభాషణ మైథునాత్,
రూక్షాన్న శుష్కశాకాశ్చ కషాయ తిక్తసేవనాత్. 67
తేనవాయుర్భవేత్క్రుద్ధః కురుతే శూల మష్టధా, (మాధవనిదానే)

తా. గుఱ్ఱము మొదలగువాని నెక్కి సంచరించుట, అభిఘాతమును జెందుట, దుఃఖించుట, మిక్కుటముగ మాటలాడుట, మిక్కుటముగ స్త్రీసంభోగముసేయుట రూక్షగలయన్నమును, ఎండినకూరలను, కారము, చేదుగలవస్తువులను మిక్కుటముగ సేవించుట - ఈ కారణములవలన వాతము ప్రకోపించి యెనిమిదివిధములైనశూలల గలుగం జేయును.

## వాతశూలలక్షణము

హృత్పార్శ్వ పృష్ఠత్రిగ్వస్తౌ ముహు స్తోదో ముహు శ్శమః. 68
వర్షాశీతాగమే తీవ్రం క్రుద్ధం భవతి మారుతాత్,
అభ్యంగమర్దనస్వేదై స్నిగ్ధోష్ణైరోభజనై శ్శమేత్. 69

తా. ఱొమ్ము, పార్శ్వములు; వీఁపు, ముడ్డిపూస, వస్తి అనువానియందు బలుమారు శూలించి పలుమారు శమించుట, వర్షశీతకాలములయందు శూల మిక్కుటముగ ప్రకోపించుట - ఈలక్షణములుగలది వాతజశూలయని తెలియవలయును. ఇది అభ్యంజనము, శరీరమర్దనము, స్వేదము, స్నిగ్ధోష్ణభోజనము అనువానివలన శమించును.

## పైత్తశూలలక్షణము

తృష్ణామూర్ఛా స్వేద రుక్ప్లోషా నాభి వస్తిషు వేదనా,
మధ్యాహ్నే చార్ధరాత్రే చ శూలం పైత్తాధికం భవేత్. 70
స్వాదుశీతలమిష్టాన్నై శ్శమ శ్శీతాగమే భవేత్, (ఆయుర్వేదే)

తా. దప్పి, మూర్ఛ, చెమట, పీడ, శోష గలుగుట, నాభి, పొత్తికడుపు అను వానియందు శూలించుట, మధ్యాహ్నకాలము, అర్ధరాత్రి, చకారమువలన అన్నము జీర్ణమయ్యెడికాలము, శరత్కాలము-వీనియందు మిక్కుటముగ శూలగలుగుట-ఈలక్షణ

ములుగలది పిత్తజశూల యని దెలియవలయును. ఇది రుచికరమై శీతకరమైన పదార్థసేవన వలన, మృష్టాన్నసేవనవలన, మఱియు శీతకాలమునందు శమించును.

శ్లేష్మజశూలలక్షణము

శ్వాసశ్చ కాస హృల్లాసౌ శూలం సూర్యోదయే ఘనమ్. 71
వసంతే శిశిరే భుక్తే దూష్యతే కఫజం విదు, (చరకే)

తా. ఉబ్బసము, దగ్గు, ఓకరింతలు గలుగుట, సూర్యోదయకాలమున మిక్కుటముగ శూలించుట, వసంత, శిశిరఋతువులయందును, భోజనానంతరమును మిక్కుటముగ ప్రకోపించుట- ఈలక్షణములుగలది శ్లేష్మజశూల యని తెలియవలయును.

ద్వంద్వ, త్రిదోషశూలలక్షణము

మిశ్రితం ద్వంద్వజం జ్ఞేయం కష్టసాధ్యం క్వచిద్భవేత్. 72
త్రిభిశ్చ లక్షణైర్యుక్త మసాధ్యం సాన్నిపాతికం,

తా. రెండేసిదోషలక్షణములం గలది ద్వంద్వశూలయనియు, మూడుదోషలక్షణములంగలది సన్నిపాతశూలయనియు తెలియవలయును. (మఱియు "ఏకదోషోత్థితస్సాధ్యః"ఇత్యాది గ్రంథాంతరవచనమువలన ఏకదోషమువలన జనించినశూల సాధ్యంబులు.) రెండుదోషములవలన గలిగినశూల కష్టసాధ్యంబులు. సన్నిపాతమువలన జనించినశూల అసాధ్యంబులు.

శూలోత్పత్తిస్థానములు

వాతాత్మకం వస్తిగతం వదంతి పిత్తాత్మకం చాపివదంతి నాభ్యాం,
హృత్పార్శ్వకుక్షౌ కఫసన్నివిష్టం సర్వేషు దేశేషు చ సన్నిపాతాత్. (గ్రంథాంతరే)

తా. పొత్తికడుపునందు వాతజశూలయు, నాభియందు పిత్తజశూలయు, ఱొమ్ము పార్శ్వములు, కుక్షి అనువానియందు శ్లేష్మజశూలయు, పూర్వోక్తసర్వప్రదేశములయందు సన్నిపాతశూలయు జనించును.

ఆమశూలలక్షణము

కఫశూలే యథాచిహ్నం తథాటోపస్య వర్ధనం,
ఆనాహశ్చ ప్రసేకశ్చ హ్యామశూలస్య లక్షణమ్. (నిత్యనాథీయే)

తా. శ్లేష్మశూలలక్షణయుక్తంబైయుండుట, మిక్కుటముగ కడుపులో గుడగుడ శబ్దము, కడుపుబ్బరము (చకారమువలన వాంతి, ఓకరింతలు, జడత్వము, నిశ్చలత్వము) గలుగుట, నోటియందు జొల్లుగారుట-ఈలక్షణములుగలది ఆమశూలయని దెలియవలయును.

### పరిణామశూలలక్షణము

భుక్తే జీర్యతి యచ్ఛూలం తదేవ పరిణామజం,
వాతపిత్తకఫాధిక్యం విజ్ఞేయం పూర్వలక్షణైః. (పూజ్యపాదీయే)

తా. భుజించినయన్నము జీర్ణంబగునపుడు గలిగెడిశూల పరిణామశూల యనంబడును. దీనియందలి వాత, పిత్త, శ్లేష్మాధిక్యములను పూర్వోక్తవాతాది శూలలయొక్క లక్షణములవలన దెలియవలయును.

### మృత్యుశూలలక్షణము

వాతజం శ్రవణే రక్తం నేత్రాబ్జే చ హరిద్రతా,
భ్రమో మూర్ఛా హ్యనిద్రత్వ మతిమూత్రం చ మృత్యుకే. 76
(ఆయుర్వేదే)

తా. శరీరమున నొప్పి మొదలగువాతోపద్రవములు గలుగుట, చెవిలో నెత్తురు గారుట, కన్నులు పచ్చనగుట, తబ్బిబ్బులాడుట, మూర్ఛగలుగుట, నిదురబట్టకుండుట, మూత్రం బధికముగ వెడలుట-ఈలక్షణములుగలది మృత్యుశూలయని తెలియవలయును. (ఇవియ ఎనిమిదివిధములైనశూలలు)

### పక్తిశూలలక్షణము

వేదనాతితృషా మూర్ఛా హ్యానాహో గౌరవారుచీ,
కాసశ్వాసౌచ హిక్కా చ *పక్తిశూలస్యలక్షణమ్. (మతాంతరే)

తా. శరీరమున వేదనగలుగుట, కడుదప్పి మూర్ఛ, కడుపుబ్బరము, జడత్వము, అరుచి, కాసశ్వాసములు, ఎక్కిళ్లుగలుగుట, ఈలక్షణములు గలది పక్తిశూల యని తెలియవలయును.

### శూలోత్పత్తిస్థానములు

వాతాశ్రయేవాతజశూలజన్మ నాభౌచపిత్తప్రభవంసదాహం,
వక్షస్థలేస్యాత్కఫజస్య జన్మశూలస్య చిహ్నం ప్రవదంతి వైద్యాః.
(రసరత్నాకరే)

తా. వాతశూల వాతస్థానము నాశ్రయించి జనించును. పిత్తశూల బొడ్డునాశ్రయించి తాపముతో గూడియుండును. శ్లేష్మశూల ఱొమ్ము నాశ్రయించి జనించును.

### ద్వంద్వశూలోత్పత్తిస్థానములు

వస్తౌ హృత్పార్శ్వ పృష్ఠేషు సశూలః కఫవాతికః,
కుక్షౌ హృన్నాభిపార్శ్వేషు సశూలః కఫపైత్తికః. 79
దాహ జ్వరకరో ఘోరో విజ్ఞేయో వాతపైత్తికః,

---

* శూలస్యోపద్రవాః స్మృతాః

తా. వస్తి, బొడ్డు, పార్శ్వములు, వీఁపు అనువానియందు శ్లేష్మవాతద్వంద్వములవలన శూల జనించును. కుక్షి, హృదయము, నాభి, పార్శ్వము అనువానియందు శ్లేష్మపిత్తద్వంద్వమువలన శూల జనించును. వస్తి, నాభి అనువానియందు దాహ, జ్వరయుక్తంబై భయంకరమైన శూల వాతపిత్తమువలన జనించును.

శూలసాధ్యాసాధ్యములు

ఏకదోషోత్థితస్సాధ్యః కృచ్ఛ్రసాధ్యో ద్విదోషజః. 80
సర్వదోషోత్థితో ఘోర స్త్వసాధ్యో భూర్యుపద్రవః,
సర్వేష్వేతేషుశూలేషు హ్యామజంచాతిదారుణమ్. (భేషజకల్పే)

తా. ఏకదోషమువలన జనించినశూల సాధ్యంబులు. ద్వంద్వదోషమువలన జనించిన శూల కష్టసాధ్యంబులు. త్రిదోషమువలన జనించిన భయంకరమైన "శ్లో. వేదనాతితృషామూర్ఛాహ్వానాహోగౌరవారుచీ, కాసశ్వాసశ్చహిక్కాచ శూలస్యోపద్రవాస్మృతాః." అనఁగా వేదన, కడుదప్పి, మూర్ఛ, కడుఁపుబ్బరము, జడత్వము, అరుచి, శ్వాసకాసములు, ఎక్కిళ్ళు అను పలువిధములైన యుపద్రవములతోఁగూడియుండు శూలలు అసాధ్యంబులు. మఱియు సర్వశూలలలో ఆమశూల కడు నసాధ్యంబులు.

వాతశూలలకు ఉదయభాస్కరరసము

భస్మసూతం మృతంచాభ్రం శిలా గంధక తాళకం,
హింగుళం కుష్ఠ ముస్తం చ తుల్యం చూర్ణం విభావయేత్. 82
స్నుహ్యర్కమత్తస్య నిర్గుండీ [1]మహారాష్ట్రీద్రవైః పృథక్,
ప్రతిద్రావైర్దినం భావ్యం శుష్కం తద్గోళకీకృతమ్. 83
వస్త్రే బధ్వా మృదా లేప్యం శుష్కం కృత్వా పుటే పచేత్,
[2]చతుర్యామార్ధమాత్రేషు తమాదాయ విచూర్ణయేత్. 84
[3]గుంజాష్టఘృతశుంఠిభ్యాం లేహ్యశ్చోదయభాస్కరః,
వాతశూలప్రశాంత్యర్థం తిలక్షారం [4]సకుష్ఠకమ్. 85
మధునా లేహయేచ్చానుమూలం వా కాకతుండజం,
పంచకోలాభయాక్వాథం పిప్పలీ చూర్ణసంయుతమ్. 86
పటుఃకట్వ్యారుశూలేషు మందాగ్నౌ చ విశేషతః,
సదేయస్స్వచ్ఛలవణో గుల్మే చ మలబంధనే. 87
తైలయుక్తశ్చ సర్వేషు వాతశూలం చ నస్యతి, (ఆయుర్వేదే)

1 మహారాస్నా. 2 చతుర్థాబస్తమాత్రేణ. 3 ద్వేగుంజే. 4 సకర్షకమ్.

తా. రసభస్మము, అభ్రకభస్మము, శుద్ధిచేసిన శిలాజీత్తు, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన తాళకము, ఇంగువ, కంకుష్ఠము, తుంగము స్త్రైలం-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి చూర్ణముచేసి బొంతజెముడుపాలు, ఉమ్మెత్త, వావిలి, పెద్దములక అను వానిరసములలో ప్రతిదానిచే నొక్కొకదినము భావనజేసి ఎండించి ముద్దచేసి దాసిపై బట్టజుట్టి మన్నుపూసి యెండించి మూకుళ్ళలో నునిచి చీలమన్ను లేపనముజేసి పాకమైనను జేయవలయును. లేక కుప్పెలో నునిచి ౮౹ ఝాములవఱకు పుటమైనను వేయవలయును. ఇటుల జేసినపిదప దానినిదీసి చూర్ణముజేసి ౨ గురిగింజలయెత్తును నెయ్యి, శొంఠి అనువాని యనుపానముతోగాని, కర్షప్రమాణము నువ్వులక్షారము, చెంగల్వకోష్టు-వీనిని తేనెలో గలిపి యీయనుపానముతోగాని, లేక ఎఱ్ఱగురిజవేరు చూర్ణానుపానముతోగాని, లేక పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, కరక్కాయ అనువానికషాయములో పిప్పలిచూర్ణము గలిపిగాని సేవించిన వాతశూల హరించును. మఱియు పైయౌషధమును సైంధవలవణానుపానముతో సేవించిన నడుము, తొడ అనువానియందలి శూల, అగ్నిమాంద్యము వీనిని విశేషముగ హరింపజేయును. మఱియు దీని నువ్వులో గలిపి సేవించిన వాతగుల్మము, మలబద్ధము వీనిని హరింపజేయును. నూనెతో సేవించిన సర్వాంగ వాతశూలల హరింపజేయును. (మఱియు దీనినే తుని, ప్రతితుని, అష్ఠీల, ప్రత్యష్ఠీల అనురోగములయందును సేవింపందగును.)

### శూలదావానలరసము

చించాక్షార శ్శుద్ధశంఖచూర్ణం లవణపంచకమ్. 88
క్షారః పంచాగ్నిసంభూతః పృథగర్ధపలాన్వితః,
మరీచం మాగధీ శుంఠీ హింగుచ ద్విపలం తథా. 89
పారదం గంధకం తామ్రం విషంచార్ధపలం పృథక్,
సర్వం జంబీరనీరేణ మర్ద్యం తద్దివసత్రయమ్. 90
కోలప్రమాణాం వటికాం పంచగవ్యఘృతాన్వితం,
లేహయే చ్ఛూలశాంత్యర్థం ఘృతాన్నం భోజనం తథా. 91
లశునక్వథితం దేయం దధ్యాజ్యం గవ్యమేవవా,
పథ్యం నిత్యం ప్రయుంజీత సర్వశూలనిబర్హణమ్. 92
హృచ్ఛూలం పార్శ్వశూలంచా జీర్ణశూలం చ గుల్మజం,
అనాహ ప్లీహ ముదర మశ్మరీ శర్కరాపహః. 93
క్షయంచైవ న సందేహో సేవయే ద్వ్యాధిహారకః,
శూలదావానలో నామ్నా పూజ్యపాదేన భాషితః. 94

(మాధవనిదానే)

తా. చింతక్షారము, శుద్ధిజేసిన శంఖభస్మము, పంచలవణములు, పంచాగ్నులక్షారము- ఇవి దినుసుకు ౪ పలము, త్రికటుకములు, ఇంగువ-ఇవి దినుసుకు ౨ పలములు, శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, తామ్రభస్మము, శుద్ధిజేసిన నాభి-ఇవి దినుసుకు ౪ పలము-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో మూడుదినములు మర్దించి రేగుపండంత మాత్రలుజేసి *పంచగవ్యముతోగాని, ఘృతముతోగాని సేవించిన సర్వశూలలు, ఆమ్లశూల, పార్శ్వశూల, అజీర్ణశూల, గుల్మములు, కడుపుబ్బరము, ప్లీహరోగము, ఉదరములు, శర్కరాశ్మరి, క్షయము-వీనిని నిస్సంశయముగ హరింపజేయును. పథ్యము ప్రతిదినము సేతివంటకమును, వెల్లుల్లిపాయలకషాయమును, మేకపెరుగునుగాని లేక ఆవు పెరుగునుగాని సేవింపవలయును.

### శూలకుఠారరసము

టంకణం పారదం గంధం త్రిఫలా వ్యోష తాళకం,
విషం తామ్రం చ నేపాళం భృంగస్వరసమర్దితమ్. 95
ద్విగుంజమాత్రా వటికా మరీచే నార్ద్రకేణ వా,
సర్వశూలకుఠారోఽయం విష్ణుచక్రమివాసురాన్. (శారీరే.

తా. వెలిగారము, శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, త్రిఫలములు, త్రికటుకములు, శుద్ధిజేసిన తాళకము, శుద్ధిజేసిన నాభి, తామ్రభస్మము, శుద్ధిజేసిన నేపాళములు- వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గుంటగలగరాకురసముతో మర్దించి రెండుగురిగింజలంత మాత్రలుజేసి యందొకదానిని మిరియపుచూర్ణముతోగాని, లేక అల్లపురసముతోగాని సేవించిన "విష్ణుచక్ర మసురుల నాశనము జేయుభంగి" సర్వశూలల హరింపజేయును.

### పైత్తశూలలకు ముస్తాదిమండూరము

మండూరం చూర్ణితం కృత్వా ముస్తా బదరమూలకం,
కణా శుంఠీ యవక్షారం పంచానాం సమచూర్ణకమ్. 9
చూర్ణతుల్యం చ మండూరం గోమూత్రాష్టగుణం భవేత్,
తత్తుల్యంచ గవాంక్షీరం పచే న్మృద్వగ్నినా శనైః. 9
పిండితం కోలమాత్రం తు భక్షయే చ్ఛూలనుద్భవేత్,
ప్రాతర్మధ్యాహ్న రాత్రౌ చ భక్షయే ద్వటికాత్రయమ్. 9
మాంసం పిష్టం చ గుర్వన్నం మాషాదీంశ్చ వివర్జయేత్,
(రసరత్నాకరే

* పంచగవ్య మన గోమయము, గోమూత్రము, పాలు, పెరుగు, నెయ్యి.

తా. తుంగముస్తెలు, రేగువేరు, పిప్పలి, శొంఠి, యవక్షారము - వీనిని సమభాగములుగ చూర్ణముచేసి దానికిసమముగ మండూరచూర్ణమును గలిపి ఎనిమిదింతలు గోమూత్రము, గోమూత్రమునకు సమముగ ఆవుపాలుపోసి మృద్వగ్నితో మెల్లగ వండి రేగుగింజలంతమాత్రలు చేసి ప్రాతఃకాలమున, మధ్యాహ్నకాలమున, రాత్రికాలమున మూడు మాత్రలు సేవింపుచుండిన శూలలు హరించును. సర్వశూలలయందు మాంసము, పిండి వంటకములు, జడాన్నము, మినుములు మొదలగువాని వర్జింపవలయును.

### కుబేరాక్షాదిచూర్ణము

ధనదనయనమజ్జా టంకణై ర్హింగు సింధూ
రుచక మరిచ శుంఠీ దీప్య పథ్యా కణానాం,
క్రమశ ఇతిచ వృద్ధం చూర్ణ ముష్ణాంబునాచ
జనయతి జఠరాగ్నిం సర్వశూలం నిహంతి. (సిందూరమణిదర్పణే)

తా. గచ్చపలుకులు, వెలిగారము, ఇంగువ, సైంధవలవణము, మాదీఫలము, మిరియాలు, శొంఠి, ఓమము, కరక్కాయ, పిప్పళ్ళు - వీనిని క్రమముగ హెచ్చించి చూర్ణము చేసి నాలుగుమాడలయెత్తును ఉష్ణోదకముతో సేవించిన సర్వశూలల హరింపం జేయుటయే గాక అగ్నిదీపనమును సహా గలుగంజేయును.

### గోమూత్రమండూరము

గోమూత్రసిద్ధం మండూరం త్రిఫలాచూర్ణసంయుతం,
విలిహేన్మధుసర్పిర్భ్యాం శూలం హంతి త్రిదోషజమ్. 101

తా గోమూత్రయుక్తముగ గాచి సిద్ధముజేయఁబడిన మండూరమునకు సమముగ త్రిఫలచూర్ణమునుగలిపి తేనెతోగాని, లేక నేతితోగాని సేవించిన త్రిదోషజశూల హరించును.

### శ్లేష్మశూలలకు శూలసింహవటికములు

విషాకర్షం వచాకర్షం త్రికటు త్రిఫలాచ షట్,
భార్గీ ముస్తా విడంగానాం ప్రతికర్షం చ *చూర్ణయేత్. 102
గుడేన సర్వతుల్యేన గుటికా చణమాత్రకా,
శూల సింహప్రయోగోఽయం కఫశూలహరం భవేత్. 103
(ఆయుర్వేదే)

తా. అతివస, వస, త్రికటుకములు, త్రిఫలములు, గంటుభారంగి, తుంగముస్తెలు, వాయువిడంగములు, చిత్రమూలము - వీనిని దినుసు కొక్కొక కర్షముచొప్పున దంచి

* చిత్రకమ్.

చూర్ణముజేసి దానికి సమముగ బెల్లము గలిపి మర్దించి శెనగలంతమాత్రలుజేసి సేవించిన శ్లేష్మముల హరించును.

ఆమశూలలకు షణ్ముఖరసము

[1]శుద్ధసూతం సమంగంధం సూతాంశం మృతతామ్రకం,
సౌవర్చలం చ సూతాంశం జంబీరై ర్దినసప్తకమ్. 104
మర్దయే దాతపే తీవ్రే రుధ్వా లఘుపుటత్రయం,
దత్వాదాయ తు తచ్చూర్ణే సూతాంశం త్రికటుం క్షిపేత్. 105
షణ్ముఖోఽయం రసోనామ [2]త్రిగుంజ మామశూలజిత్,
ఏరండతైలం షడ్భాగం లశునస్య దశాష్టకమ్. 106
ఏకంహింగూ త్రిసింధూత్థం సర్వమేకత్ర మర్దయేత్,
త్రినిష్కం భక్షయే చ్చాను చామశూలప్రశాంతయే. 107
(మాధవనిదానే)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, తామ్రభస్మము, సౌవర్చలవణము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో ౭ దినములు మర్దించి తీక్ష్ణమైన ఎండ నెండించి ప్రమిదెలలో నునిచి 3 లఘుపుటంబు లిడి చూర్ణముజేసి రసమునకు సమముగ త్రికటుకచూర్ణముగలిపి మూడుగురిగింజలయెత్తును భక్షించి వెంబడిగ ౧౮ భాగములు వెల్లుల్లిపాయలు, ౧ భాగము ఇంగువ, 3 భాగములు సైంధవలవణము - వీనిని మర్దించి మూడునిష్కములయెత్తు నుంటజేసి ౬ భాగము లాముదములో గలిపి త్రాగిన ఆమశూల హరించును.

పరిణామశూలలకు త్రివృతాదియోగము

త్రివృత్కణాభయాచూర్ణం సగుడం చోష్ణవారిణా,
జయే ద్దినముఖే సేవ్యం శూలం చ పరిణామజమ్. 108

తా. తెగడ, పిప్పళ్ళు, కరకపప్పు వీనిని చూర్ణముజేసి ప్రాతబెల్లము గలిపి యుష్ణోదకముతో నుదయమున సేవించిన పరిణామశూల హరించును.

సర్వశూలలకు సర్వేశ్వరవటికములు

విశ్వ మేరండతైలేన హింగు సౌవర్చలాన్వితం,
మృతసూతకసంయుక్తం భక్షితం సర్వశూలహా. 109
పక్తిశూలం తథైవాన్న ద్రవశూలం చ సర్వశః, (మాధవనిదానే)

తా. శొంఠి, ఇంగువ, సౌవర్చలవణము, రసభస్మము - వీనిని సమభాగములుగ

1 సూతంగంధం సమంశుద్ధం. 2 త్రిగుంజం సర్వశూలజిత్.

ఖల్వములో నునిచి ఆముదముతో మర్దించి వల్లప్రమాణమంత మాత్రలుజేసి ఒకమండలము సేవించిన పక్తిశూల, అన్నద్రవశూల మొదలగు సర్వశూలల హరింపంజేయును.

### మృత్యుశూలకు క్షారయోగము

వంధ్యా లాంగలికామూలం శంఖం చ ద్విగుణం తయోః. 110
త్రయాణాం భావయేచ్చూర్ణం త్ర్యహం జంబీరజద్రవైః,
రుద్ధ్వా గజపుటే పాచ్యం తత్క్షారం మరిచైర్ఘృతైః. 111
కర్షమాత్రం పిబేచ్ఛూలా త్తత్క్షణా న్ముక్తి మాప్నుయాత్,
(మాధవనిదానే)

తా. గొడ్డుకాకరగడ్డ, చన్నచర్లగడ్డ-ఇవి సమభాగములు, శంఖచూర్ణము ౨ భాగములు-ఇటుల వానిని ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో ౩ దినములు భావనజేసి మూకుటిలో నునిచి చీలమన్ను లేపనముజేసి గజపుటం బిడిన యది క్షారంబగును. దానిలో కర్షప్రమాణమును మిరియపుచూర్ణము, నెయ్యి అనువానియనుపానముతోడ సేవించిన మృత్యుశూల తక్షణమున హరించును.

### సర్వశూలలకు వైశ్వానరవటికములు

సైంధవం నాగరం ముస్తా నవభాగం పృథక్పృథక్. 112
ప్రత్యేకం లశునం హింగు కుబేరాక్షి త్రయంత్రయం,
ఏకాంశం భస్మసూతం చ తైలేనైరండజేన చ. 113
క్వాథితం సర్వశూలఘ్నం ప్లీహాఘ్నో వైశ్వానరో భవేత్,

తా. సైంధవలవణము, శొంఠి, తుంగముస్తెలు-ఇవి దినుసుకు ౯ భాగములు, వెల్లుల్లి, ఇంగువ, గచ్చపలుకులు-ఇవి దినుసుకు మూఁడుభాగములు, రసభస్మము ౧ భాగము-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి చూర్ణముజేసి ఆముదములో గలిపి వండి మాత్రలుజేసి శక్త్యనుగుణ్యముగ సేవించిన (గుల్మము) సర్వశూలలు, ప్లీహము వీనిని హరింపంజేయును.

### శూలాదులకు గజకేసరీరసము

శుద్ధసూతం ద్విధాగంధం యామైకం మర్దయే ద్దృఢమ్. 114
ద్వయోస్తుల్యం శుద్ధతామ్రం సంపుటే తన్నిరోధయేత్,
ఊర్ధ్వాధో లవణం దత్త్వా మృద్భాండే ధారయే ద్భిషక్. 115
తతో గజపుటే పక్త్వా స్వాంగశీతం సముద్ధరేత్,
సంపుటం చూర్ణయే త్సూక్ష్మం పర్ణఖండే ద్విగుంజకమ్. 116
భక్షయే త్సర్వశూలార్తో హింగు శుంఠీ సజీరకం,

వచా మరిచజం చూర్ణం కర్ష ముష్ణజలైః పిబేత్. 117
అసాధ్యం నాశయేచ్ఛూలం రసోఽయం గజకేసరీ, (సిద్ధరసార్ణవే)

తా. శుద్ధిజేసినరసము ౧ భాగము. శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు-ఇటుల వీనిని ఖల్వములో నునిచి యొకయామము బాగుగ మర్దించి దీనిని మూడుభాగములు శుద్ధి జేయఁబడిన తామ్రపుడబ్బిలో నునిచి దానిపైమూసి యొకకుండయడుగున సగమువఱకు నుప్పుపోసి దానిమధ్యమున పైతామ్రపుడబ్బినునిచి మరల దానిపై యుప్పుపోసి మూతిని మూసి చీలమన్ను లేపనముజేసి గజపుటంబిడి సాంగశీతలమునదీసి డబ్బితోడ సూక్ష్మముగ చూర్ణముజేసి రెండుగురిగింజలయెత్తును తమలపాకులో నునిచి భక్షించి వెంబడిగ ఇంగువ, శొంఠి, జీలకఱ్ఱ, వస, మిరియాలు అనువానిచూర్ణములో కర్ష ప్రమాణమును ఉష్ణోదకములో గలిపి త్రాగిన సర్వశూలలు, అసాధ్యమైనశూలలు వీనిని హరింపంజేయును.

## శూలారిరసము

రస గంధం సమం కృత్వా తామ్రం తుల్యం నియోజయేత్. 118
మరీచం నాగరం హింగు వచాజాజ్యగ్నిమూలకం,
మార్కవస్వరసేనైవ దినం సూక్ష్మం విమర్దయేత్. 119
బదరాస్థిప్రమాణేన వటికాః కారయే ద్భిషక్,
శూలం గుల్మ ముదావర్తం వాతరోగం నిహంతి చ. 120
రసశ్శూలారిరిత్యేష వహ్నిమాంద్యనిషూదనః,

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, తామ్రభస్మము, మిరియాలు, శొంఠి, ఇంగువ, వస, జాజికాయలు, చిత్రమూలము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గుంటగలగరాకురసములో నొకదినము బాగుగ మర్దించి రేగుపండంతమాత్రలుచేసి ఆరు మాసములు సేవింపుచుండిన సర్వశూలలు, గుల్మములు, ఉదావర్తము, వాతరోగములు, అగ్నిమాంద్యము వీనిని హరింపంజేయును.

## శూలాంతకరసము

మృణాల చందనం యష్టి గుడూచీ వాలుకం తథా. 121
ఏతత్సర్వం సమంచూర్ణం చూర్ణాంశం శర్కరాం క్షిపేత్,
సిందూరం వల్లమాత్రేణ తండులోదకపానతః. 122
పైత్తశూల విదాహశ్చ సర్వశూలం ప్రశామ్యతి, (నిత్యనాథీయే)

తా. తామరతూండ్లు, శ్రీగంధము, యష్టిమధుకము, తిప్పతీఁగె, కూతురుబుడమ వీనిని సమభాగములుగ చూర్ణముచేసి దీనికి సమముగ పంచదారగలిపి వల్లప్రమాణమును సిందూరయుక్తముగ గడుగుతో సేవించిన పైత్తశూల, తాపము, శర్వశూలలు హరించును.

### ప్రక్కశూలచికిత్స

౧. ఇల్లింద యుత్తరేణుల, పల్లవరసమందు జాతిఫల జాపత్రుల్
వెల్లుల్లి భృంగి యేలకి, సుల్లభ మావాలు పక్కశూలలు మానున్.

తా. ఇల్లిందకొనలరసము నాటాకు, ఉత్తరేణుకొనలరసము నాటాకు, జాజికాయ, జాపత్రి, వెల్లుల్లి, గుంటగలగర, ఏలకులు, లవంగములు, ఆవాలు-వీనిని నూరి మూడుపూటలు త్రాగిన ప్రక్కశూల హరించును.

### సర్వశూలలకు గజాంకుశము

నిష్కత్రయం శుద్ధసూతం ద్వినిష్కం శుద్ధటంకణమ్. 123
గంధకం పంచనిష్కంచా ప్యేకనిష్కంచ ముస్తకం,
చతుర్నిష్కం చ నేపాళం తత్సమం మృతతామ్రకమ్. 124
సర్వతుల్యం తిలక్షారం మృక్షామ్లు క్షారచిత్రకం,
తద్వత్పలాశకక్షారం షణ్ణిష్కం త్ర్యూష సైంధవమ్. 125
యవక్షారం ద్వినిష్కం చ బిడా సౌవర్చ కాచకం,
సముద్రలవణం చైవ పిప్పలీ చ త్రినిష్కకమ్. 126
చిత్రమూలరసైర్యుక్తం దినైకం చ విమర్ధయేత్,
సప్తధా చణకక్షార మార్ద్రిక ద్రవమర్దితమ్. 127
ద్విగుంజాం వటికాం ఖాదే దార్ద్రికస్య చ వారిణా,
గుల్మాష్ఠీలా ప్లీహ శూల ప్రత్యష్ఠీలా తునీ ద్వయమ్. 128
ఉదరం సప్తవృద్ధిం చ శోభ పాండ్వామయం తథా,
సర్వరోగాః హరేచ్ఛీఘ్రిం రసశ్శూలగజాంకుశః. (ఆయుర్వేదే)

తా. శుద్ధిచేసిన రసము ౩ నిష్కములు, శుద్ధిచేసిన వెలిగారము ౨ నిష్కములు, శుద్ధిచేసిన గంధకము ౫ నిష్కములు, తుంగముస్తెలు ౧ నిష్కము, శుద్ధిచేసిన నేపాళములు ౪ నిష్కములు, తామ్రభస్మము ౪ నిష్కములు, నువ్వులక్షారము ౧౫ నిష్కములు, చింతక్షారము, చిత్రమూలక్షారము, మోదుగక్షారము-ఇవి దినుసుకు ౬ నిష్కములు, త్రికటుకములు, సైంధవలవణము, యవక్షారము-ఇవి దినుసుకు ౨ నిష్కములు, బిడాలవణము, సౌవర్చలవణము, కాచలవణము, సముద్రలవణము, పిప్పళ్లు-ఇవి దినుసుకు ౩ నిష్కములు, సెనగక్షారము ౭ నిష్కములు-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి చిత్రమూల రసముతో నొకదినము మర్దించి పిదప అల్లపురసముతో మర్దించి రెండు గురిగింజలంత మాత్రలుచేసి యందొకదానిని అల్లపురసముతో మూడుమండలములు సేవించిన పంచ

గుల్మములు, అష్ఠీలము, ప్లీహము, అష్టశూలలు, ప్రత్యష్ఠీలము, తుని, ప్రతితుని, ఉదరము, సప్తవృద్ధులు, శోఫ, పాండువు మొదలగు సర్వరోగముల శీఘ్రముగ హరింపంజేయును. (శూల, గుల్మనివారణార్థంబై మహాదగ్నికుమారమును సేవింపవలయును. పైఁజెప్పఁబడిన యౌషధములవలన శూలగుల్మములు నివర్తింపకుండిన ఇఁకఁ జెప్పంబడు శంఖద్రావకమును సేవింపవలయును.

## శంఖద్రావకము

త్రిక్షారం పంచలవణం పటికీ సురకారకం,
కాసీసం నవసారం చ తిలచించాపమార్గకమ్. 130
ఏతాని సమభాగాని ఘటీమాత్రం విమర్దయేత్,
పాచయే న్మద్యయంత్రేణ మృదువహ్నా తథా భిషక్. 131
శంఖద్రావరసో నామ సర్వశూల వినాశకృత్,
పంచకాసా౯ పంచగుల్మా౯ క్షయకాసా౯ వినాశయేత్. 132
మన్యాస్తంభం కంఠరోగం హృద్రోగం సర్వశూలజిత్,
అగ్నిం చ కురుతే దీప్తం తేజోవర్ణబలప్రదః. (ఆయుర్వేదే

తా. సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము, పంచలవణములు (అనఁగా సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, కాంచలవణము, మంచిలవణము) పటిక, సురాకారము, కాసీసము, నవాసారము, నువ్వులక్షారము, చింతక్షారము, ఉ... రేణుక్షారము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి యొకఘాము మర్దించి కుండలో బోసి దళముగ చీలమన్నుబూసి మునుపటివలెనే సారాయిబట్టిని తగిలించి మృద్వగ్నితో వండిన శంఖద్రావకము సిద్ధంబగును. దానిలో నరతులమును ఓమపుపొట్టులో గలి... దంతములకు తగులక అంగిటిలో వేసుకొని (ఆరుమాసములవఱకు) మ్రింగుచుండిన పం... కాసములు, పంచగుల్మములు, క్షయకాసము, మన్యాస్తంభము, కంఠరోగము, హృద్రో... గము, సర్వశూలలు-వీనిని హరింపంజేసి అగ్నిదీపనము, తేజస్సు, వర్ణము, బలము అ... వానిని సహా గలుగంజేయును.

## మహాశంఖద్రావకము

రంభా చించాగ్ని భూపీలు కేతక్యపి తథైవ చ,
సాల కాలం చ భూధాత్రీ శిగ్రుమూల హరిప్రియమ్. 13...
శరపుంఖీ చ నీలీ చ తిలకాష్ఠం చ బర్బరా,
అఙ్గనవ్యాయ దారూచా పర్కశల్యపునర్నవమ్. 13...
నిర్దిష్టా వింశతిః క్షారా శ్శంఖద్రావం సుపాచయేత్,
క్షారాశ్చ వింశతిః ప్రోక్తా లవణానాం చ పంచకమ్. 13...

పటికీ నవసారంచ క్షారద్వయ త్రిటంకణం,
తుత్థత్రయం శిలా తాళం గంధకం సజ్జకారకమ్. 137
పాషాణంచ తు కాసీసం మూత్రవర్గం తథైవచ,
భూక్షారం గృహధూమాఖ్యం సర్వం సంస్థాప్యయే త్సమమ్. 138
ఆమ్లవర్గై స్తథా మాసం భావయేచ్ఛ ముహుర్ముహుః,
తేజోయంత్రే విధానేన పాకసిద్ధిం విచక్షణః. 139
మూత్రవర్గంచ తోయాభం వరాటీ శంఖకం ద్రవేత్,
పారదేన చ సంయుక్తం వాతరోగే చ యోజయేత్. 140
గుల్మద్వాదశకం హంతి హ్యుదరాణి తథైవచ,
శీతజ్వరం పురాణం చ శోభం సర్వాంగమారుతమ్. 141
ప్రమేహాణ్ వింశతిం హంతి మూత్రకృచ్ఛ్రం తథైవచ,
గజవాజినరాణాంచ పశుపక్షీమృగేషు చ. 142
సర్వరోగహరం చైత త్కాశ్యపేన చ భాషితం,
శంఖద్రావమిదం నామ్నా సర్వరోగేషు శస్యతే. (మాధవనిదానే)

తా. అరటిపట్ట, చింతచెక్క, చిత్రమూలము, ముచ్చతుమికి, మొగిలి, ఏపిచెక్క, కలిగొట్టు, నేలయుసిరిక, మునగవేరు, కణిపిచెక్క, ములువెంపలి, నీలి, నువ్వులదంటు, వాయింట, ఏరుమద్ది, నల్లమద్ది, దేవదారు, జిల్లేడు, ఉత్తరేణు, గలిజేరు అనువాని క్షారములు, పంచలవణములు, పటిక, నవాసారము, యవక్షారము, సర్జక్షారము, వెలిగారము, సురాకారము, గురిజాకారము, శుద్ధిజేసినమైలుతుత్థము, శుద్ధిజేసిన పాలతుత్థము, శుద్ధిజేసిన కఫరితుత్థము, శుద్ధిజేసిన రక్తమణిశిల, శుద్ధిజేసిన తాళకము, శుద్ధిజేసిన గంధకము, సబ్బు, పాషాణము, అన్నభేది,*మూత్రవర్గులో చెప్పఁబడిన ౭ విధమూత్రములు, చౌటిక్షారము, కరుధూపము-వీనినెల్ల సమభాగములు గ్రహించి ఆమ్లవర్గముతో నొకమాసమువఱకు పలుమారు భావనజేసి తేజోయంత్రమునం దునిచి వండిన మూత్రవర్గతుల్యంబై నీరువలె నుండు శంఖద్రావక మొదుసును. అందు గవ్వల, శంఖములవేసిన ద్రవించును. ఆశంఖద్రావకములో శుద్ధిజేసినరసమునుగలిపి సేవించిన వాతరోగములును, ఓమపుపొట్టుగలిపి సేవించిన ౧౨ విధములయిన గుల్మములును, పన్నెండుఉదరములును, శీతజ్వరములును, పురాణజ్వరశోఫలును, సర్వాంగవాతములును, వింశతిమేహములును, మూత్రకృఛ్రములును హరించును. ఇది ఏనుఁగులకు, గుఱ్ఱములకు, నరులకు, పశువులకు, పక్షులకు, మృగములకు గలుగు సర్వరోగముల హరింపంజేయు నని కశ్యపమహర్షి

---

* ఆవు, అశ్వము, మేక, ఏనుగు, గాడిద, ఒంటె, నరుఁడు వీనిమూత్రములు.

వచించెను. (తెల్లనిచవుడును ఉప్పుగవండి అందొకతులములో అరతులము సురాకారము, పావుసేరు ఉదకము గలిపి త్రాగిన ఉమిసేవాంతులు, గుల్మశూలలు హరించును. ఈశంఖ ద్రావకము సర్వరోగములయందు కడుప్రశస్తంబు.

గుల్మాదులయందు పథ్యము

కుళత్థ వాస్తు బృహతీ సపటోల పునర్నవం,
పక్వకూశ్మాండ కతక మిసి హింగు సజీరకమ్. 142
గవ్యం తక్రం పృశ్నికాళి ముండీ నారంగ బిల్వకం,
ప్లీహాష్ఠీలోదరానాహ గుల్మవిద్రధిమిత్రకమ్. (మాధవనిదానే)

తా. ఉలవకట్టు, (తోటకూర) చక్రవర్తికూర, పెద్దములక, చిన్నములక, పొట్లకాయ, గలిజేరుకూర, ముదురుగుమ్మడుకాయ, ఇండుపుకాయ, సదాపకూర, ఇంగువ, జీలకఱ్ఱ, ఆవుచల్ల, కోలపొన్న, బోడతరము, నారదబ్బకాయ, మారేడుపండు-ఇవి ప్లీహము, అష్ఠీలము, తుని, ప్రతితుని, ఉదరము, ఆనాహము, గుల్మశూల, విద్రధి అను వానియందు పథ్యకరంబులు.

గుల్మాదులయం దపథ్యము

నింబ ధాన్యాక నిష్పావశాలుకం పిష్టకైః కృతం,
సిత పిండాల పిణ్యాకం మాంసం నూతనసంభవమ్. 146
అలాబూ దధి చామ్లాని కఠినాని గురూణి చ,
ప్లీహాష్ఠీలోదరానాహ గుల్మవిద్రధిశత్రవః. 147

తా. వేపపండు, కొతిమెర్లు, అనుములు, తామర మొదలైనవానిగడ్డలు పిండివంటకము, తెల్లనిచారకంద, తెలకపిండి, నవీనమాంసము, అనుగపుకాయ, పెరుగు, పులుసు, కఠినద్రవ్యములు - ఇవి ప్లీహము, అష్ఠీలము (ప్రత్యష్ఠీలము), ఉదరము, ఆనాహము, గుల్మశూల, విద్రధి అనువానియం దపథ్యకరంబులు.

ఏకోనవింశప్రకరణమ్.



# వింశ ప్రకరణము

## ఉన్మాదరోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లో. భైరవం భైరవాకారం వీరం వీరేశ్వరం ప్రభుం,
రుద్రం రుద్రగణాధీశం వీరభద్ర మహం భజే. 1

తా. భైరవుడనే పేరుగలవాడు, భయంకరస్వరూపుడు శూరుడు, వీరేశ్వరుడు, జగత్ప్రభువు, రుద్రుడు, రుద్రగణాధిపతి అగు వీరభద్రుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజనిపేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథముయొక్క వింశప్రకరణమును వచింపుచున్నాడను.

అథాన్యత్సంప్రవక్ష్యామి సంక్షిప్తం సూక్తముత్తమం,
ఆయుర్వేదోపదేశేఽస్మి న్నున్మాదం తు నిగద్యతే. (ఆయుర్వేదే)

తా. ఆయుర్వేదమున జెప్పంబడినప్రకారము ఉన్మాదనిదానము సంక్షిప్తంబుగ వచియించెదను.

### ఉన్మాదనిదానము

మదయంత్యుద్ధతాదోషా యస్మాదున్మార్గమాశ్రితః,
మానసోఽయమతోవ్యాధి రున్మాదఇతి కథ్యతే. 4

తా. దోషములు వృద్ధిఁజెంది స్వమార్గమును విడనాడి అన్యమార్గముల (అనఁగా మనోవహాదమనుల) నాశ్రయించుటవలన మనస్సునందు భ్రమజనించి ఉన్మాద మనంబడు ఈరోగము మానసికదోషమువలన జనించును.

### ఉన్మాదభేదంబులు

ఏకైకశ స్సర్వశశ్చ దోషైరత్యర్థమూర్ఛితైః,
మానసేన చ దుఃఖేన స పంచవిధ ఉచ్యతే. 5

విషాద్భవతి షష్ఠశ్చ యథాస్వం తత్ర భేషజం,
సచాప్రవృద్ధ స్తరుణో మదసంజ్ఞాం బిభర్తి చ. 6

తా. వాత, పిత్త, శ్లేష్మములు ప్రత్యేకములుగ ప్రకోపించుటవలనగాని, లేక సన్నిపాతదోషమువలనగాని, లేక మానసికదుఃఖమువలనగాని, ఉన్మాదం బైదు విధంబు లగును,

మఱియు విషసంబంధమువలన ఆరవదియగు ఉన్మాదము జనించును. దీనియందు తగుమైన చికిత్సలం జేయవలయును. ఇవి యధికముగ వృద్ధిం జెందక తరుణంబులైన మదమని వచించెదరు.

ఉన్మాదకారణము

చోరై ర్నరేంద్రపురుషైః కరిభి స్తథాన్యైః
విధ్వంసితస్య ధననాశకులక్షయైర్వా,
గాఢం క్షతి ర్మనసిజప్రహితో౽ధికం వా
జాయేత చోత్కటతరో మనసో వికారః. 7

తా. చోరులు, రాజకీయపురుషులు, ఏనుగులు, పులి మొదలగు దుష్టజంతువులు అనువానివలనగాని, ధననాశకులక్షయమువలనగాని, మన్మథవికారమువలనగాని, అంతఃకరణమున బలమైన ఖేదము జనించి దానివలన బలిష్ఠమైన మనోవికారము జనించును.

ఉన్మాదకారణ, తత్సంప్రాప్తి

విరుద్ధదుష్టాశుచిభోజనాని ప్రధర్షణం దేవగురుద్విజానాం,
ఉన్మాదహేతుర్భయహర్షపూర్వో మనోభిఘాతో విషమాశ్చ చేష్టాః.
తైరల్పసత్వస్య మలాః ప్రదుష్టా బుద్ధేర్నివాసం హృదయం ప్రదూష్య,
స్రోతాంస్యధిష్ఠాయ మనోవహాని ప్రమోహయంత్యాశు నరస్య చేతః.

తా. విరుద్ధదుష్టాన్నమును (అనఁగా విషయుక్తాన్నమును), అమంగళకరాన్నమును సేవించుట, దేవ గురు బ్రాహ్మణుల తిరస్కరించుట, భయము, సంతోషము అనువాని సంబంధమువలన మనసునందు తంద్ర గలుగుట, విషమచేష్ట (అనఁగా వంకరగ నడుచుట, మాటలాడుట మొదలగునవి, బలవంతునితో యుద్ధాలాడుట) - ఇవిమొదలగు కారణములవలన నల్పసత్వగుణముగల పురుషునియొక్క వాతాదిదోషములు ప్రకోపించి వృద్ధింజెంది బుద్ధికి స్థానముగ నుండుమనస్సును జెఱచి మనోవహాస్రోతస్సులం జెంది అంతఃకరణమును మోహింపం జేయును.

ఉన్మాదస్వరూపము

ధీవిభ్రమస్సత్వపరిప్లవశ్చ పర్యాకులాదృష్టిరధీరతా చ,
అబద్ధవాక్త్వం హృదయం చ శూన్యం సామాన్యమున్మాదగదస్య చిహ్నమ్.

తా. భ్రమ, మనశ్చాంచల్యముగలుగుట, దృష్టిచలించుట, భయముగలుగుట అసంబద్ధముగ మాటలాడుట, హృదయము శూన్యంబగుట (అనఁగా విచారణశక్తి లేకుండుట) - ఉన్మాదమున సామాన్యలక్షణంబులని తెలియవలయును.

వాతజోన్మాదలక్షణము

రూక్షాల్పశీతాన్నవిరేకధాతుక్షయోపవాసైరనిలో౽తివృద్ధః,

చింతాదిదుష్టంహృదయంప్రదూష్యబుద్ధింస్మృతించాపినిహంతిశీఘ్రమ్.
అస్థానహాసస్మితనృత్యగీత వాగంగవిక్షేపణరోదనాని,
పారుష్యకార్శ్యారుణవర్ణతాచ జీర్ణేబలంచానిలజస్వరూపమ్. 12

తా. రూక్షము, అల్పము, శీతలముగలయన్నమును సేవించుట, విరేచనములు జేయించుట, దాతువులు క్షయించుట, ఉపవాసముసేయుట - ఈకారణములవలన వాతం బధికముగ వృద్ధింజెంది చింతాదియుక్తంబైనమనస్సును గడుదుష్టయుక్తంబుగజేసి బుద్ధిస్మృతుల శీఘ్రముగ నశింపంజేయుట, నిష్కారణముగ నవ్వుట, ఒకింతహాస్యము సేయుట, ప్రసక్తములేకుండునపుడు నృత్య, గీత, భాషణముల సలుపుట, శరీరము కుదిలించుట, ఏడ్చుట, కఠినముగనుండుట, శరీరము గృశించుట, శరీరకాంతి యెఱ్ఱగ నగుట, ఆహారము పరిపాకమునుజెందుచుండ రోగబలమెచ్చుట - ఈలక్షణములుగలది వాతజోన్మాదమని తెలియవలయును.

## పిత్తజోన్మాదలక్షణము

అజీర్ణకట్వమ్లవిదాహ్యశీతై ర్భోజ్యైశ్చితంపిత్తముదీర్ణవేగం,
ఉన్మాదమత్యుగ్రమనాత్మకస్యహృదిస్థితంపూర్వవదాశుకుర్యాత్. 13
అమర్షసంరంభవినగ్నభావా స్సంతర్జనాభి ద్రవణౌష్ణ్యరోషాః,
ప్రచ్ఛాయశీతాన్నజలాభిలాషాః పీతాస్యతాపిత్తకృతస్యలింగమ్.

తా. ఉడికీయుడకకుండుభోజనమును, కారము, పులుసు, విదాహము, ఉష్ణము గలభోజనమును సేయుటవలన అణగియుండు పిత్తము తీవ్రముగలేచి ఆజితేంద్రియపురుషునియొక్క హృదయమునుజెంది పూర్వమువలెనే కడునుగ్రమైన ఉన్మాదమును తత్క్షణమున గలుగంజేయును. దానివలన నోర్పులేకుండుట, ఆర్భాటముసేయుట, దిగంబరుఁడుగనుండుట, పరుల భయపరచుట, పరుగెత్తుట, శరీర ముష్ణముగనుండుట, కోపమునుజెందుట, నీడలో గూర్చుండుటయందు, శీతాన్నమును శీతజలముసేవించుటయం దిచ్ఛగలుగుట, ముఖము పసపువర్ణముగనుండుట అను నీలక్షణంబులు గలుగును.

## కఫజోన్మాదలక్షణము

సంపూరణైర్మందవిచేష్టితస్య సోష్మాకఫోమర్మణిసంప్రవృద్ధః,
బుద్ధింస్మృతించాప్యుపహంతిచిత్తంప్రమోహయన్సంజనయేద్వికారం
వాక్చేష్టితంమందమరోచకశ్చ నారీవివిక్తప్రియతాతినిద్రా,
ఛర్దిశ్చలాలాచబలంచభుక్తే నఖాదిశౌక్ల్యంచ కఫాదకేస్యాత్. 16

తా. తృప్తికరపదార్థముల భక్షించి శ్రమనుజెందకుండు పురుషునియొక్క పిత్తయుక్తకఫము హృదయమున మిక్కుటముగ వృద్ధింజెంది బుద్ధి, స్మృతి, చిత్తము అను వానిని నశింపంజేయుటచే మోహింపంజేసి ఉన్మాదరూపవికారమును గలుగంజేయుటవలన

వ్యాపారము (అనఁగా మాటలు మొదలగునవి) మందమగుట, అన్నద్వేషము, స్త్రీల యందును, ఏకాంతవాసమునందును యిచ్ఛగలుగుట, కడునిద్ర, వాంతిగలుగుట, నోట జొల్లుగారుట, భోజనానంతరము రోగము ప్రకోపించుట, గోళ్ళు, చర్మము, మూత్రము, నేత్రములు మొదలగునవి తెల్లగనుండుట - ఈలక్షణములుగలది కఫజోన్మాదమని తెలియ వలయును.

సన్నిపాతోన్మాదలక్షణము

యస్సన్నిపాతప్రభవోఽతిఘోరస్సర్వైస్సమస్తైరపి హేతుభిస్స్యాత్
సర్వాణిరూపాణి బిభర్తితాదృగ్విరుద్ధభైషజ్యవిధిర్వివర్జ్యః. 17

తా. వాతాదిదోషములన్నియు తమతమకారణములచే ప్రకోపించి సర్వదోష లక్షణయుక్తంబై కడుభయంకరమైన సన్నిపాతోన్మాదమును గలుగంజేయును. కావున వాతాదిదోషములకై జెప్పంబడిన ప్రత్యేకచికిత్సలు పరస్పరవిరుద్ధంబులగుటచే దాని యందు చేయంజనదు. అయినను అనిర్దేశ్యకారణోత్పత్తిగల యీసన్నిపాతమునందు త్రిదోషహారమైన ఆమలకాదులచే జికిత్సింపవలయును.

శోకజోన్మాదలక్షణము

చోరైర్నరేంద్రపురుషైరరిభిస్తథాన్యై
ర్విత్రాసితస్య ధనబాంధవసంక్షయాద్వా,
గాఢం క్షతే మనసి చ ప్రియయారిరంసో
ర్జాయేత చోత్కటతరో మనసో వికారః. 18
చిత్రం బ్రవీతి చ మనోఽనుగతం విసంజ్ఞో
గాయత్యథో హసతి రోదితి చాతిమూఢః,

తా. దొంగలు, రాజపురుషులు, శత్రువులు, ఇతరులు వీరివలన భయమును జెం దుటవలనగాని, లేక తనకిష్టురాలగు స్త్రీతో సంభోగము సేయుటయం దిచ్ఛయించుటవల నగాని, అంతఃకరణము బలమై ఖేదమును జెందియుండ మనస్సునందు భయంకరమైన వికారము జనించి దానివలన పలువిధములుగ మాటలాడుచు మనోమర్మంబును తెలియఁ బరచుట, జ్ఞానము విపరీతంబగుట, పాడుట, నవ్వుట, ఏడ్చుట, కడుమాఢ్యమును జెందుట - ఈలక్షణములు గలది శోకజోన్మాదమని తెలియవలయును.

విషజోన్మాదలక్షణము

రక్తేక్షణో హతబలేంద్రియభాస్సుదీన
శ్శ్యావాననో విషకృతేన భవేద్విసంజ్ఞః. 19

తా. నేత్రము లెఱ్ఱగనగుట, బలము, ఇంద్రియములు, శరీరకాంతి నశించుట, మిక్కుటముగ దీనుఁడౌట, ముఖముపై నలుపుఛాయగలుగుట, సంజ్ఞనశించుట - ఈ లక్షణములుగలది విషజోన్మాదమని తెలియవలయును.

## అసాధ్యోన్మాదలక్షణము

అవాఙ్ముఖ స్తూన్ముఖో వా క్షీణమాంసబలో నరః,
జాగరూకో హ్యసందేహ ఉన్మాదేన వినశ్యతి. 20

తా. తలవంచికొనియుండుట, లేక తల పైకెత్తుకొనియుండుట, శరీరమాంసము, బలము క్షయించుట, నిదురపట్టకుండుట - ఈలక్షణములుగల యున్మాదరోగి నిశ్చయముగ మృతిజెందును.

## భూతజోన్మాదలక్షణము

అమర్త్యవాగ్విక్రమవీర్యచేష్టా జ్ఞానాదివిజ్ఞానబలాదిభిర్యః,
ఉన్మాదకాలో నియతశ్చయస్య భూతోత్థమున్మాదముదాహరేత్తమ్.

తా. మనుజునకు వ్యతిరిక్తంబైనవాక్కు, పరాక్రమము, శక్తి, శరీరవ్యాపారము, తత్త్వజ్ఞానము, శిల్పాదికజ్ఞానము, స్మృత్యాదిజ్ఞానము మొదలగునవి యున్మాదకాలంబున నియతముగగలిగిన భూతజోన్మాదమని తెలియవలయును. (భూతశబ్దమువలన నుత్తరోత్తర జెప్పంబడు దేవతలను సహా దెలియవలయును.)

## భూతోన్మాదలక్షణము

ప్రలాపో బహుధా యస్య కృతం కార్యం చ విస్మరేత్,
గర్జతీ వాదతే హంతి క్వచి త్తీక్ష్ణం చ పాపకృత్. 22
భూతోన్మాదోదితం చిహ్నం వాతోన్మాదే క్వచిత్స్మృతం,
రక్షయేచ్ఛృంఖలాబంధైః మూలేచ గాఢయేత్కచైః. 23
సర్వాంగం తప్తలోహైర్వా బోధార్థం దర్శయేన్భయం,
పుత్రదారపితామాతా తస్యాగ్రే పాతయేత్స్మృతౌ. 24
చోరరాజభయంచాస్య బోధయే ద్విస్మృతం పురః,
రసై ర్ధూపాంజనై ర్నస్యై స్స్నేహభోజ్యై రుపాచరేత్. 25
(మాధవనిదానే)

తా. పలువిధములుగ ప్రలాపించుట, చేసినపనిని మరచుట, బొబ్బలిడుట, నిష్కారణముగ వాదించుట, కొట్టుట, ఒకానొకపుడు మిక్కుటముగ పాపకృత్యముల జేయుట - ఈలక్షణములుగలది భూతోన్మాదమని తెలియవలయును. అందు కొన్నిలక్ష

ణంబులు వాతోన్మాదమునందును గలిగియుండును. ఇది నివర్తించుటకై సంకిళ్లువేయవలయును. వెంట్రుకలనీడ్చి కట్టవలయును. ఇనుము నెఱ్ఱగ కాల్చి ప్రజ్ఞగలుగుటకై సర్వాంగముల జూపించుటచే భయపరచవలయును. మఱియు ప్రజ్ఞగలుగు నిమిత్తము వానియెదుట పుత్రుఁడు, భార్య, తండ్రి, తల్లి మొదలగువారిని త్రోయవలయును. మఱియు చోరభయము, రాజభయము సదా గలుగునటులం జేయవలయును. మఱియు రసములు, ధూపములు, అంజనములు, నస్యములు స్నేహయుక్తభోజనము అనువానివలన జికిత్సింపవలయును.

అతీవ హాసముల్లాసం వికారాన్ కురుతే బలాత్,
క్షణే స్వస్థః క్షణే భూతోన్మాదస్య లక్షణమ్. 26

తా. తఱుచుగా నగుట, సంతోషమును జెందుట, పలువిధవికారములజేయుట, క్షణకాలము స్వస్థంబుగనుండుట, క్షణకాలం బెఱుఁగకుండుట - ఈలక్షణములుగలది భూతోన్మాదమని తెలియవలయును. (దీనియం దుత్తరత్ర జెప్పంబడునస్యముల నేడుమార్లు జేయించుటయేగాక రాత్రులయందు మహేశ్వరధూపమును, లోనికి సూర్యోదయరససేవనను జేయించవలయును.

## దేవగ్రహోన్మాదలక్షణము

సంతుష్టశ్శుచిరతిదివ్యమాల్యగంధో నిస్తంద్రస్త్వవితథసంస్కృతప్రభాషీ
తేజస్వీస్థిరనయనో వరప్రదాతా బ్రహ్మణ్యోభవతినరస్సదేవజుష్టః. 27

తా. ఎల్లపుడు సంతోషముగనుండుట, పవిత్రుఁడైయుండుట, శరీరమున దివ్యపుష్పమాలికలధరించుట, గంధలేపనములు జేసికొనుట, నిదురబట్టకుండుట, సత్యమును సంస్కృతమును మాటలాడుట, తేజస్సుగలుగుట, స్థిరదృష్టిగలుగుట, వరముల నొసంగుట బ్రాహ్మణులయందు ప్రీతిగలుగుట-ఈలక్షణములు గలది దేవగ్రహోన్మాదమని తెలియవలయును. (దేవశబ్దమువలన గణమాతృకాదికములనుగూడ నెఱుంగందగును.)

## అసురగ్రహోన్మాదలక్షణము

సంస్వేదీద్విజగురుదేవదోషవక్తా జిహ్మాక్షో విగతభయో విమార్గదృష్టిః
సంతుష్టోనభవతిచాన్నపానజాతైర్దుష్టాత్మా భవతిసదేవశత్రుజుష్టః. 2

తా. శరీరమున జెమటగారుట, బ్రాహ్మణ, గురు, దేవతలయందు దోషము నారోపించుట, వక్రముగజూచుట, భయపడకుండుట, వేదవిరుద్ధమార్గమునందు బ్రవర్తించుట, అధికముగ నన్నపానములసేవించినను తృప్తిజెందకుండుట, దుర్బుద్ధిగలుగుట ఈలక్షణములుగలిగిన అసురగ్రహోన్మాదమని తెలియవలయును.

## గంధర్వగ్రహోన్మాదలక్షణము

హృష్టాత్మాపులినవనాంతరోపసేవీ స్వాచారఃప్రియపరిగీతగంధమాల్యః,
నృత్యన్వైప్రహసతిచారుచాల్పశబ్దం గంధర్వగ్రహపరిపీడితోమనుష్యః.

తా. మనస్సంతోషముగలుగుట, ఇసుకదిన్నెలు, ఉద్యానవనములు వీనియందు సంచరించుట, అనింద్యమైన యాచారము నాచరించుట, గాన, గంధ, పుష్పములయం దిచ్ఛగలుగుట, నృత్యము సలుపుట, నవ్వుట, మధురముగ, నల్పముగ మాటలాడుట - ఈలక్షణములుగలది గంధర్వగ్రహోన్మాదమని తెలియవలయును.

## యక్షగ్రహోన్మాద లక్షణము

తామ్రాక్షఃప్రియతనురక్తవస్త్రధారీ గంభీరోద్రుతగతిరల్పవాక్సహిష్ణుః,
తేజస్వీవదతిచ కిందదామికస్మై యోయక్షగ్రహపరిపీడితోమనుష్యః. 30

తా. నేత్రము లెఱ్ఱగనుండుట, సుందరమై, సూక్ష్మమై ఎఱుపురంగుగలదైయుండు వస్త్రములధరించుటయం దిచ్ఛగలుగుట, గంభీరముగ (ధీరముగ) నుండుట, శీఘ్రముగ నడుచుట, మితముగ మాటలాడుట, ఓర్పు తేజస్సు గలుగుట, ఎవని కేదియిత్తునని వచించుట-ఈలక్షణములుగలది యక్షగ్రహోన్మాద మని తెలియవలయును.

## పితృగ్రహోన్మాదలక్షణము

ప్రేతానాంసదిశతిసంస్తరేషుపిండాన్భ్రాంతాత్మాజలమపిచాపసవ్యవస్త్రః,
మాంసేప్సుస్తిల గుడపాయసాభికామస్తద్భక్తోభవతిపితృగ్రహాభిజుష్టః.

తా. దర్భపై పితృదేవతలకు పిండము నిచ్చుట, భ్రాంతిని జెందుట, పైవస్త్రము నపసవ్యముగధరించి తర్పణమువిడుచుట, మాంసభక్షణము, నువ్వులు, బెల్లము, పరమాన్నము అనువానియందిచ్ఛ, పితృభక్తిగలుగుట-ఈలక్షణములు గలది పితృగ్రహోన్మాద మని తెలియవలయును. (దీనియందుగాని,ఇతరభూతోన్మాదములయందుగాని రోగిగోరెడి సర్వపదార్థముల నివ్వందగును.)

## సర్పగ్రహోన్మాదలక్షణము

యస్తూర్వ్యాం ప్రసరతి సర్పవత్కదాచి
త్సృక్విణ్యౌ విలిహతి జిహ్వయా తథైవ,
క్రోధాళు ర్మధు గుడ దుగ్ధ పాయసేప్సు
ర్విజ్ఞేయో భవతి భుజంగమేన జుష్టః. 32

తా. సర్పమువలె (అనఁగా ఱొమ్ముతో) భూమిపై నొకానొకపుడుప్రాకులాడుట, వెలపటిపెదవులను సర్పమువలె నాలుకతో నాకుట, కడుకోపమునుజెందుట, తేనె,

బెల్లము, పాలు, పాయసము అనువానిసేవనయం దిచ్ఛగలుగుట - ఈలక్షణములుంగలిగిన సర్పగ్రహోన్మాద మని తెలియవలయును.

### రాక్షసగ్రహోన్మాదలక్షణము

మాంసాసృగ్వివిధసురావికారలిప్సు ర్నిర్లజ్జో భృతమతి నిష్ఠురోఽతిశూరః,
క్రోధాళుర్విపులబలో నిశావిహారీ శౌచద్విడ్భవతిసరాక్షసైర్గృహీతః. 33

తా. మాంసము, రక్తము, పలువిధములైన మద్యములు అనువాని నిచ్ఛయించుట, లజ్జలేకుండుట, కఠినిష్ఠూరముగ మాటలాడుట, కడుశౌర్యము, కోపము, కడుబలము గలుగుట, రాత్రులయందు మిక్కుటముగ సంచరించుట, శుచిత్వమునందు మిక్కిలి యసహ్యపడుట - ఈలక్షణములుంగలిగిన రాక్షసగ్రహోన్మాద మని తెలియవలయును.

### పిశాచజుష్టలక్షణము

* ఉద్ధస్తఃకృశపరుషశ్చిరప్రలాపీ దుర్గంధో భృశమశుచి స్తథాతిలోలః,
బహ్వాశీవిజనవనాంతరోపసేవీ వ్యాచేష్టన్ భ్రమతిరుదన్ పిశాచజుష్టః. 34

తా. హస్తమును పొడవుగ నెత్తుట, లేక దిగంబరుఁడుగ నుండుట, తేజస్సులేకుండుట, చిరకాలమువఱకు తఱుచుగ వదురుట, శరీరమున దుర్గంధము వెడలుట, కడు నమంగళముగ నుండుట, అన్నపానముల నిచ్ఛగించుట, అన్నపానముల మిక్కుటముగ సేవించుట, వనమునం దేకాంతముగనుండుట కిచ్ఛగించుట, విరుద్ధచేష్టలు సేయుట, రోదనముసేయుచు సంచరించుట - ఈలక్షణములుగలది పిశాచోన్మాద మని తెలియవలయును. (హింస, క్రీడ, సత్కారము అనుమూడుకారణములవలన గ్రహముసోకును. అందు హింసించుటకై పట్టెడిగ్రహము నివర్తించుట యసాధ్యము.)

### దేవాదిగ్రహగ్రహణకాలము

దేవగ్రహాః పౌర్ణమాస్యా మసురా స్సంధ్యయోరపి,
గంధర్వాః ప్రాయశోఽష్టమ్యాం యక్షాశ్చ ప్రతిపద్యథ. 35
పితృగ్రహా స్తథాదర్శే పంచమ్యా మపిచోరగాః
రక్షాంసి రాత్రౌ పైశాచా శ్చతుర్దశ్యాం విశంతిహి. 36

తా. దేవగ్రహము పౌర్ణమియందును, అసురగ్రహము సంధ్యలయందును, గంధర్వగ్రహము తఱుచుగ అష్టమియందును, యక్షగ్రహము పాడ్యమియందును, పితృగ్రహము అమావాస్యయందును, సర్పగ్రహము పంచమియందును, రాక్షసగ్రహము రాత్రియందును, పిశాచగ్రహము చతుర్దశియందును మనుజులకు సోఁకును. (కావున

---

* ఉద్వస్త్ర.

ఆయాతిథులవలన నాయా గ్రహముల నెఱిఁగి తత్తదుపయుక్తశాంతి, బలి, దానముల నాయాతిథులయందు సేయుటకై జెప్పంబడియెను.)

## శరీరాశ్రితగ్రహాదృష్టకారణము

దర్పణాదీ న్యథాఛాయా శీతోష్ణం ప్రాణినోయథా,
స్వమణిం భాస్కరాంశుశ్చ యథాదేహంచ దేహధృక్. 37
విశంతి నచ దృశ్యంతే గ్రహాస్తద్వచ్ఛరీరిణాం,

తా. అద్దము మొదలగువానియందు ప్రతిబింబమును, ప్రాణులయందు శీతోష్ణమును, సూర్యకాంతమణులయందు సూర్యకిరణములును, శరీరమున జీవుఁడును చేరుచందంబున ప్రాణులయొక్క శరీరమునందు గ్రహములుజేరి గనుపించకుండును.

## అపస్మారసామాన్యలక్షణము

తమఃప్రవేశ స్సంరంభో దోషోద్రేకౌ హతస్మృతిః. 38
అపస్మార ఇతి జ్ఞేయో గదో ఘోర శ్చతుర్విధః,

తా. చీకటి ప్రవేశించినటుల దోఁచుట, వికారముగ నేత్రములదిప్పుచు హస్తపాదముల పిదలించుట, దోష ప్రాబల్యమువలన జ్ఞానము నష్టంబగుట - ఈలక్షణములు గలది భయంకరమైన అపస్మారమని తెలియవలయును. ఇది వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత భేదములవలన నాలుగువిధంబులు.

## అపస్మారపూర్వరూపములు

హృత్కంప శ్శూన్యతా స్వేదో ధ్యానం మూర్ఛాప్రమూఢతా.
నిద్రానాశశ్చ తస్మింస్తు భవిష్యతి భవంత్యథ,

తా. హృదయమున కంపముగలుగుట, ఏమియు దోఁచకుండుట, చెమటపట్టుట, చింత, మూర్ఛ, ఇంద్రియమోహము, నిద్రాభంగముగలుగుట - ఇవియ అపస్మారమునకు పూర్వరూపంబులు.

## వాతాపస్మారలక్షణము

కంపతే ప్రదశేద్దంతా న్ఫేనోద్వామీశ్వసిత్యపి. 40
పరుషారుణకృష్ణాని పశ్యేద్రూపాణిచానిలాత్,

తా. వణకుట, పండ్లుకొఱుకుట, నోటివలన నురుగుగారుట, శ్వాసము గలుగుట, మనుజులు కాఠిన్యము, ఎఱుపు, నలుపువర్ణములుఁగలవారుగ గనుపించుట-ఈలక్షణములు గలది వాతాపస్మారమని తెలియవలయును.

## పిత్తాపస్మారలక్షణము

పీతఫేనాంగవక్త్రాక్షః పీతాసృగ్రూపదర్శనః. 41

సతృష్ణోష్ణానలవ్యాప్త లోకదర్శీ చ పైత్తికః,

తా. నోటిలో పసపుగ నురుగు గారుట, శరీరము, ముఖము, నేత్రములు పసపు ఛాయగలవిగనుండుట, వస్తువులు పసపు, ఎఱుపువర్ణములుగలవిగ గనుపించుట, తృష్ణోష్ణ యుక్తుండైయుండ నగ్నివలన జగత్తు వ్యాప్తంబైయుండునటులం గాంచుట-ఈలక్షణములు గలది పైత్త్యాపస్మారమని తెలియవలయును.

## శ్లేష్మజాపస్మారలక్షణము

శుక్ల ఫేనాంగవక్త్రాక్షః శీతో హృష్టాంగజో గురుః. 42
పశ్యేత్ శుక్లాని రూపాణి ముచ్యతే శ్లైష్మికశ్చిరాత్,

తా. నోటినురుగు, శరీరము, ముఖము, కన్నులు తెల్లగనుండుట, శరీరము చల్లగ నుండుట, గగుర్పొడుచుట, శరీరము జడముగనుండుట, సర్వపదార్థములు తెల్లగ గనుపించుట (లేక తెల్లగనుండు పురుషుఁడు తనవద్దికి పరుగులిడుచు వచ్చునటులం గాంచుట, దీర్ఘకాలముమీఁద విడుచుట-ఈలక్షణములుగలది శ్లేష్మజాపస్మారమని తెలియవలయును. శ్లేష్మజాపస్మారము దీర్ఘకాలముమీఁద విడుచుననుటవలన వాతపిత్తాపస్మారంబులు శీఘ్రముగ విడుచునని తెలియవలయును.)

## సన్నిపాతాపస్మారలక్షణము

సర్వైరేతైః సమస్తైశ్చ లింగైర్జ్ఞేయస్త్రిదోషజః. 43
అపస్మారస్సచాసాధ్యో యఃక్షీణస్యానవశ్చయః,

తా. పూర్వోక్తవాత, పిత్త, శ్లేష్మలక్షణములం గలది త్రిదోషాపస్మారమని తెలియవలయును. ఇది యసాధ్యంబులు. మఱియు క్షీణపురుషునికి జనించిన యపస్మారంబును, జీర్ణంబైనయపస్మారంబును అసాధ్యంబులు.

## అసాధ్యాపస్మారలక్షణము

ప్రతిస్ఫురంతం బహుశః క్షీణం ప్రచలితభ్రువమ్. 44
నేత్రాభ్యాం చ వికుర్వాణ మపస్మారో వినాశయేత్,

తా. పలుమారు వణకుట, శరీరము కృశించియుండుట, కనుబొమల నెగరవేయుట, నేత్రముల వికారముగ ద్రిప్పుట-ఈలక్షణములుగల యపస్మారరోగి యముని గాంచునని తెలియవలయును.

పక్షాద్వా ద్వాదశాహాద్వా మాసాద్వా కుపితామలాః. 45
అపస్మారాయ కుర్వంతి వేగం కించిదథోత్తరం,

తా. దోషములు ప్రకోపించి ౧౫ దినములకుగాని, లేక ౧౨ దినములకుగాని, ఒకమాసమునకుగాని, అపస్మారమును గలుగం జేయును. (అందు వాతాపస్మారము ౧౨ దిన

ములకు, పిత్తాపస్మారము ౧౫ దినములకు, శ్లేష్మాపస్మారము ౩౦ దినములకు జనించును. "ద్వాదశాహానంతరంపక్షం" అని జెప్పదగియుండ దొలుత పక్షమును జెప్పుటవలన దీర్ఘ కాలమునకు దోషము వృద్ధిజెందుచున్నదని యూహింపం దగియున్నయది. "కించిదథోత్తరం" అనుపదమువలన దోషము తనతారతమ్యమువలన జెప్పంబడిన కాలమునకు ముందే వేగముగలదియగునని సూచింపంబడియెడిది. ఐనను వేగమును గలుగంజేసి యపస్మారముల కారంభమై యుండుదోషము సర్వకాలమునందు శరీరము నాశ్రయించియుండ వేగముసేయక పన్నెండుదినముల కాలమునందు మాత్రము వేగముసేయుటకు గారణం బెద్దియని యూహింపందగియున్నయది. ఐనను, "శ్లో. దేవేవర్షత్యపి యథా భూమౌ బీజానికానిచిత్, శరది ప్రతిరోహంతి తథావ్యాధిసముచ్ఛ్రియః." అనువచనప్రకారము విత్తనమువలన నంకురము జనించుటకు తేజస్సు, వాయువు, పృథివి, ఉదకము అనునవి సహాయంబులై యుండ మధ్యకాలమున జనింపక కాలవిశేషమువలన జనించుచందంబున దోషములును కాలానుగుణ్యముగ బ్రకోపమును జెందును. ఈకారణంబులే చాతుర్థికాది జ్వరములయందును సంబంధించునని తెలియవలయును.)

## సామాన్య చికిత్స

యచ్చోపదిశ్యతే కించి దపస్మారే చికిత్సితమ్. 46
ఉన్మాదే తచ్చ కర్తవ్యం సామాన్యాద్దోషదూష్యయోః,

తా. ఉన్మాదాపస్మారములయందు దోషదూష్యములు సమానంబులుగ నుండుట వలన నపస్మారమునకై జెప్పంబడిన సర్వచికిత్సల ఉన్మాదమునందును జేయందగును.

ఆశ్వాసయేత్సుహృద్వాక్యై ర్యాప్రియా దిష్టవినాశనమ్. 47
దర్శయే దద్భుతం కర్మ తాడయేచ్చ కశాదిభిః,

తా. ఉన్మాదముగలవాని నుత్తమమైనమాటలవలన నూరడించవలయును. మఱియు వానికి ప్రియకరముగనుండు వస్తువు నశించినదని గాని జెప్పవలయును. లేక నద్భుతచేష్టల జూపించవలయును. కొరడాలు మొదలగువానిచే గొట్టవలయును.

కపికచ్ఛ్వాథవా తప్తలోహతైలజలైః స్పృశేత్. 48
వక్త్రాభిధానే కూపే వా సతతం చ నివేశయేత్,
పరస్పరప్రతిద్వంద్వై రేభిరేవ శమం నయేత్. 49
జలాగ్నిద్రుమశైలేభ్యో విషమేభ్యశ్చతం సదా,
రక్షేదున్మాదినంచైవ సద్యః ప్రాణహరం హి తత్. 50

తా. ఉన్మాదముగలవానికి దురదగొండినిగాని, లేక గాచిన యినుమునుగాని, నూనెనుగాని, లేక నీళ్ళనుగాని తాకించవలయును. లేక కాచినలోహాదులను నోటిలో పోయునటులనైనను భయము జూపవలయును. పైజెప్పబడిన పరస్పరవిరుద్ధకృత్యముల

వలన నున్మాదరోగిని స్వాధీనపరచికొనవలయును. మఱియు నీళ్ళు, నిప్పు, వృక్షములు, పర్వతము, విషమస్థలము అనునవి సద్యఃప్రాణహారంబు లగుటచే వానివలన నున్మాదరోగిని సంరక్షింపవలయును.

### భూతభైరవరసము

రసస్సతాలస్సశిరస్సలోహ స్స్రోతోఽంజనంసార్కమిదంహిగంధం,
పిష్ట్వాజమూత్రేణసమంసమస్తా ద్దేయోద్విభాగోఽథబలిఃపచేచ్చ. 51
లోహేక్షణం హంతిఘృతేనమాషోఽపస్మారమస్మోన్మదమానసత్వం,
పిబేదనుత్ర్యూషణహింగుయుక్తంసర్పిర్నృమూత్రంరుచకేనసార్ధమ్.
భూతోన్మాదేషు సర్వేషు రసోఽయం భూతభైరవః,
స్వర్ణజైః తంచభిర్బీజై ర్దేయ స్సర్పి ర్విమిశ్రితః. 53

తా. శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన తాళకము, శుద్ధిచేసిన మణిశిల, లోహభస్మము, సురమటాయి, తామ్రభస్మము, శుద్ధిచేసిన గంధకము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గోమూత్రముతో మర్దించి దీనికిరెండింతలు శుద్ధిచేసినగంధకమును లోహపాత్రయం దునిచి పైయౌషధములు గలిపి వండి ఒకమాషమెత్తును నేతితోడ సేవించిన అపస్మారము, ఉన్మాదము వీనిని హరింపంజేయును. దీనిసేవనానంతరము త్రికటుకములు, ఇంగువ అనువానిచూర్ణమును ఘృతానుపానముతోడగాని, లేక సైంధవలవణమును నరమూత్రానుపానముతోడగాని, లేక ౫ ఉమ్మెత్తవిత్తులను నేతియనుపానముతోడగాని సేవింపవలయును.

యేచ స్యుర్భువి గుహ్యకాశ్చ ప్రమథా స్తేషాంసమారాధనం,
దేవబ్రాహ్మణపూజనం చ సయమే దున్మాదమాగంతుకమ్. 54

తా. దేవయోని విశేషులగు గుహ్యులు, ప్రమథగణములు, ఇంద్రాదిదేవతలు, బ్రాహ్మణులు, వీర్లను బూజించుటచే ఆగంతుకోన్మాదము శమించును.

### అపస్మారగజాంకుశము

హింగు సౌవర్చలం వ్యోషాం గోమూత్రేణ పృథగ్దినం,
చూర్ణితం నిష్కమాత్రం తు సూతరాజేన సంయుతమ్. 55
అజాజ్యేన తు దేయం స్యా త్సర్వోన్మాదవినాశనం,
గదితం సప్తరాత్రేణ హ్యపస్మారగజాంకుశమ్. 56

తా. ఇంగువ, సౌవర్చలవణములు, త్రికటుకములు - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి గోమూత్రములో నొకదినము నానబెట్టి మరుదినము ఎండించి చూర్ణము చేసి నిష్కప్రమాణము రసభస్మము గలిపి మేకనేతితో ఏడుదినములు సేవించిన సర్వోన్మాదములు, అపస్మారము వీనిని హరింపంజేయును.

## అపస్మారమునకు భూతభైరవరసము

మృతసూతార్కలోహం చ తాళం గంధం మనశ్శిలాం,
స్రోతోఽంజనం చ తుల్యాంశం నరమూత్రేణ మర్దయేత్. 57
తద్గోళద్విగుణం గంధం లోహపాత్రే క్షణం పచేత్,
పంచగుంజామితం ఖాదే దపస్మారహరం ఘృతైః. 58
హింగు సౌవర్చలం త్ర్యూషం నరమూత్రేణ సర్పిషా,
కర్షమాత్రం పిబేచ్చాను రసోఽయం భూతభైరవః. (ఆయుర్వేదే)

తా. రసభస్మము, తామ్రభస్మము, లోహభస్మము, శుద్ధిచేసిన తాళకము, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసిన మణిశిల, స్రోతోంజనము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి నరమూత్రముతో మర్దించి ముద్దచేసి దానికి రెండింతలు శుద్ధిచేసిన గంధకమును గలిపి ఇనుపగిన్నెలో నునిచి క్షణకాలము వండి ౫ గురిగింజలయెత్తును నేతితోగాని, లేక ఇంగువ, సౌవర్చలవణము, త్రికటుకములు అనువానిని నరమూత్రముతో నూరి కర్షమెత్తును నేతితోగాని సేవించిన అపస్మారము హరించును.

## అపస్మారమునకు ఇంద్రబ్రహ్మావటికములు

మృతం సూతాభ్రకం తీక్ష్ణ[1]మారం కాంస్యం మృతం సమం,
పద్మకేసరసంయుక్తం దినైకం మర్దయేద్ద్రవైః. 60
[2]స్నుహ్యగ్నివిజయైరండ వచా నిష్పావసూరణైః,
నిర్గుండ్యాశ్చ ద్రవైర్మర్ద్యం తద్గోళం పాచయే త్పునః. 61
కర్ణికా సర్షపోత్థేన తైలేన గంధసంయుతం,
యామం పక్త్వా సముద్ధృత్య చణమాత్రా వటీకృతా. 62
ఇంద్రబ్రహ్మావటీనామా భక్షయే దార్ద్రికద్రవైః,
దశమూలకషాయం చ కణాయుక్తం పిబేదను. 63
అపస్మారం నిహంత్యాశు యథా సూర్యోదయస్తమః,
(సిద్ధరసార్ణవే)

తా. రసభస్మము, అభ్రకభస్మము, లోహభస్మము, ఇత్తడిభస్మము, కంచుభస్మము (లేక రజితభస్మము, శుద్ధిచేసిన సువర్ణమాక్షికము, శుద్ధిచేసినవసనాభి), పద్మకేసరములు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి బొంతజెముడుపాలు, చిత్రమూలము, కరక్కాయ, ఆముదపువేరు, వస, అనుపాకు, కంద, వావిలి అనువానిరసములలో ప్రతిదానిచే నొక్కొకదినముచొప్పున మర్దించి ముద్దచేసి దానిని మరల కుసుమనూనె, ఆవ

1 తారతాప్యవిషం. 2 స్నుహ్యగ్నివిజయైరండపథ్యా = బొంతజెముడుపాలు, చిత్రమూలము, గంజాయి, ఆముదపువేరు, కరక్కాయ.

నూనె, గంధకతైలము అనువానితో నొకరఘామము వండి దించుకొని సెనగగింజయెత్తును అల్లపురసముతోగాని, లేక మారేడు, గుమ్ముడు, దుందిలము, తక్కిలి, కలిగొట్టు, పిన్నపొన్న, నక్కపొన్న, పెద్దములక, నేలములక, పల్లేరు అనువానిచెక్కల సమభాగములుగ దంచి కషాయముగాంచి అందు పిప్పలిచూర్ణముగలిపి యీయనుపానముతోడగాని సేవించిన "సూర్యోదుదయించుటచే నంధకారము దొలంగుభంగి" అపస్మారము శీఘ్రముగ నివర్తించును.

## అపస్మారములకు బ్రాహ్మీఘృతము

బ్రాహ్మీ ముండీ వచా కుష్ఠం సనీలోత్పల పిప్పలీ. 64
సైంధవంచ సమం భావ్యం బ్రాహ్మీద్రావై స్త్రిసప్తకం,
తస్మాచ్చతుర్గుణం చాజ్యం బ్రాహ్మీద్రావం ఘృతాచ్చతుః. 65
ఘృతశేషం పచేత్సర్వ మిదం బ్రాహ్మీ ఘృతం స్మృతం,
అపస్మారం హరత్యాశు సర్వరోగకులాంతకమ్. (మాధవనిదానే)

తా॥ బ్రహ్మదండి, బోడతరము, వస, చెంగల్వకోష్ఠు, నల్లకలువగడ్డ, పిప్పలి, సైంధవలవణము-వీనిని సమభాగములుగ చూర్ణముచేసి బ్రహ్మదండిరసముతో ౨౧ మార్లు భావనచేసి ముద్దచేసి దానికి నాలుగింతలు నెయ్యి, నేతికి నాలుగింతలు బ్రహ్మదండి రసము గలిపి ఘృతము శేషించునటులగాచి సేవించిన అపస్మారము (ఉన్మాదము) మొదలగు సర్వరోగముల శీఘ్రముగ హరింపం జేయును.

## బ్రాహ్మీఘృతము

చతుష్షష్టీపలం బ్రాహ్మీ నిజద్రావం సమాహరేత్,
ద్వాత్రింశత్పలకం చాజ్యం త్రివృద్ధతీం కటుత్రయమ్. 67
ఆరగ్వధం శంఖపుష్పం ప్రియంగు సవిళంగకం,
ప్రతికర్షం క్షిపే చ్చూర్ణం పచే చ్చూర్ణం దృఢే ఘటే. 68
పలమాత్రం పిబేన్నిత్యం యావత్పలచతుష్టయం,
భూతోన్మాద మపస్మారం బ్రాహ్మీఘృత మిదం హరేత్. 69
(సిద్ధరసార్ణవే)

తా॥ మోదుగచెక్కరసము ౬౪ పలములు, నెయ్యి ౩౨ పలములు, శుద్ధిచేసిన తెగడ, నేలదంతి, త్రికటుకములు, రేలపట్ట, కట్లవేరుపట్ట, ప్రేంకణము, వాయువిడంగములు-వీనిని దినుసుకు కర్షప్రమాణముచొప్పున చూర్ణముచేసి నేతిలోగలిపి వండిపలము మొదలు నాలుగుపలములవఱకు రోగబలానుగుణ్యముగ ప్రతిదినము పానము చేయించిన భూతోన్మాదము, అపస్మారము హరించును.

### భూతోన్మాదచికిత్సాక్రమము

బుద్ధ్వా దోషం వయస్సాత్మ్యం దేశం కాలం బలాబలం,
చికిత్సిత మిదం కుర్యా దున్మాదే భూతదోషజే. 70

తా. భూతోన్మాదమున దోషము, వయస్సు, శరీరప్రకృతి, దేశము, కాలము, బలము, దౌర్బల్యము అనువానిని బుద్ధివలన బాగుగ నెఱింగి చికిత్సింపవలయును.

దేవర్షి పితృగంధర్వై రున్మత్తేషుచ బుద్ధిమాన్,
త్యజే న్నస్యాంజనాదీని తీక్ష్ణాని క్రూరకర్మ చ,
సర్పిఃపానం సూర్యజపహోమ మంత్రాదిరిష్యతే. 72

తా. దేవ, పితృ, గంధర్వోన్మాదములయందు బుద్ధిమంతుఁడగువాఁడు నస్యము అంజనము మొదలగు తీక్ష్ణకరమైన క్రూరకర్మలవర్జించి ఘృతపానమువలన సూర్యజపహోమ మంత్రాదులవలన నుపచరింపవలయును.

పూజాబల్యుపహారశాంతివిషయో హోమేష్టిమంత్రక్రియా
దానం స్వస్త్యయనం వ్రతాదినియమ స్సమ్యగ్జపో మంగళం,
ప్రాయశ్చిత్తవిధాన మంజలిరథో రత్నౌషధీధారణం
భూతానా మధిపస్య విష్టపపతే ర్గౌరీపతే రర్చనమ్. 73

తా. పూజ, బలి, కానుక, శాంతి, హోమము, యాగములు, మంత్రించడము, దానము, ఆశీర్వాదము, వ్రతాదినియమములు, జపము, మంగళాచరణము, ప్రాయశ్చిత్తము, నమస్కారము, రత్నములు, ఓషధులు - వీనిని ధరించుట, భూతాధిపతియగు నీశ్వరునిపూజ-వీనిచే భూతాదిగ్రహపీడను హరింపఁజేయవలయును.

మాషైకం భక్షయే న్నిత్యం పిబే ద్బ్రాహ్మీఘృతం హ్యను,
సర్వభూతగ్రహాన్ హంతి రసమానందభైరవమ్. 74

తా. మాషప్రమాణము ఆనందభైరవరసమును బ్రాహ్మీఘృతానుపానముతోఁడ ప్రతిదినము సేవించుచుండిన సర్వభూతగ్రహోన్మాదములు హరించును.

### హింగ్వాదిఘృతము

హింగు సౌవర్చలం త్ర్యూషం పంచానాం పలపంచకం,
చతుష్షష్టిజలంచాజ్యం గవాం మూత్రం చతుర్గుణమ్. 75
ఘృతశేషం పచేత్సర్వం తథా పానే ప్రయోజయేత్,
భూతోన్మాద మపస్మారం నాశయే ద్బ్రహ్మరాక్షసమ్. (బాహటే) 76

తా. ఇంగువ, సౌవర్చలవణము, త్రికటుకములు-వీనిని దినుసుకు ౫ పలముల చొప్పున దంచి చూర్ణముజేసి నెయ్యి ౬౪ పలములు, నేతికి నాలుగింతలు గోమూత్రము

గలిపి ఘృతము శేషించునటుల గాచి సేవించిన భూతోన్మాదము, అపస్మారము బ్రహ్మరక్షస్సు-వీనిని హరింపంజేయును.

భూతోన్మాదాపస్మారములకు విజయఘృతము

ఉగ్రగంథా పలం పంచ పటోలం పర్పటం తథా,
పిప్పలీ శృంగబేరంచ పంచ పంచపలం తథా. 77
బ్రాహ్మీరసశ్చ ప్రస్థార్థం ఘృతప్రస్థే విపాచయేత్,
త్రిఫలా త్రికటూశీర లశునం పంచకోలకమ్. 78
ఏతన్నిష్కం ప్రయుంజీత యథాగ్ని బలమాత్రయా,
భూతోన్మాద మపస్మారం వాతికం పైత్తికం జ్వరమ్. 79
శ్లైష్మికం సాన్నిపాతంచ శీతకం విషమజ్వరం,
పానమాత్రేణనశ్యంతి ప్రోచ్యతేవిజయంఘృతమ్. (నిత్యనాథీయే)80

తా. ఓమపుపొట్టు, చేదిపొట్ల, పర్పాటకము, పిప్పళ్లు, అల్లము - వీనిని దినుసుకు ౫ పలము చొప్పున చూర్ణము జేసి అందు మోదుగచెక్కరసము ౪ ప్రస్థము, నెయ్యి ప్రస్థము, త్రిఫలములు, త్రికటుకములు, వట్టివేరు, వెల్లుల్లిపాయలు, పంచకోలములు అనువానిచూర్ణమును దినుసుకొక్కొకనిష్కముచొప్పున గలిపి ఘృతపక్వముగ గాచి అగ్నిబలానుగుణ్యముగ సేవించిన భూతోన్మాదము, అపస్మారము, వాత, పైత్త, శ్లేష్మ, సన్నిపాత, శీత, విషమజ్వరములు హరించును.

గంధకపిష్టి

గంధకం పలమాదాయ తులసీరసమర్దితం,
త్రిదినం గోజలే పాచ్యం డోలాయంత్రే ప్రయోజయేత్, 81
తత్సమం పారదం దత్వా చార్ద్రికేణ దినత్రయం,
అష్టమాంశేన నేపాళం తత్ర విన్యస్య వారిభిః. 82
ఆర్ద్రికస్య త్ర్యహం మర్ద్యం భవే ద్గంధకపిష్టకం,
తత్పిష్టకం ప్రయుంజీత చతుర్వల్లప్రమాణకమ్. 83
సప్తవారప్రయోగేణ సోన్మాద తిమిరం జయేత్,
వాతశ్లేష్మాంతరాన్ రోగాన్ హన్యాదత్ర న సంశయః. 84

తా. ఒకపలము శుద్ధిజేసినగంధకమును ఖల్వములో నునిచి తులసియాకురసముతో 3 దినములు మర్దించి ముద్దజేసి యెండించి రెండుమడతలుగల బట్టలో మూటగట్టి గోమూత్రముతో డోలాయంత్రమున వండి పైగంధకమునకు సమముగ శుద్ధిచేసినరసమును జేర్చి ఖల్వములో నునిచి అల్లపురసముతో మూడుదినములు మర్దించి యెండించి ఔషధ

మున కెనిమిదవభాగము శుద్ధిజేసిన నేపాళము గలిపి అల్లపురసముతో 3 దినములు మర్దించి కరాటములో నునిచి పూటకు నాలుగువల్లములయెత్తును బోడతరము, బ్రహ్మదండి అనువానిరసానుపానముతోడ నేడుదినములు సేవించిన తిమిరముతో గూడియుండు ఉన్మాదములు, వాతశ్లేష్మమువలన జనించినరోగములు నిస్సంశయముగ హరించును. (మఱియు బ్రాహ్మీఘృతానుపానముతోడగాని, లేక పంచగవ్యఘృతానుపానముతోడగాని, లేక విజయఘృతానుపానముతోడగాని, లేక కల్యాణఘృతానుపానముతోడగాని లేక దశమూల కషాయానుపానముతోడగాని, లేక అల్లపురసానుపానముతోడగాని, లేక పిప్పలితోడగాని సేవించిన సర్వోన్మాదములు హరించును. దీనియందు శీతకరద్రవ్యములు, బఱ్ఱెనెయ్యి, బఱ్ఱెపాలు, బోడతరపుకూర అనువానిని సేవించుట కడుప్రశస్తంబు.)

## అపస్మారోన్మాదములకు విజయగుళికలు

సూతంచ గంధకం లోహం విషం చిత్రక పత్రకం,
విళంగం రేణుకా ముస్తా చైలా గ్రంథిక కేసరమ్ 85
కటుత్రయంచ త్రిఫలా నేపాళం శుల్బభస్మకం,
ఏతాని సమభాగాని గుడ ద్విగుణసంయుతమ్. 86
సర్వం తద్గుటికాం కృత్వా చణకానాం ప్రమాణతః,
ఏకైకాం భక్షయే న్నిత్యం తాసాం మధ్యే విచక్షణః. 87
కాసే శ్వాసే క్షయే గుల్మే ప్రమేహే విషమజ్వరే,
తృష్ణాయాం గ్రహణీరోగే శూలపాండ్వామయేషు చ. 88
మూత్రకృచ్ఛ్రే మూఢవాతే గర్భరోగేచ దారుణే,
క్రిమిరోగేచ మందాగ్నౌ పీనసే హృద్యదరేషుచ. 89
అర్శస్సు చాతిసారేషు కుష్ఠరోగే గళగ్రహే,
కండూగదే హృద్రుజాయాం హిక్కాయ మూర్ధ్వవాతకే 90
అపస్మారే తథోన్మాదే రక్తవృద్ధౌచ దారుణే,
సర్వాంగేషుచ కుష్ఠేషు నిఖిలా స్వశ్మరీషుచ. 91
లూతాయాం సన్నిపాతేషు సర్పదష్టేచ వృశ్చికే,
హస్తపాదాదిరోగేషు సర్వేషు ఘుటికాహితా. 92
జయాఖ్యాభక్షితా యేయం బ్రహ్మణా చోదితేశ్వరే. (సిద్ధరసార్ణవే)

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, లోహభస్మము, శుద్ధిజేసిననాభి, చిత్రమూలము, ఆకుపత్రిక, వాయువిడంగములు, రేణుకలు, తుంగముస్తెలు, ఏలకులు, గ్రంధితగరము, నాగకేసరములు, త్రికటుకములు, త్రిఫలములు, శుద్ధిజేసిననేపాళ

ములు,తామ్రభస్మము - వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి చూర్ణముజేసి దీనికి రెండింతలు బెల్లముగలిపి నాలుగుర్యామములు మర్దించి సెనగగింజలంతేసి మాత్రలుజేసి ప్రతిదినము నందొక్కొకమాత్రను సేవించిన కాసము, శ్వాసము, క్షయము, గుల్మము, ప్రమేహము, విషమజ్వరము, దప్పి, గ్రహణి, శూల, పాండువు, మూత్రకృఛ్రము, మూఢవాతము, భయంకరమైన గర్భరోగము, క్రిమిరోగము, మందాగ్ని, పీనసము, ఉదరములు, అర్శస్సు, అతిసారము, కుక్షిరోగము, గళగ్రహము, దురద, బొమ్మునొప్పి ఎక్కిళ్లు, ఊర్ధ్వవాతము, అపస్మారము, ఉన్మాదము, దారుణమైన రక్తవృద్ధిరోగము, సర్వాంగకుష్ఠము, సర్వాశ్మరులు, లూత, సన్నిపాతము, సర్ప వృశ్చిక దష్టవిషములు, హస్తపాదాదులయందలి రోగము మొదలగువానినన్నింటిని హరింపంజేయునని ఈశ్వరునికి బ్రహ్మ వచించెను.

### అపస్మారోన్మాదములకు ప్రసిద్ధమైన నస్యములు

పిష్ట్వాహ్యపామార్గఫలానినస్యం గోవారిణాబుద్ధివిబోధనాయ,
ఏవంకుసుంభస్వరసేనయుక్తం తమిస్రబృందంశమయేచ్ఛశీఘ్రమ్.

(పూజ్యపాదీయే)

తా. ఉత్తరేణువిత్తులను గోమూత్రముతోగాని, లేక కుసుంబాపువ్వులస్వరసముతోగాని నస్యముజేయించిన అపస్మారము, ఉన్మాదము శీఘ్రముగ హరించును.

త్రికటుం చిత్రకంచైవ లాంగలీం చేంద్రవారుణీం,
వచా మధుకబీజాని తథా పాఠా నదీఫలమ్.
తాళకం వత్సనాభంచాప్యంకోలక్షార యుగ్మకం,
ఏవం పంచదశప్రోక్తా న్సమభాగాంశ్చ కారయేత్. 95
సూక్ష్మచూర్ణీకృతం చైవ నిర్గుండీ తింత్రిణీరసైః,
ఆర్ద్రికస్వరసైర్యుక్తం త్రివిధైశ్చ విచక్షణః.
ఏవం నస్యం ప్రదాతవ్య మర్కమూలరసేనచ,
అపస్మారం చ హృద్రోగం వాతసంకులమేవచ.
ధనుర్వాతం గ్రహంచైవాప్యున్మాదం సన్నిపాతజిత్,
పూజ్యపాదకృతోయోగః నరాణాం హితకారణాత్. 98

(పూజ్యపాదీయే)

తా. త్రికటుకములు చిత్రమూలము, చన్నచర్లగడ్డ, పాపరవేరు, వస, ఇప్పగింజలు, చిరుబొద్దివేరు, సముద్రపాడవిత్తులు, శుద్ధిచేసినతాళకము, శుద్ధిచేసిననాభి, ఊడుగ కొనలు, సర్జక్షారము, యవక్షారము-ఈపదియైదుదినుసుల సమభాగములుగ చూర్ణము

కేసి ఖల్వములో నునిచి వావిలియాకురసము, చింతాకురసము, అల్లపురసము అనువాని లోగాని, లేక జిల్లేడువేళ్ళరసముతోగాని మర్దించి తలప్రేలునటుల వెల్లకిల మంచ ముపై పరుండబెట్టి నాలుగుదినములు నస్యముజేయించిన అపస్మారము, బొమ్మునొప్పి, వాతరోగము, ధనుర్వాతము, గ్రహదోషము, ఉన్మాదము, సన్నిపాతనులు (కాకిసో మాలు, కుండేటిటెగులు) మొదలగురోగముల హరింపంజేయునని పూజ్యపాదమహాముని మానవహితార్థమై వచించెను. (మఱియు ఈనస్యముల జేయించుచు లోపలికి నౌషధసేవం జేయించుచుండిన అపస్మారములు, ఉన్మాదములు హరించును.

ఉ. తెల్లమినాలనేతను ధృతిం దలనంటి జలంబువోసియుం
జిల్లెడునున్నచిల్కలవిశీర్షములం దొలఁగించి యందులో
వేళ్ళజముంచి వేఁచియును వేగిర మార్ద్రిరసానఁ గల్పియుక్
సల్లలితంబు నస్యములు సల్పిన మానును దత్తురంబులుక్.

తా. ఆదిత్యవారముతో గూడియుం డమావాస్యయందుగాని, లేక ఆదిత్యవారము నాడుగాని, జిల్లేడు మిడతలదెచ్చి వానితలదీసి వానిగర్భములో మిరియముల నునిచి యెండించి చూర్ణముజేసి రెండు సెనగగింజలెత్తును ఖల్వములో నునిచి అల్లపురసముతో బాగుగ నూరి యందు మూడు నూనెబొట్లు గలిపి నాలుగుమారులు నస్యము జేయించుట యేగాక పూర్వోక్తౌషధములలో దేనియొక్క సేవననేని జేయించిన అపస్మారము, ఉన్మా దము హరించును. మఱియు పూర్వోక్తచతుర్విధనస్యములు అపస్మారోన్మాదముల హరిం పంజేయుటయందు ప్రసిద్ధంబులగుటచే వానిలో ప్రతిదానిచే నాలుగుమారులు నస్యము జేయించిన అపస్మారోన్మాదములు హరించును.

క. నింబఫలఖండములలో, పంబినచూర్ణంబు నల్లప్రత్త్యాకురసం
బుంబోసిమఱియునొకమా, సంబుక్ భుజియింపమానుజాందసములువే.

క. ఇలజీలకఱ్ఱసొంటియుఁ, దులములును సమంబుఁ గూర్చి తుదిజంబఫలం
బులపులును గలిపి త్రాగినఁ, దలకునుఁ జనిపోవు మేటిదత్తూరంబుల్.

క. వెసనిమ్మ కణిపిచెక్కల, రసమును మిరియంబుగూర్చి రమణనుగ్రోలక్
వసుధను నున్మాదంబుల, పసచెడి భువి మానిపోవుఁ బ్రజలకునెల్లక్.

క. తెల్లగలిజేరువేరును, మొల్లంబుగ బ్రహ్మదండిమూడగుకాయ
ల్లల్లపురసమునన నస్యము, సల్లలితిముఁజేయ మానుఁ జాందసములువే.

## అపస్మారములకు విజయపర్పటీరసము

సూత గంధక తామ్రాణి సమభాగాని కారయేత్,
స్సూతపాదేన దాతవ్యం వత్సనాభం భిషగ్వరః.

కృత్వా కజ్జలికాంతారం సూతతుల్యం వినిక్షిపేత్,
గంధకం మర్దయేత్పశ్చాత్కజ్జలీ జాయతే తథా. 100
ఘృతాభ్యక్తేతు తచ్చూర్ణం పచే దాయసభాజనే,
ఏవం ద్రవత్వ మాయాతి తతో మోచదళే క్షిపేత్. 101
పచనే నోపదేశేన కర్తవ్యః పర్పటీరసః,
రోగశాంత్యై ప్రయోక్తవ్యో హ్యష్టగుంజా ప్రమాణతః. 102
దత్తూరబీజసంయోగా న్మహోన్మాద విశోధకః,
అపస్మారం నిహంత్యాశు వ్యోష నింబదళై స్సహ. 103
పర్పటీరసగుంజాష్టౌ బ్రాహ్మీ ఘృతసమన్వితం,
ఖాదయే ద్రోగిణం వైద్యో హ్యపస్మారాపనుత్తయే. 104

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, తామ్రభస్మము-ఇవి సమభాగములు, శుద్ధిజేసినవసనాభి రసమునకు నాలవభాగము, రజితభస్మము రసమునకు సమభాగము-ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి కాటుకవలె మర్దించి పిదప దీనికి సమముగ శుద్ధిజేసిన గంధకమును గలిపి మరల కాటుకవలె మర్దించి యినుపపాత్రములోవైచి ఒకింత నెయ్యి గలిపి వండిన నది ద్రవించును. దాని నరటాకులో నునిచి అప్పడమువలె నిప్పులో గాల్చి చూర్ణముజేసి యెనిమిదిగురిగింజల యెత్తును ఉమ్మెత్తవిత్తుల చూర్ణానుపానముతోడ సేవించిన గొప్పయున్మాదమును హరింపంజేయును. మఱియు త్రికటుకములు, వేపయిగుళ్ళు అనువాని యనుపానముతోడ సేవించిన అపస్మారమును శీఘ్రముగ హరింపంజేయును. మఱియు నెనిమిదిగురిగింజలయెత్తు పర్పటీరసము బ్రాహ్మీఘృతానుపానముతోడ సేవించిన అపస్మారము హరించును.

బ్రాహ్మీ శుంఠీ వచా కుష్ఠం నీలోత్పలక సైంధవం,
పిప్పలీమపి సంచూర్ణ్య బ్రాహ్మీ ద్రావేణ భావయేత్. 105
సప్తధా నవనీతేన సంక్షిప్త్వా విపచేద్ఘృతం,
నస్యే దున్మాదశాంత్యర్థ మపస్మారంచ నాశయేత్. 106

తా. బ్రహ్మదండి, శొంఠి, వస, చెంగల్వకోష్టు, నల్లకలువ, సైంధవలవణము, పిప్పళ్ళు - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి బ్రాహ్మీరసముతో నేడుమార్లు భావనజేసి వెన్నలోగలిపి ఘృతముగ గాచి నస్యముజేయించిన ఉన్మాదము, అపస్మారము హరించును.

వరాహకర్ణరక్తేన కర్కోట్యా నస్యమాచరేత్,
అథవా నరమూత్రేణ హ్యున్మత్తస్యాపి నస్యతః 107

తా. పందిచెవిరక్తముతో గొడ్డుకాకరగడ్డను నూరి నస్యముజేయించిన అపస్మారము

ఉన్మాదము హరించును. ఉమ్మెత్తవిత్తును నరమూత్రముతో నూరి నస్యము జేయించిన ఉన్మాదము, అపస్మారము హరించును.

శ్వేతాపరాజితాదినస్యము

శ్వేతాపరాజితామూలం విజయామూలమేవచ,
నరమూత్రేణ సంపిష్య నస్యం వాతనుదద్భుతమ్. 108

తా. తెల్లగంటెనవేరు, కరకవేరు-వీనిని నరమూత్రముతో నూరి నస్యముజేయించిన వాతాపస్మారము హరించును.

ఉన్మత్తకాసనాస్థీని ఘృష్ట్వాతేనేనవాకుచీం,
శ్వేతాపరాజితామూలం కర్ణేధార్యం సదాబుధైః. 109
నిర్గుండీ దండకం ఛిత్వా హ్యపస్మారో విముచ్యతే,
పర్పటీరసగుంజాష్టౌ దుత్తూరబీజపంచకమ్. 110
గోఘృతేనచ సంయోజ్య ఖాదయోన్మాదనోదనే,
సఘృతం మాషమండంచ పాయయేద్ఘృతదుగ్ధకమ్. 111
నింబతైలం సమాదాయ లింపేదాపాదమస్తకం,
గుర్వన్నం పాయసం దద్యాచ్ఛుష్కంశాకంచ వర్జయేత్. 112
యద్వా సంరక్షయేత్తం తద్యావచ్ఛాంతిం నగచ్ఛతి,
మాహేశ్వరాఖ్యధూపంచ ధూపయేత్సతతం నిశి. 113

తా. ఉమ్మెత్తవిత్తులు, వేగిసవిత్తులు, భావంచివిత్తులు, తెల్లగంటెనవేరు, వావిలి కాడలు-వీనిలో దేనినైనను నూరి చెవిలో నునిచికొనిన అపస్మారము హరించును. మఱియు నెనిమిదిగురిగింజలయెత్తు పర్పటీరసమును, 5 ఉమ్మెత్తవిత్తుల చూర్ణమును ఆవునేతిలో గలిపి ఈయాయనుపానముతోడగాని, లేక నేతితో గూడియుండు మినుపకట్టుయొక్క యనుపానముతోడగాని నెయ్యి, పాలు అనువానియనుపానముతోడగాని సేవించిన ఉన్మాదము హరించును. మఱియు నున్మాదరోగికి పాదము మొదలు శిరమువఱకు వేప నూనెను లేపముజేయుటయేగాక జడాన్నమును, పాయసము నొసంగవలయును. ఎండిన కూరల నొసంగంజనదు. మఱియు నున్మాదము శమించువఱకు ఉన్మాదరోగిని కడుజాగ రూకతతో గాపాడవలయును. రాత్రులయందు మహేశ్వరధూపము నొసంగవలయును.

మహేశ్వరధూపము

శ్రీవేష్ట దారు బాహ్లీకం ముస్తా కటుకకం నిశా,
సర్షపా నింబపత్రాణి చందనం త్రిఫలా వచా. 114
బృహతీ సర్పనిర్మోక కర్పాసాస్థి యవాతుషం,

గోశృంగం బస్తరోమాణి బర్హిపింఛం బిడాలవిట్. 115
ఛాగరోమ మృతంచేతి బస్తమూత్రేణ భావితం,
ఏషమాహేశ్వరో ధూప స్సర్వగ్రహణివారకః. 116

తా. సర్జరసము, దేవదారు, ఇంగువ, తుంగముస్తెలు, కటుకరోహిణి, పసపు, ఆవాలు, వేపాకు, చందనము, త్రిఫలములు, వస, నేలములక, పాముకూసము, ప్రత్తి విత్తులు, యవలపొట్టు, ఆవుకొమ్ము, గొఱ్ఱెవెంట్రుకలు, నెమలియీకెలు, పిల్లివిష్టము మేకవెంట్రుకలు, నెయ్యి-వీనినేకముజేసి గొఱ్ఱెమూత్రముతో భావనజేసి ధూపమువేసిన సర్వగ్రహములు నివర్తించును.

## భూతోన్మాదములకు మంత్రము

జోరీజోరీ బ్రహ్మానుజోరీ వృపరేవిఖుపణిరేవృఖు। జాయీరే విఖు।
ఉతరేనునఖారే।తుజేశిద్ధు।దేవాగురువాచి।శిద్ధు।ఓంగురుప్రసాదమ్॥

తా. అనునీమంత్రముతో నిమ్మకాయల మంత్రించి తినిపించవలయును. మఱియు నీమంత్రముతో వేడినీళ్ళను, చన్నీళ్లను మంత్రించి పోయవలయును.

ఇంద్రవారుణికామూల మారనాళేన పేషితం,
అపస్మారహరం నస్యం భూతప్రేతస్య కింపునః. 117

తా. పాపరవేరును కలితో నూరి నస్యముజేయించిన అపస్మారము (ఉన్మాదము) భూతప్రేతములు నివర్తించును. మఱియు స్తీనస్యములను ౯ మార్లు జేయించవలయును. అపస్మారోన్మాదరోగ సాధ్యాసాధ్యంబుల నెఱింగి సాధ్యంబులగు వానినే జికిత్సింపవల యును. పూర్వోక్త ఔషధములు కష్టసాధ్యములగు నపస్మారోన్మాదములనగా హరింపం జేయును. మఱియు నపస్మారోన్మాదనివారణార్థంబై పంచగవ్యఘృతమును, కల్యాణఘృత మును సేవింపందగును.

## అపస్మారోన్మాదములయందు పథ్యము

పత్తూర శాలి గోధూమ ముద్గ యూష ఘృతాదయః,
ధాత్రీ పటోల కూశ్మాండ తండులీయక వాస్తుకమ్. 118
కపిత్థం దాడిమం ద్రాక్షా లఘుపిత్తహరాణిచ,
ఉన్మాదే చిత్తవిభ్రంశే హ్యపస్మారే హితం విదుః. (మాధవనిదానే)

తా. పొన్నగంటికూర, లేక నెమలిజుట్టాకు, రాజనపుబియ్యము, గోధుమలు, పెసరకట్టు, నెయ్యి మొదలగునవి, ఉసిరికకాయ, పొట్లకాయ, ముదురుగుమ్మడుకాయ, చిఱ్ఱికూర, చక్రవర్తపుకూర, వెలగపండు, దాడింబపండు, ద్రాక్షపండు, లఘుకర ద్రవ్యములు, పిత్తహరద్రవ్యములు-ఇవి ఉనాదము, చిత్తవిభ్రమము, అపస్మారము అను వానియందు పథ్యకరంబులు.

—— అపస్మారోన్మాదములయం దపథ్యము ——

మద్యం విరుద్ధాశన ముష్ణభోజనం నిద్రాక్షుధాతృట్క్షుత వేగధారణం,
తిక్తానితీక్ష్ణానిభిషక్సమాదిశే దున్మాదరోగోపహతో హిగర్హితమ్. 120

తా. మద్యము, విరుద్ధాన్నము, ఉష్ణకరభోజనము-వీనిని సేవించుట, నిద్ర, ఆఁకలి, దప్పి, తుమ్ములు, మలమూత్రవేగము-వీని నడ్డగించుట, చేదు, తీక్ష్ణమైనద్రవ్యముల సేవించుట-ఇవి యపస్మారోన్మాదములయం దపథ్యకరంబులు.

—— మరణసూచకములు ——

క. ఆయు రవసానకాలం, బేయనువులఁ దెలియవచ్చు నెఱిఁగింపుము గాం
గేయ యరిష్టాగ్రమనము, లేయుపశకునములు సూచి యెఱుఁగంగఁ
దగుఁన్.

వ. అనినఁ గుమారుం డతనికిట్లనియె.

గీ. వామనాసాపుటమున నెవ్వానికేని
గాలి యుచ్ఛ్వాసనిశ్వాసగతిఁ జరించుఁ
బింగళానాడి నడువదు పెద్దయేని
వాఁడు మూఁడబ్దములకు నిర్యాణమొందు.

గీ. ఒండె మూఁడహోరాత్రంబు లొండెనేని
రెండహోరాత్రములు సంచరించుహేళి
నరుని కెవ్వని కొక్కవత్సరముగాని
బ్రదుకఁడండ్రు సుధర్మణీప్రాణనాథ.

క. నాసాపుటయుగమునని, శ్వాసోచ్ఛ్వాసానిలములు సరియై నడచుఁన్
వాసరము లెవ్వరికిఁబది,మాసత్రితయమున వాఁడుమరణముఁబొందున్.

క. ప్రాణానిల మెవ్వరికిని, ఘ్రాణపుటీయుగ్మకమునఁ బ్రవహింపకసం[న్.
క్షీణమయినోరవెడలునొ, బ్రాణమతఁడు దొఱఁగువాసరత్రితయము

గీ. అదరిపా టెవ్వఁ డీక్షించు నాకసమున
హాటకపుఁగృష్ణపింగళుఁ డైనపురుషుఁ
డాతనికి వత్సరత్రయం బవధి సూపెఁ
బ్రాణధారణమున కిల్వలాసురారి.

ఉ. తుమ్మును నింద్రియంబు నిజతోయమలంబులు నొండెనొండె మూ
త్రమ్ము మలమ్ము దుమ్ము బలదార్ఢ్యము సాలక యెవ్వఁడేని నొ

క్కుమ్మడినుత్సృజించునతఁ డుండఁడు ప్రాణముతోడఁ గూడి యే
కమ్మగువత్సరమ్ము గడఁగాచినపిమ్మట వాసరార్ధమున్.

ఉ. కానఁ డరుంధతిన్ ధ్రువునిఁ గానఁడు విష్ణుపదత్రయంబునుం
గానఁడు మాతృమండలము గానఁడు గన్నులు గల్గియేని యే
మానవుఁ డమ్మనుష్యునకు మాసము లాఱు విరామ మొందఁగాఁ
గానఁగవచ్చుఁ గుంభభవ కాలునిబంధురసౌరవీథికల్.

గీ. దృఢవివేకయరుంధతీదేవి జిహ్వ
నాసికాగ్రంబు ధ్రువుఁ డిల్వలాసురారి
విష్ణుపదమది భ్రూమధ్యవీధి యనఘ
మాతృమండల మక్షిపద్మము మునీంద్ర.

సీ. అసితాదివర్ణంబు నామ్లాదిరసమును నన్యథాభావంబు నందెనేని
దంతోష్ఠకంధరాతాలుజిహ్వాగ్రంబు లొండొక్కవర్ణంబు నొందెనేని
గరజేంద్రియంబులుగనుదోయికోలుకులుధూమధూమ్రత్వంబుదోరసె
నాఖండరీయకంబగుధనుఃఖండంబు నభముపై రేయగన్పట్టెనేని [నేని

గీ. నాఱుమాసములకు మర్త్యుఁడ స్తమించు, వడిగ నేతెంచి యూసరవ
ల్లితొండ, పాదములనుండి తలదాఁకఁ బ్రాఁకెనేని, నతఁడు షాణ్మాస
ములఁ జూచు యముని మొగము.

గీ. జలకమాడినపిమ్మటఁ జరణములను, హృదయమున నీళ్ళు వేగంబ యిం
కురఁబారు, దర్పణమునీడదోఁచు నాతామ్రకాంతి, నెవ్వనికి వాఁడు
నాఱ్నెల్ల నేగుదివికి.

వ. మఱియు. ఛాయాప్రకంపంబు మతిభ్రంశంబు చంద్రద్వయసూర్య
ద్వయదర్శనంబు పగలు తారకావీక్షణంబు రాత్రి దారకానభివీక్ష
ణంబు గంధర్వనగరావలోకనంబు పిశాచనృత్తవీక్షణంబు శ్రవణ
ధ్వనిహాని స్వప్నంబునందుఁ బిశాచ ఖర వాయస భూత ప్రేత శునక
గృధ్ర గోమాయుబాధ పాంసురాశి యూపదండవల్మీకారోహణంబు
తైలాభ్యంగనముండనంబులు మరణసూచకంబులు. (కాశీఖండే)

వింశ ప్రకరణమ్.



# ఏకవింశ ప్రకరణము.

## భగందరరోగనిదానలక్షణచికిత్సాదయః

శ్లో. భూరథం మేరుకోదండం వేదాశ్వం పురనాశకం,
సర్వలోకపతిం శంభుం లింగమూర్తి మహం భజే. 1

తాత్పర్యము. భూమియే రథముగఁగలవాఁడు, మేరుపర్వతమే ధనస్సుగఁగలవాఁడు, వేదములే యశ్వములుగఁగలవాఁడు, త్రిపురసంహారకుఁడు, సర్వలోకములకు ప్రభువు, లింగస్వరూపుఁడు నగు ఈశ్వరుని నేను భజించెదను.

శ్రీనీలకంఠవంశాబ్ధిచంద్రమా బసవాహ్వయః,
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్. 2

తా. నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుఁడై బసవరాజని పేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబయిన బసవరాజీయ మను నీగ్రంథము యొక్క ఏకవింశ ప్రకరణమును వచించుచున్నాఁడను.

### భగందరోత్పత్తి

క్షుధార్తస్తు న భుంజీత తృష్ణార్తో న పిబేజ్జలం,
తృష్ణార్తో జాయతే గుల్మీ క్షుధార్తస్తు భగందరీ. (నిత్యనాథీయే)

తా. ఆఁకలి గల్గినపుడు భుజింపకుండుటవలన భగందరరోగంబును, దప్పి గలిగినపు డుదకమును పానము సేయకుండుటవలన గుల్మరోగంబును జనించును.

### భగందరస్వరూపము

గుదస్య ద్వ్యంగుళే దేశే పార్శ్వతః పిటికార్తికృత్,
భిన్నో భగందరో జ్ఞేయ స్సచ పంచవిధో మతః. (మాధవనిదానే)

తా. గుదమునకు ప్రక్కన రెండంగుళముల ప్రదేశమున నొకపురుపు జనించి మిక్కుటముగ పోట్లతోఁగూడి పగిలిన భగందర మనంబడును. ఇది ఐదువిధంబులు.

### భగందరపూర్వరూపములు

కటీ కపాల నిస్తోద దాహ కండూ రుజాదయః,
భవంతి పూర్వరూపాణి భవిష్యతి భగందరే. 5

తా. నడుము, తలపుఱ్ఱె వీనియందు పోట్లుగలుగుట, మంట, దురద మొదలగు నుపద్రవములు గలుగుట- ఈలక్షణములవలన భగందరము జనించు నని తెలియవలయును,

### భగందరభేదములు

వాతాద్భిన్నారుణోవర్ణః పిత్తాద్రక్తో భగందరః,
కఫాచ్ఛ్వేతో ఘనస్రావః కండూ కఠినతాయుతః.
శంబూకావర్తవన్నాడీ పిటికా గోస్తనాకృతిః,
బహువక్త్ర స్స్రవేద్గాఢః క్రిమియుక్త స్త్రిదోషజః.
ఔదాసీన్యాద్యదా పక్వం రేతో మూత్ర పురీషకం,
వస్రావ త్స్రవతే పక్వం కష్టసాధ్యో భగందరః.
త్రిదోషోత్థోఽప్యసాధ్యశ్చ క్షతజశ్చ విశేషతః,
అథ సర్వప్రయత్నేన పాకః కార్యో భగందరే. (ఆయుర్వేదే

తా॥ పగిలి యెఱ్ఱగ నుండిన వాతభగందరమనియు, రక్తవర్ణముగనుండిన పైత్య భగందరమనియు, తెలుపు, కడుస్రావము, దురదగలదై కఠినంబుగనుండిన శ్లేష్మభగందరమనియు, నాడి నత్తగుల్లవలె జుట్టుకొని, గోస్తనాకారమై పిటికలతో వ్యాప్తంబై యుండిన శంబూకావర్త భగందరమనియు, పెక్కు రంధ్రములతో గూడి మిక్కుటము పులిసీటిని గార్చుచు క్రిమియుక్తంబైయుండిన త్రిదోషభగందరమనియు తెలియవలయును. భగందరమును చికిత్సింపక నుపేక్షించుటచే పండి, రేతో, మూత్ర, పురీషము వసవలె స్రవింపంజేయును. ఇటులపండిన భగందరము కష్టసాధ్యము. త్రిదోషజ భగందరమసాధ్యము. క్షతజ భగందరము కడు నసాధ్యము. ఐనను భగందరములను సర్వప్రయత్నములచే పండునటులం జేయవలయును.

### శతపోనకభగందరలక్షణము

కషాయరూక్షైరతికోపితోఽనిల స్త్వపానదేశేపిటికాంకరోతియాం,
ఉపేక్షణాత్పాకముపైతిదారుణం రుజాచభిన్నారుణఫేనవాహినీ. 1
తత్రాగమోమూత్రపురీషరేతసాం వ్రణైరనేకైశ్శతపోనకంవదేత్,

తా॥ ఒగరు రూక్ష గలపదార్థసేవనవలన మిక్కుటముగ వాతము ప్రకోపించి గుదస్థానమున కురుపును గలుగంజేయును. అది యుపేక్షింపఁబడుటవలన భయకరమైన పాకముగలదై పగిలి పోటుతోడి ఎఱ్ఱనై నురుగుతో గూడిన చీమును స్రవింపంజేయుచు ననేకవ్రణములుగలదై వానిఛిద్రములవలన మూత్రమలశుక్లముల స్రవింపజేయుచుండిన శతపోనక మనంబడును. ఇది జల్లెడవంటిఛిద్రములు గలది యగుటంజేసి శతపోనకమని చెప్పంబడును.

### ఉష్ట్రశిరోధరభగందరలక్షణము

ప్రకోపణైఃపిత్తమతిప్రకోపితం కరోతిరక్తాంపిటికాంగుదాశ్రితాం,
తదాశుపాకాహిమపూయవాహినీం భగందరంతూష్ట్రశిరోధరంవదేత్

తా. పిత్తకరపదార్థసేవనవలన పిత్తం బధికముగ ప్రకోపించి గుదస్థానమున ఒంటెమెడతో సమానమైన యెఱ్ఱనికురుపును గలుగంజేయును. అది తీవ్రముగ పండి వేడిగ చీమును స్రవింపంజేయును. ఇదియ ఉష్ట్రశిరోధర భగందర మనంబడును.

పరిస్రావీభగందరలక్షణము

కండూయనో ఘనస్రావీ కఠినో మంద వేదనః,
శ్వేతావభాసః కఫజః పరిస్రావీ భగందరః. 12

తా. కఫజభగందరమున దురదగలుగుటవలన గట్టిగ చీము స్రవించుట, కురుపు కఠినముగనుండుట, ఒకింత పోటుగలుగుట, తెల్లగనుండుట-ఈలక్షణములుగలది పరిస్రావీభగంధరమని తెలియవలయును.

శంబూకావర్తభగందరలక్షణము

బహువర్ణరుజాస్రావాః పిటికా గోస్తనోపమాః,
శంబూకావర్తవన్నాడీ శంబూకావర్తకోమతః. 13

తా. ఆవుచండ్లవలె ననేకకురుపులుజనించి పలువిధములైనవర్ణములు, వేదన, స్రావము గలదిగనుండుట, వ్రణము నత్తగుల్లయందలి సుడితో సమానముగనుండుట-ఈ లక్షణములుగలది శంబూకావర్తభగందరమని తెలియవలయును.

ఉన్మార్గిభగందరలక్షణము

క్షతాత్తుతిః పాయుగతా వివర్ధతే
హ్యుపేక్షణాత్స్యుః కృమయో విదార్యతే,
ప్రకుర్వతే మార్గ మనేకధాముఖై
ర్వ్రణై స్తదున్మార్గిభగందరం వదేత్. 14

తా. ముండ్లు మొదలగువాని యభిఘాతమువలన గుదసమీపమునందు గలిగిన గాయము నుపేక్షించుటవలన వృద్ధిజెంది గుదమువఱకు వ్యాపించి పురుగులతోఁగూడి పగిలి యనేకఛిద్రములుగల వ్రణములచే వ్యాప్తంబై యుండిన ఉన్మార్గిభగందర మనంబడును. (ఇదే క్షతజభగందరమనియు జెప్పంబడును.)

భగందరసాధ్యాసాధ్యలక్షణము

ఘోరా స్సాధయితుం దుఃఖా స్సర్వఏవ భగందరాః,
తేష్వసాధ్య స్త్రిదోషోత్థః క్షతజశ్చ విశేషతః. 15

తా. సర్వభగందరము లసాధ్యంబులు. వానిలో త్రిదోషజభగందరము కడు నసాధ్యము. క్షతజభగందర మన్నిటికన్న మిక్కిలి యసాధ్యము.

## అసాధ్యభగందరలక్షణము

వాతమూత్రపురీషాణి క్రిమయ శ్శుక్రమేవచ,
భగందరా త్ప్రస్రవంతి నాశయంతి త మాతురమ్. 16
తథాపి తస్య కర్తవ్యా చికిత్సా జీవితావధి,

తా. భగందరమువలన వాత మూత్ర, పురీష, క్రిమి, శుక్రములు వెడలిన రో మృతిజెందునని తెలియవలయును. ఐనను జీవించియుండువఱకు చికిత్సం జేయవలయును

## రవితాండవరసము

శుద్ధసూతం ద్విధాగంధం కుమారీరసమర్దితమ్. 17
త్ర్యహాంతే గోళకం కృత్వా హండికాంతే నిరోధయేత్,
తయోస్సమే తామ్రపాత్రే శుద్ధేచ తామ్రలేపితే. 18
తం భాండం భస్మనాపూర్య చుల్ల్యాం తీవ్రాగ్నినాపచేత్,
త్రియామాంతే సముద్ధృత్య చూర్ణయే త్స్వాంగశీతలమ్. 19
జంబీరస్య ద్రవైః పిష్ట్వా రుధ్వా సప్తపుటే పచేత్,
గుంజైకం మధునాజ్యేన లిహ్యాద్ధంతి భగందరమ్. 20
ముసలీ లశునం చానుపాన్యారనాళయుతం పిబేత్,
కర్తవ్యం మధునాహారం, దివాస్వాపంచ మైథునమ్. 21
వర్జయే చ్ఛీతమాహారం రసేఽస్మిన్ రవితాండవే, (మాధవనిదానే

తా. శుద్ధిజేసినరసము ౧ భాగము, శుద్ధిజేసినగంధకము ౨ భాగములు-వీనిని ఖల్వములోనునిచి కలబందరసముతో 3 దినములు మర్దించి ముద్దజేసి పైరసగంధకములకు సమముగ శుద్ధిజేసినతామ్రమును గ్రహించి డబ్బిజేసి దానిలో నాముద్ద నునిచి దానిపై మూసి సందులకు లేపనముజేసి హండికాయంత్రమునందునిచి దానినిండా బూడిదపోసి పొయిమీఁదనునిచి తీవ్రాగ్నిచే 3 ఝాములువండి సాంగశీతలమున దీసి ఖల్వములోనునిచి చూర్ణముజేసి నిమ్మపండ్లరసముతో 2 మార్లునూరి 2 మార్లుపుటంబిడి యం దొకగురిగింజ యెత్తును తేనెతోగాని, నేతితోగాని, లేక నేలతాటిగడ్డలు, వెల్లుల్లిపాయలు అనువానిని కలితోనూరి యీయనుపానముతోడగాని సేవించిన భగందరము హరించును. ఈరససేవన కాలంబున మధురాహారముల జేయవలయును. పగటినిద్ర, స్త్రీసంగమము, శీతకరాహార ములు అనువానిని వర్జింపవలయును.

## భగందరములకు రసకర్పూరయోగము

రసకర్పూర మాజ్యేన లిహేద్ధ్యతి భగందరమ్. 22
ముసలీ లశునం చాను హ్యారనాళయుతం పిబేత్,

తా. రసకర్పూరమును నేతితో సేవించి వెంబడిగ నేలతాటిగడ్డలను, వెల్లుల్లిపాయలను కలితో నూరి త్రాగిన భగందరము హరించును. (లేక తక్కలివేరుచూర్ణము, నెల్లివేళ్ళ చూర్ణము దినుసుకు ౮ తులములు, రసకర్పూరము ౪ తులము-ఇటుల వీనిని ఖల్వములో నునిచి గూడపాలవేళ్ళరసముతో మర్దించి ౦౦ మాత్రలుజేసి ౪౦ దినములు రేపుమాపు ఆవునేతితోడ సేవించిన భగందరము, లూతవ్రణము హరించును.)

అపక్వభగందరచికిత్సాక్రమము

స్రావ్యం రక్తం వ్రణే జాతే జలూకంవా ప్రదాపయేత్. 23
లాంగలీ కృష్ణదుత్తూర విషముష్టించ లేపయేత్,
నిర్గుండ్యాశ్చ ద్రవైః పిష్ట్వా లేపయేద్వార్కమూలకమ్. 24
అపక్వో జీర్యతే గ్రంథీ రక్తమోక్షే కృతేఽపి వా,

తా. అపక్వమైన భగందరవ్రణమున సొరకాయబుఱ్ఱలు మొదలగువానిచేగాని, లేక జలగలవలనగాని, రక్తమునుదీసి చన్నచర్లగడ్డ, నల్లఉమ్మెత్త, విషముష్టి అనువానిని నూరిగాని, లేక జిల్లేడువేళ్ళను వావిలియాకురసముతో నూరిగాని లేపనము జేసిన మానును.

వాతభగందరములకు విళంగాదివటికములు

విళంగేంద్రయవం కృష్ణా స్త్రిభి ర్ద్విగుణగుగ్గులుమ్. 25
త్రిపలాం గుగ్గులాంశాంచ ఘృతేన సహ మేళయేత్,
భక్షయే న్మధునా కర్షం మాహుతోత్థభగందరే. 26

తా. వాయువిడంగములు, కొడిసెపాల, పిప్పళ్లు-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి రెండింతలు శుద్ధిజేసిన మహిసాక్షిగుగ్గిలము, గుగ్గిలమునకు సమము కరకతాండ్రయుసిరికల చూర్ణము గలిపి నేతితో మర్దించి కర్షప్రమాణమును తేనె యనుపానముతోడ సేవించిన వాతభగందరము హరించును.

పైత్తభగందరచికిత్స

పిత్తాధిక్యే ప్రదాతవ్యో రసోఽయం రవితాండవః,
వాకుచీబీజచూర్ణంచా ప్యనుస్యాదుష్ణవారిణా (ఆయుర్వేదే) 27

తా. పూర్వోక్తరవితాండవరసములో భావంచివిత్తులచూర్ణమును గలిపి ఉష్ణోదకముతో సేవించిన పైత్తజభగందరము హరించును.

శ్లేష్మభగందరచికిత్స

సంమర్ద్యాజ్యే కఫోత్థస్య దాతవ్యో రవితాండవః,
ఛాయాశుష్కం దేవదారు నిష్కార్ధం లవణం పలమ్. 28

పిష్ట్వా కోష్ణజలైః పీత్వా హ్యనుపానేన తం జయేత్,

తా. నేతితో మర్దింపఁబడిన పూర్వోక్త రవితాండవరసమును సేవించి దేవదారు చెక్కను నీడనెండించి చూర్ణముచేసి యం దర్ధనిష్కములో ఒకపలము ఉప్పుగలిపి ఉష్ణోదకానుపానముతోడ సేవించిన శ్లేష్మ భగందరము హరించును.

జయంత్యాదిచూర్ణము

జయంతీంవా జయాం ఖాదే త్సద్యో హంతి త్రిదోషజమ్. 29
(అశ్వినికల్పే)

తా. తక్కలివేరు, కూరసెల్లిచెక్క-వీనిని దంచి చూర్ణముజేసి సేవించిన త్రిదోషజ భగందరము తత్క్షణమున హరించును.

యష్ట్యాదిలేపనము

యష్టికాచామృతా శుంఠీ వటపత్రం పునర్నవా,
జలైః పిష్ట్వా ప్రలేపోఽయం పిత్తోత్థేతుభగందరే. 30

తా. అతిమధురము, తిప్పతీఁగె, శొంఠి, మఱ్ఱియాకు, గలిజేరు-వీనినుదకముతో నూరి లేపనముజేసిన పైత్తజ భగందరము హరించును.

శ్లేష్మభగందరమునకు కాంచన్యాదిలేపము

కాంచనీ ద్వి నిశా ముండీ మంజిష్ఠా చ శతావరీ,
గంధకం ధాతకీపుష్పం తుల్యం లవణపంచకమ్. 31
కన్యాద్రవయుతో లేపః కఫోత్థేచ భగందరే, (ఆయుర్వేదే)

తా. దేవకాంచనము, పసపు, మ్రానిపసపు, బోడతరము, మంజిష్ఠ, పిల్లిపీచర, గంధకము, ఆరెపువ్వు, పంచలవణములు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి కలబంద రసముతోనూరి లేపనముజేసిన శ్లేష్మజభగందరము హరించును.

విస్యందనతైలము

సైంధవం చిత్రకం దంతీం పలాశం చేంద్రవారుణీమ్.
గోమూత్రేఽష్టగుణే పచ్యాద్గ్రాహ్యమష్టావశేషితం,
క్వాథపాదం క్షిపేత్తైలం కృష్ణాయస రజోఘృతమ్. 33
పచే త్తైలావశేషంచ తేన లేప్యం భగందరం,
అసాధ్యం సాధయత్యాశు పక్వం క్రిమికులాన్వితమ్. 34

తా. సైంధవలవణము, చిత్రమూలము, నేలదంతి, మోదుగ, పాపర-వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి ఎనిమిదింతలు గోమూత్రము గలిపి అష్టావశేషముగ కషాయము గాచి వడియగట్టి దానికి నాలవభాగము నూనె, నూనెకు సమము

అయస్కాంతచూర్ణము, అయస్కాంత చూర్ణమునకు సమము నెయ్యిగలిపి చిక్కగ వండి లేపనముజేసిన అసాధ్యభగందరములు, పురుగులతోగూడియుండు భగందరములు శీఘ్రముగ హరించును.

విడంగాదిలేపనము

విళంగం త్రిఫలాచూర్ణం పిప్పలీ మధుతైలకం,
లేపాద్భగందరం హంతి క్రిమియుక్తం న సంశయః. (చరకే) 35

తా. వాయువిడంగములు, త్రిఫలములు, పిప్పళ్ళు-వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి తేనె, నూనె గలిపి లేపనముచేసిన క్రిములతోగూడియుండు భగందరములు (పుటినీరును గార్చెడి భగందరములు) నిశ్చయముగ హరించును.

దార్వికవర్తి

స్నుహ్యర్కదుగ్ధ దార్వీభి ర్వర్తిం కృత్వా ప్రయోజయేత్,
భగందరవ్రణే శాంత్యై యోజ్యా నాడీవ్రణేషు చ 36

తా. బొంతజెముడుపాలు, జిల్లేడుపాలు-వీనితో మ్రానిపసపును నూరి వస్త్రమునకు బట్టించి వర్తిజేసి భగందరనాడీవ్రణములయం దునిచిన భగందరములు, నాడీ వ్రణములు హరించును.

నిశాదివర్తి

నిశాం సైంధవ సిద్ధార్థ క్షౌద్ర గుగ్గులు సంయుతాం,
వర్తిర్భగందరే యోజ్యా తథా నాడీవ్రణేషు చ. 37

తా. పసపు, సైంధవలవణము, తెల్లావాలు, గుగ్గిలము - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి తేనెలోగలిపి బట్టనుపట్టించి వర్తిజేసి భగందరనాడీవ్రణములయం దునిచిన భగందరములు, నాడీవ్రణములు హరించును.

శ్వానాస్థిలేపనము

భూతాంకుశస్యమూలంతు ఖరరక్తేన సంయుతం,
శ్వానాస్థి లేపనాచ్చాథ శీఘ్రం హన్యా ద్భగందరమ్. 38
(సిద్ధరసార్ణవే)

తా. భూతాంకుశపువేళ్ళను చూర్ణముజేసి అందు గాడిదనెత్తురుచే గలిపి కుక్క యెముకనుజాది లేపనముజేసిన శీఘ్రముగ భగందరములు హరించును.

కాలాగ్నిరుద్రరసము

శుద్ధసూతం సమంగంధం మృతనాగం సతుత్థకం,
జీరకం సైంధవం తుల్యం తిక్తకోశాతకీద్రవైః. 39

పిష్టం తల్లేపనాద్ధంతి భక్షణాచ్చ భగందరం,
రసఃకాలాగ్ని నామాయం ద్విగుంజం మృత్యుజిద్భవేత్, 40

(సిద్ధవిద్యాభూః)

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిజేసినగంధకము, నాగభస్మము, శుద్ధిజేసినమైలుతుత్థము, జీలకఱ్ఱ, సైంధవలవణము - వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి చేదుబీరాకురసముతో మర్దించి రెండుగురిగింజలయెత్తు మాత్రలుజేసి యందొకదానిని భక్షించుటయేగాక లేపనమును జేయుచుండిన మృత్యుతుల్యముగనుండు భగందరము (సర్వభగందరవ్రణములు) హరించును.

సర్వవ్రణములకు రసరాట్టు

కస్తూరీ హిమరశ్మి కుంకుమ సితా జాతీఫలం హాటకం
చాంపేయం వృష హేమబీజ విజయాయష్టీ జయంతీ విషమ్. 41
ప్రత్యేకం వల్లమానం ఘృతమధుసహితం లిహ్యమానం దినాంతే
కించిన్మార్చాం భజంతే హరతిచ సమయే భక్షయే దిక్షుఖండాన్,
స్త్రీణాం గర్వాధికారం గమయతి సకలం వీర్యపాతం నయాతి
లింగాంతో యాతివృద్ధిం స్థిరతరవపుషాం స్తంభకృద్యోనిభగ్నమ్.
సర్వాంగం సంధివాతం బహువిధవ్రణతా గ్రంథిలూతా స్ఫుటంతి
పూయం దుర్గంధలూతా స్రవతిచ బహుళం తీవ్రదుఃఖేనయుక్తం,
దాహంమోహంచ తృష్ణాంక్షయక్రిమి కృశతాంపీనసం పాండురోగాన్
గుల్మాధ్మానంచ శూలాగ్రహణి గుద రుజం కుష్ఠరోగం నిహంతి. 43

(సిద్ధరసార్ణవే)

తా. కస్తూరి, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, పంచదార, జాజికాయ, స్వర్ణభస్మము, నాగకేసరములు, డొమ్మడోలుగడ్డ, ఉమ్మెత్తవిత్తులు, గంజావివిత్తులు, యష్టిమధుకము, తక్కలివిత్తులు, శుద్ధిజేసిననాభి - వీనిని దినుసుకు వల్లప్రమాణముచొప్పున ఖల్వములోనునిచి (రసకర్పూర మొకభాగము గలిపి మర్దించి ౨ వీసములు రసకర్పూర ముండునటుల) మాత్రలుజేసి యందొకదానిని నేతితోగాని, లేక తేనెతోగాని, ౮ మండలములు సేవించిన సర్వాంగ సంధివాతము, బహువిధ వ్రణములు, గ్రంథులు, లూతపగిలి చీముగారుట, దుర్గంధమైన లూత, అధికముగ చీముగారుట, కడుదుఃఖము, దాహము, మోహము, దప్పి, క్షయము, క్రిములు, శరీరకృశత్వము, పీనస, పాండువు, గుల్మము, ఆధ్మానము, శూల, గ్రహణి, భగందరము, కుష్ఠువు - వీనిని హరింపంజేయును. మఱియు దీనిసేవనవలన నొకింత మూర్ఛగలిగిన దానినివారణార్థమై చెఱుకుతుంటను భక్షింపవలయును. మఱియు దీనిని సేవించెడివాఁడు దృఢశరీరిగ

నుండిన కడువీర్యస్తంభనము గలవాఁడై స్త్రీలతోరమించి వారిగర్వమును హరింపం జేయుటయేగాక వృద్ధిఁజెందిన లింగముగలవాఁడై యోనిని భగ్నముసేయును. (పథ్యము- పగటియందు ఆవుచల్లతోఁగూడియుండు అన్నమును, రాత్రియందు క్షీరాన్నమును, చప్పిడివంటకమును సేవింపవలయును.)

## వ్రణాంతకరసము

దరదంచైకభాగంతు షడ్భాగంచాపి గంధకం,
సూతరాజేనచైకేన తదర్ధం మృతనాగకమ్. 44
హంసపాదిరసైర్మర్ద్యం పుటమేకంచ చూర్ణితం,
గుడాజ మరిచం మిశ్రం ప్రాతఃకాలేచ సేవయేత్. 45
వ్రణ కీటక కుష్ఠాని మండలానిచ నాశయేత్,
వ్రణరాజఇతిఖ్యాతో దుష్టవ్రణహరఃపరః. (ఆయుర్వేదే) 46

తా. శుద్ధిజేసినఇంగిలీకము ౧ భాగము, శుద్ధిజేసినగంధకము ౬ భాగములు, శుద్ధిజేసినరసము ౧ భాగము, నాగభస్మము ½ భాగము - ఇటుల వీనిని ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో మర్దించి మాత్రలుజేసి యెండించి కుప్పెలో నునిచి లఘు పుటంబిడి సాంగశీతలమునదీసి చూర్ణముజేసి పూటకు ౧ చిన్నముల యెత్తును ౪ మండలములు బెల్లము, ఆవునెయ్యి, మిరియపుచూర్ణము అనువానియనుపానముతోడ ప్రాతఃకాలమున సేవించిన వ్రణములు, క్రిములు, మండలకుష్ఠువు, దుష్టవ్రణములు హరించును. (పథ్యము - చప్పిడివంటకము, పాలన్నము-వీనిని భుజింపవలయును.)

## యోగరాజగుగ్గులము

పిప్పలీ పిప్పలీమూలం చవ్య చిత్రక నాగరైః.
పాఠా విళంగేంద్రయవైః హింగు భార్జీ వచాన్వితైః. 47
సప్తపాటివిషా జాజీ జీరకై రేణుకాయుతైః,
గజకృష్ణాజమోదాచ కటుకామూర్వామిశ్రితైః. 48
సమభాగాన్వితైరేతై స్త్రిఫలా ద్విగుణాన్వితైః,
త్రిఫలాసహితైరేతై స్సమభాగంచ గుగ్గులుమ్. 49
ఏతచ్చూర్ణీకృతం శ్లక్ష్ణం మధునాచ పరిప్లుతం,
యోగరాజ ఇతిఖ్యాతో భక్షయేత్ప్రాతరుత్థితః.
అర్శాంసి వాతగుల్మంచ పాండు శోభ మరోచకం,
నాభిశూల ముదావర్తం ప్రమేహం వాతశోణితమ్. 51

కుష్ఠ క్షయ మపస్మారం హృద్రోగం గ్రహణీగదం,
మహచ్చాప్యగ్నిమాంద్యంచ శ్వాస కాస భగందరమ్. 52
సంతతాభ్యాసయోగేన వలీపలితనాశనం,
రేతోదోషం యోనిదోషం సర్వదోషం వినాశయేత్. 53

తా. పిప్పళ్ళు, మోడి, చెవ్యము, చిత్రమూలము, శొంఠి, శిరబొద్ది, వాయువిడంగములు, కొడిసెవిత్తులు, ఇంగువ, గంటుభారంగి, వస, తెల్లావాలు, అతివస, జాజికాయ, జీలకఱ్ఱ, రేణుకలు, గజపిప్పలి, ఓమము, కటుకరోహిణి, చాగదుంపలు - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి రెండింతలు త్రిఫలచూర్ణము, వీనికన్నిటియెత్తు శుద్ధిచేసిన మహిసాక్షిగుగ్గిలము గలిపి బాగుగ చూర్ణముచేసి తేనెపోసిత్రొక్కి తానికాయలంతమాత్రలుచేసి ౪ మండలములు ప్రాతస్సాయంకాలములయందు సేవించిన అర్శస్సు, వాతగుల్మము, పాండువు, శోఫలు, అరుచి, నాభిశూల, ఉదావర్తము, ప్రమేహములు, రక్తవాతము, కుష్టువు, క్షయము, అపస్మారము, హృద్రోగము, గ్రహణి, అగ్నిమాంద్యము, శ్వాసము, కాసము, భగందరము, ముదిమి, శుక్రదోషము, యోనిదోషము మొదలగు సర్వదోషముల హరింపంజేయును. (మఱియు దీనిని చిన్నమెత్తు సిందూరము, పావుసేరు నక్కక్షీటాకురసము, ౧ తులము మిరియపుచూర్ణము అనువాని యను పానముతోడగాని, పావుసేరు డొమ్మడోలుగడ్డరసము, ౧ తులము మిరియపు చూర్ణము, చిన్నమెత్తు సిందూరము అనువాని యనుపానముతోడగాని ౪ మాసములు సేవించిన భగందరవ్రణములు మానును.)

## వ్రణలక్షణము

ఏకదేశోత్థిత శ్శోథో వ్రణానాం పూర్వలక్షణం,
షడ్విధస్స్యాత్పృథక్సర్వరక్తాగంతునిమిత్తజః. 54
శోథాః షడేతే విజ్ఞేయాః ప్రాగుక్తైశ్శోథలక్షణైః,
విశేషః కథ్యతే తేషాం పక్వాపక్వవినిశ్చయే. (ఆయుర్వేదే)

తా. వ్రణము జనించుటకు ముందేదైన నొకచో వాపుజనించి వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, రక్త, ఆగంతుకభేదములవలన నాఱువిధంబులు గలదిగనై పూర్వోక్త శోఫలక్షణయుక్తంబై యుండును. అట్లగుటంజేసి వానిపక్వాపక్వాద్యవస్థల నిశ్చయించుటకు దగిన విశేషలక్షణంబుల వచియించెదను.

## వ్రణపాకలక్షణము.

విషమం పచ్యతే వాతా త్పిత్తోత్థశ్చాచిరంచిరం,
కఫజః పిత్తవచ్ఛోథో రక్తాగంతుసముద్భవః.

తా. వ్రణము వాతదోషమువలన విషమపాకము (అనఁగా కొన్నిస్థలముల పండి

పగిడకుండుట) గలదిగనుండును. పిత్తదోషమువలన శీఘ్రముగ పండును. కఫదోషము వలన చిరకాలముమీఁద పండును. రక్త ఆగంతుక దోషములవలన పిత్తమువలెనే శీఘ్రముగ పండును.

## అపక్వవ్రణలక్షణము

మందోష్మతాల్పశోథత్వం కాఠిన్యం త్వక్సవర్ణతా,
మందవేదనతాచైవ శోథానా మామలక్షణమ్. 57

తా. వాపునుదాఁకిన నొకింత యుష్ణంబుగనుండుట, ఒకింతవాపు జనించి కఠినం బుగనుండుట, ఛాయ వివర్ణము గాకుండుట, ఒకింతపోటుగలిగియుండుట-ఇవియన్నియు అపక్వవ్రణలక్షణంబులని తెలియవలయును.

## పచ్యమానవ్రణలక్షణము

దహ్యతే దహనేనేవ క్షారేణేవచ పచ్యతే,
పిపీలికాగణేనేవ దశ్యతే ఛిద్యతే తథా. 58
భిద్యతేచైవ శస్త్రేణ దండేనేవచ తాడ్యతే,
పీడ్యతే పాణినేవాంత స్సూచీభిరివ తుద్యతే. 59
సోషాచోషో వివర్ణస్స్యా దంగుళ్యేవావపాఠ్యతే,
ఆసనే శయనే స్థానే శాంతిం వృశ్చికవిద్ధవత్. 60
నగచ్ఛే దాతతశ్శోథో భవే ద్ధ్మాన వస్తివత్,
జ్వరస్తృష్ణారుచిశ్చైవ పచ్యమానస్యలక్షణమ్. 61

తా. వ్రణము పక్వంబగుచుండ అగ్నితో గాల్చఁబడినటుల మండుట, క్షారము నుసిచినటుల చిమచిమలాడుట, చీమలు గొరికినటుల నొచ్చుట, లేక శస్త్రముతో ఛేదింపం బడినటులగాని, చీల్చంబడినటులగాని, లేక కఱ్ఱతో గొట్టఁబడినటులగాని, లేక చేతితో బిసుకంబడినటులగాని, లేక లోపల సూదులతో బొడువంబడునటుల గాని వేదనగలదై తాపముతోగూడియుండుట, అగ్నితో వేయించఁబడినటుల పీడగలుగుట, వర్ణముమారుట, వ్రేళ్ళతో జీల్చంబడినటులుండుట, కూర్చుండునపుడు, పరుండునపుడు, నిలువంబడియుం డునపుడు తేలుగుట్టినటుల వేదనగలిగి ఎల్లపుడు శమింపకుండుట, వాపుబ్బుటవలన నీడు వఁబడిన వస్తివలెనై జ్వరము, దప్పి, అరుచి అనువానియుక్తంబై యుండుట-ఈలక్షణంబు లు గలది పచ్యమానవ్రణమని తెలియవలయును.

## పక్వవ్రణలక్షణము

వేదనోపశమ శ్శోథో లోహితోఽల్పో నచోన్నతః,
ప్రాదుర్భావో వలీనాంచ తోదః కండూ ర్ముహుర్ముహుః. 62
ఉపద్రవాణాం ప్రశమో నిమ్నతా స్ఫుటనం త్వచః,

వస్త్రావివాంబుసంచార స్స్యా చ్ఛోథోఽంగుళిపీడితే. 63
పూయస్య పీడయత్యేక మంతమంతేచ నీడితే,
భక్తాకాంక్షా భవేచ్చైవ శోథానాం పక్వలక్షణమ్. 64

తా. వేదనశమించుట, వాపెత్తినై యొకింతప్రసరించుట, కుంగుట, పొడిచినటు లుండుట, పలుమారు దురదగలుగుట, పిత్తమువలన గలిగిన దాహాద్యుపద్రవములు శమించుట, వాపునందు పల్లముపడుట, చర్మముపగులుట, వాపును వ్రేలితో నదిమినవస్త్రియందుండునీటివలె చీము యిటునటు చలించుట, అవయవముయొక్క యొకప్రదేశమునణచిన చీము లోనికేగుట, అన్నమునం దిచ్ఛగలుట- ఈలక్షణములవలన వ్రణము పక్వంబైన దని తెలియవలయును.

### దోషత్రయసంబంధవ్రణపాకము

సర్తేఽనిలాదృగ్న వినానపిత్తం పాకఃకఫంవాపివినానపూయః,
తస్మాద్ధిసర్వేపరిపాకకాలే పచంతి శోథాస్త్రిభిరేవదోషైః. 65

తా. వాతములేకనే పోట్లును, పిత్తములేకనే దాహంబును, కఫములేకనే చీమును గలుగనేరదు. కావున సర్వశోథలు పరిపాకకాలంబున త్రిదోషయుక్తంబైపండును. (రక్త పాక లక్షణం బె ట్లనిన—శ్లో. "కఫజేషుచ శోథేషు గంభీరం పాక మేత్యసృక్, పక్వం స్నిగ్ధం తతస్స్పష్టం యత్రస్యాత్ల్కిన్నశోఫతా, త్వక్సావర్ణ్యం రుజోఽల్పత్వం ఘన స్పర్శత్వ మశ్మవత్, రక్తపాకమితి బ్రూయాత్తం ప్రాజ్ఞో ముక్తసంశయః." అనఁగా కఫజవ్రణములయందు రక్తము గూఢముగ పాకముచెందుట, పక్వమైన పిదప నునుపుగ నుండుట, వ్రణము స్పష్టముగ ద్రవించుట, వివర్ణము గాకుండుట, ఒకింతవేదనగలుగుట, తాఁకిన రాయివలె నుండుట-ఇవి రక్తపాకలక్షణము లని వైద్యవేత్తలు నిస్సంశయముగ వచించెదరు.)

### పూయానిర్గమనపరిణామము

కక్షంసమాసాద్యయథైవవహ్ని ర్వాయ్వీరితస్సందహతి ప్రసహ్య,
తథైవపూయోప్యవినిస్సృతోహిమాంసంసిరాస్నాయుచఖాదతీహ.

తా. అగ్ని వాయువుసహాయముచే పొదరిల్లును భస్మముజేయుచందంబున, చీము వెలిబడకుండుటచే వ్రణము తపించి మాంసము, సిరలు, స్నాయువులు అను వానిని భక్షించును.

### వ్రణవైద్యగుణదోషము

ఆమం విదహ్యమానంచ సమ్యక్పక్వంచ లక్షణైః,
జానీయా త్సభవే ద్వైద్య శ్శేషా స్తస్కరవృత్తయః. 67

తా. వ్రణముయొక్క యపక్వ, పచ్యమాన, పాకావస్థల బాగుగ నెఱుంగు వాఁడే వైద్యుఁడు. తక్కినవారలు తస్కరవ్యాపారులని తెలియందగును.

## అనిశ్చితవ్రణవైద్యదోషము

యశ్ఛినత్త్యామమజ్ఞానా ద్యశ్చ పక్వ ముపేక్షతే,
శ్వపచావివ మంతవ్యౌ తా వనిశ్చితకారిణౌ. 68

తా. అజ్ఞానమువలన నపక్వముగనుండు వ్రణము పక్వమైనదని యెఱింగి భిన్నపఱచెడి వైద్యుఁడును, లేక పక్వమైయుండు వ్రణము నుపేక్షించెడి వైద్యుఁడును చండాలురతో సమానులని తెలియవలయును.

## శారీరవ్రణభేదము

ద్విధా వ్రణః పరిజ్ఞేయ శ్శారీరాగంతుభేదతః,
దోషైరాద్య స్తయోరన్య శ్శస్త్రాదిక్షతసంభవః. 69

తా. వ్రణము శారీర, ఆగంతుకభేదములవలన రెండువిధంబులు. అందు మొదటిది యగు శారీరమను వ్రణము వాతాదిదోషములవలన జనించును. రెండవదియగు ఆగంతుక వ్రణము శస్త్రాదులగాయమువలన గలుగును.

## వాతికవ్రణలక్షణము

స్తబ్ధః కఠినసంస్పర్శో మందస్రావో మహారుజః,
తుద్యతే స్ఫురతి శ్యావో వ్రణో మారుతసంభవః. 70

తా. జడముగ నుండుట, తాఁకిన కఠినముగ నుండుట, కొంచెముగ స్రావము, మిక్కుటముగ పోట్లు గలుగుట, పొడిచినటుల వేదనతో గూడియుండుట, స్ఫురించుట, నల్లగ నుండుట-ఈలక్షణములు గలది వాతవ్రణ మని తెలియవలయును.

## పైత్తికవ్రణలక్షణము

తృష్ణా మోహ జ్వర క్లేద దాహ దుష్ట్యావదారణైః,
వ్రణం పిత్తకృతం విద్యా ద్గంధై స్స్రావైశ్చ పూతికైః. 71

తా. దప్పి, మోహము, జ్వరము, చెమ్మ, తాపము గలుగుట, చీల్చఁబడినటుల వేదన గలుగుట, కంపువేయుట దుర్గంధముగ స్రావము గలుగుట - ఈలక్షణములు గలది పిత్తవ్రణమని తెలియవలయును.

## కఫజవ్రణలక్షణము

బహుపిచ్ఛోగురుస్స్నిగ్ధ స్స్తిమితో మందవేదనః,
పాండువర్ణోఽల్పసంక్లేదీ చిరపాకీ కఫోద్భవః. 72

తా. కడుజిగటగ, జడముగ, దట్టముగ, నిశ్చలముగ, మందవేదన గలదిగ, తెల్లని

వర్ణము గలదిగనుండుట, కొంచెముగ స్రావముగలుగుట, దీర్ఘకాలముమీద పండుట - ఈ లక్షణములుగలది శ్లేష్మజవ్రణమని తెలియవలయును.

రక్తజ, ద్వంద్వజవ్రణలక్షణము

రక్తో రక్తస్రుతీరక్తాద్ద్వి త్రిజస్స్యా త్తదన్వయైః. 73

తా. రక్తవర్ణముగలదై రక్తమును స్రవింపంజేయుచుండువ్రణము రక్తజవ్రణ మనంబడును. ఏకదోష రక్తసంబంధములవలన జనించునది ద్వంద్వజవ్రణమనియుద్విదోష రక్తసంబంధములవలన జనించునది సన్నిపాతజవ్రణమనియు చెప్పంబడును.

సుఖవ్రణలక్షణము

త్వఙ్మాంసజ స్సుఖే దేశే తరుణస్యానుపద్రవః,
ధీమతోఽభినవః కాలే సుఖసాధ్య స్సుఖవ్రణః. 74

తా. చర్మము, మాంసము, మర్మరహితస్థలములు అనువానియందు జనించి జ్వర తృష్ణాద్యుపద్రవరహితంబై యౌవనము, యుక్తాయుక్తవివేకజ్ఞానము గల పురుషులకు హేమంత, శిశిరకాలములయందు జనించినదియై యుండు నూతనవ్రణము సుఖవ్రణమని తెలియందగును. ఇదిసుఖసాధ్యంబు.

కృచ్ఛ్రసాధ్యాసాధ్యలక్షణము

గుణైరన్యతమై ర్హీన స్తతః కృచ్ఛ్రో వ్రణస్స్మృతః,
సర్వైర్విహీనో విజ్ఞేయ స్సోఽసాధ్యో నిరుపక్రమః. 75

తా. పూర్వోక్త "త్వఙ్మాంసజేత్యాది" శ్లోకోక్తగుణములలో తక్కువగనుండు గుణములంగల వ్రణము కష్టసాధ్యంబనియు, సర్వగుణరహితంబైయుండువ్రణ మసాధ్యం బనియు తెలియవలయును. ఇట్టి యసాధ్యవ్రణములకు జికిత్సచేయందగదు.

దుష్టవ్రణలక్షణము

పూతిపూయాతిదుష్టా సృక్స్రావ్యుత్సంగీ చిరస్థితిః,
దుష్టవ్రణోఽతిగంధాది శ్శుద్ధలింగవిపర్యయః. 76

తా. దుర్గంధముగ చీమును, చెడినరక్తమును స్రవింపంజేయుచు దీర్ఘకాలమువఱకు పైన నుబ్బుగ, లోన బోలుగ నుండినదియై అసహ్యమైనగంధము, వికారమైనవర్ణస్రావ వేదనాయుక్తంబై శుద్ధవ్రణలక్షణవిహీనంబై యుండునది దుష్టవ్రణమని తెలియవల యును.

శుద్ధవ్రణలక్షణము

జిహ్వాతలాభోఽతిమృదు శ్లక్ష్ణస్స్నిగ్ధోఽల్పవేదనః,
శుచ్యవస్థో నిరాస్రావ శ్శుద్ధో వ్రణఇతి స్మృతః. 77

తా. నాలుకయొక్క పైభాగమువంటి కాంతిగలదిగ, కడుమృదువుగ, నున్నగ, స్నిగ్ధముగ నుండినదియై అల్పవేదనాయుక్తమై ఉబ్బుమొదలగునవి లేక పొక్కులతో దోషరక్తాదిస్రావరహితంబై యుండునది శుద్ధవ్రణ మని తెలియవలయును.

## వ్రణరోహణలక్షణము

కపోతవర్ణప్రతిమా యస్యాంతాః క్లేదవర్జితాః,
స్థిరాశ్చపిటికావంతో రోహతీతితమాదిశేత్. 78

తా. చుట్టూ పావురపిట్టవర్ణముతో సమానంబై *క్లేదరహితంబై పగులక వ్యాప్తంబై యుండువ్రణము బాగుగ మొలుచు నని తెలియవలయును.

## బాగుగ తేలినవ్రణలక్షణము

రూఢవర్త్మానమగ్రంథి మశూన మరుజ వ్రణం,
త్వక్సవర్ణం సమతలం సమ్యగ్రూఢం తమాదిశేత్. 79

తా. ముఖము బాగుగ నగుపడుట. కురుపుపై నుబ్బు, వాపు, పోట్లు లేకుండుట, చర్మముతో సమానవర్ణము గలదిగ నుండుట, నాలుకతోగాని అరచేతితోగాని సమానముగ నుండుట - ఈలక్షణములు గల వ్రణము బాగుగ పండి తేలినదనియు తెలియవలయును.

## వ్రణకృచ్ఛ్రసాధ్యలక్షణము

కుష్ఠినాం విషజుష్టానాం శోషిణాం మధుమేహినాం,
వ్రణాః కృచ్ఛ్రేణ సిధ్యంతి యేషాంచాపి వ్రణేవ్రణాః. 80

తా. కుష్ఠువు, విషము, క్షయరోగము, మధుమేహముగల పురుషునికి జనించిన వ్రణము కష్టసాధ్యము. మఱియు వ్రణముపై మఱియొక వ్రణము జనించిన నదియును కష్టసాధ్యంబు.

## సాధ్యాసాధ్యవ్రణలక్షణము

వసాం మేదోఽథమజ్జానం మస్తులుంగంచ యస్స్రవేత్,
ఆగంతుజో వ్రణస్సిధ్యే న్నసిధ్యే ద్దోషసంభవః. 81

తా. క్రొవ్వు, మేదస్సు, మజ్జ, మస్తకస్నేహము - వీనిని వెడలింపంజేసెడి వ్రణము ఆగంతుకజనితంబైయుండిన సాధ్యంబు; దోషజనితంబైయుండిన నసాధ్యంబు.

## అసాధ్యవ్రణలక్షణము

మద్యాగుర్వాజ్య సుమనః పద్మ చందన చంపకైః,
సుగంధా దివ్యగంధాశ్చ ముమూర్షూణాం వ్రణాస్స్మృతాః. 82

*క్లేద మన చెమ్మ.

తా. మద్యము, అగురు, నెయ్యి, పుష్పము, కమలము, చందనము, సంపంగి పువ్వు, లేక చమత్కారిక పారిజాతాదిక పుష్పము అనువానియొక్క సువాసనను వెద లింపంజేయుచుండు వ్రణమువలన రోగి మృతి జెందునని తెలియవలయును.

యేచ మర్మసు సంభూతా భవం త్యత్యర్థవేదనా,
దహ్యంతే చాంతరత్యర్థం బహిశ్శీతాశ్చ యేవ్రణాః. 83
దహ్యంతే బహిరత్యర్థం భవం త్యంతశ్చ శీతలాః,
ప్రాణ మాంస క్షయ శ్వాస కాసారోచకపీడితాః. 84
ప్రవృద్ధపూయరుధిరా వ్రణా యేషాంచ మర్మసు,
క్రియాభి స్సమ్యగారబ్ధా నసిధ్యంతిచ యేవ్రణాః. 85
వర్జయేదేవ తా న్వైద్య స్సంరక్ష న్నాత్మనో యశః, (మతాంతరే)

తా. మర్మస్థానమున జనించి కడువేదన గలుగంజేయుచుండు వ్రణంబును, లోనతాపము, వెలపట శీతలముగల వ్రణంబును, వెలపట తాపము లోన శీతలముగల వ్రణంబును, బలమాంసములు క్షయించి శ్వాసము, దగ్గు, అరోచకము అనువానితో గూడి విశేషపీడను గలుగం జేయుచుండు వ్రణంబును, మర్మస్థానమునందు జనించి చీమును, రక్తమును మిక్కుటముగ గార్చుచుండు వ్రణంబును, బాగుగ జికిత్స జేయం బడియు సాధ్యముగాకుండు వ్రణంబును యశస్సును గోరెడు వైద్యుఁడు వర్జింపవలయును.

### వ్రణాపచారము

వ్రణే శ్వయథు రాయాసా త్సచ రాగశ్చ జాగరాత్. 86
తౌచ రుక్చ దివా స్వాపా త్తాశ్చ మృత్యుశ్చ మైథునాత్,

తా. ఆయాసమువలన వ్రణమునందు వాపును, జాగరణమువలన వాపును, ఎఱుపువర్ణమును, పగటియందు నిద్రించుటవలన వాపును ఎఱుపువర్ణమును పోట్లును, మైథునమువలన వాపును, ఎఱుపువర్ణమును, పోట్లును మరణమును గలుగంజేయును.

### వ్రణివర్జ్యద్రవ్యములు

ఆమ్లం దధిచ శాకంచ మాంసమానూపవారిజమ్. 87
జీరం గురూణిచాన్నాని వ్రణీతు పరివర్జయేత్,
(మాధవనిదానే)

తా. పులుసు, పెరుగు, ఆకుకూరలు, జలజంతుమాంసము, జీలకఱ్ఱ, గురుకరాన్నములు - వీనిని వ్రణరోగముగలవారు వర్జింపవలయును.

### వాతవ్రణమునకు మాతులుంగాది లేపనము

మాతులుంగాగ్నిమంథౌచ సురదారుమహౌషధమ్. 88

అహింస్రాచైవ రాస్నాచ ప్రలేపో వాతశోఫహా,

తా. మాదీఫలము, కూరసెల్లి, దేవదారు, శొంఠి, నారంజి, సన్నరాస్నము - వీనిని నూరి వ్రణమునందు లేపనము జేసినను, లేక వర్తిజేసి ఎక్కించినను, వాతవ్రణము మానును.

గంభీరవ్రణమునకు అభయాదిలేపము

అభయా త్రివృతా దంతీ లాంగలీ మధు సైంధవః. 89
సుషవీపత్ర ధత్తూర కర్ణమోట కుబేరకాః,
పృథగేతే ప్రలేపేన గంభీరవ్రణశోషణాః. 90

తా. కరక్కాయ, తెగడ, నేలదంతి, చెన్నచర్లగడ్డ, తేనె, సైంధవలవణము, కాకరాకు, ఉమ్మెత్తాకు, కర్ణమోట; గగ్గెరాకు - వీనిలో దేనినేని నూరి లేపనము జేసిన గంభీరవ్రణము శోషించును.

మనశ్శిలాదిలేపనము

మనశ్శిలా సమంజిష్ఠా సలాక్షా రజనీద్వయం,
ప్రలేప స్సఘృత క్షౌద్ర స్త్వగ్విశుద్ధికరస్స్మృతః. 91

తా. మణిశిల, మంజిష్ఠ, లక్క, పసపు, మ్రానిపసపు - వీనిచూర్ణమును నెయ్యి, తేనె అనువానిలో గలిపి లేపనము జేసిన చర్మము శుద్ధంబగును.

వ్రణక్రిములకు కరంజాదిలేపము

కరంజారిష్టనిర్గుండీ రసోహన్యా ద్వ్రణక్రిమీన్,

తా. క్రానుగ, వేప, వావిలి - వీనిరసముల లేపనముచేసిన వ్రణము, క్రిములు హరించును.

పటోలాదికషాయము

పటోలీ నింబపత్రాణాం క్వాథ స్సంక్షాళనే హితః. 92
తతస్సంరోపణే శస్త స్తిలానాం మధుకాస్వితః,

తా. చేతిపొట్ల, వేపాకు-వీనికషాయముతో వ్రణముల గడుగుట ప్రశస్తము. మఱియు నువ్వులకల్కములో తేనె గలిపి లేపనముజేసిన వ్రణములు కుదురుగట్టి మానును.

చిరబిల్వాదిలేపనము

చిరబిల్వ స్తథాదంతీ చిత్రకో హయమారకః,
కపోత కంక గృధ్రాణాం మలలేపేనదారణమ్. 93

తా. క్రానుగ, చిత్రమూలము, దంతి, గన్నేరు అనువానివేళ్ళనుగాని, లేక,

పావురపిట్ట, రాపులుగు, గద్ద అనువానిమలమును గాని లేపనము జేసిన వ్రణము పగులును.

దంతీమూలాది లేపము

దంతీమూలక చిత్రత్వక్స్నుహ్యర్క పయసా గుడః,
భల్లాతకాస్థికాసీస సైంధవైర్దారణస్స్మృతః. 94

తా. దంతివేరు. చిత్రమూలపుపట్ట, బొంతజముడుపాలు, జిల్లేడుపాలు, బెల్లము, జీడివిత్తులు, అన్నభేది, సైంధవలవణము - వీనిని నూరి లేపనము జేసిన వ్రణము పగులును.

యవాదిలేపము

యవ గోధూమ చూర్ణంచ సక్షారం దారణం పృథక్,
హారిద్రా భస్మ చూర్ణాభ్యాం ప్రలేపో దారణః పరః. 95
అజవిట్క్షారమృజ్యంచ ప్రలేపో వ్రణదారణః,

తా. యవలు, గోధుమలు - వీనిపిండిలో క్షారముగలిపి లేపనముజేసినను, లేక పసపు మసిలో సున్నముగలిపిగాని, లేక మేకపెంటికలబూడిదె క్షారములో సాంబర లవణమునుజేర్చిగాని, లేపనముజేసినను వ్రణము పగులును. ఇది కడుశ్రేష్ఠంబు.

ప్రక్షాళనము

తతః ప్రక్షాళనే క్వాథః పటోలీ నింబపత్రజః. 96
అవిశుద్ధే విశుద్ధే తు న్యగ్రోధాదిత్వగుద్భవః,
పంచమూలీ ద్వయం వాతే న్యగ్రోధాదిశ్చ పైత్తికే. 97
ఆరగ్వధాదికో యజ్వః కఫజే సర్వకర్మసు,

తా. వ్రణమును చేతిపొట్ల, వేపాకు అనువానికషాయముతోడను, శుద్ధ అశుద్ధవ్రణములను మఱ్ఱి మొదలగువాని పట్టలకషాయముతోడను, వాతవ్రణమును దశమూల కషాయముతోడను, పిత్తవ్రణమును మఱ్ఱి మొదలగువానిపట్టల కషాయముతోడను, కఫవ్రణమును రేల మొదలగువాని కషాయముతోడను గడుగవలయును.

శోధనరోపణవిధి

తిల సైంధవ యష్ట్యాహ్వా నింబపత్ర నిశాయుతైః. 98
త్రివృన్మధుయుతైః పిష్టైః ప్రలేపో వ్రణశోధనః,
తిలకల్కస్సలవణో ద్వేహరిద్రే త్రివృద్ఘృతమ్. 99
మధుకం నింబపత్రాణి లేపస్స్యాద్వ్రణశోధనః,

తా. నువ్వులు, సైంధవలవణము, అతిమధురము, వేపాకు, పసపు, మ్రానిపసపు, ...డ - వీనిని చూర్ణముజేసి తేనెతో మర్దించి లేపనముజేసిన వ్రణము శుద్ధంబగును. ...కయు నువ్వులకల్కములో, ఉప్పు, పసపు, మ్రానిపసపు, తెగడ, అతిమధురము, ...పాకు అనువానిచూర్ణమును నేతిని గలిపి లేపనముజేసిన వ్రణము శుద్ధంబగును.

### దుష్టవ్రణలేపనము

నింబ కోలకపత్రాణి లేపస్స్యా ద్వ్రణశోధనః. 100
నింబపత్ర తిలైః కల్కో మధునా కృతశోధనః,
నింబపత్రం తిలా దంతీ త్రివృత్సైంధవమాక్షికమ్. 101
దుష్టవ్రణప్రశమనో లేప శ్శోధనకేసరీ,

తా. వేపాకు, రేగాకు అనువానినిగాని, నువ్వులకల్కములో వేపాకుచూర్ణ...ను, తేనెను గలిపిగాని, లేక వేపాకు, నువ్వులు, దంతివేరు, తెగడ, సైంధవలవణము ...వానిని తేనెలో గలిపిగాని లేపనముచేసిన దుష్టవ్రణము శమించును.

### నింబాదిశోధనము

నింబపత్ర మధుభ్యాంతు యుక్త స్సంశోధన స్మృతః. 102
ఏకంవా శారిబామూలం సర్వవ్రణవిశోధనం,

తా. వేపాకు, తేనె - వీనిని నూరి లేపనముచేసినను, లేక సుగంధిపాలవేరును ...రి లేపనము చేసినను సర్వవ్రణములు శుద్ధంబు లగును.

### పారదాదిమలహరఘృతము.

రస గంధకయో శ్చూర్ణం తత్సమం మర్దశంఖకమ్. 103
సర్వతుల్యంతు కంపిల్లం కించి త్తుత్థసమన్వితం,
సర్వం సంమేళయే ద్దత్వా ఘృతం సర్వచతుర్గుణమ్. 104
పిచుప్లుతం ప్రదాతవ్యం దుష్టవ్రణనిషూదనం,
నాడీవ్రణహరంచైవ సర్వవ్రణనిషూదనమ్. 105
యేవ్రణా నప్రశామ్యంతి భేషజానాం శతేనచ,
అనేనతే ప్రశామ్యంతి సర్పిషా స్వల్పకాలతః. (ఆయుర్వేదే) 106

తా. రసము, గంధకము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి కాటుకవలె ...రి దానికి సమముగ ముదారుసింగును గలిపి మర్దించి వీనికన్నిటికి సమముగ కంపిల్లము, ...కింత మైలుతుత్థముగలిపి బాగుగనూరి దానికి నాలుగింతలునెయ్యిగలిపి దానిలో ప్రత్తిని ...డిపి వ్రణముపై నునిచిన దుష్టవ్రణము శుద్ధంబగుటయేగాక నాడీవ్రణములు, సర్వ వ్రణములను నశింపజేయును. మఱియు ననేకౌషధములవలననగా శాంతిచెందకుండునట్టి వ్రణం బీఘృతమువలన స్వల్పకాలములో శాంతిచెందును.

### రసాదిఘృతము

రస గంధక సిందూర రాళ కంపిల్ల ముద్ధకం,
తుత్థం ఖాదిరకం చూర్ణం సర్వం ఘృతచతుర్గుణమ్. 107
యుక్త్వా సంమేళ్య పిచునా వ్రణేదేయం విజానతా,
సర్వవ్రణప్రశమనం ఘృతమేతన్నసంశయః. 108

తా. రసము, గంధకము, సిందూరము, సర్జరసము, కంపిల్లము (గుగ్గిలము,) ముదారసింగు, మైలుతుత్థము, కాచు-వీనిని సమభాగములుగ చూర్ణముచేసి దానికి నాలుగింతలు నెయ్యి గలిపి దానిలో ప్రత్తినద్ది వ్రణముపై వైచిన సర్వవ్రణములు నిశ్చయముగ హరించును.

### హస్తిదంతలేపనము

హస్తిదంతం జలే ఘృష్టం బిందుమాత్రప్రలేపనం,
అత్యంతకఠినేచాపి శోఫే పాచనభేదనమ్. 109

తా. ఏనుగుదంతము నుదకముతో నూరి యందొకబిందువును వ్రణముయొక్క-ముఖముపై నునిచిన కడుకఠినముగ నుండువ్రణము పండి పగులును.

### విడంగాదిగుగ్గులువటికములు

విడంగ త్రిఫలా వ్యోష చూర్ణం గుగ్గులునాసమం,
సర్పిషా వటికాః కుర్యా త్ఖాదే ద్వాహితభోజనః. 110
దుష్టవ్రణాపచీ మేహ కుష్ఠ నాడీ విశోధనః,

తా. వాయువిడంగములు, త్రిఫలములు, త్రికటుకములు - ఇవి సమభాగములు, వీనికన్నిటికి సమము శుద్ధిచేసిన గుగ్గిలము ఇటుల వీనినెల్ల నేకముచేసి ఖల్వములో నునిచి నేతితో మర్దించి యుంటలుచేసి పథ్యముగనుండి సేవింపుచుండిన దుష్టవ్రణము, అపచి, మేహము, కుష్టువు, నాడీవ్రణము-వీనిని హరింపంజేయును.

### అమృతాదిగుగ్గులము

అమృతా పటోలమూల త్రికటు త్రిఫలాక్రిమిఘ్నానాం,
కృత్వా సమభాగచూర్ణం తత్తుల్యో గుగ్గులుర్యోజ్యః. 111
ప్రతివాసరమేకైకాం ఖాదేదథాక్షపరిమాణాం,
జేతుం వ్రణవాతాస్రం గుల్మోదర పాండు శోథాదీన్. 112

తా. తిప్పతీగె, చేతిపొట్లవేరు, త్రికటుకములు, త్రిఫలములు, వాయువిడంగములు-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దానికిసమముగ శుద్ధిచేసిన గుగ్గిలమును గలిపి మర్దించి అక్షప్రమాణము మాత్రలుచేసి యందొకదానిని ప్రతిదినము సేవించుచుండిన వ్రణము, వాతరక్తము, గుల్మము, ఉదరము, పాండువు, వాపు హరించును.

## జాత్యాదిఘృతము

జాతీపత్ర పటోల నింబ కటుకా దార్వీ నిశా శారిబా
మంజిష్ఠాభయ తుత్థ సిక్థ మధుకై ర్నక్తాహ్వాబీజై స్సమైః,
సర్పి స్సిద్ధ మనేన సూక్ష్మవదనా మర్మాశ్రితా స్రావిణో
గంభీరా స్సరుజో వ్రణాస్సగతికాశ్శుద్ధ్యంతి రోహంతిచ. 113

తా. జాపత్రి, చేతిపొట్ల, వేప, కటుకరోహిణి, మ్రానిపసపు, పసపు, సుగంధిపాలవేరు, మంజిష్ఠ, కరక్కాయ, మైలుతుత్థము, మైనము, అతిమధురము, క్రానుగవిత్తులు-వీనిని సమభాగములుగ దంచి కషాయము గాచి దానిలో నెయ్యి గలిపి చిక్కగవండి లేపనముచేసిన మర్మస్థానముపై జనించి యనేకసూక్ష్మముఖములవలన స్రావముజేయించుచు లోన నొప్పిగలదై లోననే చలించునదియైయుండు వ్రణమును శుద్ధపఱచుటయేగాక మానునటులనగా జేయుచున్నది.

## సర్జకాదిఘృతము

సర్జకాచ యవక్షారః కంపిలంచ హరేణుకా,
టంకణం శ్వేతఖదిరం తుత్థచూర్ణంచ గోఘృతైః. 114
సర్వం సమాంశం సంచూర్ణ్య మర్దయేత్ప్రహరం దృఢం,
సర్జకాద్యమిదం సర్పి స్సర్వవ్రణహరం పరమ్. 115

తా. సర్జక్షారము, యవక్షారము, కంపిల్లము, రేణుకవిత్తులు, వెలిగారము, తెల్లకాచు, మైలుతుత్థము-వీనినెల్ల సమభాగములుగ చూర్ణముజేసి ఖల్వములో నునిచి ఆవునేతితో నొకఝాము బాగుగ మర్దించి లేపనముజేసిన సర్వవ్రణముల హరింపంజేయును. (మఱియు నది క్రిములు, దురద-వీనిని నశింపంజేసి చర్మమునకు మంచివర్ణమును సగాగలుగంజేయును.)

## లశునాదిలేపము

లశునేనాథవా దద్యా ల్లేపనం క్రిమినాశనమ్. 116

తా. తెల్లగడ్డను నూరి లేపనముజేసిన క్రిములు నశించును.

## నింబపత్రాదిధూపము

నింబపత్ర వచా హింగు సర్పి ర్లవణ సైంధవైః,
ధూపనం కృమి రక్షోఘ్నం వ్రణ కండూ రుజాపహమ్. 117

తా. వేపాకు, వస, ఇంగువ, నెయ్యి, ఉప్పు, సైంధవలవణము-వీనిని చూర్ణముజేసి వ్రణములయందు ధూపమువేసిన క్రిములు, రక్షస్సు, వ్రణము, దురద, పీడహరించును.

వ్రణలేపనములు

సప్తదళదుగ్ధకల్కః శ్శమయతి దుష్టవ్రణం ప్రలేపేన,
మధుయుక్తా శరపుంఖా సర్వవ్రణరోపణః కథితా. 118
పంచవల్కలచూర్ణైర్వా శుక్తిచూర్ణ సమాయుతైః,
ధాతకీ లోధ్రచూర్ణైర్వా లేపో రోపణకః పరః. 119

తా. ఆకుజెముడుపట్టను పాలతో నూరి లేపనముజేసిన దుష్టవ్రణము శమించును. లేక తెల్లవెంపలిచూర్ణమును తేనెలో గలిపి లేపనముజేసిన సర్వవ్రణములు మాంసపూరితంబులగు. మఱియు పంచవల్కలచూర్ణమునుగాని, కప్పచిప్పసున్నము, ఆరెపువ్వు, లొద్దుగ వీనిచూర్ణమునుగాని లేపనము జేసిన వ్రణములు మాని మాంసపూరితంబులగును.

అయోరజాదిలేపము

అయోరజ స్సకాసీసం త్రిఫలా కుసుమానిచ,
ప్రలేపః కురుతే దార్ఢ్య్ సద్యఏవ నవత్వచి. 120

తా. ఇనుపపొడి, అన్నభేది, త్రిఫలములు, లవంగములు, మ్రానిపసపు - వీనిని నూరి వ్రణముయొక్కనూతనచర్మముపై లేపనము సేయుట హితకరంబు.

ఆగంతుక వ్రణనిదానము

నానాధారాముఖై శ్శస్త్రై ర్నానాస్థాననిపాతితైః,
భవంతి నానాకృతయో వ్రణా స్తాంస్తా న్నిబోధమే. 121
(ఆయుర్వేదే)

తా. పలువిధములైన పదునుముఖములుగల యాయుధములచే శరీరముయొక్క పలువిధస్థానములయందు తగులుదెబ్బలవలన జనించునట్టి పలువిధములైన నాకృతులుగల వ్రణముల వచించెదను.

ఆగంతుకవ్రణభేదములు

ఛిన్నం భిన్నం తథావిద్ధం క్షతంపిచ్ఛితమేవచ,
ఘృష్టమాహు స్తథాషష్ఠం తేషాం వక్ష్యామి లక్షణమ్. 122

తా. ఛిన్నము, భిన్నము, విద్ధము, క్షతము, పిచ్ఛితము, ఘృష్టము అని వ్రణము లాఱువిధంబులు. వానిలక్షణముల వచించెదను.

ఛిన్నలక్షణము

తిర్యక్ఛిన్న మృజుర్వాపి యో వ్రణస్త్వాయతో భవేత్,
గాత్రస్యపాతనం తద్ధి ఛిన్న మిత్యభిధీయతే. 123

తా. శరీరమున నాయుధప్రహారముచే అడ్డముగ, వక్రముగ లేక పొడవుగనైన వ్రణము ఛిన్న మనంబడును.

## భిన్నలక్షణము

శక్తికుంతేషు ఖడ్గాగ్ర విషాణై రాశయోహతః,
యత్కించి త్స్రవతే తద్ధి భిన్నలక్షణముచ్యతే. 124

తా. శక్తి (బల్లెము), కుంతము, బాణము, కత్తియొక్కకొన, విషాణము (దంతము కొమ్ము) అనునాయుధములచే కోష్ఠమునందు పొడువంబడుటవలన నొకింతరక్తము స్రవించిన భిన్న మనంబడును.

## కోష్ఠలక్షణము

స్థానాన్యామాగ్నిపక్వానాం మూత్రస్య రుధిరస్యచ,
హృదుండుకః పుప్పుసశ్చ కోష్ఠ ఇత్యభిధీయతే. 125

తా. ఆమ, అగ్ని, పక్వ, మూత్ర *రక్తాశయములు, ఱొమ్ము, మలాశయము, పుప్పుసము అనునీస్థలంబులు కోష్ఠ మనంబడును.

## కోష్ఠభేదలక్షము

తస్మిన్ భిన్నే రక్తపూర్ణే జ్వరో దాహశ్చ జాయతే,
మూత్రమార్గ గుదాస్యేభ్యో రక్తం ఘ్రాణాచ్చ గచ్ఛతి. 126
మూర్ఛా శ్వాసతృషాధ్మాన మభక్తచ్ఛందఏవచ,
విణ్మూత్రవాతసంగశ్చ స్వేదాస్రావోఽక్షిరక్తతా. 127
లోహగంధిత్వ మాస్యస్య గాత్ర దౌర్గంధ్యమేవచ,
హృచ్ఛూలం పార్శ్వయోశ్చాపి విశేషం చాత్ర మే శృణు. 128

తా. కోష్ఠము భిన్నమై రక్తముచే నిండియుండ జ్వరము, దాహము, మూత్రమార్గ, గుద, ముఖ, నాసికములవలన రక్తస్రావము, మూర్ఛ, శ్వాసము, దప్పి, కడుపుబ్బరము, అన్నద్వేషము, మల, మూత్ర, వాతప్రతిబంధము, మిక్కుటముగచెమట, నేత్రములయందు దెబ్బపువర్ణము, నోటియందు దినుపవాసన, శరీరదౌర్గంధ్యము, హృదయము, పక్కలు అనువానియందు శూల అనులక్షణంబులు గలుగును. ఐనను దీనికన్నవిశేషముగ గలుగునట్టి లక్షణంబుల వచించెదను.

## ఆమాశయస్థితరక్తలక్షణము

ఆమాశయస్థే రుధిరే రుధిరం ఛర్దయత్యపి,
ఆధ్మాన మతిమాత్రంచ శూలంచ భృశదారుణమ్. 129

* రక్తాశయ మన-యకృత్ ప్లీహములు.

తా. ఆమాశయమునందు రక్తముజేరియుండ రక్తవమనము, మిక్కుటముగ కడు పుబ్బరము, కడుభయంకరమయిన శూల గలుగును.

పక్వాశయస్థ రక్తలక్షణము

పక్వాశయగతేచాపి రుజా గౌరవ మేవచ,
అధఃకాయే విశేషేణ శీతతాచ భవేదిహ. 130

తా. పక్వాశయమునందు రక్తముజేరియుండ, శూల, జడత్వము, నడుము యొక్క క్రిందిభాగమునందు విశేషముగ శీతలము గలుగును.

విద్ధలక్షణము

సూక్ష్మాస్య శల్యాభిహతం యదంగం త్వాశయం వినా,
ఉత్తుండితం నిర్గతంవా తద్విద్ధమితి నిర్దిశేత్. 131

తా. సూక్ష్మమైనముఖముగలశల్యముచే ఆమాశయముగాక తక్కినయంగముల యందు పొడువఁబడుటవలన బైలువెడలిన శల్యముగలదిగాని, ముఖముగలదిగాని యుండిన విద్ధ మనంబడును.

క్షతవ్రణలక్షణము

నాతిచ్ఛిన్నం నాతిభిన్న ముభయోర్లక్షణాన్వితం,
విషమం వ్రణమంగేషు తత్క్షతం త్వభినిర్దిశేత్. 132

తా. అంగము అతిభిన్నముగాక అతిఛిన్నముగాక యుండుటచే ఛిన్నభిన్నలక్షణ యుక్తంబై మిట్టపల్లముగలదై యుండిన క్షతజవ్రణ మనంబడును.

పిచ్ఛితవ్రణలక్షణము

ప్రహారపీడనాభ్యాంతు యదంగం పృథుతాంగతం,
సాసితత్పిచ్ఛితం విన్యా న్మజ్జా రక్తపరిప్లుతమ్. 133

తా. దెబ్బలవలనగాని, బండిమొదలైనవానిచే నలుగుటవలనగాని, అంగము విస్తరించి యెముకలతోఁగూడి మజ్జారక్తములయొక్క చేరిమిచే వ్రణభావముగలదై యుండిన పిచ్ఛిత మనంబడును.

ఘృష్టలక్షణము

ఘర్షణా దభిఘాతాద్వా యదంగం విగతత్వచం,
ఉషాస్రావాన్వితం తద్ధి ఘృష్ట మిత్యభినిర్దిశేత్. 134

తా. ఒరసికొనుటవలనగాని, లేక అభిఘాతమువలనగాని శరీరముయొక్కపైచర్మము వీడి మంటతోఁగూడి రక్తము స్రవించుచుండిన ఘృష్ట మనంబడును.

### శల్యవ్రణలక్షణము

శ్యావంసశోథంపిటికాన్వితంచ ముహుర్ముహుశ్శోణితవాహినంచ,
మదూద్గతంబుద్బుదతుల్యమాంసం వ్రణంసశల్యంసరుజంవదంతి. 135

తా. వ్రణము నీలవర్ణము, వాపుగలకురుపులతో వ్యాప్తంబై పలుమారు రక్తమును స్రవింపఁజేయుచు మృదువుగ నుండినదై నీటిబుగ్గవలె పైకి లేచినటువంటి మాంసముగలదై వేదనతోఁ గూడియుండిన శల్యవ్రణ మనంబడును.

### కోష్ఠభేదలక్షణము

త్వచోతీత్యసిరాదీని భిత్వావా పరిహృత్యవా,
కోష్ఠేప్రతిష్ఠితం శల్యం కుర్యా దుక్తా నుపద్రవాన్. 136

తా. శల్య మేదుచర్మములకు లోభాగమున బ్రవేశించి నరములు, మాంసము, చాలునరములు, ఎముకలు-వీనిని భిన్నము జేసిగాని, లేకభిన్నముసేయకగాని కోష్ఠమును జెందిన కోష్ఠభేదమని తెలియవలయును. దానియందు పైఁజెప్పఁబడినశల్యవ్రణోపద్రవంబులు గలుగును.

### అసాధ్యకోష్ఠభేదలక్షణము

తత్రాంతర్లోహితం పాండు శీతపాదకరాననం,
శీతోచ్ఛ్వాసం రక్తనేత్ర మానద్ధం పరివర్జయేత్. 137

తా. ఎవనికి రక్తములోన సంచితంబై పాండువర్ణముగ, కాళ్లు చేతులు చల్లగ నుండునో, శ్వాసము చల్లగ వెడలునో, నేత్రము లెఱ్ఱనైయుండునో, కడుపుబ్బరము గలిగియుండునో అట్టివారు యమాలయంబున కేగుదు రని తెలియవలయును.

### మర్మక్షతసామాన్యలక్షణము

భ్రమః ప్రలాపః పతనంప్రమోహో విచేష్టనంగ్లానిరథోష్ణతాచ,
ప్రస్తాంగతామూర్ఛసమూర్ధ్వవాత స్తీవ్రారుజో వాతకృతాశ్చతాస్తాః
మాంసోదకాభంరుధిరంచగచ్ఛే త్సర్వేంద్రియార్థోపరమ స్తథైవ,
దశార్ధసంఖ్యేష్వథవిక్షతేషు సామాన్యతోమర్మసులింగముక్తమ్.

తా. భ్రమ, తబ్బిబ్బుమాటలు, భూమిపైఁబడుట, ఇంద్రియమనోమోహము గలుగుట, కాళ్లుచేతులు విదిలించుట, బడలిక, ఉష్ణముగలుగుట, అంగసంధులూడినటుల వేదనగలుగుట, మూర్ఛ, ఎగయూపిరి, వాతజన్యతీవ్రపీడగలుగుట, రక్తము మాంసము కడిగిననీళ్ళవలె స్రవించుట, సర్వేంద్రియవ్యాపారము నశించుట-ఈలక్షణములు సామాన్యముగ ఉత్తరత్ర జెప్పంబడు మర్మములైన మాంస, సిర, స్నాయు, అస్థి సంధుల యొక్క క్షతములవలన గలుగును.

### మర్మరహితసిరావిద్ధలక్షణము

సురేంద్రగోపప్రతిమం ప్రభూతం రక్తంస్రవేత్తత్క్షయజశ్చవాయుః,
కరోతి రోగాన్వివిధాన్యథోక్తాన్ సిరాసువిద్ధాస్వథవాక్షతాసు.

తా. సిరను బొడుచుటవలనగాని, లేక దానియందు గాయము తగులుటవలనగాని ఇంద్రగోప పురుగువర్ణమువలె నెఱ్ఱనైన రక్తము మిక్కుటముగ స్రవించిన మర్మరహిత సిరావిద్ధ మని తెలియవలయును. (మఱియు ఆరక్తక్షయమువలన వాతము ప్రకోపించి పలువిధములైన ఆక్షేపకాదిరోగముల గలుగంజేయును.)

### స్నాయువిద్ధలక్షణము

కౌబ్జ్యంశరీరావయవావసాదః క్రియాస్వశక్తి స్తుములా రుజశ్చ,
చిరాద్వ్రణోరోహతియస్యచాపితంస్నాయువిద్ధంపురుషంవ్యవస్యేత్.

తా. కుబ్జత్వము, శరీరమునందు బడలిక, పనిచేయుట కశక్తత, కడువేదనగలిగి కాయము దీర్ఘకాలముమీఁద మాంసపూరితంబైన స్నాయువిద్ధ మని తెలియవలయును.

### సంధివిద్ధలక్షణము

శోథాభివృద్ధిస్తుములారుజశ్చ బలక్షయఃపర్వసుభేదశోథా,
క్షతేషుసంధిష్వచలాచలేషు స్యాత్సర్వకర్మోపరమశ్చలింగమ్. 142

తా. చలనముగాని, లేక అచలనముగాని గలసంధులయందు గాయము దగులుట వలన వాపుగలిగి వృద్ధిజెందుట, మిక్కుటముగ వేదనగలుగుట, సత్వము కొరవడుట, సంధులయందు భేదింపఁబడినటులనే పీడగలుగుట, వాచుట, ఏపనిని జేయుటకు దోఁచ కుండుట-ఈలక్షణములవలన సంధియందు గాయముదగిలినదని తెలియవలయును.

### అస్థివిద్ధలక్షణము

ఘోరారుజోయస్యనిశాదినేషు సర్వాస్వవస్థాసుచనైతిశాంతిం,
భిషగ్విపశ్చిద్విదితార్థసూత్ర స్తమస్థివిద్ధంపురుషం వ్యవస్యేత్. 143

తా. రేయుంబగలు భయంకరమైన పీడగలిగి జాగ్రదాది సర్వావస్థలయందు శాంతిజెందకుండిన వైద్యశాస్త్రవేత్తయగువాఁడు అస్థులయందు గాయముదగిలినదని తెలియవలయును.

### సిరాదిమర్మవిద్ధలక్షణము

యథాస్వమేతానివిభావయేచ్చ లింగానిమర్మస్వభితాడితేషు,

తా. సిరాదిమర్మస్థానములయం దభిఘాతముగలిగిన పూర్వోక్తభ్రమప్రలాపే త్యాదిలక్షణములవలన తెలిసికొనవలయును. మఱియు చకారమువలన ఈలక్షణంబులును, సామాన్యలక్షణంబులును గలుగు నని తెలియందగును.

మాంసమర్మవిద్ధలక్షణము

పాండుర్వివర్ణ స్స్పర్శితంనవేత్తి యోమాంసమర్మస్వభితాడితస్స్యాత్.

తా. పాండురవర్ణము, వైవర్ణ్యము, స్పర్శజ్ఞాన శూన్యతగలవాఁడై యుండిన మాంసమర్మమునందు గాయముగలిగిన దని తెలియవలయును.

సర్వవ్రణోపద్రవములు

విసర్పః పక్షఘాతశ్చ సిరాస్తంభోపతానకః,
మోహోన్మాదవ్రణ రుజా జ్వర స్తృష్ణా హనుగ్రహః. 145
కాస శ్ఛర్ది రతీసారో హిక్కా శ్వాస స్సవేపథుః,
షోడశోపద్రవాః ప్రోక్తా వ్రణానాం వ్రణచింతకైః. 146

తా. విసర్పము, పక్షఘాతము, సిరాస్తంభనము, అపతానకము, మోహము, ఉన్మాదము, వ్రణమునందు పీడ, జ్వరము, దప్పి, * హనుగ్రహము, దగ్గు, వాంతి, అతిసారము, ఎక్కిళ్లు, శ్వాసము, వణఁకు అను పదునారు ఉపద్రవంబులు వ్రణములయందు గలుగునని వ్రణవేత్తలగువారు వచించెదరు.

ఆగంతుకవ్రణచికిత్స

యష్టీమధుకయుక్తేన కించిదుష్ణేన సర్పిషా,
మత్వాగంతువ్రణం వైద్యో ఘృతక్షౌద్రసమన్వితమ్. 147
శక్త్యాక్రియా ప్రయోక్తవ్యా పిత్తరక్తోష్మణా నిశి,

తా. ఆగంతుకవ్రణమునందు అతిమధురచూర్ణమును నేతిలోఁ గలిపి యొకింత యుష్ణముజేసి లేపనము జేయవలయును. మఱియు శక్త్యనుగుణ్యముగ నొకింత పిత్తకర, రక్తశోధనకర, ఉష్ణకరపదార్థములను నెయ్యి, తేనె, అనువానియుక్తముగ జేసి రాత్రులయం దుపచరింపవలయును.

ఆగంతుకవ్రణసామాన్యచికిత్స

బుధ్వాగంతువ్రణం వైద్యో ఘృత క్షౌద్ర సమన్వితామ్. 148
శీతాంక్రియాం చరేదాశు రక్తపిత్తోష్మనాశినీం,

తా. వైద్యుఁడు ఆగంతుకవ్రణలక్షణమును బాగుగ నెఱింగి రక్త, పిత్త, ఉష్ణనాశకర, శీతకరక్రియలను నెయ్యి తేనె అనువానియుక్తముగ జేయవలయును.

క్రుద్ధే సద్యోవ్రణే కుర్యా దూర్ధ్వం చాధశ్చ శోధనమ్. 149
లంఘనం చ బలం జ్ఞాత్వా భోజనంచాస్రమోక్షణం,

---

* హనుగ్రహ మన కటిమర్లుకట్టి కొనుట.

తా. ప్రకోపించియుండు ఆగంతుకవ్రణములయందు వమన, విరేచన, లంఘన, భోజన, రక్తమోక్షణముల వ్రణబలానుగుణ్యముగ జేయించవలయును.

## గౌరాదిఘృతము

గౌరా హరిద్రా మంజిష్ఠా మాంసీ మధుకమేవచ. 150
ప్రపౌండరీకం హ్రీబేరం నతం ముస్తం సచందనం,
జాతీ నింబ పటోలంచ కరంజం కటురోహిణీ. 151
మధూచ్ఛిష్టం మధూకంచ మహామేదా తథైవచ,
పంచవల్కలతోయేన ఘృతప్రస్థం విపాచయేత్. 152
ఏతద్గౌరాదికం సర్పి స్సర్వవ్రణవిశోధనం,
ఆగంతుకాశ్చ సహజా స్సుచిరోత్థాశ్చ యే వ్రణాః. 153
నాడీవ్రణశ్చ విషమో నశ్యంతేవ నసంశయః,

తా. గోరోచనము, పసపు, మంజిష్ఠ, జటామాంసి, అతిమధురము, ప్రపౌండరీకము, కురువేరు, గ్రంథితగరము, తుంగముస్తెలు, చందనము, జాజి, వేప, చేలిపొట్ల, క్రానుగవిత్తులు, కటుకరోహిణి, మైనము, ఇప్ప, మహామేద, పంచవల్కములు-వీనిని దంచి కషాయముగాచి అందొకప్రస్థము నెయ్యిగలిపి ఘృతపక్వముగ గాచి లేపనముజేసిన సర్వవ్రణములు, ఆగంతుకవ్రణములు, సహజవ్రణములు, దీర్ఘకాలముగనుండువ్రణములు, నాడీవ్రణములు, దుష్టవ్రణములు-వీనిని నిస్సంశయముగ హరింపంజేయును.

## జాత్యాదితైలము

జాతీ నింబ పటోలానాం నక్తమాలస్య పల్లవాః. 154
సిక్థకం మధుకం కుష్ఠం ద్వే నిశే కటురోహిణీ,
మంజిష్ఠా పద్మకం లోధ్ర మభయా నీలముత్పలమ్. 155
తుత్థకం శారిబాబీజం నక్తమాలస్యచ క్షిపేత్,
ఏతాని సమభాగాని పిష్ట్వా తైలం విపాచయేత్. 156
విషవ్రణసముత్థేషు స్ఫోటకేషుచ కచ్ఛుషు,
కండూ విసర్పరోగేషు కీటదష్టేషు సర్వథా. 157
సద్యశ్శస్త్రప్రహారేషు దగ్ధవిద్ధక్షతేషుచ,
నఖదంతక్షతే దేహే దుష్టమాంసావఘర్షణే. 158
భక్షణార్థమిదం తైలం హితం శోధనరోపణం,

తా. జాజియాకు, వేపాకు, చేతిపొట్లాకు, క్రానుగాకు, మైనము, అతిమధురము, చెంగల్వకోష్టు, పసపు, మ్రానిపసపు, కటుకరోహిణి, మంజిష్ఠ, పద్మకాష్ఠము, లొద్దుగ, కరక్కాయ, నల్లకలువగడ్డలు, మైలుతుత్థము, సుగంధిపాలవేరు, కానుగవిత్తులు-వీనిని సమభాగములుగ గ్రహించి నూరి కల్కముజేసి అందు తైలముగలిపి చిక్కగగాచి సేవించిన విషమవ్రణము, సర్వస్ఫోటకములు, గజ్జి, దురద, విసర్పము, పురుగుకాటు, శస్త్రప్రహారమువలన తత్కాలమునగలిగిన గాయము, కాలుటవలన గలిగిన గాయము, పొడుచుటవలన గలిగినగాయము, నఖదంతమువలన గలిగినగాయము, శరీరమునందలి దుష్టమాంసమును ఛేదించుటవలన గలిగిన గాయము, ఒరిపిడివలన గలిగిన గాయము పరిశుద్ధమై మాంసపూరితంబయి మానును.

## దూర్వాదితైలము

దూర్వాస్వరస సంసిద్ధం తైలం కంపిల్లకేనవా. 159
దార్వీత్వచశ్చ కల్కేన ప్రధానం వ్రణరోపణం,

తా. గరికరసములోగాని, కంపిల్లరసములోగాని, లేక మ్రానిపసపుపట్టకల్కములోగాని, తైలముగలిపి చిక్కగగాచి లేపనముజేసిన వ్రణము మాని మాంసపూరితంబగును. ఇది శ్రేష్ఠంబయినది.

## ఆమాశయభేదోపచారము

ఆమాశయస్థే రుధిరే వమనం పథ్య ముచ్యతే. 160
పక్వాశయాస్థే దేయంచ విరేచన మసంశయం,

తా. గాయము తగులుటవలన ఆమాశయమునందు రక్తముజేరియుండిన వమనమును, పక్వాశయమునందు రక్తముజేరియుండిన నిస్సంశయముగ విరేచనమును జేయించవలయును.

## విపరీతకమల్లతైలము

సిందూర కుష్ఠ విష హింగు రసోన చిత్ర
బాణాంఘ్రి లాంగలిక కల్కవిపక్వతైలం,
ప్రాసాదమంత్ర హుతహుంకృతతుత్థ ఫేనః
క్లిన్నవ్రణ ప్రశమనో విపరీతమల్లః. 161
ఖడ్గాభిఘాత గురుగండ మహోపదంశ
నాడీవ్రణవ్రణ విచర్చిక కుష్ఠ పామాః,
ఏతాన్నిహంతి విపరీతకమల్లనామ
తైలం యథేష్టశయనాసనభోజనస్య. 162

తా. సిందూరము, చెంగల్వకోష్టు, నాభి, ఇంగువ, వెల్లుల్లిపాయలు, చిత్రమూ

లము, తెల్లవెంపలి, చెన్నచర్లగడ్డ, హరిదళము, మైలుతుత్థము, పేలాలు, నల్లమందు-వీనిలో తైలముగలిపి కాచి వ్రణములయందు లేపనముజేసిన స్రావముగల వ్రణముల శమింపంజేయును. మఱియు విపరీతమల్లకమను నీతైలలేపనమువలన కత్తిగాయము, పెద్ద గంటులు, భయంకరమైన ఉపదంశము, నాడీవ్రణములు, వ్రణము, విచర్చిక, కుష్టువు, గజ్జి హరించును. దీనియందు పథ్యనియమములు లేవు.

## సప్తవింశతిగుగ్గులము

త్రికటు త్రిఫలా ముస్తా విడంగామృత చిత్రకం,
పటోలం పిప్పలీమూలం హపుషా సురదారుచ. 163
తుంబురుం పుష్కరం చవ్య విశాలా రజనీద్వయం,
బిడం సౌవర్చల క్షారం సైంధవం గజపిప్పలీ. 164
యావంత్యేతాని సర్వాణి తావ ద్విగుణగుగ్గులుః,
కోలప్రమాణాం వటికాం భక్షయే న్మధునాసహ. 165
కాసం శ్వాసం తథా శోఫ మర్శాంసిచ భగందరం,
హృచ్ఛూలం పార్శ్వశూలంచ కుక్షి వస్తి గుదే రుజమ్. 166
అశ్మరీం మూత్రకృచ్ఛ్రంచ హ్యాంత్రవృద్ధిం తథా క్రిమీన్,
చిరజ్వరోపసృష్టానాం క్షతోపహతచేతసామ్. 167
ఆనాహంచ తథోన్మాదం సర్వకుష్ఠోదరాణిచ,
నాడీదుష్టవ్రణా న్సర్వాన్ ప్రమేహాన్ శ్లీపదం తథా. 168
ధన్వంతరకృతో హ్యేష స్సర్వరోగనిషూదనః,
సప్తవింశతికో నామ గుగ్గులుః ప్రథితో మహాన్. 169

తా. త్రికటుకములు, త్రిఫలములు, తుంగముస్తెలు, వాయువిడంగములు, శుద్ధిజేసిననాభి, చిత్రమూలము, చేతిపొట్ల, మోడి, బోడతరము, దేవదారు, ధనియాలు, పుష్కరమూలము, చవ్యము, వెఱ్ఱిపుచ్చ, పసపు, మ్రానిపసపు, బిడాలవణము, సౌవర్చలవణము, సర్జక్షారము, యవక్షారము, సైంధవలవణము, ఏనుగుపిప్పలి-వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దానికి రెండింతలు శుద్ధిజేసిన గుగ్గిలమునుగలిపి, మర్దించి రేగుగింజంత మాత్రలుజేసి తేనెతో సేవించిన దగ్గు, ఉబ్బసము, వాపు, మూలవ్యాధి, భగందరము, ఱొమ్మునొప్పి, పార్శ్వశూల, లోకడుపు పొత్తికడుపు గుదము అనువానియందలిశూల, అశ్మరి, మూత్రకృఛ్రము, ఆంత్రవృద్ధి, క్రిములు, పురాణజ్వరము, గాయము, కడుపుబ్బరము, ఉన్మాదము, సర్వకుష్టువులు, సర్వోదరములు, దుష్టనాడీవ్రణములు, ప్రమేహము, శ్లీపదము వీనిని హరింపంజేయును. ఇది సర్వరోగవినాశనార్థంబై ధన్వంతరిచే జెప్పంబడియెను. ఇది కడు శ్రేష్ఠంబయినది.

## * నాడీవ్రణ నిదానము

యశ్శోథ మామ మతిపక్వ ముపేక్షతేఽజ్ఞో
యోవావ్రణం ప్రచురపూయ మసాధువృత్తః,
అభ్యంతరం ప్రవిశతి ప్రవిదార్య తస్య
స్థానాని పూర్వవిహితాని తతస్సపూయః. 170
తస్యాతిమాత్రగమనాద్గతిరిష్యతేతు
నాడీవయద్వహతి తేనమతాతునాడీ. 171

తా. మూర్ఖమనుజుఁడు పుండినవాపు నపక్వ మని యెఱింగి యుపేక్షించుటవలన గాని, లేక చీము నిండియుండు వ్రణము నుపేక్షించుటవలనగాని దానియందు చీము పూర్వోక్త త్వఙ్మాంసాదికస్థానములం జెంది భేదించి మిక్కుటముగ లోని కేగుటవలన ఏక మార్గముగలదై దానివలన చీము నాడివలె గారుచుండిన నాడీవ్రణ మనంబడును.

## నాడీవ్రణభేదములు

దోషైస్త్రిభిర్భవతిసాపృథగేకశశ్చసంమూర్ఛితైరపిచశల్యనిమిత్తతోన్యా,

తా. నాడీవ్రణము వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, శల్యజములన నైదు విధంబులు.

## వాతనాడీవ్రణలక్షణము

తత్రానిలాత్పరుషసూక్ష్మముఖీసశూలా ఫేనానువిద్ధమధికంస్రవతిక్షపాసు.

తా. ముఖము రూక్షముగ, సన్నగనుండుట, శూలగలుగుట, రాత్రులయందు నుఱుగుతోఁగూడినస్రావము మిక్కుటముగ గలుగుట-ఈలక్షణములు గలది వాతనాడీ వ్రణమని తెలియవలయును.

## పిత్తనాడీవ్రణలక్షణము

పిత్తాత్తుతృడ్జ్వరకరీపరిదాహయుక్తాపీతంస్రవత్యధికముష్ణమహస్సుచాపి,

తా. దప్పి, జ్వరము, దాహముగలుగుట, చీము పసుపువర్ణము, ఉష్ణముగలదై పగటియందధికముగ స్రవించుట-ఈలక్షణములుగలది పిత్తనాడీవ్రణమని తెలియవలయును.

## కఫజనాడీవ్రణలక్షణము

జ్ఞేయా కఫా ద్బహుఘనార్జున పిచ్ఛిలాస్రా,
స్తబ్ధా సకండురుజా రజనీప్రవృద్ధా. 173

తా. చీము గట్టిగ, తెల్లగ, బంకగ వెడలుట, జడముగనుండుట, దురద, పీడ

* నాడీవ్రణ మన నారికురుపు.

గలుగుట, రాత్రులయం దధికముగ చీముస్రవించుట - ఈలక్షణములుగలది శ్లేష్మజ నాడీవ్రణమని తెలియవలయును.

—∞ శల్యజనాడీవ్రణలక్షణము ∞—

నష్టంకథంచిదనుమార్గముదీరితేషు స్థానేషుశల్యమచిరేణగతింకరోతి,
సాఫేనిలంమథితముష్ణమసృగ్విమిశ్రం స్రావంకరోతిసహసాసరుజంచ
నిత్యమ్. 174

తా. కంటకాదిశల్యములు చర్మము మొదలగువానియందు ప్రవేశించి యగుపడక నియమములైన వేగక్షయాదికారణరహితంబులై సూక్ష్మమార్గముగలవై శల్యజవ్రణమును గలుగంజేయును. దానియందు స్రావము నుఱుగుగ, వేడిగ, రక్తయుక్తముగ వెడలుటయే గాక మథించఁబడినటుల పోట్లును గలిగియుండును.

—∞ సన్నిపాతజనాడీవ్రణలక్షణము ∞—

దాహ జ్వర శ్వసన మూర్ఛన వక్త్రశోషా
యస్యాం భవంతి విహితానిచ లక్షణాని,
తామాదిశే త్పవనపిత్తకఫప్రకోపా
ద్ఘోరా మసుక్షయకరీమివ కాళరాత్రిమ్. 175

తా. దాహము, జ్వరము, శ్వాసము, మూర్ఛ, నోరెండుట అనులక్షణంబులును, పూర్వోక్తవాత, పిత్త, కఫప్రకోపమువలన గలిగెడి లక్షణంబులును గూడియుండిన సన్నిపాతజనాడీవ్రణమని తెలియవలయును. ఇది భయంకరమై ప్రాణముల హరింపం జేయుట యందు కాళరాత్రితో సమానంబైయుండును.

—∞ నాడీవ్రణసాధ్యాసాధ్యలక్షణము ∞—

నాడీత్రిదోషప్రభవానసిధ్యే చ్ఛేషాశ్చతస్రఃఖలు యత్నసాధ్యాః.

తా. సన్నిపాతజనాడీవ్రణం బసాధ్యము. తక్కినవి నాలుగును యత్నమువలన సాధ్యంబులగును.

—∞ నాడీవ్రణసామాన్యచికిత్స ∞—

నాడీనాం గతి మన్వీక్ష్య శస్త్రేణోత్పాట్య కర్మవిత్,
సర్వవ్రణక్రమం కుర్యా చ్ఛోధనారోపణాదికమ్. 177
కృశ దుర్బల భీరూణాం నాడీమర్మాశ్రితాతుయా,
క్షారమాత్రేణ సంఛిద్యా న్నశస్త్రేణ కదాచన. 178

తా. బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు నాడిగతినెఱింగి శస్త్రముచే దానింజీల్చి సర్వవ్రణములయందు జేయునటులనే శోధన, రోపణాదిక్రియలం జేయవలయును. మఱియు కృశత్వము, సత్వహాని, భయముగలవారలకు జనించిన నాడీవ్రణమును, మర్మ

స్థలములయందు జనించిన నాడీవ్రణమును, క్షారమువలన ఛేదనము జేయవలయునేగాని శస్త్రమువలన నెపుడును ఛేదనము జేయం జనదు.

వాతనాడీవ్రణచికిత్సాక్రమము

నాడీం వాతకృతాం సాధు పాటితాం లేఖయే ద్భిషక్,
ప్రత్యక్పుష్పీఫలయుతై స్తిలైః పిష్టైః ప్రలేపయేత్. 179

తా. వాతనాడీవ్రణమును శస్త్రముతో జీల్చి లేఖనక్రియంజేసి దానిపై తెల్లయుత్తరేణువిత్తులను, నువ్వులను నూరి లేపనము జేయవలయును.

పిత్తజనాడీవ్రణశూలకు తిలాదిలేపము

పైత్తికం తిల మంజిష్ఠా నాగదంతీ నిశాహ్వయైః,

తా. పిత్తజనాడీవ్రణమునందు నువ్వులు, మంజిష్ఠ, నాగదంతి, పసపు - వీనిని నూరి లేపనము సేయవలయును.

కఫజనాడీవ్రణమునకు తిలాదిలేపము

శ్లైష్మికం తిల యష్ట్యాహ్వానికుంభారిష్ట సైంధవైః. 180

తా. కఫజనాడీవ్రణమునందు నువ్వులు, అతిమధురము, నాగదంతి, వేప సైంధవలవణము - వీనిని నూరి లేపనము సేయవలయును.

శల్యనాడీవ్రణమునకు తిలాదిలేపము

శల్యజాం తిల మంజిష్ఠా మధ్వాజ్యైః ర్లేపయే న్మహుః,

తా. శల్యనాడీవ్రణమునందు నువ్వులు, మంజిష్ఠ వీనిని తేనె, నేతితో నూరిపలుమారు లేపనము సేయవలయును.

నాడీవ్రణచికిత్స

ఆదౌ భగ్నం విదిత్వాతు సేచయే చ్ఛీతవారిణా. 181
పంకేనా లేపనం కార్యం బంధనంచ కుశాన్వితం,
ఆలేపనార్థం మంజిష్ఠా మధుకం చామ్లపేషితమ్. 182
శతధౌత ఘృతోన్మిశ్రం శాలిపిష్టంచ లేపనం,
నాడీనాం గతిమన్వీక్ష్య శస్త్రేణోత్పాట్య కర్మవిత్. 183

తా. అభిఘాతాదికములవలన యెముకలు విఱిగిన దానిపై తొలుత శీతోదకమును పోసి తదనంతరము శస్త్రాదికములతో సిరలకపాయము గలుగకుండునటుల శరీరమున గ్రుచ్చికొనియుండు శల్యముల యుక్తితో దీసి దానిపై ఎఱ్ఱమన్నును బూసి దర్భల నునిచి

కట్టుగట్టి పిదప మంజిష్ఠను, అతిమధురమును నిమ్మపండ్లరసముతోనూరి లేపనముజేసి పిదప నూరుమార్లు కడుగఁబడిన నేతిలో బియ్యపు పిండిని గలిపి లేపనము జేయవలయును.

## జాత్యాదివర్తి

జాత్యర్క-శమ్యాకకరంజదంతీ సింధూత్థసౌవర్చలయావశూకైః,
వర్తిఃకృతాహంత్యచిరేణనాడీంస్నుక్షీరపిష్టాసహసైంధవేన. 184

తా. జాజి, జిల్లేడు, రేల, క్రానుగ, దంతివేరు, సైంధవలవణము, సౌవర్చలవణము, యవక్షారము - వీని నుదకముతోనూరి వస్త్రమునకు బట్టించి వర్తిజేసిగాని, లేక జెముడు పాలతో సైంధవలవణమునునూరివర్తిజేసిగాని వ్రణమునం దునిచిన నాడీవ్రణము శీఘ్రముగ హరించును.

## నిర్గుండీతైలము

సమూలపత్రాం నిర్గుండీం పీడయిత్వా రసేనతు,
తేన సిద్ధం సమంతైలం నాడీదుష్టవ్రణాపహమ్. 185

తా. వావిలిసమూలమును దంచి రసముదీసి దానికి సమముగ నూనె గలిపి తైలపక్వముగకాచి లేపనముచేసిన దుష్టనాడీవ్రణము హరించును.

## నరాస్థితైలము

నరాస్థితైలలేపేన స్ఫుటిత శ్శుష్యతి వ్రణః,

తా. మనుజునియొక్క-యెముకలనూనెను లేపనముజేసిన వ్రణము పగిలి యెండును.

## విడంగాదిగుగ్గులు

విడంగ త్రిఫలా వ్యోష చూర్ణం గుగ్గులునాసమమ్. 186
సర్పిషా వటికాం కుర్యా త్ఖాదేద్వాహితభోజనః,
దుష్టవ్రణాపచీ మేహ కుష్ఠ నాడీ విశోధనః. 187

తా. వాయువిడంగములు, త్రిఫలములు, త్రికటుకములు-వీనిని చూర్ణముజేసి దీనికిసమముగ శుద్ధిజేసిన గుగ్గిలమునుగలిపి నేతితో మర్దించి యుంటలుచేసి సేవించిన దుష్టవ్రణము, అపచి, మేహము, కుష్ఠువు, నాడీవ్రణము హరించును. దీనియందు చప్పిడి పథ్యము నాచరింపవలయును.

## ఆరగ్వధాదివర్తి

ఆరగ్వధ నిశా కోల చూర్ణాజ్య క్షౌద్రసంయుతా,
సూత్రవర్తిర్వ్రణేయోజ్యా శోధనీగతినాశినీ. 188

తా. రేల, పసపు, రేగుకాయ వీనిని చూర్ణముచేసి నెయ్యి, తేనె గలిపి దానిలో నూలుతోపేడినవర్తిని తడిపి వ్రణములో నునిచిన వ్రణశుద్ధంబై దానిగతిహరించును,

## గుగ్గుల్వాది లేపము

గుగ్గులు స్త్రిఫలా వ్యోషై స్సమాంశై శ్చాజ్యయోజితః,
నాడీదుష్టవ్రణంచాపి జయేదపి భగందరమ్. 189

తా. శుద్ధిజేసిన మహిసాక్షిగుగ్గిలము, త్రిఫలములు, త్రికటుకములు-వీనిని సమ భాగములుగ ఖల్వములో నునిచి నేతితో నూరి లేపనముజేసిన దుష్టనాడీవ్రణమును, భగందరమును హరింపంజేయును.

## సర్వవ్రణములయందు పథ్యము

యవషష్టిక గోధూమ పురాణాసితశాలయః,
మసూర తువరీ ముద్గయూషశ్చ మధు శర్కరః. 190
విలేపీ లాజమండశ్చ జాంగలా మృగపక్షిణః,
ఘృతం తైలం పటోలంచ వేత్రాగ్రం బాలమూలకమ్. 191
వార్తాకం కారవేల్లంచ కర్కోటీ తండులీయకం,
ఏతత్పథ్యం నరై స్సేవ్యం యథావస్థయథామలమ్. 192
వ్రణశోధే వ్రణే సద్యోవ్రణే నాడీవ్రణేషుచ,

తా. యవలు, ౬౦ దినములకు ఫలించినవడ్లబియ్యము, గోధుమలు, నల్లనిప్రాత బియ్యము, చిఱుసెనగలు, కందులు, పెసలు అనువాని యూషము, తేనె, పంచదార, విలేపి, పేలాలయొక్కమండము, జాంగలదేశములోని పశుపక్షిమాంసము, నెయ్యి, నూనె, పొట్లకాయ, వెదురుమొలక, లేతముల్లంగి, వంకాయ, కాకరకాయ, ఆకాకర కాయ, చిఱ్ఱికూర-ఇవి వ్రణశోధనము, వ్రణము, సద్యోవ్రణము, నాడీవ్రణము అను వానియందు పథ్యకరంబులు. అట్లగుటంజేసి వాని నామయారోగావస్థాభేదముల, దోషభేద ముల నెఱింగి యథాయోగ్యముగ పథ్యమునం దునిచికొనవలయును.

## వ్రణములయం దపథ్యము

రూక్షామ్లశీతంలవణంవ్యవాయ మాయాసముచ్చైఃపరిభాషణంచ,
స్త్రియాసమాలోకనమహ్నినిద్రాం ప్రజాగరంచంక్రమణంనితాంతమ్.
శోకంవిరుద్ధాశనమంబుపానం తాంబూలశాకానిచపత్రవంతి,
అజాంగలం మాంసమసాత్మ్యమన్నంవివర్జయే త్తంసతతంప్రయత్నాత్.

తా. రూక్షము, పులుసు, శీతలము, ఉప్పుగలరసములు, మైథునము, శ్రమ, బిగ్గరగ మాటలాడుట, స్త్రీలంజూచుట, పగటినిద్ర, రాత్రులయందు జాగరణము, కడు సంచారము, శోకము, విరుద్ధాశనము, ఉదకపానము, విడెము, ఆకుకూరలు, జలచర

జంతుమాంసము, శరీరప్రకృతి కననుగుణముగానియన్నము-ఇవియన్నియు వ్రణములయం దపథ్యకరంబులగుటచే వానిని ప్రయత్నపూర్వకముగ వర్జింపవలయును.

## అగ్నిదగ్ధవ్రణనిదానము

వాక్యమ్. తత్ర స్నిగ్ధం రూక్షం వాశ్రిత్య ద్రవ్య మగ్నిర్దహతి,అగ్నిసం తప్తోహి స్నేహః సూక్ష్మమార్గానుసారిత్వాత్, త్వగాదీ ననుప్రవిశ్యాశు దహతి, తస్మాత్స్నేహ దగ్ధేంఽధికారుజో భవంతి,తత్రప్లుష్టం దుర్దగ్ధం సమ్యగ్దగ్ధ మతిదగ్ధంచేతి చతుర్విధం భవత్యగ్నిదగ్ధమ్. 195

తా. అగ్నిస్నిగ్ధ, రూక్షద్రవ్యాశ్రితంబై దహనముసేయును. మఱియుఅగ్నిచే తపింపఁబడినతైలము సూక్ష్మమార్గములవలన (అనఁగా రోమకూపములవలన) త్వఙ్మాంసాది సప్తధాతువులయందు ప్రవేశించి శీఘ్రముగ దహింపఁజేయును. కావున స్నేహదగ్ధమున అధికమైన వేదనలుగలుగును. ఆయగ్నిదగ్ధముప్లుష్టము, దుర్దగ్ధము, సమ్యగ్దగ్ధము, అతిదగ్ధము అని నాలుగు విధంబులు.

## విశేషజ్ఞానము

వాక్యమ్. తత్ర వివర్ణమాత్ర ప్లుష్యతే తత్ ప్లుష్టమ్, యత్రోత్తిష్ఠంతి స్ఫోటా స్తీవ్రదాహవేదనా శ్చిరాచ్చోపశామ్యంతి తద్దుర్దగ్ధమ్, సమ్యగ్దగ్ధ మవగాఢం తాళఫలవర్ణం సుస్థితం పూర్వలక్షణయుక్తం, అతిదగ్ధంతు త్వఙ్మాంసావలంబన గాత్రవిశ్లేషణ సిరా స్నాయు సంధ్యస్థి వ్యాపాదేనాతిమాత్ర వేదనా జ్వరదాహపిపాసామూర్ఛా శ్వాసోపద్రవాభవంతి, ఇతిప్లుష్టాదిభేదేన వహ్నిదగ్ధశ్చతుర్విధో వ్రణో భవతి. 196

తా. అందు చర్మము వివర్ణంబగునట్లు కాలిన ప్లుష్టమనియు, కాలినదానిపై బొబ్బలుగలిగి తీవ్రదాహవేదనాయుక్తంబై దీర్ఘ కాలముమీఁద శాంతిజెందిన దుర్దగ్ధమనియు, లోతైన మూలముగలదై తాటిపండుతో తుల్యమైనవర్ణముగలదై బొబ్బలతో వ్యాప్తంబై కడుదాహవేదనాయుక్తంబై యుండిన సమ్యగ్దగ్ధమనియు, చర్మమాంసముల దహింపంజేయుటచే వాని నూడునటులంజేసి సిరలు, స్నాయువులు, సంధులు, అస్థులు అనువానింజెఱచి కడువేదనను, జ్వరమును, మంటను, దప్పిని, మూర్ఛను, శ్వాసమును గలుగంజేసిన అతిదగ్ధమనియు తెలియవలయును. ఈభేదములవలన అగ్నిదగ్ధవ్రణము నాలుగువిధంబులు.

## అగ్నిదగ్ధవ్రణచికిత్స

ప్లుష్టస్యాగ్ని ప్రశమనే కార్యముష్ణం తథౌషధం,

శీతాముష్ణాం చ దుర్దగ్ధే క్రియాం కుర్యా త్తతఃపునః. 197
ఘృతాలేపనసేకాంస్తు శీతాన్యేవాస్యకారయేత్,
అతిదగ్ధే విశీర్ణాని మాంసాన్యుద్ధృత్య శీతలామ్. 198
క్రియాం కుర్యాచ్ఛ తాం కాలే శాలితండులకండనైః,
తిందుక్యాశ్చ కషాయైర్వా ఘృతమిశ్రైః ప్రలేపయేత్. 199
సమ్యగ్దగ్ధేతుగాక్షీరి ప్లక్షచందన గైరికైః,
సామంతైః సర్పిషాయుక్తై రాలేపం కారయేద్భిషక్. 200

తా. ప్లుష్టాగ్నిశమనార్థమై ఉష్ణకరౌషధముల లేపనముసేయవలయును. దుర్దగ్ధమున శీతకరక్రియలనుగాని, లేక ఉష్ణకరక్రియలనుగాని జేసి తదనంతరము ఘృతాదులయొక్క లేపనము, సేచనము మొదలగు శీతకరక్రియలను జేయవలయును. అతిదగ్ధమున శిథిలంబై వ్రేలుచుండు మాంసమును ఛేదించి శీతకరక్రియలను, వరిబియ్యపుపిండిని నల్లతుమికపట్టకషాయముతోడంజేర్చి నేతినిగలిపి లేపనమును జేయవలయును. సమ్యగ్దగ్ధమున వెదురుప్పు, మఱ్ఱి, చందనము, కావిరాయి, తిప్పతీఁగె అనువానికల్కములో నెయ్యిగలిపి కాచి లేపనము సేయవలయును.

### పథ్యాదిలేపము

పథ్యా కర్దమ జీరక మధు సిక్థక సర్జ మిశ్రితో లేపః,
గవ్యం ఘృత మపహరతిచ పావకజనితం వ్రణం సద్యః. 201

తా. కరక్కాయ, బురద, జీలకఱ్ఱ, అతిమధురము, మైనము, గుగ్గిలము - వీనిని నూరిగాని, లేక ఆవునేతినిగాని లేపనము జేసిన అగ్నిదగ్ధవ్రణము శమించును.

### సుధాదిలేపము

సుధాం పురాతనీం దధ్నోవారిణా పరివేషితాం,
లేపనం తైలదగ్ధస్య విస్ఫోటవ్యాధినాశనమ్. 202

తా. ప్రాతసున్నమును పెరుగుమీఁది తేటనీటితో నూరి లేపనముజేసిన వేడినూనెవలన గలిగిన బొబ్బలు మానును.

### దగ్ధయవచూర్ణము

దగ్ధయవభస్మచూర్ణం తిలతైలాక్తం ప్రలేపనాదచిరాత్,
హరతి శిఖిదాహదగ్ధం భూయోఽభ్యంగాద్వ్రణంచాశు. 203

తా. యవలనుగాల్చి మసిజేసి నువ్వులనూనెలోఁగలిపి పలుమారు లేపనముజేసిన అగ్నిదగ్ధవ్రణము శీఘ్రముగ మానును.

### చందనాది తైలము

చందనం వటశృంగాశ్చ మంజిష్ఠా మధుకం తథా,
ప్రపౌండరీకం దుర్వాచ పతంగం ధాతకీ తథా. 204
ఏతైస్తైలం విపక్తవ్యం గోక్షీరేణ సమాయుతం,
అగ్నిదగ్ధే వ్రణేశ్రేష్ఠం తత్క్షణాద్రోపణం పరమ్. 205

తా. చందనము, మఱ్ఱియూడకొనలు, మంజిష్ఠ, అతిమధురము, ప్రపౌండరీకము, గరిక, రసకర్పూరము, ఆరెపువ్వు అనువానికల్కములో ఆవుపాలు, నూనె కలిపి చిక్కగ తైలముకాచి లేపనముజేసిన అగ్నిదగ్ధవ్రణము తత్క్షణమున మాంసపూరితంబై మానును.

### పటోలాది తైలము

సిద్ధం కషాయ కల్కాభ్యాం పటోల్యాః కటుతైలకం,
దగ్ధవ్రణరుజా స్రావ దాహ విస్ఫోటనాశనమ్. 206

తా. చేతిపొట్లకషాయములోగాని, లేక దానికల్కములోగాని తెల్లావనూనెను గలిపి చిక్కగకాచి లేపనముజేసిన అగ్నిదగ్ధవ్రణమునందలిపీడ, స్రావము, మంటలు, బొబ్బలు వీనిని హరింపంజేయును.

### మధూచ్ఛిష్టాది తైలము

మధూచ్ఛిష్టం సమధుకం లోధ్రం సర్జరసం తథా,
మూర్వా చందన మంజిష్ఠం పిష్ట్వా సర్పిర్విపాచయేత్. 207
సర్వేషా మగ్నిదగ్ధానాం వ్రణరోపణముత్తమం,

తా. మైనము, అతిమధురము, లొద్దుగ, గుగ్గిలము, గరిక, చందనము, మంజిష్ఠ అనువానికల్కములో నెయ్యిగలిపి చిక్కగకాచి లేపనముజేసిన అగ్నిదగ్ధవ్రణములన్నియు మాంసపూరితంబులై మానును.

### లూతవ్రణలక్షణము

భ్రమ శ్వాస జ్వరం దాహం మూర్ఛా ఘూర్ణం సకంపనమ్. 208
శూలం దృష్టి ర్మహారౌద్రం లూతాః కుర్వంతి దేహినాం,
(మాధవనిదానే)

తా. భ్రమ, ఉబ్బసము, జ్వరము, దాహము, మూర్ఛగలుగుట, ఒడలుదిరుగుట, శరీరమువణకుట, శూల, కడుభయంకరమైన దృష్టిగలుగుట-ఈలక్షణములుగలది లూతవ్రణమని తెలియవలయును. (దీనియందు వాత, పైత్త, శ్లేష్మ, త్రిదోషభేదంబులుగలిగియుండును.)

## త్రిదోషజలూతలక్షణము

భ్రువోర్మధ్యే గళే హస్తే స్తనే కంఠేచ మూర్ధని 209
హృది పృష్ఠే మర్మణీచ లూతస్స్యాత్తు త్రిదోషజః,
అసాధ్యా కష్టసాధ్యావా జ్ఞాత్వా వైద్యఉపాచరేత్. 210

తా. కనుబొమలయొక్క మధ్యప్రదేశము, గళము, హస్తములు, స్తనములు, కంఠము, శిరము, హృదయము, వీపు అను మర్మస్థలములయందు వ్రణములు జనించిన త్రిదోషలూతయని దెలియవలయును. వీనియొక్క అసాధ్య, కష్టసాధ్యముల నెఱింగి వైద్యుఁడు చికిత్సింపవలయును.

## అసాధ్యలూతలక్షణము

పక్వజంబూఫలాకారం తథారక్తం ప్రవేద్యది,
దంతోష్ఠం శ్యామలం యస్య లూతదోషీ న జీవతి. 211
తథాపి తస్య కర్తవ్యా చికిత్సా జీవితావధి,

తా. నేరేడుపండువర్ణముగలదై రక్తమును గార్చుచు దంతములు, పెదవి నల్లనై యుండిన అట్టిలూతరోగి మృతిచెందునని తెలియవలయును. ఐనను జీవించి యుండు వఱకు చికిత్సంజేయవలయును.

## వాతలూతచికిత్స

ఉత్పలం చందనం కుష్ఠం జీవంతీం శుంఠి పాటలామ్. 212
మదనం బిల్వ నిర్గుండీ దమనం బ్రహ్మదండికాం,
నఖంచ తగరంచైవ వేతసం వరుణం తథా. 213
జలే పిష్ట్వా ప్రలేపోఽయంవాతలూతనివారణం, (మాధవనిదానే)

తా. నల్లకలువ, శ్రీగంధము, చెంగల్వకోష్టు, మనుబాల, శొంఠి, కలిగొట్టు, మ్రంగవేరు, మారేడు, వావిలి, దవనము, బ్రహ్మదండి, నఖము, గ్రంథితగరము, ప్రబ్బలి, ఉలిమిడి - వీనిని సమభాగములుగ నుదకముతో నూరి లేపనముజేసిన వాతలూతవ్రణము హరించును.

## వాతలూతకు లాంగల్యాదిలేపము

లాంగలీ భానుమూలంచ గ్రహధూమాజమూత్రకమ్. 214
దుత్తూరస్యఫలే క్షిప్త్వా లేపోలూపవినాశకృత్,

తా. చన్నచర్లగడ్డ, జిల్లేడువేరు, కరుధూపము - వీనిని మేకపంచితముతో నూరి ఉమ్మెత్తకాయలోనునిచి పుటంబిడి నూరి లేపనముజేసిన వాతలూతవ్రణము మానును.

## పైత్తలూతచందనాదిలేపము

చందనం చోత్పలం ముస్తాం లాంగలీం శుంఠి రేణుకామ్. 215
వాలుకం మధుయష్టీంచ కుసుంభవల్కలాన్వితం,
తుల్యం పిష్ట్వా జలై ర్లేపః పిత్తలూతప్రశాంతయే. (ఆయుర్వేదే)

తా. చందనము, నల్లకలువదుంపలు, తుంగముస్తెలు, చన్నచర్లగడ్డ, శొంఠి, రేణుకలు, కూతురుబుడమ, యష్టిమధుకము, కుసుంబపట్ట-వీనిని సమభాగములుగ నుదకముతో నూరి లేపనముజేసిన పైత్తలూతవ్రణము మానును.

## శ్లేష్మలూతకు శ్లేష్మాటకాదిలేపము

శ్లేష్మాట శారిబా ముస్తా వరుణం నాగపుష్పికాం,
వహ్నిం పాటల పాఠాశ్చ పలం వంశత్వచం సమమ్. 217
జలైః పిష్ట్వా ప్రలేపోఽయం కఫలూతప్రశాంతయే, (చరకే)

తా. విరిగిచెక్క, గూడపాల, తుంగముస్తెలు, ఉలిమిడి, నాగసంపంగి, చిత్రమూలము, కలిగొట్టు, చిరుబొద్ది - వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి సముగ వెదురుపీచుగలిపి ఉష్ణోదకముతోనూరి లేపనముజేసిన శ్లేష్మలూతవ్రణముమానును.

## త్రిదోషజలూతకు మదనాదిలేపము

మలం కౌక్కుట పారావం హింగూ మదన తాళకమ్. 218
వంశత్వ గ్గిరకర్ణీంచ రేణుకంచ మనశ్శిలాం,
జలే పిష్ట్వా ప్రలేపోఽయం లూతం హంతి త్రిదోషజమ్. 219

తా. కోడివిష్ఠము, పావురపిట్టవిష్ఠము, ఇంగువ, మ్రంగవేరు, హరిదళము, వెదురుపీచు, తెల్లగంటెన, రేణుకలు, మణిశిల - వీనిని సమభాగములుగ నుష్ణోదకముతోనూరి లేపనముజేసిన త్రిదోషలూతవ్రణము మానును.

## జ్యోతిష్మతీలేపము

జ్యోతిష్మతీంచ కర్కోటీపల్లవం పేషయే జ్జలైః,
లేపోలూతా న్నిహంత్యాశు సప్తరాత్రై ర్నసంశయః. 220

తా. వెక్కుడుతీగె, డావరడంగిఓగుళ్ళు, లేక చేతిబీరచిగుళ్లు - వీని నుష్ణోదకముతోనూరి ౭ దినములు లేపనముజేసిన త్రిదోషలూతవ్రణము నిస్సంశయముగ శీఘ్రముగ మానును.

## సర్పాక్షీలేపము

నరమూత్రేణ సర్పాక్షీం పిష్ట్వా లేపంతు కారయేత్,
అసాధ్యాం సాదయేల్లూతాం త్రిదోషోత్థా వినిర్దిశేత్. 221

తా. సర్పాక్షీమూలమును నరమూత్రముతో నూరి లేపనము జేసిన అసాధ్యమైన త్రిదోషలూతవ్రణము మానును.

### గోజిహ్వాదిలేపము

గోజిహ్వాపల్లవాః పాఠా మూలం తోయేన పేషయేత్,
లేపేన నాశయే ల్లూత మసాధ్యాం విషజిహ్వాలామ్. 222

తా. బరివెంకచిగుళ్లు, శిరుబొద్దివేరు వీని నుష్ణోదకముతో నూరి లేపనము జేసిన అసాధ్యమైన త్రిదోషలూతవ్రణము, విషజిహ్వాక మానును.

(జాజికాయ, జాపత్రి, పిప్పలి, మోడి, లవంగములు, కాంచు, ఓమము, ఖురాసానిఓమము-వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ఒకతులము రసకర్పూరము గలిపి ఉష్ణోదకముతో మర్దించి రెండువీసములయెత్తు రసకర్పూరము తూగునటులమాత్రలుజేసి రెండుమండలములు ప్రాతస్సాయంకాలముల నొక్కొక్క-మాత్రచొప్పున ఆవునేతితో సేవించిన సర్వలూతవ్రణములు, భగందరము, గండమాల, మేహవ్రణములు మొదలగు సర్వవ్రణములు హరించును. ఈయౌషధ సేవనకాలంబున చప్పిడివంటకమును భుజింపవలయును. మఱియు భగందరవ్రణనివారణార్థంబై చెప్పంబడియుండు రవితాండవరసమును, కాలాగ్నిరుద్రరసమును, రసకర్పూరమును లూతవ్రణములయందును ప్రయోగింపందగును.)

(ఓం నమో భగవతే రుద్రాయ-ఓం సురామహద్విషమదనివహ హుంసురసుర అప్పహే నేలిక ప్రచసూదహనూపచమాను రహణాంస్వాహా. అనుమంత్రముతో లూతవ్రణములను మంత్రింపవలయును. మఱియు సర్వౌషధముల నొసంగునపుడామంత్రముసే పఠింపవలయును.)

### భుజపత్రబంధము

కుంకుమం చందనం క్షీరైః పిష్ట్వా మంత్రమిదం లిఖేత్,
భూర్జపత్రేచ తద్ధార్యం గళేవా బాహుమూలకే. 223
లూతాః హంతి న సందేహో బంధయే చ్ఛ్వేతసూత్రకైః,
(మాధవనిదానే)

తా. కుంకుమ, శ్రీగంధము-వీనిని పాలతోనూరి భుజపత్రపామపై పైఁజెప్పఁబడినమంత్రమునువ్రాసి దానిని మడిచి తెల్లదారమున బంధించి మెడయందుగాని, లేక సందిటియందుగాని గట్టికొనిన సర్వలూతవ్రణములు నిస్సంశయముగ హరించును.

## *చల్దిచికిత్స

క. మురదారుసింగు వెన్నయు, సరవిగ మర్దించి వేడ్కఁ జయ్యన ధరణి
న్నరులకుఁబ్రామినయప్పుడె,సురుచిరముగమానుమురికిసొన్నరులెల్లన్.
క. ఆవొండవేపు గంధము, పాదుగ నావాలముద్ద భక్షణసేయఁగా
వేదేశునికృపచేతను, నాదము లేనట్టికప్పునాగుగమానున్.

## మర్కటీరోగోత్పత్తి

దేవేషు ధావమానేషు హ్యంధకాసురసంయుగే. 224
రుద్రకోపానలోత్పన్నా మర్కట్యా వేదనోత్కటాః,

(నిత్యనాథీయే)

తా. తొల్లి దేవతలు అంధకాసురునితో యుద్ధముజేసినపుడు పరాజితులైనందున రుద్రకోపాగ్నివలన అత్యుత్పాతమైన వేదనగల మర్కటీరోగములు జనించెను. అవెవ్వి యనిన.—

## మర్కటీరోగభేదములు

జిహ్వికా పద్మినీ నందా వాసినీ మోహినీ తథా. 225
దాహినీ కాళరాత్రీచ క్షోభిణీ చాష్టసంఖ్యయా,

తా. జిహ్విక, పద్మిని, నంద, వాసిని, మోహిని, దాహిని, కాళరాత్రి, క్షోభిణి అని మర్కటీరోగములు ౮ విధంబులు.

## జిహ్వికామర్కటీలక్షణము, తచ్చికిత్స

సిద్ధార్థసదృశాకార జిహ్వికానామ మర్కటీ. 226
తృణధాన్య నిశా దార్వి పిష్ట్వా తండులవారిణా,
తథా తస్య ప్రదాతవ్యో లేపోఽయం విషనాశనః. 227
మంత్రేణ శంభుదేవస్య దినేపోహతి తద్విషం,

తా. తెల్లావాలవలె తెల్లనిపొక్కులు జనించిన జిహ్వికయను పేరంబరఁగుమర్కటి యనంబడును. దానియందు దూసరిబియ్యము, పసపు, మ్రానిపసపు అనువానిని సమ భాగములుగ పసిగడుగుతోనూరి "ఓం హ్రాం హ్రీం ఫట్ స్వాహా" అను శంభుదేవమంత్రముతో నభిమంత్రించి లేపనముజేసిన జిహ్వికయను మర్కటీరోగముయొక్క విష మొకదినములో మానును.

## పద్మినీమర్కటీలక్షణము

రక్తదర్దురసంకాశం గాత్రం యస్య ప్రదుష్యతే. 228

* చల్ది యన మురికిసొన్నారి.

పద్మినీమర్కటీనామ దాహః కండూ ర్విదాహితా,

తా. శరీరమున నెఱ్ఱనిదద్రువలె జనించి శరీరమునంతయు జేఱిచి తాపము, దురద, మంటలు గలిగియుండిన పద్మినీమర్కటి యనంబడును.

పద్మినీమర్కటికి పునర్నవాది లేపము

పునర్నవోద్భవంమూలం సప్తపర్ణీం సమంతథా. 229
గోమూత్రా ధారనాళేన పిష్ట్వా లేపో విషాపహః,

తా. తెల్లగలిజేరువేరు, ఏడాకులయరటివేరు-వీనిని సమభాగములుగదంచి ఆవు పంచితముతోను, కలితోను నూరి "ఓం ముంచముంచ ఇతిస్వాహా" అనుమంత్రముతో నభిమంత్రించి లేపనముజేసిన పద్మినియను మర్కటీరోగము హరించును.

నందామర్కటీలక్షణము

ఆగ్నేయస్ఫోటకాకారం యద్గాత్రం సాతు నందికా. 230
శూల దాహ జ్వరం కంపంయాతిగాత్రం సవేదనం, (మాధవనిదానే)

తా. శరీరమున నగ్నిదగ్ధముతో సమానమైన బొబ్బలు లేచుట, శూల, తాపము జ్వరము, శరీరకంపముగలుగుట, శరీరమునొచ్చుట - ఈలక్షణము గలది నందయను మర్కటీరోగమని తెలియవలయును.

నందామర్కటికి పద్మపత్రాదిలేపము

పద్మపత్రోశీరకంచ శ్వేతచందన ముత్పలమ్. 231
శీతతోయేన పిష్ట్వాను లేపో మంత్రం సుఖావహం,

తా. తామరాకు, వట్టివేరు, శ్రీగంధము, కలువగడ్డ-వీనిలో దేనినేని శీతోదకముతో నూరి "ఓంస్వాహా, భూర్భువస్వాహా, హాంస్వాహా" అనుమంత్రముతో నభిమంత్రించి లేపనముజేసిన నందయను మర్కటీరోగము హరించును.

వాసినీమర్కటీస్వరూపము

వక్త్రంచ పింగళం కృష్ణా జ్వలితాగ్నినిభేక్షణా. 232
వింశదంఘ్రి మహారౌద్రీ వాసినీనామ మర్కటీ,

తా. ముఖము పింగళవర్ణముగలదిగ, శరీరము నలుపువర్ణముగలదిగ, అగ్నివలె జ్వలించుచుండు నేత్రములుగలదిగ, ఇరువది పాదములుగలదిగ, మహాభయంకరముగ నుండునది వాసియను మర్కటీదేవతయని తెలియవలయును.

వాసినీమర్కటీలక్షణము

ఆగ్నేయస్ఫోటకాశ్చైవ జాయంతే తద్విషాధికే. 233
విద్ధ్యంతి సర్వగాత్రాణి పూతిగంధముఖం భవేత్,

తా. అగ్నితో దగ్ధంబైనటుల స్ఫోటకములు జనించి విషమించినపుడు శరీరం బంతయు సూదులతో బొడుచునటుల వేదనగలుగుట, ముఖము దుర్గంధనుగ నుండుట- ఈలక్షణములుగలది వాసినియను మర్కటీరోగమని తెలియవలయును.

### వాసినీమర్కటికి ఈశ్వర్యాదిలేపము

ఈశ్వరీ నింబపత్రాణి శ్వేతాకాశా కుశాస్తథా. 234
కషాయైః పంచభి ర్ఘాతే తల్లేపశ్చ సుఖావహః,

తా. ఈశ్వరివేరు, వేపాకు, గరికెవేరు, కుశదర్భవేరు-వీనిని సమభాగములుగ నుదకముతో నూరి యీదిగువ నుదహరించెడి పంచత్వక్కుల కషాయముతో మర్కటీరోగమును గడిగి అభిమంత్రించి లేపనముజేసిన వాసినియను మర్కటీరోగము హరించును.

### పంచత్వక్కులకషాయము

ఉదుంబర వటాశ్వత్థ చూత ప్లక్షసముద్భవాః. 235
త్వక్పంచకకషాయేణ శివమంత్ర శ్శివోదితః,

తా. మేడి, మఱ్ఱి, రావి, మామిడి, జువ్వి యను పంచత్వక్కుల దంచి కషాయముగాచి దానితో మర్కటీరోగమును గడుగవలయును. మఱియు దానికి "ఓం నమో భగవతే రుద్రాయ హరహర గచ్ఛతు విషం స్వాహా" అనుమంత్రముతో నభిమంత్రించి పూర్వోక్త ఔషధములను లేపనము జేయవలయును.

### మోహినీమర్కటీస్వరూపము

బహుపాదా మహాకాయా బహురూపా విషోత్కటా. 236
మోహినీనామ విజ్ఞేయా విద్ధో భర్తేన జీవితం,

తా. అనేకపాదములు గొప్పశరీరము పెక్కురూపములుగలదై కడువిషముతో గూడియుండునది మోహినీమర్కటీదేవతయని తెలియవలయును. ఇది సోకిన మనుజుడు జీవింపడు.

### మోహినీమర్కటీలక్షణము

రోమాంచోఽథ జ్వరో దాహో స్వేదో నిద్రాండవర్ధనమ్, 237
రక్తాంగం శ్వయథుశ్చేతి తయా దష్టస్య లక్షణం,

తా. గగుర్పాటు, జ్వరము, దాహము, చెమట, నిద్రాభంగముగలుగుట, అండములు వృద్ధిజెందుట, శరీరము రక్తవర్ణముగ నుండుట, శరీరము వాచుట-ఈలక్షణ

### దాహినీమర్కటీలక్షణము

అగ్నితుల్యా బృహత్పాదా దురంతా గరళోత్కటా. 238
దాహినీ చాపరాధీతా మూర్ఛా దాహోఽతిదారుణః,

తా. అగ్నివలెమండుచు గొప్పపాదములుగలదై మృత్యుప్రదంబై అత్యుత్కటమైన విషముతోఁగూడి యుండునది దాహినీమర్కటి యనంబడును. అదిసోఁకిన మూర్ఛ, కడుభయంకరమైన దాహము గలుగును.

### మోహినీమర్కటీచికిత్స

గర్దభాండ ప్రియంగూచ శ్వేతచందన చిత్రకమ్.
శిఖి నీలోత్పలంచాపి త్వాలేపో హంతి తద్విషం,

తా. కలుజువ్వి (ధరణివేరు), ప్రేంకణము, శ్రీగంధము, చిత్రమూలము, మయూరశిఖి, నల్లకలువగడ్డ-వీనిని సమభాగములుగ నుదకముతో మెత్తగనూరి "ఓం నమో రుద్రాయ, హేనవే గౌరీపతయే మహాపక్షిరాజాయ పక్షిపాతేనహరవిషంజాహాహా" అనుమంత్రముతో నభిమంత్రించి లేపనముజేసిన మోహిని యను మర్కటిరోగము హరించును.

### కాళరాత్రీమర్కటీస్వరూపము

శుక్లా కృష్ణా ఘనాంఘ్రిశ్చ రోమాంచావిషవన్మదా. 240
కాళరాత్రి స్తయాదష్టే నమంత్రం నచ భేషజం.

తా. తెల్లగగాని, లేక నల్లగ గానియుండుట, పాదములు బరువు గలిగియుండుట, రోమములు నిక్కబొడిచికొని యుండుట, గడువిషతుల్యముగ నుండుట-ఈలక్షణములు గలది కాళరాత్రీమర్కటియని తెలియవలయును ఇది సోఁకిన మంత్రౌషధములులేవు.

### క్షోభిణీమర్కటీస్వరూపము

బహుపాదాన్వితా శ్వేతా రక్తపాదా నచేక్షణా. 241
క్షోభిణీపాచ విజ్ఞేయా స్ఫోటతోదప్రణాదయః,

తా. అనేకపాదములతో గూడియుండుట, తెల్లగనుండుట, ఎఱ్ఱనిపాదములు గలదిగ నుండుట, దృష్టిలేకుండుట-ఈలక్షణములుగలది క్షోభిణీమర్కటియని తెలియవలయును. ఇది సోఁకిన బొబ్బలు, సూదులతో బొడుచునటుల వేదన, వ్రణములు మొదలగునవి గలుగును.

### క్షోభిణీమర్కటిచికిత్సాక్రమము

కషాయైః క్షాళనం త్వగ్భిస్సింధు మధ్వాజ్య లేపనమ్. 242
పశ్చా చ్ఛిన్నేశ్వరీమూలం మధుపర్ణి శతావరీ,

చందనోదక పిష్టానాం చందనం లేపనం హితమ్. 243
సమంత్ర మౌషధం ప్రోక్తం మర్కటీవిషనాశనం,

తా. మర్కటీరోగమును పంచత్వక్కుల కషాయముతో గడిగి సైంధవలవణము లో తేనె, నెయ్యిగలపి లేపనము జేసి తదనంతరము తిప్పతీగె, ఈశ్వరివేరు, గుమ్ముడు వేరు, పిల్లిపీచర అనువానిని సమభాగములుగ శ్రీగంధపురసముతో నూరి లేపనము జేసిన క్షోభిణియను మర్కటిరోగము హరించును. (మఱియు నెనిమిదివిధములైన మర్కటీ రోగములయందు పూర్వోక్త ఔషధలేపనమును, మంత్రాభిమంత్రముల నొక మండలము గాని, లేక రెండుమండలములుగాని జేయవలయును.) వానిచే మర్కటీరోగవిషములు హరించును.

## అర్బుదరోగనిదానము

గాత్రప్రదేశే క్వచిదేవదోషా స్సంమూర్ఛితా మాంసమసృక్ప్రదూష్య,
వృత్తంస్థిరంమందరుజంమహాంత మనల్పమూలంచిరవృద్ధిపాకమ్. 244
కుర్వంతి మాంసోచ్ఛ్రియమత్యగాధం తదర్బుదంశాస్త్రవిదోవదంతి,
అర్బుదే గ్రంథివ త్కుర్యా ద్వేధితం సుతరాం హితమ్. 245

(మాధవనిదానే)

తా. ప్రకోపించిన దోషములు శరీరమునందేదైన నొకభాగమున మాంసరక్తము లం జెఱచి గుండ్రమై స్థిరమై యొకింత నొప్పిగలదై గొప్పదియై లోతుగ వ్యాపించిన మూలముగలదై చిరకాలముమీఁద వృద్ధిజెంది లోతుగలదైయుండు గ్రంథులవలెనే సిరా వేధను సేయుట కడుహితకరంబు. (అర్బుదమన పౌరగడ్డ.)

## అర్బుదరోగలక్షణము

మృదుస్థూల స్తథా శోఫః క్వచిద్గాత్రే ప్రకాశితః,
సుజాత మర్బుదం జ్ఞేయం చిరాద్వృద్ధిశ్చ పాకకృత్.
భవేత్తం పాచయే చ్ఛోథం లేపనైః పాకకారకైః,

తా. శరీరమునం దేదైన నొకభాగమున మృదువుగ, గొప్పదిగనుండు వాపు జనించి మెఱయుచు చిరకాలముమీఁద బాగుగ వృద్ధిం జెంది పాకమును జెందిన అర్బుద మనంబడును. దీనిని పాకోపయుక్తలేపనమువలన పాకము చేయింపవలయును.

## అర్బుదభేదములు

వాతేన పిత్తేన కఫేన చాపి రక్తేన మాంసేన చ మేదసాచ,
తజ్జాయతే తస్యచ లక్షణాని గ్రంథే స్సమానాని సదాభవంతి.

తా. అర్బుదము వాత, పిత్త, కఫ, రక్త, మాంస, మేదజములన నాఱువిధంబులు. వానియం దెల్లప్పుడు గ్రంథిలక్షణంబులే గలిగియుండును.

రక్తార్బుదలక్షణము

దోషఃప్రదుష్టోరుధిరంసిరాసు సంకుచ్యసంపీడ్యతతోఽస్యపాకం,
సాస్రావమున్నహ్యతిమాంసపిండం మాంసాంకురైరాచితమాశువృద్ధమ్.
కరోత్యజస్రంరుధిరప్రవృద్ధి మసాధ్యమేతద్రుధిరాత్మకం తు,
రక్తక్షయోపద్రవపీడితత్వా త్పాండుర్భవేత్సోఽర్బుదపీడితస్తు. 249

తా. ప్రకోపించిన దోషము సిరలయందు రక్తమును సంకోచపఱచి (అనఁగా జేర్చి) పీడించుటచే మాంసపు ముద్దను ఎత్తుగజేసి యొకింత పండునటులుం జేయుట, కొంచెముగ స్రావముగలదై మాంసపుటంకురములతో వ్యాప్తమై శీఘ్రముగ వృద్ధిం జెందునదియై యుండుటవలన నెల్లపుడు రక్తమును గార్చుచుండుట, రక్తముక్షయించుటవలన, అర్బుదపీడవలన శరీరము తెలుపుబారుట-ఈలక్షణములుగలది రక్తార్బుదమని తెలియవలయును. ఇది యసాధ్యము.

మాంసార్బుదలక్షణము

ముష్టిప్రహారాదిభిరర్దితేఽంగే మాంసంప్రదుష్టం జనయేద్ధిశోథం,
అవేదనం స్నిగ్ధ మనన్యవర్ణ మపాకమశ్మోపమమప్రచాల్యమ్. 250
ప్రదుష్టమాంసస్య నరస్య గాఢ మేతద్భవేన్మాంసపరాయణస్య,
మాంసార్బుదం త్వేతదసాధ్యముక్తం సాధ్యేష్వపీమానితువర్జయేచ్చ.

తా. పిడిదెబ్బలు మొదలగువానివలన అంగపీడితుఁడైయుండి దుష్టమైన మాంసము వేదనారహితంబై మిసమిసలాడుచు చర్మసమానవర్ణముగలదై పాకరహితంబై ఱాయివలె గట్టిగ చలించినదియై యుండువాపును గలుగంజేసిన మాంసార్బుద మనంబడును. ఇది అసాధ్యము. ఈమాంసార్బుదము మాంసము చెడినవానికిని, ప్రతిదినము మాంసమును భక్షించెడువానికిని తఱుచుగ జనించును. ఈక్రింద జెప్పంబడునర్బుదములు సాధ్యంబులైనను వర్జింపవలయును.

అసాధ్యార్బుదలక్షణము

సంప్రస్రుతం మర్మణియచ్చజాతం స్రోతస్సువాయచ్చభవేదచాల్యం,

తా. మర్మస్థలముపై జనించి స్రావముతోగూడియుండు అర్బుదమును, నాసాదిమార్గములపై జనించియుండు అర్బుదమును, మఱియు స్థిరముగనుండు అర్బుదమును అసాధ్యంబులు.

### అధ్యర్బుదలక్షణము

యజ్జాయతేన్యత్ఖలు పూర్వజాతే జ్ఞేయంతదధ్యర్బుదమర్బుదజ్ఞైః. 252

తా. పూర్వముజనించిన యర్బుదముమీద వేరొక యర్బుదము జనించిన అధ్యర్బుద మనంబడును.

### ద్విరర్బుదలక్షణము

యద్వంద్వజాతం యుగపత్క్రమాద్వాద్విరర్బుదంతచ్ఛుభ వేదసాధ్యమ్.

తా. ఏకకాలమునందు గాని, లేక ఒకదానికివెనుక నొకటిగగాని, రెండర్బుదములు సమీపములుంగ జనించిన ద్విరర్బుద మనంబడును. ఇది యసాధ్యము.

### అర్బుదపాకానుత్పత్తికారణము

నపాకమాయాంతికఫాధికాద్వా మేదోబహుత్వాచ్చవిశేషతస్తు,
దోషస్థిరత్వాద్గ్రథనాచ్చ తేషాం సర్వార్బుదాన్యేవనిసర్గతస్తు. 254

తా. కఫముగాని లేక మేదస్సుగాని యధికముగ నుండుటవలన, దోషములు స్థిరములుంగ నుండుటవలన, దోషము లొకదానితో నొకటి జేరుటవలన సర్వార్బుదముల యందు స్వభావముగ పాకము గలుగకయుండును.

### గంధాదిలేపము

గంధ శిలా విశ్వౌషధ విడంగ నాగభస్మభిస్సమైశ్చూర్ణం,
కృకలాసరక్తయుక్తం లేపాత్సద్యోఽర్బుదధ్వంసి. 255

తా. గంధకము, మణిశిల, శొంఠి, వాయువిడంగములు, నాగభస్మము-వీనిని సమ భాగములుంగ చూర్ణముజేసి తొండరక్తములో గలిపి లేపనముజేసిన తత్క్షణమున అర్బుదము హరించును.

### యవక్షారాదిలేపము

లిప్త్వాయవక్షారవిడంగబీజం గంధోపలైస్స్వాక్షస్యణీకృతైర్యత్,
రక్తేనమిశ్రైస్సరటస్యసద్యస్త్వధ్యర్బుదంశామ్యతినాన్యథైతత్.

తా. యవక్షారము, వాయువిడంగములు-వీనిని ఖల్వములో నునిచి వెన్నతో మర్దించి తొండరక్తమునందు గలిపి లేపనముజేసిన అధ్యర్బుదము తత్క్షణమున నశించును. ఇది మఱియొకవిధముగ నశింపదు.

### హరిద్రాదిలేపము

హరిద్రా లోధ్ర పత్తంగ గుడ ధూమ మనశ్శిలాః,
మధుప్రగాఢో లేపోఽయం మేదోర్బుదహరఃపరః. 257

ఏతామేవ క్రియాం కుర్యా దశేషాం శర్కరార్బుదే,

తా. పసపు, లొద్దుగ, రసకర్పూరము, బెల్లము, కరుధూపము, మణిశిల-వీనిని ఖల్వములో నునిచి మర్దించి తేనెలో గలిపి లేపనముజేసిన మేదోర్బుదము నశించును. ఈక్రియనే శర్కరార్బుదమునందును జేయందగును.

—౦ రౌద్రరసము ౦—

శుద్ధసూతం సమం గంధం మర్ద్యం యామచతుష్టయమ్. 258
నాగవల్లీ బలాద్రావైః మేఘనాదపునర్నవైః,
గోమూత్రైః పిప్పలీయుక్తైః మర్ద్య రుధ్వా పుటేల్లఘు. 259
లిహేత్క్షౌద్రై రసోరౌద్రః గుంజామాత్రమితం భవేత్,
పారిజాతాంబుదంచైవ కాసమర్దం చ సంపిషేత్. 260
నింబపత్రోద్భవై శ్చాథ తత్కల్కై శ్శుధ్యతి వ్రణం, (ఆయుర్వేదే)

తా. శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి నాలుగుఝాములు కాటుకవలె మర్దించి పిప్పలిచూర్ణమునుజేర్చి మర్దించి తమలపాకులతొడిమెల రసము, ముత్తవపులగము, చిఱ్ఱికూర, తెల్లగలిజేరు, అనువాని రసములతోను, గోమూత్రముతోను మరల నాలుగుఝాములు మర్దించి లఘుపుటంబిడి గురిగింజంత యెత్తును తేనెతో సాయంప్రాతఃకాలముల సేవింపుచుండుటయేగాక పారిజాతపాకు, తుంగముస్తెలు, కసివెందాకు, వేపాకు అనువానిని కల్కముజేసి కాచి లేపనముజేసిన అర్బుదములు హరించును.

—౦ అర్బుదమునకు చిత్రమూలాదిలేపము ౦—

చిత్రకం చిరిబిల్వం చ శృంగిబేర పునర్నవమ్. 261
లాంగలీ శిగ్రుమూలం చ దంతీ లవణపంచకం,
సకణా మరిచం పిష్ట్వా గోమూత్రేణ ప్రలేపయేత్. 262
సర్వార్బుదా వినశ్యంతే నరోహంతి పునర్నృణాం,

తా. చిత్రమూలము, క్రానుగచెక్క, అల్లము, గలిజేరు, చెన్నచర్లగడ్డ, మునగవేరు, నేలవంతి, పంచలవణములు, పిప్పలి, మిరియాలు-వీనిని సమభాగములుగ ఆవుపంచితముతో నూరి లేపనముజేసిన సర్వార్బుదములు హరించి మరల జనింపకుండును.

—౦ గళగండనిదానము ౦—

నబద్ధ శ్శ్వయథుర్యస్య ముష్కవ ల్లంబతే గళే. 263
మహాన్వా యదివా హ్రస్వో గళగండం తమాదిశేత్,

కంఠమునందు పెద్దదిగగాని, లేక చిన్నదిగగాని నుండి వాపుజనించి వృషణవ వలె వ్రేలుచుండిన గళగండ మనంబడును.

### గళగండసంప్రాప్తి

వాతఃకఫశ్చాపి గళే ప్రదుష్టో మన్యేసమాశ్రిత్య తథైవ మేదః,
కుర్వంతిగండం క్రమశస్స్వలింగై స్సమన్వితం తంగళగండమాహుః

తా. దుష్టములైన వాత, కఫ, మేదస్సులు గొంతునందలి సిరలజెంది క్రమమ వృద్ధింజెంది తమతమలక్షణయుక్తంబై నొకయుంటను గలుగంజేసిన గళగండ మ బడును. (ఇది వాతజ, కఫజ, మేదజములవలన మూడువిధంబులు.)

### వాతికగళగండలక్షణము

తోదాన్వితః కృష్ణసిరావనద్ధ శ్శ్యావారుణోవాపదనాత్మకస్తు,
పారుష్యయుక్తశ్చిరవృద్ధపాకో యదృచ్ఛయాపాకమియాత్కదాచిత్
వైరస్యమాస్యస్యచతస్యజంతో ర్భవేత్తథాతాలుగళప్రశోషః,

తా. సూదులతో బొడుచునటుల పీడగలుగుట, నల్లని సిరలతో వ్యాప్త యుండుట, నీలముగ, లేక ఎఱ్ఱగ, కఠినముగ నుండుట, చిరకాలమునుండి పాకము జె కుండుట, ఒకానొకప్పుడు కారణములేకయే పండుట, నోరు విరసముగ నుండుట, లో డౌడ, గొంతెండుట-ఈలక్షణములు గలది వాతికగళగండమని తెలియవలయును.

### కఫజగళగండలక్షణము

స్థిరస్సవర్ణోగురురుగ్రకండూ శ్శీతోమహాంశ్చాపి కఫాత్మకస్తు.
చిరాభివృద్ధింభజతేచిరాద్వా ప్రపచ్యతేమందరుజఃకదాచిత్,
మాధుర్యమాస్యస్యచతస్యజంతో ర్భవేత్తథాతాలుగళప్రలేపః.

తా. స్థిరముగ, చర్మముతో సమానవర్ణముగలదై జడముగ, కడుదురదయుక్తవ చల్లగ, పెద్దదిగ, దీర్ఘకాలముమీఁద వృద్ధింజెందినదిగ, దీర్ఘకాలముమీఁద నొకా పుడు పండునదిగ నుండుట, పండునప్పుడొకింత పోట్లుగలుగుట, నోరు తీపిగనుండ లోదౌడ, గొంతు, కఫముతో నలకంబడినటులుండుట-ఈలక్షణములు గలది కఫజ గండమని తెలియవలయును.

### మేదజగళగండలక్షణము

స్నిగ్ధోగురుఃపాండురనిష్టగంధో మేదోభవస్స్వల్పరుజోఽతికండూ
ప్రలంబతేఽలాబువదల్పమూలో దేహానురూపక్షయవృద్ధియుక్తః
స్నిగ్ధాస్యతాతస్యభవేచ్చజంతో ర్గళేనుశబ్దం కురుతేచనిత్యం,

తా. మినమినలాడుచు జడముగ, పాండురవర్ణముగ, దుర్గంధముగ, మందమైన పీడగలదిగ, కదుదురదయుక్తముగనుండుట, స్వల్పమూలముగలదై సొరకాయవలె వ్రేలుచుండుట, శరీరము క్షయించిన నదియును క్షయించుట, వృద్ధిజెందిన నదియును వృద్ధిం జెందుట, ముఖము నూనెచే బూయంబడినటుల మినమినలాడుట, మాటలాడునపుడెల్లపుడు గొంతువలన నుపశబ్దము వెడలుట-ఈలక్షణములుగలది మేదజగళగండ మని తెలియవలయును.

## అసాధ్యగళగండలక్షణము

కృచ్ఛ్రాచ్ఛ్వసంతం మృదుసర్వగాత్రం సంవత్సరాతీతమరోచకార్తం,
క్షీణం చ వైద్యోగళగండజుష్టం భిన్నస్వరంచాపి వివర్జయేత్తు. 269

తా. కష్టముగ శ్వాసమునేని, లేక సర్వశరీరము మృదువుగనేని, గళగండము జనించి ఒక సంవత్సరకాలం బతిక్రమించియేని, అరోచకంబేని, శరీర క్షయంబేని, స్వరభేదంబేని గల గళగండరోగిని వైద్యుఁడు వర్జింపవలయును.

## సర్షపాదిలేపనము

సర్షపా శ్శిగ్రుబీజాని శణబీజాతసీ యవాః,
మూలకస్య చ బీజాని తక్రేణామ్లేన పేషయేత్. 270
గండాని గ్రంథయశ్చైవ గండమాలా స్తథైవ చ,
ఆలేపాత్తేన శామ్యంతి విలయం యాంతివాచిరాత్. 271

తా. తెల్లావాలు, మునగవిత్తులు, జనపవిత్తులు, అగిసెవిత్తులు, యవలు, ముల్లంగివిత్తులు-వీనిని పుల్లనిమజ్జిగతో నూరి లేపనముజేసిన గళగండము, గ్రంథులు, గండమాల శీఘ్రముగ నశించును.

## మండూరలోహము

మహిషీమూత్రవిమిశ్రం లోహమలం సుస్థితం ఘటేమాసం,
అంతర్ధూమవిదగ్ధం మధునా గళగండనాశనం లీఢమ్. 272

తా. లోహకిట్టమును మంటిపాత్రయందునిచి బఱ్ఱెమూత్రము పోసి యొక మాసమువఱకునిచి పిదప దానిని నూరి గజపుటంబిడి తేనెతో సేవించిన గళగండము హరించును.

## వాతగళగండమునకు నిచులాదిలేపము

నిచులం శిగ్రుమూలాని దశమూల మథాపి చ,
ఆలేపనం వాతగండే సుఖోష్ణం సంప్రశస్యతే. 273

తా. ప్రబ్బలి, మునగవేరు, దశమూలములు - వీనిని నూరి యొకింత వెచ్చజేసి సుఖోష్ణముగ లేపనముజేసిన వాతగళగండము హరించును.

కఫజగళగండోపచారము

స్వేదోపనాహైః కఫసంభవేపి కృత్వాక్రమం శ్లేష్మహరంవిదధ్యాత్

తా. ఒత్తడము, కట్టుగట్టుట, శ్లేష్మనాశకరక్రియలు అనువానివలన కఫజ గండము హరించును.

దేవదార్వ్యాదిలేపము

దేవదారు ర్విశాలా చ కఫగండే ప్రలేపనం,
ఛర్దనం శీర్షకశ్చైవ సర్వేగండనకే హితాః. 2

తా. దేవదారు, వెఱ్ఱిపుచ్చ అనువాని లేపనమును వమనము, శిరోవిరేచన అనువానిని సర్వగళగండములయందు జేయుట హితకరంబులు.

మేదజగళగండచికిత్సాక్రమము

మేదస్సముత్థేత్రయథోపదిష్టాం విధ్యేచ్ఛిరాంస్నిగ్ధతనోర్నరస్య,
శ్యామాసుధాలోహపురీషదంతీ రసాంజనైశ్చాపిహితఃప్రలేపః. 2

తా. శాస్త్రోక్తప్రకారము స్నేహమును లేపనము జేసి సిరావేధంజేసి పిప్ప సున్నము, లోహకిట్టము, నేపాళములు, రసాంజనము అనువానిని నూరి మేదజగళగండ నందు లేపనము జేయుట హితకరంబులు.

శ్వేతాపరాజితామూలం ప్రాతః పిష్ట్వా పిబేన్నరః,
సర్పిషా నియతాహారో గళగండప్రశాంతయే. 2

తా. తెల్లగంటెనవేరును నూరి ప్రాతఃకాలమున త్రాగి నేతియన్నము కొల్లపు భుజించుచుండిన గళగండము శమించును.

తుంబితైలము

విడంగ క్షార సింధూత్థ రాస్నాగ్ని వ్యోష దారుభిః,
కటుతుంభీఫలరసే కటుతైలం విపాచితమ్. 2
చరోత్థమపి నస్యేన గళగండం వినశ్యతి,

తా. వాయువిడంగములు, యవక్షారము, సైంధవలవణము, వస, సన్నరాస్న చిత్రమూలము, త్రికటుకములు, దేవదారు అనువానికషాయములో చేదుసొరకాయ రసము, తెల్లావనూనె కలిపి చిక్కగగాచి నస్యముజేయించిన చిరకాలముగనుండు గ గండము నిస్సంశయముగ హరించును.

తుంబ్యాదితైలము

తుంబిరసేనకటుకేనచతుర్గుణేన కల్కీకృతైర్మగధజాదిగణౌషధైశ్చ,

తైలంశృతంహరతిదేహిషుగండమాలా మత్యుల్బణామపిగళేగళగండ [రోగాన్. 279

తా. నాలుగింతలు చేదుపొరకాయరసములో పిప్పల్యాదిగణోక్త ఔషధముల కల్కమును, దానికి సమముగ నూనెను గలిపి చిక్కగగాచి లేపనముజేసిన ప్రబలమైన గండమాల, గళగండము హరించును.

సూర్యావర్తాదిలేపము

సూర్యావర్తరసోనాభ్యాం గళగండోపనాహనం,
స్ఫోటాస్స్రావైస్సంప్రయాంతి గళగండో నసంశయః. 280

తా. సూర్యావర్తము, వెల్లుల్లి-వీనిని నూరి ముద్దజేసి కట్టుగట్టిన బొబ్బలు, స్రావము- వీనితోగూడియుండు గళగండము నిస్సంశయముగ శమించును.

పలాశమూలలేపనము

తండులోదకపిష్టేన మూలేన పరిలేపితః,
హితః కర్ణే ఫలాశస్య గళగండః ప్రశామ్యతి. 281

తా. మోదుగవేరును బియ్యపుకడుగుతో నూరి చెవులయందు లేపనముజేసిన గళగండము హరించును.

గండమాలభేదములు

చత్వారః క్రిమిభీ రోగా జాయంతే గ్రంథిపూర్వకాః,
హృదయే గండమాలాభం కంఠేజాతం తథైవచ. 282
కపోలగండమాలాచాప్యుత్తమాంగే చ జాయతే,
దంతవ్రణం కటౌజాతం శ్రవణే నాసగండకే. 283
ఏతే దుర్గంధసంయుక్తా శ్శ్వేతరక్తసమన్వితాః,
ఏతేషాం భైషజం చైవ కథ్యతే పూర్వవేదిభిః. (సిద్ధరసార్ణవే)

తా. క్రిములవలన గ్రంథిపూర్వకముగ నాలుగువిధములైన రోగములు జనించును. హృదయమున జనించిన హృదయగండమాల యనియు, కంఠమున జనించిన కంఠగండమాల యనియు, చెక్కిటజనించిన కపోలగండమాల యనియు, శిరమునజనించిన కపాలగండమాల యనియుఁ జెప్పంబడును. మఱియు పంటియందు జనించిన దంతవ్రణమనియు, కటిప్రదేశమున జనించిన కటివ్రణమనియు, చెవిలోగలిగిన కర్ణవ్రణమనియు, నాసికమునజనించిన నాసికావ్రణమనియు జెప్పంబడును. ఇవియన్నియు దుర్గంధయుక్తంబులై చీమునుగార్చుచు తెల్లగ, ఎఱ్ఱగ నుండును. వీనికౌషధము పూర్వులచే జెప్పంబడియెను.

### గండమాలలక్షణము

కర్కంధుకోలామలకప్రమాణైః కక్షాంసమన్యాగళవంక్షణేషు,
మేదఃకఫాభ్యాంచిరమందపాకైస్స్యాద్గండమాలాబహుభిస్తుగండైః.

తా. మేదస్సు, కఫము అనువానివలన చంకలు, భుజశిరములు, పెడతల, పెనరము, కంఠము, గజ్జలు, అనువానియందు రేగుపండు, మిరియాలు, ఉసిరికకాయ అంత వానిప్రమాణముగల పలువిధములైన గ్రంథులు జనించి సావకాశముమీద కొంచెము పాకమునుజెందిన గండమాల యనంబడును.

### గండమాలలకు త్రికటుకాదివటికములు

త్రికటుం స విళంగం తు ప్రత్యేకం నవనిష్కకం,
నారికేళం తథాపిష్టం పురాణగుడమేవ చ. 28
ప్రత్యేకం పలమాత్రం తు రసభస్మ చ నిష్కకం,
ఏరండతిలతైలేన భల్లాతక చతుష్పలమ్. 28
మర్దయే త్పచనం కృత్వా మాషమాత్రం చ దాపయేత్,
గండమాలా వినశ్యంతి లవణామ్లాంచ వర్జయేత్. (సిద్ధరసార్ణ

తా. త్రికటుకములు, వాయువిడంగములు-ఇవి దినుసుకు తొమ్మిదినిష్కములు ప్రాతకొబ్బెర, ప్రాతబెల్లము - ఇవి దినుసు కొక్కొకపలము, రసభస్మము ౧ నిష్కమ జీడిగింజలు ౪ పలములు-ఇటుల వీనినెల్ల నేకముజేసి మెత్తగ దంచి అందు ౪ పలమ ఆముదము, ౪ పలముల నూనెనుగలిపి వండి మాషప్రమాణము మాత్రలుజేసి సేవించి గండమాలలు హరించును. దీనిసేవనకాలంబున ఉప్పును, పులుసును వర్జించి (కందిపప్పు ఆవునెయ్యి, నల్లనివరివంటకము) అనువానిని భుజింపవలయును.

### విడంగాదిచూర్ణము

విళంగేంద్రయవామూలం మహానింబద్రుమత్వచః,
తుల్యం చూర్ణజలైః పీతం కర్షైకం గండమాలనుత్. 28

(మాధవనిదాన

తా. వాయువిడంగములు, కొడిసెపేరు, పెద్దవేపచెక్క - దీనియభావంబు (కెం౦ం కరక్కాయలబెరడు) వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి కర్షప్రమాణమును ఉదకానుపానముతోడ సేవించిన గండమాలలు హరించును.

### గండమాలలకు తాళకాదివటికములు

శుద్ధతాళం శిలాంశుద్ధాం యవక్షారం స సైంధవం,
చార్వీం సుధాం చూర్ణయేత్తు మాక్షికేణ సమాయుతమ్. 29

నిష్కార్ధం ఘృతయుక్తంచ కంఠరోగేషు దాపయేత్, (ఆయుర్వేదే)

తా. శుద్ధిజేసినతాళకము, శుద్ధిచేసిన శిలాజిత్తు, యవక్షారము, సైంధవలవణము, ఫ్రానిపసపు, సున్నము-వీనిని సమభాగములుగ గ్రహించి తేనెతో మర్దించి అర్ధనిష్కప్రమాణము మాత్రలుజేసి నేతియనుపానముతోఁడ సేవించిన కంఠగండమాలలు హరించును.

క. ఫ్రాని యొద్దర్తిగడ్డలు, నూనెయు మిరియంబు వండి నూరకత్రాగ
న్నానుగ నలువదిదినములు, మానవతతికెల్ల గండమాలలు మానున్.

క. మిరియంబు నూనె వెల్లులి, బజె బచ్చలిగడ్డ గూర్చి భక్షింపంగా
మరినల్లవడ్లపురుఁరో,గిరము తినం గండమాల కిల్బిషమడఁగున్.

క. వారిజపుచెక్కరసమును, బేరెన్నక సిందురంబు పిప్పలి మోడిం
గూరిచి సేవించినదా, మారూక్షై కుష్ఠు గండమాల లడంగున్.

గీ. మంగతెల్ల వెలకి నురిచిత్రమూలంబు, నెమలిచెక్క గారనీలిపుప్పి
పిప్పలియును జూర్ణ మొప్పఁగా వెన్నదా,గ్రోలవేగగండమాలలడఁగు.

గీ. కలియుగంబున మున్నూరు కరక కాయ, లించుకని చూడఁబోవక
యింపుతోఁడ, మండలం బారగింప భూమండలమున, గండమాలలు
కుష్ఠురోగములు మాను.

గీ. గాలనెల్లి త్రికటుకము నల్లపుప్పియు, సమము గూర్చి నూనె సమము
గూర్చి, త్రాగి భానువారత్రయము దధ్యన్నంబు, గుడువ గండ
మాల లడఁగిపోదె.

(ఈరెండు గీతపద్యములయందు జెప్పంబడిన యౌషధములతో పూటకు రెండు చిన్నములయెత్తు రసకర్పూరమును గలిపి వెన్నయనుపానముతోఁడ దంతములకు దగలక మ్రింగుచుండిన గండమాలలు హరించును.)

## గండమాలలకు గంధకాదిలేపము

గంధకం పారదం తుల్యం మర్కటీక్షీరేణ సైంధవమ్. 291
పిష్ట్వా చ కాంచనీమూలం లేపోఽయం గండమాలహా,
(చికిత్సాసారసిద్ధసంగ్రహే)

తా. గంధకము, రసము, సైంధవలవణము, దేవకాంచనపట్ట-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి జిల్లేడుపాలతో మర్దించి గండమాలలందు లేపనము జేసి అగ్నియందుకాచిన గండమాలలు హరించును.

ఇంద్రవారుణికామూలం భానుదుగ్ధైశ్చ సైంధవమ్. 292
పిష్ట్వా లేపేన హంత్యాశు ముండీద్రావేణ వేషయేత్,
పిబేత్సప్తదినం యష్టిం గండమాలా వినశ్యతి. (నిత్యనాథీయే) 293

తా. పాపరవేరును జిల్లేడుపాలతోనూరి అందు సైంధవలవణము గలిపి గండమాలలపై లేపనముజేసి నిప్పుసెగయందుగాచిన గండమాలలు హరించును. మఱియు యష్టిమధుకమును బోడతరరసముతో నూరి ఏడుదినములు త్రాగిన గండమాలలు హరించును. (రసము, గంధకము, మైలుతుత్థము - వీనిని సమభాగములుగ నేకముజేసి ఆవువెన్నతో మర్దించి గండమాలపై లేపనముచేసి సెగయందుగాచిన గండమాలలు హరించును.)

గండమాలాకండనరసము

కర్షం సూతం శుద్ధమస్య గంధకం త్వర్ధముత్తమం,
సార్ధకర్షం తామ్రభస్మ మృతం కిట్టం త్రికర్షకమ్. 294
వ్యోషా షట్కర్షతులితా మషార్ధం సైంధవం స్మృతం,
కాంచనారత్వచశ్చూర్ణం పలత్రయమితం క్షిపేత్. 295
పలత్రయం గుగ్గులోశ్చ శుద్ధస్య సముపాహరేత్,
ఏతద్వ్యక్త్వా తు సంమేళ్య సురభీ సర్పిషా దృఢమ్. 296
గండమాలా కండనోయం రసో మాషత్రయాత్మకః,
భుక్తో నిహంతి గండాని గండమాలాం చ దారుణామ్. 297

తా. శుద్ధిజేసిరసము ౧ కర్షము, శుద్ధిచేసిన గంధకము ½ కర్షము, తామ్రభస్మము ౧½ కర్షము, మండూరము 3 కర్షములు, శొంఠి ౨ కర్షములు, మిరియాలు ౨ కర్షములు, పిప్పలి ౨ కర్షములు, సైంధవలవణము ½ అక్షము, దేవకాంచనపుచెక్క-చూర్ణము 3 పలములు, శుద్ధిచేసిన మహిసాక్షిగుగ్గిలము 3 పలములు-ఇటుల వీనినెల్ల క్రమముగ నేకముచేసి ఆవునేతితో దంచి 3 మాషనుల యెత్తు ఉంటలుజేసి సేవించిన భయంకరములైన గళగండము, గండమాలలు హరించును.

గంధకాదిలేపనము

గంధకం టంకణం సింధుం కాంచనీ నవసారకం,
సౌవర్చలం యవక్షారం కాచం రక్తం సుచర్చికామ్. 298
శీతం రక్తం చ పాషాణం మూషకోత్థం నియోజయేత్,
జేపాలబీజ మజ్జాం చ సమం జంబీరపేషితమ్. 299
శస్త్రైశ్ఛిత్వా ప్రదాతవ్యం వేష్ట్య మేరండపత్రకైః,

ఏవం త్ర్యహాత్స్ఫుటంత్యేవ దధ్యన్నం దాపయేత్తతః. 300
గండమాలాపచీగ్రంథి ర్బహిర్నిర్యాతి నాన్యథా,

తా. గంధకము, వెలిగారము, సైంధవలవణము, పసపు, నవాసాగరము, సౌవర్చ లవణము, యవక్షారము, కాచలవణము, సిందూరము, సర్జక్షారము, కర్పూరము, లక్క, పాషాణము, ఎలుకచెవిపట్ట, నేపాళపువిత్తులు-వీనిని సమభాగములుగ ఖల్వములో నుసిచి (నారదపుకాయ) నిమ్మపండు అనుపానిరసములతో మర్దించి శస్త్రముతోగీచి యీయౌష ధము నునిచి మూడుదినములు ఆమదపాకులనుబెట్టి కట్టుగట్టిన గండమాల, అపచి, గ్రంథి పగిలి అందలిదోషము నిశ్చయముగ బైలువెడలును. మఱియు దీనియందు పెరు గన్నము నొసంగవలయును.

## కపాలగండమాలలక్షణము

కపాలగండమాలా తు హ్యుత్తమాంగే చ జాయతే. 301
ఏషాదుర్గంధసంయుక్తా శ్వేతరక్తసమన్వితా, (ఆయుర్వేదే)

తా. శిరమున గండమాల జనించి దుర్గంధయుక్తమై చీము గారుచు తెల్లగ, ఎఱ్ఱగ నుండిన కపాలగండమాలయని తెలియవలయును. (ఇది హరించుటకై ఇంగిలీకముయొక్క పొగ ఉబ్బనేని, రసకర్పూరసేవననేని జేయందగును.)

సీ. రమణతో నాగసరపుగడ్డ సమును వెన్నతోఁగూర్చి సేవింపవలయు
నురువజ్రనీలాకు నొగి మేకపాలతో విశదంబుగాను సేవింపవలయుఁ
గడఁకతో విడి వేళ్ళవడినూనెతోవండి వేడుకతోను సేవింపవలయుఁ
బొసఁగవెల్తురువేళ్ళరసమునునూనె యుమిరియంబుగూరిచి మెసఁగవలయు
గీ. జౌటపులతీఁగెవేళ్ళను సరివి నెఱ్ఱగురిజగారలవేళ్ళనుగూర్చి నూనె
మిరియమును గల్పి సేవింప ధరణియందుఁ, బలుగపాలపుగండమా
లలు నడంగు

తా. నాగసరపుగడ్డను నూరి పోకంతముద్దచేసి వెన్నతో నొకమండలముగాని, లేక రెండుమండలములుగాని సేవించినను, లేక వజ్రనీలాకును నూరి ముద్దజేసి మేకపా లతోసేవించినను కపాలగండమాలలు హరించును. ఈరెండౌషధములు సేవించునపుడు చప్పిడన్నమును, నల్లనరియిగిరికెను భుజింపవలయును. పిడికెడు లవిడివేళ్ళను చిదియ గొట్టి సోలెడునూనె గలిపి గాచి ప్రాతస్సాయంకాలమున నొటాకుప్రమాణమును రెండు మండలములు సేవింపుచు లవిడియాకును నూరి లేపనము సేయుచుండిన కపాలగండ మాలలు హరించును. దీనియందు చప్పిడివంటకమును భుజింపవలయును. వెల్తురువేళ్ళరసము పావుసేరు, మిరియపుమూర్ణ మొకతులము, నూనె యొకతులము గలిపి రేపు, మాపు సేవన,

నస్యములు జేయింపుచుండిన కపాలగండమాల హరించును. నాసికమునందు మంట గలిగిన కపాలగండమాల హరించెనని యెఱింగి నస్యముల వర్జించి చప్పిడివంటకమునే భుజింపంజేయుచుండవలయును. (చప్పిడియన కందిపప్పుపొడి, కూర, నూనె, నల్లవరి వంటకము అనునవి) చౌటిపుల్లతీఁగెవేళ్ళు, ఎఱ్ఱగలిజేరువేరు, పుట్టమీఁది గారెవేరు - వీనిని నూరి పావుసేరు రసము దీసి అందు నాటాకు ప్రమాణము మిరియపు చూర్ణముగలిపి అమావాస్య మొదలు మూడమావాస్యలవఱకు పానము జేయింపవలయును. వమనముగాకుండిన విడియముసేయవలయును. దీనిసేవనానంతరం బొకరఘామ గడచిన పిదప కొఱ్ఱపాలజావను త్రాగించవలయును. తక్కినదినములయందు పావుసేరురసములో నూనె యొకతులము, మిరియపుచూర్ణ మొకతులము గలిపి ప్రతిదిన మొసంగుచు జప్పిడి నాచరించునటులం జేయుచుండిన కపాలగండమాలలు హరించును.

(చాతరాసికూరలో ఉప్పు, పులుసు గలిపి వండి అన్నముతోడంజేర్చి కమికెడు భక్షించినను, లేక గోగుకూరను ఉప్పు, పులుసుతోడంవండి రేపుమాపు కమికెడు చొప్పున భక్షింపుచుండినను, లేక రసఉబ్బను వేసినను గండమాలలు హరించును.)

సీ. బోడతరంబును బొన్నగంటియుఁ బిల్లపెసర గజ్జేరు లింపెసఁగఁదెచ్చి
నలిన మూలంబులు నాలుగునాలుగు సేరులరసముగాఁ జేసి యందు
సరిగాఘృతంబునుఛాగమూత్రంబును రెండు సేరులుగూర్చివండికల్క
తలమీఁదమూఁడుజాములుపెట్టి యుష్ణోదకముల చేస్నానంబుగానొనర్చి
గీ. యన్నమును దీయగూరయు ననుభవంబు
చేసి పథ్యముచేసినఁ జెడుకపాల
గండమాలలు ధరణిఁ బ్రఖ్యాతముగను
మానవావలి కెల్లను మానుచుండు.

### గండమాలాదులయందు పథ్యము

పురాణఘృతపానం చ జీర్ణలోహితశాలయః. 302
యవా ముద్గాః పటోలం చ రక్త శిగ్రు కటిల్లకం,
వాలిశాకం చ వేత్రాగ్రం రూక్షాణి చ కటూని చ. 303
దీపనాని చ సర్వాణి గుగ్గులుశ్చ శిలాజతు,
గళగండే గండమాలాపచి గ్రంథ్యర్బుదాంతరే. 304
యథాదోషం యథావస్థం పథ్యమేతత్ప్రకీర్తితం,

తా. ప్రాతనెయ్యి, ప్రాతయెఱ్ఱబియ్యపువంటకము, యవలు, పెసలు, పొట్లకాయ, ఎఱ్ఱమునగ్కాయ, కాకరకాయ, పొన్నగంటికూర, వెనురుమొలక, రూక్షకర

ద్రవ్యములు, కారద్రవ్యములు, దీపనకరసర్వౌషధములు, గుగ్గిలము, శిలాజిత్తు ఇని గళ గండము, గండమాల, అపచి, గ్రంథి, అర్బుదము అనువానియందు దోషానుగుణ్యముగ, అవస్థానుగుణ్యమున పథ్యకరంబులు.

కులత్థా స్సఘృతం సక్తు పథ్యం స్యా ద్గండమాలికా. 305
(మతాంతరే)

తా. ఉలవలు, నెయ్యి, పేలపిండి-ఇవి గండమాలలయందు పథ్యకరంబులు.

గండమాలాదులయం దపథ్యము

దుగ్ధేక్షువికృతీస్సర్వా మాంసంచానూపసంభవం,
పిష్టాన్న మమ్లం మధురం గుర్వభిష్యందికారి చ. 306
గళగండం గండమాలాపచి గ్రంథ్యర్బుదామయాన్,
చికిత్సన్నగదంకారో యశోర్థీ పరివర్జయేత్. 307

తా. పాలు, బెల్లము, పంచదార మొదలగు చెఱకువలననైన ద్రవ్యములు, అనూపదేశమాంసము, పిండివంటకములు, పులుసు, తీపిగలపదార్థములు, జడకరద్రవ్యములు, కఫకరద్రవ్యములు-ఇవి గళగండము, గండమాల, అపచి, గ్రంథి, అర్బుదము అనువానియం దపథ్యకరంబులు. అట్లగుటచే వానిని యశమునుగోరెడి వైద్యుఁడు వర్జింపంజేయవలయును.

కర్ణశూలలక్షణము

సమీరణశ్శ్రోత్రగతోఽన్యథాచరన్ సమంతతశ్శూలమతీవకర్ణయోః,
కరోతిదోషైశ్చయథాస్వమావృత స్సకర్ణశూలఃకథితోదురాసదః.
(ఆయుర్వేదే)

తా. కర్ణగతవాతము ప్రకోపించి ప్రతిలోమముగ సంతత సంచరింపుచు "ఏకః ప్రకుపితో దోష స్సర్వానేవ ప్రకోపయేత్" అనున్యాయానుసరణి కఫపిత్త రక్తములం జెరచి వానితోడంగూడి తమతమబలానుగుణ్యముగ "శ్లో. మూర్ఛాదాహో జ్వర శ్శ్వాసః క్లమోఽథ వమథు స్తథా, ఉపద్రవాః కర్ణశూలే భవంత్యేతే మరివ్యతః," అనువచనోక్తోపద్రవ్యములతోఁగూడి కష్టసాధ్యమైన శూలను గలుగంజేయును. ఇదియ కర్ణశూల యనంబడును.

కర్ణనాదలక్షణము

కర్ణస్రోతస్థితేవాతే శృణోతి వివిదాన్స్వరాన్,
భేరీమృదంగశంఖానాం కర్ణనాద స్సఉచ్యతే. 309

తా. వాతము చెవిలోనుండి శబ్దవాహిని సిరలసమీపంబున కేగుటవలన భేరీ,

మృదంగ, శంఖాదిక శబ్దమువంటి పలువిధములైన శబ్దముల గలుగంజేసిన కర్ణనాద మనంబడును.

బాధిర్యలక్షణము

యదా శబ్దవహం వాయు స్స్రోతఆవృత్య తిష్ఠతి,
శుద్ధశ్శ్లేష్మాన్వితోవాపి బాధిర్యం తేన జాయతే. 310

తా. వాయువు కఫముతోగలిసిగాని, గలియకగాని శబ్దవాహిని స్రోతస్సుల నడ్డగించుటవలన చెవుడు గలుగును.

కర్ణక్ష్వేడలక్షణము

వాయుః పిత్తాదిభిర్యుక్తో వేణుఘోషసమం స్వనం,
కరోతి కర్ణయోః క్ష్వేడం కర్ణక్ష్వేడ స్సఉచ్యతే. 311

తా. వాయువు పిత్తాదులతోడంగలిసి చెవిలో పిల్లనగ్రోవివంటి శబ్దమును గలుగంజేసిన కర్ణక్ష్వేడ మనంబడును.

కర్ణస్రావలక్షణము

శిరోఽభిఘాతాదథవానిమజ్జనా జ్జలేప్రపాకాదథవాపివిద్రధేః,
ప్రవేద్ధిపూయం శ్రవణోఽనిలార్దిత స్సకర్ణసంస్రావఇతిప్రకీర్తితః.

తా. శిరమునందు దెబ్బదగులుటవలనగాని, లేక నీళ్ళయందు దుమికి మునుంగుటవలనగాని, లేక చెవిలోజనించిన విద్రధి పండియుండుటవలనగాని, వాతము ప్రకోపించి చెవివలన చీముగార్చుచుండిన కర్ణస్రావ మనంబడును.

కర్ణకండూలక్షణము

మారుతః కఫసంయుక్తః కర్ణేకండూం కరోతి చ,

తా. కఫయుక్తమైన వాయువు చెవిలో దురదగలుగంజేసిన కర్ణకండు వనంబడును.

కర్ణగూథలక్షణము

పిత్తోష్మశోషితశ్లేష్మా జాయతే కర్ణగూథకః. 313

తా. పిత్తోష్ణముచే కఫమెండి గుబిలిగనైన కర్ణగూథ మనంబడును.

కర్ణప్రతినాహలక్షణము

సకర్ణగూథోద్రవతాంయదాగతో విలాయితోఘ్రాణముఖం ప్రపద్యతే,
తదాసకర్ణప్రతినాహసంజ్ఞితో భవేద్వికారశ్శిరసోఽర్ధభేదకృత్. 314

తా. చెవియందుండు గుబిలి ద్రవించిగాని, లేక స్నేహస్వేదాదులవలన ద్రవించిగాని ముక్కు, నోరు అనువానివలన వెడలిన ప్రతినాహ మనంబడును. దీనివలన నర్ధతల నొప్పి గలుగును.

### క్రిమికర్ణలక్షణము

యదాతుమూర్ఛ్నంత్యథవాపిజంతవస్సృజంత్యపత్యాన్యథవాపిమక్షికాః,
తదవ్యంజనత్వాచ్ఛ్రవణోనిరుచ్యతే భిషగ్భిరాద్యైః క్రిమికర్ణకోగదః.

తా. చెవులో పురుగులు జనించి వ్యాపించుటవలనగాని, లేక ఈఁగలు పిల్లల బెట్టుటవలనగాని, కర్ణమార్గము నడ్డగింపఁబడిన క్రిమికర్ణ మనంబడును.

### పతంగాదికీటకలక్షణము

పతంగాశ్శతపద్యశ్చ కర్ణః స్రోతఃప్రవిశ్యహి,
అరతిం వ్యాకులత్వం చ భృశం కుర్వంతి వేదనామ్. 316
కర్ణో నిస్తుద్యతే తస్య తథావై ఫుర్ఫురాయతే,
కీటే చరతి రుక్తీవ్రా నిష్పందే మందవేదనా. 317

తా. మిడుత, జెఱ్ఱి, జోరీగ మొదలగునవి చెవిలో ప్రవేశించుటవలన నెమ్మది లేకుండుట, ప్రాణములు వ్యాకులమును జెందుట, మిక్కిలి వేదనగలుగుట, చెవిలో బొడుచునటు లుండుట, గుబగుబలాడుట, పురుగులు సంచరింపుచుండిన తీవ్రవేదనగలుగుట, సంచరింపక స్తబ్ధముగనుండిన వేదనతగ్గుట-అను నీలక్షణంబులు పతంగాదిక్రిముల వలన గలుగును.

### కర్ణవిద్రధిలక్షణము

క్షతాభిఘాతప్రభవస్తువిద్రధి ర్భవేత్తథాదోషకృతోపరఃపునః,
సరక్తపీతారుణమస్రమాస్రవేత్ప్రతోదధూమాయనదాహదోషవాన్.

తా. చెవియందు పుడక మొదలగువానిచేనేని, లేక దెబ్బచేనేని, గాయము దగులుటచేనేని, వాతాదిదోషములచేనేని విద్రధిజనించిన కర్ణవిద్రధి యనంబడును. అది పగిలిన వాతాదిదోషక్రమముగ ఎఱ్ఱగ, లేక పసుపువర్ణముగ, లేక అరుణవర్ణముగ రక్తము స్రవించుట, పొడిచినటులుండుట, పొగ వెడలునటులుండుట, మంట, శోషగలుగుట- అను నీలక్షణంబులు గలుగును.

### కర్ణపాకలక్షణము

కర్ణపాకస్తు పిత్తేన కోథవిక్లేదకృద్భవేత్,
కర్ణవిద్రధిపాకాద్వా జాయతే చాంబుపూరణాత్. 319

తా. పిత్తమువలనగాని, లేక కర్ణవిద్రధి పండుటవలనగాని, లేక చెవిలో నీళ్లు జేరుటవలనగాని, దౌర్గంధ్యము, ద్రవత్వము అనువానియుక్తముగ కర్ణపాకరోగము (అనఁగా కర్ణవ్రణము) గలుగును.

పూతికర్ణలక్షణము

పూయం స్రవతివా పూతి సజ్ఞేయః పూతికర్ణకః,

తా. చెవులయందు దుర్గంధముగ చీముకారుచుండిన పూతికర్ణ మనంబడును.

కర్ణశోధార్బుదార్శలక్షణము

కర్ణశోధార్బుదార్శాంసి జానీయాదుక్తలక్షణైః. 320

తా. కర్ణశోధ, కర్ణార్బుదము, కర్ణార్శస్సు అనువాని లక్షణములు పూర్వము వలెనే తెలియందగును.

వాతకర్ణరోగలక్షణము

నదోతిరుక్కర్ణమదస్యశోష స్స్రావ స్తను శ్చాశ్రవణంచవాతాత్,
(చరకే)

తా. వాతసంబంధమువలన చెవియందు నాదము, మిక్కుటముగ పోట్లు, చెవియందలి గులిమి శోషించుట, లేతగ స్రావము, చెవుడు గలుగును.

పిత్తజకర్ణరోగలక్షణము

శోధస్సరాగోదరణంవిదాహ స్సపీతపూతి స్రవణంచపిత్తాత్. 321

తా. పిత్తసంబంధమువలన చెవులు వాచి ఎఱ్ఱగనగుట, పగుళ్ళు, మంట, ఒకింత పసపుఛాయగ, దుర్గంధముగ స్రావము అను నీలక్షణంబులు గలుగును.

కఫజకర్ణరోగలక్షణము

వైశ్రుత్యకండూస్థిరశోథశుక్లా స్నిగ్ధాస్రుతిశ్లేష్మ * భవేతిరుక్చ,

తా. కఫసంబంధమువలన విపరీతముగ వినుపించుట, దురద, వాపు కఠినముగనుండుట, తెల్లగ, బంకగనుండుస్రావము, మిక్కుటముగ పోట్లు అనునీలక్షణంబులుగలుగును.

సన్నిపాతకర్ణరోగలక్షణము

సర్వాణిరూపాణిచ సన్నిపాతా త్స్రావశ్చతత్రాధికదోషవర్ణః.

తా. సన్నిపాతసంబంధమువలన సర్వదోష లక్షణయుక్తంబై అధికముగనుండు దోషవర్ణమైన స్రావము గలుగును.

కర్ణశోథలక్షణము

సౌకుమార్యచ్చిరోత్సృష్టే సహసాపి ప్రవర్ధతే,
కర్ణశోథో భవేత్పాళ్యాం సరుజః పరిపోటవాన్. 323

తా. సుకుమారములైన చెవితమ్మలకట్టి కొంతకాలమువఱకు వృద్ధిపఱచక నుపేక్షించి తదనంతరము శీఘ్రముగ వృద్ధిపఱచుటకై యత్నించుటచే వానియందు వేదన, పగుళ్ళు అనువానియుక్తముగ వాపు జనించును. ఇదియ కర్ణశోథ మనంబడును.

---

* భవేచ్చరుక్చ.

### పరిపోటకలక్షణము

కృష్ణారుణనిభ స్తబ్ధ స్సవాతా త్పరిపోటకః,

తా. వాతసంబంధమువలన నల్లగ, లేక ఎఱ్ఱగ, కఠినముగ నుండువాపు జనించి పగిలిన పరిపోటక మనంబడును.

### కర్ణోత్పాతలక్షణము

గుర్వాభరణసంయోగా త్తాడనా ద్ఘర్షణాదపి. 324
శోథః పాళ్యాం భవేచ్ఛ్యావో దాహపాకరుజాన్వితః,
రక్తోవా రక్తపిత్తాభ్యా ముత్పాత స్సగదోమతః 325

తా. చెవియందు భారముగల యాభరణముల ధరించుటచేనేని, అభిఘాతముచేనేని, లేక రుద్దుటచేనేని, రక్తపిత్తములు ప్రకోపించి చెవితమ్మెలయందు నీలము, లేక ఎఱుపుగలవాపును గలుగంజేయును. దానివలన మంట, పాకము, పోట్లుగలిగిన ఉత్పాత మనంబడును.

### కర్ణోన్మంథకలక్షణము

కర్ణంబలాద్వర్ధయతః పాళ్యాం వాయుః ప్రకుప్యతి,
సకఫం గృహ్య కురుతే శోఫం స్తబ్ధమవేదనమ్. 326
ఉన్మంథక స్సకండూకో వికారః కఫవాతజః,

తా. బలాత్కారమువలన చెవిరంధ్రమును వృద్ధిజెందించుటచే చెవియొక్క తమ్మెయందు వాతము ప్రకోపించి కఫముతోడజేరి కఠినమైన మందవేదనగలవాపును గలుగంజేసి దానియందు దురదను సదా గలుగంజేయుచుండిన ఉన్మంథక మనంబడును. ఇది కఫవాతజన్యంబులు.

### కర్ణదుఃఖవర్ధనలక్షణము

సంవర్ధ్యమానే దుర్విద్ధే కండూ దాహ రుజాన్వితః. 327
శోఫో భవతి పాకశ్చ త్రిదోషో దుఃఖవర్ధనః,

తా. విరుద్ధస్థలమునందు చెవితమ్మెనుకుట్టి వృద్ధిపఱచుటచే దురద, తాపము, పోటు, పాకము అనువానియుక్తముగ వాపును గలుగంజేసిన దుఃఖవర్ధ మనంబడును. ఇది త్రిదోషమువలన జనించును.

### కర్ణపరిలేహిలక్షణము

కఫాసృక్కృమిసంభూత స్సవిసర్పన్నిత స్తతః. 328
లిహేచ్ఛ శష్కులీం పాలీం పరిలేహీత్యసౌ స్మృతః,

తా. చెవితమ్మెయందు కఫరక్తక్రిములవలన వాపు జనించి నంతట తిరుగుచు క
పుటమునందు వ్యాపించి యందలిమాంసమును భక్షించిన పరిలేహి యనంబడును.

కర్ణగండమాలలక్షణము

శ్రవణాంతర్వ్రణం జాతం క్రిమిదుర్గంధసంయుతమ్. 32
తచ్ఛాంత్యర్థం వదిష్యామి భైషజ్యం లోకమోహనం,
(మాధవనిదానే

తా. చెవిలో వ్రణముజనించి క్రిమిదుర్గంధయుక్తంబై చీము గారుచుండిన క
గండమాల యనంబడును. ఇది హరించుటకై లోకమోహనకరమైన యౌషధము
వచించెదను.

భాషితం రేవణాసిద్ధై రసశ్శీతాంశునామకః. 33
అర్కపత్త్రరసైః కర్ణే న్నిక్షేప్యం కర్ణరోగజిత్,

తా. పండుజిల్లేడాకురసములో రేవణసిద్ధునిచే జెప్పంబడినశీతాంశురసమును గలి
యొకమండలము చెవిలో పోయుచుండిన అసాధ్యమయిన కర్ణరోగము (అనఁగా చీమ
గారుట) హరించును.

భల్లాతకాదితైలము

భల్లాతక శిలా తాళం తిలజం మూత్ర కుష్టకమ్. 33
పక్వంతైలావశేషం తు క్రిమిదుర్గంధహృద్భవేత్, (మాధవనిదానే

తా. జీడివిత్తులు, శిలాజిత్తు, తాళకము, చెంగల్వకోష్టు-వీనిని సమభాగములుగ
కల్కముజేసి అందు నూనె, గోమూత్రము గలిపి చిక్కగ తైలముగాచి చెవిలో పోయు
చుండిన క్రిమిదుర్గంధములతో గూడియుండు కర్ణరోగము హరించును.

గీ. తామ్రభస్మంబు శ్రవణరంధ్రములనిడియ, నింబఫలసార మామిఁద
నెమ్మిఁ బోయ, నిశ్చయంబుగ మాను మాసితముగాను, జిరతరం
బైన చెవిలోనిచీము లెల్ల.

(గంధకతైలమునుగాని, గుగ్గిలతైలమునుగాని, చెవిలో వేయుచుండిన చీముగారుట
మానును. పైకర్ణరోగములయం దౌషధములను రెండుమాసములు చెవిలో బోయుచుండ
వలయును.)

గీ. హరిదళము మాదిఫలమును నమర భాగ, మూత్రమున మర్దనము
చేసి శ్రోత్రములను, నిడియుఁ దన్మూత్రమునుబోయ నిఖిలజనుల,
చెవులయందును కారెడిచీము మాను.

క. సారుప్పు నిమ్మపులుసును, నారూఢిగఁ గర్ణరంధ్రమందులఁ బోయ
న్నేరీతియైన చీములు, ధారుణిలో మానుసుమ్ము తథ్యం బరయన్.

క. పెన్నేరుగడ్డరసమును, బన్నుగ నల్లంపురసము బాగుగఁ గ్రోలక
రెన్నెల్లలోన మానును, జెన్నారఁగ మురికిగల్లు చెవిలోచీముల్.

శృంగబేరాదితైలము

శృంగబేరరసం క్షౌద్రం సైంధవం తైలమేవ చ. 332
కటూష్ణం కర్ణయో ర్ధార్యమేతత్స్యా ద్వేదనాపహం,

తా. అల్లపురసములో తేనె, సైంధవలవణము, తెల్లావనూనె గలిపి తైలము శేషించునటుల కాచి కించిదుష్ణముగ చెవిలోవేసిన కర్ణశూల హరించును.

లశునాదిస్వరసము

లశునార్ద్రక శిగ్రూణాం వరుణా మూలకస్య చ. 333
కదళ్యా స్స్వరసశ్శ్రేష్ఠో కటూష్ణః కర్ణపూరణే,

తా. తెల్లగడ్డలు, అల్లము, మునగ, ఉలిమిడివేరు, ముల్లంగి, అరటి-దీనిరసమును ఆవనూనెతోగలిపి కాచి కించిదుష్ణముగ జెవిలోవేసిన కర్ణశూల హరించును.

అర్కాంకురాదిస్వరసము

అర్కాంకురా నమ్లపిష్టా న్సతైలాన్ లవణాన్వితాన్. 334
సన్నిదధ్యా త్స్నుధాకాండే పూరితే మృత్స్నయావృతే,
పుటపాకే తయా స్విన్నం పీడయేదారసాగమాత్.
సుఖోష్ణం తద్రసం కర్ణే ప్రక్షిపే చ్ఛూలశాంతయే,

తా. జిల్లేడుచిగుళ్ళను నిమ్మపండ్లరసములో నూరి అందు నూనె, ఉప్పుగలిపి కల్కముజేసి దీనిని తొలచఁబడిన పచ్చబొంతజెముడుమ్రానిలో, నునిచి దానిపై మూసి చీలమన్ను లేపనముజేసి పుటపాకమునం దునిచి పక్వముచేసి రసమును పిండికొని సుఖోష్ణముగ చెవిలోవేసిన కర్ణశూల హరించును.

అర్కపత్రరసము

అర్కస్యపత్రం పరిణామపీత మాజ్యేనలిప్తం శిఖియోగతప్తం,
ఆపీడతస్యాంబుసుఖోష్ణమేవ కర్ణేనిషిక్తం హరతేతి శూలమ్. 336

తా. పండినజిల్లేడాకులకు నెయ్యిబట్టించి చేతికి నంటించుకొని నిప్పుమీఁద వెచ్చజేసి రసమును బిండికొని సుఖోష్ణముగ చెవిలోవేసిన కర్ణశూల హరించును.

శ్యోనాకతైలము

తైలం శ్యోనాకమూలేన మందేఽగ్నౌ విధినా శ్రృతం,
హరేదాశు త్రిదోషోత్థకర్ణశూలం ప్రపూరణాత్. 337

తా. దుందిలపువేరు కల్కములో నూనె గలిపి మందాగ్నితో పక్వముజేసి చెవిలోవేసిన త్రిదోషజకర్ణశూల శీఘ్రముగ హరించును.

### హింగ్వాదితైలము

హింగు సైంధవ శుంఠీభి స్తైలం సర్షపసంభవం,
విపక్వం హంతి తేఽవశ్యం కర్ణశూలం ప్రపూరయేత్. 338

తా. ఇంగువ, సైంధవలవణము, శొంఠి-వీనికల్కములో తెల్లనియావనూనెను గలిపి పక్వముజేసి చెవిలోవేసిన నిశ్చయముగ కర్ణశూల హరించును.

### నాగరాదితైలము

నాగరసైంధవమాగధిముస్తా హింగువచాలశునంతిలతైలం,
అర్కసుపక్వపలాశరసేన కర్ణరుజం బధిరం వినిహంతి. 339

తా. శొంఠి, సైంధవలవణము, పిప్పలి, తుంగముస్తెలు, ఇంగువ, వస, వెల్లుల్లిపాయలు అనువానికల్కములో నువ్వులనూనె, పండుజిల్లేడాకురసము, మోదుగరసము గలిపి చిక్కగగాచి చెవిలోవేసిన కర్ణరోగము, చెవుడు హరించును.

### అపామార్గతైలము

అపామార్గక్షారజలే తత్కృతకల్కేన సాధితం తిలజం,
అపహరతి కర్ణనాదం బాధిర్యంచాపి పూరణతః. 340

తా. ఉత్తరేణుక్షారోదకము, ఉత్తరేణుకల్కము-వీనిలో నువ్వులనూనె గలిపి కాచి చెవిలోవేసిన కర్ణనాదము, చెవుడు హరించును.

### హింగ్వాదితైలము

హింగ్వబ్ద దారు మిసి మూలకభస్మ భూర్జ
త్వక్క్షార సింధురుచకోద్భిద శిగ్రు విశ్వైః,
సస్వర్జికా బిడవ చాంజన మాతులుంగై
రంభారసైః స్వమధుసూక్త మిదం విపక్వమ్. 341
తైలం ప్రసిద్ధమితి తచ్ఛ్రివణామయఘ్నం
కర్ణప్రణాదబధిరత్వహరం నరాణాం,
భూరి మస్తక శ్రవణ శష్కులికాంతరాళ
శూలాపహం చరక సుశ్రుత పూజితం చ 342

తా. ఇంగువ, తుంగముస్తెలు, దేవదారు, పెద్దసదాప, ముల్లంగిభస్మము, భుజపత్రము, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, అట్టుప్పు, లేక పట్టిఉప్పు, మునగ, శొంఠి, సర్జక్షారము, బిడాలవణము, * సురమకాయి, మాదీఫలరసము, అరటిరసము, మధుసూక్తము- వీనికల్కములో నువ్వులనూనె గలిపి చిక్కగ గాచి చెవిలో

* సురమ యన తురకలు సాధారణముగ అంజనము వేసికొనెడి నల్లకాయి.

వేసిన కర్ణరోగము, కర్ణనాదము, చెవుడు, కనుబొమలు, శిరము, చెవి, చెవితమ్మె - వీని యందలిశూల హరించునని చరక సుశ్రుతగ్రంథములయందు జెప్పంబడియెను.

బిల్వతైలము

గవాంమూత్రేణ బిల్వాని పిష్ట్వా తైలం విపాచయేత్,
సజలం చ సదుగ్ధం చ తద్బాధిర్యహరం పరమ్. (మాధవనిదానే)

తా. బిల్వకాయను నావుపంచితముతో నూరి అం దుదకము, మేకపాలు, నూనె గలిపి కాచి చెవిలోవేసిన చెవుడు హరించును.

దీపికాతైలము

బృహతః పంచమూలస్య కాండాన్యష్టాంగులాని చ,
క్షౌమేణావేష్ట్య సంసిచ్య తైలేనాదీపయేత్తతః. 344
యత్తైలం చ్యవతే తేభ్య స్సుఖోష్ణం తేన పూరయేత్,
జ్ఞేయం తద్దీపికాతైలం కుష్ఠం దేవతరో స్తథా. 345

తా. ఎనిమిదంగుళముల ప్రమాణముగల బృహత్పంచమూలములను కట్టగట్టి దానికి తెల్లపట్టుగుడ్డను జుట్టి నూనెలో బాగుగ దడిపి వెలిగించి యందు స్రవించెడి తైలమును గ్రహించి సుఖోష్ణముగ చెవిలోవేసినను, ఇంక చెంగల్వకోష్టు, దేవదారు అనువానియందు పైప్రకారమే తైలమును దీసి చెవిలోవేసినను చెవుడు హరించును.

నిర్గుండ్యాదితైలము

నిర్గుండిజాతిరవిభృంగరసోనరంభా కార్పాసశిగ్రు సురసార్ద్రికకారవేల్యాః,
ఏషాంరసేతిలభవంసవిషంసుపక్వం బాధిర్యనాదకృమి వేదనపూయముక్తే.

తా. వావిలి, జాజియాకు, జిల్లేడు, గుంటగలగర, వెల్లుల్లి, అరటి, ప్రత్తికాయ, మునగ, తులసి, అల్లము, కాకర అనువానిరసములో నువ్వులనూనె గలిపి అందొకింత వసనాభిని వైచి సిద్ధముజేసి చెవిలో వేసిన చెవుడు, కర్ణనాదము, క్రిములు, శూల, చీము గారుట హరించును.

బీజపూరరసము

సర్జకాచూర్ణసంయుక్తం బీజపూరరసం క్షిపేత్,
కర్ణస్రావ రుజాదౌతు ప్రశస్తం నాత్రసంశయః. 347

తా. మాదీఫలరసము సర్జక్షారమును గలిపి చెవిలోవేసిన కర్ణస్రావము, శూల మొదలగునవి నిస్సంశయముగ హరించును.

సముద్రఫేనచూర్ణము

సముద్రఫేనచూర్ణం తు న్యస్తం శ్రవణసంశ్రవే,
పూయస్రావం వ్రణం సాంద్రం హంతి ధ్వాంతమివాంశుమాన్

తా. సముద్రపునురుగు చూర్ణమును చెవిలో వేసిన "సూర్యుం డంధకారమును హరింపంజేయుభంగి" చెవిచీము, వ్రణము, బంక వీనిని హరింపంజేయును.

సర్జత్వక్చూర్ణము

సర్జత్వక్చూర్ణసంయుక్తం కార్పాసీఫలజోరసః,
మధుసంమిశ్రిత స్సాధు కర్ణస్రావే ప్రశస్యతే. 349

తా. ప్రత్తికాయలరసములో గుగ్గిలపుపట్టచూర్ణమును, తేనెను గలిపి చెవిలో వేసిన కర్ణస్రావము హరించును.

కర్ణస్రావచికిత్స

జంబ్వామ్రపత్రంతరుణంసమాంశం కపిత్థకార్పాసఫలంచసార్ద్రం,
ధృత్వారసంతన్మధునావిమిశ్రం స్రావాపహంసంప్రవదంతితజ్జ్ఞాః. 350
ఏతైశ్శృతంనింబకరంజతైలం ససార్షపం స్రావహరం ప్రదిష్టం,

తా. పండిన నేరేడాకులను, పండిన మామిడాకులను సమభాగములుగ చూర్ణము జేసి అందు లేతవెలగకాయరసమును, ప్రత్తికాయలరసమును, తేనెను గలిపి చెవిలో వేసినను, లేక పైద్రవ్యములతోడ వేప, కానుగ అనువానినిజేర్చి అం దావనూనెను గలిపి చిక్కగగాచి చెవిలోవేసినను కర్ణస్రావము హరించును.

కర్ణరోగమునకు రాస్నాదిచూర్ణము

రాస్నామృతైరండసురాహ్వావిశ్వంతుల్యంవిచూర్ణ్యాథవిమిశ్ర్యఖాదేత్
వాతామయీ కర్ణశిరోగదీచ నాడీవ్రణీచాపిభగందరీచ, (రసరత్నాకరే)

తా. సన్నరాస్నము, తిప్పతీగె, ఆముదపువేరు, దేవదారు, శొంఠి-వీనిని చూర్ణమును సమభాగములుగ జేర్చి సేవించిన వాతరోగము, కర్ణరోగము, శిరోరోగము, నాడీవ్రణము, భగందరము హరించును.

కృమికర్ణచికిత్స

హలినివిభక్తివ్యోషా నేకీకృత్య ప్రకల్పయే ద్బద్ధ్వా,
వసనాంతరరసేనవ శ్రవణే పరిపూరయేద్యుక్త్యా. 352
కర్ణజలౌకా నియతం కృమి కీట పిపీలికా స్తథాన్యేపి,
నిపతంతి నిర్విశేషాః కారండాశ్చాపి ముండస్థాః. 353

తా. చెన్నచెర్లగడ్డ, గుంటగలగర, త్రికటుకములు-వీనిని నూరి బట్టలో గట్టి చెవిలో యుక్తిగబిండిన కర్ణములయిందలి సల్ల జెఱ్ఱి, పురుగులు, కీటకములు, చీములు, తలలోనిపురుగులు ఊడిపడును.

### కర్ణవిద్రధిచికిత్సాక్రమము

విద్రధౌయాశ్చ కుర్వంతి విద్రధ్యుక్తం చికిత్సితమ్. 354

తా. కర్ణవిద్రధియందు సామాన్యవిద్రధి చికిత్సం జేయవలయును.

### ఆమ్రాదితైలము

ఆమ్ర జంబూ ప్రవాళాని మధూకస్య వటస్య చ,
ఏభిస్తు సాధితం తైలం పూతికర్ణగదం హరేత్. 355

తా. మామిడి, నేరేడు, ఇప్ప, మఱ్ఱి అనువాని చిగుళ్లకల్కములో తైలము గలిపి కాచి చెవిలో వేసిన చీముగారుట హరించును.

### గంధకతైలము

చూర్ణేనగంధకశిలారజనీభవేన ముష్ట్యంశకేనకటుతైలపలాష్టకం తు,
ధత్తూరపత్రరసతుల్యమిదంవిపక్వంనాడీజయేచ్చిరభవామపికర్ణజాతామ్.

తా. గంధకము, మణిశిల, పసుపు - వీనిని నాలుగురూపాయలయెత్తు చూర్ణము జేసి అందు 3-౦ రూపాయలయెత్తు తెల్లావనూనె, 3-౦ రూపాయలయెత్తు ఉమ్మెత్తాకు రసముగలిపి పక్వముజేసి చెవిలోవేసిన దీర్ఘకాలముగనుండు కర్ణనాడీరోగము హరించును.

### శతావరీతైలము

శతావరీ వాజిగంధా పయస్యైరండబీజకైః,
తైలం విపక్వం సక్షీరం పాలీం సంవర్ధయేత్సుఖమ్. 357

తా. పిల్లిపీచర, పెన్నేరుగడ్డ, ఆముదపువిత్తులు - వీనిని పెరుగుమీఁదినీరుతో నూరి కల్కముజేసి అందు నూనె, పాలు గలిపి కాచి లేపనముజేయుచుండిన చెవితమ్మెలు సుఖముగవృద్ధిజెందును.

### జీవనీయతైలము

జీవంత్యాచాశ్వగంధార్క వాకుచీబీజ సైంధవైః,
హాలినీ సురసాభ్యాం చ గోధా కంక వసాన్వితమ్. 358
తైలం విపక్వ మభ్యంగా దున్మథం నాశయే ద్ధ్రువం,

తా. పాలచేర, పెన్నేరుగడ్డ, జిల్లేడుపాలు, భావంచివిత్తులు, సైంధవలవణము చెన్నచెర్లగడ్డ, తులసి, ఉడుము, గద్ద అనువానిక్రొవ్వుల నేకముజేసి తైలములో గలిపి గాచి అభ్యంజనముజేసిన ఉన్మంథకము శీఘ్రముగ హరించును.

### కర్ణరోగమునందు పథ్యము

గోధూమా శ్శాలయో ముద్గా యవాశ్చాపి ఘృతం తథా. 359
లావో మయూరో హారిణ స్తిత్తిరి ర్వనకుక్కుటః,
పటోలం శిగ్రు వార్తాకం సునిషణ్ణం కటిల్లకమ్. 360

రసాయనాని సర్వాణి బ్రహ్మచర్య మభాషణం,
ఉపయుక్తం యథాదోష మిదం కర్ణామయే హితమ్. 3

(మాధవనిదా

తా. గోధుమలు, వరిబియ్యము, పెసలు, యవలు, నెయ్యి, లావుకపిట్ట, నెమ జింక, తిత్తిరిపక్షి, అడవికోడి, పొట్లకాయ, మునగ, వంకాయ, చెంచలికూర, కా కాయ, సర్వరసాయనములు, బ్రహ్మచర్యము, మాటలాడకుండుట - ఇవి కర్ణమునం దోషానుగుణముగ పథ్యకరంబులు.

కర్ణరోగమునం దపథ్యము

దంతకాష్ఠం శిరస్స్నానం వ్యాయామం శ్లేష్మలం గురు,
కండూయనం తుషారం చ కర్ణరోగీ పరిత్యజేత్. 3

తా. దంతకాష్ఠము, శిరస్స్నానము, సంచారము, కఫకరాన్నము, జడాన్నవ గోకుట, మంచు-వీనిని కర్ణరోగముగలవారు వర్జించవలయును.

---

ముఖరోగనిదానము.

ఓష్ఠరోగసంప్రాప్తి

ఆనూపపిశిత క్షీర దధి మాషాది సేవనాత్,
ముఖమధ్యే గదా న్కుర్యుః క్రుద్ధా దోషాః కఫోత్తరాః. 3

(ఆయుర్వేదే

తా. జలచరజంతుమాంసము, పాలు, పెరుగు, ఉద్దులు, మొదలగు పదార్థముల మిక్కుటముగ సేవించుటచే కఫప్రధానమగు వాతాదిదోషములు ప్రకోపించి నో యందు రోగములు గలుగంజేయును.

ముఖరోగసంఖ్య

దంతే ష్వష్టా వోష్ఠయోశ్చ మూలేషు దశ పంచ చ,
నవ తాలూని జిహ్వాయాం పంచ సప్తదశాస్యయోః. 36
కంఠే త్రయ స్సర్వసరా ఏకషష్టిశ్చతుఃపరా,

తా. దంతరోగములు ౮, పెదవిరోగములు ౮, దంతమూలరోగములు ౧౫, దౌడరోగములు ౯, నాలుకరోగములు ౫, కంఠరోగములు ౧౭, సర్వసరరోగములు 3 ఇటుల ముఖరోగములు ౬౫ విధంబులు.

వాతికోష్ఠరోగలక్షణము

కర్కశౌ పరుషౌ స్తబ్ధౌ కృష్ణౌ తీవ్రరుజాన్వితౌ. 365
దాల్యేతే పరిపాట్యేతే ఓష్ఠౌ మారుతకోపతః,

తా. పెదవి గరగరలాడుట, కఠినముగ, జడముగ, నల్లగనుండుట, తీవ్రమైన పీడతోఁగూడియుండుట, పగలుట, చర్మముపీడుట-ఈలక్షణములుగలది వాతికౌష్ఠరోగమని తెలియవలయును.

## పైత్తికౌష్ఠరోగలక్షణము

చీయేతే పిటికాభిస్తు సరుజాభి స్సమంతతః. 366
సదాహపాకపిటికౌ పీతాభాసౌ చ పిత్తతః,

తా. పెదవులయందంతట చిడుములులేచి నొచ్చుట, పెదవులు మండుట, పాకమును జెందుట, కురుపులు పసుపువర్ణముగ నుండుట - ఈలక్షణములుగలది పైత్తికోష్ఠరోగమని తెలియవలయును.

## శ్లేష్మకౌష్ఠలక్షణము

సవర్ణాభిస్తు చీయేతే పిటికాభిరవేదనౌ. 367
భవతస్తు కఫా దోష్ఠౌ పిచ్ఛిలౌ శీతలౌ గురూ,

తా. పెదవి చర్మముతో సమానవర్ణముగలదై చిడుములతో వ్యాప్తంబైయుండుట, ఒకింతనొచ్చుట, జిగటగనై చల్లగ, జడముగనుండుట-ఈలక్షణములు గలది కఫజౌష్ఠరోగమని తెలియవలయును.

## సాన్నిపాతకౌష్ఠరోగలక్షణము

సకృత్కృష్ణౌ సకృత్పీతౌ సకృచ్ఛ్వేతౌ తథైవచ. 368
సన్నిపాతేన విజ్ఞేయా వనేకపిటికాన్వితౌ,

తా. పెదవు లొకానొకపుడు నల్లగ, మఱియొకపుడు పసపుగ, వేరొకపుడు తెల్లగనుండుట, పెక్కుచిడుములతో వ్యాప్తంబైయుండుట, ఈలక్షణములు గలది సన్నిపాతకౌష్ఠరోగమని తెలియవలయును.

## రక్తజౌష్ఠరోగలక్షణము

ఖర్జూరీఫలవర్ణాభి పిటికాభి ర్నిపీడితౌ. 369
రక్తోపసృష్టౌ రుధిరం స్రవత శ్శోణితప్రభౌ,

తా. పెదపైని ఖర్జూరపుకాయతో సమానమైన వర్ణముగల కురుపులు జనించి రక్తముగారుట, పెదవి రక్తమువలె నెఱ్ఱగనుండుట-ఈలక్షణములుగలది రక్తజౌష్ఠరోగమని తెలియవలయును.

## మాంసజౌష్ఠరోగలక్షణము

మాంసదుష్టౌ గురూ స్థూలౌ మాంసపిండవదుద్గతౌ. 370
జంతవశ్చాత్ర మూర్ఛంతి నరస్యోభయతోముఖాత్,

రెండుసెలవులయందుతప్ప తక్కిన పెదవులయందు పురుగులుజనించుట - ఈలక్షణములు గలది మాంసజౌష్ఠరోగమని తెలియవలయును.

మేదజౌష్ఠరోగలక్షణము

సర్పిర్మండప్రతీకాశౌ మేదసా కండురౌ గురూ. 371
స్వచ్ఛం స్ఫటికసంకాశ మాస్రావం స్రవతోభృశం,
తయోర్వ్రణో నసంరోహే న్మృదుత్వం చ నగచ్ఛతి. 372

తా. పెదవి పేరిననేతివలె తెల్లగ, దురదతో గూడినదిగ, జడముగనుండుట, పెదవియందు స్ఫటికమువలె స్వచ్ఛముగనుండు స్రావం బధికముగ గలుగుట, పెదవిపైగలిగిన వ్రణమాంసపూరితముగాయుండుట, కఠినముగనుండుట-ఈలక్షణములు గలది మేదజౌష్ఠరోగమని తెలియవలయును.

అభిఘాతజౌష్ఠలక్షణము

ఓష్ఠౌపర్యవదీర్యేతే పీడ్యేతేచాభిఘాతతః,
గ్రంథితౌ చ తదాస్యాతాం కండూ క్లేదసమన్వితౌ. 373

తా. పెదవిచుట్టుచీలుట, పోట్లు, గంట్లుగలుగుట, దురదగలిగి బంకగ నుండుట-ఈలక్షణములు గలది అభిఘాతజౌష్ఠరోగమని తెలియవలయును.

---

## దంతమూలగతరోగములు

శీతాదలక్షణము

శోణితం దంతవేష్టేభ్యో యస్యాకస్మాత్ప్రవర్తతే,
దుర్గంధీని సకృష్ణాని ప్రక్లేదీని మృదూని చ. 374
దంతమాంసాని శీర్యంతే పచంతీ చ పరస్పరం,
శీతాదోనామ సవ్యాధిః కఫశోణితసంభవః. 375

తా. దంతములనుండి యకస్మాత్తుగ రక్తము వెడలుట, దంతములయొక్క మాంసము దుర్గంధమై నల్లనై తడిసి మృదువై వీడుట, ఒకదంతముయొక్క పైమాంసము పండిన మఱియొకదానిమాంసమును పండించుట-ఈలక్షణములుగలది శీతాదమను దంతరోగమని తెలియవలయును. ఇది కఫరక్తమువలన గలుగును.

దంతపుప్పుటలక్షణము

దంతయోస్త్రిషువా యస్య శ్వయథుర్జాయతే మహాన్,
దంతపుప్పుటకోనామ సవ్యాధిః కఫరక్తజః. 376

తా. రెండు, లేక మూడుదంతమూలములయందు గొప్పగ వాపుజనించిన దంతపుప్పుటమని తెలియవలయును, ఇది కఫరక్తమువలన జనించును.

### దంతవేష్టలక్షణము.

స్రవంతి పూయం రుధిరం చలా దంతా భవంతి చ,
దంతవేష్ట స్సవిజ్ఞేయో దుష్టశోణితసంభవః. 377

తా. రక్తము, దుష్టంబగుటచే దంతమువలన రక్తము, చీము గారుచు గదలు చుండిన దంతవేష్టమని తెలియవలయును.

### సౌషిరలక్షణము

శ్వయథు ర్దంతమూలేషు రుజావా& కఫరక్తజః,
లాలాస్రావీ సవిజ్ఞేయ స్సౌషిరో నామనామతః. 378

తా. కఫరక్తమువలన దంతమూలములయందు వాపు జనించి నొప్పిగలిగి జొల్లు గారుచుండిన సౌషిరమని తెలియవలయును.

### మహాసౌషిరలక్షణము

దంతా శ్చలంతి వేష్టేభ్య స్తాలుచాప్యవదీర్యతే,
యస్మిన్సర్వగతో వ్యాధి ర్మహాసౌషిరసంజ్ఞకః 379

తా. త్రిదోషమువలన దంతమూలములు కదలుట, అంగిలి పగలుట-ఈలక్షణములుగలది మహాసౌషిరమని తెలియవలయును.

### పరిదరలక్షణము

దంతమాంసాని శీర్యంతే యస్మి& ష్ఠీవతిచాప్యసృక్,
పిత్తాసృక్కఫజో వ్యాధిర్జ్ఞేయః పరిదరో హిసః. 380

తా. దంతమాంసముపీడి యుమిసిన రక్తముపడిన పరిదరమని తెలియవలయును. ఇది పిత్తరక్తకఫములవలన గలుగును.

### ఉపకుశలక్షణము

వేష్టేషు దాహః పాకశ్చ తాభ్యాం దంతా శ్చలంతి చ,
ఆఘాకృతాః ప్రస్రవంతి శోణితం మందవేదనాః. 381
ఆధ్మాయంతే స్రుతే రక్తే ముఖే పూతిశ్చ జాయతే,
యస్మి న్నుపకుశో నామ పిత్తరక్తకృతో గదః. 382

తా. దంతమూలముల నాశ్రయించియుండుమాంసమునందు తాపముజనించి పండుటవలన దంతములు కదలుట, ముఖమునుపంచిన నొకింతవేదనగలిగి రక్తముపడుట, రక్తము పడినపిదప మాంసముపండి మరలపొక్కుట, నోటియందు దుర్గంధము వెడలుట, పిత్త రక్త కృతవికారయుక్తంబై యుండుట-ఈలక్షణములుగలది ఉపకుశ మని తెలియవలయును.

### వైదర్భలక్షణము

ఘృష్టేషు దంతమూలేషు సంరంభో జాయతే మహాన్,
భవంతి చపలా దంతా స్సవైదర్భోఽభిఘాతజః. 383

తా. దంతము నాశ్రయించియుండు మాంసమును దృఢముగ తోముటచే నధికముగ వాపుగలిగి దంతములు గదలుచుండిన వైదర్భమని తెలియవలయును. ఇది యభిఘాతమువలన గలుగును.

### ఖల్లీవర్ధనలక్షణము

మారుతేనాధికోదంతో జాయతే తీవ్రవేదనః,
ఖల్లీవర్ధనసంజ్ఞో వై జాతేరుక్చ ప్రశామ్యతి. 384

తా. వాతసంబంధమువలన పంటిపై మఱియొకపల్లుజనించుట, అది గలుగునపుడు మిక్కుటముగ పోట్లుగలుగుట, పెరిగిన వేదనశమించుట - ఈలక్షణములు గలది ఖల్లీవర్ధనమని తెలియవలయును.

### కరాళలక్షణము

శనైశ్శనైః ప్రకురుతే వాయుర్దంతసమాశ్రితః,
కరాళా న్వికటా న్దంతా స్కరాళో నచ సిధ్యతి. 385

తా. వాతము దంతమూలముల నాశ్రయించి మెల్లమెల్లగ దంతముల వంకరగ జేయుచుండిన కరాళమని తెలియవలయును. ఇది యసాధ్యంబులు.

### అధిమాంసకలక్షణము

హానవ్యే పశ్చిమేదంతే మహాంశోథో మహారుజః,
లాలాస్రావీ కఫకృతో విజ్ఞేయో హ్యధిమాంసకః. 386

తా. దౌడకొనలో పంటిమూలమునందు లావుగ వాపుజనించి కడుపోటును గలుగంజేయుచు మిక్కుటముగ జొల్లును గార్చుచుండిన అధిమాంసకమని తెలియవలయును. ఇది కఫమువలన జనించును.

### నాడీవ్రణలక్షణము

దంతమూలగతానాడ్యః పంచజ్ఞేయా యథేరితాః. 387

తా. నాడీవ్రణము వాత, పిత్త, కఫ, సన్నిపాత, ఆగంతుక భేదములవలన నైదు విధంబులని జెప్పంబడియెను. అవి దంతమూలములయందును జనించును. (మఱియు నిదివఱకు జెప్పంబడిన ౧౧ విధములైన దంతలక్షణంబులును, ౫ విధములైన నాడీదంతలక్షణంబులును జేరి ౧౬. విధంబులగును. ఐనను కరాళమనునది సుశ్రుతాచార్యుని మతమునం దధికంబగుటచే దానిలక్షణమును నిచట నుదహరింపంబడియెను.)

# దంతరోగములు

## దాలనలక్షణము

దీర్యమాణేష్వివ రుజా యస్యదంతేషు జాయతే,
దాలనోనామ సవ్యాధి స్సదాగతినిమిత్తజః. 388

తా. దంతములు పగులఁగొట్టఁబడినటుల పీడగలిగిన దాలన మనంబడును. ఇది వాతమువలన జనించును.

## కృమిదంతలక్షణము

కృష్ణచ్ఛిద్ర శ్చలస్రావీ ససంరంభో మహారుజః,
అనిమిత్తరుజోవాతా త్సజ్ఞేయః కృమిదంతకః. 389

తా. వాతసంబంధమువలన దంతములయందు నల్లనిఛిద్రములు గలిగి కదలుచు, స్రావమునుజేయించుచు వాపు, మిక్కుటముగ పోట్లు, నిష్కారణముగ నొప్పిగలిగిన కృమిదంత మనంబడును. (దీనియందు నల్లనిఛిద్రములు, క్రిములు దుష్టరక్తమువలన గలుగును.)

## భంజనకలక్షణము

వక్త్రం వక్రం భవేద్యస్య దంతభంగశ్చ జాయతే,
కఫవాతకృతో వ్యాధి స్సభంజనకసంజ్ఞితః. 390

తా. నోరు వంకరగనై దంతములువీడిన భంజన మనంబడును. ఇది కఫవాత ప్రకోపమువలన జనించును.

## దంతహర్షలక్షణము

శీత రూక్ష ప్రవాతామ్ల స్పర్శానామ సహిష్ణవాః,
పిత్తమారుతకోపేన దంతహర్షస్సనామతః. 391

తా. శీతలము, రూక్ష, పులుసుగలపదార్థస్పర్శవలన, గాలితగులుటవలన సహించుట కశక్యంబుగనుండిన దంతహర్ష మనంబడును. ఇది పిత్త, వాత, ప్రకోపమువలన జనించును. (మఱియు నిది వాతజన్యంబైయుండినను వ్యాధిస్వభావమువలన నుష్ణమును సగా సహించుట కశక్యంబైయుండును.)

## దంతశర్కరలక్షణము

మలోదంతగతో యస్తు పిత్తమారుతశోషితః,
శర్కరేవ ఖరస్పర్శా సా జ్ఞేయా దంతశర్కరా. 392

తా. దంతగతమలము పిత్త, వాతములవలన శోషించుటచే నిసుకవలె గరగర లాడుచుండినద [illegible] ంబడును.

## కపాలికాలక్షణము

కపాలేష్వివ దీర్ణేషు దంతానాంసైవ శర్కరా,

కపాలికేతి సా జ్ఞేయా సదా దంతవినాశినీ. 393

తా. పైఁజెప్పంబడిన దంతశర్కర (దంతమలము) చిల్లపెంకులవలె పగిలిన దంతశర్కర యనంబడును. ఇది యెల్లపుడు దంతముల నశింపంజేయుచుండును.

శ్యావదంతలక్షణము

యోసృఙ్మిశ్రేణ పిత్తేన దగ్ధో దంత స్త్వశేషతః,
శ్యావతాం నీలతాం వాపి గత స్సశ్యావదంతకః. 394

తా. రక్తయుక్తపిత్తమువలన దంతములయందంతట కాలినట్లు నల్లగాని, లేక నీలముగాని యుండిన శ్యావదంత మనంబడును.

హనుమోక్షలక్షణము

వాతేనతై స్తైర్భావై స్తు హనుసంధిర్వియుహతః,
హనుమోక్షఇతిజ్ఞేయో వ్యాధిరర్దితలక్షణః. 395

తా. వాతసంబంధమువలన, అభిఘాతాదులవలన, జెక్కటిసంధులువీడిన హనుమోక్ష మనంబడును. ఇది అర్దితలక్షణయుక్తంబై యుండును.

---

## జిహ్వాగతరోగములు

వాతజలక్షణము

జిహ్వానిలేనస్ఫుటితాప్రసుప్తా భవేచ్చశాకచ్ఛదనప్రకాశా,

తా. నాలుకపగిలి మొద్దుపారి (అనఁగా రసజ్ఞానవిహీనంబై) మిట్టభూముల యందు జనించు వృక్షములయొక్క యాకువలె గరగరలాడుచుండిన వాతజిహ్వకమని తెలియవలయును.

పిత్తజలక్షణము

పిత్తేనపీతాపరిదహ్యతేచ దీర్ఘైస్సరక్తైరపికంటకైశ్చ. 396

తా. నాలుక పసపువర్ణముగలదై దాహయుక్తంబై పొడవై ఎఱ్ఱగనుండు ముండ్లతో వ్యాప్తంబైయుండిన పిత్తజిహ్వకమని తెలియవలయును.

కఫజలక్షణము

కఫేనగుర్వీబహులాచితాచ మాంసోచ్ఛ్రయైశ్శాల్మలికంటకాభైః.

తా. నాలుక జడముగ, బూరుగముండ్లవంటి మాంసపుమొలకలచే కడువ్యాప్తంబుగనుండిన కఫజిహ్వకమని తెలియవలయును.

అలాసలక్షణము

జిహ్వాతలేయశ్శ్వయథుః ప్రగాఢ స్సోలాససంజ్ఞః కఫరక్తమూర్తిః,
జిహ్వాంసతు స్తంభయతి ప్రవృద్ధో మూలేచ జిహ్వా భృశమేతిపాకం.

తా. కఫరక్తమువలన నాలుకయందు భయంకరమైన వాపుగలిగిన అలసక మనంబడును. ఇది వృద్ధింజెందిన నాలుకయందు స్తంభనమును నాలుకయొక్కమూలమునందు మిక్కుటముగ పాకమును గలుగంజేయును.

–౷ ఉపజిహ్వాకలక్షణము ౸–

జిహ్వాగ్రరూపశ్శ్వయథుస్సజిహ్వా ముున్నమ్య జాతఃకఫరక్తమూర్తిః,
లాలాకరఃకండుయుతస్సచోష స్సాతూపజిహ్వాకథితాభిషగ్భిః. 399

తా. కఫరక్తమువలన నాలుకకొనవలె వాపుజనించి పొడవై మిక్కుటముగ జొల్లు గార్చుచు దురద, మంటతోడంగూడియుండిన యుపజిహ్వాక మనంబడును.



## తాలుగతరోగములు

–౷ కంఠశుండిలక్షణము ౸–

శ్లేష్మాసృగ్భ్యాంతాలుమూలాత్ప్రవృద్ధోదీర్ఘశ్శోథోధ్మాతవస్తిప్రకాశః,
తృష్ణాకాసశ్వాసకృత్తంవదంతి వ్యాధింవైద్యాః కంఠశుండీదనామ్నా.

తా. కఫరక్తములవలన లోదౌడమూలమున నుబ్బినవస్తివలె దీర్ఘమైన వాపు గలిగి దప్పి, దగ్గు, ఉబ్బసమును గలిగియుండిన కంఠశుండి యనంబడును. (కంఠశుండి యన క్రిందినాలుకపడుట.)

–౷ తుండికేరిలక్షణము ౸–

శోథశ్శూలస్తోదదాహప్రపాకీ ప్రాగుక్తాభ్యాంతుండికేరీమతాతు,

తా. కఫరక్తమువలన శూల, పోట్లు, దాహము, పాకము మొదలగువానియుక్తముగ వాపుగలిగి యడవిప్రత్తికాయయాకారముగలదిగనుండిన తుండికేరి యనంబడును.

–౷ అధ్రువలక్షణము ౸–

శోథస్తబ్ధోలోహితస్తాలుదేశే రక్తాజ్జ్ఞేయస్సోధ్రువోరుగ్జ్వరశ్చ. 401

తా. లోదౌడయందు రక్తవికారముచే జడముగ, ఎఱ్ఱగనుండు వాపుజనించిపోట్లు తోడంగూడి జ్వరముగలిగిన అధ్రువ మనంబడును.

–౷ కచ్ఛపలక్షణము. ౸–

కూర్మోత్సన్నో వేదనోశీఘ్రజన్మా రోగోజ్ఞేయఃకచ్ఛపశ్శ్లేష్మణాతు,

తా. కఫదోషమువలన తాఁబేటిపీఁపువలె నుబ్బుగ, వేదనాయుక్తముగ నుండు వాపు సావకాశముగ జనించిన కచ్ఛప మనంబడును.

–౷ అర్బుదలక్షణము ౸–

పద్మాకారం తాలుమధ్యేతుశోథం విద్యాద్రక్తాదర్బుదంప్రోక్తలింగమ్.

తా. లోదౌడమధ్యముగ రక్తదోషమువలన తామరమిద్దెవలె వాపుజనించి అర్బుద నిదానోక్త రక్తార్బుర్బుదలక్షణయుక్తంబైయుండిన అర్బుద మనంబడును.

కపాలికేతి సా జ్ఞేయా సదా దంతవినాశినీ. 393

తా. పైఁజెప్పంబడిన దంతశర్కర (దంతమలము) చిల్లపెంకులవలె పగిలిన దంతశర్కర యనంబడును. ఇది యెల్లపుడు దంతముల నశింపఁజేయుచుండును.

శ్యావదంతలక్షణము

యోసృఙ్మిశ్రేణ పిత్తేన దగ్ధో దంత స్త్వశేషతః,
శ్యావతాం నీలతాం వాపి గత స్సశ్యావదంతకః. 394

తా. రక్తయుక్తపిత్తమువలన దంతములయందంతట కాలినట్లు నల్లగాని, లేక నీలముగాని యుండిన శ్యావదంత మనంబడును.

హనుమోక్షలక్షణము

వాతేనతైస్తైర్భావైస్తు హనుసంధిర్విసంహతః,
హనుమోక్షఇతిజ్ఞేయో వ్యాధిరర్దితలక్షణః. 395

తా. వాతసంబంధమువలన, అభిఘాతాదులవలన, జెక్కుటిసంధులువీడిన హనుమోక్ష మనంబడును. ఇది అర్దితలక్షణయుక్తంబై యుండును.

---

## జిహ్వాగతరోగములు

వాతజలక్షణము

జిహ్వానిలేనస్ఫుటితాప్రసుప్తా భవేచ్చశాకచ్ఛదనప్రకాశా,

తా. నాలుకపగిలి మొద్దుపారి (అనఁగా రసజ్ఞానవిహీనంబై) మిట్టభూములయందు జనించు వృక్షములయొక్క యాకువలె గరగరలాడుచుండిన వాతజిహ్వకమని తెలియవలయును.

పిత్తజలక్షణము

పిత్తేనపీతాపరిదహ్యతేచ దీర్ఘైస్సరక్తైరపికంటకైశ్చ. 396

తా. నాలుక పసపువర్ణముగలదై దాహయుక్తంబై పొడవై ఎఱ్ఱగనుండు ముండ్లతో వ్యాప్తంబైయుండిన పిత్తజిహ్వకమని తెలియవలయును.

కఫజలక్షణము

కఫేనగుర్వీబహులాచితాచ మాంసోచ్ఛ్రియైశ్శాల్మలికంటకాభైః.

తా. నాలుక జడముగ, బూరుగముండ్లవంటి మాంసపుమొలకలచే కడువ్యాప్తంబుగనుండిన కఫజిహ్వకమని తెలియవలయును.

అలాసలక్షణము

జిహ్వాతలేయశ్శ్వయథుఃప్రగాఢ స్సోలాససంజ్ఞఃకఫరక్తమూర్తిః,
జిహ్వాంసతుస్తంభయతిప్రవృద్ధో మూలేచజిహ్వాభృశమేతిపాకమ్,

తా. కఫరక్తమువలన నాలుకయందు భయంకరమైన వాపుగలిగిన అలసక మనంబడును. ఇది వృద్ధింజెందిన నాలుకయందు స్తంభనమును నాలుకయొక్కమూలమునందు మిక్కుటముగ పాకమును గలుగంజేయును.

### ఉపజిహ్వకలక్షణము

జిహ్వాగ్రరూపశ్శ్వయథుస్సజిహ్వా మున్నమ్య జాతఃకఫరక్తమూర్తిః,
లాలాకరఃకండుయుతస్సచోష స్స్యాతూపజిహ్వకథితాభిషగ్భిః. 399

తా. కఫరక్తమువలన నాలుకకొనవలె వాపుజనించి పొడవై మిక్కుటముగ జొల్లుగార్చుచు దురద, మంటతోడంగూడియుండిన యుపజిహ్వక మనంబడును.



## తాలుగతరోగములు

### కంఠశుండిలక్షణము

శ్లేష్మాసృగ్భ్యాంతాలుమూలాత్ప్రవృద్ధోదీర్ఘశ్శోథోధ్మాతవస్తిప్రకాశః,
తృష్ణాకాసశ్వాసకృత్తంవదంతి వ్యాధింవైద్యాః కంఠశుండీదనామ్నా.

తా. కఫరక్తములవలన లోదౌడమూలమున నుబ్బినవస్తివలె దీర్ఘమైన వాపుగలిగి దప్పి, దగ్గు, ఉబ్బసమును గలిగియుండిన కంఠశుండి యనంబడును. (కంఠశుండి యన క్రిందినాలుకపడుట.)

### తుండికేరిలక్షణము

శోథశ్శూలస్తోదదాహప్రపాకీ ప్రాగుక్తాభ్యాంతుండికేరీమతాతు,

తా. కఫరక్తమువలన శూల, పోట్లు, దాహము, పాకము మొదలగువానియుక్తముగ వాపుగలిగి యడవిప్రత్తికాయయాకారముగలదిగనుండిన తుండికేరి యనంబడును.

### అధ్రువలక్షణము

శోథస్స్తబ్ధోలోహితస్తాలుదేశే రక్తాజ్ఞేయస్సోధ్రువోరుగ్జ్వరశ్చ. 401

తా. లోదౌడయందు రక్తవికారముచే జడముగ, ఎఱ్ఱగనుండు వాపుజనించిపోట్లతోడంగూడి జ్వరముగలిగిన అధ్రువ మనంబడును.

### కచ్ఛపలక్షణము.

కూర్మోత్సన్నోవేదనోశీఘ్రజన్మా రోగోజ్ఞేయఃకచ్ఛపశ్శ్లేష్మణాతు,

తా. కఫదోషమువలన తాబేటివీపువలె నుబ్బుగ, వేదనాయుక్తముగ నుండు వాపు సావకాశముగ జనించిన కచ్ఛప మనంబడును.

### అర్బుదలక్షణము

పద్మాకారం తాలుమధ్యేతుశోథం విద్యాద్రక్తాదర్బుదంప్రోక్తలింగమ్.

తా. లోదౌడమధ్యముగ రక్తదోషమువలన దామరమిద్దెవలె వాపుజనించి అర్బుదనిదానోక్త రక్తార్బుదలక్షణయుక్తంబైయుండిన అర్బుద మనంబడును.

### మాంససంఘాతలక్షణము

దుష్టం మాంసం నీరుజం తాలుమధ్యే
కఫాచ్ఛూనం మాంససంఘాతమాహుః,

తా. లోదౌడమధ్యమున కఫదోషమువలన మాంసము దుష్టంబై యుబ్బి వేదనారహితంబైయుండిన మాంససంఘాత మనంబడును.

### తాలుపుప్పుటలక్షణము

నీరుక్స్థాయీకోలమాత్రః కఫాత్స్యా న్మేదోయుక్తాత్పుప్పుటస్తాలుదేశే.

తా. మేదోయుక్తకఫముచే లోదౌడయందు వేదనారహితంబై స్థిరమై, రేగుపండు ప్రమాణముగలదైయుండు వాపుజనించిన తాలుపుప్పుట మనంబడును.

### తాలుశోషలక్షణము

శోషోత్యర్థం దీర్యతేచాపి తాలు శ్వాసశ్చోగ్రస్తాలుశోషోఽనిలాచ్చ,

తా. వాతమువలన లోదౌడ మిక్కుటముగ నెండి పగిలి భయంకరమైన శ్వాసము వెడలుచుండిన తాలుశోష మనంబడును.

### తాలుపాకలక్షణము

పిత్తంకుర్యాత్పాకమత్యర్థఘోరం తాలున్యేవంతాలుపాకంవదంతి. 404

తా. రక్తప్రకోపముచే లోదౌడ కడుభయంకరముగ పండిన తాలుపాక మనంబడును.

---

## కంఠగతరోగములు

### రోహిణీలక్షణము

గళేనిలఃపిత్తకఫౌచమూర్ఛితౌ ప్రదూష్యమాంసంచతథైవశోణితం,
గళోపసంరోధకరైస్తథాంకురైర్నిహంత్యసూన్వ్యాధిరయంహిరోహిణీ.

తా. కంఠమధ్యమున వాత పిత్త కఫములు ప్రకోపించి మాంసరక్తములం జెఱచి కంఠము నడ్డగించెడి యంకురముల గలుగంజేసిన రోహిణి యనంబడును. ఇది ప్రాణముల హరింపంజేయును.

### వాతజరోహిణీలక్షణము

జిహ్వాసమంతాద్భృశవేదనాస్తు మాంసాంకురాఃకంఠనిరోధనాయే,
సారోహిణీవాతకృతా ప్రదిష్టా వాతాత్మకోపద్రవగాఢయుక్తా. 406

తా. నాలుకయంచంతట కడువేదనాయుక్తమైన మాంసపు మొలకలు జనించి కంఠము నడ్డగించుటవలన కంపస్తంభాదికవాతోపద్రవయుక్తంబై యుండిన వాతజరోహిణి యనంబడును,

## పిత్తజరోహిణీలక్షణము

క్షిప్రోద్గమా క్షిప్రవిదాహపాకా తీవ్రజ్వరా పిత్తనిమిత్తజాతా,

తా. శీఘ్రముగ జనించి దాహయుక్తంబై శీఘ్రముగ పండుటవలన తీవ్రజ్వరయుక్తంబై యుండిన పిత్తజరోహిణి యనంబడును.

## కఫజరోహిణీలక్షణము

స్రోతోనిరోధిన్యపిమందపాకా స్థిరాంకురాయాకఫసంభవాసా. 407

తా. కంఠమార్గము నడ్డగించి చిరకాలముమీఁద పండునదియై కఠినమైన మొలకలు గలదై యుండిన కఫజరోహిణి యని తెలియవలయును.

## త్రిదోషజరోహిణీలక్షణము

గంభీరపాకిన్యనివార్యవీర్యా త్రిదోషలింగా త్రితయోత్థితాసా,

తా. గంభీరపాకము (అనఁగా లోనచీము గలదై) ఔషధోపచారముల కశక్యంబైన పూర్వోక్తత్రిదోషలక్షణయుక్తంబై యుండునది త్రిదోషజరోహిణి యనంబడును." (ఇది తత్క్షణమున ప్రాణముల హరింపంజేయును.)

## రక్తజరోహిణీలక్షణము

స్ఫోటైశ్చితాపిత్తసమానలింగా సాధ్యాప్రదిష్టారుధిరాత్మకాతు. 408

తా. బొబ్బలవలన వ్యాప్తంబై పిత్తరోహిణీలక్షణయుక్తంబై యుండిన రక్తజరోహిణి యని తెలియవలయును. ఇది సాధ్యము.

## కంఠశాలూకలక్షణము

కోలాస్థిమాత్రః కఫసంభవోయో గ్రంథిర్గళే కంటకశూకభూతః,
ఖరస్థిరశ్శస్త్రనిపాతసాధ్య స్తంకంఠశాలూకమితిబ్రువంతి. 409

తా. కంఠమున కఫమువలన రేగువిత్తులయొక్క ప్రమాణముగల గ్రంథి జనించి ముండ్లు, జలశూకములు - వీనివలె వేదనను గలుగంజేయుచు గరగరగ, కఠినముగనుండిన కంఠశాలూక మనంబడును. ఇది శస్త్రసాధ్యంబు.

## అధిజిహ్వాలక్షణము

జిహ్వాగ్రరూపశ్శ్వయథుః కఫాత్తు జిహ్వోపరిష్టాదపిరక్తమిశ్రాత్,
జ్ఞేయోఽధిజిహ్వః ఖలురోగఏష వివర్జయేదాగతపాకమేనమ్. 410

తా. రక్తయుక్తకఫముచే నాలుకకు పైన వాపు జనించి నాలుకకొనవలెనుండిన అధిజిహ్వక మనంబడును. ఇది పండిన నసాధ్యంబు.

## వలయలక్షణము

బలాసపవాయతమున్నతం చ గ్రంథిం కరోత్యన్నగతేం నివార్య,
తంసర్వథైవాప్రతివార్యవీర్యం వివర్జనీయం వలయం వదంతి. 411

తా. కఫముచే పొడవుగ, నుబ్బుగ నుండు గ్రంథి జనించి దానివలన అన్నము లోని దిగక సర్వోపచారముల కనర్హంబై యుండిన వలయ మనియు, గ్రంథాంతరముః ఘటసర్ప మనియు జెప్పంబడును. ఇది యసాధ్యము.

బలాసలక్షణము

గళేతుశోథంకురుతః ప్రవృద్ధౌ శ్లేష్మాఽనిలౌ శ్వాసరుజోపపన్నం,
మర్మచ్ఛిదం దుస్తరమేనమాహు ర్బలాససంజ్ఞంనిపుణావికారమ్. 41

తా. ప్రకోపించిన కఫవాతములు కంఠమునందు వాపును గలుగంజేయుటవలః నుబ్బసము గలిగి కంఠమునొచ్చుచు మర్మస్థానమును భేదింపుచుండిన బలాస మనంబడును ఇది యసాధ్యము.

ఏకబృందలక్షణము

వృత్తోన్నతోంతశ్శ్వయథుస్సదాహ స్సకండురోపాకమృదుర్గురుశ్చ,
నామ్నైకబృందఃపరికీర్తితోఽసౌ వ్యాధిర్బలాసక్షతజప్రసూతః. 41

తా. కంఠమునందు కఫరక్తములు ప్రకోపించుటవలన గుండ్రముగ, ఉబ్బుగ ఒకింత దాహయుక్తముగ, దురదతోగూడినదిగ నుండు వాపు లోన గలిగి యొకింః పండి, ఒకింత మృదువుగ, జడముగ నుండిన ఏకబృంద మనంబడును.

బృందలక్షణము

సమున్నతంవృత్తమమందదాహం తీవ్రజ్వరం బృందముదాహరంతి,
తంచాపి పిత్తక్షతజప్రకోపా ద్విద్యాత్సతోదం పవనాత్మకం తు. 414

తా. కంఠమునం దుబ్బుగ, గుండ్రముగ, తీవ్రదాహయుక్తముగ, జ్వరయుక్త ముగ నుండు వాపు జనించిన బృంద మనంబడును. ఇది వాత, పిత్త, రక్తప్రకోపమువలః జనించి పొడుచునటుల వేదనతో గూడియుండును. ఇది బృందమునం దవస్థావిశేషమః గలదిగ నుండుటంజేసి వేఱుగ నెన్నంజనదు.

శతఘ్నిలక్షణము

వర్తిర్ఘనాకంఠనిరోధినీయా చితాతిమాత్రం పిశితప్రరోహైః,
అనేకరుక్ప్రాణహరీత్రిదోషాత్ జ్ఞేయాశతఘ్నీతుశతఘ్నిరూపా. 415

తా. కంఠమునందు గుండ్రముగ, పొడవుగ, కఠినముగ నుండు వాపు జనించి కంఠము నడ్డగించుట, వాపునందు మాంసపుమొలకలు తీవ్రముగ, మిక్కుటముగ జనించి పోట్లు, దాహము, దురద మొదలగు పలువిధములైన పీడలతో గూడియుండుట, ముండ్లతో వ్యాప్తంబైన ఫిరంగివలెనుండుట - ఈలక్షణములుగలది శతఘ్ని యనంబడును. ఇది ప్రాణముల హరింపంజేయును.

గిలాయులక్షణము

గ్రంథిర్గళేత్వామలకాస్థిమాత్రస్థిరోఽల్పరుగ్యః కఫరక్తమూర్తః,
సంలక్ష్యతేసక్తమివాశనం చ సశస్త్రసాధ్యస్తుగిలాయుసంజ్ఞః. 416

తా. కంఠములో కఫరక్తసంబంధమువలన నుసిరికకాయవిత్తువంటి గ్రంథి జనించి కఠినంబై మందవేదనగలదై యన్నము మ్రింగిన ఘారాళముగ దిగకుండునటులం జేసిన గిలాయు వనంబడును. ఇది శస్త్రసాధ్యము.

గళవిద్రధిలక్షణము

సర్వాంగళంవ్యాప్యసముత్థితోయశ్శోథోరుజస్సంతిచయత్రసర్వాః,
సపర్వదోషోగళవిద్రధిస్తు తస్యైవతుల్యఃఖలు సర్వజస్య. 417

తా. త్రిదోషసంబంధమువలన వాపు కంఠమునం దంతట జనించి పలువిధవేదనలతోగూడి విద్రధిని పూర్వోక్త త్రిదోషలక్షణయుక్తంబై యుండిన గళవిద్రధి యనంబడును.

గళౌఘలక్షణము

శోథోమహానన్నజలావరోధీ తీవ్రజ్వరోవాయుగతేర్నిహంతా,
కఫేనజాతోరుధిరాన్వితేన గళేగలౌఘఃపరికీర్త్యతేఽసౌ. 418

తా. రక్తయుక్తకఫముచే కంఠమున ప్రబలమైన వాపు జనించి యన్నోదకముల లోనగ్రోలుట కశక్యంబై తీవ్రజ్వరయుక్తంబై వాతసంచారరహితంబై యుండిన గళౌఘ మనంబడును.

స్వరఘ్నలక్షణము

యస్తామ్యమానశ్శ్వసితిప్రసక్తం భిన్నస్వరశ్శుష్కవిముక్తకంఠః,
కఫోపదిగ్ధేష్వనిలాయనేషు జ్ఞేయస్సరోగశ్శ్వసహాత్స్వరఘ్నః. 419

తా. కంఠమునందు వాతమార్గములు కఫముచే నడ్డగింపబడుచుండ పలుమారు నేత్రములకు జీకట్లు గ్రమ్మి యెల్లపుడు శ్వాసమును విడుచుట, స్వరము భేదించుట, గొంతెండుట, ఉమిని బాగుగమ్రింగుట కశక్యంబగుట - ఈలక్షణములు గలది స్వరఘ్న మనంబడును. ఇది వాతజన్యంబు.

మాంసతానకలక్షణము

ప్రతానవాన్యశ్శ్వయథుస్సుకష్టో గళోఽపరోధంకురుతేక్రమేణ,
సమాంసతానేతి బిభర్తిసంజ్ఞాం ప్రాణప్రణుత్సర్వకృతోవికారః. 420

తా. కంఠమునందు వాపు జనించి క్రమముగ కంఠమున వ్యాపించి యడ్డగించి కడుకష్టమును గలుగంజేయుచు ప్రాణముల హరింపంజేయునది మాంసతానక మనంబడును. ఇది త్రిదోషజనితంబు.

### విదారీలక్షణము

సదాహతోదంశ్వయథుస్సుతీవ్ర మంతర్గళేపూతివిశీర్ణమాంసం,
పిత్తేనవిద్యాద్వదనేవిదారీం పార్శ్వేవిశేషాత్సతుయేనశేతే. 421

తా. కంఠమున పిత్తప్రకోపముచే తీవ్రముగ వాపు జనించి దాహము, పోట్లు అపానానిలోడఁగూడి దుర్గంధయుక్తమై మాంసము వీడుచుండిన విదారి యనంబడును. ఇది పరుండెడి పార్శ్వమునందే విశేషముగ జనించును.

### సర్వసరలక్షణములు

స్ఫోటైస్సతోదైర్వదనంసమంతా ద్యస్యాచితంసర్వసరస్సవాతాత్,

తా. వాతసంబంధమువలన నోటియందంతట బొబ్బలుగలిగి సూదులతో బొడుచునటుల పోట్లు గలిగియుండిన సర్వసర మని (అనఁగా ముఖపాక మని) తెలియవలయును.

### పైత్తికసర్వసరలక్షణము

రక్తైస్సదాహైఃపిటకైస్సపీతై ర్యస్యాచితంచాపిసపిత్తకోపాత్. 422

తా. పిత్తప్రకోపమువలన ముఖమునందెఱ్ఱగ, పచ్చగ నుండు కురుపులు జనించి మంటతోడం గూడియుండిన పైత్తికసర్వసర మని తెలియవలయును.

### కఫజసర్వసరలక్షణము

అవేదనైఃకండుయుతైస్సవర్ణై ర్యస్యాచితంచాపిసవైకఫేన. 423

తా. కఫప్రకోపముచే మందవేదన, దురద గలిగి చర్మముతో సమానవర్ణము గల బొబ్బలు నోటిలో వ్యాపించిన కఫసర్వసర మని తెలియవలయును.

### అసాధ్యముఖరోగలక్షణము

ఓష్ఠప్రకోపే వర్జ్యాస్స్యు ర్మాంసరక్తప్రకోపజాః,
దంతమూలేషు వర్జ్యౌ తు త్రిలింగగతిషౌషిరా. 424
దంతేషు చ నసిధ్యంతి శ్యావదాళనభంజనాః,
జిహ్వాతలే ష్వలాసశ్చ తాలవ్యేష్వర్బుదం తథా. 425
స్వరఘ్నో వలయో బృందో బలాసశ్చ విదారికాః,
గలౌఘో మాంసతానశ్చ శతఘ్నీ రోహిణీగళే. 426
అసాధ్యాః కీర్తితా హ్యేతే రోగా నవదశైవతు,
తేషు చాపి క్రియాం వైద్యః ప్రత్యాఖ్యాయ సమాచరేత్. 427

తా. ఓష్ఠరోగములలో మాంసజ, రక్తజ, త్రిదోషజము లన 3 రోగంబులును, దంతమూలగతరోగములలో సన్నిపాతము, నాడీసౌషిరము అన ౨ రోగంబులును, దంతరోగములలో శ్యావ, దాళన, భంజనము లన 3 రోగంబులును, జిహ్వాకరోగములలో అలస మను నొకరోగంబును, తాలుగతరోగములలో అర్బుద మను నొకరోగం

ు, కంఠగతరోగములలో స్వరఘ్న, వలయ, బృంద, బలాస, విదారిక, గళౌఘ, ంసతానక, శతఘ్ని, రోహిణి యను ౯ రోగంబులును, ఈచెప్పిన ౧౫ రోగంబు ాధ్యంబులు. అట్లగుటంజేసి వానియందు జికిత్సం జేయునపుడు కుదురుట, దుర్లభంబని ు యౌషధము వైద్యుఁడొసంగవలయును.

## తైలాదిలేపనము

తైలం ఘృతం సర్జరసం ససిక్థం రాగ్నా గుడం సైంధవగైరికం చ,
పక్త్వా సమాంశం దశనచ్ఛదానాం తద్భేదహంతా వ్రణరోపణం చ. 428

తా. నూనె, నెయ్యి, గుగ్గిలము, మైనము, సన్నరాష్ట్రము, బెల్లము, సైంధవ ణము, కావిరాయి - వీనిని సమభాగములుగ నేకముజేసి తైలము గాచి పెదవులపై నముచేసిన పెదవిపగుళ్ళు మాని వ్రణమునందు మాంసము నిండును.

## రాళాదిలేపనము

రాళం మధూచ్ఛిష్టగుడేన పక్వం తైలం ఘృతం వా వినిహంతి లేపాత్,
త్వక్తోదపారుష్యరుజోధరస్య పూయాస్రసంస్రావమపి ప్రహాణ్యాత్.

తా. గుగ్గిలము, మైనము, బెల్లము - వీనిలో నూనెగాని, నెయ్యిగాని కలిపి చి పెదవులపై లేపనముచేసిన చర్మపీడ, గరగరలాడుట, పోట్లు, చీము, రక్తము సట - వీనిని హరింపంజేయును.

## పిత్తోష్ఠరోగచికిత్స

వేధం సిరాణాం వమనం విరేకం తిక్తస్య పానం రసభోజనం చ,
శీతాః ప్రదేహాః పరిషేచనం చ పిత్తోపసృష్టేష్వధరేషు కుర్యాత్. 430

తా. పిత్తవికారముగల పెదవిరోగములయందు సిరావేధనను, వమనము, విరే ము, కటురసపానము, రసయుక్తభోజనము, శీతకరలేపనము, పిత్తహరౌషధకషా ములయొక్క పరిషేకయు మొదలగు నుపచారములను జేయవలయును.

## సర్వోష్ఠరోగసామాన్యచికిత్స

ఓష్ఠరోగే ష్వశేషేషు దృష్ట్వా దోష ముపాచరేత్,
తేషు వ్రణత్వం యాతేషు వ్రణవ త్సముపాచరేత్. 431

తా. సమస్తమైన పెదవిరోగములయందు దోషానుగుణ్యమైన చికిత్సలను, లేక ణంబైయుండిన వ్రణచికిత్సలను జేయవలయును,

## శీతాదరోగచికిత్స

శీతాదే హృతరక్తే తు తోయం నాగరసర్షపైః,
నిక్వాథ్య త్రిఫలాం వాపి కుర్యా ద్గండూషధారణమ్. 432

తా. శీతాద మనుదంతరోగమున మునుపటివలెనే రక్తమును దీసి శొంఠి, తెల్లా

వాలు - అనువాని కషాయముతోగాని, త్రిఫలకషాయముతోగాని, [1]గండూషము సేయ వలయును.

### కాసీసాదిచూర్ణము

కాసీస లోధ్ర కృష్ణా మనశ్శిలా సప్రియంగు తేజోహ్వా,
ఏషాం చూర్ణం మధుయుక్ఛీతాదే పూతిమాంసహారమ్. 433
తైలం ఘృతం వా వాతఘ్నం శీతాదే సంప్రశస్యతే,

తా. అన్నభేది, లొద్దుగ, పిప్పలి, మణిశిల, ప్రేంకణము, వెక్కుడు, లేక పెను తురుతీగ అనువానిచూర్ణముతో తేనె గలిపి లేపనముచేసినను, లేక వాతహరతైలమును గాని, లేక ఘృతమునుగాని లేపనముచేసినను దుర్గంధము గలిగి శిథిలమై యుండు మాంసము హరించును.

### దంతపుప్పుటచికిత్స

దంతపుప్పుటకేకార్యం తరుణే రక్తమోక్షణమ్. 434
సపంచలవణక్షార సక్షౌద్రః ప్రతిసారణం,

తా. దంతపుప్పుటరోగమున తరుణావస్థయందు రక్తము దీసి పంచలవణముల క్షారమును తేనెతో గలిపి మెల్లగ రుద్దవలయును.

### దంతవేష్టచికిత్స

లోధ్రం పతంగం మధుకం లాక్షాచూర్ణైర్మధుప్లుతైః. 435
గండూషే క్షీరిణో యోజ్యాస్సక్షౌద్రఘృతశర్కరాః,

తా. లొద్దుగ, రసకర్పూరము, అతిమధురము, లక్క - వీనిని చూర్ణముచేసి తేనెతో గలిపిగాని, లేక [2]క్షీరవృక్షముల చూర్ణముతో తేనె, నెయ్యి, పంచదార గలిపి గాని గండూషముచేయించిన దంతవేష్టరోగము హరించును.

### జీరకాదిచూర్ణము

జరణ లవణ పథ్యా శాల్మలీకంటకానా
మనుదిన మనుఘృష్టం దంతమూలేషు చూర్ణం,
వ్రణదరణరుగస్రస్రావచాంచల్యశోథా
నపనయతి వివస్వా నంధకారానివాశు. 436

తా. జీలకఱ్ఱ, ఉప్పు, కరక్కాయ, బూరుగముండ్లు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి దానితో ప్రతిదినము దంతములను తోమిన "సూర్యుం డంధకారమును

---

1 గండూష మన ద్రవపదార్థములను ధరించి యుమ్మివేయుటయ.
2 క్షీరవృక్షము లన మఱ్ఱి, మేడి, రావి, అంబాళము, కలుజువ్వి అనునవి.

పంజేయుభంగి" దంతవ్రణము, దంతపుపగుళ్లు, పోట్లు, రక్తస్రావము, దంతచల
వాపు - వీనిని శీఘ్రముగ హరింపంజేయును.

కణాదిచూర్ణము

కణా సింధూత్థ జరణం చూర్ణం తూర్ణం వ్యపోహతి,
ఘర్షణా ద్దంతచాంచల్యం వ్యథా శోథాస్రసంస్రవాన్. 437

తా. పిప్పలి, సైంధవలవణము, జీలకఱ్ఱ- వీనిని చూర్ణముచేసి దంతముల రుద్దిన ములు కదలుట, పోటు, వాపు, రక్తస్రావము శీఘ్రముగ హరించును.

భద్రముస్తాదివటికములు

భద్ర ముస్తాభయా వ్యోష విడంగారిష్టపల్లవైః,
గోమూత్రపిష్టై ర్గుటికాం ఛాయాశుష్కాం ప్రకల్పయేత్. 438

తాన్నిదధ్యాన్ముఖేనిశ్యాం చలదంతాతురో నరః,
నాతఃపరతరం కించి చ్చలదంతస్య భేషజమ్. 439

తా. తుంగముస్తెలు, కరక్కాయ, త్రికటుకములు, వాయువిడంగములు, కు-వీనిని గోమూత్రముతో నూరి యుంటలుచేసి నీడ నెండించి రాత్రులయందు యం దునిచికొని పరుండిన దంతములు గట్టియగును. దంతచలనమునందు దీనికంటె మయిన యౌషధం బెద్దియునులేదు.

సౌషిరచికిత్స

సౌషిరేద్ధృతరక్తేతు లోధ్ర ముస్తా రసాంజనైః,
సక్షౌద్రై శ్శస్యతే లేపో గండూషే క్షీరిణో హితః. 440

తా. సౌషిర మనురోగమున రక్తముదీసి లొద్దుగ, తుంగముస్తెలు, రసాంజనము వాని చూర్ణమును తేనెలో గలిపి లేపనముచేయుటయు, లేకక్షీరవృక్షకషాయముతో గండూషధారణమును చేయించుటయు హితకరంబులు.

పంచలవణాదిచూర్ణలేపము

కాకోదుంబరికాపత్రై ర్వ్రణం విస్రావయే ద్భిషక్,
లవణైః క్షౌద్రయుక్తైశ్చ సవ్యోషైః ప్రతిసారయేత్. 441

తా. బ్రహ్మమేడియాకులతో వ్రణమును రుద్ది రక్తమును స్రవింపంజేసి పంచ ణములు త్రికటుకములు అనువాని చూర్ణములో తేనెను గలిపి మెల్లగ దంతముల ందు రుద్దవలయును.

వైదర్భచికిత్స

శస్త్రేణోత్కృత్య వైదర్భం దంతమూలాని శోధయేత్,
[illegible] 442

తా. వైదర్భ మను దంతమూలరోగమును శస్త్రముతో జీల్చి రక్తస్రావము జేయించుటయేగాక క్షారలేపనమును, సమస్తమైన శీతకరలేపనములను జేయవలయును.

ఉద్ధృత్యాధికదంతం తు తతో వై సముపాచరేత్.
కృమిదంతకవచ్చాత్ర విధిః కార్యో విజానతా. 443

తా. అధికముగ నుండు దంతమును దీసివేసి కృమిదంతచికిత్సలం జేయవలయును.

అధిమాంసకచికిత్స

ఛిత్వాధిమాంసం సక్షౌద్రై రేతైశ్చూర్ణై రుపాచరేత్,
వచా తేజోవతీ పాఠా సర్జికాయావశూకజైః. 444
క్షౌద్రం ద్వితీయం పిప్పల్యా కబలేచాత్ర కీర్తితం,
పటోల నింబ త్రిఫలా కషాయశ్చాత్ర ధావనః. 445

తా. అధిమాంస మను దంతమూలరోగమును ఛేదించి దానిపై వస, వెక్కుడుతీఁగె, అగరుశొంఠి, లేక చిరుబొద్ది, సర్జక్షారము, యవక్షారము అనువానికల్కములఁ తేనె గలిపిగాని, లేక పిప్పలిచూర్ణములఁ తేనె గలిపి నోటియందు ధరింపవలయును. మఱియు చేతిపొట్లు, వేప, త్రిఫలములు అనువానికషాయముతోఁడ అధిమాంసమును గడుగవలయును.

దంతవిద్రధిసామాన్యచికిత్స

విద్రధ్యుక్తం చ విధివ ద్విదధ్యా ద్దంతవిద్రధౌ,
శస్త్రకర్మ నరస్తత్ర కుశలో నైవ కారయేత్. 446

తా. దంతవిద్రధియందు సామాన్యవిద్రధియొక్క సర్వచికిత్సలం జేయవలయునేగాని శస్త్రకర్మను జేయంజనదు.

స్నైహికోత్ర హితో ధూమో నస్యం స్నైహికమేవ చ,
రసారసయవాగ్వశ్చ క్షీరం సాంతానికం ఘృతమ్. 447
శిరోవస్తి ర్హితశ్చాపి క్రమోయశ్చానిలాపహః,

దంతహర్ష రోగమున స్నేహయుక్తధూమము, నస్యము, స్నేహయుక్తమధురాదిరసములు, మాంసరసము, యవాగు, పాలు, సాంతానికఘృతము, శిరోవస్తివాతనాశకరచికిత్సలు-వీనిని క్రమముగ జేయవలయును.

కృమిదంతచికిత్స

సీలీ వాయసజంఘా కటుతుంబీ మూలమేకైకమ్. 448
సంచూర్ణ్య దశనవిధృతం దశనకృమిపాతనం ప్రాహుః,

తా. సీలి, వెలుమసంధి, చేదసొర-వీనివేళ్లను ప్రత్యేకముగ చూర్ణము చేసి దంతమూలయం దునిచిన క్రిములు నశించును.

### శారిబాపర్ణధారణము

పిష్ట్వాచ శారిబాపర్ణం దృఢం దంతేషు ధారయేత్. 449
పతంతి దంతకీటాశ్చ చాంచల్యం హరతి క్షణాత్,

తా. తెల్లసుగంధిపాలాకులను నూరి యుంటచేసి పండ్లయందదిమి యుంచికొనిన క్రిములు శీఘ్రముగ నూడిపడి దంతములు గట్టియగును.

### కాసీసాదిగుటికలు

కాసీసం హింగు సౌరాష్ట్రీ దేవదారు సమంజనైః. 450
గుటికాం ధారయే ద్దంతే కృమిశూలహరాం పరామ్,

తా. అన్నభేది, ఇంగువ, తొవరిమన్ను, దేవదారు-వీనిని సమభాగములుగ నుదకముతో నూరి మాత్రలుచేసి దంతములపై నునిచిన క్రిమిదంతశూల హరించును.

### శర్కరాచికిత్స

అచ్ఛిందం దంతమూలాని శర్కరా ముద్ధరే ద్భిషక్. 451
లాక్షాచూర్ణై ర్మధుయుతై స్తదస్తాం ప్రతిసారయేత్,

తా. దంతమూలములయందు నొప్పి గలుగకుండునటుల వానిపైనుండు శర్కర (మలము)ను గీచితీసి పిదప లక్కచూర్ణమును తేనెలో గలిపి మెల్లగ రుద్దవలయును.

### కపాలికాచికిత్స

దంతహర్షక్రియాం చాత్ర కుర్యా న్నిరవశేషతః. 452
కపాలికా కృచ్ఛ్రతమా తత్రా ప్యేషా క్రియాహితా,

తా. (దంతశర్కరయందును) కపాలిక మను దంతరోగమునందు దంతహర్షమునకై చెప్పంబడిన సర్వచికిత్సలం జేయవలయును.

### నాడీవ్రణచికిత్స

ఛిత్వా మాంసాని శస్త్రేణ భవేయుః పరితో యది. 453
ఉద్ధృత్య చ దహేచ్చాపి క్షారేణ జ్వలనేన వా,

తా. నాడీవ్రణమునందు చుట్టు మాంసంబుండిన శస్త్రముతో ఛేదించి క్షారముతోగాని, అగ్నితోగాని, కాల్చవలయును.

### దంతరోగసామాన్యచికిత్స

దంతరోగేషు సర్వేషు శస్తో వాతహరో విధిః. 454
పక్వం తైలం కవోష్ణం చ శస్తం కబలధారణే,

తా. సర్వదంతరోగములయందును వాతనాశకరచికిత్సలం జేయుటయేగాక వాతహరద్రవ్యయుక్తముగ నూనెను గాచి సుఖోష్ణముగ నోటిలో ధరించుట ప్రశస్తంబు.

## లాక్షాదితైలము

తైలం లాక్షారసం క్షీరం పృథక్ప్రస్థమితం పచేత్. 455
ద్రవ్యైః పలమితై రేతైః క్వాథ శ్చాపి చతుర్గుణైః,
లోధ్ర కట్ఫల మంజిష్ఠా పద్మకేసర పద్మకైః. 456
చందనోత్పల యష్ట్యాహ్వై స్తత్తైలం వదనే ధృతం,
చాలనం దంతచాలం చ దంతమోక్షం కపాలికామ్. 457
శీతాదం పూతివక్త్రం చా ప్యరుచిం విరసాస్యతాం,
హన్యాదాశు గదానేతా న్కుర్యా ద్దంతానపి స్థిరాన్. 458
లాక్షాదికమిదం తైలం దంతరోగేషు పూజితం,

తా. నూనె, లక్కరసము, పాలు వీసిని దినుసు కొక్కొక ప్రస్థముచొప్పున గ్రహించి అందు లొద్దుగ, గుమ్ముడు తేకు, మంజిష్ఠ, దామరయగరులు, చందనము, నల్ల కలువగడ్డ, అతిమధురము అనువానియొక్క కషాయమును నూనెకు నాలుగింతలు గలిపి లొద్దుగ మొదలగు ద్రవ్యములయొక్క కల్కమును దినుసు కొక్కొకపలము చొప్పున గలిపి చిక్కగ తైలముగాచి నోటియందునిచికొనిన చాలనము, పండ్లు కదలుట, అకాలమున దంతము లూడుట, కపాలికము, శీతాదము, పూతివక్త్రము, అరుచి, నోటి విరసత్వము-వీసిని శీఘ్రముగ హరింపజేయుటయేగాక దంతముల గట్టిపఱచును. ఇది దంత రోగములయందు కడు శ్రేష్ఠంబు.

## దంతరోగమునకు అరిమేదాదితైలము

అరిమేదత్వచం క్షుణ్ణాం పచే చ్ఛతపలోన్మితామ్. 459
జలద్రోణేన తత్క్వాథం గృహీయా త్పాదశేషితం,
తైలస్యార్ధాఢకం దత్వా కల్కైః కర్షమితైః పచేత్. 460
అరిమేదలవంగాభ్యాం గైరికాగరుపద్మకైః,
మంజిష్ఠా లోధ్ర మధుకై ర్లాక్షా న్యగ్రోధ ముస్తకైః. 461
త్వగ్జాతీఫల కర్పూర కంకోల ఖదిరై స్తథా,
పతంగ ధాతకీపుష్ప సూక్ష్మైలా నాగకేసరైః. 462
కట్ఫలేన చ సంసిద్ధం తైలం ముఖరుజం జయేత్,
ప్రదుష్టమాంసం చలితం శీర్ణదంతం చ సౌషిరమ్. 463
శీతాదం దంతహర్షం చ విద్రధిం కృమిదంతకం,

దంతస్ఫుటన దౌర్గంధ్యం జిహ్వా తాల్వోష్ఠజాం రుజమ్. 464

తా. ౧౦౦ పలములు నల్లతుమ్మపట్టను దంచి ద్రోణప్రమాణ ముదకములో వైచి కషాయముగాచి చతుర్థాంశము దించికొని వడియగట్టి అందు నువ్వులనూనె 4 ఆఢకము, నల్లతుమ్మపట్ట, లవంగములు, కావిరాయి, కృష్ణాగరు, పద్మకాష్ఠము, మంజిష్ఠి, లొద్దుగ, అతిమధురము, లక్క, మఱ్ఱియూడకొనలు, తుంగముస్తెలు, లవంగపట్ట, జాజికాయ, కర్పూరము, తక్కోలపుట్లు, కాచు, నీటిప్పి, ఆరెపువ్వు, సన్నయేలకులు, నాగకేసరములు, గుమ్మడుతేకు అనువానికల్కములు ఉనుసు కొక్కొక కర్షముచొప్పునగలిపి చిక్కగ కాచి నోటిలో ధరించిన దంతములయందలి కుళ్ళినమాంసము, దంతములు కదలుట, దంతములు విరుగుట, సౌషిరము, శీతాదము, దంతహర్షము, దంతవిద్రధి, క్రిమిదంతము, దంతపుపగుళ్ళు, దౌర్గంధ్యము, నాలుక, లోదౌడ, పెదవి-వీనియందలి రోగములన్నియు హరించును.

### కుష్ఠాదిచూర్ణము

కుష్ఠం దార్వీ లోధ్ర మబ్ద స్సమంగా పాఠాతిక్తా తేజనీపీతికా చ,
చూర్ణంశ స్తంఘర్ష ణేతద్ద్విజానాం రక్తస్రావం హంతికండూంరుజం చ.

తా. చెంగల్వకోష్టు, మ్రానిపసపు, లొద్దుగ, తుంగముస్తెలు, మంజిష్ఠి, అగరుశొంఠి, లేక చిరుబొద్ది, కటుకరోహిణి, చాగ, పసపు అనువానిచూర్ణముతో దంతములు తోమిన రక్తస్రావము, దురద, పోట్లు హరించును.

### జాతీపత్రాదిచూర్ణము

జాతీపత్ర పునర్నవా గజకణా కోరంట కోష్ఠం వచా
శుంఠీ దీప్య హరీతకీ తిల సమం శ్లక్ష్ణం భృశం చూర్ణయేత్,
తచ్చూర్ణం వదనే ధృతం విజయతే దౌర్గంధ్య దంతవ్యథాం
చాంచల్యత్వ మతిప్రణ శ్వయథు రు క్కండూ కృమి వ్యాపదః.466

తా. జాజికాయలు, గలిజేరు, గజపిప్పలి, గోరింట, చెంగల్వకోష్టు, వస, శొంఠి, ఓమము, కరక్కాయ, నువ్వులు అనువానిచూర్ణమును సమభాగిములుగ గలిపి నోటిలో ధరించిన నోటిదుర్గంధము, దంతశూల, దంతములు కదలుట, దంతవ్రణము, వాపు, పీడ, దురద, పురుగులు హరించును.

### దంతరోగములయందు పథ్యము

ఫల్గాన్యమ్లాని శీతాంబు రూక్షాన్నం దంతధావనం,
తథాపి కఠినం భక్ష్య దంతరోగీ వివర్జయేత్. 467

తా. పుల్లనిఫలములు, శీతోదకము. రూక్షాన్నము, దంతధావనము, కఠినపదార్థభక్షణము-వీనిని దంతరోగి వర్జింపవలయును.

## ఉపజిహ్వికాచికిత్స

ఉపజిహ్వాం తు సంలిఖ్య క్షారేణ ప్రతిసారయేత్,
క్షీరం విరేక గండూష ధూమైశ్చైనా ముపాచరేత్. 468

తా. ఉపజిహ్వికయందు లేఖనక్రియంజేసి క్షారలేపనము, క్షీరపానము, విరేచనము, గండూషము, ధూమపానము అనువానిచే నుపచరింపవలయును.

## వ్యోషాదిచూర్ణము

వ్యోష క్షారాభయా వహ్ని చూర్ణమేతత్ప్రఘర్షణం,
ఉపజిహ్వికశాంత్యర్థ మేభి స్తైలం చ పాచయేత్. 469
గృహధూమారనాళేన క్వాథం సమధు సైంధవం,
పాణినామర్దయేచ్చాస్య ముపజిహ్వాప్రశాంతయే. 470

తా. ఉపజిహ్వికరోగశమనార్థంబై త్రికటుకములు, యవక్షారము, కరక్కాయ, చిత్రమూలము అనువానిచూర్ణముతో దంతముల రుద్దవలయును. మఱియు పైద్రవ్యములనే తైలముగాచి గండూషము చేయవలయును. మఱియు కషాయము [illegible] గలిపి కాచి అందు తేనె, సైంధవలవణము గలిపి ఉపజిహ్వ[illegible] మర్దనము చేయవలయును.

## కంఠశుండ్యాదిచికిత్స

తుండికేర్యాం ధ్రువే కూర్మే సంఘాతే తాలుపుప్పుటే,
ఏషఏవ విధిః కార్యో విశేష శ్శస్త్రకర్మణి. 471

తా. తుండికేరి, ధ్రువము, కూర్మము, సంఘాతము, తాలుపుప్పుటము- వీనియందు శస్త్రకర్మను జేయునెడ క్రిందజెప్పంబడుచికిత్సల విశేషముగ జేయవలయును.

స్నేహస్వేదా తాళుశోషే విధిశ్చానిలనాశనః,

తా. తాలుశోషమునందు స్నేహములను, స్వేదనక్రియలను [illegible] నాశక ఔషధసేవనను జేయవలయును.

తాలుపాకేతు కర్తవ్యం విధానం పిత్తనాశనమ్. 472

తా. తాలుపాకమునందు పిత్తనాశకరచికిత్సల జేయవలయును.

## గళశుండిఛేదనవిధి

అంగుష్ఠాంగుళిసందంశే నాకృష్య గళశుండికాం,
ఛేదయే న్మండలాగ్రేణ జిహ్వోపరితు సంస్థితామ్. 473

తా. నాలుకపైన జనించియుండు చిరునాలుకను అంగుష్ఠాంగులతో పట్టియీడ్చి శస్త్రముతో ఛేదింపవలయును.

### శుండీఛేదనానంతరోపచారము

పిప్పల్యతివిషా కుష్ఠ వచా మరిచ నాగరైః,
క్షౌద్రయుక్తైస్సలవణై స్తతస్తాం ప్రతిసారయేత్. 474

తా. చిరునాలుకను ఛేదించినపదప పిప్పలి, అతివస, చెంగల్వకోష్టు, వస, మిరియాలు, శొంఠి అనువానిచూర్ణములో తేనె, ఉప్పు గలిపి వ్రేలితో రుద్దవలయును.

### రోహిణీసామాన్యచికిత్స

రోహిణీనాం తు సాధ్యానాం హితం శోణితమోక్షణం,
వమనం ధూమపానం చ గండూషో నస్యకర్మ చ. 475

తా. పంచరోహిణులలో సాధ్యంబగు దానియందు రక్తముదీసి వమనము, ధూమపానము, గండూషధారణము, నస్యకర్మ అను నుపచారముల జేయవలయును.

### వాతజరోహిణీచికిత్స

వాతజాంతూర్ధ్వ తే రక్తే లవణైః ప్రతిసారయేత్,
సుఖోష్ణా స్స్నేహగండూషా న్ధారయేచ్చాప్యభీక్ష్ణశః. 476

తా. వాతజరోహిణియందు రక్తముదీసి లవణముతో రుద్దవలయును. మఱియు సుఖోష్ణముగ స్నేహగండూషమును పలుమారు ధరింపవలయును.

### పిత్తజరోహిణీచికిత్స

విస్రావ్య పిత్తసంభూతాం సితా క్షౌద్ర ప్రియంగుభిః,
ఘర్షయే త్కబలో ద్రాక్షా పరూషైః క్వథితైర్హితః. 477

తా. పిత్తజరోహిణియందు రక్తమునుదీసి పంచదార, తేనె అనువానిలో ప్రేంకణచూర్ణము, గలిపి రుద్ది ద్రాక్ష, ఖర్జూరపండు అనువానికషాయమును నోటియందు ధరింపం జేయవలయును.

### రక్తజరోహిణీచికిత్స

పిత్తవత్సాధయే ద్వైద్యో రోహిణీం రక్తసంభవాం,

తా. రక్తజరోహిణియందు పిత్తరోహిణీచికిత్సం జేయవలయును.

### కంఠశాలూకచికిత్స

విస్రావ్య కంఠశాలూకం సాధయే త్తుండికేరివత్. 478
ఏకకాలే యవాన్నం చ భుంజీత స్నిగ్ధమల్పశః,

తా. కంఠశాలూకమునందు రక్తమును దీసి తుండికేరివలెనే చికిత్సింపవలయును. మఱియు దీనియందొకింత ఘృతయుక్తముగ జేయంబడిన యవాన్నము నొకప్పూట భుజింపవలయును.

కఫజరోహిణీచికిత్స

ఆగారధూమకటుకైః కఫజాం ప్రతిసారయేత్. 479
శ్వేతా విడంగ దంతీషు తైలం సిద్ధం ససైంధవం,
నస్యకర్మణి దాతవ్యం కబలం చ కఫోచ్ఛ్రయే. 480

తా. కఫజరోహిణియందు కరుధూపము కారముగలయౌషధములతో రుద్దవలయును. తెల్లతులసి, వాయువిడంగములు, దంతివేరు అనువానితో తైలముగాచి యందు సైంధవలవణమును గలిపి నస్యమును నోటియందు ధారణమును జేయించవలయును.

అధిజిహ్వకచికిత్స

ఉపజిహ్వకవచ్చాపి సాధయే దధిజిహ్వకం,

తా. అధిజిహ్వక రోగమునందు ఉపజిహ్వకరోగచికిత్సం జేయవలయును.

ఏకబృందచికిత్స

ఏకబృందం తు విస్రావ్య విధిం శోధనమాచరేత్. 481

తా. ఏకబృందమునందు రక్తస్రావముచేయించి పిదప శోధనవిధిని చేయింపవలయు.

బృందచికిత్స

ఏకబృందమివ ప్రాయో బృందం చ సముపాచరేత్,

తా. బృందమునందు ఏకబృందచికిత్సం జేయవలయును.

గిలాయుచికిత్స

గిలాయుశ్చాపి యోవ్యాధి స్తంచ శస్త్రేణ సాధయేత్. 482

తా. గిలాయువునందు శస్త్రచికిత్సం జేయవలయును.

గళవిద్రధిచికిత్స

సమర్మస్థం తు సంపక్వం ఛేదయే ద్గళవిద్రధిం,

తా. మర్మరహితస్థలములయందు గలిగిన గళవిద్రధి పండియుండినదానిని ఛేదింపవలయును.

సర్వసరసామాన్యచికిత్స

వాతాత్సర్వసరం చూర్ణై ర్లవణైః ప్రతిసారయేత్. 483
తైలం వాతహరై స్సిద్ధం హితం కబలనస్యయోః,
పిత్తాత్మకే సర్వసరే శుద్ధకాయస్య దేహినః. 484
సర్వః పిత్తహరః కార్యో విధి ర్మధురశీతలః,
ప్రతిసారణ గండూష ధూమ సంశోధనాని చ. 485
కఫాత్మకే సర్వసరే క్రమం కుర్యా త్కఫాపహం,

తా. వాతజసర్వసర మనఁగా ముఖపాకమునందు దాని నుప్పుతోరుద్ది వాతనాశకరౌషధయుక్తముగ సిద్ధముజేయఁబడిన తైలముతో గండూష, నస్యములఁ జేయవలయును. పిత్తజసర్వసరమున తొలుత విరేచనమునకొసంగి పిదప పిత్తహరమైన సర్వమధుర, శీతకరచికిత్సలం జేయవలయును. కఫజసర్వసరమున * ప్రతిసారణ, గండూష, ధూమపాన శోధనములను, సర్వకఫహరచికిత్సలను జేయవలయును.

గళరోగచికిత్స

కంఠరోగే ష్వసృఙ్మోక్షై స్తీక్ష్ణై ర్నస్యాదికర్మభిః. 486
చికిత్సక శ్చికిత్సాం తు కుశలో త్రిసమాచరేత్,

తా. గళరోగమునందు రక్తమును దీసి తీక్ష్ణకరౌషధముల నొసంగి నస్యాదికర్మల జేయవలయును.

మృద్వికాదిచూర్ణము

మృద్వీకా కటుకా వ్యోష దార్వీత్వ క్త్రిఫలా ఘనమ్. 487
పాఠా రసాంజనం దూర్వా తేజోహ్వేతి సుచూర్ణితం,
క్షౌద్రయుక్తం విధాతవ్యం గళరోగే మహౌషధమ్. 488

తా. ద్రాక్షపండు, కటుకరోహిణి, త్రికటుకములు, మ్రానిపసపు, లవంగపట్ట త్రిఫలములు, తుంగముస్తెలు, అగరుశొంఠి, లేక చిరుబొద్ది, రసాంజనము, గరిక, వెక్కుడు, తీఁగె అనువానిచూర్ణముతో తేనె గలిపి గళమునందు లేపనము చేయవలయును. ఇది గొప్పయౌషధము.

యవక్షారాదిగుటికలు

యవాగ్రజంతేజవతీంసపాఠా రసాంజనందారునిశాంసకృష్ణాం,
క్షౌద్రేణకుర్యాద్గుటికాంముఖేన తాం ధారయేత్సర్వగళామయేషు.

తా. యవక్షారము, వెక్కుడుతీఁగె, అగరుశొంఠి, లేక చిరుబొద్ది, రసాంజనము, మ్రానిపసపు, పిప్పలి, అనువానిచూర్ణముతో తేనె గలిపి యుంటలుజేసి నోటిలో నునిచికొనిన సర్వకంఠరోగములు హరించును.

ముఖపాకసామాన్యచికిత్స

ముఖపాకే సిరావేధ శ్శిరసశ్చ విరేచనం,
మధు మూత్ర ఘృత క్షీరై శ్శైతైశ్చ కబళగ్రహః. 490

---

* కల్క, అవలేహ, చూర్ణ భేదములచే ప్రతిసారణము మూడువిధంబులు. కావున వానిని వ్రేలికొనతో గ్రహించి నాలుకయందుగాని, లేక నోటియందంతటగాని లేపనము చేయుటయ ప్రతిసారణ మనంబడును.

తా. సర్వముఖపాకములయందు సిరావేధనము చేయించి తేనె, గోమూత్రము, నెయ్యి, పాలు, శీతకరపదార్థములు అనువాని *కబళమును ముఖమునందు ధరింపవలయును.

మ ముఖపాకచికిత్స మ

పంచవల్కలజః క్వాథ స్త్రిఫలాసంభవోఽథవా,
ముఖపాకే ప్రయోక్తవ్య స్సక్షౌద్రో ముఖధావనే. 491

తా. పంచత్వక్కలకషాయములోగాని, త్రిఫలకషాయములోగాని తేనె గలిపి నోరును గడిగిన ముఖపాకము హరించును.

మ తిలాదిగండూషము మ

తిలా నీలోత్పలం సర్పి శ్శర్కరా క్షీరమేవ చ,
సలోధ్రో దగ్ధవక్త్రస్య గండూషో దాహనాశనః. 492

తా. నువ్వులు, నల్లకలువగడ్డ, నెయ్యి, పంచదార, పాలు, లొద్దుగచూర్ణము వీనిని గండూషము చేసిన ముఖపాకము, దాహము శమించును.

మ యష్టిమధ్వాదితైలము మ

యష్టీమధు పలమేకం త్రింశ న్నీలోత్పలస్య తైలస్య,
ప్రస్థం తద్ద్విగుణపయో విధినా పక్వంతు నస్యేన. 493
నిశిపద నస్యస్రావం క్షపయతి గాత్రస్య దోషసంఘాతం,
వపుస్స్వర్ణత్వమవశ్యం క్రమశోఽభ్యంగేన జంతూనామ్ 494

తా. అతిమధురము ౧ పలము, నల్లకలువగడ్డలు ౩౦ పలములు, నువ్వెనె ౧ ప్రస్థము, పాలు ౨ ప్రస్థములు-ఇటుల వీనినెల్ల నేకము చేసి మందాగ్నిలో తైలముగాచి రాత్రులయందు నస్యము చేయించిన ముఖస్రావము, శరీరమునకు లేపనము చేయించిన శరీర దోషము హరించి బంగారువంటి కాంతి గలుగును.

మ హరిద్రాదితైలము మ

హరిద్రా నింబపత్రాణి మధుకం నీలముత్పలం,
తైలమేభి ర్విపక్తవ్యం ముఖపాకహరం పరమ్. 495

తా. పసపు, వేపాకు, అతిమధురము, నల్లకలువగడ్డ అనువానికల్కములో తైలము గలిపి కాచి నోటిలో ధరించిన ముఖపాకము హరించును.

మ ఖదిరాదిగుటికలు మ

ఖదిరస్య తులాం తోయ ద్రోణే పక్త్వాష్టశేషితే,

* కబళ మన కల్కాదుల నోటినిండఁబోసికొని నమిలి యుమ్మివేయుటయు.

జాతీకోశేందుపూగైశ్చ చాతుర్జాతమృగాండజైః. 496
పృథక్కర్షమితైః పిష్టైః శ్లేషయిత్వా చణోపమాః,
గుటీః కృత్వా ముఖే ధార్యా సా నిహంత్యఖిలాన్ గదాన్. 497
జిహ్వోష్ఠ దంత వదన గళ తాళు సముద్భవాన్,

తా. నూరుపలముల నల్లతుమ్మపట్టయందొక ద్రోణప్రమాణ ముదకము పోసి యష్టమాంశముగ కషాయము గాచి వడియ గట్టి అందు జాపత్రి, కర్పూరము, మంచి వక్కలు, లవంగపట్ట, ఏలకులు, లవంగపత్రి, నాగకేసరములు, కస్తూరి-వీనిచూర్ణమును దినుసుకు కర్షప్రమాణముచొప్పున గలిపి సెనగగింజలంత మాత్రలుజేసి నోటిలో నునిచి కొని దానిరసమును మ్రింగుచుండిన సర్వముఖరోగములు, జిహ్వారోగములు, పెదవిరోగములు హరించును.

### దంతవ్రణలక్షణము

దంతవ్రణం కపోలోత్థం పూయం స్రవతి సంతతమ్. 498
ఏతద్దోషం సువిజ్ఞాయ తతః కర్మ సమాచరేత్, (చరకే)

తా. చెక్కిట వ్రణము పుట్టి యెల్లపుడు చీము గారుచుండిన దంతవ్రణ మని తెలియవలయును. ఈదోషమును బాగుగ నెఱింగి చికిత్సింపవలయును.

### వంధ్యాకర్కోటకీలేపనము

వంధ్యాకర్కోటకీమూలం గోమయేన సుసంశ్రుతమ్. 499
అర్కదుగ్ధేన సంమిశ్ర్య మాతపే శోషయేత్త్రిధా,
క్షారార్కదుగ్ధసహితం శోషయే ద్గంధ లేపనమ్. 500
కపోలదంతవ్రణకం నాశయే న్నాత్ర సంశయః,

తా. గొడ్డుకాకరగడ్డను ఆవుపేడతో వండి బిళ్ళలుగ కోసి జిల్లేడుపాలతో 3 మార్లు భావనజేసి యెండనెండించి పిదప, ఉప్పు, జిల్లేడుపాలు వీనితో భావనజేసి మరల నెండించి గంధము దీసి రెండుమాసములు లేపనముసేయుచుండిన చెక్కిట జనించిన దంతవ్రణము నిశ్చయముగ మానును.

గోక్షురస్వరసం కర్ణే పార్శ్వే దంతవ్రణస్య చ. 501
పూరితం శాంతయేత్వ్యర్థ మిత్యుక్తం మునిపుంగవైః,
(అన్యశాస్త్రే)

తా. దంతపార్శ్వమున వ్రణముగలిగిన నాప్రక్కనుండుచెవిలో పల్లేరురసమును పిండిన దంతవ్రణము శమించును. (మఱియు పల్లేరురసమును వ్రణముపై రెండుదినములు పట్టించి పిదప చేటిబీరవిత్తులగంధమునుగాని, చిత్రమూలగంధమునుగాని లేపనముజేసిన

దంతవ్రణము మానును. మఱియు కలిమేశ్వరపు చెక్కగంధమును భక్షణసేయుచు దానిచే వ్రణముపై లేపనము సేయుచుండిన ౨ మాసములలో దంతవ్రణము మానును. పథ్యము- చప్పిడివంటకమును, ఆవుపెరుగును భుజింపవలయును. దంతవ్రణములయందు రసకర్పూరమును ౨ మాసములు సేవింపుచు చప్పిడివంటకమును భుజింపవలయును.

క. తుందిలపుచెక్క నసుముల, బొందుగ పచనంబు చేసి భుజియింపఁదగు
న్నుందుగను మానిపోవును, దందడి నొప్పించుచున్న దంతవ్రణముల్.

గీ గొడ్డుకాకరచెట్టులగడ్డనూనె, గూడపాకంబు చేసియుఁ గ్రోలవలయు
సంశయం బేల యిదియ నిశ్చయము సుమ్ము, నరుల బాధించు దంత
ణాలు మాను.

గీ. రమ్యమైనట్టి నాగసరంపుగడ్డ, వెన్నగూరిచి సేవింప వివిధదంత,వ్రణ
ములన్నియు మాను భూవలయమందుఁ, జిరతరంబుగఁ బథ్యంబు సే
యుచున్న.

దంతవ్రణలక్షణము

వాతేన దంతచలనం రక్తస్రవణ ముచ్యతే. 502
క్రిమిణా పూయ పీడా చ దంతరోగే తథా భవేత్. (సిద్ధరసార్ణవే)

తా. వాతదోషమువలన దంతములు కదలుచు రక్తము స్రవింపుచుండును. క్రిమివలన దంతముల నొప్పి గలిగి చీముగారును.

కాళింగాదిచూర్ణము

కాళింగ చించా విజయామూలం పుంఖ్యశ్వమారకమ్. 503
చలదంతదృఢత్వస్య ప్రత్యేకం దంతధావనాత్, (మాధవనిదానే)

తా. కొడిసెపాల, చింతగింజలు, తక్కిలివేరు, తెల్లవెంపలి, గన్నేరు - వీనిలో దేనినేని నూరి పండ్లు తోముకొనిన కదలుచుండుదంతములు గట్టిపడును.

జాతీ గోరంటపత్రం వా చర్వయే త్ప్రాతరుత్థితః. 504
స్థిరాశ్చలితాదంతా స్తత్కాష్ఠైర్దంతధావనాత్, (ఆయుర్వేదే)

తా. జాపత్రినిగాని, లేక గోరింటాకునుగాని ప్రాతఃకాలమున నమలినను, లేక వానిపుడకలతో దంతధావనముజేసినను, (లేక ములుగోరింట, మామిడి, పచ్చిజిల్లేడు వీనిపుడకలలో దేనితోనేని దంతధావనముచేసినను కదలుచుండు దంతములు గట్టిపడును. మఱియు విడెములో జీడిగింజల గలిపి విడెము సేయుచుండిన కదలుచుండు దంతములు, దంతవ్రణములు, చీముగారుట హరించును. ఇంగువను ఆవు వెన్నతోడ ౩ మాస

ములు సేవింపుచుండిన దంతశూలలు, కృమిసంతములు, కదలుచుండుదంతములు, రక్తస్రావములు హరించును.)

### లాంగల్యాదియోగము

తోయేన లాంగలీమూలం పిష్ట్వాంగుష్ఠే ప్రలేపయేత్. 505
దంతా న్నిర్యాంతి నో చిత్రం కీటకా కౌతుకావహాః.

తా. చెన్నచర్లగడ్డ నుదకముతో నూరి దంతములయందు వ్రేలితో రుద్దిన దంతశూలలు హరించి పురుగు లూడిపడును. (తెల్లకాచును, మైలుతుత్థమును నూరి పండ్లపై నూసి సెగయందుగాచిన దంతములు గట్టిపడుటయేగాక దంతశూలలును హరించును.)

### జాతీపత్రాదిచూర్ణము

జాతీపత్ర పునర్నవా గజకణా గోరంట కుష్ఠం వచా
చవ్యం శుంఠి హరీతకీ సమకృతం చూర్ణం ముఖే ధారయేత్,
వాతఘ్నం క్రిమి దంతశూల కఫజం సర్వామయం నాశయేత్
దుర్గంధాదిసమస్తదోషశమనం దంతశ్చ వజ్రాయతే. (మాధవకల్పే)

తా. జాపత్రి, గలిజేరు, గజపిప్పలి, ములుగోరంట, చెంగల్వకోష్టు, వస, చవ్యము, శొంఠి, కరక్కాయలు - వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి దంతములయందు లేపనముజేసిన దంతవాతము, క్రిములు, దంతశూల, చీము, రక్తముగారుట, దుర్గంధము, దంతములు గదలుట మొదలగు నుపద్రవంబులన్నియు శమించి దంతములు వజ్రతుల్యంబు లగును.

### ముఖరోగమునందు పథ్యము

స్వేదో విరేకో వమనం గండూషః ప్రతిసారణం,
కబళో సృక్స్రుతి ర్నస్యం ధూమ శ్శస్త్రాగ్నికర్మణి. 507
తృణధాన్యం యవా ముద్గా కుళుత్థా జాంగలోరసః,
బహుపుత్రీ కారవేల్లం పటోలం బాలమూలకమ్. 508
కర్పూర నీరం తాంబూలం తప్తాంబుఖదిరోద్ధృతం,
కటు తిక్తోచ వర్గోఽయం మిత్రం స్యాన్ముఖరోగిణామ్. 509
(మాధవనిదానే)

తా. చెమటదీయుట, విరేచనము, వమనము, గండూషము, ప్రతిసారణము, కబలధారణము, రక్తమోక్షణము, నస్యము, ధూమపానము, శస్త్రకర్మ, అగ్నికర్మ, దూసరిబియ్యము, లేక వెదురుబియ్యము, యవలు, పెసలు, ఉలవలు, జాంగలమాంసము, నేలములుసిరిక, చల్లపిల్లిగడ్డలు, కాకరకాయ, చేదుపొట్ల, లేతముల్లంగి, పచ్చకర్పూరము, ఇను

కము, విడెము, నల్లతుమ్మకషాయము, కారము, జేదుగలరసములు - ఇవి ముఖరోగము యందు పథ్యకరంబులు.

### ముఖరోగమునం దపథ్యము

దంతకాష్ఠం స్నాన మమ్లం మత్స్య మానూపమామిషం,
దధి క్షీరం గుడం మాషం రూక్షాన్నం కఠినాసనమ్. 510
అధోముఖేన శయనం గుర్వభిష్యందికారి చ,
ముఖరోగేషు సర్వేషు దివానిద్రాం చ వర్జయేత్. 511

తా. దంతకాష్ఠము, స్నానము, పులుసు, మత్స్యములు, అనూపజంతుమాంసము, పెరుగు, పాలు, బెల్లము, ఉద్దులు, రూక్షాన్నము, కఠినాసనము, బోరగిల పరుండుట, జడాన్నము, సిండివంటకము, పగటినిద్ర - ఇవి ముఖరోగమునం దపథ్యకరంబు లగుటచే వీనిని వర్జింపవలయును.

### తుండివ్రణలక్షణము

శోథా పూయం చ వేదశ్చ శల్యపాతం భవేద్యది,
తదేవ మునిభిః ప్రోక్తం తుండివ్రణమితి ధ్రువమ్. (ఆయుర్వేదే)

తా. వాపు, నొప్పి గలిగి చీమును గార్చుచు లోన శల్యముచివికి యూడి శలబారుటయే తుండివ్రణ మని తెలియవలయును. (దీనియందును, మఱియు సర్వవ్రణముల యందును రసఉబ్బ వేయవలయును.

### రసఉబ్బ

ఆకల్ల కైలాసురపుష్పశుంఠీ కృష్ణాస్త్రిణిష్కాశ్చరసంద్వినిష్కం,
జ్యోతిష్మతీవై త్రిఫలా గుడస్య దీప్యస్య చత్వారి పలానియోజ్య.
సంమర్ద్యగాఢం ప్రహారద్వయేన ద్వినిష్కమాత్రంచ ఘృతేనఖాద్యం,
సవాయురోగం సహసానిహంతి మర్మస్థితాః గ్రంథియుతాం స్తథైవ.
ఉదుంబరం కాకణకంచ కుష్ఠం కపాలకందూశ్చ తథా నిహంతి. 515

తా. రసఉబ్బ ౨ విధంబులు. అందు అక్కలకఱ్ఱ, ఏలకులు, లవంగములు, శొంఠి, పిప్పళ్లు, అనునవి దినుసుకు మూడేసి నిష్కములు - శుద్ధిజేసిన పాదరసము, వెఱ్ఱితుడు విత్తులు ఇవి దినుసుకు ౨ నిష్కములు - త్రిఫలములు, బెల్లము, ఓమపుపొట్టు ఇవి దినుసుకు నాలుగేసిపలములు-ఇటుల వీనిని రోటిలో నునిచి రెండుఝాములు రెండురోకండ్లతో బాగుగ దంచి ౨ నిష్కములయెత్తుచు నేతియనుపానముతోడ భక్షింపవలయును. ఇటుల శ్లోకోక్తప్రకారముజేసిన నోరుపట్టునుగావున పైయాపథముతోడ చేరెడు మంచి వేపచెక్కగంధమును గలిపి రెండురోకండ్లతో నొకఝాము బాగుగ మర్దించి ౧౦ యుంటలుజేసి ౯ దినములు రేపుమాపు వేపచెక్కగంధములో నొడిగి ౨ నిష్కములయెత్తును

తియనుపానముతోడ మ్రింగవలయును. ఇదియ మొదటివిధమగు రసఉబ్బ. మఱియు పగంధముతో పైద్రవ్యములను, ౧౦ చిన్నములయెత్తు శుద్ధిజేసిన గంధకమును, పావు యజెల్లమును గలిపి రోటిలో నొకరఘాము దంచి ౧౮ యుంటలుజేసి రేపుమాపు ౨ యుంటలచొప్పున ౯ దినములు ఆవునేతితోడ భక్షింపవలయును. ఇదియ రెండవవిధమగు సఉబ్బ. ఈరెండు రసఉబ్బల సేవించునపుడు విడెముసేయుచు ౭గాలిలేనితావున నుండ లయును. ౧౦ యవదినమున నూరకుండి ౧౧-వ దినమున ఆవునేతిలో దలయంటికొని ప్పడిపథ్యము సేయుచుండిన వాతరోగములు, మర్మస్థానములయందు జనించిన గ్రంథులు వ్రణములు), ఉదుంబరకుష్టువు, కాకణకుష్టువు, కపాలకుష్టువు, దురద, చకారమువలన ండ, డొక్కమండ, పేరులేనివ్రణములు, ఫిరంగిరోగములు - ఇవియన్నియు మానును. ఈయుబ్బ జేసినపిదప 3 మాసములు పథ్యముగ నుండి పిదప రసకర్పూరమును సేవింప లయును.)

. వరచిత్రమూలమూలము, మిరియంబును నూనె గూర్చి మేలుగబా
కుం, బరవుగఁ గ్రోలినను భగం, దరమండలు మానుచుండు దంతగ
దంబుల్.

. మేదినిని జిత్రమూలము మేకపాల, నండి తత్క్షీరములుఁ గ్రోల
మండలములు, పథ్యముగ ఛాగదుగ్ధాన్నపానములను, గొన్న జను
డొక్కమండలకుల మణంగు.

## నాతిపుంటిలక్షణము

పక్ష్మమధ్యే తు యజ్జాతం పూయస్రావోఽభవేద్యది,
తన్నామమునిభిః పూర్వైః కూపవ్రణమితి స్మృతమ్. 516

తా. కంటికొలికిపద్ద వ్రణముజనించి నీరువలె చీము గారుచుండిన కూపవ్రణ మని నులు వచించిరి.

. ముఱియుచు వజ్రనీలిరసముస్తలియు స్గడువేగ రాగిముం
తను గడుమర్దనంబుగ నుదంబునఁ జేసియు నూతిపుంటిపైఁ
దనరఁగఁ బెట్టి కట్టియు నుతంబుగ మూఁడుచెక్క మేకపా
లనయము గ్రోల మానును జనావళిలోచనజాలరోగముల్.

(ఈనూతిపుంటియందు ౪౦ దినములు కట్టుగట్టవలయును)

## జంతి, రాజవ్రణలక్షణము

మధ్యే శరావరూపేణ జాతం ఛిద్రశతైర్యుతం,
పూయశోణితే ప్రవర్తతే జంతికావ్రణ ముచ్యతే. 517

తదేవ పృష్ఠే యజ్జాతం రాజవ్రణమితి స్మృతం,

తా. వ్రణమధ్యభాగము మూకుడుయొక్క యాకారముగలదై శతఛిద్రములు గలదై చీమును గార్చుచు శూలతోడం గూడియుండిన జంతివా వ్రణ మనంబడును. ఇదే వీపులో జనించిన రాజవ్రణ మనంబడును.

సీ. మహిషోప్పుతామ్రభస్మంబునుగరకకాయలనుసినూరియునలదియొకటి
సన్న పావలికూర సరవిగాఁ బాకంబుజేసి కట్టినఁ బనిచేయు నొకటి
యిల్లిపాషాణంబు నిలపైడి జాజిని దంతవ్రణంబుల దాఁప నొకటి
దంతియాకునుదెచ్చి ధన్యంబుగానూరి కట్టుగట్టినను బోకడచునొకటి
గీ. యరయ నీనాల్గువిధములయౌషధముల, వైర మనిపించు జంతికవ్రణ
ముకెల్ల, జగతి నిందుకుఁ బ్రతిచెప్పసాటిలేదు, నరులకెల్లను మాను
నిర్ణయముగాను.

## స్నాయుకవ్రణలక్షణము

దేహేగ్రంథిస్తు సంజాతః పూయం స్రవతి నిత్యశః. 518
తదేవ మునిభిః పూర్వైః స్నాయుకవ్రణముచ్యతే,

తా. శరీరమున కణతివలె జనించి గట్టిగ చీముసెల్లపుడు గార్చుచుండిన స్నాయుక వ్రణమని పూర్వీకులైన మునులు వచించిరి.

## స్నాయుకవ్రణమునకు గంధకతైలము

అథవార్కస్నుహీక్షీరై ర్వస్త్రం లేప్యం తు సప్తధా. 519
గంధకం నవనీతేన పిష్ట్వా వస్త్రంతు లేపయేత్,
తద్వర్తిం దీపితాం కుర్యా ద్దృఢం ధార్యా దధోముఖమ్. 520
తైలం తత్స్రవతే భాండే గ్రాహ్యం యోగేషు యోజయేత్,
తత్తైలం రసమిశ్రం చ నాగవల్లీ దళేన చ. 521
భక్షణే త్స్నాయుకం హంతి సర్వవ్రణహరం స్మృతం,

తా. జమిలివస్త్రమును జిల్లేడుపాలు, బొంతజెముడుపాలు అనువానిలో నేడేసి మార్లు తడిపి యెండించి దానియందు శుద్ధిజేసిన గంధకమును వెన్నతో నూరి పట్టించి వర్తిగజుట్టి దీపమున వెలిగించి తల్లక్రిందుగబెట్టి అందు వడిసెడు గంధకతైలమును గాజు గిన్నెలో దీసికొని ౨ చిన్నములయెత్తును తమలపాకున జరిమి దానిపై చిన్నమెత్తు శుద్ధి జేసినరసము నునిచి వ్రేలితో రాచి యాతమలపాకును భక్షించి విడెముసేయవలయును. ఇటుల ౪౦ దినములు రేపుమాపు సేయుచుండిన స్నాయుకవ్రణము మొదలైన సర్వ

వ్రణములు మానును. (మఱియు స్నాయుకవ్రణమున రసయుబ్బనుసగా జేయందగును పథ్యము చప్పిడి.)

### స్నాయుకవ్రణచికిత్స

పాఠాళగరుడీమూలం పిబే త్స్నాయుకనాశనమ్. 522

తా. దూసరివేరును నూరి సేవించిన స్నాయుకవ్రణము మానును.

నృమూత్రైః కాంచనీం పిష్ట్వా లేపస్స్నాయుకజిద్భవేత్,
వార్తాకపత్రం నృమూత్రైః పిండంచాశ్వత్థపత్రకే. 523
సంతప్తం బంధయే చ్ఛీఘ్రం శమయే త్స్నాయుకం కిల,
(ఆయుర్వేదే)

తా. దేవకాంచనపు చెక్కను నరమూత్రముతో నూరి లేపనముజేసినను, లేక వంగాకును నరమూత్రముతో నూరి ముద్దజేసి రావియాకులో నునిచి వెచ్చజేసి గొబ్బున కట్టుగట్టినను స్నాయుకవ్రణము మానును.

### స్తనవ్రణలక్షణము

వాతేన కఠినం శుక్లం స్తనం భవతి దారుణమ్. 524
పూర్వోక్తేన ప్రలేపేన సుఖోష్ణేన సుఖావహం,
పైత్తాధిక్యే స్తనేరోగే పీడా భవతి చారుణా. 525
మూలేన కరవీరస్య శీతతోయేన పేషయేత్,
స్తనమాలేపయే త్తేన సుఖమాప్నోతి తత్క్షణాత్. 526
రక్తమోక్షశ్చ వా కుర్యా జ్జలూకై శ్శాంతిమాప్నుయాత్,
శ్వయథు శ్శ్యామవర్ణశ్చ స్తనస్యైవ కఫాధికే. 527
మధుయష్టిం కఫేతోయైః పిష్ట్వాలేపే సుఖావహం,
సర్వేషాం స్తనరోగాణాం రక్తమోక్షః ప్రశస్యతే. (సిద్ధరసార్ణవే)

తా. కఠినముగ, తెల్లగ, దూచుటకు భయంకరముగనుండిన వాతజస్తనవ్రణమని తెలియవలయును. దీనయందు పూర్వోక్తలేపనము సుఖోష్ణముగ జేసిన మానును. స్తనమున కడుపీడ గలిగి వ్రణ మెఱ్ఱనైయుండిన పిత్తజస్తనవ్రణమని తెలియవలయును. దీని యందు గన్నేరువేళ్ళను శీతోదకముతో నూరి లేపనముజేసిన తత్క్షణమున మానును. లేక జలగలతో రక్తమును దీయించినను మానును. వాచి నల్లనైయుండిన శ్లేష్మజస్తనవ్రణమని తెలియవలయును. దీనియందు యష్టిమధుకమును నీళ్ళతోనూరి లేపనము జేయవలయును. సర్వస్తనవ్రణములయందు రక్తస్రావము జేయించవలయును.

## స్తనవ్రణచికిత్స

రసం వా శివబీజం వా బలిశైలేన మిశ్రయేత్,
నాగవల్లీదళే పిష్ట్వా ఖాదయే త్తదనంతరమ్. 529
తాంబూలచర్వణం కృత్వా లవణామ్లాని వర్జయేత్,
స్తనవ్రణం నిహంత్యాశు నాసారోగే ప్రశస్యతే. 530

తా. పైఁజెప్పంబడిన గంధకతైలమును తమలపాకున బట్టించి దానిపై పూటకు చిన్న మెత్తు శుద్ధిజేసిన ఇంగిలీకమునుగాని, లేక శుద్ధిజేసిన రసమునుగాని నునిచి వ్రేలితో మర్దించి భక్షింపవలయును. ఇటుల ౪౦ దినములు రేపుమాపు సేవించి విడెముజేసిన స్తననాసావ్రణములు మానును. దీనిని సేవించునపుడు ఉప్పును, పులుసును వర్జింపవలయును. (మఱియు రెండుమండలములు ఇంగువను వెన్నలోఁ గలిపి భక్షించిన స్తనవ్రణములు మానును).

క. ఇమ్మహిఁ గంధకతైలము, తమ్మలపాకునను జరిమి తగఁ జిన్నంబుల్
నెమ్మది నింగిలికంబును,దమ్ములము జేయ మానుఁ దగఁ జనుమాదల్.
కరవీరస్య మూలం చ హ్యష్టమాత్రేణ పేషయేత్,
తత్క్షణా త్స్ఫుటతే రక్తం శస్త్రైర్వా స్ఫోటయేద్భిషక్. 531
(శస్త్రవైద్యే)

తా. గన్నేరువేళ్ళను లోటిపిటమాత్రముతో నూరి ముద్దజేసి కట్టుగట్టినతత్క్షణమున పగిలి రక్తముగారి స్తనవ్రణము మానును. లేక శస్త్రముతో గీచియైనను రక్తమును గార్చిన మానును.

## వటాదికషాయము

వటకోదుంబరాశ్వత్థ ప్లక్షకార్జునకత్వచః,
తోయై శ్చతుర్గుణైః క్వాథం పాదశేషం సమాహరేత్. 532
ఏతేన క్షాళయే న్నిత్యం స్రావపూయం హరేత్ స్తనే,

తా. మఱ్ఱి, మేడి, రావి, జువ్వి, ఏరుమద్ది అనువానిపట్టల సమభాగములుగ దంచి దానికి నాలుగింత లుదకము పోసి నాలవభాగముగ కషాయము గాచి వడియగట్టి దానిచే ప్రతిదినము స్తనమాదల గడుగుచుండిన చీము గారుట మానును.

మథ్వాజ్యై ర్దేవదారుం చ పిష్ట్వా వర్తిం ప్రలేపయేత్. 533
పూయం స్రావ్య స్తనే క్షిప్త్వా రోపణం కురుతే క్షణాత్,

తా. దేవదారుచెక్కను తేనె, నెయ్యి వీనితో నూరి వస్త్రమునకు బట్టించి వర్తి జేసి వ్రణమునం దునిచిన గొబ్బున చీముకారు చనుమాదలు మానును. (మఱియు దీని

యందు ధూపతైలలేపనమునుగాని, తామ్రభస్మలేపనముగాని జేయవలయును. చనుమాదలు గడునైయుండిన రసకర్పూరమును ౨ మండలములు సేవింపవలయును. మఱియు రసఉబ్బను జేయవలయును. పథ్యము చప్పిడి.)

గ్రంథి, విసర్పులయందు శస్త్రకర్మనిషేధము

రక్తమేవాశ్రయస్తస్య గ్రంథౌ శస్త్రహతే తదా. 534
శామ్యేద్గ్రంథి విసర్పి ర్నసాత్ర కార్యా విచారణా,
కఫవాతౌ శ్వాసకాసౌ శోష హిధ్మాతిసారకాన్. 535
గ్రంథీనాం కురుతే మాలాం రక్తానాం తీవ్రకజ్వరం,
ఇత్యేవం గ్రంథి వైసర్పి మోహ మూర్ఛాం కరోతి చ. 536

తా. గ్రంథులు రక్తాశ్రితంబులై జనించుటంజేసి యాగ్రంథులను, విసర్పిగ్రంథులను శస్త్రముజేయంజనదు. అటు జేసిన నవి శమింపకుండుటయేగాక కఫవాతప్రకోపమువలన శ్వాసకాసములు, శోష, ఎక్కిళ్ళు, అతిసారము, రక్తగ్రంథులయొక్కవరుస తీవ్రజ్వరము, మోహము, మూర్ఛ మొదలగు నుపద్రవములతో గూడి కష్టసాధ్యంబు లగును.

గ్రంథిః పాషాణ కఠినో యది నైవోపశామ్యతి,
అథాస్య దాహ క్షారేణ రక్తంవాథ విమోక్షయేత్. 537
వారిభి స్సేచయే ద్వైద్యః పాకత స్సర్వకర్మణి, (నిత్యనాథీయే)

తా. గ్రంథులు ఱాయివలె కఠినంబులై శాంతిజెందకుండిన వానియందు దాహ, క్షారకర్మలనుగాని, లేక రక్తస్రావమునుగాని జేయవలయును. (ఆక్షారకర్మ మెద్ది యనిన—సర్జక్షారములో క్రొత్తసున్నముగలిపి గ్రంథులనడుమ మూడుబొట్లు నుంచవలయును.ఈప్రకారము మూడుమారులుజేసిన నవి వ్రణంబులగు.వానిపై పెరుగువత్తిని దడిపివేసిన మానును. లేక వానియందు రక్తమునైనం దీయవలయును. గ్రంథులన—కంతులు. దీనికి జికిత్స - ఉత్తరేణుక్షారము, ఉమ్మెత్తకట్టెలక్షారము, దొగ్గలివేళ్ళక్షారము, నల్లయుప్పికట్టెక్షారము, క్రొత్తసున్నము - వీనిని గలిపి కంతులనడుమ నొకబొట్టును, మూడుదిక్కుల మూడుబొట్లు నునిచిన వ్రణంబులగును. అవి కరగువఱకు పెరుగులో వత్తుల దడిపి వేయవలయును. అవి కరిగినబిదప నీళ్ళవత్తుల వేయవలయును.

గ్రంథులకు బృహత్యాదిలేపము

బృహతీ చిత్రకం వ్యాఘ్రీ కణౌ సిద్ధార్థక స్తథా. 538
స్నేహేన సిద్ధం కార్యంస్యా త్తీక్ష్ణం శుష్కస్య లేపనం,
సంశోష్య బహుశో గ్రంథీ న్విబధ్నీయా త్పునఃపునః. 539

తా. పెద్దములకవేళ్ళు, చిత్రమూలము, నేలములకవేరు, పిప్పలి, తెల్లావాలు-వీనిని నూరి నూనెలో గలిపి వండి కొంచె ముష్ణముగ లేపనముజేసి యెండించి కట్టుగట్టిన గ్రంథులు మానును. ఇటుల పలుమారు జేయవలయును.

పునర్నవాదిలేపము

పునర్నవార్కాభయశిగ్రుమూలగరంజసింధూత్థమహౌషధానాం,
కల్కం ప్రలిప్తం పశుమూత్రపిష్టం గ్రంథ్యర్బుదం హంత్యపచించసద్యః.

తా. గలిజేరువేరు, జిల్లేడువేరు, కరక్కాయలు, మునగవేరు, కానుగవేరు, సైంధవలవణము, శొంఠి - వీనిని సమభాగములుగ ఆవుపంచితముతో నూరి కల్కముజేసి లేపనముజేసిన గ్రంథి, అర్బుదము, అపచి తత్క్షణమున మానును.

పూతికరంజలేపము

మూలంపూతికరంజస్య చిత్రకం లవణం పరం,
ఉపలేప్య తథాపిష్టం సమస్తగ్రంథిభేదనమ్. (మతాంతరే) 541

తా. నెమలిచెక్క, లేక నెమలడుగుచెక్క, కానుగచెక్క, చిత్రమూలము, సైంధవలవణము- వీనిని నూరి లేపనముజేసి కట్టుగట్టిన సర్వగ్రంథులు పగులును.

గళగ్రంథిస్వరూప, తచ్చికిత్స

గళేగ్రంథిశ్చయోజాత స్తన్నామగళగ్రంథికం,
వక్త్రే నఖాగ్రం నిక్షిప్య భిత్వా పిప్పలికాం దదేత్. 542

తా. గళములో గ్రంథిజనించిన గళగ్రంథి యనంబడును. దానిముఖమును గోటితో గిచి పిప్పలిచూర్ణముబెట్టిన మానును.

శిరీషాదిలేపము

శిరీషంచ శివాం శిగ్రుం పంచాంగంచ యవస్యచ,
అమ్లతక్రేణ సుపిష్య గళగ్రంథిం హరేత్పరమ్. 543

తా. దిరిసెనపుచెక్క, ఉసిరికకాయ, మునగపువ్వు, బాసియాకు, వేరు, పట్ట, విత్తులు, యవక్షారము - వీనిని సమభాగములుగ పుల్లచల్లతో నూరి యుడికించి కంఠమున లేపనముజేసిన గళగ్రంథి (గళమున జనించినకంతులు) మానును.

వ్యోషాదికషాయము

వ్యోషా తిక్తా విషా పాఠా దారు ముస్తా కళింగకా,
గోమూత్రక్వథితా పేయా కంఠగ్రంథివినాశినీ. 544
(మాధవనిదానే)

తా. త్రికటుకములు, చేదుబీరవిత్తులు, అతివస, శిరుబొద్ది, ముసిపసపు, తుంగ

ముస్తెలు, వెఱ్ఱిపుచ్చకాయ - వీనిని గోమూత్రముతో నూరి కాచి త్రాగిన గళమునగలిగిన గడ్డలు కంతులు మానును.

ముస్తాదికషాయము

క్వాథస్సముస్తాతివిషేంద్రదారు కళింగపాఠాకటురోహిణీనాం,
గోమూత్రసింహీమధునాచయుక్తంపయోగళవ్యాధిషుసర్వజేషు.515

తా. తుంగముస్తెలు, అతివస, పాపర, వెఱ్ఱిపుచ్చాకు, శిరుబొద్దివేళ్ళు, కటుకరోహిణి, అడ్డసరము - వీనిని సమభాగములుగ గ్రహించి నూరి, గోమూత్రము, తేనె, పాలు వీనిలో గలిపి కాచి త్రాగిన కంఠమున జనించిన గడ్డలు మొదలగు సర్వరోగములు మానును.

గళకీలస్వరూపము

వాతదోషప్రభవః ప్రకాశతే జాయతేచ గళకీలవర్ధనం,
దుఃఖమన్నమనిశంతు భుజ్యతే వ్యేవముక్తమథవైద్యపారగైః. 546
(చరకే)

తా. వాతము ప్రకోపించి కంఠమును జెందిన గళకీలకము (అనఁగా కప్పనాగురు) జనించును. దానియం దన్నమును భుజించిన పిగక ప్రతిదినము దుఃఖబెట్టుచు వ్రేళ్ళి వచ్చుచుండును. దీనిని వైద్యవేత్తలు గళకీలక మని వచించెదరు.

గళకీలచికిత్సాక్రమము

స్తనయోరధరేఽంగుళిత్రిసంఖ్యా మంతరాహుతభుజశ్చచేష్టయా,
పాతయేచ్చ గళకీలసంభవం పీరపిప్పలిరసశ్చ భుజ్యతే. 547

తా. గళకీలకమున రెండుచనుమొనలక్రింద మూడువేళ్ళలోనుండి రెండుచంకల ప్రక్కలవఱకు సడ్డముగ రక్షవేయవలయును. లోపలికి పీరపిప్పలి, గంధకముల సేవింపం జేయవలయును.

విషముష్ట్యాదిలేపము

విషముష్ట్యభయా శుంఠీ మధునా కర్షమాత్రకం,
గళరోగహరం వక్త్రే ధారయే ద్దినసప్తకమ్. (మాధవనిదానే)

తా. విషముష్టిచెక్క, కరక్కాయలు, శొంఠి - వీనిని దినుసు కొకకర్షప్రమాణముచొప్పున గ్రహించి తేనెతో నూరి యేడుదినములు లేపనముజేసిన గళకీలకము నశించును.

సైంధవలవణలేపము

లేపయే ద్వానుదుగ్ధేన సైంధవం గళకీలనుత్. 549

తా. జిల్లేడుపాలతో సైంధవలవణమును నూరి లేపనముజేసిన గళకీలకము నశించును.

క. ఆదొండవేరు గంధము, పాదుగ నావాలముద్ద భక్షణసేయన్
వేదేశునికృపచేతను, నాదములేనట్టిశెప్పనాగురుమానున్.

**ఆస్యస్ఫోటలక్షణ, తచ్చికిత్స**

ఆస్యస్ఫోటశ్చ విజ్ఞేయో లక్షణై ర్భిషజోత్తమైః,
చందనం ఘనసారశ్చ హ్యాస్యస్ఫోటవినాశనమ్. (చరకే) 550

తా. నాలుకవిచ్చి పొక్కులవలె పొక్కిన ఆస్యస్ఫోట మనంబడును. దానియందు మంచిగంధములో ౨ వీసములయెత్తు పచ్చకర్పూరమును జేర్చి నేతితో సేవించిన ఆస్య స్ఫోటము మానును.

**ఆస్యస్ఫోటలక్షణము**

వాతాజ్జిహ్వోష్ఠయోశ్చైవ స్ఫోటభిన్నత్వమాప్నుయాత్,
తన్నామమునిభిః ప్రోక్త మాస్యస్ఫోటకసంజ్ఞికమ్. (ఆయుర్వేదే)

తా. వాతదోషమువలన నాలుక, పెదవులు పొక్కినను, లేక పగిలినను ఆస్య స్ఫోటక మని మునులు వచించిరి.

**ఆస్యస్ఫోటకచికిత్స**

భల్లాతకీరసంచూర్ణం గళస్ఫోటే ప్రలేపయేత్,
లవణం గృహధూమంచ క్వాథయే త్కాంజికేనతు. 552
గండూషం క్షౌద్రసంయుక్తం గళస్ఫోటహరం పరం,

తా. జీడిచెక్కరసముతో సున్నమును నూరి లేపనముజేసిన ఆస్యస్ఫోటము హరించును. మఱియు ఉప్పు, కరుధూపము-వీనిలో కలిపోసి కషాయముగాచి తేనె గలిపి గండూషముజేసినను (పొట్లపండు, పిప్పలి వీనిని గండూషముజేసినను) ఆస్యస్ఫోటము హరించును.

గైరికాంబు ఘృతం తైలం సర్జ సైంధవ సిక్థకమ్. 553
వీరణంచ యథాపక్వ మాస్యస్ఫోటవ్రణాపహం,

తా. కావిరాయి, కురువేరు, నెయ్యి, నూనె, గుగ్గిలము, సైంధవలవణము, మైనము, వట్టివేరు-వీనిని పక్వముగవండి పెదవులపైఁబూసిన పగుళ్ళ(పొక్కులు), వ్రణము మానును.

**సిక్థకాదిలేపము**

సిక్థకం ధూపకం తుత్థం కటుతైలం విపాచితమ్. 554

ఓష్ఠపీడాదికం హంతి లేపనం వేదనాపహం,

తా. మైనము, గుగ్గిలము, మైలుతుత్థము-వీనిని ఆవనూనెతో వండి పెదవుల యందు బూసిన పగుళ్ళు, పొక్కులు, వేదన మానును. (పెదవిరోగములయందు శ్లీపద రోగచికిత్సం జేయవలయును. రసకర్పూరము సేవింపవలయును. మఱియు రస ఉబ్బను వేయవలయును.)

## కీలకలక్షణము

జఘనేచ కటౌ గ్రంథి ర్మాంసమాప్నోతి నవ్యథా. 555
ఆననే గుద పార్శ్వేచ సర్వాంగే పిటికా భవేత్,

తా. పిఱుదు, నడుము, భుజశిరములు, ముఖము, గుదపార్శ్వములు, సర్వాంగ ములు-వీనియందు గ్రంథులు జనించి నొప్పిలేకుండిన పులిపిర్లని తెలియవలయును.

## అశ్వత్థాదిలేపము

అశ్వత్థస్యత్వచోభస్మ చూర్ణేన సమమిశ్రితమ్. 556
నవనీతం ద్వయోస్తుల్యం మర్ద్యం తేన విలేపయేత్,
ఆననే గుదపార్శ్వేచ కటిస్థాః పిటికా జయేత్. 557

తా. రావిచెక్కలబూడిదె, సున్నము-వీనిని సమభాగములుగ గ్రహించి ఈ రెంటికిసమముగ వెన్నగలిపి మర్దించి ముఖము, గుదపార్శ్వము, నడుము-వీనియందు లేప నముజేసిన పులిపిర్లు మానును. మఱియు నక్కపీటాకురసమును లేపనముజేసిన పులిపిర్లు మానును.)

## కీలకలేపనములు

ఏవంచించారసైః పిష్టం సైంధవం లేపయేత్ర్యహం,
శిగ్రుమూలత్వచస్తోయైః పిష్ట్వా లేపేన తం జయేత్. 558
పిష్ట్వా కండూం నిహంత్యాశు చిత్రకం వా గవాంజలైః,
నరమూత్రేణ సర్పాక్షీ పిష్టా లేపేన తాం జయేత్. 559

తా. చింతాకురసముతో సైంధవలవణమును నూరి 3 దినములు జేసి లేపనము నను, మునగవేరుపట్ట నుదకముతో నూరి లేపనముజేసినను, పులిపిర్లు మానును. మఱియు చిత్రమూలమును గోమూత్రముతో నూరి లేపనము జేసిన పులిపిర్లు, దురద శీఘ్రముగ మానును. సర్పాక్షిని నరమూత్రముతో నూరి లేపనముజేసిన పురిపిర్లు మానును.

## కాలస్ఫోటాదికలక్షణము

కాలస్ఫోటో విషస్ఫోట స్సద్యోహన్యా త్సవేదనః,
కక్షగ్రంథి ర్గళగ్రంథిః కర్ణగ్రంథిశ్చ నాశయేత్. 560

ఆస్యజం స్ఫోటకం తీవ్రం రసభస్మచ నాశయేత్,

తా. కాలస్ఫోటము, విషస్ఫోటము జనించిన తత్క్షణముననే మంటను, వేదనను గలుగంజేయును. చంకలో వ్రణముపుట్టిన కక్షగ్రంథి యనంబడును. కంఠమున వ్రణము పుట్టిన గళగ్రంథి యనంబడును. చెవిమడతయందు వ్రణము పుట్టిన కర్ణగ్రంథి యనంబడును. ఇవి యన్నియు మృత్యుప్రదంబులు. నోట వ్రణముపుట్టిన ఆస్యస్ఫోట మనంబడును. ఇది నివర్తించుటకై శ్లీపదరోగమున జెప్పంబడు రసభస్మమునుగాని, లేక రసకర్పూరమునుగాని అనుపానముతోడ సేవింపవలయును. (లేక రసఉబ్బనేని జేయవలయును.)

కాలస్ఫోటహరలేపనము

గుంజాపత్ర సితా యష్టి గవాంక్షీరేణ పాయయేత్. 561
కాలస్ఫోటం నిహంత్యాశు మజ్జావా పుత్రజీవికా,

తా. గురిజాకు, పంచదార, యష్టిమధుకము-వీనిని నూరి ఆవుపాలతో సేవించినను, లేక పుత్రజీవిగుజ్జును నూరి లేపనము జేసినను, కాలస్ఫోటము శీఘ్రముగ మానును.

విషస్ఫోటహరలేపనము

పుష్యార్కే కాకతుండ్యాస్తు మూలమాదాయ భక్షయేత్. 562
క్షౌద్రేణ స్ఫోటకం హంతి కింవా ముండీరసం పిబేత్,

తా. పుష్యమినక్షత్రము భానువారమునాడు గురిజవేరును దెచ్చి దంచి చూర్ణముజేసి తేనెతో సేవించినను, లేక బోడతరరసమును త్రాగినను విషస్ఫోటకవ్రణములు మానును.

దంతికొనలు, ౭ మిరియాలు-వీనిని ౭ నూనెబొట్లతో నూరి అరమండలము సేవించిన కక్షగ్రంథియందు సోనవలె నీరు గారును. పిదప ౧౦ చిన్నములయెత్తు మంచి ఇంగువను ఆవువెన్నలో గలిపి రెండుమండలములు సాయంప్రాతఃకాలముల సేవింపుచుండిన కక్షగ్రంథి మానును. ఇటులనే గళగ్రంథి, గండమాల, కర్ణగ్రంథి అనువానియందును ఇంగువను సేవింపందగును.

(రసము, గంధకము, మైలుతుత్థము, కాచు-వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గజ్జేరాకురసముతో మర్దించి యెండించి చూర్ణముజేసి ఆవునేతితో గలిపి కాకియాకుతో లేపనముజేయుచుండిన చెవిమడతయందు జనించిన వ్రణము మానును. ఆస్యస్ఫోటకములయందు రసకర్పూరమును ౨ మండలములు సేవించిన ఆస్యస్ఫోటకము హరించుటయేగాక పైఁజెప్పఁబడిన సర్వవ్రణములు హరించును. పథ్యము-చప్పిడిషంటకములు భుజింపవలయును.)

### శ్లీపదరోగనిదానము

ప్రస్థితో వంక్షణే వాపి రధఃకాయే కఫోల్బణః. 563
దోషజ స్సాస్రవ శ్శోఫ శ్శాలీనా మాకృతి స్తథా,
మేదోమాంసాశ్రితం శోఫం పాదే శ్లీపదముచ్యతే. 564
(మాధవనిదానే)

తా. కఫాధిక్యముగల వాతపిత్తశ్లేష్మములవలన గజ్జలయందు వాపు జనించి శరీరాధోభాగమున వ్యాపించి స్రావమునుజేయునట్టి వడ్లగింజల యాకృతిగల కురుపులలో వ్యాప్తంబై మేదోమాంసాశ్రితంబై పాదములయందు వ్యాపించిన శ్లీపద మనంబడును. (మఱియు "తచ్ఛ్లీపదం స్యాత్కరకర్ణనేత్ర శిశ్నౌష్ఠనాసాస్వపి కేచిదాహుః" అను గ్రంథాంతరవచనప్రకారము శ్లీపదము హస్తము, కర్ణము, నేత్రములు, మేఢ్రము, పెదవి, నాసికము అనువానియందును జనించు నని కొందఱు వచించిరనుట.)

### శ్లీపదరోగలక్షణము

శ్లీపదం పాదవల్మీకం తత్ర రక్తం విమోక్షయేత్,
భక్షయే త్సూరణవటీ మర్శోరోగచికిత్సకే. (అన్యశాస్త్రే) 565

తా. కాలు పుట్టవలె పెరిగిన శ్లీపదరోగ మనంబడును. దీనియందు రక్తమును దీయవలయును. మఱియు అర్శోరోగమునందలి సూరణవటికముల సేవించిన శ్లీపదము మానును. (ఈసూరణవటికములు అర్శోరోగప్రకరణమున జెప్పంబడియున్నయది.)

అత్యంతస్థూలజంఘోరు శ్శ్లీపదోఽసౌ భిషగ్వరైః,
అతిస్థూలతరం కృష్ణం వల్మీకమితి కీర్తితమ్. 566

తా. పిక్కలు, తొడలు, మిక్కుటముగ లావైయుండిన శ్లీపద మనంబడును. దానినే తొడారుగడ్డ యనియు వచించెదరు. పిక్కలయందుగాని, తొడలయందుగాని మఱియును లావుగలిగి నల్లనైయుండిన వల్మీక మనంబడును.

(హస్తపాదములు పగిలి దురదగలిగియుండిన శ్లీపద మనంబడును. ఇది నివర్తించుటకై గంధకతైలమును సేవింపవలయును. బోడతరరసమును సేవించిన కాళ్ల, చేతులపగుళ్లు మానును. హంసపాదియాకురసము పావుసేరు, మేకనెయ్యి సౌటాపు, మిరియములు ఒకతులము గలిపి సేవించిన కాళ్ళు చేతులు పగుళ్లు మానును. మఱియు వీనియందు గుగ్గిలతైలమునుగాని, గౌరీ పాషాణము, వేపకొనలు-వీనిని నూరిగాని మూడుదినములు లేపనము సేయవలయును. మఱియు ప్రతిదినము తప్పక వేపాకు నుడికించి కట్టవలయును.)

### శ్లీపదలక్షణము

కరపాదౌ యదాకృష్ణౌ కండూతి స్స్ఫోటసంభవః,
తుషాచర్మ యదాజాతం తదేవ శ్లీపదం స్మృతమ్. 567

తా. చేతులు కాళ్ళు నల్లనై దురదతోగూడి పగిలి చర్మము పొట్టువలె రాలు చుండిన శ్లీపద మని తెలియవలయును.

శ్లీపదచికిత్స

విశ్వాకణాభ్యాంక్వథితం గుళూచ్యాశ్శృతంసుదారుక్వథితంపి బేద్వా,
సమూత్రకంశ్లీపదకంనిహన్యాత్ సిద్ధార్థకాస్తస్యహితఃప్రలేపే. 568

(భావప్రకాశే)

తా. శొంఠి, పిప్పలి, తిప్పతీగె అనువానికషాయములోగాని, లేక దేవదారు చెక్కకషాయములోగాని తేనె గలిపి సేవించి తెల్లావాలను నూరి లేపనముజేసిన శ్లీపదము హరించును.

అభయాదిలేపము

అభయా సర్షప నాగర హింగు వచా శిగ్రు రవిమూలైః,
దినకర పయసా పిష్టై శ్లీపదనాశాయ లేపనం స్యాత్. 569

తా. కరక్కాయలు, తెల్లావాలు, శొంఠి, ఇంగువ, వస, మునగ, జిల్లేడువేరు వీనిని సమభాగములుగ గ్రహించి జిల్లేడుపాలతో నూరి లేపనముజేసిన శ్లీపదము హరించును. (లేక గుగ్గిలతైలమును లేపనముజేసిన శ్లీపదము హరించును. మఱియు నిది నివర్తించుటకై గంధకకల్పమును సేవింపందగును. దీనియందు ఎడమచేతి పెద్దనవ్రేలి గుంట కడ్డముగ ఏడేండ్ల ప్రాతప్రత్తికట్టెనుగాల్చి రక్షవేసిన శ్లీపదము మానును.)

ఖదిరం సల్లకీ దారు సక్షౌద్రం హరితాళకం,
గవాంమూత్రేణ సమం పిష్ట్వాపిబేచ్ఛ్లీపదశాంతయే. 570

తా. ఖదిరసారము, అందుగు, దేవదారు, శుద్ధిజేసిన తాళకము—వీనిని సమభాగ ములుగ గోమూత్రముతో నూరి తేనెగలిపి సేవించిన శ్లీపదము హరించును.

రసకర్పూర మమృతం సేవయే త్సకలామయే,
వంధ్యా చ లభతే గర్భం మృతవంధ్యా చ రక్షయేత్. 571

(మాధవనిదానే)

తా. రసకర్పూరము అమృతతుల్యంబగుటచే సర్వరోగముల హరింపంజేసి గొడ్రాలకు, మృతవంధ్యలకు గర్భధారణమున్ను గలుగంజేయును. (కావున రసకర్పూరము తులము, బెల్లము నాటాకుప్రమాణము - ఈరెంటిని ఖల్వములో నునిచి రెండుఝాములు మర్దించి ౮౦ మాత్రలుజేసి ౪౦ దినములు ఆవునేతితో సాయంప్రాతఃకాలముల మ్రింగి విడెము సేయవలయును. పథ్యము - వరివంటకము, మేకచల్ల, ఆవుపాలు - వీనిని భుజింపవలయును. ఇటుల పథ్యముగనుండి యొకమండలముగాని, లేక రెండుమండల

ములుగాని, ఔషధమును సేవింపుచుండిన ఫిరంగిరోగములు, వ్రణములు, లూతవ్రణములు, భగందరములు, పురుషునికి జనించెడు పుండ్లు, దంతవ్రణములు, బహువిధవ్రణములు, గ్రంథులు, శలపాశ్వ్రణములు, చనుమాదలు, పుండ్లు, నూతిపుండ్లు, కాళ్ళు, చేతులు పగిలి దురదగలరోగములు, నొప్పితోఁగూడియుండు వాతములు, శూలతోఁగూడియుండు నేత్రవాతములు, నాలుక నాశ్రయించిన రోగములు, మేఢ్రవ్రణములు, మర్మస్థలమున బుట్టిన వ్రణములు-ఇవి యన్నియుఁ హరించుటయే గాక ఫిరంగివ్యాధులుగల స్త్రీలు గర్భోత్పత్తియైనను నాలవమాసములోపల ప్రతిదిన మొకపూట పైయౌషధములో నొకమాత్రను ఆవునేతితోడ చప్పిడిపథ్యముగనుండి ఒకమాసమువఱకు సేవింపఁజేసిన ఆస్త్రీయును, గర్భస్థశిశువును నిరోగులై సుఖముగ నుందు రని రసరత్నాకరమునందు జెప్పఁబడియున్నది.)

సీ. అవనిపైఁ దిప్పతీఁగాకురసంబును గోఘృతంబును గొని కూర్చి వండి
చేతలాంశాకుచు జెన్నుగ శోధించి గోఘృతంబునుగొని కూర్చి వండి
రేగొట్టిచెక్కను బాగుగఁ దెప్పించి గోఘృతంబునుగొని కూర్చి వండి
పెద్దమ్రాన్చెక్కను జేర్మితోఁ దెప్పించి గోఘృతంబునుగొని కూర్చి వండి

గీ. యిట్టియౌషధములయందు నేదియైన
సిందురంబున సేవింప స్త్రీలకెల్ల
చెడ్డవ్యాధులు మైఁబూని బిడ్డలెల్ల
బ్రతుకకుండిన శిశువులు బ్రతుకుచుంద్రు.

సీ. తనరు వాలుడుతైలమును వేప యీనెల
రససిందురము గూర్చి మెసగ నొకటి
మేలువెల్లురువేళ్లు మిరియంబు నెయ్యని
సిందురంబును గూర్చి సేవనొకటి
మునుసిందురము కోలముక్కియు మిరియంబు
బంచదారయుఁ జేర్చి పాన మొకటి
కారనుములు నూడుగపువేరు గోఘృతం
బున వండి సిందురంబునను నొకటి

గీ. భార్గి యావాలు గోఘృతంబునను వండి
సిందురంబును గూర్చి భక్షింప నొకటి